మహర్షి వేదవ్యాస ప్రణీత

# శ్రీమద్భాగవతము

**పంచమ, షష్ఠ స్కంధములు**

**నాలుగవ సంపుటము**

స్వామి తత్త్వవిదానంద సరస్వతి





తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.

మహర్షి వేదవ్యాస ప్రణీత

# శ్రీమద్భాగవతము

## (పంచమ, షష్ఠ స్కంధములు)

నాల్గవ సంపుటము

స్వామి తత్త్వవిదానంద సరస్వతి
(బ్రహ్మవిద్యాకుటీర్, పాతఅల్వాల్, సికింద్రాబాదు)
గారిచే రచింపబడిన ''తత్త్వప్రకాశిక'' అనే
తెలుగు టీకతో కూడినది




ప్రచురణ
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
2005

# SRIMADBHAGAVATAMU

with Telugu Commentary

**Skandha V - VI**

by
**SWAMI TATTVAVIDANANDA SARASWATI**

T.T.D. Religious Publications Series No :685



First Edition : 2005

Copies : 2000

*Published by*
**Sri A.P.V.N. Sarma, I.A.S.**
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati.

*Printed at*
Tirumala Tirupati Devasthanams Press,
Tirupati.

# ముందు మాట

భారతీయ వాఙ్మయంలో పురాణాలు అత్యంత విశిష్టమైనవి. అవి లోకానికి మిత్రులవలె హితాన్ని ఉపదేశిస్తాయి. కాబట్టి, ''మిత్ర సమ్మితములు''గా ప్రఖ్యాతి వహించాయి. పురాణాలు ప్రాచీనమైనవైనా ఎప్పటికప్పుడు నిత్యనూతనంగా ప్రకాశిస్తూ వుంటాయి. అవి మన పురాతన విజ్ఞాన సర్వస్వాలు (Encyclopaedias)అటువంటి పదునెనిమిది పురాణాల్లో అగ్రగణ్యమైనది శ్రీమద్భాగవతము.

'భాగవత'మంటే భగవంతుని గూర్చి వివరించే గ్రంథమని భావం. ఇలాగే 'భగవత్' శబ్దంతో సంబంధించిన నామధేయం కల మరొక ప్రసిద్ధ గ్రంథం 'భగవద్గీత'. భగవంతుడు చెప్పింది భగవద్గీత; ఆ భగవంతుని గూర్చి చెప్పేది భాగవతము. ఇది ఈ రెంటికి గల అవినాభావ సంబంధం.

వేర్వేరు పురాణాలను, ఇతిహాసాలను రచియించిన వేదవ్యాసుడు బదరికావనంలో సరస్వతీనదీ తీరాన గల తన ఆశ్రమంలో ఒకప్పుడు చింతిస్తూ కూర్చొని ఉండినాడు. ఆ సమయంలో అక్కడకు విచ్చేసిన నారదమహర్షి, విషయం తెలిసికొని, వ్యాసునితో ఇలా అన్నాడు. 'మునీంద్రా! నీవు ఇంతవరకు ఎన్నో గ్రంథాలను రచించినప్పటికీ, భగవానుడైన శ్రీమహావిష్ణువు యొక్క గుణగణాలను, మహిమలను, అవతారలీలలను వెల్లడించే కథలతో గూడిన సమగ్ర గ్రంథాన్ని ప్రత్యేకంగా రచింపలేదు. కావున, అలాంటి ఉత్కృష్ట గ్రంథాన్ని రచిస్తే నీకు పరిపూర్ణమైన మనశ్శాంతి ఏర్పడుతుంది'-అని, ఆ విధంగా నారదుని ఆదేశాన్ని పాటించి, వేదవ్యాస మహాముని రచించిన ఉదాత్తగ్రంథమే శ్రీమద్భాగవత మహాపురాణం!

మంత్రాలన్నింటిలోనూ ఉత్తమమైన మంత్రం 'గాయత్రి' అటువంటి గాయత్రీమంత్రాన్ని ఆధారంచేసికొని ఈ గ్రంథం విస్తరిల్లినట్లు ఇందలి అవతారికలో పేర్కొనబడి ఉంది. ఈ గ్రంథానికి 'భక్తిశాస్త్ర' మని, 'సాత్వతసంహిత' అని, 'మోక్షగ్రంథ'మని, 'హయగ్రీవ బ్రహ్మవిద్య' అని- అనేక నామాంతరాలు పూర్వంనుండీ వాడుకలో ఉన్నాయి. ఇవన్నీ ఈ భాగవత గ్రంథానికి గల ప్రశస్తిని చక్కగా చాటుతూ వున్నాయి.

వేదవ్యాసుడు తొలుదొల్త భాగవత పురాణాన్ని కుమారుడైన శుకునికీ, శిష్యుడైన రోమ హర్షణునికీ ఉపదేశించాడు. రోమహర్షణుని కుమారుడైన ఉగ్రశ్రవసుడు నైమిశారణ్యంలో వెయ్యేండ్ల సత్రయాగాన్ని నిర్వహిస్తూవున్న

శౌనకాది మహామునుల వద్దకు వెళ్లి, భాగవత పురాణాన్ని ప్రవచనం చేశాడు. ఆ విధంగా ఉగ్రశ్రవసుడనే సూతుడు అలనాడు నైమిశారణ్యంలో ఆరంభించిన భాగవత కథా ప్రవచనం నేటికీ దేశంలో ఎక్కడో ఒకచోట అవిచ్ఛిన్నంగా కొనసాగుతూనే వస్తున్నది.

ఈ సుప్రసిద్ధ గ్రంథానికి ''తత్త్వప్రకాశిక'' - అనే తెలుగు టీక సమకూర్చబడి ఉండటం ప్రస్తుత ప్రచురణలోని ముఖ్య విశేషం! ప్రతిపదార్థ, తాత్పర్యాలతో కూడిన ఈ తెలుగు టీక సరళమైన భాషలో, సులభశైలిలో, సామాన్య పాఠకులను సైతం ఆకట్టుకొనే రీతిలో సముచితంగా కొనసాగింది. సార్థక నామమయిన ఈ టీకను రచించిన సహృదయులు, సుగృహీత నామధేయులు, బ్రహ్మవిద్యానిధులు, బహుగ్రంథకర్తలు పూజ్యశ్రీ తత్త్వవిదానంద సరస్వతీ స్వామివారికి కృతజ్ఞతాపూర్వక అభివందనాలు.

చివరగా నొక్కమాట: పద్మపురాణంలో శ్రీమద్భాగవతం సాక్షాత్తు భగవంతుని స్వరూపంగా నిరూపింపబడింది. తదనుగుణంగా భాగవతంలోని మొదటి, రెండు స్కంధాలు భగవంతుని పాదాలు; మూడు నాలుగు స్కంధాలు ఊరువులు; ఐదవ స్కంధం నాభి ప్రదేశం; ఆరవ స్కంధం హృదయం; ఏడు, ఎనిమిది స్కంధాలు బాహువుల్లు; తొమ్మిదవ స్కంధం కంఠం; పదవ స్కంధం ముఖం; పదకొండవది లలాటం; పంద్రెండవ స్కంధం శిఖ.

పద్మపురాణంలోని పై వరసను బట్టి, పంచమస్కంధం విరాట్పురుషునియొక్క నాభిప్రదేశం, షష్ఠస్కంధం హృదయం ఆవిష్కరింపబడినట్లుగా భావించాలి! అందులో ఇవి ఐదవ, ఆరవ స్కంధాలు. ఇలాగే, తరువాతి స్కంధాలను కూడ త్వరలో ప్రచురించే ప్రయత్నాలు చురుకుగా కొనసాగుతున్నాయి. అలమేల్మంగా శ్రీనివాసుల అనుగ్రహ విశేషంతో ఆ యా సంపుటాలూ అచిరకాలంలోనే వెలుగుచూడగలవని ఆశిస్తున్నాము.

ఆస్తిక మహాశయులెల్లరకు ఈ ధార్మిక ప్రచురణ ఆనందదాయి కాగలదని ఆకాంక్షిస్తున్నాము.

*''భాగవత పురాణ ఫల రసాస్వాదన*
*పదవిఁ గనుఁడు! రసికభావవిదులు!''*

**కార్యనిర్వహణాధికారి,**
తి.తి.దేవస్థానములు

వేదాంత శిరోమణి, బ్రహ్మవిద్యా మహోదధి, రాష్ట్రపతి
సమ్మాన గ్రహీత, మా నాన్నగారు
గురుదేవులు, కీర్తిశేషులు

బ్రహ్మశ్రీ రాణి నృసింహ శాస్త్రి గారి

పవిత్ర స్మృతికి
భక్తిపూర్వకముగా అంకితము.

# విషయ సూచిక

## పంచమ స్కంధము

1. ప్రియవ్రత-ఉపాఖ్యానము ----------- 1
2. అగ్నీధ్రుని చరితము ----------------- 30
3. నాభి మహారాజుయొక్క చరితము ----------------- 46
4. ఋషభదేవుని చరితము ----------------- 60
5. ఋషభదేవుడు రాజ్యమును విడిచి సన్న్యసించుట ---------- 72
6. ఋషభదేవుడు అవతారమును చాలించుట ------------- 97
7. భరతుని చరితము ------------------------ 111
8. భరతుడు మృగమై జన్మించుట ---------------- 122
9. జడభరతుని భద్రకాళి రక్షించుట -------------- 142
10. జడభరతుని రహూగణుడు అవమానించుట ----------- 160
11. రహూగణ జడభరత సంవాదము - మనో విజయము ------ 177
12. రహూగణ జడభరత సంవాదము - జగన్మిథ్యాత్వము ------- 189
13. రహూగణ జడభరత సంవాదము - సంసారము అనే అడవి --- 200
14. రహూగణ జడభరత సంవాదము - దృష్టాంతముల వివరణము 216
15. గయుని చరితము ----------------- 246
16. భువనకోశమును వర్ణించుట ----------------- 256
17. సంకర్షణ స్తుతి ----------------- 274
18. అవతార మూర్తుల మంత్రములు - స్తోత్రములు ----------- 292
19. శ్రీరామ మంత్ర స్తోత్రములు - భారత దేశ మహిమ --------- 319
20. విస్తృతమగు భువనకోశవర్ణనము ----------- 340
21. సూర్యరథముయొక్క గమనము ----------- 368
22. జ్యోతిశ్చక్రము - గ్రహముల గతి ----------- 380
23. జ్యోతిశ్చక్రము - శిశుమార వర్ణనము ---------- 392
24. రసాతలము మొదలగు లోకముల వర్ణనము ---------- 401

25. శ్రీ సంకర్షణ దేవుని స్తోత్రము ------------------ 424
26. నరకయాతనలను వర్ణించుట ------------------ 436

## షష్ఠ స్కంధము

1. అజామిల-ఉపాఖ్యానము ------------------ 469
2. అజామిలుడు వైకుంఠమును పొందుట ------------------ 499
3. యముడు భగవన్నామ మహిమను వర్ణించుట ------------ 520
4. హంస గుహ్య స్తోత్రము ------------------ 539
5. దక్షుడు నారదుని శపించుట -------------------------- 565
6. దక్షుని కన్యల వంశావళి -------------------------- 584
7. ఇంద్రునిచే అవమానించబడి బృహస్పతి దేవతలను విడిచిపెట్టుట 602
8. నారాయణ కవచము -------------------------- 619
9. వృత్రాసురుని పుట్టుక - దేవతలు శ్రీహరిని స్తుతించుట -------- 640
10. దేవాసుర యుద్ధము -------------------------- 670
11. వృత్రాసురుని వీరవాణి -------------------------- 684
12. ఇంద్రుడు వృత్రాసురుని సంహరించుట ------------------ 699
13. ఇంద్రుడు బ్రహ్మహత్యా పాపమునుండి విముక్తుడగుట ---- 715
14. వృత్రాసురుని పూర్వచరితము-చిత్రకేతువునకు పుత్రవియోగము 726
15. అంగిరసుడు చిత్రకేతువునకు వైరాగ్యము నుపదేశించుట ----- 753
16. చిత్రకేతువునకు పరమాత్మ సాక్షాత్కరించుట ------------ 765
17. చిత్రకేతువు శాపముచే వృత్రుడై జన్మించుట ------------ 797
18. మరుద్గణముల జన్మ వృత్తాంతము ------------------ 815
19. పుంసవన వ్రత విధానము ------------------ 847

* * * * *

శ్రీగణేశాయ నమః

ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్రీ మహర్షి వేదవ్యాస ప్రణీతం

# శ్రీమద్భాగవత మహాపురాణమ్

## తత్త్వ ప్రకాశికా సంయుతమ్

# పంచమః స్కంధః

---

## అథ ప్రథమోఽధ్యాయః

### ప్రియవ్రతోపాఖ్యానము

రాజోవాచ ।
ప్రియవ్రతో భాగవత ఆత్మారామః కథం మునే ।
గృహేఽరమత యన్మూలః కర్మబంధః పరాభవః ॥ 1

మునే - ఓ శుక మహర్షీ!, రాజా - పరీక్షిన్మహారాజు, ఉవాచ - పలికెను, భాగవతః - భగవద్భక్తుడు, ఆత్మారామః - తనయందు తానే రమించువాడు అగు, ప్రియవ్రతః - ప్రియవ్రత మహారాజు, గృహే - ఇంటియందు, కథమ్ - ఏ విధముగా, అరమత - రమించెను?, కర్మబంధః - కర్మల

బంధము, పరాభవః - ఆత్మ విస్మృతి, యత్-మూలః - ఏ గృహము మూలముగా గలదియో.

పరీక్షిన్మహారాజు శుకమహర్షిని ఇట్లు ప్రశ్నించెను --- ఓ మహర్షీ! ప్రియవ్రతుడు గొప్ప భగవద్భక్తుడనియు, తన స్వరూపమునందు తాను రమించువాడు (ఆత్మానంద భరితుడు) అనియు చెప్పితిరి. అట్టి మహాత్ముడు గృహస్థాశ్రమమునందు ఎట్లు ఇమిడెను? ఏలయనగా, గృహస్థాశ్రమమునందు మునిగిపోయిన జనులు తమ స్వరూపమును గురించి విస్మరించి, కర్మల బంధములో చిక్కుకొని యుందురు గదా!

న నూనం ముక్తసంగానాం తాదృశానాం ద్విజర్షభ ।
గృహేష్వభినివేశోఽయం పుంసాం భవితుమర్హతి ॥ 2

ద్విజ-ఋషభ - ఓ బ్రాహ్మణ శ్రేష్ఠా!, ముక్తసంగానామ్ - విడిచిపెట్టబడిన భోగాసక్తి కలిగిన, తాదృశానామ్ - అట్టి, పుంసామ్ - మానవులకు, గృహేషు - ఇంటియందు, అయమ్ - ఈ, అభినివేశః- అతిశయించిన రాగము, భవితుమ్ - ఉండుటకు, న అర్హతి = తగదు, నూనమ్ - నిశ్చయము.

ఓ మహర్షీ! నీవు బ్రహ్మవేత్తలలో అగ్రేసరుడవు. భోగాసక్తిని విడిచిపెట్టిన అట్టివారికి ఈ విధముగా గృహస్థాశ్రమమునందు అధికమగు ఆసక్తి ఉండుట తగదు గదా! ఇది నిశ్చయము.

మహతాం ఖలు విప్రర్షే ఉత్తమశ్లోకపాదయోః ।
ఛాయానిర్వృతచిత్తానాం న కుటుంబే స్పృహామతిః ॥ 3

విప్ర-ఋషే - ఓ మహర్షీ!, ఉత్తమశ్లోకపాదయోః - పుణ్యకీర్తి యగు శ్రీహరియొక్క పాదములయొక్క, ఛాయానిర్వృతచిత్తానామ్ - నీడచే శాంతమైన మనస్సు గల, మహతామ్ - మహాత్ములకు, కుటుంబే - కుటుంబమునందు, స్పృహామతిః - తృష్ణతో గూడిన బుద్ధి, న ఖలు - ఉండదు గదా!

ఓ మహర్షీ! నీవు వేదముల సారమునెరింగిన వాడవు. పుణ్యకీర్తి యగు శ్రీహరియొక్క పాదముల నీడను ఆశ్రయించిన మహాత్ముల

మనస్సు శాంతముగా నుండును. అట్టి వారి బుద్ధిలో సంసారమునందు తృష్ణ ఉండదు గదా!

సంశయోఽయం మహాన్ బ్రహ్మన్ దారాగారసుతాదిషు ।
సక్తస్య యత్సిద్ధిరభూత్కృష్ణే చ మతిరచ్యుతా ॥ 4

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, అయమ్ - ఇది, మహాన్ - పెద్ద, సంశయః - సందేహము, యత్ - ఏదనగా, దార-ఆగారసుత-ఆదిషు - భార్య ఇల్లు కొడుకు మొదలగువాటియందు, సక్తస్య - తగుల్కొనియున్న వానికి, సిద్ధిః - సిద్ధి, చ - మరియు, కృష్ణే - శ్రీకృష్ణునియందు, అచ్యుతా - జారిపోని, మతిః - భక్తి, అభూత్ - కలిగెనో.

ఓ మహర్షీ! నాకు పెద్ద సందేహము గలదు. భార్య, ఇల్లు, కొడుకులు మొదలగువాటియందు తగుల్కొనియున్న ప్రియవ్రతునకు శ్రీకృష్ణునియందు దృఢమగు భక్తి నెలకొని ఆత్మజ్ఞానము ఉదయించుట ఎట్లు సంభవమయ్యేను?

శ్రీశుక ఉవాచ ।
బాఢముక్తం భగవత ఉత్తమశ్లోకస్య శ్రీమచ్చరణారవిందమకరందరస ఆవేశితచేతసో భాగవతపరమహంసదయితకథాం కించిదంతరాయవిహతాం స్వాం శివతమాం పదవీం న ప్రాయేణ హిన్వంతి ॥ 5

బాఢమ్ - చక్కగా, ఉక్తమ్ - చెప్పబడినది, ఉత్తమశ్లోకస్య - ఉత్తమమగు కీర్తి గల, భగవతః - శ్రీహరి భగవానునియొక్క, శ్రీమత్-చరణ-అరవిందమకరందరసే - శోభతో గూడియున్న పాదపద్మముల తేనెయొక్క రుచియందు, ఆవేశితచేతసః - గాఢముగా నిమగ్నమైన మనస్సులు గలవారు, కించిత్-అంతరాయవిహతామ్ - కొంచెము విఘ్నముచే అడ్డుకొనబడినట్టియు, శివతమామ్ - మిక్కిలి మంగళకరమగు, స్వామ్ - తమదైన, పదవీమ్ - మార్గము అయి ఉన్న, భాగవతపరమహంసదయితక

థామ్ - భగవద్భక్తులగు ఆత్మజ్ఞానులకు ప్రియుడైన శ్రీహరియొక్క కథను, ప్రాయేణ - ఇంచుమించుగా, న హిన్వంతి - విడిచిపెట్టరు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- నీవు చక్కగా చెప్పితివి. కాని, పవిత్రకీర్తియగు శ్రీహరిభగవానుని పాదపద్మముల ధ్యానామృతరసాస్వాదనమునందు నిమగ్నమైన మనస్సు గల మహాత్ములు శ్రీహరి గాథను స్వీయసాధనగా ఎన్నుకొనియుందురు. భగవద్భక్తులగు ఆత్మజ్ఞానులకు శ్రీహరి చాల ప్రియుడు. ఆ పరమమంగళకరమగు మార్గములో వారికి కొద్దిపాటి విఘ్నములు వచ్చినా, వారా మార్గమును విడిచిపెట్టరు.

యర్హి వావ హ రాజన్ స రాజపుత్రః ప్రియవ్రతః పరమభాగ
వతో నారదస్య చరణోపసేవయాఽంజసావగతపరమార్థస
తత్త్వో బ్రహ్మసత్రేణ దీక్షిష్యమాణోఽవనితలపరిపాలనాయా
మ్నాతప్రవరగుణగణైకాంతభాజనతయా స్వపిత్రోపామంత్రితో
భగవతి వాసుదేవ ఏవావ్యవధానసమాధియోగేన సమావేశితసక
లకారకక్రియాకలాపో నైవాభ్యనందద్యద్యపి తదప్రత్యామ్నా
తవ్యం తదధికరణ ఆత్మనోఽన్యస్మాదసతోఽపి పరాభవమన్వీక్ష
మాణః ।। 6

రాజన్ - ఓ రాజా!, రాజపుత్రః - రాజపుత్రుడు, పరమభాగవతః హ - గొప్ప భగవద్భక్తుడట, సః - ఆ, ప్రియవ్రతః - ప్రియవ్రతుడు, యర్హి వావ - ఏ కాలమునందైతే, నారదస్య - నారదుని, చరణ-ఉపసేవయా - పాదములను సేవించుటచే, అంజసా - అనాయాసముగా, అవగతపరమార్థసతత్త్వః - తెలియబడిన పరమసత్యముయొక్క స్వరూపము గలవాడో, బ్రహ్మసత్రేణ - ఆత్మనిష్ఠచే, దీక్షిష్యమాణః హ - దీక్షను తీసుకొన బోవువాడు, ఆమ్నాతప్రవరగుణగణ-ఏకాంతభాజనతయా - శాస్త్రముచే బోధించబడిన గొప్ప గుణముల సమూహమునకు నిత్యనివాసస్థానము అగుటచే, స్వపిత్రా - తన తండ్రిచే, అవనితలపరిపాలనాయ - భూమండలమును పాలించుట కొరకు, ఉపామంత్రితః - నియోగించబడినవాడు, భగవతి వాసుదేవే ఏవ - శ్రీకృష్ణ భగవానునియందు మాత్రమే, అవ్యవధానసమాధి

యోగేన - నిరంతరమగు చిత్తముయొక్క ఏకాగ్రతచే, సమావేశితసకలకార కక్రియాకలాపః - సమర్పించబడిన అన్ని ఇంద్రియవ్యాపారముల సమూహము గలవాడు, తత్ - ఆ మాట, యది అపి అప్రత్యామ్నాతవ్యమ్ - తిరస్కరించ కూడనిదే అయిననూ, తత్-అధికరణే - ఆ రాజ్యాధికారమునందు, అసతః అపి - మిథ్యయే అయి ఉన్ననూ, అన్యస్మాత్ - అనాత్మవలన, ఆత్మనః - ఆత్మకు, పరాభవమ్ - తిరస్కారమును, అన్వీక్షమాణః - ఆలోచించువాడై, న ఏవ అభ్యనందత్ - సుతరాము ఇష్టపడలేదు.

రాజపుత్రుడగు ఆ ప్రియవ్రతుడు భగవద్భక్తులలో గొప్పవాడు. ఒక కాలములో ఆయన నారద మహర్షియొక్క పాదములను సేవించి తేలికగా పరబ్రహ్మస్వరూపమును తెలుసుకొని, ఆత్మనిష్ఠయందు జీవితమును గడుపుటకై దీక్షను స్వీకరించుటకు సిద్ధపడెను. కాని, ఆతనియందు శాస్త్రోక్తములైన గొప్ప రాజగుణములన్నియు నిత్యనివాసముగా ఉండెడివి. ఆయనను తండ్రియగు మనువు రాజ్యమునేలుమని నియోగించెను. తండ్రియొక్క ఆ మాట తిరస్కరించ రానిది. సందేహము లేదు. కాని, ఆయన మనస్సు నిరంతరముగా శ్రీకృష్ణ భగవానునియందు మాత్రమే ఏకాగ్రమైయుండెడిది. చూచుట, వినుట మొదలగు ఇంద్రియవ్యాపారములనన్నింటినీ ఆయన వాసుదేవునియందు సమర్పించి వేసెను. కావుననే, రాజ్యాధికారమును చేబట్టినచో, అనాత్మభూతములగు రాజ్యాదులచే ఆత్మస్వరూపము తిరస్కరించబడునని ఆయన తలపోసెను. కావుననే, ఆయనకు అట్టి రాజ్యాధికారము నచ్చుబాటు కాలేదు. రాజ్యము మొదలగునవి మిథ్యయే అయిననూ, ఆత్మస్వరూపమును కప్పివేయ సమర్థములని ఆయనకు తెలియును.

అథ హ భగవానాదిదేవ ఏతస్య గుణవిసర్గస్య పరిబృంహణానుధ్యానవ్యవసితసకలజగదభిప్రాయ ఆత్మయోనిరఖిలనిగమ
నిజగణపరివేష్టితస్స్వభవనాదవతతార ।। 7

అథ - అప్పుడు, ఆదిదేవః - ఆదిదేవుడు, ఆత్మయోనిః - స్వయంభువుడు అగు, భగవాన్ - బ్రహ్మ భగవానుడు, ఏతస్య - ఈ, గుణ విసర్గస్య - త్రిగుణాత్మికయగు ప్రకృతియొక్క వికారమైన జగత్తుయొక్క,

పరిబృంహణ-అనుధ్యానవ్యవసితసకలజగత్-అభిప్రాయః - సమృద్ధిని గురించి ఆలోచించుటచే నిశ్చయించబడిన సకలజీవుల అభిప్రాయము గల వాడై, అఖిలనిగమనిజగణపరివేష్టితః - అన్ని వేదములచే మరియు తన పరిచారకులచే చుట్టువారబడి యున్నవాడై, స్వభవనాత్ - తన లోకము నుండి, అవతతార హ - క్రిందకు దిగెనట.

త్రిగుణాత్మికయగు ప్రకృతియొక్క వికారమే ఈ జగత్తు. స్వయంభువుడు, ఆదిదేవుడు అగు బ్రహ్మభగవానుడు సర్వదా ఈ జగత్తుయొక్క సమృద్ధిని గురించి ఆలోచించుచుండును. సకలజీవుల అభిప్రాయము ఆయనకు నిశ్చితముగా విదితమే. వేదములు రూపమును దాల్చి వెంటరాగా, పరిచారకులచే చుట్టువారబడియున్న ఆ బ్రహ్మగారు సత్యలోకము నుండి భూలోకమునకు విచ్చేసెను.

స తత్ర తత్ర గగనతల ఉడుపతిరివ విమానావలిభిరనుపదమ
మరపరివృఢైరభిపూజ్యమానః పథి పథి చ వరూథశస్సిద్ధగంధ
ర్వసాధ్యచారణమునిగణైరుపగీయమానో గంధమాదనద్రోణీమ
వభాసయన్నుపససర్ప ॥ 8

సః - ఆ బ్రహ్మగారు, గగనతలే - ఆకాశమునందు, తత్ర తత్ర - అక్కడక్కడ, విమాన-ఆవలిభిః - విమానముల గుంపులు గల, అమరపరివృఢైః - దేవశ్రేష్ఠులచే, అనుపదమ్ - అడుగడుగునా, అభిపూజ్యమానః- చక్కగా పూజించబడుచున్నవాడై, పథి పథి చ - మార్గమంతటా, వరూథశః - గుంపులు గుంపులుగా, సిద్ధగంధర్వసాధ్యచారణమునిగణైః- సిద్ధులు గంధర్వులు సాధ్యులు చారణులు మరియు మహర్షుల సంఘములచే, ఉపగీయమానః - కీర్తించబడుచున్నవాడై, ఉడుపతిః ఇవ - చంద్రుడు వలె, గంధమాదనద్రోణీమ్ - గంధమాదన పర్వతముయొక్క లోయను, అవభాసయన్ - ప్రకాశింప జేయుచున్నవాడై, ఉపససర్ప - సమీపించెను.

దేవశ్రేష్ఠులు ఆకాశములో అక్కడక్కడ విమానపంక్తులయందున్నవారై ఆ బ్రహ్మగారిని అడుగడుగునా చక్కగా పూజించిరి. మార్గమంతటా సిద్ధులు, గంధర్వులు, సాధ్యులు, చారణులు మరియు మహర్షులు

గుంపులు గుంపులుగా చేరి, ఆయనను కీర్తించిరి. ఆయన చంద్రుడు వలె గంధమాదన పర్వతముయొక్క లోయను ప్రకాశింపజేస్తూ, ప్రియవ్రతుని వద్దకు విచ్చేసెను.

తత్ర హ వా ఏనం దేవర్షిర్హంసయానేన పితరం భగవంతం హిరణ్యగర్భముపలభమానస్సహసైవోత్థాయార్హణేన సహ పితాపుత్రాభ్యామవహితాంజలిరుపతస్థే ।। 9

తత్ర - అక్కడ, వై - నిశ్చయముగా, దేవ-ఋషిః - దేవర్షియగు నారదుడు, హంసయానేన - హంసవాహనముచే, ఏనమ్ - ఈయనను, పితరమ్ - తండ్రి అయిన, హిరణ్యగర్భం భగవంతమ్ - హిరణ్యగర్భ భగవానునిగా, ఉపలభమానః - తెలుసుకున్నవాడై, సహసా ఏవ - వెను వెంటనే, అవహిత-అంజలిః - దోసిలి యొగ్గినవాడై, ఉత్థాయ - లేచి నిలబడి, పితాపుత్రాభ్యాం సహ - మనువు ప్రియవ్రతులతో గూడి, అర్హణేన - పూజతో, ఉపతస్థే - స్తుతించెను.

అక్కడ ఆ సమయములో ప్రియవ్రతునితో బాటు ఆయన తండ్రి యగు మనువు, నారద మహర్షి కూడ ఉండిరి. హంస వాహనమును బట్టి ఆయన తన తండ్రియగు హిరణ్యగర్భుడే (బ్రహ్మగారు) నని నారదుడు గుర్తుబట్టెను. ఆయన వెంటనే లేచి నిలబడి, వారిద్దరితో గూడి బ్రహ్మగారిని పూజించి స్తుతించెను.

భగవానపి భారత తదుపనీతార్హణస్సూక్తవాకేనాతితరాముదిత గుణగణావతారసుజయః ప్రియవ్రతమాదిపురుషస్తం సదయ హాసావలోక ఇతి హోవాచ ।। 10

భారత - ఓ రాజా!, తత్-ఉపనీత-అర్హణః- వారిచే సమర్పించబడిన పూజ గల, ఆదిపురుషః - ఆదిపురుషుడగు, భగవాన్ అపి - బ్రహ్మదేవుడు కూడ, సూక్తవాకేన - మంచి వాక్యముచే, అతితరామ్ - అధికముగా, ఉదితగుణగణ-అవతారసుజయః - వర్ణించబడిన గుణముల సముదాయము అవతారములు మరియు గొప్ప విజయములు గలవాడై, సదయ హాస-అవలోకః - దయతో గూడిన చిరునవ్వుతో కూడియున్న చూపు గల

వాడై, తమ్ - ఆ, ప్రియవ్రతమ్ - ప్రియవ్రతుని గురించి, ఇతి - ఈ విధము గా, ఉవాచ హ - పలికెనట.

భరతవంశములో జన్మించిన ఓ పరీక్షిన్మహారాజా! ఆదిపురుషు డగు బ్రహ్మదేవునకు వారు పూజాదికమును సమర్పించి, మంచి వాక్యము లతో ఆయన గుణగణములను, అవతార విశేషములను, ఆయనయొక్క గొప్ప ఉత్కర్షను అధికముగా కొనియాడిరి. ఆయన అప్పుడు దయతో గూడిన చిరునవ్వుతో ప్రియవ్రతునివైపు చూచి ఇట్లు పలికెను.

శ్రీభగవానువాచ ।
నిబోధ తాతేదమృతం బ్రవీమి
మాసూయితుం దేవమర్హస్యప్రమేయమ్ ।
వయం భవస్తే తత ఏష మహర్షిః
వహామ సర్వే వివశా యస్య దిష్టమ్ ॥ 11

తాత - కుమారా!, నిబోధ - తెలుసుకొనుము, ఇదమ్ - ఈ, ఋతమ్ - సత్యమును, బ్రవీమి - చెప్పుచున్నాను, అప్రమేయమ్ - ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరము కాని, దేవమ్ - శ్రీహరి దేవుని, అసూయితుమ్ - దోషదృష్టితో చూచుటకు, మా అర్హసి - తగవు, వయమ్ - మేము, భవః - శివుడు, తే - నీ, తతః - తండ్రియగు మనువు, ఏషః - ఈ, మహర్షిః - నారద మహర్షి, సర్వే - అందరము, వివశాః - అస్వతంత్రుల మై, యస్య - ఎవ్వాని, దిష్టమ్ - ఆదేశమును, వహామ - పాలించెదమో.

కుమారా! నేను సత్యమును చెప్పుచున్నాను. నీవీ విషయమును తెలుసుకొనుము. శ్రీహరి ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరుడు కాడు. ఆయనను నీవు దోషదృష్టితో చూచుట తగదు. నేను, శివుడు, నీ తండ్రి యగు మనువు, ఈ నారద మహర్షి మేమందరము అస్వతంత్రులము. మేము ఆయన ఆదేశమును పాలించుచుండెదము.

న తస్య కశ్చిత్తపసా విద్యయా వా
న యోగవీర్యేణ మనీషయా వా ।

నైవార్థధర్మైః పరతస్స్వతో వా
కృతం విహంతుం తనుభృద్విభూయాత్ ॥ 12

తస్య - ఆ శ్రీహరియొక్క, కృతమ్ - విధానమును, తనుభృత్ - దేహమును ధరించువాడు, కశ్చిత్ - ఎవ్వడైననూ, తపసా - తపస్సుచే గాని, విద్యయా వా - విద్యచే గాని, విహంతుమ్ - తప్పించుటకు, న విభూయాత్ - సమర్థుడు కాడు, యోగవీర్యేణ - యోగశక్తిచే గాని, మనీ షయా వా - బుద్ధిశక్తిచే గాని, న - సమర్థుడు కాడు, అర్థధర్మైః - ధన ముచే గాని ధర్మకార్యములచే గాని, పరతః - ఇతరుని వలన గాని, స్వతః వా - స్వయముగా గాని, న ఏవ - సమర్థుడు కానే కాడు.

ఏ జీవుడైననూ ఆ శ్రీహరియొక్క విధానమును తపస్సుచే, విద్య చే, యోగశక్తిచే, బుద్ధిశక్తిచే, ధనముచే, లేదా ధర్మకార్యములచే, స్వయ ముగా గాని, లేదా ఇతరుల ఆశ్రయముతో గాని, తప్పించుటకు సమర్థుడు కానే కాడు.

భవాయ నాశాయ చ కర్మ కర్తుం
శోకాయ మోహాయ సదా భయాయ ।
సుఖాయ దుఃఖాయ చ దేహయోగ-
మవ్యక్తదిష్టం జనతాఽంగ ధత్తే ॥ 13

అంగ - ఓయీ!, జనతా - జీవ సమూహము, భవాయ - పుట్టుక కొరకు, చ - మరియు, నాశాయ - మరణము కొరకు, కర్మ - కర్మను, కర్తుమ్ - చేయుటకు, శోకాయ - శోకము కొరకు, మోహాయ - మోహము కొరకు, సదా - అన్ని కాలములలో, భయాయ - భయము కొరకు, సుఖాయ - సుఖము కొరకు, చ - మరియు, దుఃఖాయ - దుఃఖము కొర కు, అవ్యక్తదిష్టమ్ - ఇంద్రియగోచరుడు కాని ఈశ్వరునిచే ఈయబడిన, దేహయోగమ్ - దేహముతోడి సంబంధమును, ధత్తే - ధరించుచున్నది.

ఓయీ! ప్రతి జీవుడు ఇంద్రియగోచరుడు కాని ఈశ్వరునిచే ఈయ బడిన దేహమును ధరించి, కర్మలను చేస్తూ, అన్ని కాలములలో శోకమును

మోహమును భయమును అనుభవిస్తూ, సుఖదుఃఖములననుభవించి, మరణించును. ఈ సర్వము ఈశ్వరాధీనమై యున్నది.

యద్వాచి తంత్యాం గుణకర్మదామభిః
సుదుస్తరైర్వత్స వయం సుయోజితాః ।
సర్వే వహామో బలిమీశ్వరాయ
ప్రోతా నసీవ ద్విపదే చతుష్పదః ॥ 14

వత్స - ఓ కుమారా!, సుదుస్తరైః - మిక్కిలి అతిక్రమించ శక్యము కాని, గుణకర్మదామభిః - సత్త్వరజస్తమోగుణపూర్వకమగు కర్మలు అనే త్రాళ్లచే, యత్-వాచి - ఎవ్వాని వాక్కు అనే, తంత్యామ్ - త్రాటియందు, సుయోజితాః - గట్టిగా కట్టబడినవారమై, వయమ్ - మనము, సర్వే - అందరము, నసి - ముక్కునందు, ప్రోతాః - త్రాడు వేయబడిన, చతుష్పదః - పశువులు, ద్విపదే ఇవ - మానవుని కొరకు వలె, ఈశ్వరాయ - ఈశ్వరుని కొరకు, బలిమ్ - పూజను, వహామః - వహించుచున్నాము.

ఓ కుమారా! భగవానుని వేదరూపమగు వాక్కు మనలనందరిని నడిపించుచున్నది. వేదోక్తములగు సత్త్వరజస్తమోగుణాత్మకములైన కర్మలను చేసే మనము అందరము, కర్మలు అనే త్రాళ్లచే వేదము అనే త్రాటికి కట్టి వేయబడి, ఈశ్వరుని ఆదేశమును పాలిస్తూ, ఆయనను పూజించుచున్నాము. మనము ముక్కు త్రాడు వేసి బండికి కట్టబడి మనుష్యుల కొరకై బరువులను మోసే ఎద్దుల వంటి వారము.

ఈశాభిసృష్టం హ్యవరుంధ్మహేఽంగ
దుఃఖం సుఖం వా గుణకర్మసంగాత్ ।
ఆస్థాయ తత్తద్యదయుంక్త నాథః
చక్షుష్మతాంధా ఇవ నీయమానాః ॥ 15

అంగ - ఓయీ!, గుణకర్మసంగాత్ - గుణములు మూలమునందు గల కర్మలయందలి ఆసక్తి వలన, నాథః - ఈశ్వరుడు, యత్ - ఏ దేహమును, అయుంక్త - సమకూర్చినాడో, తత్ తత్ - దానిని దానిని, ఆస్థాయ

- స్వీకరించి, చక్షుష్మతా - చూపు గలవానిచే, నీయమానాః - నడిపించబడే, అంధాః ఇవ - గ్రుడ్డివారు వలె, ఈశా - ఈశ్వరునిచే, అభిసృష్టమ్ - ఈయబడిన, దుఃఖమ్ - దుఃఖమును గాని, సుఖం వా - సుఖమును గాని, అవరుంధ్మహే హి - స్వీకరించెదము గదా!

జీవులమగు మనము సత్త్వాది గుణములే మూలముగా గల కర్మలయందు ఆసక్తి గలవారమై యుండెదము. ఆ కర్మలకనురూపముగా ఈశ్వరుడు మనకు ఆయా దేహములనొసగును. అట్టి దేహములను దాల్చిన మనము, చూపు గలవానిచే నడిపించబడే గ్రుడ్డివారు వలె, ఈశ్వరునిచే ఈయబడే సుఖదుఃఖములను స్వీకరించెదము.

ముక్తోఽపి తావద్బిభృయాత్స్వదేహ-
మారబ్ధమశ్నన్నభిమానశూన్యః ।
యథానుభూతం ప్రతియాతనిద్రః
కిం త్వన్యదేహాయ గుణాన్న వృంక్తే ॥ 16

ముక్తః అపి - జీవన్ముక్తుడు కూడ, ఆరబ్ధమ్ - ప్రారబ్ధకర్మను, అశ్నన్ - అనుభవించుచున్నవాడై, అభిమానశూన్యః - అభిమానము లేనివాడై, తావత్ - అంతవరకు, ప్రతియాతనిద్రః - తొలగిపోయిన నిద్ర గలవాడు, అనుభూతం యథా - స్వప్నములో అనుభవించబడినదానిని వలె, స్వదేహమ్ - తన దేహమును, బిభృయాత్ - ధరించును, కిం తు - కాని, అన్యదేహాయ - మరియొక దేహము కొరకు, గుణాన్ - వాసనలను (కర్మలను), న వృంక్తే - స్వీకరించదు.

జీవన్ముక్తుడు కూడ ప్రారబ్ధ (జన్మనారంభించిన) కర్మ ఉన్నంతవరకు దానికి అనురూపముగా సుఖదుఃఖములననుభవిస్తూ, దేహాదులయందు నేను-నాది అనే అభిమానము లేనివాడై, దేహమును ధరించి యుండును. దీనిని నిద్ర మేల్కొంచినవాడు స్వప్నములో తాను అనుభవించిన విషయములను స్మరించే స్థితితో పోల్చవచ్చును. కాని, అట్టి జ్ఞాని మరల దేహమునారంభించే విధముగా (అనగా, కర్తృత్వభావనతో) కర్మలను చేయడు. దేహారంభకములగు వాసనలు ఆతనియందు ఉండవు.

భయం ప్రమత్తస్య వనేష్వపి స్యాద్
యతస్స ఆస్తే సహషట్సపత్నః ।
జితేంద్రియస్యాత్మరతేర్బుధస్య
గృహాశ్రమః కిం ను కరోత్యవద్యమ్ ॥ 17

ప్రమత్తస్య - మదించి యున్నవానికి, వనేషు అపి - అడవుల యందు కూడ, భయమ్ - భయము, స్యాత్ - కలుగును, యతః - ఏలయనగా, సః - ఆతడు, సహషట్-సపత్నః - ఆర్గురు శత్రువులతో కూడియున్నవాడై, ఆస్తే - ఉండును, జిత-ఇంద్రియస్య - జయించబడిన ఇంద్రియములు కలిగినట్టియు, ఆత్మరతేః - ఆత్మారాముడగు, బుధస్య - జ్ఞానికి, గృహ-ఆశ్రమః - గృహస్థాశ్రమము, అవద్యమ్ - దోషమును, కిం ను కరోతి - చేయునా ఏమి?

విషయభోగములయందు మదించి యున్నవాడు అడవిలో ఉన్నా సంసారభయమును కలిగియే యుండును. ఏలయనగా, అడవికి వెళ్లినా ఆర్గురు అంతశ్శత్రువులు (కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు, లేదా అయిదు జ్ఞానేంద్రియములు మరియు మనస్సు) ఆతనిని వెన్నాడి యుండును. దీనికి భిన్నముగా, ఇంద్రియములను జయించి ఆత్మారాముడై యున్న జ్ఞాని గృహస్థాశ్రమములో ఉన్నా, దోషమేమి కలుగును? రాగాది దోషమేమియు ఆతనికి కలుగదు.

యః షట్ సపత్నాన్ విజిగీషమాణో
గృహేషు నిర్విశ్య యతేత పూర్వమ్ ।
అత్యేతి దుర్గాశ్రిత ఊర్జితారీన్
క్షీణేషు కామం విచరేద్విపశ్చిత్ ॥ 18

విపశ్చిత్ - వివేకియగు, యః - ఎవడైతే, షట్ - ఆరు, సపత్నాన్ - శత్రువులను, విజిగీషమాణః - జయించు కోరిక గలవాడో, పూర్వమ్ - ముందుగా, గృహేషు నిర్విశ్య - గృహస్థాశ్రమమునందుండి, యతేత - సాధన చేయవలెను, క్షీణేషు - అవి క్షీణించగా, కామమ్ - యథేచ్ఛగా,

విచరేత్ - సంచరించవలెను, దుర్గ-ఆశ్రితః - దుర్గమునాశ్రయించిన రాజు, ఊర్జిత-అరీన్ - బలవంతులగు శత్రువులను, అతి-ఏతి - జయించును.

దుర్గమునాశ్రయించి ఉన్న రాజు బలవంతులగు శత్రువులనైననూ జయించగల్గును. అదే విధముగా వివేకవంతుడగు సాధకుడు ముందుగా గృహస్థాశ్రమములోనుండి సాధన చేయవలెను. అట్లు చేయుట వలన ఆత డు ఆరు అంతశ్శత్రువులను జయించి, జితేంద్రియుడగును. అప్పుడాతడు గృహస్థుగా ఉన్నా, లేక అడవికి వెళ్లినా (సన్న్యసించినా), తేడా ఉండదు గాన, తనకు నచ్చిన విధముగా చేయవచ్చును.

త్వం త్వబ్జనాభాంఘ్రిసరోజకోశ-
దుర్గాశ్రితో నిర్జితషట్సపత్నః ।
భుంక్ష్వేహ భోగాన్ పురుషాతిదిష్టాన్
విముక్తసంగః ప్రకృతిం భజస్వ ॥ 19

త్వం తు - నీవైతే, అబ్జనాభ-అంఘ్రిసరోజకోశదుర్గ-ఆశ్రితః - పద్మనాభుని పాదపద్మముయొక్క గర్భము అనే దుర్గమునాశ్రయించినవా డవై, నిర్జితషట్-సపత్నః - జయించబడిన ఆర్గురు అంతశ్శత్రువులు గలవా డవై, ఇహ - ఈ లోకమునందు, పురుష-అతిదిష్టాన్ - ఈశ్వరునిచే ఈయ బడిన, భోగాన్ - భోగములను, విముక్తసంగః - విడిచిపెట్టబడిన ఆసక్తి గల వాడవై, భుంక్ష్వ - అనుభవించుము, ప్రకృతిమ్ - స్వరూపమును, భజస్వ - సేవించుము.

నీవైతే పద్మనాభుని పాదపద్మముయొక్క గర్భమునే దుర్గముగా ఆశ్రయించి (అనగా, పద్మనాభుని పాదములను స్మరించి మనోబలమును పొంది), ఆర్గురు లోపలి శత్రువులను (కామక్రోధాదులను, లేదా అయిదు ఇంద్రియములను మనస్సును) జయించుము. ఈ లోకములో ఈశ్వరుడి చ్చిన భోగములను భోగాసక్తి లేకుండా అనుభవించుము. ఆ విధముగా ఆత్మస్వరూపనిష్ఠను సాధించుము.

శ్రీశుక ఉవాచ ।
ఇతి సమభిహితో మహాభాగవతో భగవతస్త్రిభువనగురోరను

శాసనమాత్మనో లఘుతయాఽవనతశిరోధరో బాఢమితి సబ
హుమానముపాహ ॥ 20

ఇతి - ఈ విధముగా, సమభిహితః - చక్కగా ఉపదేశించబడిన, సః - ఆ, మహాభాగవతః - గొప్ప భగవద్భక్తుడగు ప్రియవ్రతుడు, ఆత్మనః - తాను, లఘుతయా - పిన్న అగుటచే, అవనతశిరోధరః - వంచబడిన మెడ గలవాడై, త్రిభువనగురోః - ముల్లోకములకు తండ్రియగు, భగవతః - బ్రహ్మదేవుని, శాసనమ్ - ఆదేశమును, బాఢం ఇతి - సరే అని, సబహుమానమ్ - ఆదరపూర్వకముగా, ఉపాహ - స్వీకరించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ముల్లోకములకు తండ్రియగు బ్రహ్మదేవుడు గొప్ప భగవద్భక్తుడగు ప్రియవ్రతునకు ఈ విధముగా చక్కని ఉపదేశమును చేసెను. తాను బ్రహ్మగారికంటె పిన్న యగుటచే, ప్రియవ్రతుడు ఆయన యెదుట వినయముతో మెడను వంచి, సరే అంటూ, ఆ ఉపదేశమును ఆదరముతో స్వీకరించెను.

భగవానపి మనునా యథావదుపకల్పితాపచితిః ప్రియవ్రతనా
రదయోరవిషమమభిసమీక్షమాణయోరాత్మసమవస్థాన
మవాఙ్మనసం క్షయమవ్యవహృతం ప్రవర్తయన్నగమత్ ॥21

భగవాన్ అపి - బ్రహ్మదేవుడు కూడ, మనునా - మనువుచే, యథావత్ - చక్కగా, ఉపకల్పిత-అపచితిః - సమర్పించబడిన పూజ గలవాడై, ప్రియవ్రతనారదయోః - ప్రియవ్రతుడు నారదుడు, అవిషమమ్ - తిన్నగా, అభిసమీక్షమాణయోః - చూచుచుండగా, ఆత్మసమవస్థానమ్ - తనకు అధిష్ఠానమైనట్టియు, అవాక్-మనసమ్ - మాటలకు ఊహలకు అందనట్టియు, అవ్యవహృతమ్ - వ్యవహారమునకు అతీతమైన పరబ్రహ్మను, ప్రవర్తయన్ - ధ్యానించుచున్నవాడై, క్షయమ్ - నివాసమును గురించి, అగమత్ - వెళ్లెను.

బ్రహ్మదేవుని మనువు చక్కగా పూజించెను. అపుడాయన, ప్రియవ్రత నారదులు ప్రసన్నమగు మనస్సుతో తనవైపే చూచుచుండగా, తన లోకమునకు వెళ్లెను. ఆ సమయములో ఆయన పరబ్రహ్మను ఆత్మరూప

ముగా ధ్యానించుచుండెను. హిరణ్యగర్భునకు అధిష్ఠానమగు ఆ పరబ్రహ్మ మాటలకు గాని, ఊహలకు గాని అందేది కాదు. సర్వవ్యవహారములు ఆ పరబ్రహ్మయందే కల్పించబడుచున్ననూ, అవి ఆ పరతత్త్వమును స్పృశించజాలవు.

మనురపి పరేణైవం ప్రతిసంధితమనోరథస్సురర్షివరానుమతే
నాత్మజమఖిలధరామండలస్థితిగుప్తయ ఆస్థాప్య స్వయమతివి
షమవిషయవిషజలాశయాశాయా ఉపరరామ ॥ 22

మనుః అపి - మనువు కూడ, ఏవమ్ - ఈ విధముగా, పరేణ - జగద్గురువగు బ్రహ్మగారిచే, ప్రతిసంధితమనోరథః - సంపాదించబడిన మనోరథము గలవాడై, సుర-ఋషివర-అనుమతేన - దేవర్షివర్యుడగు నారదుని అనుమతిచే, ఆత్మజమ్ - పుత్రుడగు ప్రియవ్రతుని, అఖిలధరా మండలస్థితిగుప్తయే - సకలభూమండలముయొక్క స్థితిని రక్షించుటకై, ఆస్థాప్య - రాజ్యాధికారమునందు నిలిపి, స్వయమ్ - తాను, అతివిషమవిషయవిషజల-ఆశయ-ఆశాయాః - మిక్కిలి దుర్ఘటమగు ఇంద్రియభోగములనే విషజలమునకు నిధానమైన గృహమునందలి వాసననుండి, ఉపరరామ - నివృత్తుడాయెను.

మనువుయొక్క మనోరథమును జగద్గురువగు బ్రహ్మగారు ఈ విధముగా సంపాదించి పెట్టెను. అపుడాయన సకలభూమండలముయొక్క మర్యాదను రక్షించుట కొరకై, దేవర్షివర్యుడగు నారదుని అనుమతిచే ప్రియవ్రతుని రాజ్యమునందు ప్రతిష్ఠించెను. ఇంద్రియభోగములకు నిలయమగు గృహాశ్రమము విషము కలిసిన జలాశయము వంటిది. భోగేచ్ఛను అధిగమించుట దుర్ఘటము. కాని, ఆ మనువు అట్టి భోగేచ్ఛను పరిత్యజించెను.

ఇతి హ వావ స జగతీపతిరీశ్వరేచ్ఛయాఽధినివేశితకర్మాధికా
రోఽఖిలజగద్బంధధ్వంసనపరానుభావస్య భగవత ఆదిపురుష
స్యాంఘ్రియుగలానవరతధ్యానానుభావేన పరిరంధితకషాయా
శయోఽవదాతోఽపి మానవర్ధనో మహతాం మహీతలమనుశ
శాస ॥ 23

ఇతి హ వావ - ఇదే విధముగా, ఈశ్వర-ఇచ్ఛయా - ఈశ్వరుని సంకల్పముచే, అధినివేశితకర్మ-అధికారః - పొందించబడిన కర్మలయందలి అధికారము గల, సః - ఆ, జగతీపతిః - ప్రియవ్రత మహారాజు, అఖిల జగద్-బంధధ్వంసనపర-అనుభావస్య - సకలజగత్తుయొక్క బంధమును నశింపజేయుటయందు పూర్ణమగు సామర్థ్యము కలిగినట్టియు, ఆదిపురుషస్య - సర్వజగత్కారణమగు అఖండచైతన్యమే స్వరూపముగా గల, భగవతః - శ్రీహరి భగవానుని, అంఘ్రియుగల-అనవరతధ్యాన-అనుభావేన - పాదముల జంటను నిరంతరముగా ధ్యానించుటయొక్క ప్రభావముచే, పరిరంధితకషాయ-ఆశయః - దహించబడిన రాగద్వేషములు గల హృదయము గలవాడై, అవదాతః అపి - శుద్ధుడే అయిననూ, మహతామ్ - పెద్దల, మానవర్ధనః - సమ్మానమును వర్ధిల్లజేయువాడై, మహీతలమ్ - భూమండలమును, అనుశశాస - పాలించెను.

ఈ విధముగా ప్రియవ్రత మహారాజు ఈశ్వరసంకల్పముచే రాజ్యపాలనము అనే కర్మయందు నియుక్తుడాయెను. సకలజగత్తుయొక్క బంధమునుండి విముక్తిని కలిగించే మహిమ సకలజగత్కారణుడగు శ్రీహరి భగవానునకు గలదు. ఆ మహారాజు అఖండచైతన్యస్వరూపుడగు అట్టి శ్రీహరియొక్క పాదముల జంటను నిరంతరముగా ధ్యానించెడివాడు. ఆ ధ్యానముయొక్క ప్రభావముచే ఆయన హృదయములో రాగద్వేషముల మాలిన్యము తొలగిపోయి, ఆయన శుద్ధుడాయెను. ఇంకనూ కర్తవ్యకర్మలను చేయవలసిన అవశ్యకత ఆయనకు లేదు. అయిననూ, పెద్దల మర్యాదను నిలబెట్టువాడై, ఆయన రాజ్యమును పాలించెను.

**అథ చ దుహితరం ప్రజాపతేర్విశ్వకర్మణ ఉపయేమే బర్హిష్మతీం నామ తస్యాము హ వావ ఆత్మజానాత్మసమానశీలగుణకర్మరూపవీర్యోదారాన్ దశ భావయాంబభూవ కన్యాం చ యవీయసీమూర్జస్వతీం నామ ॥ 24**

అథ చ - తరువాత, ప్రజాపతేః - ప్రజాపతియగు, విశ్వకర్మణః - విశ్వకర్మయొక్క, బర్హిష్మతీం నామ - బర్హిష్మతి అని ప్రసిద్ధి గాంచిన, దుహితరమ్ - కుమార్తెను, ఉపయేమే - వివాహమాడెను, ఉ - అహో!, తస్యాం

వావ - ఆమెయందు నిశ్చయముగా, ఆత్మసమానశీలగుణకర్మరూపవీర్య-ఉదారాన్ - తనతో సమానమైన శీలము గుణములు కర్మ రూపము పరాక్రమములచే గొప్పవారగు, దశ - పదిమంది, ఆత్మజాన్ - కుమారులను, చ - మరియు, ఊర్జస్వతీం నామ - ఊర్జస్వతి అని ప్రసిద్ధి గాంచిన, యవీయసీమ్ - కనిష్ఠయగు, కన్యామ్ - కన్యను, భావయాంబభూవ - కనెను.

తరువాత ఆయన విశ్వకర్మ ప్రజాపతియొక్క కుమార్తెయగు బర్హిష్మతిని వివాహమాడెను. ఆమెయందు ఆయనకు పదిమంది కొడుకులు, ఆఖరుగా ఊర్జస్వతి అని పేరు గాంచిన ఒక కూతురు కలిగిరి. ఆహా! ఆ కొడుకులు అందరు చాల గొప్ప వారు. వారు ప్రియవ్రతునితో సమానమైన శీలమును, గుణములను, కర్మలను, రూపమును, పరాక్రమమును కలిగి యుండిరి.

ఆగ్నీధ్రేధ్మజిహ్వయజ్ఞబాహుమహావీరహిరణ్యరేతోఘృతపృష్ఠ-
సవనమేధాతిథివీతిహోత్రకవయ ఇతి సర్వ ఏవాగ్నినామానః।। 25

ఆగ్నీధ్ర-ఇధ్మజిహ్వయజ్ఞబాహుమహావీరహిరణ్యరేతః-ఘృతపృష్ఠసవనమేధాతిథివీతిహోత్రకవయః - ఆగ్నీధ్రుడు ఇధ్మజిహ్వుడు యజ్ఞబాహువు మహావీరుడు హిరణ్యరేతసుడు ఘృతపృష్ఠుడు సవనుడు మేధాతిథి వీతిహోత్రుడు కవి, ఇతి - అని, సర్వే- అందరు, అగ్నినామానః ఏవ - అగ్ని పేరు గలవారే.

ఆగ్నీధ్రుడు (అగ్నిని ప్రజ్వరిల్లజేయు ఋత్విక్కు), ఇధ్మజిహ్వుడు (సమిధెల కట్టయే నాలుకగా గలవాడు), యజ్ఞబాహువు (యజ్ఞములే చేతులుగా గలవాడు), మహావీరుడు (గొప్ప వేడి గలవాడు), హిరణ్యరేతసుడు (తేజస్సే సారముగా గలవాడు), ఘృతపృష్ఠుడు (నేయియే ఆధారముగా గలవాడు), సవనుడు (సోమమును పానము చేయువాడు), మేధాతిథి, వీతిహోత్రుడు (హవిస్సే ఆహారముగా గలవాడు), కవి (జ్ఞాన స్వరూపుడు) అనునవి వారి పేర్లు. ఇవి అన్నీ అగ్ని పేర్లే.

ఏతేషాం కవిర్మహావీరస్సవన ఇతి త్రయ ఆసన్నూర్ధ్వరేతసస్త
ఆత్మవిద్యాయామర్భభావాదారభ్య కృతపరిచయాః పారమ
హంస్యమేవాశ్రమమభజన్ ।। 26

ఏతేషామ్ - వీరిలో, కవిః - కవి, మహావీరః - మహావీరుడు, సవనః - సవనుడు, ఇతి - అనే, త్రయః - ముగ్గురు, ఊర్ధ్వరేతసః - నైష్ఠిక బ్రహ్మచారులుగా, ఆసన్ - ఉండిరి, అర్భభావాత్ - బాల్యమునుండి, ఆరభ్య - మొదలుపెట్టి, ఆత్మవిద్యాయామ్ - ఆత్మవిద్యయందు, కృతపరి చయాః - చేయబడిన అభ్యాసము గల, తే - వారు, పారమహంస్యమ్ - పరమహంసలకు చెందిన, ఆశ్రమం ఏవ - ఆశ్రమమును మాత్రమే, అభ జన్ - సేవించిరి.

వీరిలో కవి, మహావీరుడు, సవనుడు అనువారలు ముగ్గురు నైష్ఠిక బ్రహ్మచారులు. వారు బాల్యమునుండియే ఆత్మవిద్యను అభ్యసించి, పర మహంసలకు సంబంధించిన సన్న్యాసాశ్రమమునే స్వీకరించిరి.

తస్మిన్ను హ వా ఉపశమశీలాః పరమర్షయస్సకలజీవనికా
యావాసస్య భగవతో వాసుదేవస్య భీతానాం శరణభూతస్య
శ్రీమచ్చరణారవిందావిరతస్మరణావిగలితపరమభక్తియోగాను
భావేన పరిభావితాంతర్హృదయాధిగతే భగవతి సర్వేషాం
భూతానామాత్మభూతే ప్రత్యగాత్మన్యేవాత్మనస్తాదాత్మ్యమవి
శేషేణ సమీయుః।। 27

ఉ హ - ఆహా!, తస్మిన్ వై - దానియందు నిశ్చయముగా, ఉపశ మశీలాః - సర్వకర్మసన్న్యాసమే శీలముగా గల, పరమ-ఋషయః - మహర్షులగు ఆ కవి మొదలగు వారలు, సకలజీవనికాయ-ఆవాసస్య - సక లజీవసమూహములకు నివాసమైనట్టియు, భీతానామ్ - భయపడినవారల కు, శరణభూతస్య - శరణు అయిన, భగవతః వాసుదేవస్య - శ్రీకృష్ణ భగ వానునియొక్క, శ్రీమత్-చరణ-అరవింద-అవిరతస్మరణ-అవిగలితపరమ భక్తియోగ-అనుభావేన - శోభిల్లే పాదపద్మముల నిరంతరమగు స్మరణ ముచే అఖండితమైన గొప్ప భక్తియొక్క అభ్యాసముయొక్క మహిమచే,

పరిభావిత-అంతః-హృదయ-అధిగతే - పరిశుద్ధము చేయబడిన హృదయము లోపల సాక్షాత్కరము చేసుకొనబడునట్టియు, సర్వేషామ్ - అన్ని, భూతానామ్ - ప్రాణులకు, ఆత్మభూతే - ఆత్మ యైనట్టియు, ప్రత్యక్-ఆత్మని ఏవ - అంతరతమమగు స్వరూపమే అయి ఉన్న, భగవతి - భగవానునియందు, ఆత్మనః - ఆత్మయొక్క, తాదాత్మ్యమ్ - అభేదమును, అవిశేషేణ - అహంకార నిరాకరణముచే, సమీయుః - పొందిరి.

ఆహా! ఆ సన్న్యాసాశ్రమమునందు వారు ముగ్గురు మహర్షులు సర్వకర్మసన్న్యాసులై సర్వోత్కృష్టమగు భక్తిని సాధన చేసిరి. సకలజీవ సమూహములకు నివాసస్థానమగు శ్రీకృష్ణ భగవానుడు శరణు పొందిన వారి భయములను పోగొట్టును. వారాయనయొక్క శోభాయుక్తములగు పాదపద్మములను అఖండితముగా ధ్యానించిరి. దాని ప్రభావముచే వారి హృదయము శుద్ధమై, సకలప్రాణులకు అంతరతమమగు స్వరూపమైన ఆత్మయే అయి ఉన్న భగవానుడు ఆ హృదయములో సాక్షాత్కరించెను. వారు అహంకారమును నిరాకరించి ఆత్మరూపుడగు భగవానునిలోనే ఐక్యమును పొందిరి.

అన్యస్యామపి జాయాయాం త్రయః పుత్రా ఆసన్నుత్తమస్తా
మసో రైవత ఇతి మన్వంతరాధిపతయః ॥ 28

అన్యస్యామ్ - మరియొక, జాయాయాం - భార్యయందు, ఉత్తమః - ఉత్తముడు, తామసః - తామసుడు, రైవతః - రైవతుడు, ఇతి - అనే, మన్వంతర-అధిపతయః - మన్వంతరములకు ప్రభువులగు, త్రయః - ముగ్గురు, పుత్రాః అపి - పుత్రులు కూడ, ఆసన్ - కలిగిరి.

ప్రియవ్రతునకు మరియొక భార్యయందు ఉత్తముడు, తామసుడు, రైవతుడు అనే ముగ్గురు కొడుకులు కూడ కలిగిరి. వారు మన్వంతరములకు అధీశ్వరులు.

ఏవముపశమాయనేషు స్వతనయేష్వథ జగతీపతిర్జగతీమర్బుదా
న్యేకాదశ పరివత్సరాణామవ్యాహతాఖిలపురుషకారసారసంభృత
దోర్దండయుగలాపీడితమౌర్వీగుణస్తనితవిరమితధర్మప్రతిపక్షో బర్హి

ష్మత్యాశ్చానుదినమేధమానప్రమోదప్రసరణయౌషిణ్యవ్రీడాప్రము షితహాసావలోకరుచిరక్ష్వేల్యాదిభిః పరాభూయమానవివేక ఇవాన వబుధ్యమాన ఇవ మహామనా బుభుజే ।। 29

స్వతనయేషు - తన కుమారులు, ఏవమ్ - ఈ విధముగా, ఉపశ మాయనేషు - సర్వకర్మసన్న్యాసమే జీవనశైలిగా గలవారు కాగా, మహా మనాః - గొప్ప మనస్సు గల, జగతీపతిః - ప్రియవ్రత మహారాజు, అథ - తరువాత, పరివత్సరాణామ్ - సంవత్సరములయొక్క, ఏకాదశ - పదకొం డు, అర్బుదాని - కోట్లను, అవ్యాహత-అఖిలపురుషకారసారసంభృతదోః- దండయుగల-ఆపీడితమౌర్వీగుణస్తనితవిరమితధర్మప్రతిపక్షః - ఖండితము కాని అన్ని పౌరుషములు గల బలముచే నిండియున్న రెండు భుజదండ ములచే లాగబడిన నారిత్రాడుయొక్క టంకారముచే తొలగించబడిన ధర్మ విరోధులు గలవాడై, బర్హిష్మత్యాః - బర్హిష్మతికి, అనుదినమ్ -ప్రతిరోజు, ఏధమానప్రమోదప్రసరణయౌషిణ్యవ్రీడాప్రముషితహాస-అవలోకరుచి రక్ష్వేలీ-ఆదిభిః - వర్ధిల్లుచున్న హర్షము ఎదురేగుట ప్రేమప్రకటనము సిగ్గు ముసిముసి నవ్వుల చూపులు ఉల్లాసమును కలిగించే పరిహాసవచనములు మొదలగువాటిచే, పరాభూయమానవివేకః ఇవ - తిరస్కరించబడిన వివే కము గలవాడు వలె, అనవబుధ్యమానః ఇవ - ఆత్మవిస్మృతిని పొందిన వాడు వలె, జగతీమ్ - భూమిని, బుభుజే - భోగించెను.

ఈ విధముగా ప్రియవ్రత మహారాజుయొక్క ముగ్గురు కుమారులు సర్వకర్మసన్న్యాసపరాయణులైరి. అపుడా పెద్ద మనస్సు గల మహారాజు పదకొండు కోట్ల సంవత్సరముల కాలము భూమిని పాలించెను. ఆయన బలముతో నిండిన భుజదండముల జంటతో అన్ని పురుషకారములను నిరాఘాటముగా సాధించెను. ఆయన ఆ భుజములతో నారిత్రాడు లాగిన ప్పుడు కలిగిన శబ్దము ధర్మద్రోహులను తరిమివేయుటకు చాలియుండె ను. ఆయన అంతఃపురమునకు వచ్చినప్పుడు బర్హిష్మతి హర్షముతో ఎదు రేగి, ప్రేమను ఒలకబోస్తూ, సిగ్గు పడుతూ, ముసిముసి నవ్వులతో నిండిన చూపులను విసురుతూ, ఉల్లాసమును కలిగించే పరిహాసవచనములను పలుకుతూ ఆయనను రమింపజేసెను. ప్రతిదినము వర్ధిల్లుచున్న ఈ

శృంగారచేష్టలచే ఆయన వివేకమును కోల్పోయినాడా యన్నట్లు, ఆత్మవి స్మృతిని పొందినాడా యన్నట్లు, ఆమెతో గూడి భూలోకములో భోగముల ననుభవించెను.

యావదవభాసయతి సురగిరిమనుపరిక్రామన్ భగవానాదిత్యో వసుధాతలమర్ధేనైవ ప్రతపత్యర్ధేనావచ్ఛాదయతి తదా హి భగవదుపాసనోపచితాతిపురుషప్రభావస్తదనభినందన్ సమజవేన రథేన జ్యోతిర్మయేన రజనీమపి దినం కరిష్యామీతి సప్తకృత్వస్తరణిమనుపర్యక్రామద్ద్వితీయ ఇవ పతంగః ॥ 30

భగవాన్ ఆదిత్యః - సూర్య భగవానుడు, యావత్ - ఎంతవరకు, వసుధాతలమ్ - భూమండలమును, అవభాసయతి - ప్రకాశింప జేయుచున్నాడో, సురగిరిమ్ - మేరుపర్వతమును, అనుపరిక్రామన్ - ప్రదక్షిణము చేయుచున్నవాడై, అర్ధేన ఏవ - సగము ప్రదక్షిణముచే మాత్రమే, ప్రతపతి - చక్కగా ప్రకాశించుచున్నాడు, అర్ధేన - సగము ప్రదక్షిణముచే, అవచ్ఛాదయతి - చీకటితో కప్పివేయుచున్నాడు, భగవత్-ఉపాసన-ఉపచిత-అతిపురుషప్రభావః - భగవంతుని ఉపాసించుటచే సంపాదించబడిన మానవాతీతమగు మహిమ గల ప్రియవ్రతుడు, తత్ - దానిని, అనభినందన్ - ఇష్టపడనివాడై, తదా హి - అప్పుడే, సమజవేన - సమానమగు వేగము గల, జ్యోతిర్మయేన - ప్రకాశముతో నిండియున్న, రథేన - రథముతో, రజనీం అపి - రాత్రిని కూడ, దినమ్ - పగలుగా, కరిష్యామి - చేయగలను, ఇతి - అని, ద్వితీయః - రెండవ, పతంగః ఇవ - సూర్యుడు వలె, తరణిం అను - సూర్యుని అనుసరించి, సప్తకృత్వః - ఏడు సార్లు, పర్యక్రామత్ - ప్రదక్షిణము చేసెను.

సూర్య భగవానుడు మేరు పర్వతమును ప్రదక్షిణము చేస్తూ భూమండలమును ప్రకాశింప జేయుచున్నాడు. కాని, ఆయన భూమండలములో సగమును మాత్రమే ప్రకాశింప జేస్తూ, మిగిలిన సగమును చీకటితో కప్పివేయుచున్నాడు. ఇది ప్రియవ్రతునకు నచ్చలేదు. ఆయన శ్రీహరి భగవానుని ఉపాసించి మానవాతీతమగు మహిమను సంపాదించినవాడు.

అపుడాయన సూర్యునితో సమానమగు వేగము గలది, కాంతిపూర్ణము అగు రథమునెక్కి, రెండవ సూర్యుని వలె సూర్యుని వెంట మేరువును ఏడు సార్లు ప్రదక్షిణము చేసెను.

యే వా ఉ హ తద్రథచరణనేమికృతపరిఖాతాస్తే సప్త సింధవ
ఆసన్ యత ఏవ కృతాస్సప్త భువో ద్వీపాః ॥ 31

ఉ హ - ఆహా!, యే వై - ఏవైతే, తద్-రథచరణనేమికృతపరిఖాతాః - ఆ రథచక్రముల వంచలచే చేయబడిన అగడ్తలు (గాడులు) గలవో, తే - అవి, సప్త - ఏడు, సింధవః - సముద్రములు, ఆసన్ - అయినవి, యతః ఏవ - వేటి వలన మాత్రమే, భువః - భూమియొక్క, సప్త - ఏడు, ద్వీపాః - ఖండములు, కృతాః - చేయబడినవో.

ఆయన రథచక్రముల వంచలు చేసిన అగడ్తలే ఏడు సముద్రములైనవి. ఆ సముద్రముల వలననే భూమండలము ఏడు ఖండములుగా విభాగము చేయబడినది.

జంబూప్లక్షశాల్మలికుశక్రౌంచశాకపుష్కరసంజ్ఞాస్తేషాం పరి
మాణం పూర్వస్మాత్పూర్వస్మాదుత్తర ఉత్తరో యథాసంఖ్యం
ద్విగుణమానేన బహిస్సమంతత ఉపక్లుప్తాః ॥ 32

జంబూప్లక్షశాల్మలికుశక్రౌంచశాకపుష్కరసంజ్ఞాః - జంబూ ప్లక్షము శాల్మలి కుశము క్రౌంచము శాకము పుష్కరము అనునవి పేర్లు, తేషామ్ - వాటి, పరిమాణమ్ - కొలతను గురించి, పూర్వస్మాత్ పూర్వస్మాత్ - ముందు ముందు దానికంటె, ఉత్తరః ఉత్తరః - తరువాతి తరువాతిది, యథాసంఖ్యమ్ - క్రమముగా, ద్విగుణమానేన - రెండు రెట్లు కొలతచే, బహిః - బయట, సమంతతః - అంతటా, ఉపక్లుప్తాః - రచించబడినవి.

జంబూ, ప్లక్షము, కుశము, క్రౌంచము, శాకము, పుష్కరము అనునవి ఆ ద్వీపముల పేర్లు. వాటి పరిమాణమును గురించి చెప్పెదను. వాటిలో ముందుదానికంటె తరువాతిది రెండు రెట్లు పరిమాణమును కలిగి యున్నది. అవి సముద్రమునకు బయట చుట్టూ వ్యాపించి యున్నవి.

క్షారోదేక్షురసోదసురోదఘృతోదక్షీరోదదధిమండోదశుద్ధో
దాస్సప్త జలధయస్సప్త ద్వీపపరిఖా ఇవాభ్యంతరద్వీపస
మానా ఏకైకశ్యేన యథానుపూర్వం సప్తస్వపి బహిర్ద్వీపేషు
పృథక్ పరిత ఉపకల్పితాస్తేషు జంబ్వాదిషు బర్హిష్మతీపతిర
నువ్రతానాత్మజానాగ్నీధ్రేధ్మజిహ్వాయజ్ఞబాహుహిరణ్యరేతో-
ఘృతపృష్ఠమేధాతిథివీతిహోత్రసంజ్ఞాన్ యథాసంఖ్యేనైకైకస్మి
న్నేకమేవాధిపతిం విదధే ॥ 33

క్షార-ఉదఇక్షురస-ఉదసురా-ఉదఘృత-ఉదక్షీర-ఉదదధిమండ-ఉదశుద్ధ-ఉదాః - ఉప్పు నీరు చెరుకు రసము మదిర నేయి పాలు పెరుగు మంచినీరు అనునవి గల, సప్త - ఏడు, జలధయః - సముద్రములు, సప్త - ఏడు, ద్వీపపరిఖాః ఇవ - ద్వీపములకు అగడ్తలు వలె నున్నవి, ఏకైకశ్యేన - ప్రతి ఒక్కటి, అభ్యంతరద్వీపసమానాః - తమ లోపలనుండే ద్వీపములతో సమానమైనవి, సప్తసు - ఏడు, ద్వీపేషు అపి - ద్వీపములయందు కూడ, యథానుపూర్వమ్ - క్రమముగా, పృథక్ - వేర్వేరుగా, బహిః - బయట, పరితః - చుట్టూ, ఉపకల్పితాః - రచించబడి యున్నవి, తేషు - ఆ, జంబూ-ఆదిషు - జంబూద్వీపము మొదలగు ద్వీపములయందు, బర్హిష్మతీపతిః - బర్హిష్మతికి భర్తయగు ప్రియవ్రతుడు, అనువ్రతాన్ - తన ఆజ్ఞను పాలించే, ఆగ్నీధ్ర-ఇధ్మజిహ్వాయజ్ఞబాహుహిరణ్యరేతః-ఘృతపృష్ఠమేధాతిథివీతిహోత్రసంజ్ఞాన్ - ఆగ్నీధ్రుడు ఇధ్మజిహ్వుడు యజ్ఞబాహువు హిరణ్యరేతసుడు ఘృతపృష్ఠుడు మేధాతిథి వీతిహోత్రుడు అని పేర్లు గల, ఆత్మజాన్ - పుత్రులను, యథాసంఖ్యేన - క్రమముగా, ఏక-ఏకస్మిన్ - ఒక్కొక్క ద్వీపమునందు, ఏకం ఏవ - ఒక్కని మాత్రమే, అధిపతిమ్ - రాజునుగా, విదధే - చేసెను.

ఉప్పు, చెరుకు రసము, మదిర, నేయి, పాలు, పెరుగు, మంచి నీరు అనే ఏడు సముద్రములు ఏడు ద్వీపములకు అగడ్తలవలె నున్నవి. అవి వాటిలోపలనున్న జంబూ మొదలగు ద్వీపములతో సమానమగు పరిమాణమును కలిగియున్నవి. అవి క్రమముగా జంబూ మొదలగు ఏడు ద్వీపములకు బయట వేర్వేరుగా చుట్టువారి యున్నవి. బర్హిష్మతికి భర్త

యగు ప్రియవ్రతుడు తన ఆజ్ఞను పాలించే పుత్రులనేడ్గురిని క్రమముగా ఒక్కొక్కరిని ఒక్కొక్క ద్వీపమునకు మాత్రమే అధిపతిగా చేసెను. ఆగ్నీధ్రుడు, ఇధ్మజిహ్వుడు, యజ్ఞబాహువు, హిరణ్యరేతసుడు, ఘృతపృష్ఠుడు, మేధాతిథి, వీతిహోత్రుడు అనునవి వారి పేర్లు.

దుహితరం చోర్జస్వతీం నామోశనసే ప్రాయచ్ఛద్యస్యామాసీ
ద్దేవయానీ నామ కావ్యసుతా ॥ 34

ఊర్జస్వతీం నామ - ఊర్జస్వతి యని ప్రసిద్ధిని గాంచిన, దుహితరమ్ - కుమార్తెను, ఉశనసే - శుక్రాచార్యునకు, ప్రాయచ్ఛత్ - ఇచ్చెను, యస్యామ్ - ఎవతెయందు, దేవయానీ నామ - దేవయాని యని ప్రసిద్ధిని గాంచిన, కావ్యసుతా - శుక్రాచార్యునకు కుమార్తె, ఆసీత్ - కలిగెనో.

ప్రియవ్రతుడు ఊర్జస్వతి యని ప్రసిద్ధిని గాంచిన తన కుమార్తెను శుక్రాచార్యునకు ఇచ్చి వివాహమును చేసెను. శుక్రాచార్యునకు ఆమె యందు దేవయాని అని ప్రసిద్ధిని బడసిన కుమార్తె కలిగెను.

నైవంవిధః పురుషకార ఉరుక్రమస్య
పుంసాం తదంఘ్రిరజసా జితషడ్గుణానామ్ ।
చిత్రం విదూరవిగతస్సకృదాదదీత
యన్నామధేయమధునా స జహాతి బంధమ్ ॥ 35

ఉరుక్రమస్య - వామనావతారములో పెద్ద అడుగులు వేసిన భగవానుని, ఏవంవిధః - ఇట్టి, పురుషకారః - సృష్టిశక్తి, తత్-అంఘ్రిరజసా - ఆయన పాదధూళిచే, జితషట్-గుణానామ్ - జయించబడిన ఆరు ఇంద్రియములు గల, పుంసామ్ - వ్యక్తులకు, న చిత్రమ్ - ఆశ్చర్యము కాదు, విదూరవిగతః - చాల దూరముగా తొలగిపోయినవాడు, యత్-నామధేయమ్ - ఎవ్వాని పేరును, సకృత్ - ఒక్కసారి, ఆదదీత - ఉచ్చరించునో, సః - ఆతడు, అధునా - ఆ క్షణమునందు, బంధమ్ - సంసారబంధమును, జహాతి - విడిచిపెట్టును.

వామనావతారములో పెద్ద పెద్ద అంగలతో ముల్లోకములను కొలిచిన భగవానునియందు ఈ విధముగా ఏడు సముద్రములను, ద్వీపములను రచించే సామర్థ్యము గలదు. ఆయన పాదపద్మములను కొలిచే భక్తులకు ఇట్టి సామర్థ్యము ఆశ్చర్యమును కలిగించదు. భగవంతుని పాదపద్మములను కొలిచే భక్తులు అయిదు జ్ఞానేంద్రియములను, మనస్సును జయించెదరు. ఆకలి-దప్పికలు, శోకమోహములు, జరామృత్యువులు అనే ఆరు ప్రకృతివికారములకు వారు అతీతులై యుండెదరు. ధర్మమునుండి దూరముగా తొలగిపోయిన వ్యక్తియైననూ ఆ భగవానుని నామమును ఒక్కసారి ఉచ్చరించినచో, ఆ క్షణమునందే ఆతడు సంసారబంధమునుండి విముక్తుడగును.

స ఏవమపరిమితబలపరాక్రమ ఏకదా తు దేవర్షిచరణానుశయ
నానుపతితగుణవిసర్గసంసర్గేణానిర్వృతమివాత్మానం మన్య
మాన ఆత్మనిర్వేద ఇదమాహ ॥ 36

ఏవమ్ - ఈ విధముగా, అపరిమితబలపరాక్రమః - హద్దు లేని బలము పరాక్రమము గల, సః - ఆ ప్రియవ్రతుడు, ఏకదా తు - ఒకనాడైతే, దేవ-ఋషిచరణ-అనుశయన-అనుపతితగుణవిసర్గసంసర్గేణ - దేవర్షి యగు నారదుని పాదముల సేవ తరువాత పొందబడిన రాజ్యవ్యవహారములతోడి (విషయభోగములతోడి) సంయోగము వలన, ఆత్మానమ్ - తనను, అనిర్వృతం ఇవ - ఆనందము లేనివానినిగా, మన్యమానః - తలపోయుచున్నవాడై, ఆత్మనిర్వేదః - బుద్ధియందు వైరాగ్యము గలవాడై, ఇదమ్ - ఈ మాటను, ఆహ - పలికెను.

ఈ విధముగా ప్రియవ్రతుడు హద్దు లేని బలపరాక్రమములు గలవాడే. కాని, ఆయన దేవర్షియగు నారదుని పాదములను సేవిస్తూ, రాజ్యాధికారమును, విషయభోగములను పొంది యుండెను. అందువలన, ఆయనకు మనస్సులో ఒక అసంతోషము మిగిలియున్నదా యన్నట్లు ఉండెను. వైరాగ్యపూర్ణమగు మనస్సు గల ఆ మహారాజు ఒకనాడు ఇట్లు పలికెను.

అహో అసాధ్వనుష్ఠితం యదభినివేశితోఽహమింద్రియైరవిద్యా
రచితవిషమవిషయాంధకూపే తదలమలమముష్యా వని
తాయా వినోదమృగం మాం ధిగ్ధిగితి గర్హయాంచకార ।। 37

అహో - ఆశ్చర్యము!, అసాధు - చెడు పని, అనుష్ఠితమ్ - చేయబడినది, యత్ - ఏలయనగా, అహమ్ - నేను, అవిద్యారచితవిషమవిషయ-అంధకూపే - అజ్ఞానముచే తీర్చిదిద్దబడిన దుఃఖదాయకములగు విషయభోగముల చీకటి నూతియందు, ఇంద్రియైః - ఇంద్రియములచే, అభినివేశితః - పట్టుదల గలవానిగా చేయబడిన (పారవేయబడిన) వాడను, తత్ - దానినుండి, అలం అలమ్ - చాలు చాలు, అముష్యాః - ఈ, వనితాయాః - స్త్రీకి, వినోదమృగమ్ - క్రీడామృగము (కోతి) అగు, మామ్ - నా గురించి, ధిక్ ధిక్ - అధికముగా నింద యగుగాక!, ఇతి - అని, గర్హయాంచకార - నిందించుకొనెను.

ఆశ్చర్యము! చాల చెడ్డ పనిని చేసితిని! అజ్ఞానము దుఃఖహేతువులగు ఇంద్రియభోగములను చక్కగా తీర్చిదిద్ది ఆకర్షణను కలిగించును. ఇంద్రియములు నాకు దుఃఖహేతువువగు విషయభోగములయందు పట్టుదలను కలిగించి, చీకటితో నిండియున్న కూపమువంటి సంసారములోనికి పడద్రోసినవి. ఈ భోగములింక చాలును! నేను స్త్రీ చేతిలో కోతివలె నాట్యమాడితిని. నా ప్రవృత్తి చాల నిందించ దగినది, అని ఆ మహారాజు తనను నిందించుకొనెను.

పరదేవతాప్రసాదాధిగతాత్మప్రత్యవమర్శేనానుప్రవృత్తేభ్యః
పుత్రేభ్య ఇమాం యథాదాయం విభజ్య భుక్తభోగాం చ
మహిషీం మృతకమివ సహమహావిభూతిమపహాయ స్వయం
నిహితనిర్వేదో హృది గృహీతహరివిహారానుభావో భగవతో
నారదస్య పదవీం పునరేవానుససార ।। 38

పరదేవతాప్రసాద-అధిగత-ఆత్మప్రత్యవమర్శేన - పరమేశ్వరుని అనుగ్రహముచే పొందబడిన బుద్ధియందలి వివేకజ్ఞానముచే, హృది - హృదయమునందు, నిహితనిర్వేదః - ఉంచబడిన వైరాగ్యము గల ప్రియ

వ్రతుడు, అనుప్రవృత్తేభ్యః - తనను అనుసరించియున్న, పుత్రేభ్యః - పుత్రుల కొరకు, ఇమామ్ - ఈ భూమిని, యథాదాయమ్ - యోగ్యతనను సరించి, విభజ్య - పంచియిచ్చి, సహమహావిభూతిమ్ - గొప్ప సంపదతో గూడియున్నట్టియు, భుక్తభోగామ్ - అనుభవించబడిన భోగములు గల, మహిషీమ్ - భార్యను, మృతకం ఇవ - మరణించిన దేహమును వలె, అప హాయ - విడిచిపెట్టి, స్వయమ్ - తాను, హృది - హృదయమునందు, గృహీతహరివిహార-అనుభావః - స్వీకరించబడిన శ్రీహరియొక్క లీలల ప్రభావము గలవాడై, భగవతః - పూజ్యుడగు, నారదస్య - నారదుని, పద వీం ఏవ - మార్గమును మాత్రమే, పునః - మరల, అనుససార - అనుసరిం చెను.

పరమేశ్వరుని అనుగ్రహముచే ప్రియవ్రతుని హృదయములో వివే కము ఉదయించి, వైరాగ్యము దృఢమయ్యెను. ఆయన ఈ భూమిని యోగ్యతననుసరించి తనను అనుసరించియున్న పుత్రులకు పంచియిచ్చె ను. ఆయన భార్యతో గూడి గొప్ప సామ్రాజ్యలక్ష్మిని, భోగములను అనుభ వించెను. ఇపుడాయన ఆ సామ్రాజ్యమును మృతదేహమును వలె విడిచిపె ట్టెను. ఆయన హృదయములో శ్రీహరియొక్క లీలల మహిమను భావన చేస్తూ, మరల పూజ్యుడగు నారదమహర్షి ఉపదేశించిన మార్గమునే అనుస రించెను.

తస్య హ వా ఏతే శ్లోకాః ।
ప్రియవ్రతకృతం కర్మ కో ను కుర్యాద్వినేశ్వరమ్ ।
యో నేమినిమ్నైరకరోచ్ఛాయాం ఘ్నన్ సప్త వారిధీన్ ॥ 39

తస్య - ఆ ప్రియవ్రతునకు, ఏతే - ఈ, శ్లోకాః వై - ప్రసిద్ధములైన శ్లోకములు, హ - ఉన్నవి, ప్రియవ్రతకృతమ్ - ప్రియవ్రతునిచే చేయబడిన, కర్మ - పనిని, ఈశ్వరం వినా - ఈశ్వరుని మినహాయించి, కః ను - ఎవ్వా డు, కుర్యాత్ - చేయును?, యః - ఏ ప్రియవ్రతుడు, ఛాయామ్ - చీకటి ని, ఘ్నన్ - పోగొట్టుచున్నవాడై, నేమినిమ్నైః - చక్రముల అంచుల గాడుల చే, సప్త - ఏడు, వారిధీన్ - సముద్రములను, అకరోత్ - చేసెనో.

ప్రియవ్రతుని మహిమను చెప్పే ప్రసిద్ధములగు శ్లోకములు ఈ విధముగా నున్నవి --- ప్రియవ్రతుడు చేసిన కార్యమును భగవంతుడు తప్ప మరియెవ్వరు చేయగలరు? ఆయన చీకట్లను పోగొడ్తూ, తన రథచక్రముల అంచుల గాడులచే ఏడు సముద్రములను రచించెను.

భూసంస్థానం కృతం యేన సరిద్గిరివనాదిభిః ।
సీమా చ భూతనిర్వృత్యై ద్వీపే ద్వీపే విభాగశః ॥ 40

యేన - ఎవనిచే, భూతనిర్వృత్యై - ప్రాణుల సుఖము కొరకు, భూసంస్థానమ్ - భూమియొక్క రచన, చ - మరియు, ద్వీపే ద్వీపే - ప్రతి ద్వీపమునందు, విభాగశః - వేర్వేరుగా, సరిత్-గిరివన-ఆదిభిః - నదులు పర్వతములు అడవులు మొదలగువాటిచే, సీమా - హద్దు, కృతమ్ - చేయబడినదో.

ప్రియవ్రతుడు ప్రాణుల సుఖజీవనము కొరకై ద్వీపముల ద్వారా భూమియొక్క రచనను, ప్రతి ద్వీపమునందు వేర్వేరుగా నదులు, పర్వతములు, అడవులు మొదలగు వాటిచే హద్దులను ఏర్పాటు చేసెను.

భౌమం దివ్యం మానుషం చ మహిత్వం కర్మయోగజమ్ ।
యశ్చక్రే నిరయౌపమ్యం పురుషానుజనప్రియః ॥ 41

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే
ప్రియవ్రతోపాఖ్యానం నామ ప్రథమోఽధ్యాయః ॥

పురుష-అనుజనప్రియః - శ్రీహరియొక్క భక్తులు ప్రియమైన, యః - ఏ ప్రియవ్రతుడు, కర్మయోగజమ్ - కర్మల అనుష్ఠానముచే పుట్టే, భౌమమ్ - పాతాళమునందున్నట్టియు, దివ్యమ్ - స్వర్గమునందున్నట్టియు, చ - మరియు, మానుషమ్ - మనుష్యలోకమునందుండే, మహిత్వమ్ - వైభవమును, నిరయ-ఔపమ్యమ్ - నరకమువంటి దానినిగా, చక్రే - చేసెనో.

ప్రియవ్రతునకు భగవద్భక్తులయందు ప్రీతి మెండు. జీవులు కర్మలను చేసి పాతాళమునందు, భూలోక స్వర్గలోకములయందు పొందే వైభవము ఆయనకు నరకమువంటిదిగనే భాసిల్లెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమ స్కంధములో
ప్రియవ్రతోపాఖ్యానము అనే మొదటి
అధ్యాయము ముగిసినది (1).

*****

# అథ ద్వితీయోऽధ్యాయః

## ఆగ్నీధ్రుని చరితము

శ్రీశుక ఉవాచ ।
ఏవం పితరి సంప్రవృత్తే తదనుశాసనే వర్తమాన ఆగ్నీధ్రో జంబూద్వీపౌకసః ప్రజా ఔరసవద్ధర్మావేక్షమాణః పర్యగోపాయత్ ।। 1

ఏవమ్ - ఈ విధముగా, పితరి - తండ్రి, సంప్రవృత్తే - చక్కగా ప్రవర్తిల్లువాడు కాగా, తత్-అనుశాసనే - ఆయన ఆదేశమునందు, వర్తమానః - ఉండునట్టియు, ధర్మ-అవేక్షమాణః - ధర్మమును పాలించే, ఆగ్నీధ్రః - ఆగ్నీధ్రుడు, జంబూద్వీప-ఓకసః - జంబూద్వీపము నివాసముగా గల, ప్రజాః - ప్రజలను, ఔరసవత్ - సంతానమును వలె, పరి-అగోపాయత్ - అన్ని విధములుగా పాలించెను.

శ్రీశుకమహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా ప్రియవ్రతుడు చక్కగా భగవద్భజనమునందు ప్రవర్తిల్లగా, తండ్రి ఆజ్ఞను పాలించే ఆగ్నీధ్రుడు జంబూద్వీపనివాసులగు జనులను ధర్మబద్ధముగా సంతానమును వలె అన్ని విధములుగా రక్షిస్తూ, రాజ్యమునేలెను.

స చ కదాచిత్పితృలోకకామస్సురవరవనితాక్రీడాచలద్రోణ్యాం భగవంతం విశ్వసృజాం పతిమాభృతపరిచర్యోపకరణ ఆత్మైకాగ్ర్యేణ తపస్వ్యారాధయాంబభూవ ।। 2

సః చ - ఆ ఆగ్నీధ్రుడు, కదాచిత్ - ఒకనాడు, పితృలోకకామః - పితృలోకమును కోరువాడై, ఆభృతపరిచర్యా-ఉపకరణః - సమకూర్చుకొనబడిన పూజాసామగ్రి గలవాడై, తపస్వీ - తపశ్శాలియై, సురవరవనితాక్రీ

డా-అచలద్రోణ్యామ్ - దేవశ్రేష్ఠుల భార్యలకు విహారపర్వతమగు మందరముయొక్క లోయయందు, ఆత్మైకాగ్ర్యేణ - చిత్తముయొక్క ఏకాగ్రతచే, విశ్వసృజామ్ - ప్రజాపతులకు, పతిమ్ - ప్రభువగు, భగవంతమ్ - బ్రహ్మదేవుని, ఆరాధయాంబభూవ - ఆరాధించెను.

ఒకనాడు ఆ ఆగ్నీధ్రుడు పితృలోకమును (సంతానమును) పొందగోరి, మందరపర్వతముయొక్క లోయలో ఉండి తపస్సును చేసెను. ఆ లోయలో దేవశ్రేష్ఠుల భార్యలు విహరించుచుందురు. అచట ఆయన పూజాసామగ్రిని సమకూర్చుకొని, ప్రజాపతులకు ప్రభువగు బ్రహ్మదేవుని ఏకాగ్రమగు చిత్తముతో ఆరాధించెను.

తదుపలభ్య భగవానాదిపురుషస్సదసి గాయంతీం పూర్వ
చిత్తిం నామాప్సరసమభియాపయామాస || 3

తత్ - ఆ విషయమును, ఉపలభ్య - తెలుసుకొని, భగవాన్ - పూజ్యుడు, ఆదిపురుషః - జగత్తునకు కారణమైన (హిరణ్యగర్భుడు) బ్రహ్మగారు, సదసి - సభయందు, గాయంతీమ్ - గానమును చేయుచున్న, పూర్వచిత్తిం నామ - పూర్వచిత్తియని ప్రసిద్ధిని గాంచిన, అప్సరసమ్ - అప్సరసను, అభియాపయామాస - ఆగ్నీధ్రుని వద్దకు పంపించెను.

జగత్కారణుడగు బ్రహ్మదేవుడు ఆ విషయమును తెలుసుకొని, తన సభలో గానము చేసే పూర్వచిత్తి అనే అప్సరసను ఆగ్నీధ్రుని వద్దకు పంపించెను.

సా చ తదాశ్రమోపవనమతిరమణీయం వివిధనిబిడవిటపివిట
పనికరసంశ్లిష్టపురటలతారూఢస్థలవిహంగమమిథునైః ప్రోచ్య
మానశ్రుతిభిః ప్రతిబోధ్యమానసలిలకుక్కుటకారండవకలహం
సాదిభిర్విచిత్రముపకూజితామలజలాశయకమలాకరముప
బభ్రామ || 4

సా చ - ఆమె, అతిరమణీయమ్ - మిక్కిలి సుందరమైనది, వివిధనిబిడవిటపివిటపనికరసంశ్లిష్టపురటలతా-ఆరూఢస్థలవిహంగమమిథునైః -

పలుకరముల దట్టని చెట్ల కొమ్మల గుంపులచే కౌగిలించుకొనబడిన బంగరు తీగలయందు కూర్చున్న భూపక్షుల జంటలచే, ప్రోచ్యమానశ్రుతిభిః - పలుకబడుచున్న స్వరములచే, ప్రతిబోధ్యమానసలిలకుక్కుటకారండవకలహంస-ఆదిభిః - జాగరూకము చేయబడుచున్న నీటి కోళ్లు కారండవ (కన్నెలేడు) పక్షులు రాజహంసలు మొదలగు వాటిచే, విచిత్రమ్ - ఆశ్చర్యకరముగా, ఉపకూజిత-అమలజల-ఆశయకమల-ఆకరమ్ - ప్రతిధ్వనించుచున్న స్వచ్ఛమగు సరస్సులలోని కమలముల సమృద్ధి గల, తత్-ఆశ్రమ-ఉపవనం ఉప - ఆ ఆగ్నీధ్రుని ఆశ్రమమునకు సమీపమునందలి ఉద్యానవనమునకు దగ్గరలో, బభ్రామ - తిరుగాడెను.

ఆమె ఆ ఆగ్నీధ్రుని మిక్కిలి సుందరమగు ఆశ్రమమునకు దగ్గరగానున్న ఉద్యానవనములో సంచరింప జొచ్చెను. ఆ ఆశ్రమములో పలురకముల చెట్లు దట్టముగా నుండెను. బంగరు తీగలను కౌగిలించియున్న వాటి కొమ్మల గుంపులపై నెమలి మొదలగు భూపక్షుల జంటలు కూర్చుండి, స్వరములను పలుకుచుండెను. అక్కడి స్వచ్ఛమగు సరస్సులలోని నీటి కోళ్లు, కారండవ పక్షులు, రాజహంసలు మొదలగునవి ఆ కూతలను సావధానముగా వినుచుండెను. ఆ పక్షుల రొదలతో ప్రతిధ్వనిస్తూ ఆశ్చర్యమును గొలిపే ఆ సరస్సులలో కమలములు సమృద్ధముగా నుండెను.

**తస్యాస్సులలితగమనపదవిన్యాసగతివిలాసాయాశ్చానుపదం**
**ఖణఖణాయమానరుచిరచరణాభరణస్వనముపాకర్ణ్య నరదేవ**
**కుమారస్సమాధియోగేనామీలితనయననలినముకులయుగల**
**మీషద్వికచయ్య వ్యచష్ట ॥ 5**

సులలితగమనపదవిన్యాసగతివిలాసాయాః - మిక్కిలి సుందరమగు నడకయందు పాదముల విన్యాసములచే గమనమునందు విలాస గల, తస్యాః - ఆమెయొక్క, అనుపదమ్ - ప్రతి అడుగునందు, ఖణఖణాయమానరుచిరచరణ-ఆభరణస్వనమ్ - ఖణఖణ ధ్వనిని చేయుచున్న సుందరమగు నూపురముల ధ్వనిని, ఉపాకర్ణ్య - విని, నరదేవకుమారః - మహారాజపుత్రుడగు ఆగ్నీధ్రుడు, సమాధియోగేన - చిత్తైకాగ్రతయొక్క అభ్యాసముచే, ఆమీలితనయననలినముకులయుగలమ్ - మూయబడిన

తామరమొగ్గలవంటి కళ్ల జంటను, ఈషత్ - కొంచెము, వికచయ్య - తెరిచి, వ్యచష్ట - చూచెను.

ఆమె అందము ఉట్టిపడునట్లుగా అడుగులను వేస్తూ విలాసగా నడుస్తూ ఉంటే, అందమగు కాలియందెలు ఖణఖణ ధ్వనిని చేయుచుండెను. మహారాజపుత్రుడగు ఆగ్నీధ్రుడు చిత్తముయొక్క ఏకాగ్రతను అభ్యసిస్తూ, కన్నులను మూసుకొని యుండెను. ఆ ధ్వనిని విన్న ఆయన కన్నులను కొద్దిగా తెరిచి చూచెను.

తామేవాఽవిదూరే మధుకరీమివ సుమనస ఉపజిఘ్రంతీం దివిజమనుజమనోనయనాహ్లాదదుఘైర్గతివిహారవ్రీడావినయావలోకసుస్వరాక్షరావయవైర్మనసి నృణాం కుసుమాయుధస్య విదధతీం వివరం నిజముఖవిగలితామృతాసవసహాసభాషణామోదమదాంధమధుకరనికరోపరోధేన ద్రుతపదవిన్యాసేన వల్గుస్పందనస్తనకలశకబరభారరశనాం దేవీం తదవలోకనేన వివృతావసరస్య భగవతో మకరధ్వజస్య వశముపనీతో జడవదితి హోవాచ ॥ 6

అవిదూరే ఏవ - దగ్గరలోనే, మధుకరీం ఇవ - తుమ్మెద వలె, సుమనసః - పుష్పములను, ఉపజిఘ్రంతీమ్ - ఆఘ్రాణించుచున్నట్టియు, దివిజమనుజమనః-నయన-ఆహ్లాదదుఘైః - దేవతలకు మానవులకు మనస్సునకు కళ్లకు అధికముగా ఆహ్లాదమును కలిగించే, గతివిహారవ్రీడావినయ-అవలోకసుస్వర-అక్షర-అవయవైః - నడక ఆట సిగ్గు వినయముతోడి చూపులు చక్కని పలుకులు మరియు అవయవములతో, నృణామ్ - మానవులకు, మనసి - మనస్సునందు, కుసుమ-ఆయుధస్య - పుష్పములే ఆయుధములుగా గల మన్మథునకు, వివరమ్ - ప్రవేశద్వారమును, విదధతీమ్ - ఏర్పాటు చేయుచున్నట్టియు, నిజముఖవిగలిత-అమృత-ఆసవసహాసభాషణ-ఆమోదమద-అంధమధుకరనికర-ఉపరోధేన - తన నోటి నుండి వెలువడిన అమృతాసవమువంటి చిరునవ్వుతో కూడిన పలుకులయందలి నిశ్వాససుగంధముచే మదించి గ్రుడ్డివి అయిన తుమ్మెదల

గుంపుల కప్పివేతచే, ద్రుతపదవిన్యాసేన - వేగముగా అడుగులను వేయు టచే, వల్గుస్పందనస్తనకలశకబరభారరశనామ్ - సుందరమగు చిన్న కద లిక కలశములవంటి స్తనములయందు దట్టని జుట్టుముడియందు చిరుగం టల వడ్డాణమునందు కలిగిన, తామ్ - ఆ, దేవీమ్ - దేవిని, తత్-అవలోక నేన - ఆమెను చూచుటచే, వివృత-అవసరస్య - పొందబడిన ప్రవేశము నకు అవకాశము గల, భగవతః - పూజ్యుడగు, మకరధ్వజస్య - మొసలి ధ్వజమునందు గల మన్మథుని, వశమ్ - వశమును, ఉపనీతః - పొందించ బడిన ఆగ్నీధ్రుడు, జడవత్ - జడుడు వలె, ఇతి హ - ఈ విధముగా, ఉవాచ - పలికెను.

ఆమె తుమ్మెదవలె పుష్పములనాఘ్రాణించుచుండెను. ఆమె నడ క, విహారము, సిగ్గు, వినయముతో కూడిన చూపులు, చక్కని పలుకులు మరియు అవయవములు దేవతలకు మానవులకు కూడ మనస్సునకు కళ్లకు అధికముగా ఆహ్లాదమును కలిగించుచుండెను. ఆమె సౌందర్యము మానవుల హృదయములలో మన్మథునకు ప్రవేశమును కల్పించుచుండె ను. ఆమె చిరునవ్వుతో పలికే పలుకులు అమృతాసవమువలె మధుర ముగా మాదకములై యుండెను. ఆమె మాటలాడునప్పుడు వెలువడే నిశ్వాసవాయువుయొక్క సుగంధమునాఘ్రాణించిన తుమ్మెదల గుంపులు మత్తుచే గ్రుడ్డివి అయి ఆమె ముఖమును కప్పివేయుచుండెను. ఆమె తొందరగా నడుచునప్పుడు కలశములవంటి స్తనములు, దట్టని జుట్టు ముడి మరియు చిరుగంటల వడ్డాణము కొద్దిగా కదలాడుచుండెను. ఆమెను తన సమీపములో చూచిన ఆగ్నీధ్రుని హృదయములో పూజ్యు డగు మన్మథునకు ప్రవేశము లభించెను. మన్మథునకు వశుడైన ఆగ్నీ ధ్రుడు మొద్దుబారినవాడు (పిచ్చివాడు) వలె ఆమెతో నిట్లనెను.

కా త్వం చికీర్షసి చ కిం మునివర్య శైలే
మాయాఽసి కాపి భగవత్పరదేవతాయాః ।
విజ్యే బిభర్షి ధనుషీ సుహృదాత్మనోఽర్థే
కిం వా మృగాన్మృగయసే విపినే ప్రమత్తాన్ ॥ 7

మునివర్య - ఓ గొప్ప మహర్షీ!, త్వమ్ - నీవు, కా - ఎవరు?, శైలే - పర్వతమునందు, కిమ్ - దేనిని, చికీర్షసి - చేయగోరుచున్నావు?, భగవత్-పరదేవతాయాః - పరమేశ్వరుడగు శ్రీహరియొక్క, కా అపి - చెప్ప శక్యము కాని, మాయా అసి - మాయవా యేమి?, సుహృత్ - మిత్రమా!, విజ్యే - నారిత్రాడు లేని, ధనుషీ - రెండు ధనస్సులను, బిభర్షి - ధరించియున్నావు, ఆత్మనః అర్థే - నీ కొరకా యేమి?, వా - లేక, విపినే - అడవియందు, ప్రమత్తాన్ - బాగా మదించియున్న, మృగాన్ - మృగములను, మృగయసే కిమ్ - వేటాడుచున్నావా యేమి?

ఓ గొప్ప మహర్షీ! నీవెవరు? ఈ పర్వతముపై నీవు ఏమి చేయగోరుచున్నావు? నీవు పరమేశ్వరుడగు శ్రీహరియొక్క మాయవా యేమి? మిత్రమా! నీవు నారిత్రాడు లేని రెండు ధనస్సులను (కనుబొమలు) ధరించి యున్నావు. అవి ఆత్మరక్షణ కొరకా? లేక, అడవిలో బాగా మదించి యున్న మృగములను వేటాడుచున్నావా యేమి? (కాముకులే సంసార మనే అడవిలో బాగా మదించి యున్న మృగములు).

బాణావిమౌ భగవతశ్శతపత్రపత్రౌ
శాంతావపుంఖరుచిరావతితిగ్మదంతౌ ।
కస్మై యుయుంక్షసి వనే విచరన్న విద్మః
క్షేమాయ నో జడధియాం తవ విక్రమోఽస్తు ॥ 8

భగవతః - పూజ్యుడవగు నీ, ఇమౌ - ఈ, శాంతౌ - శాంతములైన, బాణౌ - బాణములు, శతపత్రపత్రౌ - కలువలే రెక్కలుగా గలవి, అపుంఖరుచిరౌ - తోకలు లేకున్ననూ అందమైనవి, అతితిగ్మదంతౌ - మిక్కిలి వాడి కొనలు గలవి, వనే - అడవియందు, విచరన్ - సంచరించువాడవై, కస్మై - ఎవని కొరకు, యుయుంక్షసి - ప్రయోగించ గోరుచున్నావు?, తవ - నీ, విక్రమః - పరాక్రమము, జడధియామ్ - మందబుద్ధులమగు, నః - మా, క్షేమాయ - క్షేమము కొరకు, అస్తు - అగుగాక!

పూజ్యుడవగు నీ ఈ శాంతములగు బాణములు (చూపులు) కలువ కన్నులే రెక్కలుగా గలవి. మిక్కిలి వాడి కొనలు గల ఈ బాణములు

తోక లేకున్ననూ, అందముగా నున్నవి. నీవు అడవిలో సంచరిస్తూ, వీటిని ఎవనిపై ప్రయోగించ గోరుచున్నావు? నీ పరాక్రమము మందబుద్ధులమగు మాకు క్షేమమును కలిగించు గాక!

శిష్యా ఇమే భగవతః పరితః పఠంతి
గాయంతి సామ సరహస్యమజస్రమీశమ్ ।
యుష్మచ్ఛిఖావిలులితాస్సుమనోఽభివృష్టీః
సర్వే భజంత్యృషిగణా ఇవ వేదశాఖాః ॥ 9

భగవతః - పూజ్యుడవగు నీ, ఇమే - ఈ, శిష్యాః - శిష్యులు, ఈశమ్ - గురువగు నీ, పరితః - చుట్టూ, పఠంతి - చదువుచున్నారు, అజస్రమ్ - నిరంతరముగా, సరహస్యమ్ - రహస్యము (మంత్రము) తో కూడిన, సామ - సామవేదమును, గాయంతి - గానము చేయుచున్నారు, యుష్మత్-శిఖావిలులితాః - నీ జుట్టుముడినుండి జారిపడిన, సుమనః-అభివృష్టీః - పుష్పముల నలువైపుల వర్షములను, సర్వే - అందరు, ఋషిగణాః - మహర్షుల గుంపులు, వేదశాఖాః ఇవ - వేదశాఖలను వలె, భజంతి - స్వీకరించుచున్నారు.

పూజ్యుడవగు నీ ఈ శిష్యులు (తుమ్మెదలు) నీ చుట్టూ చేరి వల్లించుచున్నారు; (రహస్యములను చెప్పుచున్నారా యన్నట్లు) మంత్రములతో కూడిన సామవేదమును గానము చేయుచున్నారు. నీ జుట్టుముడినుండి జారి నలువైపులా పడిన పూలవానను, మహర్షుల గుంపులు వేదశాఖలను అనుసరించే విధముగా, వీరందరు సేవించుచున్నారు.

వాచం పరం చరణపంజరతిత్తిరీణాం
బ్రహ్మన్నరూపముఖరాం శృణవామ తుభ్యమ్ ।
లబ్ధా కదంబరుచిరంకవిటంకబింబే
యస్యామలాతపరిధిః క్వ చ వల్కలం తే ॥ 10

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, తుభ్యమ్ - నీ కొరకు, అరూపముఖరామ్ - ముఖము కానరాకుండా ధ్వనిని చేయుచున్న, చరణపంజరతిత్తిరీణామ్ -

పాదముల నూపురములయందలి మణులయొక్క, వాచం పరమ్ - వాక్కును మాత్రమే, శృణవామ - వినుచున్నాము, అంకవిటంకబింబే - నడుముయొక్క సుందరమగు మండలమునందు, కదంబరుచిః - కడిమి పువ్వుల కాంతి, క్వ - ఎక్కడ, లబ్ధా - సంపాదించబడినది, యస్యామ్ - దేనియందు, అలాతపరిధిః - కొరివియొక్క కైవారము గలదో, తే - నీ, వల్కలమ్ - వస్త్రము, క్వ - ఎక్కడిది?

ఓ మహాత్మా! నీ నూపురములయందలి మణులు (పంజరముల లోని తిత్తిరిపక్షులు అని వ్యంగ్యార్థము) నీ కొరకై ధ్వనించుచున్నవి. కేవలము ధ్వని మాత్రము మాకు వినబడుచున్నది. కాని, వాటి ముఖము కానవచ్చుట లేదు. నీ నడుముయొక్క సుందరమగు మండలమునందు కడిమిపువ్వుల కాంతి ఎక్కడిది? దానికి చుట్టూ నిప్పుల కైవారము గలదు సుమా! (పచ్చని దేహకాంతికి ఆకుపచ్చని చీర, బంగరు వడ్డాణము జోడైన వని ధ్వని). నీకీ వస్త్రము ఎక్కడిది?

కిం సంభృతం రుచిరయోర్ద్విజ శృంగయోస్తే
మధ్యే కృశో వహసి యత్ర దృశిశ్శ్రితా మే ।
పంకోऽరుణస్సురభిరాత్మవిషాణ ఈదృగ్
యేనాశ్రమం సుభగ మే సురభీకరోషి ॥ 11

ద్విజ - ఓ మహర్షీ!, తే - నీ, రుచిరయోః - సుందరములగు, శృంగయోః - శిఖరములయందు, కిమ్ - ఏమి, సంభృతమ్ - నింపబడినది?, మధ్యే - నడుము, కృశః - చిక్కియున్న నీవు, వహసి - మోయుచున్నావు, యత్ర - ఎక్కడనైతే, మే - నా, దృశిః - చూపు, శ్రితా - లగ్నమైనదో, సుభగ - ఓ భాగ్యవంతుడా!, ఆత్మవిషాణే - నీ శిఖరమునందు, అరుణః - ఎర్రని, సురభిః - పరిమళము గల, పంకః - లేపము, ఈదృక్ - ఇట్టి అపూర్వమైనది, యేన - దేనిచే, మే - నా, ఆశ్రమమ్ - ఆశ్రమమును, సురభీకరోషి - పరిమళభరితము చేయుచున్నావో.

ఓ మహర్షీ! నీ సుందరములగు శిఖరముల (స్తనముల) లో ఏమి నిండియున్నది? సన్నని నడుము గల నీవు ఈ శిఖరములను మోయుచు

న్నావు. నా చూపు అచ్చటనే నిలిచియున్నది సుమా! ఓ భాగ్యవంతుడా! నీ ఈ శిఖరములపై అపూర్వమగు ఎర్రని లేపము (చందనపు పూత) గలదు. ఈ లేపముయొక్క పరిమళముచే నా ఆశ్రమము పరిమళభరితమైనది.

లోకం ప్రదర్శయ సుహృత్తమ తావకం మే
యత్రత్య ఇత్థమురసాఽవయవావపూర్వౌ ।
అస్మద్విధస్య మనఉన్నయనౌ బిభర్తి
బహ్వద్భుతం సరసరాససుధాది వక్త్రే ॥ 12

సుహృత్-తమ - ఓ గొప్ప మిత్రమా!, తావకమ్ - నీ, లోకమ్ - నివాసస్థానమును, మే - నా కొరకు, ప్రదర్శయ - చూపుము, యత్రత్యః - ఎక్కడనుండే జనుడు, ఇత్థమ్ - ఈ విధముగా, ఉరసా - వక్షఃస్థలముచే, అస్మత్-విధస్య - మావంటివాని, మన-ఉత్-నయనౌ - మనస్సునకు క్షోభను కలిగించే, అపూర్వౌ - అపూర్వములగు, అవయవౌ - అవయవములను, వక్త్రే - ముఖమునందు, సరసరాససుధా-ఆది - తియ్యని పలుకులతో మరియు విలాసతో కూడియున్న అమృతము మొదలగు, బహు - పలువిధముల, అద్భుతమ్ - విచిత్రమును, బిభర్తి - ధరించునో.

ఓయీ! నీవు గొప్ప మిత్రుడవు. నీవు నివసించే స్థానమును నాకు చూపుము. మీ ఊరిలోని జనులు ఈ విధముగా వక్షఃస్థలముపై నావంటివారల మనస్సునకు క్షోభను కలిగించే అపూర్వములగు అవయవములను మాత్రమే గాక, ముఖముపై తియ్యని పలుకులు, హావభావములూ అధరామృతము మొదలగు అనేకములైన అద్భుతములను కలిగియుండెదరు.

కా వాఽఽత్మవృత్తిరదనాద్ధవిరంగ వాతి
విష్ణోః కలాస్యనిమిషోన్మకరౌ చ కర్ణౌ ।
ఉద్విగ్నమీనయుగలం ద్విజపంక్తిశోచి-
రాసన్నభృంగనికరం సర ఇన్ముఖం తే ॥ 13

అంగ - ఓ మిత్రమా!, ఆత్మవృత్తిః - నీ ఆహారము, కా వా - ఏమి?, అదనాత్ - భుజించుట వలన, హవిః - సుగంధము, వాతి - వీచు

చున్నది, విష్ణోః - శ్రీహరియొక్క, కలా - కళవు, అసి - అగుదువు, కర్ణౌ - చెవులు, అనిమిష-ఉత్-మకరౌ - రెప్పపాటు లేని కన్నులవంటి రత్నము లతో కూడియున్న గొప్ప మకరకుండలములు గలవి, ఉద్విగ్నమీనయుగ లమ్ - చంచలమైన చేపల జంట కలిగినట్టియు, ద్విజపంక్తిశోచిః - పక్షుల (దంతముల) వరుసల శోభ కలిగినట్టియు, ఆసన్నభృంగనికరమ్ - దాపు నందున్న తుమ్మెదల గుంపు గల, తే - నీ, ముఖమ్ - ముఖము, సరః ఇత్ - సరస్సును పోలియున్నది.

ఓ మిత్రమా! నీ ఆహారమేమి? నీవు నములుచున్న పదార్థము (తాంబూలము) యొక్క సుగంధము నావరకు గాలిచే ప్రసరించుచున్నది. నీవు శ్రీహరియొక్క అంశవు. నీ చెవులకు గల గొప్ప మకరకుండముల రత్నములు రెప్పపాటు లేని కన్నులవలె మెరియుచున్నవి. చంచలమగు కన్నుల జంటతో, శోభిల్లే దంతముల వరుసలతో, తుమ్మెదల గుంపు వంటి జుట్టుముడితో కూడియున్న నీ ముఖము -- ఇటునటు కదిలే చేపలతో, రాజహంసల వరుసలతో, తుమ్మెదల గుంపులతో కూడియున్న సరస్సును పోలియున్నది.

యోఽసౌ త్వయా కరసరోజహతః పతంగో
దిక్షు భ్రమన్ భ్రమత ఏజయతేఽక్షిణీ మే ।
ముక్తం న తే స్మరసి వక్రజటావరూథం
కష్టోఽనిలో హరతి లంపట ఏష నీవీమ్ ।। 14

యః - ఏ, పతంగః - బంతి, త్వయా - నీచే, కరసరోజహతః - పద్మమువంటి చేతితో కొట్టబడినదో, అసౌ - ఇది, దిక్షు - దిక్కులయందు, భ్రమన్ - తిరుగుచున్నదై, భ్రమతః - తిరుగుచున్న, మే - నా, అక్షిణీ - కన్నులను, ఏజయతే - త్రిప్పుచున్నది, తే - నీ, ముక్తమ్ - విడిపోయిన, వక్రజటా-అవరూథమ్ - గిరజాల జుట్టుయొక్క ముడిని, న స్మరసి - గుర్తించకున్నావు, లంపటః - చంచలుడు, కష్టః - ధూర్తుడు అగు, ఏషః - ఈ, అనిలః - వాయువు, నీవీమ్ - వస్త్రమును, హరతి - తొలగించుచు న్నాడు.

నీవు పద్మమువంటి చేతితో బంతిని కొట్టుచుండగా, అది నలువైపులా ఎగురుతూ, చంచలమగు చిత్తము గల నా కళ్లను ఇటునటు త్రిప్పుచున్నది. నీ గిరజాల జుట్టు ముడి విడిపోయినా, నీవు గమనించనే లేదు. ఈ ధూర్తుడగు చపల వాయువు నీ వస్త్రమును తొలగించుచున్నాడు.

రూపం తపోధన తపశ్చరతాం తపోఘ్నం
హ్యేతత్తు కేన తపసా భవతోపలబ్ధమ్ ।
చర్తుం తపోఽర్హసి మయా సహ మిత్ర మహ్యం
కిం వా ప్రసీదతి స వై భవభావనో మే ॥ 15

తపః-ధన - తపస్సే ధనముగా గలవాడా!, తపః - తపస్సును, చరతామ్ - చేయువారల, తపః-ఘ్నమ్ - తపస్సును చెడగొట్టే, ఏతత్ - ఈ, రూపం తు - రూపమైతే, భవతా - నీచే, కేన - ఏ, తపసా - తపస్సుచే, ఉపలబ్ధమ్ - పొందబడినది?, మిత్ర - ఓ మిత్రమా!, మహ్యమ్ - నా కొరకు, మయా సహ - నాతో గూడి, తపః - తపస్సును, చర్తుమ్ - చేయుటకు, అర్హసి హి - తగుచున్నావు, భవభావనః - సృష్టిని చేసిన, సః - ఆ బ్రహ్మదేవుడు, మే - నా కొరకు, కిం వా ప్రసీదతి - అనుగ్రహించునా?

తపస్సే ధనముగా గల ఓ మిత్రమా! నీ ఈ రూపము తపస్సును చేయువారల తపస్సునకు విఘ్నమును కలిగించ జాలియున్నది. నీవీ రూపమును ఏ తపస్సు చేసి సంపాదించితివి? నీవు నా కోసం నాతో గూడి తపస్సును చేయవలెను సుమా! ఆ సృష్టికర్త (నీతో జతను గూర్చుట ద్వారా) నాపై అనుగ్రహమును చూపునా?

న త్వాం త్యజామి దయితం ద్విజదేవదత్తం
యస్మిన్మనో దృగపి నో న వియాతి లగ్నమ్ ।
మాం చారుశృంగ్యర్హసి నేతుమనువ్రతం తే
చిత్తం యతః ప్రతిసరంతు శివాస్సచివ్యః ॥ 16

ద్విజదేవదత్తమ్ - బ్రహ్మదేవునిచే ఈయబడిన, దయితమ్ - ప్రియుడవగు, త్వామ్ - నిన్ను, న త్యజామి - విడువను, యస్మిన్ - ఏ

నీయందు, లగ్నమ్ - లగ్నమైన, నః - మా, మనః - మనస్సు, దృక్ అపి - చూపు కూడ, న వియాతి - ఇవతలకు వచ్చుట లేదు, చారుశృంగి - సుందరమగు స్తనములు గలదానా!, అనువ్రతమ్ - అనుసరించే, మామ్ - నన్ను, నేతుమ్ - కొనిపోవుటకు, అర్హసి - తగుచున్నావు, యతః - ఎక్కడ నైతే, తే - నీ, చిత్తమ్ - చిత్తము గలదో, శివాః -మంగళకారులగు, సచివ్యః - సఖురాండ్రు, ప్రతిసరంతు - తోడు వచ్చెదరు గాక!

ప్రియుడవగు నిన్ను బ్రహ్మదేవుడు నాకు ఒసగినాడు. నేను నిన్ను విడిచిపెట్టను. నీయందు నా మనస్సు, చూపు కూడ లగ్నమై, వెను దిరుగుట లేదు. ఓ సుందరస్తనీ! నేను నీ వెంట వచ్చుచున్నాను. నీ మనస్సునకు నచ్చిన చోటికి నన్ను గొనిపొమ్ము. మంగళకారులగు ఈ నీ సఖురాండ్రు మన వెంట ఉండెదరు గాక!

శ్రీశుక ఉవాచ ।

ఇతి లలనాఽనునయాతివిశారదో గ్రామ్యవైదగ్ధ్యయా పరిభాషయా
తాం విబుధవధూం విబుధమతిరధిసభాజయామాస ॥ 17

విబుధమతిః - దేవతల బుద్ధివంటి బుద్ధి గలవాడు, లలనా-అనునయ-అతివిశారదః - సుందరిని వశము చేసుకొనుటలో మిక్కిలి నేర్పరి అగు ఆగ్నీధ్రుడు, ఇతి - ఈ విధముగా, గ్రామ్యవైదగ్ధ్యయా - ఇంద్రియభోగములయందు పాటవమైన, పరిభాషయా - పలుకుతో, తామ్ - ఆ, విబుధవధూమ్ - అప్సరసను, అధిసభాజయామాస - అనుకూలముగా చేసుకొనెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- దేవతలవలె చురుకైన బుద్ధి గల ఆగ్నీధ్రుడు సుందరిని వశము చేసుకొనుటలో నేర్పరి. ఆయన ఈ తీరున ఇంద్రియభోగములయందు పాటవము గల పలుకులతో ఆ అప్సరసను తనకు అనుకూలము చేసుకొనెను.

**సా చ తతస్తస్య వీరయూథపతేర్బుద్ధిశీలరూపవయశ్శ్రియౌదార్యేణ పరాక్షిప్తమనాస్తేన సహాయుతాయుతపరివత్సరోపలక్షణం కాలం జంబూద్వీపపతినా భౌమస్వర్గభోగాన్ బుభుజే ॥ 18**

తతః - తరువాత, సా చ - ఆ పూర్వచిత్తి కూడ, వీరయూథపతేః - వీరుల గణములకు ప్రభువగు, తస్య - ఆ ఆగ్నీధ్రునియొక్క, బుద్ధిశీల రూపవయః-శ్రియ-ఔదార్యేణ - బుద్ధి శీలము రూపము వయస్సు సంపద ఔదార్యముచే, పరాక్షిప్తమనాః - ఆకర్షించబడిన మనస్సు గలదియై, జంబూద్వీపపతినా - జంబూద్వీపమునకు ప్రభువగు, తేన సహ - ఆయ నతో గూడి, అయుత-అయుతపరివత్సర-ఉపలక్షణమ్ - పది కోట్ల సంవ త్సరముల పరిమితి గల, కాలమ్ - కాలమును, భౌమస్వర్గభోగాన్ - భూలోకమునందు మరియు స్వర్గలోకమునందు భోగములను, బుభుజే - భోగించెను.

తరువాత వీరుల గణములకు ప్రభువు మరియు జంబూద్వీపము నకు అధిపతి అగు ఆ ఆగ్నీధ్రునియొక్క బుద్ధి, శీలము, రూపము, వయ స్సు, సంపద మరియు ఔదార్యములచే ఆ పూర్వచిత్తి మనస్సు ఆకర్షిత మయ్యెను. ఆయనతో గూడి ఆమె పది కోట్ల సంవత్సరముల కాలము నిరంతరముగా భూలోకమునందు మరియు స్వర్గలోకమునందు భోగముల ననుభవించెను.

తస్యాము హ వా ఆత్మజాన్ స రాజవర ఆగ్నీధ్రో నాభికింపు
రుషహరివర్షేలావృతరమ్యకహిరణ్మయకురుభద్రాశ్వకేతుమా
లసంజ్ఞాన్నవ పుత్రానజనయత్ ॥ 19

రాజవరః - మహారాజగు, సః - ఆ, ఆగ్నీధ్రః - ఆగ్నీధ్రుడు, తస్యాం వై - ఆమెయందు, నాభికింపురుషహరివర్ష-ఇలావృతరమ్యకహిర ణ్మయభద్రాశ్వకేతుమాలసంజ్ఞాన్ - నాభి కింపురుషుడు హరివర్షుడు ఇలా వృతుడు రమ్యకుడు హిరణ్మయుడు కురువు భద్రాశ్వుడు మరియు కేతు మాలుడు అనే పేరు గల, నవ - తొమ్మండుగురు, ఆత్మజాన్ - తననుండి పుట్టిన, పుత్రాన్ - కొడుకులను, అజనయత్ హ - కనెనట.

ఆ ఆగ్నీధ్ర మహారాజునకు పూర్వచిత్తియందు నాభి, కింపురుషు డు, హరివర్షుడు, ఇలావృతుడు, రమ్యకుడు, హిరణ్మయుడు, కురువు, భద్రాశ్వుడు, కేతుమాలుడు అనే తొమ్మండుగురు పుత్రులు కలిగిరి.

సా సూత్వాథ సుతాన్నవానువత్సరం గృహ ఏవాపహాయ పూర్వచిత్తిర్భూయ ఏవాజం దేవముపతస్థే ॥ 20

సా - ఆ, పూర్వచిత్తిః - పూర్వచిత్తి, అనువత్సరమ్ - ప్రతి యేడాది, నవ - తొమ్మండుగురు, సుతాన్ - కొడుకులను, సూత్వా - కని, గృహే ఏవ - ఇంటియందే, అపహాయ - విడిచిపెట్టి, అథ - తరువాత, భూయః - మరల, అజం దేవం ఏవ - బ్రహ్మదేవుని మాత్రమే, ఉపతస్థే - సేవించెను.

ఆ పూర్వచిత్తి సంవత్సరమునకు ఒకరు చొప్పున తొమ్మండుగురు కొడుకులను కనెను. ఆమె వారిని రాజభవనములోనే విడిచిపెట్టి, మరల బ్రహ్మదేవుని సేవించెను.

ఆగ్నీధ్రసుతాస్తే మాతురనుగ్రహాదౌత్పత్తికేనైవ సంహననబలోపేతాః పిత్రా విభక్తా ఆత్మతుల్యనామాని యథాభాగం జంబూద్వీపవర్షాణి బుభుజుః ॥ 21

తే - ఆ, ఆగ్నీధ్రసుతాః - ఆగ్నీధ్రుని పుత్రులు, మాతుః - తల్లి యొక్క, అనుగ్రహాత్ - అనుగ్రహము వలన, ఔత్పత్తికేన ఏవ - పుట్టుక తోడనే, సంహననబల-ఉపేతాః - దృఢమగు శరీరముతో బలముతో కూడినవారై, పిత్రా - తండ్రిచే, విభక్తాః - పంచి ఈయబడిన రాజ్యాధికారము గలవారై, ఆత్మతుల్యనామాని - తమకు తగిన పేర్లు గల, జంబూద్వీపవర్షాణి - జంబూద్వీపముయొక్క దేశములను, యథాభాగమ్ - విభాగమున తిక్రమించకుండగా, బుభుజుః - పాలించిరి.

ఆ ఆగ్నీధ్రుని పుత్రులకు పుట్టుక తోడనే తల్లి అనుగ్రహము వలన దృఢమగు శరీరము, బలము ఉండెను. ఆగ్నీధ్రుడు జంబూద్వీపమును విభాగము చేసి, వారికి ఆయా భాగములయందు రాజ్యాధికారమును అప్పజెప్పెను. ఆ భాగములకు వారి పేర్లే ఏర్పడెను. వారు తమ తమ భాగములను అతిక్రమించకుండగా పాలించిరి.

ఆగ్నీధ్రో రాజాఽతృప్తః కామానామప్సరసమేవానుదినమధిమ
న్యమానస్తస్యాస్సలోకతాం శ్రుతిభిరవారుంధ యత్ర పితరో
మాదయంతే ॥ 22

ఆగ్నీధ్రః రాజా - ఆగ్నీధ్ర మహారాజు, కామానామ్ - భోగముల కు, అతృప్తః - తృప్తిని చెందనివాడై, అప్సరసం ఏవ - అప్సరసయగు పూర్వచిత్తినే, అనుదినమ్ - ప్రతిదినము, అధిమన్యమానః - అధికముగా తలంచువాడై, తస్యాః - ఆమెయొక్క, సలోకతామ్ - సమానమగు లోక మును కలిగియుండుటను, శ్రుతిభిః - వేదోక్తములగు కర్మలచే, అవారుంధ - పొందెను, యత్ర - ఎక్కడనైతే, పితరః - పితృదేవతలు, మాదయంతే - ఆనందించెదరో.

ఆగ్నీధ్ర మహారాజునకు భోగముల యెడల తృప్తి కలుగలేదు. ఆయన ప్రతిదినము అప్సరసయగు పూర్వచిత్తిని అధికముగా స్మరించెడి వాడు. ఆయన వేదోక్తకర్మలను చేసి, పూర్వచిత్తియొక్క లోకమును పొందె ను. అది పితృదేవతలు ఆనందముగా నివసించే లోకము.

సంపరేతే పితరి నవ భ్రాతరో మేరుదుహితౄర్మేరుదేవీం ప్రతి
రూపాముగ్రదంష్ట్రీం లతాం రమ్యాం శ్యామాం నారీం భద్రాం
దేవవీతిమితిసంజ్ఞా నవోదవహన్ ॥ 23

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే
ఆగ్నీధ్రచరితం నామ ద్వితీయోఽధ్యాయః ॥

పితరి - తండ్రి, సంపరేతే - మరణించగా, నవ - తొమ్మండుగు రు, భ్రాతరః - సోదరులు, మేరుదేవీమ్ - మేరుదేవిని, ప్రతిరూపామ్ - ప్రతిరూపను, ఉగ్రదంష్ట్రీమ్ - ఉగ్రదంష్ట్రిని, లతామ్ - లతను, రమ్యామ్ - రమ్యను, శ్యామామ్ - శ్యామను, నారీమ్ - నారిని, భద్రామ్ - భద్రను, దేవవీతిమ్ - దేవవీతిని, ఇతిసంజ్ఞాః - ఈ పేర్లు గల, నవ - తొమ్మండుగు రు, మేరుదుహితౄః - మేరుప్రజాపతియొక్క కుమార్తెలను, ఉదవహన్ - వివాహమాడిరి.

తండ్రి మరణించిన తరువాత ఆ తొమ్మండుగురు సోదరులు మేరు ప్రజాపతియొక్క తొమ్మండుగురు కుమార్తెలను వివాహమాడిరి. మేరుదేవి, ప్రతిరూప, ఉగ్రదంష్ట్రి, లత, రమ్య, శ్యామ, నారి, భద్ర మరియు దేవవీతి అనునవి వారి పేర్లు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమ
స్కంధములో ఆగ్నీధ్రుని చరితము అనే రెండవ
అధ్యాయము ముగిసినది (2).

*****

# అథ తృతీయోఽధ్యాయః

## నాభి మహారాజుయొక్క చరితము

శ్రీశుక ఉవాచ ।

నాభిరపత్యకామోఽప్రజయా మేరుదేవ్యా భగవంతం యజ్ఞపు
రుషమవహితాత్మాఽయజత ॥ 1

అపత్యకామః -సంతానమునందు కోరిక గల, నాభిః - నాభి, అప్ర జయా - సంతానము లేని, మేరుదేవ్యా - మేరుదేవితో గూడి, అవహిత- ఆత్మా - ఏకాగ్రమగు చిత్తము గలవాడై, యజ్ఞపురుషమ్ - యజ్ఞమునకు అధీశ్వరుడగు శ్రీహరిని, అయజత - ఆరాధించెను.

శ్రీశుకమహర్షి ఇట్లు పలికెను --- ఆగ్నీధ్రుని పుత్రుడగు నాభికి భార్యయగు మేరుదేవియందు సంతానము కలుగలేదు. అపుడాయన సంతానమునందు కోరిక గలవాడై, భార్యతో గూడి యజ్ఞేశ్వరుడగు శ్రీహరిని ఏకాగ్రమగు చిత్తముతో ఆరాధించెను.

తస్య హ వావ శ్రద్ధయా విశుద్ధభావేన యజతః ప్రవర్గ్యేషు
ప్రచరత్సు ద్రవ్యదేశకాలమంత్రర్త్విగ్దక్షిణావిధానయోగోప
పత్త్యా దురధిగమోఽపి భగవాన్ భాగవతవాత్సల్యతయా
సుప్రతీక ఆత్మానమపరాజితం నిజజనాభిప్రేతార్థవిధిత్సయా
గృహీతహృదయో హృదయంగమం మనోనయనానందనావ
యవాభిరామమావిశ్చకార ॥ 2

తస్య - ఆ నాభి, వావ - నిశ్చయముగా, శ్రద్ధయా - శ్రద్ధతో, విశు ద్ధభావేన - పరిశుద్ధమగు అంతఃకరణముతో, యజతః - యజ్ఞమును

చేయుచుండగా, ప్రవర్గ్యేషు - ప్రవర్గ్యలు, ప్రచరత్సు - కొనసాగుచుండగా, ద్రవ్యదేశకాలమంత్ర-ఋత్విక్-దక్షిణావిధానయోగ-ఉపపత్త్యా - పదార్థములు దేశము కాలము మంత్రము ఋత్విక్కులు దక్షిణలు మరియు విధి అనే అంగములు సంపన్నమగుటచే, దురధిగమః అపి - పొంద శక్యము కానివాడే అయిననూ, భగవాన్ - శ్రీహరి భగవానుడు, భాగవతవాత్సల్యతయా - భగవద్భక్తులయందలి ప్రేమచే, సుప్రతీకః - చక్కని అవయవములు గలవాడై, నిజజన-అభిప్రేత-అర్థవిధిత్సయా - తన భక్తులు కోరే ఫలములను ఇచ్చే కోరికచే, గృహీతహృదయః - వశము చేసుకొనబడిన హృదయము గలవాడై, అపరాజితమ్ - పరతంత్రము కానట్టియు, హృదయంగమమ్ - మనోహరమైనట్టియు, మనోనయన-ఆనందన-అవయవ-అభిరామమ్ - మనస్సునకు కన్నులకు ఆనందమును కలిగించే అవయవములతో సుందరమైన, ఆత్మానమ్ - తనను, ఆవిశ్చకార - ప్రకటము జేసెను.

ఆ నాభి నిశ్చితమగు శ్రద్ధతో పరిశుద్ధమగు అంతఃకరణముతో యజ్ఞమును చేయుచుండెను. ఆ యజ్ఞములో పదార్థములు, దేశము, కాలము, మంత్రములు, ఋత్విక్కులు, దక్షిణలు, విధి అనే ఏడు అంగములు సుసంపన్నములుగా నుండెను. కావుననే, శ్రీహరి భగవానుడు పొంద శక్యము కానివాడే అయిననూ, తన భక్తులు కోరే విషయములను అనుగ్రహించవలెననే కోరికకు తన హృదయము వశమై పోగా, సుందరమగు అవయవములు గల ఆ భక్తవత్సలుడు ప్రకటమయ్యెను. ఆయన అవయవములు మనస్సునకు, కన్నులకు ఆనందమును గొల్పుచుండెను. అట్టి సర్వస్వతంత్రమగు ఆయన రూపము అతిసుందరమగు అవయవములతో మనోహరముగా, సుఖకరముగా నుండెను.

**అథ హ తమావిష్కృతభుజయుగలద్వయం హిరణ్మయం పురుషవిశేషం కపిశకౌశేయాంబరధరమురసి విలసచ్ఛ్రీవత్సలలామం దరవరవనరుహవనమాలాచ్ఛూర్యమృతమణిగదాదిభిరుపలక్షితం స్ఫుటకిరణప్రవరముకుటకుండలకటకకటిసూత్రహారకేయూరనూపురాద్యంగభూషణవిభూషితమృత్విక్సద**

స్వగృహపతయోఽధనా ఇవోత్తమధనముపలభ్య సబహుమాన
మర్హణేనావనతశీర్షాణ ఉపతస్థుః ॥ 3

అథ - తరువాత, ఆవిష్కృతభుజయుగలద్వయమ్ - ప్రకటమైన రెండు జంటల భుజములు కలిగినట్టియు, హిరణ్మయమ్ - తేజోమయమైనట్టియు, కపిశకౌశేయ-అంబరధరమ్ - పచ్చని పట్టు వస్త్రములను ధరించినట్టియు, ఉరసి - వక్షఃస్థలమునందు, విలసత్-శ్రీవత్సలలామమ్ - ప్రకాశించుచున్న శ్రీవత్సము (మచ్చ) చిహ్నముగా కలిగినట్టియు, దరవరవనరుహవనమాలాచ్ఛూర్యమృతమణిగదా-ఆదిభిః - గొప్ప శంఖము పద్మము వనమాల చక్రము కౌస్తుభమాణిక్యము గద మొదలగువాటిచే, ఉపలక్షితమ్ - కూడియున్నట్టియు, స్ఫుటకిరణప్రవరమణిమయముకుటకుండలకటకకటిసూత్రహారకేయూరనూపుర-ఆది-అంగభూషణవిభూషితమ్ - ఇనుమడింప జేయబడిన కాంతి గల గొప్ప మణులతో నిండిన కిరీటము కుండలములు కంకణములు మొలత్రాడు హారము అంగదములు కాలియందెలు మొదలగు అవయవముల ఆభరణములచే అలంకరించబడిన, తమ్ - ఆ, పురుషవిశేషమ్ - పురుషోత్తముని, ఉపలభ్య - చూచి, ఋత్విక్-సదస్యగృహపతయః - ఋత్విక్కులు సభాసదులు మరియు యజమానియగు నాభి, అధనాః - ధనము లేనివారు, ఉత్తమధనం ఇవ - గొప్ప ధనమును వలె, సబహుమానమ్ - సాదరముగా, అర్హణేన - అర్ఘ్యముతో గూడి, అవనతశీర్షాణః - వంచబడిన తలలు గలవారై, ఉపతస్థుః హ - స్తుతించిరట.

అప్పుడు నాలుగు భుజములను కలిగియున్న ఆ పురుషోత్తముని ఋత్విక్కులు, సభాసదులు మరియు యజమానియగు నాభి చూచిరి. కాంతిపుంజమువలెనున్న ఆయన పచ్చని పట్టు వస్త్రములను దాల్చెను. ఆయన రొమ్ముపై శ్రీవత్సము (మచ్చ) ప్రకాశించుచుండెను. గొప్ప శంఖము, పద్మము, వనమాల (పుష్పముల మాల), చక్రము (శూరులను సంహరించేది), కౌస్తుభమాణిక్యము (అమృతముతో బాటు పుట్టినది), గద మొదలగువాటిని ఆయన ధరించియుండెను. ఆయన అవయవముల కాంతిని ఇనుమడింపజేసే గొప్ప మణులతో కూర్చబడిన కిరీటము, కుండ

లములు, కంకణములు, నూపురాదులు, హారము, అంగదములు, కాలియందెలు మొదలగు ఆభరణములను అలంకరించుకొనెను. గొప్ప ధనమును పొందిన నిర్ధనులు వలె, సాదరముగా అర్ఘ్యమును తీసుకొని, వారాయనను తలలను వంచి, స్తుతించిరి.

ఋత్విజ ఊచుః ।
అర్హసి ముహురర్హత్తమార్హణమస్మాకమనుపథానాం నమో నమ
ఇత్యేతావత్సదుపశిక్షితం కోఽర్హతి పుమాన్ ప్రకృతిగుణవ్యతికర
మతిరనీశ ఈశ్వరస్య పరస్య ప్రకృతిపురుషయోరర్వాక్తనాభి
ర్నామరూపాకృతిభీ రూపనిరూపణమ్ ।। 4

అర్హత్-తమ - పూజించదగినవారిలో గొప్పవాడా!, అనుపథానామ్ - సేవకులమగు, అస్మాకమ్ - మా, అర్హణమ్ - అర్ఘ్యమును, ముహుః - మరల మరల, అర్హసి - తగుచున్నావు, నమః - నమస్కారము, నమః - నమస్కారము, ఇతి ఏతావత్ - ఇంతమాత్రమే, సత్-ఉపశిక్షితమ్ - మహాత్ములచే శిక్షణ నేర్పబడినది, ప్రకృతిగుణవ్యతికరమతిః - ప్రకృతియొక్క గుణముల కార్యమగు ప్రపంచమునందు బుద్ధి గలవాడు, అనీశః - అస్వతంత్రుడు అగు, పుమాన్ - మానవుడు, కః - ఎవడు, అర్వాక్తనాభిః - ప్రపంచములో అంతర్భాగమై యున్న, నామరూప-ఆకృతిభిః - నామము రూపము మరియు ఆకారములచే, ప్రకృతిపురుషయోః - ప్రకృతికంటె జీవులకంటె, పరస్య - ఉత్కృష్టుడు (అతీతుడు) అగు, ఈశ్వరస్య - ఈశ్వరునియొక్క, రూపనిరూపణమ్ - రూపమును నిరూపించుటను, అర్హతి - తగుచున్నాడు?

ఋత్విక్కులు ఇట్లు పలికిరి --- ఓ శ్రీహరీ! పూజించదగినవారిలో నీవు ఉత్తముడవు. సేవకులమగు మేము నిన్ను మరల మరల పూజించవలసిన వారము. కాని, పలుమార్లు నమస్కారమును చేయుట మాత్రమే మాకు తెలియును. మహాత్ములు మాకు అంతవరకే నేర్పినారు. నీవు ప్రకృతికంటె, జీవులకంటె అతీతుడవగు ఈశ్వరుడవు. ప్రకృతికి వశుడైయున్న మానవుని బుద్ధి ప్రకృతియొక్క గుణముల (సత్త్వరజస్తమస్సులు) నుండి

పుట్టిన ప్రపంచమునందు తగుల్కొనియుండును. అట్టి మానవుడు ప్రపంచ స్థాయికి మాత్రమే చెందియున్న నామము, రూపము మరియు ఆకారములతో నీ స్వరూపమును ఎట్లు నిరూపించగల్గును?

సకలజననికాయవృజిననిరసనశివతమప్రవరగుణగణైకదేశకథ
నాదృతే ।। 5

సకలజననికాయవృజిననిరసనశివతమప్రవరగుణగణ-ఏకదేశకథ నాత్ ఋతే - సర్వమానవసమూహముల పాపములను పోగొట్టే పరమ మంగళములగు చాల గొప్ప గుణముల సమూహముల ఒక అంశమును చెప్పుట మినహాయించి.

నీ గుణముల సమూహములు సకలమానవ సముదాయముల పాపములను పోగొట్టజాలి యున్నవి. అట్టి పరమమంగళకరములగు చాల గొప్ప గుణములలో కొన్నింటిని వర్ణించుట మినహాయిస్తే, అంతకు మించి మేమేమి చేయగలము?

పరిజనానురాగవిరచితశబలసంశబ్దసలిలసితకిసలయతులసికా
దూర్వాంకురైరపి సంభృతయా సపర్యయా కిల పరమ పరితు
ష్యసి ।। 6

పరమ - ఓ పరమేశ్వరా!, పరిజన-అనురాగవిరచితశబలసంశబ్దసలిలసితకిసలయతులసికాదూర్వా-అంకురైః అపి - సేవకులచే ప్రేమతో చేయబడిన తడబాటు స్తుతివాక్యములు నీరు స్వచ్ఛమగు చిగుళ్లు తులసి గరిక పరకలతోనైననూ, సంభృతయా - సమకూర్చబడిన, సపర్యయా - పూజచే, పరితుష్యసి కిల - సంతోషించెదవు గదా!

ఓ పరమేశ్వరా! నీ భక్తులు ప్రేమతో తడబడుతూ నిన్ను చక్కగా స్తుతించెదరు. నీకు నీటితో, స్వచ్ఛమగు చిగుళ్లతో, తులసి దళములతో, గరిక పరకలతో చక్కగా పూజ చేసెదరు. నీవు ఇంతమాత్రము చేతనే సంతోషించెదవు గదా!

అథానయాఽపి న భవత ఇజ్యయోరుభారభరయా సముచిత
మర్థమిహోపలభామహే || 7

అథ - అట్లు గానిచో, ఉరుభారభరయా - విస్తృతమగు సాధనసా మగ్రితోనిండియున్న, అనయా - ఈ, ఇజ్యయా అపి - యజ్ఞముతో కూడ, భవతః - నీకు, సముచితమ్ - అపేక్షించబడిన, అర్థమ్ - ప్రయోజనము ను, న ఉపలభామహే - కానరాము.

మా భక్తిని ప్రక్కన బెట్టినచో, విస్తృతమగు సాధనసంపత్తితో నిర్వ హించబడేదైననూ, మా దృష్టిలో ఈ యజ్ఞమునుండి నీవు అపేక్షించే ప్రయోజనము ఏదీ లేదు.

ఆత్మన ఏవానుసవనమంజసాఽవ్యతిరేకేణ బోభూయమానాశే
షపురుషార్థస్వరూపస్య కిం తు నాథాశిష ఆశాసానానామేతద
భిసంరాధనమాత్రం భవితుమర్హతి || 8

ఆత్మనః ఏవ - నీవే, అనుసవనమ్ - నిరంతరముగా, అంజసా - సాక్షాత్తుగా, అవ్యతిరేకేణ - విచ్ఛేదము లేని విధముగా, బోభూయమాన -అశేషపురుష-అర్థస్వరూపస్య - అతిశయించి ఉండే అన్ని పురుషార్థ ముల స్వరూపము గలవాడవు, కిం తు - కాని, నాథ - ఓ ప్రభూ!, ఆశిషః - భోగములను, ఆశాసానానామ్ - కోరువారలకు, ఏతత్ - ఈ యాగము, భవత్-అభిసంరాధనమాత్రమ్ - నీ ఆరాధనము మాత్రము, భవితుమ్ - అగుటకు, అర్హతి - తగియున్నది.

నీ స్వరూపమగు ఆనందమునందు నిరంతరముగా సాక్షాత్తుగా విచ్ఛేదము లేని విధముగా పురుషార్థములన్నియు (ధర్మార్థకామమోక్షము లు) అతిశయించి అంతర్గతమై యున్నవి. (కావున, ఈ యజ్ఞాదులచే నీవు పొందదగిన ప్రయోజనమేమియు లేదు). ఓ ప్రభూ! కాని, ఏవో భోగము లను కోరుకునే మావంటి వారలకు మాత్రము ఈ యజ్ఞము నిన్ను ఆరా ధించి మనోరథములను పొందుటకు యోగ్యమగు సాధనమగుచున్నది.

**తద్యథా బాలిశానాం స్వయమాత్మనశ్శ్రేయః పరమవిదుషాం పరమపరమపురుష ప్రకర్షకరుణయా స్వమహిమానం చాపవర్గాఖ్యముపకల్పయిష్యన్ స్వయం నాపచిత ఏవేతరవదిహోపలక్షితః ॥ 9**

పరమపరమపురుష - గొప్పవారగు బ్రహ్మాదులకంటె ఉత్కృష్టుడవైన ఓ పురుషోత్తమా!, తత్ - అందువలన, స్వయమ్ - తనంత తానుగా, ఆత్మనః - తనకు, పరమ్ - సర్వోత్కృష్టమగు, శ్రేయః - హితమగు మోక్షమును గురించి, అవిదుషామ్ - తెలియనివారలకు, బాలిశానాం యథా - పిల్లలకు వలె, ప్రకర్షకరుణయా - గొప్ప దయతో, అపవర్గ-అఖ్యమ్ -మోక్షము అనే పేరు గల, స్వమహిమానం చ - ఆత్మానందమును కూడ, ఉపకల్పయిష్యన్ - సమకూర్చబోవువాడవై, ఇహ - ఈ యజ్ఞమునందు, స్వయమ్ - స్వయముగా, న-అపచితః ఏవ - పూజించబడకుండగనే, ఇతరవత్ - పూజించబడువాడవు వలె, ఉపలక్షితః - కనబడుచున్నావు.

ఓ పురుషోత్తమా! సర్వాధికులగు బ్రహ్మాదులకంటె కూడ నీవు ఉత్కృష్టుడవు. కావుననే, తమంత తాముగా తమకు సర్వోత్తమమగు హితమైన మోక్షమును గురించి తెలియని వారలకు -- ఏమీ తెలియని పిల్లల మంచిని తండ్రి చూచే విధముగా -- నీవే గొప్ప దయతో కోరికలను మాత్రమే గాక, మోక్షమనే ఆత్మానందమును కూడ అనుగ్రహించెదవు. అందుకొరకు మాత్రమే నీవీ యజ్ఞములో స్వయముగా పూజాదికము యొక్క అపేక్ష లేనివాడవే అయిననూ, వాటితో సంబంధము ఉన్నవానివలె స్వీకరించ బడుచున్నావు.

**అథాయమేవ వరో హ్యర్హత్తమ యర్హి బర్హిషి రాజర్షేర్వరదర్షభో భవాన్నిజపురుషేక్షణవిషయ ఆసీత్ ॥ 10**

అర్హత్-తమ - పూజ్యులలో ఉత్తముడా!, అథ - అయినప్పటికీ, అయం ఏవ - ఇదియే, వరః - వరము, హి - ఏలయనగా, యర్హి - ఎప్పుడైతే, రాజ-ఋషేః - రాజర్షియగు నాభియొక్క, బర్హిషి - యజ్ఞమునందు, వరద-ఋషభః - వరములనిచ్చువారిలో శ్రేష్ఠుడవగు, భవాన్ - నీవు, నిజ

పురుష-ఈక్షణవిషయః - నీ భక్తుల కన్నులకు కనబడువాడవు, ఆసీత్ - అయినావో.

ఓ శ్రీహరీ! పూజ్యులలో నీవు ఉత్తముడవు, వరములనిచ్చువారిలో శ్రేష్ఠుడవు. నీకు పూజాదికముయొక్క అపేక్ష లేకున్ననూ, రాజర్షి యగు ఈ నాభియొక్క యజ్ఞములో నీ భక్తులమగు మాకు కంట బడినావు. ఇదియే మాకు వరము.

అసంగనిశితజ్ఞానానలవిధూతాశేషమలానాం భవత్స్వభావానామాత్మారామాణాం మునీనామనవరతపరిగుణితగుణగణ పరమమంగలాయనగుణగణకథనోఽసి ॥ 11

అనవరతపరిగుణితగుణగణ - నిరంతరముగా అభ్యాసముచే వర్ణించబడిన గుణముల సమూహములు గలవాడా!, అసంగనిశితజ్ఞాన-అనలవిధూత-అశేషమలానామ్ - వైరాగ్యముచే తీక్ష్ణము చేయబడిన జ్ఞానము అనే అగ్నిచే నశింపజేయబడిన అన్ని దోషములు కలిగినట్టియు, భవత్-స్వభావానామ్ - నీ స్వభావము కలిగినట్టియు, ఆత్మారామాణామ్ - ఆత్మనిష్ఠయందు ఆనందించే, మునీనామ్ - మునులకు, పరమమంగల-అయనగుణగణకథనః - గొప్ప మంగళములనిచ్చే గుణసమూహముల వర్ణనము గలవాడవు, అసి - అగుచున్నావు.

ఓ శ్రీహరీ! భక్తులు అభ్యాసముచే నీ గుణముల సమూహమును నిరంతరముగా గానము చేయుదురు. మునులు వైరాగ్యముచే తీక్ష్ణము చేయబడిన ఆత్మజ్ఞానము అనే అగ్నిచే దోషములనన్నింటినీ నశింప జేసుకొని, నీతో సమానమగు స్వభావమును కలిగియుందురు. అట్టి ఆత్మారాములగు మునులు గొప్ప మంగళములనిచ్చే నీ గుణగణముల వర్ణనను చేయుచునే యుందురు.

అథ కథంచిత్ స్ఖలనక్షుత్పతనజృంభణదురవస్థానాదిషు వివశానాం నస్స్మరణాయ జ్వరమరణదశాయామపి సకలకశ్మల

నిరసనాని తవ గుణకృతనామధేయాని వచనగోచరాణి
భవంతు ।। 12

అథ - అందువలన, స్థలనక్షుత్-పతనజృంభణదురవస్థాన-ఆదిషు - జారుట తుమ్మట పడుట ఆవులింత సంకటస్థితి మొదలగువాటియందు, జ్వరమరణదశాయాం అపి - జ్వరము మరణము అనే అవస్థయందు కూడ, స్మరణాయ - స్మరించుట కొరకు, వివశానామ్ - అశక్తులమగు, నః - మాకు, సకలకశ్మలనిరసనాని - అన్ని పాపములను పోగొట్టే, తవ - నీ, గుణకృతనామధేయాని - గుణములచే ఏర్పడిన నామములు, కథంచిత్ - ఏదో విధముగా, వచనగోచరాణి - ఉచ్చారణలో విషయములు, భవంతు - అగుగాక!

నీ గుణవర్ణనము చాల పావనము. కావున, జారుట, పడుట, తుమ్మట, ఆవులించుట, సంకటములో పడుట, జ్వరములో నుండుట, మరణావస్థ మొదలగు అవస్థలయందు కూడ మేము నిన్ను స్మరించ వలసి యున్నది. కాని, అట్లు చేయుటకు మాకు శక్తి ఉండుట లేదు. నీ గుణములను ప్రకటించే నీ నామములు (భక్తవత్సల మొదలగునవి) పాపములన న్నింటినీ పోగొట్టును. కావున, ఏదో విధముగా అట్టి దురవస్థలయందు కూడ మా నోరు నీ నామములను ఉచ్చరించునట్లు అనుగ్రహించుము.

కిం చాయం రాజర్షిరపత్యకామః ప్రజాం భవాదృశీమాశాసాన
ఈశ్వరమాశిషాం స్వర్గాపవర్గయోరపి భవంతముపధావతి
ప్రజాయామర్థప్రత్యయో ధనదమివాధనః ఫలీకరణమ్ ।। 13

కిం చ - మరియు, ప్రజాయామ్ - సంతానమునందు, అర్థప్రత్యయః - పురుషార్థమనే బుద్ధి గల, అయమ్ - ఈ, రాజ-ఋషిః - రాజర్షియగు నాభి, అపత్యకామః - సంతానమును కోరువాడై, భవాదృశీమ్ - నీవంటి, ప్రజామ్ - సంతానమును, ఆశాసానః - కోరుచున్నవాడై, ఆశిషామ్ - ఐహికసుఖములకు, స్వర్గ-అపవర్గయోః అపి - స్వర్గమునకు మోక్షమునకు కూడ, ఈశ్వరమ్ - ప్రభుడవగు, భవంతమ్ - నిన్ను, అధనః

- నిర్ధనుడు, ఫలీకరణమ్ - ఊకను, ఆశాసానః - కోరువాడై, ధనదం ఇవ - ధనికుని (కుబేరుని) వలె, ఉపధావతి - ఆరాధించుచున్నాడు.

మరియు, రాజర్షియగు ఈ నాభి సంతానమే పురుషార్థమని భావించుచున్నాడు. ఈయన తనకు నీవంటి కొడుకు కలగాలని కోరుచున్నాడు. నీవు ఐహికసుఖములకే గాక, స్వర్గమునకు మోక్షమునకు కూడ ప్రభుడవు. నిర్ధనుడు ధనికుని (కుబేరుని) ఊక కొరకు ప్రార్థించినట్లుగా, ఈతడు నిన్ను సంతానము కొరకు ఆరాధించుచున్నాడు.

కో వా ఇహ తేఽపరాజితోఽపరాజితయా మాయయాఽనవసిత
పదవ్యాఽనావృతమతిర్విషయవిషరయానావృతప్రకృతి
రనుపాసితమహచ్చరణః ॥ 14

అనుపాసితమహత్-చరణః - ఉపాసించబడని మహాత్ముల పాదములు గల, కః వా - ఎవ్వాడు, ఇహ - ఈ లోకములో, అపరాజితయా - తరించ శక్యము కానట్టియు, అనవసితపదవ్యా - నిశ్చయముగా తెలియజాలని మార్గము కలిగిన, తే - నీ, మాయయా - మాయచే, అపరాజితః - పరాభూతుడు కానివాడు?, అనావృతమతిః - కప్పివేయబడని బుద్ధి గలవాడు?, విషయవిషరయ-అనావృతప్రకృతిః - ఇంద్రియభోగములనే విషముయొక్క వేగముచే కప్పివేయబడని స్వభావము గలవాడు?

నీ మాయను తరించుట శక్యము కాదు. నీ మాయయొక్క స్వరూపము, లేక మార్గము ఇట్టిదని నిర్ధారించుట సంభవము కాదు. మహాత్ముల పాదములను ఉపాసించకుండగా, అట్టి నీ మాయచే పరాభూతుడు కానివాడు గాని, నీ మాయచే కప్పివేయబడని బుద్ధి గలవాడు గాని, ఇంద్రియ భోగములనే విషముయొక్క వేగముచే కలుషితము కాని స్వభావము గలవాడు గాని ఈ లోకములో ఎవరు గలరు? (లేనే లేరు). మహాత్ముల పాద సేవనముచే మాత్రమే మాయను తరించుట శక్యమగునని అభిప్రాయము.

యదు హ వావ తవ పునరదభ్రకర్తరిహ సమాహూతస్తత్రార్థ
ధియాం మందానాం నస్తద్యద్దేవహేలనం దేవదేవార్హసి
సామ్యేన సర్వాన్ ప్రతివోఢుమవిదుషామ్ ॥ 15

అదభ్రకర్తః - అనేక కార్యములను చేయువాడా!, దేవదేవ - ఓ దేవదేవా!, యత్ - ఏ కారణముగా, ఇహ - ఇచటకు, ఉ వావ - నిశ్చయముగా, సమాహూతః - ఆహ్వానిచంబడితివో, తత్ర - ఆ విషయమునందు, అర్థధియామ్ - ఫలమునందు బుద్ధి గలిగినట్టియు, మందానామ్ - మంద బుద్ధులమైనట్టియు, అవిదుషామ్ - అజ్ఞానులమగు, నః - మాయొక్క, యత్ - ఏ, దేవహేలనమ్ - దేవుడవగు నీ అమర్యాద గలదో, తత్ - దానిని, సర్వాన్ - అందరిని గురించి, తవ - నీ, సామ్యేన - సమత్వముచే, ప్రతిబోఢుమ్ - సహించుటకు, అర్హసి - తగుదువు.

ఓ దేవదేవా! నీవు గొప్ప గొప్ప కార్యములను చేయుదువు. మందబుద్ధులము, అజ్ఞానులము అగు మేము నిశ్చయముగా ఒక చిన్న ఫలమునందు బుద్ధిని నిలిపి, నిన్ను ఇచటకు ఆహ్వానించితిమి. ఆ విధముగా మేము దేవుడవగు నిన్ను అమర్యాద చేసితిమి. కాని, నీవు అందరి విషయములో సమచిత్తము గలవాడవు. కావున, మా దోషమును నీవు సహించ తగుదువు.

శ్రీశుక ఉవాచ ।
ఇతి నిగదేనాభిష్టూయమానో భగవాననిమిషర్షభో వర్షధరాభి
వాదితాభివందితచరణస్సదయమిదమాహ ॥ 16

వర్షధర-అభివాదిత-అభివందితచరణః - దేశాధిపతియగు నాభిచే నమస్కరించబడే ఋత్విక్కులచే నమస్కరించబడిన పాదములు గలిగినట్టియు, అనిమిష-ఋషభః - దేవతలలో (రెప్పపాటు లేనివారు) శ్రేష్ఠుడగు, భగవాన్ - శ్రీహరి భగవానుడు, ఇతి - ఈ విధముగా, నిగదేన - గద్యరూపములోనున్న స్తోత్రముచే, అభిష్టూయమానః - స్తుతించబడుచున్నవాడై, సదయమ్ - దయతో కూడియున్న విధముగా, ఇదమ్ - దీనిని, ఆహ - పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- దేశాధిపతియగు నాభిచే పూజలనందుకొనే ఆ ఋత్విక్కులు దేవదేవుడగు శ్రీహరి భగవానుని పాదము

లకు నమస్కరించి, ఈ విధముగా గద్యరూపములోనున్న స్తోత్రముతో స్తుతించిరి. అపుడాయన దయతో నిట్లనెను.

శ్రీభగవానువాచ ।

అహో బతాహమృషయో భవద్భిరవితథగీర్భిర్వరమసులభమ
భియాచితో యదముష్యాత్మజో మయా సదృశో భూయాదితి
మమాహమేవాభిరూపః కైవల్యాదథాపి బ్రహ్మవాదో న మృషా
భవితుమర్హతి మమైవ హి ముఖం యద్ద్విజదేవకులమ్ ।।17

అహో బత - ఆశ్చర్యము!, ఋషయః - ఓ మహర్షులారా!, అవిత థగీర్భిః - పొల్లు పోని వాక్కులు గల, భవద్భిః - మీచే, అహమ్ - నేను, అసులభమ్ - సులభము కాని, వరమ్ - వరము, అభియాచితః - కోరబడి తిని, యత్ - ఏదనగా, అముష్య - ఈ నాభియొక్క, ఆత్మజః - పుత్రుడు, మయా - నాతో, సదృశః - పోలిక గలవాడు, భూయాత్ - అగుగాక!, ఇతి - అని, కైవల్యాత్ - కేవలుడు (అద్వితీయుడు) అగుట వలన, మమ - నాకు, అహం ఏవ - నేనే, అభిరూపః - పోలినవాడను, అథ అపి - అయిన ప్పటికీ, బ్రహ్మవాదః - బ్రహ్మవేత్తల మాట, మృషా - అసత్యము, భవి తుమ్ - అగుటకు, న అర్హతి - తగదు, హి - ఏలయనగా, ద్విజదేవకులమ్ - ఉపనయనసంస్కారము గలవారిలో దేవతలవంటి బ్రాహ్మణుల సమూ హము, యత్ - ఏది గలదో అది, మమ - నా, ముఖం ఏవ - ముఖమే.

శ్రీభగవానుడిట్లు పలికెను --- ఆహా! ఆశ్చర్యము! ఓ మహర్షు లారా! పొల్లు పోని వాక్కులు గల మీరు నన్ను, ఈ రాజునకు నన్ను పోలిన కొడుకు కలగాలని, దుర్లభమగు వరమునే కోరితిరి. అద్వితీయుడనగుట వ లన, నన్ను పోలినవాడను నేను మాత్రమే. అయినప్పటికీ, బ్రహ్మవేత్తల మాట అసత్యము కారాదు. ఏలయనగా, ఉపనయన సంస్కారము గలవా రిలో బ్రహ్మవేత్తలు దేవతల వంటి వారు. నా ముఖము వారే (అనగా, వారి పలుకునకు నా పలుకునకు తేడా లేదు).

తత ఆగ్నీధ్రీయేఽంశకలయావతరిష్యామ్యాత్మతుల్యమనుపల
భమానః ।। 18

తతః - అందువలన, ఆత్మతుల్యమ్ - నాతో సమమైనవానిని, అనుపలభమానః - కానరాని నేను, ఆగ్నీధ్రీయే - ఆగ్నీధ్ర పుత్రుడగు నాభి యందు, అంశకలయా - నా అంశచే, అవతరిష్యామి - అవతరించెదను.

అందువలన, నేనే స్వయముగా నా అంశచే ఆగ్నీధ్రుని పుత్రుడగు నాభికి పుత్రుడనై అవతరించెదను. ఏలయనగా, నాతో సమమైనవాడు నాకు మరియొకడు కానరాడు.

శ్రీశుక ఉవాచ ।
ఇతి నిశామయంత్యా మేరుదేవ్యాః పతిమభిధాయాంతర్దధే
భగవాన్ ॥ 19

మేరుదేవ్యాః - మేరుదేవి, నిశామయంత్యాః - వినుచుండగా, పతిమ్ - ఆమె భర్తయగు నాభిని గురించి, ఇతి - ఈ విధముగా, అభిధాయ - చెప్పి, భగవాన్ - శ్రీహరి భగవానుడు, అంతర్దధే - అంతర్ధాన మాయెను.

శ్రీశుక మహర్షి ఇట్లు చెప్పెను --- మేరుదేవి వినుచుండగా ఆమె భర్తయగు నాభితో ఈ విధముగా చెప్పి, శ్రీహరి భగవానుడు అంతర్ధాన మాయెను.

బర్హిషి తస్మిన్నేవ విష్ణుదత్త భగవాన్ పరమర్షిభిః ప్రసాదితో
నాభేః ప్రియచికీర్షయా తదవరోధాయనే మేరుదేవ్యాం ధర్మాన్
దర్శయితుకామో వాతరశనానాం శ్రమణానామృషీణామూర్ధ్వ
మంథినాం శుక్లయా తనువాఽవతతార ॥ 20

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే
నాభిచరితం నామ తృతీయోఽధ్యాయః ॥

విష్ణుదత్త - ఓ పరీక్షిన్మహారాజా!, తస్మిన్ - ఆ, బర్హిషి ఏవ - యజ్ఞమునందే, పరమ-ఋషిభిః - మహర్షులచే, ప్రసాదితః - ప్రసన్న ముగా చేసుకొనబడిన, భగవాన్ - శ్రీహరి భగవానుడు, నాభేః - నాభికి,

ప్రియచికీర్షయా - ప్రియమును చేయు గోరికతో, వాతరశనానామ్ - దిగం బరులైనట్టియు, శ్రమణానామ్ - తపశ్శాలురగు సన్న్యాసులకు, ఊర్ధ్వమం థినామ్ - ఊర్ధ్వరేతస్కులగు, ఋషీణామ్ - మహర్షులకు, ధర్మాన్ - ధర్మములను, దర్శయితుకామః - చూపించే కోరిక గలవాడై, తత్-అవరో ధ-అయనే - ఆయన అంతఃపురమునందు, మేరుదేవ్యామ్ - మేరుదేవి యందు, శుక్లయా - సత్త్వప్రధానమగు, తనువా - శరీరముతో, అవతతార - అవతరించెను.

విష్ణువుచే రక్షించబడిన ఓ పరీక్షిన్మహారాజా! ఆ యజ్ఞమునందు మహర్షులు శ్రీహరిని ప్రసన్నము చేసుకొనిరి. ఆయన నాభికి ప్రీతిని కలిగించ గోరెను. పైగా, దిగంబరులు తపశ్శాలురు అగు సన్న్యాసులకు, ఊర్ధ్వరేతస్కులగు మహర్షులకు ఆయన ధర్మములను ప్రకటించ గోరెను. ఆయన నాభియొక్క అంతఃపురములో మేరుదేవియందు సత్త్వగుణప్రధానమగు శరీరముతో అవతరించెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమ
స్కంధములో నాభి మహారాజుయొక్క చరితము అనే మూడవ
అధ్యాయము ముగిసినది (3).

*****

# అథ చతుర్థోऽధ్యాయః

## ఋషభదేవుని చరితము

శ్రీశుక ఉవాచ ।

అథ హ తముత్పత్త్యైవాభివ్యజ్యమానభగవల్లక్షణం సామ్యోప
శమవైరాగ్యైశ్వర్యమహావిభూతిభిరనుదినమేధమానానుభావం
ప్రకృతయః ప్రజా బ్రాహ్మణా దేవతాశ్చావనితలసమవనాయా
తితరాం జగృధుః ॥ 1

అథ - తరువాత, ఉత్పత్త్యా ఏవ - పుట్టుక తోడనే, అభివ్యజ్యమానభగవత్-లక్షణమ్ - స్పష్టముగా ప్రకటము చేయబడుచున్న భగవంతుని లక్షణములు కలిగినట్టియు, సామ్య-ఉపశమవైరాగ్య-ఐశ్వర్యమహావిభూతిభిః - సమచిత్తమును కలిగియుండుట శాంతముగా నుండుట వైరాగ్యము అలౌకికమగు సామర్థ్యము అనే గొప్ప విభూతులచే, అనుదినమ్ - ప్రతిదినము, ఏధమాన-అనుభావమ్ - పెరుగుచున్న తేజస్సు కలిగిన, తమ్ - ఆ బాలకుని, ప్రకృతయః - మంత్రులు మొదలగువారు, ప్రజాః - ప్రజలు, బ్రాహ్మణాః - బ్రహ్మవేత్తలు, చ - మరియు, దేవతాః - దేవతలు, అవనితలసమవనాయ - భూమండలమును పరిపాలించుట కొరకు, అతితరామ్ - చాల గట్టిగా, జగృధుః హ - కోరిరట.

శ్రీశుకమహర్షి ఇట్లు పలికెను --- ఓ మహారాజా! ఆ బాలునియందు పుట్టుక తోడనే భగవానుని లక్షణములు (అరికాలియందలి పద్మము మొదలగు గురుతులు) స్పష్టముగా ప్రకటమయ్యెను. ఆ బాలకునియందు సమచిత్తమును కలిగియుండుట, శాంతస్వభావము, వైరాగ్యము, అలౌకిక సామర్థ్యము, తేజస్సు అనే గొప్ప విభూతులు (మహిమలు) దిన దినాభివృద్ధి చెందుచుండెను. మంత్రులు మొదలగు రాజాధికారులు,

ప్రజలు, మహర్షులు మరియు దేవతలు కూడ ఆ బాలకుడు మహారాజు కావలెనని గట్టిగా కోరుచుండిరి.

తస్య హ వా ఇత్థం వర్ష్మణా వరీయసా బృహచ్ఛ్లోకేన చౌజసా బలేన శ్రియా యశసా వీర్యశౌర్యాభ్యాం చ పితా ఋషభ ఇతీదం నామ చకార ।। 2

తస్య వై - ఆ బాలకునకు, వరీయసా - మిక్కిలి శ్రేష్ఠమైనట్టియు, బృహత్-శ్లోకేన - గొప్పగా కీర్తించబడే, వర్ష్మణా - దేహముచే, ఓజసా - తేజస్సుచే, బలేన - బలముచే, శ్రియా - శోభచే, యశసా - కీర్తిచే, వీర్యశౌర్యాభ్యాం చ - గొప్ప ప్రభావము మరియు ఉత్సాహములచే, పితా - తండ్రి, ఋషభః ఇతి - ఋషభుడు అనే, ఇదమ్ - ఈ, నామ - పేరును, చకార - పెట్టెను.

ఆ బాలకుని దేహము మిక్కిలి శ్రేష్ఠముగా నుండుటచే గొప్పగా కీర్తించబడుచుండెను. ఆతని తేజస్సును, బలమును, అందమును, కీర్తిని, గొప్ప ప్రభావమును మరియు ఉత్సాహమును చూచి, తండ్రి ఆతనికి ఋషభుడు (శ్రేష్ఠుడు) అని పేరు పెట్టెను.

తస్య హీంద్రస్స్పర్ధమానో భగవాన్ వర్షే న వవర్ష తదవధార్య భగవానృషభదేవో యోగేశ్వరః ప్రహస్యాత్మయోగమాయయా స్వవర్షమజనాభం నామాభ్యవర్షత్ ।। 3

స్పర్ధమానః - అసూయపడిన, భగవాన్ - పూజ్యుడగు, ఇంద్రః - ఇంద్రుడు, తస్య - ఆతని, వర్షే - దేశమునందు, న వవర్ష హి - వర్షించలేదు, తత్ - ఆ విషయమును, అవధార్య - తెలుసుకొని, భగవాన్ - పూజ్యుడు, యోగ-ఈశ్వరః - యోగులలో శ్రేష్ఠుడు అగు, ఋషభదేవః - ఋషభదేవుడు, ప్రహస్య - నవ్వి, ఆత్మయోగమాయయా - తన యోగశక్తిచే, అజనాభం నామ - అజనాభమని ప్రసిద్ధి గాంచిన, స్వవర్షమ్ - తన దేశమును, అభ్యవర్షత్ - అంతటా వర్షించెను.

పూజ్యుడగు ఇంద్రునకు ఋషభదేవునిపై అసూయ కలిగి, ఆయన దేశమగు అజనాభమునందు వర్షములు లేకుండా చేసెను. యోగులలో శ్రేష్ఠుడు, పూజ్యుడు అగు ఋషభదేవుడు ఈ సంగతిని గమనించి నవ్వుకొనెను. అపుడాయన తన యోగశక్తిచే దేశమునందు వర్షములు సమృద్ధిగా కురియునట్లు చేసెను.

నాభిస్తు యథాభిలషితం సుప్రజస్త్వమవరుధ్యాతిప్రమోదభరవిహ్వలో గద్గదాక్షరయా గిరా స్వైరం గృహీతనరలోకసధర్మం భగవంతం పురాణపురుషం మాయావిలసితమతిర్వత్స తాతేతి సానురాగముపలాలయన్ పరాం నిర్వృతిముపగతః ॥ 4

మాయావిలసితమతిః - మాయచే వ్యామోహమును పొందించబడిన బుద్ధి గల, నాభిః తు - నాభి మహారాజైతే, యథా-అభిలషితమ్ - తన కోరికకు తగ్గ విధముగా, సుప్రజస్త్వమ్ - చక్కని కొడుకును కలిగియుండుటను, అవరుధ్య - పొంది, అతిప్రమోదభరవిహ్వలః - గొప్ప ఆనందము నిండుటచే వివశుడై, గద్గద-అక్షరయా - తడబాటు పడుచున్న అక్షరములు గల, గిరా - వాక్కుతో, స్వైరమ్ - స్వేచ్ఛచే, గృహీతనరలోకసధర్మమ్ - స్వీకరించబడిన మానవులతో సమానమగు వ్యవహారము కలిగినట్టియు, పురాణపురుషమ్ - ఆదిపురుషుడగు, భగవంతమ్ - శ్రీహరి భగవానుని, వత్స - బాబూ!, తాత - అబ్బాయీ!, ఇతి - అని, స-అనురాగమ్ - ప్రేమతో కూడియున్న విధముగా, ఉపలాలయన్ - లాలించువాడై, పరామ్ - గొప్ప, నిర్వృతిమ్ - ఆనందమును, ఉపగతః - పొందినవాడు.

నాభి మహారాజుయొక్క బుద్ధి మాయచే వ్యామోహితమై యుండెను. ఆయనకు తాను కోరిన విధముగా కొడుకు లభించెను. ఆ ఆనందము హృదయములో నిండి, ఆయన వివశుడై తడబాటు పడుచున్న పలుకులతో ఋషభుని, బాబూ! నాయనా! అంటూ ప్రేమపూర్వకముగా లాలిస్తూ గొప్ప ఆనందమును పొందుచుండెను. ఆదిపురుషుడగు శ్రీహరి భగవానుడు ఈ విధముగా స్వతంత్రముగా మానవులతో సమానమగు వ్యవహారము స్వీకరించి యుండెను.

విదితానురాగమాపౌరప్రకృతి జనపదో రాజా నాభిరాత్మజం
సమయసేతురక్షాయామభిషిచ్య బ్రాహ్మణేషూపనిధాయ
సహ మేరుదేవ్యా విశాలాయాం ప్రసన్ననిపుణేన తపసా సమా
ధియోగేన నరనారాయణాఖ్యం భగవంతం వాసుదేవముపా
సీనః కాలేన తన్మహిమానమవాప ॥ 5

జనపదః - జనులే ప్రమాణముగా గల, రాజా నాభిః - నాభి మహా రాజు, ఆపౌరప్రకృతి - పౌరులు మొదలుకొని మంత్రులు మొదలగు రాజాధికారుల వరకు, విదిత-అనురాగమ్ - తెలియబడిన అనురాగము కలిగిన, ఆత్మజమ్ - పుత్రుని, సమయసేతురక్షాయామ్ - సదాచారముల మర్యాదను రక్షించుటయందు, అభిషిచ్య - అభిషేకించి, బ్రాహ్మణేషు - బ్రహ్మవేత్తలయందు, ఉపనిధాయ - అప్పజెప్పి, మేరుదేవ్యా సహ - మేరుదేవితో గూడి, విశాలాయామ్ - బదరికాశ్రమమునందు, ప్రసన్ననిపుణేన - శాంతము మరియు తీవ్రము అగు, తపసా - తపస్సుచే, సమాధియోగేన - చిత్తైకాగ్రతయొక్క అభ్యాసముచే, నరనారాయణ-ఆఖ్యమ్ - నరనారాయణులు అనే పేరు గల, భగవంతం వాసుదేవమ్ - వాసుదేవ భగవానుని, ఉపాసీనః - ఆరాధించుచున్నవాడై, కాలేన - కాలముచే, తత్-మహిమానమ్ - ఆ భగవానుని మహిమను (మోక్షమును), అవాప - పొందెను.

పౌరులతో మొదలిడి మంత్రులు రాజాధికారుల వరకు జనులందరు ఋషభునియందు అనురాగము కలిగియున్నారనే విషయమును నాభి మహారాజు గమనించెను. ఆయనకు జనుల అభీష్టమే ప్రమాణము. ఆయన ధర్మమర్యాదను రక్షించుట కొరకై తన కుమారుని రాజ్యమునందు అభిషేకించి, బ్రహ్మవేత్తల అదుపాజ్ఞలలో ఉంచెను. ఆయన తన భార్యయగు మేరుదేవితో గూడి బదరికాశ్రమమును చేరి, శాంతముగా మరియు తీవ్రముగా తపస్సును చేసెను. ఆయన ఏకాగ్రమగు చిత్తముతో నరనారాయణరూపములో అవతరించిన వాసుదేవ భగవానుని ఉపాసించెను. కొంత కాలమునకు ఆయన జీవన్ముక్తుడాయెను.

యస్య హ పాండవేయ శ్లోకావుదాహరంతి --
కో ను తత్కర్మ రాజర్షేర్నాభేరన్వాచరేత్పుమాన్ ।
అపత్యతామగాద్యస్య హరిశ్శుద్ధేన కర్మణా ।। 6

పాండవేయ - పాండవుల మనుమడవగు ఓ పరీక్షిన్మహారాజా!, యస్య హ - ఏ నాభికి సంబంధించిన, శ్లోకౌ - రెండు శ్లోకములను, ఉదాహరంతి - ఉదహరించెదరో, రాజర్షేః - రాజర్షియగు, నాభేః - నాభియొక్క, **తత్** - **ఆ**, కర్మ - కర్మను, కః ను - ఏ, పుమాన్ - మానవుడు, **అను-ఆచరేత్** - చేయును?, యస్య - ఎవని, శుద్ధేన - పవిత్రమగు, కర్మణా - కర్మచే, హరిః - శ్రీహరి, అపత్యతామ్ - సంతానరూపమును, అగాత్ - పొందెనో.

పాండవవంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! నాభికి సంబంధించి ఆర్యులు రెండు శ్లోకములనుదహరించెదరు. వాటి యర్థమేమనగా --- రాజర్షియగు నాభి చేసిన యజ్ఞమువంటి యజ్ఞమును మరియొక వ్యక్తి ఎవరు చేయగల్గును? ఆయన చేసిన ఆ పవిత్రమగు యజ్ఞముయొక్క ప్రభావముచే శ్రీహరి ఆయనకు పుత్రుడై అవతరించెను.

బ్రహ్మణ్యోఽన్యః కుతో నాభేర్విప్రా మంగలపూజితాః ।
యస్య బర్హిషి యజ్ఞేశం దర్శయామాసురోజసా ।। 7

నాభేః - నాభికంటె, అన్యః - మరియొకడు, బ్రహ్మణ్యః - బ్రహ్మవేత్తలయెడల భక్తి గలవాడు, కుతః - ఎవడు (ఎక్కడ) గలడు?, యస్య - ఎవని, బర్హిషి - యజ్ఞమునందు, మంగలపూజితాః - దక్షిణలచే సత్కరించబడిన, విప్రాః - వేదవేత్తలు, ఓజసా - మంత్రశక్తిచే, యజ్ఞ-ఈశమ్ - యజ్ఞేశ్వరుడగు శ్రీహరిని, దర్శయామాసుః - సాక్షాత్కరించునట్లు చేసిరో.

నాభియొక్క యజ్ఞములో దక్షిణాదులచే సత్కరించబడిన వేదవేత్తలు తమ మంత్రశక్తిచే యజ్ఞేశ్వరుడగు శ్రీహరి దర్శనమిచ్చునట్లు చేసిరి. బ్రహ్మవేత్తలయెడల అట్టి నాభికంటె గొప్ప, లేక సమానమైన భక్తి గలవాడు ఎవరు ఎక్కడ ఉన్నారు? (లేరు)

**అథ హ భగవానృషభదేవస్స్వవర్షం కర్మక్షేత్రమనుమన్య మానః ప్రదర్శితగురుకులవాసో లబ్ధవరైర్గురుభిరనుజ్ఞాతో గృహమేధినాం ధర్మాననుశిక్షమాణో జయంత్యామింద్రదత్తా యాముభయలక్షణం కర్మ సమామ్నాయామ్నాతమభియుంజ న్నాత్మజానామాత్మసమానానాం శతం జనయామాస ॥ 8**

అథ - తరువాత, భగవాన్ - పూజ్యుడగు, ఋషభదేవః - ఋష భదేవుడు, స్వవర్షమ్ - తన దేశమును, కర్మక్షేత్రమ్ - కర్మభూమినిగా, అనుమన్యమానః - తెలుసుకున్నవాడై, ప్రదర్శితగురుకులవాసః - ప్రద ర్శించబడిన గురుకులమునందలి నివాసము గలవాడై, లబ్ధవరైః - పొంద బడిన దక్షిణలు గల, గురుభిః - గురువులచే, అనుజ్ఞాతః - అనుమతినీయ బడినవాడై, గృహమేధినామ్ - గృహస్థుల, ధర్మాన్ - ధర్మములను గురించి, అనుశిక్షమాణః - ఆదర్శమును నెలకొల్పువాడై, సమామ్నాయ-ఆమ్నాతమ్ - వేదములచే విధించబడిన, ఉభయలక్షణమ్ - శ్రౌతము స్మార్తము అనే రెండు విధముల, కర్మ - కర్మను, అభియుంజన్ - అను ష్ఠించువాడై, ఇంద్రదత్తాయామ్ - ఇంద్రునిచే ఈయబడిన, జయంత్యామ్ - జయంతియందు, ఆత్మసమానానామ్ - తనతో సమానమైన, ఆత్మజా నామ్ - పుత్రుల, శతమ్ - వందను, జనయామాస హ - కనెనట.

తండ్రి అడవికి వెళ్లిన తరువాత పూజ్యుడగు ఆ ఋషభదేవుడు తన దేశము కర్మభూమియని తెలుసుకొనెను. ఆయన మానవులకు ఆదర్శ మును నెలపుటకొరకై గురుకులవాసమును చేసెను. గురువులకు దక్షిణని చ్చి, వారి అనుమతిని పొంది, ఇంద్రునిచే ఈయబడిన జయంతిని వివాహ మాడెను. ఆయన జనులకు శిక్షణనిచ్చుటకై గృహస్థధర్మములనాచరిస్తూ, శాస్త్రవిహితములైన శ్రౌత స్మార్తములనే రెండు రకముల కర్మలను అను ష్ఠించెను. ఆయనకు జయంతియందు తనతో సమానమైన వందమంది కొడుకులు కలిగిరి.

**యేషాం ఖలు మహాయోగీ భరతో జ్యేష్ఠశ్శ్రేష్ఠగుణ ఆసీద్యే నేదం వర్షం భారతమితి వ్యపదిశంతి ॥ 9**

యేషామ్ - ఏ పుత్రులలో, జ్యేష్ఠః - పెద్దవాడు, మహాయోగీ - గొప్ప యోగియగు, భరతః - భరతుడు, శ్రేష్ఠగుణః - గొప్ప గుణములు కలవాడుగా, ఆసీత్ - ఉండెనో, యేన - ఎవనిచే, ఇదమ్ - ఈ, వర్షమ్ - దేశమును, భారతం ఇతి - భారతమని, వ్యపదిశంతి - పిలిచెదరో.

వారిలో పెద్దవాడు భరతుడు. ఆయన శ్రేష్ఠమగు గుణములు గల గొప్ప యోగి. ఆయన పేరుతోనే ఈ దేశమునకు భారతదేశము అనే పేరు వచ్చినది.

తమను కుశావర్త ఇలావర్తో బ్రహ్మావర్తో మలయః కేతుర్భద్ర
సేన ఇంద్రస్పృగ్విదర్భః కీకట ఇతి నవ నవతిప్రధానాః ।।10

తమ్ - ఆ భరతుని, అను - అనుసరించి, కుశావర్తః - కుశావర్తుడు, ఇలావర్తః - ఇలావర్తుడు, బ్రహ్మావర్తః - బ్రహ్మావర్తుడు, మలయః - మలయుడు, కేతుః - కేతువు, భద్రసేనః - భద్రసేనుడు, ఇంద్రస్పృక్ - ఇంద్రస్పృక్కు, విదర్భః - విదర్భుడు, కీకటః - కీకటుడు, ఇతి - అనే, నవ - తొమ్మండుగురు, నవతిప్రధానాః - తొంభైమంది కంటె పెద్దవారు.

కుశావర్తుడు, ఇలావర్తుడు, బ్రహ్మావర్తుడు, మలయుడు, కేతువు, భద్రసేనుడు, ఇంద్రస్పృక్కు, విదర్భుడు, కీకటుడు అనే తొమ్మిదిమంది భరతుని తరువాతి సోదరులు. మిగిలిన తొంభై మంది వీరి తరువాతి వారు.

కవిర్హరిరంతరిక్షః ప్రబుద్ధః పిప్పలాయనః ।
ఆవిర్హోత్రోऽథ ద్రుమిలశ్చమసః కరభాజనః ।। 11

ఇతి భాగవతధర్మదర్శనా నవ మహాభాగవతాస్తేషాం సుచ
రితం భగవన్మహిమోపబృంహితం వసుదేవనారదసంవాద
ముపశమాయనముపరిష్టాద్వర్ణయిష్యామః ।। 12

కవిః - కవి, హరిః - హరి, అంతరిక్షః - అంతరిక్షుడు, ప్రబుద్ధః - ప్రబుద్ధుడు, పిప్పలాయనః - పిప్పలాయనుడు, ఆవిర్హోత్రః - ఆవిర్హోత్రుడు, అథ - తరువాత, ద్రుమిలః - ద్రుమిలుడు, చమసః - చమసుడు, కరభాజనః - కరభాజనుడు, ఇతి - అనే, నవ - తొమ్మండుగురు, భాగవతధ

ర్మదర్శనాః - భగవద్భక్తుల ధర్మములను ప్రచారము చేసినవారు, మహా భాగవతాః - గొప్ప భగవద్భక్తులు, భగవత్-మహిమ-ఉపబృంహితమ్ - భగవంతుని మహిమచే వర్ధిల్లునట్టియు, ఉపశమాయనమ్ - శాంతిపూర్ణము గు, వసుదేవనారదసంవాదమ్ - వసుదేవ నారద సంవాదరూపమైన, తేషామ్ - వారి, సుచరితమ్ - గొప్ప వృత్తాంతమును, ఉపరిష్టాత్ - మున్ముందు, వర్ణయిష్యామః - వర్ణించగలము.

కీకటుని తరువాతి వారు కవి, హరి, అంతరిక్షుడు, ప్రబుద్ధుడు, పిప్పలాయనుడు, ఆవిర్హోత్రుడు, ద్రుమిలుడు, చమసుడు మరియు కరభాజనుడు. గొప్ప భగవద్భక్తులగు వీరు భగవద్భక్తుల ధర్మములను ప్రచారము చేసిరి. భగవంతుని మహిమచే వర్ధిల్లే శాంతిపూర్ణమగు వీరి గొప్ప వృత్తాంతము నారద వసుదేవ సంవాద రూపముగా మున్ముందు (**11** వ స్కంధము) వర్ణించబడగలదు.

యవీయాంస ఏకాశీతిర్జాయంతేయాః పితురాదేశకరా మహాశా
లీనా మహాశ్రోత్రియా యజ్ఞశీలాః కర్మవిశుద్ధా బ్రాహ్మణా
బభూవుః ॥ **13**

జాయంతేయాః - జయంతియొక్క పుత్రులు, యవీయాంసః - తమ్ముళ్లు, ఏక-అశీతిః - ఎనభై ఒక్క మంది, పితుః - తండ్రియొక్క, ఆదేశకరాః - ఆదేశమును పాలించువారు, మహాశాలీనాః - గొప్ప వినయము గలవారు, మహాశ్రోత్రియాః - గొప్ప వేదవేత్తలు, యజ్ఞశీలాః - యజ్ఞములను చేసే స్వభావము గలవారు, కర్మవిశుద్ధాః - పుణ్యకర్మలచే పవిత్రమైనవారు, బ్రాహ్మణాః - వేదపరాయణులుగా, బభూవుః - అయిరి.

కవి మొదలగువారి తమ్ముళ్లు, జయంతి పుత్రులు ఎనభై ఒక్క మంది గొప్ప వినయముతో తండ్రి ఆదేశమును పాలిస్తూ నిరంతరముగా యజ్ఞములను చేసే స్వభావమును కలిగియుండిరి. గొప్ప వేదవేత్తలగు వారు పుణ్యకర్మలచే పవిత్రులై, వేదపరాయణులైరి.

భగవానృషభసంజ్ఞ ఆత్మతంత్రస్స్వయం నిత్యనివృత్తానర్థప
రంపరః కేవలానందానుభవ ఈశ్వర ఏవ విపరీతవత్కర్మాణ్యా

రభమాణః కాలేనానుగతం ధర్మమాచరణేనోపశిక్షయన్నత
ద్విదాం సమ ఉపశాంతో మైత్రః కారుణికో ధర్మార్థయశఃప్రజా
నందామృతావరోధేన గృహేషు లోకం నియమయత్ ।। 14

ఆత్మతంత్రః - స్వతంత్రుడు, నిత్యనివృత్త-అనర్థపరంపరః - సర్వకాలములలో తొలగియున్న అనర్థముల పరంపర గలవాడు, కేవల-ఆనంద-అనుభవః - అద్వయము ఆనందఘనము అగు ఆత్మయందు నిష్ఠ గలవాడు, ఈశ్వరః - సర్వసమర్థుడు, సమః - సమచిత్తము గలవాడు, ఉపశాంతః - రాగద్వేషములు లేనివాడు, మైత్రః - స్నేహశీలి, కారుణికః - దయామయుడు, ఋషభసంజ్ఞః - ఋషభుడు అనే పేరు గల, భగవాన్ ఏవ - భగవానుడు కూడ, విపరీతవత్ - పరిచ్ఛిన్నుడగు జీవుడు వలె, కర్మాణి - విహితకర్మలను, ఆరభమాణః - చేయుచున్నవాడై, కాలేన - కాలముచే, అనుగతమ్ - మరుగున పడిన (సంప్రాప్తమైన), ధర్మమ్ - ధర్మమును, స్వయమ్ - తనంత తానుగా, ఆచరణేన - ఆచరించుటచే, అతత్-విదామ్ - ధర్మము తెలియనివారలకు, ఉపశిక్షయన్ - నేర్పుచున్నవాడై, ధర్మ-అర్థయశఃప్రజా-ఆనంద-అమృత-అవరోధేన - ధర్మము సంపద కీర్తి సంతానము ఐహికభోగముల సుఖము మరియు మోక్షములను సంపాదించుటచే, లోకమ్ - మానవుని, గృహేషు - ఇంటియందు, నియమయత్ - ధర్మాచరణములో పెట్టెను.

భగవంతుని అవతారమగు ఋషభుడు కర్మలకు అధీనుడు కాని స్వతంత్రుడు. అద్వయము ఆనందఘనము పూర్ణము అగు ఆత్మయందు నిష్ఠ గల ఆయనకు జన్మమరణములు మొదలగు అనర్థముల పరంపర సర్వకాలములలో దూరముగా నుండును. సర్వసమర్థుడగు ఆయన సమచిత్తము గలవాడు. రాగద్వేషరహితుడు, స్నేహశీలి అగు ఋషభుడు దయామయుడు. ఆయన అనాదికాలమునుండి సంప్రాప్తమై కాలప్రభావముచే మరుగున పడిపోవుచున్న ధర్మమును ఆదర్శముగా నిలిచి ధర్మజ్ఞానము లేని జనులకు నేర్పుట కొరకై, పరిచ్ఛిన్నుడగు జీవుని వలె విహితకర్మలనాచరించెడివాడు. ఆయన గృహస్థుడుగా ఉంటూ ధర్మమును, సంపదను,

కీర్తిని, సంతానమును, ఐహికసుఖములను మరియు మోక్షమును కూడ సాధించి, తద్ద్వారా జనులను గృహస్థధర్మమునందు నిలబెట్టెను.

యద్యచ్ఛీర్షణ్యాచరితం తత్తదనువర్తతే లోకః ॥ 15

**యత్ యత్** - ఏది ఏది, శీర్షణ్య-ఆచరితమ్ - శ్రేష్ఠపురుషునిచే ఆచరించబడినదో, **తత్ తత్** - దానిని దానిని, లోకః - మానవుడు, అనువర్తతే - అనుసరించును.

శ్రేష్ఠపురుషుడు దేనిని ఆచరిస్తే, లోకము కూడ దానినే అనుసరించును గదా!

యద్యపి స్వవిదితం సకలధర్మం బ్రాహ్మం గుహ్యం బ్రాహ్మణైర్దర్శితమార్గేణ సామాదిభిరుపాయైర్జనతామనుశశాస ॥16

సకలధర్మమ్ - అన్ని ధర్మములు గల, బ్రాహ్మమ్ - వేదములకు చెందిన, గుహ్యమ్ - రహస్యము, స్వవిదితం యది అపి - తనచే తెలియబడినదే అయిననూ, బ్రాహ్మణైః - వేదవేత్తలచే, దర్శితమార్గేణ - చూపబడిన మార్గముచే, సామ-ఆదిభిః - సామము మొదలగు, ఉపాయైః - ఉపాయములచే, జనతామ్ - జనతను, అనుశశాస - శాసించెను.

సకలధర్మములకు నిలయము వేదము కాగా, ఆ వేదరహస్యములు ఋషభునకు తెలిసినవే. అయినా, ఆయన వేదవేత్తలు చూపిన మార్గములో జనులను శాసించెను. సామము (మంచిగా చెప్పుట), దానము (సంపదనిచ్చి వశము చేసుకొనుట), భేదము (శత్రువుల మధ్య విరోధము కలిగించి వశము చేసుకొనుట), దండము (శిక్ష వేసి దారిలో పెట్టుట) అనే నాలుగు విధముల రాజనీతితో ఆయన పాలించెను.

ద్రవ్యదేశకాలవయశ్శ్రద్ధర్త్విగ్వివిధోద్దేశోపచితైస్సర్వైరపి క్రతుభిర్యథోపదేశం శతకృత్వ ఇయాజ ॥ 17

ద్రవ్యదేశకాలవయః-శ్రద్ధా-ఋత్విక్-వివిధ-ఉద్దేశ-ఉపచితైః - ద్రవ్యములు దేశము కాలము వయస్సు శ్రద్ధ ఋత్విక్కులు వివిధదేవతల ఉద్దేశ్యములచే సంపాదించబడిన, సర్వైః - అన్ని, క్రతుభిః అపి - క్రతువు

లచే కూడ, యథా-ఉపదేశమ్ - యథావిధిగా, శతకృత్వః - వంద పర్యాయములు, ఇయాజ - యజ్ఞమును చేసెను.

ఆయన మంచి వయస్సులోనుండగనే యోగ్యమగు కాలముల యందు పుణ్యతీర్థములలో యథావిధిగా వివిధదేవతలకు పురోడాశము మొదలగు ద్రవ్యములను ఋత్విక్కుల సాహాయ్యముతో శ్రద్ధగా సమర్పించి, వంద పర్యాయములు అన్ని విధముల క్రతువులను సుసంపన్నము చేసెను.

భగవతర్షభేణ పరిరక్ష్యమాణ ఏతస్మిన్ వర్షే న కశ్చన పురుషో వాంఛత్యవిద్యమానమివాత్మనోऽన్యస్మాత్కథంచన కిమపి కర్హిచిద వేక్షతే భర్తర్యనుసవనం విజృంభితస్నేహాతిశయమంతరేణ ॥ 18

ఏతస్మిన్ - ఈ, వర్షే - దేశమునందు, భగవతా ఋషభేణ - ఋషభదేవునిచే, పరిరక్ష్యమాణః - రక్షించబడుచున్న, పురుషః - మానవుడు, కశ్చన - ఎవ్వడైననూ, కర్హిచిత్ - ఏ కాలమునందైననూ, ఆత్మనః - తనకు, అన్యస్మాత్ - ఇతరునినుండి, కిం అపి - దేనినైననూ, కథంచన - ఏ విధముగనైననూ, అవిద్యమానం ఇవ - ఉనికి లేనిదానిని వలె, న వాంఛతి - కోరడు, న అవేక్షతే - చూడడు, అనుసవనమ్ - ప్రతిదినము, భర్తరి - ప్రభువగు ఋషభునియందు, విజృంభితస్నేహ-అతిశయం అంతరేణ - వర్ధిల్లిన అతిశయించిన ప్రేమను మినహాయించి.

ఈ దేశమును ఋషభదేవుడు పాలించుచుండగా, ఏ వ్యక్తియైననూ ఎన్నడైననూ ఇతరుల సొమ్మును ఏదో విధముగా తనకు రావాలనే కోరికతో కన్నెత్తియైననూ చూడలేదు. ఇతరుల సొమ్ము జనులకు లేనిదానితో సమానము. కాని, ఈ నియమము ఆ జనులకు దినదినము తమ ప్రభువగు ఋషభునియందు వర్ధిల్లిన ప్రేమాతిశయమునకు వర్తించదు.

స కదాచిదటమానో భగవానృషభో బ్రహ్మావర్తగతో బ్రహ్మర్షిప్ర వరసభాయాం ప్రజానాం నిశామయంతీనామాత్మజానవహితా

త్మనః ప్రశ్రయప్రణయభరసుయంత్రితానప్యుపశిక్షయన్నితి
హోవాచ ॥ 19

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే
ఋషభదేవచరితం నామ చతుర్థోఽధ్యాయః ॥

భగవాన్ ఋషభః - ఋషభదేవుడు, కదాచిత్ - ఒకప్పుడు, అట మానః - సంచరించుచున్నవాడై, బ్రహ్మావర్తగతః - బ్రహ్మావర్తమును చేరుకున్నవాడై, బ్రహ్మ-ఋషిప్రవరసభాయామ్ - గొప్ప బ్రహ్మర్షుల సభయందు, ప్రజానామ్ - జనులు, నిశామయంతీనామ్ - వినుచుండగా, అవహిత -ఆత్మనః - సావధానమనస్కులైన, ఆత్మజాన్ - పుత్రులను, ప్రశ్రయప్రణయభరసుయంత్రితాన్ అపి - వినయము ప్రేమలతో నిండి చక్కగా వశులై ఉన్నవారే అయిననూ, ఉపశిక్షయన్ - నేర్పుచున్నవాడై, ఇతి - ఈ విధముగా, ఉవాచ హ - పలికెనట.

ఋషభదేవుడు ఒకప్పుడు సంచారము చేస్తూ, బ్రహ్మావర్తము చేరెను. అచట బ్రహ్మర్షుల సభలో జనులు వినుచుండగా, ఆయన సావధానమనస్కులైన తన పుత్రులతో నిట్లనెను. వారి హృదయములు ఆయనయెడల వినయముతో, ప్రేమతో నిండియుండెను. అయిననూ, వారికి శిక్షణ నీయవలెనని ఆయన తలపోసి ఇట్లు పలికెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమ
స్కంధములో ఋషభదేవుని చరితము అనే నాల్గవ
అధ్యాయము ముగిసినది (4).

*****

# అథ పంచమోఽధ్యాయః

## ఋషభదేవుడు రాజ్యమును విడిచి సన్న్యసించుట

ఋషభ ఉవాచ ।
నాయం దేహో దేహభాజాం నృలోకే
కష్టాన్ కామానర్హతే విడ్భుజాం యే ।
తపో దివ్యం పుత్రకా యేన సత్త్వం
శుద్ధ్యేద్యస్మాద్బ్రహ్మసౌఖ్యం త్వనంతమ్ ॥ 1

పుత్రకాః - పుత్రులారా!, నృలోకే - మానవలోకమునందు, దేహభాజామ్ - ప్రాణుల లోపల, అయమ్ - ఈ, దేహః - దేహము, కష్టాన్ - కష్టముల పాలుచేసే, కామాన్ - విషయభోగములను, న అర్హతే - తగదు, యే - ఏ కామనలు, విడ్భుజామ్ - పశువులకు గలవో, దివ్యమ్ - దివ్యమగు, తపః - తపస్సును, యేన - దేనిచే, సత్త్వమ్ - అంతఃకరణము, శుద్ధ్యేత్ - పరిశుద్ధమగునో, యస్మాత్ తు - దేనివలనైతే, అనంతమ్ - అనంతమగు, బ్రహ్మసౌఖ్యమ్ - బ్రహ్మానందమో.

ఋషభదేవుడు ఇట్లు పలికెను --- ఓ పుత్రులారా! ఈ మానవలోకములో ఇంద్రియభోగములు మానవుని పశువులతో సమానముగా చేసి, కష్టముల పాలు చేయును. కావున, దేహధారుల మధ్యలో మానవదేహమును దాల్చిన జీవుడు అట్టి కామనలకు వశుడు కారాదు. ఈ మానవదేహము వాటికి తగదు. ఇది దివ్యమగు తపస్సునకు తగియున్నది. తపస్సు వలన అంతఃకరణము శుద్ధమై, ఆత్మజ్ఞానము ద్వారా, అనంతమగు బ్రహ్మానందము లభించును.

మహత్సేవాం ద్వారమాహుర్విముక్తేః
తమోద్వారం యోషితాం సంగిసంగమ్ ।
మహాంతస్తే సమచిత్తాః ప్రశాంతా
విమన్యవస్సుహృదస్సాధవో యే ॥ 2

మహత్-సేవామ్ - మహాత్ముల సేవను, విముక్తేః - మోక్షమునకు, ద్వారమ్ - ద్వారమునుగా, యోషితామ్ - యువతుల, సంగిసంగమ్ - సంగము గలవారితోడి సంగమును, తమః-ద్వారమ్ - అజ్ఞానమునకు (సంసారమునకు) ద్వారమునుగా, ఆహుః - చెప్పుచున్నారు, యే - ఎవరైతే, సమచిత్తాః - సమమగు చిత్తము గలవారో, ప్రశాంతాః - శాంతస్వభావులో, విమన్యవః - కోపము లేనివారో, సుహృదః - స్నేహశీలురో, సాధవః - పరోపకార స్వభావము గలవారో, తే - వారు, మహాంతః - మహాత్ములు.

మహాత్ముల సేవ మోక్షమునకు, చెడు యువతులతో సంగము గలవారితోడి సావాసము సంసారమునకు, ద్వారమని పెద్దలు చెప్పెదరు. ఎవరైతే సుఖదుఃఖముల యెడల సమానమగు చిత్తము కలిగి, శాంతమగు స్వభావము గలవారై, కోపము నెరుంగక, స్నేహశీలురై పరోపకార స్వభావమును కలిగియుందురో, వారే మహాత్ములు.

యే వా మయీశే కృతసౌహృదార్థా
జనేషు దేహంభరవార్తికేషు ।
గృహేషు జాయాత్మజరాతిమత్సు
న ప్రీతియుక్తా యావదర్థాశ్చ లోకే ॥ 3

యే వా - ఎవరైతే, ఈశే - ఈశ్వరుడనగు, మయి - నాయందు, కృతసౌహృద-అర్థాః - చేయబడిన ప్రేమయే పురుషార్థముగా గలవారో, దేహంభరవార్తికేషు - దేహపోషణమే ప్రధానమగు చర్చనీయాంశముగా గల, జనేషు - జనులయందు, జాయా-ఆత్మజరాతిమత్సు - భార్య సంతానము ధనము గల, గృహేషు - ఇంటియందు, న ప్రీతియుక్తాః - ఆసక్తి లేనివారు, చ - మరియు, లోకే - లోకమునందు, యావత్-అర్థాః - ఎంత వరకో అంతే ప్రయోజనము గలవారు.

ఎవరైతే ఈశ్వరుడనగు నాయందలి ప్రేమనే పురుషార్థముగా స్వీకరించియున్నారో, వారు మహాత్ములు. ఇంతేగాక, ఎవరైతే దేహమునకు చెందిన భోగములను గురించి మాత్రమే చర్చించే జనులయందు ప్రీతిని చేయరో, భార్య సంతానము ధనము ఇల్లు అనేవి ఉన్నా వాటియందు ఆసక్తిని చేయరో, శరీరయాత్ర కొరకు లోకముతో ఎంతవరకు ప్రయోజనమో అంత మాత్రమే వ్యవహరించెదరో, వారు మహాత్ములు.

నూనం ప్రమత్తః కురుతే వికర్మ యదింద్రియప్రీతయ ఆపృణోతి ।
న సాధు మన్యే యత ఆత్మనోఽయమసన్నపి క్లేశద ఆస దేహః॥4

ప్రమత్తః - బాగా మదించియున్నవాడు, నూనమ్ - నిశ్చయముగా, వికర్మ - తప్పు పనిని, కురుతే - చేయుచున్నాడు, యత్ - ఎప్పుడైతే, ఇంద్రియప్రీతయే - ఇంద్రియముల ప్రీతి కొరకు, ఆపృణోతి - ప్రవర్తిల్లునో, సాధు - మంచిదియని, న మన్యే - తలంచను, యతః -ఏలయనగా, అసన్ అపి - మిథ్యయే అయిననూ, ఆత్మనః - తనకు, క్లేశదః - దుఃఖమును కలిగించే, అయమ్ - ఈ, దేహః - దేహము, ఆస - కలిగినది.

మానవుడు ఏ కాలమునందైతే ఇంద్రియముల ప్రీతి కొరకు ప్రవర్తిల్లునో, ఆ సమయములో కార్యాకార్యవివేకమును కోల్పోయి నిశ్చయముగా తప్పు పనిని చేయును. ఇది సరికాదని నా అభిప్రాయము. ఏలయనగా, మిథ్యయే అయిననూ వ్యక్తికి క్లేశమును కలిగించే ఈ దేహము కర్మల వలననే సంప్రాప్తమైనది.

పరాభవస్తావదబోధజాతో
యావన్న జిజ్ఞాసత ఆత్మతత్త్వమ్ ।
యావత్క్రియాస్తావదిదం మనో వై
కర్మాత్మకం యేన శరీరబంధః ॥ 5

**తావత్ - అంతవరకు, అబోధజాతః - అజ్ఞానమునుండి పుట్టిన, పరాభవః - తిరస్కారము, యావత్ - ఎంతవరకైతే, ఆత్మతత్త్వమ్ - ఆత్మ యొక్క యథార్థస్వరూపమును, న జిజ్ఞాసతే - తెలియగోరదో, యావత్ - ఎంతవరకైతే, క్రియాః - కర్మలో, తావత్ - అంతవరకు, ఇదమ్ - ఈ,**

మనః - మనస్సు, వై - నిశ్చయముగా, కర్మ-ఆత్మకమ్ - కర్మయే స్వభావ ముగా గలది, యేన - దేనిచే, శరీరబంధః - శరీరముయొక్క బంధమో.

మానవుడు తన యథార్థస్వరూపము (ఆత్మ) ను తెలియగోరనంతవరకు (ఆత్మవిచారము చేయనంతవరకు), అజ్ఞానముచే ఆతని స్వరూపము తిరస్కరించబడి (కప్పివేయబడి) యుండును. అజ్ఞానము ఉన్నంతవరకు మానవునకు క్రియాసంబంధము తప్పదు. క్రియలు ఉన్నంతవరకు మనస్సులో కర్మవాసనలు నిలిచియే యుండును. దానిచే, వ్యక్తి మరల దేహమును పొంది, దానిచే బంధించబడి యుండును.

ఏవం మనః కర్మవశం ప్రయుంక్తే
అవిద్యయాఽఽత్మన్యుపధీయమానే ।
ప్రీతిర్న యావన్మయి వాసుదేవే
న ముచ్యతే దేహయోగేన తావత్ ॥ 6

ఏవమ్ - ఈ విధముగా, అవిద్యయా - అజ్ఞానముచే, ఆత్మని - ఆత్మ, ఉపధీయమానే - కప్పివేయబడుచుండగా, కర్మవశమ్ - కర్మవాసనలకు వశమైయున్న, మనః - మనస్సు, (కర్మవశమ్ - కర్మలకు బానిసయైన మానవుని), ప్రయుంక్తే - కర్మలను చేయించును, యావత్ - ఎంతవరకైతే, వాసుదేవే - వాసుదేవుడనగు, మయి - నాయందు, ప్రీతిః - భక్తి, న - లేదో, తావత్ - అంతవరకు, దేహయోగేన - దేహముతోడి సంబంధముచే, న ముచ్యేత - విడిచిపెట్టబడడు.

ఈ విధముగా ఆత్మస్వరూపము అజ్ఞానముచే కప్పివేయబడి యున్నంతవరకు, కర్మవాసనలకు వశమైపోయిన మనస్సు (కర్మలకు బానిసయైన) మానవునిచే కర్మలను చేయించుచునే యుండును. ఎంతవరకైతే, వాసుదేవుడ (సర్వజగన్నివాసుడు, శుద్ధచైతన్యస్వరూపుడు) నగు నాయందు భక్తి కలుగదో, అంతవరకు వ్యక్తికి దేహముతోడి సంబంధము (జన్మ) నుండి విముక్తి లేదు.

యదా న పశ్యత్యయథా గుణేహాం
స్వార్థే ప్రమత్తస్సహసా విపశ్చిత్ ।

గతస్మృతిర్విందతి తత్ర తాపా-
నాసాద్య మైథున్యమగారమజ్ఞః ।। 7

యదా - ఏ కాలమునందైతే, విపశ్చిత్ - వివేకియై, గుణ-ఈహామ్ - గుణముల చేష్టను, అయథా - మిథ్యగా, న పశ్యతి - కనుగొనడో, తత్ర - ఆ కాలమునందు, సహసా - శీఘ్రముగా, గతస్మృతిః - తొలగిన స్వరూప జ్ఞానము గలవాడై, స్వ-అర్థే - తన హితము విషయములో, ప్రమత్తః - ప్రమాదము (మరుపు) గల, అజ్ఞః - అజ్ఞాని, మైథున్యమ్ - శారీరకభోగ ములే ప్రధానముగా గల, అగారమ్ - గృహమును, ఆసాద్య - పొంది, (తత్ర - దానియందు), తాపాన్ - తాపములను, విందతి - పొందును.

మానవుడు వివేకియై సత్త్వరజస్తమోగుణముల కార్యములైన ఇంద్రియముల చేష్టలను మిథ్యాభూతములుగా గుర్తించవలెను. అట్టి యథార్థదర్శనము లేనంతవరకు, వ్యక్తి శీఘ్రముగా తన స్వరూపము యొక్క స్మరణమును గోల్పోయి, పరమపురుషార్థము విషయములో అసా వధానుడుగా నుండును. ఇట్టి అజ్ఞాని శరీరసుఖములే ప్రధానమైన గృహ (గృహాశ్రమ) మును పొంది, దానిలో తాపములననుభవించును.

పుంసః స్త్రియా మిథునీభావమేతం
తయోర్మిథో హృదయగ్రంథిమాహుః ।
అతో గృహక్షేత్రసుతాప్తవిత్తైః
జనస్య మోహోఽయమహం మమేతి ।। 8

పుంసః - మగవానికి, స్త్రియా - స్త్రీతో, ఏతమ్ - ఈ, మిథునీభా వమ్ - జతగట్టుటను, తయోః - వారిద్దరికి, మిథః - పరస్పరము, హృద యగ్రంథిమ్ - హృదయములయందలి ముడియని, ఆహుః - చెప్పుచు న్నారు, అతః - దీనివలన, జనస్య - మానవునకు, గృహక్షేత్రసుత-ఆప్త విత్తైః - ఇల్లు భూమి సంతానము బంధువర్గము ధనములచే, అయమ్ - ఇది, అహమ్ - నేను, మమ - నాది, ఇతి - అనే, మోహః - మోహము.

స్త్రీపురుషులు ఒకరితో మరియొకరు జత గట్టెదరు. ఇదియే వారికి హృదయములయందు ముడి (కంతి) గా తయారగునని మహాత్ములు

చెప్పెదరు. దాని వలననే, వారు దేహమునందు ఆత్మాభిమానము (ఇది నేను అనే ధారణ) కలిగియుందురు. ఈ వ్యామోహముచే వారు ఇల్లు, పొలము, సంతానము, బంధువులు, ధనములయందు మమకారము (ఇది నాది అనే ఆగ్రహము) ను కలిగియుందురు.

యదా మనోహృదయగ్రంథిరస్య
కర్మానుబద్ధో దృఢ ఆశ్లథేత ।
తదా జనస్సంపరివర్తతేఽస్మాత్
ముక్తః పరం యాత్యతిహాయ హేతుమ్ ॥ 9

యదా - ఏ కాలమునందైతే, అస్య - ఈ మానవుని, కర్మ-అను బద్ధః - కర్మలననుసరించే బిగుసుకొనేది, దృఢః - దృఢమైనది అగు, మనః-హృదయగ్రంథిః - వాసనల రూపములోనుండే హృదయమునందలి ముడి, ఆశ్లథేత - శిథిలమగునో, తదా - అప్పుడు, జనః - మానవుడు, అస్మాత్ - దీనినుండి, సంపరివర్తతే - నివృత్తుడగును, హేతుమ్ - సంసారమునకు కారణమగు అజ్ఞానమును, అతిహాయ - విడిచిపెట్టి, ముక్తః - ముక్తుడై, పరమ్ - పరబ్రహ్మను, యాతి - పొందును.

మానవుని హృదయములో వాసనల రూపములోనుండే గట్టి ముడి కర్మలవెంట బిగుసుకొనును. ఇది శిథిలమైననాడు మానవుడు దేహాదులయందలి వ్యామోహమునుండి బయటపడును. అట్టివాడు సంసారహేతువగు అజ్ఞానమును పోగొట్టుకొని, జీవన్ముక్తుడై పరబ్రహ్మను ఆత్మరూపముగా పొందును.

హంసే గురౌ మయి భక్త్యాఽనువృత్త్యా
వితృష్ణయా ద్వంద్వతితిక్షయా చ ।
సర్వత్ర జంతోర్వ్యసనావగత్యా
జిజ్ఞాసయా తపసేహానివృత్త్యా ॥ 10

మత్కర్మభిర్మత్కథయా చ నిత్యం
మద్దేవసంగాద్గుణకీర్తనాన్మే ।

నిర్వైరసామ్యోపశమేన పుత్రా
జిహాసయా దేహగేహాత్మబుద్ధేః ॥ 11

అధ్యాత్మయోగేన వివిక్తసేవయా
ప్రాణేంద్రియాత్మాభిజయేన సధ్ర్యక్ ।
సచ్ఛ్రద్ధయా బ్రహ్మచర్యేణ శశ్వ-
దసంప్రమాదేన యమేన వాచామ్ ॥ 12

సర్వత్ర మద్భావవిచక్షణేన
జ్ఞానేన విజ్ఞానవిరాజితేన ।
యోగేన ధృత్యుద్యమసత్త్వయుక్తో
లింగం వ్యపోహేత్కుశలోఽహమాఖ్యమ్ ॥ 13

పుత్రాః - ఓ పుత్రులారా!, హంసే - హంసయగు, గురౌ - గురువునందు, మయి - నాయందు, భక్త్యా - భక్తిచే, అనువృత్త్యా - తత్పరతచే, వితృష్ణయా - భోగములయందలి తృష్ణను విడనాడుటచే, ద్వంద్వతితిక్షయా చ - సుఖదుఃఖాదిద్వంద్వములను సహించుటచే, జంతోః - జీవునకు, సర్వత్ర - ఇహపరములు రెండింటియందు, వ్యసన-అవగత్యా - దుఃఖమును తెలియుటచే, జిజ్ఞాసయా - తెలియాలనే కోరికచే, తపసా - తపస్సుచే, ఈహానివృత్త్యా - కామనలను విడిచిపెట్టుటచే, మత్-కర్మభిః - నాకు సమర్పించే కర్మలచే, నిత్యమ్ - నిత్యము, మత్-కథయా చ - నా గాథలచే, మత్-దేవసంగాత్ - నేనే దేవుడుగా గలవారితోడి సంగముచే, మే - నా, గుణకీర్తనాత్ - గుణములను కీర్తించుట వలన, నిర్వైరసామ్య-ఉపశమేన - వైరము లేకుండుటచే సమచిత్తమును కలిగియుండుటచే మరియు శాంతస్వభావముచే, దేహగేహ-ఆత్మబుద్ధేః - దేహమునందలి నేను అనే బుద్ధిని ఇంటియందలి నాది అనే ధారణను, జిహాసయా - విడిచిపెట్టాలనే కోరికచే, అధి-ఆత్మయోగేన - ఆత్మనిష్ఠను అభ్యసించుట (మోక్షశాస్త్రాధ్యయనము) చే, వివిక్తసేవయా - ఏకాంతమునందు నివసించుటచే, సధ్ర్యక్ - చక్కగా, ప్రాణ-ఇంద్రియ-ఆత్మ-అభిజయేన - ప్రాణమును ఇంద్రియములను మనస్సును వశము చేసుకొనుటచే, సత్-శ్రద్ధయా -

శాస్త్రము (మహాత్ముల బోధ) నందలి శ్రద్ధచే, బ్రహ్మచర్యేణ - బ్రహ్మచర్యముచే, శశ్వత్ - అన్ని కాలములయందు, అసంప్రమాదేన - లక్ష్యము విషయములో జాగరూకుడుగ నుండుటచే, వాచామ్ - వాక్కుల, యమేన - నియమించుటచే, సర్వత్ర - అంతటా, మత్-భావవిచక్షణేన - నన్ను భావించుటయందు సావధానుడుగా నుండుటచే, విజ్ఞానవిరాజితేన - అనుభవముచే విరాజిల్లే, జ్ఞానేన - జ్ఞానముచే, యోగేన - అభ్యాసముచే, ధృతి-ఉద్యమసత్త్వయుక్తః - ధైర్యము ప్రయత్నము వివేకములతో కూడియున్న, కుశలః - నిపుణుడగు సాధకుడు, అహం-ఆఖ్యమ్ - అహంకారమనే, లింగమ్ - సూక్ష్మశరీరమును, వ్యపోహేత్ - పోనాడవలెను.

ఓ పుత్రులారా! నిపుణుడగు సాధకుడు ధైర్యముతో మరియు వివేకముతో సాధన చేయవలెను. జ్ఞానియగు గురువునందు, నాయందు భక్తిని, తత్పరతను కలిగియుండవలెను. భోగములయందలి తృష్ణను విడనాడి, సుఖదుఃఖాదిద్వంద్వములను సహించవలెను. జీవునకు ఇహపరములు రెండింటిలో మిగిలేది దుఃఖమేనని గుర్తించవలెను. ఆత్మస్వరూపమునరయవలెననే కోరికను కలిగి ఆత్మవిచారమును చేయవలెను. కోరికలను విడిచి తపస్సును చేయవలెను. కర్మలను పరమేశ్వరార్పణబుద్ధితో ఆచరించవలెను. నిత్యము నన్ను ఆరాధించే మహాత్ములతోడి సంగమును చేస్తూ, నా గాథలను విని, నా గుణములను కీర్తించవలెను. ఎవ్వరియందైననూ వైరభావము లేకుండా, అందరియందు సమచిత్తము గలవాడై, శాంతముగా నుండవలెను. దేహమునందలి నేను అనే బుద్ధిని, ఇంటియందలి నాది అనే ధారణను అధిగమించవలెననే ఆకాంక్షను కలిగియుండవలెను. మోక్షశాస్త్రమును అధ్యయనము చేస్తూ, ఏకాంతములోనున్నవాడై ఆత్మనిష్ఠను అభ్యసించవలెను. చక్కగా ప్రాణాయామముచే ప్రాణమును, ప్రత్యాహారముచే ఇంద్రియములను, ధారణాధ్యానములచే మనస్సును వశము చేసుకొనవలెను. శాస్త్రమునందు, మహాత్ముల బోధలయందు శ్రద్ధను కలిగి, వాక్కును నియంత్రిస్తూ, తన లక్ష్యము విషయములో సావధానుడై యుండవలెను. వివేకముచే అంతటా నన్నే దర్శించవలెను. ఆత్మస్వరూపమును తెలుసుకొని, ఆ జ్ఞానము అనుభవపర్యంతము విరాజిల్లునట్లు అభ్యసించవలెను. సాధకుడీ తీరున అహంకారమనే సూక్ష్మశరీరమును అధిగమించవలెను.

కర్మాశయం హృదయగ్రంథిబంధ-
మవిద్యయాఽఽసాదితమప్రమత్తః ।
అనేన యోగేన యథోపదేశం
సమ్యగ్వ్యపోహ్యోపరమేత యోగాత్ ॥ 14

అవిద్యయా - అజ్ఞానముచే, ఆసాదితమ్ - పొందించబడినట్టియు, కర్మ-ఆశయమ్ - కర్మవాసనలకు ఆశ్రయమగు, హృదయగ్రంథిబంధమ్ - హృదయమునందలి ముడి అనే బంధమును, అప్రమత్తః - సావధానుడై, అనేన - ఈ, యోగేన - అభ్యాసముచే, యథా-ఉపదేశమ్ - ఉపదేశము నతిక్రమించకుండగా, సమ్యక్ - పూర్తిగా, వ్యపోహ్య - తొలగించుకొని, యోగాత్ - అభ్యాసమునుండి, ఉపరమేత - విరమించవలెను.

కర్మవాసనలకు ఆశ్రయమైన హృదయగ్రంథి అనే బంధము మానవునకు అజ్ఞానముచే సంప్రాప్తమైనది. సాధకుడు సావధానుడై పైన ఉపదేశించిన విధముగా అభ్యాసముచే ఆ గ్రంథిని పూర్తిగా తొలగించుకొని, ఆ తరువాత అభ్యాసమును కూడ విడిచిపెట్టవలెను.

పుత్రాంశ్చ శిష్యాంశ్చ నృపో గురుర్వా
మల్లోకకామో మదనుగ్రహార్థః ।
ఇత్థం విమన్యురనుశిష్యాదతద్జ్ఞాన్
న యోజయేత్కర్మసు కర్మమూఢాన్ ।
కం యోజయన్మనుజోఽర్థం లభేత
నిపాతయన్నష్టదృశం హి గర్తే ॥ 15

విమన్యుః - కోపము లేనివాడు, మత్-అనుగ్రహ-అర్థః - నా అనుగ్రహమే ప్రయోజనముగా గలవాడు, మత్-లోకకామః - నా లోకమును కోరువాడు అగు, నృపః - రాజు గాని, గురుః వా - తండ్రి (గురువు) గాని, పుత్రాన్ చ - పుత్రులను, శిష్యాన్ చ - శిష్యులను కూడ, ఇత్థమ్ - ఈ విధముగా, అనుశిష్యాత్ - శిక్షణ నీయవలెను, అతత్-జ్ఞాన్ - ఆ పరమాత్మను తెలియని, కర్మమూఢాన్ - కర్మలయందు గ్రుడ్డిగా మునిగి యున్నవారిని,

కర్మసు - కర్మలయందు, న యోజయేత్ - ప్రేరేపించరాదు, హి - ఏల యనగా, యోజయన్ - ప్రేరేపించుచున్న, మనుజః - వ్యక్తి, నష్టదృశమ్ - నశించిన చూపు గలవానిని, గర్తే - గోతియందు, నిపాతయన్ - పడద్రో యువాడై, కమ్ - ఏ, అర్థమ్ - ప్రయోజనమును, లభేత - పొందును?

నా అనుగ్రహమును పొంది, నా లోకము (మోక్షము) ను పొందు టయే ప్రధానలక్ష్యముగా గల రాజు గాని, తండ్రి గాని, గురువు గాని, కోపము లేకుండా క్రమముగా తన ప్రజలకు, పుత్రులకు మరియు శిష్యు లకు ఈ యోగమునందు శిక్షణనీయవలెను. అంతేగాని, ఆ ఆత్మతత్త్వము నెరుంగక కర్మలయందు గ్రుడ్డిగా మునిగియున్నవారిని మరల అవే కామ్యకర్మలయందు ప్రేరేపించరాదు. అట్లు ప్రేరేపించిన వ్యక్తి అజ్ఞాన ముచే గ్రుడ్డివారగు ఆ జనులను సంసారమనే గోతిలోనికి పడద్రోసి ఏమి ప్రయోజనమును పొందును?

లోకస్స్వయం శ్రేయసి నష్టదృష్టిః
యోఽర్థాన్సమీహేత నికామకామః ।
అన్యోన్యవైరస్సుఖలేశహేతో-
రనంతదుఃఖం చ న వేద మూఢః ॥ 16

స్వయమ్ - తనంత తానుగా, శ్రేయసి - పరమపురుషార్థము విష యమునందు, నష్టదృష్టిః - నశించిన జ్ఞానము గలవాడు, నికామకామః - అతిశయించిన కామనలు గల, యః - ఏ, లోకః - వ్యక్తి, సుఖలేశహేతోః - సుఖముయొక్క లేశము కారణముగా, అన్యోన్యవైరః - ఒకరితో మరియొ కరు విరోధము గలవాడై, అర్థాన్ - భోగ్యములగు విషయములను, సమీ హేత - కోరునో, మూఢః - వ్యామోహితుడైన అట్టి వ్యక్తి, అనంతదుఃఖం చ - అంతము లేని దుఃఖమును కూడ, న వేద - తెలియకున్నాడు.

వ్యక్తికి తనంత తానుగా పరమపురుషార్థము విషయములో అవగా హన లేదు. కావుననే, వ్యక్తి వ్యామోహితుడై, అతిశయించిన కామనలు గలవాడై భోగ్యములగు విషయములను కోరుతూ, అల్పమగు సుఖము

కొరకై ఇతరులతో విరోధము పెట్టుకొనును. అట్టి వ్యక్తి తనకు వచ్చిపడే అంతము లేని దుఃఖమును గురించి తెలుసుకొనుట లేదు.

కస్తం స్వయం తదభిజ్ఞో విపశ్చిత్
అవిద్యాయామంతరే వర్తమానమ్ ।
దృష్ట్వా పునస్తం సఘృణః కుబుద్ధిం
ప్రయోజయేదుత్పథగం యథాంధమ్ ॥ 17

స్వయమ్ - తనంత తానుగా, తద్-అభిజ్ఞః - పరమపురుషార్థ మును గురించి తెలిసినవాడు, విపశ్చిత్ - వివేకి, సఘృణః - దయ గల వాడు అగు, కః - ఎవడు, అవిద్యాయామ్ - అజ్ఞానమునందు, అంతరే - మధ్యయందు, వర్తమానమ్ - ఉన్నట్టియు, కుబుద్ధిమ్ - తప్పు ఆలోచన గలిగినట్టియు, ఉత్-పథగమ్ - తప్పు మార్గములో వెళ్లుచున్న, తమ్ - వానిని, దృష్ట్వా పునః - చూచి కూడ, ఉత్-పథగమ్ - తప్పు దారిన నడు చుచున్న, అంధం యథా - గ్రుడ్డివానిని వలె, తమ్ - వానిని, పునః - ఇంకా, ప్రయోజయేత్ - ప్రేరేపించును?

గ్రుడ్డివాడు గోతిలో పడే మార్గములో వెళ్లుచుండగా, ఆ విష యము తెలిసిన దయామయుడు చూచినచో, అటులనే వెళ్లుమని ప్రేరేపిం చునా? అదే విధముగా, అజ్ఞానము (సంసారము) లో పూర్తిగా చిక్కుకొని తప్పుగా ఆలోచిస్తూ తప్పు మార్గము (కామ్యకర్మల మార్గము) లో ముందుకు సాగుచున్న వ్యక్తిని చూచి కూడ, తాను స్వయముగా పరమపు రుషార్థమును గురించి తెలుసుకున్న వివేకియగు దయాళువు, వానిని అదే దారిలో ముందుకు సాగుమని ప్రోత్సహించునా? ప్రోత్సహించదు.

గురుర్న స స్యాత్స్వజనో న స స్యాత్
పితా న స స్యాజ్జననీ న సా స్యాత్ ।
దైవం న తత్స్యాన్న పతిశ్చ స స్యాత్
న మోచయేద్యస్సముపేతమృత్యుమ్ ॥ 18

సః - ఆతడు, గురుః - గురువు, న స్యాత్ - కాదు, సః - ఆతడు, స్వజనః - తనవాడు, న స్యాత్ - కాదు, సః - ఆతడు, పితా - తండ్రి, న స్యాత్ - కాదు, సా - ఆమె, జననీ - తల్లి, న స్యాత్ - కాదు, తత్ - అది, దైవమ్ - దైవము, న స్యాత్ - కాదు, చ - మరియు, సః - ఆతడు, పతిః - భర్త (ప్రభువు), న స్యాత్ - కాదు, యః - ఎవడైతే, సముపేతమృత్యుమ్ - సంప్రాప్తమైన మృత్యువు (సంసారము) గలవానిని, న మోచయేత్ - మోక్షమును కలిగించడో.

ఎవడైతే మృత్యురూపమగు సంసారములో చిక్కుకొనియున్న వానికి జ్ఞానమునుపదేశించి మోక్షమార్గమును సుగమము చేయడో, అట్టి గురువు గురువు కాదు; బంధువు బంధువు కాదు; తండ్రి తండ్రి కాదు; తల్లి తల్లి కాదు; దైవము దైవము కాదు; భర్త (ప్రభువు) భర్త (ప్రభువు) కాదు.

ఇదం శరీరం మమ దుర్విభావ్యం
సత్త్వం హి మే హృదయం యత్ర ధర్మః ।
పృష్ఠే కృతో మే యదధర్మ ఆరాత్
అతో హి మామృషభం ప్రాహురార్యాః ॥ 19

మమ - నా, ఇదమ్ - ఈ, శరీరమ్ - దేహము, దుర్విభావ్యమ్ - ఊహింప శక్యము కానిది, మే - నా, హృదయమ్ - హృదయము, సత్త్వం హి - సత్త్వమే గదా!, యత్ర - దేనియందైతే, ధర్మః - ధర్మము గలదో, యత్ - ఎందువలనైతే, మే - నాచే, అధర్మః - అధర్మము, ఆరాత్ - దూరముగా, పృష్ఠే కృతః - తిరస్కరించబడినదో, అతః హి - ఇందువలననే, ఆర్యాః - మహాత్ములు, మామ్ - నన్ను, ఋషభమ్ - ఋషభుడని, ప్రాహుః - చెప్పుచున్నారు.

ఈ నా శరీరముయొక్క రహస్యము ఊహకు అందనిది (దివ్యము). ధర్మముతో నిండియున్న నా హృదయము శుద్ధసత్త్వగుణమే. నేను అధర్మమును దూరముగా నెట్టివేసినాను. కావుననే, మహాత్ములు నన్ను ఋషభుడు (శ్రేష్ఠుడు) అని నిర్దేశించుచున్నారు.

తస్మాద్భవంతో హృదయేన జాతాః
సర్వే మహీయాంసమముం సనాభమ్ ।
అక్లిష్టబుద్ధ్యా భరతం భజధ్వం
శుశ్రూషణం తద్భరణం ప్రజానామ్ ॥ 20

తస్మాత్ - అందువలన, హృదయేన - హృదయముచే, జాతాః - పుట్టిన, భవంతః - మీరు, సర్వే - అందరు, మహీయాంసమ్ - చాల గొప్పవాడైనట్టియు, సనాభమ్ - సోదరుడగు, అముమ్ - ఈ, భరతమ్ - భరతుని, అక్లిష్టబుద్ధ్యా - దోషములు లేని బుద్ధితో, భజధ్వమ్ - సేవించుడు, తత్ - అదియే, శుశ్రూషణమ్ - సేవ, ప్రజానామ్ - ప్రజల, భరణమ్ - పాలనము.

మీరందరు నా హృదయమునుండి పుట్టినారు. కావున, మీరు మత్సరము మొదలగు దోషములు లేని బుద్ధితో మీ సోదరుడగు ఈ భరతుని సేవించుడు. ఈతడు చాల గొప్పవాడు. ఈతనిని సేవించినచో, నన్ను సేవించినట్లే; ప్రజలను పాలించినట్లే యగును.

భూతేషు వీరుద్భ్య ఉదుత్తమా యే
సరీసృపాస్తేషు సబోధనిష్ఠాః ।
తతో మనుష్యాః ప్రమథాస్తతోఽపి
గంధర్వసిద్ధా విబుధానుగా యే॥ 21

భూతేషు - ప్రాణులయందు, వీరుద్భ్యః - చెట్టుచేమలకంటె, యే - ఏ, పరీసృపాః - కదిలే ప్రాణులు గలవో అవి, ఉత్-ఉత్తమాః - చాల గొప్పవి, తేషు - వాటియందు, సబోధనిష్ఠాః - తెలివితో కూడిన స్థితి గల పశువులు, తతః - వాటికంటె, మనుష్యాః - మానవులు, తతః అపి - వారికంటె కూడ, ప్రమథాః - ప్రమథగణములు, గంధర్వసిద్ధాః - గంధర్వులు సిద్ధులు, యే - ఏ, విబుధ-అనుగాః - దేవతల అనుచరులు గలరో.

ప్రాణులలో చెట్టుచేమలకంటె కదిలే ప్రాణులు చాల గొప్పవి. వాటిలో కొంత తెలివి గల పశువులు మిగిలిన వాటికంటె చాల గొప్పవి.

వాటికంటె మానవులు చాల గొప్ప వారు. మానవులకంటె ప్రమథగణము లు, వారికంటె దేవతలకు అనుచరులగు గంధర్వులు మరియు సిద్ధులు చాల గొప్పవారు.

దేవాసురేభ్యో మఘవత్ప్రధానా
దక్షాదయో బ్రహ్మసుతాస్తు తేషామ్ ।
భవః పరస్సోఽథ విరించవీర్యః
స మత్పరోఽహం ద్విజదేవదేవః ।। 22

అసురేభ్యః - అసురులకంటె, మఘవత్-ప్రధానాః - ఇంద్రుడు ప్రధానుడుగా గల, దేవాః - దేవతలు, దక్ష-ఆదయః - దక్షుడు మొదలుగా గల, బ్రహ్మసుతాః - బ్రహ్మపుత్రులు, తేషాం తు - వారిలోనైతే, భవః - రుద్రుడు, పరః - గొప్పవాడు, సః - ఆయన, విరించవీర్యః - బ్రహ్మయే శక్తిగా గలవాడు, సః - ఆ బ్రహ్మ, మత్-పరః - నేనే పూజనీయుడుగా గల వాడు, అహమ్ - నేను, ద్విజదేవదేవః - బ్రాహ్మణులనే దేవతలే పూజనీయులుగా గలవాడను.

అసురులకంటె దేవతలు, వారికంటె వారి నాయకుడగు ఇంద్రుడు, ఇంద్రుని కంటె దక్షుడు మొదలగు బ్రహ్మపుత్రులు, వారికంటె వారిలోనివా డగు రుద్రుడు గొప్పవారు. శివుని శక్తి (కారణము) బ్రహ్మ కాగా, ఆ బ్రహ్మ నన్ను పూజించును. నేను బ్రహ్మవేత్తలనే భూసురులను పూజించెదను.

న బ్రాహ్మణైస్తులయే భూతమన్యత్
పశ్యామి విప్రాః కిమతః పరం తు ।
యస్మిన్నృభిః ప్రహుతం శ్రద్ధయాఽహ-
మశ్నామి కామం న తథాఽగ్నిహోత్రే ।। 23

విప్రాః - ఓ వేదవేత్తలారా!, అన్యత్ - మరియొక, భూతమ్ - ప్రాణిని, బ్రాహ్మణైః - బ్రహ్మవేత్తలతో, న తులయే - సరిపోల్చను, అతః - ఈ బ్రహ్మవేత్తకంటె, పరం తు - గొప్ప ప్రాణినైతే, న పశ్యామి - కానరాను, యస్మిన్ - ఏ బ్రహ్మవేత్తయందు, నృభిః - మానవులచే, శ్రద్ధయా - శ్రద్ధ

తో, ప్రహుతమ్ - హోమము చేయబడినదానిని, అహమ్ - నేను, కామమ్ - యథేచ్ఛగా, అశ్నామి - భుజించెదను, తథా - ఆ విధముగా, అగ్ని హోత్రే - అగ్నిహోత్రమునందు, న - భుజించను.

ఓ వేదవేత్తలారా! బ్రహ్మవేత్తలతో సమానమైనది, లేక గొప్పది అగు మరియొక ప్రాణి ఏదీ లేదని నా అభిప్రాయము. మానవులచే బ్రహ్మ వేత్తలయందు శ్రద్ధగా సమర్పించబడిన అన్నాదికమును నేను ఎంత ఆనం దముగా స్వీకరించెదనో, అంత ఆనందముగా అగ్నిహోత్రాది కర్మలయందు హోమము చేయబడిన ద్రవ్యమును నేను స్వీకరించుట లేదు.

ధృతా తనూరుశతీ మే పురాణీ యేనేహ సత్త్వమ్పరమమ్పవిత్రమ్,
శమో దమస్సత్యమనుగ్రహశ్చ తపస్తితిక్షానుభవశ్చ యత్ర ॥ 24

ఇహ - ఈ లోకమునందు, యేన - ఏ బ్రహ్మవేత్తచే, మే - నాయొక్క, పురాణీ - సనాతనమగు, ఉశతీ - కమనీయమైన, తనూః - దేహము, ధృతా - ధరించబడినదో, యత్ర - ఎవనియందు, పరమమ్ - మిక్కిలి, పవిత్రమ్ - పావనమగు, సత్త్వమ్ - సత్త్వగుణము, శమః - మనో నిగ్రహము, దమః - బాహ్యేంద్రియ నిగ్రహము, సత్యమ్ - సత్యము, అను గ్రహః చ - అనుగ్రహము కూడ, తపః - తపస్సు, తితిక్షా - సహనము, చ - మరియు, అనుభవః - ఆత్మసాక్షాత్కారము గలవో.

ఈ లోకములో బ్రహ్మవేత్త నాయొక్క సనాతనము మరియు కమ నీయము అగు వేదము (జ్ఞానము) అనే శరీరమును ధరించియున్నాడు. ఆయనయందు మిక్కిలి పావనమగు సత్త్వగుణము, మనోనిగ్రహము, బాహ్యేంద్రియ నిగ్రహము, సత్యము, ఇతరులయందు అనుగ్రహము, తప స్సు, సహనము మరియు ఆత్మసాక్షాత్కారము అనే లక్షణములుండును.

మత్తోఽప్యనంతాత్పరతః పరస్మాత్
స్వర్గాపవర్గాధిపతేర్న కించిత్ ।
యేషాం కిము స్యాదితరేణ తేషా-
మకించనానాం మయి భక్తిభాజామ్ ॥ 25

అనంతాత్ - అంతము లేనట్టియు, పరతః - సర్వముకంటె అతీత మైన మాయాశక్తికంటె, పరస్మాత్ - అతీతుడనైనట్టియు, స్వర్గ-అపవర్గ-అధిపతేః - స్వర్గమోక్షములకు అధీశ్వరుడనగు, మత్తః అపి - నానుండి కూడ, అకించనానామ్ - ఏమీ లేనట్టియు, మయి - నాయందు, భక్తిభాజామ్ - భక్తిని కలిగియున్న, యేషామ్ - ఎవరికైతే, కించిత్ - ఏదీ, న - లేదో, తేషామ్ - వారికి, ఇతరేణ - ఇతరముతో, కిము - ఏమి ప్రయోజనము, స్యాత్ - ఉండును?

అనంతశక్తిసంపన్నుడనగు నేను సర్వకారణమగు ప్రకృతికంటె కూడ అతీతుడను. ప్రాణులకు స్వర్గమోక్షములనే ఫలములనిచ్చే ఈశ్వరుడను నేనే. నాయందు నిండా భక్తి తప్ప మరేమీ లేని ఈ బ్రహ్మవేత్తలు అట్టి నానుండి కూడ దేనినీ అపేక్షించరు. వారికి ఇతరమగు రాజ్యాధికారము మొదలగువాటితో పని యేమున్నది?

సర్వాణి మద్ధిష్ణ్యతయా భవద్భిశ్చరాణి భూతాని సుతా ధ్రువాణి ।
సంభావితవ్యాని పదే పదే వో వివిక్తదృగ్భిస్తదు హార్హణం మే ॥26

సుతాః - పుత్రులారా!, చరాణి - కదిలేవి, ధ్రువాణి - కదలనివి అగు, భూతాని - ప్రాణులు, సర్వాణి - అన్నీ, వివిక్తదృగ్భిః - వివేకముతో కూడిన దర్శనము గల, భవద్భిః - మీచే, పదే పదే - క్షణక్షణమునందు, మత్-ధిష్ణ్యతయా - నా అధిష్ఠానముగా, సంభావితవ్యాని - సమ్మానించబడవలసినవి, తత్ ఉ హ - అదియే, వః - మీకు, మే - నాయొక్క, అర్హణమ్ - పూజ.

ఓ పుత్రులారా! కదిలేవి మరియు కదలనివి అగు ప్రాణులు అన్నింటియందు నేనే ఉన్నాను. కావున, మీరు బ్రహ్మసర్గవివేకముతో కూడిన దర్శనము గలవారై, ప్రతిక్షణము సకలప్రాణులను నా అధిష్ఠానముగనే దర్శించుడు. అదియే మీరు నాకు చేసే పూజ.

మనోవచోదృక్కరణేహితస్య
సాక్షాత్కృతం మే పరిబర్హణం హి ।

వినా పుమాన్యేన మహావిమోహాత్
కృతాంతపాశాన్న విమోక్తుమీశేత్ ।। 27

మనః-వచః-దృక్-కరణ-ఈహితస్య - మనస్సు వాక్కు కన్నులు మిగిలిన ఇంద్రియముల వ్యాపారమునకు, మే - నా, పరిబర్హణమ్ - ఆరాధనమే, సాక్షాత్ - సాక్షాత్తుగా, కృతం హి - ఫలము గదా!, యేన వినా - ఏది లేకుండా, పుమాన్ - మానవుడు, కృతాంతపాశాత్ - కాలపాశమగు, మహావిమోహాత్ - పెద్ద వ్యామోహమునుండి, విమోక్తుమ్ - విడిపించుకొనుటకు, న ఈశేత్ - సమర్థుడు కాడో.

మనస్సు, వాక్కు, చూపులు మరియు ఇతరములగు ఇంద్రియముల వ్యాపారమునకు సాక్షాత్తుగా ఫలము నన్ను ఆరాధించుటయే. అది లేకున్నచో, మానవుడు సర్వమును కబళించి వేసే కాలముయొక్క పాశమై యున్న పెద్ద వ్యామోహము (అజ్ఞానము) నుండి తప్పించుకొనజాలడు.

శ్రీశుక ఉవాచ ।
ఏవమనుశాస్యాత్మజాన్ స్వయమనుశిష్టానపి లోకానుశాసనార్థం మహానుభావః పరమసుహృద్భగవానృషభాపదేశ ఉపశమశీలానాముపరతకర్మణాం మహామునీనాం భక్తిజ్ఞానవైరాగ్యలక్షణం పారమహంస్యధర్మముపశిక్షమాణస్స్వతనయశతజ్యేష్ఠం పరమభాగవతం భగవజ్జనపరాయణం భరతం ధరణిపాలనాయాభిషిచ్య స్వయం భవన ఏవోర్వరితశరీరమాత్రపరిగ్రహ ఉన్మత్త ఇవ గగనపరిధానః ప్రకీర్ణకేశ ఆత్మన్యారోపితాహవనీయో బ్రహ్మావర్తాత్ప్రవవ్రాజ ।। 28

స్వయమ్ - తమంత తాముగా, అనుశిష్టాన్ అపి - చక్కని శిక్షణను పొందినవారే అయిననూ, ఆత్మజాన్ - పుత్రులను, లోక-అనుశాసన-అర్థమ్ - జనులకు శిక్షణను గరపుట కొరకై, ఏవమ్ - ఈ విధముగా, అనుశాస్య - శిక్షణనిచ్చి, మహా-అనుభావః - గొప్ప మహిమ గలవాడు, పరమసుహృత్ - గొప్ప హితచింతకుడు, ఋషభ-అపదేశః - ఋషభుడు

అనే పేరు గలవాడు అగు, భగవాన్ - భగవానుడు, ఉపశమశీలానామ్ - శాంతమగు స్వభావము కలిగినట్టియు, ఉపరతకర్మణామ్ - విడిచిపెట్టబడిన కర్మలు గల, మహామునీనామ్ - గొప్ప ఆత్మారాములైన ఋషులకు, భక్తిజ్ఞానవైరాగ్యలక్షణమ్ - భక్తి జ్ఞానము వైరాగ్యము లక్షణములుగా గల, పారమహంస్యధర్మమ్ - పరమహంసలకు సంబంధించిన ధర్మమును, ఉపశిక్షమాణః - శిక్షణనిచ్చువాడై, స్వతనయశతజ్యేష్ఠమ్ - తన వంద పుత్రులలో పెద్దవాడైనట్టియు, పరమభాగవతమ్ - గొప్ప భగవద్భక్తుడైనట్టియు, భగవత్-జనపరాయణమ్ - భగవద్భక్తులయందు గొప్ప ప్రీతి కలిగిన, భరతమ్ - భరతుని, ధరణిపాలనాయ - భూమిని పాలించుట కొరకు, అభిషిచ్య - అభిషేకించి, స్వయమ్ - స్వయముగా, భవనే ఏవ - భవనమునందే, ఉర్వరితశరీరమాత్రపరిగ్రహః - మిగిలిన శరీరము మాత్రమే స్వీకరించబడినదిగా గలవాడై, ఉన్మత్తః ఇవ - పిచ్చివాడు వలె, గగనపరిధానః - దిగంబరుడై, ప్రకీర్ణకేశః - విరబోయబడిన జుట్టు గలవాడై, ఆత్మని - తనయందు, ఆరోపిత-ఆహవనీయః - భావనచే స్థాపించబడిన ఆహవనీయాగ్ని గలవాడై, బ్రహ్మావర్తాత్ - బ్రహ్మావర్తమునుండి, ప్రవవ్రాజ - నిర్గమించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఋషభుని పుత్రులు స్వయముగా ధర్మముయొక్క శిక్షణ గలవారే. అయిననూ, సమాజమునకు శిక్షణనిచ్చుటకై ఋషభదేవుడు వారికీ విధముగా ధర్మమునుపదేశించెను. గొప్ప హితచింతకుడు, మహామహిముడు అగు ఋషభుడు, సర్వకర్మలను పరిత్యజించి ఆత్మారాములైయున్న శాంతస్వభావులగు మహాత్ములకు భక్తి, జ్ఞానము, వైరాగ్యములే లక్షణములుగా గల పరమహంసల (ఆత్మజ్ఞానుల) ధర్మమునందు శిక్షణనిచ్చుటకై స్వయముగా సన్న్యసించెను. ఆయన వందమంది కొడుకులలో పెద్దవాడగు భరతుడు గొప్ప భగవద్భక్తుడే గాక, భగవద్భక్తులయందు పెద్ద ప్రీతి గలవాడు. అతనిని ఆయన సామ్రాజ్యమును పాలించుటకై పట్టాభిషిక్తుని చేసెను. అపుడాయన భావనతో ఆహవనీయాగ్నిని తనయందు స్థాపించుకొని, సర్వమును రాజప్రాసాదమునందే విడిచిపెట్టి, కేవలము శరీరముతో మాత్రమే నగ్నముగా బ్రహ్మా

వర్త్మముమండి నిర్గమించెను. జుట్టు విరబోసుకొనియున్న ఆయన పిచ్చివాని వలె కానవచ్చెను.

**జడాంధమూకబధిరపిశాచోన్మాదకవదవధూతవేషోఽభిభాష్య మాణోఽపి జనానాం గృహీతమౌనవ్రతస్తూష్ణీం బభూవ ॥29**

జనానామ్ - జనుల మధ్యలో, జడ-అంధమూకబధిరపిశాచ-ఉ న్మాదకవత్ - జడుడు గ్రుడ్డివాడు మూగవాడు చెవిటివాడు పిశాచము పిచ్చివాడు వలె, అవధూతవేషః - మట్టి కొట్టుకుపోయిన వేషము గలవాడై, అభిభాష్యమాణః అపి - మాటలాడించబడిననూ, గృహీతమౌనః - స్వీక రించబడిన మౌనమే వ్రతముగా గలవాడై, తూష్ణీం బభూవ - మిన్నకుండె ను.

ఆయన జనుల మధ్యలో జడుడు వలె, గ్రుడ్డివాడు వలె, మూగివా డువలె, చెవిటివాడు వలె, పిశాచము వలె, పిచ్చివాడు వలె, మట్టి కొట్టుకు పోయిన వేషముతో (అవధూతయై) ఉండెను. ఆయన మౌనవ్రతమును పట్టి, ఇతరులు పలకరించిననూ మిన్నకుండెడివాడు.

**తత్ర తత్ర పురగ్రామాకరఖేటవాటఖర్వటశిబిరవ్రజఘోషసార్థగి రివనాశ్రమాదిష్వనుపథమవనిచరాపసదైః పరిభూయమానో మక్షికాభిరివ వనగజస్తర్జనతాడనావమేహనష్ఠీవనగ్రావశకృద్ర జఃప్రక్షేపపూతివాతదురుక్తైస్తదవిగణయన్నేవాసత్సంస్థాన ఏత స్మిన్ దేహోపలక్షణే సదపదేశ ఉభయానుభవస్వరూపేణ స్వమహిమావస్థానేనాసమారోపితాహంమమాభిమానత్వాదవి ఖండితమనాః పృథివీమేకచరః పరిబభ్రామ ॥ 30**

తత్ర తత్ర - అక్కడక్కడ, పురగ్రామ-ఆకరఖేటవాటఖర్వటశిబిరవ్ర జఘోషసార్థగిరివన-ఆశ్రమ-ఆదిషు - నగరములు గ్రామములు గనులు వ్యవసాయదారుల పల్లెలు ఉద్యానవనములు కొండపల్లెలు శిబిరములు పశు కాపరుల పల్లెలు గొల్లపల్లెలు యాత్రీకుల గుంపులు కొండలు అడ వులు ఆశ్రమములు మొదలగువాటియందు, అనుపథమ్ - ప్రతిమార్గము

నందు, అవనిచర-అపసదైః - అధములగు వ్యక్తులచే, మక్షికాభిః - ఈగల చే, వనగజః ఇవ - అడవిలోని ఏనుగు వలె, తర్జనతాడన-అవమేహనష్ఠీవన గ్రావశకృత్-రజఃప్రక్షేపపూతివాతదురుక్తైః - బెదిరించుట కొట్టుట మూత్రము చేయుట ఉమ్మి వేయుట రాళ్లను పేడను దుమ్మును మీద వేయుట చెడు గాలిని మీదకు పంపుట చెడు పలుకులు అనువాటిచే, పరి భూయమానః - పీడించబడుచున్నవాడై, తత్ - దానిని, అవిగణయన్ ఏవ - లెక్కించనివాడుగనే, ఉభయ-అనుభవస్వరూపేణ - రెండింటి అనుభ వమే స్వరూపముగా గల, స్వమహిమ-అవస్థానేన - తన మహిమయందు నిలిచియుండుటచే, అసత్-సంస్థానే - మిథ్యాభూతమగు (పంచభూతము ల) సన్నివేశమైన, దేహ-ఉపలక్షణే - దేహము అనే ఆకారము గల, సత్ -అపదేశే - సత్యము అని పిలువబడే, ఏతస్మిన్ - దీనియందు, అసమారో పిత-అహంమమ-అభిమానత్వాత్ - ఆరోపించబడని నేను-నాది అనే అభి మానము గలవాడగుట వలన, అవిఖండితమనాః - క్షోభను చెందని మనస్సు గలవాడై, ఏకచరః - ఏకాకియై, పృథివీమ్ - భూమిని, పరిబ భ్రామ - తిరుగాడెను.

ఆయన భూమండలమునందు నగరములు, గ్రామములు, గను లు, వ్యవసాయదారుల పల్లెలు, ఉద్యానవనములు, కొండపల్లెలు, సేనల శిబిరములు, పశు కాపరుల పల్లెలు, గొల్లపల్లెలు, యాత్రీకుల గుడారము లు, కొండలు, అడవులు, ఆశ్రమములు మొదలగు చోట్ల ఏకాకియై తిరుగా డెను. అక్కడక్కడ మార్గములో కొందరు మానవాధములు ఆయనను బెది రించి, కొట్టి, మూత్రించి, ఉమ్మి, రాళ్లను పేడను దుమ్మును మీద వేసి, చెడుగాలిని మీదకు పంపి, తిట్టి పలువిధములుగా పీడించెడివారు. అడవి లోని ఏనుగు దోమలను వలె, ఆయన వీటిని లెక్కబెట్టెడివాడు కాదు. ప్రకృ తిపురుషుల వివేకముయొక్క అనుభవముతో గూడియున్న ఆయన ఆత్మ స్వరూపముయొక్క మహిమయందే నిష్ఠను కలిగియుండెడివాడు. కావున నే, పంచభూతముల సమ్మేళనమై లౌకికులచే సత్యమని స్వీకరించబడే మిథ్యాభూతమగు ఈ దేహాకృతియందు ఆయన నేను-నాది అనే అభిమా నమును ఆరోపించెడివాడు కాదు. కావుననే, వారి చేష్టలచే ఆయన మన స్సునకు క్షోభ కలిగెడిది కాదు.

అతిసుకుమారకరచరణోరఃస్థలవిపులబాహ్వాంసగలవదనాద్య
వయవవిన్యాసః ప్రకృతిసుందరస్వభావహాసముఖో నవనలి
నదలాయమానశిశిరతారారుణాయతనయనరుచిరస్సదృశసు
భగకపోలకర్ణకంఠనాసో విగూఢస్మితవదనమహోత్సవేన పురవ
నితానాం మనసి కుసుమశరాసనముపదధానః పరాగవలంబ
మానకుటిలజటిలకపిశకేశభూరిభారోఽవధూతమలిననిజశరీ
రేణ గ్రహగృహీత ఇవాదృశ్యత ॥ 31

అతిసుకుమారకరచరణ-ఉరఃస్థలవిపులబాహు-అంసగలవదన-ఆది-అవయవవిన్యాసః - మిక్కిలి సుకుమారములైన చేతులు కాళ్లు వక్షఃస్థలము పొడవైన బాహువులు విశాలమైన భుజస్కంధములు కంఠము ముఖము మొదలైన అవయవముల సంరచన కలిగినట్టియు, ప్రకృతిసుందరస్వభావహాసముఖః - సహజముగా అందమైన మరియు సహజసిద్ధమైన చిరునవ్వుచే శోభిల్లే ముఖము కలిగినట్టియు, నవనలినదలాయమానశిశిరతార-అరుణ-ఆయతనయనరుచిరః - కొత్తగా వికసించిన పద్మము యొక్క రేకవలె ఆచరించుచున్న తాపమును పోగొట్టే కంటిపాపలతో కూడియున్న ఎర్రని నిడివి కన్నులతో సుందరమైనట్టియు, సదృశసుభగకపోలకర్ణకంఠనాసః - ఎక్కువ తక్కువలు లేని అందమైన చెక్కిళ్లు చెవులు కంఠము ముక్కు కలిగినట్టియు, విగూఢస్మితవదనమహా-ఉత్సవేన - సుస్పష్టము కాని చిరునవ్వుగల ముఖముయొక్క గొప్ప విలాసచే, పురవనితానామ్ - పౌరస్త్రీల, మనసి - మనస్సునందు, కుసుమశర-ఆసనమ్ - పుష్పముల ధనస్సు గల మన్మథుని, ఉపదధానః - ఉద్దీపింపజేయుచున్నట్టియు, పరాక్ - ఎదుట, అవలంబమానకుటిలజటిలకపిశకేశభూరిభారః - వ్రేలాడుచున్న ఉంగరాల జడలు కట్టిన బూడిదరంగు కేశముల అధికమగు భారము గల ఋషభుడు, అవధూతమలిననిజశరీరేణ - అనాదరమునకు గురియై మలినమైన తన శరీరముతో, గ్రహగృహీతః ఇవ - దెయ్యము పట్టినవాడు వలె, అదృశ్యత - కానవచ్చెను.

ఋషభదేవుని చేతులు, కాళ్లు, వక్షఃస్థలము, పొడవాటి బాహువులు, విశాలమైన భుజస్కంధములు, కంఠము, ముఖము మొద

లగు అవయవములు చాల సుకుమారముగా చక్కని రచన కలిగియుండె ను. సహజముగా అందమైన ఆయన ముఖము సహజసిద్ధమైన చిరున వ్వుతో శోభిల్లెను. ఆయనయొక్క ఎర్రని నిడివి కన్నులు క్రొత్తగా వికసించిన పద్మపు రేకలను అనుకరిస్తూ అందముగా నుండెను. ఆయన కనుగ్రుడ్లు తమ చూపులతో తాపమును పోగొట్టుచుండెను. ఆయన చెక్కిళ్లు, చెవులు, కంఠము, ముక్కు సరిసమానముగా అందముగా నుండెను. సుస్పష్టము కాని చిరునవ్వుతో కూడిన ఆయన ముఖము చూపరులకు గొప్ప ఉత్సవ మును చేయజాలియుండెను. ఆ ముఖముయొక్క విలాసలు పౌరస్త్రీల మనస్సునందు పుష్పబాణుని ఉద్దీపింప జేయుచుండెను. ముఖము పైకి వ్రేలాడుచున్న దట్టని బరువైన గిరజాల జుట్టు జడలు కట్టి బూడిదరంగును కలిగియుండెను. శ్రద్ధను చూపకపోవుటచే మలినమైన శరీరముతో ఆయన దెయ్యము పట్టినవాడు వలె కన్పట్టెను.

> యర్హి వావ స భగవాన్ లోకమిమం యోగస్యాద్ధా ప్రతీపమివా
> చక్షాణస్తత్ప్రతిక్రియాకర్మ బీభత్సితమితి వ్రతమాజగరమాస్థి
> తశ్శయాన ఏవాశ్నాతి పిబతి ఖాదత్యవమేహతి హదతి స్మ
> చేష్టమాన ఉచ్చరిత ఆదిగ్ధోద్దేశః ।। 32

యర్హి వావ - ఏ కాలమునందైతే, సః - ఆ, భగవాన్ - ఋషభదే వుడు, ఇమమ్ - ఈ, లోకమ్ - జనమును, యోగస్య - ఆత్మజ్ఞాననిష్ఠకు, అద్ధా - సాక్షాత్తుగా, ప్రతీపం ఇవ - విరోధియా యన్నట్లు, తత్-ప్రతిక్రియా కర్మ - దానికి విరుగుడు అయిన కర్మ, బీభత్సితం ఇతి - బీభత్సముతో కూడినదియని, ఆచక్షాణః - తలంచువాడో అప్పుడు, ఆజగరమ్ - కొండ చిలువకు సంబంధించిన, వ్రతమ్ - వ్రతమును, ఆస్థితః - స్వీకరించినవా డై, ఉచ్చరితే - మాలిన్యమునందు, చేష్టమానః - దొర్లువాడై, ఆదిగ్ధ-ఉ ద్దేశః - పూయబడిన దేహభాగములు గలవాడై, శయానః ఏవ - పరుండి యున్నవాడుగనే, అశ్నాతి స్మ - భుజించెను, పిబతి స్మ - నీటిని త్రాగెను, ఖాదతి స్మ - భుజించెను, అవమేహతి స్మ హదతి స్మ - విసర్జించెను.

తన ఆత్మజ్ఞాననిష్ఠకు జనము ఆటంకము వలె నున్నదనియు, వారినుండి తప్పించుకొనుటకు చేసే ప్రయత్నము బీభత్సమునకు దారి

తీయుననియు ఋషభదేవుడు భావించెను. కావుననే, ఆయన వెంటనే ఆజగరవృత్తి (కొండచిలువ వలె ఒకే చోట ఉంటూ జీవించుట) ని స్వీకరించి, పరుండియే పళ్లను తినుట, నీటిని త్రాగుట, భోజనము చేయుట, విసర్జనాదికమును మొదలుపెట్టెను. ఆయన దొర్లినప్పుడు శరీరభాగములన్నియు మలినములగుచుండెను.

తస్య హ యః పురీషసురభిసౌగంధ్యవాయుస్తం దేశం దశ
యోజనం సమంతాత్ సురభిం చకార ॥ 33

తస్య - ఆయనయొక్క, యః - ఏ, పురీషసురభిసౌగంధ్యవాయుః - మాలిన్యముయొక్క పరిమళముచే సుగంధితమైన వాయువు గలదో అది, దశయోజనమ్ - పదియోజనముల, తమ్ - ఆ, దేశమ్ - ప్రదేశమును, సమంతాత్ - అంతటా, సురభిమ్ - పరిమళభరితమునుగా, చకార - చేసెను.

యోగీశ్వరుడగు ఆయన దేహముయొక్క మాలిన్యము దివ్యపరిమళమును కలిగియుండెను. ఆయన దేహముపైనుండి వీచిన వాయువు ఆ పరిమళముతో నిండి, పది యోజనముల వరకు ఆ ప్రదేశమంతా సుగంధముతో నిండిపోయెను.

ఏవం గోమృగకాకచర్యయా వ్రజంస్తిష్ఠన్నాసీనశ్శయానఃకాక
మృగగోచరితః పిబతి ఖాదత్యవమేహతి స్మ ॥ 34

ఏవమ్ - ఈ విధముగా, కాకగోమృగచరితః - కాకి ఆవు లేడి అనే ప్రాణుల ఆచరణము గల ఋషభదేవుడు, గోమృగకాకచర్యయా - ఆవు లేడి కాకి అనే ప్రాణుల వ్యాపారముచే, వ్రజన్ - వెళ్లుచున్నవాడు, తిష్ఠన్ - నిలిచియున్నవాడు, ఆసీనః - కూర్చున్నవాడు, శయానః - పరున్నవాడు, పిబతి స్మ - త్రాగెను, ఖాదతి స్మ - భోజనమును చేసెను, అవమేహతి స్మ - విసర్జించెను.

ఈ విధముగా ఆ ఋషభదేవుడు ఆవు, కాకి, లేడి అను ప్రాణుల వ్రతమును కూడ ఆచరించుచూ, వాటివలెనే ఒకప్పుడు నడుస్తూ,

మరియొకప్పుడు నిలబడి, ఇంకోసారి పరుండి, ఒకప్పుడు పళ్లను తింటూ, భోజనమును చేస్తూ, విసర్జిస్తూ గడిపెను.

ఇతి నానాయోగచర్యాచరణో భగవాన్ కైవల్యపతిర్ఋషభోఽ
విరతపరమమహానందానుభావ ఆత్మని సర్వేషాం భూతానా
మాత్మభూతే భగవతి వాసుదేవ ఆత్మనోఽవ్యవధానానంతరోద
రభావేన సిద్ధసమస్తార్థపరిపూర్ణో యోగైశ్వర్యాణి వైహాయసమ
నోజవాంతర్ధానపరకాయప్రవేశదూరగ్రహణాదీని యదృచ్ఛ
యోపగతాని నాంజసా నృప హృదయేనాభ్యనందత్ ॥ 35

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే
ఋషభదేవస్య రాజ్యత్యాగో నామ పంచమోఽధ్యాయః ॥

నృప - ఓ రాజా!, ఇతి - ఈ విధముగా, నానాయోగచర్యా-ఆచరణః - పలురకముల యోగాభ్యాసములను చేయువాడు, కైవల్యపతిః - మోక్షప్రదాత, అవిరతపరమమహా-ఆనంద-అనుభవః - నిరంతరము సర్వోత్కృష్టము అగు ఆనందముయొక్క అనుభవము గలవాడు, సర్వేషామ్ - అన్ని, భూతానామ్ - ప్రాణులకు, ఆత్మభూతే - ఆత్మయగు, ఆత్మని - తన స్వరూపమునందు, భగవతి వాసుదేవే - వాసుదేవ భగవానునియందు, ఆత్మనః - తనకు, అవ్యవధాన-అనంతర-ఉదరభావేన - అభేదముచే అల్పమగు తేడా కూడ లేని జ్ఞానముచే, సిద్ధసమస్త-అర్థపరిపూర్ణః - సిద్ధించిన అన్ని పురుషార్థములచే పూర్ణుడు అగు, భగవాన్ ఋషభః - ఋషభదేవుడు, యదృచ్ఛయా - అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే), అంజసా - సాక్షాత్తుగా, ఉపగతాని - సంప్రాప్తమైన, వైహాయసమనః-జవ-అంతర్ధానపరకాయప్రవేశదూరగ్రహణ-ఆదీని - ఆకాశములో ఎగురుట మనస్సుతో సమానమైన (గొప్ప) వేగముతో వెళ్లుట అంతర్హితుడై ఉండుట ఇతరదేహములో ప్రవేశించుట దూరమునందలి శబ్దములను వినుట మరియు రూపములను చూచుట మొదలగు, యోగ-ఐశ్వర్యాణి - యోగసిద్ధులను, హృదయేన - మనస్సుతో, న అభ్యనందత్ - ఆదరించలేదు.

ఓ పరీక్షిన్మహారాజా! మోక్షప్రదాతయగు ఋషభదేవుడు ఈ విధముగా (జనులకు ఆదర్శము కొరకై) పలువిధముల యోగాభ్యాసములను చేయుచుండెను. ఆయన నిరంతరముగా సర్వోత్కృష్టమగు బ్రహ్మానందమునందు ప్రతిష్ఠితుడై యుండెను. ఆయన సకలప్రాణులను తన స్వరూపమునందు, వాసుదేవ భగవానుని ఆత్మరూపముగా దర్శించెను. ఆయన దర్శనములో తనకు, వాసుదేవునకు తేడా లేశమైననూ లేకుండెను. అట్టి జ్ఞానముచే పురుషార్థములన్నియు సిద్ధించి, ఆయన పరిపూర్ణుడయ్యెను. ఆయనకు అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే) ఆకాశములో ఎగురుట, మనోవేగముతో వెళ్లుట, అంతర్ధానమగుట, పరకాయ ప్రవేశము, దూరమునందలి శబ్దములను వినగల్గుట మరియు రూపములను చూడగల్గుట మొదలగు యోగసిద్ధులు ప్రత్యక్షముగా సంప్రాప్తమయ్యెను. కాని, ఆయన హృదయములో వాటిపై ఆదరము లేకుండెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో
ఋషభదేవుడు రాజ్యాధికారమును విడిచిపెట్టి పరివ్రాజకుడగుట అనే
ఐదవ అధ్యాయము ముగిసినది (5).

*****

# అథ షష్ఠోఽధ్యాయః

## ఋషభదేవుడు అవతారమును చాలించుట

రాజోవాచ ।

న నూనం భగవ ఆత్మారామాణాం యోగసమీరితజ్ఞానావభర్జి తకర్మబీజానామైశ్వర్యాణి పునః క్లేశదాని భవితుమర్హంతి యదృచ్ఛయోపగతాని ॥ 1

భగవః - ఓ పూజనీయా!, యోగసమీరితజ్ఞాన-అవభర్జితకర్మబీజానామ్ - యోగముచే ఉద్దీపింప జేయబడిన జ్ఞానముచే దహించి వేయబడిన కర్మఫలములు అనే బీజము (కర్మకు బీజమగు రాగద్వేషములు) గల, ఆత్మారామాణాం పునః - తమ స్వరూపమునందు ఆనందించే మహాత్ములకైతే, యదృచ్ఛయా - అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే), ఉపగతాని - సంప్రాప్తమైన, ఐశ్వర్యాణి - యోగసిద్ధులు, (పునః - మరల), క్లేశదాని - క్లేశములను కలిగించునవి, భవితుమ్ - అగుటకు, న అర్హంతి - సమర్థములు కావు, నూనమ్ - నిశ్చయము.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- పూజనీయుడవగు ఓ శుక మహర్షీ! మహాత్ములకు కర్మయోగముచే ఆత్మజ్ఞానము కలిగి, దానిచే వారి కర్మఫలములన్నియు దహించివేయబడును. కొత్తగా కర్మలను చేయుటకు ప్రేరణనిచ్చే రాగద్వేషములు కూడ వారియందు ఉండవు. తమ స్వరూపమునందు మాత్రమే రమించే అట్టి మహాత్ములకు అనుకోకుండా ఈశ్వరేచ్ఛచే యోగసిద్ధులు లభించినచో, అవి వారికి మరల అజ్ఞానము, అస్మిత, రాగము, ద్వేషము, మరణభయము అనే చిత్తక్లేశములను కలిగించలేవు. ఇది నిశ్చయము.

ఋషిరువాచ ।
సత్యముక్తం కిం త్విహ వా ఏకే న మనసోఽద్ధా విస్రంభమనవ
స్థానస్య శఠకిరాత ఇవ సంగచ్ఛంతే ॥ 2

సత్యమ్ - సత్యము, ఉక్తమ్ - చెప్పబడినది, కిం తు - కానైతే, ఇహ - ఈ జగత్తునందు, ఏకే - కొందరు (గొప్పవారు), అనవస్థానస్య - నిలకడ లేని, మనసః - మనస్సుయొక్క, విస్రంభమ్ - నమ్మకమును, శఠకిరాతే ఇవ - నమ్మించి మోసము చేయువానియందు క్రూరునియందు వలె, అద్ధా - సాక్షాత్తుగా, న వై సంగచ్ఛంతే - సుతరాము చేయుట లేదు.

శుక మహర్షి ఇట్లు పలికెను --- నీవు చెప్పినది వాస్తవమే. కాని, ఈ లోకములో నమ్మించి మోసము చేయువానిని, క్రూర స్వభావము గల వానిని విశ్వసించరు. అదే విధముగా, కొందరు మహాత్ములు మిక్కిలి చపలమగు మనస్సును సాక్షాత్తుగా విశ్వసించరు.

తథా చోక్తమ్ ---
న కుర్యాత్కర్హిచిత్సఖ్యం మనసి హ్యనవస్థితే ।
యద్విస్రంభాచ్చిరాచ్చీర్ణం చస్కంద తప ఐశ్వరమ్ ॥ 3

తథా చ - ఈ విషయమును సమర్థిస్తూ, ఉక్తమ్ - చెప్పబడినది, మనసి - మనస్సు, అనవస్థితే - చంచలమై యుండగా, కర్హిచిత్ - ఏ కాలమునందైననూ, సఖ్యమ్ - స్నేహమును, న కుర్యాత్ - చేయరాదు, హి - ఏలయనగా, యత్-విస్రంభాత్ - దేనిని విశ్వసించుట వలన, ఐశ్వరమ్ - గొప్పవారల, చిరాత్ - చాలకాలము, చీర్ణమ్ - సంపాదించబడిన, తపః - తపస్సు, చస్కంద - జారిపోయెనో.

ఈ విషయములో ఇట్లు చెప్పబడినది --- మనస్సు చంచలమైనది. ఈ సంగతిని గుర్తించి, సాధకుడు ఏ కాలమునందైననూ ఆసక్తిని పెంచుకొనరాదు (మనస్సుతో స్నేహమును చేయరాదు). గొప్పవారలు కూడ మనస్సును నమ్మి, చిరకాలము కష్టపడి చేసిన తపస్సును పోగొట్టుకొనిరి.

నిత్యం దదాతి కామస్య చ్ఛిద్రం తమను యేఽరయః ।
యోగినః కృతమైత్రస్య పత్యుర్జాయేవ పుంశ్చలీ ॥ 4

కృతమైత్రస్య - చేయబడిన స్నేహము గల, యోగినః - యోగికి, నిత్యమ్ - అన్ని కాలములలో, కామస్య - కామనకు, తం అను - దానిని అనుసరించి, యే - ఏ, అరయః - శత్రువులు గలరో వారికి, పుంశ్చలీ - వ్యభిచారిణియగు, జాయా - భార్య, పత్యుః ఇవ - భర్తకు వలె, ఛిద్రమ్ - అవకాశమును, దదాతి - ఇచ్చును.

వ్యభిచారిణియగు భార్య భర్త నమ్మియుండగా, జారులు ప్రవేశించుటకు అవకాశమునిచ్చును. అదే విధముగా, సాధకుడు మనస్సును నమ్మి యున్నచో, ఆ మనస్సు కామనకు, దాని వెంట వచ్చే కోపము మొదలగు అంతశ్శత్రువులకు లోపల ప్రవేశించే అవకాశమునిచ్చును.

కామో మన్యుర్మదో లోభశ్శోకమోహభయాదయః ।
కర్మబంధశ్చ యన్మూలస్స్వీకుర్యాత్కో ను తద్బుధః ॥ 5

కామః - కామన, మన్యుః - కోపము, మదః - గర్వము, లోభః - పిసినారి తనము, శోకమోహభయ-ఆదయః - శోకము వ్యామోహము భయము మొదలగునవి, కర్మబంధః చ - కర్మల వలన కలిగే బంధము కూడ, యత్-మూలః - దేని మూలకముగా కలుగునో, తత్ - అట్టి మనస్సును, బుధః - వివేకియగు, కః - ఎవ్వాడు, స్వీకుర్యాత్ ను - స్వీకరించును?

మనస్సు మూలకముగనే సాధకునకు కామన, కోపము, గర్వము, పిసినారి తనము, శోకము, వ్యామోహము, భయము, మాత్సర్యము మొదలగు అవలక్షణములు ఉదయించును. మనస్సు మూలకముగనే వ్యక్తి కర్మలయందు బద్ధుడై యుండును. అట్టి మనస్సును వివేకియగు సాధకుడు ఎవ్వాడు విశ్వసించును? (ఎవ్వరైననూ విశ్వసించరు).

అథైవమఖిలలోకపాలలలామోఽపి విలక్షణైర్జడవదవధూతవేష భాషాచరితైరవిలక్షితభగవత్ప్రభావో యోగినాం సాంపరాయ

విధిమనుశిక్షయన్ స్వకలేవరం జిహాసురాత్మన్యాత్మానమసం
వ్యవహితమనర్థాంతరభావేనాన్వీక్షమాణ ఉపరతానువృత్తిరుప
రరామ ॥ 6

అథ - ఒకనాడు, ఏవమ్ - ఈ విధముగా, అఖిలలోకపాలలలామః అపి - లోకపాలకులందరికీ అలంకారమువంటి వాడే అయిననూ, విలక్షణైః - విడ్డూరములైన, జడవత్-అవధూతవేషభాషాచరితైః - మూర్ఖుడు వలె అవధూతల (తిరస్కరించబడే) వేషము భాష ఆచరణములచే, అవిలక్షితభగవత్-ప్రభావః - అభివ్యక్తము కాని ఈశ్వరవిభూతి గల ఋషభదేవుడు, యోగినామ్ - సాధకులకు, సాంపరాయవిధిమ్ - మరణించే పద్ధతిని, అనుశిక్షయన్ - శిక్షణనిచ్చువాడై, స్వకలేవరమ్ - తన దేహమును, జిహాసుః - విడువ గోరువాడై, ఆత్మని - బుద్ధియందు, అసంవ్యవహితమ్ - వ్యవధానము లేని, ఆత్మానమ్ - ఆత్మస్వరూపమును, అనర్థాంతరభావేన - అభేదభావనచే, అను-ఈక్షమాణః - దర్శించువాడై, ఉపరత-అనువృత్తిః - తిరస్కరించబడిన దేహాభిమానము గలవాడై, ఉపరరామ - విరమించెను.

ఋషభదేవుడు లోకపాలకుందరికీ అలంకారము వంటి వాడే. కాని, ఆయన తన ఈశ్వరీయమగు మహిమ ప్రకటము కాకుండా, లోకవిరుద్ధములైన వేషము, భాష, చేష్టలతో జడుడు వలె కానవచ్చెను. అప్పుడాయన దేహత్యాగము చేయగోరి, సాధకులకు మరణించే పద్ధతిని నేర్పదలచెను. ఆయన దేహాభిమానమును విడిచిపెట్టి, భేదదృష్టికి నిలయమగు బుద్ధిని ఆత్మచైతన్యమునందు విలీనము చేసి, ఆత్మనిష్ఠుడై నిలిచెను. ఈ విధముగా ఆయన ప్రపంచవ్యవహారములనుండి విరమించెను.

తస్య హ వా ఏవం ముక్తలింగస్య భగవత ఋషభస్య యోగ
మాయావాసనయా దేహ ఇమాం జగతీమభిమానాభాసేన
సంక్రమమాణః కోంకవేంకకుటకాన్ దక్షిణకర్ణాటకాన్ దేశాన్
యదృచ్ఛయోపగతః కుటకాచలోపవన ఆస్యకృతాశ్మకవల
ఉన్మాద ఇవ ముక్తమూర్ధజోఽసంవీత ఏవ విచచార ॥ 7

ఏవమ్ - ఈ విధముగా, ముక్తలింగస్య వై - నిశ్చయముగా విడువ బడిన దేహాభిమానము గల, తస్య - ఆ, భగవతః ఋషభస్య - ఋషభదే వుని, దేహః - దేహము, యోగమాయావాసనయా - యోగమాయయొక్క వాసనచే, ఇమామ్ - ఈ, జగతీమ్ - లోకమును, అభిమాన-ఆభాసేన - దేహమునందు అహంభావముయొక్క ఆభాసచే, సంక్రమమాణః - తిరుగా డుచున్నవాడై, కోంకవేంకకుటకాన్ - కోంక వేంక కుటక ప్రాంతములను, దక్షిణకర్ణాటకాన్ - దక్షిణము కర్ణాటకము అనే, దేశాన్ - ప్రాంతములను, యదృచ్ఛయా - అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే), ఉపగతః - చేరుకున్నవా డై, కుటక-అచల-ఉపవనే - కుటక పర్వతముయొక్క ఉద్యానమునందు, ఆస్యకృత-అశ్మకవలః - నోటియందుంచబడిన రాతి ముక్క గలవాడై, ఉన్మాదః ఇవ - పిచ్చివాడు వలె, ముక్తమూర్ధజః - విరబోసుకున్న జుట్టు గలవాడై, అసంవీతః ఏవ - దిగంబరుడుగనే, విచచార - తిరుగాడెను.

ఈ విధముగా ఋషభదేవునకు నిశ్చయముగా దేహాభిమానము లేకుండెను. అయిననూ, యోగమాయయొక్క వాసనచే ఆయన దేహము బాధితమైననూ ఛాయామాత్రముగా మిగిలియున్న అహంవృత్తిని బట్టి నడ చుచుండెను. ఈ విధముగా ఆయన ఈ లోకములో తిరుగుతూ, అనుకో కుండగనే ఈశ్వరేచ్ఛచే కోంకము, వేంకము, కుటకము, దక్షిణదేశము, కర్ణా టకము మొదలగు ప్రాంతములలో తిరిగెను. ఒకనాడాయన కుటకపర్వత ముయొక్క ఉద్యానమునందు నోటియందు రాతిముక్కనుంచుకొని, పిచ్చి వాడు వలె జుట్టు విరబోసుకొని, దిగంబరుడుగనే తిరుగాడెను.

అథ సమీరవేగవిధూతవేణువికర్షణజాతోగ్రదావానలస్తద్వనమా
లేలిహనస్సహ తేన దదాహ ॥ 8

**అథ - తరువాత, సమీరవేగవిధూతవేణువికర్షణజాత-ఉగ్రదావ-అ నలః - గాలియొక్క వేగముచే కదల్చబడిన వెదుళ్ల రాపిడిచే పుట్టిన భయంకరమగు కార్చిచ్చు, తత్ - ఆ, వనమ్ - అడవిని, ఆలేలిహానః - అంతటా కబళించుచున్నదై, తేన సహ - ఆ ఋషభదేవునితో సహా, దదాహ - కాల్చెను.**

తరువాత, గాలి వేగమునకు కదలాడే వెదుళ్ల రాపిడికి పుట్టిన భయంకరమగు కార్చిచ్చు ఆ అడవిని పూర్తిగా కబళిస్తూ కాల్చివేసెను. ఋషభదేవుడు దానిలో చిక్కుకొని మరణించెను.

యస్య కిలానుచరితముపాకర్ణ్య కోంకవేంకకుటకానాం రాజా ౽ర్హన్నామోపశిక్ష్య కలావధర్మ ఉత్కృష్యమాణే భవితవ్యేన విమోహితస్స్వధర్మపథమకుతోభయమపహాయ కుపథపాఖం డమసమంజసం నిజమనీషయా మందస్సంప్రవర్తయిష్యతే ॥ 9

యస్య - ఏ ఋషభదేవుని, అనుచరితం కిల - వృత్తాంతమునైతే, ఉపాకర్ణ్య - విని, అర్హన్ నామ - అర్హన్ అని ప్రసిద్ధి గాంచిన, మందః - మందబుద్ధియగు, కోంకవేంకకుటకానామ్ - కోంకవేంకకుటకప్రాంతముల, రాజా - రాజు, ఉపశిక్ష్య - నేర్చుకొని, కలౌ - కలియుగమునందు, అధర్మే - అధర్మము, ఉత్కృష్యమాణే - వర్ధిల్లుచుండగా, భవితవ్యేన - విధివిధానముచే, విమోహితః - వ్యామోహితుడై, అకుతః-భయమ్ - దేనినుండియైననూ భయము లేని, స్వధర్మపథమ్ - తన ధర్మమునాచరించుట అనే మార్గమును, అపహాయ - విడిచిపెట్టి, అసమంజసమ్ - అయోగ్యమైన, కుపథపాఖండమ్ - చెడు మార్గము అగు పాఖండమును, నిజమనీషయా - తన బుద్ధిచే, సంప్రవర్తయిష్యతే - ప్రవర్తిల్ల జేయగలడు.

కోంక వేంక కుటక ప్రాంతములకు అర్హన్ అని ప్రసిద్ధిని చెందిన రాజు ఉండగలడు. ఆయన ఋషభదేవుని ఈ వృత్తాంతమును విని, ఆ ఆచరణను తాను కూడ నేర్చుకొని, తన బుద్ధిచే అయోగ్యమగు పాఖండ (పాపపు గురుతులు గలది, వేదములను దూషించునది) పూర్ణమైన చెడు మార్గమును నిర్మించి ప్రచారము చేయగలడు. మానవులు తమ ధర్మమును తామాచరించినచో, వారికి ఏ విధముగనూ భయము కలుగదు. కాని, విధివిధానము అట్లుండుటచే, కలియుగమునందు అధర్మము వర్ధిల్లి, ఆ రాజు వ్యామోహముచే స్వధర్మమును విడిచిపెట్టగలడు.

యేన హ వావ కలౌ మనుజాపసదా దేవమాయామోహితా
స్వవిధినియోగశౌచచారిత్రవిహీనా దేవహేలనాన్యపవ్రతాని
నిజనిజేచ్ఛయా గృహ్ణానా అస్నానానాచమనాశౌచకేశోల్లుంచ
నాదీని కలినాఽధర్మబహులేనోపహతధియో బ్రహ్మబ్రాహ్మణ
యజ్ఞపురుషలోకవిదూషకాః ప్రాయేణ భవిష్యంతి ॥ 10

యేన - ఏ పాఖండ మతముచే, కలౌ - కలియుగమునందు, వావ - నిశ్చయముగా, దేవమాయావిమోహితాః - ఈశ్వరుని మాయచే వ్యామోహితులైనట్టియు, స్వవిధినియోగశౌచచారిత్రవిహీనాః - స్వధర్మమును బోధించే శాస్త్రముయొక్క ఆదేశము (తాము కల్పించుకున్న గాస్త్రముయొక్క ఆదేశముచే) శౌచము మరియు సచ్ఛీలము లేని, మనుజ -అపసదాః - మానవాధములు, దేవహేలనాని - దేవతలను అవమానించే, అస్నాన-అనాచమన-అశౌచకేశ-ఉల్లుంచన-ఆదీని - స్నానమును చేయకుండుట ఆచమనమును చేయకుండుట పరిశుద్ధముగా లేకుండుట జుట్టును పెరికివేయుట మొదలగు, అపవ్రతాని - పాఖండ (వేదదూషకములైన) వ్రతములను, నిజనిజ-ఇచ్ఛయా - తమ తమ స్వేచ్ఛచే, గృహ్ణానాః - స్వీకరించువారై, అధర్మబహులేన - అధర్మము అధికముగానుండే, కలినా - కలియుగముచే, ఉపహతధియః - తిరస్కరించబడిన వివేకము గలవారై, ప్రాయేణ - తరుచుగా, బ్రహ్మబ్రాహ్మణయజ్ఞపురుషలోకవిదూషకాః - వేదములను బ్రాహ్మణులను యజ్ఞేశ్వరుడగు శ్రీహరిని భగవద్భక్తులను నిందించువారుగా, భవిష్యంతి - కాగలరు.

ఈ పాఖండమతముయొక్క ప్రభావముచే కలియుగమునందు కొందరు మానవాధములు నిశ్చయముగా ఈశ్వరమాయచే వ్యామోహితులై యుందురు. వారు స్వధర్మమును విధించే వేదముల ఆదేశములను, బాహ్య-ఆంతరశౌచము (పవిత్రత) లను విడిచిపెట్టి, స్వకపోలకల్పితమగు గ్రంథములలోని విధులనే ఆచరిస్తూ, సచ్ఛీలమును కోల్పోయి ఉందురు. వారు తమకు నచ్చిన విధముగా, దేవతలను హేళన చేసే పాఖండవ్రతములను చేస్తూ, స్నానము ఆచమనము పరిశుద్ధతలను విడిచిపెట్టి, జుట్టు పెరుకుకొనుట మొదలగు పనులను చేసెదరు. కలియుగములో అధర్మము

అధికముగా నుండును. దాని ప్రభావముచే వారు నశించిన వివేకము గల వారై, వేదములను బ్రాహ్మణులను యజ్ఞేశ్వరుడగు శ్రీహరిని భగవద్భక్తులను తరుచుగా దూషించెదరు.

తే చ హ్యార్వాక్తనయా నిజలోకయాత్రయాఽంధపరంపర
యాఽఽశ్వస్తాస్తమస్యంధే స్వయమేవ ప్రపతిష్యంతి ॥ 11

తే చ - వారు, అర్వాక్తనయా - నవీనమైన, నిజలోకయాత్రయా - తమ ఇచ్చవచ్చిన లోకవ్యవహారము (దేహయాత్ర) చే, అంధపరంపరయా - అజ్ఞానుల పరంపరచే, ఆశ్వస్తాః - విశ్వాసము గలవారై, అంధే - చూపు లేకుండా చేసే, తమసి - చీకటియందు, స్వయం ఏవ - తమంత తాముగా, ప్రపతిష్యంతి హి - పడిపోగలరు.

వారు ఈ నవీనమైన పాఖండమార్గమును విశ్వసించి, తమ ఇచ్చవచ్చిన రీతిలో వ్యవహరిస్తూ, దేహయాత్రను నిర్వర్తించెదరు. వీరి పరంపరలో ఒక అజ్ఞాని తన అజ్ఞానమును మరియొకనికి అందజేయుచుండును. దీనిచే వారు తమంత తాముగా ఘోరమగు నరకములో పడిపోయెదరు. (అజ్ఞానమనే ఈ నరకములో వివేకమునకు అవకాశమే లేదు).

అయమవతారో రజసోపప్లుతకైవల్యోపశిక్షణార్థః । తస్యానుగు
ణాన్ శ్లోకాన్ గాయంతి ॥ 12

అయమ్ - ఈ, అవతారః - అవతారము, రజసా - రజోగుణముచే, ఉపప్లుతకైవల్య-ఉపశిక్షణ-అర్థః - వ్యాపించబడి యున్నవారలకు మోక్షమునకు శిక్షణనిచ్చుటయే ప్రయోజనముగా గలది, తస్య - దానికి, అనుగుణాన్ - అనురూపములైన, శ్లోకాన్ - శ్లోకములను, గాయంతి - గానము చేసెదరు.

రజోగుణముచే నిండిన మనస్సు గల మానవులకు మోక్షమార్గమునందు శిక్షణనిచ్చుటయే ఈ అవతారమునకు ప్రయోజనము. ఆ ప్రయోజనమునకు తగిన శ్లోకములను జనులు ఈ విధముగా గానము చేసెదరు.

అహో భువస్సప్తసముద్రవత్యా
ద్వీపేషు వర్షేష్వధిపుణ్యమేతత్ ।
గాయంతి యత్రత్యజనా మురారేః
కర్మాణి భద్రాణ్యవతారవంతి ॥ 13

అహో - ఆశ్చర్యము!, సప్తసముద్రవత్యాః - ఏడు సముద్రములతో కూడియున్న, భువః - భూమియొక్క, ద్వీపేషు - ఖండములయందు, వర్షేషు - దేశములయందు, ఏతత్ - ఈ భారతదేశము, అధిపుణ్యమ్ - అధికమగు పుణ్యము గలది, యత్రత్యజనాః - ఎక్కడనుండే జనులు, ముర-అరేః - శ్రీహరియొక్క, అవతారవంతి - అవతారములు గలిగినట్టియు, భద్రాణి - మంగళకరములగు, కర్మాణి - లీలలను, గాయంతి - గానము చేయుచున్నారో.

ఆశ్చర్యము! ఏడు సముద్రములతో చుట్టువారబడియున్న ఈ భూమండలములోని ఖండములు మరియు దేశములు అన్నింటిలో భారత దేశము చాల పవిత్రమైనది. ఏలయనగా, ముర అనే రాక్షసుని సంహరించిన శ్రీహరియొక్క అవతారములను, ఆయా అవతారములయొక్క మంగళకరములగు లీలలను అక్కడి జనులు గానము చేయుచుందురు.

అహో ను వంశో యశసాఽవదాతః
పైయవ్రతో యత్ర పుమాన్ పురాణః ।
కృతావతారః పురుషస్స ఆద్యః
చచార ధర్మం యదకర్మహేతుమ్ ॥ 14

అహో - ఆశ్చర్యము!, పైయవ్రతః - ప్రియవ్రతునకు సంబంధించిన, వంశః - వంశము, యశసా - కీర్తితో, అవదాతః ను - శుద్ధమైనది గదా!, యత్ - ఏలయనగా, యత్ర - దేనియందైతే, పురుషః - సర్వాంతర్యామి (మనుష్యరూపము గలవాడు), ఆద్యః - సర్వకారణుడు అగు, సః - ఆ, పురాణః పుమాన్ - పురాణపురుషుడగు శ్రీహరి, కృత-అవతారః - చేయబడిన అవతారము గలవాడై, అకర్మహేతుమ్ - కర్మ(సం) బంధము

లేని మోక్షమునకు కారణమగు, ధర్మమ్ - ధర్మమును, చచార - ఆచరించె నో.

ఆశ్చర్యము! ప్రియవ్రతుని వంశము పవిత్రమైనది, గొప్ప కీర్తి గల ది. ఏలయనగా, సర్వాంతర్యామి, సర్వకారణుడు, పురాణపురుషుడు అగు శ్రీహరి మనుష్యరూపముతో ఆ వంశమునందు అవతరించి, మోక్షమునకు దారి తీసే ధర్మము నాచరించెను. మోక్షస్వరూపమగు ఆత్మయందు కర్మ సంబంధము ఉండదు.

కో న్వస్య కాష్ఠామపరోఽనుగచ్ఛేత్
మనోరథేనాప్యభవస్య యోగీ ।
యో యోగమాయాః స్పృహయత్యుదస్తా
హ్యసత్తయా యేన కృతప్రయత్నాః ॥ 15

అభవస్య - సంసారమునకు అతీతుడైన, అస్య - ఈ ఋషభదేవు ని, కాష్ఠామ్ - మార్గమును, అపరః - మరియొక, యోగీ - యోగి, కః ను - ఎవ్వాడు, మనోరథేన అపి - ఊహచేతనైననూ, గచ్ఛేత్ - పొందును?, యః - ఏ యోగి, యోగమాయాః - యోగసిద్ధులను, స్పృహయతి - కోరునో, హి - ఏలయనగా, యేన - ఏ ఋషభునిచే, కృతప్రయత్నాః - చేయబడిన ప్రయత్నము గల ఆ సిద్ధులు, అసత్తయా - మిథ్య యగుటచే, ఉదస్తాః - నిరాకరించబడినవో.

ఋషభదేవుడు సంసారమునకు అతీతుడు. ఆయన అనుసరించిన మార్గమును మరియొక యోగి ఎవ్వడైననూ ఊహచేనైననూ అనుసరించ గల్గునా? ఏలయనగా, సామాన్యముగా యోగులు యోగసిద్ధులను కోరు చుందురు. కాని, ఋషభదేవుడు తమను స్వీకరించవలెనని ఆ సిద్ధులు ప్రయత్నించినా, మిథ్యాభూతములగుటచే వాటిని ఆయన నిరాకరించెను.

ఇతి హ స్మ సకలవేదలోకదేవబ్రాహ్మణగవాం పరమగురోర్భ గవత ఋషభాఖ్యస్య విశుద్ధాచరితమీరితం పుంసాం సమస్త దుశ్చరితాభిహరణం పరమమహామంగలాయనమిదమను శ్ర

ద్ధయోపచితయాऽనుశృణోత్యాశ్రావయతి వాऽవహితో భగవతి తస్మిన్వాసుదేవ ఏకాంతతో భక్తిరనయోరపి సమనువర్తతే ॥ 16

ఇతి హ స్మ - ఈ విధముగా, సకలవేదలోకదేవబ్రాహ్మణగవామ్ - అన్ని వేదములు లోకములు దేవతలు బ్రాహ్మణులు మరియు గోవులకు, పరమగురోః - పరమగురువు అయిన, ఋషభ-ఆఖ్యస్య - ఋషభుడనే పేరు గల, భగవతః - భగవానుని, విశుద్ధ-ఆచరితమ్ - పరమపవిత్రమగు ఆచరణము, ఈరితమ్ - చెప్పబడినది, పుంసామ్ - మానవులకు, సమస్త దుశ్చరిత-అభిహరణమ్ - అన్ని పాపములను పోగొట్టునది, పరమమహా మంగల-అయనమ్ - మిక్కిలి దుర్లభమగు గొప్ప కల్యాణములకు నిధానము, ఇదమ్ - దీనిని, అవహితః - ఏకాగ్రచిత్తము గలవాడు, ఉపచితయా - వర్ధిల్లజేయబడిన, శ్రద్ధయా - శ్రద్ధతో, అను - నిరంతరము, అనుశృణోతి - ప్రవచనముగా వినును, వా - లేదా, ఆశ్రావయతి - వినిపించును, అనయోః అపి - వీరిద్దరికి కూడ, తస్మిన్ - ఆ, వాసుదేవే భగవతి - వాసుదేవ భగవానునియందు, ఏకాంతతః - ఫలతృష్ణ లేని, భక్తిః - భక్తి, సమనువర్తతే - కలుగును.

అన్ని వేదములను, లోకములను, దేవతలను, బ్రాహ్మణులను, గోవులను ఋషభదేవుడు రక్షించెను. ఆయన పరమగురువు. ఆయన యొక్క పావనమగు చరితమును నేను చెప్పితిని. ఇది మానవుల సకలపాపములను పోగొట్టును. మిక్కిలి దుర్లభమగు గొప్ప కల్యాణములకు ఈ చరితము నిధానము. సాధకుడు దీనిని ఏకాగ్రమగు చిత్తముతో ప్రతిదినము ప్రవచనము చేయవలెను. లేదా, అట్టి ప్రవచనమును వినవలెను. అట్లు ప్రవచనము చేయువాడు, మరియు వినువాడు అనే ఇద్దరికి కూడ ఆ వాసుదేవ భగవానునియందు ఏకాంతమగు (ఫలాభిసంధి లేని) భక్తి కుదురును.

యస్యామేవ కవయ ఆత్మానమవిరతం వివిధవృజినసంసారపరితాపోపతప్యమానమనుసవనం స్నాపయంతస్తయైవ పరయా నిర్వృత్యా హ్యపవర్గమాత్యంతికం పరమపురుషార్థ

మపి స్వయమాసాదితం నో ఏవాద్రియంతే భగవదీయత్వేనైవ
పరిసమాప్తసర్వార్థాః ॥ 17

యస్యాం ఏవ - ఏ భక్తియందు మాత్రమే, కవయః - జ్ఞానులు, అవిరతమ్ - నిరంతరముగా, అనుసవనమ్ - ప్రతిదినము, వివిధవృజినసంసారపరితాప-ఉపతప్యమానమ్ - అనేకములైన దుఃఖములు గల సంసారముయొక్క సర్వతోముఖమగు తాపముచే అధికముగా తపింపజేయబడుచున్న, ఆత్మానమ్ - మనస్సును, స్నాపయంతః - స్నానమును చేయించుచున్నవారై, తయా - ఆ, పరయా - సర్వాతిశాయియగు, నిర్వృత్యా ఏవ - ఆనందముతో మాత్రమే, భగవదీయత్వేన ఏవ - భగవంతునకు చెంది యుండుటచే మాత్రమే, పరిసమాప్తసర్వ-అర్థాః - పరిపూర్ణములైన అన్ని పురుషార్థములు (మనోరథములు) గలవారై, స్వయమ్ - తనంత తానుగా, ఆసాదితమ్ - సంప్రాప్తమైన, పరమపురుష-అర్థమ్ - సర్వోత్కృష్టమగు పురుషార్థమైన, ఆత్యంతికమ్ - వినాశము లేని, అపవర్గం అపి - మోక్షమును కూడ, నో ఏవ ఆద్రియంతే హి - ఆదరించుటనే లేదు.

జ్ఞానులు ప్రతిదినము నిరంతరముగా తమ అంతఃకరణమును ఆ భక్తియందు మాత్రమే స్నానము చేయించెదరు. అనేకదుఃఖములతో నిండియున్న జన్మమరణప్రవాహరూపమగు సంసారముయొక్క అధికమగు తాపము వారికి ఆ విధముగా ఉపశమించును. ఆ భక్తిచే వారికి పరమానందము కలుగును. మేము భగవద్భక్తులము అనే భావన చేతనే వారికి పురుషార్థములు (మనోరథములు) అన్నియు పరిపూర్ణములగును. వినాశము లేనిది, పరమపురుషార్థము అగు మోక్షము తనంత తానుగా వచ్చినా, వారు దానియందు ఆదరమును చూపనే చూపరు.

రాజన్ పతిర్గురురలం భవతాం యదూనాం
దైవం ప్రియః కులపతిః క్వ చ కింకరో వః ।
అస్త్వేవమంగ భగవాన్ భజతాం ముకుందో
ముక్తిం దదాతి కర్హిచిత్ స్మ న భక్తియోగమ్ ॥ 18

అంగ - ఓయీ!, రాజన్ - రాజా!, భగవాన్ - భగవానుడు, భవతామ్ - మీకు, యదూనామ్ - యాదవులకు, అలమ్ - స్వయముగా, పతిః - పాలకుడు, గురుః - మార్గదర్శి, దైవమ్ - దైవము, ప్రియః - ప్రియమైనవాడు, కులపతిః - కులమునకు ప్రభువు, క్వ చ - కొన్ని సందర్భములయందు, వః - మీకు, కింకరః - చెప్పిన పనిని చేయువాడు, ఏవమ్ - ఇటులనే, అస్తు - అగుగాక!, ముకుందః - శ్రీహరి (మోక్షమునిచ్చువాడు), భజతామ్ - భక్తులకు, ముక్తిమ్ - మోక్షమును, దదాతి - ఇచ్చును, కర్హిచిత్ స్మ - ఏ కాలమునందైననూ, భక్తియోగమ్ - భక్తియోగమును, న - ఇచ్చుట లేదు.

ఓ రాజా! శ్రీకృష్ణ భగవానుడు మీకు, యాదవులకు స్వయముగా రక్షకుడు, మార్గదర్శి, దైవము, ప్రియుడు మరియు కులమునకు ప్రభువు. ఇంతేగాక, ఆయన కొన్ని సందర్భములలో మీరు చెప్పిన పనులను కూడ చేసి పెట్టినాడు. ఇదే విధముగా ఆయన ఇతరభక్తులకు కూడ చేయవచ్చును. మోక్షప్రదాతయగు ఆ భగవానుడు భక్తులకు మోక్షమును కూడ ఇచ్చును. కాని, ఏ కాలమునందైననూ భక్తియోగమును సరళముగా నీయడు.

నిత్యానుభూతనిజలాభనివృత్తతృష్ణః
శ్రేయస్యతద్రచనయా చిరసుప్తబుద్ధేః ।
లోకస్య యః కరుణయాభయమాత్మలోక-
మాఖ్యాన్నమో భగవతే ఋషభాయ తస్మై ॥ 19

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే
ఋషభదేవస్య దేహత్యాగో నామ షష్ఠోఽధ్యాయః ॥

నిత్య-అనుభూతనిజలాభనివృత్తతృష్ణః - అన్ని కాలములలో అనుభవమునకు వచ్చిన తన స్వరూపముయొక్క ఉపలబ్ధిచే తొలగిపోయిన కామనలు గల, యః - ఏ ఋషభదేవుడు, అతత్-రచనయా - అనాత్మయందలి ప్రవృత్తిచే, శ్రేయసి - శ్రేయస్సు (మోక్షము) విషయమునందు, చిరసుప్తబుద్ధేః - చిరకాలమునుండి నిద్రించిన బుద్ధిగల, లోకస్య - మానవునకు, కరుణయా - దయతో, అభయమ్ - భయమునకు తావు లేని, ఆత్మ

లోకమ్ - ఆత్మ అనే లోకమును, ఆఖ్యాత్ - ప్రకటించెనో, తస్మై - అట్టి, భగవతే ఋషభాయ - ఋషభదేవుని కొరకు, నమః - నమస్కారము.

ఋషభదేవుడు అన్ని కాలములలో ఆత్మస్వరూపమునందు నిలిచియున్నవాడగుటచే ఆయనకు కామనలు ఏవియు లేవు. కాని, దీనికి భిన్నముగా మానవుడు అనాత్మభూతములగు దేహాదులయందు ఆత్మభావముతో వ్యవహరిస్తూ, పరమహితము మరియు మోక్షరూపము అగు ఆత్మస్వరూపము విషయములో అజ్ఞానియై యున్నాడు. అట్టి మానవునకు అభయస్థానమగు ఆత్మతత్త్వమును ప్రకటించిన ఆ ఋషభదేవుని కొరకు నమస్కారము.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో
ఋషభదేవుడు అవతారమును చాలించుట అనే ఆరవ అధ్యాయము
ముగిసినది (6).

*****

# అథ సప్తమోऽధ్యాయః

## భరతుని చరితము

శ్రీశుక ఉవాచ ।
భరతస్తు మహాభాగవతో యదా భగవతావనితలపరిపాలనాయ
సంచింతితస్తదనుశాసనపరః పంచజనీం విశ్వరూపదుహితర
ముపయేమే ॥ 1

యదా - ఏ కాలమునందైతే, మహాభాగవతః - గొప్ప భగవద్భక్తు డగు, భరతః తు - భరతుడైతే, భగవతా - ఋషభదేవునిచే, సంచింతితః - సంకల్పించబడినాడో అప్పుడు, తద్-అనుశాసనపరః - ఆయన ఆదేశ మును పాలించువాడై, విశ్వరూపదుహితరమ్ - విశ్వరూపుని కుమార్తెయ గు, పంచజనీమ్ - పంచజనిని, ఉపయేమే - వివాహమాడెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- గొప్ప భగవద్భక్తుడగు భర తుడు రాజ్యము నేలవలెనని ఋషభదేవుడు సంకల్పించెను. భరతుడు ఆయన ఆదేశమును పాటించి, విశ్వరూపుని కుమార్తెయగు పంచజనిని వివాహమాడెను.

తస్యాము హ వా ఆత్మజాన్ కార్త్స్న్యేనానురూపానాత్మనః
పంచ జనయామాస భూతాదిరివ భూతసూక్ష్మాణి ॥ 2

తస్యాం హ - ఆమెయందు, ఆత్మనః - తనకు, కార్త్స్న్యేవ - పూర్తిగా, అనురూపాన్ - అనురూపులైన, పంచ - అయిదుగురు, ఆత్మ జాన్ - కుమారులను, భూత-ఆదిః - అహంకారము, భూతసూక్ష్మాణి ఇవ - సూక్ష్మభూతములను వలె, జనయామాస - కనెను.

మహత్తత్త్వమునుండి పుట్టిన అహంకారము పృథివి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము అనే అయిదు సూక్ష్మభూతములను ప్రకటించెను. అదే విధముగా, ఆ భరతుడు తన భార్యయందు తనకు తగియున్న అయిదుగురు కొడుకులను కనెను.

సుమతిం రాష్ట్రభృతం సుదర్శనమాథర్వణం ధూమ్రకేతుమితి । అజనాభం నామైతద్వర్షం భారతమితి యత ఆరభ్య వ్యపదిశంతి ।। 3

సుమతిమ్ - సుమతిని, రాష్ట్రభృతమ్ - రాష్ట్రభృతుని, సుదర్శనమ్ - సుదర్శనుని, ఆథర్వణమ్ - ఆథర్వణుని, ధూమ్రకేతుం ఇతి - ధూమ్రకేతువు అనువారిని, అజనాభమ్ - అజనాభముగా, నామ - ప్రసిద్ధిని గాంచిన, ఏతత్ - ఈ, వర్షమ్ - దేశమును, యతః - ఏ భరతునినుండి, ఆరభ్య - మొదలిడి, భారతం ఇతి - భారతదేశమని, వ్యపదిశంతి - పిలుచుచున్నారో.

సుమతి, రాష్ట్రభృతుడు, సుదర్శనుడు, ఆథర్వణుడు, ధూమ్రకేతువు అనునవి వారి పేర్లు. భరతునకు పూర్వమునందు అజనాభమని ప్రసిద్ధిని గాంచిన ఈ దేశమునకు ఆయన తరువాత ఆయన పేరుతో భారతదేశము అనే పేరు వచ్చెను.

స బహువిన్మహీపతిః పితృపితామహవదురువత్సలతయా స్వే స్వే కర్మణి వర్తమానాః ప్రజాస్స్వధర్మమనువర్తమానః పర్యపాలయత్ ।। 4

బహువిత్ - చాల తెలిసినవాడగు, సః - ఆ, మహీపతిః - మహారాజు, పితృపితామహవత్ - తండ్రి తాతలవలె, ఉరువత్సలతయా - గొప్ప ప్రేమ గలవాడగుటచే, స్వే స్వే - తమ తమ, కర్మణి - పనియందు, వర్తమానాః - నిలిచియున్న, ప్రజాః - ప్రజలను, స్వధర్మమ్ - తన ధర్మమును, అనువర్తమానః - అనుష్ఠించువాడై, పర్యపాలయత్ - పాలించెను.

గొప్ప పండితుడగు ఆ మహారాజునకు ప్రజలయందు ప్రేమ మెండు. తమ తమ పనులను చేసుకొనే ప్రజలను ఆయన తన ధర్మ మును పాలిస్తూ, తన తండ్రి తాత పాలించినట్లే, పరిపాలించెను.

ఈజే చ భగవంతం యజ్ఞక్రతురూపం క్రతుభిరుచ్చావచైశ్శ్ర
ద్ధయాఽఽహృతాగ్నిహోత్రదర్శపూర్ణమాసచాతుర్మాస్యపశుసో
మానాం ప్రకృతివికృతిభిరనుసవనం చాతుర్హోత్రవిధినా || 5

యజ్ఞక్రతురూపమ్ - యజ్ఞములు క్రతువుల రూపములోనున్న, భగవంతం చ - భగవానుని కూడ, ఆహృత-అగ్నిహోత్రదర్శపూర్ణమాసచాతుర్మాస్యపశుసోమానామ్ - చేబట్టబడిన అగ్నిహోత్రము దర్శ పూర్ణమాస చాతుర్మాస్యము పశుయాగము మరియు సోమయాగముల, ప్రకృతివికృతిభిః - ప్రకృతి వికృతి రూపములైన, ఉచ్చావచైః - చిన్న పెద్ద, క్రతుభిః - క్రతువులచే, శ్రద్ధయా - శ్రద్ధతో, అనుసవనమ్ - ఆయా కాలములయందు, చాతుర్హోత్రవిధినా - నలుగురు ఋత్విక్కులచే ఆచరించబడే విధానముతో, ఈజే - ఆరాధించెను.

యజ్ఞము (యూపము లేని వేదోక్తకర్మ), క్రతువు (యూపముతో కూడియున్న కర్మ) ల రూపములో శ్రీహరియే ఉన్నాడు. ఆ భరతుడు ఆయా కాలములలో అగ్నిహోత్రము, దర్శ, పూర్ణమాస, చాతుర్మాస్యము, పశుయాగము, సోమయాగము అనే చిన్న మరియు పెద్ద యాగములను చేబట్టి వాటిని శ్రద్ధగా చేసి, ఆ విధముగా శ్రీహరిని ఆరాధించెను. ఆయన ప్రకృతి (పూర్తి అంగములతో కూడియున్న క్రతువు) మరియు వికృతి (పూర్తి అంగములు లేని క్రతువు) అనే రెండు రకముల యాగములనాచరించెను. హోత, ఉద్గాత, అధ్వర్యుడు, బ్రహ్మ అనే నాల్గు రకముల ఋత్విక్కులు ఆయనకు ఆ యాగములలో సహకరించిరి.

సంప్రచరత్సు నానాయాగేషు విరచితాంగక్రియేష్వపూర్వం
యత్తత్క్రియాఫలం ధర్మాఖ్యం పరే బ్రహ్మణి యజ్ఞపురుషే
సర్వదేవతాలింగానాం మంత్రాణామర్థనియామకతయా సాక్షా
త్కర్తరి పరదేవతాయాం భగవతి వాసుదేవ ఏవ భావయ

మాన ఆత్మ నైపుణ్యమృదితకషాయో హవిష్ష్వధ్వర్యుభిర్గృహ్యమాణేషు స యజమానో యజ్ఞభాజో దేవాంస్తాన్ పురుషావయవేష్వభ్యధ్యాయత్ ॥ 6

విరచిత-అంగక్రియేషు - సంపాదించబడిన అంగముల క్రియలు గల, నానాయాగేషు - పలు విధముల యాగములు, సంప్రచరత్సు - చక్కగా నడుచుచుండగా, అధ్వర్యుభిః - అధ్వర్యులచే, హవిష్షు - హవిస్సులు, గృహ్యమాణేషు - స్వీకరించబడుచుండగా, సః - ఆ, యజమానః - యజ్ఞకర్తయగు భరతుడు, అపూర్వమ్ - అపూర్వమనబడే, ధర్మ-ఆఖ్యమ్ - ధర్మము అనే పేరు గల, యత్ - ఏ, క్రియాఫలమ్ - కర్మఫలము గలదో, తత్ - దానిని, యజ్ఞపురుషే - యజ్ఞేశ్వరుడైనట్టియు, పరే - సర్వాతీతమైనట్టియు, బ్రహ్మణి - దేశకాలపరిచ్ఛేదములు లేనట్టియు, సర్వదేవతాలింగానామ్ - అన్ని దేవతల లక్షణములను స్మరించే, మంత్రాణామ్ - మంత్రముల, అర్థనియామకతయా - ప్రతిపాద్యమగు దేవతలను నియమించుటచే, సాక్షాత్ - సాక్షాత్తుగా, కర్తరి - కర్తయైనట్టియు, పరదేవతాయామ్ - దేవదేవుడగు, భగవతి వాసుదేవే ఏవ - వాసుదేవ భగవానుని యందు మాత్రమే, భావయమానః - భావించుచున్నవాడై, ఆత్మనైపుణ్యమృదితకషాయః - బుద్ధియందలి కుశలతచే నశింపజేయబడిన రాగద్వేషములు గలవాడై, తాన్ - ఆ, యజ్ఞభాజః - యజ్ఞభోక్తలగు, దేవాన్ - దేవతలను, పురుష-అవయవేషు - శ్రీహరియొక్క అవయవములయందు, అభ్యధ్యాయత్ - చక్కగా ధ్యానించెను.

అధ్వర్యులు హవిస్సులను స్వీకరించి కర్మాంగములలోని హోమాదిక్రియలనాచరిస్తూ, వివిధములగు యాగములను చక్కగా నిర్వర్తించుచుండిరి. వేదోక్తమగు కర్మను చేస్తూనే, దానినుండి పుట్టే అపూర్వము అనే క్రియాఫలము పుణ్యము రూపములో నుండును. యజ్ఞమును చేయుచున్న ఆ భరతుడు అట్టి క్రియాఫలమును పరబ్రహ్మస్వరూపుడగు వాసుదేవ భగవానునకు సమర్పించుచుండెను. ఈశ్వరునకు కర్మఫలమును సమర్పించుట అనే ఈ కుశలతచే ఆయన బుద్ధియందలి రాగద్వేషాది దోషములు నశించెను. మంత్రములు వివిధదేవతల లక్షణములను స్మరింపజేయును.

ఈ విధముగా ఆయా మంత్రములు ఆయా దేవతలను ప్రతిపాదించునట్లు గా, భగవానుడే వ్యవస్థను చేసెను. కావున, యజ్ఞమునకు ప్రధానకర్త యజ్ఞే శ్వరుడగు శ్రీహరియే. భరతుడు యజ్ఞభోక్తలగు ఆయా దేవతలను దేవదే వుడగు శ్రీహరి అవయవములయందు భావన చేయుచుండెను.

ఏవం కర్మవిశుద్ధ్యా విశుద్ధసత్త్వస్యాంతర్హృదయాకాశశరీరే బ్రహ్మణి భగవతి వాసుదేవే మహాపురుషరూపోపలక్షణే శ్రీవ త్సకౌస్తుభవనమాలాऽరిదరగదాదిభిరుపలక్షితే నిజపురుషహృ ల్లిఖితేనాత్మని పురుషరూపేణ విరోచమాన ఉచ్చైస్తరాం భక్తిర నుదినమేధమానరయాऽజాయత ।। 7

ఏవమ్ - ఈ విధముగా, కర్మవిశుద్ధ్యా - కర్మల పరిశుద్ధిచే, విశుద్ధ సత్త్వస్య - పరిశుద్ధమైన అంతఃకరణము గల భరతునకు, అంతః-హృదయ -ఆకాశశరీరే - హృదయము లోపలి ఆకాశము శరీరముగా గలిగినట్టియు, బ్రహ్మణి - పరబ్రహ్మస్వరూపుడైనట్టియు, మహాపురుషరూప-ఉపలక్షణే - గొప్ప పురుషుని రూపమే ఆకారముగా గలిగినట్టియు, శ్రీవత్సకౌస్తుభవన మాలా-అరిదరగదా-ఆదిభిః - పుట్టుమచ్చ రూపములోనున్న లక్ష్మీదేవి కౌస్తుభమాణిక్యము అడవిపువ్వుల మాల చక్రము శంఖము గద మొదలగు వాటితో, ఉపలక్షితే - కూడుకొనియున్నట్టియు, నిజపురుషహృత్-లిఖితేన - తన భక్తుల హృదయమునందు వ్రాతయై యున్న, పురుషరూపేణ - పురుషోత్తముని రూపముచే, ఆత్మని - అంతఃకరణమునందు, విరోచమానే - గొప్పగా ప్రకాశించుచున్న, వాసుదేవే భగవతి - వాసుదేవ భగవానుని యందు, అనుదినమ్ - ప్రతిదినము, ఉచ్చైస్తరామ్ - చాల తీవ్రముగా, ఏధ మానరయా - వర్ధిల్లే వేగము గల, భక్తిః - భక్తి, అజాయత - కలిగెను.

ఈ విధముగా భరతుడు నిష్కామముగా కర్మలను చేయుటచే, ఆయన అంతఃకరణము పరిశుద్ధమయ్యెను. పరబ్రహ్మస్వరూపుడగు వాసు దేవ భగవానుడు ప్రాణుల హృదయము లోపలి చిదాకాశమే స్వరూప ముగా గలవాడు. ఆ పురుషోత్తముడు పుట్టుమచ్చ రూపములోనున్న లక్ష్మీ దేవిని, కౌస్తుభమాణిక్యమును, అడవిపువ్వుల మాలను, శంఖచక్రములను,

గద మొదలగువాటిని దాల్చియున్న గొప్ప పురుషాకారములో తన భక్తుల హృదయములయందు స్థిరముగా నిలిచియుండును. భరతునకు కూడ తన హృదయములో ప్రకాశించుచున్న ఆ పురుషోత్తమునియందు గొప్ప భక్తి కలిగెను. ఆ భక్తియొక్క వేగము దినదినము చాల అధికముగా పెరిగెను.

ఏవం వర్షాయుతసహస్రపర్యంతావసితకర్మనిర్వాణావస
రోఽధిభుజ్యమానం స్వతనయేభ్యో రిక్థం పితృపైతామహం
యథాదాయం విభజ్య స్వయం సకలసంపన్నికేతాత్స్వనికేతా
త్పులహాశ్రమం ప్రవవ్రాజ ॥ 8

ఏవమ్ - ఈ విధముగా, వర్ష-అయుతసహస్రపర్యంత-అవసితకర్మనిర్వాణ-అవసరః - కోటిసంవత్సరముల తరువాతి కాలమునందు నిర్ధారించబడిన కర్మఫలముయొక్క పరిసమాప్తియొక్క సమయము గల భరతుడు, అధిభుజ్యమానమ్ - సాధికారముగా భోగింపబడుచున్న, పితృపైతామహమ్ - తండ్రి తాతలకు చెందిన, రిక్థమ్ - సంపదను, యథాదాయమ్ - యథాయోగ్యముగా, స్వతనయేభ్యః - తన కుమారుల కొరకు, విభజ్య - పంచియిచ్చి, స్వయమ్ - తాను, సకలసంపత్-నికేతాత్ - అన్ని సంపదలకు నిలయమైన, స్వనికేతాత్ - తన గృహమునుండి, పులహ-ఆశ్రమమ్ - పులహుని ఆశ్రమమును గురించి, ప్రవవ్రాజ - నిర్గమించెను.

ఈ విధముగా భరతుడు కోటి సంవత్సరములు రాజ్యమును పాలిస్తూ భోగములననుభవించెను. ఈ భోగములననుభవింపజేసిన ప్రారబ్ధ కర్మఫలము పూర్తి అయ్యే సమయము వచ్చినదని ఆయన అపుడు నిర్ధారించుకొనెను. అపుడాయన తండ్రితాతలనుండి తనకు వచ్చిన ఆ సంపదను తన కొడుకులకు యథాన్యాయముగా పంచియిచ్చి, తాను సన్న్యసించెను. అన్ని సంపదలకు నిలయమైన తన గృహమునుండి నిర్గమించి, ఆయన పులహుని ఆశ్రమమునకు వెళ్లెను.

యత్ర హ వావ భగవాన్ హరిరద్యాపి తత్రత్యానాం నిజజ
నానాం వాత్సల్యేన సన్నిధాప్యత ఇచ్ఛారూపేణ ॥ 9

యత్ర హ - ఎక్కడనైతే, వావ - నిశ్చయముగా, భగవాన్ హరిః - శ్రీహరి భగవానుడు, అద్య అపి - ఈ నాటికి కూడ, తత్రత్యానామ్ - అక్క డనుండే, నిజజనానామ్ - తన భక్తజనులకు, వాత్సల్యేన - ప్రేమచే, ఇచ్ఛారూపేణ - కోరే రూపముతో, సన్నిధాప్యతే - సన్నిహితుడుగా చేయ బడుచున్నాడో.

శ్రీహరి భగవానునకు ఆ పులహాశ్రమమునందు ఉండే తన భక్తుల యెడల వాత్సల్యము మెండు. ఈ నాటికీ ఆయన వారికి తాము ఉపాసించే రూపములో దర్శనమిచ్చుచుండును.

యత్రాశ్రమపదాన్యుభయతోనాభిభిర్దృషచ్చక్రైశ్చక్రనదీ
నామ సరిత్ప్రవరా సర్వతః పవిత్రీకరోతి ॥ 10

యత్ర - ఎక్కడనైతే, చక్రనదీ - చక్రనది అనే, సరిత్-ప్రవరా - నదులలో గొప్ప నది, ఆశ్రమపదాని - ఆశ్రమస్థానములను, ఉభయతః-నా భిభిః - క్రింద పైన తూములు గల, దృషత్-చక్రైః - రాళ్లయందలి చక్ర ములచే, సర్వతః - అన్ని విధములుగా, పవిత్రీకరోతి - పవిత్రము చేయు చున్నది.

అక్కడ చక్రనది (గండకి) అనే గొప్ప నది గలదు. దానియందలి రాళ్లయందు క్రింద పైన తూములు గల చక్రముల గుర్తులు (శాలగ్రామము లు) ఉండును. వాటి వలన అక్కడి ఆశ్రమములు అన్ని విధములుగా పవి త్రములగుచుండును.

తస్మిన్ వావ కిల స ఏకలః పులహాశ్రమోపవనే వివిధకుసుమకి
సలయతులసికాంబుభిః కందమూలఫలోపహారైశ్చ సమీహ
మానో భగవత ఆరాధనం వివిక్త ఉపరతవిషయాభిలాష ఉప
భృతోపశమః పరాం నిర్వృతిమవాప ॥ 11

తస్మిన్ - ఆ, పులహ-ఆశ్రమ-ఉపవనే - పులహాశ్రమముయొక్క ఉద్యానవనమునందు, వివిక్తః - పరిశుద్ధమగు అంతఃకరణము గలవాడు, ఉపరతవిషయ-అభిలాషః - తొలగిపోయిన భోగ్యవస్తువులయందలి

కామన గలవాడు, ఉపభృత-ఉపశమః - వర్ధిల్లిన శాంతి గలవాడు అగు, సః - ఆ భరతుడు, ఏకలః - ఒంటరివైౖ, వివిధకుసుమకిసలయతులసికా-అంబుభిః - పలురకముల పుష్పములు చిగుళ్లు తులసిదళములు మరియు జలములతో, చ - మరియు, కందమూలఫల-ఉపహారైః - దుంపలు వ్రేళ్లు పళ్ల నైవేద్యములతో, భగవతః - భగవానుని, ఆరాధనం వావ - ఆరాధనమును మాత్రమే, సమీహమానః - చేయుచున్నవాడై, పరామ్ - గొప్ప, నిర్వృతిమ్ - ఆనందమును, అవాప కిల - పొందెను.

పరిశుద్ధమగు అంతఃకరణము గల ఆ భరతుని మనస్సులోని భోగ వాసనలన్నియు తొలగిపోయి శాంతి వర్ధిల్లెను. ఆయన పులహాశ్రమము యొక్క ఉద్యానవనమునందు ఒంటరిగా భగవానుని పలురకముల పుష్పములు, చిగుళ్లు, తులసి దళములతో పూజించి, నీటితో అభిషేకించెను. ఆయన భగవానునకు దుంపలను, వ్రేళ్లను, పళ్లను నైవేద్యమిడెను. ఈ విధముగా ఆయన ఈశ్వరారాధనచే పరమానందమును పొందెను.

తయేత్థమవిరతపురుషపరిచర్యయా భగవతి ప్రవర్ధమానాను రాగభరద్రుతహృదయశైథిల్యః ప్రహర్షవేగేనాత్మన్యుద్భిద్య మానరోమపులకకులక ఔత్కంఠ్యప్రవృత్తప్రణయబాష్పనిరు ద్ధావలోకనయన ఏవం నిజరమణారుణచరణారవిందానుధ్యా నపరిచితభక్తియోగేన పరిప్లుతపరమాహ్లాదగంభీరహృదయ హ్రదావగాఢధిషణస్తామపి క్రియమాణాం భగవత్సపర్యాం న సస్మార ॥ 12

ఇత్థమ్ - ఈ విధముగా, తయా - అట్టి, అవిరతపురుషపరిచర్యయా - నిరంతరమగు పురుషోత్తముని ఆరాధనచే, భగవతి - భగవానుని యందు, ప్రవర్ధమాన-అనురాగభరద్రుతహృదయశైథిల్యః - గొప్పగా వర్ధిల్లుచున్న ప్రేమయొక్క వేగముచే ద్రవించిన హృదయములోని శాంతి గలవాడు, ప్రహర్షవేగేన - ఆనందముయొక్క వేగముచే, ఆత్మని - దేహమునందు, ఉద్భిద్యమానరోమపులకకులకః - పొడుచుకు వచ్చుచున్న గగుర్పాటుల సమూహములు గలవాడు, ఔత్కంఠ్యప్రవృత్తప్రణయబాష్పనిరు

ర్ధ-అవలోకనయనః - తహతహచే బయలుదేరిన ప్రేమయొక్క కన్నీటిచే అడ్డుకొనబడిన చూపుగల కన్నులు గలవాడు అగు భరతుడు, ఏవమ్ - ఈ విధముగా, నిజరమణ-అరుణచరణ-అరవింద-అనుధ్యానపరిచితభక్తియోగేన - తనకు ప్రీతిని కలిగించే భగవానుని ఎఱ్ఱని పద్మములవంటి పాదముల నిరంతరధ్యానముచే పరిథవిల్లిన భక్తియోగముచే, పరిప్లుతపరమ-ఆహ్లాదగంభీరహృదయహ్రద-అవగాఢధిషణః - అంతటా వ్యాపించిన పరమానందముగల హృదయమనే సరస్సునందు నిమగ్నమైన బుద్ధి గలవాడై, క్రియమాణామ్ - చేయబడుచున్న, తామ్ - ఆ, భగవత్-సపర్యాం అపి - భగవానుని పూజను కూడ, న సస్మార - స్మరించలేదు.

ఈ విధముగా అట్టి పురుషోత్తముని నిరంతరమగు ఆరాధనచే భరతుని హృదయములో అనురాగము బాగా పెరిగి, దాని వేగముచే హృదయము కరిగి శాంతమాయెను. గొప్ప ఆనందముయొక్క వేగముచే ఆయన దేహమంతటా గగుర్పాట్లు పొడసూపెను. హృదయమునందలి తహతహచే ప్రేమాశ్రువులు పైకి ఉబికి కన్నుల చూపునకు ఆటంకము కలిగెను. ఈ విధముగా తన హృదయమునకు ప్రీతిని కలిగించే భగవానుని ఎఱ్ఱని పాదపద్మములను నిరంతరముగా ఆయన ధ్యానించగా, ఆ భక్తియొక్క అభ్యాసము పరిథవిల్లి, ఆయన హృదయమనే లోతైన సరస్సు అంతటా పరమానందముచే వ్యాప్తమయ్యెను. అట్టి హృదయమునందు నిమగ్నమైన బుద్ధిగల ఆ భరతుడు తాను చేయుచున్న ఈశ్వరపూజను కూడ మరిచి యుండెను.

ఇత్థం ధృతభగవద్వ్రత ఐణేయాజినవాససానుసవనాభిషేకా
ర్ద్రకపిశకుటిలజటాకలాపేన చ విరోచమానస్సూర్యర్చా భగ
వంతం హిరణ్మయం పురుషముజ్జిహానే సూర్యమండ
లేఽభ్యుపతిష్ఠన్నేతదు హోవాచ ।। 13

ఇత్థమ్ - ఈ విధముగా, ధృతభగవత్-వ్రతః - చేపట్టబడిన ఈశ్వరుని వ్రతములు గల ఆ భరతుడు, ఐణేయ-అజినవాససా - లేడి చర్మమనే వస్త్రముతో, అనుసవన-అభిషేక-అర్ద్రకపిశకుటిలజటాకలాపేన - మూడు పూటల స్నానముచే తడిసియున్న బూడిదరంగు గల గిరజాల జుట్టు

యొక్క సమూహముతో, విరోచమానః - ప్రకాశించుచున్నవాడై, సూర్య-ఋచా - సూర్యమంత్రముతో, హిరణ్మయమ్ - తేజోమయుడైనట్టియు, పురుషమ్ - పూర్ణుడగు, భగవంతమ్ - భగవానుని, ఉజ్జిహానే - ఉదయించుచున్న, సూర్యమండలే - సూర్యమండలమునందు, అభి-ఉపతిష్ఠన్ - అభిముఖముగా నిలబడి స్తుతించుచున్నవాడై, ఏతత్ ఉ - ఈ వాక్యమును, ఉవాచ హ - పలికెను.

ఈ విధముగా భరతుడు ఈశ్వరవ్రతములను చేబట్టి, లేడిచర్మమునే వస్త్రముగా దాల్చి ప్రకాశించెను. మూడు పూటల స్నానముచే ఆయన దట్టని జుట్టు తడిసి బూడిదరంగు కలిగి గిరజాలు తిరిగియుండెను. ఆయన ఉదయించుచున్న సూర్యునకు ఎదుట నిలిచి సూర్యమండలమునందు తేజోమయుడు మరియు పూర్ణుడు అగు భగవానుని సూర్యమంత్రముతో స్తుతిస్తూ, ఈ వాక్యమును పలికెను.

పరోరజస్సవితుర్జాతవేదో
దేవస్య భర్గో మనసేదం జజాన ।
సురేతసాఽదః పునరావిశ్య చష్టే
హంసం గృధ్రాణం నృషద్రింగిరామిమః ॥ 14

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే
భరతోపాఖ్యానే సప్తమోఽధ్యాయః ॥

దేవస్య - ప్రకాశస్వరూపుడగు, సవితుః - సూర్యుని, భర్గః - తేజస్సు, పరః-రజః - ప్రకృతికి అతీతమైనది, జాతవేదః - పుట్టిన కర్మఫలరూపమగు సంపద గలది, మనసా - సంకల్పముచే, ఇదమ్ - ఈ జగత్తును, జజాన - సృష్టించెను, అదః - ఈ జగత్తును, సురేతసా - చైతన్యశక్తిచే, పునః - మరల, ఆవిశ్య- ఆవేశించి, గృధ్రాణమ్ - సుఖమును కోరుచున్న, హంసమ్ - జీవుని, చష్టే - దర్శించుచున్నాడు, నృషత్-రింగిరామ్ - ప్రాణులయందుండే ఇంద్రియములను ప్రవర్తిల్లజేసే శక్తిని, ఇమః - శరణు వేడుచున్నాము.

చైతన్యప్రకాశమే స్వరూపముగా గల సర్వజగత్కారణుడగు పరబ్రహ్మ (సూర్యదేవుడు) యొక్క స్వరూపభూతమగు చిచ్ఛక్తి ప్రకృతికి అతీతమైనది. కర్మఫలములనొసంగే ఆ చిచ్ఛక్తిస్వరూపుడగు పరబ్రహ్మయే సంకల్పమాత్రముచే ఈ జగత్తును సృష్టించి, మరల దానియందు ఆవేశించి, ఇంద్రియభోగములను కోరే జీవుని సాక్షిరూపుడై దర్శించుచున్నాడు. ప్రాణులయందలి ఇంద్రియశక్తులను ప్రవర్తిల్ల జేసే భగవానుని ఆ చిచ్ఛక్తిని మేము శరణు వేడుచున్నాము.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో భరతుని ఉపాఖ్యానము అనే ఏడవ అధ్యాయము ముగిసినది (7).

*****

# అథ అష్టమోऽధ్యాయః

## భరతుడు మృగమై జన్మించుట

శ్రీశుక ఉవాచ ।
ఏకదా తు మహానద్యాం కృతాభిషేకనైయమికావశ్యకో బ్రహ్మ
క్షరమభిగృణానో ముహూర్తత్రయముదకాంత ఉపవివేశ ।। 1

ఏకదా తు - ఒకనాడైతే, మహానద్యామ్ - ఆ గొప్ప నదియందు, కృత-అభిషేకనైయమిక-ఆవశ్యకః - చేయబడిన స్నానము మరియు నియమముగా ప్రాప్తించిన అవశ్యము చేయదగిన సంధ్యావందనాది కర్మ గల భరతుడు, అక్షరం బ్రహ్మ - ఓంకారమును, అభిగృణానః - జపించుచున్నవాడై, ముహూర్తత్రయమ్ - మూడు ముహూర్తముల కాలము, ఉదక-అంతే - నదీతీరమునందు, ఉపవివేశ - కూర్చుండెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఒకనాడు భరతుడు ఆ గండకీ నదియందు స్నానమును చేసి, ప్రతిదినము తప్పక చేయదగిన సంధ్యావందనాది నిత్యకర్మను పూర్తి చేసుకొనెను. అపుడాయన నది ఒడ్డున సుమారు రెండు గంటల కాలము ఓంకారమును జపిస్తూ కూర్చుండెను.

తత్ర తదా రాజన్ హరిణీ పిపాసయా జలాశయాభ్యాశమేకైవో
పజగామ ।। 2

రాజన్ - ఓ పరీక్షిన్మహారాజా!, తత్ర - అచట, తదా - అప్పుడు, హరిణీ - లేడి, ఏకా ఏవ - ఒంటరిగనే, పిపాసయా - దాహముతో, జల-ఆశయ-అభ్యాశమ్ - నదియొక్క సమీపమును, ఉపజగామ - వచ్చెను.

ఓ పరీక్షిన్మహారాజా! అపుడచట ఒక లేడి దప్పికతో ఒంటరిగా నది దగ్గరకు వచ్చెను.

తయా పేపీయమాన ఉదకే తావదేవావిదూరేణ నదతో మృగ
పతేరున్నాదో లోకభయంకర ఉదపతత్ ।। 3

తయా - దానిచే, ఉదకే - నీరు, పేపీయమానే - మిక్కిలి ఆస క్తితో త్రాగబడుచుండగా, తావత్ ఏవ - అంతలోనే, అవిదూరేణ - దగ్గరలో నే, నదతః - నాదము చేయుచున్న, మృగపతేః - సింహముయొక్క, లోక భయంకరః - జనులకు భయమును గొల్పే, ఉత్-నాదః - పెద్ద నాదము, ఉదపతత్ - బయల్వెడలెను.

ఆ లేడి చాల ఆసక్తితో నీటిని త్రాగుచుండగనే, ఇంతలో దగ్గరలోనే సింహము జనులకు భయమును గొల్పే పెద్ద నాదమును చేసెను. ఆ నాదము అంతటా ప్రతిధ్వనించెను.

తముపశ్రుత్య సా మృగవధూః ప్రకృతివిక్లబా చకితనిరీక్షణా
సుతరామపి హరిభయాభినివేశవ్యగ్రహృదయా పారిప్లవదృష్టి
రగతతృషా భయాత్ సహసైవోచ్చక్రామ ।। 4

ప్రకృతివిక్లబా - సహజముగనే కలవరపాటు గలది, చకితనిరీక్షణా - బెదిరే కన్నులు గలది అగు, సా - ఆ, మృగవధూః - ఆడు లేడి, తమ్ - ఆ నాదమును, ఉపశ్రుత్య - దగ్గరలో విని, సుతరామ్ - మిక్కిలి, హరిభ య-అభినివేశవ్యగ్రహృదయా - సింహము వలని భయముతో నిండి వ్యాకులమైన హృదయము గలదై, పారిప్లవదృష్టిః - ఇటునటు తిరుగాడు చున్న చూపులు గలదియై, అగతతృషా అపి - తీరని దాహము గలదియే అయిననూ, భయాత్ - భయము వలన, సహసా ఏవ - ఒక్క ఉదుటున, ఉచ్చక్రామ - ఎగిరి గెంతు వేసెను.

లేడికి సహజముగనే కలవరపాటు ఎక్కువ. బెదిరే కన్నులు గల ఆ ఆడు లేడి హృదయము సింహము వలని భయముతో నిండి వ్యాకులమ య్యెను. దానికి ఇంకా దాహము తీరనేలేదు. అయిననూ, అది భయముతో ఇటునటు కంగారుగా చూస్తూ, ఒక్క ఉదుటున ఎగిరి గెంతు వేసెను.

**తస్యా ఉత్పతంత్యా అంతర్వత్న్యా ఉరుభయావగలితో**
**యోనినిర్గతో గర్భస్స్రోతసి నిపపాత ॥ 5**

**ఉత్**-పతంత్యాః - పైకి ఎగిరినట్టియు, **అంతర్వత్న్యాః** - గర్భిణి యైన, **తస్యాః** - ఆ ఆడులేడియొక్క, ఉరుభయ-అవగలితః - పెద్ద భయముచే జారిపోయిన, యోనినిర్గతః - జననేంద్రియమునుండి బయల్వెడలిన, గర్భః - గర్భము, స్రోతసి - ప్రవాహమునందు, నిపపాత - పడెను.

ఆ లేడి గర్భిణి. అతిశయించిన భయముతో అది పైకి ఎగరగానే, దాని గర్భము జారి, బయటకు వచ్చి, నదీప్రవాహములో పడెను.

**తత్ప్రసవోత్సర్పణభయఖేదాతురా స్వగణేన వియుజ్యమానా**
**కస్యాంచిద్దర్యాం కృష్ణసారసతీ నిపపాతాథ చ మమార ॥ 6**

**తత్**-ప్రసవ-ఉత్సర్పణభయఖేద-ఆతురా - ఆ ప్రసవము పైకి ఎగురుట భయములచే కలిగిన దుఃఖముచే పీడించబడినది, స్వగణేన - తన గుంపుతో, వియుజ్యమానా - వియోగమును పొందినది అగు, కృష్ణసారసతీ - ఆడు లేడి, కస్యాంచిత్ - ఒకానొక, దర్యామ్ - పర్వతగుహయందు, నిపపాత - పడెను, అథ చ - తరువాత, మమార - మరణించెను.

ఆ విధముగా పైకి ఎగురుట వలన ప్రసవము అగుటచే భయపడియున్న ఆ ఆడులేడికి చాల ఖేదము కలిగెను. అప్పటికే తన గుంపునుండి విడిపోయిన ఆ లేడి ఒక పర్వతగుహలో నేలగూలి మరణించెను.

**తం త్వేణకుణకం కృపణం స్రోతసాఽనూహ్యమానమభివీక్ష్యాపవిద్ధం బంధురివానుకంపయా రాజర్షిర్భరత ఆదాయ మృతమాతరమిత్యాశ్రమపదమనయత్ ॥ 7**

స్రోతసా - ప్రవాహముచే, అనూహ్యమానమ్ - ముందుకు కొనిపోబడుచున్నట్టియు, అపవిద్ధమ్ - తన గుంపునకు దూరమైనట్టియు, కృపణమ్ - దీనముగానున్న, తమ్ - ఆ, ఏణకుణకం తు - లేడి పిల్లనైతే, అభివీక్ష్య - దగ్గరగా చూచి, రాజ-ఋషిః - రాజర్షియగు, భరతః - భరతుడు, బంధుః ఇవ - బంధువు వలె, అనుకంపయా - దయతో, మృతమాతరం

ఇతి - మరణించిన తల్లి గలది అనే కారణముచే, ఆదాయ - తీసుకొని, ఆశ్రమపదమ్ - ఆశ్రమస్థానమును గురించి, అనయత్ - తీసుకువెళ్లెను.

ఆ లేడిపిల్ల తల్లి మరణించగా గుంపుకు దూరమై దీనముగా నదీ ప్రవాహములో కొట్టుకొని పోతూ ఉండగా, రాజర్షియగు భరతుడు దానిని చూచెను. ఆయనకు దానిపై జాలి కలిగెను. ఆయన దానిని ఆత్మబంధువు వలె చేతిలోకి తీసుకొని, తన ఆశ్రమమునకు గొనిపోయెను.

> తస్య హ వా ఏణకుణక ఉచ్చైరేతస్మిన్ కృతనిజాభిమానస్యా
> హరహస్తత్పోషణపాలనలాలనప్రీణనానుధ్యానేనాత్మనియమా
> స్సహయమాః పురుషపరిచర్యాదయ ఏకైకశః కతిపయేనాహ
> ర్గణేన వియుజ్యమానాః కిల సర్వ ఏవోదవసన్ ॥ 8

ఏతస్మిన్ - ఈ, ఏణకుణకే - లేడిపిల్లయందు, వై - నిశ్చయముగా, ఉచ్చైః - అధికముగా, కృతనిజ-అభిమానస్య - చేయబడిన తనది అనే అభిమానము గల, తస్య - ఆ భరతునకు, అహః-అహః - ప్రతి దినము, తత్-పోషణపాలనలాలనప్రీణన-అనుధ్యానేన - దానిని పోషించుట రక్షించుట లాలించుట ప్రీతిని కలిగించుట అనువాటి నిరంతరమగు చింతనచే, సహయమాః - యమములతో గూడినట్టియు, పురుషపరిచర్యా-ఆదయః - ఈశ్వరపూజ మొదలగు, ఆత్మనియమాః - తన నియమములు, సర్వే ఏవ - అన్నీ కూడ, ఏక-ఏకశః - ఒక్కొక్కటిగా, కతిపయేన - కొన్ని, అహర్గణేన - రోజుల సముదాయముచే, ఉదవసన్ కిల - దూరమయ్యెను.

ఈ లేడిపిల్లపై ఆ భరతునకు, ఇది నాది అనే అతిశయించిన అభిమానము దృఢముగా ఏర్పడెను. ఆయనకు ప్రతి దినము దానికి ఆహారమును సమగూర్చుట, క్రూరమృగములనుండి రక్షణను కల్పించుట, దానిని లాలించుట, దానికి ప్రీతిని కలిగించుట అనే పనుల చింతయే ఉండెడిది. దానివలన, ఆయనలో అహింస మొదలగు యమములు, శౌచము మొదలగు నియమములు, ఈశ్వరపూజ మొదలగు నిత్యకర్మలు క్రమముగా ఒక్కటొక్కటిగా దూరము కాజొచ్చెను. కొన్ని రోజులు గడచునాటికి అవి అన్నీ కూడ ఆయనలో లుప్తమయ్యెను.

అహో బతాయం హరిణకుణకః కృపణ ఈశ్వరరథచరణపరిభ్ర
మణరయేణ స్వగణసుహృద్బంధుభ్యః పరివర్జితశ్శరణం చ
మోపసాదితో మామేవ మాతాపితరౌ భ్రాతృజ్ఞాతీన్ యౌథికాం
శ్చైవోపేయాయ నాన్యం కంచన వేద మయ్యతివిస్రబ్ధశ్చాత
ఏవ మయా మత్పరాయణస్య పోషణపాలనప్రీణనలాలనమ
నసూయునానుష్ఠేయం శరణ్యోపేక్షాదోషవిదుషా ॥ 9

అహో - ఆశ్చర్యము!, బత - అయ్యో!, కృపణః - దీనమైన, అయమ్ - ఈ, హరిణకుణకః - లేడి పిల్ల, ఈశ్వరరథచరణపరిభ్రమణర యేణ - కాలచక్రముయొక్క గిరగిర తిరిగే వేగముచే, స్వగణసుహృత్-బం ధుభ్యః - తన గుంపులోని మిత్రులనుండి బంధువులనుండి, పరివర్జితః - విడిపించబడినదై, మా చ - నన్ను, శరణమ్ - ఆశ్రయముగా, ఉపసాదితః - పొందించబడినదై, మాం ఏవ - నన్నే, మాతాపితరౌ - తల్లిదండ్రులను గా, భ్రాతృజ్ఞాతీన్ - సోదరులనుగా బంధువులనుగా, యౌథికాన్ చ - గుంపులోని వారినిగా, ఏవ - నిశ్చయముగా, ఉపేయాయ - పొందినది, అన్యమ్ - మరియొకనిని, కంచన - ఎవరినైననూ, న వేద - తెలియకున్న ది, చ - మరియు, మయి - నాయందు, అతివిస్రబ్ధః - మిక్కిలి విశ్వాసము గలది, అతః ఏవ - ఇందువలననే, శరణ్య-ఉపేక్షాదోషవిదుషా - శరణు పొందినవారిని ఉపేక్షించుటలోని దోషమునెరింగినట్టియు, అనసూయునా - దోషదృష్టిని చేయని, మయా - నాచే, మత్-పరాయణస్య - నన్ను శరణు వేడిన దీనియొక్క, పోషణపాలనప్రీణనలాలనమ్ - పోషించుట రక్షించుట ప్రీతిని కలిగించుట లాలించుట, అనుష్ఠేయమ్ - చేయదగినది.

ఆశ్చర్యము! అయ్యో! వేగముగా పరిభ్రమించే కాలచక్రము దీన మగు ఈ లేడిపిల్లను తన గుంపులోని మిత్రులనుండి, బంధువులనుండి విడదీసి, నా వద్దకు చేర్చినది. ఇది నన్నే శరణుగా పొంది, నన్నే తల్లిదండ్రు లుగా, సోదరులుగా, బంధువులుగా, తన గుంపులోనివారుగా భావించుచు న్నది. దీనికి నేను తప్ప మరియొకరు తెలియరు. పైగా, దీనికి నాపై విశ్వా సము మెండు. కావుననే, నన్ను శరణు పొందిన దీనిని పెంచుటలోని ఇబ్బందులను సరకు చేయకుండా, నేను దీనిని పోషించి రక్షించి లాలించి,

ప్రీతిని కలిగించవలెను. శరణు జొచ్చినవారిని ఉపేక్షించుట తప్పు అని నాకు తెలియును. కావున, ఇది నా కర్తవ్యము.

నూనం హ్యార్యాస్సాధవ ఉపశమశీలాః కృపణసుహృద ఏవం
విధార్థే స్వార్థానపి గురుతరానుపేక్షంతే ॥ 10

హి - ఏలయనగా, ఆర్యాః - శిష్టులు, ఉపశమశీలాః - శాంతస్వభావులు, కృపణసుహృదః - దీనులకు ఉపకారమును చేయువారు అగు, సాధవః - సాధుపురుషులు, ఏవంవిధ-అర్థే - ఇట్టి సందర్భమునందు, గురుతరాన్ - మిక్కిలి ప్రముఖములైన, స్వ-అర్థాన్ అపి - స్వంత ప్రయోజనములను కూడ, ఉపేక్షంతే - ఉపేక్షించెదరు, నూనమ్ - నిశ్చయము.

ఏలయనగా, శిష్టాచారసంపన్నులగు సాధుపురుషులు శాంతస్వభావులై దీనులకు ఉపకారము చేయుదురు. వారు ఇట్టి పరోపకార సందర్భములో మిక్కిలి విలువైన స్వంత ప్రయోజనములను కూడ ప్రక్కన బెట్టెదరు. ఇది నిశ్చయము.

ఇతి కృతానుషంగ ఆసనశయనాటనస్థానాశనాదిషు సహ
మృగజహునా స్నేహానుబద్ధహృదయ ఆసీత్ ॥ 11

ఇతి - ఈ విధముగా, కృత-అనుషంగః - చేయబడిన ఆసక్తిగల భరతుడు, ఆసనశయన-అటనస్థాన-అశన-ఆదిషు - కూర్చుండుట పరుండుట తిరుగుట నిలిచియుండుట తినుట మొదలగువాటియందు, మృగజహునా సహ - లేడిపిల్లతో గూడి, స్నేహ-అనుబద్ధహృదయః - ప్రేమచే కట్టివేయబడిన హృదయము గలవాడై, ఆసీత్ - ఉండెను.

ఈ విధముగా లేడిపిల్లయందు భరతునకు ఆసక్తి కలిగి, ఆయన హృదయములో ప్రేమపాశము నిర్మాణమయ్యెను. కూర్చుండుట, పరుండుట, తిరుగాడుట, నిలిచియుండుట, తినుట మొదలగు పనులను ఆయన ఆ లేడిపిల్లతో కలిసియే చేసెడివాడు.

కుశకుసుమసమిత్పలాశఫలమూలోదకాన్యాహరిష్యమాణో వృకసాలావృకాదిభ్యో భయమాశంసమానో యదా సహ హరిణకుణకేన వనం సమావిశతి ॥ 12

యదా - ఎప్పుడైతే, కుశకుసుమసమిత్-పలాశఫలమూల-ఉదకాని - దర్భలు పుష్పములు సమిధలు ఆకులు పళ్లు దుంపలు నీరు అనువాటిని, ఆహరిష్యమాణః - తీసుకు రాబోవువాడో అప్పుడు, వృకసాలావృక-ఆదిభ్యః - తోడేళ్లు అడవి కుక్కల వలన, భయమ్ - భయమును, ఆశంసమానః - శంకించువాడై, హరిణకుణకేన సహ - లేడిపిల్లతో గూడి, వనమ్ - అడవిని, సమావిశతి - ప్రవేశించును.

దర్భలు, పుష్పములు, సమిధలు, ఆకులు, పళ్లు, దుంపలను మరియు నీటిని తెచ్చుకొనుటకై తాను అడవిలోనికి వెళ్లినప్పుడు, ఆ లేడిపిల్లకు తోడేళ్లు, అడవి కుక్కలు మొదలగు వాటి వలన హాని కలుగునేమో యను ఆశంక ఆ భరతునకు ఉండెడిది. కావుననే, ఆయన ఆ లేడిపిల్లను వెంట బెట్టుకొని అడవిలోనికి వెళ్లెడివాడు.

పథిషు చ ముగ్ధభావేన తత్ర తత్ర విషక్తమతిప్రణయభరహృదయః కార్పణ్యాత్ స్కంధేనోద్వహతి ఏవముత్సంగ ఉరసి చాధాయోపలాలయన్ ముదం పరమామవాప ॥ 13

చ - మరియు, పథిషు - మార్గములయందు, ముగ్ధభావేన - తెలివి అనుభవము లేకుండుటచే, తత్ర తత్ర - అక్కడక్కడ, విషక్తమ్ - అతుకుకొనిపోయిన ఆ లేడిని, అతిప్రణయభరహృదయః - అతిశయించిన ప్రేమతో నిండిన హృదయము గల భరతుడు, కార్పణ్యాత్ - ప్రేమపారవశ్యము వలన, స్కంధేన - భుజముచే, ఉద్వహతి - పైన పెట్టుకొని మోయును, ఏవమ్ - ఇదే విధముగా, ఉత్సంగే - ఒడియందు, ఉరసి చ - వక్షఃస్థలమునందు కూడ, ఆధాయ - ఉంచుకొని, ఉపలాలయన్ - దగ్గరగా లాలించువాడై, పరమామ్ - అతిశయించిన, ముదమ్ - ఆనందమును, అవాప - పొందెను.

మార్గమధ్యములో అక్కడక్కడ (బురద మొదలగు ప్రదేశములలో) ఆ లేడి తెలివి, అనుభవము లేకుండుటచే ఆగిపోయెడిది. అపుడు అతిశయించిన ప్రేమతో నిండిన హృదయము గల ఆ భరతుడు దానిని భుజముపై పెట్టుకొని ప్రేమపారవశ్యముతో మోసెడివాడు. ఇంతే గాక, దానిని ఒడిలో, లేక గుండెలపై పెట్టుకొని, ముద్దాడుతూ మహానందమును పొందెడివాడు.

క్రియాయాం నిర్వర్త్యమానాయామంతరాలేఽప్యుత్థాయోత్థాయ యదైనమభిచక్షీత తర్హి వావ స వర్షపతిః ప్రకృతిస్థేన మనసా తస్మా ఆశిష ఆశాస్తే స్వస్తి స్తాద్వత్స తే సర్వత ఇతి ॥ 14

క్రియాయామ్ - పని, నిర్వర్త్యమానాయామ్ - నిర్వర్తింపబడుచుండగా, అంతరాలే అపి - మధ్యలో కూడ, యదా - ఎప్పుడైతే, ఉత్థాయ ఉత్థాయ - పైకి లేచి పైకి లేచి, ఏనమ్ - ఈ లేడి పిల్లను, అభిచక్షీత - ఎదురుగా చూచునో, తర్హి వావ - అప్పుడే, సః - ఆ, వర్షపతిః - భరత మహారాజు, ప్రకృతిస్థేన - స్వస్థమైన, మనసా - మనస్సుతో, తస్మై - దాని కొరకు, వత్స - పుత్రా!, తే - నీ కొరకు, సర్వతః - అన్ని వైపుల నుండియు, స్వస్తి - మంగళము, స్తాత్ - కలుగుగాక!, ఇతి - అని, ఆశిషః - ఆశీర్వచనములను, ఆశాస్తే - ప్రార్థించును.

ఆ భరత మహారాజు ఏదో పనిలోనున్నప్పుడు ఆ పని మధ్యలో పలు పర్యాయములు లేచి ఆ లేడి పిల్లను చూచును. అది సరిగానే ఉన్నదని గమనించిన తరువాతనే ఆయన మనస్సు కుదుటబడును. అట్టి సందర్భములలో ఆయన దానిని, ఓ పుత్రా! నీకు అన్ని వైపులనుండియు మంగళము కలుగుగాక! అని ఆశీర్వదిస్తూ, దాని క్షేమమును కోరుచుండును.

అన్యదా భృశముద్విగ్నమనా నష్టద్రవిణ ఇవ కృపణస్సకరుణమతితర్షేణ హరిణకుణకవిరహవిహ్వలహృదయసంతాపస్తమేవానుశోచన్కిల కశ్మలం మహదభిరంభిత ఇతి హోవాచ॥ 15

అన్యదా - అది కానరాని సమయమునందు, భృశమ్ - మిక్కిలి, ఉద్విగ్నమనాః - క్షోభను పొందిన మనస్సు గల భరతుడు, నష్టద్రవిణః - నష్టమైన ధనము గల, కృపణః ఇవ - లోభి వలె, సకరుణమ్ - దైన్యముతో కూడియున్న విధముగా, అతితర్షేణ - అతిశయించిన కంగారుతో, హరిణకుణకవిరహవిహ్వలహృదయసంతాపః - లేడిపిల్లయొక్క వియోగముచే స్వాధీనత తప్పిన హృదయములో అధికమగు తాపము గలవాడై, తం ఏవ - ఆ లేడి పిల్ల గురించి మాత్రమే, అనుశోచన్ - దుఃఖించుచున్నవాడై, మహత్ - అధికమగు, కశ్మలమ్ - మోహమును, అభిరంభితః - పొందించబడినవాడై, ఇతి హ - ఇట్లు, ఉవాచ కిల - పలికెను.

ఆ సందర్భములో ఆ లేడిపిల్ల కానరానిచో, ధనమును కోల్పోయిన లోభివలె, భరతుడు మనస్సులో చాల క్షోభపడెడివాడు. ఆయన దీనముగా అతిశయించిన కంగారు పడెడివాడు. లేడిపిల్లయొక్క వియోగముచే ఆయన హృదయము స్వాధీనత తప్పి, చాల ఖేదమునమనుభవించెడిది. ఆయన ఆ లేడిపిల్ల గురించి మాత్రమే శోకిస్తూ, అధికమగు మోహమును పొంది, ఇట్లు పలికెడివాడు.

అపి బత స వై కృపణ ఏణబాలకో మృతహరిణీసుతోఽహో
మమానార్యస్య శఠకిరాతమతేరకృతసుకృతస్య కృతవిస్రంభ
ఆత్మప్రత్యయేన తదవిగణయన్ సుజన ఇవాగమిష్యతి ।। 16

బత - అయ్యో!, అహో - ఆహా!, కృపణః - దీనము, మృతహరిణీసుతః - మరణించిన లేడియొక్క సంతానము అగు, సః - ఆ, ఏణబాలకః - లేడిపిల్ల, అనార్యస్య - దుష్టుడనైనట్టియు, శఠకిరాతమతేః - మోసగానియొక్క క్రూరునియొక్క బుద్ధి కలిగినట్టియు, అకృతసుకృతస్య - చేయబడని పుణ్యము గల, మమ - నన్ను, ఆత్మప్రత్యయేన - తన అంతఃకరణముయొక్క విశుద్ధిచే, అవిగణయన్ - లెక్క పెట్టనిదై, కృతవిస్రంభః - చేయబడిన విశ్వాసము గలదై, సుజనః ఇవ - సత్పురుషుడు వలె, అపి ఆగమిష్యతి - తిరిగి వచ్చునా?

అయ్యో! దీనమగు ఆ లేడిపిల్ల తల్లి లేనిది. దుష్టుడనగు నా మనస్సు మోసపూరితము మరియు క్రూరము. నేను పుణ్యమును చేసిన వాడను కాను. మాయనెరుంగని ఆ లేడి పిల్ల నా ఈ దోషములను సరకు చేయకుండా, నాయందలి విశ్వాసముతో, సత్పురుషుడు వలె తిరిగి వచ్చునా?

**అపి క్షేమేణాస్మిన్నాశ్రమోపవనే శష్పాణి చరంతం దేవగుప్తం ద్రక్ష్యామి ॥ 17**

అస్మిన్ - ఈ, ఆశ్రమ-ఉపవనే - ఆశ్రమముయొక్క ఉద్యానము నందు, క్షేమేణ - క్షేమముగా, శష్పాణి - లేతగడ్డిని, చరంతమ్ - భక్షించు చున్నట్టియు, దేవగుప్తమ్ - దేవునిచే రక్షించబడే ఆ లేడి పిల్లను, అపి ద్రక్ష్యామి - చూచెదనా?

ఆ లేడిని దేవుడు రక్షించునా? అది క్షేమముగా తిరిగి వచ్చి, ఈ ఆశ్రమముయొక్క ఉద్యానములో లేతగడ్డిని మేయుచుండగా, నేను చూచె దనా?

**అపి చ న వృకస్సాలావృకోఽన్యతమో వా నైకచర ఏకచరో వా భక్షయతి ॥ 18**

చ - మరియు, వృకః - తోడేలు గాని, సాలావృకః - కుక్క గాని, న-ఏకచరః వా - గుంపులో తిరిగే మృగము గాని, ఏకచరః - ఒంటరిగా తిరిగే మృగము గాని, అన్యతమః - మరియొకటి, అపి న భక్షయతి - తినుట లేదు గదా?

తోడేలు గాని, కుక్క గాని, గుంపులో తిరిగే అడవి పంది వంటి మరియొక క్రూరమృగము గాని, ఒంటరిగా వేటాడే పెద్దపులివంటి మృగము గాని, ఈ లేడిపిల్లను భక్షించుట లేదు గదా?

**నిమ్లోచతి హ భగవాన్ సకలజగత్క్షేమోదయస్త్రయ్యాత్మా ఽద్యాపి మమ న మృగవధూన్యాస ఆగచ్ఛతి ॥ 19**

హ - అయ్యో!, సకలజగత్-క్షేమ-ఉదయః - సకలలోకముల క్షేమముకొరకు ఉదయించువాడు, త్రయీ-ఆత్మా - వేదరూపుడు అగు, భగవాన్ - సూర్యభగవానుడు, నిమ్లోచతి - అస్తమించుచున్నాడు, అద్య అపి - ఇప్పటికి కూడ, మమ - నాకు, మృగవధూన్యాసః - ఆడులేడి యొక్క న్యాసము (దాచిన సొత్తు), న ఆగచ్ఛతి - వచ్చుట లేదు.

అయ్యో! సకలప్రాణుల క్షేమము కొరకు ఉదయించువాడు, వేద రూపుడు అగు సూర్యభగవానుడు అస్తమించుచున్నాడు. ఈ లేడి పిల్లను దాని తల్లి నావద్ద విడిచిపెట్టి మరణించినది. ఇది ఇంకనూ తిరిగి రాలేదు.

**అపిస్విదకృతసుకృతమాగత్య మాం సుఖయిష్యతి హరిణరాజకుమారో వివిధరుచిరదర్శనీయనిజమృగదారకవినోదైరసంతోషం స్వానామపనుదన్ ॥ 20**

హరిణరాజకుమారః - లేడి అనే రాజకుమారుడు, ఆగత్య - తిరిగి వచ్చి, వివిధరుచిరదర్శనీయనిజమృగదారకవినోదైః - అనేకములగు అభీష్టములైన అందమైన తన లేడి పిల్లయొక్క వినోదములతో, స్వానామ్ - తన వారల, అసంతోషమ్ - దుఃఖమును, అపనుదన్ - తొలగించునదై, అకృత సుకృతమ్ - చేయబడని పుణ్యము గల, మామ్ - నన్ను, అపిస్విత్ సుఖయిష్యతి - సుఖపెట్టునా?

రాజకుమారునివంటి ఆ లేడి తిరిగి వచ్చి, తన అల్లర్లతో తనవాడ నగు నా దుఃఖమును తొలగించి నన్ను సుఖపెట్టునా? నేను అంత పుణ్యము చేసుకోలేదు. అది చేసే అనేకరకముల లేడి పిల్లల ఆటలు అందముగా చూడ ముచ్చట గొల్పును.

**క్ష్వేలికాయాం మాం మృషాసమాధినాఽఽమీలితదృశం ప్రేమ సంరంభేణ చకితచకిత ఆగత్య పృషదపరుషవిషాణాగ్రేణ లుఠతి ॥ 21**

క్ష్వేలికాయామ్ - ఆటయందు, మృషాసమాధినా - నటించే సమాధిచే, ఆమీలితదృశమ్ - గట్టిగా మూయబడిన కన్నులు గల, మామ్

- నన్ను, ప్రేమసంరంభేణ - ప్రేమయందలి కోపముతో, చకితచకితః - చాల భయపడుచున్నదై, ఆగత్య - వచ్చి, పృషత్-అపరుషవిషాణ-అగ్రేణ - నీటి బిందువు వలె వాడి గాని కొమ్ము కొనతో, లుఠతి - పొడుచును.

నేను వినోదము కొరకై సమాధిని నటిస్తూ కళ్లను గట్టిగా మూసుకొనియుండగా, అది ప్రేమతో కోపమును నటిస్తూ, చాల భయపడుతూ నా దగ్గరకు వచ్చి, నన్ను కొమ్ము కొనతో పొడుచును. ఆ కొమ్ము నీటి బిందువు వలె సున్నితమైనదే గాని, వాడియైనది కాదు.

ఆసాదితహవిషి బర్హిషి దూషితే మయోపాలబ్ధో భీతభీతస్సప
ద్యుపరతరాస ఋషికుమారవదవహితకరణకలాప ఆస్తే। 22

ఆసాదితహవిషి - ఉంచబడిన హవిస్సు గల, బర్హిషి - దర్భ, దూషితే - చెడగొట్టబడగా, మయా - నాచే, ఉపాలబ్ధః - దూరబడినదై, భీతభీతః - చాల భయపడినదై, సపది - వెంటనే, ఉపరతరాసః - విడిచిపెట్టబడిన ఆట గలదియై, ఋషికుమారవత్ - ఋషికుమారుడు వలె, అవహితకరణకలాపః - నియంత్రించబడిన ఇంద్రియముల సమూహము గలదియై, ఆస్తే - కూర్చుండును.

నేను హవిస్సును పెట్టిన దర్భను అది పాడుచేయగా నేను కోపించెదను. అపుడు అది చాల భయమును పొంది, వెంటనే ఆటను మానివేసి కూర్చుండును. అప్పుడు అది ఆటలను విడిచిపెట్టి ఇంద్రియములను అన్నింటినీ నియంత్రించి కూర్చున్న ఋషికుమారుని బోలియుండును.

కిం వా అరే ఆచరితం తపస్తపస్విన్యాఽనయా యదియమవని
స్సవినయకృష్ణసారతనయతనుతరసుభగశివతమాఖరఖురప
దపంక్తిభిర్ద్రవిణవిధురాతురస్య కృపణస్య మమ ద్రవిణపదవీం
సూచయంత్యాత్మానం చ సర్వతః కృతకౌతుకం ద్విజానాం
స్వర్గాపవర్గకామానాం దేవయజనం కరోతి ।। 23

అరే - అరే!, తపస్విన్యా - తపస్వినియగు, అనయా - ఈ భూమిచే, కిం వా - ఏమి, తపః - తపస్సు, ఆచరితమ్ - చేయబడినదో?,

యత్ - ఏలయనగా, ఇయమ్ - ఈ, అవనిః - భూమి, సవినయకృష్ణసార తనయతనుతరసుభగశివతమ-అఖరఖురపదపంక్తిభిః - చక్కని ప్రవర్తన గల మగ లేడి పిల్లయొక్క చాల చిన్నవి సుందరములు మంగళకరములు కోమలములు అగు గిట్టలు గల పాదముల గురుతుల వరుసలచే, ద్రవిణవిధుర-ఆతురస్య - సంపదనుండి వియోగమును పొంది వ్యాకులుడనైనట్టియు, కృపణస్య - దీనుడనగు, మమ - నాకు, ద్రవిణపదవీమ్ - సంపదయొక్క మార్గమును, సూచయంతీ - చూపించుచున్నదై, సర్వతః - అంతటా, కృతకౌతుకమ్ - చేయబడిన మంగళము గల, ఆత్మానమ్ - తనను, స్వర్గ-అపవర్గకామానామ్ - స్వర్గమును మోక్షమును కోరే, ద్విజానామ్ - వేదవేత్తలకు, దేవయజనమ్ - యజ్ఞస్థానమును, కరోతి - చేయుచున్నది.

అరే! తపస్వినియగు ఈ భూమి ఏమి తపస్సు చేసినదో గదా! ఏలయనగా, చక్కని ప్రవర్తనగల మగ లేడిపిల్లయొక్క మంగళకరములగు పాదముల గురుతులయొక్క వరుసలతో ఈ భూమి నాకు ఆ లేడి వెళ్లిన మార్గమును సూచించుచున్నది. ఆ లేడియొక్క చాల చిన్నవియగు గిట్టలు అందముగా, కోమలముగా నుండును. నాకున్న సంపద అంతా ఆ లేడిపిల్లయే. ఆ సంపదకు దూరమై దీనుడనై యున్న నాకు ఈ గురుతుల వరుసలు నా సంపద ఉన్న స్థానమును చూపుచున్నవి. లేడి పాదముల గురుతులతో ఈ నేల అంతటా మంగళమయమైనది. స్వర్గమును గాని, మోక్షమును గాని కోరే వేదవేత్తలు యజ్ఞములను చేయుటకు ఈ స్థానము తగియున్నది.

**అపిస్విదసౌ భగవానుడుపతిరేనం మృగపతిభయాన్మృతమాతరం మృగబాలకం స్వాశ్రమపరిభ్రష్టమనుకంపయా కృపణజనవత్సలః పరిపాతి ॥ 24**

భగవాన్ - పూజనీయుడు, కృపణజనవత్సలః - దీనులగు జనుల యెడల ప్రేమ గలవాడు అగు, అసౌ - ఈ, ఉడుపతిః - చంద్రుడు, మృగపతిభయాత్ - సింహము వలని భయము వలన, మృతమాతరమ్ - మరణించిన తల్లి గలిగినట్టియు, స్వ-ఆశ్రమపరిభ్రష్టమ్ - తన ఆశ్రమమునుండి

దూరమైన, ఏనమ్ - ఈ, మృగబాలకమ్ - మగ లేడి పిల్లను, అనుకంపయా - దయతో, అపిస్విత్ పరిపాతి - రక్షించునా?

పూజనీయుడగు ఈ చంద్రుడు దీనజనుల యెడల ప్రేమ గలవాడు. సింహము వలని భయముతో తల్లి మరణించగా, నా ఆశ్రమమునకు చేరిన ఈ లేడి పిల్ల దారి తప్పి ఆశ్రమమునుండి దూరమైనది. దానిని ఈ నక్షత్రములకు ప్రభువగు చంద్రుడు దయతో రక్షించునా?

కిం వాऽऽత్మజవిశ్లేషజ్వరదవదహనశిఖాభిరుపతప్యమానహృ
దయస్థలనలినీకం మాముపసృతమృగీతనయం శిశిరశాంతా
నురాగగుణితనిజవదనసలిలామృతమయగభస్తిభి
స్స్వధయతీతి చ ॥ 25

ఆత్మజవిశ్లేషజ్వరదవదహనశిఖాభిః - పుత్రవియోగముచే కలిగిన తాపము అనే కార్చిచ్చుయొక్క జ్వాలలచే, ఉపతప్యమానహృదయస్థలనలినీకమ్ - తపింపజేయబడుచున్న హృదయమనే మెట్టతామర గలిగినట్టియు, ఉపసృతమృగీతనయమ్ - పుత్రునిగా స్వీకరించబడిన మగ లేడి పిల్ల గల, మామ్ - నన్ను, శిశిరశాంత-అనురాగగుణితనిజవదనసలిల-అమృతమయగభస్తిభిః - చల్లని శాంతమైన అనురాగముచే మరల మరల స్రవించే తన నోటియందలి నీరు వంటి అమృతపూర్ణమగు కిరణములతో, కిం వా స్వధయతి - అమృతపు జల్లు కురిపించునా?, ఇతి - అని.

నేను మగ లేడి పిల్లను పుత్రునితో సమానముగా పెంచుకొంటిని. కాని, ఇప్పుడు ఆ లేడి పిల్లయొక్క వియోగమే కార్చిచ్చుయొక్క జ్వాలలు కాగా, మెట్టతామరపువ్వు వంటి నా హృదయము దుఃఖతాపముతో ఉడికిపోవుచున్నది. అట్టి నాపై చంద్రుడు రెట్టించిన అనురాగముతో, తన బింబమునుండి నిరంతరముగా వెలువడే చల్లని శాంతమైన అమృతపూర్ణమగు కిరణములతో అమృతపు జల్లు కురిపించునా? అని కూడ భరతుడు వాపోయెను.

ఏవమఘటమానమనోరథాకులహృదయో మృగదారకాభాసేన
స్వారబ్ధకర్మణా యోగారంభణతో విభ్రంశితస్స యోగతాపసో

భగవదారాధనలక్షణాచ్చ కథమితరథా జాత్యంతర ఏణకుణక ఆసంగస్సాక్షాన్నిశ్శ్రేయసప్రతిపక్షతయా ప్రాక్పరిత్యక్తదుస్త్యజహృదయాభిజాతస్య తస్యైవమంతరాయవిహతయోగారంభణస్య రాజర్షేర్భరతస్య తావన్మృగార్భకపోషణపాలనప్రీణనలాలనానుషంగేణావిగణయత ఆత్మానమహిరివాఖుబిలం దురతిక్రమః కాలః కరాలరభస ఆపద్యత ॥ 26

ఏవమ్ - ఈ విధముగా, అఘటమానమనోరథ-ఆకులహృదయః - తీరని కోరికచే కల్లోలితమైన హృదయము గల, సః - ఆ, యోగతాపసః - యోగముననుష్ఠించే తపస్వియగు భరతుడు, మృగదారక-ఆభాసేన - లేడి పిల్ల రూపములో కనబడే, స్వ-ఆరబ్ధకర్మణా - తన ప్రారబ్ధకర్మ (జన్మను ఆరంభింపజేసిన కర్మ) చే, యోగ-ఆరంభణతః - యోగాభ్యాసము నుండి, చ - మరియు, భగవత్-ఆరాధనలక్షణాత్ - భగవంతుని ఆరాధించుట అనే కర్మనుండి, విభ్రంశితః - జారిపోవునట్లు చేయబడినవాడు, ఇతరథా - అట్లు కానిచో, నిశ్శ్రేయసప్రతిపక్షతయా - పరమహితమగు మోక్షమునకు విరోధియగుటచే, ప్రాక్ - పూర్వము, సాక్షాత్ - సాక్షాత్తుగా, పరిత్యక్తదుస్త్యజహృదయ-అభిజాతస్య - విడిచిపెట్టబడిన విడువ శక్యము కాని హృదయమునుండి పుట్టిన పుత్రులు కల, తస్య - ఆ భరతునకు, జాతి-అంతరే - మరియొక జాతికి చెందిన, ఏణకుణకే - లేడి పిల్లయందు, ఆసంగః - ఆసక్తి, కథమ్ - ఎట్లు కలుగును?, ఏవమ్ - ఈ విధముగా, అంతరాయవిహతయోగ-ఆరంభణస్య - విఘ్నములచే చెడగొట్టబడిన యోగాభ్యాసము గలిగినట్టియు, మృగ-అర్భకపోషణపాలనప్రీణనలాలన-అనుషంగేణ - లేడి పిల్లయొక్క పోషించుట రక్షించుట ప్రీతిని కలిగించుట లాలించుటలయందలి నిమగ్నతచే, ఆత్మానమ్ - తన గురించి, అవిగణయతః - లెక్కపెట్టని, రాజర్షేః - రాజర్షియగు, భరతస్య - భరతునకు, తావత్ - అంతలో, దురతిక్రమః - దాట శక్యము కానిది, కరాలరభసః - భయంకరమగు వేగము గలది అగు, కాలః - మరణసమయము, ఆఖుబిలమ్ - ఎలుక కలుగును, అహిః ఇవ - పాము వలె, ఆపద్యత - వచ్చెను.

భక్తియోగముననుష్ఠిస్తూ తపస్సు చేసుకొనే ఆ రాజర్షియగు భరతుని మనోరథము సిద్ధించలేదు. దానితో ఆయన హృదయము కల్లోలమయ్యెను. ప్రారబ్ధకర్మయే ఆ విధముగా లేడిపిల్ల రూపములో వచ్చి ఆయనను యోగాభ్యాసమునుండి, భగవంతుని ఆరాధించే కర్మలనుండి జారిపోవునట్లు చేసినది. అట్లు గానిచో, పరమపురుషార్థమగు మోక్షమునకు సాక్షాత్తుగా ఆటంకములనే భావనతో పూర్వమే తన హృదయమునుండి పుట్టిన పుత్రులను కూడ విడిచిపెట్టిన ఆ భరతునకు మానవజాతికంటె భిన్నమైన పశుజాతికి. చెందిన లేడిపిల్లయందు ఇంతటి ఆసక్తి ఏల కలుగవలెను? పుత్రులను విడిచిపెట్టుట ఎంతటివారికైననూ దుష్కరము గదా! ఈ విధముగా ఆ భరతుని యోగాభ్యాసము విఘ్నములచే వినష్టమయ్యెను. ఆయన ఆ లేడి పిల్లను పోషించుట, రక్షించుట, దానికి ప్రీతిని కలిగించుట, లాలించుట మొదలగు పనులను చేస్తూ, తన గురించి పట్టించుకొనలేదు. ఇంతలో ఎలుక కలుగులో ప్రవేశించే పాము వలె మరణసమయము వచ్చి పడెను. భయంకరమగు వేగము గల కాలమును అతిక్రమించుట ఎవ్వారికైననూ శక్యము కాదు.

తదానీమపి పార్శ్వవర్తినమాత్మజమివానుశోచంతమభివీక్ష
మాణో మృగ ఏవాభినివేశితమనా విసృజ్య లోకమిమం సహ
మృగేణ కలేవరం మృతమను న మృతజన్మానుస్మృతిరితరవ
న్మృగశరీరమవాప ॥ 27

తదానీం అపి - అప్పుడు కూడ, పార్శ్వవర్తినమ్ - ప్రక్కనే ఉన్నట్టియు, అనుశోచంతమ్ - దుఃఖించుచున్న, ఆత్మజమ్ - పుత్రుని, అభివీక్షమాణః ఇవ - చూచుచున్నవాడు వలె, మృగే ఏవ - లేడియందు మాత్రమే, అభినివేశితమనాః - గట్టిగా తగుల్కొన్న మనస్సు గల భరతుడు, మృగేణ సహ - లేడితో బాటు, ఇమమ్ - ఈ, లోకమ్ - దేహమును, విసృజ్య - విడిచిపెట్టి, మృతమ్ - మరణించిన, కలేవరమ్ - దేహమును, అను - అనుసరించి, నమృతజన్మ-అనుస్మృతిః - వినష్టము కాని పూర్వజన్మస్మరణము గలవాడై, ఇతరవత్ - ఇతరులవలె, మృగశరీరమ్ - లేడి శరీరమును, అవాప - పొందెను.

మరణించే వ్యక్తి తన ప్రక్కనే శోకిస్తూ ఉన్న పుత్రుని మీదనే మనస్సు పెట్టి-మరణించును. అదే విధముగా భరతుని మనస్సు మరణించే సమయములో కూడ లేడిపిల్లయందు మాత్రమే తగుల్కొని యుండెను. అపుడాయన ఆ లేడితో బాటుగా దేహమును కూడ విడిచిపెట్టి, అజ్ఞానముతో మరణించే జనుల వలె, పశుశరీరమునే పొందెను. సాధారణముగా వ్యక్తి మరణించుట తోడనే పూర్వజన్మస్మృతి లుప్తమగును. కాని, లేడియై పుట్టిన భరతునకు మాత్రము పూర్వజన్మస్మరణము లుప్తము కాలేదు.

తత్రాపి హ వా ఆత్మనో మృగత్వకారణం భగవదారాధనసమీ
హానుభావేనానుస్మృత్య భృశమనుతప్యమాన ఆహ ॥ 28

తత్ర అపి హ - ఆ లేడి జన్మయందు కూడ, ఆత్మనః - తనకు, మృగత్వకారణమ్ - లేడియై పుట్టుటకు కారణమును, భగవత్-ఆరాధనస మీహా-అనుభావేన - భగవంతుని ఆరాధనను చక్కగా అనుష్ఠించుట యొక్క ప్రభావముచే, వై - నిశ్చయముగా, అనుస్మృత్య - స్మరించి, భృశమ్ - మిక్కిలి, అనుతప్యమానః - తాపమును పొందుచున్నవాడై, ఆహ - పలికెను.

ఆ లేడి జన్మయందు ఆయనకు తాను లేడియై పుట్టుటకు గల కారణము స్పష్టముగా తెలియుచునే యుండెను. అది ఆయన పూర్వజన్మలో చక్కగా చేసిన భగవదారాధనయొక్క మహిమయే. అట్టి స్మృతిచే మిక్కిలి తాపమును పొందియున్న ఆ భరతుడు తనలో ఇట్లు అనుకొనెను.

అహో కష్టం భ్రష్టోऽహమాత్మవతామనుపథాద్యద్విముక్తసమస్త
సంగస్య వివిక్తపుణ్యారణ్యశరణస్యాత్మవత ఆత్మని సర్వేషా
మాత్మనాం భగవతి వాసుదేవే తదనుశ్రవణమననసంకీర్తనారా
ధనానుస్మరణాభియోగేనాశూన్యసకలయామేన కాలేన సమా
వేశితం సమాహితం కార్త్స్న్యేన మనస్తత్తు పునర్మమాబుధ
స్యారాన్మృగసుతమను పరిసుస్రావ ॥ 29

అహో - అయ్యో!, కష్టమ్ - కష్టము!, అహమ్ - నేను, ఆత్మవతామ్ - ధీరుల, అనుపథాత్ - మార్గమునుండి, భ్రష్టః - తప్పిపోతిని, యత్ - ఏలయనగా, విముక్తసమస్తసంగస్య - విడిచిపెట్టబడిన అన్ని ఆసక్తులు కలిగినట్టియు, వివిక్తపుణ్య-అరణ్యశరణస్య - జనసంచారము లేని పవిత్రమగు అడవియే శరణుగా గలిగినట్టియు, ఆత్మవతః - ధీరుడనైనట్టియు, అబుధస్య - వివేకము లేని, మమ - నాయొక్క, సర్వేషామ్ - అన్ని, ఆత్మనామ్ - అంతఃకరణములకు, ఆత్మని - ఆత్మయగు, భగవతి వాసుదేవే - వాసుదేవ భగవానునియందు, తత్-అనుశ్రవణమననసంకీర్తన-ఆరాధన-అనుస్మరణ-అభియోగేన - ఆ భగవానుని నిరంతరముగా శ్రవణము చేయుట మననము చేయుట చక్కగా కీర్తించుట ఆరాధించుట స్మరించుటలయందలి నిమగ్నతచే, అశూన్యసకలయామేన - శూన్యము కాని అన్ని జాములు గల, కాలేన - కాలముచే, సమావేశితమ్ - స్థిరము చేయబడినట్టియు, సమాహితమ్ - ఏకాగ్రము చేయబడిన, మనః తు - మనస్సైతే, పునః - మరల, కార్త్స్న్యేన - పూర్తిగా, ఆరాత్ - దూరముగా, మృగసుతం అను - లేడిపిల్లను అనుసరించి, పరిసుస్రావ - జారిపోయెను.

అయ్యో! కష్టము వచ్చినది. ధీరులై తపస్సును చేసే మునుల మార్గమునుండి నేను జారిపోయినాను. నేను ధైర్యముగా అన్ని ఆసక్తులను విడిచిపెట్టి, పవిత్రమగు అరణ్యమును ఆశ్రయించి ఏకాంతములో వాసుదేవ భగవానుని మహిమలను వింటూ, వాటిని మననము చేస్తూ, ఆ భగవానునే చక్కగా కీర్తిస్తూ, ఆరాధిస్తూ, ఆయన స్మరణమునందే పూర్తిగా పట్టుదలను కలిగియుంటిని. ఆ విధముగా కాలముయొక్క జాములనన్నింటినీ సార్థకము చేసుకుంటూ, నేను మనస్సును ఏకాగ్రము చేసి, సకలప్రాణుల అంతఃకరణములో ఆత్మరూపముగా విరాజిల్లే భగవానునిపై స్థిరముగా నిలిపితిని. కాని, నాయందు వివేకము లేకుండుటచే, అట్టి నా మనస్సు దానికి విరుద్ధముగా భగవానునకు పూర్తిగా దూరమై, లేడిపిల్ల వెంట పడి లక్ష్యము నుండి జారిపోయినది.

ఇత్యేవం నిగూఢనిర్వేదో విసృజ్య మృగీం మాతరం పునర్భగ
వత్క్షేత్రముపశమశీలమునిగణదయితం శాలగ్రామం పులస్త్య
పులహాశ్రమం కాలంజరాత్ప్రత్యాజగామ ॥ 30

ఇతి - అని, ఏవమ్ - ఈ విధముగా, నిగూఢనిర్వేదః - రహస్యమైన వైరాగ్యము గల భరతుడు, మాతరమ్ - తల్లియగు, మృగీమ్ - ఆడు లేడిని, విసృజ్య - విడిచిపెట్టి, కాలంజరాత్ - కాలంజర పర్వతమునుండి, పునః - మరల, ఉపశమశీలమునిగణదయితమ్ - శాంతమగు స్వభావము గల మహర్షుల సమూహములకు ప్రియమైనట్టియు, శాలగ్రామమ్ - శాలగ్రామమనే, భగవత్-క్షేత్రమ్ - భగవానుని క్షేత్రమైన, పులస్త్యపులహ-ఆశ్రమమ్ - పులస్త్య పులహ మహర్షుల ఆశ్రమమును గురించి, ప్రతి-ఆజగామ - తిరిగి వచ్చెను.

భరతుడు ఈ విధముగా ఉదయించిన తన వైరాగ్యమును దాచిపెట్టి, తనను కన్న ఆడు లేడిని విడిచిపెట్టెను. అపుడాయన (లేడి రూపములో) తాను పుట్టిన కాలంజర పర్వతమునుండి పులస్త్య పులహ మహర్షుల ఆశ్రమమునకు తిరిగి వచ్చెను. ఆ ఆశ్రమము శాలగ్రామము అనే భగవానుని క్షేత్రమునందు గలదు. శాంతస్వభావము గల మహర్షుల గుంపులకు ఆ క్షేత్రము చాల ప్రియమైనది.

తస్మిన్నపి కాలం ప్రతీక్షమాణస్సంగాచ్చ భృశముద్విగ్న ఆత్మ
సహచరశ్శుష్కపర్ణతృణవీరుధా వర్తమానో మృగత్వనిమిత్తావ
సానమేవ గణయన్మృగశరీరం తీర్థోదకక్లిన్నముత్ససర్జ ॥ 31

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే భరతస్య
మృగజన్మప్రాప్తిర్నామ అష్టమోఽధ్యాయః ॥

తస్మిన్ అపి - ఆ ఆశ్రమమునందు కూడ, కాలమ్ - మరణమును, ప్రతీక్షమాణః - ఎదురు చూచుచున్నవాడై, చ - మరియు, సంగాత్ - సంగము (ఆసక్తి) వలని, భృశమ్ - మిక్కిలి, ఉద్విగ్నః - వెరపు గలవాడై, ఆత్మసహచరః - ఆత్మయే తోడుగా గలవాడై, శుష్కపర్ణతృణవీరుధా

- ఎండిపోయిన ఆకులు గడ్డి కొమ్మలతో, వర్తమానః - శరీరమును నిలబె ట్టుకొనువాడై, మృగత్వనిమిత్త-అవసానం ఏవ - లేడి జన్మనిచ్చిన కర్మ యొక్క అంతమును మాత్రమే, గణయన్ - లెక్కించువాడై, తీర్థ-ఉదకక్లి న్నమ్ - తీర్థమునందలి జలముచే తడిసియున్న, మృగశరీరమ్ - లేడి శరీ రమును, ఉత్ససర్జ - విడిచిపెట్టెను.

ఆ ఆశ్రమములో కూడ లేడి రూపములో నున్న భరతుడు ఆత్మయే తోడు కాగా (ఒంటరిగా, ఆత్మనిష్ఠుడై) కాలమును ప్రతీక్షించుచుం డెను. ఇతరమృగములతో తనకు స్నేహము ఏర్పడునేమో యని ఆయన చాల భయపడెను. ఆయన ఎండు ఆకులను, గడ్డిని, కొమ్మల కొనలను మాత్రమే తింటూ ప్రాణములను నిలబెట్టుకొనెను. ఆయన తనకు లేడి జన్మ నిచ్చిన కర్మయొక్క అంతమును మాత్రమే పరిగణించెడివాడు. సమ యము రాగానే, ఆయన గండకీ నదియొక్క నీటిలో నిలబడి ప్రాణములను విడిచి పెట్టెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో
భరతుడు లేడి జన్మను పొందుటను వర్ణించే
ఎనిమిదవ అధ్యాయము ముగిసినది (8).

*****

# అథ నవమోऽధ్యాయః

## జడభరతుని భద్రకాళి రక్షించుట

శ్రీశుక ఉవాచ ।

అథ కస్యచిద్ద్విజవరస్యాంగిరఃప్రవరస్య శమదమతపస్స్వా
ధ్యాయాధ్యయనత్యాగసంతోషతితిక్షాప్రశ్రయవిద్యాऽనసూ
యాత్మజ్ఞానానందయుక్తస్యాత్మసదృశశ్రుతశీలాచారరూపౌదా
ర్యగుణా నవ సోదర్యా అంగజా బభూవుర్మిథునం చ యవీ
యస్యాం భార్యాయామ్ ॥ 1

అథ - తరువాత, శమదమతపః-స్వాధ్యాయ-అధ్యయనత్యాగసం తోషతితిక్షాప్రశ్రయవిద్యా-అనసూయా-ఆత్మజ్ఞాన-ఆనందయుక్తస్య - మనోనిగ్రహము ఇంద్రియనిగ్రహము తపస్సు తన వేదశాఖను అధ్యయనము చేయుట దానము సంతోషము సహనము వినయము ఉపాసన అసూయ లేకుండుట ఆత్మజ్ఞానము ఆనందములతో కూడియున్నట్టియు, అంగిరఃప్రవరస్య - ఆంగిరస గోత్రము వారిలో ప్రముఖుడైన, కస్యచిత్ - ఒకానొక, ద్విజవరస్య - బ్రాహ్మణ శ్రేష్ఠునకు, ఆత్మసదృశశ్రుతశీల-ఆచార రూప-ఔదార్యగుణాః - తనతో సమానమైన విద్య మంచి స్వభావము ఆచ రణము రూపము పెద్ద మనస్సు అనే గుణములు గల, సోదర్యాః - ఒకే తల్లి కడుపున పుట్టిన, నవ - తొమ్మండుగురు, అంగజాః - పుత్రులు, బభూవుః - ఉండిరి, యవీయస్యామ్ - చిన్న, భార్యాయామ్ - భార్యయం దు, మిథునం చ - కొడుకు కూతురు (కవలలు) కూడ.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఆంగీరస గోత్రమునకు చెందిన ఒక గొప్ప బ్రాహ్మణుడుండెను. తన వేదశాఖను అధ్యయనము చేసి యున్న ఆయన మనోనిగ్రహము, ఇంద్రియనిగ్రహము, తపస్సు, దానము,

సంతోషము (ఉన్నదానితో తుష్టుడగుట), సహనము, వినయము మరియు ఆత్మజ్ఞానములను కలిగియుండెను. ఈశ్వరోపాసకుడగు ఆయన ఇతరుల యందు దోషములను ఎత్తి చూపెడివాడు కాదు. ఆయనకు పెద్ద భార్య యందు తొమ్మండుగురు కొడుకులు కలిగిరి. వారు ఆయనతో సమాన ముగా విద్య, సచ్ఛీలము, ఆచరణము, రూపము, పెద్ద మనస్సు అనే గుణ ములను కలిగియుండిరి. ఆయనకు చిన్న భార్యయందు ఒక కొడుకు, కూతురు (కవలలు) కూడ కలిగిరి.

యస్తు తత్ర పుమాంస్తం పరమభాగవతం రాజర్షిప్రవరం భరత ముత్సృష్టమృగశరీరం చరమశరీరేణ విప్రత్వం గతమాహుః ॥ 2

తత్ర - ఆ కవలలలో, యః - ఏ, పుమాన్ తు - మగపిల్లవాడు గలడో, తమ్ - వానిని, పరమభాగవతమ్ - గొప్ప భగవద్భక్తుడైనట్టియు, రాజర్షిప్రవరమ్ - రాజర్షులలో శ్రేష్ఠుడైనట్టియు, ఉత్సృష్టమృగశరీరమ్ - విడిచిపెట్టబడిన లేడి శరీరము గలిగినట్టియు, చరమశరీరేణ - ఆఖరి శరీర ముచే, విప్రత్వమ్ - బ్రాహ్మణజన్మను, గతమ్ - పొందిన, భరతమ్ - భర తునిగా, ఆహుః - చెప్పుచున్నారు.

గొప్ప భగవద్భక్తుడు, రాజర్షులలో శ్రేష్ఠుడు అగు భరతుడు లేడి జన్మ అంతమైన పిదప బ్రాహ్మణునిగా జన్మించెననియు, ఆ భరతుడే ఈ కవల పిల్లలలోని మగ పిల్లవాడనియు, భరతునకు ఇది ఆఖరి జన్మ అనియు మహాత్ములు చెప్పిరి.

తత్రాపి స్వజనసంగాచ్చ భృశముద్విజమానో భగవతః కర్మ బంధవిధ్వంసనశ్రవణస్మరణగుణవివరణచరణారవిందయు గలం మనసా విదధదాత్మనః ప్రతిఘాతమాశంకమానో భగవద నుగ్రహేణానుస్మృతస్వపూర్వజన్మావలిరాత్మానమున్మత్తజ డాంధబధిరస్వరూపేణ దర్శయామాస లోకస్య ॥ 3

తత్ర అపి - ఆ జన్మయందు కూడ, స్వజనసంగాత్ - తన బంధు జనులతోడి సంగము (ఆసక్తి) వలన, భృశమ్ - మిక్కిలి, ఉద్విజమానః - వెరపు గలవాడు, భగవతః - భగవానుని, కర్మబంధవిధ్వంసనశ్రవణస్మరణ గుణవివరణచరణ-అరవిందయుగలమ్ - కర్మబంధమును ధ్వస్తము చేసే శ్రవణము స్మరణము గుణముల కథనములు గల పాదపద్మముల జంటను, మనసా - మనస్సుతో, విదధత్ - విశేషముగా ధ్యానించువాడు, భగవత్ -అనుగ్రహేణ - భగవంతుని అనుగ్రహముచే, అనుస్మృతస్వపూర్వజన్మ-ఆవలిః - గుర్తుకు వచ్చిన తన పూర్వజన్మల వరుస గలవాడు అగు భర తుడు, ఆత్మనః - తనకు, ప్రతిఘాతమ్ - విఘ్నమును, ఆశంకమానః - ఆశంకించువాడై, ఆత్మానమ్ - తనను, ఉన్మత్తజడ-అంధబధిరస్వరూపేణ - పిచ్చివాడు మూర్ఖుడు గ్రుడ్డివాడు చెవిటివాళ్ల రూపముతో, లోకస్య - లోకమునకు, దర్శయామాస - ప్రకటించెను.

ఆ జన్మలో కూడ భరతుడు తనకు బంధువులయందు ఆసక్తి కలు గునేమో యని అధికముగా వెరచెడివాడు. ఆయన మనస్సులో భగవానుని పాదపద్మముల జంటను విశేషముగా ధారణ చేసెడివాడు. భగవానుని పాదములను గురించి వినుట, స్మరించుట, గుణములను వివరించుట అను సాధనల వలన భక్తునకు సంసారబంధము దూరమగును. ఆయనకు భగవా నుని అనుగ్రహముచే తన పూర్వజన్మలన్నియు గుర్తులో నుండెను. కావున నే, ఆయన మోక్షమునకు మరల విఘ్నము కలుగునేమో యను ఆశంకతో, తనను జనులు పిచ్చివాడు, వెర్రివాడు, గ్రుడ్డివాడు, చెవిటివాడు అని తలచే విధముగా ప్రవర్తించెడి వాడు.

**తస్యాపి హ వా ఆత్మజస్య విప్రః పుత్రస్నేహానుబద్ధమనా ఆ**
**సమావర్తనాత్సంస్కారాన్ యథోపదేశం విదధాన ఉపనీతస్య**
**చ పునశ్శౌచాచమనాదీన్ కర్మనియమానభిప్రేతానపి సమశి**
**క్షయదనుశిష్టేన హి భావ్యం పితుః పుత్రేణేతి ॥ 4**

**పుత్రస్నేహ-అనుబద్ధమనాః** - పుత్రునియందలి ప్రేమచే కట్టివేయ బడిన మనస్సు గల, **విప్రః** - ఆ బ్రాహ్మణుడు, **తస్య** - అట్టి, **ఆత్మజస్య అపి** - పుత్రునకు కూడ, **వై** - నిశ్చయముగా, **ఆ సమావర్తనాత్** - సమావ

ర్తనము వరకు, సంస్కారాన్ - వైదిక సంస్కారములను, యథా-ఉపదేశమ్ - విధిని అతిక్రమించకుండగా, విదధానః - నిర్వర్తించువాడై, ఉపనీతస్య పునః - ఉపనయనము చేయబడిన ఆ పుత్రునకైతే, శౌచ-ఆచమన-ఆదీన్ - పరిశుద్ధి ఆచమనము మొదలగు, కర్మనియమాన్ - వైదికకర్మల నియమములను, అనభిప్రేతాన్ అపి - ఆతనికి అభీష్టములు కానివే అయిననూ, సమశిక్షయత్ - చక్కగా శిక్షణనిచ్చెను. హి - ఏలయనగా, పుత్రేణ - పుత్రునిచే, పితుః - తండ్రి వద్దనుండి, అనుశిష్టేన భావ్యం - శిక్షణనీయబడి ఉండదగును, ఇతి - అనే కారణముగా.

ఆ బ్రాహ్మణునకు తన పుత్రుడగు భరతునియందు ప్రీతి మెండు. కావుననే, భరతుడు ఆ విధముగా జడుడుగనే ఉన్ననూ, ఆయన ఆతనికి సమావర్తన (వివాహమునకు గురువుయొక్క అనుజ్ఞను పొంది తిరిగి గృహమునకు వచ్చుట అనే) సంస్కారము వరకు వైదిక సంస్కారములను యథావిధిగా చేస్తూ వచ్చెను. ఆయన ఆతనికి అభీష్టము కాకున్ననూ, అదే వరుసలో ఉపనయనము చేసి, స్నానాదులచే శుద్ధిని పొందుట ఆచమనము మొదలగు వైదికకర్మల నియమములను చక్కగా నేర్పెను. ఏలయన, పుత్రుడు తండ్రి వద్దనుండి శిక్షణను పొందియే తీరవలెను గదా!

> స చాపి తదు హ పితృసంనిధావేవాసధ్రీచీనమివ స్మ కరోతి ఛందాంస్యధ్యాపయిష్యన్ సహ వ్యాహృతిభిస్సప్రణవశిరస్త్రిపదీం సావిత్రీం గ్రైష్మవాసంతికాన్మాసానధీయానమప్యసమవేతరూపం గ్రాహయామాస ॥ 5

సః అపి చ - ఆ భరతుడు కూడ, పితృసంనిధౌ ఏవ - తండ్రి సన్నిధిలో మాత్రమే, తత్ ఉ - ఆ వైదికకర్మను, అసధ్రీచీనం ఇవ - సరిగా చేయుట లేదా యన్నట్లుగా, కరోతి స్మ - చేసెను, ఛందాంసి - వేదమును, అధ్యాపయిష్యన్ - అధ్యయనము చేయించ బోవువాడై తండ్రి, గ్రైష్మవాసంతికాన్ - గ్రీష్మ వసంత ఋతువులకు చెందిన, మాసాన్ - మాసములను, అధీయానం అపి - అధ్యయనము చేయుచున్నవాడే అయిననూ, సప్రణవశిరః - శిరోమంత్రమగు ఓంకారముతో కూడినట్టియు, త్రిపదీమ్ - మూడు పాదములు గల, సావిత్రీమ్ - సవిత (సూర్యుడు) దేవతగా గల

గాయత్రీ మంత్రమును, వ్యాహృతిభిః సహ - వ్యాహృతులతో సహా, అసమ వేతరూపమ్ - సరిగ్గా లేని విధముగా, గ్రాహయామాస - నేర్పెను.

ఆ భరతుడు వైదికకర్మలను తండ్రి సన్నిధిలో మాత్రమే చేసెడివాడు. అది కూడ ఖచ్చితముగా చేసెడివాడు కాదు. తండ్రి భరతుని వర్షాకాలములో వేదములను చదివించగోరి, ముందుగా సవితృదేవతాకమైన గాయత్రీమంత్రమును ఉపదేశించెను. వసంత గ్రీష్మఋతువులలోని చైత్ర, వైశాఖ, జ్యేష్ఠ, ఆషాఢమాసములయందు నిరంతరముగా వల్లింప జేసిననూ, శిరోమంత్రమగు ఓంకారముతో మరియు భూః భువః సువః అనే వ్యాహృతులతో కూడియున్న గాయత్రీమంత్రమును ఆతడు సరిగ్గా నేర్వలేకపోయెను.

ఏవం స్వతనుజ ఆత్మన్యనురాగావేశితచిత్తశ్శౌచాధ్యయనవ్రత
నియమగుర్వనలశుశ్రూషణాద్యౌపకుర్వాణకకర్మాణ్యనభియు
క్తాన్యపి సమనుశిష్టేన భావ్యమిత్యసదాగ్రహః పుత్రమనుశాస్య
స్వయం తావదనధిగతమనోరథః కాలేనాప్రమత్తేన స్వయం
గృహ ఏవ ప్రమత్త ఉపసంహృతః ॥ 6

ఏవమ్ - ఈ విధముగా, ఆత్మని - తానే అయి ఉన్న, స్వతనుజే - తన పుత్రునియందు, అనురాగ-ఆవేశితచిత్తః - అనురాగముతో నిండియున్న మనస్సు గల ఆ తండ్రి, అనభియుక్తాని అపి - భరతునకు ఇష్టము కానివే అయిననూ, శౌచ-అధ్యయనవ్రతనియమగురు-అనలశుశ్రూషణ-ఆది-ఔపకుర్వాణకకర్మాణి - పరిశుద్ధి వేదాధ్యయనము వ్రతములు నియమములు గురుసేవ అగ్నిని సేవించుట మొదలైన బ్రహ్మచారికి చెందిన కర్మలను గురించి, సమనుశిష్టేన - చక్కగా శిక్షణనీయబడినవాడుగా, భావ్యమ్ - ఉండదగును, ఇతి - అనే, అసత్-ఆగ్రహః - తగని పట్టుదల గలవాడై, పుత్రమ్ - పుత్రుడగు భరతుని, అనుశాస్య - శిక్షణనిచ్చి, స్వయమ్ - తాను, అనధిగతమనోరథః - సిద్ధించని కోరిక గలవాడై, గృహే ఏవ - గృహమునందు మాత్రమే, స్వయమ్ - తాను, ప్రమత్తః - ఆసక్తుడై, తావత్ - అంతలో, అప్రమత్తేన - మరుపునెరుంగని, కాలేన - కాలముచే, ఉపసంహృతః - ఉపసంహరించ బడినాడు.

ఆ తండ్రికి తనకు తన పుత్రునకు తేడా లేదు. ఆయన హృద యము పుత్రప్రేమతో నిండియుండెను. తన పుత్రుడు సుశిక్షితుడు కావలె నని ఆయనకు తగని పట్టుదల ఉండెడిది. బ్రహ్మచారియగు తన పుత్రునకు ఇష్టము కాకున్ననూ, శౌచము (స్నానాదులచే పరిశుద్ధముగా నుండుట), వేదాధ్యయనము, వేదోక్తములగు వ్రతములననుష్ఠించుట, బ్రహ్మచారి నియమములు, గురుశుశ్రూష, అగ్నిసేవ మొదలగు వేదోక్తకర్మలయందు ఆయన భరతునకు శిక్షణనిచ్చుచుండెడివాడు. కాని, ఆ విషయములో ఆయన కోరిక తీరనే లేదు. ఈ విధముగా, ఆయన గృహకార్యములలో తలమున్కలై యుండగనే మరణసమయము ఆసన్నమైనది. ఆయన మర ణించినాడు. మృత్యువునకు మరుపు గాని, సోమరితనము గాని ఉండవు.

అథ యవీయసీ ద్విజసతీ స్వగర్భజాతం మిథునం సపత్న్యై
ఉపన్యస్య స్వయమనుసంస్థయా పతిలోకమగాత్ ॥ 7

అథ - అప్పుడు, యవీయసీ - చిన్న, ద్విజసతీ - బ్రాహ్మణుని భార్య, స్వగర్భజాతమ్ - తన గర్భమునుండి పుట్టిన, మిథునమ్ - కవలల జంటను, సపత్న్యై - సవతి కొరకు, ఉపన్యస్య - అప్పజెప్పి, స్వయమ్ - తాను, అనుసంస్థయా - అనుసరించి మరణించుటచే, పతిలోకమ్ - భర్త యొక్క లోకమును, అగాత్ - పొందెను.

అప్పుడు ఆ బ్రాహ్మణుని చిన్న భార్య తన కవల పిల్లలను సవతికి అప్పజెప్పి, తాను భర్తతో బాటే మరణించి, భర్త పొందిన లోకమును పొందెను.

పితర్యుపరతే భ్రాతర ఏనమతత్ప్రభావవిదస్త్రయ్యాం విద్యా
యామేవ పర్యవసితమతయో న పరవిద్యాయాం జడమతిరితి
భ్రాతురనుశాసననిర్బంధాన్న్యవృత్సంత ॥ 8

పితరి - తండ్రి, ఉపరతే - మరణించగా, అతత్-ప్రభావవిదః - ఆ భరతుని మహిమను ఎరుగని వారు, త్రయ్యామ్ - వేదములోని కర్మకాం డకు సంబంధించిన, విద్యాయాం ఏవ - జ్ఞానమునందు మాత్రమే, న పరవి ద్యాయామ్ - పరవిద్యయగు ఆత్మజ్ఞానమునందు కాదు, పర్యవసితమ

తయః - నిశ్చితమైన బుద్ధి గలవారు అగు, భ్రాతరః - సోదరులు, జడ మతిః - జడమైన బుద్ధి గలవాడు, ఇతి - అని, భ్రాతుః - సోదరుడగు భర తుని, అనుశాసనాత్ - శిక్షణనుండి, న్యవృత్సంత - నివృత్తులు కాగోరిరి.

భరతుని సోదరులకు ఆయన మహిమ తెలియదు. వారి బుద్ధి కేవ లము వేదముయొక్క కర్మకాండయందు మాత్రమే నిశ్చితమై యుండెను. సర్వాతిశాయియగు ఆత్మజ్ఞానమునందు వారికి అభిరుచి లేదు. వారి దృష్టిలో భరతుడు జ్ఞానము లేని వెర్రివాడు. కావుననే, తండ్రి మరణించిన తరువాత, ఆయనకు వైదికమగు కర్మకాండయందు శిక్షణను కొనసాగిం చుట వారికి సమ్మతము కాలేదు.

స చ ప్రాకృతైర్ద్విపదపశుభిరున్మత్త జడ బధిరేత్యభిభాష్య మాణో యదా తదనురూపాణి ప్రభాషతే కర్మాణి చ స కార్య మాణః పరేచ్ఛయా కరోతి విష్టితో వేతనతో వా యాచ్ఞయా యదృచ్ఛయా వోపసాదితమల్పం బహు మృష్టం కదన్నం వాభ్యవహరతి పరం నేంద్రియప్రీతినిమిత్తమ్ । నిత్యనివృత్తని మిత్తస్వసిద్ధవిశుద్ధానుభవానందస్వాత్మలాభాధిగమస్సుఖదుః ఖయోర్ద్వంద్వనిమిత్తయోరసంభావితదేహాభిమానః ।। 9

సః చ - ఆ భరతుడు కూడ, ప్రాకృతైః - అజ్ఞానులగు, ద్విపదప శుభిః - రెండు కాళ్ళ పశువులచే, ఉన్మత్త - పిచ్చివాడా!, జడ - మూర్ఖుడా!, బధిర - చెవిటివాడా!, ఇతి - అని, అభిభాష్యమాణః - పలక రించ బడుచున్నవాడై, యదా - ఎప్పుడైతే, తత్-అనురూపాణి - దానికి తగియున్న పలుకులను, ప్రభాషతే - పలుకునో, కర్మాణి చ - పనులను కూడ, కార్యమాణః - చేయించ బడుచున్నవాడో అప్పుడు, పర-ఇచ్ఛయా - ఇతరుల సంకల్పముచే, కరోతి - చేయును, విష్టితః - బలాత్కారముగా చేయించబడిన కర్మల వలన, వేతనతః వా - కూలి వలన గాని, యాచ్ఞయా - యాచించుటచే గాని, యదృచ్ఛయా వా - అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే) గాని, ఉపసాదితమ్ - పొందించబడిన, అల్పమ్ - తక్కువ గాని, బహు - అధికము గాని, మృష్టమ్ - రుచియైనది గాని, కదన్నం వా

- చెడిపోయిన అన్నమును గాని, పరమ్ - కేవలము, అభ్యవహరతి - తినును, ఇంద్రియప్రీతినిమిత్తమ్ - నాలుకకు ప్రీతి కారణముగా, న - కాదు, నిత్యనివృత్తనిమిత్తస్వసిద్ధవిశుద్ధ-అనుభవ-ఆనందస్వ-ఆత్మలాభ-అధిగమః - సర్వకాలములలో తొలగిపోయిన నిమిత్తము కలిగిన స్వయంసిద్ధమైన విశుద్ధమైన అనుభవరూపమైన ఆనందమే అయి ఉన్న తన ఆత్మ (స్వరూపము) యొక్క జ్ఞానముయొక్క ప్రాప్తి గలవాడు, ద్వంద్వనిమిత్తయోః - శీతోష్ణాది ద్వంద్వములు నిమిత్తముగా గల, సుఖదుఃఖయోః - సుఖదుఃఖములయందు, అసంభావితదేహ-అభిమానః - ఆరోపించబడని దేహమే నేను నాది అనే ధారణ గలవాడు.

రెండు కాళ్ల పశువులు అనదగిన మూర్ఖజనులు ఆ భరతుని, ఓరీ పిచ్చివాడా! వెర్రీ! చెవిటివాడా! అని పలకరించెడివారు. ఆయన ఆ పిలుపునకు తగిన విధముగనే మాటలాడెడివాడు. వారు ఆయనచే బలాత్కారముగా పనులను చేయించినప్పుడు, వారి ఇచ్ఛకు అనురూపముగా ఆయన పనులను చేసెడివాడు. చాకిరీ చేయించుకొని కొందరు తిండి పెట్టెడివారు. మరికొందరు కూలి ఇచ్చెడివారు. ఆ విధముగా ఆయనకు కొన్ని సందర్భములలో ఆహారము లభించెడిది. మరియొకప్పుడు బిచ్చమెత్తెడివాడు. ఒకప్పుడు అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే) ఆహారము లభించెడిది. లభించిన ఆహారము తనకు సరిపడినా, సరిపడక పోయినా, రుచిగా ఉన్నా, లేక చెడిపోయినా, ఆయన దానిని తినెడివాడు. ఆయన తినేది ప్రాణములను నిలబెట్టుకొనుట కొరకు మాత్రమే గాని, రుచులను ఆస్వాదించుట కొరకు కాదు.

ఆత్మ ఆనందఘనము. ఆ ఆనందము ఏ కాలమునందైననూ బాహ్యమగు నిమిత్తములచే కొత్తగా పుట్టేది కాదు. స్వయంసిద్ధమగు ఆ ఆనందమునందు భోక్త-భోగ్యము మొదలగు భేదములు ఉండవు. అది ఆత్మజ్ఞానరూపముగా అనుభవమునకు వచ్చును. అది భరతునియందు గలదు. కావుననే, ఆయనకు చలి-వేడి, సమ్మానము-అవమానము మొదలగు ద్వంద్వముల (పరస్పరవిరుద్ధములగు స్థితులు) చే కలిగే సుఖదుఃఖ

ములయందు, నాది అనే అభిమానము గాని, దేహమునందు నేను అనే అధ్యాస (అది కానిదానిని అది అని పొరబడుట) గాని ఉండెడిది కాదు.

శీతోష్ణవాతవర్షేషు వృష ఇవానావృతాంగః పీనస్సంహననాం
గః స్థండిలసంవేశనానున్మర్దనామజ్జనరజసా మహామణిరివాన
భివ్యక్తబ్రహ్మవర్చసః కుపటావృతకటిరుపవీతేనోరుమషిణా
ద్విజాతిరితి బ్రహ్మబంధురితి సంజ్ఞయాऽతజ్జ్ఞజనావమతో
విచచార ॥ 10

శీత-ఉష్ణవాతవర్షేషు - చలి వేడి సుడిగాలి వర్షములయందు, వృషః ఇవ - ఎద్దువలె, అనావృత-అంగః - కప్పబడని అవయవములు గలవాడు, పీనః - బలిసినవాడు, సంహనన-అంగః - కుదురైన అవయవ ములు గలవాడు, స్థండిలసంవేశన-అనున్మర్దన-అమజ్జనరజసా - నేలపై పరుండుట తలంటు లేకుండుట స్నానము లేకుండుటలచే దుమ్ముతో, మహామణిః ఇవ - గొప్ప విలువైన మాణిక్యము వలె, అనభివ్యక్తబ్రహ్మవ ర్చసః - ప్రకటము కాని బ్రహ్మవర్చస్సు గలవాడు, కుపట-ఆవృతకటిః - చినిగిన (మాసిన) వస్త్రముచే కప్పబడిన నడుము గలవాడు అగు జడభర తుడు, ఉరుమషిణా - అధికమగు మాలిన్యము గల, ఉపవీతేన - జంధెము తో, ద్విజాతిః - బాపడు, ఇతి - అని, బ్రహ్మబంధుః - బ్రాహ్మణాధముడు, ఇతి - అని, సంజ్ఞయా - పేరుతో, అతద్-జ్ఞజన-అవమతః - ఆయన గురించి తెలియని జనులచే అవమానించబడువాడై, విచచార - తిరిగెను.

జడభరతుడు చలిలో, ఎండలో, గాలిలో, వర్షములో ఎద్దు వలె దేహముపై వస్త్రమును కప్పుకోకుండానే తిరిగెడివాడు. ఆయన కుదురైన అవయవములతో పుష్టిగా నుండెడివాడు. నేలపై పరుండే ఆయనకు తలంటు ఉండేది కాదు. అప్పుడప్పుడు స్నానము కూడ సున్నయే. కావున నే ఆయన, మట్టిలోని మాణిక్యము వలె, బ్రహ్మతేజస్సు ప్రకటము కాకుం డా, మలినముగా నుండెడివాడు. నడుమునకు చినిగి మాసియున్న వస్త్ర మును కట్టుకున్న ఆయనకు జంధెము కూడ అతిమలినముగా నుండెడిది.

ఆయన మహిమనెరుంగని జనులు ఆయనను బాపడని, బ్రాహ్మణాధము డని వ్యవహరిస్తూ అవమానించెడివారు.

యదా తు పరత ఆహారం కర్మవేతనత ఈహమానస్స్వభ్రాతృ భిరపి కేదారకర్మణి నిరూపితస్తదపి కరోతి కిం తు న సమం విషమం న్యూనమధికమితి వేద కణపిణ్యాకఫలీకరణకుల్మాష స్థాలీపురీషాదీన్యప్యమృతవదభ్యవహరతి ॥ 11

యదా తు - ఏ కాలమునందైతే, కర్మవేతనతః - పనికి కూలిగా, పరతః - ఇతరులనుండి, ఆహారమ్ - ఆహారమును, ఈహమానః - అపే క్షించువాడో అప్పుడు, స్వభ్రాతృభిః అపి - తన సోదరులచే గూడ, కేదార కర్మణి - పొలము పనియందు, నిరూపితః - నియమించబడినవాడై, తత్ అపి - ఆ పనిని కూడ, కరోతి - చేయును, కిం తు - కాని, సమమ్ - పొలము సమముగా నున్నది, విషమమ్ - ఎగుడు దిగుడుగా నున్నది, న్యూనమ్ - తక్కువగా నున్నది, అధికమ్ - అధికముగా నున్నది, ఇతి - అని, న వేద - తెలుసుకొనడు, కణపిణ్యాకఫలీకరణకుల్మాషస్థాలీపురీష-ఆ దీని అపి - నూకలు తెలకపిండి తవుడు ముక్కిపోయిన మినుములు గిన్నె లోని మాడిన అన్నము మొదలగువాటిని కూడ, అమృతవత్ - అమృత మును వలె, అభ్యవహరతి - భుజించును.

ఇతరులకు కూలిని చేసి పొట్ట నింపుకొన గోరే జడభరతుని, ఆయన సోదరులు కూడ పొలము పనులలో నియోగించెడివారు. ఆయన ఆ పనులను కూడ చేసెడివాడు. కాని, పొలము సమముగా ఉన్నదని గాని, ఎగుడు దిగుడుగా నున్నదని కాని, ఆయనకు తెలిసేది కాదు. విత్తనములు మొదలగునవి తక్కువ గాని, ఎక్కువ గాని కావచ్చును. ఆ సంగతిని కూడ ఆయన గమనించెడివాడు కాదు. నూకల జావ, తెలకపిండి, తవుడు, ముక్కి పోయిన మినుములు, గిన్నె అడుగున మాడిన అన్నము మొదలగు ఆహారమును కూడ ఆయన అమృతమును వలె భక్షించెడి వాడు.

అథ కదాచిత్కశ్చిద్వృషలపతిర్భద్రకాల్యై పురుషపశుమాలభ తాపత్యకామః ॥ 12

అథ - తరువాత, కదాచిత్ - ఒకనాడు, కశ్చిత్ - ఒకానొక, అపత్య కామః - సంతానమును కోరే, వృషలపతిః - బందిపోటు దొంగల నాయ కుడు, పురుషపశుమ్ - మనిషిని బలిగా, ఆలభత - ఇచ్చుటకు సిద్ధపడెను.

కొంత కాలము తరువాత ఒకనాడు ఒకానొక బందిపోటు దొంగల నాయకుడు సంతానమును పొందగోరి, మనిషిని భద్రకాళికి బలిని ఈయవ లెనని సంకల్పించెను.

తస్య హ దైవముక్తస్య పశోః పదవీం తదనుచరాః పరిధావంతో
నిశి నిశీథసమయే తమసాఽఽవృతాయామనధిగతపశవ ఆకస్మి
కేన విధినా కేదారాన్ వీరాసనేన మృగవరాహాదిభ్యస్సంరక్ష
మాణమంగిరఃప్రవరసుతమపశ్యన్ ॥ 13

దైవముక్తస్య - విధిచే విడిపించబడిన, తస్య - ఆ నాయకుని, పశోః - పురుషపశువుయొక్క, పదవీమ్ - మార్గమును, పరిధావంతః - వెంట పరుగెత్తుచున్న, తద్-అనుచరాః - వాని కింకరులు, తమసా - చీకటి తో, ఆవృతాయామ్ - అంతటా వ్యాపించబడిన, నిశి - రాత్రియందు, నిశీథ సమయే - అర్ధరాత్రి సమయమునందు, అనధిగతపశవః - పొందబడని పురుషపశువు గలవారై, ఆకస్మికేన - హఠాత్తుగా ఘటిల్లిన, విధినా - దైవవి ధానముచే, వీరాసనేన - వీరాసనముచే, కేదారాన్ - పంటధాన్యమును, మృగవరాహ-ఆదిభ్యః - పశువులు పందులు మొదలగు వాటినుండి, సంర క్షమాణమ్ - చక్కగా రక్షించుచున్న, అంగిరఃప్రవరసుతమ్ - ఆంగీరసగోత్రీ కులలో శ్రేష్ఠుడగు బ్రాహ్మణుని పుత్రుడగు జడభరతుని, అపశ్యన్ - చూచి రి.

ఆ చోరనాయకుడు ఒక వ్యక్తిని బలి యిచ్చుటకై నిర్బంధించెను. కాని, ఆ వ్యక్తి దైవానుగ్రహముచే తప్పించుకొని పారిపోయెను. ఆ నాయ కుని కింకరులు పారిపోయిన వ్యక్తిని వెదుక్కుంటూ పరుగెత్తిరి. ఇంతలో వారు వెదుకుచుండగనే అర్ధరాత్రము ఆయెను. అంతటా చీకట్లు అలుము కొని యుండెను. వారికి ఆ వ్యక్తి దొరకలేదు. అదే సమయములో ఆంగీరస గోత్రీకులలో శ్రేష్ఠుడగు బ్రాహ్మణుని కన్న కొడుకైన జడభరతుడు వీరాసన

ములో కూర్చుండి, పొలములోని పంటను పశువులు, పందులు మొదలగు వాటినుండి కాపలా కాయుచుండెను. ఆకస్మికమగు విధివిధానముచే ఆ కింకరులు ఆయనను చూచిరి.

అథ త ఏనమనవద్యలక్షణమవమృశ్య భర్తృకర్మనిష్పత్తిం మన్యమానా బద్ధ్వా రశనయా చండికాగృహముపనిన్యు ర్ముదా వికసితవదనాః ॥ 14

అథ - అప్పుడు, ముదా - ఆనందముతో, వికసితవదనాః - విచ్చుకున్న ముఖములు గల, తే - వారు, అనవద్యలక్షణమ్ - దోషములు లేని లక్షణములు గల, ఏనమ్ - ఈ జడభరతుని, అవమృశ్య - పరిశీలించి, భర్తృకర్మనిష్పత్తిమ్ - నాయకుని పనియొక్క పరిపూర్తిని, మన్యమానాః - తలపోయువారై, రశనయా - త్రాటితో, బద్ధ్వా - కట్టి, చండికాగృహమ్ - చండికాలయమును గురించి, ఉపనిన్యుః - కొనిపోయిరి.

అప్పుడు అన్ని మంచి లక్షణములతో కూడియున్న ఆ జడభరతుని పరిశీలించగానే ఆ కింకరుల ముఖములు ఆనందముతో విచ్చుకొనెను. తమ నాయకుని పని కోరిక సిద్ధించినట్లేనని వారు తలపోసిరి. వారు ఆయనను త్రాటితో కట్టి చండికాలయమునకు తీసుకొని పోయిరి.

అథ పణయస్తం స్వవిధినాఽభిషిచ్యాహతేన వాససాఽఽచ్ఛాద్య భూషణలేపస్రక్తిలకాదిభిరుపస్కృతం భుక్తవంతం ధూపదీప మాల్యలాజకిసలయాంకురఫలోపహారోపేతయా వైశససం స్థయా మహతా గీతస్తుతిమృదంగపణవఘోషేణ చ పురుష పశుం భద్రకాల్యాః పురత ఉపవేశయామాసుః ॥ 15

అథ - తరువాత, పణయః - చోరులు, స్వవిధినా - తమ పద్ధతితో, అభిషిచ్య - అభిషేకించి, ఆహతేన - కొత్త, వాససా - వస్త్రముతో, ఆచ్ఛాద్య - కప్పి, భూషణలేపస్రక్-తిలక-ఆదిభిః - అలంకారములు పైపూతలు మాలలు తిలకము మొదలగువాటితో, ఉపస్కృతమ్ - అలంకరించబడినట్టియు, భుక్తవంతమ్ - భుజించియున్న, పురుషపశుమ్ - బలికి

నిర్దేశించిన ఆ జడభరతుని, ధూపదీపమాల్యలాజకిసలయ-అంకురఫల-ఉపహార-ఉపేతయా - ధూపము దీపము పుష్పమాలలు పేలాలు చిగుళ్లు లేత ఆకులు పళ్ల నైవేద్యములతో కూడియున్న, వైశససంస్థయా - బలి యిచ్చే విధానముతో, చ - మరియు, మహతా - పెద్ద, గీతస్తుతిమృదంగపణవఘోషేణ - పాటలు స్తోత్రములు మద్దెళ్లు భేరీల ధ్వనితో, భద్రకాల్యాః - భద్రకాళియొక్క, పురతః - ఎదుట, ఉపవేశయామాసుః - కూర్చుండ బెట్టిరి.

తరువాత ఆ చోరులు మనిషిని బలి యిచ్చే తమ పద్ధతిని అనుసరించి, ఆ జడభరతుని అభిషేకించి, కొత్త వస్త్రములను కట్టి, భూషణములతో అలంకరించి, గంధముల నలమి, పుష్పమాలలను వేసి, తిలకము పెట్టి, పలు విధములుగా అలంకరించిరి. ఆయనకు భోజనము కూడ పెట్టిరి. అపుడు వారు భద్రకాళికి ధూప దీపములను అర్పించి, పుష్పమాలలు, పేలాలు, చిగుళ్లు, లేత ఆకులతో పూజించి, పళ్లను నైవేద్యమిడిరి. వారు అపుడు బిగ్గరగా పాటలను పాడుతూ, స్తోత్రములను పఠిస్తూ, మద్దెళ్లను భేరీలను పెద్ద ధ్వని కలుగునట్లుగా వాయిస్తూ, బలిపశువగు ఆ జడభరతుని భద్రకాళి యెదుట కూర్చుండ బెట్టిరి.

అథ వృషలరాజపణిః పురుషపశోరసృగాసవేన దేవీం భద్రకాలీం యక్ష్యమాణస్తదభిమంత్రితమసిమతికరాలనిశితముపాదదే ।। 16

అథ - తరువాత, వృషలరాజపణిః - చోర నాయకుని అనుచరుడు, పురుషపశోః - బలినిచ్చే వ్యక్తియొక్క, అసృక్-ఆసవేన - రక్తము అనే మాదకద్రవముతో, భద్రకాలీం దేవీమ్ - భద్రకాళీ దేవిని, యక్ష్యమాణః - తర్పణము చేయబోవువాడై, తత్-అభిమంత్రితమ్ - ఆ దేవియొక్క మంత్రముతో అభిమంత్రించబడినట్టియు, అతికరాలనిశితమ్ - మిక్కిలి భయమును గొల్పే వాడి గల, అసిమ్ - కత్తిని, ఉపాదదే - తీసుకొనెను.

అప్పుడు చోరుల నాయకుని అనుచరుడు ఒకడు బలినీయవలసిన ఈ జడభరతుని రక్తముతో భద్రకాళీ దేవికి తృప్తిని కలిగించగోరెను.

ఆతడు దేవీమంత్రముతో మిక్కిలి వాడిగానున్న భయంకరమగు కత్తిని అభి మంత్రించి, పైకి యెత్తెను.

ఇతి తేషాం వృషలానాం రజస్తమఃప్రకృతీనాం ధనమదరజఉ త్సిక్తమనసాం భగవత్కలావీరకులం కదర్థీకృత్యోత్పథేన స్వైరం విహరతాం హింసావిహారాణాం కర్మాతిదారుణం యద్బ్రహ్మభూతస్య సాక్షాద్బ్రహ్మర్షిసుతస్య నిర్వైరస్య సర్వభూతసుహృదస్సూనాయామప్యననుమతమాలంభనం తదుపలభ్య బ్రహ్మతేజసాతిదుర్విషహేణ దందహ్యమానేన వపుషా సహసోచ్చచాట సైవ దేవీ భద్రకాలీ ॥ 17

రజః-తమఃప్రకృతీనామ్ - రజోగుణము తమోగుణము ప్రముఖ మైన స్వభావము కలిగినట్టియు, ధనమదరజః-ఉత్సిక్తమనసామ్ - ధనము వలని గర్వము మరియు రజోగుణములచే మిడిసిపడే మనస్సు గలిగి నట్టియు, భగవత్-కలావీరకులమ్ - భగవంతుని అంశతో కూడియున్న తేజ శ్శాలుర వంశమును, కదర్థీకృత్య - తిరస్కరించి, ఉత్పథేన - తప్పు మార్గ ముచే, స్వైరమ్ - ఇచ్చవచ్చిన విధముగా, విహరతామ్ - విహరించునట్టి యు, హింసావిహారాణామ్ - హింసయందు రమించే, తేషామ్ - ఆ, వృష లానామ్ - చోరులయొక్క, ఇతి - ఈ విధమైన, సాక్షాత్ - సాక్షాత్తుగా, బ్రహ్మభూతస్య - పరబ్రహ్మస్వరూపుడైనట్టియు, బ్రహ్మర్షిసుతస్య - బ్రహ్మర్షియొక్క పుత్రుడైనట్టియు, నిర్వైరస్య - వైరము లేనట్టియు, సర్వ భూతసుహృదః - సకలప్రాణులకు హితచింతకుడగు జడభరతునియొక్క, సూనాయాం అపి - ఆపత్కాలమునందు కూడ, అననుమతమ్ - అను మతి ఈయబడని, ఆలంభనమ్ - బలిని యిచ్చుట అనే, యత్ - ఏ, అతి దారుణమ్ - మిక్కిలి దారుణమైన, కర్మ - కర్మ గలదో, తత్ - దానిని, ఉప లభ్య - చూచి, అతిదుర్విషహేణ - మిక్కిలి సహించ శక్యము కాని, బ్రహ్మతేజసా - బ్రహ్మతేజస్సుచే, దందహ్యమానేన - అధికముగా దహిం చబడుచున్న, వపుషా - శరీరముతో, సా - ఆ, దేవీ భద్రకాలీ ఏవ - భద్రకా ళీ దేవియే, సహసా - తత్క్షణమే, ఉచ్చచాట - బయటకు వచ్చెను.

ఆ చోరుల స్వభావములో రజస్తమోగుణముల పాలు ఎక్కువ. ధనగర్వముచే వారి వివేకము కప్పివేయబడెను. వారి మనస్సులలో మిడి సిపాటు ఎక్కువగా నుండెను. కావుననే, హింసయందు విహరించే ఆ చోరులు భగవంతుని అంశతో కూడిన (భగవత్స్వరూపమగు వేదములను నిరంతరముగా అధ్యయనము చేసే) తేజశ్శాలురగు వేదవేత్తల వంశమును కూడ తిరస్కారము చేసి, తప్పు దారిన ఇచ్ఛవచ్చిన రీతిగా విహరిస్తూ, ఈ విధముగా మిక్కిలి దారుణమైన పనిని చేయుటకు పూనుకొనిరి. జడభర తుడు ఆత్మసాక్షాత్కారముచే సాక్షాత్తు పరబ్రహ్మస్వరూపుడై యుండెను. ఆయన తండ్రీ బ్రహ్మర్షి. సకలప్రాణుల హితమును గురించి చింతిల్లే ఆయ నకు ఎవ్వరితోనైననూ వైరము లేదు. అట్టి మహాత్ముని హింసించుట హింసకు అనుమతి ఉండే ఆపత్కాలములో కూడ తగదు. అట్టి అకృత్య మును చూచిన భద్రకాళీదేవి స్వయముగా విగ్రహమునుండి ఒక్క ఉదు టున బయటకు వచ్చెను. మిక్కిలి సహించ శక్యము కాని బ్రహ్మతేజస్సుచే (బ్రహ్మవేత్తయొక్క తేజస్సు) ఆమె శరీరము అధికముగా మండి పోవుచుండెను.

భృశమమర్షరోషావేశరభసవిలసితభ్రుకుటివిటపకుటిలదం
ష్ట్రారుణేక్షణాటోపాతిభయానకవదనా హంతుకామేవేదం
మహాట్టహాసమతిసంరంభేణ విముంచంతీ తత ఉత్పత్య పాపీ
యసాం దుష్టానాం తేనైవాసినా వివృక్ణశీర్ష్ణాం గలాత్స్రవంత
మసృగాసవమత్యుష్ణం సహ గణేన నిపీయాతిపానమదవిహ్వ
లోచ్చైస్తరాం స్వపార్షదైస్సహ జగౌ ననర్త చ విజహార చ శిరః
కందుకలీలయా ॥ 18

భృశమ్ - మిక్కిలి, అమర్షరోష-ఆవేశరభసవిలసితభ్రుకుటివిటపకు టిలదంష్ట్రా-అరుణ-ఈక్షణ-ఆటోప-అతిభయానకవదనా - తప్పును సహించలేకపోవుటచే కలిగిన కోపముయొక్క ఆవేశముయొక్క వేగముచే పైకి సాగదీయబడిన కొమ్మలవంటి కనుబొమల విరుపు భయమును గొల్పే కోరలు ఎర్రని కన్నుల హడావుడిచే మిక్కిలి భయంకరమగు ముఖము గల ది, ఇదమ్ - ఈ జగత్తును, హంతుకామా ఇవ - సంహరించే కోరిక గలది

వలె, అతిసంరంభేణ - అతిశయించిన వేగిరపాటుతో, మహా-అట్టహాసమ్ - పెద్ద నాదముతో కూడిన నవ్వును, విముంచంతీ - విడిచిపెట్టుచున్న భద్ర కాళి, తతః - అక్కడ (విగ్రహము) నుండి (తరువాత), ఉత్పత్య - పైకి యెగిరి, తేన - ఆ, అసినా ఏవ - కత్తితోనే, వివృక్ణశీర్ష్ణామ్ - నరకబడిన తలలు గలిగినట్టియు, పాపీయసామ్ - పాపిష్ఠులైన, దుష్టానామ్ - ఆ దుష్టులయొక్క, గలాత్ - కంఠమునుండి, స్రవంతమ్ - కారుచున్న, అతి-ఉష్ణమ్ - మిక్కిలి వేడిగానున్న, అసృక్-ఆసవమ్ - రక్తము అనే మత్తె క్కించే ద్రవమును, గణేన సహ - పరివారముతో గూడి, నిపీయ - త్రాగి, అతిపానమదవిహ్వలా - అతిగా త్రాగుటచే కలిగిన మత్తుచే పరవశురాలై, స్వపార్షదైః సహ - తన అనుచరులతో గూడి, ఉచ్చైః-తరామ్ - బిగ్గరగా, జగౌ - పాడెను, చ - మరియు, ననర్త - నాట్యమును చేసెను, శిరఃకందుక లీలయా - తలలు అనే బంతుల లీలతో, విజహార చ - విహరించెను.

ఆ అపరాధమును భద్రకాళి సుతరాము సహించలేకపోయెను. కోపావేశముయొక్క వేగముచే, కొమ్మలవంటి ఆమె కనుబొమలు పైకి సాగి ముడివడెను. భయమును గొల్పె వంకరదైన కోరలతో, ఎర్రని కన్నుల హడావుడితో ఆమె ముఖము మిక్కిలి భీతిని గొల్పెను. ఈ జగత్తును సంహ రించ గోరుచున్నదా యన్నట్లు ఆమె పెద్ద నాదముతో దీర్ఘముగా నవ్వుచుం డెను. ఆమె అపుడా విగ్రహమునుండి పైకి యెగిరి అదే కత్తితో పాపిష్ఠులు, దుష్టులు అగు ఆ చోరుల తలలను నరికి, కంఠములనుండి కారుచున్న మిక్కిలి వేడియైన నెత్తురును త్రాగుచుండెను. తన పరివారముతో గూడి ఆ నెత్తురు అనే మాదకద్రవమును అతిగా త్రాగుటచే మత్తు కలిగి ఆమెకు స్వాధీనత తప్పుచుండెను. ఆమె తన అనుచరులతో గూడి బిగ్గరగా పాడు తూ, నాట్యము చేస్తూ, తలలనే బంతులుగా ఆడుతూ విహరించెను.

ఏవమేవ ఖలు మహదభిచారాతిక్రమః కార్త్స్న్యేనాత్మనే
ఫలతి ॥ 19

మహత్-అభిచార-అతిక్రమః - మహాత్ముల యెడల బలి యిచ్చుట అనే అపరాధము, ఏవం ఏవ - ఇదే విధముగా, కార్త్స్న్యేన - పూర్తిగా, ఆత్మనే - తన కొరకు, ఫలతి ఖలు - ఫలించును గదా!

మహాత్ముల యెడల బలి యిచ్చుట అనే అపరాధమునకు పూను కున్నచో, అది ఆ అపరాధమును చేయువాని పైననే పూర్తి ఫలమును చూపును గదా!

న వా ఏతద్విష్ణుదత్త మహదద్భుతం యదసంభ్రమస్స్వశిర శ్ఛేదన ఆపతితేఽపి విముక్తదేహాద్యాత్మభావసుదృఢహృదయ గ్రంథీనాం సర్వసత్త్వసుహృదాత్మనాం నిర్వైరాణాం సాక్షాద్భ గవతాఽనిమిషారివరాయుధేనాప్రమత్తేన తైస్తైర్భావైః పరిరక్ష్య మాణానాం తత్పాదమూలమకుతశ్చిద్భయముపసృతానాం భాగవతపరమహంసానామ్ ॥ 20

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే
జడభరతవృత్తాంతో నామ నవమోఽధ్యాయః ॥

విష్ణుదత్త - ఓ పరీక్షిన్మహారాజా!, ఏతత్ - ఇది, మహత్ - పెద్ద, అద్భుతమ్ - అద్భుతము, న వై - కానే కాదు, యత్ - ఏదనగా, విముక్తదే హ-ఆది-ఆత్మభావసుదృఢహృదయగ్రంథీనామ్ - విడిచిపెట్టబడిన దేహము మొదలగువాటియందలి ఆత్మ అనే ధారణ అనే మిక్కిలి బిగిసి యున్న హృదయమునందలి ముడి కలిగినట్టియు, సర్వసత్త్వసుహృత్-ఆ త్మనామ్ - సకలప్రాణుల హితమును గోరే మనస్సు గలిగినట్టియు, నిర్వై రాణామ్ - వైరము లేనట్టియు, సాక్షాత్ - సాక్షాత్తుగా, భగవతా - శ్రీహరి భగవానునిచే, అప్రమత్తేన - నిత్యము జాగరూకముగానుండే, అనిమిష-అ రివర-ఆయుధేన - కాలము అనే గొప్ప చక్రాయుధముతో (చక్రాయుధము గల భగవానునిచే), తైః తైః - ఆయా, భావైః - రూపములతో, పరిరక్ష్యమా ణానామ్ - అన్ని చోట్లా రక్షించబడునట్టియు, అకుతశ్చిద్-భయమ్ - దేని వలనైననూ భయము లేని, తత్-పాదమూలమ్ - ఆయన పాదమూలము ను, ఉపసృతానామ్ - శరణు జొచ్చిన, భాగవతపరమహంసానామ్ - భగ వద్భక్తులైన పరమహంసలకు, స్వశిరః-ఛేదనే - తమ తలయొక్క నరుకు ట, ఆపతితే అపి - వచ్చి పడిననూ, అసంభ్రమః - తొందరపాటు లేకుండు ట.

శ్రీహరి అనుగ్రహమును పొందియున్న ఓ పరీక్షిన్మహారాజా! చోరులు తన తలను నరుకుటకు సంసిద్ధమైనప్పుడు కూడ జడభరతుడు కలవరపడలేదు. ఇది పెద్ద ఆశ్చర్యము కాదు. ఏలయనగా, మానవుల హృదయములో దేహమే నేను, దేహమునకు సంబంధించినవి నావి అనే ధారణరూపములో అజ్ఞానమనే ముడి బిగుసుకొని యుండును. కాని, భగవద్భక్తులైన ఆత్మజ్ఞానులకు ఈ అజ్ఞానము ఉండదు. తమ అంతఃకరణములో వైరము నెరుంగక సకలప్రాణుల హితమును గురించి చింతించే అట్టి మహాత్ములను సాక్షాత్తుగా శ్రీహరి భగవానుడే, ఆగిపోవుట యెరుంగని కాలము అనే చక్రమే గొప్ప ఆయుధము కాగా, భద్రకాళి మొదలగు ఆయా రూపములలో ప్రకటమై రక్షించును. శ్రీహరి పాదమూలమును శరణు వేడిన అట్టి మహాత్ములకు దేనివలనైననూ భయము ఉండదు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో
జడభరతుని భద్రకాళి రక్షించుటను వర్ణించే
తొమ్మిదవ అధ్యాయము ముగిసినది (9).

*****

# అథ దశమోఽధ్యాయః

## జడభరతుని రహూగణుడు అవమానించుట

శ్రీశుక ఉవాచ ।
అథ సింధుసౌవీరపతే రహూగణస్య వ్రజత ఇక్షుమత్యాస్తటే తత్కులపతినా శిబికావాహపురుషాన్వేషణసమయే దైవేనోప సాదితస్స ద్విజవర ఉపలబ్ధ ఏష పీవా యువా సంహన నాంగో గోఖరవద్ధురం వోఢుమలమితి పూర్వవిష్టిగృహీతై స్సహ గృహీతః ప్రసభమతదర్హ ఉవాహ శిబికాం స మహాను భావః ॥ 1

అథ - తరువాత, వ్రజతః - వెళ్లుచున్న, సింధుసౌవీరపతేః - సింధుసౌవీరదేశములకు ప్రభువగు, రహూగణస్య - రహూగణునకు, ఇక్షుమత్యాః - ఇక్షుమతీనదియొక్క, తటే - తీరమునందు, తత్-కులపతినా - వాని పల్లకీ మోయువారి నాయకునిచే, శిబికావాహపురుష-అన్వేషణసమయే - పల్లకీని మోసే మనిషిని వెదికే సమయమునందు, ద్విజవరః - గొప్ప బ్రాహ్మణుడగు, సః - ఆ జడభరతుడు, దైవేన - విధిచే, ఉపసాదితః - పొందించబడినవాడై, ఉపలబ్ధః - చూడబడినాడు, ఏషః - ఈతడు, పీవా - బలిసి యున్నవాడు, యువా - యువకుడు, సంహనన-అంగః - కుదురైన అవయవములు గలవాడు, గోఖరవత్ - ఎద్దు గాడిదలవలె, ధురమ్ - బరువును, వోఢుమ్ - మోయుటకు, అలమ్ - సమర్థుడు, ఇతి - అని, పూర్వవిష్టిగృహీతైః సహ - పూర్వము కూలికి కుదుర్చుకున్న మనుష్యులతో బాటుగా, ప్రసభమ్ - బలాత్కారముగా, గృహీతః - కుదర్చబడినవాడు, అతద్-అర్హః - ఆ పనికి తగని, సః - ఆ, మహానుభావః - మహానుభావుడు, శిబికామ్ - పల్లకిని, ఉవాహ హ - మోసెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- తరువాత ఒకనాడు సింధుసౌవీ రదేశములకు ప్రభువగు రహూగణుడు ఇక్షుమతీ నదీతీరమున పల్లకీలో వెళ్లుచుండెను. పల్లకీ మోతగాండ్ర నాయకుడు పల్లకీని మోసే ఒక మనిషి కొరకు వెదుకుచుండెను. గొప్ప బ్రాహ్మణుడగు జడభరతుడు విధివిధాన ముచే ఆతని కంట బడెను. ఈ యువకుడు కుదురైన అవయవములతో దిట్టముగా నున్నాడనియు, ఎద్దువలె గాడిదవలె బరువును మోయగలడని యు, ఆతడు ఈయనను బలాత్కారముగా పల్లకీని మోసే పనికి కుదిర్చె ను. ఆ మహానుభావునకు పల్లకీని మోసే పని చేతకాదు. అయిననూ, అంతకు పూర్వమునుండి పల్లకీని మోయుచున్న కూలీలతో కలిసి ఆయన కూడ పల్లకీని మోసెను.

యదా హి ద్విజవరస్యేషుమాత్రావలోకానుగతేర్న సమా
హితా పురుషగతిస్తదా విషమగతాం స్వశిబికాం రహూగణ
ఉపధార్య పురుషానధివహత ఆహ హే వోఢారస్సాధ్వతిక్ర
మత కిమితి విషమముహ్యాతే యానమితి ।। 2

యదా హి - ఏ సమయమునందైతే, ఇషుమాత్ర-అవలోక-అను గతేః - బాణము పొడవు గల నేలను మాత్రమే చూచుకుంటూ నడుస్తున్న, ద్విజవరస్య - ఆ గొప్ప బ్రాహ్మణునకు, పురుషగతిః - మోసే వ్యక్తుల నడ క, న సమాహితా - సమానముగా కలిసి లేదో, తదా - అప్పుడు, విషమగ తామ్ - ఇటునటు ఊగుచున్న, స్వశిబికామ్ - తన పల్లకిని, రహూగణః - రహూగణుడు, ఉపధార్య - చూచి, అధివహతః - మోయుచున్న, పురు షాన్ - వ్యక్తులనుద్దేశించి, ఆహ - పలికెను, హే వోఢారః - ఓ మోసే మనుష్యులారా!, సాధు - సరిగా, అతిక్రమత - మోయుడు, యానమ్ - పల్లకి, కిం ఇతి - ఏ కారణముగా, విషమమ్ - అడ్డదిడ్డముగా, ఉహ్యాతే - మోయబడుచున్నది?, ఇతి - అని.

తన కాలి క్రింద ఏ ప్రాణియైననూ నలిగిపోరాదనే భావనతో ఆ గొప్ప బ్రాహ్మణుడు తన ముందు మూరెడు నేలను చూచుకుంటూ నడచు చుండెను. దాని వలన పల్లకీని మోసే ఇతరవ్యక్తుల నడకకు ఈయన నడక సరిపడలేదు. అప్పుడు అడ్డదిడ్డముగా ఊగుచున్న తన పల్లకిని చూచి

రహూగణుడు బ్రోతగాండ్లతో నిట్లనెను --- ఓరీ, పల్లకీని మోసే మీరు సరిగా మోయుడు. పల్లకీ ఇటునటు ఊగుచుండుటకు కారణమేమి?

అథ త ఈశ్వరవచస్సోపాలంభముపాకర్ణ్యోపాయతురీయా చ్ఛంకితమనసస్తం విజ్ఞాపయాంబభూవుః ॥ 3

అథ - అప్పుడు, తే - వారు, స-ఉపాలంభమ్ - నిందతో కూడిన, ఈశ్వరవచః - ప్రభువుయొక్క మాటను, ఉపాకర్ణ్య - విని, ఉపాయతురీ యాత్ - ఉపాయములలో నాల్గవదియగు దండము వలన, శంకితమనసః - భయపడిన మనస్సులు గలవారై, తమ్ - ఆ రాజును గురించి, విజ్ఞాప యాంబభూవుః - విన్నవించుకొనిరి.

రాజు ఈ విధముగా నిందాపూర్వకముగా పలికిన మాటను విన్న ఆ వాహకులు రాజు తమను దండించునేమోయని భయపడి, ఆయనతో ఇట్లు విన్నవించుకొనిరి.

న వయం నరదేవ ప్రమత్తా భవన్నియమానుపథాస్సాధ్వేవ వహామః । అయమధునైవ నియుక్తోఽపి న ద్రుతం వ్రజతి నానేన సహ వోఢుము హ వయం పారయామ ఇతి ॥ 4

నరదేవ - మహారాజా!, భవత్-నియమ-అనుపథాః - మీ ఆజ్ఞను అనుసరించే, వయమ్ - మేము, న ప్రమత్తాః - అజాగ్రత్తగా లేము, సాధు ఏవ - బాగుగనే, వహామః - మోయుచున్నాము, అయమ్ - ఈతడు, అధునా ఏవ - ఇప్పుడే, నియుక్తః అపి - నియోగించబడినవాడే అయిన నూ, ద్రుతమ్ - వేగముగా, న వ్రజతి - నడచుట లేదు, అనేన సహ - వీనితో గూడి, వోఢుమ్ - మోయుటకు, వయమ్ - మేము, న హ ఉ పార యామః - సమర్థులము కానే కాము, ఇతి - అని.

మహారాజా! మీ ఆజ్ఞను పాలించే మేము అజాగరూకులమై లేము. మేము సరిగానే మోయుచున్నాము. కాని, ఈతడు ఇప్పుడు మాత్రమే మోయుటకు నియుక్తుడైననూ, వేగముగా నడచుట లేదు. ఈతనితో కలిసి మోయుట మా వలన కానే కాదు, అని వారు పలికిరి.

సాంసర్గికో దోష ఏష నూనమేకస్యాపి సర్వేషాం సాంసర్గి కాణాం భవితుమర్హతీతి నిశ్చిత్య నిశమ్య కృపణవచో రాజా రహూగణ ఉపాసితవృద్ధోఽపి నిసర్గేణ బలాత్కృత ఈషదుత్థితమన్యురవిస్పష్టబ్రహ్మతేజసం జాతవేదసమివ రజసాఽఽవృతమతిరాహ ॥ 5

రజసా - రజోగుణముచే, ఆవృతమతిః - వ్యాపించబడిన బుద్ధి గల, రాజా రహూగణః - రహూగణ మహారాజు, ఉపాసితవృద్ధః అపి - సేవించబడిన పెద్దలు గలవాడే అయిననూ, నిసర్గేణ - స్వభావముచే, బలాత్-కృతః - వశము చేయబడినవాడై, ఈషత్ - కొంచెము, ఉత్థిత మన్యుః - పైకి వచ్చిన కోపము గలవాడై, కృపణవచః - దీనులగు వాహకుల మాటను, నిశమ్య - విని, సాంసర్గికః - గుంపునకు చెందిన, దోషః - తప్పు, నూనమ్ - నిశ్చయముగా, ఏకస్య ఏవ - ఒక్కనిదే అయిననూ, సాంసర్గికాణామ్ - గుంపులోని వారలకు, సర్వేషాం అపి - అందరికీ కూడ, భవితుమ్ - కలుగుటకు, అర్హతి - తగియున్నది, ఇతి - అని, నిశ్చిత్య - నిశ్చయించుకొని, అవిస్పష్టబ్రహ్మతేజసమ్ - స్పష్టముగా ప్రకటము కాని బ్రహ్మతేజస్సు గలిగినట్టియు, జాతవేదసం ఇవ - నిప్పు వలె నున్న జడభరతుని గురించి, ఆహ - పలికెను.

రజోగుణముచే వ్యాప్తమైన బుద్ధిగల రహూగణ మహారాజు పెద్దలను సేవించినవాడే. కాని, ఈ సందర్భములో స్వభావమునకే పైచేయి కలుగుటచే, ఆయనలో కొంచెము కోపము పొడసూపినది. పల్లకీని మోసే వాహకులు దీనముగా చెప్పిన మాటను విని ఆయన, గుంపులో ఒక్కడు తప్పు చేసినా దాని చెడు ఫలితము గుంపులోని వారందరికీ సంక్రమించునని నిశ్చయించుకొనెను. అపుడాయన నివురు గప్పిన నిప్పు వలె స్పష్టముగా ప్రకటము కాని బ్రహ్మవర్చస్సు గల జడభరతునితో నిట్లనెను.

అహో కష్టం భ్రాతర్వ్యక్తమురు పరిశ్రాంతో దీర్ఘమధ్వానమేక ఏవ ఊహివాన్ సుచిరం నాతిపీవా న సంహననాంగో జరసా చోపద్రుతో భవాన్ సఖే నో ఏవాపర ఏతే సంఘట్టిన ఇతి బహు

విప్రలబ్ధోఽప్యవిద్యయా రచితద్రవ్యగుణకర్మాశయస్వచరమక
లేవరేఽవస్తుని సంస్థానవిశేషేఽహం మమేత్యనధ్యారోపితమి
థ్యాప్రత్యయో బ్రహ్మభూతస్తూష్ణీం శిబికాం పూర్వవదువాహ.

అహో - అయ్యో!, భ్రాతః - సోదరా!, కష్టమ్ - కష్టమే!, వ్యక్తమ్ - నిశ్చితముగా, ఉరు - చాల, పరిశ్రాంతః - అలసినవాడవు, దీర్ఘమ్ - పొడవైన, అధ్వానమ్ - మార్గమును, ఏకః ఏవ - ఒక్కడివే, సుచిరమ్ - చాల సేపు, ఊహివాన్ - మోసినవాడవు!, అతిపీవా - చాల పుష్టిగానున్న వాడవు, న - కావు, సంహనన-అంగః - కుదురైన (దృఢమైన) అవయవ ములు కలవాడవు, న - కావు!, భవాన్ - నీవు, జరసా - ముసలితనముచే, ఉపద్రుతః చ - నీరసపడినవాడవు కూడ, సఖే - మిత్రమా!, ఏతే - ఈ, అపరే - ఇతరులైన, సంఘట్టినః - సహచరులు, నో ఏవ - మోయనే లేదు, ఇతి - అని, బహు - అధికముగా, విప్రలబ్ధః అపి - వెటకారము చేయబడి నవాడైననూ, అవస్తుని - మిథ్యయైనట్టియు, సంస్థానవిశేషే - విశిష్టమైన ఆకారమైనట్టియు, అవిద్యయా - అజ్ఞానముచే, విహితద్రవ్యగుణకర్మ-ఆశ యస్వచరమకలేవరే - చేయబడిన పంచభూతములు గుణములు కర్మలు అంతఃకరణము గల తన ఆఖరి శరీరమునందు, అహమ్ - నేను, మమ - నాది, ఇతి - అని, అనధ్యారోపితమిథ్యాప్రత్యయః - ఆరోపించబడని మిథ్యాభిమానము గలవాడై, బ్రహ్మభూతః - పరబ్రహ్మస్వరూపుడైయున్న జడభరతుడు, తూష్ణీమ్ - మౌనముగా, పూర్వవత్ - పూర్వమునందు వలె, శిబికామ్ - పల్లకీని, ఉవాహ - మోసెను.

అయ్యో! పాపము, చాల కష్టము వచ్చి పడినది! సోదరా! నీవు చాల అలసిపోయినావని స్పష్టముగా కనబడుచునే యున్నది! చాల దూరము నీవు ఒక్కడివే చాల సేపు మోసినావు! నీ ఇతరసహచరులు మోయనే లేదు! నీవు చాల బలిసి లేవు! నీకు దృఢమగు అవయవములు లేవు సుమా! మిత్రమా! నీవు ముసలితనముచే నీరసపడి యున్నావు! అంటూ రహూగణుడు జడభరతుని చాల వెటకారము చేసెను. అయిన నూ, ఆయన మౌనముగనే ఉండెను. మిథ్యాభూతమగు ఈ శరీరము సత్త్వ రజస్తమోగుణములనుండి పుట్టినది. ఇది పంచభూతముల కలయికచే

తయారైనది. అవిద్యయొక్క ప్రభావముచే జీవుడు దీనిని పొంది మరల కర్మలను చేయుచుండును. కాని, అది జడభరతునకు ఆఖరి శరీరము. పర బ్రహ్మస్వరూపుడై యున్న జడభరతునకు కేవలము విశిష్టమైన ఆకారము (నామరూపములు) మాత్రమే అయి ఉన్న శరీరమునందు, ఇది నేను అని గాని, ఇది నాది అని గాని, మిథ్యాభిమానము లేదు. కావుననే, ఆయన మౌనముగా పల్లకీని పూర్వమునందు వలెనే మోయుచుండెను.

అథ పునస్స్వశిబికాయాం విషమగతాయాం ప్రకుపిత ఉవాచ రహూగణః కిమిదమరే త్వం జీవన్మృతో మాం కదర్థీకృత్య భర్తృశాసనమతిచరసి ప్రమత్తస్య చ తే కరోమి చికిత్సాం దండపాణిరివ జనతాయా యథా ప్రకృతిం స్వాం భజిష్యస ఇతి || 7

అథ - తరువాత, పునః - మరల, స్వశిబికాయామ్ - తన పల్లకి, విషమగతాయామ్ - ఎగుడు దిగుడుగా కదలుచుండగా, ప్రకుపితః - చాల కోపించిన, రహూగణః - రహూగణుడు, ఉవాచ - పలికెను, అరే - ఓరీ!, ఇదమ్ - ఇది, కిమ్ - ఏమి?, త్వమ్ - నీవు, జీవన్-మృతః - బ్రతికియుండగనే మరణించినవాడవు, మామ్ - నన్ను, కదర్థీకృత్య - తిరస్కరించి, భర్తృశాసనమ్ - ప్రభువుయొక్క ఆజ్ఞను, అతిచరసి - ఉల్లంఘించుచున్నావు, ప్రమత్తస్య - మిక్కిలి గర్వించియున్న, తే - నీకు, దండపాణిః - మృత్యుదండము చేతియందు గల యముడు, జనతాయాః ఇవ - జనమునకు వలె, చికిత్సామ్ - చికిత్సను, కరోమి - చేసెదను, యథా - ఏ విధముగానైతే, స్వామ్ - నీదైన, ప్రకృతిమ్ - జాగరూకతను, భజిష్యసే - పొందగలవో, ఇతి - అని.

తరువాత మరల పల్లకీ ఎగుడు దిగుడుగా ముందుకు సాగుచుండెను. దానితో రహూగణుడు చాల కోపించి ఇట్లు పలికెను --- ఓరీ! ఇది యేమి? నీకు బ్రతికియుండగనే చావు మూడినది. ప్రభువునగు నన్ను తిరస్కరించి నా శాసనమును ఉల్లంఘించినావు. మృత్యుదండము చేతియందుండే యముడు జనులకు చేయు విధముగా, నేను చాల గర్వించియున్న నీకు చికిత్స శాస్తి చేసెదను. అప్పుడు మరల నీవు ఒళ్లు దగ్గర పెట్టుకొని మోసెదవు.

ఏవం బహ్వబద్ధమపి భాషమాణం నరదేవాభిమానం రజసా
తమసాఽనువిద్ధేన మదేన తిరస్కృతాశేషభగవత్ప్రియనికేతం
పండితమానినం స భగవాన్ బ్రాహ్మణో బ్రహ్మభూతస్సర్వ
భూతసుహృదాత్మా యోగేశ్వరచర్యాయాం నాతివ్యుత్పన్న
మతిం స్మయమాన ఇవ విగతస్మయ ఇదమాహ ॥ 8

నరదేవ-అభిమానమ్ - రాజును అనే అభిమానము కలిగినట్టియు, రజసా - రజోగుణముచే, తమసా - తమోగుణముచే, అనువిద్ధేన - వర్ధిల్ల జేయబడిన, మదేన - గర్వముచే, తిరస్కృత-అశేషభగవత్-ప్రియనికేతమ్ - నిందించబడిన అనన్యమగు భగవద్భక్తి గల భరతుడు కలిగినట్టియు, పండితమానినమ్ - తాను పండితుడనని తలపోయునట్టియు, యోగ-ఈశ్వరచర్యాయామ్ - మహాయోగుల చేష్ట విషయమునందు, న-అతివ్యుత్పన్నమతిమ్ - అధికమైన విజ్ఞానము గల బుద్ధి లేని రహూగణుని గురించి, ఏవమ్ - ఈ విధముగా, బహు - అధికముగా, అబద్ధమ్ - అయోగ్యమగు వచనమును, భాషమాణం అపి - పలుకుచున్నవాడే అయిననూ, భగవాన్ - పూజ్యుడు, బ్రాహ్మణః - బ్రాహ్మణుడు, బ్రహ్మభూతః - పరబ్రహ్మస్వరూపుడు, సర్వభూతసుహృద్-ఆత్మా - సకలప్రాణుల హితమును గురించి చింతిల్లే అంతఃకరణము గలవాడు, విగతస్మయః - తొలగిపోయిన గర్వము గలవాడు అగు, సః - ఆ జడభరతుడు, స్మయమానః ఇవ - చిరునవ్వు నవ్వుచున్నవాడు వలె, ఇదమ్ - ఈ మాటను, ఆహ - పలికెను.

తాను రాజుననే అభిమానముతో రహూగణుడు ఈ విధముగా అనేకములైన అయోగ్యములగు మాటలను పలుకుచుండెను. రజస్తమోగుణముల ప్రభావముచే పెచ్చు పెరిగిన గర్వముతో ఆయన భగవానుని అనన్యభక్తుడగు జడభరతుని నిందించుచుండెను. తాను పండితుడనని మిడిసిపడే ఆయనకు మహాయోగుల చేష్టలను గురించి చెప్పుకోదగ్గ అవగాహన లేదు. పూజనీయుడు, బ్రాహ్మణుడు, పరబ్రహ్మస్వరూపుడు అగు ఆ జడభరతుడు తన హృదయములో సకలప్రాణుల హితమును మాత్రమే చింతిల్లుచుండును. లేశమైననూ గర్వము లేని ఆయన చిరునవ్వుతో అట్టి రహూగణుని ఉద్దేశించి, ఇట్లు పలికెను.

బ్రాహ్మణ ఉవాచ ।

త్వయోదితం వ్యక్తమవిప్రలబ్ధం భర్తుస్స మే స్యాద్యది వీర భారః।
గంతుర్యది స్యాదధిగమ్యమధ్వా పీవేతి రాశౌ న విదాం ప్రవాదః।9

వీర - ఓ వీరుడా!, త్వయా - నీచే, ఉదితమ్ - చెప్పబడినది, వ్యక్తమ్ - సత్యమే, అవిప్రలబ్ధమ్ - వెటకారము కానిది, భర్తుః - బరువును మోసే దేహమునకు, భారః - బరువు, మే - నాకు, సః - ఆ బరువు, యది స్యాత్ - ఉన్నదా?, గంతుః - నడిచే దేహమునకు, అధిగమ్యమ్ - చేరుకో దగిన గమ్యము, అధ్వా - దారి, మే - నాకు, యది స్యాత్ - ఉన్నదా?, రాశౌ - పంచభూతముల ప్రోగునందు, పీవా - బలిసినవాడు, ఇతి - అనే, ప్రవాదః - వ్యవహారము, విదామ్ - వివేకము గలవారికి, న - ఉండదు.

జడభరతుడిట్లు పలికెను --- ఓ వీరుడా! నీవు చెప్పినది సత్యమే. బరువును మోసేది దేహమే గాని, నేను కాదు. దారిలో నడిచి గమ్యమును చేరేది దేహమే గాని, నేను కాదు. కావున, నాకు శ్రమ లేదు అంటూ నీవు చేసిన ప్రసంగములో వెటకారమేమియు లేదు. బలిసి ఉన్నది కూడ పంచ భూతముల ప్రోవు మాత్రమే. ఆత్మానాత్మవివేకము గలవారు ఈ తీరున మాటలాడరు.

స్థౌల్యం కార్శ్యం వ్యాధయ ఆధయశ్చ
క్షుత్తృడ్ భయం కలిరిచ్ఛా జరా చ ।
నిద్రా రతిర్మన్యురహంమదశ్శుచో
దేహే న జాతస్య హి మే న సంతి ।। 10

స్థౌల్యమ్ - లావుగా నుండుట, కార్శ్యమ్ - చిక్కి యుండుట, వ్యాధయః - రోగములు, ఆధయః చ - మనోవ్యాధులు కూడ, క్షుత్ - ఆకలి, తృట్ - దప్పిక, భయమ్ - భయము, కలిః - కలహము, ఇచ్ఛా - కోరిక, జరా చ - ముసలిదనము కూడ, నిద్రా - నిద్ర, రతిః - ప్రేమ, మన్యుః - కోపము, అహంమదః - అహంకారముచే గర్వము, శుచః - శోకములు, దేహే - దేహమునందు (దేహేన - దేహముతో, జాతస్య - పుట్టినవానికి), న జాతస్య - పుట్టుక లేని, మే - నాకు, న సంతి హి - లేవు గదా!

లావుగా నుండుట, చిక్కియుండుట, రోగములు, మానసికపీడలు, ఆకలి దప్పికలు, భయము, కలహము, కోరిక, ముసలిదనము, నిద్ర, ప్రేమ, అహంకారము (చేయువాడను నేనే అనే ధారణ) చే గర్వము, శోక ములు దేహమనస్సంఘాతమునకే (దేహాభిమానము గల జీవునకే) గాని, పుట్టుక లేని నాకు (ఆత్మస్వరూపునకు) లేవు సుమా!

జీవన్మృతత్వం నియమేన రాజన్
ఆద్యంతవద్యద్వికృతస్య దృష్టమ్ ।
స్వస్వామ్యభావో ధ్రువ ఈడ్య యత్ర
తర్హ్యుచ్యతేఽసౌ విధికృత్యయోగః ॥ 11

రాజన్ - ఓ రాజా!, వికృతస్య - మార్పులను చెందే దానికి, జీవ త్-మృతత్వమ్ - జీవించియుండగనే మరణించుట, నియమేన - తప్పనిస రిగా, దృష్టమ్ - దర్శించబడినది, యత్ - ఏది, ఆది-అంతవత్ - పుట్టుక మరణములు గలదియో, ఈడ్య - కొనియాడ దగినవాడా!, యత్ర - ఏ కాలమునందైతే, స్వస్వామ్యభావః - సేవకుడు ప్రభువు అనే స్థితి, ధ్రువః - స్థిరమో, తర్హి - అప్పుడు, అసౌ - ఇది, విధికృత్యయోగః - ఆజ్ఞ దానిని పాలించుట అనువాటి సమావేశము, ఉచ్యతే - ఉచితముగ నుండును.

ఓ రాజా! నీవు కొనియాడ దగినవాడవే. మార్పులను చెందుతూ ఉండే దేహము మొదలగు కార్యములకు పుట్టుక మరణములు అనివార్య ములని మనకు అనుభవములో నున్నది. కావున, అట్టి దేహాదులు జీవించి యుండగనే మరణించినవానితో సమానమే. ప్రభువు, సేవకుడు అనే స్థితి స్థిరమైనచో, ప్రభువు ఆజ్ఞాపించుట మరియు సేవకుడు దానిని పాలించుట అనే స్థితి కూడ సమంజసముగ నుండును. (కాని, ఇట్టి ప్రభుసేవకసంబం ధము స్థిరమైనదని చెప్ప వలను పడదు).

విశేషబుద్ధేర్వివరం మనాక్చ పశ్యామ యన్న వ్యవహారతోఽన్యత్ ।
క ఈశ్వరస్తత్ర కిమీశితవ్యం తథాపి రాజన్ కరవామ కిం తే ॥ 12

రాజన్ - ఓ రాజా!, యత్ - ఎప్పుడైతే, వ్యవహారతః - వ్యవహా రము కంటె, అన్యత్ - మరియొక, విశేషబుద్ధేః - భేదబుద్ధికి, మనాక్ చ -

అల్పముగనైననూ, వివరమ్ - అవకాశమును, న పశ్యామ - కానరామో, తత్ర - అప్పుడు, ఈశ్వరః - ప్రభువు, కః - ఎవడు?, ఈశితవ్యమ్ - శాసించ దగినది, కిమ్ - ఏది?, తథాపి - అయినప్పటికీ, తే - నీ కొరకు, కిమ్ - దేనిని, కరవామ - చేసెదము?

రాజా! ప్రభువు, సేవకుడు అనే భేదబుద్ధి లోకవ్యవహారమునందు న్ననూ, వాస్తవములో అట్టి భేదమునకు అవకాశము లేశమైననూ మాకు కానరాదు. అట్టి స్థితిలో, ప్రభువు ఎవరు? సేవకుడు ఎవరు? సరే, కానిం డు. మీకు నేనేమి చేయాలి? చెప్పండి, చేస్తాను.

ఉన్మత్తమత్తజడవత్స్వసంస్థాం గతస్య మే వీర చికిత్సితేన ।
అర్థః కియాన్భవతా శిక్షితేన స్తబ్ధప్రమత్తస్య చ పిష్టపేషః ॥13

వీర - ఓ వీరుడా! ఉన్మత్తమత్తజడవత్ - పిచ్చివాడు మత్తెక్కిన వాడు జడుడు వలెనున్నట్టియు, స్వసంస్థామ్ - నా స్వరూపమును, గతస్య - పొందియున్న, మే - నాకు, చికిత్సితేన - చికిత్సను చేయుటచే, అర్థః - ప్రయోజనము, కియాన్ - ఎంతటిది? స్తబ్ధప్రమత్తస్య - జడుడు మత్తెక్కిన వాడు అగు వ్యక్తికి, భవతా - నీచే, శిక్షితేన - శిక్షించుటచే, పిష్టపేషః - పిండిని పిండి చేయుటయే.

ఓ వీరుడా! పిచ్చివాడు, మత్తెక్కినవాడు, జడుడు వలె ఉండే నేను ఆత్మనిష్ఠుడను. నాకు చికిత్సను చేయుట వలన ఏమి ప్రయోజనముం డును? మత్తెక్కియున్న జడునకు శిక్షను వేయుట పిష్టపేషణమే (వ్యర్థమే).

శ్రీశుక ఉవాచ ।
ఏతావదనువాదపరిభాషయా ప్రత్యుదీర్య మునివర ఉపశమ శీల ఉపరతానాత్మ్యనిమిత్త ఉపభోగేన కర్మారబ్ధం వ్యపన యన్ రాజయానమపి తథోవాహ ॥ 14

మునివరః - ఆత్మనిష్ఠులలో అగ్రేసరుడు, ఉపశమశీలః - శాంత స్వభావుడు, ఉపరత-అనాత్మ్యనిమిత్తః - తొలగిపోయిన దేహాత్మభావము నకు నిమిత్తమైన అజ్ఞానము గలవాడు అగు జడభరతుడు, అనువాదపరిభా

షయా - సమాధానమును చెప్పుటచే, ఏతావత్ - ఇంత మాత్రము, ప్రత్యుదీర్య - బదులు పలికి, ఆరబ్ధం కర్మ - ప్రారబ్ధకర్మను, ఉపభోగేన - అనుభవించుటచే, వ్యపనయన్ - క్షీణింప జేయుచున్నవాడై, రాజయానమ్ - రాజుయొక్క పల్లకిని, తథా - అదే విధముగా, ఉవాహ - మోసెను.

శాంతస్వభావము గల జడభరతుడు ఆత్మనిష్ఠులలో అగ్రేసరుడు. దేహమే ఆత్మ అనే ధారణను కలిగించే అజ్ఞానము ఆయననుండి తొలగిపోయినది. రాజు చెప్పినదానికి సమాధానమునిచ్చుట కొరకు మాత్రమే ఆయన ఈ మాటలనైననూ పలికెను. ఆయన తన ప్రారబ్ధకర్మను క్షీణింపజేయువాడై రాజుగారి పల్లకిని పూర్వమునందు వలెనే మోయుచుండెను.

స చాపి పాండవేయ సింధుసౌవీరపతిస్తత్త్వజిజ్ఞాసాయాం
సమ్యక్ శ్రద్ధయాఽధికృతాధికారస్తద్ధృదయగ్రంథిమోచనం
ద్విజవచ ఆశ్రుత్య బహుయోగగ్రంథసమ్మతం త్వరయాఽవ
రుహ్య శిరసా పాదమూలముపసృతః క్షమాపయన్ విగతనృప
దేవస్మయ ఉవాచ ॥ 15

పాండవేయ - పాండవ వంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా!, తత్త్వజిజ్ఞాసాయామ్ - ఆత్మతత్త్వముయొక్క విచారమునందు, శ్రద్ధయా - శ్రద్ధతో, సమ్యక్ - చక్కగా, (సమ్యక్-శ్రద్ధయా - సాత్త్వికమగు శ్రద్ధతో), అధికృత-అధికారః - పొందబడిన యోగ్యతగల, సః - ఆ, సింధుసౌవీర పతిః చ అపి - సింధుసౌవీర దేశములకు ప్రభువగు రహూగణుడు కూడ, హృదయగ్రంథిమోచనమ్ - హృదయములోని అజ్ఞానపు ముడిని విప్పునట్టియు, బహుయోగగ్రంథసమ్మతమ్ - అనేకములగు యోగశాస్త్రగ్రంథములయందు స్వీకరించబడిన, తత్ - ఆ, ద్విజవరవచః - గొప్ప బ్రాహ్మణుని మాటను, ఆశ్రుత్య - అంతా విని, విగతనృపదేవస్మయః - తొలగిపోయిన చక్రవర్తియొక్క గర్వము గలవాడై, త్వరయా - వేగముగా, అవరుహ్య - క్రిందకు దిగి, శిరసా - శిరస్సుతో, పాదమూలమ్ - పాదముల మూలమును, ఉపసృతః - చేరుకున్నవాడై, క్షమాపయన్ - తన అపరాధమునకు క్షమను కలిగించువాడై, ఉవాచ - పలికెను.

పాండువంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! సింధుసౌవీరదేశములకు ప్రభువగు రహూగణుడు సాత్త్వికమగు శ్రద్ధతో చక్కగా ఆత్మతత్త్వమును విచారము చేసి, ఆత్మజ్ఞానమునకు యోగ్యతను సంపాదించినవాడే. గొప్ప బ్రాహ్మణుడగు జడభరతుడు హృదయములోని అజ్ఞానమనే ముడిని విప్పే మాటను పలికెను. అన్ని యోగశాస్త్రగ్రంథములలో చెప్పిన దానికి అనురూపముగా నున్న ఆ మాటను జాగ్రత్తగా విన్న వెంటనే, ఆయనకు తాను చక్రవర్తిననే గర్వము దూరమయ్యెను. ఆయన వెంటనే పల్లకీ దిగి, తన అపరాధమును క్షమించవలెననే కోరికతో, ఆ జడభరతుని పాదములకు తలవంచి నమస్కరించి, ఇట్లు పలికెను.

కస్త్వం నిగూఢశ్చరసి ద్విజానాం బిభర్షి సూత్రం కతమోఽవధూతః।
కస్యాసి కుత్రత్య ఇహాపి కస్మాత్ క్షేమాయ నశ్చేదసి నోత శుక్లః॥16

త్వమ్ - నీవు, కః - ఎవడవు?, నిగూఢః - ప్రచ్ఛన్నుడవై, చరసి - తిరుగుచున్నావు, ద్విజానామ్ - బ్రాహ్మణుల, సూత్రమ్ - జందెమును, బిభర్షి - ధరించినావు, కతమః - ఏ, అవధూతః - అవధూతవు?, కస్య అసి - ఎవనికి చెందినవాడవు?, కుత్రత్యః - ఎక్కడివాడవు?, ఇహ - ఇచట, కస్మాత్ - ఏల ఉన్నావు?, నః - మా, క్షేమాయ - క్షేమము కొరకు, అసి చేత్ - ఉన్నవాడవైనచో, శుక్లః - కపిలభగవానుడవు, న ఉత - కావు గదా?

రహస్యముగా తిరుగుచున్న నీవు ఎవరివి? బ్రాహ్మణుల జందెమును దాల్చియున్న నీవు అవధూతలలో ఒకరివా? నీవు ఎవరివాడవు? ఎక్కడివాడవు? ఇక్కడ ఏల ఉన్నావు? మా క్షేమము కొరకే ఉన్నావా? అట్లైనచో, నీవు సత్త్వమూర్తియగు కపిల భగవానుడవు కావు గదా?

నాహం విశంకే సురరాజవజ్రా-
న్న త్ర్యక్షశూలాన్న యమస్య దండాత్ ।
నాగ్న్యర్కసోమానిలవిత్తపాస్త్రా-
చ్ఛంకే భృశం బ్రహ్మకులావమానాత్ ॥ 17

అహమ్ - నేను, సురరాజవజ్రాత్ - దేవరాజగు ఇంద్రుని వజ్రము వలన, న విశంకే - భయపడను, త్రి-అక్షశూలాత్ - ముక్కంటి శూలము

వలన, న - భయపడను, యమస్య - యముని, దండాత్ - దండము వల న, న - భయపడను, అగ్ని-అర్కసోమ-అనిలవిత్తప-అస్త్రాత్ - అగ్ని సూర్యుడు చంద్రుడు వాయువు కుబేరుల అస్త్రము వలన, న - భయపడ ను, బ్రహ్మకుల-అవమానాత్ - బ్రాహ్మణుల (బ్రహ్మవేత్తల) సమూహము నకు అవమానము వలన, భృశమ్ - మిక్కిలి, శంకే - భయపడెదను.

నేను దేవరాజగు ఇంద్రుని వజ్రమునకు గాని, ముక్కంటి శూలము నకు గాని, యముని మృత్యుదండమునకు గాని, అగ్ని సూర్యుడు చంద్రుడు వాయువు కుబేరుల అస్త్రములకు గాని భయపడను. కాని, నేను బ్రాహ్మణులకు (బ్రహ్మవేత్తలకు) అవమానము జరుగునేమో యని చాల భయపడుచుందును.

తద్బ్రూహ్యసంగో జడవన్నిగూఢవిజ్ఞానవీర్యో విచరస్యపారః ।
వచాంసి యోగగ్రథితాని సాధో న నః క్షమం తే మనసాపి భేత్తుమ్।

తత్ - అందువలన, బ్రూహి - చెప్పుము, అసంగః - సంసారము నందు ఆసక్తి లేనివాడవు, నిగూఢవిజ్ఞానవీర్యః - దాచబడిన జ్ఞానము యొక్క ప్రభావము గలవాడవు, అపారః - అవధులు లేనివాడవు అగు నీవు, జడవత్ - మూఢుడు వలె, విచరసి - తిరుగాడుచున్నావు, సాధో - ఓ మహాత్మా!, యోగగ్రథితాని - ఈశ్వరుని చేరే ఉపాయముతో గూడియు న్న, తే - నీ, వచాంసి - మాటలు, నః - మాకు, మనసా అపి - ఊహచేనై ననూ, భేత్తుమ్ - విప్పుటకు, న క్షమమ్ - శక్యము కాదు.

ఓ మహాత్మా! సంసారాసక్తి లేని నీవు అవధులు లేని నీ జ్ఞానప్రభా వము బయట పడకుండా తిరుగుచున్నావు. కావున, నీవెవరివో చెప్పుము. జ్ఞానము (ఈశ్వరుని చేరే ఉపాయము) తో గూడియున్న నీ పలుకుల తత్త్వమును అరయుట మాకు ఊహలోనైననూ సంభవము కాదు.

అహం చ యోగేశ్వరమాత్మతత్త్వ-
విదాం మునీనాం పరమం గురుం వై ।
ప్రష్టుం ప్రవృత్తః కిమిహారణం తత్
సాక్షాద్ధరిం జ్ఞానకలాఽవతీర్ణమ్ ।। 19

అహం చ - నేనైతే, యోగ-ఈశ్వరమ్ - జ్ఞానులకు ప్రభువైనట్టి యు, ఆత్మతత్త్వవిదామ్ - ఆత్మతత్త్వమునెరింగిన, మునీనామ్ - ఆత్మనిష్ఠులకు, వై - నిశ్చయముగా, పరమం గురుమ్ - పరమగురువైనట్టియు, జ్ఞానకలా-అవతీర్ణమ్ - జ్ఞానశక్తిచే అవతరించియున్న, సాక్షాత్ - సాక్షాత్తుగా, హరిమ్ - శ్రీహరియైన కపిలుని, ఇహ - ఈ లోకములో, అరణమ్ - శరణము, కిమ్ - ఏదియో, తత్ - దానిని, ప్రష్టుమ్ - అడుగుటకు, ప్రవృత్తః - బయలు దేరినవాడను.

సాక్షాత్తు శ్రీహరి జ్ఞానశక్తిచే కపిలునిగా అవతరించినాడు. ఆ యోగేశ్వరుడు ఆత్మతత్త్వమునెరింగి ఆత్మనిష్ఠులైయున్న మహాత్ములకు పరమగురువు. ఈ సంసారములో శరణు పొందదగినది యేది? అనే విషయమును ఆయనను అడిగి తెలుసుకొనుటకై నేను బయలు దేరినాను.

స వై భవాంల్లోకనిరీక్షణార్థమవ్యక్తలింగో విచరత్యపిస్విత్ ।
యోగేశ్వరాణాం గతిమంధబుద్ధిః కథం విచక్షీత గృహానుబంధః ।।

సః వై - ఆ కపిలుడవే అయిన, భవాన్ - నీవు, లోకనిరీక్షణ-అర్థమ్ - లోకమును చూచుట కొరకై, అవ్యక్తలింగః - తెలియబడని గుర్తులు గలవాడవై, అపిస్విత్ విచరతి - సంచరించుచున్నావా?, యోగ-ఈశ్వరాణామ్ - యోగేశ్వరుల, గతిమ్ - ప్రభావమును, అంధబుద్ధిః - అజ్ఞానముతో నిండిన బుద్ధి గలవాడు, గృహ-అనుబంధః - గృహమునందు ఆసక్తి గలవాడు, కథమ్ - ఏ విధముగా, విచక్షీత - దర్శించును?

ఆ కపిల భగవానుడవు నీవేనా? లోకమును చూచుట కొరకై గుర్తు పట్టుటకు వీలు లేని విధముగా సంచరించుచున్నావా యేమి? అజ్ఞానముతో నిండిన బుద్ధి కలిగి లోకవ్యవహారములయందు ఆసక్తుడై యున్న నావంటివాడు యోగేశ్వరుల మహిమను ఎట్లు దర్శించగల్గును?

దృష్టశ్శ్రమః కర్మత ఆత్మనో వై భర్తుర్గంతుర్భవతశ్చానుమన్యే ।
యథాఽసతోదానయనాద్యభావాత్సమూల ఇష్టో వ్యవహారమార్గః।।

ఆత్మనః - నాకు (దేహమునకు), కర్మతః - కర్మ వలన, వై - నిశ్చయముగా, శ్రమః - అలసట, దృష్టః - అనుభవించబడినది, భర్తుః - బరువును మోయునట్టియు, గంతుః - నడచుచున్న, భవతః చ - నీకు కూడ, అనుమన్యే - ఊహించుచున్నాను. అసతా - సత్యము గాని దానితో, ఉద-ఆనయన-ఆది-అభావాత్ - నీటిని తెచ్చుట మొదలగునవి అసంభవమగుట వలన, వ్యవహారమార్గః - వ్యవహారముల మార్గము, యథా - ఉన్నది ఉన్నట్లుగా, సమూలః - ప్రమాణము గలదిగా, ఇష్టః - అభిమతము.

పని చేసినప్పుడు దేహమునకు (నాకు) శ్రమ కలుగుట అనుభవములోనున్నది. కావున, బరువును మోస్తూ నడిచినప్పుడు తమకు కూడ నిశ్చితముగా శ్రమ కలిగియుండునని నేను ఊహించుచున్నాను. ఈ వ్యావహారిక ప్రపంచము మనకు ఏ రూపములో అనుభవమునకు వచ్చునో, అదే రూపములో అది సత్యమేనని నా అభిప్రాయము. ఏలయనగా, కుండ మొదలగు పదార్థములు సత్యము కావన్నచో, వాటితో నీటిని తెచ్చుట మొదలగు పనులు సంభవము కాకూడదు. (కాని, సంభవమగుచున్నవి).

స్థాల్యగ్నితాపాత్పయసోఽభితాపః
తత్తాపతస్తండులగర్భరంధిః ।
దేహేంద్రియాస్వాశయసన్నికర్షాత్
తత్సంసృతిః పురుషస్యానురోధాత్ ॥ 22

స్థాలీ-అగ్నితాపాత్ - గిన్నెను నిప్పుతో వేడి చేయుట వలన, పయసః - నీటికి, అభితాపః - అంతటా వేడి, తత్-తాపతః - ఆ నీటియొక్క వేడి వలన, తండులగర్భరంధిః - బియ్యపు గింజల లోపల ఉడుకుట, దేహ-ఇంద్రియ-అసు-ఆశయసన్నికర్షాత్ - దేహము ఇంద్రియములు ప్రాణములు అంతఃకరణములతోడి సంబంధమువలన, పురుషస్య - ఆత్మకు, అనురోధాత్ - అనుసరించి వచ్చుట వలన, తత్-సంసృతిః - వాటి సుఖదుఃఖముల ప్రవాహము.

గిన్నెను నిప్పులపై పెట్టినప్పుడు గిన్నె వేడెక్కి, ఆ వేడి గిన్నెలోని నీటికి సంక్రమించును. ఆ నీటి వేడి వలన నీటిలోని బియ్యపు గింజల

లోపల కూడ ఉడుకును. అదే విధముగా, ఆత్మ చైతన్యమునకు దేహము, ఇంద్రియములు, ప్రాణములు, అంతఃకరణములతో సంబంధము ఉన్నది. దాని వలన వాటి సుఖదుఃఖములు ఆత్మకు కూడ సంక్రమించును.

శాస్తాఽభిగోప్తా నృపతిః ప్రజానాం యః కింకరో వై న పినష్టి పిష్టమ్,
స్వధర్మమారాధనమచ్యుతస్య యదీహమానో విజహాత్యఘౌఘమ్।

శాస్తా - శిక్షకుడు, అభిగోప్తా - రక్షకుడు అగు, నృపతిః - రాజు, పిష్టం న పినష్టి - పిష్టపేషణమును (వ్యర్థమగు పనిని) చేయుట లేదు, యః - ఏ రాజైతే, వై - నిశ్చయముగా, ప్రజానామ్ - ప్రజలకు, కింకరః - సేవకుడో, యత్ - ఏలయనగా, అచ్యుతస్య - శ్రీహరియొక్క, ఆరాధనమ్ - ఆరాధనమేయగు, స్వధర్మమ్ - తన ధర్మమును, ఈహమానః - పాటించువాడై, అఘ-ఓఘమ్ - పాపముల సమూహమును, విజహాతి - విడిచి పెట్టుచున్నాడు.

రాజు ప్రజలకు సేవకుడు. అట్టి రాజు దుష్టులను శిక్షించి, శిష్టులను రక్షించుట పిష్టపేషణము (వ్యర్థమగు పని) కాదు. ఇది నిశ్చయము. రాజు ఈ విధముగా తన ధర్మమును పాలించుట శ్రీహరిని ఆరాధించుటయే యగును. దాని వలన రాజునకు పాపముల సమూహమునుండి విముక్తి కలుగును.

తన్మే భవాన్నరదేవాభిమానమదేన తుచ్ఛీకృతసత్తమస్య ।
కృషీష్ట మైత్రీదృశమార్తబంధో యథా తరే సదవధ్యానమంహః।24

ఆర్తబంధో - దుఃఖితులకు బంధువు అయినవాడా!, తత్ - అందు వలన, నరదేవ-అభిమానమదేన - చక్రవర్తిననే అభిమానముచే కలిగిన గర్వముచే, తుచ్ఛీకృతసత్-తమస్య - తిరస్కరించబడిన సత్పురుషశ్రేష్ఠుడు గల, మే - నాకు, భవాన్ - నీవు, మైత్రీదృశమ్ - ప్రేమతోడి చూపును, కృషీష్ట - చేయుడు, యథా - ఏ విధముగానైతే, సత్-అవధ్యానమ్ - సత్పురుష తిరస్కారము అనే, అంహః - పాపమును, తరే - తరించెదనో.

ఓ మహాత్మా! నేను చక్రవర్తిననే అభిమానముతో గర్వించి సత్పు రుషులలో శ్రేష్ఠుడవగు నిన్ను తిరస్కరించితిని. నీవు దుఃఖితులకు బంధుడ వు. కావున, నన్ను నీవు ప్రేమతో చూడదగును. నీవు అట్లు చూచినచో, సత్పురుషుని అవమానించిన పాపమునుండి నేను గట్టెక్కెదను.

న విక్రియా విశ్వసుహృత్సఖస్య
సామ్యేన వీతాభిమతేస్తవాపి ।
మహద్విమానాత్స్వకృతాద్ధి మాదృజ్
నంక్ష్యత్యదూరాదపి శూలపాణిః ॥ 25

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే రహూగణేన
జడభరతస్య తిరస్కారో నామ దశమోఽధ్యాయః ॥

విశ్వసుహృత్-సఖస్య - జగత్తునకు హితచింతకుడవు మిత్రుడవు అయినట్టియు, సామ్యేన - సమభావముచే, వీత-అభిమతేః - విడిచిపెట్టబ డిన అభిమానము గల, తవ - నీకు, విక్రియా - వికారము, న - లేదు, అపి - అయినప్పటికీ, స్వకృతాత్ - తనచే చేయబడిన, మహత్-విమానాత్ - మహాత్ముని అవమానము వలన, మాదృక్ - నావంటివాడు, శూలపాణిః అపి - శూలపాణియగు రుద్రుడే అయిననూ, అదూరాత్ - తొందరలో, నంక్ష్యతి హి - నశించును గదా!

నీవు సకలప్రాణులకు హితమును చింతించే మిత్రుడవు. దేహాభి మానమును విడిచి, సమచిత్తమును కలిగియుండుటచే, మానావమానము లు నీలో వికారమును కలిగించవు. అయిననూ, మహాత్ములను అవమానిం చిన నావంటి వ్యక్తి, సాక్షాత్తుగా శూలపాణియగు రుద్రుడే అయిననూ, శీఘ్రముగా నాశమును పొందును గదా!

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో జడభరతుని రహూగణుడు అవమానించుట అనే పదవ అధ్యాయము ముగిసినది (10).

*****

# అథ ఏకాదశోఽధ్యాయః

## రహూగణ జడభరత సంవాదము - మనో విజయము

బ్రాహ్మణ ఉవాచ ।
అకోవిదః కోవిదవాదవాదాన్
వదస్యథో నాతివిదాం వరిష్ఠః ।
న సూరయో హి వ్యవహారమేనం
తత్త్వావమర్శేన సహామనంతి ।। 1

అకోవిదః - వివేకము లేని నీవు, కోవిదవాదవాదాన్ - వివేకవంతుల పలుకుల వంటి పలుకులను, వదసి - పలుకుచున్నావు, అథో- అయినప్పటికీ, అతివిదామ్ - గొప్ప వివేకవంతులలో, వరిష్ఠః - శ్రేష్ఠుడవు, న - కావు, హి - ఏలయనగా, సూరయః - జ్ఞానులు, ఏనమ్ - ఈ, వ్యవహారమ్ - వ్యావహారిక ప్రపంచమును, తత్త్వ-అవమర్శేన సహ - పరమార్థము (పరమసత్యము) యొక్క విచారముతో బాటుగా, న ఆమనంతి - చెప్పుట లేదు.

జడభరతుడు ఇట్లు పలికెను --- నీవు వివేకము గలవాడవు కావు. కాని, వివేకవంతుల మాటలవంటి మాటలను పలుకుచున్నావు. అయిననూ, నీవు గొప్ప వివేకము గలవారిలో అగ్రేసరుడవు కాబోవు. ఏలయనగా, తత్త్వము (సత్యవస్తువు) ను విచారించే మహాత్ములు ఈ వ్యావహారిక ప్రపంచము యథార్థమని చెప్పుట లేదు.

తథైవ రాజన్నురుగార్హమేధ-
వితానవిద్యోరువిజృంభితేషు ।

న వేదవాదేషు హి తత్త్వవాదః
ప్రాయేణ శుద్ధో ను చకాస్తి సాధుః ॥ 2

రాజన్ - ఓ రాజా!, తథా ఏవ - అదే విధముగా, ఉరుగార్హమేధవితానవిద్యా-ఉరువిజృంభితేషు - పెద్ద గృహస్థాశ్రమమునకు సంబంధించిన యజ్ఞముల విస్తారముయొక్క విద్యలయందు అధికముగా చెలరేగే, వేదవాదేషు - వేదములలోని అర్థవాదములయందు, శుద్ధః - దోషములు లేనిది, సాధుః - మంచిది అగు, తత్త్వవాదః - తత్త్వవిచారము, ప్రాయేణ - తరుచుగా, న చకాస్తి - ప్రకాశించుట లేదు, ను - నిశ్చయము.

ఓ రాజా! వైదిక వ్యవహారము కూడ లౌకిక వ్యవహారము వంటిదే. గృహస్థాశ్రమమునకు సంబంధించిన విస్తృతమగు యజ్ఞయాగాదులను వేదము అధికముగా బోధించుచున్నది. వాటికి చెందిన అర్థవాదములు (కర్మల మహిమను స్తుతించే వాక్యములు) వేదములలో చెలరేగి యున్నవి. వాటియందు హింసాది దోషములు లేని రాగద్వేషాదులకు అతీతముగా నుండే పరమార్థముయొక్క విచారము తరుచుగా విలసిల్లుట లేదు. ఇది నిశ్చయము.

న తస్య తత్త్వగ్రహణాయ సాక్షాత్
వరీయసీరపి వాచస్సమాసన్ ।
స్వప్నే నిరుక్త్యా గృహమేధిసౌఖ్యం
న యస్య హేయానుమితం స్వయం స్యాత్ ॥ 3

వాచః - వేదవచనములు, వరీయసీః అపి - గొప్పవే అయిననూ, సాక్షాత్ - సాక్షాత్తుగా, తస్య - ఆ పురుషునియొక్క, తత్త్వగ్రహణాయ - యథార్థస్వరూపమును తెలియుటకు, న సమాసన్ - సమర్థములగుట లేదు, యస్య - ఏ పురుషునకు, స్వయమ్ - తనంత తానుగా, స్వప్నే - కల విషయములోని, నిరుక్త్యా - వ్యాఖ్యానముచే, గృహమేధిసౌఖ్యమ్ - గృహాశ్రమమునకు చెందిన యజ్ఞాదుల వలన కలిగే సుఖము, హేయ-అనుమితమ్ - విడిచిపెట్ట దగినది అని ఊహించబడేది, న స్యాత్ - కాదు.

వ్యక్తి కలలో సుఖమునసుభవించును. కాని, అది అనిత్యమని అనుభవమే. ఈ అనుభవమును విశ్లేషించుకొని, గృహస్థాశ్రమములో చేసే యజ్ఞాదుల వలన కలిగే సుఖము కూడ అదే విధముగా అనిత్యమనియు, కావున విడిచిపెట్ట దగినదనియు, వ్యక్తి తనంత తానుగా నిశ్చయించుకొన లేకున్నాడు. వేదాంతవచనములు గొప్పవియే. కాని, అట్టి వ్యక్తి సాక్షాత్తుగా ఆ వచనములను బట్టి తన యథార్థస్వరూపమును తెలియజాలడు.

యావన్మనో రజసా పూరుషస్య
సత్త్వేన వా తమసా వాఽనురుద్ధమ్ ।
చేతోభిరాకూతిభిరాతనోతి
నిరంకుశం కుశలం చేతరం వా ॥ 4

యావత్ - ఎంతవరకైతే, పూరుషస్య - వ్యక్తియొక్క, మనః - మనస్సు, రజసా - రజోగుణముచే గాని, సత్త్వేన వా - సత్త్వగుణముచే గాని, తమసా వా - తమోగుణముచే గాని, అనురుద్ధమ్ - పరవశము చేయబడి యుండునో అంతవరకు, నిరంకుశమ్ - నిగ్రహము లేని ఆ మన స్సు, చేతోభిః - జ్ఞానేంద్రియములతో, ఆకూతిభిః - కర్మేంద్రియములతో, కుశలమ్ - పుణ్యమును గాని, ఇతరం చ వా - పాపమును గాని, ఆతనోతి - విస్తరింప జేయును.

ఎంతవరకైతే వ్యక్తియొక్క మనస్సు సత్త్వరజస్తమోగుణములకు వశమై యుండునో, అంతవరకు ఆ మనస్సుపై ఆతనికి నిగ్రహము ఉండ దు. అట్టి మనస్సు జ్ఞానేంద్రియములు మరియు కర్మేంద్రియముల సహకా రముతో, ఆతనిచే పుణ్యపాపములను అధికముగా చేయించుచుండును.

స వాసనాత్మా విషయోపరక్తో గుణప్రవాహో వికృతః షోడశాత్మా ।
బిభ్రత్పృథఙ్నామభి రూపభేదమంతర్బహిష్ట్వం చ పురైస్తనోతి ॥ 5

వాసనాత్మా - వాసనలే స్వరూపముగా గలది, విషయ-ఉపరక్తః - ఇంద్రియభోగములయందు ఆసక్తి గలది, గుణప్రవాహః - సత్త్వరజస్తమో గుణములచే ప్రవహింప జేయబడునది, వికృతః - కామాది వికారములు గలది, షోడశ-ఆత్మా - పదునారు అంశములలో ప్రముఖమైనది అగు, సః

- ఆ మనస్సు, పృథక్-నామభిః - వేర్వేరు పేర్లతో బాటుగా, రూపభేదమ్ - రూపములలో భేదమును, బిభ్రత్ - కలిగియున్నదై, పురైః - దేహముల చే, అంతః-బహిష్ట్వమ్ - లోపల బయట (గొప్పది నికృష్టమైనది) అనే భేద మును, తనోతి - విస్తరింప జేయుచున్నది.

మనస్సు అనగా వాసనల సముదాయమే. ఇంద్రియభోగముల యందాసక్తమైన ఆ మనస్సు సత్త్వరజస్తమోగుణముల ప్రవాహమై సాగు చుండును. కామాది వికారములతో కూడిన ఆ మనస్సు జీవునియొక్క పదునారు అంశముల (ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు, ఐదు ప్రాణములు, మనస్సు) లో ప్రముఖమైనది. ఆ మనస్సు జీవుని వివిధజన్మలలో వేర్వేరు నామములతో వేర్వేరు రూపములను ఉపాధు లుగా కలిగియుండును. ఆ ఉపాధులలో కొన్ని (దేవతాదేహము) మొదల గునవి గొప్పవి కాగా, మరికొన్ని (పశువు మొదలైనవి) నికృష్టములు. ఆత్మ స్వరూపుడగు జీవునకు అట్టి ఉపాధితోడి తాదాత్మ్యము వలననే లోపల, బయట అనే తేడా కలుగుచున్నది.

దుఃఖం సుఖం వ్యతిరిక్తం చ తీవ్రం
కాలోపపన్నం ఫలమావ్యనక్తి ।
ఆలింగ్య మాయారచితాంతరాత్మా
స్వదేహినం సంసృతిచక్రకూటః ॥ 6

మాయారచిత-అంతరాత్మా - మాయచే నిర్మించబడిన అంతఃకర ణము, స్వదేహినమ్ - తన జీవుని, ఆలింగ్య - కౌగిలించుకొని, సంసృతిచ క్రకూటః - సంసారచక్రమునందు మోసపుచ్చునదై, దుఃఖమ్ - దుఃఖము ను, సుఖమ్ - సుఖమును, వ్యతిరిక్తం చ - మోహమును కూడ, తీవ్రమ్ - నివారింప శక్యము కానట్టియు, కాల-ఉపపన్నమ్ - కాలముచే సంప్రాప్తమై న, ఫలమ్ - కర్మఫలమును, ఆవ్యనక్తి - అన్ని విధములుగా ప్రకటించును.

అంతఃకరణము సత్త్వరజస్తమోగుణాత్మికయగు మాయాశక్తి యొక్క కార్యము. జీవుడు అజ్ఞానముచే దానితో తాదాత్మ్యమును చెంది, ఆ విధముగా మోసపోయి, సంసారచక్రములో పడి తిరుగుచుండును. ఆ

అంతఃకరణము జీవునకు కాలముచే పరిపక్వమైన కర్మల ఫలము రూప ముగా ఒకప్పుడు సుఖము (సత్త్వగుణకార్యము) ను, మరియొకప్పుడు దుఃఖము (రజోగుణకార్యము) ను, ఇంకో సమయములో మోహము (అస త్యమును సత్యమని భ్రమపడుట, తమోగుణకార్యము) ను ప్రకటించుచుం డును. ఈ కర్మల ఫలమును అజ్ఞానియగు జీవుడు తప్పించుకొనలేడు.

తావానయం వ్యవహారస్సదావిః
క్షేత్రజ్ఞసాక్ష్యో భవతి స్థూలసూక్ష్మః ।
తస్మాన్మనో లింగమదో వదంతి
గుణాగుణత్వస్య పరావరస్య ॥ 7

సదా - అన్ని కాలములలో, క్షేత్రజ్ఞసాక్ష్యః - క్షేత్రజ్ఞునిచే దర్శించ బడేది, స్థూలసూక్ష్మః - స్థూలము మరియు సూక్ష్మము అయినది అగు, అయమ్ - ఈ, వ్యవహారః - లోకవ్యవహారము, తావాన్ - అంతవరకు ఉండేది, ఆవిః భవతి - ప్రకాశించుచుండును, తస్మాత్ - అందువలన, పర -అవరత్వస్య - ఉత్కృష్టనికృష్టజన్మలకు, గుణ-అగుణత్వస్య - బంధమో క్షములకు, అదః - ఈ, మనః - మనస్సే, లింగమ్ - కారణమని, వదంతి - చెప్పుచున్నారు.

ఈ విధముగా మనస్సుతోడి తాదాత్మ్యము ఉన్నంతవరకు, ఈ లోకవ్యవహారము ప్రకాశించుచునే యుండును. జాగ్రదవస్థయందు ఈ వ్యవహారము స్థూలము (ఇంద్రియగోచరము) గను, స్వప్నావస్థలో సూక్ష్మము (కేవలము మనస్సుయొక్క విలాస మాత్రమే) గను ఉండును. కాని, ఆత్మ సర్వావస్థలయందు దృశ్యమగు ఈ లోకవ్యవహారమునకు సాక్షి గనే నిలిచియుండును. కావున, జీవుడు ఉత్కృష్ట నికృష్టములగు జన్మలను పొంది త్రిగుణాత్మికయగు ప్రకృతితోడి తాదాత్మ్యము వలన సంసారబంధ ములో నుండుటకు కారణము ఈ మనస్సే. ఈ మనస్సే పరిశుద్ధమై తన స్వరూపమగు ఆత్మయందు విలీనమైనప్పుడు జీవుడు గుణసంబంధము నుండి విముక్తుడై మోక్షమును పొందును. ఈ విధముగా మోక్షమునకు కూడ మనస్సే కారణమగుచున్నది. గుణములతోడి తాదాత్మ్యమే ఆత్మ

యొక్క అపర (నికృష్ట) భావము. గుణాతీతమగు స్థితియే ఆత్మకు స్వతస్సిద్ధమగు పర (ఉత్కృష్ట) భావము.

గుణానురక్తం వ్యసనాయ జంతోః
క్షేమాయ నైర్గుణ్యమథో మనస్స్యాత్ ।
యథా ప్రదీపో ఘృతవర్తిమశ్నన్
శిఖాస్సధూమా భజతి హ్యన్యదా స్వమ్ ।
పదం తథా గుణకర్మానుబద్ధం
వృత్తీర్మనశ్శ్రయతేఽన్యత్ర తత్త్వమ్ ॥ 8

అథో - అందువలన, జంతోః - మానవుని, మనః - మనస్సు, గుణ-అనురక్తమ్ - గుణకార్యములగు విషయభోగములయందు అనురాగము గలదియై, వ్యసనాయ - దుఃఖము కొరకు, నైర్గుణ్యమ్ - గుణసంబంధము లేనిదై, క్షేమాయ - సుఖము కొరకు, స్యాత్ - అగును, యథా - ఏ విధముగానైతే, ప్రదీపః - దీపము, ఘృతవర్తిమ్ - నేతివత్తిని, అశ్నన్ - భక్షించుచున్నదై, సధూమాః - పొగతో గూడిన, శిఖాః - జ్వాలలను, భజతి హి - పొందును గదా!, అన్యదా - అట్లు కాని సమయములో, స్వమ్ - తన స్వరూపమును పొందునో, తథా - అదే విధముగా, గుణకర్మ-అనుబద్ధమ్ - గుణకార్యములగు విషయభోగములయందు కర్మలయందు తగుల్కొన్న, మనః - మనస్సు, వృత్తీః - వృత్తులను, అన్యత్ర - అట్లు గాని సమయమునందు, తత్త్వమ్ - పరమార్థమగు, పదమ్ - పదము (పొందదగిన లక్ష్యము) ను, శ్రయతే - ఆశ్రయించుచున్నది.

అందువలన, త్రిగుణాత్మికయగు ప్రకృతియొక్క కార్యములగు భోగములయందు ఆసక్తి గల వ్యక్తికి వాని మనస్సే దుఃఖహేతువు అగును. అదే మనస్సు గుణములకు అతీతముగా తన స్వరూపమగు ఆత్మచైతన్యమునందు విలీనమై మోక్షహేతువు అగును. నేతివత్తిలోని నేతిని పీల్చే దీపము పొగతో గూడిన జ్వాలలను సృష్టించును. అదే దీపము నేతిని గ్రహించుట మానివేసినచో, తన స్వరూపమగు మహాభూతాగ్నిలో విలీనమగును. అదే విధముగా, గుణకార్యములగు విషయభోగములయందు,

దానిని బట్టి వివిధకర్మలయందు తగుల్కొన్న మనస్సు నిరంతరముగా ఆలోచనలను సృష్టించుచునే యుండును. అదే మనస్సు విషయభోగము లను విడిచిపెట్టినచో, పరమపదమగు ఆత్మతత్త్వమును పొంది యుండు ను.

ఏకాదశాసన్మనసో హి వృత్తయ
ఆకూతయః పంచ ధియోఽభిమానః ।
మాత్రాణి కర్మాణి పురం చ తాసాం
వదంతి హైకాదశ వీర భూమీః ॥ 9

గంధాకృతిస్పర్శరసశ్రవాంసి
విసర్గరత్యర్త్యభిజల్పశిల్పాః ।
ఏకాదశం స్వీకరణం మమేతి
శయ్యామహం ద్వాదశమేక ఆహుః ॥ 10

వీర - ఓ వీరుడా!, మనసః - మనస్సునకు, ఆకూతయః - క్రియా రూపములు, పంచ - ఐదు, ధియః - జ్ఞానరూపములు, అభిమానః - నేను నాది అనే అభిమానము, ఏకాదశ - పదకొండు, వృత్తయః - వృత్తులు, ఆసన్ - ఉండెను, తాసామ్ - వాటికి, మాత్రాణి - తన్మాత్రలు, కర్మాణి - కర్మలు, పురం చ - నగరము అనదగిన దేహము, ఏకాదశ - పదకొండు, భూమీః - విషయములని, వదంతి - చెప్పుచున్నారు, గంధ-ఆకృతిస్పర్శ రసశ్రవాంసి - గంధము రూపము స్పర్శ రసము శబ్దములు, విసర్గరతి-అ ర్తి-అభిజల్పశిల్పాః - విసర్జనము సంభోగము గమనము మాటలాడుట ఇచ్చుట పుచ్చుకొనుటలు, మమ - నాది, ఇతి - అని, స్వీకరణమ్ - స్వీక రించబడే దేహము, ఏకాదశమ్ - పదకొండవది, శయ్యామ్ - శరీరమును, అహమ్ - అహంకారమును, ద్వాదశమ్ - పన్నెండవదిగా, ఏకే - కొంద రు, ఆహుః - చెప్పుచున్నారు.

ఓ వీరా! అయిదు కర్మేంద్రియములు, అయిదు జ్ఞానేంద్రియము లు, అహంకారము అనే పదకొండు మనస్సుయొక్క వ్యాపారములు. చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు అనే జ్ఞానేంద్రియములకు క్రమముగా

శబ్దస్పర్శరూపరసగంధములనే తన్మాత్రలు (ఇతరభూతముల సమ్మేళ నము లేకుండా కేవలము ఒకే లక్షణము ప్రకటమగుట) విషయములు. చేతులు, కాళ్లు, నోరు, జననేంద్రియము, విసర్జనేంద్రియము అనే అయిదు కర్మేంద్రియములకు క్రమముగా ఇచ్చి పుచ్చుకొనుట, నడచుట, మాటలా డుట, సంభోగము, విసర్జనము అనే అయిదు క్రియలు విషయములు. అహంవృత్తికి పురము అనే శరీరముందు నేను, నాది అనే దేహాభిమానమే విషయము. ఈ విధముగా విషయములు కూడ వెరసి పదకొండు అని మహాత్ములు చెప్పుచున్నారు. దేహమునందు నేను అనే అభిమానము (అ హంకారము) ను, నాది అనే అభిమానము (మమకారము) ను విడిగా లెక్కించి కొందరు పన్నెండు వృత్తులను, పన్నెండు విషయములను చెప్పు చున్నారు.

ద్రవ్యస్వభావాశయకర్మకాలైరేకాదశామీ మనసో వికారాః ।
సహస్రశశ్శతశః కోటిశశ్చ క్షేత్రజ్ఞతో న మిథో న స్వతస్స్యుః ॥11

అమీ - ఈ, ఏకాదశ - పదకొండు, మనసః - మనస్సుయొక్క, వికారాః - వికారములు, ద్రవ్యస్వభావ-ఆశయకర్మకాలైః - ద్రవ్యము స్వభావము సంస్కారము కర్మ మరియు కాలములచే, శతశః - వందలాది గా, సహస్రశః - వేలాదిగా, కోటిశః చ - కోట్లాదిగా కూడ, స్యుః - ఉండు ను, క్షేత్రజ్ఞతః - క్షేత్రమును తెలుసుకుంటూ ఉండే ఆత్మచైతన్యము వల న, మిథః - పరస్పరము కలియుట వలన, న - కాదు, స్వతః - తమంత తాముగా, న - కాదు.

గంధాదిద్రవ్యములను బట్టి, వ్యక్తియొక్క స్వభావమును బట్టి, సంస్కారములను బట్టి, కాలము కర్మల ప్రభావముచే కూడ ఈ మానసవి కారములు వందల, వేల, కోట్ల రకములుగా నుండును. క్షేత్రము (దేహేం ద్రియమనస్సంఘాతము) ను సాక్షిగా దర్శిస్తూ ఉండే ఆత్మచైతన్యము వలననే, ఈ వికారములకు సత్త (ఉనికి) మరియు స్ఫురణము (ప్రకాశము) గలవు. అంతే గాని, ఈ మనో వికారముల సత్తాస్ఫూర్తులకు ఆత్మ-అనా త్మల వాస్తవమగు కలయిక హేతువు కాదు. మరియు, అవి స్వతంత్రమగు సత్తాస్ఫురణములు కలవి కూడ కావు.

**క్షేత్రజ్ఞ ఏతా మనసో విభూతీర్జీవస్య మాయారచితస్య నిత్యాః ।**
**ఆవిర్హితాః క్వాపి తిరోహితాశ్చ శుద్ధో విచష్టే హ్యావిశుద్ధకర్తుః ।।12**

జీవస్య - జీవుని ఉపాధియైనట్టియు, మాయారచితస్య - మాయచే నిర్మించబడినట్టియు, అవిశుద్ధకర్తుః - బంధహేతువగు కర్మను చేసే, మనసః - మనస్సుయొక్క, నిత్యాః - ప్రవాహరూపములైనట్టియు, క్వ అపి - ఒక కాలమునందు, ఆవిర్హితాః - ప్రకటమగునట్టియు, చ - మరియొక కాలమునందు, తిరోహితాః - అంతర్ధానమయ్యే, ఏతాః - ఈ, విభూతీః - ప్రకాశించే వృత్తులను, శుద్ధః - అసంగుడైన, క్షేత్రజ్ఞః - క్షేత్రజ్ఞుడు, విచష్టే హి - దర్శించుచున్నాడు గదా!

త్రిగుణాత్మికయగు మాయయొక్క కార్యమైన ఈ మనస్సే జీవుని ఉపాధి. ఇదియే సంసారబంధమునకు కారణమైన కర్మలను చేయును. దీని యందు జాగ్రత్స్వప్నములలో ప్రకటమై నిద్రలో అంతర్ధానమయ్యే వృత్తి (ఆలోచన) ప్రకాశములను అసంగుడగు క్షేత్రజ్ఞుడు సాక్షిగా దర్శించుచుండును. క్షేత్రమనగా దేహేంద్రియమనస్సంఘాతము. దానిని తెలుసుకుంటూ ఉండే ఆత్మచైతన్యమే క్షేత్రజ్ఞుడు.

**క్షేత్రజ్ఞ ఆత్మా పురుషః పురాణః**
**సాక్షాత్స్వయంజ్యోతిరజః పరేశః ।**
**నారాయణో భగవాన్వాసుదేవః**
**స్వమాయయాఽఽత్మన్యవధీయమానః ।। 13**

క్షేత్రజ్ఞః - క్షేత్రజ్ఞుడు, ఆత్మా - వ్యక్తియొక్క అంతరతమమగు స్వరూపము, పురుషః - దేహమునందు ప్రకటమగువాడు, పురాణః - కాలమునకు అతీతుడు, సాక్షాత్ - పరోక్షుడు (తెలియబడనివాడు) కాడు, స్వయంజ్యోతిః - స్వయముగా ప్రకాశించువాడు, అజః - పుట్టుక లేనివాడు, పర-ఈశః - సర్వాతిశాయియగు ఈశ్వరుడు, నారాయణః - నారాయణుడు, భగవాన్ - భగవానుడు, వాసుదేవః - వాసుదేవుడు (ప్రాణులలో చైతన్యరూపుడుగా నుండువాడు), స్వమాయయా - తన మాయాశక్తిచే, ఆత్మని - బుద్ధియందు, అవధీయమానః - అంతర్యామియై ఉండువాడు.

ఈ దేహేంద్రియమనస్సంఘాతమునకు సాక్షియై ఉండే చైతన్యమే వ్యక్తియొక్క ఆత్మ. కాలాతీతుడు, సర్వేశ్వరుడు అగు నారాయణుడే అట్టి ఆత్మరూపముగా అపరోక్షుడై ఈ దేహమునందు ప్రకటమగుచున్నాడు. తన మాయాశక్తిచే సకలప్రాణుల బుద్ధియందు అంతర్యామియై స్వయంప్రకాశస్వరూపుడుగా విరాజిల్లే ఆ భగవానునకు పుట్టుక లేదు.

యథాఽనిలః స్థావరజంగమానామాత్మస్వరూపేణ నివిష్ట ఈశేత్ ।
ఏవం పరో భగవాన్వాసుదేవః క్షేత్రజ్ఞ ఆత్మేదమనుప్రవిష్టః ।। 14

యథా - ఏ విధముగానైతే, అనిలః - వాయువు, స్థావరజంగమానామ్ - కదలని మరియు కదిలే ప్రాణులయొక్క, ఆత్మస్వరూపేణ - ప్రాణశక్తిరూపముగా, నివిష్టః - ఉన్నవాడై, ఈశేత్ - నియమించునో, ఏవమ్ - ఇదే విధముగా, పరః - ప్రకృతికి అతీతుడగు, భగవాన్ వాసుదేవః - వాసుదేవ భగవానుడు, క్షేత్రజ్ఞః - దేహేంద్రియమనస్సంఘాతమును దర్శించే, ఆత్మా - అంతరతమమగు చైతన్యస్వరూపుడై, ఇదమ్ - ఈ జగత్తును, అను - సృష్టించిన పిదప, ప్రవిష్టః - ప్రవేశించినవాడు.

కదిలే మరియు కదలని ప్రాణులలో వాయువు ప్రాణశక్తిరూపముగా ఉంటూ, వాటిని నియమించును. అదే విధముగా, ప్రకృతికి అతీతుడగు వాసుదేవ భగవానుడు ఈ జగత్తును సృష్టించిన పిదప, సకలప్రాణులలో క్షేత్రమునకు సాక్షియగు ఆత్మచైతన్యము రూపముగా ప్రవేశించినాడు (అనగా, ఆ రూపముగా ఉపలభ్యమగుచున్నాడు).

న యావదేతాం తనుభృన్నరేంద్ర
విధూయ మాయాం వయునోదయేన ।
విముక్తసంగో జితషట్సపత్నో
వేదాత్మతత్త్వం భ్రమతీహ తావత్ ।। 15

న యావదేతన్మన ఆత్మలింగం
సంసారతాపావపనం జనస్య ।

యచ్ఛోకమోహామయరాగలోభ-
వైరానుబంధం మమతాం విధత్తే ॥ 16

నర-ఇంద్ర - ఓ మహారాజా!, తనుభృత్ - దేహధారియగు వ్యక్తి, విముక్తసంగః - విడిచిపెట్టబడిన సంసారమునందలి ఆసక్తి గలవాడై, జితషట్-సపత్నః - జయించబడిన ఆర్గురు శత్రువులు గలవాడై, వయున-ఉదయేన - జ్ఞానముయొక్క ఉదయించుటచే, ఏతామ్ - ఈ, మాయామ్ - అజ్ఞానమును, విధూయ - తొలగించుకొని, ఆత్మతత్త్వమ్ - తన స్వరూపమును, యావత్ - ఎంతవరకైతే, న వేద - తెలియకుండునో, తావత్ - అంతవరకు, ఇహ - ఈ సంసారములో, భ్రమతి - తిరుగాడుచుండును, యావత్ - ఎంతవరకైతే, ఆత్మలింగమ్ - ఆత్మకు ఉపాధియగు, ఏతత్ - ఈ, మనః - మనస్సు, జనస్య - మానవునకు, సంసారతాప-ఆవపనమ్ - సంసారమునందలి దుఃఖములకు క్షేత్రమని, న - తెలియకుండునో, యత్ - ఏ మనస్సైతే, శోకమోహ-ఆమయరాగలోభవైర-అనుబంధమ్ - శోకము వ్యామోహము (అనిత్యమును నిత్యమని భ్రమపడుట) రోగము ఆసక్తి లోభము వైరముల ఎడతెగని సంబంధమును, మమతామ్ - మమకారమును, విధత్తే - కలిగించునో.

ఓ మహారాజా! దేహధారియగు వ్యక్తి సంసారమునందలి ఆసక్తిని విడిచిపెట్టి, కామక్రోధలోభమోహమదమాత్సర్యములనే ఆర్గురు అంతశ్శత్రువులను జయించవలెను. అట్టి సాధకుడు ఆత్మజ్ఞానమును పొంది, ఈ అజ్ఞానమును తొలగించుకొనవలెను. ఆత్మస్వరూపమునకు ఉపాధి (సమీపములోనుండి తన ధర్మములను ఇతరమునకు సంక్రమింపజేసినట్లు కన్పట్టునది) యగు మనస్సే సంసారములో దుఃఖములను పండించే పొలము అని సాధకుడు తెలియవలెను. మనస్సే మానవునకు మమకారమును పెంచి, శోకము వ్యామోహము చింతలు ఆసక్తి లోభము మరియు వైరములతో ఎడతెగని సంబంధమును కలిగించును. ఎంతవరకైతే సాధకుడు ఆత్మవిచారమును చేసి తన స్వరూపమును తెలియకుండునో, అంతవరకు ఈ సంసారములో తిరుగాడుచుండును.

భ్రాతృవ్యమేనం తదదభ్రవీర్య-
ముపేక్షయాఽధ్యేధితమప్రమత్తః ।
గురోర్హరేశ్చరణోపాసనాస్త్రో
జహి వ్యలీకం స్వయమాత్మమోషమ్ ॥ 17

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే
భరతరహూగణసంవాదే మనోవిజయవర్ణనం
నామ ఏకాదశోఽధ్యాయః ॥

తత్ - అందువలన, భ్రాతృవ్యమ్ - శత్రువు అయినట్టియు, అదభ్ర వీర్యమ్ - చాల బలము కలిగినట్టియు, ఉపేక్షయా - ఉపేక్ష చేయుటచే, అధి-ఏధితమ్ - చాల బలపడినట్టియు, స్వయమ్ - తనంత తానుగా, వ్యలీకమ్ - మిథ్య అయినట్టియు, ఆత్మమోషమ్ - ఆత్మస్వరూపమును అపహరించే, ఏనమ్ - ఈ మనస్సును, గురోః - గురువుయొక్క, హరేః - శ్రీహరియొక్క, చరణ-ఉపాసన-అస్త్రః - పాదములను సేవించుట అనే అస్త్రము గలవాడవై, అప్రమత్తః - జాగరూకుడవై, (ఉపేక్షయా - సాక్షిగా నిలిచియుండుటచే), జహి - సంహరించుము.

కావున, ఈ మనస్సే నీకు శత్రువు. ఇది తనంత తానుగా మిథ్యయే అయిననూ, దీని బలము చాల పెద్దది. దీనిని ఉపేక్ష చేయుటచే, దీని బలము మరింత పెరిగి, ఇది ఆత్మస్వరూపమును కప్పివేయుచున్నది. గురువుయొక్క మరియు శ్రీహరియొక్క పాదములను సేవించుటయే దీనిని నాశము చేసే గొప్ప ఆయుధము. దీనికి సాక్షియై నిలిచియుండుట కూడ దీని వినాశమునకు తోడ్పడును. నీవు జాగరూకుడవై ఈ మనస్సును నాశము చేయుము.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో
రహూగణ జడభరత సంవాదములో మనోవిజయము అనే
పదకొండవ అధ్యాయము ముగిసినది (**11**).

*****

# అథ ద్వాదశోऽధ్యాయః

## రహూగణ జడభరత సంవాదము - జగన్మిథ్యాత్వ నిరూపణము

రహూగణ ఉవాచ ।
నమో నమః కారణవిగ్రహాయ
స్వరూపతుచ్ఛీకృతవిగ్రహాయ ।
నమోऽవధూత ద్విజబంధులింగ-
నిగూఢనిత్యానుభవాయ తుభ్యమ్ ॥ 1

అవధూత - ఓ మహాయోగీ!, కారణవిగ్రహాయ - కారణదేహుడవైనట్టియు, స్వరూపతుచ్ఛీకృతవిగ్రహాయ - ఆత్మజ్ఞానముచే తిరస్కరించబడిన భేదము కలిగినట్టియు, ద్విజబంధులింగనిగూఢనిత్య-అనుభవాయ - బ్రాహ్మణాధముని చిహ్నములచే అతిరహస్యముగా నుంచబడిన సర్వకాలములయందలి ఆత్మానుభవము గల, తుభ్యమ్ - నీ కొరకు, నమః నమః నమః - అనేక నమస్కారములు.

రహూగణుడు ఇట్లు పలికెను --- ఓ మహాయోగీ! నీవు కారణజన్ముడవు. నీవు ఆత్మజ్ఞానముచే భేదదృష్టిని నిరాకరించితివి. నీవు సర్వకాలములలో ఆత్మనిష్ఠుడవై యుందువు. కాని, నీవు బ్రాహ్మణాధముని వేషములో నుండుటచే, ఆ సంగతి అతిరహస్యముగా నున్నది. నీకు అనేక నమస్కారములు.

జ్వరామయార్తస్య యథాऽగదం సత్
నిదాఘదగ్ధస్య యథా హిమాంభః ।

కుదేహమానాహివిదష్టదృష్టేః
బ్రహ్మన్ వచస్తేఽమృతమౌషధం మే ॥ 2

బ్రహ్మన్ - ఓ మహాత్మా!, జ్వర-ఆమయ-ఆర్తస్య - జ్వరమనే రోగముచే పీడించబడినవానికి, సత్ - జ్వరమును తగ్గించే, అగదమ్ - మందు, యథా - ఎటులనో, నిదాఘదగ్ధస్య - ఎండ వేడిచే (పాపముచే) తపింపజేయబడినవానికి, హిమ-అంభః - చల్లని (గంగ) నీరు, యథా - ఎటులనో, కుదేహమాన-అహివిదష్టదృష్టేః - కుత్సితమైన శరీరమునందు అభిమానము అనే పాముచే గట్టిగా కాటు వేయబడిన దృష్టి గల, మే - నాకు, తే - నీ, వచః - వచనము, అమృతమ్ - అమృతమువంటి, ఔష ధమ్ - మందు.

జ్వరముతో పీడను పొందియున్న వానికి జ్వరబాధను పోగొట్టే మందు ఎట్టిదో, ఎండ వేడిచే తాపమును పొందియున్నవానికి చల్లని నీరు ఎట్టిదో, పాపముచే పీడించబడువానికి గంగాజలము ఎట్టిదో, కుత్సితమైన శరీరమునందు నేను అనే అభిమానముగల నాకు మీ మాటలు అట్టివి. పాము విషమువంటి ఈ దేహాభిమానము నా వివేకమును నశింపజేసినది. అట్టి నాకు మీ మాటలు అమృతము, మందుల వంటివి.

తస్మాద్భవంతం మమ సంశయార్థం
ప్రక్ష్యామి పశ్చాదధునా సుబోధమ్ ।
అధ్యాత్మయోగగ్రథితం తవోక్త-
మాఖ్యాహి కౌతూహలచేతసో మే ॥ 3

తస్మాత్ - అందువలన, మమ - నా, సంశయ-అర్థమ్ - సంశయ ముయొక్క విషయమును గురించి, భవంతమ్ - నిన్ను, పశ్చాత్ - తరువా త, ప్రక్ష్యామి - ప్రశ్నించగలను, అధునా - ఇప్పుడు, అధ్యాత్మయోగగ్రథి తమ్ - అధ్యాత్మయోగముతో కూర్చబడిన, తవ - నీ, ఉక్తమ్ - ఉపదేశము ను, కౌతూహలచేతసః - ఉత్కంఠతో కూడిన మనస్సు గల, మే - నాకు, సుబోధమ్ - చక్కగా తెలిసే విధముగా, ఆఖ్యాహి - చెప్పుము.

అందువలన, నాకు సందేహము గల విషయములను నేను తమరిని తరువాత ప్రశ్నించెదను. మీరు అధ్యాత్మయోగము (ఆత్మస్వరూపము యొక్క జ్ఞానము) తో గూడిన ఉపదేశమును చేసియుంటిరి. నా మనస్సులో దానిని తెలుసుకోవాలనే ఉత్కంఠ గలదు. కావున, ఇప్పుడు తమరు నాకా విషయము చక్కగా తెలిసే విధముగా వివరించుడు.

యదాహ యోగేశ్వర దృశ్యమానం
క్రియాఫలం సద్వ్యవహారమూలమ్ ।
న హ్యంజసా తత్త్వవిమర్శనాయ
భవానముష్మిన్ భ్రమతే మనో మే ॥ 4

యోగేశ్వర - ఓ మహాయోగీ!, దృశ్యమానమ్ - కానవచ్చేది, సత్ - యథార్థము అగు, (సత్-వ్యవహారమూలమ్ - సత్యమగు లోకవ్యవహారమునకు మూలమైన), క్రియాఫలమ్ - కర్మఫలము, వ్యవహారమూలమ్ - నామరూపవ్యవహారము మాత్రమే మూలమునందు గలదియని, అంజసా - సాక్షాత్తుగా, తత్త్వవిమర్శనాయ - పరమార్థతత్త్వముయొక్క విచారము కొరకు, అంజసా - తేలికగా, న హి - నిలబడదని, భవాన్ - తమరు, యత్ - ఏ వచనమును, ఆహ - చెప్పితిరో, అముష్మిన్ - ఈ విషయమునందు, మే - నా, మనః - మనస్సు, భ్రమతే - భ్రమించుచున్నది.

ఓ మహాయోగీ! ప్రత్యక్ష-అనుమాన ప్రమాణములచే తెలియవచ్చే సుఖదుఃఖాది కర్మఫలము యథార్థమనియే తోచును. సత్యముగా భాసించే లోకవ్యవహారమునకు ఈ అనుభవమే మూలము. కాని, ఈ క్రియాఫలములు కేవలము నామరూప (మిథ్యాభూతమగు) వ్యవహారము మాత్రమే మూలముగా గలది అనియు, పరమార్థతత్త్వముయొక్క విచారము ముందు ఇది నిలబడేది గాదనియు తమరు సెలవిచ్చిరి. ఈ అంశములో నా మనస్సు భ్రమకు గురియగుచున్నది.

బ్రాహ్మణ ఉవాచ ।
అయం జనో నామ చలన్ పృథివ్యాం
యః పార్థివః పార్థివ కస్య హేతోః ।

తస్యాపి చాంఘ్ర్యోరధి గుల్ఫజంఘా-
జానూరుమధ్యోరశిరోధరాంసాః ।। 5

పార్థివ - ఓ మహారాజా!, అయమ్ - ఈ, జనః నామ - మనిషి అని ప్రసిద్ధిని చెందిన దేహము, కస్య - ఒకానొక, హేతోః - కారణమునకు, పృథివ్యామ్ - భూమిపై, చలన్ - నడచుచున్నది, యః - ఏదైతే, పార్థివః - పృథివీవికారమో, తస్య అపి - దానికి కూడ, అంఘ్ర్యోః అధి - పాదములపై, గుల్ఫజంఘాజాను-ఊరుమధ్య-ఉరశిరోధర-అంసాః - చీలమండలు పిక్కలు మోకాళ్లు తొడలు నడుము వక్షఃస్థలము మెడ భుజములు.

జడభరతుడిట్లు పలికెను --- ఓ మహారాజా! వ్యక్తియని ప్రసిద్ధిని గాంచిన ఈ దేహము ఏదో ఒక కారణముగా నేలపై నడుచుచున్నది. అయిననూ, ఇది కేవలము పృథివియొక్క వికారము (జడము) మాత్రమే. దేహము అనేది కూడ రెండు పాదములు, వాటిపై చీలమండలు, పిక్కలు, మోకాళ్లు, తొడలు, నడుము, వక్షఃస్థలము, మెడ మరియు భుజములు అనే అవయవముల కలయిక మాత్రమే. దేహము అనే స్వతంత్రమైన తత్త్వమేదియు లేదు.

అంసేఽధి దార్వీ శిబికా చ యస్యాం
సౌవీరరాజేత్యపదేశ ఆస్తే ।
యస్మిన్ భవాన్ రూఢనిజాభిమానో
రాజాఽస్మి సింధుష్వితి దుర్మదాంధః ।। 6

అంసే అధి - భుజముపై, దార్వీ - చెక్కతో చేసిన, శిబికా - పల్లకి, యస్యామ్ - దేనియందు, సౌవీరరాజః - సౌవీరదేశపు రాజు, ఇతి - అనే, అపదేశః - నామమాత్రము, ఆస్తే - ఉన్నదో, యస్మిన్ - ఏ నామమునందు, రూఢనిజ-అభిమానః - దృఢముగా నాటుకున్న నేను అనే అభిమానము గల, భవాన్ - నీవు, సింధుషు - సింధుదేశమునందు, రాజా - రాజును, అస్మి - అగుచున్నాను, ఇతి- అని, దుర్మద-అంధః - చెడ్డ గర్వముచే కన్ను మిన్ను కానరానివాడవు.

భుజముపై చెక్కతో చేసిన పల్లకీ ఉన్నది. దానిలో సౌవీరదేశపు రాజు అనే నామరూపములు మాత్రమే ఉన్నవి. ఆ నామరూపముల యందు నేను అనే అభిమానము నీయందు దృఢముగా నాటుకొని యున్నది. అట్టి దేహాభిమానివియగు నీవు, నేను సింధుదేశపు రాజును అనే పెద్ద గర్వముతో కన్ను మిన్ను కానరాకుండ నున్నావు.

శోచ్యానిమాంస్త్వమధికష్టదీనాన్ విష్ట్యా నిగృహ్ణన్నిరనుగ్రహోఽసి ।
జనస్య గోప్తాఽస్మి వికత్థమానో న శోభసే వృద్ధసభాసు ధృష్టః ॥7

శోచ్యాన్ - శోకింప దగినట్టియు, అధికష్టదీనాన్ - అధికమగు కష్టముచే దీనులైన, ఇమాన్ - వీరిని, విష్ట్యా - కూలిచే, నిగృహ్ణన్ - నియంత్రించువాడవై, నిరనుగ్రహః - దయ లేనివాడవు, అసి - అగుదువు, జనస్య - జనముయొక్క, గోప్తా - రక్షకుడను, అస్మి - అగుచున్నాను అని, వికత్థమానః - గొప్పలు చెప్పుకొనువాడవై, ధృష్టః - గర్విష్ఠివైన నీవు, వృద్ధసభాసు - పెద్దల సభలయందు, న శోభసే - శోభిల్లవు.

అధికమగు కష్టమును చేస్తూ దీనులైయున్న ఈ కూలీలను చూచి నచో దుఃఖము కలుగును. దయనెరుంగని నీవు వీరికి కూలినిచ్చి పల్లకీని మోయించుచున్నావు. పైగా, నేను జనులను రక్షించువాడను అని బీరములు పలికెదవు. నీవంటి గర్విష్ఠి మహాత్ముల సన్నిధిలో శోభిల్లదు.

యదా క్షితావేవ చరాచరస్య
విదామ నిష్ఠాం ప్రభవం చ నిత్యమ్ ।
తన్నామతోఽన్యద్వ్యవహారమూలం
నిరూప్యతాం సత్క్రియయాఽనుమేయమ్ ॥ 8

యదా - ఏ కాలమునందైతే, చర-అచరస్య - కదిలే మరియు కదలని ప్రాణిసమూహమునకు, నిత్యమ్ - సర్వకాలములలో, క్షితౌ ఏవ - పృథివియందు మాత్రమే, నిష్ఠామ్ - మనుగడ (విలీనమగుట) ను, ప్రభవం చ - పుట్టుకను కూడ, విదామ - తెలియుచున్నామో, తత్ - అప్పుడు, నామతః - నామముకంటె, అన్యత్ - మరియొకటి, వ్యవహారమూలమ్ -

లోకవ్యవహారమునకు మూలమైన, సత్ - సత్యము, క్రియయా - క్రియచే, అనుమేయమ్ - ఊహించ దగినది, నిరూప్యతామ్ - నిర్దేశించబడు గాక!

కదిలే మరియు కదలని ప్రాణులు అన్నీ పృథివినుండియే పుట్టి, పృథివియందే మనుగడను సాగించి, పృథివియందే విలీనమగుచున్నవని మనకు తెలియుచునే యున్నది. ఇట్టి స్థితిలో ప్రాణిదేహములన్నియు పృథివీ వికారములు మాత్రమే అయి ఉండగా, లోకవ్యవహారమునకు మూలమునందు నామరూపములకంటె భిన్నమైన సత్యతత్త్వము ఒకటి ఉన్నదని నిర్దేశించుట పొసగదు. వాటియందు ప్రకటమయ్యే క్రియలను బట్టి వాటికి మూలమగు సత్యతత్త్వము గలదని ఊహించుటయు పొసగదు.

ఏవం నిరుక్తం క్షితిశబ్దవృత్త-
మసన్నిధానాత్పరమాణవో యే ।
అవిద్యయా మనసా కల్పితాస్తే
యేషాం సమూహేన కృతో విశేషః ॥ 9

అసత్-నిధానాత్ - అవ్యక్తము (కారణము) అగు పరమాణువుల యందు విలీనమగుట వలన, క్షితిశబ్దవృత్తమ్ - పృథివి అనే నామముచే నిర్దేశించబడేది, ఏవమ్ - ఈ విధముగనే, నిరుక్తమ్ - నిర్ధారించబడినది, యే - ఏ, పరమాణవః - పరమాణువులు గలవో, తే - అవి, అవిద్యయా - అజ్ఞానముచే, మనసా - మనస్సుచే, కల్పితాః - కల్పితములు, యేషామ్ - వేటి, సమూహేన - సముదాయముచే, విశేషః - విశిష్టమగు పదార్థము, కృతః - చేయబడినదో.

పృథివియైననూ తనకు కారణములు, అవ్యక్తములు అగు పరమాణువులలో విలీనమగును. కావున, పృథివి అనే నామముచే నిర్దేశించబడే రూపముకంటె భిన్నముగా సత్యతత్త్వము ఒకటి గలదని చెప్పుట పొసగదు. ఈ పరమాణువులు కూడ అజ్ఞానముచే మనస్సు కల్పించినవియే. అవి ఒకచో ప్రోగుపడి, పృథివి అనే ఒక మిథ్యారూపమే ఒక విశిష్టపదార్థముగా కానవచ్చుచున్నది.

ఏవం కృశం స్థూలమణుర్బృహద్యద్
అసచ్చ సజ్జీవమజీవమన్యత్ ।
ద్రవ్యస్వభావాశయకాలకర్మ-
నామ్నాఽజయాఽవేహి కృతం ద్వితీయమ్ ॥ 10

ఏవమ్ - ఇదే విధముగా, అన్యత్ - ఇతరము, కృశమ్ - చిక్కియున్నది, స్థూలమ్ - లావుగా నున్నది, అణుః - చిన్నది, బృహత్ - పెద్దది, అసత్ - కారణము, చ - మరియు, సత్ - కార్యము, జీవమ్ - ప్రాణము గలది, అజీవమ్ - ప్రాణము లేనిది, యత్ - ఏది గలదో, ద్వితీయమ్ - ద్వైతప్రపంచము, ద్రవ్యస్వభావ-ఆశయకాలకర్మనామ్నా - పంచభూతములు స్వభావము సంస్కారము కాలము కర్మఫలము అని వ్యవహరించబడే, అజయా - పుట్టుక లేని మాయచే, కృతమ్ - చేయబడినదిగా, అవేహి - తెలియుము.

ఈ ద్వైతప్రపంచములో చిక్కియున్నది, లావుగా నున్నది, చిన్నది, పెద్దది, కారణము, కార్యము, ప్రాణము గలది, ప్రాణము లేనిది అంటూ అనేకములగు తేడాలు కానవచ్చుచున్నవి. ఈ భేదజాతమంతయు పృథివి వలెనే కేవలము నామరూపములు మాత్రమేనని తెలియుము. మాయాశక్తియే పంచభూతములు, వివిధప్రాణుల స్వభావములు, వాటి సంస్కారములు, కాలము, కర్మఫలము మొదలగు నామములను దాల్చి, ఈ నానాత్వమును కల్పించుచున్నది (లేకున్ననూ కానవచ్చునట్లు చేయుచున్నది).

జ్ఞానం విశుద్ధం పరమార్థమేక-
మనంతరం త్వబహిర్బ్రహ్మ సత్యమ్ ।
ప్రత్యక్ ప్రశాంతం భగవచ్ఛబ్దసంజ్ఞం
యద్వాసుదేవం కవయో వదంతి ॥ 11

తు - ఈ నానాత్వమునకు భిన్నముగా, జ్ఞానమ్ - జ్ఞప్తి స్వరూపము, విశుద్ధమ్ - కర్తృత్వభోక్తృత్వాదులు లేనిది, పరమ-అర్థమ్ - సర్వమునకు అతీతమైన సత్త, ఏకమ్ - రెండవది లేనిది, అనంతరమ్ - లోపల లేనిది, అబహిః - బాహ్యము లేనిది అగు, బ్రహ్మ - పరబ్రహ్మ, సత్యమ్ -

యథార్థ తత్త్వము, ప్రత్యక్ - వ్యక్తియొక్క అంతరతమమగు స్వరూపము, ప్రశాంతమ్ - వికారములు లేనిది, భగవత్-శబ్దసంజ్ఞితమ్ - భగవానుడు అనే పేరుతో వ్యవహరించ బడునది, యత్ - దేనిని, కవయః - మహాత్ము లు, వాసుదేవమ్ - వాసుదేవునిగా, వదంతి - చెప్పుచున్నారో.

ఈ నానాత్వముకంటె విలక్షణమైన యథార్థతత్త్వమే పరబ్రహ్మ (అఖండసత్త). అది కర్తృత్వభోక్తృత్వాది దోషములు లేని జ్ఞప్తి (నిర్విశేష జ్ఞానము, లేక చైతన్యము) యే స్వరూపముగా గలది. సర్వవ్యాపకమగు దానియందు బయట, లోపల అనే భేదములు లేవు. జీవుని అంతరతమ మగు స్వరూపము వికారములు లేని ఆ పరబ్రహ్మయే. దానికే భగవాను డని పేరు. మహాత్ములు ఆ పరబ్రహ్మనే వాసుదేవుడు (సర్వజగత్తునకు అధిష్ఠానమైన చైతన్యము) అని వ్యవహరించెదరు.

రహూగణైతత్తపసా న యాతి
న చేజ్యయా నిర్వపణాద్గృహాద్వా ।
న చ్ఛందసా నైవ జలాగ్నిసూర్యైః
వినా మహత్పాదరజోఽభిషేకమ్ ॥ 12

రహూగణ - ఓ రహూగణా!, మహత్-పాదరజః-అభిషేకం వినా - మహాత్ముల పాదముల ధూళియొక్క అభిషేకము లేకుండా, ఏతత్ - దీనిని, తపసా - తపస్సుచే, న యాతి - పొందుట లేదు, చ - మరియు, ఇజ్యయా - యజ్ఞముచే, న - పొందుట లేదు, నిర్వపణాత్ - అన్నాదుల దానము వలన, గృహాత్ వా - గృహస్థధర్మముల వలన గాని, ఛందసా - వేదాధ్యయనముచే, న - పొందుట లేదు, జల-అగ్నిసూర్యైః - నీటి యందు అగ్నుల మధ్యలో ఎండలో చేసే తపస్సులచే, న ఏవ - నిశ్చయ ముగా పొందుట లేదు.

ఓ రహూగణా! సాధకుడు ఈ పరమాత్మతత్త్వమును నీటిలో నిల బడి చేసే తపస్సుచే గాని, పంచాగ్నుల (నాలుగు దిక్కులలో మంటలు, పైన ఎండ) మధ్యలో చేసే తపస్సుచే గాని, యజ్ఞముచే గాని, అన్నాదు లమ దానము చేయుట వలన గాని, సంతానప్రాప్తి మొదలగు గృహస్థధర్మ

ములను పాటించుట వలన గాని పొందజాలడు. మహాత్ముల పాదముల ధూళితో తలపై అభిషేకము వలన మాత్రమే ఈ పరమాత్మతత్త్వము సాధకునకు లభించును.

యత్రోత్తమశ్లోకగుణానువాదః
ప్రస్తూయతే గ్రామ్యకథావిఘాతః ।
నిషేవ్యమాణోఽనుదినం ముముక్షోః
మతిం సతీం యచ్ఛతి వాసుదేవే ॥ 13

యత్ర - ఏ మహాత్ములయందు, గ్రామ్యకథావిఘాతః - భోగములకు సంబంధించిన ప్రసంగములకు అడ్డుకట్టను వేసే, ఉత్తమశ్లోకగుణ-అనువాదః - పవిత్రకీర్తియగు శ్రీహరియొక్క గుణముల ప్రవచనము, ప్రస్తూయతే - ప్రవర్తిల్లునో, అనుదినమ్ - ప్రతిదినము, నిషేవ్యమాణః - సేవించబడుచున్నదై, ముముక్షోః - మోక్షమునందు ఇచ్ఛ గలవాని, సతీమ్ - పవిత్రమగు, మతిమ్ - మనస్సును, వాసుదేవే - వాసుదేవునియందు, యచ్ఛతి - సమర్పించునో.

మహాత్ముల సన్నిధిలో పవిత్రకీర్తియగు శ్రీహరియొక్క గుణముల ప్రస్తావము ప్రవర్తిల్లుచుండును. దాని వలన భోగములకు సంబంధించిన ప్రసంగములకు అడ్డుకట్ట పడును. మోక్షమును గోరు సాధకుడు అట్టి ప్రవచనములను ప్రతిదినము సేవించుచున్నచో, వాని అంతఃకరణము శుద్ధమై, వాసుదేవునియందు లగ్నమగును.

అహం పురా భరతో నామ రాజా
విముక్తదృష్టశ్రుతసంగబంధః ।
ఆరాధనం భగవత ఈహమానో
మృగోఽభవం మృగసంగాద్ధతార్థః ॥ 14

అహమ్ - నేను, పురా - పూర్వజన్మయందు, విముక్తదృష్టశ్రుతసంగబంధః - విడిచిపెట్టబడిన చూడబడే మరియు వినబడే వాటియందలి ఆసక్తియొక్క బంధము గల, భరతః నామ - భరతుడని ప్రసిద్ధిని గాంచిన,

రాజా - రాజును, భగవతః - భగవానుని, ఆరాధనమ్ - ఆరాధనను, ఈహ మానః - చేయువాడనై, మృగసంగాత్ - లేడియందలి ఆసక్తి వలన, హత -అర్థః - నశింప జేయబడిన ప్రయోజనము గలవాడనై, మృగః - లేడిగా, అభవమ్ - అయితిని.

నేను పూర్వజన్మయందు భరతుడని ప్రసిద్ధి చెందిన రాజును. మానవుడు కంటితో చూచి, చెవితో విని భోగములయందు ఆసక్తిని పెంచు కొనును. కాని, నేను అట్టి ఆసక్తి అనే బంధమునుండి బయట పడితిని. ఇహ లోక పరలోకములయందలి భోగములపై ఆసక్తిని విడిచి నేను భగవంతుని ఆరాధించెడివాడను. కాని, ఇంతలో ఒక లేడి పిల్లపై ఆసక్తిని పెంచుకొను టచే, ఆ ప్రయోజనము దెబ్బ తినెను. అపుడు నేను లేడినై పుట్టితిని.

సా మాం స్మృతిర్మృగదేహేఽపి వీర కృష్ణార్చనప్రభవా నో జహాతి।
అథో అహం జనసంగాదసంగో విశంకమానోఽవివృతశ్చరామి ॥15

వీర - ఓ వీరుడా!, కృష్ణ-అర్చనప్రభవా - శ్రీకృష్ణుని పూజించుట వలన కలిగిన, సా - ఆ, స్మృతిః - పూర్వజన్మస్మరణము, మామ్ - నన్ను, మృగదేహే అపి - లేడి శరీరమునందు కూడ, నో జహాతి - వీడకున్నది, అథో - అందువలన, అహమ్ - నేను, జనసంగాత్ - జనులతోడి సంగము వలన, విశంకమానః - భయపడుచున్నవాడనై, అసంగః - ఏకాకినై, అవి వృతః - ప్రకటము కానివాడనై, చరామి - తిరుగుచున్నాను.

ఓ వీరుడా! శ్రీకృష్ణుని పూజించుట వలన లేడి జన్మయందు కూడ పూర్వజన్మస్మృతి నన్ను విడిచి పోలేదు. కావుననే, నేను జనులతోడి సంగము వలన భయపడువాడనై, ఏకాకిగా నా అసలు స్థితి ఇతరులకు తెలి యకుండగా, సంచరించుచున్నాను.

తస్మాన్నరోఽసంగసుసంగజాత-
జ్ఞానాసినేహైవ వివృక్ణమోహః ।
హరిం తదీహాకథనశ్రుతాభ్యాం
లబ్ధస్మృతిర్యాత్యతిపారమధ్వనః ॥ 16

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే
రహూగణ జడభరత సంవాదే జగన్మిథ్యాత్వనిరూపణం
నామ ద్వాదశోऽధ్యాయః ||

తస్మాత్ - అందువలన, నరః - మానవుడు, అసంగసుసంగజాత జ్ఞాన-అసినా - సంసారాసక్తి లేని మహాత్ములతోడి మంచి సంగము (సంసారమునందు అసక్తి లేకుండుట, మంచి సంగముల) వలన కలిగిన ఆత్మజ్ఞానము అనే కత్తితో, ఇహ ఏవ - ఈ జన్మయందే, వివృక్ణమోహః - నశింపజేయబడిన వ్యామోహము గలవాడై, తత్-ఈహాకథనశ్రుతాభ్యామ్ - ఆ శ్రీహరియొక్క లీలలను చెప్పుట వినుటలచే, లబ్ధస్మృతిః - పొందబడిన ఆత్మజ్ఞానము గలవాడై, అధ్వనః - సంసారము అనే మార్గముయొక్క, అతిపారమ్ - శ్రేష్ఠమగు అంతిమలక్ష్యమైన, హరిమ్ - శ్రీహరిని, యాతి - పొందుచున్నాడు.

కావున, మానవుడు సంసారాసక్తిని వీడి, అట్టి మహాత్ములతో చక్కని సత్సంగమును చేయవలెను. అట్లు చేయు సాధకునకు ఆత్మజ్ఞానము ఉదయించును. ఆత్మజ్ఞానము అనే కత్తి ఆతనికి ఈ జన్మయందే సంసారవ్యామోహమును నశింపజేయును. శ్రీహరియొక్క లీలలను చెప్పుట, వినుట వలన ఆతడు సంసారమార్గమునకు అతీతముగా పరమలక్ష్య మైన శ్రీహరిని ఆత్మరూపముగా పొందును.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో
రహూగణ జడభరత సంవాదములో జగన్మిథ్యాత్వ నిరూపణము
అనే పన్నెండవ అధ్యాయము ముగిసినది (12).

*****

# అథ త్రయోదశోఽధ్యాయః

## రహూగణ జడభరత సంవాదము - సంసారము అనే అడవిలో ప్రయాణము

బ్రాహ్మణ ఉవాచ ।
దురత్యయేఽధ్వన్యజయా నివేశితో
రజస్తమస్సత్త్వవిభక్తకర్మదృక్ ।
స ఏష సార్థోఽర్థపరః పరిభ్రమన్
భవాటవీం యాతి న శర్మ విందతి ॥ 1

రజః-తమః-సత్త్వవిభక్తకర్మదృక్ - రజస్తమస్సత్త్వగుణములచే విభాగము చేయబడిన కర్మలయందు దృష్టి గలది, అర్థపరః - ధనమే (విషయభోగములే) ప్రధానముగా గలది అగు, ఏషః - ఈ, సః - ఆ, సార్థః - వర్తకుల దళము, అజయా - భగవానుని మాయచే, దురత్యయే - దాటశక్యము కాని, అధ్వని - మార్గమునందు, నివేశితః - ప్రవేశపెట్టబడినదై, భవ-అటవీమ్ - సంసారమనే అడవిని, పరిభ్రమన్ - అంతా తిరుగుచున్నదై, శర్మ - సుఖమును, న విందతి - పొందుట లేదు.

జడభరతుడిట్లు పలికెను --- ప్రసిద్ధమైన ఈ వర్తకుల దళము భగవానుని మాయకు లోబడి అడవి మార్గములో ప్రవేశించినది. ఈ గుంపు యొక్క దృష్టి సాత్త్విక రాజస తామసములనే విభాగము గల కర్మలయందు లగ్నమై యున్నది. ధనసంపాదనయే ఈ దళములోని వారల ప్రధానలక్ష్యము. ఈ విధముగా సంసారమనే అడవిలో అంతటా తిరుగాడుచున్న ఈ దళమునకు సుఖము లభించుట లేదు.

యస్యామిమే షణ్నరదేవ దస్యవః
సార్థం విలుంపంతి కునాయకం బలాత్ ।
గోమాయవో యత్ర హరంతి సార్థికం
ప్రమత్తమావిశ్య యథోరణం వృకాః ॥ 2

నరదేవ - ఓ మహారాజా!, యస్యామ్ - ఏ అడవియందు, ఇమే - ఈ, షట్ - ఆర్గురు, దస్యవః - దోపిడీగాండ్రు, కునాయకమ్ - దుష్టుడగు నాయకుడు గల, సార్థమ్ - వర్తకుల దళమును, బలాత్ - బలాత్కారముగా, లుంపంతి - దోచుకొనెదరో, యత్ర - ఎక్కడనైతే, గోమాయవః - నక్కలు, ప్రమత్తమ్ - ఆదమరచియున్న, సార్థికమ్ - వర్తకుని, ఆవిశ్య - మీదపడి, ఉరణమ్ - పొట్టేలును, వృకాః యథా - తోడేళ్లు వలె, హరంతి - ఇటునటు లాగునో.

ఓ మహారాజా! ఈ వర్తకుల దళముయొక్క నాయకుడు దుష్టుడు. ఆ అడవిలో ఆర్గురు దోపిడీగాండ్రు గలరు. వారు ఆ దళమును బలాత్కారముగా దోచెదరు. అక్కడ నక్కలు ఆదమరచియున్న వర్తకుని మీదపడి, తోడేళ్లు పొట్టేలును వలె, ఇటునటు లాగును.

ప్రభూతవీరుత్తృణగుల్మగహ్వరే
కఠోరదంశైర్మశకైరుపద్రుతః ।
క్వచిత్తు గంధర్వపురం ప్రపశ్యతి
క్వచిత్క్వచిచ్చాశురయోల్ముకగ్రహమ్ ॥ 3

ప్రభూతవీరుత్-తృణగుల్మగహ్వరే - దట్టని తీగలు గడ్డిదుబ్బులు పొదలతో చొర శక్యము కాని అడవియందు, కఠోరదంశైః - గట్టి కాటు గల పెద్ద అడవి యీగలచేః, మశకైః - దోమలచే, ఉపద్రుతః - పీడించబడిన గుంపు, క్వచిత్ తు - ఒకచోటైతే, గంధర్వపురమ్ - గంధర్వుల నగరమును, క్వచిత్ చ - మరియొకచోట, ఆశురయ-ఉల్ముకగ్రహమ్ - అధికమగు వేగము గల కొరవి దెయ్యమును, ప్రపశ్యతి - చూచును.

ఆ అడవి దట్టని తీగలు, గడ్డిదుబ్బులు, పొదలతో చొర శక్యము కాకుండమండును. దానిలో ఆ వర్తకుల దళమును గట్టి కాటు గల దోమలు, అడవి యీగలు పీడించుచుండును. వారికి ఒకచోట గంధర్వుల నగరము కానరాగా, మరియొకచోట అధికవేగము గల కొరివి దెయ్యము కనబడును.

నివాసతోయద్రవిణాత్మబుద్ధిస్తతస్తతో ధావతి భో అటవ్యామ్ ।
క్వచిచ్చ వాత్యోత్థితపాంసుధూమ్రా దిశో న జానాతి రజస్వలాక్షః॥

భోః - ఓ రాజా!, అటవ్యామ్ - అడవియందు, నివాసతోయద్రవిణ-ఆత్మబుద్ధిః - నివాసము నీరు ధనములయందు నాది అనే బుద్ధి గల వర్తకుల గుంపు, తతః తతః - అక్కడక్కడ, ధావతి - పరుగులెత్తును, క్వచిత్ చ - ఒకచోట, రజస్వల-అక్షః - దుమ్ముతో నిండిన కన్నులు గలవాడై, వాత్యా-ఉత్థితపాంసుధూమ్రాః - సుడిగాలియందు పైకి లేచిన దుమ్ముచే బూడిదరంగు గల, దిశః - దిక్కులను, న జానాతి - తెలియకుండును.

ఓ రాజా! ఆ అడవిలో ఆ వర్తకులు నివాసము, నీరు, ధనముల యందు ఇవి నావి అనే బుద్ధి గలవారై అక్కడక్కడ పరుగులెత్తెదరు. ఒకచోట సుడిగాలి లేచి దిక్కులను బూడిదతో నింపి వేయగా, ఆ దుమ్ముతో కళ్లు నిండి, వారు దిక్కు తోచక యుందురు.

అదృశ్యఝిల్లీస్వనకర్ణశూల
ఉలూకవాగ్భిర్వ్యథితాంతరాత్మా ।
అపుణ్యవృక్షాన్ శ్రయతే క్షుధార్దితో
మరీచితోయాన్యభిధావతి క్వచిత్ ॥ 5

అదృశ్యఝిల్లీస్వనకర్ణశూలః - కంటికి కానరాని ఈలపురుగుల ధ్వనిచే చెవియందు పోటు గలవాడు, ఉలూకవాగ్భిః - గుడ్లగూబల కూతలచే, వ్యథిత-అంతరాత్మా - భయమును పొందిన అంతఃకరణము గలవాడు, క్షుధార్దితః - ఆకలిచే పీడించబడినవాడు అగు వర్తకుడు, అపుణ్యవృక్షాన్ - పాపపు చెట్లను, శ్రయతే - ఆశ్రయించును, క్వచిత్ - ఒకచోట (ఒకప్పుడు), మరీచితోయాని - ఎండమావి నీళ్లను, అభిధావతి - అభిముఖముగా పరుగెత్తును.

కంటికి కానరాని ఈలపురుగుల ధ్వనిచే చెవియందు పోటు గల ఆ గుంపులోని వర్తకుడు గుడ్లగూబల కూతలకు మనస్సులో చాల భయపడు ను. ఆకలిచే పీడించబడే ఆతడు పాపపు చెట్లను ఆశ్రయించును. ఒకచోట ఆతడు ఎండమావుల వెంట పరుగులు తీయును.

క్వచిద్వితోయాస్సరితోఽభియాతి పరస్పరం చాలషతే నిరంధః ।
ఆసాద్య దావం క్వచిదగ్నితప్తో నిర్విద్యతే క్వ చ యక్షైర్హతాసుః॥6

క్వచిత్ - ఒకచోట (ఒకప్పుడు), వితోయాః - నీరు లేని, సరితః - నదులను గురించి, అభియాతి - అభిముఖముగా వెళ్లును, నిరంధః - అన్నము లేని ఆ దళము, పరస్పరమ్ - ఒకరినొకరు, ఆలషతే - అన్న మును కోరెదరు, క్వచిత్ - ఒకచోట, దావమ్ - కార్చిచ్చును, ఆసాద్య - సమీపించి, అగ్నితప్తః - అగ్నిచే తపింప జేయబడినదై, క్వ చ - మరియొక చోట, యక్షైః - యక్షులచే, హత-అసుః - అపహరించబడిన ప్రాణము వంటి ధనము గలదిరై, నిర్విద్యతే - విషాదమును పొందును.

ఆ దళము ఒకప్పుడు నీరు లేని నదుల వైపు పయనించును. ఆ గుంపులోని వారలకు ఆహారము దొరకని సందర్భములలో తమ వారలకు ఆహారము లభించవలెనని వారు కోరుచుందురు. వారికి దారిలో ఒకప్పుడు కార్చిచ్చుయొక్క వేడిచే దుఃఖము కలుగును. మరియొక చోట యక్షులు ప్రాణములతో సమానమైన ధనమును అపహరించగా, వారు చాల దుఃఖిం చెదరు.

శూరైర్హృతస్వః క్వ చ నిర్విణ్ణచేతాః
శోచన్ విముహ్యన్నుపయాతి కశ్మలమ్ ।
క్వచిచ్చ గంధర్వపురం ప్రవిష్టః
ప్రమోదతే నిర్వృతవన్ముహూర్తమ్ ॥ 7

క్వ చ - ఒకచోట, శూరైః - బలవంతులచే, హృతస్వః - అపహ రించబడిన సొత్తు గలవాడై, నిర్విణ్ణచేతాః - నిరాశతో నిండిన అంతఃకర ణము గలవాడు, శోచన్ - దుఃఖించుచున్నవాడు, విముహ్యన్ - వ్యామో హమును పొందుచున్నవాడు, కశ్మలమ్ - మూర్ఛను, ఉపయాతి -

పొందును, క్వచిత్ చ - మరియొకచోట, గంధర్వపురమ్ - గంధర్వుల నగరమును, ప్రవిష్టః - ప్రవేశించినవాడై, ముహూర్తమ్ - గంట సేపు, నిర్వృతవత్ - సుఖమును పొందినవాడు వలె, ప్రమోదతే - చాల ఆనందమును పొందును.

తన సొత్తును ఒకచోట బలవంతులగు కొందరు అపహరించగా, ఆ వర్తకుడు నిరాశతో నిండిన హృదయము గలవాడై శోకించును. అతడు వ్యామోహితుడై, మూర్ఛను పొందును. మరియొకచోట అతడు గంధర్వుల నగరములో ప్రవేశించి, కొంత సేపు సుఖమును పొందినవాడు వలె చాల ఆనందించును.

చలన్క్వచిత్కంటకశర్కరాంఘ్రిర్నగారురుక్షుర్విమనా ఇవాస్తే ।
పదే పదేऽభ్యంతరవహ్నినార్దితః కౌటుంబికః క్రుధ్యతి వై జనాయ॥

కంటకశర్కర-అంఘ్రిః - ముళ్లు చిన్న రాళ్లచే నొప్పి కలిగించబడిన పాదములు గలవాడై, నగ-ఆరురుక్షుః - పర్వతమును ఎక్క గోరువాడై, క్వచిత్ - ఒకచోట, చలన్ - నడచుచున్నవాడై, విమనాః ఇవ - చెడిన మనస్సు గలవాడు వలె, ఆస్తే - ఉండును, పదే పదే - ప్రతి అడుగు (క్షణము) నందు, అభ్యంతరవహ్నినా - లోపలి (జఠరములోని) అగ్నిచే, అర్దితః - పీడించబడినవాడై, కౌటుంబికః - కుటుంబమునందు మమకారము గలవాడై, జనాయ - జనుని కొరకు, క్రుధ్యతి వై - కోపపడుచుండును.

ఆ వర్తకుడు ఒకచోట పర్వతమునెక్కగోరి నడచుచుండగా, ముళ్లు చిన్న రాళ్లు ఆతని పాదములకు నొప్పిని కలిగించుచుండును. ఈ విధముగా చెడిన మనస్సు గలవాడై నడచుచుండగా, ప్రతి అడుగులో ప్రతి క్షణము ఆకలి బాధ అధికమగుచుండును. ఈ విధముగా పీడను పొంది కుటుంబమునందు మమకారావిష్టుడై యున్న ఆ వర్తకుడు కుటుంబములోని జనులపై కోపపడుచుండును.

క్వచిన్నిగీర్ణోऽజగరాహినా జనో నావైతి కించిద్విపినేऽపవిద్ధః ।
దష్టస్స్మ శేతే క్వ చ దందశూకైరంధోऽంధకూపే పతితస్తమిస్రే॥19

క్వచిత్ - ఒకచోట, అజగర-అహినా - కొండచిలువచే, నిగీర్ణః - మ్రింగబడిన, జనః - ఆ జనుడు, విపినే - అడవియందు, అపవిద్ధః - విడిచి పెట్టబడినవాడై, కించిత్ - దేనినైననూ, న అవైతి - తెలియకుండును, క్వ చ - మరియొకచోట, దందశూకైః - పాములచే, దష్టః - కరువబడినవాడై, శేతే స్మ - పడియుండును, అంధః - గ్రుడ్డివాడై, తమిస్రే - దుఃఖముతో నిండియున్న, అంధకూపే - చీకటి గొయ్యిలో, పతితః - పడినవాడు.

ఒకచోట అడవిలో ఆతనిని అందరు విడిచి ముందుకు సాగిపోగా, ఈతనిని కొండచిలువ మ్రింగి వేయును. అపుడాతనికి దిక్కు తోచకుండును. మరియొకచోట ఆతనిని పాములు కరువగా, విషప్రభావముచే గ్రుడ్డివాడై, చీకటితో నిండియున్న గోతిలో పడి పెద్ద దుఃఖముననుభవించును.

కర్హి స్మ చిత్ క్షుద్రరసాన్ విచిన్వన్
తన్మక్షికాభిర్వ్యథితో విమానః ।
తత్రాతికృచ్ఛ్రాత్ప్రతిలబ్ధమానో
బలాద్విలుంపన్త్యథ తం తతోఽన్యే ॥ 10

కర్హిచిత్ - ఒక సమయమునందు, క్షుద్రరసాన్ - తేనెలను, విచిన్వన్ - వెదుకుచున్నవాడై, తత్-మక్షికాభిః - ఆ తేనెపట్టుల ఈగలచే, వ్యథితః - పీడించబడినవాడై, విమానః - అవమానించబడినవాడు, తత్ర - అచట, అతికృచ్ఛ్రాత్ - చాల కష్టము వలన, ప్రతిలబ్ధమానః - పొందబడిన అభిమానము గలవాడు, తతః - అప్పుడు, తమ్ - వానిని, అన్యే - ఇతరులు, బలాత్ - బలాత్కారముగా, విలుంపంతి - లాగుకొనెదరు.

ఒక సమయములో ఆతడు తేనె కొరకు వెదుకును. అప్పుడు తేనెపట్టుల ఈగలు కుట్టగా, ఆతడు మర్యాదను పోగొట్టుకొని, పీడను పొందును. ఒకచో చాల కష్టము మీద తేనెను పొంది మర్యాదను నిలబెట్టుకున్ననూ, దానిని ఇతరులు ఆతనివద్ద బలాత్కారముగా లాగుకొనెదరు.

క్వచిచ్చ శీతాతపవాతవర్షప్రతిక్రియాం కర్తుమనీశ ఆస్తే ।
క్వచిన్మిథో విపణన్యచ్చ కించిద్విద్వేషమృచ్ఛత్యుత విత్తశాఠ్యాత్॥

క్వచిత్ - ఒకచోట, శీత-ఆతపవాతవర్షప్రతిక్రియామ్ - చలి ఎండ గాలి వర్షములకు నివారణను, కర్తుమ్ - చేయుటకు, అనీశః - చేత గానివాడై, ఆస్తే - ఉండును, క్వచిత్ చ - మరియొకచోట, మిథః - ఒకరితోనొకరు, యత్ కించిత్ చ ఉత - దేనినో ఒక అల్పవస్తువును, విపణన్ - వర్తకము చేయుచున్నవాడై, విత్తశాఠ్యాత్ - ధనము వద్ద మోసము చేయుట వలన, విద్వేషమ్ - అధికమగు ద్వేషమును, ఋచ్ఛతి - పొందును.

ఆతడు కొన్ని స్థానములలో చలి, ఎండ, గాలి, వర్షములనుండి నివారించుకొనే సామర్థ్యము లేక యుండును. అతడు మరియొక సందర్భములో ఇతరులను ఏదో ఒక చిన్నవస్తువునకు సంబంధించిన లావాదేవీలయందు ధనము విషయములో మోసము చేసి, వారితో అధికమగు ద్వేషమును కొని తెచ్చుకొనును.

క్వచిత్క్వచిత్ క్షీణధనస్తు తస్మిన్ శయ్యాసనస్థానవిహారహీనః ।
యాచన్పరాదప్రతిలబ్ధకామః పారక్యదృష్టిర్లభతేఽవమానమ్ ॥12

క్వచిత్ - ఒకచోట, క్వచిత్ - ఒక సమయములో, క్షీణధనః తు - ఖర్చు అయిన ధనము గలవాడై, తస్మిన్ - ఆ అడవియందు, శయ్యా-ఆసనస్థానవిహారహీనః - పడక కుర్చీ మకాము ప్రయాణసాధనములు లేనివాడై, పరాత్ - ఇతరులనుండి, యాచన్ - యాచించువాడై, అప్రతిలబ్ధకామః - లభించని కోరిక గలవాడై, పారక్యదృష్టిః - ఇతరుల సొత్తుపై చూపు గలవాడై, అవమానమ్ - అవమానమును, లభతే - పొందును.

ఒకానొక సమయములో ఒక్కొక్కచోట అతనికి మంచము, కుర్చీ, మకాము చేయుటకు చోటు మరియు ప్రయాణసాధనము లభించవు. అతని వద్దనున్న సొమ్ము ఖర్చు అయినది. అపుడాతడు ఇతరులనుండి ధనమును యాచించును. కాని, అతని కోరిక తీరదు. అపుడాతని చూపు ఇతరుల సొత్తుపై ఉండును. ఈ తీరున అతడు అవమానమును పొందును.

అన్యోన్యవిత్తవ్యతిషంగవృద్ధవైరానుబంధో వివహన్మిథశ్చ ।
అధ్వన్యముష్మిన్నురుకృచ్ఛ్రవిత్తబాధోపసర్గైర్విహరన్విపన్నః ॥13

అన్యోన్యవిత్తవ్యతిషంగవృద్ధవైర-అనుబంధః - పరస్పరము ధనమును ఇచ్చి పుచ్చుకొనుటలో పెరిగిన వైరముయొక్క దోషము గలవారై, మిథః - పరస్పరము, వివహన్ - వివాహములను చేయుచున్నవారై, అముష్మిన్ - ఈ, అధ్వని - మార్గమునందు, విహరన్ - తిరుగుచున్నవారై, ఉరుకృచ్ఛ్రవిత్తబాధ-ఉపసర్గైః - పెద్ద కష్టములచే ధనబాధలచే విఘ్నములచే, విపన్నః - ఆపదలను పొందువాడు (మరణించువాడు).

అతడు ఈ మార్గములో వెళ్తూ, ఇతరులతో ధనమును ఇచ్చి పుచ్చుకొనుచుండును. ఆ సందర్భములలో అతనియందు వారి యెడల వైరము అనే దోషము పెరుగుచుండును. అయిననూ, వివాహాది సంబంధములను వారితో కలుపుకొనుచుండును. ఈ తీరున అతడు పెద్ద కష్టములను, ధనపీడలను, విఘ్నములను పొంది ఆపదలలో పడి మరణించును.

తాంస్తాన్ విపన్నాన్ స హి తత్ర తత్ర
విహాయ జాతం పరిగృహ్య సార్థః ।
ఆవర్తతేఽద్యాపి న కశ్చిదత్ర
వీరాధ్వనః పారముపైతి యోగమ్ ।। 14

సః - ఆ, సార్థః హి - వర్తకుల దళము, తత్ర తత్ర - అక్కడక్కడ (ఆయా సమయములయందు), తాన్ తాన్ - ఆయా, విపన్నాన్ - మరణించినవారిని, విహాయ - విడిచిపెట్టి, జాతమ్ - పుట్టినవారిని, పరిగృహ్య - పట్టుకొని, అద్య అపి - ఇప్పటికి కూడ, న ఆవర్తతే - తిరిగి వచ్చుట లేదు, వీర - ఓ వీరుడా!, అత్ర - ఈ అడవియందు, కశ్చిత్ - ఒకానొకడు, అధ్వనః - మార్గముయొక్క, పారమ్ - అంతమును చేర్చె, యోగమ్ - ఉపాయమును, ఉపైతి - పొందును.

ఓ వీరా! ఆ వర్తకుల దళము అక్కడక్కడ ఆయా సమయములలో మరణించినవారిని విడిచిపెడ్తూ, పుట్టినవారిని స్వీకరిస్తూ వెళ్లుచుండిరి. ఆ గుంపు ఇంతవరకు తిరిగి రానే లేదు. ఆ అడవిలో ఎవరో ఒకడు మాత్రము దారియొక్క అంతమును చేరే ఉపాయమును కనుగొనినాడు.

మనస్వినో నిర్జితదిగ్గజేంద్రా
మమేతి సర్వే భువి బద్ధవైరాః ।
మృధే శయీరన్న తు తద్వ్రజంతి
యన్న్యస్తదండో గతవైరోఽభియాతి ॥ 15

భువి - లోకమునందు, మనస్వినః - అభిమానవంతులు, నిర్జిత దిగ్-గజ-ఇంద్రాః - జయించబడిన గొప్ప దిగ్గజములు గలవారు, సర్వే - అందరు, మమ - నాది, ఇతి - అని, బద్ధవైరాః - కట్టబడిన వైరము గలవారు, మృధే - యుద్ధమునందు, శయీరన్ - కుప్ప కూలెదరు, తు - కాని, తత్ - దానిని, న వ్రజంతి - పొందుట లేదు, యత్ - దేనిని, న్యస్తదండః - విడిచిపెట్టబడిన హింస గలవాడు, గతవైరః - తొలగిన వైరము గలవాడు, అభియాతి - పొందుచున్నాడో.

ఈ లోకములో వైరమును విడనాడి హింసను విడిచిపెట్టిన వ్యక్తి పరమపదమును పొందును. కాని, అహంకార మమకారములు గల వ్యక్తులు వైరమును కట్టి గొప్ప దిగ్గజములను జయించినా, వారు ఆఖరుగా యుద్ధములో మరణించెదరు. కాని, వారు ఆ పరమపదమును పొందలేరు.

ప్రసజ్జతి క్వాపి లతాభుజాశ్రయస్తదాశ్రయావ్యక్తపదద్విజస్పృహః।
క్వచిత్కదాచిద్ధరిచక్రతస్త్రసన్ సఖ్యం విధత్తే బకకంకగృధ్రైః ॥16

లతాభుజ-ఆశ్రయః - లతల కొమ్మలపై వాలియున్నదై, తత్-ఆశ్రయ-అవ్యక్తపదద్విజస్పృహః - ఆ లతలు ఆశ్రయముగా కలిగి అస్పష్టమగు ధ్వనులను చేసే పక్షులయందు కోరిక గలదై, క్వ అపి - ఒకచోట, ప్రసజ్జతి - ఆసక్తిని కలిగియుండును, క్వచిత్ - ఒకచోట, కదాచిత్ - ఒకప్పుడు, హరిచక్రతః - సింహముల గుంపు వలన, త్రసన్ - భయపడునదై, బకకంకగృధ్రైః - కొంగలు రాపులుగులు గద్దలతో, సఖ్యమ్ - స్నేహమును, విధత్తే - చేయును.

ఆ దళము ఒకచోట లతల కొమ్మలనాశ్రయించి, ఆ కొమ్మలనే ఆశ్రయించి ఉన్న పక్షుల అస్పష్టమగు కూతలయందు కోరిక గలదియై అచటనే ఆసక్తిని పెంచుకొని యుండును. మరియొకప్పుడు ఇంకోచోట ఆ

దళము సింహముల గుంపునకు భయపడి, కొంగలు రాపులుగాలు మరియు గ్రద్దలతో స్నేహమును చేయును.

తైర్వంచితో హంసకులం సమావిశన్
న రోచయన్ శీలముపైతి వానరాన్ ।
తజ్జాతిరాసేన సునిర్వృతేంద్రియః
పరస్పరోద్వీక్షణవిస్మృతావధిః ॥ 17

తైః - వాటిచే, వంచితః - మోసగించబడిన ఆ దళము, హంసకులమ్ - హంసల గుంపును, సమావిశన్ - ప్రవేశించునదై, శీలమ్ - ఆచారమును, న రోచయన్ - ఇష్టపడనిదై, వానరాన్ - కోతులను, ఉపైతి - చేరును, తద్-జాతిరాసేన - ఆ జాతి స్వభావముచే, సునిర్వృత-ఇంద్రియః - బాగా తృప్తిని జెందిన ఇంద్రియములు గలదై, పరస్పర-ఉద్వీక్షణవిస్మృత-అవధిః - ఒకరినొకరు చూచుకొనుటచే మరువబడిన జీవితావధి గలది.

ఆ దళమును ఆ పక్షులు మోసగించగా, అది హంసల గుంపులో ప్రవేశించును. కాని, ఆ దళములోని వారలకు హంసల ఆచారవ్యవహారములు నచ్చకపోవుటచే, వారు కోతులతో జతగట్టెదరు. ఆ కోతి జాతి స్వభావమును బట్టి వారు ఇంద్రియములకు భోగములచే తృప్తిని కలిగించెదరు. ఈ విధముగా వారు స్త్రీపురుషుల జంటలలో ఒకరినొకరు చూచుకుంటూ, తమ జీవితములకు అవధి ఉన్నదనే సంగతిని విస్మరించెదరు.

ద్రుమేషు రంస్యన్ సుతదారవత్సలో
వ్యవాయదీనో వివశస్స్వబంధనే ।
క్వచిత్ప్రమాదాద్గిరికందరే పతన్
వల్లీం గృహీత్వా గజభీత ఆస్థితః ॥ 18

ద్రుమేషు - చెట్లయందు, రంస్యన్ - క్రీడించుచున్నవాడై, సుతదారవత్సలః - పుత్రులయందు భార్యయందు ప్రీతి గలవాడై, వ్యవాయదీనః - సంభోగమునందలి ఇచ్ఛచే దీనుడై, స్వబంధనే - తన బంధము విషయమునందు, వివశః - స్వాధీనత లేనివాడు, క్వచిత్ - ఒకచోట, ప్రమాదాత్ -

పొరపాటు వలన, గిరికందరే - పర్వతగుహయందు, పతన్ - పడిపోవుచు న్నవాడై, వల్లీమ్ - తీగను, గృహీత్వా - పట్టుకొని, గజభీతః - ఏనుగు వలన భయపడినవాడై, ఆస్థితః - నిలిచియున్నవాడు.

చెట్లయందు క్రీడించే ఆ వర్తకుడు పుత్రులయందు, భార్యయందు అధికమగు ప్రీతిని కలిగియుండును. సంభోగమునందలి ఇచ్ఛచే దీనుడై యున్న ఆతడు తన బంధనమును త్రెంచుకొనుటకైననూ స్వాధీనత లేక యుండును. ఒకప్పుడు ఆతడు పొరపాటున పర్వతగుహలో పడిపోతూ, తీగను పట్టుకొని, అచటి ఏనుగునకు భయపడుతూ వ్రేలాడుచుండును.

అతః కథంచిత్స విముక్త ఆపదః
పునశ్చ సార్థం ప్రవిశత్యరిందమ ।
అధ్వన్యముష్మిన్నజయా నివేశితో
భ్రమఞ్జనోఽద్యాపి న వేద కశ్చన ॥ 19

అరిందమ - శత్రువులను శాసించువాడా!, అతః - ఈ, ఆపదః - ఆపదనుండి, కథంచిత్ - కష్టము మీద, విముక్తః - విముక్తుడైన, సః - ఆ వర్తకుడు, పునః చ - మరల, సార్థమ్ - దళమును, ప్రవిశతి - ప్రవేశించును, అముష్మిన్ - ఈ, అధ్వని - మార్గమునందు, అజయా - మాయాశక్తిచే, నివేశితః - ప్రవేశింప జేయబడినవాడై, భ్రమన్ - తిరుగాడుచున్న, జనః - వ్యక్తి, కశ్చన - ఒక్కడైననూ, అద్య అపి - ఇప్పటికి కూడ, న వేద - తెలియుట లేదు.

శత్రువులను శాసించే ఓ రాజా! ఈ ఆపదనుండి ఆతడు కష్టము మీద విముక్తుడై, మరల దళమును చేరుకొనును. ఆ మార్గమునందు భగవానుని మాయచే ప్రవేశపెట్టబడి తిరుగాడుచున్న జీవుడు ఒక్కడైననూ ఈ నాటికి కూడ దానినుండి బయట పడే ఉపాయము నెరుగడు.

రహూగణ త్వమపి హ్యధ్వనోఽస్య
సన్న్యస్తదండః కృతభూతమైత్రః ।

అసజ్జితాత్మా హరిసేవయా శితం
జ్ఞానాసిమాదాయ తరాతిపారమ్ ।। 20

రహూగణ - ఓ రహూగణా!, త్వం అపి - నీవు కూడ, సన్న్యస్త దండః - విడిచిపెట్టబడిన ప్రాణిపీడ గలవాడవై, కృతభూతమైత్రః - చేయబడిన ప్రాణులయందలి ప్రేమ గలవాడవై, అసజ్జిత-ఆత్మా - భోగములయందు తగుల్కొనని మనస్సు గలవాడవై, హరిసేవయా - శ్రీహరియొక్క సేవచే, శితమ్ - వాడిగా చేయబడిన, జ్ఞాన-అసిమ్ - జ్ఞానమనే కత్తిని, ఆదాయ - తీసుకొని, అస్య - ఈ, అధ్వనః - మార్గముయొక్క, అతిపారమ్ - సర్వోత్కృష్టమగు లక్ష్యమును, తర - చేరుము (పారం అతితర).

ఓ రహూగణా! నీవు ప్రాణులకు పీడను కలిగించుటను మాని, ప్రాణులయందు ప్రేమను పెంచుకొనుము. భోగములయందలి ఆసక్తిని విడిచి, శ్రీహరిని సేవించుము. తద్ద్వారా జ్ఞానము అనే కత్తికి పదును పెట్టి, దానితో ఈ సంసారమార్గమును దాటివేసి, నీవు కూడ శ్రీహరిని చేరుము.

రాజోవాచ ।
అహో నృజన్మాఖిలజన్మశోభనం
కిం జన్మభిస్త్వపరైరప్యముష్మిన్ ।
న యద్ధృషీకేశయశఃకృతాత్మనాం
మహాత్మనాం వః ప్రచురస్సమాగమః ।। 21

అహో - ఆశ్చర్యము!, నృజన్మ - మానవజన్మ, అఖిలజన్మశోభనమ్ - పుట్టుకలన్నింటిలో మంగళకరమైనది, అపరైః - ఇతరములగు, అముష్మిన్ - స్వర్గమునందు, జన్మభిః - జన్మలచే, కిమ్ - ఏమి ప్రయోజనము?, యత్ - ఏ జన్మలయందు, హృషీకేశయశఃకృత-ఆత్మనామ్ - శ్రీహరియొక్క కీర్తియందు లగ్నమైన మనస్సు గల, మహాత్మనామ్ - మహాత్ములగు, వః - మీ, సమాగమః - కలయిక, ప్రచురః - తరచుగా సిద్ధించేది, న - కాదో.

రహూగణుడిట్లు పలికెను --- ఆహా! మానవజన్మ సకలజన్మలలో మంగళకరమైనది. స్వర్గాదిలోకములయందలి ఇతరజన్మల వలన ప్రయోజనమేమున్నది? ఆ జన్మలలో మీవంటి మహాత్ములతోడి సమాగమము తరచుగా సిద్ధించదు గదా! మీ మనస్సు ఇంద్రియవ్యాపారములకు అధీశ్వరుడగు శ్రీహరియొక్క కీర్తియందు లగ్నమై యుండును.

న హ్యాద్భుతం త్వచ్చరణాబ్జరేణుభిః
హతాంహసో భక్తిరధోక్షజేఽమలా ।
మౌహూర్తికాద్యస్య సమాగమాచ్చ మే
దుస్తర్కమూలోఽపహతోఽవివేకః ।। 22

త్వత్-చరణ-అబ్జరేణుభిః - నీ పాదపద్మముల ధూళికణములచే, హత-అంహసః - నశింపజేయబడిన పాపములు గలవానికి, అధోక్షజే - శ్రీహరియందు, అమలా - శుద్ధమగు, భక్తిః - భక్తి, న హి అద్భుతమ్ - ఆశ్చర్యము కానే కాదు, యస్య - ఏ నీయొక్క, మౌహూర్తికాత్ - గంట సేపటి, సమాగమాత్ - కలయిక వలన, మే చ - నాకు కూడ, దుస్తర్క మూలః - చెడు తర్కము మూలమునందు గల, అవివేకః - అవివేకము, అపహతః - తొలగిపోయినదో.

నీ పాదపద్మముల ధూళిచే సాధకుల పాపములన్నియు నశించి, వారికి సకలప్రమాణములకు అందని శ్రీహరియందు నిష్కామభక్తి కలుగుటలో ఆశ్చర్యము లేనే లేదు. ఏలయనగా, నాకు కూడ మీతోడి గంట సేపు సమావేశము వలన అవివేకము తొలగిపోయినది. అవివేకమునకు మూలము చెడు తర్కమే.

నమో మహద్భ్యోఽస్తు నమశ్శిశుభ్యో
నమో యువభ్యో నమ ఆ వటుభ్యః ।
యే బ్రాహ్మణా గామవధూతలింగాః
చరంతి తేభ్యశ్శివమస్తు రాజ్ఞామ్ ।। 23

మహద్భ్యః - పెద్దల కొరకు, నమః - నమస్కారము, అస్తు - అగుగాక!, శిశుభ్యః - పిల్లల కొరకు, నమః - నమస్కారము, యువభ్యః - యువకుల కొరకు, నమః -నమస్కారము, ఆ వటుభ్యః - బ్రహ్మచారుల కొరకు కూడ, నమః - నమస్కారము, అవధూతలింగాః - తిరస్కారయోగ్యమగు వేషము గల, యే - ఏ, బ్రాహ్మణాః - బ్రహ్మవేత్తలు, గామ్ - భూమిని, చరంతి - సంచరించుచున్నారో, తేభ్యః - వారినుండి, రాజ్ఞామ్ - రాజులకు, శివమ్ - మంగళము, అస్తు - కలుగుగాక!

పెద్దలకు, పిల్లలకు, యువకులకు, ఆటలాడుకునే బ్రహ్మచారులకు కూడ నమస్కారము. తిరస్కారయోగ్యమగు వేషముతో బ్రహ్మవేత్తలు భూమిపై సంచరించెదరు. వారి వలన రాజులకు మంగళము కలుగుగాక!

శ్రీశుక ఉవాచ ।
ఇత్యేవముత్తరామాతస్స వై బ్రహ్మర్షిసుతస్సింధుపతయ ఆత్మ సతత్త్వం విగణయతః పరానుభావః పరమకారుణికతయోప దిశ్య రహూగణేన సకరుణమభివందితచరణ ఆపూర్ణార్ణవ ఇవ నిభృతకరణోర్మ్యాశయో ధరణిమిమాం విచచార ।। 24

ఉత్తరామాతః - ఉత్తర తల్లిగా గలవాడా!, బ్రహ్మర్షిసుతః - బ్రహ్మర్షిపుత్రుడు, పర-అనుభావః - మహానుభావుడు అగు, సః - ఆ జడభరతుడు, ఇతి - అని, ఏవమ్ - ఈ విధముగా, వై - నిశ్చయముగా, విగణయతః - అవమానమును చేసిన, సింధుపతయే - సింధుదేశాధిపతి కొరకు, ఆత్మ సతత్త్వమ్ - ఆత్మస్వరూపమును, పరమకారుణికతయా - గొప్ప కరుణ గలవాడగుటచే, ఉపదిశ్య - ఉపదేశించి, రహూగణేన - రహూగణునిచే, సకరుణమ్ - దైన్యముతో కూడిన విధముగా, అభివందితచరణః - నమస్కరించబడిన పాదములు గలవాడై, ఆపూర్ణ-అర్ణవః ఇవ - పరిపూర్ణమగు సముద్రము వలె, నిభృతకరణ-ఊర్మి-ఆశయః - శాంతిల్లిన ఇంద్రియముల తరంగములు గల అంతఃకరణము గలవాడై, ఇమామ్ - ఈ, ధరణిమ్ - భూమిని, విచచార - సంచరించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ ఉత్తరాపుత్రా! బ్రహ్మర్షి పుత్రుడు, మహానుభావుడు అగు ఆ జడభరతుడు ఈ విధముగా, రహూగణునకు ఆత్మతత్త్వమునుపదేశించెను. ఆయన పరమకారుణికుడగుటచే తనను అవమానము చేసినవానికి జ్ఞానము నుపదేశించెను. రహూగణుడు దైన్యముతో ఆయన పాదములకు నమస్కరించెను. విషయములనుండి ఇంద్రియములు నివృత్తములగుటచే శాంతమైన అంతఃకరణము గల ఆయన పరిపూర్ణమగు సముద్రమువంటి వాడు. తరువాత ఆయన ఈ భూమిపై సంచరించెను.

సౌవీరపతిరపి సుజనసమవగతపరమాత్మసతత్త్వ ఆత్మన్యవి
ద్యాఽధ్యారోపితాం చ దేహాత్మమతిం విససర్జ । ఏవం హి
నృప భగవదాశ్రితాశ్రితానుభావః ॥ 25

సుజనసమవగతపరమాత్మసతత్త్వః - సుజనుడగు జడభరతునిచే బోధించబడిన పరమాత్మతత్త్వము గల, సౌవీరపతిః అపి - సౌవీరదేశాధిపతియగు రహూగణుడు కూడ, ఆత్మని - ఆత్మయందు, అవిద్యా-అధ్యారోపితామ్ - అజ్ఞానముచే ఆరోపించబడిన, దేహ-ఆత్మమతిమ్ - దేహమే ఆత్మయనే ధారణను, విససర్జ - విడిచి పెట్టెను, నృప - ఓ రాజా!, భగవత్-ఆశ్రిత-ఆశ్రిత-అనుభావః - భగవద్భక్తులనాశ్రయించినవారి ప్రభావము, ఏవం హి - ఇట్టిది గదా!

అజ్ఞానముచే మానవులు దేహమే ఆత్మయనే భ్రాంతిని కలిగియుందురు. సుజనుడగు జడభరతునిచే బోధించబడిన పరమాత్మతత్త్వము గల రహూగణుడు దేహమే ఆత్మయనే ధారణను విడిచిపెట్టెను. ఓ రాజా! భగవద్భక్తులనాశ్రయించిన వ్యక్తులకు ఇట్టి ప్రభావము ఉండును సుమా!

రాజోవాచ ।
యో హ వా ఇహ బహువిదా మహాభాగవత త్వయాఽభిహితః
పరోక్షేణ వచసా జీవలోకభవాధ్వా స హ్యార్యమనీషయా కల్పి

తద్విషయో నాంజసాऽవ్యుత్పన్నలోకసమధిగమః । అథ తదేవై
తద్దురవగమం సమవేతానుకల్పేన నిర్దిశ్యతామితి ॥ 26

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే రహూగణ జడ
భరత సంవాదే సంసారాటవీవర్ణనం నామ త్రయోదశోऽధ్యాయః ॥

మహాభాగవత - గొప్ప భగవద్భక్తుడా!, బహువిదా - అనేకము తెలిసిన, త్వయా - నీచే, ఇహ - ఈ ప్రసంగమునందు, పరోక్షేణ - దాచి పెట్టే, వచసా - వచనముచే, యః - ఏ, జీవలోకభవ-అధ్వా - జీవసమూహముయొక్క సంసారమార్గము, అభిహితః - చెప్పబడినదో, ఆర్యమనీషయా - వివేకవంతుల బుద్ధిచే, కల్పితవిషయః - కల్పించబడిన అంశములు గల, సః హి - అదైతే, అంజసా - సాక్షాత్తుగా, అవ్యుత్పన్నలోకసమధిగమః - పరిపక్వము కాని జనులచే చక్కగా తెలియబడేది, న - కాదు, అథ - అందువలన, దురవగమమ్ - తెలియ శక్యము కాని, తత్ - ఆ, ఏతత్ ఏవ - ఈ విషయమే, సమవేత-అనుకూల్యేన - రూపకమునకు సరిపడి స్పష్టముగా తెలిసే పద్ధతితో, నిర్దిశ్యతామ్ - వివరించబడు గాక!.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- ఓ మహర్షీ! గొప్ప భగవద్భక్తుడవగు నీవు అన్నీ తెలిసినవాడవు. నీవు జీవసమూహము పయనించే సంసారమార్గమును పరోక్ష (విషయమును రూపకము చేసి దాచి పెట్టుట) పద్ధతిలో చెప్పినావు. ఈ రూపకములోని దృష్టాంతములు వివేకవంతుల బుద్ధిచే కల్పించబడినవి. కావున; పరిపక్వమగు బుద్ధిశక్తి లేని జనులకు ఈ రూపకదృష్టాంతములు తిన్నగా చక్కగా అవగాహనకు రావు. కావున, మీరు అవే విషయములను దృష్టాంతములు చక్కగా అర్థమయ్యే రీతిలో చెప్పుడు. ఆ విషయములను ఊహించుట సరళము కాదు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో
రహూగణ జడభరత సంవాదములో సంసారము అనే అడవిలో యాత్రను
వర్ణించే పదమూడవ అధ్యాయము ముగిసినది (13).

*****

# అథ చతుర్దశోఽధ్యాయః

## రహూగణ జడభరత సంవాదము - దృష్టాంతముల వివరణము

స హోవాచ ।
య ఏష దేహాత్మమానినాం సత్త్వాదిగుణవిశేషవికల్పితకుశ
లాకుశలసమవహారవినిర్మితవివిధదేహావలిభిర్వియోగసంయో
గాద్యనాదిసంసారానుభవస్య ద్వారభూతేన షడింద్రియవర్గేణ
తస్మిన్ దుర్గాధ్వవదసుగమేఽధ్వన్యాపతిత ఈశ్వరస్య భగవతో
విష్ణోర్వశవర్తిన్యా మాయయా జీవలోకోఽయం యథా వణిక్సా
ర్థోఽర్థపరస్స్వదేహనిష్పాదితకర్మానుభవశ్శ్మశానవదశివత
మాయాం సంసారాటవ్యాం గతో నాద్యాపి విఫలబహుప్రతి
యోగేహస్తత్తాపోపశమనీం హరిగురుచరణారవిందమధుకరా
నుపదవీమవరుంధే యస్యాము హ వా ఏతే షడింద్రియనా
మానః కర్మణా దస్యవ ఏవ తే ॥ 1

సః - ఆ శుకుడు, హ - ఆనందముగా, ఉవాచ - పలికెను, యః - ఏ వర్తకుల దళము గలదో, ఏషః - ఇది, దేహ-ఆత్మమానినామ్ - దేహమే ఆత్మ అని భావించువారలకు, సత్త్వ-ఆదిగుణవిశేషవికల్పితకుశల-అకుశల సమవహారవినిర్మితవివిధదేహ-ఆవలిభిః - సత్త్వరజస్తమోగుణములలోని భేదాలచే వేర్వేరుగానుండే పుణ్యము పాపము వాటి మిశ్రమములచే నిర్మించబడిన వేర్వేరు దేహముల పరంపరలచే, వియోగసంయోగ-ఆది-అనాది సంసార-అనుభవస్య - వియోగము సంయోగము మొదలైన అనాదియగు సంసారముయొక్క అనుభవమునకు, ద్వారభూతేన - ద్వారము అయి

ఉన్న, షట్-ఇంద్రియవర్గేణ - ఆరు ఇంద్రియముల సమూహముచే, తస్మిన్ - అట్టి, దుర్గ-అధ్వవత్ - చొర శక్యము కాని దారి వలె, అసుగమే - తేలిక కాని ప్రయాణము గల, అధ్వని - ప్రవృత్తిమార్గమునందు, ఈశ్వరస్య - సర్వేశ్వరుడగు, విష్ణోః భగవతః - విష్ణు భగవానుని, వశవర్తిన్యా - వశమునందుండే, మాయయా - మాయచే, ఆపతితః - వచ్చి పడిన, అయమ్ - ఈ, జీవలోకః - జీవసమూహము, వణిక్-సార్థః యథా - వర్తకుల దళము వలె, అర్థపరః - సంపదయే పరమలక్ష్యముగా గలదియై, స్వదేహ నిష్పాదితకర్మ-అనుభవః - తమ దేహములచే ఉత్పన్నము చేయబడిన కర్మల ఫలములు గలదై, శ్మశానవత్ - శ్మశానము వలె, అశివతమాయామ్ - మిక్కిలి అమంగళకరమైన, సంసార-అటవ్యామ్ - సంసారము అనే అడవియందు, గతః - ప్రవేశించినదై, అద్య అపి - ఇప్పటికి కూడ, విఫలబహు ప్రతియోగ-ఈహః - నిష్ఫలములు అనేక విఘ్నములు గలవి అగు కర్మలు గలదియై, తత్-తాప-ఉపశమనీమ్ - ఆ అడవియందలి తాపములను పోగొట్టే, హరిగురుచరణ-అరవిందమధుకర-అనుపదవీమ్ - శ్రీహరి మరియు గురువుయొక్క పాదపద్మములయందు తుమ్మెదల మార్గమును, న అవరుంధే - పొందుట లేదు, యస్యాం ఉ హ - ఏ సంసారమనే అడవియందు, ఏతే - ఈ, షట్ - ఆర్గురు, ఇంద్రియనామానః - ఇంద్రియములనే పేరు గల, దస్యవః - దోపిడీ గాండ్రు గలరో, తే - వారు, కర్మణా ఏవ - కర్మచేతనే.

ఆ శుకమహర్షి ఆనందముతో నిట్లు పలికెను --- ఆ వర్తకుల దళము ఈ జీవుల సముదాయమే. జీవులు దేహమే ఆత్మ అనే భ్రాంతితో కర్మలను చేయుచుందురు. ఈ కర్మల ఫలములు పుణ్యము, పాపము, మిశ్రమము (పుణ్యపాపముల సమపాళ్లు) అని మూడు విధములుగా నుండును. పుణ్యప్రభావముచే సత్త్వగుణప్రధానమగు దేవతాదేహములు, పాపప్రభావముచే తమోగుణప్రధానమగు చెట్టు మొదలగు దేహములు, మిశ్రమఫలముచే రజోగుణప్రధానమగు మనుష్యదేహములు జీవులకు ఒక జన్మ తరువాత మరియొక జన్మలో పరంపరగా లభించుచుండును. పుట్టినప్పుడు దేహముతో సంయోగము, మరణములో వియోగము మొదలైన సంసారముయొక్క అనుభవములు ఈ జీవులకు అనాది కాలమునుం

డియు కలుగుచునే యున్నవి. మనస్సుయొక్క ప్రేరణచే అయిదు జ్ఞానేంద్రియముల భోగముల కొరకై వ్యక్తి కర్మలను చేయును గనుక, ఈ ఆరే నిరంతరమగు సంసారమునకు ద్వారమని చెప్పవచ్చును. అడవిలో చొరశక్యము కాని దారి ఎట్టిదియో, ఈ సంసారయాత్ర అట్టిది. సర్వేశ్వరుడైన విష్ణు భగవానునకు వశవర్తియై ఉండే మాయచే ఈ ఆరు ఇంద్రియములే జీవుని దీనిలోనికి త్రోయును. సంపదల వెనుకబడే ఇట్టి జీవుల సమూహమే ధనార్జనాపరులగు వర్తకుల దళముతో పోల్చబడినది. జీవుడు తన దేహముతో కర్మలను చేసి, వాటి ఫలముల ననుభవిస్తూ, మిక్కిలి అమంగళకరమగు సంసారమనే అడవిలో పడి తిరుగుచున్నాడు. కాని, అనేకములగు ఆటంకములతో గూడిన కర్మలను చేస్తూ వైఫల్యమును చెందుచున్న ఆ జీవుడు ఈ నాటికి కూడ శ్రీహరియొక్క మరియు గురువుయొక్క పాదపద్మముల నాశ్రయించుట లేదు. తుమ్మెద పద్మమును వలె, సాధకుడు శ్రీహరి పాదపద్మముల నాశ్రయించినచో, సంసారములోని తాపముల న్నియు ఉడుగును. ఈ సంసారమనే అడవిలో ఆర్గురు ఇంద్రియములనే దోపిడీగాండ్రు గలరు. ఈ ఇంద్రియములు చేసే పనిని బట్టియే వాటికి దోపిడీగాండ్రతో పోలిక వచ్చినది.

తద్యథా పురుషస్య ధనం యత్కించిద్ధర్మౌపయికం బహుకృచ్ఛ్రాధిగతం సాక్షాత్పరమపురుషారాధనలక్షణో యోఽసౌ ధర్మస్తం తు సాంపరాయ ఉదాహరంతి । తద్ధర్మ్యం ధనం దర్శనస్పర్శనశ్రవణాస్వాదనావఘ్రాణసంకల్పవ్యవసాయగృహగ్రామ్యోపభోగేన కునాథస్యాజితాత్మనో యథా సార్థస్య విలుంపంతి ॥ 2

**తత్** - ఇంద్రియముల దోపిడీ, **యథా** - ఏ విధముగానంటే, **కునాథస్య** - చెడు బుద్ధి కలిగినట్టియు, **అజిత-ఆత్మనః** - జయించబడని అంతఃకరణము గల, **పురుషస్య** - వ్యక్తికి, **సాక్షాత్** - సాక్షాత్తుగా, **ధర్మ-ఔపయికమ్** - ధర్మహేతువు, **బహుకృచ్ఛ్ర-అధిగతమ్** - చాల కష్టము మీద సంపాదించబడినది అగు, **కించిత్** - కొంచెము, **యత్** - ఏ, **ధనమ్** - ధనము గలదో, **సాక్షాత్** - సాక్షాత్తుగా, **పరమపురుష-ఆరాధనలక్షణః** - పురు

షోత్తముని ఆరాధించుట అనే, యః - ఏ, అసౌ - ఈ, ధర్మః - ధర్మము గలదో, తం తు - దానినైతే, సాంపరాయే - పరలోకమునందు, ఉదాహరంతి - ఉటంకించెదరో, తత్ - ఆ, ధర్మ్యమ్ - ధర్మమునకు తగియున్న, ధనమ్ - ధనమును, దర్శనస్పర్శనశ్రవణ-ఆస్వాదన-అవఘ్రాణసంకల్ప వ్యవసాయగృహగ్రామ్య-ఉపభోగేన - చూచుట స్పృశించుట వినుట రుచి చూచుట అఘ్రాణించుట సంకల్పించుట నిశ్చయించుట అనువాటిచే ఇంటి యందలి అల్పసుఖముల భోగించుటచే, సార్థస్య యథా - వర్తకుల దళముయొక్క ధనమును వలె, విలుంపంతి - నశింపజేయును.

వ్యక్తి చాల కష్టపడి కొంచెము ధనమును కూడబెట్టును. ఈ ధనము సాక్షాత్తుగా ధర్మమునకు హేతువు కాగల్గును. ధర్మమనగా సాక్షాత్తుగా పురుషోత్తముని ఆరాధించుటయే. ఈ ధర్మమే వ్యక్తికి పరలోకమును సంపాదించి పెట్టునని పెద్దలు ఉటంకించెదరు. కాని, వ్యక్తియొక్క బుద్ధి చెడియుండుటచే, వానికి అంతఃకరణముపై నిగ్రహము లేదు. కావుననే, కన్ను (చూచుట), చర్మము (స్పర్శ), శ్రోత్రము (వినుట), జిహ్వ (ఆస్వాదించుట), ముక్కు (అఘ్రాణించుట), మనస్సు (సంకల్పించుట, నిశ్చయించుట) అనే ఇంద్రియములద్వారా పురుషుడు అల్పములగు భోగములననుభవించుచుండును. అప్పుడు, వర్తకుల దళముయొక్క ధనమును దోపిడీగాండ్రు దోచుకునే విధముగా, ఈ ఇంద్రియములు వ్యక్తియొక్క అట్టి ధర్మమునకు తగియున్న ధనమును నశింపజేయును.

అథ చ యత్ర కౌటుంబికా దారాపత్యాదయో నామ్నా కర్మణా
వృకసృగాలా ఏవానిచ్ఛతోऽపి కదర్యస్య కుటుంబిన ఉరణకవ
త్సంరక్ష్యమాణం మిషతోऽపి హరంతి || 3

అథ - తరువాత, యత్ర - ఏ సంసారమార్గమునందు, కౌటుంబికాః - కుటుంబసభ్యులు, నామ్నా - పేరును బట్టి, దార-అపత్య-ఆదయః - భార్య సంతానము మొదలగువారు, కర్మణా - పనిని బట్టి, వృకసృగాలాః ఏవ - తోడేళ్లు నక్కలే, కదర్యస్య - లోభియగు, కుటుంబినః - కుటుంబ యజమాని, అనిచ్ఛతః అపి - ఇష్టపడకున్ననూ, మిషతః అపి - కళ్లు అప్పగించి చూచుచుండగనే, సంరక్ష్యమాణమ్ - చక్కగా రక్షిం

చబడుచున్న ధనమును, ఉరణకవత్ - పొట్టేలును వలె, హరంతి - లాగి వేసెదరు.

తరువాత ఈ సంసారమార్గములో కుటుంబసభ్యులు, పేరును బట్టి భార్య కొడుకు కూతురు మొదలగువారే అయిననూ, వారు చేసే పనిని బట్టి తోడేళ్లు నక్కలు అగుచున్నారు. లోభియగు కుటుంబ యజమాని డబ్బు ఖర్చు అగుటకు ఇష్టపడడు. కాని, ఆతడు చూచుచుండగనే, తోడేళ్లు పొట్టేలును వలె, ఆతడు భద్రముగా దాచుకున్న ధనమును వీరు లాగి వేసెదరు.

యథా హ్యానువత్సరం కృష్యమాణమప్యదగ్ధబీజం క్షేత్రం
పునరేవావపనకాలే గుల్మతృణవీరుద్భిర్గహ్వరమివ భవత్యేవ
మేవ గృహాశ్రమః కర్మక్షేత్రం యస్మిన్న హి కర్మాణ్యుత్సీ
దంతి యదయం కామకరండ ఏష ఆవసథః ॥ 4

యథా హి - ఏ విధముగానైతే, అనువత్సరమ్ - ప్రతి సంవత్సరము, కృష్యమాణం అపి - దున్నబడేదే అయిననూ, అదగ్ధబీజమ్ - తగుల పెట్టబడని బీజములు గల, క్షేత్రమ్ - పొలము, పునః ఏవ - మరల, ఆవపనకాలే - విత్తనములు చల్లే కాలమునందు, గుల్మతృణవీరుద్భిః - తీగలు గడ్డి పొదలతో, గహ్వరం ఇవ - చొర శక్యము కాదా యన్నట్లు, భవతి ఏవ - అయి తీరునో, ఏవం ఏవ - ఇదే విధముగా, గృహ-ఆశ్రమః - గృహస్థాశ్రమము, కర్మక్షేత్రమ్ - కర్మల పొలము, యస్మిన్ - దేనియందైతే, కర్మాణి- కర్మలు, న హి ఉత్సీదంతి - పూర్తిగా నశించవు, యత్ - ఏలయనగా, ఏషః - ఇది, ఆవసథః - ఇల్లు, అయమ్ - ఇది, కామకరండః - కోరికల్ల సజ్జ.

ప్రతి సంవత్సరము పొలమును దున్నుచున్ననూ, దానిలోని బీజములను తగులబెట్టనిచో, విత్తనములను చల్లే కాలము వచ్చుసరికి, తీగలు గడ్డి పొదలతో ఆ పొలము అడుగు పెట్టుటకు వీలు లేకుండ నుండును. అదే తీరున, ఈ గృహాశ్రమము కర్మలకు పొలము వంటిది. దీనిలో కర్మలు పూర్తిగా తొలగిపోవు. ఏలయన, ఈ ఇల్లు అనేది కోరికలకు పుట్టినిల్లు.

తత్ర గతో దంశమశకసమాపసదైర్మనుజైశ్శలభశకుంతతస్కర
మూషకాదిభిరుపరుధ్యమానబహిఃప్రాణః క్వచిత్పరివర్తమా
నోఽస్మిన్నధ్వన్యవిద్యాకామకర్మభిరుపరక్తమనసాఽనుపప
న్నార్థం నరలోకం గంధర్వనగరముపపన్నమితి మిథ్యాదృష్టిర
నుపశ్యతి ॥ 5

తత్ర - ఆ గృహాశ్రమమునందు, గతః - చేరిన ఆ వర్తకుల దళము, అస్మిన్ - ఈ, అధ్వని - సంసారమార్గమునందు, క్వచిత్ - ఒకచోట, పరివర్తమానః - తిరుగాడుచున్నదై, దంశమశకసమ-అపసదైః - అడవి ఈగలు దోమలతో సమానులైనట్టియు అధములైన, మనుజైః - మానవులచే, శలభశకుంతతస్కరమూషక-ఆదిభిః - మిడుతలు పక్షులు చోరులు ఎలుకలు మొదలగువాటిచే, ఉపరుధ్యమానబహిఃప్రాణః - అధికముగా పీడించబడుచున్న బాహ్యప్రాణములు గలదై, అవిద్యాకామకర్మభిః - అజ్ఞానము కామనలు కర్మలచే, ఉపరక్తమనసా - వ్యాప్తమైన మనస్సుతో, మిథ్యాదృష్టిః - భ్రాంతిని పొందియున్న దర్శనము గలదై, అనుపపన్న-అర్థమ్ - అశాశ్వతములగు పదార్థములు (ప్రయోజనములు) కలిగినట్టియు, గంధర్వనగరమ్ - గంధర్వనగరము అయిన, నరలోకమ్ - మానవలోకమును, ఉపపన్నం ఇతి - నిత్యమని, అనుపశ్యతి - ప్రతిక్షణము తలచును.

ఈ సంసారమార్గములో గృహాశ్రమమును స్వీకరించియున్న వ్యక్తులను అడవి యీగలు మరియు దోమలవంటి మనుష్యాధములు పీడించుచుందురు. మిడుతలు, పక్షులు, చోరులు, ఎలుకలు మొదలగునవి వారికి బహిఃప్రాణములైన ధనధాన్యాదులకు అప్పుడప్పుడు హానిని కలిగించుచుండును. వారి మనస్సు అజ్ఞానము, దానినుండి పుట్టే కామనలు, వాటి వలన సంప్రాప్తమయ్యే వివిధకర్మలతో వ్యాప్తమై యుండును. కావుననే, ఈ మానవజీవనము అనిత్యమనియు, గంధర్వనగరమువలె మిథ్యయనియు వారు గ్రహించలేరు. భ్రాంతదర్శనము గల ఆ జనులు ఇది అంతా సత్యమనే ప్రతిక్షణము తలపోయుచుందురు.

**తత్ర చ క్వచిద్ధాతపోదకనిభాన్ విషయానుపధావతి పానభోజ నవ్యవాయాదివ్యసనలోలుపః ॥ 6**

తత్ర చ - ఆ సంసారమార్గమునందు కూడ, పానభోజనవ్యవాయ -ఆదివ్యసనలోలుపః - త్రాగుట తినుట సంభోగము మొదలగు వ్యసనము లయందు లంపటుడైన వ్యక్తి, ఆతప-ఉదకనిభాన్ - ఎండమావులవంటి, విషయాన్ - ఇంద్రియభోగములను గురించి, ఉపధావతి - పరుగెత్తును.

ఆ సంసారమార్గములో త్రాగుట, తినుట, సంభోగము, నృత్య ములు మొదలగు వ్యసనములకు బానిసయైన వ్యక్తి ఎండమావులవంటి ఇంద్రియభోగముల వెనుక పరుగులెత్తుచుండును.

**క్వచిచ్చాశేషదోషనిషదనం పురీషవిశేషం తద్వర్ణగుణనిర్మిత మతిస్సువర్ణముపాదిత్సత్యగ్నికామకాతర ఇవోల్ముకపిశాచమ్ ॥ 7**

క్వచిత్ చ - మరియొకచోట, అశేషదోషనిషదనమ్ - సకలదోష ములకు నివాసస్థానమైన, పురీషవిశేషమ్ - అగ్నియొక్క మలమనదగిన బంగారమును, తత్-వర్ణగుణనిర్మితమతిః - దాని రంగే గల రజోగుణ ముచే నిర్మించబడిన బుద్ధి గలవాడై, అగ్నికామకాతరః - వేడియందలి కోరి కచే పరవశమైయున్నవాడు, ఉల్ముకపిశాచం ఇవ - కొరివి దెయ్యమును వలె, ఉపాదిత్సతి - స్వీకరించ గోరును.

బంగారమనగా అగ్నియొక్క మలమనియు, అదియే సకలదోష ములకు నివాసస్థావమనియు చెప్పబడినది. రజోగుణమునకు బంగారము యొక్క రంగు ప్రతీక. ఒకడు చలికి బాధపడుతూ వేడి కావాలనే కోరికచే పరవశుడై కొరివి దెయ్యము నాశ్రయించినాడట. అదే విధముగా, రజోగుణ ప్రధానమైన మనస్సు గల ఆ వర్తకుల దళము సంసారము అనే అడవి మా ర్గములో బంగారమును సంపాదించ గోరుచుండును.

**అథ కదాచిన్నివాసపానీయద్రవిణాద్యనేకాత్మోపజీవనాభినివేశ ఏతస్యాం సంసారాటవ్యామితస్తతః పరిధావతి ॥ 8**

అథ - మరియు, ఏతస్యామ్ - ఈ, సంసార-అటవ్యామ్ - సంసారము అనే అడవియందు, కదాచిత్ - ఒకప్పుడు, నివాసపానీయద్రవిణ-ఆది-అనేక-ఆత్మోపజీవన-అభినివేశః - నివాసము పానీయము ధనము మొదలగు అనేకములైన తన జీవనమునకు అవసరమైన వాటియందు పట్టుదల గలవాడై, ఇతః తతః - ఇటునటు, పరిధావతి - అంతటా పరుగెత్తును.

మరియు ఒకప్పుడు ఆ జీవుడు ఈ సంసారము అనే అడవిలో నివాసము పానీయము ధనము వస్త్రము మొదలైన అనేకములగు నిత్యావసరవస్తువులయందు నిశ్చితబుద్ధి గలవాడై ఇటునటు పరుగులెత్తును.

క్వచిచ్చ వాత్యౌపమ్యయా ప్రమదయాఽఽరోహమారోపితస్తత్కాలరజసా రజనీభూత ఇవాసాధుమర్యాదో రజస్వలాక్షోఽపి దిగ్దేవతా అతిరజస్వలమతిర్న విజానాతి ॥ 9

చ - మరియు, క్వచిత్ - ఒకచోట, వాత్యా-ఔపమ్యయా - సుడిగాలితో పోలిక గల, ప్రమదయా - మత్తెక్కించే యువతిచే, ఆరోహమ్ - అంకమును, ఆరోపితః - ఆరోపించుకొన బడినవాడై, తత్-కాలరజసా - ఆ సమయమునందలి కామవేగముచే, రజనీభూతః ఇవ - ముద్దగట్టిన చీకటియా యన్నట్లు, అసాధుమర్యాదః - సత్పురుషుల మర్యాద లేనివాడై, రజస్వల-అక్షః - కన్ను మిన్ను గానని చూపు గలవాడై, అతిరజస్వలమతిః - అతిశయించిన రజోగుణప్రధానమగు మనస్సు గలవాడై, దిక్-దేవతాః అపి - దిక్కుల అధిష్ఠానదేవతలను కూడ, న విజానాతి - తెలుసుకొనడు.

ఈ సంసారమనే అడవిలో ఒకచోట, ముద్ద గట్టిన అజ్ఞానమనదగిన ఈ మానవుడు, సత్పురుషుల మర్యాదను మంట గలిపి, మత్తెక్కిస్తూ సుడిగాలితో పోల్చదగియున్న యువతియొక్క ఒడిలో విశ్రమించును. అతిశయించిన రజోగుణముతో ఆతని మనస్సు నిండియుండుటచే ఆ సమయమునందలి కామవేగముచే ఆతనికి కన్ను మిన్ను గానరాదు. కావుననే, తన చేష్టలకు సాక్షులైయున్న దిగ్దేవతలను కూడ ఆతడు సరకు చేయడు.

క్వచిత్సకృదవగతవిషయవైతథ్యస్స్వయం పరాభిధ్యానేన విభ్రంశితస్మృతిస్తయైవ మరీచితోయప్రాయాంస్తానేవాభిధావతి ॥ 10

క్వచిత్ - ఒకచోట, సకృత్ - ఒకసారి, అవగతవిషయవైతథ్యః - గుర్తించబడిన ఇంద్రియభోగముల వైఫల్యము గలవాడై, స్వయమ్ - స్వయముగా, పర-అభిధ్యానేన - అనాత్మయందలి ఆత్మభావముచే, విభ్రంశితస్మృతిః - నష్టము చేయబడిన స్మరణము గలవాడై, తయా ఏవ - ఆ నష్టమైన స్మరణముతోనే, మరీచితోయప్రాయాన్ - ఎండమావులవంటి, తాన్ ఏవ - ఆ ఇంద్రియభోగములను గురించి మాత్రమే, అభిధావతి - పరుగెత్తును.

ఒక సందర్భములో ఒకసారి ఆ వ్యక్తికి ఇంద్రియభోగముల వెంట బడుట వ్యర్థమనే గుర్తింపు కలుగవచ్చును. కాని, ఆతడు అనాత్మలగు దేహాదులయందు ఆత్మభావము కలవాడగుటచే, ఆ స్మృతి కూడ వినష్టమగును. అట్లు వినష్టమైన స్మృతి గలవాడై, ఆతడు ఎండమావులవంటి ఆ ఇంద్రియభోగముల వెంట పరుగులెత్తుచునే యుండును.

క్వచిదులూకఝిల్లీస్వనవదతిపరుషరభసాటోపం ప్రత్యక్షం పరోక్షం వా రిపురాజకులనిర్భర్త్సితేనాతివ్యథితకర్ణమూలహృదయః ॥ 11

క్వచిత్ - ఒకచోట, ఉలూకఝిల్లీస్వనవత్ - గుడ్లగూబల మరియు ఈలపురుగుల ధ్వనివలె, అతిపరుషరభస-ఆటోపమ్ - మిక్కిలి పరుషమైన కోపముయొక్క వేగము కలుగునట్లుగా, ప్రత్యక్షమ్ - ప్రత్యక్షముగా గాని, పరోక్షం వా - పరోక్షముగా గాని, రిపురాజకులనిర్భర్త్సితేన - శత్రువుల మరియు రాజుల సమూహముయొక్క నిందావచనముచే, అతివ్యథితకర్ణమూలహృదయః - మిక్కిలి పీడను పొందిన చెవి మొదలు మరియు హృదయము గలవాడు.

ఒకప్పుడు ఆ మానవుని కంటికి కనబడే గుడ్లగూబలవలె శత్రువులు ఎదురుగా నుండి కోపముయొక్క వేగముతో మిక్కిలి పరుషమగు

వచనములతో నిందించెదరు. మరియొకప్పుడు కంటికి కనబడని ఈలపురుగువంటి రాజు పరోక్షమునందు నిందించును. ఈ నిందావచనములచే ఆతనికి చెవియందు, గుండెలయందు పోటు వచ్చును.

స యదా దుగ్ధపూర్వసుకృతస్తదా కారస్కరకాకతుండాద్యపుణ్యద్రుమలతావిషోదపానవదుభయార్థశూన్యద్రవిణాన్ జీవన్మృతాన్ స్వయం జీవన్మ్రియమాణ ఉపధావతి ॥ 12

సః - ఆ వర్తకుడు, యదా - ఏ కాలమునందైతే, దుగ్ధపూర్వసుకృతః - అనుభవించబడిన పూర్వపుణ్యము గలవాడో, తదా - అప్పుడు, కారస్కరకాకతుండ-ఆది-అపుణ్యద్రుమలతావిష-ఉదపానవత్ - విషపు తుమ్మి మరియు కాకిదొండ మొదలగు పాపపు చెట్లు తీగలు విషపు నీటి నూతుల వలె, ఉభయ-అర్థశూన్యద్రవిణాన్ - ఇహపరముల ప్రయోజనములు లేని ధనములు గల, జీవత్-మృతాన్ - జీవించియుండగనే మరణించిన జనులను, స్వయమ్ - తాను, జీవత్-మ్రియమాణః - జీవించియుండగనే మరణించుచున్నవాడై, ఉపధావతి - సేవించును.

ఆ జీవుడు పూర్వపుణ్యమంతయు అనుభవముచే క్షయము కాగా, జీవన్మృతుడు వలె నుండును. ఇహపరములకు పనికి రాని ధనము గల లోభులు విషపు తుమ్మి చెట్టు, కాకిదొండ చెట్టు, విషపు తీగలు, విషపు నీటితో నిండిన బావి మొదలగు వాటిని పోలినవారు. అపుడా వర్తకుడు ఇట్టి జీవన్మృతులను సేవించును.

ఏకదాఽసత్ప్రసంగాన్నికృతమతిర్వ్యుదకస్రోతఃస్ఖలనవదుభయతోఽపి దుఃఖదం పాఖండమభియాతి ॥ 13

ఏకదా - ఒకప్పుడు, అసత్-ప్రసంగాత్ - దుష్టులతోడి దృఢమైన సంగము వలన, నికృతమతిః - వంచించబడిన బుద్ధిగల ఆ వర్తకుడు, వి-ఉదకస్రోతఃస్ఖలనవత్ - నీరు లేని నదియొక్క లోతులో పడుట వలె, ఉభయతః అపి - ఇహపరములయందు కూడ, దుఃఖదమ్ - దుఃఖమునిచ్చే, పాఖండమ్ - వేదవిరుద్ధమగు మతమును, అభియాతి - స్వీకరించును.

ఒకప్పుడా జీవుడు దుష్టులతో దృఢమగు స్నేహమును చేసి, దానిచే వంచించబడిన బుద్ధి గలవాడై, వేదవిరుద్ధమగు మతమును స్వీకరించును. ఇది నీటి కొరకై నీళ్లు లేని నదియొక్క లోతులోనికి దుముకుట వంటిది. తల పగులుటయే గాని, నీరు లభించదు. అదే విధముగా వేదవిరుద్ధమగు మతమును స్వీకరించుట వలన ఇహపరములు రెండు నాశనమై దుఃఖమే మిగులును.

యదా తు పరబాధయాఽంధ ఆత్మనే నోపనమతి తదా హి
పితృపుత్రబర్హిష్మతః పితృపుత్రాన్ వా స ఖలు భక్షయతి ||14

సః - ఆతడు, యదా తు - ఎప్పుడైతే, పరబాధయా - శత్రువుల పీడచే, ఆత్మనే - తన కొరకు, అంధః - అన్నము, న ఉపనమతి - లభించదో, తదా హి - అప్పుడు, పితృపుత్రబర్హిష్మతః - తండ్రియొక్క పుత్రుల యొక్క గడ్డిపోచయైననూ గలవారిని, పితృపుత్రాన్ వా - తండ్రిని గాని పుత్రులను గాని, భక్షయతి ఖలు - తినును గదా!

శత్రువుల పీడచే ఆ వర్తకునకు (జీవునకు) తినుటకై అన్నము కూడ లభించని పరిస్థితి ఏర్పడినప్పుడు తన తండ్రి లేక పుత్రుల సొత్తు గడ్డిపోచయైననూ కలిగియున్న జనులను గాని, లేదా తన తండ్రినే గాని, పుత్రులను గాని చాల పీడించును.

క్వచిదాసాద్య గృహం దావవత్ప్రియార్థవిధురమసుఖోదర్కం
శోకాగ్నినా దహ్యమానో భృశం నిర్వేదముపగచ్ఛతి || 15

క్వచిత్ - ఒకప్పుడు, దావవత్ - కార్చిచ్చువలె, ప్రియ-అర్థవిధురమ్ - ప్రీతికరమగు పదార్థములచే శూన్యమైనట్టియు, అసుఖ-ఉదర్కమ్ - దుఃఖములనే పరంపరగా ఇచ్చే, గృహమ్ - ఇంటిని, ఆసాద్య - చేరుకొని, శోక-అగ్నినా - శోకము అనే అగ్నిచే, దహ్యమానః - దహింపజేయబడుచున్నవాడై, భృశమ్ - మిక్కిలి, నిర్వేదమ్ - నిరాశను, ఉపగచ్ఛతి - పొందును.

ఇల్లు కార్చిచ్చు వంటిది. దానిలో ప్రీతిని కలిగించే వస్తువులు శూన్యము. అది ఒకదాని తరువాత మరియొకటిగా దుఃఖరూపమగు ఫలములనే ఇచ్చుచుండును. ఆ జీవుడు అట్టి ఇంటిని చేరుకొని, శోకము అనే అగ్నిచే దహింపజేయ బడుచున్నవాడై, తీవ్రమగు నిరాశను పొందును.

క్వచిత్కాలవిషమితరాజకులరక్షసాऽపహృతప్రియతమధ
నాసుః ప్రమృతక ఇవ విగతజీవలక్షణ ఆస్తే ॥ 16

క్వచిత్ - ఒకచోట, కాలవిషమితరాజకులరక్షసా - కాలముచే ప్రతికూలమైన రాజకులము అనే రాక్షసునిచే, అపహృతప్రియతమధన-అసుః - అపహరించబడిన మిక్కిలి ప్రియమైన ధనము అనే ప్రాణములు గలవాడై, ప్రమృతకః ఇవ - మరణించినవాడు వలె, విగతజీవలక్షణః - తొలగిన ప్రాణము గలవాని లక్షణములు గలవాడై, ఆస్తే - ఉండును.

ఒకప్పుడు ఆతనికి కాలము కలిసిరాక రాజవంశములోని వారే రాక్షసులుగా మారి, ఆతనికి ప్రాణములతో సమానముగా మిక్కిలి ప్రియమగు ధనమునపహరించెదరు. అపుడు బ్రతికియున్నవాని లక్షణములు ఉడిగిపోగా, ఆతడు శవము వలె పడియుండును.

కదాచిన్మనోరథోపగతపితృపితామహాద్యసత్సదితి స్వప్నని
ర్వృతిలక్షణమనుభవతి ॥ 17

కదాచిత్ - ఒకానొక సమయమునందు, మనోరథ-ఉపగతపితృపితామహాది - కోరికచే సంప్రాప్తమైన పదార్థములవంటి తండ్రి తాత మొదలగునది, అసత్ - వాస్తవముగా లేకున్ననూ, సత్ - ఉన్నవారు, ఇతి - అని, స్వప్ననిర్వృతిలక్షణమ్ - కలయందలి సుఖమువంటి సుఖమును, అనుభవతి - అనుభవించును.

వ్యక్తి మనోరాజ్యమును చేయుచూ ఏవో కొన్ని పదార్థముల గురించి ఊహలను చేయును. ఆ పదార్థములు ఆతని ఊహలో ఉన్నవే గాని, వాస్తవముగా ఉన్నవి కావు. తండ్రి, తాత మొదలగు బంధుత్వములు

కూడ అట్టివియే. కాని, ఆతడు అవి యథార్థములేవని భ్రమిస్తూ, కలలో పొందే సుఖమువంటి క్షణికసుఖమును ఒకప్పుడు అనుభవించును.

క్వచిద్గృహాశ్రమకర్మచోదనాతిభరగిరిమారురుక్షమాణో లోకవ్య సనకర్షితమనాః కంటకశర్కరాక్షేత్రం ప్రవిశన్నివ సీదతి ।। 18

క్వచిత్ - ఒకచోట, గృహ-ఆశ్రమకర్మచోదనా-అతిభరగిరిమ్ - గృహస్థాశ్రమమునందలి కర్మవిధుల అధికమగు విస్తారము గల కొండను ఎక్కగోరువాడై, లోకవ్యసనకర్షితమనాః - లోకవ్యవహారములయందలి తీవ్ర మగు ఆసక్తిచే ఆకర్షించబడిన మనస్సు గలవాడై, కంటకశర్కరాక్షేత్రమ్ - ముళ్లు వాడియైన చిన్న రాళ్లు గల నేలను, ప్రవిశన్ ఇవ - ప్రవేశించువాడు వలె, సీదతి - దుఃఖితుడగును.

గృహస్థునకు విధించబడిన కర్మలనన్నింటినీ చేయబూనుట పెద్ద కొండను ఎక్కుట వంటిది. ఆ కర్మల విస్తారము అట్టిది. దానికి పూనుకున్న ఈతని మనస్సు లోకవ్యవహారములయందలి తీవ్రమగు ఆసక్తిచే పరవశమై యుండును. కావుననే, ముళ్లతో పదునైన చిన్న రాళ్లతో నిండిన నేలపై నడుచుటకు పూనుకున్నవాడు వలె, ఈతడు కూడ దుఃఖితుడగును.

క్వచిచ్చ దుస్సహేన కాయాభ్యంతరవహ్నినా గృహీతసార స్స్వకుటుంబాయ క్రుధ్యతి ।। 19

చ - మరియు, క్వచిత్ - ఒకప్పుడు, దుస్సహేన - సహించ శక్యము కాని, కాయ-అభ్యంతరవహ్నినా - శరీరము లోపలి జఠరాగ్నిచే, గృహీతసారః - తీసివేయబడిన ఓపిక గలవాడై, స్వకుటుంబాయ - తన కుటుంబములోని వ్యక్తి కొరకు, క్రుధ్యతి - కోపించును.

శరీరములో ఆకలి రూపములోనున్న అగ్నిని తట్టుకొనుట చాల కష్టము. ఒకప్పుడు ఆ అగ్ని ఆతని ఓపికను నశింపజేయును. అపుడాతడు ఇంటిలోని వారిపై కోపమును చేయును. (ఈ వర్ణనలు దళములోని వ్యక్తు లందరికీ వర్తించును).

స ఏవ పునర్నిద్రాऽజగరగృహీతోऽంధే తమసి మగ్నశ్శూన్యా
రణ్య ఇవ శేతే నాన్యత్కించన వేద శవ ఇవాపవిద్ధః ।। 20

సః ఏవ - ఆతడే, పునః - మరల, నిద్రా-అజగరగృహీతః - నిద్ర అనే కొండచిలువచే పట్టుకొనబడినవాడై, అంధే తమసి - దట్టని చీకటి యందు, మగ్నః - మునిగినవాడై, శూన్య-అరణ్యే - జనులు లేని అడవి యందు, అపవిద్ధః - విడిచిపెట్టబడిన, శవః ఇవ - శవము వలె, శేతే - నిద్రించును, అన్యత్ - ఇతరమును, కించన - దేనినైననూ, న వేద - తెలియకుండును.

పగలు అనేకకార్యములలో వ్యగ్రుడైన ఆతడు రాత్రియందు నిద్ర అనే కొండచిలువకు వశుడై అజ్ఞానమనే అంధకారములో మునిగిపోయి, నిర్జనారణ్యములో విడిచిపెట్టబడిన శవము వలె, నిద్రించును. ఆ సమయములో ఆతనికి ఏమియు తెలియదు.

కదాచిద్భగ్నమానదంష్ట్రో దుర్జనదందశూకైరలబ్ధనిద్రాక్షణో వ్యథిత
హృదయేనానుక్షీయమాణవిజ్ఞానోऽంధకూపేऽంధవత్పతతి ।। 21

కదాచిత్ - ఒకప్పుడు, దుర్జనదందశూకైః - దుష్టులనే విషజంతువులచే, భగ్నమానదంష్ట్రః - విరుగగొట్టబడిన గర్వము అనే దంష్ట్రలు గలవాడై, అలబ్ధనిద్రాక్షణః - పొందబడని నిద్రకు అవకాశము గలవాడై, వ్యథిత హృదయేన - పీడించబడిన హృదయముతో, అనుక్షీయమాణవిజ్ఞానః - ప్రతిక్షణము క్షీణించుచున్న విజ్ఞానము గలవాడై, అంధకూపే - చీకటి నూతిలో, అంధవత్ - గ్రుడ్డివాడు వలె, పతతి - పడుచున్నాడు.

ఒకప్పుడు విషజంతువులవంటి దుష్టులు ఆతని గర్వము అనే కోరలను పీకివేసెదరు. అపుడు నిద్రించే అవకాశము కూడ దొరకక, ఆతని విజ్ఞానము క్షీణించిపోవును. గ్రుడ్డివాడు చీకటితో నిండిన నూతిలో పడిన విధముగా, ఆతడు అజ్ఞానము అనే నూతిలో పడిపోవును.

**కర్హి స్మ చిత్కామమధులవాన్ విచిన్వన్ యదా పరదారపరద్ర వ్యాణ్యవరుంధానో రాజ్ఞా స్వామిభిర్వా నిహతః పతత్యపారే నిరయే ॥ 22**

కర్హిచిత్ స్మ - ఒకానొక కాలమునందు, కామమధులవాన్ - కోరికలనే తేనె తుంపరల గురించి, విచిన్వన్ - వెదుకుచున్నవాడై, యదా - ఏ సమయమునందైతే, పరదారపరద్రవ్యాణి - ఇతరుని భార్యను ఇతరుని సొత్తును, అవరుంధానః - తీసుకొనువాడో అప్పుడు, రాజ్ఞా - రాజుచే గాని, స్వామిభిః వా - ఆ సొత్తుయొక్క యజమానులచే గాని, నిహతః - కొట్టబడినవాడై, అపారే - అంతము లేని, నిరయే - నరకమునందు, పతతి - పడును.

ఆతడు ఒక సమయములో కోరికలనే తేనె తుంపరలను వెదుక్కుంటూ, పరస్త్రీని పరధనమును ఆశించును. అపుడు రాజు గాని, లేక ఆ ధనముయొక్క యజమానులు గాని, ఈతనికి దేహశుద్ధి (మరణదండన) చేసెదరు. ఇతడు అంతము లేని నరకము (కారాగృహము) లో పడును.

**అథ చ తస్మాదుభయథాఽపి హి కర్మాస్మిన్నాత్మనస్సంసారా వపనముదాహరంతి ॥ 23**

అథ చ - తరువాత, తస్మాత్ - అందువలన, ఉభయథా అపి - రెండు విధములుగా కూడ, కర్మ - కర్మ, అస్మిన్ - ఈ సంసారమార్గమునందు, ఆత్మనః - ఆత్మకు (తనకు), సంసార-ఆవపనమ్ - సంసారమునకు జన్మ క్షేత్రముగా, ఉదాహరంతి - చెప్పుచున్నారు.

ఇందువలననే, ఈ సంసారమార్గములో పుణ్యము పాపము అనే రెండు విధములైన కర్మ ఆత్మకు (వ్యక్తికి) సంసారమునకు పుట్టినిల్లు అని మహాత్ములు చెప్పెదరు.

**ముక్తస్తతో యది బంధాద్దేవదత్త ఉపాచ్ఛినత్తి తస్మాదపి విష్ణుమిత్ర ఇత్యనవస్థితిః ॥ 24**

తతః - ఆ, బంధాత్ - బంధమునుండి, ముక్తః యది - విముక్తుడై నచో, దేవదత్తః - దేవదత్తుడు, ఉపాచ్ఛినత్తి - లాగుకొనును, తస్మాత్ అపి - వానినుండి కూడ, విష్ణుమిత్రః - విష్ణుమిత్రుడు, ఇతి - ఈ విధముగా, అనవస్థితిః - నిలకడ లేకుండుట.

ఒకచో ఆతడు పరధనమునపహరించి చెరనుండి బయట పడిన నూ, ఆ ధనమును దేవదత్తుడు (మరియొకడు) ఈతనినుండి లాగుకొనును. దేవదత్తునినుండి ఇంకొకడు (విష్ణుమిత్రుడు) ఊడలాగును. ఈ విధముగా, ధనమునకు నిలకడ లేదు.

క్వచిచ్చ శీతవాతాద్యనేకాధిదైవికభౌతికాత్మీయానాం దశానాం ప్రతినివారణేఽకల్పో దురంతచింతయా విషణ్ణ ఆస్తే ॥ 25

క్వచిత్ చ - మరియొకచోట, శీతవాత-ఆది-అనేక-అధిదైవికభౌతిక-ఆత్మీయానామ్ - చలి వేడి మొదలైన అనేకములగు ఆధిదైవిక-అధిభౌతిక-ఆధ్యాత్మికములగు, దశానామ్ - అవస్థలయొక్క, ప్రతినివారణే - నివారించుటయందు, అకల్పః - అసమర్థుడై, దురంతచింతయా - అంతు లేని చింతచే, విషణ్ణః - శోకించువాడై, ఆస్తే - ఉండును.

ఆతనికి మరియొక చోట చలి వేడి మొదలైన ఆధిదైవిక (దైవముచే ఈయబడే), ఆధిభౌతిక (ప్రకృతిచే కల్పించబడే), ఆధ్యాత్మిక (శరీరము నందు కలిగే) దుఃఖావస్థలనుండి తప్పించుకొనే సామర్థ్యము ఉండదు. కావుననే, ఆతడు అంతు లేని చింతతో శోకించుచుండును.

క్వచిన్మిథో వ్యవహరన్యత్కించిద్ధనమన్యేభ్యో వా కాకిణికామాత్రమపహరన్ యత్కించిద్వా విద్వేషమేతి విత్తశాఠ్యాత్ ॥26

క్వచిత్ - ఒకచోట, మిథః - ఒకరితోనొకరు, యత్ కించిత్ - ఏదో కొంచెము, ధనమ్ - ధనమును, వ్యవహరన్ - వ్యవహారమును చేయుచున్నవాడై, కాకిణికామాత్రం వా - దమ్మిడీ మాత్రము గాని, యత్ కించిత్ వా - ఏదో కొంచెము గాని, అన్యేభ్యః - ఇతరులనుండి, అపహరన్ - అపహ

రించువాడై, విత్తశాఠ్యాత్ - ధనము విషయములో వంచన చేయుట వలన, విద్వేషమ్ - అధికమగు ద్వేషమును, ఏతి -పొందును.

ఒకచోట ఆ జీవుడు ఇతరులతో ధనమును ఇచ్చి పుచ్చుకొనే వ్యవహారమును చేస్తూ, ఇతరులనుండి దమ్మిడీని గాని, అంతకంటె తక్కువ గాని ధనమును అపహరించును. ధనము విషయములో ఇట్టి మోసమును చేయుట వలన ఆతనికి వారితో అధికమగు విరోధము ఏర్పడును.

అధ్వన్యముష్మిన్నిమ ఉపసర్గాస్తథా సుఖదుఃఖరాగద్వేషభ
యాభిమానప్రమాదోన్మాదశోకమోహలోభమాత్సర్యేర్ష్యాఽవ
మానక్షుత్పిపాసాధివ్యాధిజన్మజరామరణాదయః ॥ 27

అముష్మిన్ - ఈ, అధ్వని - మార్గమునందు, తథా - అదే విధముగా, ఇమే - ఈ, సుఖదుఃఖరాగద్వేషభయ-అభిమానప్రమాద-ఉన్మాద శోకమోహలోభమాత్సర్య-ఈర్ష్యా-అవమానక్షుత్-పిపాసా-ఆధివ్యాధిజన్మ జరామరణ-ఆదయః - సుఖము దుఃఖము రాగము ద్వేషము భయము అభిమానము (నేను, నాది అనే ధారణలు) పొరపాటు పిచ్చి శోకము వ్యామోహము లోభము ఓర్వలేనితనము పగ అవమానము ఆకలి దప్పిక మనోవ్యాధి శరీరమునకు వ్యాధి పుట్టుక ముసలితనము మరణము మొదలగు, ఉపసర్గాః - ఆటంకములు.

అదే విధముగా, ఈ మార్గమునందు సుఖదుఃఖములు, రాగద్వేషములు, భయము, అభిమానము, పొరపాటు, పిచ్చి, శోకము, వ్యామోహము, లోభము, ఓర్వలేని తనము, పగ, అవమానము, ఆకలి దప్పికలు, మనోవ్యాధి, శరీరవ్యాధి, పుట్టుక, ముసలితనము, మరణము మొదలగు విఘ్నములు కూడ గలవు.

క్వాపి దేవమాయయా స్త్రియా భుజలతోపగూఢః ప్రస్కన్నవి
వేకవిజ్ఞానో యద్విహారగృహారంభాకులహృదయస్తదాశ్రయావ
సక్తసుతదుహితృకలత్రభాషితావలోకవిచేష్టితాపహృతహృ
దయ ఆత్మానమజితాత్మాఽపారేఽంధే తమసి ప్రహిణోతి॥28

క్వ అపి - ఒక సమయమునందు, దేవమాయయా - దేవమాయ అనే, స్త్రియా - స్త్రీచే, భుజలతా-ఉపగూఢః - లతలవంటి భుజములతో కౌగలించుకొన బడినవాడు, ప్రస్కన్నవివేకవిజ్ఞానః - తొలగిపోయిన కార్యా కార్యముల వివేకముయొక్క విజ్ఞానము గలవాడు, యత్-విహారగృహ-ఆ రంభ-ఆకులహృదయః - ఏ స్త్రీయొక్క విహారము కొరకై గృహమును ఆరంభించుటయందు వ్యాకులమైన హృదయము గలవాడో, తత్-ఆశ్రయ -అవసక్తసుతదుహితృకలత్రభాషిత-అవలోకవిచేష్టిత-అపహృతహృదయః - ఆ స్త్రీయొక్క గృహమునందు తగుల్కొనియున్న పుత్రుడు కుమార్తె పుత్రుని భార్య అనువారల మాటలు చూపులు చేష్టలచే అపహరించబడిన హృదయము గలవాడు, అజిత-ఆత్మా - జయించబడని మనస్సు గల వాడు అగు ఆ వర్తకుడు, ఆత్మానమ్ - తనను, అపారే - అంతము లేని, అంధే తమసి - దట్టని చీకటియందు, ప్రహిణోతి - పారవేయుచున్నాడు.

ఆ వర్తకుడు (వ్యక్తి) ఒక సమయమునందు దేవమాయ (అవిద్య) అనే స్త్రీచే లతలవంటి భుజములచే కౌగిలించుకొనబడి, ఇది చేయదగిన పని ఇది చేయకూడనిది అనే వివేకజ్ఞానమును కోల్పోవును. ఆ స్త్రీకి విహారగృహమును కట్టే తొందరపాటుతో ఆతని హృదయము వ్యాకులమై యుండును. ఆమె గృహమును ఆశ్రయించుకొనియే ఈతని కొడుకు, కూతురు, కోడలు కూడ గలరు. ఈతని హృదయము వారి మాటలకు, చూపులకు, చేష్టలకు మురిసిపోవుచుండును. మనోనిగ్రహము లేని ఈ వ్యక్తి అంతము లేని దట్టమైన అజ్ఞానము అనే నరకములోనికి తాను పడి పోవుటలో తానే కారణమగుచున్నాడు.

**కదాచిదీశ్వరస్య భగవతో విష్ణోశ్చక్రాత్పరమాణ్వాదిద్విపరార్ధా పవర్గకాలోపలక్షణాత్పరివర్తితేన వయసా రంహసా హరత ఆబ్రహ్మతృణస్తంబాదీనాం భూతానామనిమిషతో మిషతాం విత్రస్తహృదయస్తమేవేశ్వరం కాలచక్రనిజాయుధం సాక్షాద్భగ వంతం యజ్ఞపురుషమనాదృత్య పాఖండదేవతాః కంకగృధ్రబ కవటప్రాయా ఆర్యసమయపరిహృతాస్సాంకేత్యేనాభిధత్తే।29**

కదాచిత్ - ఒకప్పుడు, ఈశ్వరస్య - సర్వేశ్వరుడైనట్టియు, విష్ణోః - సర్వవ్యాపకుడైన, భగవతః - శ్రీహరి భగవానునియొక్క, పరమాణు-ఆదిద్విపర-అర్ధ-అపవర్గకాల-ఉపలక్షణాత్ - పరమాణువు ఆదిగా ద్విపరార్ధము అంతముగా కలిగి కాలము అనే పేరు గలిగినట్టియు, రంహసా - వేగముచే, పరివర్తితేన - త్రిప్పుటచే, వయసా - వయస్సుచే, ఆబ్రహ్మతృణస్తంబ-ఆదీనామ్ - బ్రహ్మగారు మొదలుకొని గడ్డిపోచ వరకు గల, భూతానామ్ - ప్రాణులు, మిషతామ్ - చూచుచుండగా, హరతః - సంహరించునట్టియు, అనిమిషతః - రెప్పపాటు లేని, చక్రాత్ - చక్రము వలన, విత్రస్తహృదయః - అధికముగా భయపడిన హృదయము గలవాడు, ఈశ్వరమ్ - సర్వేశ్వరుడైనట్టియు, సాక్షాత్ - సాక్షాత్తుగా, కాలచక్రనిజ-ఆయుధమ్ - కాలచక్రమే తన ఆయుధముగా గలిగినట్టియు, యజ్ఞపురుషమ్ - యజ్ఞేశ్వరుడైనట్టియు, తమ్ - ఆ, భగవంతం ఏవ - శ్రీహరినే, అనాదృత్య - తిరస్కరించి, కంకగృధ్రబకవటప్రాయాః - రాపులుగులు గ్రద్దలు కొంగలు గవ్వపిట్టలు వంటి, ఆర్యసమయపరిహృతాః - శిష్టాచారమునందు తిరస్కరించబడిన, పాఖండదేవతాః - వేదవిరుద్ధమగు దేవతలను, సాంకేత్యేన - ప్రమాణము కాని తంత్రముచే, అభిధత్తే - స్వీకరించును.

అత్యంతము అల్పమైన పరమాణుప్రమాణముతో మొదలిడి వెయ్యి కల్పములు అనే బ్రహ్మగారి ఆయుర్దాయము వరకు కాలము విస్తరించి యున్నది. చక్రాకారముగా తిరిగే ఈ కాలమే సర్వేశ్వరుడు, సర్వవ్యాపకుడు అగు శ్రీహరి భగవానుని చక్రాయుధము. ఆగుట యెరుగని ఆ కాలచక్రము వేగముగా తిరుగుతూ బ్రహ్మగారినుండి గడ్డిపోచ వరకు గల సకలప్రాణులు చూచుచుండగనే వారి వయస్సును వేగముగా హరించివేయుచుండును. ఈ కాలము వలన భయపడిన ఆ వ్యక్తి సాక్షాత్తు యజ్ఞేశ్వరుడగు ఆ శ్రీహరి భగవానుని కాదని, రాపులుగులు గ్రద్దలు కొంగలు గవ్వపిట్టలతో పోల్చదగిన వేదవిరుద్ధములగు దేవతలనాశ్రయించును. శిష్టాచార సంపన్నులచే తిరస్కరించబడే ఈ మతములకు వేదప్రమాణము లేని తంత్రములే మూలము.

యదా పాఖండిభిరాత్మవంచితైస్తైరురు వంచితో బ్రహ్మకులం సమావసంస్తేషాం శీలముపనయనాదిశ్రౌతస్మార్తకర్మానుష్ఠా నేన భగవతో యజ్ఞపురుషస్యారాధనమేవ తదరోచయన్ శూద్రకులం భజతే నిగమాచారేఽశుద్ధితో యస్య మిథునీభావః కుటుంబభరణం యథా వానరజాతేః ।। 30

యదా- ఏ కాలమునందైతే, ఆత్మవంచితైః - తమచే మోసపోయిన, తైః - ఆ, పాఖండిభిః - పాఖండులచే, ఉరు - అధికముగా, వంచితః - వంచించబడిన ఆ జీవుడు, బ్రహ్మకులమ్ - వేదవేత్తల సమూహమును, సమావసన్ - కలిసి నివసించువాడై, తేషామ్ - వారియొక్క, తత్ - ఆ, శీలమ్ - స్వభావమైన, ఉపనయన-ఆదిశ్రౌతస్మార్తకర్మ-అనుష్ఠానేన - ఉపనయనము మొదలగు శ్రుతిస్మృతులచే విధించబడిన కర్మలను చేయుటచే, యజ్ఞపురుషస్య - యజ్ఞేశ్వరుడగు, భగవతః - శ్రీహరి భగవానునియొక్క, ఆరాధనం ఏవ - ఆరాధనమునే, అరోచయన్ - ఇష్టపడనివాడై, శూద్రకులమ్ - శూద్రుల సమూహమును, భజతే - సేవించును, యస్య - దేనికి, నిగమ-ఆచారే - వేదోక్తమగు కర్మానుష్ఠానమునందు, అశుద్ధితః - శుద్ధి లేకుండుట వలన, వానరజాతేః యథా - వానరజాతికి వలె, మిథునీభావః - స్త్రీపురుషులు కలిసియుండుట, కుటుంబభరణమ్ - కుటుంబమును పోషించుకొనుట.

తమను తామే మోసగించుకొనే పాఖండులు ఈ వ్యక్తిని అధికముగా మోసగించినారు. అపుడీతడు బ్రహ్మవేత్తల బస్తీలో చేరి వారితో నివసించ మొదలిడెను. ఉపనయనము మొదలగు శ్రుతిస్మృతివిహితములైన కర్మలను చేస్తూ, యజ్ఞేశ్వరుడగు శ్రీహరి భగవానుని ఆరాధించుటయే వారి నిత్యకృత్యము. అది ఈతనికి నచ్చుబాటు కాకపోవుటచే, ఒకానొక శూద్రుల సముదాయమును చేరి, వారిని సేవించును. వారు వేదోక్తమగు ధర్మమును విడిచిపెట్టి పవిత్రత లేనివారై, కేవలము కుటుంబపోషణము మరియు స్త్రీపురుషుల సమాగమము మాత్రమే జీవితలక్ష్యములుగా గలవారై పశుప్రాయమగు జీవితమును గడుపుచుందురు.

తత్రాపి నిరవరోధస్స్వైరేణ విహరన్నతికృపణబుద్ధిరన్యోన్య ముఖనిరీక్షణాదినా గ్రామ్యకర్మణైవ విస్మృతకాలావధిః ||31

అతికృపణబుద్ధిః - మిక్కిలి దీనమగు బుద్ధిగల ఆ వ్యక్తి, తత్ర అపి - అక్కడ కూడ, నిరవరోధః - హద్దులు లేనివాడై, స్వైరేణ - యథేచ్ఛగా, విహరన్ - విహరించువాడై, అన్యోన్యముఖనిరీక్షణ-ఆదినా - పరస్పరము ముఖమును చూచుకొనుట మొదలగు, గ్రామ్యకర్మణా ఏవ - విషయభోగ ములకు చెందిన పనితో మాత్రమే, విస్మృతకాల-అవధిః - విస్మరించబడిన మృత్యుకాలము గలవాడు.

మిక్కిలి దీనమగు బుద్ధి గల ఆ వ్యక్తి అక్కడ కూడ హద్దులు లేకుండా యథేచ్ఛగా విహరించుచుండును. స్త్రీపురుషులు ఒకరి ముఖ మును మరియొకరు చూచుచుండుట మొదలగు విషయభోగములకు సంబంధించిన కర్మలతోడనే ప్రొద్దు పుచ్చే ఆతడు తనకు మృత్యుకాలము ఆసన్నమైనదనే విషయమును కూడ గుర్తించలేదు.

క్వచిద్ద్రుమవదైహికార్థేషు గృహేషు రంస్యన్ యథా వానర స్సుతదారవత్సలో వ్యవాయక్షణః || 32

క్వచిత్ - ఒకప్పుడు, ద్రుమవత్-ఐహిక-అర్థేషు - చెట్టుతో పోల్చ బడే ఇహలోకసుఖములే ఫలముగా గల, గృహేషు - ఇంటియందు, రంస్యన్ - రమించుచున్నవాడై, వానరః యథా - కోతివలె, సుతదారవ త్సలః - పుత్రులయందు భార్యయందు ప్రేమ గల ఆ జీవుడు, వ్యవాయ క్షణః - సంభోగముయొక్క ఉత్సవము గలవాడు.

ఒకచో ఆతడు ఇహలోకఫలములే ప్రధానముగా గలవాడై గృహమునందు రమించుచుండును. ఇట్టి స్థితిలో ఆతనిని చెట్టుపై పళ్లను తింటూ తిరుగాడే కోతితో పోల్చవచ్చును. భార్యాపుత్రులయందు ప్రేమ మెండుగా గల ఆతనికి ఇంద్రియభోగములే ఉత్సవఘడియలు అగును.

ఏవమధ్వన్యవరుంధానో మృత్యుగజభయాత్తమసి గిరికందర ప్రాయే || 33

ఏవమ్ - ఈ విధముగా, అధ్వని - మార్గమునందు, గిరికందర ప్రాయే - కొండగుహతో పోల్చదగిన, తమసి - అజ్ఞానమనే చీకటియందు, మృత్యుగజభయాత్ - మరణము అనే ఏనుగు వలని భయము వలన, అవరుంధానః - అనుభవించుచున్నవాడు.

ఈ విధముగా జీవుడు సంసారమార్గమునందు విషయభోగముల ననుభవిస్తూ, కొండగుహతో పోల్చదగిన అజ్ఞానమనే చీకటిలో పడియుండును. ఆతడు అచట మరణము అనే ఏనుగు వలన భయపడుచుండును.

క్వచిచ్ఛీతవాతాద్యనేకదైవికభౌతికాత్మీయానాం దుఃఖానాం ప్రతినివారణేఽకల్పో దురంతవిషయవిషణ్ణ ఆస్తే ॥ 34

క్వచిత్ - ఒకప్పుడు, శీతవాత-ఆది-అనేకదైవికభౌతిక-ఆత్మీయానామ్ - చలి గాలి మొదలగు అనేకములైన ఆధిదైవిక-ఆధిభౌతిక-ఆధ్యాత్మికములగు, దుఃఖానామ్ - దుఃఖములకు, ప్రతినివారణే - నివారించుటయందు, అకల్పః - అసమర్థుడై, దురంతవిషయవిషణ్ణః - అంతము లేని విషయభోగములకు చెందిన చింత గలవాడై, ఆస్తే - ఉండును.

ఆతనికి ఆయా సందర్భములలో చలి, గాలి మొదలగు అనేకములైన ఆధిదైవిక-ఆధిభౌతిక-ఆధ్యాత్మికములగు దుఃఖములను నివారించే శక్తి ఉండదు. ఆతనికి విషయభోగముల గురించి ఉండే చింత అంతు లేనిది. ఈ విధముగా ఆతడు ఖిన్నుడై యుండును.

క్వచిన్మిథో వ్యవహరన్ యత్కించిద్ధనముపయాతి విత్తశాఠ్యేన ॥ 35

క్వచిత్ - ఒకప్పుడు, మిథః - ఒకరితో నొకరు, వ్యవహరన్ - వ్యవహారములను నడుపువాడై, విత్తశాఠ్యేన - ధనము విషయములో మోసగించుటచే, యత్ కించిత్ - ఏదో కొద్ది, ధనమ్ - ధనమును, ఉపయాతి - పొందును.

ఆతడు ఒకప్పుడు ఇతరులతో వ్యవహారములను నడిపి, వారిని ధనము విషయములో మోసగించి, ఏదో కొద్ది ధనమును సంపాదించును.

క్వచిత్ క్షీణధనశ్శయ్యాసనాశనాద్యుపభోగవిహీనో యావదప్ర
తిలబ్ధమనోరథోపగతాదానేऽవసితమతిస్తతస్తతోऽవమానాదీని
జనాదభిలభతే ।। 36

క్వచిత్ - ఒకచోట, క్షీణధనః - నష్టమైన ధనము గల ఆతడు, శయ్యా-ఆసన-అశన-ఆది-ఉపభోగవిహీనః - మంచము కుర్చీ భోజనము మొదలగు భోగములు లేనివాడై, యావత్ - ఎప్పుడైతే, అప్రతిలబ్ధమనోర థ-ఉపగత-అదానే - పొందబడని కోరిక గలవాడగుటచే కోరబడినదానిని సంపాదించుటయందు, అవసితమతిః - నిశ్చయించబడిన బుద్ధి గలవాడై, తతః తతః - ఆయా, జనాత్ - జనుని వలన, అవమాన-ఆదీని - అవమా నము మొదలగువాటిని, అభిలభతే - అంతటా పొందును.

సంసారమార్గములో పయనించుచున్న ఆ జీవుడు ఆ దారిలో ఒక చోట ధనమును కోల్పోయి, మంచము కుర్చీ భోజనము మొదలగు భోగ సామగ్రి లేనివాడగును. తాను పొందలేకపోయిన అభీష్టవస్తువును ఏ విధ ముగనైననూ పొందవలెననే నిశ్చయముతో ఆతడు ప్రయత్నించి, ఆయా సందర్భములలో జనుల వలన అవమానము మొదలగువాటిని పొందును.

ఏవం విత్తవ్యతిషంగవివృద్ధవైరానుబంధోऽపి పూర్వవాసనయా
మిథ ఉద్వహత్యథాపవహతి ।। 37

ఏవమ్ - ఈ విధముగా, విత్తవ్యతిషంగవివృద్ధవైర-అనుబంధః అపి - ధనమునందలి ఆసక్తిచే బాగా పెరిగిన వైరముయొక్క దోషము గల వాడే అయిననూ, పూర్వవాసనయా - పూర్వమునందలి సంస్కారముచే, మిథః - ఒకరితో నొకరు, ఉద్వహతి - వివాహము మొదలగు సంబంధ మును కలుపుకొనును, అథ - తరువాత, అపవహతి - విడిచిపెట్టును.

ఈ విధముగా ధనమునందు అధికమగు ఆసక్తి గల జీవుడు సర్వదా వైరభావన గలవాడగును. కాని, పూర్వసంస్కారముల బలముచే ఇతరులతో వివాహాది సంబంధములను కలుపుకొని, మరల విడిచిపెట్టును.

ఏతస్మిన్ సంసారాధ్వని నానాక్లేశోపసర్గబాధిత ఆపన్నవిపన్నో యత్ర యస్తము హ వావేతరస్తత్ర విసృజ్య జాతం జాతముపాదాయ శోచన్ముహ్యన్ బిభ్యద్వివదన్ క్రందన్ సంహృష్యన్ గాయన్నహ్యమానస్సాధువర్జితో నైవావర్తతేऽద్యాపి యత ఆరబ్ధ ఏష నరలోకసార్థో యమధ్వనః పారముపదిశంతి ॥38

ఏషః - ఈ, నరలోకసార్థః - మనుష్యలోకమునందలి జీవసమూహము, ఏతస్మిన్ - ఈ, సంసార-అధ్వని - సంసారహేతువు అగు ప్రవృత్తి మార్గమునందు, నానాక్లేశ-ఉపసర్గబాధితః - అనేకములగు కష్టములచే విఘ్నములచే పీడించబడినదై, యత్ర - ఎక్కడ, యః - ఎవడు, ఆపన్నవిపన్నః - ఆపదను మరణమును పొందినాడో, తం ఉ హ - వానిని, తత్ర వై - అక్కడనే, విసృజ్య - విడిచిపెట్టి, ఇతరః - ఇతరుడు, జాతం జాతమ్ - పుట్టిన ప్రతివానిని, ఉపాదాయ - స్వీకరించి, శోచన్ - దుఃఖించుచున్నదై, ముహ్యన్ - వ్యామోహమును (మూర్ఛను) పొందుచున్నదై, బిభ్యత్ - భయపడుచున్నదై, వివదన్ - కలహించుచున్నదై, క్రందన్ - రోదించుచున్నదై, సంహృష్యన్ - పెద్దగా హర్షోద్వేగమును కలిగినదై, గాయన్ - పాడుచున్నదై, నహ్యమానః - బంధించబడుచున్నదై, సాధువర్జితః - సాధువులచే విడిచిపెట్టబడినదై, అద్య అపి - ఇప్పటికి కూడ, న ఏవ ఆవర్తతే - చేరుకొనుటనే లేదు, యతః - ఎవ్వానినుండి, ఆరబ్ధః - సృష్టి బయలు దేరినదో, యమ్ - ఎవ్వానిని, అధ్వనః - సంసారమార్గము యొక్క, పారమ్ - అంతిమమగు అవధిగా, ఉపదిశంతి - ఉపదేశించెదరో.

ఈ సంసారమార్గమునకు అంతిమమగు అవధి శ్రీహరియేనని మహాత్ములు ఉపదేశించుచున్నారు. మనుష్యలోకమునందలి ఈ జీవసమూహము ఆయననుండియే ఉద్భవించినది. వర్తకుల దళమువంటి ఈ జీవసమూహము ఈ సంసారహేతువగు ప్రవృత్తిమార్గములో పయనిస్తూ అనేకములగు కష్టములచే మరియు విఘ్నములచే పీడించబడుచున్నది. ఈ జీవుల గుంపు జీవనయాత్రను చేస్తూ ఉండగా, యాత్ర మధ్యలో ఆపదను పొందినవారిని మరియు మరణించినవారిని విడిచిపెట్టి ఇతరులు ముందుకు సాగుచుందురు. ఈ గుంపులో కొత్తగా జన్మించిన జీవులు

అప్పుడప్పుడు వచ్చి చేరుచుందురు. అజ్ఞానముచే వ్యామోహితులై యున్న వీరందరు శోకిస్తూ, మూర్ఛపోతూ, భయపడుతూ, కలహిస్తూ, రోదిస్తూ, అప్పుడప్పుడు బిగ్గరగా హర్షముతో పాడుకుంటూ, మరియొక ప్పుడు బంధమును పొందుతూ సాగెదరు. వీరు సాధుసంగమును దూర ముగా పెట్టుటచే, ఈ నాటికి కూడ వీరు యాత్రను పూర్తి చేసి, ఆ శ్రీహరి వద్దకు చేరలేక పోవుచున్నారు.

యదిదం యోగానుశాసనం న వా ఏతదవరుంధతే యన్న్యస్త దండా మునయ ఉపశమశీలా ఉపరతాత్మానస్సమవగచ్ఛంతి || 39

యత్ - ఏ, ఇదమ్ - ఈ, యోగ-అనుశాసనమ్ - యోగము (జ్ఞానము, లేక సాధన) యొక్క శాస్త్రోపదేశము గలదో, ఏతత్ - దీనిని, వై - నిశ్చయముగా, న అవరుంధతే - పొందుటలేదు, యత్ - దేనిని, న్యస్త దండాః - విడిచిపెట్టబడిన భూతహింస గలవారు, ఉపశమశీలాః - శాంత మగు స్వభావము గలవారు, ఉపరత-ఆత్మానః - భోగములనుండి విరమిం చుకున్న మనస్సులు గలవారు అగు, మునయః - మననశీలురు, సమవగ చ్ఛంతి - చక్కగా పొందుచున్నారో.

ఆ జీవుల సమూహము ఈ యోగము (జ్ఞానము, భక్తి లేక సాధన) యొక్క శాస్త్రోపదేశమును చేపట్టలేకనే సంసారమునందు పడియున్నారు. శాంతస్వభావులు, మననశీలురు అగు సాధకులు సాంసారికభోగములను ప్రక్కన బెట్టి, భూతహింసను విడనాడి, శ్రీహరిని ఆత్మరూపముగా పొందు చున్నారు.

యదపి దిగిభజయినో యజ్వినో యే వై రాజర్షయః కిం తు పరం మృధే శయీరన్నస్యామేవ మమేయమితి కృతవైరాను బంధా యాం విసృజ్య స్వయముపసంహృతాః || 40

**దిక్-ఇభజయినః యత్ అపి - దిగ్గజములను జయించినవారే అయినా, యే - ఏ, యజ్వినః వై - యజ్ఞములను చేసిన, రాజర్షయః - రాజర్షులు గలరో వారు, కిం తు - కానైతే, అస్యామ్ - ఈ భూమి విషయ**

మునందు, ఇయమ్ - ఈ భూమి, మమ ఏవ - నాదే, ఇతి - అని, కృతవైర -అనుబంధాః - చేయబడిన నిరంతరమగు వైరము గలవారై, పరమ్ - కేవలము, మృధే - యుద్ధభూమియందు, శయీరన్ - నిద్రించెదరు, యామ్ - ఏ భూమిని, విసృజ్య - విడిచిపెట్టి, స్వయమ్ - స్వయముగా, ఉపసంహృతాః - మరణించినారో.

దిగ్గజములను జయించి, యజ్ఞములననుష్ఠించిన రాజర్షులు సైతము ఈ భూమి నాది అని నిరంతరమగు వైరమును పూని, యుద్ధరంగములో నేలపై పడి మరణించుచున్నారే గాని, ఆ శ్రీహరిని పొందలేకున్నారు. భూమి కొరకై కలహించు వారలు ఆ భూమిని విడిచి తాము పరలోకమునకు పయనమగుచున్నారు.

కర్మవల్లీమవలంబ్య తత ఆపదః కథంచిన్నరకాద్విముక్తః పున
రప్యేవం సంసారాధ్వని వర్తమానో నరలోకసార్థముపయాతి
ఏవముపరి గతోఽపి || 41

కర్మవల్లీమ్ - ప్రారబ్ధకర్మ అనే తీగను, అవలంబ్య - పట్టుకొని వ్రేలాడి, తతః - ఆ, ఆపదః - ఆపదనుండి, నరకాత్ - నరకమునుండి, కథంచిత్ - కష్టము మీద, విముక్తః - విముక్తుడై, పునః అపి - మరల కూడ, ఏవమ్ - ఈ విధముగా, సంసార-అధ్వని - సంసారమునకు హేతువగు ప్రవృత్తిమార్గమునందు, వర్తమానః - ఉన్నవాడై, నరలోకసార్థమ్ - మానవలోకమునందలి జీవుల దళమును, ఉపయాతి - చేరును, ఉపరిగతః అపి - స్వర్గమును పొందినవాడు కూడ, ఏవమ్ - ఇటులనే.

ఆపదను లేక నరకమును పొందిన జీవుడు ప్రారబ్ధకర్మ అనే తీగను పట్టుకొని వ్రేలాడుతూ, ఆ ఆపదనుండి లేక నరకమునుండి చాల కష్టము మీద విడుదల అగును. అపుడా జీవుడు మరల మనుష్యలోకములోని ఈ జీవుల సముదాయమును చేరుకొని, మరల సంసారమునకు హేతువగు కర్మమార్గమునందు ముందుకు సాగును. పుణ్యముచే స్వర్గమును పొందిన జీవుడు కూడ ఆ పుణ్యము ఖర్చు కాగానే, మరల నరలోకములో జన్మించి, ఆ జీవసమూహమును చేరుకొనును.

తస్యేదముపగాయంతి ---
ఆర్షభస్యేహ రాజర్షేర్మనసాఽపి మహాత్మనః ।
నానువర్త్మార్హతి నృపో మక్షికేవ గరుత్మతః ।। 42

తస్య - ఆ భరతునకు, ఇదమ్ - ఈ మహిమను, ఉపగాయంతి - గానము చేయుచున్నారు, ఇహ - ఈ లోకమునందు, ఆర్షభస్య - ఋషభుని పుత్రుడైనట్టియు, రాజర్షేః - రాజర్షి అయినట్టియు, మహాత్మనః - మహాత్ముడగు భరతుని, వర్త్మ - మార్గమును, అను - అనుసరించుటకు, నృపః - రాజు, మనసా అపి - మనస్సుచే నైననూ, గరుత్మతః - గరుత్మంతునికి, మక్షికా ఇవ - ఈగ వలె, న అర్హతి - తగడు.

ఆ భరతుని మహిమను ఉటంకించే ఈ శ్లోకములను పెద్దలు గానము చేయుదురు --- ఋషభుని పుత్రుడు, రాజర్షి, మహాత్ముడు అగు భరతుడు నడచిన మార్గములో నడచుట ఇతరరాజులకు ఊహకైననూ అందని విషయము. ఈగ గరుత్మంతుని దారిలో పయనించలేదు గదా!

యో దుస్త్యజాన్ దారసుతాన్ సుహృద్రాజ్యం హృదిస్పృశః ।
జహౌ యువైవ మలవదుత్తమశ్లోకలాలసః ।। 43

ఉత్తమశ్లోకలాలసః - పవిత్రకీర్తియగు శ్రీహరియందు తృష్ణ గల, యః - ఏ భరతుడు, యువా ఏవ - యువకుడుగనే, దుస్త్యజాన్ - విడువ శక్యము కానట్టియు, హృదిస్పృశః - మనోహరులగు, దారసుతాన్ - భార్యను పుత్రులను, సుహృత్-రాజ్యమ్ - మిత్రులను రాజ్యమును, మలవత్ - మాలిన్యమును వలె, జహౌ - విడిచిపెట్టెనో.

పవిత్రకీర్తియగు శ్రీహరిని పొందాలనే తహతహ గల భరతుడు యువకుడుగ నుండగనే, మనస్సును హరించివేసే భార్యను, పుత్రులను, మిత్రులను, రాజ్యమును మాలిన్యమును వలె విడిచిపెట్టెను. ఇట్లు విడిచిపెట్టుట దుర్ఘటము.

యో దుస్త్యజాన్ క్షితిసుతస్వజనార్థదారాన్
ప్రార్థ్యాం శ్రియం సురవరైస్సదయావలోకామ్ ।

నైచ్ఛన్నృపస్తదుచితం మహతాం మధుద్విట్-
సేవాఽనురక్తమనసామభవోఽపి ఫల్గుః ॥ 44

యః - ఏ, నృపః - భరత మహారాజు, దుస్త్యజాన్ - విడిచిపెట్ట శక్యము కాని, క్షితిసుతస్వజన-అర్థదారాన్ - భూమి పుత్రులు తన వారు ధనము భార్యలను, సురవరైః - గొప్ప దేవతలచే, ప్రార్థ్యామ్ - కోరబడునట్టియు, సదయా-అవలోకామ్ - దయాదృష్టితో కూడియున్న, శ్రియమ్ - లక్ష్మిని, న ఐచ్ఛత్ - కోరలేదో, తత్ - అది, ఉచితమ్ - యోగ్యమే, మధుద్విట్-సేవా-అనురక్తమనసామ్ - మధువైరియగు శ్రీహరియొక్క సేవయందు ప్రీతి గల మనస్సు గల, మహతామ్ - మహాత్ములకు, అభవః అపి - పునర్జన్మ లేని మోక్షము కూడ, ఫల్గుః - అల్పమే.

భరత మహారాజు భూమి, పుత్రులు, తన వారు, ధనము, భార్య అనువాటిని కోరలేదు. వీరిని విడిచిపెట్టుట చాల కష్టము. పైగా, ఆయన లక్ష్మిని కూడ కోరలేదు. లక్ష్మీదేవియొక్క దయతో కూడిన చూపును దేవతలలో గొప్పవారు కూడ ప్రార్థించుచుందురు. (ఈయన తనవైపు దయతో చూడాలని లక్ష్మీదేవి అపేక్షించినా, ఆయన లెక్క చేయలేదు). ఈ త్యాగము భరతుని విషయములో యోగ్యముగనే యున్నది. ఏలయనగా, మధువైరియగు శ్రీహరియొక్క సేవయందలి ప్రీతితో నిండిన మనస్సు గల మహాత్ములకు పునర్జన్మ లేని మోక్షము కూడ అల్పమైనదియే.

యజ్ఞాయ ధర్మపతయే విధినైపుణాయ
యోగాయ సాంఖ్యశిరసే ప్రకృతీశ్వరాయ ।
నారాయణాయ హరయే నమ ఇత్యుదారం
హాస్యన్మృగత్వమపి యస్సముదాజహార ॥ 45

యజ్ఞాయ - యజ్ఞస్వరూపుడైనట్టియు, ధర్మపతయే - ధర్మమునకు పాలకుడైనట్టియు, విధినైపుణాయ - విధియందు నైపుణ్యము కలిగినట్టియు, యోగాయ - యోగముచే పొందబడునట్టియు (యోగస్వరూపుడైనట్టియు), సాంఖ్యశిరసే - ఉపనిషత్తులచే ప్రతిపాదించబడునట్టియు, ప్రకృతి-ఈశ్వరాయ - ప్రకృతిని తన వశమునందుంచుకొనునట్టియు, నారాయ

ణాయ - ప్రాణులే నివాసస్థానముగా గల, హరయే - శ్రీహరి (పాపము లను పోగొట్టువాడు) కొరకు, నమః - నమస్కారము, ఇతి - అని, యః - ఏ భరతుడు, మృగత్వమ్ - లేడి శరీరమును, హాస్యన్ అపి - విడిచిపెట్ట బోవువాడైనప్పటికీ, ఉదారమ్ - బిగ్గరగా, సముదాజహార - చక్కగా ఉచ్చ రించెనో.

భరతుడు లేడి శరీరమును విడువబోతూ కూడ, బిగ్గరగా చక్కగా ఇట్లు ఉచ్చరించెను --- యజ్ఞస్వరూపుడగు శ్రీహరి ధర్మమును పాలించు ను. వైదికకర్మలను ప్రవర్తిల్ల జేసే ఆయనయే యజ్ఞమును చేసే యజమా ని రూపములో నున్నాడు. ఆయనను సాధకులు జ్ఞానముచే పొందెదరు. ఆ జ్ఞానము కూడ ఆయన స్వరూపమే. ప్రకృతిని తన వశమునందుంచు కొనే ఆ శ్రీహరిని సాంఖ్య (ఆత్మజ్ఞాన) శాస్త్రము (ఉపనిషత్తులు) ప్రతిపా దించుచున్నది. సకలప్రాణుల హృదయములో ఆత్మరూపముగా విరాజిల్లే ఆ శ్రీహరికి నమస్కారము.

యః ఇదం భాగవతసభాజితావదాతగుణకర్మణో రాజర్షేర్భరత
స్యానుచరితం స్వస్త్యయనమాయుష్యం ధన్యం యశస్యం
స్వర్గ్యాపవర్గ్యం వాఽనుశృణోత్యాఖ్యాస్యత్యభినందతి చ
సర్వా ఏవాశిష ఆత్మన ఆశాస్తే న కాంచన పరత ఇతి || 46

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే
రహూగణ జడభరత సంవాదే పారోక్ష్యవివరణం
నామ చతుర్దశోఽధ్యాయః ||

యః - ఎవడైతే, భాగవతసభాజిత-అవదాతగుణకర్మణః - భగవ ద్భక్తులచే సత్కరించబడే శుద్ధములగు గుణములు చేష్టలు గలిగినట్టియు, రాజర్షేః - రాజర్షియగు, భరతస్య - భరతునియొక్క, స్వస్తి-అయనమ్ - మంగళములకు నిధానమైనట్టియు, ఆయుష్యమ్ - ఆయుష్షును వర్ధిల్లజే యునట్టియు, ధన్యమ్ - ధనమునిచ్చునట్టియు, యశస్యమ్ - కీర్తిని ఇచ్చు నట్టియు, స్వర్గ్య-అపవర్గ్యమ్ - స్వర్గమును మోక్షమును ఇచ్చే, ఇదమ్ - ఈ, అనుచరితమ్ - వృత్తాంతమును, అనుశృణోతి - మహాత్ములు

చెప్పగా వినునో, ఆఖ్యాస్యతి - ప్రవచించునో, చ - మరియు, అభినందతి - కొనియాడునో ఆతడు, ఆత్మనః - ఆత్మస్వరూపమునుండి, సర్వాః - అన్ని, ఆశిషః - కామనలను, ఆశాస్తే ఏవ - పొంది తీరును, పరతః - ఇతరులనుండి, కాంచన - దేనినైననూ, న ఇతి - పొంద బనిలేదు.

భగవద్భక్తులు రాజర్షియగు భరతుని శుద్ధములగు గుణములను, కర్మలను ప్రశంసించుచుందురు. ఆయనయొక్క ఈ మంగళనిధానమగు వృత్తాంతము దీర్ఘాయుష్షును, ధనమును, కీర్తిని, స్వర్గమును, మోక్షమును కూడ అనుగ్రహించును. దీనిని మహాత్ములు చెప్పగా ఎవరైతే వినునో, ఎవరైతే ప్రవచించునో, మరియు కొనియాడునో, వానికి తన స్వరూపమునుండియే సకలకామనలు సిద్ధించి తీరును. అట్టివాడు కామనల సిద్ధి కొరకై ఇతరముల నాశ్రయించ బని లేదు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో రహూగణ జడభరత సంవాదములో సంసారమార్గములోని దృష్టాంతములను వివరించే పదునాల్గవ అధ్యాయము ముగిసినది (14).

*****

# అథ పంచదశోఽధ్యాయః

## గయుని చరితము

• శ్రీశుక ఉవాచ ।

భరతస్యాత్మజస్సుమతిర్నామాభిహితో యము హ వావ కేచి
త్పాఖండిన ఋషభపదవీమనువర్తమానం చానార్యా అవేదస
మామ్నాతాం దేవతాం స్వమనీషయా పాపీయస్యాం కలౌ
కల్పయిష్యంతి॥ 1

భరతస్య - భరతుని, సుమతిః నామ - సుమతి యని ప్రసిద్ధిని గాంచిన, ఆత్మజః - పుత్రుడు, అభిహితః - చెప్పబడినాడు, ఋషభపదవీమ్ - ఋషభుని మార్గమును, అనువర్తమానమ్ - అనుసరించుచున్న, యం ఉ హ - ఎవనినైతే, కేచిత్ - కొందరు, పాఖండినః - వేదవిరోధులగు, అనార్యాః - దుష్టులు, అవేదసమామ్నాతామ్ - వేదములలో చెప్పబడని, దేవతామ్ - దేవతనుగా, స్వమనీషయా - తమ బుద్ధిచే, పాపీయస్యామ్ - పాపభూయిష్ఠమగు, కలౌ - కలియుగమునందు, కల్పయిష్యంతి - కల్పించగలరో.

శుకమహర్షి ఇట్లు పలికెను --- భరతుని పుత్రుడు సుమతి అనే పేరుతో ప్రసిద్ధిని గాంచినాడు. ఆయనను గురించి ఇదివరలో చెప్పడమైనది. ఆయన ఋషభుని మార్గమునే అనుసరించెను. కాని, పాపభూయిష్ఠమగు కలియుగమునందు వేదవిరోధులగు దుష్టులు తమ బుద్ధికి తోచిన విధముగా ఆయనయే దేవతయని, వేదముల బోధతో సంబంధము లేకుండా కల్పించెదరు.

తస్మాద్వృద్ధసేనాయాం దేవతాజిన్నామ పుత్రోఽభవత్ ॥ 2

తస్మాత్ - వాని వలన, వృద్ధసేనాయామ్ - వృద్ధసేనయందు, దేవతాజిత్ నామ - దేవతాజిత్తు అని ప్రసిద్ధి గాంచిన, పుత్రః - పుత్రుడు, అభవత్ - కలిగెను.

ఆయనకు వృద్ధసేన అనే భార్యయందు దేవతాజిత్తు అని ప్రసిద్ధిని గాంచిన పుత్రుడు కలిగెను.

అథాసుర్యాం తత్తనయో దేవద్యుమ్నస్తతో ధేనుమత్యాం
సుతః పరమేష్ఠీ తస్య సువర్చలాయాం ప్రతీహ ఉపజాతః ॥3

అథ - తరువాత, ఆసుర్యామ్ - ఆసురియందు, తత్-తనయః - ఆ దేవతాజిత్తుని పుత్రుడు, దేవద్యుమ్నః - దేవద్యుమ్నుడు, తతః - వాని వలన, ధేనుమత్యామ్ - ధేనుమతియందు, పరమేష్ఠీ - పరమేష్ఠి అనే, సుతః - కొడుకు, తస్య - వానికి, సువర్చలాయామ్ - సువర్చలయందు, ప్రతీహః - ప్రతీహుడు, ఉపజాతః - పుట్టినాడు.

తరువాత దేవతాజిత్తునకు ఆసురియందు దేవద్యుమ్నుడు అనే పుత్రుడు, ఆ దేవద్యుమ్నునకు ధేనుమతియందు పరమేష్ఠి అనే పుత్రుడు, ఆ పరమేష్ఠికి సువర్చలయందు ప్రతీహుడు అనే పుత్రుడు కలిగిరి.

య ఆత్మవిద్యామాఖ్యాయ స్వయం సంశుద్ధో మహాపురుష
మనుసస్మార ॥ 4

యః - ఏ ప్రతీహుడు, ఆత్మవిద్యామ్ - ఆత్మజ్ఞానమును, ఆఖ్యాయ - బోధించి, స్వయమ్ - స్వయముగా, సంశుద్ధః - చక్కగా శుద్ధుడై, మహాపురుషమ్ - పురుషోత్తముని, అనుసస్మార - అనుభవమునకు తెచ్చుకొనెనో.

ఆ ప్రతీహుడు తాను అంతఃకరణశుద్ధిని పొంది, ఆత్మజ్ఞానమును ప్రవచించి, పురుషోత్తముని ఆత్మరూపముగా సాక్షాత్కరించుకొనెను.

ప్రతీహాత్సువర్చలాయాం ప్రతిహర్త్రాదయస్త్రయ ఆసన్నిజ్యాకోవి
దాస్సూనవః ప్రతిహర్తుః స్తుత్యామజభూమానావజనిషాతామ్ ॥5

ప్రతీహాత్ - ప్రతీహుని వలన, సువర్చలాయామ్ - సువర్చలయం దు, ప్రతిహర్త్రాదయః - ప్రతిహర్త మొదలగు, త్రయః - ముగ్గురు, ఇజ్యాకో విదాః - యజ్ఞములలో నిపుణులగు, సూనవః - పుత్రులు, ఆసన్ - కలిగిరి, ప్రతిహర్తుః - ప్రతిహర్తకు, స్తుత్యామ్ - స్తుతియందు, అజభూమానౌ - అజుడు భూమ అనువారలు, అజనిషాతామ్ - జన్మించిరి.

ప్రతీహునకు సువర్చలయందు ప్రతిహర్త, ప్రస్తోత మరియు ఉద్గాత అనే ముగ్గురు కొడుకులు కలిగిరి. వారు యజ్ఞయాగాదులలో నిపుణులు. ప్రతిహర్తకు స్తుతియందు అజుడు, భూమ అనే కొడుకులు కలిగిరి.

**భూమ్న ఋషికుల్యాయాముద్గీథస్తతః ప్రస్తావో దేవకుల్యాయాం ప్రస్తావాన్నియుత్సాయాం హృదయజ ఆసీద్విభుర్విభో రత్యాం చ పృథుషేణస్తస్మాన్నక్త ఆకూత్యాం జజ్ఞే నక్తాద్ద్రుతిపుత్రో గయో రాజర్షిప్రవర ఉదారశ్రవా అజాయత సాక్షాద్భగవతో విష్ణోర్జగద్రిరక్షిషయా గృహీతసత్త్వస్య కలాఽఽత్మవత్త్వాదిలక్షణేన మహాపురుషతాం ప్రాప్తః ॥ 6**

భూమ్నః - భూముని వలన, ఋషికుల్యాయామ్ - ఋషికుల్యయందు, ఉద్గీథః - ఉద్గీథుడు, తతః - వాని వలన, దేవకుల్యాయామ్ - దేవకుల్యయందు, ప్రస్తావః - ప్రస్తావుడు, ప్రస్తావాత్ - ప్రస్తావుని వలన, నియుత్సాయామ్ - నియుత్సయందు, విభుః - విభుడు అనే, హృదయజః - హృదయమునుండి పుట్టే కొడుకు, ఆసీత్ - కలిగెను, విభోః చ - విభువు వలన కూడ, రత్యామ్ - రతియందు, పృథుషేణః - పృథుషేణుడు, తస్మాత్ - వాని వలన, ఆకూత్యామ్ - ఆకూతియందు, నక్తః - నక్తుడు, జజ్ఞే - పుట్టెను, నక్తాత్ - నక్తుని వలన, ద్రుతిపుత్రః - ద్రుతియొక్క పుత్రుడగు, గయః - గయుడు, అజాయత - పుట్టెను, రాజర్షిప్రవరః - రాజర్షులలో శ్రేష్ఠుడు, ఉదారశ్రవాః - గొప్ప కీర్తి గలవాడు, జగత్-రిరక్షయా - జగత్తును రక్షించే కోరికతో, గృహీతసత్త్వస్య - స్వీకరించబడిన సత్త్వగుణము గల, భగవతః విష్ణోః - విష్ణు భగవానునియొక్క, సాక్షాత్ - సాక్షాత్తుగా, కలా -

అంశ, ఆత్మవత్త్వాదిలక్షణేన - ఇంద్రియనిగ్రహము మొదలగు లక్షణముచే, మహాపురుషతామ్ - మహానుభావత్వమును, ప్రాప్తః - పొందినవాడు.

భూమకు ఋషికుల్యయందు ఉద్గీథుడు అనే హృదయమునుండి పుట్టే కొడుకు కలిగెను. ఉద్గీథునకు దేవకుల్యయందు ప్రస్తావుడు, ప్రస్తావునకు నియుత్సయందు విభుడు, విభునకు రతియందు పృథుషేణుడు, పృథుషేణునకు ఆకూతియందు నక్తుడు, నక్తునకు ద్రుతియందు గయుడు అనే పుత్రులు కలిగిరి. రాజర్షులలో శ్రేష్ఠుడగు గయుడు గొప్ప కీర్తిని పొందెను. ఆయన సాక్షాత్తుగా, జగత్తును రక్షించే కోరికతో సత్త్వగుణమును స్వీకరించియున్న విష్ణుభగవానుని అంశయే. సంయమము మొదలగు లక్షణములు గల ఆ గయుడు సర్వమానవులలో గొప్పవాడు ఆయెను.

స వై స్వధర్మేణ ప్రజాపాలనపోషణప్రీణనోపలాలనానుశాసన లక్షణేనేజ్యాదినా చ భగవతి మహాపురుషే పరావరే బ్రహ్మణి సర్వాత్మనార్పితపరమార్థలక్షణేన బ్రహ్మవిచ్చరణానుసేవయాఽఽపాదితభగవద్భక్తియోగేన చాభీక్ష్ణశః పరిభావితాతిశుద్ధమతిరుపరతానాత్మ్య ఆత్మని స్వయముపలభ్యమానబ్రహ్మాత్మానుభవోఽపి నిరభిమాన ఏవావనిమజూగుపత్ ॥ 7

సః - ఆ గయుడు, వై - నిశ్చయముగా, ప్రజాపాలనపోషణప్రీణన -ఉపలాలన-అనుశాసనలక్షణేన - ప్రజలను పాలించుట పోషించుట రంజింపజేయుట ప్రేమతో లాలించుట మరియు అనుశాసనములో నుంచుట అనే లక్షణములు కలిగినట్టియు, ఇజ్యా-ఆదినా చ - యజ్ఞము మొదలైనట్టియు, మహాపురుషే - పురుషోత్తముడైనట్టియు, పర-అవరే - కార్యకారణముల రూపములోనున్నట్టియు, బ్రహ్మణి - సర్వాతిశాయి అయినట్టియు, సర్వ-ఆత్మని - సర్వము రూపములోనున్న, భగవతి - శ్రీహరి భగవానునియందు, అర్పితపరమార్థలక్షణేన - అర్పించబడినదై పరమపురుషార్థముయొక్క లక్షణము గల, స్వధర్మేణ - తన ధర్మముచే, చ - మరియు, బ్రహ్మవిత్-చరణ-అనుసేవయా - బ్రహ్మవేత్తల పాదముల సేవచే, ఆపాదితభగవద్-భక్తియోగేన - సంపాదించబడిన భగవానునియం

దలి భక్తి అనే సాధనచే, అభీక్ష్ణశః - నిరంతరముగా, పరిభావిత-అతిశుద్ధ మతిః - సంస్కరించబడిన మిక్కిలి పరిశుద్ధమైన అంతఃకరణము గలవాడై, ఉపరత-అనాత్మ్యే - తొలగిపోయిన దేహాదులు గల, ఆత్మని - అంతఃకరణ మునందు, స్వయమ్ - స్వయముగా, ఉపలభ్యమానబ్రహ్మ-ఆత్మ-అను భవః అపి - పొందబడుచున్న బ్రహ్మకంటె అభిన్నమైన ఆత్మయొక్క అను భవము గలవాడే అయిననూ, నిరభిమానః ఏవ - అహంకారము లేని వాడుగనే, అవనిమ్ - భూమిని, అజూగుపత్ - పాలించెను.

ప్రజలను పాలించి పోషించుట, వారికి ప్రీతిని కలిగించుట, వారిని ప్రేమతో లాలించుట మరియు వారిని అనుశాసనములో నుంచుట అనునవి రాజునకు స్వధర్మము. యజ్ఞములను చేయుట కూడ రాజధర్మమే. ఆ గయ మహారాజు ఇట్టి తన ధర్మమును చక్కగా అనుష్ఠించి, దానిని పురుషో త్తముడు, సర్వాతిశాయి అగు శ్రీహరికి సమర్పించెను. కార్యకారణరూపుడై సర్వమునకు ఆత్మ అయి ఉన్న భగవానునకు ఇట్లు సమర్పించుట వలన స్వధర్మము పరమపురుషార్థమగు మోక్షమునకు దారి తీయును. ఇట్టి స్వధ ర్మముచే గయుని అంతఃకరణము నిరంతరముగా సంస్కరించబడినదై మిక్కిలి పరిశుద్ధమయ్యెను. పైగా, ఆయన బ్రహ్మవేత్తల పాదములను సేవించి భక్తియోగమును కూడ సంపాదించెను. దీని వలన ఆయనకు అంతఃకరణములో అనాత్మయగు దేహాదులయందుండే ఆసక్తి తొలగిపోయె ను. ఆయనకు బుద్ధియందు బ్రహ్మాత్మైక్యజ్ఞానము ఉదయించి, ఆయన ఆత్మసాక్షాత్కారమును పొందెను. అయిననూ, ఆయన అభిమానశూ న్యుడై భూమిని పాలించెను. పరబ్రహ్మ హృదయములో ఆత్మరూపముగా సర్వకాలములలో ఉపలభ్యమగుచునే యుండును గదా!

**తస్యేమాం గాథాం పాండవేయ పురావిద ఉపగాయంతి ॥8**

పాండవేయ - పాండువంశీయుడవగు ఓ రాజా!, తస్య - ఆ గయుని, ఇమామ్ - ఈ, గాథామ్ - మహిమను చెప్పే శ్లోకమును, పురావిదః - ఇతిహాసము తెలిసినవారు, ఉపగాయంతి - గానము చేసెదరు.

పాండువంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! ఆ గయుని మహిమను బోధించే ఈ శ్లోకములను ఇతిహాసజ్ఞులు గానము చేయుచుందురు.

గయం నృపః కః ప్రతియాతి కర్మభిః
యజ్వాభిమానీ బహువిద్ధర్మగోప్తా ।
సమాగతశ్రీస్సదసస్పతిస్సతాం
సత్సేవకోఽన్యో భగవత్కలామృతే ॥ 9

భగవత్-కలాం ఋతే - భగవానుని అంశను మినహాయించి, యజ్వా - యజ్ఞములను చేసినవాడు, అభిమానీ - మనస్వి, బహువిత్ - చాల తెలిసినవాడు, ధర్మగోప్తా - ధర్మమును రక్షించువాడు, సమాగతశ్రీః - పొందబడిన సంపద గలవాడు, సతామ్ - సత్పురుషుల, సదసస్పతిః - సమాజమునకు ప్రభువు, సత్-సేవకః - సత్పురుషులను సేవించువాడు అగు, అన్యః - ఇతరుడగు, నృపః - రాజు, కః - ఎవడు, కర్మభిః - కర్మల చే, గయమ్ - గయుని, ప్రతియాతి - సమానుడగును?

కర్మల విషయములో గయునితో సమానుడైన రాజు ఎవడు గలడు? యజ్ఞములను చేసి ఆత్మాభిమానము గలవాడై గొప్ప పండితుడై ధర్మమును రక్షిస్తూ సంపదలను పొంది సత్పురుషుల సమాజములో అగ్రగణ్యుడై సత్పురుషులను సేవించే రాజు కూడ గయునితో సమానుడు కాలేడు. గయుడు భగవంతుని అంశయే.

యమభ్యషించన్ పరయా ముదా సతీః
సత్యాశిషో దక్షకన్యాస్సరిద్భిః ।
యస్య ప్రజానాం దుదుహే ధరాఽఽశిషో
నిరాశిషో గుణవత్సస్నుతోధాః ॥ 10

సతీః - పతివ్రతలు, సత్య-ఆశిషః - యథార్థములగు ఆశీస్సులు గలవారు అగు, దక్షకన్యాః - దక్షుని కుమార్తెలు, పరయా - గొప్ప, ముదా - ఆనందముతో, యమ్ - ఏ గయుని, సరిద్భిః - జలములతో (నదులతో గూడి), అభ్యషించన్ - అభిషేకించిరో, నిరాశిషః - కోరికలు లేని, యస్య - ఏ గయుని, ప్రజానామ్ - ప్రజలకు, గుణవత్సస్నుత-ఊధాః - గుణములనే దూడచే చేపబడిన పొదుగు గల, ధరా - భూమి, ఆశిషః - కామనలను, దుదుహే - పితికెనో.

దక్షుని కుమార్తెలు పతివ్రతలు. వారి ఆశీర్వచనములు యథార్థము లగును. వారు గంగ మొదలగు నదీదేవతలు తోడు కాగా, గొప్ప ఆనంద ముతో గయుని జలములతో అభిషేకించిరి. గయుడు నిష్కాముడు. ఆయన గుణములచే ప్రసన్నురాలైన భూదేవి ఆయన రాజ్యములోని ప్రజల కోరికలను పరిపూర్ణము చేసెను.

ఛందాంస్యకామస్య చ యస్య కామాన్
దుదూహురాజహ్రురథో బలిం నృపాః ।
ప్రత్యంచితా యుధి ధర్మేణ విప్రా
యదాశిషాం షష్ఠమంశం పరేత్య ॥ 11

అకామస్య - నిష్కాముడగు, యస్య - ఏ గయునికి, ఛందాంసి - వేదములు, కామాన్ - భోగ్యవస్తువులను, దుదుహుః - పితికినవో, అథో - మరియు, యుధి - యుద్ధమునందు, ప్రతి-అంచితాః - సత్కరించబడిన, నృపాః - రాజులు, బలిమ్ - కప్పమును, ఆజహ్రుః - సమర్పించిరో, ధర్మేణ - ధర్మముచే, విప్రాః - వేదవేత్తలు, యత్ - ఎప్పుడైతే, ప్రత్యం చితాః - సత్కరించబడినారో, పరేత్య - మరణించి, ఆశిషామ్ - శుభఫల ముల, షష్ఠమ్ - ఆరవ, అంశమ్ - భాగమును, ఆజహ్రుః - సమర్పించిరో.

గయుడు నిష్కాముడు. కాని, వేదములు ఆయనకు భోగ్యవస్తువు లను కర్మఫలరూపముగా సమృద్ధిగా నిచ్చినవి. మరియు, యుద్ధరంగము నందు ఆయన రాజులను బాణములతో సత్కరించగా, వారాయనకు కప్ప ములను కట్టిరి. ఆయన ధర్మముగా వేదవేత్తలను పాలించగా, వారు ఆయ నకు పరలోకములో ఫలించే తమ పుణ్యములో ఆరవ వంతును అర్పించిరి.

యస్యాధ్వరే భగవానధ్వరాత్మా మఘోని మాద్యత్యురుసోమపీథే,
శ్రద్ధావిశుద్ధాచలభక్తియోగసమర్పితేజ్యాఫలమాజహార ॥ 12

ఉరుసోమపీథే - అధికమగు సోమపానము గల, యస్య - ఏ గయుని, అధ్వరే - యజ్ఞమునందు, మఘోని - ఇంద్రుడు, మాద్యతి - మత్తును పొందగా, అధ్వర-ఆత్మా - యజ్ఞస్వరూపుడగు, భగవాన్ - శ్రీహరి భగవానుడు, శ్రద్ధావిశుద్ధ-అచలభక్తియోగసమర్పిత-ఇజ్యాఫలమ్ -

శ్రద్ధచే మిక్కిలి శుద్ధమైన చలనము లేని భక్తియోగముచే సమర్పించబడిన యజ్ఞఫలమును, అజహార - స్వీకరించెనో.

ఆయన యజ్ఞములో అధికమగు సోమమును పానము చేసిన ఇంద్రునకు మత్తు కలిగెను. ఆయన చేసే భక్తిసాధన శ్రద్ధచే మిక్కిలి శుద్ధమైనది మరియు అచంచలమైనది. ఆయన ఆ విధమగు భక్తితో యజ్ఞఫలమును సమర్పించగా, యజ్ఞస్వరూపుడగు శ్రీహరి భగవానుడు స్వయముగా స్వీకరించెను.

యత్ప్రీణనాద్బర్హిషి దేవతిర్యఙ్-
మనుష్యవీరుత్తృణమావిరించాత్ ।
ప్రీయేత సద్యస్స హ విశ్వజీవః
ప్రీతస్స్వయం ప్రీతిమగాద్గయస్య ।। 13

యత్-ప్రీణనాత్ - ఏ భగవానుని సంతోషపెట్టుట వలన, ఆవిరించాత్ - బ్రహ్మగారితో మొదలుకొని, దేవతిర్యక్-మనుష్యవీరుత్-తృణమ్ - దేవతలు పశుపక్ష్యాదులు మనుష్యులు చెట్టుచేమలు మరియు గడ్డి, సద్యః - వెనువెంటనే, ప్రీయేత - ప్రీతిని చెందునో, విశ్వజీవః - సకలప్రాణులలో అంతర్యామి, స్వయమ్ - స్వయముగా, ప్రీతః - ప్రీతిని చెందినవాడు అగు, సః - ఆ శ్రీహరి, గయస్య - గయుని, బర్హిషి - యజ్ఞమునందు, ప్రీతిమ్ - ప్రీతిని, అగాత్ - పొందెను.

సర్వాంతర్యామి, స్వరూపమునందు ఆనందఘనుడు అగు భగవానుడు ప్రీతిని చెందినచో, బ్రహ్మగారితో మొదలిడి దేవతలు మనుష్యులు పశుపక్ష్యాదులు చెట్టుచేమలు గడ్డి వరకు గల ప్రాణులు వెనువెంటనే ప్రీతిని చెందును. అట్టి శ్రీహరి గయుని యజ్ఞములో అధికప్రీతిని పొందెను.

గయాద్గయంత్యాం చిత్రరథస్సుగతిరవరోధన ఇతి త్రయః
పుత్రా బభూవుశ్చిత్రరథాదూర్ణాయాం సమ్రాడజనిష్ట ।। 14

గయాత్ - గయుని వలన, గయంత్యామ్ - గయంతియందు, చిత్రరథః - చిత్రరథుడు, సుగతిః - సుగతి, అవరోధనః - అవరోధనుడు,

ఇతి - అనే, త్రయః - ముగ్గురు, పుత్రాః - పుత్రులు, బభూవుః - కలిగిరి, చిత్రరథాత్ - చిత్రరథుని వలన, ఊర్ణాయామ్ - ఊర్ణయందు, సమ్రాట్ - సమ్రాట్టు, అజనిష్ట - పుట్టెను.

గయునకు భార్యయగు గయంతియందు చిత్రరథుడు, సుగతి, అవరోధనుడు అనే ముగ్గురు కుమారులు కలిగిరి. చిత్రరథునకు ఊర్ణ యందు సమ్రాట్టు అనే కొడుకు పుట్టెను.

తత ఉత్కలాయాం మరీచిర్మరీచేర్బిందుమత్యాం బిందుమా నుదపద్యత తస్మాత్సరఘాయాం మధునామాఽభవన్మధోస్సు మనసి వీరవ్రతస్తతో భోజాయాం మంథుప్రమంథూ జజ్ఞాతే మంథోస్సత్యాయాం భౌవనస్తతో దూషణాయాం త్వష్టాఽజనిష్ట త్వష్టుర్విరోచనాయాం విరజో విరజస్య శతజి త్ప్రవరం పుత్రశతం కన్యా చ విషూచ్యాం కిల జాతమ్ ॥15

తతః - సమ్రాట్టు వలన, ఉత్కలాయామ్ - ఉత్కలయందు, మరీచిః - మరీచి, మరీచేః - మరీచి వలన, బిందుమత్యామ్ - బిందుమతి యందు, బిందుమాన్ - బిందుమంతుడు, ఉదపద్యత - పుట్టెను, తస్మాత్ - వాని వలన, సరఘాయామ్ - సరఘయందు, మధునామా - మధువు అని ప్రసిద్ధి జెందినవాడు, అభవత్ - కలిగెను, మధోః - మధువు వలన, సుమనసి - సుమనసయందు, వీరవ్రతః - వీరవ్రతుడు, తతః - వాని వలన, భోజాయామ్ - భోజయందు, మంథుప్రమంథూ - మంథుడు ప్రమంథుడు, జజ్ఞాతే - పుట్టిరి, మంథోః - మంథుని వలన, సత్యాయామ్ - సత్య యందు, భౌవనః - భౌవనుడు, తతః - వాని వలన, దూషణాయామ్ - దూషణయందు, త్వష్టా - త్వష్ట, అజనిష్ట - పుట్టెను, త్వష్టుః - త్వష్ట వలన, విరోచనాయామ్ - విరోచనయందు, విరజః - విరజుడు, విరజస్య - విరజునకు, విషూచ్యామ్ - విషూచియందు, శతజిత్-ప్రవరమ్ - శతజిత్తు మొదలుగాగల, పుత్రశతమ్ - పుత్రుల వంద, కన్యా చ - కన్య కూడ, జాతమ్ - పుట్టెను.

సమ్రాట్టునకు ఉత్కలయందు మరీచి, మరీచికి బిందుమతియందు బిందుమంతుడు, బిందుమంతునకు సరఘయందు మధువు అని ప్రసిద్ధి జెందినవాడు, మధువునకు సుమనసయందు వీరవ్రతుడు, వీరవ్రతునకు భోజయందు మంథుడు మరియు ప్రమంథుడు, మంథునకు సత్యయందు భౌవనుడు, భౌవనునకు దూషణయందు త్వష్ట, త్వష్టకు విరోచనయందు విరజుడు, విరజునకు విషూచియందు శతజిత్తు మొదలగాగల వందమంది కొడుకులు మరియు ఒక కూతురు పుట్టిరి.

తత్రాయం శ్లోకః ---
ప్రైయవ్రతం వంశమిమం విరజశ్చరమోద్భవః ।
అకరోదత్యలం కీర్త్యా విష్ణుస్సురగణం యథా ।। 16

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే
గయమహిమవర్ణనం నామ పంచదశోఽధ్యాయః ।।

తత్ర - ఆ విరజుని విషయమునందు, అయమ్ - ఈ, శ్లోకః - శ్లోకము, ఇమమ్ - ఈ, ప్రైయవ్రతమ్ - ప్రియవ్రతునకు చెందిన, వంశమ్ - వంశమును, చరమ-ఉద్భవః - ఆఖరున పుట్టిన, విరజః - విరజుడు, విష్ణుః - విష్ణువు, సురగణం యథా - దేవతల గణమును వలె, కీర్త్యా - కీర్తితో, అతి - అధికముగా, అలం అకరోత్ - అలంకరించెను.

ఆ విరజుని గురించి ఇట్టి ప్రసిద్ధి గలదు --- ప్రియవ్రతుని వంశములో (తన వరకు గల పరంపరలో) ఆఖరున పుట్టిన విరజుడు తన కీర్తితో ఆ వంశమును, విష్ణువు వామనుడై దేవతల గణమును వలె, అధికముగా అలంకరించెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో గయుని మహిమను వర్ణించే పదునైదవ అధ్యాయము ముగిసినది (15).

*****

# అథ షోడశోऽధ్యాయః

## భువనకోశమును వర్ణించుట

రాజోవాచ ।

ఉక్తస్త్వయా భూమండలాయామవిశేషో యావదాదిత్యస్తపతి
యత్ర చాసౌ జ్యోతిషాం గణైశ్చంద్రమా వా సహ దృశ్యతే।।1

యావత్ - ఎంతవరకైతే, ఆదిత్యః - సూర్యుడు, తపతి - ప్రకాశించుచున్నాడో, యత్ర చ - ఎక్కడనైతే, అసౌ - ఈ, చంద్రమాః వా - చంద్రుడు, జ్యోతిషామ్ - నక్షత్రముల, గణైః - సమూహములతో, దృశ్యతే - కానవచ్చుచున్నాడో అంతవరకు, భూమండల-ఆయామవిశేషః - భూమండలముయొక్క విస్తృతియొక్క వివరము, త్వయా - నీచే, ఉక్తః - చెప్పబడినది.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- ఎంతవరకైతే సూర్యుడు ప్రకాశించునో మరియు నక్షత్రగణములతో కూడియున్న చంద్రుడు కానవచ్చునో, అంతవరకు భూమండలముయొక్క విస్తారమును మీరు వివరముగా చెప్పియుంటిరి.

తత్రాపి ప్రియవ్రతరథచరణపరిఖాతైస్సప్తభిస్సప్త సింధవ ఉప
క్లుప్తా యత ఏతస్యాస్సప్తద్వీపవిశేషవికల్పస్త్వయా భగవన్
ఖలు సూచిత ఏతదేవాఖిలమహం మానతో లక్షణతశ్చ సర్వం
విజిజ్ఞాసామి ।। 2

భగవన్ - పూజనీయా!, అపి - మరియు, తత్ర - ఆ భూమండలమునందు, సప్తభిః - ఏడు, ప్రియవ్రతరథచరణపరిఖాతైః - ప్రియవ్రతుని రథచక్రముచే చుట్టూ ఏర్పడిన అగడ్తలచే, సప్త - ఏడు, సింధవః - సము

ద్రములు, ఉపక్లుప్తాః - రచించబడినవి, యతః - ఏ సముద్రముల వలన, ఏతస్యాః - ఈ భూమియొక్క, సప్తద్వీపవిశేషవికల్పః - ఏడు ద్వీపముల విభాగముయొక్క రచన, త్వయా - నీచే, సూచితః ఖలు - నిరూపించ బడినది గదా!, అహమ్ - నేను, ఏతత్ - ఈ, అఖిలం ఏవ - సర్వమునే, మానతః - కొలతను బట్టి, లక్షణతః చ - లక్షణములను బట్టి కూడ, సర్వమ్ - పూర్ణముగా, విజిజ్ఞాసామి - తెలియగోరుచున్నాను.

ఆ భూమండలమునందు ప్రియవ్రతుని రథముచే త్రవ్వబడిన ఏడు అగడ్తలచే ఏడు సముద్రములు రచించబడినవనియు, ఆ సముద్ర ముల వలన ఈ భూమియందు ఏడు ఖండముల విభాగము జరిగినద నియు తమరు సూచన ప్రాయముగా చెప్పియుంటిరి. నేను ఈ ఏడు ఖండ ముల కొలతలను, లక్షణములను కూడ పూర్తిగా తెలియ గోరుచున్నాను.

భగవతో గుణమయే స్థూలరూప ఆవేశితం మనో హ్యగుణేఽపి సూక్ష్మతమ ఆత్మజ్యోతిషి పరే బ్రహ్మణి భగవతి వాసుదే వాఖ్యే క్షమమావేశితుం తదు హైతద్గురోఽర్హస్యనువర్ణయితు మితి ॥ 3

గురో - ఓ గురూ!, హి - ఏలయనగా, భగవతః - భగవానుని, గుణమయే - త్రిగుణాత్మకమగు, స్థూలరూపే - స్థూలమగు విరాడ్రూపము నందు, ఆవేశితమ్ - ఏకాగ్రము చేయబడిన, మనః - మనస్సు, అగుణే - గుణములకు అతీతమైనట్టియు, సూక్ష్మతమే - మిక్కిలి సూక్ష్మ మైనట్టియు, ఆత్మజ్యోతిషి - ఆత్మజ్యోతి రూపమైనట్టియు (స్వయంప్రకాశమైనట్టియు), పరే - సర్వాతిశాయి యైనట్టియు, బ్రహ్మణి - అఖండసత్తారూపమైనట్టి యు, వాసుదేవ-ఆఖ్యే - వాసుదేవుడు అనే పేరు గల, భగవతి - భగవాను నియందు, ఆవేశితుమ్ - ఏకాగ్రము చేయుటకు, క్షమమ్ - యోగ్యము (స మర్థము), తత్ ఉ - అందువలననే, ఏతత్ - దీనిని, అనువర్ణయితుమ్ - వర్ణించుటకు, అర్హసి - తగుదువు, ఇతి - అని.

ఓ గురూ! ఏలయనగా, భగవానుని త్రిగుణాత్మకము మరియు స్థూలము అగు ఈ విరాడ్రూపమునందు ఏకాగ్రము చేయబడిన మన

స్సును, ఆ భగవానుని మిక్కిలి సూక్ష్మమగు నిర్గుణపరబ్రహ్మస్వరూపము నందు కూడ లగ్నము చేయుట సంభవమగును. వాసుదేవుడు అనే పేరు గల ఆ స్వయంప్రకాశస్వరూపము ప్రాణులలో ఆత్మచైతన్యము రూపముగా ప్రకాశించుచున్నది. కావుననే, ఈ విషయమును తమరు వర్ణించ తగుదురు.

ఋషిరువాచ ।

న వై మహారాజ భగవతో మాయాగుణవిభూతేః కాష్ఠాం మనసా వచసా వాఽధిగంతుమలం విబుధాయుషాఽపి పురుష స్తస్మాత్ప్రాధాన్యేనైవ భూగోలకవిశేషం నామరూపమానలక్ష ణతో వ్యాఖ్యాస్యామః ॥ 4

మహారాజ - ఓ మహారాజా!, భగవతః - భగవానుని, మాయా గుణవిభూతేః - మాయాశక్తియొక్క గుణముల మహిమయొక్క, కాష్ఠామ్ - సీమను, పురుషః - మానవుడు, మనసా - మనస్సుతో గాని, వచసా వా - వాక్కుతో గాని, విబుధ-ఆయుషా అపి - దేవతల ఆయుర్దాయముచేనైన నూ, అధిగంతుమ్ - తెలియుటకు, న వై అలమ్ - సమర్థుడు కానే కాడు, తస్మాత్ - అందువలన, ప్రాధాన్యేన ఏవ - ప్రాధాన్యముచే మాత్రమే, భూగోలకవిశేషమ్ - భూమండలముయొక్క విభాగమును, నామరూపమా నలక్షణతః - పేరు రూపము పరిమాణము మరియు లక్షణముల వలన, వ్యాఖ్యాస్యామః - వివరించి చెప్పెదము.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- మహారాజా! మానవునకు దేవతల ఆయుష్షును ఇచ్చినా, భగవానుని మాయాశక్తిలోని గుణముల మహిమయొక్క సీమను వాక్కుతో వర్ణించలేడు; మనస్సుతో ఊహించుటకైననూ సమర్థుడు కాడు. ఇది నిశ్చయము. కావున, మేము భూగోళముయొక్క వివిధభాగముల పేర్లను, రూపము (రచన) లను, పరిమాణములను, వాటి లక్షణములను ప్రధానమైనవాటిని మాత్రమే వివరించి చెప్పెదము.

యో వాయం ద్వీపః కువలయకమలకోశాభ్యంతరకోశో నియుతయోజనవిశాలస్సమవర్తులో యథా పుష్కరపత్రమ్ ॥ 5

యః - ఏ, అయమ్ - ఈ, ద్వీపః - జంబూద్వీపము గలదో అది, కువలయకమలకోశ-అభ్యంతరకోశః - భూమండలమనే కమలముయొక్క కోశము (గర్భము) ల లోపలి కోశము, నియుతయోజనవిశాలః - లక్ష యోజనముల విస్తీర్ణము గలది, పుష్కరపత్రం యథా - తామరాకు వలె, సమవర్తులః - సమముగా గుండ్రముగా నున్నది.

మనముండే ఈ జంబూద్వీపము భూమండలముయొక్క కోశ ముల లోపలి కోశము. లక్ష యోజనముల విస్తీర్ణము గల ఈ ద్వీపము తామరాకు వలె సమముగా గుండ్రముగా నున్నది.

యస్మిన్నవ వర్షాణి నవయోజనసహస్రాయామాన్యష్టభిర్మర్యా దాగిరిభిస్సువిభక్తాని భవంతి ॥ 6

యస్మిన్ - దేనియందైతే, నవయోజనసహస్ర-ఆయామాని - తొమ్మిది వేల యోజనముల నిడివి గలవి, నవ - తొమ్మిది, వర్షాణి - అవాంతరఖండములు, అష్టభిః - ఎనిమిది, మర్యాదాగిరిభిః - హద్దుల పర్వతములతో, సువిభక్తాని - చక్కగా విభాగము చేయబడినవై, భవంతి - ఉన్నవి.

జంబూద్వీపమునందు తొమ్మిది వేల యోజనముల నిడివి గల తొమ్మిది వర్షములు (అవాంతర ఖండములు) గలవు. వీటిని హద్దుల యందు పర్వతములు చక్కగా విభాగము చేయుచున్నవి.

ఏషాం మధ్యే ఇలావృతం నామాభ్యంతరవర్షం యస్య నాభ్యా మవస్థితస్సర్వతస్సౌవర్ణః కులగిరిరాజో మేరుర్ద్వీపాయామస మున్నాహః కర్ణికాభూతః కువలయకమలస్య మూర్ధని ద్వాత్రింశత్సహస్రయోజనవితతో మూలే షోడశసహస్రం తావతాంతర్భూమ్యాం ప్రవిష్టః ॥ 7

ఏషామ్ - వీటి, మధ్యే - మధ్యయందు, ఇలావృతం నామ - ఇలా వృతము అని ప్రసిద్ధిని గాంచిన, అభ్యంతరవర్షమ్ - లోపలి వర్షము, యస్య - దేనియొక్క, నాభ్యామ్ - మధ్యలో, సర్వతః - అంతటా, సౌవర్ణః

- బంగరు వికారము, కులగిరిరాజః - కులపర్వతములలో శ్రేష్ఠమైనది, ద్వీప-ఆయామసమున్నాహః - ద్వీపముయొక్క నిడివియే ఎత్తుగా గలది, కువలయకమలస్య - భూమండలమనే కమలమునకు, కర్ణికాభూతః - దుద్దువలె ఉన్నది, మూర్ధని - శిఖరమునందు, ద్వాత్రింశత్-సహస్రయోజన వితతః - ముప్పది రెండు వేల యోజనముల విస్తారము గలది, మూలే - పాదము వద్ద, షోడశసహస్రమ్ - పదునారు వేల యోజనముల విస్తారము గలది, తావతా - అదే నిడివిచే, భూమ్యామ్ - భూమియందు, అంతః - లోపల, ప్రవిష్టః - ప్రవేశించినది అగు, మేరుః - మేరు పర్వతము, అవస్థితః - ఉన్నదియో.

వీటి మధ్యలో ఇలావృతమనే లోపలి వర్షము గలదు. దానికి మధ్యలో అంతటా బంగారమే అయిన మేరు పర్వతము ఉన్నది. కులపర్వతములలో శ్రేష్ఠమైన మేరువు జంబూద్వీపముయొక్క నిడివితో సమానమైన ఎత్తు (లక్ష యోజనములు) కలిగియున్నది. భూమండలమనే కమలమునకు దుద్దువలె నున్న మేరువు శిఖరమునందు ముప్పది రెండు వేల యోజనములు, పాదము వద్ద పదహారు వేల యోజనములు, భూమి లోపల ప్రవేశించిన భాగము పదహారు వేల యోజనములు నిడివి కలదు.

ఉత్తరోత్తరేణేలావృతం నీలశ్శ్వేతశ్శృంగవానితి త్రయో రమ్యకహిరణ్మయకురూణాం వర్షాణాం మర్యాదాగిరయః ప్రాగాయతా ఉభయతః క్షారోదావధయో ద్విసహస్రపృథవ ఏకైకశః పూర్వస్మాత్పూర్వస్మాదుత్తర ఉత్తరో దశాంశాధికాంశేన దైర్ఘ్య ఏవ హ్రసంతి ॥ 8

ఇలావృతం ఉత్తర-ఉత్తరేణ - ఇలావృతవర్షమునకు తరువాత ఉత్తరమునందు, నీలః - నీలము, శ్వేతః - శ్వేతము, శృంగవాన్ - శృంగవంతము, ఇతి - అనే, త్రయః - మూడు, రమ్యకహిరణ్మయకురూణాం వర్షాణామ్ - రమ్యక హిరణ్మయ కురువర్షములయొక్క, మర్యాదాగిరయః - హద్దును నిర్ణయించే పర్వతములు, ప్రాక్-ఆయతాః - తూర్పు వైపు విస్తరించినవి, ఉభయతః - రెండు వైపులా, క్షార-ఉద-అవధయః - ఉప్పు

సముద్రము హద్దుగా గలవి, ద్విసహస్రపృథవః - రెండు వేల యోజన ములు వెడల్పు గలవి, పూర్వస్మాత్ పూర్వస్మాత్ - ముందు ముందు ఉన్న దానికంటె, ఉత్తరః ఉత్తరః - తరువాతిది తరువాతిది, ఏక-ఏకశః - ఒక్కటొ క్కటిగా, దశ-అంశ-అధిక-అంశేన - దశాంశముకంటె కొంచెము అధికమైన అంశముచే, దైర్ఘ్యే ఏవ - పొడవునందు మాత్రమే, హ్రసంతి - కురచగా నున్నవి.

ఇలావృతవర్షమునకు తరువాత ఉత్తరాన వరుసలోనుండే రమ్యక, హిరణ్మయ, కురు వర్షములకు క్రమముగా నీలము, శ్వేతము, శృంగవం తము అనే పర్వతములు హద్దును నిర్ధారించుచుండును. ఇవి తూర్పు నుండి పడమరకు రెండు వైపులా రెండు వేల యోజనముల వెడల్పు గల వై, ఉప్పు సముద్రము వరకు విస్తరించి యున్నవి. పొడవు మాత్రము నీలము కంటె శ్వేతము, శ్వేతము కంటె శృంగవంతము దశాంశముకంటె కొంచెము అధికమైన అంశము తక్కువ. ఎత్తు సమానమే.

ఏవం దక్షిణేనేలావృతం నిషధో హేమకూటో హిమాలయ ఇతి
ప్రాగాయతా యథా నీలాదయోఽయుతయోజనోత్సేధా హరివ
ర్షకింపురుషభారతానాం యథాసంఖ్యమ్ ॥ 9

ఏవమ్ - ఇదే విధముగా, ఇలావృతం దక్షిణేన - ఇలావృతమునకు దక్షిణాన, నిషధః - నిషధము, హేమకూటః - హేమకూటము, హిమా లయః - హిమాలయము, ఇతి - అనే పర్వతములు, నీల-ఆదయః యథా - నీలము మొదలగునవి వలె, ప్రాక్-ఆయతాః - తూర్పు వైపు వ్యాపించిన వై, అయుతయోజన-ఉత్సేధాః - పదివేల యోజనముల ఎత్తు గలవై, యథాసంఖ్యమ్ - క్రమముగా, హరివర్షకింపురుషభారతానామ్ - హరివ ర్షము కింపురుషవర్షము భారతవర్షములయొక్క (హద్దులు).

ఇదే విధముగా, ఇలావృతమునకు దక్షిణాన హరివర్షము, కింపురు షవర్షము, భారతవర్షము గలవు. నిషధము, హేమకూటము, హిమాల యము అనునవి క్రమముగా వాటి హద్దులు. ఈ పర్వతములు నీలము

మొదలగు పర్వతముల వలెనే తూర్పునుండి పడమరకు వ్యాపించి యున్నవి. వీటి ఎత్తు పదివేల యోజనములు.

తథైవేలావృతమపరేణ పూర్వేణ చ మాల్యవద్గంధమాదనావా నీలనిషధాయతౌ ద్విసహస్రం పప్రథతుః కేతుమాలభద్రాశ్వ యోస్సీమానం విదధాతే ॥ 10

తథా ఏవ - అదే విధముగా, ఇలావృతం అపరేణ - ఇలావృతము నకు పడమరగా, పూర్వేణ చ - తూర్పుగా కూడ, ఆనీలనిషధాయతౌ - నీల నిషధ పర్వతముల వరకు వ్యాపించియున్న, మాల్యవద్-గంధమా దనౌ - మాల్యవంత గంధమాదన పర్వతములు, ద్విసహస్రమ్ - రెండు వేలు, పప్రథతుః - నిడివి గలవి, కేతుమాలభద్రాశ్వయోః - కేతుమాల భద్రాశ్వ వర్షములయొక్క, సీమానమ్ - హద్దును, విదధాతే - స్థిరము చేయుచున్నవి.

అదే విధముగా, ఇలావృతమునకు పడమరలో మాల్యవంతము, తూర్పున గంధమాదనము అనే పర్వతములు గలవు. ఇవి రెండు వేల యోజనముల నిడివి గలవియై, క్రమముగా ఉత్తరమున నీల పర్వతము వరకు, దక్షిణమున నిషధ పర్వతము వరకు వ్యాపించి యున్నవి. ఇవి క్రమ ముగా కేతుమాల భద్రాశ్వవర్షముల హద్దులను నిర్ధారించుచున్నవి.

మందరో మేరుమందరస్సుపార్శ్వః కుముద ఇత్యయుతయో జనవిస్తారోన్నాహా మేరోశ్చతుర్దిశమవష్టంభగిరయ ఉపక్లుప్తాః ॥ 11

మేరోః - మేరు పర్వతమునకు, చతుర్దిశమ్ - నాలుగు దిక్కుల యందు, మందరః - మందరము, మేరుమందరః - మేరుమందరము, సుపార్శ్వః - సుపార్శ్వము, కుముదః - కుముదము, ఇతి - అనే, అయు తయోజనవిస్తార-ఉన్నాహాః - పదివేల యోజనముల విస్తారము ఎత్తు గల, అవష్టంభగిరయః - ఆధారపర్వతములు, ఉపక్లుప్తాః - రచించబడినవి.

మేరు పర్వతమునకు ఆధారముగా నాలుగు దిక్కులయందు మందరము, మేరుమందరము, సుపార్శ్వము, కుముదము అనే పర్వతములు ఈశ్వరునిచే రచించబడినవి. అవి పదివేల యోజనముల నిడివి, అంతే ఎత్తు గలవి.

చతుర్ష్వేతేషు చూతజంబూకదంబన్యగ్రోధాశ్చత్వారః పాదప
ప్రవరాః పర్వతకేతవ ఇవాధిసహస్రయోజనోన్నాహాస్తావద్విట
పవితతయశ్శతయోజనపరిణాహాః ॥ 12

ఏతేషు - ఈ, చతుర్షు - నాలుగు పర్వతములయందు, చూతజంబూకదంబన్యగ్రోధాః - మామిడి నేరేడు కడిమి మఱ్ఱి అనే, చత్వారః - నాలుగు, పాదపప్రవరాః - గొప్ప చెట్లు, పర్వతకేతవః ఇవ - పర్వతమునకు జెండాలవంటివి, అధిసహస్రయోజన-ఉన్నాహాః - పదకొండువేల యోజనముల ఎత్తు గలవి, తావద్-విటపవితతయః - అంతే దూరము వ్యాపించిన కొమ్మలు గలవి, శతయోజనపరిణాహాః - వంద యోజనముల చుట్టు కొలత గలవి.

ఈ నాలుగు పర్వతములయందు క్రమముగా మామిడి, నేరేడు, కడిమి, మఱ్ఱి అనే గొప్ప చెట్లు గలవు. పర్వతములకు జెండాలను బోలి యున్న ఆ చెట్లు పదకొండువేల యోజనముల ఎత్తుతో, అంతే దూరము వ్యాపించిన కొమ్మలతో, వంద యోజనముల చుట్టు కొలత కలిగియున్నవి.

హ్రదాశ్చత్వారః పయోమధ్విక్షురసమృష్టజలా యదుపస్ప
ర్శిన ఉపదేవగణా యోగైశ్వర్యాణి స్వాభావికాని భరతర్షభ
ధారయంతి ॥ 13

భరత-ఋషభ - భరత వంశీయులలో శ్రేష్ఠుడవగు ఓ రాజా!, పయః-మధు-ఇక్షురసమృష్టజలాః - పాలు తేనె చెరుకు రసము మరియు తియ్యని నీరు గల, చత్వారః - నాలుగు, హ్రదాః - సరస్సులు, యత్-ఉపస్పర్శినః - వేటిని సేవించే, ఉపదేవగణాః - ఉపదేవుల గణములు, స్వాభావికాని - సహజసిద్ధములైన, యోగ-ఐశ్వర్యాణి - యోగసిద్ధులను, ధారయంతి - కలిగియుందురో.

భరతవంశీయులలో శ్రేష్ఠుడవగు ఓ రాజా! ఆ నాలుగు పర్వతములపై నాలుగు సరస్సులు గలవు. వాటిలో క్రమముగా పాలు, తేనె, చెరుకు రసము మరియు తియ్యని నీరు ఉండును. ఆ సరస్సులను గంధర్వులు మొదలగు ఉపదేవతల గణములు సేవించును. వాటి వలన వారికి యోగసిద్ధులు సహజసిద్ధములగును.

**దేవోద్యానాని చ భవంతి చత్వారి నందనం చైత్రరథం వైభ్రాజకం సర్వతోభద్రమితి ॥ 14**

నందనమ్ - నందనము, చైత్రరథమ్ - చైత్రరథము, వైభ్రాజకమ్ - వైభ్రాజకము, సర్వతోభద్రమ్ - సర్వతోభద్రము, ఇతి - అనే, చత్వారః - నాలుగు, దేవ-ఉద్యానాని చ - దేవతల ఉద్యానవనములు కూడ, భవంతి - కలవు.

ఆ పర్వతములపై నందనము, చైత్రరథము, వైభ్రాజకము, సర్వతోభద్రము అనే నాలుగు దేవతల ఉద్యానములు గలవు.

**యేష్వమరపరివృఢాస్సహ సురలలనాలలామయూథపతయ ఉపదేవగణైరుపగీయమానమహిమానః కిల విహరంతి ॥15**

యేషు - వేటియందైతే, సురలలనాలలామయూథపతయః - దేవతాస్త్రీలకు అలంకారమనదగిన గొప్ప సుందరయువతుల గణములకు ప్రభువులు, ఉపదేవగణైః - గంధర్వులు మొదలగు ఉపదేవతల గణములచే, ఉపగీయమానమహిమానః - కీర్తించబడుచున్న మహిమ గలవారు అగు, అమరపరివృఢాః - దేవతలలో గొప్పవారు, సహ - గుమిగూడి, విహరింతి కిల - విహరించెదరో గదా!

ఆ ఉద్యానవనములయందు గొప్ప గొప్ప దేవతలు గుమిగూడి విహరించెదరు. గంధర్వులు మొదలగు ఉపదేవతల గణములు వారి మహిమను కీర్తించుచుందురు. వారికి దేవతాస్త్రీలకే అలంకారమనదగిన గొప్ప సుందరయువతులు చాలమంది భార్యలు.

మందరోత్సంగ ఏకాదశశతయోజనోత్తుంగదేవచూతశిరసో గిరిశిఖరస్థూలాని ఫలాన్యమృతకల్పాని పతంతి ॥ 16

మందర-ఉత్సంగే - మందరపర్వత శిఖరమునందు, ఏకాదశశత యోజన-ఉత్తుంగదేవచూతశిరసః - పదకొండు వందల య్యోజనముల ఎత్తు గల దేవలోకమునందు పుట్టిన మామిడి చెట్టుయొక్క చిటారు కొమ్మ నుండి, గిరిశిఖరస్థూలాని - పర్వతశిఖరములవలె పెద్దవైన, అమృతక ల్పాని - అమృతమువంటి, ఫలాని - పళ్లు, పతంతి - పడుచుండును.

మందరపర్వతశిఖరముపై పదకొండు వందల యోజనముల ఎత్తు గల మామిడి చెట్టు గలదు. అది దేవలోకములో పుట్టినది. దాని చిటారు కొమ్మనుండి పర్వతశిఖరములంత పెద్ద పళ్లు పడును. వాటి రుచి అమృ తము వలె నుండును.

తేషాం విశీర్యమాణానామతిమధురసురభిసుగంధిబహులారు ణరసోదేనారుణోదా నామ నదీ మందరగిరిశిఖరాన్నిపతంతీ పూర్వేణేలావృతముపప్లావయతి ॥ 17

విశీర్యమాణానామ్ - పగిలిపోవుచున్న, తేషామ్ - ఆ పళ్లయొక్క, అతిమధురసురభిసుగంధిబహుల-అరుణరస-ఉదేన - మిక్కిలి మధురము సహజపరిమళము గలది ఇతరసుగంధములు గలది చాల ఎక్కువ ఎఱ్ఱని రసము అనే నీటిచే, అరుణోదా నామ - అరుణోద అని ప్రసిద్ధిని గాంచిన, నదీ - నది, మందరగిరిశిఖరాత్ - మందరపర్వత శిఖరమునుండి, నిప తంతీ - పడుచున్నదై, ఇలావృతమ్ - ఇలావృత వర్షమును, పూర్వేణ - తూర్పుగా, ఉపప్లావయతి - తడుపుచుండును.

ఆ పళ్లు పగిలి, వాటినుండి సహజపరిమళము గల మిక్కిలి తియ్యని ఎఱ్ఱని రసము పెద్ద మొత్తములో ప్రవహించును. ఇతరసుగంధ ములు తోడైన ఆ రసమే నదియై ప్రవహించును. ఆ నది అరుణోద (ఎఱ్ఱని నీరు గలది) అని ప్రసిద్ధిని బడసెను. అది మందరపర్వత శిఖరమునుండి క్రింద పడుతూ, ఇలావృత వర్షముయొక్క తూర్పు భాగమునందు ప్రవ హించుచుండును.

యదుపజోషణాద్భవాన్యా అనుచరీణాం పుణ్యజనవధూనామ
వయవస్పర్శసుగంధవాతో దశయోజనం సమంతాదనువాస
యతి ॥ 18

**యత్-ఉపజోషణాత్** - దేనిని సేవించుట వలన, **భవాన్యాః** - పార్వతీదేవియొక్క, **అనుచరీణామ్** - చెలికత్తెలైన, **పుణ్యజనవధూనామ్** - యక్షస్త్రీలయొక్క, **అవయవస్పర్శసుగంధవాతః** - అవయవములను స్పృశించుటచే పరిమళముతో నిండిన గాలి, **సమంతాత్** - చుట్టు ప్రక్కల, **దశయోజనమ్** - పది యోజనముల దూరమును, **అనువాసయతి** - పరిమళ భరితము చేయునో.

ఆ నదీజలములను పార్వతీదేవి చెలికత్తెలగు యక్షస్త్రీలు సేవించెదరు. దానిచే వారి అవయవములు సుగంధభరితములై, వారి మీదుగా వీచే గాలి చుట్టు ప్రక్కల పది యోజనముల వరకు పరిమళమును వ్యాపింపజేయును.

ఏవం జంబూఫలానామత్యుచ్చనిపాతవిశీర్ణానామనస్థిప్రాయా
ణామిభకాయనిభానాం రసేన జంబూ నామ నదీ మేరుమంద
రశిఖరాదయుతయోజనాదవనితలే నిపతంతీ దక్షిణేనాత్మానం
యావదిలావృతముపస్యందయతి ॥ 19

**ఏవమ్** - ఇదే విధముగా, **అతి-ఉచ్చనిపాతవిశీర్ణానామ్** - చాల ఎత్తునుండి పడుటచే పగిలినట్టియు, **అనస్థిప్రాయాణామ్** - మిక్కిలి చిన్న గింజ కలిగినట్టియు, **ఇభకాయనిభానామ్** - ఏనుగు శరీరమును పోలియున్న, **జంబూఫలానామ్** - నేరేడు పళ్లయొక్క, **రసేన** - రసముచే, **జంబూ నామ** - జంబు అని ప్రసిద్ధి గాంచిన, **నదీ** - నది, **అయుతయోజనాత్** - పదివేల యోజనముల, **మేరుమందరశిఖరాత్** - మేరుమందర పర్వతము యొక్క శిఖరమునుండి, **అవనితలే** - భూతలముపై, **నిపతంతీ** - పడుచున్నదై, **ఆత్మానం దక్షిణతః** - తనకు దక్షిణముగా, **ఇలావృతం యావత్** - ఇలావృత వర్షము వరకు, **ఉపస్యందయతి** - ప్రవహించుచున్నది.

ఇదే విధముగా, మేరుమందర పర్వతము మీద నేరేడు పళ్లు పడు చుండును. మిక్కిలి చిన్న గింజ కలిగిన ఆ పళ్లు ఏనుగు శరీరముతో సమా నమైన ఆకారమును కలిగియుండును. పెద్ద ఎత్తునుండి పడుటచే అవి పగిలి ఆ రసము నదిగా ప్రవహించును. ఆ నదియే జంబూనది అని ప్రసి ద్ధిని గాంచినది. ఆ నది పదివేల యోజనముల ఎత్తు గల శిఖరమునుండి భూతలముపై పడుచుండును. అది ఆ పడిన చోటునుండి దక్షిణముగా ఇలావృత వర్షము వరకు ప్రవహించుచుండును.

తావదుభయోరపి రోధసోర్యా మృత్తికా తద్రసేనానువిధ్య మానా వాయ్వర్కసంయోగవిపాకేన సదాఽమరలోకాభరణం జాంబూనదం నామ సువర్ణం భవతి ॥ 20

ఉభయోః - రెండు, రోధసోః అపి - తటములయందు కూడ, యా - ఏ, మృత్తికా - మట్టి గలదో అది, తత్-రసేన - ఆ నదియొక్క రస ముచే, అనువిధ్యమానా - తడుపబడుచున్నదై, తావత్ - అంతటా, వాయు-అర్కసంయోగవిపాకేన - వాయువు సూర్యకాంతులతోడి కలయి కచే కలిగిన రాసాయనిక చర్యచే, సదా - అన్ని కాలములయందు, అమర లోక-ఆభరణమ్ - దేవలోకమునకు ఆభరణమైన, జాంబూనదం నామ - జాంబూనదము అని ప్రసిద్ధిగాంచిన, సువర్ణమ్ - బంగారము, భవతి - తయారగును.

ఆ నదియొక్క రెండు ఒడ్డులయందు కూడ మట్టి అంతటా నది నీటితో తడిసి, గాలికి సూర్యరశ్మికి ఎండి, రసాయనచర్య జరిగి, జాంబూన దమని ప్రసిద్ధి గాంచిన బంగారము తయారగును. ఆ బంగారము దేవతాగ ణములకు అన్ని కాలములలో ఆభరణమగుచున్నది.

యదు హ వావ విబుధాదయస్సహ యువతిభిర్ముకుటకటకక టిసూత్రాద్యాభరణరూపేణ ఖలు ధారయంతి ॥ 21

యత్ ఉ హ - దేనినైతే, వావ - నిశ్చయముగా, విబుధ-ఆదయః - దేవతలు మొదలగువారు, యువతిభిః సహ - యువతులతో గూడి, ముకుటకటకకటిసూత్ర-ఆది-ఆభరణరూపేణ - కిరీటము కంకణము మొల

త్రాడు మొదలగు ఆభరణముల రూపముగా, ధారయంతి ఖలు - ధరించు చున్నారు గదా!

ఆ బంగారమును దేవతలు, గంధర్వులు మొదలగువారు తమ భార్యలతో గూడి, కిరీటము కంకణము మొలత్రాడు మొదలగు ఆభరణ ముల రూపముగా ధరించుచుందురు.

యస్తు మహాకదంబస్సుపార్శ్వనిరూఢో యాస్తస్య కోటరేభ్యో
వినిస్సృతాః పంచాయామపరిణాహాః పంచ మధుధారాస్సుపా
ర్శ్వశిఖరాత్పతంత్యోఽపరేణాత్మానమిలావృతమనుమోద
యంతి ॥ 22

సుపార్శ్వనిరూఢః - సుపార్శ్వ పర్వతమునందు గట్టిగా పాతుకొ నియున్న, యః - ఏ, మహాకదంబః తు - పెద్ద కడిమి చెట్టు గలదో, తస్య - దాని, కోటరేభ్యః - తొర్రలనుండి, వినిస్సృతాః - బయటకు వచ్చుచున్న, పంచ-ఆయామపరిణాహాః - అయిదు బారల చుట్టుకొలత గల, పంచ - అయిదు, మధుధారాః - తేనె ధారలు గలవో అవి, సుపార్శ్వశిఖరాత్ - సుపార్శ్వ పర్వతముయొక్క శిఖరమునుండి, పతంత్యః - పడుచున్నవై, ఆత్మానం అపరేణ - తనకు పడమటనున్న, ఇలావృతమ్ - ఇలావృత వర్ష మును, అనుమోదయంతి - శోభిల్ల జేయుచున్నవి.

సుపార్శ్వ పర్వతముపై పెద్ద కడిమి చెట్టు గట్టిగా పాతుకొని యున్నది. దాని తొర్రలనుండి అయిదు బారల చుట్టుకొలత గల అయిదు తేనె ధారలు ప్రవహించుచున్నవి. అవి సుపార్శ్వ పర్వత శిఖరమునుండి పడుతూ, అచటకు పడమర దిశగానున్న ఇలావృత వర్షమునకు శోభను ఇనుమడింపజేసి, అచట సుగంధమును నింపి, అచటి ప్రాణులకు ఉల్లాస మును కలిగించుచున్నవి.

యా హ్యుపభుంజానానాం ముఖనిర్వాసితో వాయుస్సమం
తాచ్ఛతయోజనమనువాసయతి ॥ 23

యాః - వేటిని, ఉపభుంజానానామ్ - సేవించువారల, ముఖని ర్వాసితః - ముఖమునుండి బయటకు వచ్చిన, వాయుః - గాలి, సమం తాత్ - చుట్టు ప్రక్కల, శతయోజనమ్ - వంద యోజనములను, అనువా సయతి - సుగంధభరితము చేయుచున్నదో.

ఆ తేనెలను ఆస్వాదించు జనుల ముఖమునుండి వచ్చే గాలి చుట్టు ప్రక్కల వంద యోజనముల దూరము వరకు సుగంధమును వ్యాపింప జేయుచున్నది.

ఏవం కుముదనిరూఢో యశ్శతవల్శో నామ వటస్తస్య స్కంధేభ్యో నీచీనాః పయోదధిమధుఘృతగుడాన్నాద్యంబరశ య్యాసనాభరణాదయస్సర్వ ఏవ కామదుఘా నదాః కుముదా గ్రాత్పతంతస్తముత్తరేణేలావృతముపయోజయంతి || 24

ఏవమ్ - ఇదే విధముగా, కుముదనిరూఢః - కుముద పర్వత ముపై గట్టిగా పాతుకొనియున్న, యః - ఏ, శతవల్శః నామ - శతవల్శము అని ప్రసిద్ధి గాంచిన, వటః - మఱ్ఱి గలదో, తస్య - దాని, స్కంధేభ్యః - కొమ్మలనుండి, నీచీనాః - క్రిందికి ప్రవహించే, పయః-దధిమధుఘృతగుడ -అన్న-ఆది-అంబరశయ్యా-ఆసన-ఆభరణ-ఆదయః - పాలు పెరుగు తేనె నెయ్యి బెల్లము అన్నము మొదలగు ఆహారపదార్థములు వస్త్రములు శయ్యలు ఆసనములు ఆభరణములు మొదలగునవి, సర్వే ఏవ - అన్నీ, కామదుఘాః - కోరినవాటిని ఇచ్చే, నదాః - నదములు, కుముద-అగ్రాత్ - కుముద పర్వత శిఖరమునుండి, పతంతః - పడుచున్నవై, తం ఉత్తరేణ - దానికి ఉత్తరాన, ఇలావృతమ్ - ఇలావృత వర్షమును, ఉపయోజయంతి - సమకూర్చుచున్నవి.

ఇదే విధముగా, కుముద పర్వతముపై శతవల్శము (వంద కొమ్మలు గలది) అని ప్రసిద్ధి గాంచిన మఱ్ఱి చెట్టు గట్టిగా పాతుకొని యున్న ది. దాని కొమ్మల ఊడలనుండి క్రిందకు ప్రవాహములు వచ్చుచున్నవి. అవి పాలు, పెరుగు, తేనె, నెయ్యి, బెల్లము, అన్నము, ఇతరములగు ఆహా ర పదార్థములు, వస్త్రములు, శయ్యలు, ఆసనములు, ఆభరణములు

మొదలగు పదార్థములను కోరినవాటిని ఇచ్చుచుండును. ఆ ప్రవాహములు కుముధ పర్వత శిఖరమునుండి పడి, అచటకు ఉత్తరాన ఉన్న ఇలావృత వర్షమును సంపన్నము చేయుచున్నవి.

యానుపజుషాణానాం న కదాచిదపి ప్రజానాం వలీపలితక్లమ
స్వేదదౌర్గంధ్యజరామయమృత్యుశీతోష్ణవైవర్ణ్యోపసర్గాదయ
స్తాపవిశేషా భవంతి యావజ్జీవం సుఖం నిరతిశయమేవ ॥25

యాన్ - వేటిని, ఉపజుషాణానామ్ - సేవించే, ప్రజానామ్ - ప్రజలకు, కదాచిత్ అపి - ఏనాడైననూ, వలీపలితక్లమస్వేదదౌర్గంధ్యజరా-ఆమయమృత్యుశీత-ఉష్ణవైవర్ణ్య-ఉపసర్గ-ఆదయః - ముడుతలు జుట్టు తెల్లబడుట అలసట చెమట దుర్గంధము వచ్చుట ముసలితనము రోగము మరణము చలి వేడి శరీరము పాలిపోవుట అవయవములు విరుగుట మొదలగు, తాపవిశేషాః - వివిధములగు పీడలు, న భవంతి - ఉండవో, యావత్-జీవమ్ - జీవించియున్నంత కాలము, నిరతిశయమ్ - గొప్పది మరియొకటి లేని, సుఖం ఏవ - సుఖము మాత్రమే.

ఆ ప్రవాహములలోని పదార్థములను సేవించే జనులకు ఏనాడైననూ, ఒళ్లు ముడుతలు పడుట, జుట్టు తెల్లబడుట, అలసట, చెమట, శరీరమునుండి దుర్గంధము వచ్చుట, ముసలితనము, రోగము, మరణము, చలి, వేడి, శరీరము పాలిపోవుట, అవయవములు విరుగుట మొదలగు వివిధపీడలు ఉండవు. పైగా, వారికి జీవించి యున్నంత కాలము సర్వోత్కృష్టమగు సుఖమే సుఖము ఉండును.

కురంగకురరకుసుంభవైకంకత్రికూటశిశిరపతంగరుచకనిషధశి
నీవాసకపిలశంఖవైదూర్యజారుధిహంసర్షభనాగకాలంజరనార
దాదయో వింశతిగిరయో మేరోః కర్ణికాయా ఇవ కేశరభూతా
మూలదేశే పరిత ఉపక్లుప్తాః ॥ 26

కర్ణికాయాః ఇవ - దుద్దువంటి, మేరోః - మేరు పర్వతమునకు, కేశరభూతాః ఇవ - జూలు వలెనున్నవి, మూలదేశే - మూలస్థానమునం

దు, పరితః - చుట్టూ, కురంగకురరకుసుంభవైకంకత్రికూటశిశిరపతంగరుచ కనిషధశినీవాసకపిలశంఖవైదూర్యజారుధిహంస-ఋషభనాగకాలంజరనా రద-ఆదయః - కురంగము కురరము కుసుంభము వైకంకము త్రికూటము శిశిరము పతంగము రుచకము నిషధము శినీవాసము కపిలము శంఖము వైదూర్యము జారుధి హంస ఋషభము నాగము కాలంజరము నారదము, ఆది అనే, వింశతిగిరయః - ఇరువది పర్వతములు, ఉపక్లుప్తాః - రచించబ డినవి.

దుద్దునకు చుట్టూ జూలు ఉన్నట్లే, మేరు పర్వతమునకు చుట్టూ మూలస్థానమునందు ఇరువది పర్వతములు ఈశ్వరునిచే రచించబడినవి. ఆ పర్వతములు కురంగము, కురరము, కుసుంభము, వైకంకము, త్రికూట ము, శిశిరము, పతంగము, రుచకము, నిషధము, శినీవాసము, కపిలము, శంఖము, వైదూర్యము, జారుధి, హంస, ఋషభము, నాగము, కాలంజర ము, నారదము, ఆది అనునవి.

జఠరదేవకూటౌ మేరుం పూర్వేణాష్టాదశయోజనసహస్రముద గాయతౌ ద్విసహస్రం పృథుతుంగౌ భవతః । ఏవమపరేణ పవనపారియాత్రౌ దక్షిణేన కైలాసకరవీరౌ ప్రాగాయతావేవము త్తరతస్త్రిశృంగమకరావష్టభిరేతైః పరిస్తృతోఽగ్నిరివ పరితశ్చ కాస్తి కాంచనగిరిః ।। 27

మేరుం పూర్వేణ - మేరు పర్వతమునకు తూర్పుగా, అష్టాదశ యోజనసహస్రమ్ - పదునెనిమిది వేల యోజనములు, ఉదక్-ఆయతౌ - ఉత్తరముగా వ్యాపించియున్నవి, ద్విసహస్రమ్ - రెండు వేలు, పృథు తుంగౌ - లావు ఎత్తు కలవి, జఠరదేవకూటౌ - జఠరము దేవకూటము అనే పర్వతములు, భవతః - ఉన్నవి, ఏవమ్ - ఇదే విధముగా, అపరేణ - పడమరగా, పవనపారియాత్రౌ - పవన పారియాత్ర పర్వతములు, దక్షిణేన - దక్షిణముగా, కైలాసకరవీరౌ - కైలాస కరవీర పర్వతములు, ప్రాక్-ఆ యతౌ - తూర్పుగా వ్యాపించియున్నవి, ఏవమ్ - ఇదే విధముగా, ఉత్త రతః - ఉత్తరముగా, త్రిశృంగమకరౌ - త్రిశృంగ మకర పర్వతములు, ఏతైః

- ఈ, అష్టభిః - ఎనిమిది పర్వతములచే, పరితః - చుట్టూ, పరిస్తృతః - ఆవరించబడియున్న, కాంచనగిరిః - బంగరు పర్వతము, అగ్నిరివ - అగ్ని వలె, చకాస్తి - ప్రకాశించుచున్నది.

మేరు పర్వతమునకు తూర్పున జఠర దేవకూటములనే పర్వతములు గలవు. ఇవి ఉత్తరమునుండి దక్షిణమునకు పదునెనిమిది వేల యోజనముల పొడవున వ్యాపించి యున్నవి. వీటి వెడల్పు రెండు వేల యోజనములు కాగా, ఎత్తు కూడ అంతే. ఇదే విధముగా, మేరువునకు పడమరగా పవన పారియాత్ర పర్వతములు గలవు. మేరువునకు దక్షిణముగా కైలాస కరవీర పర్వతములు తూర్పు వైపునకు విస్తరించి యున్నవి. ఇదే విధముగా, మేరువునకు ఉత్తరముగా త్రిశృంగ మకర పర్వతములు గలవు. ఈ విధముగా బంగరు పర్వతము చుట్టూ ఎనిమిది పర్వతములచే ఆవరించబడి, ఎనిమిది సమిధలచే మరియు దర్భలచే చుట్టువారబడియున్న అగ్ని వలె ప్రకాశించుచున్నది.

మేరోర్మూర్ధని భగవత ఆత్మయోనేర్మధ్యత ఉపక్లుప్తాం పురీమయుతయోజనసాహస్రీం సమచతురస్రాం శాతకౌంభీం వదంతి ॥ 28

మేరోః - మేరుపర్వతముయొక్క, మూర్ధని - శిఖరమునందు, మధ్యతః - మధ్యలో, ఉపక్లుప్తామ్ - రచించబడినట్టియు, అయుతయోజనసాహస్రీమ్ - కోటి యోజనముల నిడివి గలిగినట్టియు, సమచతురస్రామ్ - సమచతుర్భుజాకారములోనున్నట్టియు, శాతకౌంభీమ్ - బంగారముతో నిర్మించబడిన, ఆత్మయోనేః - స్వయంభువుడైనట్టియు, భగవతః - పూజనీయుడగు బ్రహ్మగారి, పురీమ్ - నగరమును గురించి, వదంతి - చెప్పుచున్నారు.

స్వయంభువుడగు బ్రహ్మగారి నగరము మేరుపర్వతశిఖరముపై మధ్యలో బంగారముతో నిర్మించబడినదని మహాత్ములు చెప్పెదరు. సమచతుర్భుజాకారములోనుండే ఆ నగరము కోటి యోజనముల నిడివి కలిగి యుండును.

**తామను పరితో లోకపాలానామష్టానాం యథాదిశం యథా**
**రూపం తురీయమానేన పురోఽష్టావుపక్లుప్తాః ॥ 29**

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే**
**భువనకోశవర్ణనం నామ షోడశోఽధ్యాయః ॥**

తాం అను - ఆ బ్రహ్మపురిని అనుసరించి, పరితః - చుట్టూ, అష్టానామ్ - ఎనమండుగురు, లోకపాలానామ్ - లోకపాలకుల, అష్టౌ - ఎనిమిది, పురః - నగరములు, యథాదిశమ్ - ఆయా దిక్కులయందు, యథా రూపమ్ - ఆయా రంగులు ఉండునట్లుగా (అనురూపముగా), తురీయమానేన - నాల్గవవంతు పరిమాణముచే, ఉపక్లుప్తాః - రచించబడినవి.

ఆ బ్రహ్మపురి రచనను పోలి దాని చుట్టూ ఎనమండుగురు లోకపాలకులకు ఆయా దిక్కులలో ఎనిమిది నగరములు గలవు. అవి బ్రహ్మపురములో నాల్గవ వంతు నిడివి కలిగియున్నవి. ఆ నగరములు ఆయా లోకపాలకుల స్థాయికి తగ్గట్లు ఉన్నవి.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో
భువనకోశ వర్ణనమనే పదునారవ అధ్యాయము ముగిసినది (16).

*****

# అథ సప్తదశోऽధ్యాయః

## సంకర్షణ స్తుతి

శ్రీశుక ఉవాచ ।

తత్ర భగవతస్సాక్షాద్యజ్ఞలింగస్య విష్ణోర్విక్రమతో వామపా దాంగుష్ఠనఖనిర్భిన్నోర్ధ్వాండకటాహవివరేణాంతఃప్రవిష్టా యా బాహ్యజలధారా తచ్చరణపంకజావనేజనారుణకింజల్కోపరం జితాఖిలజగదఘమలాపహోపస్పర్శనాऽమలా సాక్షాద్భగవ త్పదీత్యనుపలక్షితవచోऽభిధీయమానాऽతిమహతా కాలేన యుగసహస్రోపలక్షణేన దివో మూర్ధన్యవతతార యత్తద్విష్ణుప దమాహుః ॥ 1

తత్ర - ఆ సమయమునందు, సాక్షాత్ - సాక్షాత్తుగా, యజ్ఞలిం గస్య - యజ్ఞమునందు వామనమూర్తిని కలిగియున్నట్టియు, విక్రమతః - అడుగులను వేయుచున్న, విష్ణోః - విష్ణువుయొక్క, వామపాద-అంగుష్ఠన ఖనిర్భిన్న-ఊర్ధ్వ-అండకటాహవివరేణ - ఎడమ కాలి బొటనవ్రేలుయొక్క గోటిచే పగులగొట్టబడిన పై భాగము గల గంగాళమువంటి బ్రహ్మాండముయొక్క చిల్లు గుండా, అంతఃప్రవిష్టా - లోపలకు ప్రవేశించిన, యా - ఏ, బాహ్యజలధారా - బయటనుండే నీటి ధార గలదో అది, తత్-చ రణపంకజ-అవనేజన-అరుణకిం[illegible]-ఉపరంజిత-అఖిలజగత్-అఘమల -అపోహస్పర్శన-అమలా - ఆ భగవానుని పద్మములవంటి పాదములను కడుగుటచే ఎర్రని పుప్పొడిచే ఎర్రగా చేయబడిన సకలప్రాణుల పాపము లను మాలిన్యమును పోగొట్టే స్పర్శ గలది మరియు పవిత్రమైనదియై, సాక్షాత్ - సాక్షాత్తుగా, భగవత్పదీ - భగవత్పది, ఇతి - అని, అనుపలక్షిత వ[illegible]ఽభిధీయమానా - మరియొక లక్షణముతో సంబంధము లేని పేరుచే

నిర్దేశించబడునదియై, యుగసహస్ర-ఉపలక్షణేన - వేయి మహాయుగ ముల పరిమాణము గల, అతిమహతా - చాల పెద్ద, కాలేన - కాలముచే, దివః - స్వర్గముయొక్క, మూర్ధని - శిరస్సు అనదగిన ధ్రువలోకమునందు, అవతతార - అవతరించెను, యత్ - దేనినైతే, తత్ - ప్రసిద్ధి చెందిన, విష్ణు పదమ్ - విష్ణుపదముగా, ఆహుః - చెప్పెదరో.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- బలియొక్క యజ్ఞములో సాక్షా త్తుగా విష్ణు భగవానుడు వామనమూర్తియై అవతరించి, మూడు అడుగులు వేసి బ్రహ్మాండమును కొలిచెను. అప్పుడు ఆయన ఎడమకాలి బొటనవ్రేలి గోరు తగిలి గంగాళమువంటి బ్రహ్మాండముయొక్క పై భాగము పగిలెను. అపుడా చిల్లు గుండా బ్రహ్మాండమునకు బయటనుండే నీరు లోపలికి ప్రవే శించి, ఆ భగవానుని పద్మములవంటి పాదములను కడిగి, ఆ పాదముల కుంకుమచే ఎర్రనయ్యేను. ఆ నీటి ధారకు సాక్షాత్తుగా భగవత్పది అని పేరు వచ్చెను. గంగ మొదలగు పేర్లు తరువాతి కాలములో వేర్వేరు లక్షణ ములను బట్టి వచ్చినవియే గాని, అసలు పేరు భగవత్పది (భగవానుని పాదముతో సంబంధము గలది) యే. ఆ నీటిని స్పృశించినచో సకలప్రా ణులకు బయటనుండే మాలిన్యముతో బాటు అంతఃకరణమునందుండే పాపములు కూడ తొలగిపోవును. ఆ నీరు వేయి మహాయుగముల పరిమా ణము గల చాల పెద్ద కాలమునకు స్వర్గముయొక్క శిరస్సు అనదగిన ధ్రువమండలమును చేరెను. ఆ ధ్రువమండలమునకు విష్ణుపదము అనే ప్రసిద్ధి కూడ గలదని మహాత్ములు చెప్పుచున్నారు.

యత్ర హ వావ వీరవ్రత ఔత్తానపాదిః పరమభాగవ
తోఽస్మత్కులదేవతాచరణారవిందోదకమితి యామనుసవన
ముత్కృష్యమాణభగవద్భక్తియోగేన దృఢం క్లిద్యమానాంత
ర్హృదయ ఔత్కంఠ్యవివశామీలితలోచనయుగలకుడ్మలవిగలి
తామలబాష్పకలయాఽభివ్యజ్యమానరోమపులకకుల
కోఽధునాపి పరమాదరేణ శిరసా బిభర్తి ॥ 2

యత్ర హ - ఎక్కడనైతే, వీరవ్రతః - దృఢమగు సంకల్పము గలవాడు, ఔత్తానపాదిః - ఉత్తానపాదుని కుమారుడు, పరమభాగవతః - గొప్ప భగవద్భక్తుడు అగు ధ్రువుడు, అస్మత్-కులదేవతాచరణ-అరవింద-ఉదకమ్ - మా కులదేవతయగు శ్రీహరియొక్క పాదపద్మముల నీరు, ఇతి - అని, యామ్ - ఏ గంగను, అనుసవనమ్ - మూడు పూటలా, ఉత్కృష్య మాణభగవద్-భక్తియోగేన - వర్ధిల్లుచున్న భగవానునియందలి భక్తియోగ ముచే, దృఢమ్ - మిక్కిలి, క్లిద్యమాన-అంతః-హృదయః - ఆర్ద్రమైన అంతఃకరణము గలవాడై, ఔత్కంఠ్యవివశ-ఆమీలితలోచనయుగలకుడ్మల విగలిత-అమలబాష్పకలయా - వేగిరపాటుచే స్వాధీనము తప్పి కొంచెము మూయబడిన మొగ్గల వంటి కన్నుల జంటనుండి జారిన స్వచ్ఛ మైన కన్నీటి ధారతో, అభివ్యజ్యమానరోమపులకకులకః - ప్రకటమగుచున్న రోమముల గగుర్పాటుల పుట్టలు గలవాడై, అధునా అపి - ఇప్పటికి కూడ, పరమ-ఆదరేణ - అతిశయించిన ఆదరముతో, శిరసా - శిరస్సుతో, వావ - నిశ్చయముగా, బిభర్తి - ధరించుచున్నాడో.

ధ్రువలోకమునందు దృఢసంకల్పుడు, ఉత్తానపాదుని పుత్రుడు అగు ధ్రువుడు ఆ గంగను, తమ కులదైవమగు శ్రీహరి పాదపద్మముల నుండి వెలువడిన కారణముగా, ఈ నాటికీ నిశ్చయముగా మూడు పూటలా అతిశయించిన ఆదరముతో తలపై దాల్చుచున్నాడు. భగవద్భక్తులలో గొప్పవాడగు ఆ ధ్రువునకు భగవంతునియందలి భక్తియొక్క అభ్యాసము దినదినప్రవర్ధమానమగుచుండును. అందువలననే, ఆయన హృదయ ములో అతిశయించిన ఆర్ద్రత ఉదయించి, వేగిరపాటుచే స్వాధీనత తప్పి, కొంచెము మూయబడిన మొగ్గలవంటి కన్నుల జంటనుండి స్వచ్ఛమగు కన్నీరు ధారగా ప్రవహించును. ఆ సమయములో ఆయనకు దేహమంతటా పుట్టలు పుట్టలుగా రోమముల గగుర్పాటు కలుగును.

**తతస్సప్త ఋషయస్తత్ప్రభావాభిజ్ఞా యాం నను తపస ఆత్యంతికీ సిద్ధిరేతావతీ భగవతి సర్వాత్మని వాసుదేవేऽనుపర తభక్తియోగలాభేనైవోపేక్షితాన్యార్థాత్మగతయో ముక్తిమివా**

గతాం ముముక్షవ ఇవ సబహుమానమద్యాపి జటాజూటైరు
ద్వహంతి ॥ 3

**తతః - తరువాత, తత్-ప్రభావ-అభిజ్ఞాః** - ఆ గంగయొక్క మహిమ బాగా తెలిసిన, సప్త - ఏడ్గురు, ఋషయః - మహర్షులు, యామ్ - ఏ గంగనైతే, తపసః - తపస్సుయొక్క, ఆత్యంతికీ - పరిపూర్ణమైన, సిద్ధిః - సిద్ధి, నను - నిశ్చయముగా, ఏతావతీ - ఇంత మాత్రమే, సర్వ-ఆత్మని - సర్వమునకు ఆత్మయైన, భగవతి వాసుదేవే - వాసుదేవ భగవానునియందు, అనుపరతభక్తియోగలాభేన ఏవ - నిరంతరమగు భక్తియోగము యొక్క లాభముచే మాత్రమే, ఉపేక్షిత-అన్య-అర్థ-ఆత్మగతయః - ఉపేక్ష చేయబడిన ఇతరములగు పురుషార్థములు గలవారై మరియు ఆత్మనిష్ఠులై, ఆగతామ్ - వచ్చిన, ముక్తిమ్ - మోక్షమును, ముముక్షవః ఇవ - మోక్షకాములు వలె, సబహుమానమ్ - ఆదరపూర్వకముగా, అద్య అపి - ఈ నాటికి కూడ, జటాజూటైః - జటల ముడులచే, ఉద్వహంతి - ధరించుచున్నారు.

తరువాత ఆ గంగయొక్క మహిమ బాగా తెలిసిన సప్తర్షులు ఆ గంగను, తపస్సునకు పూర్ణమగు సిద్ధి ఈ గంగ లభించుట మాత్రమే అంటూ, జటల ముడులయందు ఇప్పటికి కూడ ధరించుచునే యున్నారు. నడచి వచ్చిన మోక్షమును మోక్షకాములు ఆదరించే విధముగా, వారు ఆమెను ఆదరించుచునే యున్నారు. ఆత్మజ్ఞానులగు ఆ మహర్షులు సర్వ ప్రాణులలో ఆత్మరూపముగా విలసిల్లే వాసుదేవ భగవానునియందు నిరంతరమగు భక్తియోగమును పొంది, తావన్మాత్రముచే ఇతరపురుషార్థములను నిరాకరించినారు.

తతోఽనేకసహస్రకోటివిమానానీకసంకులదేవయానేనావతరం
తీందుమండలమావార్య బ్రహ్మసదనే నిపతతి ॥ 4

**తతః - తరువాత (ఆ సప్తర్షి మండలమునుండి), అనేకసహస్రకోటి విమాన-అనీకసంకులదేవయానేన** - అనేకవేల కోట్ల విమానముల గుంపులతో రద్దీగానుండే దేవలోకమార్గముచే, **అవతరంతీ** - క్రిందకు దిగుచున్న

దై, ఇందుమండలమ్ - చంద్రమండలమును, ఆవార్య - ముంచెత్తి, బ్రహ్మసదనే - బ్రహ్మపురియందు, నిపతతి - పడును.

తరువాత గంగ ఆ సప్తర్షిమండలమునుండి అనేకవేల కోట్ల విమానముల గుంపులతో రద్దీగానుండే దేవలోకమార్గముగుండా క్రిందకు దిగుతూ, మధ్యలో చంద్రమండలమును ముంచెత్తి, మేరుపర్వతశిఖరముపై నుండే బ్రహ్మపురియందు పడును.

తత్ర చతుర్ధా భిద్యమానా చతుర్భిర్నామభిశ్చతుర్దిశమభిస్యందంతీ నదనదీపతిమేవాభినివిశతి సీతాఽలకనందా చక్షుర్భద్రేతి || 5

తత్ర - అచట, చతుర్ధా - నాలుగు ప్రకారములుగా, భిద్యమానా - విడిపోయినదై, సీతా - సీత, అలకనందా - అలకనంద, చక్షుః - చక్షువు, భద్రా - భద్ర, ఇతి - అనే, చతుర్భిః - నాలుగు, నామభిః - పేర్లతో, చతుః-దిశమ్ - నాలుగు దిక్కులయందు, అభిస్యందంతీ - అభిముఖముగా ప్రవహించుచున్నదై, నదనదీపతిం ఏవ - నదములకు నదులకు గమ్యస్థానమగు సముద్రమునే, అభినివిశతి - ప్రవేశించును.

అచట గంగ నాలుగు పాయలుగా విడిపోవును. సీత, అలకనంద, చక్షువు, భద్ర అని ఆ నాలుగు పాయల పేర్లు. ఆ పాయలు నాలుగు దిక్కులవైపు ప్రవహించి సముద్రమును చేరును. నదములకు, నదులకు గమ్యము సముద్రమే గదా!

సీతా తు బ్రహ్మసదనాత్కేసరాచలాదిగిరిశిఖరేభ్యోఽధోఽధః ప్రస్రవంతీ గంధమాదనమూర్ధసు పతిత్వాఽంతరేణ భద్రాశ్వవర్షం ప్రాచ్యాం దిశి క్షారసముద్రమభివిశతి || 6

సీతా తు - సీతయైతే, బ్రహ్మసదనాత్ - బ్రహ్మపురినుండి, కేసర-అచల-ఆదిగిరిశిఖరేభ్యః - కేసరములవంటి పర్వతములలో మొదటి పర్వతముయొక్క శిఖరములనుండి, అధః అధః - క్రింద క్రిందకు, ప్రస్రవంతీ - జారుచున్నదై, గంధమాదనమూర్ధసు - గంధమాదన శిఖరములయందు,

పతిత్వా - పడి, భద్రాశ్వవర్షం అంతరేణ - భద్రాశ్వవర్షమునకు మధ్యలో, ప్రాచ్యాం దిశి - తూర్పు దిక్కునందు, క్షారసముద్రమ్ - ఉప్పు సముద్రమును, అభివిశతి - అభిముఖముగా ప్రవేశించును.

సీత అనే పాయ బ్రహ్మపురినుండి మేరుపర్వతమునకు కేసరస్థానములోనుండి పర్వతములలో మొదటిదాని శిఖరముల మీదుగా క్రింద క్రిందకు తూర్పు వైపు ప్రవహిస్తూ, గంధమాదన శిఖరములపై పడి, భద్రాశ్వఖండమునకు మధ్యగా ప్రవహించి ఉప్పు సముద్రములో కలియును.

ఏవం మాల్యవచ్ఛిఖరాన్నిష్పతంతీ తతోఽనుపరతవేగా కేతుమాలమభి చక్షుః ప్రతీచ్యాం దిశి సరిత్పతిం ప్రవిశతి ॥ 7

ఏవమ్ - ఇదే విధముగా, చక్షుః - చక్షువు, మాల్యవత్-శిఖరాత్ - మాల్యవత్పర్వత శిఖరమునుండి, నిష్పతంతీ - క్రిందకు పడుచున్నదై, తతః - అచటనుండి, అనుపరతవేగా - తగ్గని వేగము గలదియై, కేతుమాలం అభి - కేతుమాల ఖండమునకు అభిముఖముగా, ప్రతీచ్యాం దిశి - పడమర దిక్కునందు, సరిత్-పతిమ్ - నదులకు ప్రభువగు సముద్రమును, ప్రవిశతి - ప్రవేశించును.

ఇదే విధముగా, చక్షువు అనే పాయ మాల్యవత్పర్వత శిఖరమునుండి పడి, తగ్గని వేగముతో కేతుమాల ఖండమునకు అభిముఖముగా పడమర దిక్కునందు ప్రవహించి, సముద్రమును చేరును.

భద్రా చోత్తరతో మేరుశిరసో నిపతితా గిరిశిఖరాద్గిరిశిఖరమతిహాయ శృంగవతశ్శృంగాదవస్యందమానా ఉత్తరాంస్తు కురూనభిత ఉదీచ్యాం దిశి జలధిమభిప్రవిశతి ॥ 8

భద్రా చ - భద్ర కూడ, మేరుశిరసః - మేరు శిఖరమునుండి, ఉత్తరతః - ఉత్తరముగా, నిపతితా - పడినదై, గిరిశిఖరాత్ - పర్వతశిఖరమునుండి, గిరిశిఖరమ్ - పర్వత శిఖరమును, అతిహాయ - దాటి, శృంగవతః - శృంగవత్పర్వతముయొక్క, శృంగాత్ - శిఖరమునుండి, అవస్యందమానా - క్రిందకు జారుచున్నదై, ఉత్తరాన్ కురూన్ తు అభితః - ఉత్తర

కురు దేశమునకైతే అభిముఖముగా, ఉదీచ్యాం దిశి - ఉత్తర దిక్కునందు, జలధిమ్ - సముద్రమును, అభిప్రవిశతి - అభిముఖముగా ప్రవేశించును.

భద్ర అనే పాయ కూడ మేరుశిఖరమునుండి ఉత్తరముగా పడి ఒక పర్వతశిఖరమునుండి మరియొక శిఖరముమీద పడుతూ, వాటిని దాటి శృంగవత్పర్వతముయొక్క శిఖరమునుండి క్రిందకు జారుకుంటూ, ఉత్తరదిక్కునకు అభిముఖముగా ఉత్తరకురుదేశమునందు ప్రవహించి సముద్రములో కలియును.

తథైవాలకనందా దక్షిణేన బ్రహ్మసదనాద్బహూని గిరికూటాన్యతిక్రమ్య హేమకూటాద్ధైమకూటాన్యతిరభసతర రంహసా లుఠయంతీ భారతమభి వర్షం దక్షిణస్యాం దిశి జల ధిమభిప్రవిశతి యస్యాం స్నానార్థం చాగచ్ఛతః పుంసః పదే పదేऽశ్వమేధరాజసూయాదీనాం ఫలం న దుర్లభమితి ।। 9

తథా ఏవ - అదే విధముగా, అలకనందా - అలకనంద, బ్రహ్మసదనాత్ - బ్రహ్మపురినుండి, దక్షిణతః - దక్షిణముగా, బహూని - అనేకములగు, గిరికూటాని - పర్వతశిఖరములను, అతిక్రమ్య - దాటి, హేమకూటాత్ - హేమకూట పర్వతమునుండి, హైమకూటాని - హిమాలయమునకు చెందిన శిఖరములను, అతిరభసతరరంహసా - మిక్కిలి అధికమగు వేగముతో, లుఠయంతీ - సుడులు తిరుగుచున్నదై, భారతం వర్షం అభి - భారతదేశమున కభిముఖముగా, దక్షిణస్యాం దిశి అభి - దక్షిణదిక్కునకభిముఖముగా, జలధిమ్ - సముద్రమును, ప్రవిశతి - ప్రవేశించును, యస్యామ్ - దేనియందు, స్నాన-అర్థమ్ - స్నానము కొరకై, ఆగచ్ఛతః - వచ్చే, పుంసః - వ్యక్తికి, పదే పదే - ప్రతి అడుగునందు, అశ్వమేధరాజసూయ-ఆదీనామ్ - అశ్వమేధము రాజసూయము మొదలగు యజ్ఞముల, ఫలమ్ - ఫలము, దుర్లభమ్ - పొంద శక్యము కానిది, న - కాదో, ఇతి - అని.

అదే విధముగా, అలకనంద బ్రహ్మపురినుండి దక్షిణాభిముఖముగా ప్రవహించి, అనేక పర్వతశిఖరములను దాటుకుంటూ హేమకూట

పర్వతమును చేరును. అక్కడనుండి దక్షిణముగా ప్రవహిస్తూ, హిమాలయ శిఖరములను దాటి, మహావేగముతో సుడులు తిరుగుతూ భారతదేశమున కభిముఖముగా ప్రవహించి, సముద్రమును చేరును. దానిలో స్నానమును చేయుటకై వచ్చే వ్యక్తికి తాను వేసే ప్రతి అడుగునకు అశ్వమేధము, రాజసూయము మొదలగు యజ్ఞములను చేస్తే వచ్చే ఫలము లభించుట అసంభవము కాదని చెప్పెదరు.

అన్యే చ నదా నద్యశ్చ వర్షే వర్షే సంతి బహుశో మేర్వాదిగిరి దుహితరశ్శతశః ।। 10

చ - మరియు, అన్యే - ఇతరములగు, నదాః - నదములు, నద్యః చ - నదులు కూడ, వర్షే వర్షే - ప్రతి ఖండమునందు, బహుశః - అనేక ప్రకారములుగా, మేరు-ఆదిగిరిదుహితరః - మేరువు మొదలగు పర్వతముల పుత్రికలు, శతశః - వందల సంఖ్యలో, సంతి - ఉన్నవి.

ఇంతే గాక, మేరువు మొదలగు పర్వతములనుండి పుట్టిన రకరకముల నదులు, నదము (పడమరగా పారే యేరు) లు ప్రతి ఖండమునందు వందల సంఖ్యలో గలవు.

తత్రాపి భారతమేవ వర్షం కర్మక్షేత్రమన్యాన్యష్ట వర్షాణి స్వర్గిణాం పుణ్యశేషోపభోగస్థానాని భౌమాని స్వర్గపదాని వ్యపదిశంతి ।। 11

తత్ర అపి - ఆ దేశములయందు (ఆ జంబూద్వీపమునందు) కూడ, భారతం వర్షం ఏవ - భారతదేశమే, కర్మక్షేత్రమ్ - కర్మలకు క్షేత్రము, అన్యాని - ఇతరములగు, అష్ట - ఎనిమిది, వర్షాణి - దేశములు, స్వర్గిణామ్ - స్వర్గవాసులకు, పుణ్యశేష-ఉపభోగస్థానాని - మిగిలిన పుణ్యమును అనుభవించే స్థానములు, భౌమాని - భూమియందు గల, స్వర్గపదాని - స్వర్గస్థానములుగా, వ్యపదిశంతి - చెప్పుచున్నారు.

జంబూద్వీపమునందలి ఈ వర్షములన్నింటిలో భారతవర్షము మాత్రమే కర్మభూమి. మిగిలిన ఎనిమిది వర్షములు భోగభూములు. స్వర్గ

వాసులు తమకు మిగిలిన పుణ్యమును అచట అనుభవించుచుందురు. అవి భూమిపై ఉండే స్వర్గధామములని మహాత్ములు చెప్పుచున్నారు.

ఏషు పురుషాణామయుతపురుషాయుర్వర్షాణాం దేవక ల్పానాం నాగాయుతప్రాణానాం వజ్రసంహననబలవయోమో దప్రముదితమహాసౌరతమిథునవ్యవాయాపవర్గధృతైకగర్భకల త్రాణాం తత్ర తు త్రేతాయుగసమః కాలో వర్తతే ।। 12

తత్ర - అట్టి, ఏషు తు - ఈ ఖండములయందైతే, అయుతపురుష-ఆయుః-వర్షాణామ్ - మానవమానముచే పదివేల ఆయుర్దాయము యొక్క సంవత్సరములు కలిగినట్టియు, దేవకల్పానామ్ - ఇంచుమించు దేవతలతో సమానులైనట్టియు, నాగ-అయుతప్రాణానామ్ - పదివేల ఏనుగుల బలము కలిగినట్టియు, వజ్రసంహననబలవయః-మోదప్రముదితమహాసౌరతమిథునవ్యవాయ-అపవర్గధృత-ఏకగర్భకలత్రాణామ్ - వజ్రము వలె దృఢమైన శరీరమునందలి బలము వయస్సు ఉల్లాసములచే అధికముగా అనుభవించబడిన సంభోగముగల జంటలలో భోగముయొక్క అంతమునందలి ఒక సంవత్సరమునందు ధరించబడిన ఒకే గర్భము గల భార్యలు కలిగిన, పురుషాణామ్ - పురుషులకు, త్రేతాయుగసమః - త్రేతా యుగముతో సమానమైన, కాలః - కాలము, వర్తతే - ఉండును.

ఈ ఖండములలో పురుషులు ఇంచుమించుగా దేవతల వలె మనుష్యమానముచే పదివేల సంవత్సరముల ఆయుర్దాయమును కలిగి యుందురు. పదివేల ఏనుగుల బలము గల వారి దేహము వజ్రము వలె దృఢముగా నుండును. బలము, వయస్సు, ఉల్లాసము ఉండుటచే వారు భార్యలతో గూడి దీర్ఘకాలము అధికముగా భోగముల ననుభవించెదరు. ఆయుర్దాయములో ఒకే ఒక సంవత్సరము మిగిలియుండగా, వారి భార్యలు ఒకే సారి గర్భమును దాల్చెదరు. వారికి అచట కాలము త్రేతా యుగముతో సమానముగా గడుచును.

యత్ర హ దేవపతయస్స్వైస్స్వైర్గణనాయకైర్విహితమహార్హ ణాస్సర్వర్తుకుసుమస్తబకఫలకిసలయశ్రియాఽఽనమ్యమానవిట

పలతావిటపిభిరుపశుంభమానరుచిరకాననాశ్రమాయతనవ
ర్షగిరిద్రోణీషు తథా చామలజలాశయేషు వికచవివిధనవవనరు
హామోదముదితరాజహంసకుక్కుటకారండవసారసచక్రవాకాది
భిర్మధుకరనికరాకృతిభిరుపకూజితేషు జలక్రీడాదిభిర్విచిత్రవి
నోదైస్సులలితసురసుందరీణాం కామకలిలవిలాసహాసలీలాఽవ
లోకాకృష్టమనోదృష్టయస్స్వైరం విహరంతి ॥ 13

యత్ర హ - ఎక్కడనైతే, దేవపతయః - దేవనాయకులు, స్వైః స్వైః - తమ తమ, గణనాయకైః - గణముల నాయకులచే, విహితమహా -అర్హణాః - చేయబడిన గొప్ప ఉపచారములు గలవారై, సర్వ-ఋతుకుసుమస్తబకఫలకిసలయశ్రియా - అన్ని ఋతువులయందు పువ్వుల గుత్తుల పళ్ల మరియు చిగుళ్లయొక్క శోభతో, ఆనమ్యమానవిటపలతావిటపిభిః - అధికముగా వంచబడుచున్న కొమ్మలయందలి తీగలు గల చెట్లతో, ఉపశుంభమానరుచిరకానన-ఆశ్రమ-ఆయతనవర్షగిరిద్రోణీషు - శోభిల్లుచున్న అందమైన అడవులయందలి ఆశ్రమములకు నిలయములైన (ఆశ్రమములు భవనములు గల) వర్షపర్వతముల లోయలయందు, తథా చ - అదే విధముగా, వికచవివిధనవవనరుహ-ఆమోదముదితరాజహంసజలకుక్కుటకారండవసారసచక్రవాక-ఆదిభిః - వికసించిన అనేకరకముల కొంగ్రొత్త పద్మముల సుగంధముచే ఆనందించే రాజహంసలు నీటి కోళ్లు కారండవ (కన్నెలేడు) బెగ్గురు జక్కవ మొదలగు పక్షులచే, మధుకరనికర-ఆకృతిభిః - తుమ్మెదల గుంపుల జాతులచే, ఉపకూజితేషు - కూతలతో నింపివేయబడుచున్న, అమలజల-ఆశయేషు - స్వచ్ఛమగు నీటితో నిండియున్న సరస్సులయందు, జలక్రీడా-ఆదిభిః - నీటిలో ఆడే ఆటలు మొదలైన, విచిత్రవినోదైః - వివిధరకముల వినోదములతో, సులలితసురసుందరీణామ్ - మిక్కిలి అందమగు దేవయువతులయొక్క, కామకలిలవిలాసహాసలీలా-అవలోక-ఆకృష్టమనోదృష్టయః - కామనచే కలిగిన శృంగారచేష్టలు చిరునవ్వులు సొగసు చూపులచే ఆకర్షించబడిన మనస్సులు చూపులు గలవారై, స్వైరమ్ - యథేచ్ఛగా, విహరంతి - విహరించెదరో.

అక్కడ దేవనాయకులకు తమ తమ గణముల నాయకులు గొప్ప ఉపచారములను చేయుచుందురు. అచటి వర్షపర్వతముల లోయలు అడవులతో నిండి శోభిల్లుచుండును. ఆ అడవులలోని చెట్ల కొమ్మలు అన్ని ఋతువులయందు అధికమగు పువ్వుల గుత్తులతో పళ్ల బరువుతో నేలదాక వంగియుండును. ఆ కొమ్మలను చిగుళ్లతో నిండిన తీగలు పెనవేసుకొనియుండును. అట్టి అందమైన అడవులలోని ఆశ్రమములలో మరియు అచటి భవనములలో ఆ దేవనాయకులు మిక్కిలి అందమగు దేవయువతులతో గూడి రకరకముల వినోదములతో యథేచ్ఛగా విహరించుచుందురు. ఆ దేవయువతులు కామనచే కలిగిన శృంగారచేష్టలతో చిరునవ్వులను హొయలుతోడి చూపులను విసురుచుందురు. ఆ చూపులచే ఆ దేవనాయకుల మనస్సులు మాత్రమే గాక చూపులు కూడ ఆకర్షించబడును. అచటి సరస్సులు వికసించిన రకరకముల పద్మముల సుగంధము కలిగియుండును. రాజహంసలు, నీటి కోళ్లు, కారండవ పక్షులు, బెగ్గురు జక్కవ మొదలగు పక్షులు ఆ సుగంధమునకు ఆనందించి అధికముగా కూతలను కూయుచుండును. వివిధజాతుల తుమ్మెదల గుంపులు ఝుంకారములను చేయుచుండును. ఆ దేవనాయకులు దేవస్త్రీలతో గూడి వాటిలో జలకములాడుచుందురు.

నవస్వపి వర్షేషు భగవాన్నారాయణో మహాపురుషః పురుషాణాం తదనుగ్రహాయాత్మతత్త్వవ్యూహేనాత్మనాద్యాపి సంనిధీయతే ॥ 14

నవసు వర్షేషు అపి - తొమ్మిది ఖండములయందు కూడ, మహాపురుషః - పురుషోత్తముడగు, భగవాన్ నారాయణః - నారాయణ భగవానుడు, పురుషాణామ్ - వ్యక్తులకు, తత్-అనుగ్రహాయ - ఆ అనుగ్రహము కొరకై, ఆత్మతత్త్వవ్యూహేన - తన గుణముల సమూహము గల, ఆత్మనా - రూపముతో, అద్య అపి - ఈ నాటికి కూడ, సంనిధీయతే - సన్నిహితుడైయుండును.

ఆ తొమ్మిది ఖండములయందు కూడ పురుషోత్తముడగు నారాయణ భగవానుడు తన గుణమయములగు విభిన్నరూపములతో సన్నిహితుడై, అచటి వ్యక్తులపై తన అనుగ్రహమును బరపుచుండును.

**ఇలావృతే తు భగవాన్ భవ ఏక ఏవ పుమాన్న హ్యన్యస్తత్రా పరో నిర్విశతి భవాన్యాశ్శాపనిమిత్తజ్ఞో యత్ప్రవేక్ష్యతః స్త్రీభావస్తత్పశ్చాద్వక్ష్యామి ॥ 15**

ఇలావృతే తు - ఇలావృత ఖండమునందైతే, భగవాన్ భవః - శివ భగవానుడు, ఏకః ఏవ - ఒక్కడే, పుమాన్ - పురుషుడు, అన్యః - శివుని కంటె భిన్నమైనవాడు, భవాన్యాః - పార్వతియొక్క, శాపనిమిత్తజ్ఞః - శాప కారణమునెరింగియున్న, అపరః - ఇంకో పురుషుడు, తత్ర - అచట, న హి నిర్విశతి - ప్రవేశించడు, యత్ - దేనిని, ప్రవేక్ష్యతః - ప్రవేశించబోవు వానికి, స్త్రీభావః - స్త్రీత్వము కలుగునో, తత్ - ఆ విషయమును, పశ్చాత్ - తరువాత, వక్ష్యామి - చెప్పగలను.

ఇలావృత ఖండమునందైతే శివభగవానుడొక్కడు మాత్రమే పురుషుడు. మరియొక పురుషుడు లేడు. అక్కడ ప్రవేశించిన పురుషుడు స్త్రీరూపమును పొందునని పార్వతి శపించెను. ఈ సంగతి తెలిసిన వాడు ఎవడైననూ అచటకు పోడు. ఈ విషయమును నేను తరువాత వివరముగా చెప్పెదను.

**భవానీనాథైః స్త్రీగణార్బుదసహస్రైరవరుధ్యమానో భగవతశ్చతుర్మూర్తేర్మహాపురుషస్య తురీయాం తామసీం మూర్తిం ప్రకృతిమాత్మనస్సంకర్షణసంజ్ఞామాత్మసమాధిరూపేణ సంనిధాప్యైతదభిగృణన్ భవ ఉపధావతి ॥ 16**

భవానీనాథైః - పార్వతి ప్రభ్విగా కలిగిన, స్త్రీగణ-అర్బుదసహస్రైః - కోట్లాది స్త్రీల సమూహములచే, అవరుధ్యమానః - సేవించబడుచున్న, భవః - శివుడు, చతుః-మూర్తేః - నాలుగు రూపములు కలిగినట్టియు, మహాపురుషస్య - పురుషోత్తముడగు, భగవతః - నారాయణ భగ

వానుని, తురీయామ్ - నాల్గవది అయినట్టియు, తామసీమ్ - తమోగుణప్ర ధానమైనట్టియు, ఆత్మనః - తనకు, ప్రకృతిమ్ - కారణమైనట్టియు, సంకర్ష ణసంజ్ఞామ్ - సంకర్షణుడు అనే పేరు గల, మూర్తిమ్ - మూర్తిని, ఆత్మస మాధిరూపేణ - చిత్తముయొక్క ఏకాగ్రతయే స్వరూపముగా గల ధ్యాన ముచే, సన్నిధాప్య - సన్నిధియందుండునట్లుగా చేసి, ఏతత్ - దీనిని, అభిగృణన్ - స్తుతించుచున్నవాడై, ఉపధావతి - ఉపాసించుచున్నాడు.

అచట పార్వతీదేవి నాయకత్వములో కోట్లాది స్త్రీల గణములు శివుని సేవించుచుండును. ఆయన నారాయణ భగవానుని నాల్గవ రూప మును ఏకాగ్రమగు చిత్తమునందు నిలిపి, ఈ క్రింది విధముగా స్తుతిస్తూ ఉపాసించును. పురుషోత్తముడగు నారాయణుని నాల్గవ మూర్తికి సంకర్ష ణుడు అని పేరు. శివునకు కారణము తమోగుణప్రధానమగు ఆ మూర్తియే.

శ్రీభగవానువాచ ।
ఓం నమో భగవతే మహాపురుషాయ సర్వగుణసంఖ్యానాయా
నంతాయావ్యక్తాయ నమ ఇతి ।। 17

మహాపురుషాయ - పురుషోత్తముడైనట్టియు, సర్వగుణసంఖ్యా నాయ - సకల గుణకార్యములకు ప్రకాశము నొసంగునట్టియు, అనంతాయ - అనంతుడైనట్టియు, అవ్యక్తాయ - ఇంద్రియగోచరుడు కాని, భగవతే - సంకర్షణ భగవానుని కొరకు, నమః నమః - అనేక నమస్కారములు.

శ్రీశివ భగవానుడిట్లు పలికెను --- ఓమ్ (ఇది భగవానుని పేరు, లేక శబ్దాత్మకమగు ప్రతీక). పురుషోత్తముడగు సంకర్షణుడే త్రిగుణకార్య మగు జగత్తునకు చైతన్యప్రకాశము ననుగ్రహించుచున్నాడు. అనంతుడగు ఆయన ఇంద్రియములకు గోచరము కాడు. ఆయనకనేక నమస్కారములు.

భజే భజన్యారణపాదపంకజం
భగస్య కృత్స్నస్య పరం పరాయణమ్ ।
భక్తేష్వలం భావితభూతభావనం
భవాపహం త్వా భవభావమీశ్వరమ్ ।। 18

భజన్య-అరణపాదపంకజమ్ - సేవించదగిన ఆశ్రయమైన పద్మ ములవంటి పాదములు కలిగినట్టియు (భజన్య - సేవించదగినవాడా!), కృత్స్నస్య - సకలమైన, భగస్య - ఐశ్వర్యము మొదలగు ఆరు గుణముల సమూహమునకు, పరాయణమ్ - ఆశ్రయమైనట్టియు, పరమ్ - సర్వాతిశా యి యైనట్టియు, భక్తేషు - భక్తులయందు, అలమ్ - అధికముగా (అలం కారమైనట్టియు), భావితభూతభావనమ్ - ప్రకటించబడిన ప్రాణులను రక్షించే రూపము కలిగినట్టియు, భవ-అపహమ్ - సంసారమును తొలగిం చునట్టియు, భవభావమ్ - సంసారమును కలిగించునట్టియు, ఈశ్వరమ్ - ఈశ్వరుడవగు, త్వా - నిన్ను, భజే - భజించుచున్నాను.

ఓ ఈశ్వరా! సేవించదగిన నిన్ను నేను సేవించుచున్నాను. భక్తు లకు శరణునిచ్చే పద్మములవంటి నీ పాదములు సేవించ దగినవి. ఈశ్వర భావము, రక్షణశక్తి, కీర్తి, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము అనే ఆరు గుణములు నీయందు పూర్ణముగా నున్నవి. పురుషోత్తముడవగు నీవే భక్తులకు అలంకా రము. నీవు సకలప్రాణులను రక్షించే నీ రూపమును భక్తులకు ప్రకటము చేసెదవు. భక్తులకు సంసారబంధమును తొలగించే నీవు అభక్తులను సంసా రములో పడవేయుచున్నావు.

న యస్య మాయాగుణచిత్తవృత్తిభిః
నిరీక్షతో హ్యణ్వపి దృష్టిరజ్యతే ।
ఈశే యథా నోఽజితమన్యురంహసాం
కస్తం న మన్యేత జిగీషురాత్మనః ॥ 19

అజితమన్యురంహసామ్ - జయించబడని కోపముయొక్క వేగము గల, నః యథా - మాకు వలె, ఈశే - నియంత్రించుట కొరకై, నిరీ క్షతః - చూస్తూ ఉండే, యస్య - ఎవనియొక్క, దృష్టిః - చూపు, మాయాగుణచిత్తవృత్తిభిః - మాయయొక్క గుణముల కార్యములైన చిత్తవృ త్తులచే, అణు అపి - లేశమైననూ, న అజ్యతే - లేపమును పొందదో, తమ్ - అట్టి ఈశ్వరుని, ఆత్మనః - ఆత్మగా స్వీకరించబడే దేహేంద్రియా దులను (మనస్సుయొక్క), జిగీషుః - జయించగోరే, కః - ఎవ్వాడు, న మన్యేత - సేవించకుండును?

మేము కోపముయొక్క వేగమును జయించినవారము కాము. కావుననే, మేము చిత్తవృత్తులతో తాదాత్మ్యమును చెంది యుండెదము. కాని, శ్రీహరి అట్టివాడు కాదు. ఆయన ఆత్మరూపుడై సర్వమును సాక్షిగా చూస్తూ సర్వమును నియంత్రించుచునే యుండును. కాని, త్రిగుణాత్మిక యగు మాయాశక్తియొక్క గుణముల కార్యములగు మనోవృత్తులు సాక్షిచై తన్యమునకు లేపమును లేశమైననూ కలిగించలేవు. దేహేంద్రియాదుల యందు ఆత్మాభిమానము కలిగి వాటిపై జయమును మనోనిగ్రహమును పొందగోరే ఏ వ్యక్తి అట్టి ఈశ్వరుని సేవించకుండును?

అసద్దృశో యః ప్రతిభాతి మాయయా
క్షీబేవ మధ్వాసవతామ్రలోచనః ।
న నాగవధ్వోఽర్హణ ఈశిరే హ్రియా
యత్పాదయోస్స్పర్శనధర్షితేంద్రియాః ।। 20

యః - ఏ భగవానుడు, అసత్-దృశః - దుష్టమగు దృష్టి గలవాని కి, మాయయా - మాయచే, క్షీబః ఇవ - క్రొవ్వెక్కినవాడు వలె, మధు-ఆస వతామ్రలోచనః - మధువు మరియు ఆసవములచే ఎర్రని కన్నులు కలవా డుగా, ప్రతిభాతి - కనబడునో, నాగవధ్వః - నాగకన్యలు, స్పర్శనధర్షిత-ఇంద్రియాః - స్పృశించుటచే మోహింపజేయబడిన ఇంద్రియములు గల వారై, యత్-పాదయోః - ఎవని పాదములకు, అర్హణే - పూజయందు, హ్రియా - సిగ్గుచే, న ఈశిరే - సమర్థులు కాలేదో.

మాయచే వ్యామోహితమైన బుద్ధి గలవారలకు నీవు మధువును, ఆసవమును సేవించుటచే ఎర్రని కన్నులతో మత్తెక్కి యున్నవాని వలె కన బడెదవు. నాగకన్యలు నీ పాదములను స్పృశించినంత మాత్రాన వ్యామో హమును పొందిన ఇంద్రియములు గలవారై, సిగ్గుచే నిన్ను పూజించుటకు సమర్థులు కాకుండిరి.

యమాహురస్య స్థితిజన్మసంయమం
త్రిభిర్విహీనం యమనంతమృషయః ।

న వేద సిద్ధార్థమివ క్వచిత్ స్థితం
భూమండలం మూర్ధసహస్రధామసు ॥ 21

అస్య - ఈ జగత్తునకు, స్థితిజన్మసంయమమ్ - రక్షణ ఉత్పత్తి లయములకు కారణముగా, యమ్ - ఎవ్వానిని, ఆహుః - చెప్పుచున్నారో, యమ్ - ఏ, అనంతమ్ - అనంతుని, ఋ-ఋషయః - అదితి మరియు మహర్షులు (ఋషయః - మహర్షులు, వేదమంత్రములు), త్రిభిః - మూడు గుణములచే, విహీనమ్ - వర్జితునిగా, ఆహుః - చెప్పుచున్నారో, మూర్ధసహస్రధామసు - వేయి పడగలు అనే స్థానములయందు, క్వచిత్ - ఒకచోట, సిద్ధార్థమ్ - ఆవగింజవలె, స్థితమ్ - ఉన్న, భూమండలమ్ - భూమండలమును, న వేద - లెక్క చేయడో.

ఈ జగత్తుయొక్క సృష్టిస్థితిలయములను చేయువాడు అనంతుడేననియు, అయిననూ ఆయన సత్త్వరజస్తమోగుణములకు అతీతుడనియు మహర్షులు (మరియు దేవమాతయగు అదితి) చెప్పుచున్నారు (లేదా, వేదమంత్రములు చెప్పుచున్నవి). ఆయన వేయి పడగలపై ఏదో ఒక మూల భూమండలము ఆవగింజ వలె నున్నది. అది ఉన్న సంగతియైననూ ఆయనకు తలపునకు రాదు.

యస్యాద్య ఆసీద్గుణవిగ్రహో మహాన్
విజ్ఞానధిష్ణ్యో భగవానజః కిల ।
యత్సంభవోఽహం త్రివృతా స్వతేజసా
వైకారికం తామసమైంద్రియం సృజే ॥ 22

మహాన్ - మహత్తత్త్వము, యస్య - ఎవనియొక్క, ఆద్యః - మొట్టమొదటి, గుణవిగ్రహః - త్రిగుణకార్యముగా, విజ్ఞానధిష్ణ్యః - విజ్ఞానశక్తికి ఆశ్రయమగు, భగవాన్ - పూజనీయుడగు, అజః - బ్రహ్మగారుగా, ఆసీత్ కిల - ఉదయించెనో, యత్-సంభవః - ఏ బ్రహ్మగారినుండి పుట్టిన, అహమ్ - నేను, త్రివృతా - మూడు విధముల, స్వతేజసా - నా శక్తిచే, వైకారికమ్ - సత్త్వగుణప్రధానమగు దేవతావర్గమును, తామసమ్ - తమో

గుణప్రధానమగు భూతవర్గమును, ఐంద్రియమ్ - రజోగుణప్రధానమగు ఇంద్రియవర్గమును, సృజే - సృష్టించుచున్నానో.

భగవానుని మాయాశక్తి సత్త్వరజస్తమోగుణాత్మకము. దాని మొట్ట మొదటి కార్యమే మహత్తత్త్వము (సమష్టి బుద్ధిశక్తి). అది ఉపాధిగా గల చైతన్యమే పూజనీయుడైన బ్రహ్మగారు. విజ్ఞానశక్తికి ఆశ్రయమగు ఆ బ్రహ్మగారినుండియే నేను పుట్టితిని. సాత్త్విక రాజస తామసరూపమైన అహంకారమే నా శక్తి. నేను ఆ శక్తితో సత్త్వగుణప్రధానమగు దేవతావర్గము ను, రజోగుణప్రధానమగు ఇంద్రియవర్గమును, తమోగుణప్రధానమగు పంచభూతముల వర్గమును సృష్టించుచున్నాను.

ఏతే వయం యస్య వశే మహాత్మనః
స్థితాశ్శకుంతా ఇవ సూత్రయంత్రితాః ।
మహానహం వైకృతతామసేంద్రియాః
సృజామ సర్వే యదనుగ్రహాదిదమ్ ॥ 23

సూత్రయంత్రితాః - సమష్టి క్రియాశక్తిచే నియంత్రించబడే, ఏతే - ఈ, మహాన్ - మహత్తత్త్వము, అహమ్ - నేను, వైకృతతామస-ఇంద్రియాః - దేవతావర్గము పంచభూతవర్గము మరియు ఇంద్రియవర్గములు అనే, వయమ్ - మేము, సూత్రయంత్రితాః - త్రాటిచే కట్టివేయబడిన, శకుంతాః ఇవ - పక్షులు వలె, యస్య - ఏ, మహాత్మనః - మహాత్మునియొక్క, వశే - వశమునందు, స్థితాః - ఉన్నామో, సర్వే - అందరము, యత్-అనుగ్రహాత్ - ఎవని అనుగ్రహము వలన, ఇదమ్ - ఈ జగత్తును, సృజామ - సృష్టించె దమో.

మహత్తత్త్వము (బ్రహ్మగారు), నేను, దేవతావర్గము, పంచభూతవ ర్గము, ఇంద్రియవర్గము అనే ఈ మేము సమష్టి క్రియాశక్తిచే ఆ పరమేశ్వ రునకు కట్టివేయబడి, త్రాటిచే కట్టివేయబడిన పక్షులు వలె నున్నాము. ఆయన అనుగ్రహముచేతనే మేమందరము ఈ జగత్తును సృష్టించెదము.

యన్నిర్మితాం కర్హ్యపి కర్మపర్వణీం
మాయాం జనోఽయం గుణసర్గమోహితః ।

న వేద నిస్తారణయోగమంజసా
తస్మై నమస్తే విలయోదయాత్మనే ॥ 24

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే
సంకర్షణ స్తుతిర్నామ సప్తదశోఽధ్యాయః ॥

కర్మపర్వణీమ్ - కర్మలనే ముడులను పొందించునట్టియు, యత్-నిర్మితామ్ - ఎవనిచే నిర్మించబడిన, మాయామ్ - అవిద్యను, నిస్తారణ యోగమ్ - తరించే ఉపాయమును, గుణసర్గమోహితః - సత్త్వరజస్తమోగుణముల కార్యములచే వ్యామోహితుడైన, అయమ్ - ఈ, జనః - మానవుడు, కర్హి అపి - ఏ కాలమునందైననూ, అంజసా - తేలికగా, న వేద - తెలియకున్నాడో, విలయ-ఉదయ-ఆత్మనే - జగత్తు విలీనమై ఉదయించే స్వరూపము గల, తస్మై - అట్టి, తే - నీ కొరకు, నమః - నమస్కారము.

నీచే నిర్మించబడిన అవిద్య జీవునకు కర్మలు అనే గ్రంథులను కలిగించి బంధించుచున్నది. సత్త్వరజస్తమోగుణముల కార్యములగు దేహాదులయందు వ్యామోహముచే ఆత్మభావము కలిగియున్న ఈ మానవుడు ఏ కాలమునందైననూ ఆ మాయను గాని, దానిని తరించే ఉపాయమును గాని తేలికగా తెలియలేకున్నాడు. ఈ జగత్తు నీ స్వరూపమునుండి పుట్టి, నీయందే విలీనమగుచున్నది. అట్టి నీకు నమస్కారము.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో
సంకర్షణ స్తుతి అనే పదునేడవ అధ్యాయము ముగిసినది (17).

*****

# అథ అష్టాదశోఽధ్యాయః

## అవతారమూర్తుల మంత్రములు - స్తోత్రములు

శ్రీశుక ఉవాచ ।
తథా చ భద్రశ్రవా నామ ధర్మసుతస్తత్కులపతయః పురుషా భద్రాశ్వవర్షే సాక్షాద్భగవతో వాసుదేవస్య ప్రియాం తనుం ధర్మమయీం హయశీర్షాభిధానాం పరమేణ సమాధినా సంనిధాప్యేదమభిగృణంత ఉపధావంతి ।। 1

తథా చ - అదే విధముగా, భద్రాశ్వవర్షే - భద్రాశ్వవర్షమునందు, భద్రశ్రవాః నామ - భద్రశ్రవసుడు అని ప్రసిద్ధి గాంచిన, ధర్మసుతః - ధర్ముని పుత్రుడు, తత్-కులపతయః - వాని వంశములోని ప్రముఖులు, పురుషాః - సేవకులు, సాక్షాత్ - సాక్షాత్తుగా, వాసుదేవస్య భగవతః - వాసుదేవ భగవానునియొక్క, ప్రియామ్ - ప్రియమైనట్టియు, ధర్మమయీమ్ - ధర్మపూర్ణమైనట్టియు, హయశీర్ష-అభిధానామ్ - హయగ్రీవ అనే పేరు గల, తనుమ్ - మూర్తిని, పరమేణ - తీవ్రమగు, సమాధినా - చిత్తైకాగ్రతతో, సన్నిధాప్య - సన్నిధియందుంచుకొని, ఇదమ్ - ఈ స్తోత్రమును, అభిగృణంతః - పఠించుచున్నవారై, ఉపధావంతి - ఉపాసించుచున్నారు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- శివుడు సంకర్షణదేవుని ఉపాసించిన విధముగనే, భద్రాశ్వవర్షమునందు భద్రశ్రవసుడని ప్రసిద్ధి గాంచిన ధర్ముని పుత్రుడు, ఆతని వంశములోని పెద్దలు మరియు ఆతని అనుచరులు కూడ సాక్షాత్తుగా వాసుదేవ భగవానుని మూర్తియగు హయగ్రీవుని ఉపాసించుచున్నారు. ధర్మపూర్ణమైన ఈ మూర్తి భగవానునకు ప్రియమైనది. వారు తీవ్రమగు ఏకాగ్రతతో ఆ మూర్తిని మనస్సునందు స్థిరముగా నిలిపి ఈ విధముగా స్తుతించుచున్నారు.

భద్రశ్రవస ఊచుః ।
ఓం నమో భగవతే ధర్మాయాత్మవిశోధనాయ నమ ఇతి ।।2

ఓమ్. ఆత్మవిశోధనాయ - అంతఃకరణమును శుద్ధము చేసే, భగవతే ధర్మాయ - ధర్మ భగవానుని కొరకు, నమః నమః - అనేక నమస్కారములు, ఇతి - అని.

భద్రశ్రవసుడు, ఆతని అనుచరులు ఇట్లు పలికిరి (జపించిరి) --- ఓమ్. అంతఃకరణమును (జ్ఞానముతో) పరిశుద్ధము చేసే ధర్మ భగవానుని కొరకు అనేక నమస్కారములు.

అహో విచిత్రం భగవద్విచేష్టితం
ఘ్నంతం జనోఽయం హి మిషన్న పశ్యతి ।
ధ్యాయన్నసద్యర్హి వికర్మ సేవితుం
నిర్హృత్య పుత్రం పితరం జిజీవిషతి ।। 3

అహో - ఆహా!, భగవద్-విచేష్టితమ్ - భగవానుని లీల, విచిత్రమ్ - విచిత్రమైనది, హి - ఏలయనగా, అయమ్ - ఈ, జనః - మానవుడు, ఘ్నంతమ్ - సంహరించుచున్న భగవానుని, మిషన్ - చూచుచున్నవాడైననూ, న పశ్యతి - చూచుట లేదు, యర్హి - ఏలయనగా, అసత్ - మిథ్యను, సేవితుమ్ - సేవించుటకు, వికర్మ - పాపమును, ధ్యాయన్ - చింతించుచున్నవాడై, పుత్రమ్ - పుత్రుని, పితరమ్ - తండ్రిని, నిర్హృత్య - తగులబెట్టి, జిజీవిషతి - జీవించ గోరుచున్నాడు.

ఆహా! భగవానుని లీల విచిత్రమైనది. ఈ మానవుడు తన చుట్టూ మృత్యురూపములోనున్న భగవానుని చూస్తున్నా, చూడనివానితో సమానము. ఈతడు మిథ్యయగు సంసారములోని భోగముల కొరకై పాపముతో నిండిన సంకల్పములను చేస్తూ, తన చేతులతో తన తండ్రిని పుత్రుని శ్మశానమునకు పంపించి కూడా, తాను జీవించి ఉండాలనే కోరుచున్నాడు.

వదంతి విశ్వం కవయస్స్మ నశ్వరం
పశ్యంతి చాధ్యాత్మవిదో విపశ్చితః ।

తథాఽపి ముహ్యంతి తవాఽజ మాయయా
సువిస్మితం కృత్యమజం నతోఽస్మి తమ్ ।। 4

అజ - పుట్టుక లేనివాడా!, విశ్వమ్ - జగత్తును, నశ్వరమ్ - నశించుదానినిగా, కవయః - మహాత్ములు, వదంతి స్మ - చెప్పుచున్నారు, చ - మరియు, అధ్యాత్మవిదః - ఆత్మజ్ఞానమును పొందియున్న, విపశ్చితః - వివేకులు, పశ్యంతి - చూచుచున్నారు, తథాపి - అయినప్పటికీ, తవ - నీ, మాయయా - మాయచే, ముహ్యంతి - మోహపడుచున్నారు, కృత్యమ్ - లీల, సువిస్మితమ్ - చాల ఆశ్చర్యమును కలిగించునది, అజమ్ - ఆది లేని, తమ్ - అట్టి నిన్ను, నతః అస్మి - నమస్కరించుచున్నాను.

పుట్టుక లేని ఓ ఈశ్వరా! ఆత్మానాత్మవివేకముచే ఈశ్వరుని ఆత్మ రూపముగా దర్శించిన మహాత్ములు, జగత్తు అశాశ్వతమని దర్శించి, ఆ విషయమునే బోధించుచున్నారు. అయిననూ, మానవులు నీ మాయచే మోహములోనే పడియున్నారు. నీ లీల చాల ఆశ్చర్యమును కలిగించును. ఆది లేని నీకు నమస్కరించుచున్నాను.

విశ్వోద్భవస్థాననిరోధకర్మ తే
హ్యకర్తురంగీకృతమప్యపావృతః ।
యుక్తం న చిత్రం త్వయి కార్యకారణే
సర్వాత్మని వ్యతిరిక్తే చ వస్తుతః ।। 5

అకర్తుః - కర్త కానట్టియు, అప-ఆవృతః - తొలగిన ఆవరణము గల, తే - నీకు, విశ్వ-ఉద్భవస్థాననిరోధకర్మ - జగత్తుయొక్క సృష్టిస్థితిలయముల కర్మ, అపి అంగీకృతమ్ - అంగీకరించబడియే యున్నది, కార్య కారణే - కార్యము మరియు కారణము అయినట్టియు, సర్వ-ఆత్మని - సర్వమునకు స్వరూపమైనట్టియు, వస్తుతః - యథార్థముగా, వ్యతిరిక్తే చ - సర్వముకంటె విలక్షణుడవైన, త్వయి - నీ విషయమునందు, యుక్తమ్ - తగియే యున్నది, న చిత్రమ్ - విడ్డూరము కాదు.

నీకు మాయావరణము లేదు గనుక, నీయందు కర్తృత్వము లేదు. అయిననూ, జగత్తుయొక్క సృష్టిస్థితిలయములనే కర్మలను చేసేది నీవే

నని వేదములు స్వీకరించుచున్నవి. దీనిలో విద్దూరమేమియు లేదు. ఇది యుక్తియుక్తముగనే యున్నది. ఏలయనగా, కార్యము నీవే, కారణము నీవే. సర్వముయొక్క స్వరూపము నీవే. అయిననూ, సర్వముకంటె విలక్షణమైన నీ యథార్థస్వరూపమునందు సర్వము భాసించేదే గాని, వాస్తవముగా ఉన్నది కాదు.

వేదాన్ యుగాంతే తమసా తిరస్కృతాన్
రసాతలాద్యో నృతురంగవిగ్రహః ।
ప్రత్యాదదే వై కవయేఽభియాచతే
తస్మై నమస్తేఽవితథేహితాయ ఇతి ॥ 6

యుగ-అంతే - ప్రళయమునందు, తమసా - చీకటిచే, తిరస్కృతాన్ - కప్పివేయబడిన, వేదాన్ - వేదములను, రసాతలాత్ - పాతాళము నుండి, నృతురంగవిగ్రహః - మనిషి గుఱ్ఱముల రూపములు గల, యః - ఏ నీవు, అభియాచతే - ప్రార్థించుచున్న, కవయే - బ్రహ్మగారి కొరకు, ప్రతి-ఆదదే వై - నిశ్చయముగా సమర్పించితివో, అవితథ-ఈహితాయ - సత్యసంకల్పుడవగు, తస్మై - అట్టి, తే - నీ కొరకు, నమః - నమస్కారము, ఇతి - అని.

ప్రళయములో తమోగుణప్రధానులగు రాక్షసులు వేదములనపహరించి పాతాళములో దాచిరి. అపుడు బ్రహ్మగారు ప్రార్థించగా, నీవు మనిషి-గుఱ్ఱముల సంయుక్తరూపము (హయగ్రీవ) ను దాల్చి, వాటిని తెచ్చి, ఆయనకు సమర్పించితివి. సత్యసంకల్పుడవగు అట్టి నీకు నమస్కారము అని వారు స్తుతించుచున్నారు.

హరివర్షే చాపి భగవాన్నరహరిరూపేణాస్తే । తద్రూపగ్రహణ నిమిత్తముత్తరత్రాభిధాస్యే । తద్దయితం రూపం మహాపురుష గుణభాజనో మహాభాగవతో దైత్యదానవకులతీర్థీకరణశీలాచరితః ప్రహ్లాదోఽవ్యవధానానన్యభక్తియోగేన సహ తద్వర్షపురుషైరుపాస్తే ఇదం చోదాహరతి ॥ 7

హరివర్షే చ అపి - హరివర్షమునందు కూడ, భగవాన్ - భగవానుడు, నరహరిరూపేణ - నరసింహ రూపముతో, ఆస్తే - ఉన్నాడు, తద్-రూపగ్రహణనిమిత్తమ్ - ఆ రూపమును దాల్చుటకు గల కారణమును, ఉత్తరత్ర - తరువాత, అభిధాస్యే - చెప్పెదను, తత్ - ఆ, దయితమ్ - ప్రియమైన, రూపమ్ - రూపమును, మహాపురుషగుణభాజనః - గొప్ప వారి గుణములకు పాత్రుడు, మహాభాగవతః - గొప్ప భగవద్భక్తుడు, దైత్యదానవకులతీర్థీకరణశీల-ఆచరితః - దితి దనువుల వంశములను పవిత్రము చేసే స్వభావము ఆచరణము కలవాడు అగు, ప్రహ్లాదః - ప్రహ్లాదుడు, అవ్యవధాన-అనన్యభక్తియోగేన - ఫలసంకల్పముయొక్క ఆవరణము లేని అన్యము లేని భక్తి అనే ఉపాయముచే, తద్-వర్షపురుషైః సహ - ఆ ఖండములోని అనుచరులతో గూడి, ఉపాస్తే - ఉపాసించుచున్నాడు, చ - మరియు, ఇదమ్ - దీనిని, ఉదాహరతి - జపించుచున్నాడు.

హరివర్షమునందు కూడ భగవానుడు నరసింహరూపముతో నున్నాడు. ఆయన ఆ ప్రియమైన రూపమును దాల్చుటకు గల కారణమును తరువాత వివరించెదను. గొప్పవారి గుణములకు, గొప్ప భగవద్భక్తికి ప్రహ్లాదుడు నిలయము. ఆయన శీలము మరియు ఆచరణము దితి దనువుల వంశములను పవిత్రము చేసినవి. ఆయన ఆ ఖండములోని అనుచరులతో గూడి, ఇతరమునెరుంగని నిష్కామభక్తియోగముతో ఆ నరహరిని ఉపాసిస్తూ, ఈ క్రింది మంత్రమును జపించుచున్నాడు.

> ఓం నమో భగవతే నరసింహాయ నమస్తేజస్తేజసే । ఆవిరావిర్భవ వజ్రనఖ వజ్రదంష్ట్ర కర్మాశయాన్ రంధయ రంధయ తమో గ్రస గ్రస ఓం స్వాహా । అభయమభయమాత్మని భూయిష్ఠా ఓం క్ష్రౌమ్ ॥ 8

ఓమ్ (ఇది భగవానుని నిర్దేశించే వైశ్విక ధ్వని), తేజః-తేజసే - తేజస్సులకు తేజస్సు అయిన, నరసింహాయ భగవతే - నరసింహ భగవానుని కొరకు, నమః నమః - అనేక నమస్కారములు, వజ్రనఖ - వజ్రమువంటి గోళ్లు గలవాడా!, వజ్రదంష్ట్ర - వజ్రమువంటి కోరలు గలవాడా!, ఆవిః-ఆవిః-భవ - తప్పక సాక్షాత్కరించుము, కర్మ-ఆశయాన్ - కర్మవాస

నలను, రంధయ రంధయ - తప్పక దహించుము, తమః - అజ్ఞానమును, గ్రస గ్రస - తప్పక దూరము చేయుము, ఓం స్వాహా - నన్ను నేను నీకు సమర్పించుచున్నాను, ఆత్మని - అంతఃకరణమునందు, అభయం అభయమ్ - నిశ్చయముగా అభయము కలుగునట్లుగా, భూయిష్ఠాః - నిలిచి యుండుము, ఓమ్, క్ష్రౌమ్ (రక్షకుడు అనే అర్థమునిచ్చే బీజాక్షరము).

ఓమ్. తేజోమండలములగు సూర్యాదులకు కూడ తేజస్సును అనుగ్రహించే నరసింహ భగవానునకు అనేక నమస్కారములు. ఓ నరసింహా! నీ గోళ్లు, కోరలు వజ్రముల వలె వాడియైనవి సుమా! నీవు తప్పక నాకు సాక్షాత్కరించి, నా కర్మవాసనలను తప్పక దహించి, నా అజ్ఞానమును తప్పక దూరము చేయుము. నన్ను నేను నీకు సమర్పించుచున్నాను. నీ మంత్రమే మంచి పలుకు (స్వాహా అనగా సు-ఆహ). నీవు నా అంతఃకరణములో అభయస్వరూపుడవై నిలిచియుండుము. ఓం క్ష్రౌమ్.

స్వస్త్యస్తు విశ్వస్య ఖలః ప్రసీదతాం
ధ్యాయంతు భూతాని శివం మిథో ధియా ।
మనశ్చ భద్రం భజతాదధోక్షజే
ఆవేశ్యతాం నో మతిరప్యహైతుకీ ॥ 9

విశ్వస్య - జగత్తునకు, స్వస్తి - మంగళము, అస్తు - కలుగు గాక!, ఖలః - దుష్టుడు, ప్రసీదతామ్ - ప్రసన్నుడగు గాక!, భూతాని - ప్రాణులు, ధియా - బుద్ధితో, మిథః - పరస్పరము, శివమ్ - మంగళమును, ధ్యాయంతు - సంకల్పించును గాక!, చ - మరియు, మనః - మనస్సు, భద్రమ్ - మంగళమును, భజతాత్ - సేవించు గాక!, నః - మా, అహైతుకీ - కామనలు లేని, మతిః అపి - బుద్ధి కూడ, అధోక్షజే - శ్రీహరియందు, ఆవేశ్యతామ్ - ప్రవేశించు గాక!

జగత్తునకు మంగళమగు గాక! దుష్టులు ప్రసన్నమగు చిత్తము గలవారు అగుదురు గాక! ప్రాణులు ఒకరికొకరు మంచినే సంకల్పించును గాక! మా మనస్సులు మంగళములనే సంకల్పించు గాక! ప్రత్యక్షాది

ప్రమాణములకు గోచరుడు కాని శ్రీహరియందు మా మనస్సులలో దృఢ మగు నిష్కామభక్తి నిండిపోవును గాక!

మాఽగారదారాత్మజవిత్తబంధుషు
సంగో యది స్యాద్భగవత్ప్రియేషు నః ।
యః ప్రాణవృత్త్యా పరితుష్ట ఆత్మవాన్
సిద్ధ్యత్యదూరాన్న తథేంద్రియప్రియః ॥ 10

నః - మాకు, అగారదార-ఆత్మజవిత్తబంధుషు - ఇల్లు స్త్రీ సంతానము ధనము బంధువులయందు, సంగః - ఆసక్తి, మా - లేకుండు గాక!, యది - ఉండే పక్షములో, భగవత్-ప్రియేషు - భగవద్భక్తులయందు, స్యాత్ - ఉండు గాక!, యః - ఎవడైతే, ప్రాణవృత్త్యా - ప్రాణములను నిలబెట్టే ఆహారముతో, పరితుష్టః - సంతోషించినవాడై, ఆత్మవాన్ - జితేంద్రియుడై, అదూరాత్ - తొందరగా, సిద్ధ్యతి - కృతార్థుడగుచున్నాడు, తథా - ఆ విధముగా, ఇంద్రియప్రియః - ఇంద్రియములయందు ప్రీతి గలవాడు, న - అగుట లేదు.

మాకు ఇల్లు, స్త్రీ (పురుషుడు), సంతానము, ధనము, బంధువులు అనువాటియందు ఆసక్తి ఉండకుండు గాక! ఒకచో ఉన్ననూ, అది భగవద్భక్తులయందు మాత్రమే ఉందు గాక! అట్టి ఆసక్తి గల వ్యక్తి ప్రాణములను నిలబెట్టుకొనుటకు సరిపడే ఆహారముతో సంతుష్టుడై, ఇంద్రియములను వశపరచుకొని, శీఘ్రముగా జీవన్ముక్తుడగును. కాని, అట్లు గాక ఇంద్రియభోగములయందు ప్రీతి గల వ్యక్తి ఆ తీరున కృతార్థుడు కాలేడు.

యత్సంగలబ్ధం నిజవీర్యవైభవం
తీర్థం ముహుస్సంస్పృశతాం హి మానసమ్ ।
హరత్యజోఽంతశ్శ్రుతిభిర్గతోఽంగజం
కో వై న సేవేత ముకుందవిక్రమమ్ ॥ 11

యత్-సంగలబ్ధమ్ - ఏ భగవద్భక్తులతోడి సంగము వలన పొందబడినది, నిజవీర్యవైభవమ్ - తన (అసాధారణమైన) ప్రభావముయొక్క

అతిశయము కలది, తీర్థమ్ - పావనము చేయునది అగు, ముకుందవిక్ర మమ్ - శ్రీహరియొక్క కీర్తిని, శ్రుతిభిః - వినుటలచే, ముహుః - మాటిమా టికీ, సంస్పృశతామ్ - సేవించువారలకు, అంతః - హృదయమునందు, గతః - చేరిన, అజః - పుట్టుక లేని శ్రీహరి, మానసమ్ - మనస్సునకు చెందిన దోషమును, అంగజమ్ - దేహమునందు కలిగే దోషమును, హరతి - తొలగించును, కః వై - ఎవ్వాడు, న సేవేత - సేవించకుండును?

అసాధారణమైన ప్రభావాతిశయము గల ముకుందుని (మోక్షముని చ్చువాని) కీర్తి మానవులను పావనము చేయును. అది భగవద్భక్తులతోడి సంగము వలన లభించును. దానిని పలుమార్లు వింటూ సేవించే వారల హృదయమునందు పుట్టుక లేని శ్రీహరి ప్రకటమై, వారి మనస్సులలోని మాలిన్యమును మరియు దేహదోషములను కూడ తొలగించి వేయును. అట్టి భగవద్భక్తులతోడి సంగమును ఎవ్వాడు చేయకుండును?

యస్యాస్తి భక్తిర్భగవత్యకించనా
సర్వైర్గుణైస్తత్ర సమాసతే సురాః ।
హరావభక్తస్య కుతో మహద్గుణా
మనోరథేనాసతి ధావతో బహిః ॥ 12

యస్య - ఎవనికైతే, భగవతి - భగవానునియందు, అకించనా - లేశమైననూ కామన లేని, భక్తిః - భక్తి, అస్తి - కలదో, తత్ర - వానియందు, సర్వైః - అన్ని, గుణైః - గుణములతో, సురాః - దేవతలు, సమాసతే - చక్కగా నివసించెదరు, హరౌ - శ్రీహరియందు, అభక్తస్య - భక్తి లేనట్టి యు, మనోరథేన - కోరికతో, అసతి - మిథ్యయగు, బహిః - బాహ్యము నందు, ధావతః - పరుగెత్తువానికి, మహద్-గుణాః - మహాత్ముల గుణము లు, కుతః - ఎక్కడివి?

భగవంతునియందు నిష్కామభక్తి గలవానియందు అన్ని గుణము లతో బాటుగా దేవతలు కూడ నిత్యము నివసించెదరు. శ్రీహరియందు భక్తి లేక మిథ్యయగు బాహ్యసంసారమునందు కోరికలను తీర్చుకొనుటకై పరు గులు తీయువానికి మహాత్ముల గుణములు ఎట్లు అబ్బును?

హరిర్హి సాక్షాద్భగవాన్ శరీరిణా-
మాత్మా ఝషాణామివ తోయమీప్సితమ్ ।
హిత్వా మహాంస్తం యది సజ్జతే గృహే
తదా మహత్త్వం వయసా దంపతీనామ్ ॥ 13

హరిః భగవాన్ - శ్రీహరి భగవానుడు, సాక్షాత్ - సాక్షాత్తుగా, శరీరిణామ్ - దేహధారులకు, ఝషాణామ్ - చేపలకు, ఈప్సితమ్ - అభీష్టమైన, తోయం ఇవ - నీరు వలె, ఆత్మా - ఆత్మ, మహాన్ - గొప్పవాడైననూ, తమ్ - ఆ శ్రీహరిని, హిత్వా - విడిచిపెట్టి, గృహే - ఇంటియందు, యది సజ్జతే - ఆసక్తి గలవాడైనచో, తదా - అప్పుడు, దంపతీనామ్ - దంపతులకు, మహత్త్వమ్ - విలువ, వయసా హి - వయస్సుచే మాత్రమే.

సాక్షాత్తుగా శ్రీహరి భగవానుడే సకలప్రాణులకు, చేపలకు అభీష్టమగు నీరు వలె, ప్రియమగు ఆత్మయై ఉన్నాడు. ఆయనను విడిచిపెట్టి దంపతులు ఎంతటి గొప్పవారైననూ, కేవలము గృహసుఖములయందు మాత్రమే ఆసక్తి గలవారైనచో, వారికి విలువ వయస్సును బట్టి మాత్రమే (అనగా, గుణములను బట్టి కాదు).

తస్మాద్రజోరాగవిషాదమన్యు-
మానస్పృహాభయదైన్యాధిమూలమ్ ।
హిత్వా గృహం సంసృతిచక్రవాలం
నృసింహపాదం భజతాఽకుతోభయమితి ॥ 14

తస్మాత్ - అందువలన, రజః-రాగవిషాదమన్యుమానస్పృహాభయదైన్య-ఆధిమూలమ్ - తృష్ణ రాగము దుఃఖము కోపము గర్వము కోరికలు భయము దీనత మరియు మనోవ్యాధులకు మూలమైనట్టియు, సంసృతిచక్రవాలమ్ - జన్మమరణపరంపరకు మండలము అయిన, గృహమ్ - ఇంటిని, హిత్వా - విడిచిపెట్టి, అకుతోభయమ్ - దేనివలనైననూ భయము లేని, నృసింహపాదమ్ - నరసింహుని పాదమును, భజత - సేవించుడు, ఇతి - అని.

జన్మమరణపరంపరకు నిలయమైన ఈ సంసారము తృష్ణ, రాగము, దుఃఖము, కోపము, గర్వము, కోరికలు, భయము, దీనత మరియు మనోవ్యాధులకు మూలము. కావున, దీనిని విడిచిపెట్టి నరసింహుని పాదమును సేవించుడు. అట్లు చేయువారికి దేనివలనైననూ భయము ఉండదు అని స్తుతించుచున్నాడు.

**కేతుమాలేऽపి భగవాన్ కామదేవస్వరూపేణ లక్ష్మ్యాః ప్రియ చికీర్షయా ప్రజాపతేర్దుహితౄణాం పుత్రాణాం తద్వర్షపతీనాం పురుషాయుషాऽహోరాత్రపరిసంఖ్యానానాం యాసాం గర్భా మహాపురుషమహాస్త్రతేజసోద్వేజితమనసాం విధ్వస్తా వ్యసవ స్సంవత్సరాంతే వినిపతంతి ॥ 15**

కేతుమాలే అపి - కేతుమాల ఖండమునందు కూడ, భగవాన్ - శ్రీహరి, లక్ష్మ్యాః - లక్ష్మీదేవికి, ప్రజాపతేః - ప్రజాపతికి, తద్-వర్షపతీనామ్ - ఆ ఖండమునకు ప్రభువులైనట్టియు, పురుష-ఆయుషా - మానవుని ఆయుర్దాయముచే, అహోరాత్రపరిసంఖ్యానానామ్ - పగలు రాత్రుల లెక్క కలిగిన, దుహితౄణామ్ - కుమార్తెలకు, పుత్రాణామ్ - పుత్రులకు, ప్రియచికీర్షయా - ప్రీతిని కలిగించవలెననే కోరికతో, కామదేవస్వరూపేణ - కామదేవుని (ప్రద్యుమ్ను) రూపముతో, మహాపురుషమహా-అస్త్రతేజసా - పురుషోత్తముడగు శ్రీహరియొక్క గొప్ప ఆయుధమగు కాలచక్రము యొక్క తేజస్సుచే, ఉద్వేజితమనసామ్ - కలవరపాటు కలిగించబడిన మనస్సులు గల, యాసామ్ - ఏ కుమార్తెలయొక్క, గర్భాః - గర్భములు, విధ్వస్తాః - నశింప జేయబడినవై, వ్యసవః - ప్రాణములను కోల్పోయినవై, సంవత్సర-అంతే - సంవత్సరముయొక్క ఆఖరున, వినిపతంతి - పడిపోవుచున్నవో.

కేతుమాల వర్షమునందు కూడ భగవానుడు కామదేవుడగు ప్రద్యుమ్నుని రూపములో నున్నవాడై లక్ష్మీదేవికి మాత్రమే గాక, సంవత్సరాభిమానియగు ప్రజాపతికి, ఆ కేతుమాల వర్షమునకు ప్రభువులగు ప్రజాపతి పుత్రులకు, పుత్రికలకు కూడ ప్రీతిని కలిగించుచున్నాడు. పగటికి అభిమాన

దేవతలే ఆ ప్రజాపతికి పుత్రులు కాగా, రాత్రి అభిమాని దేవతలు ఆయన పుత్రికలు. మానవుని ఆయుర్దాయము వంద సంవత్సరములు, అనగా ముప్పై ఆరువేల పగళ్లు, అదే సంఖ్యలో రాత్రులు కలవు. సంవత్సర ప్రజా పతియొక్క పుత్రులు, పుత్రికల సంఖ్య కూడ అంతే. పురుషోత్తముడగు శ్రీహరికి కాలచక్రమే గొప్ప ఆయుధము. దాని తేజస్సునకు రాత్రిరూపము లోనున్న ఆ పుత్రికలకు మనస్సులో చాల భయము కలుగుచుండును. ప్రతి సంవత్సరమునకు అంతమునందు వారి గర్భములు నశించి ప్రాణములను కోల్పోయి పడిపోవుచుండును. (నిముషము, గంట, రోజు, పక్షము, నెల అనే కాలావయవములే గర్భములు. అవి పడిపోవుట యనగా, సంవత్స రము పూర్తి అగుసరికి అవి అన్నీ ఆ సంవత్సరములో విలీనమగుటయే).

అతీవ సులలితగతివిలాసవిలసితరుచిరహాసలేశావలోకలీ
లయా కించిదుత్తంభితసుందరభ్రూమండలసుభగవదనారవిం
దశ్రియా రమాం రమయన్నింద్రియాణి రమయతే ।। 16

సులలితగతివిలాసవిలసితరుచిరహాసలేశ-అవలోకలీలయా - మిక్కిలి మనోహరమైన నడకయొక్క ఠీవిచే సుందరముగా చేయబడిన అందమైన చిరునవ్వుతోడి చూపుయొక్క లీలచే, కించిద్-ఉత్తంభితసుందర భ్రూమండలసుభగవదన-అరవిందశ్రియా - కొంచెము పైకి విరువబడిన అందమైన గుండ్రని కనుబొమలచే సుందరమైన పద్మమువంటి ముఖము యొక్క శోభతో, రమామ్ - లక్ష్మీదేవిని, అతీవ - మిక్కిలి, రమయన్ - రమింప జేయుచున్నవాడై, ఇంద్రియాణి- ఇంద్రియములను, రమయతే - ఉల్లాసమును కలిగించుచున్నాడు.

శ్రీహరియొక్క అధికముగా శోభించే అందమైన చిరునవ్వుతో కూడిన చూపుయొక్క లీల, మిక్కిలి మనోహరమైన నడకయొక్క ఠీవిచే మరింత ఇనుమడించుచుండెను. ఆయన గుండ్రని అందమైన కనుబొమ లను కొంచెము పైకి విరిచినప్పుడు పద్మమువంటి ముఖముయొక్క శోభ ఇనుమడించుచుండెను. ఈ విధముగా ఆయన అచట లక్ష్మీదేవికి అధిక మగు ఉల్లాసమును కలిగిస్తూ, తాను కూడ ఇంద్రియములను రమింప జేయుచుండును.

**తద్భగవతో మాయామయం రూపం పరమసమాధియోగేన రమా దేవీ సంవత్సరస్య రాత్రిషు ప్రజాపతేర్దుహితృభిరుపేతా ऽహస్సు చ తద్భర్తృభిరుపాస్తే ఇదం చోదాహరతి ॥ 17**

భగవతః - భగవానుని, **తత్** - ఆ, మాయామయమ్ - మాయాకార్యమగు, రూపమ్ - రూపమును, రాత్రిషు - రాత్రులయందు, ప్రజాపతేః సంవత్సరస్య - సంవత్సర ప్రజాపతియొక్క, దుహితృభిః - కుమార్తెలతో, అహస్సు చ - పగళ్లయందు కూడ, తద్-భర్తృభిః - వారి భర్తలతో, ఉపేతా - కూడియున్న, రమా దేవీ - లక్ష్మీదేవి, పరమసమాధియోగేన - తీవ్రమగు చిత్తైకాగ్రతయొక్క అభ్యాసముచే, ఉపాస్తే - ఉపాసించుచున్నది, చ - మరియు, ఇదమ్ - ఈ మంత్రమును, ఉదాహరతి - ఉచ్చరించుచున్నది.

భగవానుని మాయామయమగు ఆ రూపమును లక్ష్మీదేవి, రాత్రులయందు సంవత్సర ప్రజాపతియొక్క కుమార్తెలగు రాత్రిదేవతలతో, పగళ్లయందు పగళ్లకు అభిమానులగు దేవతలతో కూడినదై, తీవ్రమగు చిత్తైకాగ్రతను అభ్యసిస్తూ, ఉపాసించుచున్నది. ఆమె ఈ క్రింది మంత్రమును కూడ ఉచ్చరించుచున్నది.

**ఓం హ్రాం హ్రీం హ్రూం ఓం నమో భగవతే హృషీకేశాయ సర్వగుణవిశేషైర్విలక్షితాత్మనే ఆకూతీనాం చిత్తీనాం చేతసాం విశేషాణాం చాధిపతయే షోడశకలాయ చ్ఛందోమయాయా న్నమయాయామృతమయాయ సర్వమయాయ సహసే ఓజసే బలాయ కాంతాయ కామాయ నమస్తే ఉభయత్ర భూయాత్ ॥ 18**

హృషీక-ఈశాయ - ఇంద్రియములకు నియామకుడైనట్టియు, సర్వగుణవిశేషైః - అందరిచే విశిష్టములగు గుణములచే (గుణకార్యములగు పృథివి మొదలగు వాటిచే), **లక్షిత-ఆత్మనే** - తెలియబడే స్వరూపము గలిగినట్టియు, **ఆకూతీనామ్** - కర్మేంద్రియములకు, చిత్తీనామ్ - జ్ఞానేంద్రియములకు, చేతసామ్ - మనస్సు బుద్ధి చిత్తము అహంకారముల

కు, విశేషాణాం చ - శబ్దము మొదలగు విషయములకు కూడ, అధిపతయే - అధీశ్వరుడైనట్టియు, షోడశకలాయ - పదునారు కళలు కలిగినట్టియు, ఛందోమయాయ - వేదమంత్రముల రూపములో నున్నట్టియు, అన్నమయాయ - ఆహారము రూపములో నున్నట్టియు, అమృతమయాయ - అమృతస్వరూపుడైనట్టియు, సర్వమయాయ - సర్వము రూపములో నున్నట్టియు, సహసే - మనశ్శక్తిరూపుడైనట్టియు, ఓజసే - ఇంద్రియశక్తి రూపుడైనట్టియు, బలాయ - దేహశక్తి రూపుడైనట్టియు, కాంతాయ - సుందరుడైనట్టియు, భగవతే కామాయ - కామదేవుడవగు, తే - నీ కొరకు, ఉభయత్ర - ఇహపరములయందు (లోపల బయట), నమః నమః - మరల మరల నమస్కారము, భూయాత్ - అగుగాక!

ఓం హ్రాం హ్రీం హ్రూం (హృదయములోనుండువాడు, పాపములను పోగొట్టువాడు అని ఈ బీజమంత్రములకు అర్థము) ఓమ్. ఓ కామదేవా! నీవు ఈ దేహమునందలి కర్మేంద్రియములకు, జ్ఞానేంద్రియములకు, మనస్సు బుద్ధి చిత్తము అహంకారము అనే మనోవృత్తి విశేషములకు, ఆ ఇంద్రియముల ద్వారా గ్రహించబడే శబ్దస్పర్శరూపరసగంధములనే విషయములకు కూడ అధీశ్వరుడవు. నీ అఖండసత్తాస్వరూపమును త్రిగుణాత్మికయగు మాయాకార్యములైన పంచభూతముల ద్వారా జనులు లక్షించగల్గుచున్నారు (నీ సకలకల్యాణగుణములచే నీ సగుణస్వరూపమును భక్తులు తెలియుచున్నారు). ఈ ఉపాధియందు పదకొండు ఇంద్రియములు, అయిదు భూతములు వెరసి పదునారు అంశములు గల జీవుని రూపములో నీవే ఉన్నావు. వేదమంత్రస్వరూపుడవు, అమృతస్వరూపుడవు అగు నీవే మేము తినే ఆహారము రూపముగా మాత్రమే గాక, సర్వము రూపముగా నున్నావు. మా మనస్సులో, ఇంద్రియములలో మరియు దేహములోనుండే శక్తులు అన్నీ నీవే. అతిసుందరుడవగు నీకు ఇహపరములయందు లోపల బయట కూడ అనేక నమస్కారములు అగుగాక!

స్త్రియో వ్రతైస్త్వా హృషికేశ్వరం స్వతో
హ్యారాధ్య లోకే పతిమాశాసతేఽన్యమ్ ।

తాసాం న తే వై పరిపాంత్యపత్యం
ప్రియం ధనాయూంషి యతోఽస్వతంత్రాః ।। 19

లోకే - లోకమునందు, స్త్రియః - స్త్రీలు, హృషిక-ఈశ్వరమ్ - ఇంద్రియములకు ప్రభుడవగు, త్వా - నిన్ను, స్వతః - స్వతంత్రముగా, వ్రతైః - వ్రతములచే, ఆరాధ్య - పూజించి, అన్యమ్ - మరియొకనిని, పతిమ్ - భర్తనుగా, ఆశాసతే - ప్రార్థించుచున్నారు, తే వై - ఆ భర్తలు, తాసామ్ - ఆ స్త్రీలయొక్క, అపత్యమ్ - సంతానమును, ప్రియమ్ - ప్రియమైన వస్తువును, ధన-ఆయూంషి - ధనములను ఆయుర్దాయముల ను, న పరిపాంతి - రక్షించుట లేదు, యతః - ఏలయనగా, అస్వతంత్రాః - స్వతంత్రులు కారు.

లోకములో స్త్రీలు ఇంద్రియాధిపతివగు నిన్ను స్వతంత్రముగా వ్రతములతో పూజించి, మరియొక వ్యక్తిని భర్తగా కోరెదరు. కాని, ఆ వ్యక్తులు అస్వంతత్రులగుటచే, ఆ స్త్రీలయొక్క సంతానమును, ధనము ను, ఆయుర్దాయమును, ఇతరప్రియవస్తువులను రక్షించలేరు.

స వై పతిస్స్యాదకుతోభయస్స్వయం
సమంతతః పాతి భయాతురం జనమ్ ।
స ఏక ఏవేతరథా మిథో భయం
నైవాత్మలాభాదధి మన్యతే పరమ్ ।। 20

స్వయమ్ - తాను, అకుతోభయః - దేనివలనైననూ భయము లేనివాడు, భయ-ఆతురమ్ - భయము వలన కంగారు పడుచున్న, జనమ్ - జనుని, సమంతతః - అన్ని విధములుగా, పాతి - రక్షించును, సః వై - అట్టివాడు మాత్రమే, పతిః - రక్షకుడు, స్యాత్ - అగును, సః - అట్టివాడు, ఏకః ఏవ - ఒక్కడు మాత్రమే, ఇతరథా - ఇతరుల విషయమునందు, మిథః - పరస్పరము, భయమ్ - భయము, ఆత్మలాభాత్ - ఆత్మను పొందుట కంటె, పరమ్ - మరియొకటి, అధి - గొప్పదిగా, న ఏవ మన్యతే - భావించబడుటనే లేదు.

ఎవడైతే స్వయముగా దేనివలనైననూ భయపడడో, అట్టివాడు మాత్రమే భయముతో కంగారు పడుచున్న జనుని అన్ని విధములుగా రక్షించి, రక్షకుడు అగును. అట్టి రక్షకుడు ఆత్మరూపుడవగు నీవు మాత్రమే. ఇతరులనాశ్రయించినచో, ఒకరి వలన మరియొకనికి భయము కలుగుచునే యుండును. ఆత్మను జ్ఞానముచే పొందుటకంటె గొప్ప పురుషార్థము మరియొకటి గలదని మహాత్ములు పరిగణించుటనే లేదు.

యా తస్య తే పాదసరోరుహార్హణం
నికామయేత్సాఽఖిలకామలంపటా ।
తదేవ రాసీప్సితమీప్సితోఽర్చితో
యద్భగ్నయాచ్ఞా భగవన్ ప్రతప్యతే ॥ 21

భగవన్ - ఓ భగవానుడా!, యా - ఏ స్త్రీ, తస్య - అట్టి, తే - నీ, పాదసరః-రుహ-అర్హణమ్ - పాదపద్మముల పూజను, నికామయేత్ - సుతరాము కోరునో, సా - ఆమె, అఖిలకామలంపటా - అన్ని కామనలను పొందునది, ఈప్సితః - ఫలమును కోరబడినవాడవై, అర్చితః - పూజింపబడిన నీవు, తత్ - ఆ, ఈప్సితం ఏవ - ఫలమును మాత్రమే, రాసి - ఇచ్చెదవు, యత్ - దేనిని గురించి, భగ్నయాచ్ఞా - వినష్టమైన కోరబడిన ఫలము గలదియై, ప్రతప్యతే - చాల తాపమును పొందునో.

ఓ భగవానుడా! అట్టి రక్షకుడవగు నీ పాదపద్మములను నిష్కామముగా పూజించే స్త్రీ అన్ని కామనలను పొందును. అట్లు గాక, ఏదో ఒక ఫలమును కోరి పూజించే వ్యక్తికి నీవు ఆ ఫలమును మాత్రమే ఇచ్చెదవు. కాని, భోగముతో ఆ ఫలము అంతమైనప్పుడు, ఆ వ్యక్తి అధికమగు దుఃఖమును పొందును.

మత్ప్రాప్తయేఽజేశసురాసురాదయః
తప్యంత ఉగ్రం తప ఐంద్రియేధియః ।
ఋతే భవత్పాదపరాయణాన్న మాం
విందంత్యహం త్వద్ధృదయా యతోఽజిత ॥ 22

అజిత - పరాజయము నెరుగనివాడా!, ఐంద్రియేధియః - ఇంద్రియభోగములయందు మాత్రమే మనస్సు గల, అజ-ఈశసుర-అసుర-ఆదయః - బ్రహ్మగారు రుద్రుడు దేవతలు రాక్షసులు మొదలగువారు, మత్-ప్రాప్తయే - నన్ను పొందుట కొరకై, ఉగ్రమ్ - కఠినమగు, తపః - తపస్సును, తప్యంతే - చేయుచున్నారు. భవత్-పాదపరాయణాత్ ఋతే - నీ పాదములే సర్వము అయినవానిని మినహాయించి, మామ్ - నన్ను, న విందంతి - పొందుట లేదు, యతః -ఏలయనగా, అహమ్ - నేను, త్వత్-హృదయా - నీయందే హృదయము గలదానను.

ఓ భగవానుడా! నీవు పరాజయమునెరుంగవు. బ్రహ్మగారు, రుద్రుడు, దేవతలు, రాక్షసులు మొదలగువారు ఇంద్రియభోగములయందు తగుల్కొన్న మనస్సులు గలవారై, నన్ను పొందగోరి, కఠినమగు తపస్సును చేయుచుందురు. కాని, నీవే పరమపురుషార్థముగా గల భక్తుడు మాత్రమే నన్ను పొందగల్గును. ఇతరులు నన్ను పొందలేరు. ఏలయనగా, నా హృదయములో నీవే ఉన్నావు.

స త్వం మమాప్యచ్యుత శీర్ష్ణి వందితం
కరాంబుజం యత్త్వదధాయి సాత్వతామ్ ।
బిభర్షి మాం లక్ష్మ వరేణ్య మాయయా
క ఈశ్వరస్యేహితమూహితుం విభురితి ॥ 23

అచ్యుత - ఓ అచ్యుతా!, త్వమ్ - నీవు, వందితమ్ - స్తుతించబడిన, కర-అంబుజమ్ - పద్మమువంటి చేతిని, మమ - నా, శీర్ష్ణి అపి - తలపై కూడ, యత్ - ఎయ్యది, త్వత్ - నీచే, సాత్వతామ్ - సాత్వతవంశీయుల (లేదా, భక్తుల, తలపై), అధాయి - ఉంచబడినదో, వరేణ్య - ఓ పురుషోత్తమా!, మామ్ - నన్ను, మాయయా - మాయచే, లక్ష్మ - చిహ్నముగా, బిభర్షి - ధరించుచున్నావు, ఈశ్వరస్య - ఈశ్వరుడవగు నీ, ఈహితమ్ - అభిప్రాయమును, ఊహితుమ్ - తెలియుటకు, కః - ఎవ్వాడు, విభుః - సమర్థుడు?, ఇతి - అని.

ఓ అచ్యుతా! (పూర్ణస్వరూపమునుండి జారుట లేనివాడా!) నీవు నీ పూజనీయమగు పద్మమువంటి చేతిని సత్త్వగుణప్రధానులగు భక్తుల (సాత్వతవంశీయుల, అనగా యాదవుల) శిరస్సుపై నుంచి అనుగ్రహించితివి. ఆ చేతిని నా శిరస్సుపై కూడ ఉంచి అనుగ్రహించుము. ఓ పురుషోత్తమా! నీవు నీ మాయాశక్తిచే నన్ను వక్షఃస్థలముపై చిహ్నముగా ధరించుచున్నావు. నీ ఆశయమును (నీవు మాయచే చేసే లీలలను) తెలుసుకొనే సామర్థ్యము ఎవరికి గలదు? అని స్తుతించుచున్నది.

రమ్యకే చ భగవతః ప్రియతమం మాత్స్యమవతారరూపం తద్వర్షపురుషస్య మనోః ప్రాక్ప్రదర్శితం స ఇదానీమపి మహతా భక్తియోగేనారాధయతీదం చోదాహరతి ॥ 24

రమ్యకే చ - రమ్యకవర్షమునందు కూడ, భగవతః - భగవానునకు, ప్రియతమమ్ - మిక్కిలి ప్రియమైనట్టియు, తద్-వర్షపురుషస్య - ఆ ఖండమునకు ప్రభువైన, మనోః - శ్రాద్ధదేవ మనువునకు, ప్రాక్ - పూర్వము, ప్రదర్శితమ్ - చూపబడిన, మాత్స్యం అవతారరూపమ్ - మత్స్యావతారముయొక్క రూపమును, సః - ఆ మనువు, ఇదానీం అపి - ఇప్పుడు కూడ, మహతా - గొప్ప, భక్తియోగేన - భక్తియోగముతో, ఆరాధయతి - ఆరాధించుచున్నాడు, ఇదం చ - ఈ మంత్రమును కూడ, ఉదాహరతి - జపించుచున్నాడు.

భగవానుడు పూర్వము (చాక్షుష మన్వంతరము తరువాత) రమ్యకవర్షమునందు మత్స్య (చేప) రూపముగా అవతరించి, ఆ అవతారమును ఆ వర్షమునకు ప్రభువగు శ్రాద్ధదేవ మనువునకు చూపినాడు. ఆ మనువు ఇప్పటికీ అచట తనకు మిక్కిలి ప్రియమైన ఆ రూపమును గొప్ప భక్తియోగముతో ఆరాధిస్తూ, ఈ క్రింది మంత్రమును జపించుచున్నాడు.

ఓం నమో భగవతే ముఖ్యతమాయ నమస్సత్త్వాయ ప్రాణాయౌజసే సహసే బలాయ మహామత్స్యాయ నమ ఇతి ॥25

ఓమ్, ముఖ్యతమాయ ప్రాణాయ - ముఖ్యప్రాణమగు సూత్రాత్మ (సకలజగత్తులోని శక్తియే స్వరూపముగా గలవాడు) అయినట్టియు,

సత్త్వాయ - సత్త్వగుణప్రధానుడైనట్టియు, సహసే - మనశ్శక్తిరూపుడైనట్టియు, ఓజసే - ఇంద్రియశక్తి రూపుడైనట్టియు, బలాయ - దేహశక్తి రూపుడైన, మహామత్స్యాయ - గొప్ప చేప కొరకు, నమః నమః నమః - అనేక నమస్కారములు, ఇతి - అని.

ఓమ్. సకలజగత్తు శక్తిస్వరూపుడగు పరమేశ్వరుని (సూత్రాత్మ) విలాసయే. ఆ సూత్రాత్మయే మా ముఖమునందలి ప్రాణవాయుసంచార రూపముగా ప్రకటమగుచున్నాడు. సత్త్వగుణప్రధానుడగు ఆ పరమేశ్వరుడే మా మనస్సులో, ఇంద్రియములలో మరియు దేహములోనుండే శక్తులను అనుగ్రహించుచున్నాడు. పెద్ద చేపగా అవతరించిన ఆ భగవానునకు అనేక నమస్కారములు.

అంతర్బహిశ్చాఖిలలోకపాలకై-
రదృష్టరూపో విచరస్యురుస్వనః ।
స ఈశ్వరస్త్వం య ఇదం వశేఽనయ-
న్నామ్నా యథా దారుమయీం నరః స్త్రియమ్ ॥ 26

ఉరుస్వనః - పెద్ద ధ్వని గలవాడవు, ఈశ్వరః - ఈశ్వరుడవు అగు, సః - అట్టి, త్వమ్ - నీవు, అఖిలలోకపాలకైః - అందరు లోకపాలకులచే, అదృష్టరూపః - కానరాని రూపము గలవాడవై, అంతః - లోపల, బహిః చ - బయట కూడ, విచరసి - సంచరించుచున్నావు, యః - ఏ నీవు, దారుమయీమ్ - చెక్కతో చేసిన, స్త్రియమ్ - స్త్రీని, నరః యథా - మానవుడు వలె, ఇదమ్ - ఈ జగత్తును, నామ్నా - పేరుతో, వశే - వశమునందు, అనయత్ - నియమించెనో.

వేదమనే గొప్ప ధ్వని గల ఈశ్వరుడవు నీవే. నీవు ప్రాణులకు లోపల (ప్రాణము), బయట (వాయువు) కూడ శక్తిస్వరూపుడవై సంచరించుచున్ననూ, నీ రూపమును లోకపాలకులందరు కూడ కనుగొనలేకున్నారు. అనేకరూపములతో కూడియున్న ఈ జగత్తును నీవు అయా పేర్లతో నీ వశములో నుంచుకొని, చెక్కబొమ్మను మనిషి ఆడించే విధముగా, నియ

మించుచున్నావు. (జగత్తు నామరూపములు మాత్రమే. నామరూపములు మిథ్య. వాటి వాస్తవిక స్వరూపము అధిష్ఠానమగు ఈశ్వరసత్తయే).

యం లోకపాలాః కిల మత్సరజ్వరా
హిత్వా యతంతోఽపి పృథక్ సమేత్య చ ।
పాతుం న శేకుర్ద్విపదశ్చతుష్పదః
సరీసృపం స్థాణు యదత్ర దృశ్యతే ॥ 27

యమ్ - ఏ నిన్ను, హిత్వా - విడిచిపెట్టి, మత్సరజ్వరాః - ఈర్ష్య అనే జ్వరము గల, లోకపాలాః - లోకపాలకులు, పృథక్ - వేర్వేరుగా గాని, సమేత్య చ - కలిసి కూడ, యతంతః అపి - ప్రయత్నము చేయువారే అయిననూ, ద్విపదః - రెండు కాళ్ల ప్రాణులను, చతుష్పదః - నాలుగు కాళ్ల ప్రాణులను, సరీసృపమ్ - పాకే ప్రాణిని, స్థాణు - కదలని ప్రాణిని, పాతుమ్ - రక్షించుటకు, న శేకుః - సమర్థులు కాలేదో, యత్ - ఏ ప్రాణి, అత్ర - ఈ జగత్తునందు, దృశ్యతే - కనబడుచున్నదో.

రెండు కాళ్లు గలవి (మానవులు), నాలుగు కాళ్లు గలవి, పాకేవి, కదలనివి అని ఈ జగత్తులో పలు రకముల ప్రాణులు కనబడుచున్నవి. ఈర్ష్య అనే జ్వరము గల లోకపాలకులు వేర్వేరుగా గాని, కలిసి గాని ప్రయత్నము చేసిననూ, ఈ ప్రాణులను రక్షించలేరు. ఈ ప్రాణులను అన్నింటినీ రక్షించేది ప్రాణస్వరూపుడవగు నీవు మాత్రమే (ప్రాణికి రక్షణనిచ్చేది ప్రాణమే గాని, ఇంద్రియములు కావు. ఆ ప్రాణము ఈశ్వరుడే).

భవాన్ యుగాంతార్ణవ ఊర్మిమాలిని
క్షోణీమిమామోషధివీరుధాం నిధిమ్ ।
మయా సహోరు క్రమతేఽజ ఓజసా
తస్మై జగత్ప్రాణగణాత్మనే నమ ఇతి ॥ 28

అజ - పుట్టుక లేనివాడా!, ఊర్మిమాలిని - కెరటముల మాలలు గల, యుగ-అంత-అర్ణవే - ప్రళయకాలసముద్రమునందు, ఓషధివీరుధామ్ - పంటమొక్కలకు తీగలకు, నిధిమ్ - నిలయమగు, ఇమామ్ - ఈ,

క్షోణీమ్ - భూమిని, మయా సహ - నాతో గూడి, ఉరు - అధికముగా, ఓజసా - వేగము (బలము) తో, భవాన్ - నీవు, క్రమతే - ముందుకు నడచుచున్నావు, జగత్-ప్రాణగణ-ఆత్మనే - జగత్తులోని ప్రాణుల సముదాయమునకు ఆత్మవగు, తస్మై - అట్టి నీ కొరకు, నమః - నమస్కారము, ఇతి - అని.

పుట్టుక లేని ఓ ప్రభూ! పెద్ద కెరటముల పంక్తులతో నిండియున్న ప్రళయకాలసముద్రములో మునిగిపోవుచున్న ఈ భూమిని నా (మనువు) తో సహా కాపాడుతూ, నీవు మత్స్యరూపములో గొప్ప బలముతో వేగముగా ముందుకు సాగినావు. పంటమొక్కలకు, తీగలకు ఈ భూమి ఆశ్రయము. జగత్తులోని ప్రాణుల సమూహమునకు సర్వశక్తిస్వరూపుడవగు నీవే (సూత్రాత్మ) ఆత్మవు. నీకు నమస్కారము అని మనువు స్తుతించెను.

హిరణ్మయేఽపి భగవాన్నివసతి కూర్మతనుం బిభ్రాణస్తస్య
తత్ప్రియతమాం తనుమర్యమా సహ వర్షపురుషైః పితృగణా
ధిపతిరుపధావతి మంత్రమిమం చానుజపతి ॥ 29

హిరణ్మయే అపి - హిరణ్మయ వర్షమునందు కూడ, కూర్మతనుమ్ - తాబేలు రూపమును, బిభ్రాణః - ధరించుచున్న, భగవాన్ - భగవానుడు, నివసతి - నివసించుచున్నాడు, తస్య - ఆయనయొక్క, తత్-ప్రియతమామ్ - ఆ మిక్కిలి ప్రియమైన, తనుమ్ - రూపమును, పితృగణ-అధిపతిః - పితృదేవతల గణములకు అధిపతియగు, అర్యమా - అర్యముడు, వర్షపురుషైః సహ - ఆ ఖండమునందలి పురుషులతో గూడి, ఉపధావతి - సేవించుచున్నాడు, ఇమమ్ - ఈ, మంత్రం చ - మంత్రమును కూడ, అను - నిరంతరముగా, జపతి - జపించుచున్నాడు.

హిరణ్మయ వర్షమునందు కూడ భగవానుడు తాబేలు రూపమును దాల్చి నివసించుచున్నాడు. మిక్కిలి ప్రియమైన ఆ రూపమును పితృగణములకు అధిపతియగు అర్యముడు, ఆ ఖండములోని జనులతో గూడి సేవిస్తూ, ఈ మంత్రమును కూడ నిరంతరముగా జపించుచున్నాడు.

ఓం నమో భగవతే అకూపారాయ సర్వసత్త్వగుణవిశేషణా
యానుపలక్షితస్థానాయ నమో వర్ష్మణే నమో భూమ్నే నమో
నమోఽవస్థానాయ నమస్తే ।। 30

ఓమ్, సర్వసత్త్వగుణవిశేషణాయ - పూర్ణమగు సత్త్వగుణము విశేషణముగా గలిగినట్టియు, అనుపలక్షితస్థానాయ - ప్రత్యక్షము కాని స్థానము కలిగినట్టియు, వర్ష్మణే - కాలమునకు అతీతుడైనట్టియు, భూమ్నే - సర్వవ్యాపకుడైనట్టియు, అవస్థానాయ - సర్వమునకు అధిష్ఠానమైనట్టియు, భగవతే - భగవానుడవైనట్టియు, అకూపారాయ - ఆదికూర్మడవైన, తే - నీ కొరకు, నమః నమః నమః --- - అనేక నమస్కారములు.

ఓమ్. ఓ ఆదికూర్మ భగవానుడా! పూర్ణసత్త్వస్వరూపుడవగు నీవు నీటిలో కానరాకుండ దాగియుందువు. కాలాతీతుడవగు నీవు సర్వవ్యాపకుడవు, సర్వమునకు అధిష్ఠానమవు. నీకు అనేక నమస్కారములు.

యద్రూపమేతన్నిజమాయయాఽర్పిత-
మర్థస్వరూపం బహురూపరూపితమ్ ।
సంఖ్యా న యస్యాస్త్యయథోపలంభనాత్
తస్మై నమస్తేఽవ్యపదేశరూపిణే ।। 31

నిజమాయయా - తన మాయాశక్తిచే, అర్పితమ్ - ప్రకాశింప జేయబడునట్టియు, అర్థస్వరూపమ్ - సర్వపదార్థముల రూపములో నున్నట్టియు, బహురూపరూపితమ్ - అనేకరూపములచే నిరూపింపబడే, ఏతత్ - ఈ జగత్తు, యద్-రూపమ్ - ఎవని రూపమో, అయథా-ఉపలంభనాత్ - మిథ్యగా తెలియబడుట వలన, యస్య - ఏ జగత్తునకు, సంఖ్యా - సంఖ్య, న అస్తి - లేదో, అవ్యపదేశరూపిణే - అనిర్వచనీయమైన రూపము గల, తస్మై - అట్టి, తే - నీకొరకు, నమః - నమస్కారము.

సర్వపదార్థముల రూపములో నున్న ఈ జగత్తు నానా నామరూపములుగా భాసించుచున్నది. ఇది నీ మాయాశక్తి చేతనే ప్రకాశింప జేయబడుచున్నది. వస్తునిశ్చయము చేసినచో ఇది మిథ్య యని తేలును గనుక,

దీనిలోని నానాత్వమునకు వాస్తవమగు పరిగణనము పొసగదు. ఈ తీరున అనిర్వచనీయమగు జగద్రూపముగా ప్రకటమైన నీకు నమస్కారము.

జరాయుజం స్వేదజమండజోద్భిదం
చరాచరం దేవర్షిపితృభూతమైంద్రియమ్ ।
ద్యౌః ఖం క్షితిశ్శైలసరిత్సముద్ర-
ద్వీపగ్రహర్క్షేత్యభిధేయ ఏకః ॥ 32

జరాయుజమ్ - గర్భాశయమునుండి పుట్టునది, స్వేదజమ్ - చెమటనుండి పుట్టునది, అండజ-ఉద్భిదమ్ - గ్రుడ్డునుండి పుట్టునది మరియు నేలను చీల్చుకొని పుట్టునది, చర-అచరమ్ - కదిలేది కదలనిది, దేవ-ఋషిపితృభూతమ్ - దేవతలు మహర్షులు పితృదేవతలు మరియు పంచభూతములు, ఐంద్రియమ్ - ఇంద్రియముల వర్గము, ద్యౌః - స్వర్గము, ఖమ్ - అంతరిక్షము, క్షితిః - భూమి, శైలసరిత్-సముద్రద్వీపగ్రహ-ఋక్ష-ఇతి - పర్వతములు నదులు సముద్రములు ద్వీపములు గ్రహములు నక్షత్రములు అని, అభిధేయః - నిర్దేశించబడేది, ఏకః - ఒక్కటి.

గర్భాశయమునుండి పుట్టే మానవులు మొదలగు ప్రాణులు, చెమటనుండి పుట్టే నల్లులు మొదలగునవి, గ్రుడ్డునుండి పుట్టే పక్షులు మొదలగునవి, నేలను చీల్చుకొని పుట్టే చెట్టుచేమలు, కదిలేవి మరియు కదలనివి అగు సకలప్రాణులు, దేవతలు, మహర్షులు, పితృదేవతలు, పంచభూతములు, ఇంద్రియముల సమూహము, స్వర్గము, అంతరిక్షము, భూమి, పర్వతములు, నదులు, సముద్రములు, ద్వీపములు, గ్రహములు, నక్షత్రములు అంటూ వివిధనామములతో నిర్దేశించబడే సర్వము వాస్తవములో అద్వితీయమగు పరబ్రహ్మ మాత్రమే.

యస్మిన్నసంఖ్యేయవిశేషనామ-
రూపాకృతౌ కవిభిః కల్పితేయమ్ ।
సంఖ్యా యయా తత్త్వదృశాఽపనీయతే
తస్మై నమస్సాంఖ్యనిదర్శనాయ త ఇతి ॥ 33

అసంఖ్యేయవిశేషనామరూప-ఆకృతౌ - లెక్కించ శక్యము కాని వేర్వేరు పేర్లు రూపములు ఆకారములు గల, యస్మిన్ - ఏ పరబ్రహ్మ యందు, కవిభిః - మహాత్ములచే, ఇయమ్ - ఈ, సంఖ్యా - తత్త్వముల లెక్క, కల్పితా - కల్పించబడినదో, యయా - ఏ, తత్త్వదృశా - యథార్థవ స్తుదర్శనముచే, అపనీయతే - తొలగించబడునో, తస్మై - అట్టి, సాంఖ్యని దర్శనాయ - సాంఖ్యసిద్ధాంతరూపుడవగు, తే - నీ కొరకు, నమః - నమ స్కారము, ఇతి - అని.

లెక్కించ శక్యము కాని వేర్వేరు పేర్లు, రంగులు, ఆకారములు గల ఈ జగత్తు రూపముగా నీవే ప్రకటమైనావు. అట్టి నీ అద్వయస్వరూప మునందు సాంఖ్యాచార్యులు తత్త్వములను కల్పించి లెక్కించుచున్నారు. నీ యథార్థస్వరూపమును తెలుసుకున్నప్పుడు ఈ భేదదృష్టి తొలగిపోవు ను. ఆ సాంఖ్యసిద్ధాంతము కూడ నీ స్వరూపమే. నీకు నా నమస్కారము అని అర్యముడు స్తుతించుచున్నాడు.

ఉత్తరేషు చ కురుషు భగవాన్ యజ్ఞపురుషః కృతవరాహ రూప ఆస్తే తం తు దేవీ హైషా భూస్సహ కురుభిరస్ఖలితభక్తి యోగేనోపధావతి ఇమాం చ పరమాముపనిషదమావర్తయతి ॥ 34

ఉత్తరేషు కురుషు చ - ఉత్తర కురువర్షమునందు కూడ, యజ్ఞపు రుషః - యజ్ఞేశ్వరుడగు, భగవాన్ - శ్రీహరి భగవానుడు, కృతవరాహ రూపః - చేయబడిన వరాహ రూపము గలవాడై, ఆస్తే - ఉన్నాడు, తం తు - ఆయననైతే, ఏషా - ఈ, భూః దేవీ - భూదేవి, కురుభిః సహ - కురు ఖండములోని జనులతో గూడి, అస్ఖలితభక్తియోగేన - విచలితము కాని భక్తియోగముతో, ఉపధావతి - ఉపాసించుచున్నది, ఇమామ్ - ఈ, పర మామ్ - గొప్ప, ఉపనిషదమ్ - మంత్రమును, ఆవర్తయతి - జపించును.

ఉత్తరకురువర్షమునందు కూడ యజ్ఞేశ్వరుడగు శ్రీహరి భగవా నుడు వరాహరూపమును దాల్చియున్నాడు. ఆయనను ఈ భూదేవి కురు

ఖండములోని జనులతో గూడి, విచలితము కాని భక్తియోగముతో ఉపాసి స్తూ, ఈ క్రింది గొప్ప మంత్రమును జపించుచున్నది.

ఓం నమో భగవతే మంత్రతత్త్వలింగాయ యజ్ఞక్రతవే మహా
ధ్వరావయవాయ మహాపురుషాయ నమః కర్మశుక్లాయ
త్రియుగాయ నమస్తే ॥ 35

ఓమ్, మంత్రతత్త్వలింగాయ - మంత్రములచే యథార్థముగా తెలియబడునట్టియు, యజ్ఞక్రతవే - యజ్ఞములు క్రతువుల రూపములోనున్నట్టియు, మహా-అధ్వర-అవయవాయ - గొప్ప యజ్ఞములే అవయవములుగా గలిగినట్టియు, కర్మశుక్లాయ - కర్మలకు శుద్ధమైన ఫలమునిచ్చునట్టియు (సత్త్వగుణప్రధానమగు కర్మల రూపములోనున్నట్టియు), త్రియుగాయ - మూడు యుగముల రూపముగా నున్నట్టియు, మహాపురుషాయ భగవతే - పురుషోత్తమ భగవానుడవైన, తే - నీ కొరకు, నమః నమః నమః - అనేక నమస్కారములు.

ఓమ్. ఓ భగవానుడా! పురుషోత్తముడవగు నీ స్వరూపము వేద మంత్రముల ద్వారా తెలియబడుచున్నది. యూపములు లేని యజ్ఞములు, యూపములు గల క్రతువులు నీ రూపములే. గొప్ప యజ్ఞములే నీ అవయవములు. కలియుగము మినహా మిగిలిన మూడు యుగములలో స్పష్టముగా ప్రకటమయ్యే నీవు కర్మలకు శుద్ధమైన ఫలములననుగ్రహించెదవు. సత్త్వగుణప్రధానమగు కర్మలు నీ రూపమే. నీకు అనేక నమస్కారములు.

యస్య స్వరూపం కవయో విపశ్చితో
గుణేషు దారుష్వివ జాతవేదసమ్ ।
మథ్నంతి మథ్నా మనసా దిదృక్షవో
గూఢం క్రియార్థైర్నమ ఈరితాత్మనే ॥ 36

దారుషు - కట్టెలయందు, జాతవేదసం ఇవ - అగ్నిని వలె, గుణేషు - గుణకార్యములగు దేహములయందు, క్రియా-అర్థైః - కర్మలచే మరియు వాటి ఫలములచే, గూఢమ్ - దాగియున్న, యస్య - ఎవ్వాని,

స్వరూపమ్ - స్వరూపమును, మథ్నా - వశము చేసుకొనబడిన, మనసా - మనస్సుతో, దిదృక్షవః - చూడగోరే, విపశ్చితః - వివేకవంతులగు, కవయః - మహాత్ములు, మథ్నంతి - మథించుచున్నారో, ఈరిత-ఆత్మనే - ప్రకటిత మైన స్వరూపము గల శ్రీహరి కొరకు, నమః - నమస్కారము.

కట్టెలలో నిప్పువలె శ్రీహరి త్రిగుణాత్మకయగు మాయయొక్క కార్యములైన దేహములయందు క్రియాశక్తి (కర్మలు) మరియు విజ్ఞానశక్తి (కర్మఫలముల అనుభవము) రూపముగా దాగియున్నాడు. వివేకవంతు లగు మహాత్ములు శ్రీహరిని దర్శించగోరి, మనస్సే చిలికే కవ్వము కాగా హృదయమును మథించెదరు. అప్పుడు వారికి శ్రీహరి ఆత్మరూపముగా సాక్షాత్కరించును.

ద్రవ్యక్రియాహేత్వయనేశకర్తృభిః
మాయాగుణైర్వస్తునిరీక్షితాత్మనే ।
అన్వీక్షయాఽంగాతిశయాత్మబుద్ధిభిః
నిరస్తమాయాకృతయే నమో నమః ॥ 37

అంగ-అతిశయ-ఆత్మబుద్ధిభిః - యోగాంగములచే అతిశయ మును పొందిన స్వరూపము గల బుద్ధి గలవారిచే, అను-ఈక్షయా - విచా రముచే, ద్రవ్యక్రియాహేతు-అయన-ఈశకర్తృభిః - విషయము ఇంద్రియ ముల వ్యాపారము ఇంద్రియాధిష్ఠానదేవత దేహము కాలము మరియు అహంకారములనే, మాయాగుణైః - మాయాశక్తియొక్క గుణముల కార్య ములచే, వస్తునిరీక్షిత-ఆత్మనే - వస్తువుగా నిశ్చయించబడిన స్వరూపము గలిగిన, నిరస్తమాయా-ఆకృతయే - తిరస్కరించబడిన మాయచే చేయబ డిన ఆకారము గల శ్రీహరి కొరకు, నమః నమః - అనేక నమస్కారములు.

ఆత్మవిచారము, మరియు యమనియమాది యోగాంగముల అభ్యాసములచే సాధకుల బుద్ధి అతిశయించి సూక్ష్మమగును. అట్టి బుద్ధి గల మహాత్ములు మాయాశక్తి కార్యములగు భోగ్యవస్తువులు, ఇంద్రియము లు, వాటి దేవతలు, దేహము, కాలము మరియు అహంకారములను పరిశీ లించి, పరమేశ్వరుని వాస్తవస్వరూపమును నిశ్చయించెదరు. ఈ ఆకార

ములన్నియు పరమేశ్వరునియందు మాయచే కల్పించబడినవియే గాని, వాస్తవముగా లేవు. అట్టి పరమేశ్వరుని కొరకు అనేక నమస్కారములు.

కరోతి విశ్వస్థితిసంయమోదయం
యస్యేప్సితం నేప్సితమీక్షితుర్గుణైః ।
మాయా యథాఽయో భ్రమతే తదాశ్రయం
గ్రావ్ణో నమస్తే గుణకర్మసాక్షిణే ॥ 38

ఈక్షితుః - సర్వసాక్షియగు, యస్య - ఏ పరమేశ్వరునియొక్క, న-ఈప్సితమ్ - కోరిక కాని, ఈప్సితమ్ - సంకల్పమైన, విశ్వస్థితిసంయమ-ఉదయమ్ - జగత్తుయొక్క రక్షణ సంహారము సృష్టులను, మాయా - మాయాశక్తి, గుణైః - గుణముల ద్వారా, గ్రావ్ణః - అయస్కాంతశిల వలన, తద్-ఆశ్రయమ్ - దానికి సమీపములోనున్న, అయః - ఇనుప ముక్క, యథా - ఏ విధముగా, భ్రమతి - తిరుగుచున్నదో ఆ విధముగా, కరోతి - చేయుచున్నదో, గుణకర్మసాక్షిణే - గుణములకు జీవుల అదృష్టములకు సాక్షియగు, తే - నీ కొరకు, నమః - నమస్కారము.

ఓ ఈశ్వరా! అయస్కాంత శిల సన్నిధిలోనున్న ఇనుప ముక్క ఆ శిల కారణముగా కదులును. అదే విధముగా, నీ సంకల్పమాత్రముచే మాయాశక్తి తన గుణముల ద్వారా జగత్తుయొక్క సృష్టిస్థితిలయములను చేయుచున్నది. సర్వసాక్షివగు నీ సంకల్పములో స్వార్థకామన లేదు. ప్రకృతిగుణములకు, జీవుల కర్మాదృష్టములకు సాక్షివగు నీకు నమస్కారము.

ప్రమథ్య దైత్యం ప్రతివారణం మృధే
యో మాం రసాయా జగదాదిసూకరః ।
కృత్వాఽగ్రదంష్ట్రే నిరగాదుదన్వతః
క్రీడన్నివేభః ప్రణతాఽస్మి తం విభుమితి ॥ 39

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే
అవతారమూర్తీనాం మంత్రస్తోత్రవర్ణనం
నామ అష్టాదశోఽధ్యాయః ॥

జగద్-ఆదిసూకరః - జగత్తునకు కారణమగు వరాహమైన, యః - ఏ శ్రీహరి, మామ్ - నన్ను, అగ్రదంష్ట్రే - కోరల కొనయందు, కృత్వా - ఉంచుకొని, క్రీడన్ - క్రీడించుచున్న, ఇభః ఇవ - ఏనుగు వలె, ప్రతివారణమ్ - తనకు విరోధియైన ఏనుగువంటి, దైత్యమ్ - రాక్షసుని, మృధే - యుద్ధమునందు, ప్రమథ్య - సంహరించి, రసాయాః - రసాతలమునుండి, ఉదన్వతః - సముద్రమునుండి, నిరగాత్ - బయటకు వచ్చెనో, తమ్ - అట్టి, విభుమ్ - సర్వసమర్థుని, ప్రణతా అస్మి - నమస్కరించుచున్నాను, ఇతి - అని.

నీటిలో క్రీడిస్తూ తనకు అడ్డు వచ్చిన ఏనుగును ఢీకొన్న పెద్ద ఏనుగు వలె, జగత్కారణమగు వరాహమూర్తి ప్రళయసముద్రములో పాతాళమునుండి నన్ను పైకి లేవదీసి, తన కోరల కొనపై నుంచుకొని, ఏనుగు వలె అడ్డు వచ్చిన హిరణ్యాక్షుని యుద్ధములో మట్టుబెట్టి, నన్ను బయటకు తీసుకువచ్చెను. ఆ సర్వసమర్థుడగు శ్రీహరికి నమస్కరించుచున్నాను అని భూదేవి స్తుతించెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో
అవతారమూర్తుల మంత్రములను, స్తుతులను వర్ణించే
పదునెనిమిదవ అధ్యాయము ముగిసినది (**18**).

*****

# అథ ఏకోనవింశోऽధ్యాయః

## శ్రీరామ మంత్ర స్తోత్రములు - భారతదేశ మహిమ

శ్రీశుక ఉవాచ ।
కింపురుషే వర్షే భగవంతమాదిపురుషం లక్ష్మణాగ్రజం సీతా
ऽభిరామం రామం తచ్చరణసన్నికర్షాభిరతః పరమభాగవతో
హనుమాన్ సహ కింపురుషైరవిరతభక్తిరుపాస్తే ।। 1

కింపురుషే వర్షే - కింపురుష వర్షమునందు, పరమభాగవతః - గొప్ప భగవద్భక్తుడు, అవిరతభక్తిః - అచంచలమైన భక్తి గల, హనుమాన్ - హనుమంతుడు, ఆదిపురుషమ్ - జగత్కారణుడు పూర్ణుడు అయినట్టియు, లక్ష్మణ-అగ్రజమ్ - లక్ష్మణునకు అన్నగారైనట్టియు, సీతా-అభిరామమ్ - సీతకు మిక్కిలి ప్రియుడైన, భగవంతం రామమ్ - శ్రీరామ భగవానుని, తద్-చరణసన్నికర్ష-అభిరతః - ఆయన పాదముల సన్నిధియందు మిక్కిలి ప్రీతిగలవాడై, కింపురుషైః సహ - కింపురుషులతో గూడి, ఉపాస్తే - ఉపాసించుచున్నాడు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- కింపురుషవర్షమునందు భగవద్భక్తులలో ఉత్తముడగు హనుమంతుడు కింపురుషులతో గూడి అచంచలమగు భక్తితో శ్రీరామ భగవానుని ఉపాసించుచున్నాడు. జగత్కారణుడు, పూర్ణుడు, లక్ష్మణునకు అన్నగారు, సీతాదేవికి మిక్కిలి ప్రియమైనవాడు అగు శ్రీరాముని పాదముల సన్నిధి హనుమంతునకు చాల ప్రీతికరమైనది.

ఆర్ష్టిషేణేన సహ గంధర్వైరనుగీయమానాం పరమకల్యాణీం
భర్తృభగవత్కథాం సముపశృణోతి స్వయం చేదం గాయతి ।। 2

గంధర్వైః - గంధర్వులచే, అనుగీయమానామ్ - గానము చేయ బడుచున్నట్టియు, పరమకల్యాణీమ్ - మిక్కిలి మంగళకరమైన, భర్తృభగవ త్-కథామ్ - తనకు ప్రభువు భగవానుడు అగు శ్రీరాముని గాథను, ఆర్ష్టి షేణేన సహ - ఆర్ష్టిషేణునితో గూడి, సముపశృణోతి - సావధానముగా వినును, స్వయమ్ - స్వయముగా, ఇదం చ - దీనిని కూడ, గాయతి - గానము చేయును.

అచట గంధర్వులు మిక్కిలి మంగళకరమగు శ్రీరామ భగవానుని గాథను గానము చేయుచుందురు. హనుమంతుడు ఆర్ష్టిషేణుడనే కింపు రుషనాయకునితో గూడి, తన ప్రభువుయొక్క గాథను సావధానముగా వినుటయే గాక, తాను కూడ ఈ క్రింది మంత్రమును జపించి, స్తోత్రమును పఠించుచుండును.

ఓం నమో భగవతే ఉత్తమశ్లోకాయ నమ ఆర్యలక్షణశీలవ్ర తాయ నమ ఉపశిక్షితాత్మన ఉపాసితలోకాయ నమస్సాధువా దనికషణాయ నమో బ్రహ్మణ్యదేవాయ మహాపురుషాయ మహారాజాయ నమ ఇతి ॥ 3

ఉత్తమశ్లోకాయ - గొప్ప కీర్తి కలిగినట్టియు, ఆర్యలక్షణశీలవ్ర తాయ - శ్రేష్ఠపురుషుల లక్షణములు స్వభావము ఆచరణము కలిగినట్టి యు, ఉపశిక్షిత-ఆత్మనే - వశము చేసుకొనబడిన మనస్సు కలిగినట్టియు, ఉపాసితలోకాయ - ఉపాసించబడిన జనులు కలిగినట్టియు, సాధువాదనిక షణాయ - మంచివాడు అనే మాటకు గీటురాయి అయినట్టియు, బ్రహ్మణ్య దేవాయ - వేదవేత్తలయెడల భక్తి కలిగిన దేముడైనట్టియు, మహాపురు షాయ - పురుషోత్తముడైనట్టియు, మహారాజాయ - చక్రవర్తియగు, భగవతే - శ్రీరామ భగవానుని కొరకు, నమః -- అనేక నమస్కారములు, ఇతి-అని.

భగవానుని అవతారమగు శ్రీరాముని కీర్తి గొప్పది. మనోనిగ్ర హము గల ఆయనయందు శ్రేష్ఠపురుషుల లక్షణములు, స్వభావము మరియు ఆచరణము కూడ గలవు. ఆయన తాను పాలించే జనులనే దైవ ముగా ఉపాసించిన చక్రవర్తి. వేదవేత్తలయెడల భక్తి గల ఆయన, మంచి

వాడు అనే మాటకు గీటురాయి. ఆ పురుషోత్తమ దేవునకు అనేక నమస్కా రములు, అని ఆయన జపించెను.

యత్తద్విశుద్ధానుభవమాత్రమేకం
స్వతేజసా ధ్వస్తగుణవ్యవస్థమ్ ।
ప్రత్యక్ ప్రశాంతం సుధియోపలంభనం
హ్యనామరూపం నిరహం ప్రపద్యే ।। 4

విశుద్ధ-అనుభవమాత్రమ్ - పరిశుద్ధమగు అనుభవమే స్వరూప ముగా కలిగినట్టియు, ఏకమ్ - అద్వితీయమైనట్టియు, స్వతేజసా - స్వరూ పప్రకాశముచే, ధ్వస్తగుణవ్యవస్థమ్ - నశింపజేయబడిన సత్త్వరజస్తమోగు ణముల వివిధావస్థలు కలిగినట్టియు, ప్రత్యక్ - వ్యక్తియొక్క అంతరతమ మగు స్వరూపమైనట్టియు, ప్రశాంతమ్ - నిశ్చలమైనట్టియు, సుధియా - పరిశుద్ధమగు అంతఃకరణముచే, ఉపలంభనమ్ - పొందబడునట్టియు, అనామరూపమ్ - నామరూపములు లేనట్టియు, నిరహమ్ - అహంకా రము లేని, యత్ - ఏ పరబ్రహ్మ గలదో, తత్ హి - దానినే, ప్రపద్యే - శరణు పొందుచున్నాను.

అద్వయపరబ్రహ్మ వ్యక్తియొక్క అంతరతమస్వరూపమగు ఆత్మయై ఉన్నది. సాధకుడు పరిశుద్ధమగు అంతఃకరణములో బ్రహ్మను కర్తృత్వభోక్తృత్వములు గాని, అహంకారము గాని లేని స్వానుభవరూప ముగా మాత్రమే పొందగల్గును. నామరూపములకు అతీతమైన అట్టి ఆత్మ తత్త్వముయొక్క నిరంజనమగు స్వరూపముయొక్క ప్రకాశము చేతనే, క్రమముగా సత్త్వరజస్తమోగుణముల కార్యములైన స్వప్నజాగ్రత్సుషుప్తు లనే అవస్థల సంసర్గము నిరాకరించబడినది. నిర్వికారమగు అట్టి ఆత్మత త్త్వమును నేను శరణు పొందుచున్నాను.

మర్త్యావతారస్త్విహ మర్త్యశిక్షణం
రక్షోవధాయైవ న కేవలం విభోః ।
కుతోఽన్యథా స్యూ రమతస్స్వ ఆత్మనః
సీతాకృతాని వ్యసనానీశ్వరస్య ।। 5

ఇహ - ఈ లోకమునందు, విభోః - పరమేశ్వరునియొక్క, మర్త్య-అవతారః తు - మానవుడుగా అవతరించుటయైతే, కేవలమ్ - కేవలము, రక్షః-వధాయ ఏవ - రాక్షసుల సంహారము కొరకు మాత్రమే, న - కాదు, మర్త్యశిక్షణమ్ - మానవులకు బోధించుట, అన్యథా - అట్లు గానిచో, స్వే - తన స్వరూపమునందు, రమతః - రమించునట్టియు, ఆత్మనః - ఆత్మరూపుడగు, ఈశ్వరస్య - ఈశ్వరునకు, సీతాకృతాని - సీత కారణముగా కలిగిన, వ్యసనాని - దుఃఖములు, కుతః - ఎట్లు, స్యుః - కలుగును?

పరమేశ్వరుడు కేవలము రాక్షససంహారము కొరకు మాత్రమే గాక, మానవులకు ఆచరణ ద్వారా బోధించుటకై ఈ లోకములో మానవుడై అవతరించెను. అట్లు గానిచో, ఆత్మారాముడు మరియు ఆత్మరూపుడు అగు ఈశ్వరునకు సీత కారణముగా దుఃఖములు కలుగుట ఎట్లు పొసగును?

న వై స ఆత్మాఽఽత్మవతాం సుహృత్తమః
సక్తస్త్రిలోక్యాం భగవాన్ వాసుదేవః ।
న స్త్రీకృతం కశ్మలమశ్నువీత
న లక్ష్మణం చాపి విహాతుమర్హతి ॥ 6

ఆత్మా - ఆత్మరూపుడు, ఆత్మవతామ్ - జితేంద్రియులకు, సుహృత్-తమః - మిక్కిలి హితకారి, వాసుదేవః - సర్వజగన్నివాసుడు మరియు స్వయంప్రకాశ స్వరూపుడు అగు, సః - ఆ, భగవాన్ - శ్రీహరి భగవానుడు, వై - నిశ్చయముగా, త్రిలోక్యామ్ - ముల్లోకములయందు, సక్తః - ఆసక్తి గలవాడు, న - కాదు, స్త్రీకృతమ్ - భార్య కారణముగా వచ్చిన, కశ్మలమ్ - దుఃఖమును, న అశ్నువీత - పొందడు, అపి చ - ఇంతే గాక, లక్ష్మణమ్ - లక్ష్మణుని, విహాతుమ్ - విడిచిపెట్టుటకు, న అర్హతి - తగడు.

సర్వజగన్నివాసుడు, స్వయంప్రకాశ స్వరూపుడు అగు ఆ శ్రీహరి భగవానుడు సకలప్రాణులలో ఆత్మరూపుడై యున్నాడు. జితేంద్రియులకు గొప్ప హితకారియగు ఆ శ్రీహరికి ముల్లోకములలో దేనిపైననూ నిశ్చయముగా ఆసక్తి లేదు. భార్య కారణముగా ఆయన యథార్థముగా దుఃఖము

లను పొందినాడనుట గాని, లక్ష్మణుని విడిచిపెట్టినాడనుట గాని పొసగదు. (ఒక సందర్భములో రాముడు లక్ష్మణుని పరిత్యజించినాడని కథ గలదు).

న జన్మ నూనం మహతో న సౌభగం
 న వాఙ్న బుద్ధిర్నాకృతిస్తోషహేతుః ।
తైర్యద్విసృష్టానపి నో వనౌకసః
 చకార సఖ్యే బత లక్ష్మణాగ్రజః ॥ 7

మహతః - మహాత్మునకు, తోషహేతుః - సంతోషమునకు కారణము, జన్మ - పుట్టుక, న - కాదు, నూనమ్ - నిశ్చయము, సౌభగమ్ - అందము, న - కాదు, వాక్ - వాక్కు, న - కాదు, బుద్ధిః - బుద్ధి, న - కాదు, ఆకృతిః - జాతి, న - కాదు, యత్ - ఏలయనగా, తైః - వాటిచే, విసృష్టాన్ - విడిచిపెట్టబడిన, వన-ఓకసః - అడవిలోనుండే, నః అపి - మమ్ములను కూడ, లక్ష్మణ-అగ్రజః - లక్ష్మణుని అన్నగారగు శ్రీరాముడు, సఖ్యే చకార - మిత్రులుగా స్వీకరించెను, బత - ఆశ్చర్యము!

మహాత్మునకు సంతోషము కలిగించేవి గొప్ప వంశములో జన్మించుట గాని, అందము గాని, మాటకారి తనము గాని, పాండిత్యము గాని, జాతి గాని కావు. ఇది నిశ్చయము. ఏలయనగా, అడవిలో బ్రతికే మాలో ఈ లక్షణములు ఏవీ లేవు. అయిననూ, లక్ష్మణుని అన్నగారగు ఆ శ్రీరాముడు మమ్ములను తన మిత్రులుగా స్వీకరించెను. ఆశ్చర్యము!

సురోఽసురో వాఽప్యథ వానరో నరః
 సర్వాత్మనా యస్సుకృతజ్ఞముత్తమమ్ ।
భజేత రామం మనుజాకృతిం హరిం
 య ఉత్తరాననయత్కోసలాన్ దివమితి ॥ 8

అథ - అందువలన, సురః - దేవత గాని, అసురః వా - అసురుడు గాని, వానరః అపి - వానరుడు గాని, నరః - మానవుడు గాని, యః - ఎవడైననూ, సర్వాత్మనా - అన్ని విధములుగా, సుకృతజ్ఞమ్ - గొప్పగా చేసిన ఉపకారమును గుర్తించునట్టియు, ఉత్తమమ్ - పురుషోత్తముడైనట్టియు,

మనుజ-ఆకృతిం హరిమ్ - మానవుని రూపములోనున్న శ్రీహరియగు, రామమ్ - శ్రీరాముని, భజేత - సేవించవలెను, యః - ఏ శ్రీరాముడు, ఉత్తరాన్ కోసలాన్ - ఉత్తరకోసల దేశవాసులను, దివమ్ - స్వర్గమును గురించి, అనయత్ - కొనిపోయెనో, ఇతి - అని.

దేవత గాని, అసురుడు గాని, వానరుడు గాని, మానవుడు గాని ఎవ్వరైననూ ఆ శ్రీరాముని సేవించవలెను. పురుషోత్తముడగు శ్రీహరియే మానవుడై శ్రీరాముడుగా అవతరించెను. శ్రీరాముడు ఇతరులు చేసిన చిన్న ఉపకారమునైననూ చక్కగా గుర్తులో నుంచుకొనెడివాడు. ఆయన ఉత్తరకోసలదేశవాసులకు స్వర్గముననుగ్రహించెను, అని హనుమంతుడు స్తుతించెను.

భారతేఽపి వర్షే భగవాన్నరనారాయణాఖ్య ఆకల్పాంతముపచి
తధర్మజ్ఞానవైరాగ్యైశ్వర్యోపశమోపరమాత్మోపలంభనమనుగ్ర
హాయాఽఽత్మవతామనుకంపయా తపోఽవ్యక్తగతిశ్చరతి ॥ 9

భారతవర్షే అపి - భారతఖండమునందు కూడ, భగవాన్ - భగవానుడు, అనుకంపయా - దయతో, ఆత్మవతామ్ - జితేంద్రియుల, అనుగ్రహాయ - అనుగ్రహించుట కొరకు, నరనారాయణ-ఆఖ్యః - నరనారాయణులు అనే పేరు గలవాడై, అవ్యక్తగతిః - ఇంద్రియగోచరము గాని స్వరూపము గలవాడై, ఆకల్ప-అంతమ్ - కల్పాంతము వరకు, ఉపచితధర్మజ్ఞాన వైరాగ్య-ఐశ్వర్య-ఉపశమ-ఉపరమ-ఆత్మోపలంభనమ్ - వర్ధిల్లిన ధర్మము జ్ఞానము వైరాగ్యము ఈశ్వరభావము శాంతి ఉపరతులచే ఆత్మయొక్క ఉపలబ్ధి గల, తపః - తపస్సును, చరతి - చేయుచున్నాడు.

భారతఖండమునందు కూడ భగవానుడు దయతో జితేంద్రియుల ననుగ్రహించుటకొరకై నరనారాయణులు అనే పేరుతో అవతరించి, కంటికి కానరాకుండా కల్పాంతము వరకు తపస్సు చేయుచున్నాడు. ఇట్టి తపస్సుచే ధర్మము జ్ఞానము వైరాగ్యము ఇంద్రియవశీకరణము మనశ్శాంతి మరియు క్రియలనుండి విరమించుట అనే లక్షణములు వర్ధిల్లి, సాధకునకు ఆత్మజ్ఞానము ఉదయించును.

**తం భగవాన్నారదో వర్ణాశ్రమవతీభిర్భారతీభిః ప్రజాభిర్భగవత్ప్రో క్తాభ్యాం సాంఖ్యయోగాభ్యాం భగవదనుభావోపవర్ణనం సావర్ణేరు పదేక్ష్యమాణః పరమభక్తిభావేనోపసరతి ఇదం చాభిగృణాతి || 10**

భగవాన్ - పూజనీయుడగు, నారదః - నారదుడు, భగవత్-ప్రోక్తాభ్యామ్ - భగవానునిచే ఉపదేశించబడిన, సాంఖ్యయోగాభ్యామ్ - జ్ఞానయోగ కర్మయోగములతో గూడి, భగవద్-అనుభావ-ఉపవర్ణనమ్ - భగవంతుని మహిమను వర్ణించే ఆగమమును, సావర్ణేః - సావర్ణి మనువునకు, ఉపదేక్ష్యమాణః - ఉపదేశించ బోవువాడై, వర్ణ-ఆశ్రమవతీభిః - వర్ణాశ్రమములు కలిగిన, భారతీభిః - భారతవర్షమునందు నివసించే, ప్రజాభిః - ప్రజలతో గూడి, పరమభక్తిభావేన - గొప్ప భక్తితో నిండిన మనస్సుతో, తమ్ - ఆ నరనారాయణుని, ఉపసరతి - సేవించును, ఇదం చ - ఈ మంత్రమును కూడ, అభిగృణాతి - జపించును.

పూజనీయుడగు నారదుడు భగవానునిచేతనే ఉపదేశించబడిన ఆత్మజ్ఞానమును, దానికి ఉపాయమగు కర్మయోగమును, వాటితో బాటుగా భగవానుని మహిమను వర్ణించే ఆగమమును సావర్ణి మనువునకు ఉపదేశించగోరెను. అపుడాయన వర్ణాశ్రమవంతులగు భారతదేశ ప్రజలతో గూడి ఆ నరనారాయణుని సేవించి, గొప్ప భక్తితో నిండిన మనస్సుతో ఈ మంత్రమును జపించును.

**ఓం నమో భగవతే ఉపశమశీలాయోపరతానాత్మ్యాయ నమోఽకించనవిత్తాయ ఋషిఋషభాయ నరనారాయణాయ పరమహంసపరమగురవే ఆత్మారామాధిపతయే నమో నమ ఇతి || 11**

ఓమ్, ఉపశమశీలాయ - శాంతస్వభావము కలిగినట్టియు, ఉపరత-అనాత్మ్యాయ - తొలగిపోయిన అనాత్మలగు దేహాదులయందలి ఆత్మభావము కలిగినట్టియు, అకించనవిత్తాయ - దరిద్రులకు పెన్నిధి అయినట్టియు, ఋషిఋషభాయ - మహర్షులలో శ్రేష్ఠుడైనట్టియు, పరమహంసపరమగురవే - ఆత్మజ్ఞానులకు పరమగురువైన, ఆత్మారామ-అధిపతయే -

ఆత్మారాములగు మహాత్ములకు అధీశ్వరుడైన, నరనారాయణాయ భగవతే - నరనారాయణ భగవానుని కొరకు, నమః --- - అనేక నమస్కారములు.

ఓమ్. శాంతస్వభావముగల నరనారాయణ మూర్తికి అనాత్మలగు దేహాదులపై ఆత్మభావము లేదు. దరిద్రులకు నిధియగు ఆ భగవానుడు మహర్షులలో శ్రేష్ఠుడు, పరమహంసలకు పరమగురువు, ఆత్మారాములగు మహాత్ములకు అధీశ్వరుడు. ఆ భగవానునకు అనేక నమస్కారములు.

గాయతి చేదమ్ ---
కర్తాఽస్య సర్గాదిషు యో న బధ్యతే
న హన్యతే దేహగతోఽపి దైహికైః ।
ద్రష్టుర్న దృగ్ యస్య గుణైర్విదూష్యతే
తస్మై నమోఽసక్తవివిక్తసాక్షిణే ॥ 12

ఇదం చ - ఈ స్తోత్రమును కూడ, గాయతి - గానము చేయుచున్నాడు, అస్య - ఈ జగత్తుయొక్క, సర్గ-ఆదిషు - సృష్టి మొదలగు కార్యములయందు, కర్తా - కర్తయగు, యః - ఏ భగవానుడు, న బధ్యతే - బంధించబడుట లేదో, దేహగతః అపి - దేహమును పొందినవాడే అయినను, దైహికైః - దేహమునకు సంబంధించిన వాటిచే, న హన్యతే - తిరస్కరించబడుట లేదో, ద్రష్టుః - ద్రష్టయగు, యస్య - ఎవనియొక్క, దృక్ - దృష్టి, గుణైః - గుణములచే, న విదూష్యతే - కలుషితము అగుట లేదో, అసక్తవివిక్తసాక్షిణే - ఆసక్తి లేకుండగా వివేకము కలిగి సాక్షియై ఉండే, తస్మై - ఆ భగవానుని కొరకు, నమః - నమస్కారము.

నారదుడు ఈ క్రింది స్తోత్రమును కూడ గానము చేయుచున్నాడు --- ఆ జగత్తుయొక్క సృష్టిస్థితిలయములను చేసేది భగవానుడే. కాని, ఆయనకు కర్తృత్వము (చేసేవాడను నేనే అనే ధారణ) అనే బంధము లేదు. ఆయన ప్రాణుల దేహములలో ఆత్మరూపముగా నున్నాడు. కాని, ఆయనకు దేహధర్మములగు పుట్టుక, మరణము మొదలగు వాటిచే తిరస్కారము లేదు. ప్రాణులయందలి ద్రష్ట ఆయనయే. కాని, శుద్ధచైతన్యస్వరూపుడగు ఆయనకు చైతన్యముచే ప్రకాశింప జేయబడే మనోవృత్తులలోని

సత్త్వరజస్తమోగుణములతోడి కాలుష్యము లేదు. ఆయన ప్రాణులలో ఆత్మరూపముగా దేహేంద్రియాదులకంటె విలక్షణుడై వాటితోడి సంగము లేకుండా సాక్షియై నిలిచియున్నాడు. ఆయనకు నమస్కారము.

ఇదం హి యోగేశ్వర యోగనైపుణం
హిరణ్యగర్భో భగవాన్ జగాద యత్ ।
యదంతకాలే త్వయి నిర్గుణే మనో
భక్త్యా దధీతోజ్ఝితదుష్కలేవరః ॥ 13

యోగ-ఈశ్వర - యోగులకు అధీశ్వరా!, ఇదమ్ - ఇది, యోగనైపుణం హి - యోగములో నేర్పు గదా!, యత్ - దేనిని, భగవాన్ - పూజ్యుడగు, హిరణ్యగర్భః - హిరణ్యగర్భుడు, జగాద - చెప్పెనో, యత్ - ఏదనగా, ఉజ్ఝితదుష్కలేవరః - విడిచిపెట్టబడిన చెడ్డదైన దేహాభిమానము గల సాధకుడు, అంతకాలే - మరణించే సమయమునందు, నిర్గుణే - నిర్గుణుడవగు, త్వయి - నీయందు, భక్త్యా - భక్తితో, మనః - మనస్సును, దధీత - నిలుపునో.

ఓ యోగేశ్వరా! సాధకుడు చెడ్డదైన దేహాభిమానమును విడిచిపెట్టి మరణించే సమయములో మనస్సును భక్తితో నిర్గుణుడవగు నీయందు నిలుపవలెను. ఇదియే యోగములోని కౌశలము. దీనినే పూజనీయుడగు హిరణ్యగర్భుడు కూడ బోధించెను.

యథైహికాముష్మికకామలంపటః
సుతేషు దారేషు ధనేషు చింతయన్ ।
శంకేత విద్వాన్ కుకలేవరాత్యయాత్
యస్తస్య యత్నః శ్రమ ఏవ కేవలమ్ ॥ 14

ఐహిక-ఆముష్మికకామలంపటః - ఇహపరలోకములయందలి కామనలయందు ఆసక్తుడైన వ్యక్తి, సుతేషు - పుత్రుల విషయమునందు, దారేషు - భార్య విషయమునందు, ధనేషు - సంపదల విషయమునందు, చింతయన్ - చింతిల్లువాడై, కుకలేవర-అత్యయాత్ - చెడుదైన దేహము

యొక్క నాశము వలన, యథా - ఏ విధముగానైతే, శంకేత - భయపడు నో, యః - ఏ, విద్వాన్ - వివేకవంతుడు భీతిల్లునో, తస్య - వాని, యత్నః - ప్రయత్నము, కేవలమ్ - కేవలము, శ్రమః ఏవ - శ్రమ మాత్రమే.

అజ్ఞాని ఇహపరలోకములయందలి సుఖములయందు ఆసక్తి కలిగి యుండును. అట్టివాడు చెడు దేహమునందు అభిమానము గలవాడై మర ణమునకు భయపడుతూ, భార్య పిల్లలు సంపదల గురించి చింతిల్లుచుం డును. వివేకవంతుడు కూడ అదే విధముగా భయపడే పక్షములో, వాని సాధన కేవలము శ్రమ మాత్రమే యగును.

తన్నః ప్రభో త్వం కుకలేవరార్పితాం
త్వన్మాయయాఽహంమమతామధోక్షజ ।
భింద్యామ యేనాశు వయం సుదుర్భిదాం
విధేహి యోగం త్వయి నస్స్వభావమితి ॥ 15

ప్రభో - ఓ ప్రభూ!, అధోక్షజ - ఇంద్రియశక్తుల మూలములో నున్నవాడా!, తత్ - అందువలన, త్వమ్ - నీవు, త్వయి - నీయందు, నః - మాకు, స్వభావమ్ - సహజమైన, యోగమ్ - భక్తియోగమును, విధేహి - కలిగించుము, యేన - దేనిచే, వయమ్ - మేము, త్వత్-మాయయా - నీ మాయచే, కుకలేవర-అర్పితామ్ - చెడుదైన దేహమునందు స్థిరము చేయబడిన, సుదుర్భిదామ్ - మిక్కిలి భేదించ శక్యము కాని, అహంమమ తామ్ - నేను నాది అనే ధారణను, ఆశు - శీఘ్రముగా, భింద్యామ - భేదిం చెదమో, ఇతి - అని.

ఓ ప్రభూ! నీవు ఇంద్రియశక్తుల మూలములో ఆత్మరూపుడవై యున్నావు. మాకు నీ మాయచే ఈ చెడు దేహమునందు భేదించ శక్యము కాని అహంకార మమకారములు స్థిరపడి యున్నవి. కావున, నీవు మాకు సహజమగు భక్తియోగమును కలిగించుము. దాని ప్రభావముచే మేమీ అహంకార మమకారములను శీఘ్రముగా పోగొట్టుకొనెదము, అని హను మంతుడు ప్రార్థించును.

భారతేఽప్యస్మిన్ వర్షే సరిచ్ఛైలాస్సంతి బహవో మలయో
మంగలప్రస్థో మైనాకస్త్రికూట ఋషభః కూటకః కోల్లకస్సహ్యో
దేవగిరిరృష్యమూకశ్శ్రీశైలో వేంకటో మహేంద్రో వారిధారో
వింధ్యశ్శుక్తిమానృక్షగిరిః పారియాత్రో ద్రోణశ్చిత్రకూటో గోవ
ర్ధనో రైవతకః కకుభో నీలో గోకాముఖ ఇంద్రకీలః కామగిరిరితి
చాన్యే చ శతసహస్రశశ్శైలాస్తేషాం నితంబప్రభవా నదా
నద్యశ్చ సంత్యసంఖ్యాతాః ॥ 16

అస్మిన్ - ఈ, భారతే వర్షే - భారత ఖండమునందు, బహవః - అనేకములగు, సరిత్-శైలాః అపి - నదులు పర్వతములు కూడ, సంతి - కలవు, మలయః - మలయము, మంగలప్రస్థః - మంగలప్రస్థము, మైనాకః - మైనాకము, త్రికూటః - త్రికూటము, ఋషభః - ఋషభము, కూటకః - కూటకము, కోల్లకః - కోల్లకము, సహ్యః - సహ్యము, దేవగిరిః - దేవగిరి, ఋష్యమూకః - ఋష్యమూకము, శ్రీశైలః - శ్రీశైలము, వేంకటః - వేంక టము, మహేంద్రః - మహేంద్రము, వారిధారః - వారిధారము, వింధ్యః - వింధ్యము, శుక్తిమాన్ - శుక్తిమంతము, ఋక్షగిరిః - ఋక్షగిరి, పారియాత్రః - పారియాత్రము, ద్రోణః - ద్రోణము, చిత్రకూటః - చిత్రకూటము, గోవర్ధనః - గోవర్ధనము, రైవతకః - రైవతకము, కకుభః - కకుభము, నీలః - నీల ము, గోకాముఖః - గోకాముఖము, ఇంద్రకీలః - ఇంద్రకీలము, కామగిరిః - కామగిరి, ఇతి - అని, అన్యే - ఇతరములగు, శైలాః చ - పర్వతములు కూడ, శతసహస్రశః - వందలాది వేలాదిగా, తేషామ్ - వాటియొక్క, నితం బప్రభవాః - మధ్యభాగములనుండి పుట్టే, నదాః - నదములు, నద్యః చ - నదులు కూడ, అసంఖ్యాతాః - లెక్క లేనన్ని, సంతి - కలవు.

ఈ భారతఖండమునందు అనేకములగు పర్వతములు, నదులు కూడ కలవు. మలయము, మంగలప్రస్థము, మైనాకము, త్రికూటము, ఋషభము, కూటకము, కోల్లకము, సహ్యము, దేవగిరి, ఋష్యమూకము, శ్రీశైలము, వేంకటము, మహేంద్రము, వారిధారము, వింధ్యము, శుక్తిమం తము, ఋక్షగిరి, పారియాత్రము, ద్రోణము, చిత్రకూటము, గోవర్ధనము, రైవతకము, కకుభము, నీలము, గోకాముఖము, ఇంద్రకీలము, కామగిరి

అనునవి మాత్రమే గాక పర్వతములు వందల వేల సంఖ్యలో గలవు. వాటి నడుమ భాగములనుండి లెక్క లేనన్ని నదములు (పడమరగా పారే యేరులు), నదులు పుట్టుచున్నవి.

ఏతాసామపో భారత్యః ప్రజా నామభిరేవ పునంతీనామాత్మనా
చోపస్పృశంతి ॥ 17

నామభిః ఏవ - నామముల చేతనే, పునంతీనామ్ - పావనము చేసే, ఏతాసామ్ - ఈ నదుల, అపః - జలములను, భారత్యః - భారతదేశమునందలి, ప్రజాః - ప్రజలు, ఆత్మనా చ - దేహముతో గూడ, ఉపస్పృశంతి - స్నానము చేయుచున్నారు.

పేర్లను స్మరించినంత మాత్రాన పవిత్రులను చేసే ఈ నదుల జలములలో భారతీయులు స్నానములను చేయుచుందురు.

చంద్రవసా తామ్రపర్ణీ అవటోదా కృతమాలా వైహాయసీ కావేరీ వేణీ
పయస్వినీ శర్కరావర్తా తుంగభద్రా కృష్ణా వేణ్యా భీమరథీ గోదా
వరీ నిర్వింధ్యా పయోష్ణీ తాపీ రేవా సురసా నర్మదా చర్మణ్వతీ
సింధురంధశ్శోణశ్చ నదౌ మహానదీ వేదస్మృతిర్ఋషికుల్యా
త్రిసామా కౌశికీ మందాకినీ యమునా సరస్వతీ దృషద్వతీ గోమతీ
సరయూ రోధస్వతీ సప్తవతీ సుషోమా శతద్రూశ్చంద్రభాగా మరు
ద్వృధా వితస్తా అసిక్నీ విశ్వేతి మహానద్యః ॥ 18

చంద్రవసా - చంద్రవస, తామ్రపర్ణీ - తామ్రపర్ణి, అవటోదా - అవటోద, కృతమాలా - కృతమాల, వైహాయసీ - వైహాయసి, కావేరీ - కావేరి, వేణీ - వేణి, పయస్వినీ - పయస్విని, శర్కరావర్తా - శర్కరావర్త, తుంగభద్రా - తుంగభద్ర, కృష్ణా - కృష్ణ, వేణ్యా - వేణ్య, భీమరథీ - భీమరథి, గోదావరీ - గోదావరి, నిర్వింధ్యా - నిర్వింధ్య, పయోష్ణీ - పయోష్ణి, తాపీ - తాపి, రేవా - రేవ, సురసా - సురస, నర్మదా - నర్మద, చర్మణ్వతీ - చర్మణ్వతి, సింధుః - సింధువు, అంధః - అంధము, చ - మరియు, శోణః - శోణము, నదౌ - నదములు, మహానదీ - మహానది, వేదస్మృతిః - వేద

స్మృతి, ఋషికుల్యా - ఋషికుల్య, త్రిసామా - త్రిసామ, కౌశికీ - కౌశికి, మందాకినీ - మందాకిని, యమునా - యమున, సరస్వతీ - సరస్వతి, దృషద్వతీ - దృషద్వతి, గోమతీ - గోమతి, సరయుః - సరయు, రోధస్వతీ - రోధస్వతి, సప్తవతీ - సప్తవతి, సుషోమా - సుషోమ, శతద్రూః - శతద్రు, చంద్రభాగా - చంద్రభాగ, మరుద్వృధా - మరుద్వృధ, వితస్తా - వితస్త, అసిక్నీ - అసిక్ని, విశ్వా - విశ్వ, ఇతి - అనే, మహానద్యః - గొప్ప నదులు.

చంద్రవశ, తామ్రపర్ణి, అవటోద, కృతమాల, వైహాయసి, కావేరి, వేణి, పయస్విని, శర్కరావర్త, తుంగభద్ర, కృష్ణ, వేణ్యా, భీమరథి, గోదావరి, నిర్వింధ్య, పయోష్ణి, తాపి, రేవ, సురస, నర్మద, చర్మణ్వతి, సింధువు, మహానది, వేదస్మృతి, ఋషికుల్య, త్రిసామ, కౌశికి, మందాకిని, యమున, సరస్వతి, దృషద్వతి, గోమతి, సరయు, రోధస్వతి, సప్తవతి, సుషోమ, శతద్రు, చంద్రభాగ, మరుద్వృధ, వితస్త, అసిక్ని, విశ్వ అనే గొప్ప నదులు, అంధము మరియు శోణము అనే నదములు గలవు.

> అస్మిన్నేవ వర్షే పురుషైర్లబ్ధజన్మభిశ్శుక్లలోహితకృష్ణవర్ణేన స్వారబ్ధేన కర్మణా దివ్యమానుషనారకగతయో బహ్వ్య ఆత్మన ఆనుపూర్వ్యేణ సర్వా హ్యేవ సర్వేషాం విధీయంతే యథావర్ణవిధానమపవర్గశ్చాపి భవతి || 19

అస్మిన్ - ఈ, వర్షే ఏవ - ఖండమునందు, లబ్ధజన్మభిః - పొందబడిన పుట్టుక గల, పురుషైః - మానవులచే, స్వ-ఆరబ్ధేన - తమచే చేయబడిన, శుక్లలోహితకృష్ణవర్ణేన - సాత్త్వికరాజసతామసరూపమైన, కర్మణా - కర్మచే, ఆనుపూర్వ్యేణ - వరుసగా, ఆత్మనః - తనకు, బహ్వ్యః - అనేకములగు, దివ్యమానుషనారకగతయః - దేవజన్మ మనుష్యజన్మ నరకజన్మలు, విధీయంతే - పొందబడుచున్నవి, హి - ఏలయనగా, సర్వాః ఏవ - అన్నీ, సర్వేషామ్ - అందరికి, యథావర్ణవిధానమ్ - ఆయా వర్ణముల విధానము ననుసరించి, అపవర్గః చ అపి - మోక్షము కూడ, భవతి - కలుగును.

ఈ ఖండమునందు జన్మించిన మానవులకు మాత్రమే తాము చేసుకున్న సాత్త్విక రాజస తామస కర్మలను బట్టి క్రమముగా దేవలోక మనుష్యలోక నరకలోకములయందు పలువిధముల జన్మలు కలుగును. ఏలయనగా, సకలజీవులకు సకలగతులు కర్మానుసారముగా సంభవమగు ను. వివిధవర్ణములకు చెందిన జనులు తమ తమ కర్తవ్యములను చేసి, మోక్షమును కూడ పొందవచ్చును.

యోఽసౌ భగవతి సర్వభూతాత్మన్యనాత్మ్యేఽనిరుక్తేఽనిలయనే
పరమాత్మని వాసుదేవేఽనన్యనిమిత్తభక్తియోగలక్షణో నానాగతి
నిమిత్తాఽవిద్యాగ్రంథిరంధనద్వారేణ యదా హి మహాపురుష
పురుషప్రసంగః ॥ 20

యః - ఏ మోక్షము కలదో, అసౌ - ఇది, యదా హి - ఏ కాలము నందైతే, మహాపురుషపురుషప్రసంగః - పురుషోత్తముని భక్తులతోడి దృఢ మగు సంగము కలుగునో అప్పుడు, నానాగతినిమిత్త-అవిద్యాగ్రంథిరంధన ద్వారేణ - పలువిధముల జన్మలకు కారణమైన అజ్ఞానము అనే పీటముడిని తొలగించుట ద్వారా, సర్వభూత-ఆత్మని - సకలప్రాణులలో ఆత్మరూపముగా నున్నట్టియు, అనాత్మ్యే - మనస్సునందలి రాగద్వేష ముల సంపర్కము లేనట్టియు, అనిరుక్తే - వాక్కులకు గోచరము కానట్టి యు, అనిలయనే - ఆధారము (వినాశము) లేనట్టియు, పరమ-ఆత్మని - వ్యక్తియొక్క అంతరతమమగు ఆత్మస్వరూపమైన, వాసుదేవే భగవతి - వాసుదేవ భగవానునియందు, అనన్యనిమిత్తభక్తియోగలక్షణః - ఇతరము కారణము కాని భక్తియోగమే స్వరూపముగా గలది.

సాధకునకు పురుషోత్తముని భక్తులతో దృఢమగు సంగము కలిగిన ప్పుడు, ఆతనిలో వాసుదేవ భగవానునియందలి భక్తియోగము ఇతరఫల ముల తృష్ణ లేని విధముగా స్థిరమగును. అదియే మోక్షముయొక్క లక్షణ ము. సర్వభూతములలో అంతరతమమగు ఆత్మరూపముగా నుండే భగవా నునియందు ప్రాణుల మనస్సులలోని రాగద్వేషముల సంపర్కము ఉండ దు. వాక్కులకు గోచరము కానివాడు, సర్వాధారుడు, మరియొక ఆధా రము లేనివాడు, వినాశము లేనివాడు అగు భగవానునియందలి భక్తి సాధ

కుని హృదయములోని అజ్ఞానము అనే పీటముడిని తొలగించును. జీవునకు పలువిధముల జన్మలనిచ్చేది ఈ అజ్ఞానమే. ఈ తీరున అజ్ఞానము తొలగి సాధకుడు మోక్షమును పొందును.

ఏతదేవ హి దేవా గాయంతి ---
అహో అమీషాం కిమకారి శోభనం
ప్రసన్న ఏషాం స్విదుత స్వయం హరిః ।
యైర్జన్మ లబ్ధం నృషు భారతాజిరే
ముకుందసేవౌపయికం స్పృహా హి నః ॥ 21

దేవాః - దేవతలు, ఏతత్ ఏవ - దీనినే, గాయంతి హి - గానము చేయుచుందురు గదా!, అహో - ఆశ్చర్యము!, అమీషామ్ - వీరికి, కిమ్ - ఏమి, శోభనమ్ - పుణ్యము, అకారి - చేయబడినది?, ఉత స్విత్ - లేక, ఏషామ్ - వీరికి, హరిః - శ్రీహరి, స్వయమ్ - స్వయముగా, ప్రసన్నః -ప్రసన్నుడైనాడా?, యైః - ఏ వీరిచే, భారత-అజిరే - భారతదేశ ప్రాంగణమునందు, ముకుందసేవా-ఔపయికమ్ - ముకుందుని సేవకు సాధనమైన, నృషు - మనుష్యులయందు, జన్మ - జన్మ, లబ్ధమ్ - పొందబడినదో, నః - మనకు, స్పృహా హి - కోరిక మాత్రమే.

దేవతలు ఈ విధముగా గానము చేయుచుందురు --- ఆశ్చర్యము! వీరు ఎట్టి పుణ్యమును చేసిరి? లేక, శ్రీహరి స్వయముగనే వీరియందు ప్రసన్నుడైనాడా? ఏలయనగా, వీరు భారతప్రాంగణములో మనుష్యులై పుట్టినారు. ఇది మోక్షమునిచ్చే శ్రీహరిని సేవించుటకు సాధనమైన జన్మ. ఇట్టి జన్మ మనకు కేవలము కోరికగా మాత్రమే మిగిలి పోయినది.

కిం దుష్కరైర్నః క్రతుభిస్తపోవ్రతైః
దానాదిభిర్వా ద్యుజయేన ఫల్గునా ।
న యత్ర నారాయణపాదపంకజ-
స్మృతిః ప్రముష్టాతిశయేంద్రియోత్సవాత్ ॥ 22

దుష్కరైః - చేయుటకు కష్టమైన, క్రతుభిః - యజ్ఞములచే, తపః-వ్రతైః - తపస్సుచే వ్రతములచే, దాన-ఆదిభిః వా - దానము మొదలగు వాటిచే గాని, ఫల్గునా - అల్పమైన, ద్యుజయేన - స్వర్గలోకమును జయించుటచే, నః - మనకు, కిమ్ - ఏమి ప్రయోజనము?, యత్ర - ఏ స్వర్గమునందు, అతిశయ-ఇంద్రియ-ఉత్సవాత్ - అతిశయించిన ఇంద్రియభోగముల ఉత్సవము వలన, నారాయణపాదపంకజస్మృతిః - నారాయణుని పాదపద్మముల స్మరణము, ప్రమృష్టా - తుడిచి వేయబడినదో.

మనము చేయుటకు కఠినమైన యజ్ఞములను, తపస్సును, వ్రతములను, దానములను, లేక ఇతరసాధనములను అనుష్ఠించి, అల్పమగు స్వర్గమును సంపాదించితిమి. కాని, మనకు దీనితో ప్రయోజనమేమున్నది? ఏలయనగా, ఈ స్వర్గములో ఇంద్రియభోగముల ఉత్సవము అతిశయముగా నుండుటచే, నారాయణుని పాదపద్మముల స్మరణము తుడిచి పెట్టబడినది.

కల్పాయుషాం స్థానజయాత్పునర్భవాత్
క్షణాయుషాం భారతభూజయో వరమ్ ।
క్షణేన మర్త్యేన కృతం మనస్వినః
సన్న్యస్య సంయాంత్యభయం పదం హరేః ॥ 23

కల్ప-ఆయుషామ్ - కల్పము ఆయుర్దాయము గలవారల, పునర్భవాత్ - మరల పుట్టుక గల, స్థానజయాత్ - పుణ్యలోకమును జయించుట కంటె, క్షణ-ఆయుషామ్ - క్షణకాలము ఆయుర్దాయము గలవారల, భారతభూజయః - భారతభూమియందు జన్మ, వరమ్ - శ్రేష్ఠమైనది, మర్త్యేన - నశ్వరమగు దేహముతో, క్షణేన - క్షణకాలముచే, కృతమ్ - చేయబడిన కర్మను, సన్న్యస్య - ఈశ్వరార్పణము చేసి, మనస్వినః - వివేకవంతులు, హరేః - శ్రీహరియొక్క, అభయమ్ - భయరహితమగు, పదమ్ - పదము (మోక్షము) ను, సంయాంతి - చక్కగా పొందుచున్నారు.

స్వర్గాది పుణ్యలోకములో కల్పము (వేయి మహాయుగములు) ఆయుర్దాయము కలిగి మరల జన్మించుట కంటె, భారతభూమిలో పుట్టి

అల్పమగు ఆయుర్దాయమును కలిగియుండుటయే మేలు. ఏలయనగా, భారతభూమిలో పుట్టిన వివేకవంతులు ఆ నశ్వరమగు దేహముతోనే ఆ అల్పకాలములోనే చేసిన కర్మను ఒక్క క్షణములో శ్రీహరికి సమర్పించి, భయరహితమగు శ్రీహరిపదము (మోక్షము) ను చక్కగా పొందెదరు.

న యత్ర వైకుంఠకథాసుధాపగా
న సాధవో భాగవతాస్తదాశ్రయాః ।
న యత్ర యజ్ఞేశమఖా మహోత్సవాః
సురేశలోకోఽపి న వై స సేవ్యతామ్ ।। 24

యత్ర - ఎక్కడనైతే, వైకుంఠకథాసుధా-ఆపగాః - శ్రీహరియొక్క గాథలు అనే అమృతనదులు, న - లేవో, భాగవతాః - భగవద్భక్తులు, తద్-ఆశ్రయాః - భగవంతుడే ఆశ్రయముగా గలవారు అగు, సాధవః - సాధు పురుషులు, న - లేరో, యత్ర - ఎక్కడనైతే, యజ్ఞ-ఈశమఖాః - యజ్ఞేశ్వరుడగు శ్రీహరియొక్క యజ్ఞములు, మహా-ఉత్సవాః - గొప్ప ఉత్సవములు, న - లేవో, సః - అది, సుర-ఈశలోకః అపి - ఇంద్రలోకమే అయిననూ, న సేవ్యతామ్ - సేవించబడకుండు గాక!, వై - నిశ్చయము.

ఎక్కడనైతే శ్రీహరియొక్క గాథలు అనే అమృతనదులు లేవో, భగవంతుని శరణు వేడిన భగవద్భక్తులగు సాధు పురుషులు లేరో, ఆ యజ్ఞేశ్వరుని ఆరాధించే యజ్ఞములు మరియు కీర్తించే గొప్ప ఉత్సవములు లేవో, అట్టి స్థానము ఇంద్రలోకమే అయిననూ, దానికి దూరముగా నుండదగును. ఇది నిశ్చయము.

ప్రాప్తా నృజాతిం త్విహ యే చ జంతవో
జ్ఞానక్రియాద్రవ్యకలాపసంభృతామ్ ।
న వై యతేరన్నపునర్భవాయ తే
భూయో వనౌకా ఇవ యాంతి బంధనమ్ ।। 25

ఇహ - ఈ లోకమునందు, జ్ఞానక్రియాద్రవ్యకలాపసంభృతామ్ - జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు పంచభూతముల సముదాయముచే

సమకూర్చబడిన, నృజాతిమ్ - మనుష్యజన్మను, ప్రాప్తాః - పొందిన, యే చ - ఏ, జంతవః తు - ప్రాణులైతే, నపునః-భవాయ - మరల పుట్టుక లేని మోక్షము కొరకు, న యతేరన్ - ప్రయత్నించరో, తే - వారు, వై - నిశ్చయము, భూయః - మరల, వన-ఓకాః ఇవ - అడవియందుండే పక్షులు వలె, బంధనం ఏవ - బంధనమునే, యాంతి - పొందెదరు.

మనుష్యదేహము జ్ఞానేంద్రియములతో, కర్మేంద్రియములతో మరియు పంచభూతములతో సంపన్నమై యున్నది. అట్టి దేహముతో ఈ భారతదేశములో పుట్టిన జనులు మరల పుట్టుక లేని మోక్షము కొరకు ప్రయత్నించవలెను. అట్లు చేయనిచో, వేటగాని వలనుండి విడుదల అయిన పిదప కూడ మరల నూకల లోభముతో వానికే చిక్కే పక్షులు వలె, ఆ జనులు మరల సంసారబంధమునే పొందెదరు. ఇది నిశ్చయము.

యైశ్శ్రద్ధయా బర్హిషి భాగశో హవిః
నిరుప్తమిష్టం విధిమంత్రవస్తుతః ।
ఏకః పృథఙ్నామభిరాహుతో ముదా
గృహ్ణాతి పూర్ణస్స్వయమాశిషాం ప్రభుః ॥ 26

ఏకః - అద్వితీయుడు, పూర్ణః - పూర్ణుడు, ఆశిషామ్ - పురుషార్థ ములకు, ప్రభుః - ప్రభుడగు శ్రీహరి, యైః - ఏ భారతీయులచే, బర్హిషి - యజ్ఞమునందు, శ్రద్ధయా - శ్రద్ధతో, పృథక్-నామభిః - వేర్వేరు పేర్లతో, ఆహుతః - ఆహ్వానించబడినవాడై, విధిమంత్రవస్తుతః - యథావిధిగా మంత్రములతో పదార్థము సరిగా ఉండునట్లుగా, ఇష్టమ్ - దేవతనుద్దేశించి సమర్పించబడినట్టియు, భాగశః - ఎవరి భాగములు వారికి ఉండునట్లుగా, నిరుప్తమ్ - వేరు చేయబడిన, హవిః - హోమద్రవ్యమును, ముదా - ఆనం దముతో, స్వయమ్ - స్వయముగా, గృహ్ణాతి - స్వీకరించునో.

భారతీయులు యజ్ఞములో ఖచ్చితముగా నిర్దేశించబడిన హోమ ద్రవ్యములను ఆయా దేవతలకు భాగములను విడిదీసి, ఆ దేవతలను వేర్వేరు నామములతో ఆహ్వానించి, యథావిధిగా మంత్రములతో శ్రద్ధగా హోమము చేసెదరు. అపుడు అద్వితీయుడు (సర్వదేవతాస్వరూపుడు),

పూర్ణుడు, పురుషార్థములను అనుగ్రహించువాడు అగు ఆ శ్రీహరియే స్వయముగా ఆనందముతో ఆ హోమద్రవ్యమును స్వీకరించును.

సత్యం దిశత్యర్థితమర్థితో నృణాం
నైవార్థదో యత్పునరర్థితా యతః ।
స్వయం విధత్తే భజతామనిచ్ఛతా-
మిచ్ఛాపిధానం నిజపాదపల్లవమ్ ॥ 27

నృణామ్ - మానవులకు, అర్థితః - కోరబడినవాడై, అర్థితమ్ - కోరబడిన ఫలమును, దిశతి - ఇచ్చుచున్నాడు, సత్యమ్ - యథార్థము, న ఏవ అర్థదః - పరమార్థమును ఇచ్చువాడు కానే కాడు, యత్ - ఏ విధము గానైతే, పునః - మరల, అర్థితా - కోరే స్థితియో, యతః - ఏలయనగా, అనిచ్ఛతామ్ - కోరికలు లేనట్టియు, భజతామ్ - సేవించువారలకు, ఇచ్ఛాపిధానమ్ - కోరికలను కప్పివేసే, నిజపాదపల్లవమ్ - తన చిగురువంటి పాదమును, స్వయమ్ - తనంత తానుగా, విధత్తే - అనుగ్రహించును.

మానవులు కోరికతో భగవానుని సేవించినచో, వారికి ఆయన ఆ కోరికను తీర్చును. ఇది యథార్థము. కాని, ఆ విధముగా కోరికను తీర్చుటలో భగవానుడు పరమార్థమగు మోక్షమునిచ్చినట్లు అగుట లేదు. ఏలయన, ఆ భోగము క్షయమైన తరువాత ఆ భక్తుడు మరల మరియొక కోరికతో ముందుకు వచ్చును. కాని, కోరికలు లేకుండా భగవానుని సేవించువారలకు ఆయన స్వయముగా తన చిగురువలె సుకుమారమైన పాదము ననుగ్రహించును. ఆ అనుగ్రహము వలన వారి సకలకామనలు ఈడేరినట్లే యగును.

యద్యత్ర నస్స్వర్గసుఖావశేషితం
స్విష్టస్య సూక్తస్య కృతస్య శోభనమ్ ।
తేనాజనాభే స్మృతిమజ్జన్మ నస్స్యాద్
వర్షే హరిర్యద్భజతాం శం తనోతి ॥ 28

అత్ర - ఈ కాలమునందు, నః - మాకు, స్విష్టస్య - చక్కటి యజ్ఞ మునకు, సూక్తస్య - మంచి మాటకు, కృతస్య - కర్మకు, స్వర్గసుఖ-అవశే షితమ్ - స్వర్గమునందలి సుఖముకంటె మిగిలిన, శోభనమ్ - పుణ్యము, యది - ఉన్నచో, తేన - దానిచే, నః - మాకు, అజనాభే వర్షే - అజనాభ వర్షమునందు, స్మృతిమత్ - స్మరణముతో గూడిన, జన్మ - పుట్టుక, స్యాత్ - కలుగు గాక!, యత్ - ఏలయనగా, హరిః - శ్రీహరి, భజతామ్ - భక్తుల కు, శమ్ - సుఖమును, తనోతి - విస్తరింప జేయుచున్నాడు.

మేము చక్కటి యజ్ఞములను మరియు ఇతరకర్మలను చేసి, మంచి పలుకులను పలికి, ఆ పుణ్యముచే స్వర్గసుఖమును అనుభవించు చుంటిమి. ఇంకనూ ఆ పుణ్యము ఈ నాటివరకు మిగిలియున్నచో, దాని ప్రభావముచే మాకు అజనాభ వర్షము (భారత దేశము) నందు శ్రీహ రియొక్క స్మృతితో కూడిన మనుష్యజన్మ కలుగుగాక! ఏలయనగా, శ్రీహరి తన భక్తులకు ఆత్మానందమును అనుగ్రహించును.

శ్రీశుక ఉవాచ ।
జంబూద్వీపస్య చ రాజన్నుపద్వీపానష్టౌ హైక ఉపదిశంతి సగ
రాత్మజైరశ్వాన్వేషణ ఇమాం మహీం పరితో నిఖనద్భిరుపక
ల్పితాన్ ।। 29

రాజన్ - ఓ రాజా!, జంబూద్వీపస్య - జంబూద్వీపమునకు, అశ్వ -అన్వేషణే - గుఱ్ఱమును వెదుకుటయందు, ఇమామ్ - ఈ, మహీమ్ - భూమిని, పరితః - చుట్టూ, నిఖనద్భిః - త్రవ్వుచున్న, సగర-ఆత్మజైః - సగరుని పుత్రులచే, ఉపకల్పితాన్ - ఏర్పడిన, అష్టౌ - ఎనిమిది, ఉపద్వీ పాన్ చ - ఉపద్వీపములను కూడ, ఏకే - కొందరు, ఉపదిశంతి హ - వర్ణించుచున్నారు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! సగరుని పుత్రులు యజ్ఞాశ్వమును వెదుకుతూ భూమిని చుట్టూ త్రవ్వినారు. ఆ సమ యులో జంబూద్వీపమునందు ఎనిమిది ఉపద్వీపములు ఏర్పడినవని కొందరు వర్ణించుచున్నారు.

తద్యథా స్వర్ణప్రస్థశ్చంద్రశుక్ల ఆవర్తనో రమణకో మందరహ
రిణః పాంచజన్యస్సింహలో లంకేతి || 30

తత్ - ఆ సమాచారము, యథా - ఎట్లనగా, స్వర్ణప్రస్థః - స్వర్ణప్రస్థము, చంద్రశుక్లః - చంద్రశుక్లము, ఆవర్తనః - ఆవర్తనము, రమణకః - రమణకము, మందరహరిణః - మందరహరిణము, పాంచజన్యః - పాంచజన్యము, సింహలః - సింహళము, లంకా - లంక, ఇతి - అని.

ఆ ఉపద్వీపములు పేర్లు ఇవి --- స్వర్ణప్రస్థము, చంద్రశుక్లము, ఆవర్తనము, రమణకము, మందరహరిణము, పాంచజన్యము, సింహళము మరియు లంక.

ఏవం తవ భారతోత్తమ జంబూద్వీపవర్షవిభాగో యథోపదేశ
ముపవర్ణిత ఇతి || 31

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే శ్రీరామ మంత్రస్తుతివర్ణనం
భారతదేశమహిమవర్ణనం నామ ఏకోనవింశోఽధ్యాయః ||

భారత-ఉత్తమ - భరతవంశీయులలో ఉత్తముడా!, ఏవమ్ - ఈ విధముగా, తవ - నీకు, జంబూద్వీపవర్షవిభాగః - జంబూద్వీపమునందలి ఖండముల విభాగము, యథా-ఉపదేశమ్ - గురువుయొక్క ఉపదేశమున తిక్రమించకుండగా, ఉపవర్ణితః - వర్ణించబడినది, ఇతి - అని.

భరతవంశీయులలో ఉత్తముడవగు ఓ పరీక్షిన్మహారాజా! ఈ విధముగా నేను నీకు జంబూద్వీపములోని ఖండముల విభాగమును మా గురువు గారు చెప్పిన విధముగా వర్ణించి చెప్పితిని, అని శుకుడు పలికెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో
శ్రీరామ మంత్రస్తోత్రములను, భారతదేశ మహిమను వర్ణించే
పంతొమ్మిదవ అధ్యాయము ముగిసినది (19).

*****

# అథ వింశోऽధ్యాయః

## విస్తృతమగు భువనకోశ వర్ణనము

శ్రీశుక ఉవాచ ।
అతః పరం ప్లక్షాదీనాం ప్రమాణలక్షణసంస్థానతో వర్షవిభాగ ఉపవర్ణ్యతే ॥ 1

అతః పరమ్ - ఈ పైన, ప్రమాణలక్షణసంస్థానతః - పరిమాణము లక్షణములు స్థితి అనువాటిననుసరించి, ప్లక్ష-ఆదీనామ్ - ప్లక్షము మొదలైన ద్వీపములయొక్క, వర్షవిభాగః - ఖండముల విభాగము, ఉపవర్ణ్యతే - వర్ణించబడుచున్నది.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఈపైన నేను ప్లక్షము మొదలగు ద్వీపముల పరిమాణమును, వాటి లక్షణములను, స్థితిని, ఆకారమును వర్ణించి చెప్పెదను.

జంబూద్వీపోऽయం యావత్ప్రమాణవిస్తారస్తావతా క్షారోదధినా పరివేష్టితో యథా మేరుర్జంబ్వాఖ్యేన లవణోదధిరపి తతో ద్విగుణ విశాలేన ప్లక్షాఖ్యేన పరిక్షిప్తో యథా పరిఖా బాహ్యోపవనేన । ప్లక్షో జంబూప్రమాణో ద్వీపాఖ్యాకరో హిరణ్మయ ఉత్థితో యత్రాగ్నిరుపాస్తే సప్తజిహ్వస్తస్యాధిపతిః ప్రియవ్రతాత్మజ ఇధ్మజిహ్వస్స్వం ద్వీపం సప్తవర్షాణి విభజ్య సప్తవర్షనామభ్య ఆత్మజేభ్య ఆకలయ్య స్వయమాత్మయోగేనోపరరామ ॥ 2

మేరుః - మేరుపర్వతము, జంబూ-ఆఖ్యేన - జంబు అనే పేరు గల ద్వీపముచేతను వలె, అయమ్ - ఈ, జంబూద్వీపః - జంబూద్వీప

ము, యావత్ - ఎంత, ప్రమాణవిస్తారః - పరిమాణము వైశాల్యము కలది యో, తావతా - అంతటి, క్షార-ఉదధినా - ఉప్పు సముద్రముచే, పరివేష్టితః - చుట్టువారబడి యున్నది, పరిఖా - అగడ్త, బాహ్య-ఉపవనేన యథా - బయటనుండే ఉద్యానము చేతను వలె, లవణ-ఉదధిః అపి - ఉప్పు సముద్రము కూడ, తతః - దానికంటె, ద్విగుణవిశాలేన - రెండు రెట్లు వైశాల్యము గల, ప్లక్ష-ఆఖ్యేన - ప్లక్షము అనే పేరు గల ద్వీపముచే, పరిక్షిప్తః - చుట్టువారబడి యున్నది, జంబూప్రమాణః - నేరేడు చెట్టుయొక్క పరిమాణము గల, హిరణ్మయః - బంగరు, ప్లక్షః - జువ్వి చెట్టు, ద్వీప-ఆఖ్యాకరః - ద్వీపమునకు పేరును తెచ్చినది, యత్ర - ఎచ్చట నైతే, ఉత్థితః - ప్రజ్వరిల్లిన, సప్తజిహ్వః - ఏడు నాలుకలు గల, అగ్నిః - అగ్ని, ఉప - దగ్గరలో, ఆస్తే - ఉన్నాడో, తస్య - ఆ ద్వీపమునకు, అధిపతిః - ప్రభువు, ప్రియవ్రత-ఆత్మజః - ప్రియవ్రతుని పుత్రుడు అగు, ఇధ్మజిహ్వః - ఇధ్మజిహ్వుడు, స్వమ్ - తనదైన, ద్వీపమ్ - ద్వీపమును, సప్తవర్షాణి - ఏడు ఖండములుగా, విభజ్య - విడగొట్టి, సప్తవర్షనామభ్యః - ఏడు ఖండముల పేర్లు గల, ఆత్మజేభ్యః - పుత్రుల కొరకు, ఆకలయ్య - ఇచ్చి, స్వయమ్ - తాను, ఆత్మయోగేన - ఆత్మనిష్ఠచే, ఉపరరామ-విరమించెను.

మేరుపర్వతము చుట్టూ జంబూద్వీపము ఉన్నట్లుగానే, ఈ జంబూద్వీపము చుట్టూ ఆ ద్వీపముతో సమానమగు పరిమాణ వైశాల్యములు గల ఉప్పు సముద్రము గలదు. అగడ్త చుట్టూ ఉండే ఉద్యానవనము వలె ఆ ఉప్పు సముద్రము చుట్టూ కూడ దానికి రెండు రెట్లు వైశాల్యము గల ప్లక్షద్వీపము గలదు. జంబూద్వీపమునందలి నేరేడు చెట్టుతో సమానమగు పరిమాణము గల ప్లక్ష (జువ్వి ) అనే బంగరు చెట్టు ఉండుట చేతనే ఆ ద్వీపమునకు ప్లక్షద్వీపము అని పేరు వచ్చినది. అచట ఏడు జిహ్వల (కాలి, కరాలి, మనోజవ, సులోహిత, సుధూమ్రవర్ణ, స్ఫులింగిని, విశ్వరుచి) తో ప్రజ్వరిల్లే అగ్ని ఆ చెట్టుకు దగ్గరలో నుండును. ప్రియవ్రతుని కుమారుడగు ఇధ్మజిహ్వుడు ఆ ద్వీపమునకు ప్రభువు. ఆయన తన ద్వీపమును ఏడు ఖండములుగా విభజించి, ఆ ఖండముల పేర్లు గల తన ఏడ్గురు కొడుకులకు వాటిని పంచి యిచ్చి, ఆయన తాను ఆత్మనిష్ఠుడై లోకవ్యవహారములనుండి విరమించెను.

శివం యవసం సుభద్రం శాంతం క్షేమమమృతమభయమితి
వర్షాణి తేషు గిరయో నద్యశ్చ సప్తైవాభిజ్ఞాతాః ।। 3

శివమ్ - శివము, యవసమ్ - యవసము, సుభద్రమ్ - సుభద్రము, శాంతమ్ - శాంతము, క్షేమమ్ - క్షేమము, అమృతమ్ - అమృతము, అభయమ్ - అభయము, ఇతి - అని, వర్షాణి - వర్షములు, తేషు - వాటియందు, గిరయః - పర్వతములు, నద్యః చ - నదులు కూడ, అభిజ్ఞాతాః - ప్రసిద్ధములైనవి, సప్త ఏవ - ఏడే.

శివము, యవసము, సుభద్రము, శాంతము, క్షేమము, అమృతము మరియు అభయము అనునవి ఆ వర్షముల పేర్లు. వాటిలో ప్రసిద్ధములైన పర్వతములు ఏడు, నదులు కూడ ఏడు గలవు.

మణికూటో వజ్రకూట ఇంద్రసేనో జ్యోతిష్మాన్ సుపర్ణో హిరణ్యష్ఠీవో మేఘమాల ఇతి సేతుశైలాః । అరుణా నృమ్ణాఽఽంగిరసీ సావిత్రీ సుప్రభాతా ఋతంభరా సత్యంభరా ఇతి మహానద్యః । యాసాం జలోపస్పర్శనవిధూతరజస్తమసో హంసపతంగోర్ధ్వాయనసత్యాంగసంజ్ఞాశ్చత్వారో వర్ణాస్సహస్రాయుషో విబుధోపమసందర్శనప్రజననాస్స్వర్గద్వారం త్రయ్యా విద్యయా భగవంతం త్రయీమయం సూర్యమాత్మానం యజంతే ।। 4

మణికూటః - మణికూటము, వజ్రకూటః - వజ్రకూటము, ఇంద్రసేనః - ఇంద్రసేనము, జ్యోతిష్మాన్ - జ్యోతిష్మంతము, సుపర్ణః -సుపర్ణము, హిరణ్యష్ఠీవః - హిరణ్యష్ఠీవము, మేఘమాలః - మేఘమాలము, ఇతి - అనేవి, సేతుశైలాః - సేతు (హద్దులను నిర్ధారించే) పర్వతములు, అరుణా - అరుణ, నృమ్ణా - నృమ్ణ, ఆంగిరసీ - ఆంగిరసి, సావిత్రీ - సావిత్రి, సుప్రభాతా - సుప్రభాత, ఋతంభరా - ఋతంభర, సత్యంభరా - సత్యంభర, ఇతి - అనునవి, మహానద్యః - గొప్ప నదులు, యాసామ్ - వేటియొక్క, జల-ఉపస్పర్శనవిధూతరజస్తమసః - నీటియందు స్నానము చేయుటచే కడిగివేయబడిన రజోగుణ తమోగణములు గల, హంసపతంగ-ఊర్ధ్వాయనసత్యాంగసంజ్ఞాః - హంస పతంగ ఊర్ధ్వాయన మరియు

సత్యాంగ అనే పేర్లు గల, చత్వారః - నాలుగు, వర్ణాః - వర్ణములవారు, సహస్ర-ఆయుషః - వేయి సంవత్సరముల ఆయుర్దాయము గలవారై, విబుధ-ఉపమసందర్శనప్రజననాః - దేవతలతో పోల్చదగిన అలసట లేని చెమట పట్టని రూపము మరియు సంతానోత్పత్తి కలవారై, త్రయ్యా - వేద రూపమైన, విద్యయా - విద్యచే, స్వర్గద్వారమ్ - స్వర్గమునకు ద్వారమైన ట్టియు, త్రయీమయమ్ - వేదములచే ప్రతిపాదించబడే, సూర్యం భగవం తమ్ - సూర్య భగవానుని, ఆత్మానమ్ - ఆత్మరూపముగా, యజంతే - ఆరాధించెదరు.

మణికూటము, వజ్రకూటము, ఇంద్రసేనము, జ్యోతిష్మంతము, సుపర్ణము, హిరణ్యష్ఠీవము, మేఘమాలము అనే పర్వతములు ఆ ఖండ ముల హద్దులను నిర్ధారించుచున్నవి. అరుణ, నృమ్ణ, ఆంగిరసి, సావిత్రి, సుప్రభాత, ఋతంభర, సత్యంభర అను గొప్ప నదులు ప్లక్షద్వీపమునందు గలవు. అచట హంస, పతంగ, ఊర్ధ్వాయన, సత్యాంగ అనే పేర్లు గల నాలుగు వర్ణముల వారు గలరు. ఆ నదీజలములలో స్నానమును చేయుట చే, వారియందలి రజోగుణ తమోగుణములు కడిగివేయబడినవి. వేయి సంవత్సరములు జీవించే ఆ జనులకు దేవతల వలె అలసట గాని, చెమట పట్టుట గాని ఉండదు. మరియు, వారు సంతానోత్పత్తియందు కూడ దేవత లను పోలియుందురు. వేదప్రతిపాద్యుడగు సూర్యభగవానుని వేదోక్తమగు ఉపాసననను సరించి ఆరాధించువారికి సూర్యుడు స్వర్గమునను గ్రహించు ను. వారు సూర్యుని ఆత్మరూపముగా ఆరాధించెదరు.

ప్రత్నస్య విష్ణో రూపం యత్సత్యస్య ర్తస్య బ్రహ్మణః ।
అమృతస్య చ మృత్యోశ్చ సూర్యమాత్మానమీమహీతి ।। 5

యత్ - ఏ సూర్యమండలము, ప్రత్నస్య - కాలాతీతుడగు, విష్ణోః - విష్ణువుయొక్క, రూపమ్ - రూపమో, సత్యస్య - సత్యమునకు, ఋతస్య - ఋతమునకు, బ్రహ్మణః - వేదమునకు, అమృతస్య - అమృత త్వమునకు, మృత్యోః చ - మృత్యువునకు కూడ, ఆత్మానమ్ - స్వరూప మైన, సూర్యమ్ - సూర్యుని, ఈమహి - శరణు వేడుచున్నాము, ఇతి - అని.

కాలాతీతుడగు విష్ణువుయొక్క రూపమే సూర్యమండలము. ఋతము (శాస్త్రానుసారముగా నిశ్చయించబడిన కర్తవ్యము), సత్యము (వాక్కాయములతో నిర్వహించబడిన కర్తవ్యము), వేదము, మోక్షము మరియు మరణములకు అధిష్ఠానము సూర్యుడే. ఆ సూర్యుని మేము శరణు వేడుచున్నాము, అని వారు స్తుతించెదరు.

ప్లక్షాదిషు పంచసు పురుషాణామాయురింద్రియమోజస్సహో బలం బుద్ధిర్విక్రమ ఇతి చ సర్వేషామౌత్పత్తికీ సిద్ధిరవిశేషేణ వర్తతే ॥16

ప్లక్ష-ఆదిషు - ప్లక్షము మొదలుగా గల, పంచసు - అయిదు ద్వీపములయందు, సర్వేషాం పురుషాణామ్ - అందరు వ్యక్తులకు, ఆయుః - ఆయుర్దాయము, ఇంద్రియమ్ - ఇంద్రియము, ఓజః - మనోబలము, సహః - ఇంద్రియబలము, బలమ్ - శరీరబలము, బుద్ధిః - బుద్ధి, విక్రమః - పరాక్రమము, ఇతి - అనే, ఔత్పత్తికీ - సహజమైన, సిద్ధిః - సిద్ధి, అవిశేషేణ - తేడా లేకుండగా, వర్తతే - ఉండును.

ప్లక్షద్వీపము మొదలగు అయిదు ద్వీపములయందు జనులకు ఆయుర్దాయము, ప్రజనన సామర్థ్యము, మనోబలము, ఇంద్రియపాటవము, శరీరబలము, బుద్ధిబలము, పరాక్రమము అనే లక్షణములు అందరిలో సమానముగా సహజసిద్ధములై యుండును.

ప్లక్షస్స్వసమానేనేక్షురసోదేనావృతో యథా తథా ద్వీపోఽపి శాల్మలో ద్విగుణవిశాలస్సమానేన సురోదేనావృతః పరివృంక్తే ॥17

యథా - ఏ విధముగానైతే, ప్లక్షః - ప్లక్షద్వీపము, స్వసమానేన - తనతో సమానమైన, ఇక్షురసోదేన - చెరుకు రసపు సముద్రముచే, ఆవృతః - చుట్టువారబడి యున్నదో, తథా - అదే విధముగా, ద్విగుణవిశాలః - రెండు రెట్లు వైశాల్యము గల, శాల్మలః ద్వీపః అపి - శాల్మల ద్వీపము కూడ, సమానేన - సమానమైన, సురోదేన - మదిరా సముద్రముచే, ఆవృతః - చుట్టువారబడి యున్నదై, పరివృంక్తే - అంతటా విరాజిల్లును.

ప్లక్షద్వీపము చుట్టూ దానితో సమానమైన వైశాల్యము గల చెరుకు రసపు సముద్రము చుట్టువారి యున్నది. అదే తీరున, ప్లక్షమునకు రెట్టింపు వైశాల్యము గల శాల్మల ద్వీపము కూడ, తనతో సమానమైన వైశాల్యము గల మదిరా సముద్రముచే చుట్టువారబడి అంతటా విరాజిల్లుచున్నది.

**యత్ర హ వై శాల్మలీ ప్లక్షాయామా యస్యాం వావ కిల నిలయమాహుర్భగవతశ్ఛందఃస్తుతః పతత్రిరాజస్య సా ద్వీపహూతయే ఉపలక్ష్యతే ।। 8**

యత్ర హ వై - ఏ శాల్మల ద్వీపమునందైతే, ప్లక్ష-ఆయామా - జువ్వి చెట్టుయొక్క నిడివి గల, శాల్మలీ - బూరుగు చెట్టు, ద్వీపహూతయే - ద్వీపముయొక్క పేరు కొరకు, ఉపలక్ష్యతే - కానవచ్చుచున్నదో, యస్యాం వావ - ఏ చెట్టునందైతే, భగవతః - భగవంతునకు, ఛందఃస్తుతః - మంత్రములతో స్తుతించే, పతత్రిరాజస్య - పక్షిరాజగు గరుత్మంతుని, నిలయమ్ - నివాసమును, ఆహుః కిల - చెప్పెదరో గదా!

శాల్మల ద్వీపమునందు జువ్వి చెట్టుతో సమానమైన నిడివిగల బూరుగు (శాల్మల) చెట్టు కానవచ్చును. దానిని బట్టియే ఆ ద్వీపమునకు ఆ పేరు వచ్చినది. తన అవయవములగు వేదమంత్రములతో శ్రీహరిని స్తుతించే పక్షిరాజగు గరుత్మంతుని నివాసము ఆ చెట్టుపైననే ఉన్నదని పెద్దలు చెప్పెదరు.

**తద్ద్వీపాధిపతిః ప్రియవ్రతాత్మజో యజ్ఞబాహుస్స్వసుతేభ్యస్సప్తభ్యస్తన్నామాని సప్తవర్షాణి వ్యభజత్సురోచనం సౌమనస్యం రమణకం దేవవర్షం పారిభద్రమాప్యాయనమవిజ్ఞాతమితి ।। 9**

తద్-ద్వీప-అధిపతిః - ఆ ద్వీపమునకు ప్రభువు, ప్రియవ్రత-ఆత్మజః - ప్రియవ్రతునకు పుత్రుడు అగు, యజ్ఞబాహుః - యజ్ఞబాహుడు, సప్తభ్యః - ఏడ్గురు, స్వసుతేభ్యః - తన పుత్రుల కొరకు, సురోచనమ్ - సురోచనము, సౌమనస్యమ్ - సౌమనస్యము, రమణకమ్ - రమణకము, దేవవర్షమ్ - దేవవర్షము, పారిభద్రమ్ - పారిభద్రము, ఆప్యాయనమ్ - ఆప్యాయనము, అవిజ్ఞాతమ్ - అవిజ్ఞాతము, ఇతి - అనే, తత్-నామాని -

వారి పేర్లు గల, సప్తవర్షాణి - ఏడు ఖండములను, వ్యభజత్ - పంచి యిచ్చెను.

ఆ ద్వీపమునకు ప్రియవ్రతుని పుత్రుడగు యజ్ఞబాహుడు ప్రభువు. ఆయనకు ఏడ్గురు కొడుకులు గలరు. ఆయన ఆ ద్వీపమును సురోచనము, సౌమనస్యము, రమణకము, దేవవర్షము, పారిభద్రము, ఆప్యాయనము, అవిజ్ఞాతము అనే ఏడు ఖండములుగా విడగొట్టి తన ఏడ్గురు కొడుకులకు పంచి యిచ్చెను. వారి పేర్లే ఆ వర్షములకు వచ్చినవి.

తేషు వర్షాద్రయో నద్యశ్చ సప్తైవాభిజ్ఞాతాస్స్వరసశ్శతశృంగో వామదేవః కుందో ముకుందః పుష్పవర్షస్సహస్రశ్రుతిరితి । అనుమతిస్సినీవాలీ సరస్వతీ కుహూ రజనీ నందా రాకేతి॥10

తేషు వాటియందు, వర్ష-అద్రయః - వర్ష పర్వతములు, నద్యః చ - నదులు కూడ, సప్త ఏవ - ఏడే, అభిజ్ఞాతాః - ప్రసిద్ధి చెందినవి, స్వరసః - స్వరసము, శతశృంగః - శతశృంగము, వామదేవః - వామదేవము, కుందః - కుందము, ముకుందః - ముకుందము, పుష్పవర్షః - పుష్పవర్షము, సహస్రశ్రుతిః - సహస్రశ్రుతి, ఇతి - అనునవి, అనుమతిః - అనుమతి, సినీవాలీ - సినీవాలి, సరస్వతీ - సరస్వతి, కుహూః - కుహు, రజనీ - రజని, నందా - నంద, రాకా - రాక, ఇతి - అనునవి.

వాటియందు స్వరసము, శతశృంగము, వామదేవము, కుందము, ముకుందము, పుష్పవర్షము, సహస్రశ్రుతి అనే ఏడు వర్ష పర్వతములు, అనుమతి, సినీవాలి, సరస్వతి, కుహు, రజని, నంద, రాక అనే ఏడు నదులు ప్రసిద్ధములైనవి.

తద్వర్షపురుషాశ్శ్రుతధరవీర్యధరవసుంధరేషంధరసంజ్ఞా భగవంతం వేదమయం సోమమాత్మానం వేదేన యజంతే ॥11

శ్రుతధరవీర్యధరవసుంధర-ఇషంధరసంజ్ఞాః - శ్రుతధరులు వీర్యధరులు వసుంధరులు ఇషంధరులు అనే పేర్లు గల, తద్-వర్షపురుషాః - ఆ వర్షములోని జనులు, వేదమయమ్ - వేదస్వరూపుడైన, సోమం భగవం

తమ్ - చంద్ర భగవానుని, వేదేన - వేదముచే, ఆత్మానమ్ - ఆత్మరూప ముగా, యజంతే - ఆరాధించెదరు.

ఆ వర్షములయందు శ్రుతధరులు, వీర్యధరులు, వసుంధరులు, ఇషంధరులు అనే పేర్లు గల వర్షముల జనులు వేదస్వరూపుడైన చంద్ర భగవానుని వేదమంత్రములతో ఆత్మరూపునిగా ఆరాధించెదరు.

స్వగోభిః పితృదేవేభ్యో విభజన్ కృష్ణశుక్లయోః ।
ప్రజానాం సర్వాసాం రాజాఽంధస్సోమో న ఆస్త్వితి ।। 12

కృష్ణశుక్లయోః - కృష్ణ శుక్ల పక్షములయందు, స్వగోభిః - తన కిర ణములతో, పితృదేవేభ్యః - పితృదేవతల కొరకు, అంధః - అన్నమును, విభజన్ - పంచి యిచ్చువాడు, సర్వాసామ్ - అందరు, ప్రజానామ్ - ప్రజ లకు, రాజా - రాజు అగు, సోమః - చంద్రుడు, నః - మాకు, ఆ-అస్తు - అభిముఖుడు అగుగాక!, ఇతి - అని.

కృష్ణ శుక్ల పక్షములలో చంద్రుడు తన కిరణములతో పితృదేవత లకు ఆహారమును పంచి యిచ్చును. ప్రజలందరికి రాజు (ఆహ్లాదకరుడు) అగు ఆ చంద్రుడు మాకు ప్రసన్నుడగు గాక! అని వారు ప్రార్థించెదరు.

ఏవం సురోదాద్బహిస్తద్ద్విగుణస్సమానేనావృతో ఘృతోదేన యథా పూర్వః కుశద్వీపో యస్మిన్ కుశస్తంబో దేవకృతస్తద్ద్వీపాఖ్యాకరో జ్వలన ఇవాపరస్స్వశష్పరోచిషా దిశో విరాజయతి ।। 13

ఏవమ్ - ఇదే విధముగా, సురోదాత్ - మదిరా సముద్రముకంటె, బహిః - బయట, తద్-ద్విగుణః - దానికి రెట్టింపు, కుశద్వీపః - కుశద్వీప ము, పూర్వః యథా - ముందటిది వలె, సమానేన - తనతో సమానమైన, ఘృతోదేన - నేయి సముద్రముచే, ఆవృతః - చుట్టువారబడినది, యస్మిన్ - దేనియందైతే, దేవకృతః - ఈశ్వరునిచే రచించబడినది, తద్-ద్వీప- ఆఖ్యాకరః - ఆ ద్వీపమునకు పేరును కలిగించినది అగు, కుశస్తంబః - దర్భ మొక్క, అపరః - రెండవ, జ్వలనః ఇవ - అగ్ని వలె, స్వశష్పరోచిషా -

తన లేత పరకల కాంతిచే, దిశః - దిక్కులను, విరాజయతి - ప్రకాశింప జేయుచున్నదో.

ఇదే విధముగా, మదిరా సముద్రమునకు బయట దానికి రెట్టింపు విశాలమైన కుశద్వీపము గలదు. దానికి కూడ, శాల్మలి ద్వీపమునకు చుట్టూ ఉన్నట్లే, అదే వైశాల్యము గల నేయి సముద్రము చుట్టూ ఉన్నది. ఆ ద్వీపమునందు ఈశ్వరునిచే రచించబడిన దర్భ (కుశ) మొక్క, రెండవ అగ్ని వలె, తన లేత పరకల కాంతిచే దిక్కులను ప్రకాశింప జేయుచున్నది. దానిని బట్టియే ఆ ద్వీపమునకు కుశద్వీపమని పేరు వచ్చినది.

తద్ద్వీపపతిః ప్రైయవ్రతో రాజన్ హిరణ్యరేతా నామ స్వం ద్వీపం సప్తభ్యస్స్వపుత్రేభ్యో యథాభాగం విభజ్య స్వయం తప ఆతిష్ఠత వసువసుదానదృఢరుచినాభిగుప్తస్తుత్యవ్రతవివిక్త వామదేవనామభ్యః ॥ 14

రాజన్ - ఓ రాజా!, తద్-ద్వీపపతిః - ఆ ద్వీపమునకు ప్రభువైన, హిరణ్యరేతాః నామ - హిరణ్యరేతసుడని ప్రసిద్ధి గాంచిన, ప్రైయవ్రతః - ప్రియవ్రతుని కుమారుడు, స్వమ్ - తనదైన, ద్వీపమ్ - ద్వీపమును, వసు వసుదానదృఢరుచినాభిగుప్తస్తుత్యవ్రతవివిక్తవామదేవనామభ్యః - వసువు వసుదానుడు దృఢరుచి నాభిగుప్తుడు స్తుత్యవ్రతుడు వివిక్తుడు వామదేవుడు అని ప్రసిద్ధి గాంచిన, సప్తభ్యః - ఏడ్గురు, స్వపుత్రేభ్యః - తన కొడుకుల కొరకు, యథాభాగమ్ - భాగముల నతిక్రమించకుండగా, విభజ్య - పంచి యిచ్చి, స్వయమ్ - తాను, తపః - తపస్సును, ఆతిష్ఠత - చేసెను.

ఓ పరీక్షిన్మహారాజా! హిరణ్యరేతసుడని ప్రసిద్ధి గాంచిన ప్రియవ్రతపుత్రుడు ఆ ద్వీపమునకు ప్రభువు. వసువు, వసుదానుడు, దృఢరుచి, నాభిగుప్తుడు, స్తుత్యవ్రతుడు, వివిక్తుడు, వామదేవుడు అని ప్రసిద్ధి గాంచిన తన ఏడ్గురు కొడుకులకు ఆయన తన ద్వీపమును వారి వారి భాగములను వారికి పంచియిచ్చెను. అపుడాయన తాను తపస్సు చేసుకొనెను.

తేషాం వర్షేషు సీమాగిరయో నద్యశ్చాభిజ్ఞాతాస్సప్త సప్తైవ చక్రశ్చతుశ్శృంగః కపిలస్త్రికూటో దేవానీక ఊర్ధ్వరోమా

ద్రవిణ ఇతి రసకుల్యా మధుకుల్యా మిత్రవిందా శ్రుతవిందా
దేవగర్భా ఘృతచ్యుతా మంత్రమాలేతి ॥ 15

తేషామ్ - వారి, వర్షేషు - వర్షములయందు, సీమాగిరయః - హద్దులను నిర్ధారించే పర్వతములు, సప్త - ఏడు, నద్యః చ - నదులు కూడ, సప్త ఏవ - ఏడు మాత్రమే, అభిజ్ఞాతాః - ప్రసిద్ధములైనవి, చక్రః - చక్రము, చతుశ్శృంగః - చతుశ్శృంగము, కపిలః - కపిలము, త్రికూటః - త్రికూటము, దేవానీకః - దేవానీకము, ఊర్ధ్వరోమా - ఊర్ధ్వరోమము, ద్రవిణః - ద్రవిణము, ఇతి - అని, రసకుల్యా - రసకుల్య, మధుకుల్యా - మధుకుల్య, మిత్రవిందా - మిత్రవింద, శ్రుతవిందా - శ్రుతవింద, దేవగర్భా - దేవగర్భ, ఘృతచ్యుతా - ఘృతచ్యుత, మంత్రమాలా - మంత్రమాల, ఇతి-అని.

వారి వర్షములయందు చక్రము, చతుశ్శృంగము, కపిలము, త్రికూటము, దేవానీకము, ఊర్ధ్వరోమము, ద్రవిణము అని ప్రసిద్ధి గాంచిన ఏడు పర్వతములు సీమలను నిర్ధారించును. రసకుల్య, మధుకుల్య, మిత్ర వింద, శ్రుతవింద, దేవగర్భ, ఘృతచ్యుత, మంత్రమాల అని ప్రసిద్ధి గాంచిన ఏడు నదులు క్రమముగా ఆ వర్షములయందు ప్రవహించును.

యాసాం పయోభిః కుశద్వీపౌకసః కుశలకోవిదాభియుక్తకులక
సంజ్ఞా భగవంతం జాతవేదసరూపిణం కర్మకౌశలేన యజంతే॥ 16

యాసామ్ - ఏ నదులయొక్క, పయోభిః - జలములచే, కుశద్వీప-ఓకసః - కుశద్వీపవాసులు, కుశలకోవిద-అభియుక్తకులకసంజ్ఞాః - కుశలురు కోవిదులు అభియుక్తులు కులకులు అనే పేర్లు గలవారు, జాతవేద సరూపిణమ్ - అగ్ని రూపములోనున్న, భగవంతమ్ - భగవానుని, కర్మకౌశలేన - కర్మలయందలి నేర్పుతో, యజంతే - ఆరాధించుచున్నారో.

కుశద్వీపములో నివసించే నాల్గు వర్ణముల వారికి కుశలురు, కోవిదులు, అభియుక్తులు, కులకులు అని పేర్లు. వారు ఆ నదుల జలములలో స్నానము చేసి, యజ్ఞాదికర్మలయందు తమకు గల నేర్పుతో అగ్నిరూపములోనున్న భగవానుని ఆరాధించుచున్నారు.

పరస్య బ్రహ్మణస్సాక్షాజ్జాతవేదోఽసి హవ్యవాట్ ।
దేవానాం పురుషాంగానాం యజ్ఞేన పురుషం యజేతి ।। 17

జాతవేదః - ఓ అగ్నీ!, సాక్షాత్ - సాక్షాత్తుగా, పరస్య బ్రహ్మణః - పరబ్రహ్మకు, హవ్యవాట్ - హోమద్రవ్యమును గొనిపోవువాడవు, అసి - అగుచున్నావు, పురుష-అంగానామ్ - పూర్ణుడగు పరబ్రహ్మయొక్క అవయవములైన, దేవానామ్ - దేవతలయొక్క, యజ్ఞేన - ఆరాధనముచే, పురుషమ్ - పూర్ణుడగు పరబ్రహ్మను, యజ - ఆరాధించుము, ఇతి - అని.

సర్వజ్ఞుడవు సర్వవ్యాపకుడవు అగు ఓ అగ్నీ! నీవు సాక్షాత్తుగా పరబ్రహ్మకు హోమద్రవ్యములను గొనిపోవుదువు. దేవతలందరు ఆ పూర్ణ బ్రహ్మయొక్క అవయవములే. కావున, వారికి మేము సమర్పించే హవిస్సులతో నీవు పూర్ణుడగు ఆ పరబ్రహ్మను ఆరాధించుము, అని వారు స్తుతించెదరు.

తథా ఘృతోదాద్బహిః క్రౌంచద్వీపో ద్విగుణస్స్వమానేన క్షీరోదేన పరిత ఉపక్లుప్తో వృతో యథా కుశద్వీపో ఘృతోదేన యస్మిన్ క్రౌంచో నామ పర్వతరాజో ద్వీపనామనిర్వర్తక ఆస్తే ।। 18

తథా - అదే విధముగా, ఘృతోదాత్ - నేయి సముద్రము కంటె, బహిః - బయట, ద్విగుణః - రెట్టింపు, క్రౌంచద్వీపః - క్రౌంచద్వీపము, స్వమానేన - తన వైశాల్యము గల, క్షీరోదేన - పాల సముద్రముతో, పరితః - చుట్టూ, ఉపక్లుప్తః - రచించబడి యున్నది, యథా - ఏ విధముగానైతే, కుశద్వీపః - కుశద్వీపము, ఘృతోదేన - నేయి సముద్రముతో (చుట్టబడి యున్నదో), యస్మిన్ - ఏ ద్వీపమునందు, క్రౌంచః నామ - క్రౌంచము అని ప్రసిద్ధి గాంచినది, ద్వీపనామనిర్వర్తకః - ద్వీపమునకు పేరును తెచ్చినది అగు, పర్వతరాజః - గొప్ప పర్వతము, ఆస్తే - ఉన్నదో.

అదే విధముగా, నేయి సముద్రమునకు బయట రెట్టింపు వైశాల్యము గల క్రౌంచద్వీపము గలదు. కుశద్వీపము చుట్టూ నేయి సముద్రము ఉన్నట్లే, క్రౌంచద్వీపము చుట్టూ ఈశ్వరునిచే పాల సముద్రము

రచించబడి యున్నది. క్రౌంచము అని ప్రసిద్ధి గాంచిన గొప్ప పర్వతము ఉండుట చేతనే, ఆ ద్వీపమునకు క్రౌంచద్వీపము అని పేరు వచ్చినది.

**యోఽసౌ గుహప్రహరణోన్మథితనితంబకుంజోఽపి క్షీరోదేనాసిచ్యమానో భగవతా వరుణేనాభిగుప్తో విభయో బభూవ ।।19**

యః - ఏ, అసౌ - ఈ పర్వతము, గుహప్రహరణ-ఉన్మథితనితంబకుంజః అపి - కుమారస్వామియొక్క శక్తిచే కలచివేయబడిన మధ్యభాగములు పొదరిళ్లు గలదియే అయిననూ, క్షీరోదేన - పాల సముద్రముచే, ఆసిచ్యమానః - అంతటా తడుపబడుచున్నదై, భగవతా వరుణేన - వరుణ భగవానునిచే, అభిగుప్తః - బాగా రక్షించబడినదై, విభయః - భయము లేనిదై, బభూవ - ఆయెనో.

ఈ పర్వతమును కుమారస్వామి శక్తితో గొట్టగా, దాని మధ్యభాగము మరియు అచటి పొదరిళ్లు కకావికలయ్యేను. కాని, పాల సముద్రము దీనిని అంతటా తడుపుచున్నది. వరుణదేవుడు కూడ దీనిని బాగా రక్షించుచుండును. కావుననే, ఈ పర్వతము నిర్భయమైనది.

**తస్మిన్నపి ప్రైయవ్రతో ఘృతపృష్ఠో నామాధిపతిస్స్వే ద్వీపే వర్షాణి సప్త విభజ్య తేషు పుత్రనామసు సప్త రిక్థాదాన్ వర్షపాన్నివేశ్య స్వయం భగవాన్ భగవతః పరమకల్యాణయశస ఆత్మభూతస్య హరేశ్చరణారవిందముపజగామ ।। 20**

తస్మిన్ అపి - ఆ క్రౌంచద్వీపమునందు కూడ, ప్రైయవ్రతః - ప్రియవ్రతుని కుమారుడు, ఘృతపృష్ఠః నామ - ఘృతపృష్ఠుడని ప్రసిద్ధి గాంచినవాడు, భగవాన్ - పూజనీయుడు అగు, అధిపతిః - ప్రభువు, స్వే - తనదైన, ద్వీపే - ద్వీపమునందు, సప్త - ఏడు, వర్షాణి - ఖండములను, విభజ్య - విభజించి, పుత్రనామసు - తన పుత్రుల పేర్లు గల, తేషు - వాటియందు, సప్త - ఏడ్గురు, రిక్థ-అదాన్ - (తండ్రి సంపదను అనుభవించే) కొడుకులను, వర్షపాన్ - వర్షములకు ప్రభువులనుగా, నివేశ్య - నిలబెట్టి, స్వయమ్ - తాను, పరమకల్యాణయశసః - మిక్కిలి మంగళకరమగు కీర్తి గలిగినట్టియు, ఆత్మభూతస్య - ఆత్మయై ఉన్న, భగవతః హరేః - శ్రీహరి

భగవానునియొక్క, చరణ-అరవిందమ్ - పాదపద్మమును, ఉపజగామ - శరణు వేడెను.

ఘృతపృష్ఠుడని ప్రసిద్ధి గాంచిన ప్రియవ్రత పుత్రుడు ఆ ద్వీపమునకు ప్రభువు. ఆయన తన ఆ ద్వీపమును ఏడు ఖండములుగా విభజించి, వాటికి తన ఏడ్గురు పుత్రులను అధిపతులుగా చేసెను. వారి పేర్లే ఆ వర్షములకు కూడ వచ్చినవి. పూజనీయుడగు ఆ ఘృతపృష్ఠుడు తాను సకల ప్రాణులలో ఆత్మరూపుడై యున్న శ్రీహరి భగవానుని పాదపద్మమును శరణు వేడెను. శ్రీహరియొక్క కీర్తి పరమమంగళకరము గదా!

ఆమో మధురుహో మేఘపృష్ఠస్సుధామా భ్రాజిష్ఠో లోహి
తార్ణో వనస్పతిరితి ఘృతపృష్ఠసుతాస్తేషాం వర్షగిరయస్సప్త
సప్తైవ నద్యశ్చాభిఖ్యాతాశ్శుక్లో వర్ధమానో భోజన ఉపబర్హిణో
నందో నందనస్సర్వతోభద్ర ఇతి అభయా అమృతౌఘా
ఆర్యకా తీర్థవతీ వృత్తిరూపవతీ పవిత్రవతీ శుక్లేతి ।। 21

ఆమః - ఆముడు, మధురుహః - మధురుహుడు, మేఘపృష్ఠః - మేఘపృష్ఠుడు, సుధామా - సుధాముడు, భ్రాజిష్ఠః - భ్రాజిష్ఠుడు, లోహితార్ణః - లోహితార్ణుడు, వనస్పతిః - వనస్పతి, ఇతి - అనువారలు, ఘృతపృష్ఠసుతాః - ఘృతపృష్ఠుని కుమారులు, శుక్లః - శుక్లము, వర్ధమానః - వర్ధమానము, భోజనః - భోజనము, ఉపబర్హిణః - ఉపబర్హిణము, నందః - నందము, నందనః - నందనము, సర్వతోభద్రః - సర్వతోభద్రము, ఇతి - అనునవి, తేషామ్ - వారి, సప్త - ఏడు, వర్షగిరయః - వర్షములయందలి పర్వతములు, అభయా - అభయ, అమృతౌఘా - అమృతౌఘ, ఆర్యకా - ఆర్యక, తీర్థవతీ - తీర్థవతి, వృత్తిరూపవతీ - వృత్తిరూపవతి, పవిత్రవతీ - పవిత్రవతి, శుక్లా - శుక్ల, ఇతి - అనే, సప్త ఏవ - ఏడే, నద్యః చ - నదులు కూడ, అభిఖ్యాతాః - ప్రసిద్ధి గాంచినవి.

ఆముడు, మధురుహుడు, మేఘపృష్ఠుడు, సుధాముడు, భ్రాజిష్ఠుడు, లోహితార్ణుడు, వనస్పతి అనువారలు ఘృతపృష్ఠుని కుమారులు. శుక్లము, వర్ధమానము, భోజనము, ఉపబర్హిణము, నందము, నందనము, సర్వ

తోభద్రము అనునవి వారి వర్షములలో ప్రసిద్ధిగాంచిన పర్వతములు. అభయ, అమృతౌఘ, ఆర్యక, తీర్థవతి, వృత్తిరూపవతి, పవిత్రవతి, శుక్ల అని ప్రసిద్ధి గాంచిన ఏడు నదులు ఆ వర్షములలో గలవు.

యాసామంభః పవిత్రమమలముపయుంజానాః పురుషఋష
భద్రవిణదేవకసంజ్ఞా వర్షపురుషా ఆపోమయం దేవమపాం
పూర్ణేనాంజలినా యజంతే ॥ 22

యాసామ్ - ఏ నదులయొక్క, పవిత్రమ్ - పావనమైనట్టియు, అమలమ్ - స్వచ్ఛమైన, అంభః - నీటిని, ఉపయుంజానాః - సేవించుచున్నవారు, పురుషఋషభద్రవిణదేవకసంజ్ఞాః - పురుషులు ఋషభులు ద్రవిణులు దేవకులు అనే పేర్లు గల, వర్షపురుషాః - వర్షమునందలి జనులు, ఆపోమయమ్ - జలరూపుడైన, దేవమ్ - దేవుని, అపాం పూర్ణేన - నీటితో నిండిన, అంజలినా - దోసిలితో, యజంతే - ఆరాధించుచున్నారు.

ఆ నదులలోని నీరు పావనము, స్వచ్ఛము. దానిని సేవించే ఆ వర్షములలోని నాలుగు వర్ణముల జనులకు క్రమముగా పురుషులు, ఋషభులు, ద్రవిణులు, దేవకులు అని పేర్లు. వారు జలముల రూపములోనున్న ఈశ్వరుని నీటితో నింపిన దోసిళ్లతో అర్ఘ్యమునిచ్చి ఆరాధించెదరు.

ఆపః పురుషవీర్యాః స్థ పునంతీర్భూర్భువస్సువః ।
తా నః పునీతామీవఘ్నీస్స్పృశతామాత్మనా భువ ఇతి ॥23

ఆపః - ఓ జలములారా!, పురుషవీర్యాః - ఈశ్వరుని సామర్థ్యము గలవి, స్థ - అగుచున్నారు, భూః - భూలోకమును, భువః - అంతరిక్షమును, సువః - స్వర్లోకమును, పునంతీః - పవిత్రము చేసే మీరు, ఆత్మనా - స్వరూపము చేతనే, ఈవఘ్నీః - పాపములను పోగొట్టెదరు, తాః - అట్టి మీరు, స్పృశతామ్ - స్పృశించుచున్న, నః - మా, భువః - దేహములను, పునీతామ్ - పవిత్రము చేయుదురు గాక!, ఇతి - అని.

ఓ జలములారా! మీయందు ఈశ్వరుని శక్తి గలదు. కావుననే, మీరు భూర్భువస్సువర్లోకములను పావనము చేయుచున్నారు.

స్వరూపము చేతనే పాపములను పోగొట్టే మీరు, మిమ్ములను స్పృశించు చున్న మా దేహములను పవిత్రము చేయుదురు గాక! అని వారు స్తుతించుచున్నారు.

ఏవం పురస్తాత్ క్షీరోదాత్పరిత ఉపవేశితశ్శాకద్వీపో ద్వావింశ
ల్లక్షయోజనాయామస్సమానేన చ దధిమండోదేన పరీతో
యస్మిన్ శాకో నామ మహీరుహస్స్వక్షేత్రవ్యపదేశకో యస్య
హ మహాసురభిగంధస్తం ద్వీపమనువాసయతి ॥ 24

ఏవమ్ - ఇదే విధముగా, క్షీరోదాత్ - పాల సముద్రముకంటె, పురస్తాత్ - ముందు, పరితః - చుట్టూ, ద్వావింశత్-లక్షయోజన-ఆయామః - ఇరవై రెండు లక్షల యోజనముల నిడివి గల, శాకద్వీపః - శాకద్వీపము, ఉపవేశితః - రచించబడి యున్నది, సమానేన - సమానమగు, దధిమండోదేన - పెరుగు సముద్రముతో, పరీతః - చుట్టువారబడియున్నది, యస్మిన్ - దేనియందైతే, శాకః నామ - శాకము అని ప్రసిద్ధి గాంచిన, మహీరుహః - చెట్టు, స్వక్షేత్రవ్యపదేశకః - తన ద్వీపమునకు పేరును తెచ్చినది, యస్య హ - దేనియొక్క, మహాసురభిగంధః - గొప్ప మనోహరమైన పరిమళము, తమ్ - ఆ, ద్వీపమ్ - ద్వీపమును, అనువాసయతి - సుగంధభరితము చేయుచున్నదో.

ఇదే విధముగా, పాల సముద్రమునకు ముందట చుట్టూ ఇరవై రెండు లక్షల యోజనముల నిడివి గల శాకద్వీపము ఈశ్వరునిచే రచించబడినది. అంతే వైశాల్యము గల పెరుగు సముద్రము దానిని చుట్టువారియున్నది. ఆ ద్వీపమునందు శాకము (టేకు) అని ప్రసిద్ధి గాంచిన చెట్టు గలదు. దాని వలననే, ఆ ద్వీపమునకు ఆ పేరు వచ్చినది. దాని గొప్ప మనోహరమైన పరిమళముచే ఆ ద్వీపమంతయు సుగంధభరితమై యుండును.

తస్యాపి ప్రైయవ్రత ఏవాధిపతిర్నామ్నా మేధాతిథిస్సోఽపి
విభజ్య సప్త వర్షాణి పుత్రనామాని తేషు స్వాత్మజాన్ పురోజవ
మనోజవపవమానధూమ్రానీకచిత్రరేఫబహురూపవిశ్వధా

రసంజ్ఞాన్నిధాప్యాధిపతీన్ స్వయం భగవత్యనంత ఆవేశితమ
తిస్తపోవనం ప్రవివేశ ॥ 25

**తస్య అపి** - దానికి కూడ, **అధిపతిః** - ప్రభువు, **ప్రైయవ్రతః ఏవ** - ప్రియవ్రతుని పుత్రుడే, **నామ్నా** - పేరుచే, **మేధాతిథిః** - మేధాతిథి, **సః అపి** - ఆయన కూడ, **పుత్రనామాని** - పుత్రుల పేర్లు గల, **సప్త** - ఏడు, **వర్షాణి** - వర్షములను, **విభజ్య** - విభజించి, **తేషు** - వాటియందు, **పురోజవమనోజవపవమానధూమ్రానీకచిత్రరేఫబహురూపవిశ్వధారసంజ్ఞాన్** - పురోజవుడు మనోజవుడు పవమానుడు ధూమ్రానీకుడు చిత్రరేఫుడు బహురూపుడు విశ్వధారుడు అనే పేర్లు గల, **స్వ-ఆత్మజాన్** - తన పుత్రులను, **అధిపతీన్** - ప్రభువులనుగా, **నిధాప్య** - ఉంచి, **స్వయమ్** - తాను, **అనంతే భగవతి** - అనంత భగవానునియందు, **ఆవేశితమతిః** - లగ్నము చేయబడిన మనస్సు గలవాడై, **తపోవనమ్** - తపోవనమును, **ప్రవివేశ** - ప్రవేశించెను.

ఆ శాకద్వీపమునకు కూడ ప్రియవ్రతుని కుమారుడే ప్రభువు. ఆయన పేరు మేధాతిథి. ఆయన కూడ ఆ ద్వీపమును ఏడు ఖండములుగా విభజించెను. ఆయనకు పురోజవుడు, మనోజవుడు, పవమానుడు, ధూమ్రానీకుడు, చిత్రరేఫుడు, బహురూపుడు, విశ్వధారుడు అనే ఏడ్గురు పుత్రులు గలరు. ఆయన వారిని ఆ ఏడు ఖండములకు అధిపతులుగా నియమించెను. ఆ ఖండములకు వారి పేర్లే వచ్చినవి. అపుడాయన తాను తన మనస్సును అనంత భగవానునియందు ఏకాగ్రము చేసి, తపస్సు కొరకై అడవికి వెళ్లెను.

ఏతేషాం వర్షమర్యాదాగిరయో నద్యశ్చ సప్త సప్తైవ ఈశాన
ఉరుశృంగో బలభద్రశ్శతకేసరస్సహస్రస్రోతో దేవపాలో మహా
నస ఇతి అనఘాఽఽయుర్దా ఉభయస్పృష్టిరపరాజితా పంచ
పదీ సహస్రస్రుతిర్నిజధృతిరితి ॥ 26

**ఏతేషామ్** - ఈ వర్షములకు, **ఈశానః** - ఈశానము, **ఉరుశృంగః** - ఉరుశృంగము, **బలభద్రః** - బలభద్రము, **శతకేసరః** - శతకేసరము, **సహస్రస్రోతః** - సహస్రస్రోతము, **దేవపాలః** - దేవపాలము, **మహానసః** - మహా

నసము, ఇతి - అనే, సప్త - ఏడు, వర్షమర్యాదాగిరయః - వర్షముల హద్దులను నిర్ధారించే పర్వతములు, అనఘా - అనఘ, ఆయుర్దా - ఆయుర్ద, ఉభయస్ప్రృష్టిః - ఉభయస్ప్రృష్టి, అపరాజితా - అపరాజిత, పంచపదీ - పంచపది, సహస్రస్రుతిః - సహస్రస్రుతి, నిజధృతిః - నిజధృతి, ఇతి - అనే, నద్యః చ - నదులు కూడ, సప్త ఏవ - ఏడే.

ఈశానము, ఉరుశృంగము, బలభద్రము, శతకేసరము, సహస్రస్రోతము, దేవపాలము, మహానసము అనే ఏడు పర్వతములు ఈ వర్షముల హద్దులను నిర్ధారించును. అనఘ, ఆయుర్ద, ఉభయస్ప్రృష్టి, అపరాజిత, పంచపది, సహస్రస్రుతి, నిజధృతి అనే ఏడు ప్రధానమైన నదులు కూడ ఆ ద్వీపమునందు ప్రవహించుచుండును.

తద్వర్షపురుషా ఋతవ్రతసత్యవ్రతదానవ్రతానువ్రతనామానో భగవంతం వాయ్వాత్మకం ప్రాణాయామవిధూతరజస్తమసః పరమసమాధినా యజంతే ।। 27

ఋతవ్రతసత్యవ్రతదానవ్రత-అనువ్రతనామానః - ఋతవ్రతులు సత్యవ్రతులు దానవ్రతులు అనువ్రతులు అని ప్రసిద్ధి గాంచినవారు, ప్రాణాయామవిధూతరజః-తమసః - ప్రాణాయామముచే తొలగించబడిన రజోగుణ తమోగుణములు గలవారు అగు, తద్-వర్షపురుషాః - ఆ వర్షములోని జనులు, వాయు-ఆత్మకమ్ - వాయురూపములోనుండే, భగవంతమ్ - భగవానుని, పరమసమాధినా - తీవ్రమగు ఏకాగ్రతచే, యజంతే - ఆరాధించెదరు.

ఆ వర్షములలోని నాల్గు వర్షముల వారికి క్రమముగా ఋతవ్రతులు, సత్యవ్రతులు, దానవ్రతులు, అనువ్రతులు అని ప్రసిద్ధి. వారందరు ప్రాణాయామమును చేసి, తమలోని రజస్తమోగుణములను నిర్మూలించుకున్నవారే. వారు తీవ్రమగు ఏకాగ్రతతో వాయురూపములోనున్న భగవానుని ఆరాధించుచుందురు.

**అంతః ప్రవిశ్య భూతాని యో బిభర్త్యాత్మకేతుభిః ।**
**అంతర్యామీశ్వరస్సాక్షాత్పాతు నో యద్వశే స్ఫుటమ్ ।।28**

యః - ఏ, ఈశ్వరః - ఈశ్వరుడు, అంతః - లోపల, ప్రవిశ్య - ప్రవేశించి, భూతాని - ప్రాణులను, ఆత్మకేతుభిః - తన వృత్తులచే, బిభర్తి - నిలబెట్టుచున్నాడో, సాక్షాత్ - సాక్షాత్తుగా, అంతః-యామీ - అంతర్యామియై, నః - మమ్ములను, పాతు - రక్షించు గాక!, స్ఫుటమ్ - దృశ్య జగత్తు, యద్-వశే - ఎవని వశములో నున్నదో.

ఈశ్వరుడు ప్రాణుల లోపల ప్రవేశించి తన ప్రాణాపానాదివృత్తులతో ప్రాణులను నిలబెట్టుచున్నాడు. సాక్షాత్తు అంతర్యామి (లోపలనుండి నియంత్రించువాడు) యై ఉన్న ఆయన మమ్ములను రక్షించు గాక! ఈ దృశ్య జగత్తు ఆయన వశములో నున్నది.

ఏవమేవ దధిమండోదాత్పరతః పుష్కరద్వీపస్తతో ద్విగుణాయామస్సమంతత ఉపకల్పితస్సమానేన స్వాదూదకేన సముద్రేణ బహిరావృతో యస్మిన్ బృహత్పుష్కరం జ్వలనశిఖామలకనకపత్రాయుతాయుతం భగవతః కమలాసనస్యాధ్యాసనం పరికల్పితమ్ ।। 29

ఏవం ఏవ - ఇదే విధముగా, దధిమండోదాత్ - పెరుగు సముద్రము కంటె, పరతః - తరువాత, పుష్కరద్వీపః - పుష్కరద్వీపము, తతః - దానికంటె, ద్విగుణ-ఆయామః - రెట్టింపు విస్తారము గలది, సమంతతః - చుట్టూ, ఉపకల్పితః - రచించబడి యున్నది, సమానేన - సమానమైన, స్వాదు-ఉదకేన - తియ్యని నీరు గల, సముద్రేణ - సముద్రముచే, బహిః - బయట, ఆవృతః - చుట్టువారబడి యున్నది, యస్మిన్ - ఏ ద్వీపమునందైతే, బృహత్ - పెద్దది, జ్వలనశిఖా-అమలకనకపత్ర-అయుత-అయుతమ్ - అగ్ని జ్వాలలవలె స్వచ్ఛమైన బంగరు రేకుల పది కోట్లు గలది, కమల-ఆసనస్య - పద్మమే ఆసనముగా గల, భగవతః - బ్రహ్మదేవునకు, అధి-ఆసనమ్ - గొప్ప ఆసనమైన, పుష్కరమ్ - పద్మము, పరికల్పితమ్ - రచించబడి యున్నదో.

ఇదే విధముగా, పెరుగు సముద్రము తరువాత దాని చుట్టూ దానికి రెట్టింపు వైశాల్యము గల పుష్కరద్వీపము ఈశ్వరునిచే రచించబడి

యున్నది. ఆ ద్వీపమునకు బయట చుట్టూ దానితో సమానమగు వైశాల్యము గల తియ్యని నీటి సముద్రము గలదు. ఆ ద్వీపమునందు పెద్ద పద్మము రచించబడి యున్నది. అది పద్మమే ఆసనముగా గల బ్రహ్మదేవుని గొప్ప ఆసనము. దానికి అగ్నిజ్వాలల వలె స్వచ్ఛమైన పది కోట్ల రేకులు గలవు.

తద్ద్వీపమధ్యే మానసోత్తరనామైక ఏవార్వాచీనపరాచీనవర్షయోర్మర్యాదాచలోఽయుతయోజనోచ్ఛ్రాయాయామో యత్ర తు చతసృషు దిక్షు చత్వారి పురాణి లోకపాలానామింద్రాదీనాం యదుపరిష్టాత్సూర్యరథస్య మేరుం పరిభ్రమతస్సంవత్సరాత్మకం చక్రం దేవానామహోరాత్రాభ్యాం పరిభ్రమతి।30

తద్-ద్వీపమధ్యే - ఆ ద్వీపమునకు మధ్యయందు, మానసోత్తరనామా - మానసోత్తరము అని ప్రసిద్ధి గాంచినది, అర్వాచీనపరాచీనవర్షయోః - తూర్పు పడమరలయందలి వర్షములకు, మర్యాదా-అచలః - హద్దును నిర్ధారించే పర్వతము, ఏకః ఏవ - ఒక్కటియే, అయుతయోజన-ఉచ్ఛ్రాయ-ఆయామః - పదివేల యోజనముల ఎత్తు నిడివి గలది, యత్ర తు - దేనియందైతే, చతసృషు - నాలుగు, దిక్షు - దిక్కులయందు, ఇంద్ర-ఆదీనామ్ - ఇంద్రుడు మొదలుగా గల, లోకపాలానామ్ - లోకపాలకుల, చత్వారి - నాలుగు, పురాణి - నగరములు గలవో, యద్-ఉపరిష్టాత్ - దేనికి పైన, మేరుమ్ - మేరు పర్వతమును, పరిభ్రమతః - చుట్టూ తిరుగుచున్న, సూర్యరథస్య - సూర్యుని రథముయొక్క, సంవత్సర-ఆత్మకమ్ - సంవత్సరమే స్వరూపముగా గల, చక్రమ్ - చక్రము, దేవానామ్ - దేవతల, అహః-రాత్రాభ్యామ్ - పగలు రాత్రులచే, పరిభ్రమతి - చుట్టూ తిరుగుచున్నదో.

ఆ పుష్కర ద్వీపమునకు మధ్యలో తూర్పు పడమర వర్షములకు హద్దును నిర్ధారిస్తూ, మానసోత్తరము అని ప్రసిద్ధి గాంచిన ఒకే ఒక పర్వతము గలదు. దాని ఎత్తు, నిడివి కూడ పదివేల యోజనములు ఉండును. దానియందు నాలుగు దిక్కులలో ఇంద్రుడు మొదలగు లోకపాలకుల

నాలుగు నగరములు గలవు. దానికి పైన మేరువు చుట్టూ సూర్యుని రథము తిరుగుచుండును. ఆ రథమునకు సంవత్సరకాలమే చక్రము. ఆ చక్రములో సగము ఉత్తరాయణము, సగము దక్షిణాయనము. అవియే దేవ తలకు క్రమముగా పగలు మరియు రాత్రి అగుచుండును.

తద్ద్వీపస్యాప్యధిపతిః ప్రైయవ్రతో వీతిహోత్రో నామైతస్యా
త్మజౌ రమణకధాతకినామానౌ వర్షపతీ నియుజ్య స స్వయం
పూర్వజవద్భగవత్కర్మశీల ఏవాస్తే ॥ 31

తద్-ద్వీపస్య - ఆ ద్వీపమునకు, అధిపతిః - ప్రభువు, ప్రైయ వ్రతః - ప్రియవ్రతుని కుమారుడు, వీతిహోత్రః నామ - వీతిహోత్రుడని ప్రసిద్ధి గాంచినవాడు, ఏతస్య - ఈతనికి, రమణకధాతకినామానౌ - రమణ కుడు ధాతకి అని ప్రసిద్ధి గాంచిన, ఆత్మజౌ - ఇద్దరు పుత్రులు, సః - ఆయ న, వర్షపతీ - వర్షములకు ప్రభువులనుగా, నియుజ్య - నియోగించి, స్వయమ్ - తాను, పూర్వజవత్ - తన పూర్వీకులనలె, భగవత్-కర్మశీలః ఏవ - భగవంతుని ఆరాధించుటయే స్వభావముగా గలవాడై, ఆస్తే - ఉన్నాడు.

ఆ ద్వీపమునకు ప్రభువు వీతిహోత్రుడని ప్రసిద్ధి గాంచిన ప్రియవ్ర తుని పుత్రుడే. ఆయనకు రమణకుడు, ధాతకి అని ఇద్దరు పుత్రులు గలరు. ఆయన వారిద్దరిని రెండు వర్షములకు ప్రభువులుగా నియమించి, తాను తన పూర్వీకుల వలె భగవంతుని ఆరాధించుటయే స్వభావముగా గల వాడు ఆయెను.

తద్వర్షపురుషా భగవంతం బ్రహ్మరూపిణం సకర్మకేణ కర్మ
ణాఽఽరాధయంతీదం చోదాహరంతి ॥ 32

తద్-వర్షపురుషాః - ఆ వర్షములయందలి జనులు, బ్రహ్మరూపి ణమ్ - బ్రహ్మగారి రూపములోనున్న, భగవంతమ్ - భగవానుని, సకర్మ కేణ - కర్మలకు మూలమగు కామనతో కూడిన, కర్మణా - కర్మతో, ఆరాధ యంతి - ఆరాధించెదరు, ఇదం చ - ఈ మంత్రమును కూడ, ఉదాహ రంతి - జపించెదరు.

ఆ వర్షములలోని జనులు సకామకర్మలతో బ్రహ్మగారి రూపము లోని భగవానుని ఆరాధిస్తూ, ఈ క్రింది మంత్రమును కూడ జపించెదరు.

యత్తత్కర్మమయం లింగం బ్రహ్మలింగం జనోఽర్చయేత్ ।
ఏకాంతమద్వయం శాంతం తస్మై భగవతే నమ ఇతి ॥ 33

కర్మమయమ్ - కర్మనిష్ఠమైనది, బ్రహ్మలింగమ్ - బ్రహ్మ జ్ఞానమును పొందించునది, ఏకాంతమ్ - అద్వయ పరబ్రహ్మయందు మాత్రమే నిష్ఠ గలది, అద్వయమ్ - రెండవది లేనిది, శాంతమ్ - శాంతమైన, యత్ - ఏ, లింగమ్ - మూర్తి గలదో, తత్ - దానిని, జనః - జనుడు, అర్చయేత్ - పూజించవలెను, తస్మై - అట్టి, భగవతే - భగవానుని కొరకు, నమః - నమస్కారము, ఇతి - అని.

అద్వయము, శాంతము అగు పరబ్రహ్మయే బ్రహ్మగారి రూపములో సృష్టికర్మయందు నిష్ఠమై యున్నది. దానిని అర్చించువాడు బ్రహ్మ జ్ఞానమును పొందును. పరబ్రహ్మయందు మాత్రమే నిష్ఠను కలిగియున్న ఆ బ్రహ్మగారి రూపమును జీవుడు పూజించవలెను. ఆ రూపములోనున్న భగవానునకు నమస్కారము, అని వారు జపించెదరు.

ఋషిరువాచ ।
తతః పరస్తాల్లోకాలోకనామాఽచలో లోకాలోకయోరంతరాలే
పరిత ఉపక్షిప్తః ॥ 34

తతః - ఆ తియ్యని నీటి సముద్రము కంటె, పరస్తాత్ - తరువాత, లోకాలోకనామా - లోకాలోకము అని ప్రసిద్ధి గాంచిన, అచలః - పర్వతము, లోక-అలోకయోః - సూర్యకాంతి గల మరియు లేని దేశములకు, అంతరాలే - మధ్యయందు, పరితః - చుట్టూ, ఉపక్షిప్తః - స్థాపించబడినది.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఆ శుద్ధజల సముద్రము తరువాత లోకాలోకమని ప్రసిద్ధి గాంచిన పర్వతము గలదు. సూర్యకాంతిగల దేశమునకు, సూర్యకాంతి చొరని దేశమునకు మధ్యలో చుట్టూ ఆ పర్వతము ఈశ్వరునిచే స్థాపించబడి యున్నది.

యావన్మానసోత్తరమేర్వోరంతరం, తావతీ భూమిః కాంచన్య
న్యాఽఽదర్శతలోపమా యస్యాం ప్రహితః పదార్థో న కథంచిత్పునః
ప్రత్యుపలభ్యతే తస్మాత్సర్వసత్త్వపరిహృతాఽఽసీత్ ॥ 35

మానసోత్తరమేర్వోః - మానసోత్తర మేరు పర్వతముల, అంతరం యావత్ - మధ్యవరకు ఎంత స్థానము గలదో, తావతీ - అంత, భూమిః - భూమి, అన్యా - మిగిలినది, కాంచనీ - బంగరు స్థలము, ఆదర్శతల-ఉపమా - అద్దము పై సమప్రదేశమును బోలియుండునది, యస్యామ్ - దేని యందు, ప్రహితః - ఉంచబడిన, పదార్థః - పదార్థము, కథంచిత్ - ఏ విధముగనైననూ, పునః - తిరిగి, న ప్రతి-ఉపలభ్యతే - పొందబడుట లేదో, తస్మాత్ - అందువలన, సర్వసత్త్వపరిహృతా - అన్ని ప్రాణులచే విడిచిపెట్టబడినదై, ఆసీత్ - ఉన్నది.

మేరు పర్వతమునుండి మానసోత్తర పర్వతమువరకు గల భూమి ప్రాణి సంచారమును కలిగియున్నది. ఆపైన ఉన్నది బంగరు భూమి. అది అద్దము పై భాగమును పోలిన సమప్రదేశము. దానియందు పడిన పదార్థమేదియు తిరిగి లభించదు. కావుననే, దానియందు ఏ విధమైన ప్రాణిసంచారమైననూ కానరాదు.

లోకాలోక ఇతి సమాఖ్యా యదనేనాచలేన లోకాలోకస్యాంత
ర్వర్తినాఽవస్థాప్యతే ॥ 36

లోకాలోకః - లోకాలోకము, ఇతి - అనే, సమాఖ్యా - పేరు, యత్ - ఏలయనగా, లోకాలోకస్య - లోకమునకు అలోకమునకు, అంతః-వర్తినా - మధ్యలోనుండే, అనేన - ఈ, అచలేన - పర్వతముచే, అవస్థాప్యతే - వ్యవస్థ చేయబడుచున్నది.

లోకాలోకపర్వతము లోకము (సూర్యకాంతి గల దేశము) నకు, అలోకము (సూర్యకాంతి లేని దేశము) నకు మధ్యలోనున్నదై వ్యవస్థను చేయుచుండుటచే, ఈ పర్వతమునకు ఆ పేరు వచ్చినది.

స లోకత్రయాంతే పరిత ఈశ్వరేణ విహితో యస్మాత్సూర్యా
దీనాం ధ్రువాపవర్గాణాం జ్యోతిర్గణానాం గభస్త
యోఽర్వాచీనాంస్త్రీంల్లోకానావితన్వానా న కదాచిత్పరాచీనా
భవితుముత్సహంతే తావదున్నహనాయామః ॥ 37

సః - ఆ పర్వతము, లోకత్రయ-అంతే - ముల్లోకములకు అంత మునందు, పరితః - చుట్టూ, ఈశ్వరేణ - ఈశ్వరునిచే, విహితః - రచించ బడినది, యస్మాత్ - ఏ పర్వతము వలన, సూర్య-ఆదీనామ్ - సూర్యుడు ఆదిగా గలిగినట్టియు, ధ్రువ-అపవర్గాణామ్ - ధ్రువనక్షత్రము అంతము నందు గల, జ్యోతిః-గణానామ్ - నక్షత్రముల గణములయొక్క, గభస్తయః - కాంతులు, అర్వాచీనాన్ - దాని క్రిందనుండే, త్రీన్ - మూడు, లోకాన్ - లోకములను, ఆవితన్వానాః - అంతటా ప్రకాశింప జేయుచున్నవై, కదా చిత్ - ఎప్పుడైననూ, పరాచీనాః - దాటి వెళ్లునవి, భవితుమ్ - అగుటకు, న ఉత్సహంతే - సమర్థములు కావు, తావత్ - అంతటి, ఉన్నహన-ఆ యామః - ఎత్తు మరియు వైశాల్యములు గలది.

ఆ లోకాలోక పర్వతము ముల్లోకములకు అంతమునందు చుట్టూ ఈశ్వరునిచే రచించబడి యున్నది. సూర్యునితో మొదలిడి ధ్రువనక్షత్రము వరకు గల నక్షత్రముల గణముల కాంతులు ఆ పర్వతమునకు ఈవల నుండే ముల్లోకములను అంతటా ప్రకాశింప జేయుచుండును. కాని, ఆ కిర ణములు ఏ నాడైననూ ఆ పర్వతమును దాటి ప్రసరించుటకు సమర్థములు కావు. దాని ఎత్తు, వైశాల్యము అంతటివి.

ఏతావాంల్లోకవిన్యాసో మానలక్షణసంస్థాభిర్విచింతితః కవి
భిస్స తు పంచాశత్కోటిగణితస్య భూగోలస్య తురీయభాగో
ఽయం లోకాలోకాచలః ॥ 38

లోకవిన్యాసః - లోకముల విస్తారము, ఏతావాన్ - ఇంతటిది, కవిభిః - విద్వాంసులచే, మానలక్షణసంఖ్యాభిః - కొలత లక్షణములు మరియు స్థితులచే, విచింతితః - విచారముచే నిశ్చయించ బడినది, సః - ఆ, అయమ్ - ఈ, లోకాలోక-అచలః తు - లోకాలోక పర్వతమైతే, పంచా

శత్-కోటిగణితస్య - ఏభై కోట్ల యోజనముల లెక్క గల, భూగోలస్య - భూమండలముయొక్క, తురీయభాగః - నాల్గవ అంశము.

ఈ విధముగా విద్వాంసులు లోకముల విస్తారమును కొలత, లక్షణములు మరియు స్థితులు అను అంశములుగా విచారించి నిశ్చయించిరి. అట్టి ఈ లోకాలోక పర్వతము భూమండలములో నాల్గవ వంతు ఉన్నది. భూమండలము ఏభై కోట్ల యోజనముల విస్తారమును కలిగియున్నది.

తదుపరిష్టాచ్చతస్పృష్వాశాస్వాత్మయోనినాఽఖిలజగద్గురు
ణాఽధినివేశితా యే ద్విరదపతయ ఋషభః పుష్కరచూడో
వామనోఽపరాజిత ఇతి సకలలోకస్థితిహేతవః ॥ 39

తద్-ఉపరిష్టాత్ - దానికి పైన, చతస్పృషు - నాలుగు, ఆశాసు - దిక్కులయందు, ఆత్మయోనినా - స్వయంభువుడైనట్టియు, అఖిలజగద్-గురుణా - సకలజగత్తునకు తండ్రియగు బ్రహ్మగారిచే, అధినివేశితాః - స్థాపించబడిన, ఋషభః - ఋషభుడు, పుష్కరచూడః - పుష్కరచూడుడు, వామనః - వామనుడు, అపరాజితః - అపరాజితుడు, ఇతి - అనే, యే - ఏ, ద్విరదపతయః - గొప్ప ఏనుగులు గలవో అవి, సకలలోకస్థితిహేతవః - అన్ని లోకముల నిలకడకు కారణములు.

స్వయంభువుడు, సకలజగత్తునకు తండ్రి అగు బ్రహ్మగారు ఆ లోకాలోక పర్వతమునకు పైన నాలుగు దిక్కులయందు, ఋషభుడు, పుష్కరచూడుడు, వామనుడు, అపరాజితుడు అనే నాలుగు గొప్ప ఏనుగులను స్థాపించెను. ముల్లోకములను అవియే నిలబెట్టుచున్నవి.

తేషాం స్వవిభూతీనాం లోకపాలానాం చ వివిధవీర్యోపబృంహ
ణాయ భగవాన్ పరమమహాపురుషో మహావిభూతిపతిరంత
ర్యామ్యాత్మనో విశుద్ధసత్త్వం ధర్మజ్ఞానవైరాగ్యైశ్వర్యాద్యష్టమ
హాసిద్ధ్యుపలక్షణం విష్వక్సేనాదిభిస్స్వపార్షదప్రవరైః పరివా
రితో నిజవరాయుధోపశోభితైర్నిజభుజదండైస్సంధారయమా
ణస్తస్మిన్ గిరివరే సమంతాత్సకలలోకస్వస్తయ ఆస్తే ॥ 40

పరమమహాపురుషః - సర్వోత్కృష్టుడు పురుషోత్తముడు, మహావి భూతిపతిః - గొప్ప ఐశ్వర్యమునకు ప్రభువు, అంతర్యామీ - జగత్తును లోపలనుండి నియమించువాడు అగు, భగవాన్ - శ్రీహరి భగవానుడు, ధర్మజ్ఞానవైరాగ్య-ఐశ్వర్య-ఆదిమహాసిద్ధి-ఉపలక్షణమ్ - ధర్మము జ్ఞానము వైరాగ్యము ఈశ్వరభావము మొదలగు గొప్ప సిద్ధులే దర్శించే ఉపాయములుగా కలిగిన, ఆత్మనః - తన, విశుద్ధసత్త్వమ్ - రజస్తమోగుణముల కలయిక లేని సత్త్వగుణమే స్వరూపముగా గల రూపమును, నిజవర-ఆయుధ-ఉపశోభితైః - తన గొప్ప ఆయుధములతో శోభిల్ల జేయబడిన, నిజ భుజదండైః - తన దండములవంటి భుజములతో బాటుగా, సంధారయమాణః - చక్కగా ఆవిష్కరించుచున్నవాడై, స్వపార్షదప్రవరైః - తన అనుచరులలో ముఖ్యులగు, విష్వక్సేన-ఆదిభిః - విష్వక్సేనుడు మొదలగు వారిచే, పరివారితః - చుట్టువారబడి యున్నవాడై, తేషామ్ - ఆ దిగ్గజములకు, స్వవిభూతీనామ్ - తన అంశలే అయిన, లోకపాలానాం చ - లోకపాలకులకు కూడ, వివిధవీర్య-ఉపబృంహణాయ - అనేకవిధములైన పరాక్రమము వర్ధిల్లుట కొరకై, తస్మిన్ - ఆ, గిరివరే - గొప్ప పర్వతమునందు, సమంతాత్ - అంతటా, సకలలోకస్వస్తయే - అన్ని లోకముల కల్యాణము కొరకు, ఆస్తే - ఉన్నాడు.

సర్వోత్కృష్టుడు, పురుషోత్తముడు, సర్వేశ్వరుడు, సర్వశక్తిమంతుడు అగు శ్రీహరి భగవానుడు సకలజగత్తును లోపలనుండి నియమించుచున్నాడు. ధర్మము, జ్ఞానము, వైరాగ్యము, ఈశ్వరభావము మొదలగు మహాసిద్ధులను బట్టి ఆయన మహిమను మనము జగత్తులో గుర్తించవచ్చును. ఆయన రజస్తమోగుణముల కలయిక లేని శుద్ధసత్త్వమే ఉపాదానముగా గల రూపమును దాల్చి, ఆ గొప్ప లోకాలోకపర్వతమంతటా విహరించును. గొప్ప ఆయుధములతో విరాజిల్లే దండములవంటి భుజములతో గూడి యున్న ఆ రూపమును ఆయన అన్ని లోకముల కల్యాణము కొరకై ఆవిష్కరించుచున్నాడు. ఆయన అనుచరులలో ప్రముఖులగు విష్వక్సేనుడు మొదలగువారు ఆయనను చుట్టువారి సేవించుచుందురు. ఆయన ఆ దిగ్గజములకు, తన అంశలైన దిక్పాలకులకు కూడ అనేకవిధములైన పరాక్రమమును ఈ తీరున వర్ధిల్ల జేయుచుండును.

ఆకల్పమేవంవేషం గత ఏష భగవానాత్మయోగమాయయా
విరచితవివిధలోకయాత్రాగోపీథాయేత్యర్థః ॥ 41

ఏషః - ఈ, భగవాన్ - భగవానుడు, ఆత్మయోగమాయయా - తన త్రిగుణముల కలయికయగు మాయచే, విరచితవివిధలోకయాత్రాగోపీథాయ - రచింపబడిన వివిధలోకముల యాత్రయొక్క రక్షణ కొరకై, ఆకల్పమ్ - కల్పాంతము వరకు, ఏవంవేషమ్ - ఇట్టి వేషమును, గతః - పొందినవాడు, ఇతి - అని, అర్థః - అర్థము.

ఆ పర్వతమునందు అంతటా ఉండును అనగా అర్థమేమనగా --- ఈ భగవానుడు మూడు గుణముల కలయికయగు తన మాయాశక్తిచే రచింపబడిన సకలలోకముల యాత్రను రక్షించుట కొరకై కల్పము అంతమగు వరకు ఈ విధమగు వేషమును దాల్చియున్నాడు.

యోఽంతర్విస్తార ఏతేన హ్యాలోకపరిమాణం చ వ్యాఖ్యాతం
యద్బహిర్లోకాలోకాచలాత్ । తతః పరస్తాద్యోగేశ్వరగతిం
విశుద్ధాముదాహరంతి ॥ 42

యః - ఏ, అంతః-విస్తారః - లోపలనుండే వైశాల్యము గలదో, ఏతేన - దీనిచే, అలోకపరిమాణం చ - అలోకముయొక్క పరిమాణము కూడ, వ్యాఖ్యాతమ్ - వివరించబడినది, యత్ - ఏదైతే, లోకాలోకాచలాత్ - లోకాలోక పర్వతము కంటె, బహిః - బయట నున్నదో, తతః - దానికంటె, పరస్తాత్ - ఆవల, విశుద్ధామ్ - విశుద్ధమైన, యోగ-ఈశ్వరగతిమ్ - యోగేశ్వరుల గమనమును, ఉదాహరంతి - చెప్పుచున్నారు.

లోకాలోక పర్వతమునకు లోపలనుండే ముల్లోకముల విస్తారము చెప్పబడినది. లోకాలోక పర్వతమునకు ఆవలనుండే అలోకము (కాంతి లేని స్థానము) యొక్క విస్తారము కూడ అంతే ఉండును. ఆ అలోకము తరువాతిది యోగేశ్వరుల మిక్కిలి పవిత్రమైన గతి (పొందే స్థానము) యని చెప్పెదరు.

**అండమధ్యగతస్సూర్యో ద్యావాభూమ్యోర్యదంతరమ్ ।**
**సూర్యాండగోలయోర్మధ్యే కోట్యస్స్యుః పంచవింశతిః ॥ 43**

సూర్యః - సూర్యుడు, అండమధ్యగతః - బ్రహ్మాండమునకు మధ్యలో నున్నవాడు, ద్యావాభూమ్యోః - స్వర్గలోక భూలోకములకు, యత్ - ఏ, అంతరమ్ - మధ్యభాగము గలదో, సూర్య-అండగోలయోః - సూర్యునకు బ్రహ్మాండగోళకమునకు, మధ్యే - మధ్యయందు, పంచవింశతిః - ఇరవై అయిదు, కోట్యః - కోట్లు, స్యుః - ఉండును.

స్వర్గలోక భూలోకములకు మధ్యలో బ్రహ్మాండముయొక్క కేంద్ర స్థానమునందు సూర్యుడు గలడు. సూర్యునకు, బ్రహ్మాండగోళకము (అవధి) నకు మధ్యలో ఇరవై అయిదు కోట్ల యోజనముల నిడివి గలదు.

మృతేऽండ ఏష ఏతస్మిన్ యదభూత్తతో మార్తండ ఇతి వ్యపదేశః । హిరణ్యగర్భ ఇతి యద్ధిరణ్యాండసముద్భవః ॥ 44

యత్ - ఎందువలననైతే, మృతే - అచేతనమగు, ఏతస్మిన్ - ఈ, అండే - బ్రహ్మాండమునందు, ఏషః - ఈ సూర్యుడు, అభూత్ - ప్రకటమయ్యెనో, తతః - అందువలన, మార్తండః - మార్తండుడు, ఇతి - అని, వ్యపదేశః - పేరు, హిరణ్యగర్భః - హిరణ్యగర్భుడు, ఇతి - అని, యత్ - ఏల యనగా, హిరణ్య-అండసముద్భవః - తేజోమయమగు బ్రహ్మాండము నుండి చక్కగా ఆవిర్భంచినవాడు.

ఈ సూర్యునకు, అచేతనమగు ఈ బ్రహ్మాండములో ప్రకటమైనాడు (ఆ తీరున జీవకోటికి హేతువు అయినాడు) గనుక మార్తండుడనియు, తేజోమయమగు బ్రహ్మాండమునుండి చక్కగా ఆవిర్భవించినాడు గనుక హిరణ్యగర్భుడనియు, పేరు వచ్చెను.

సూర్యేణ హి విభజ్యంతే దిశః ఖం ద్యౌర్మహీ భిదా ।
స్వర్గాపవర్గౌ నరకా రసౌకాంసి చ సర్వశః ॥ 45

దిశః - దిక్కులు, ఖమ్ - ఆకాశము, ద్యౌః - అంతరిక్షము, మహీ - భూమి, స్వర్గ-అపవర్గౌ - స్వర్గము మరియు మోక్షదేశము, నరకాః - నర

కములు, రస-ఓకాంసి చ - రసాతలము మొదలగు స్థానములు కూడ, సర్వశః - అన్ని ప్రకారములుగా, భిదా - భాగము, సూర్యేణ హి - సూర్యుని చేతనే, విభజ్యంతే - విభాగము చేయబడుచున్నవి.

దిక్కులు, ఆకాశము, అంతరిక్షము, భూమి, స్వర్గము, బ్రహ్మలోకము, నరకములు, రసాతలము మొదలగు లోకములు, మరియు సర్వప్రకారముల భాగములు సూర్యునిచే విభాగము చేయబడుచున్నవి.

దేవతిర్యఙ్మనుష్యాణాం సరీసృపసవీరుధామ్ ।
సర్వజీవనికాయానాం సూర్య ఆత్మా దృగీశ్వరః ।। 46

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే
విస్తృతభువనకోశవర్ణనం నామ వింశోఽధ్యాయః ।।

దేవతిర్యక్-మనుష్యాణామ్ - దేవతలు పశుపక్ష్యాదులు మానవులకు, సరీసృపసవీరుధామ్ - ప్రాకే జంతువులకు తీగలతో కూడియున్న ప్రాణులకు, సర్వజీవనికాయానామ్ - అన్ని జీవుల సమూహములకు, సూర్యః - సూర్యుడు, ఆత్మా - స్వరూపము, దృక్-ఈశ్వరః - కంటికి అధిష్ఠాన దేవత.

దేవతలు, పశుపక్ష్యాదులు, ప్రాకే జంతువులు, చెట్టుచేమలు మొదలగు సకలప్రాణిసమూహములకు సూర్యుడే స్వరూపము. కంటి చూపునకు అధిష్ఠాన దేవత సూర్యుడే.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో
విస్తారముగా భువనకోశమును వర్ణించే ఇరువదియవ
అధ్యాయము ముగిసినది (20).

*****

# అథ ఏకవింశోऽధ్యాయః

## సూర్యరథముయొక్క గమనము

శ్రీశుక ఉవాచ ।
ఏతావానేవ భూవలయస్య సంనివేశః ప్రమాణలక్షణతో వ్యాఖ్యాతః ।। 1

భూవలయస్య - భూమండలముయొక్క, సంనివేశః - సంరచన, ఏతావాన్ ఏవ- ఇంత మాత్రమే, ప్రమాణలక్షణతః - పరిమాణము లక్షణములను బట్టి, వ్యాఖ్యాతః - వివరించ బడినది.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- భూమండలముయొక్క సంరచన ఈ విధముగా నున్నది. ఈ భూమండలముయొక్క పరిమాణమును, దాని లక్షణములను నేను వివరించి చెప్పితిని.

ఏతేన హి దివో మండలమానం తద్విద ఉపదిశంతి యథా ద్విదలయోర్నిష్పావాదీనాం తే అంతరేణాంతరిక్షం తదుభయ సంధితమ్ ।। 2

ఏతేన హి - ఈ మానము చేతనే, దివః - స్వర్గముయొక్క, మండలమానమ్ - మండలముయొక్క మానమును, తద్-విదః - అది తెలిసిన వారలు, ఉపదిశంతి - ఉపదేశించుచున్నారు, నిష్పావ-ఆదీనామ్ - అనుములు మొదలగువాటియొక్క, ద్విదలయోః యథా - రెండు దళములకు వలె, తే అంతరేణ - వాటి మధ్యలో, అంతరిక్షమ్ - అంతరిక్షము, తద్-ఉభయసంధితమ్ - ఆ రెండింటితో కలిసియున్నది.

ఈ భూగోళముయొక్క పరిమాణముతో స్వర్గముయొక్క పరిమాణము సమానముగా నుండుననియు, ఈ రెండు లోకములు అనుము మొదలగు గింజల రెండు దళములవంటివి అనియు ఆ వివరములు తెలిసిన పెద్దలు చెప్పుచున్నారు. ఈ రెండు లోకములతో కలిసి వాటి మధ్యలో అంతరిక్షము ఉన్నది.

యన్మధ్యగతో భగవాంస్తపతాం పతిస్తపన ఆతపేన త్రిలోకీం
ప్రతపత్యవభాసయత్యాత్మభాసా స ఏష ఉదగయనదక్షిణాయ
నవైషువతసంజ్ఞాభిర్మాంద్యశైఘ్ర్యసమానాభిర్గతిభిరారోహణా
వరోహణసమానస్థానేషు యథాసవనమభిపద్యమానో మకరా
దిషు రాశిష్వహోరాత్రాణి దీర్ఘహ్రస్వసమానాని విధత్తే ॥ 3

యత్-మధ్యగతః - దేని మధ్యయందున్న, భగవాన్ - పూజనీయుడైన, తపతాం పతిః - ప్రకాశించువాటిలో శ్రేష్ఠుడగు, తపనః - సూర్యుడు, ఆతపేన - ఎండచే, త్రిలోకీమ్ - ముల్లోకములను, ప్రతపతి - గట్టిగా తపింప జేయుచున్నాడో, ఆత్మభాసా - తన కాంతిచే, అవభాసయతి - ప్రకాశింప జేయుచున్నాడో, సః - అట్టి, ఏషః - ఈ సూర్యుడు, ఉదక్-అయనదక్షిణ-అయనవైషువతసంజ్ఞాభిః - ఉత్తరాయణము దక్షిణాయనము విషువత్ అనే పేర్లు గల, మాంద్యశైఘ్ర్యసమానాభిః - మందము శీఘ్రము సమానము అగు, గతిభిః - గమనములతో, మకర-ఆదిషు - మకరము మొదలగు, రాశిషు - రాశులయందు, యథాసవనమ్ - కాలము నతిక్రమించకుండగా, ఆరోహణ-అవరోహణసమానస్థానేషు - పైన క్రింద సమానము అగు స్థానములయందు, అభిపద్యమానః - ప్రవేశించుచున్నవాడై, దీర్ఘహ్రస్వసమానాని - పొడుగు పొట్టి సమానము అగు, అహోరాత్రాణి - పగళ్లను రాత్రులను, విధత్తే - సమకూర్చుచున్నాడు.

జ్యోతిర్మండలములలో శ్రేష్ఠుడగు సూర్య భగవానుడు అంతరిక్ష లోకమునకు మధ్యలో నున్నవాడై, ముల్లోకములను గట్టిగా తపింప జేయుట మాత్రమే గాక, తన కాంతిచే చక్కగా ప్రకాశింప జేయుచున్నాడు. అట్టి సూర్యుడు కాలము నతిక్రమించకుండగా మకరము మొదలగు రాశు

లలోని పైన, క్రింద మరియు సమానము అగు స్థానములలో ప్రవేశించును. ఆయన మెల్లగా సంచరించే ఉత్తరాయణములో పగలు పెద్దదిగను, రాత్రి చిన్నదిగను ఉండును. ఆయన వేగముగా సంచరించే దక్షిణాయనములో పగలు పొట్టిదిగను, రాత్రి పెద్దదిగను ఉండును. ఆయన సమానవేగముతో సంచరించే విషువత్తునందు రాత్రింబగళ్లు సమానముగా నుండును.

యదా మేషతులయోర్వర్తతే తదాఽహోరాత్రాణి సమానాని భవంతి యదా వృషభాదిషు పంచసు చ రాశిషు చరతి తదాఽహాన్యేవ వర్ధంతే హ్రసతి చ మాసి మాస్యేకైకా ఘటికా రాత్రిషు ॥ 4

యదా - ఏ కాలమునందైతే, మేషతులయోః - మేషము తులల యందు, వర్తతే - ఉండునో, తదా - అప్పుడు, అహోరాత్రాణి - పగళ్లు రాత్రులు, సమానాని - సమానములై, భవంతి - ఉండును, యదా - ఎప్పుడైతే, వృషభ-ఆదిషు - వృషభము మొదలుగా గల, పంచసు - అయిదు, రాశిషు - రాశులయందు, చరతి - సంచరించునో, తదా - అప్పుడు, అహాని ఏవ - పగళ్లు మాత్రమే, వర్ధంతే - పెద్దవి అగును, మాసి మాసి - ప్రతి నెలయందు, రాత్రిషు - రాత్రులయందు, ఏక-ఏకా - ఒక్కొక్క, ఘటికా - ఘడియ, హ్రసతి - కురచ యగును.

సూర్యుడు మేష తులా రాశులయందున్నప్పుడు రాత్రింబగళ్లు సమానమగు నిడివిని కలిగియుండును. సూర్యుడు వృషభము మొదలు కొని ఉండే అయిదు రాశులలో సంచరించునప్పుడు, నెలకు ఒక్కొక్క ఘడియ (24 నిముషములు) చొప్పున పగలు సమయము పెరిగి, రాత్రి సమయము తగ్గుచుండును.

యదా వృశ్చికాదిషు పంచసు వర్తతే తదాఽహోరాత్రాణి విప ర్యయాణి భవంతి ॥ 5

యదా - ఎప్పుడైతే, వృశ్చిక-ఆదిషు - వృశ్చికము మొదలుగా గల, పంచసు - అయిదు రాశులయందు, వర్తతే - ఉండునో, తదా -

అప్పుడు, అహోరాత్రాణి - పగళ్లు రాత్రులు, విపర్యయాణి - విపరీత ములు, భవంతి - అగును.

సూర్యుడు వృశ్చికముతో మొదలిడి అయిదు రాశులయందున్న ప్పుడు రాత్రింబగళ్ల సమయములలో పైన చెప్పిన దానికి విరుద్ధమగు మార్పులు వచ్చును.

యావద్దక్షిణాయనమహాని వర్ధంతే యావదుదగాయనం రాత్రయః ।। 6

యావత్ దక్షిణాయనమ్ - దక్షిణాయనము వచ్చువరకు, అహాని - పగళ్లు, వర్ధంతే - పెరుగును, యావత్ ఉదగాయనమ్ - ఉత్తరాయణము వరకు, రాత్రయః - రాత్రులు.

దక్షిణాయనము వచ్చువరకు (ఉత్తరాయణమునందు) పగళ్లు, ఉత్తరాయణము వచ్చువరకు (దక్షిణాయనమునందు) రాత్రులు పెరుగు చుండును.

ఏవం నవ కోటయ ఏకపంచాశల్లక్షాణి యోజనానాం మానసో త్తరగిరిపరివర్తనస్యోపదిశంతి తస్మిన్నైంద్రీం పురీం పూర్వస్మా న్మేరోర్దేవధానీం నామ దక్షిణతో యామ్యాం సంయమనీం నామ పశ్చాద్వారుణీం నిమ్లోచనీం నామ ఉత్తరతస్సౌమ్యాం విభావరీం నామ తాసూదయమధ్యాహ్నాస్తమయనిశీథానీతి భూతానాం ప్రవృత్తినివృత్తినిమిత్తాని సమయవిశేషేణ మేరోశ్చ తుర్దిశమ్ ।। 7

ఏవమ్ - ఈ విధముగా, మానసోత్తరగిరిపరివర్తనస్య - మానసో త్తర పర్వతముయొక్క చుట్టు తిరుగుటకు, యోజనానామ్ - యోజనముల యొక్క, నవ - తొమ్మిది, కోటయః - కోట్లు, ఏకపంచాశత్ - ఏభై ఒక్క, లక్షాణి - లక్షలను, తస్మిన్ - ఆ పర్వతమునందు, మేరోః - మేరువునకు, పూర్వస్మాత్ - తూర్పుగా, ఐంద్రీమ్ - ఇంద్రునకు చెందిన, దేవధానీం నామ - దేవధాని అని ప్రసిద్ధి గాంచిన, పురీమ్ - నగరమును, దక్షిణతః -

దక్షిణముగా, యామ్యామ్ - యమునకు చెందిన, సంయమనీం నామ - సంయమని అని ప్రసిద్ధి గాంచిన నగరమును, పశ్చాత్ - పడమరగా, వారుణీమ్ - వరుణునకు చెందిన, నిమ్లోచనీం నామ - నిమ్లోచని అని ప్రసిద్ధి గాంచిన నగరమును, ఉత్తరతః - ఉత్తరముగా, సౌమ్యామ్ - చంద్రునకు చెందిన, విభావరీం నామ - విభావరి అని ప్రసిద్ధి గాంచిన నగరమును, ఉపదిశంతి - చెప్పుచున్నారు, మేరోః - మేరు పర్వతమునకు, చతుః-దిశమ్ - నాలుగు దిక్కులయందలి, తాసు - ఆ నగరములయందు, సమయ విశేషేణ - సమయముయొక్క తేడాచే, భూతానామ్ - ప్రాణులకు, ప్రవృత్తినివృత్తినిమిత్తాని - పనులను చేసుకొనుటకు విరమించుటకు కారణమైన, ఉదయమధ్యాహ్న-అస్తమయనిశీథాని - ఉదయము మధ్యాహ్నము సాయంకాలము రాత్రులు.

సూర్యుడు మానసోత్తర పర్వతముయొక్క చుట్టూ తిరిగే దూరము తొమ్మిది కోట్ల ఏభై ఒక్క లక్షల యోజనములనియు, ఆ పర్వతమునందు మేరు పర్వతమునకు తూర్పుగా దేవధాని అని ప్రసిద్ధి గాంచిన ఇంద్రుని నగరము గలదనియు, దక్షిణముగా సంయమని అని ప్రసిద్ధి గాంచిన యముని నగరము గలదనియు, పశ్చిమముగా నిమ్లోచని అని ప్రసిద్ధి గాంచిన వరుణుని నగరము గలదనియు, ఉత్తరముగా విభావరి అని ప్రసిద్ధి గాంచిన చంద్రుని నగరము గలదనియు పెద్దలు చెప్పుచున్నారు. మేరు పర్వతమునకు నాలుగు దిక్కులలోనుండే ఆ నగరములలో ఆయా సమయములలో ఉదయము, మధ్యాహ్నము, సాయంకాలము, రాత్రి కలుగుతూ, ప్రాణులు తమ పనులను చేసుకొనుటకు, విరమించి విశ్రమించుటకు వెసులుబాటు కలుగుచుండును.

తత్రత్యానాం దివసమధ్యంగత ఏవ సదాఽఽదిత్యస్తపతి సవ్యేనాచలం దక్షిణేన కరోతి ॥ 8

తత్రత్యానామ్ - మేరు పర్వతమునందున్న ప్రాణులకు, ఆదిత్యః - సూర్యుడు, సదా - అన్ని కాలములలో, దివసమధ్యంగతః ఏవ - మధ్యాహ్నసమయమునందు మాత్రమే ఉన్నవాడై, తపతి - తపించును, అచలమ్

- మేరు పర్వతమునుద్దేశించి, సవ్యేన - ఎడమగా, దక్షిణతః - కుడిగా, కరోతి - చేయును.

మేరు పర్వతమునందున్న ప్రాణులకు అన్ని కాలములలో మధ్యాహ్నమునందలి సూర్యుడు మాత్రమే తపించుచుండును. సూర్యుడు ఆ పర్వతము తనకు ఎడమ వైపు ఉండునట్లుగా తిరుగుచున్ననూ, కుడివైపు ఉన్నట్లుగా కానవచ్చును.

యత్రోదేతి తస్య హ సమానసూత్రనిపాతే నిమ్లోచతి యత్ర క్వచన స్యందేనాభితపతి తస్య హైష సమానసూత్రనిపాతే ప్రస్వాపయతి తత్ర గతం న పశ్యంతి యే తం సమనుపశ్యే రన్ ।। 9

యత్ర - ఎక్కడనైతే, ఉదేతి - ఉదయించునో, తస్య - ఆ స్థానమునకు, సమానసూత్రనిపాతే - తిన్నని రేఖకు ఆవలి వైపు రాగా, నిమ్లోచతి - అస్తమించును, యత్ర క్వచన - ఏ స్థానమునందైతే, స్యందేన - చెమట పట్టుటచే, అభితపతి - బాగా ఎండ కాయునో, తస్య - ఆ స్థానమునకు, సమానసూత్రనిపాతే - తిన్నని రేఖకు ఆవలి వైపు రాగానే, ఏషః - ఈ సూర్యుడు, ప్రస్వాపయతి - నిద్రింప జేయును, యే - ఎవరైతే, తమ్ - ఆ సూర్యుని, సమనుపశ్యేరన్ - చక్కగా చూసెదరో, తత్ర - ఆవలి వైపునకు, గతమ్ - చేరిన సూర్యుని, న పశ్యంతి - చూచుట లేదు.

ఏ నగరములోనైతే సూర్యుడు ఉదయించుచున్నాడో, ఆ నగరమునకు తిన్నగా రేఖకు ఆవలి వైపున ఉన్న నగరములో సూర్యుడు అస్తమించుచున్నట్లు కానవచ్చును. ఏ నగరములో సూర్యుడు బాగా ఎండ కాస్తూ చెమట్లు పట్టునట్లు చేయుచున్నాడో, సరిగ్గా దాని రేఖకు ఆవలి వైపున ఉన్న నగరములో జనులు అర్ధరాత్రమునందు నిద్రించుచుందురు. ఒక కాలమునందు సూర్యుడు ఒక నగరములో ఉదయమునుండి సాయంకాలము వరకు చక్కగా కనబడుచుండును. కాని, అదే సూర్యుడు ఆ నగరమునకు తిన్నగా రేఖకు ఆవలి వైపునకు చేరగానే, చీకటి వచ్చి సూర్యుడు కనబడకుండా పోవును.

యదా చైంద్ర్యాః పుర్యాః ప్రచలతే పంచదశఘటికాభి
ర్యామ్యాం సపాదకోటిద్వయం యోజనానాం సార్ధద్వాదశల
క్షాణి సాధికాని చోపయాతి ॥ 10

యదా చ - ఏ సమయమునందైతే, ఐంద్ర్యాః - ఇంద్రునకు చెందిన, పుర్యాః - నగరమునుండి, యామ్యామ్ - యమునకు చెందిన పురమును గురించి, ప్రచలతే - పయనించునో అప్పుడు, పంచదశఘటికాభిః - పదిహేను ఘడియలచే, యోజనానామ్ - యోజనముల, సపాద కోటిద్వయమ్ - రెండు కోట్ల పాతిక లక్షలను, సాధికాని - ఇరవై అయిదు వేలు అధికముగా గల, సార్ధద్వాదశలక్షాణి చ - పన్నెండు లక్షల ఏభై వేలను కూడ, ఉపయాతి - పయనించును.

సూర్యుడు ఇంద్రుని నగరమునుండి యముని నగరమునకు పయనించే సందర్భములో పదిహేను ఘడియలలో రెండు కోట్ల ముప్పై ఏడు లక్షల డెబ్భై అయిదు వేల యోజనముల దూరమును పయనించును.

ఏవం తతో వారుణీం సౌమ్యామైంద్రీం చ పునస్తథాన్యే చ
గ్రహాస్సోమాదయో నక్షత్రైస్సహ జ్యోతిశ్చక్రే సమభ్యు
ద్యంతి సహ వా నిమ్లోచంతి ॥ 11

ఏవమ్ - ఇదే విధముగా, తతః - అక్కడనుండి, వారుణీమ్ - వరుణుని నగరమును గురించి, సౌమ్యామ్ - చంద్రుని నగరమును గురించి, పునః - మరల, తథా - అదే విధముగా, ఐంద్రీం చ - ఇంద్రుని నగరమును గురించి కూడ, అన్యే - ఇతరములగు, సోమ-ఆదయః - చంద్రుడు మొదలుగా గల, గ్రహాః చ - గ్రహములు కూడ, నక్షత్రైః సహ - నక్షత్రములతో గూడి, జ్యోతిశ్చక్రే - నక్షత్రమండలమునందు, సమభ్యుద్యంతి - కలిసి ఉదయించును, వా - లేక, సహ - కలిసి, నిమ్లోచంతి - అస్తమించును.

ఇదే విధముగా, సూర్యుడు యముని నగరమునుండి వరుణుని నగరమునకు, అక్కడనుండి చంద్రుని నగరమునకు పయనించి, మరల అదే విధముగా ఇంద్రుని నగరమును చేరును. ఈ విధముగా చంద్రుడు

మొదలగు ఇతరగ్రహములు కూడ నక్షత్రమండలములోని నక్షత్రములతో బాటుగా కలిసి ఉదయించి, కలిసి అస్తమించుచుండును.

ఏవం ముహూర్తేన చతుస్త్రింశల్లక్షయోజనాన్యష్టశతాధికాని సౌరో రథస్త్రయీమయోఽసౌ చతసృషు పరివర్తతే పురీషు ॥ 12

ఏవమ్ - ఈ విధముగా, అసౌ - ఈ, త్రయీమయః - వేదాత్మకమైన, సౌరః - సూర్యునకు చెందిన, రథః - రథము, చతసృషు - నాలుగు, పురీషు - నగరములయందు, ముహూర్తేన - ముహూర్తకాలముచే, అష్టశత-అధికాని - ఎనిమిది వందలు అధికముగా గల, చతుః-త్రింశత్-లక్షయోజనాని - ముప్పై నాలుగు లక్షల యోజనములను, పరివర్తతే - తిరుగును.

ఈ విధముగా సూర్యుని ఈ వేదాత్మకమగు రథము ఈ నాలుగు నగరములలో, సుమారు ఒక గంట సమయములో ముప్పై నాలుగు లక్షల ఎనిమిది వందల యోజనముల దూరము చొప్పున తిరుగుచుండును.

యస్యైకం చక్రం ద్వాదశారం షణ్నేమి త్రిణాభి సంవత్సరాత్మకం సమామనంతి తస్యాక్షో మేరోర్మూర్ధని కృతో మానసోత్తరే కృతేతరభాగో యత్ర ప్రోతం రవిరథచక్రం తైలయంత్రచక్రవద్భ్రమన్మానసోత్తరగిరౌ పరిభ్రమతి ॥ 13

యస్య - ఏ రథముయొక్క, ఏకమ్ - ఒక, ద్వాదశ-అరమ్ - పన్నెండు ఆకులు గలది, షట్-నేమి - ఆరు కడకమ్ములు గలది, త్రినాభి - మూడు నడిమి తూములు గల, చక్రమ్ - చక్రము, సంవత్సర-ఆత్మకమ్ - సంవత్సర రూపమైనది యని, సమామనంతి - చెప్పుచున్నారు, తస్య - దాని, అక్షః - ఇరుసు, మేరోః - మేరు పర్వతముయొక్క, మూర్ధని - శిఖరముపై, కృతః - ఉంచబడినది, మానసోత్తరే - మానసోత్తర పర్వతముపై, కృత-ఉత్తరభాగః - ఉంచబడిన రెండవ కొన గలది, యత్ర - దేనియందైతే, ప్రోతమ్ - అమర్చబడిన, రవిరథచక్రమ్ - సూర్యుని రథముయొక్క చక్రము, తైలయంత్రచక్రవత్ - నూనె గానుగ చక్రము వలె, భ్రమత్ - తిరు

గుచున్నదై, మానసోత్తరగిరౌ - మానసోత్తర పర్వతమునందు, పరిభ్రమతి - చుట్టూ తిరుగుచున్నది.

ఆ రథమునకు సంవత్సరమే చక్రమనియు, పన్నెండు నెలలే దాని ఆకులు అనియు, ఆరు ఋతువులే కడకమ్మీలు అనియు, మూడు నాలుగు-నెలల కాలములే నడిమి తూములనియు చెప్పుచున్నారు. దాని ఇరుసుయొక్క ఒక కొన మేరు పర్వత శిఖరముపై నుండగా, రెండవ కొన మానసోత్తర పర్వతముపై నుండును. ఆ ఇరుసునకు అమర్చబడిన సూర్య రథచక్రము నూనె గానుగ చక్రము వలె తిరుగుచుండగా, రథము మానసోత్తర పర్వతముపై చుట్టూ తిరుగుచుండును.

తస్మిన్నక్షే కృతమూలో ద్వితీయోऽక్షస్తుర్యమానేన సమ్మితస్తై
లయంత్రాక్షవద్ధ్రువే కృతోపరిభాగః ॥ 14

తస్మిన్ - ఆ, అక్షే - ఇరుసునందు, కృతమూలః - అమర్చబడిన మొదలు గల, ద్వితీయః -రెండవ, అక్షః - ఇరుసు, తుర్యమానేన - నాల్గవ వంతు పొడవుచే, సమ్మితః - పరిమితి గలది, తైలయంత్ర-అక్షవత్ - నూనె గానుగ ఇరుసు వలె, ధ్రువే - ధ్రువమండలముపై, కృత-ఉపరిభాగః - ఉంచబడిన పై భాగము గలది.

ఆ ఇరుసునకు అమర్చబడి రెండవ ఇరుసు గలదు. నూనె గానుగ ఇరుసువంటి దాని పొడవు దీని పొడవులో నాల్గవ వంతు ఉండును. దాని పై కొన ఈశ్వరునిచే ధ్రువమండలముపై నుంచబడినది.

రథనీడస్తు షట్త్రింశల్లక్షయోజనాయతస్తత్తురీయభాగవిశాలస్తా
వాన్ రవిరథయుగో యత్ర హయాశ్ఛందోనామానస్సప్తారుణ
యోజితా వహంతి దేవమాదిత్యమ్ ॥ 15

రథనీడః తు - రథముయొక్క గూడైతే, షట్-త్రింశత్-లక్షయోజన -ఆయతః - ముప్పై ఆరు లక్షల యోజనముల పొడవు గలది, తత్-తురీయభాగవిశాలః - దానిలో నాల్గవ వంతు వెడల్పు గలది, రవిరథయుగః - సూర్యరథముయొక్క కాడి, తావాన్ - అంతే పొడవు గలది, యత్ర - దేని

యంద్రైతే, ఛందోనామానః - ఛందస్సుల పేర్లు గల, సప్త - ఏడు, హయాః - గుఱ్ఱములు, అరుణయోజితాః - అరుణునిచే పూన్చబడినవై, ఆదిత్యం దేవమ్ - సూర్యదేవుని, వహంతి - మోయుచుండును.

ఆ రథముయొక్క గూడు ముప్పై ఆరు లక్షల యోజనముల పొడవు, తొమ్మిది లక్షల యోజనముల వెడల్పు కలిగియుండును. దాని కాడి పొడవు తొమ్మిది లక్షల యోజనములు. దానియందు గాయత్రి మొదలగు ఛందస్సుల పేర్లు గల గుఱ్ఱములు పూన్చబడియుండును. అరుణుడు సారథిగా గల ఆ రథమును సూర్యదేవుడు అధిష్ఠించి పయనించును.

పురస్తాత్సవితురరుణః పశ్చాచ్చ నియుక్తస్సౌత్యే కర్మణి కిలాऽऽస్తే ।। 16

సౌత్యే - రథమును తోలే, కర్మణి - పనియందు, నియుక్తః - నియోగించబడిన, అరుణః - అరుణుడు, సవితుః - సూర్యునకు, పురస్తాత్ - ముందు, పశ్చాత్ చ - వెనుక కూడ, ఆస్తే కిల - ఉండును గదా!

రథమును తోలే పని అరుణునకు ఈశ్వరునిచే అప్పగించబడినది. కావుననే, అరుణుని ప్రకాశము సూర్యుడు ఉదయించుటకు ముందు, అస్తమించిన తరువాత కూడ ఉండును. (లేదా, సూర్యునకు ముందు కూర్చుండే అరుణుడు వెనుకకు, అనగా సూర్యుని వైపు చూచుచుండును).

తథా వాలఖిల్యా ఋషయోऽంగుష్ఠపర్వమాత్రాష్షష్టిసహస్రాణి పురతస్సూర్యం సూక్తవాకాయ నియుక్తాస్సంస్తువంతి ।। 17

తథా - మరియు, అంగుష్ఠపర్వమాత్రాః - బొటనవ్రేలి కణుపు పరిమాణములోనుండే, వాలఖిల్యాః ఋషయః - వాలఖిల్య మహర్షులు, షష్టి సహస్రాణి - అరవై వేల మంది, సూర్యం పురతః - సూర్యునకు ఎదురుగా, సూక్తవాకాయ - స్వస్తివాచనము కొరకు, నియుక్తాః - నియోగించబడినవారై, సంస్తువంతి - చక్కగా స్తుతించుచుందురు.

ఇంతేగాక, ఈశ్వరునిచే స్వస్తివాచనము కొరకు నియోగించబడిన అరవై వేలమంది వాలఖిల్య మహర్షులు సూర్యుని ఎదుట చక్కగా స్తోత్ర

ములను పఠించుచుందురు. వారు కేవలము బొటనవ్రేలి కణుపు పరిమాణ ములో నుందురు.

తథాఽన్యే చ ఋషయో గంధర్వాప్సరసో నాగా గ్రామణ్యో యాతుధానా దేవా ఇత్యేకైకశో గణాస్సప్త చతుర్దశ మాసి మాసి భగవంతం సూర్యమాత్మానం నానానామానం పృథ జ్నానానామానః పృథక్కర్మభిర్ద్వంద్వశ ఉపాసతే ॥ 18

తథా - అదే విధముగా, అన్యే - ఇతరులగు, ఋషయః - మహ ర్షులు, గంధర్వ-అప్సరసః - గంధర్వులు అప్సరసలు, నాగాః - నాగులు, గ్రామణ్యః - యక్షులు, యాతుధానాః - రాక్షసులు, దేవాః - దేవతలు, ఇతి - అని, ఏక-ఏకశః - ఒక్కొక్కరుగా, చతుర్దశ - పదునాలుగు, ద్వంద్వశః - ఇద్దరు చొప్పున (జంటలుగా), సప్త - ఏడు, గణాః - గణములు, మాసి మాసి - ప్రతి నెలయందు, పృథక్ - వేర్వేరుగా, నానానామానః -అనేకము లగు పేర్లు గలవారై, పృథక్-కర్మభిః - వేర్వేరు కర్మలచే, ఆత్మానమ్ - ఆత్మస్వరూపుడైనట్టియు, నానానామానమ్ - అనేక నామములు గల, భగ వంతం సూర్యమ్ - సూర్య దేవుని, ఉపాసతే - ఉపాసించెదరు.

అదే విధముగా, ఇతర మహర్షులు, గంధర్వులు, అప్సరసలు, నాగులు, యక్షులు, రాక్షసులు, దేవతలు అనువారలు తమ తమ భార్య లతో గూడి, ప్రతి నెలయందు వేర్వేరు పేర్లతో, వేర్వేరు కర్మలతో, అనేక నామములు గల ఆత్మస్వరూపుడైన సూర్యదేవుని ఉపాసించుచుందురు. వారు ఒక్కొక్కరుగా పదునాల్గు గణములుగా ఉన్నారు. కాని, ఇద్దరు చొప్పున లెక్కిస్తే, ఏడు గణములు అగుదురు.

లక్షోత్తరం సార్ధనవకోటియోజనపరిమండలం భూవలయస్య క్షణేన సగవ్యూత్యుత్తరం ద్విసహస్రయోజనాని స భుంక్తే ॥
19

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే
సూర్యరథగతివర్ణనం నామ ఏకవింశోఽధ్యాయః ॥

భూవలయస్య - భూమండలముయొక్క, లక్ష-ఉత్తరమ్ - లక్ష అధికముగా గల, స-అర్ధనవకోటియోజనపరిమండలమ్ - తొమ్మిదిన్నర కోట్ల యోజనముల వృత్తమును, క్షణేన - క్షణకాలముచే, సగవ్యూతి-ఉత్తరమ్ - రెండు యోజనములు అధికముగా గల, ద్విసహస్రయోజనాని - రెండు వేల యోజనములను, సః - ఆ సూర్యుడు, భుంక్తే - తిరుగును.

సూర్యుడు భూమండలముయొక్క తొమ్మిది కోట్ల ఏభై ఒక్క లక్షల యోజనముల వృత్తము చుట్టూ, క్షణమునకు రెండు వేల రెండు యోజనముల వేగముతో, తిరుగుచుండును.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో
సూర్యరథముయొక్క గమనమును వర్ణించే ఇరువది
ఒకటవ అధ్యాయము ముగిసినది (21).

*****

# అథ ద్వావింశోఽధ్యాయః

## జ్యోతిశ్చక్రము - గ్రహముల గతి

రాజోవాచ ।

యదేతద్భగవత ఆదిత్యస్య మేరుం ధ్రువం చ ప్రదక్షిణేన పరి
క్రామతో రాశీనామభిముఖం ప్రచలితం చాప్రదక్షిణం భగవతో
పవర్ణితమముష్య కథమనుమిమీమహీతి ॥ 1

మేరుమ్ - మేరు పర్వతమును, ధ్రువం చ - ధ్రువ మండలమును కూడ, ప్రదక్షిణేన - ప్రదక్షిణముగా, పరిక్రామతః - చుట్టి వచ్చుచున్న, అముష్య - ఈ, భగవతః ఆదిత్యస్య - సూర్య భగవానునియొక్క, యత్ - ఏ, ఏతత్ - ఈ, రాశీనామ్ - రాశులకు, అభిముఖమ్ - అభిముఖముగా, అప్రదక్షిణమ్ - ప్రదక్షిణమునకు విపరీతముగా, ప్రచలితమ్ - చలనము, భగవతా - పూజనీయుడగు మీచే, ఉపవర్ణితమ్ - వర్ణించబడినదో దానిని, కథమ్ - ఏ విధముగా, అనుమిమీమహి - ఆలోచించి నిశ్చయముగా తెలియ గల్గుదుము?, ఇతి - అని.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- ఈ సూర్యభగవానుడు రాశులకు ఎదురుగా మేరు పర్వతము, ధ్రువమండలము తనకు ఎడమవైపు ఉండునట్లు చుట్టివచ్చుననియు, కాని వాస్తవములో ఆయన గమనము ఎడమవైపు చుట్టివచ్చుట కాదనియు పూజనీయులగు మీరు వర్ణించితిరి. ఈ విషయము మాకు నిశ్చయముగా తెలియుట యెట్లు?

స హోవాచ ।

యథా కులాలచక్రేణ భ్రమతా సహ భ్రమతాం తదాశ్ర
యాణాం పిపీలికాదీనాం గతిరన్యైవ ప్రదేశాంతరేష్వప్యుపల

భ్యమానత్వాదేవం నక్షత్రరాశిభిరుపలక్షితేన కాలచక్రేణ ధ్రువం మేరుం చ ప్రదక్షిణేన పరిధావతా సహ పరిధావమానానాం తదాశ్రయాణాం సూర్యాదీనాం గ్రహాణాం గతిరన్యైవ నక్షత్రాంతరే రాశ్యంతరే చోపలభ్యమానత్వాత్ ॥ 2

యథా - ఏ విధముగానైతే, భ్రమతా - తిరుగుచున్న, కులాలచక్రేణ సహ - కుమ్మరివాని చక్రముతో బాటుగా, భ్రమతామ్ - తిరుగుచున్న, తద్-ఆశ్రయాణామ్ - ఆ చక్రమునాశ్రయించి ఉన్న, పిపీలిక-ఆదీనామ్ - చీమలు మొదలగువాటి, గతిః - గమనము, ప్రదేశ-అంతరేషు అపి - ఇతర ప్రదేశములయందు కూడ, అన్యా ఏవ - భిన్నముగనే, ఉపలభ్యమానత్వాత్ - తెలియబడుచుండుట వలన, ఏవమ్ - ఇదే విధముగా, నక్షత్రరాశిభిః - నక్షత్రములచే రాశులచే, ఉపలక్షితేన - లక్షణము తెలియబడునట్టియు, ధ్రువమ్ - ధ్రువమండలమును, మేరుం చ - మేరు పర్వతమును కూడ, ప్రదక్షిణేన - ప్రదక్షిణముగా, పరిధావతా - చుట్టూ తిరుగుచున్న, కాలచక్రేణ సహ - కాలచక్రముతో బాటుగా, పరిధావమానానామ్ - చుట్టూ తిరుగుచున్న, తద్-ఆశ్రయాణామ్ - ఆ కాలచక్రమునాశ్రయించి ఉన్న, సూర్య-ఆదీనామ్ - సూర్యుడు మొదలుగా గల, గ్రహాణామ్ - గ్రహముల, గతిః - గమనము, నక్షత్ర-అంతరే - మరియొక నక్షత్రమునందు, రాశి-అంతరే చ - మరియొక రాశియందు కూడ, అన్యా ఏవ - విపరీతమైనదిగనే, ఉపలభ్యమానత్వాత్ - తెలియబడుచుండుట వలన.

శ్రీశుకమహర్షి స్పష్టముగా ఇట్లు పలికెను --- కుమ్మరివాని చక్రము తిరుగుచుండగా దానిపై నుండి దానికి ఎదురుగా తిరిగే చీమలు మొదలగువాటి గమనము చక్రమునకు బయట నిలబడి యున్నవారికి విపరీతముగనే కానవచ్చును. అదే విధముగా, ధ్రువమండలమును మేరు పర్వతమును ప్రదక్షిణముగా కాలచక్రము చుట్టి వచ్చుచుండును. ఆ కాలచక్రమునాశ్రయించియున్న సూర్యుడు మొదలగు గ్రహములు కూడ దానితో బాటే తిరుగుచుండును. కాని, వాటి గమనము తూర్పు దిక్కునందలి నక్షత్రములయందు, రాశులయందు విపరీతముగా కానవచ్చును. కాలచక్రము యొక్క గతిని నిర్ధారించేది నక్షత్రములు, రాశులే గదా!

స ఏష భగవానాదిపురుష ఏవ సాక్షాన్నారాయణో లోకానాం స్వస్తయ ఆత్మానం త్రయీమయం కర్మవిశుద్ధినిమిత్తం కవిభి రపి చ వేదేన విజిజ్ఞాస్యమానో ద్వాదశధా విభజ్య షట్సు వసంతాదిష్వృతుషు యథోపజోషమృతుగుణాన్విదధాతి ।।3

సః - ఆ, ఏషః - ఈ, భగవాన్ - భగవానుడు, ఆదిపురుషః - జగత్కారణుడు మరియు పూర్ణుడు, కవిభిః - మహాత్ములచే, వేదేన అపి చ - వేదముచే కూడ, విజిజ్ఞాస్యమానః - తెలియగోర బడుచున్నవాడు అగు, నారాయణః ఏవ - నారాయణుడే, సాక్షాత్ - ప్రత్యక్షముగా, లోకానామ్ - లోకముల, స్వస్తయే - కల్యాణము కొరకు, త్రయీమయమ్ - వేదరూపుడైన, ఆత్మానమ్ - తనను, కర్మవిశుద్ధినిమిత్తమ్ - కర్మల శుద్ధి కారణముగా, ద్వాదశధా - పన్నెండు విధములుగా, విభజ్య - విభజించుకొని, షట్సు - ఆరు, వసంత-ఆదిషు - వసంతము మొదలుగా గల, ఋతుషు - ఋతువులయందు, యథా-ఉపజోషమ్ - కర్మఫలముల భోగము నతిక్రమించకుండగా, ఋతుగుణాన్ - ఋతు లక్షణములను, విదధాతి - విధించుచున్నాడు.

జగత్కారణుడు, పూర్ణుడు అగు నారాయణుని మహాత్ములు మరియు వేదము తెలియగోరుచుండును. అట్టి ఈ నారాయణుడే సాక్షాత్తుగా (సూర్యరూపములో ప్రత్యక్షుడై) వైదికకర్మల శుద్ధి కారణముగా తద్ద్వారా లోకముల కల్యాణము కొరకై, వేదమయమగు తన కాలరూపమును పన్నెండు విధములు (మాసములు) గా విభజించెను. జీవులకు కర్మఫలముల భోగమునకు అనుకూలముగా ఉండే విధముగా ఆయన వసంతము మొదలగు ఆ ఆరు ఋతువుల లక్షణములను ఏర్పాటు చేసెను.

తమేతమిహ పురుషాస్త్రయ్యా విద్యయా వర్ణాశ్రమాచారానుపథా ఉచ్చావచైః కర్మభిరామ్నాతైర్యోగవితానైశ్చ శ్రద్ధయా యజంతోఽంజసా శ్రేయస్సమధిగచ్ఛంతి ।। 4

ఇహ - ఈ లోకమునందు, తమ్ - అట్టి, ఏతమ్ - ఈ సూర్యరూపుడగు భగవానుని, వర్ణ-ఆశ్రమ-ఆచార-అనుపథాః - వర్ణాశ్రమధర్మము

లను అనుష్ఠించే, పురుషాః - మానవులు, త్రయ్యా - వేదరూపమగు, విద్యయా - విద్యచే, ఆమ్నాతైః - విధించబడిన, ఉచ్చావచైః - పెద్ద చిన్న, కర్మభిః - కర్మలచే, యోగవితానైః చ - యోగసాధనలచే, శ్రద్ధయా - శ్రద్ధ తో, యజంతః - ఆరాధించుచున్నవారై, అంజసా - తేలికగా, శ్రేయః - మోక్షమును, సమధిగచ్ఛంతి - చక్కగా పొందుచున్నారు.

వేదవిద్య చిన్న పెద్ద కర్మలను, యోగసాధనలను బోధించుచున్న ది. వాటి ద్వారా ఈ లోకములో మానవులు ఈ సూర్యనారాయణుని శ్రద్ధతో ఆరాధిస్తూ, వర్ణాశ్రమధర్మముల ననుష్ఠిస్తూ తేలికగా మోక్షమును చక్కగా పొందుచున్నారు.

అథ స ఏష ఆత్మా లోకానాం ద్యావాపృథివ్యోరంతరేణ నభో
వలయస్య కాలచక్రగతో ద్వాదశ మాసాన్ భుంక్తే రాశిసంజ్ఞాన్
సంవత్సరావయవాన్ మాసః పక్షద్వయం దివా నక్తం చేతి
సపాదర్క్షద్వయముపదిశంతి యావతా షష్ఠమంశం భుంజీత
స వై ఋతురిత్యుపదిశ్యతే సంవత్సరావయవః ॥ 5

అథ - మరియు, లోకానామ్ - ప్రాణులకు, ఆత్మా - ఆత్మయగు, సః - అట్టి, ఏషః - ఈ సూర్యుడు, ద్యావాపృథివ్యోః - స్వర్గలోక భూలోక ములకు, అంతరేణ - మధ్యయందు, నభః-వలయస్య - అంతరిక్ష మండ లముయొక్క, కాలచక్రగతః - కాలచక్రమును పొందినవాడై, రాశిసంజ్ఞాన్ - రాశులను బట్టి పేర్లు వచ్చునట్టియు, సంవత్సర-అవయవాన్ - సంవత్సర ముయొక్క అవయవములైన, ద్వాదశ - పన్నెండు, మాసాన్ - నెలలను, భుంక్తే - అతిక్రమించుచున్నాడు, పక్షద్వయమ్ - రెండు పక్షములు, దివా - పగలు, నక్తం చ - రాత్రి కలిసి, సపాద-ఋక్షద్వయమ్ - రెండు నక్షత్ర ములు మరియు ఒక పాదము, మాసః - మాసము, ఇతి - అని, ఉపదిశంతి - బోధించుచున్నారు, యావతా - ఏ కాలముచే, షష్ఠమ్ - ఆరవ, అంశమ్ - భాగమును, భుంజీత - అతిక్రమించునో, సః - అది, వై - నిశ్చయము గా, సంవత్సర-అవయవః - సంవత్సరమునకు అవయవమగు, ఋతుః - ఋతువు, ఇతి - అని, ఉపదిశ్యతే - బోధించబడుచున్నది.

సకలప్రాణులకు ఆత్మయగు ఆ ఈ సూర్యుడు స్వర్గలోక భూలోకములకు మధ్యలో అంతరిక్ష మండలమునందలి కాలచక్రమును పొందినవాడై, పన్నెండు నెలలను అతిక్రమించుచున్నాడు. ఆయన అతిక్రమించే (దాటి ముందుకు సాగే) రాశుల పేర్లే సంవత్సరమునకు అవయవములగు ఈ నెలలకు వచ్చినవి. చంద్రమానమును బట్టి రెండు పక్షములు నెల అనియు, పితృమానమును బట్టి పగలు రాత్రి కలిపి నెల అనియు, సౌరమానమును బట్టి రెండు నక్షత్రముల ఒక పాదమును సూర్యుడు అతిక్రమించే కాలము నెల అనియు జ్యోతిశ్శాస్త్రజ్ఞులు బోధించుచున్నారు. సూర్యుడు ఈ సంవత్సరకాల పరిభ్రమణములో ఆరవ వంతు పూర్తి చేసిన కాలమునకు ఋతువు అని పేరు. అది కూడ సంవత్సరమునకు అవయవమే.

అథ చ యావతార్ధేన నభోవీథ్యాం ప్రచరతి తం కాలమయన
మాచక్షతే ।। 6

అథ చ - మరియు, యావతా - ఏ కాలముచే, నభోవీథ్యామ్ - ఆకాశవీథియందు, అర్ధేన - సగముచే, ప్రచరతి - అతిక్రమించునో, తమ్ - ఆ, కాలమ్ - కాలమును, అయనమ్ - అయనమునుగా, ఆచక్షతే - చెప్పుచున్నారు.

సూర్యుడు ఆకాశవీథిలో ఒక పరిభ్రమణము (సంవత్సరము) లో సగమును అతిక్రమించే కాలమును అయనమని పెద్దలు వ్యవహరించెదరు.

అథ చ యావన్నభోమండలం సహ ద్యావాపృథివ్యోర్మండ
లాభ్యాం కార్త్స్న్యేన స హ భుంజీత తం కాలం సంవత్సరం
పరివత్సరమిడావత్సరమనువత్సరం వత్సరమితి భానోర్మాం
ద్యశైఘ్ర్యసమగతిభిస్సమామనంతి ।। 7

అథ చ - మరియు, ద్యావాపృథివ్యోః - స్వర్గలోక భూలోకముల యొక్క, మండలాభ్యాం సహ - మండలములతో సహా, నభోమండలమ్ - అంతరిక్ష మండలమును, కార్త్స్న్యేన - పూర్తిగా, సః హ - ఆ సూర్యుడు, యావత్ - ఎంతలో, భుంజీత - అతిక్రమించునో, తమ్ - అట్టి, కాలమ్ - కాలమును, భానోః - సూర్యునియొక్క, మాంద్యశైఘ్ర్యసమగతిభిః -

మెల్లని వేగమైన మరియు సమానమైన గమనములచే, సంవత్సరమ్ - సంవత్సరము, పరివత్సరమ్ - పరివత్సరము, ఇడావత్సరమ్ - ఇడావత్సరము, అనువత్సరమ్ - అనువత్సరము, వత్సరమ్ - వత్సరము, ఇతి - అని, సమామనంతి - చెప్పుచున్నారు.

మరియు, ఆ సూర్యుడు స్వర్గలోక భూలోకముల మండలములతో సహా అంతరిక్ష మండలమును పూర్తిగా అతిక్రమించే కాలమునకు, సూర్యుని మెల్లని, వేగమైన మరియు సమానమైన గమనములను బట్టి, సంవత్సరము, పరివత్సరము, ఇడావత్సరము, అనువత్సరము, వత్సరము అని అవాంతర భేదముతో కూడిన వ్యవహారమును జ్యోతిశ్శాస్త్రజ్ఞులు చేయుచున్నారు.

ఏవం చంద్రమా అర్కగభస్తిభ్య ఉపరిష్టాల్లక్షయోజనత ఉపలభ్యమానోऽర్కస్య సంవత్సరభుక్తిం పక్షాభ్యాం మాసభుక్తిం సపాదర్క్షాభ్యాం దినేనైవ పక్షభుక్తిమగ్రచారీ ద్రుతతరగమనో భుంక్తే ॥8

ఏవమ్ - ఇదే విధముగా, అర్కగభస్తిభ్యః - సూర్యకిరణములకంటె, ఉపరిష్టాత్ - పైన, లక్షయోజనతః - లక్ష యోజనముల దూరమునుండి, ఉపలభ్యమానః - లభ్యమగుచున్నవాడు, అగ్రచారీ - అగ్రేసరుడు, ద్రుతతరగమనః - ఎక్కువ శీఘ్రమైన గమనము గలవాడు అగు, చంద్రమాః - చంద్రుడు, అర్కస్య - సూర్యుని, సంవత్సరభుక్తిమ్ - సంవత్సరకాలములో పయనించిన దూరమును, పక్షాభ్యామ్ - రెండు పక్షములతో, మాసభుక్తిమ్ - నెలలో పయనించిన దూరమును, సపాద-ఋక్షాభ్యామ్ - ఒక పాదముతో గూడిన రెండు నక్షత్రములతో, పక్షభుక్తిమ్ - పక్షములో పయనించిన దూరమును, దినేన ఏవ - ఒక రోజుచే మాత్రమే, భుంక్తే - అతిక్రమించుచున్నాడు.

ఇంతే గాక, చంద్రుడు సూర్యమండలమునకు పైన లక్షయోజనముల దూరములో నుండును. చంద్రుడు రాశులన్నిటికీ ముందు ఉండును. చంద్రుని వేగము సూర్యుని వేగము కంటె అధికము. సూర్యుడు సంవత్సరకాలములో పయనించిన మార్గమును చంద్రుడు నెలలో, నెలలో పయనిం

చిన మార్గమును రెండు రోజుల పూటలో, పక్షములో పయనించిన దూర మును ఒకే రోజులో అతిక్రమించును.

అథ చాపూర్యమాణాభిశ్చ కలాభిరమరాణాం క్షీయమాణా
భిశ్చ కలాభిః పితౄణామహోరాత్రాణి పూర్వపక్షాపరప
క్షాభ్యాం వితన్వానస్సర్వజీవనివహప్రాణో జీవశ్చైకమేకం
నక్షత్రం త్రింశతా ముహూర్తైర్భుం క్తే ॥ 9

అథ చ - మరియు, ఆపూర్యమాణాభిః - పూరించబడుచున్న, కలాభిః - కళలచే, అమరాణామ్ - దేవతలకు, క్షీయమాణాభిః - క్షీణించు చున్న, కలాభిః - కళలచే, పితౄణామ్ - పితృదేవతలకు, పూర్వపక్ష-అపర పక్షాభ్యామ్ - శుక్లపక్ష కృష్ణపక్షములచే, అహోరాత్రాణి - పగళ్లను రాత్రుల ను, వితన్వానః - చేయుచున్నవాడై, సర్వజీవనివహప్రాణః - సకలప్రాణుల సమూహములకు ప్రాణము, జీవః - ప్రాణకారణము అగు చంద్రుడు, ఏకం ఏకమ్ - ఒక్కొక్క, నక్షత్రమ్ - నక్షత్రమును, త్రింశతా - ముప్పై, ముహూర్తైః - ముహూర్తములచే, భుంక్తే - అతిక్రమించుచున్నాడు.

మరియు, చంద్రుడు శుక్లపక్షములో పూరించబడుచున్న కళలతో దేవతలకు పగళ్లను, కృష్ణపక్షములో క్షీణించుచున్న కళలతో పితృదేవత లకు రాత్రులను వ్యవస్థ చేయుచున్నాడు. (శుక్లపక్షములో దేవతలను, కృష్ణ పక్షములో పితృదేవతలను పూజించుట శ్రేష్ఠము అని యర్థము). సకలప్రా ణులకు అన్నము రూపములో ప్రాణములను నిలబెట్టేది అమృతమయు డగు చంద్రుడే. ఆయన ఒక్కొక్క నక్షత్రమును ముప్పై ముహూర్తముల (ఒక రోజు) కాలములో అతిక్రమించును.

య ఏష షోడశకలః పురుషో భగవాన్ మనోమయోఽన్నమయోఽ
మృతమయో దేవపితృమనుష్యభూతపశుపక్షిసరీసృపవీరుధాం
ప్రాణాప్యాయనశీలత్వాత్సర్వమయ ఇతి వర్ణయంతి ॥ 10

షోడశకలః - పదునారు కళలు గలవాడు, పురుషః - పురుష రూపుడు, భగవాన్ - పూజనీయుడు, మనోమయః - మనస్సు రూపములో

నుండువాడు, అన్నమయః - ఆహారము రూపములో నుండువాడు, అమృతమయః - రసస్వరూపుడు అగు, యః - ఏ చంద్రుడు గలడో, ఏషః - ఈ చంద్రుడు, దేవపితృమనుష్యభూతపశుపక్షిసరీసృపవీరుధామ్ - దేవతలు పితృదేవతలు మానవులు ప్రేతములు పశువులు పక్షులు ప్రాకెడి జంతువులు మరియు చెట్టుచేమలకు, ప్రాణ-అప్యాయనశీలత్వాత్ - ప్రాణములకు తృప్తిని కలిగించే స్వభావము కలిగియుండుట వలన, సర్వమయః - సర్వమయుడు అని, వర్ణయంతి - వర్ణించుచున్నారు.

పూజనీయుడగు ఈ చంద్రుని రూపములో ఆ పురుషోత్తముడే ఉన్నాడు. పదునారు కళల ఈ చంద్రుడు మనస్సునకు అధిష్ఠాన దేవత. రసస్వరూపుడగు ఈ చంద్రుడే ఆహారము రూపములో నున్నవాడై దేవతలు, పితృదేవతలు, మానవులు, ప్రేతములు, పశువులు, పక్షులు, ప్రాకెడి జంతువులు మరియు చెట్టు చేమల ప్రాణములకు తృప్తిని, పుష్టని కలిగించే స్వభావము కలిగియున్నాడు. ఈ విధముగా సర్వము రూపములో చంద్రుడే ఉన్నాడని మహాత్ములు వర్ణించుచున్నారు.

**తత ఉపరిష్టాత్త్రిలక్షయోజనతో నక్షత్రాణి మేరుం దక్షిణేనైవ కాలాయన ఈశ్వరయోజితాని సహాభిజితాऽష్టావింశతిః ||11**

**తతః** - ఆ చంద్రమండలము కంటె, త్రిలక్షయోజనతః - మూడు లక్షల యోజనముల, ఉపరిష్టాత్ - పైన, ఈశ్వరయోజితాని - ఈశ్వరునిచే నియోగించబడిన, నక్షత్రాణి - నక్షత్రములు, కాల-అయనే - కాలచక్రము నందు, అభిజితా సహ - అభిజిత్తుతో కలిపి, అష్టావింశతిః - ఇరవై ఎనిమిది, మేరుమ్ - మేరు పర్వతమును, దక్షిణేన ఏవ - కుడిగా మాత్రమే.

ఆ చంద్రమండలమునకు మూడు లక్షల యోజనముల పైన అభిజిత్తుతో కలిసి ఇరవై ఎనిమిది నక్షత్రములు గలవు. ఈశ్వరునిచే కాలచక్రమునందు నియోగించబడిన ఈ నక్షత్రములు మేరు పర్వతము తమకు కుడివైపు ఉండే విధముగా కాలచక్రములో పరిభ్రమించుచుండును (కాలచక్రముతో బాటుగా మేరువునకు ప్రదక్షిణము చేయుచుండును).

**తత ఉపరిష్టాదుశనా ద్విలక్షయోజనత ఉపలభ్యతే పురతః పశ్చాత్సహైవ వాఽర్కస్య శైఘ్ర్యమాంద్యసామ్యాభిర్గతిభిర ర్కవచ్చరతి లోకానాం నిత్యదాఽనుకూల ఏవ ప్రాయేణ వర్ష యంశ్చారేణానుమీయతే స వృష్టివిష్టంభగ్రహోపశమనః॥12**

తతః - నక్షత్రమండలముకంటె, ద్విలక్షయోజనతః - రెండు లక్షల యోజనముల, ఉపరిష్టాత్ - పైన, ఉశనా - శుక్రుడు, ఉపలభ్యతే - కానవచ్చుచున్నాడు, అర్కస్య - సూర్యునకు, పురతః - ఎదురుగా గాని, పశ్చాత్ - వెనుక గాని, సహ ఏవ వా - కలిసియే గాని, శైఘ్ర్యమాంద్యసా మ్యాభిః - శీఘ్రము మెల్లన మరియు సమానమైన, గతిభిః - వేగములతో, అర్కవత్ - సూర్యుడు వలె, చరతి - తిరుగుచున్నాడు, లోకానామ్ - ప్రాణులకు, నిత్యదా - అన్ని కాలములలో, అనుకూలః ఏవ - అనుకూలు డే, సః - ఆ శుక్రుడు, ప్రాయేణ - తరచుగా, వర్షయన్ - వర్షమును కలిగిం చుచున్నవాడై, చారేణ - గమనముచే, వృష్టివిష్టంభగ్రహ-ఉపశమనః - వర్షముయొక్క స్తంభింపజేసే గ్రహములను ఉపశమింప జేయువాడుగా, అనుమీయతే - ఊహించబడుచున్నాడు.

నక్షత్రమండలమునకు రెండు లక్షల యోజనముల పైన శుక్రుడు కనబడును. శుక్రుడు సూర్యుని శీఘ్రమైన, మెల్లని మరియు సమానమైన గమనములతో బాటుగా సూర్యునకు ముందు గాని, వెనుక గాని, సమాన ముగా గాని సూర్యుని వలెనే సంచరించును. శుక్రుడు సర్వకాలములలో ప్రాణులకు అనుకూలుడు. ఏలయన, శుక్రుడు తరచుగా వర్షములను కలి గించును. శుక్రుడు తన గమనముచే వర్షమును స్తంభింపజేసే గ్రహ ములను ఉపశమింప జేయునని ఊహించ వచ్చును.

**ఉశనసా బుధో వ్యాఖ్యాతస్తత ఉపరిష్టాద్ద్విలక్షయోజనతో బుధస్సో మసుత ఉపలభ్యమానః ప్రాయేణ శుభకృద్యదాఽర్కాద్వ్యతిరిచ్యేత తదాఽతివాతాఽభ్రప్రాయానావృష్ట్యాదిభయమాశంసతే ॥ 13**

ఉశనసా - శుక్రునిచే, బుధః - బుధుడు, వ్యాఖ్యాతః - వ్యాఖ్యా నించబడినాడు, తతః - శుక్రునికంటె, ద్విలక్షయోజనతః - రెండు లక్షల

యోజనముల, ఉపరిష్టాత్ - పైన, సోమసుతః - చంద్రుని కుమారుడగు, బుధః - బుధుడు, ఉపలభ్యమానః - కనబడుచున్నవాడు, ప్రాయేణ - తరచుగా, శుభకృత్ - శుభమును చేయువాడు, యదా - ఏ కాలమునందైతే, అర్కాత్ - సూర్యునికంటె, వ్యతిరిచ్యేత - దాటి ముందుకు పోవునో, తదా - అప్పుడు, అతివాత-అభ్రప్రాయ-అనావృష్టి-ఆదిభయమ్ - పెనుగాలి మేఘములతో నిండిన ఆకాశము మరియు అనావృష్టి మొదలగు వాటి వలని భయమును, ఆశంసతే - సూచించును.

శుక్రునకు రెండు లక్షల యోజనముల పైన చంద్రపుత్రుడగు బుధుడు కానవచ్చును. బుధుని గమనము శుక్రుని గమనమునే పోలియుండును. బుధుడు తరచుగా శుభకరుడు. కాని, బుధుడు సూర్యుని దాటి ముందుకు వెళ్లిన సందర్భములలో పెనుగాలిని, ఆకాశము మేఘావృతమగుటను, అనావృష్టి మొదలగు భయములను సూచించును.

> అత ఊర్ధ్వమంగారకోఽపి యోజనలక్షద్వితయ ఉపలభ్యమానస్త్రిభిస్త్రిభిః పక్షైరేకైకశో రాశీన్ ద్వాదశానుభుంక్తే యది న వక్రేణాభివర్తతే ప్రాయేణాశుభగ్రహోఽఘశంసః ॥ 14

అతః - ఈ బుధుని కంటె, యోజనలక్షద్వితయే - రెండు లక్షల యోజనములయందు, ఊర్ధ్వమ్ - పైన, అంగారకః అపి - అంగారకుడు కూడ, ఉపలభ్యమానః - కనబడుచున్నవాడు, వక్రేణ - వంకరయగు మార్గముచే, యది న అభివర్తతే - పయనించని పక్షములో, త్రిభిః త్రిభిః - మూడేసి మూడేసి, పక్షైః - పక్షములచే, ఏక-ఏకశః - ఒక్కొక్కటిగా, ద్వాదశ - పన్నెండు, రాశీన్ - రాశులను, అనుభుంక్తే - అతిక్రమించును, ప్రాయేణ - తరచుగా, అశుభగ్రహః - అశుభమును చేసే గ్రహము, అఘశంసః - దుఃఖమును సూచించునది.

బుధునకు రెండు లక్షల యోజనములకు పైన అంగారక గ్రహము కానవచ్చును. అది వంకరయగు గమనములో లేనప్పుడు పన్నెండు రాశులను ఒక్కొక్కదానిని మూడేసి పక్షముల కాలములో అతిక్రమించును. తరచుగా అశుభమును చేసే ఈ గ్రహము దుఃఖమును సూచించును.

**తత ఉపరిష్టాద్ద్విలక్షయోజనాంతరగతో భగవాన్ బృహస్పతిరే
కైకస్మిన్ రాశౌ పరివత్సరం పరివత్సరం చరతి యదా న వక్ర
స్స్యాత్ప్రాయేణానుకూలో బ్రాహ్మణకులస్య ॥ 15**

**తతః** - అంగారకుని కంటె, **ఉపరిష్టాత్** - పైన, **ద్విలక్షయోజన -అంతరగతః** - రెండు లక్షల యోజనముల దూరములో నున్న, **భగవాన్** - పూజనీయుడగు, **బృహస్పతిః** - గురువు, **యదా** - ఎప్పుడైతే, **వక్రః** - వంకర గమనము గలవాడు, **న స్యాత్** - కాడో అప్పుడు, **ఏక-ఏకస్మిన్** - ఒక్కొక్క, **రాశౌ** - రాశియందు, **పరివత్సరం పరివత్సరమ్** - ఒక్కొక్క సంవత్సరమును, **చరతి** - అతిక్రమించును, **ప్రాయేణ** - తరచుగా, **బ్రాహ్మణకులస్య** - వేదవేత్తల సమూహమునకు, **అనుకూలః** - అనుకూలుడు.

అంగారక గ్రహమునకు రెండు లక్షల యోజనములకు పైన గురు గ్రహము గలదు. పూజనీయుడగు గురువు వక్రగతిలో లేనప్పుడు ఒక్కొక్క రాశిని ఒక్కొక్క సంవత్సరకాలములో అతిక్రమించును. గురువు వేదవేత్తల సముదాయమునకు తరచుగా అనుకూలముగా నుండే గ్రహము.

**తత ఉపరిష్టాద్యోజనలక్షద్వయాత్ప్రతీయమానశ్శనైశ్చర ఏకైక
స్మిన్ రాశౌ త్రింశాన్మాసాన్ విలంబమానస్సర్వానేవాను పర్యేతి
తావద్భిరనువత్సరైః ప్రాయేణ హి సర్వేషామశాంతికరః ॥ 16**

**తతః** - గురు గ్రహము కంటె, **యోజనలక్షద్వయాత్** - రెండు లక్షల యోజనముల కంటె, **ఉపరిష్టాత్** - పైన, **శనైశ్చరః** - శని, **ప్రతీయమానః** - కనబడువాడు, **ఏక-ఏకస్మిన్** - ఒక్కొక్క, **రాశౌ** - రాశియందు, **త్రింశాన్** - ముప్పది, **మాసాన్** - మాసములను, **విలంబమానః** - విలంబము చేయుచున్నవాడై, **సర్వాన్ ఏవ** - అన్ని రాశులను కూడ, **తావద్భిః** - అన్నే, **అనువత్సరైః** - సంవత్సరములచే, **అను పర్యేతి** - వెనుక పయనించును, **ప్రాయేణ హి** - తరచుగా, **సర్వేషామ్** - అందరికి, **అశాంతికరః** - అశాంతిని కలిగించువాడు.

గురుగ్రహమునకు రెండు లక్షల యోజనముల పైన శని కనబడును. శని మెల్లమెల్లగా పయనిస్తూ, ఒక్కో రాశిలో ముప్పై మాసములు

గడుపును. కావుననే, శనికి రాశులనన్నింటినీ దాటుటకు ముప్పై సంవత్సర ములు పట్టును. శని సాధారణముగా అందరికి అశాంతిని కలిగించును.

తత ఉత్తరస్మాదృషయ ఏకాదశలక్షయోజనాంతర ఉపల భ్యంతే య ఏవ లోకానాం శమనుభావయంతో భగవతో విష్ణో ర్యత్పరమం పదం ప్రదక్షిణం ప్రక్రమంతి ॥ 17

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే జ్యోతిశ్చక్రే
గ్రహగతివర్ణనం నామ ద్వావింశోఽధ్యాయః ॥

తతః - శనికంటె, ఉత్తరస్మాత్ - పైన (ఉత్తరదిక్కుగా), ఏకాదశల క్షయోజన-అంతరే - పదకొండు లక్షల యోజనముల దూరమునందు, ఋషయః - సప్తర్షులు, ఉపలభ్యంతే - కానవచ్చెదరు, యే - ఎవరైతే, లోకానామ్ - ప్రాణులకు, శం ఏవ - సుఖమును మాత్రమే, అనుభావ యంతః - కోరువారై, భగవతః విష్ణోః - విష్ణు భగవానునియొక్క, యత్ - ఏ, పరమం పదమ్ - సర్వోత్కృష్టమగు ధామము గలదో దానిని, ప్రదక్షి ణమ్ - ప్రదక్షిణముగా, ప్రక్రమంతి - పరిక్రమమును చేయుచుందురు.

శనికి పదకొండు లక్షల యోజనముల పైన ఉత్తరమునందు సప్త ర్షులు కానవచ్చెదరు. వారు ప్రాణుల సుఖమును మాత్రమే కోరుతూ, విష్ణు భగవానుని పరమపదమగు ధ్రువమండలమును ప్రదక్షిణము చేయుదురు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో
జ్యోతిశ్చక్రమును, గ్రహముల గతిని వర్ణించే ఇరువది
రెండవ అధ్యాయము ముగిసినది (22).

*****

# అథ త్రయోవింశోऽధ్యాయః

## జ్యోతిశ్చక్రము - శిశుమార వర్ణనము

శ్రీశుక ఉవాచ ।
అథ తస్మాత్పరతస్త్రయోదశలక్షయోజనాంతరతో యత్తద్విష్ణోః పరమం పదమభివదంతి తత్ర హ మహాభాగవతో ధ్రువ ఔత్తానపాదిరగ్నినేంద్రేణ ప్రజాపతినా కశ్యపేన ధర్మేణ చ సమకాలయుగ్భి స్సబహుమానం దక్షిణతః క్రియమాణ ఇదానీమపి కల్పజీవినామా జీవ్య ఉపాస్తే తస్యేహానుభావ ఉపవర్ణితః ।। 1

అథ - తరువాత, తస్మాత్ - సప్తర్షిమండలముకంటె, పరతః - పైన, త్రయోదశలక్షయోజన-అంతరతః - పదమూడు లక్షల యోజనముల దూరము తరువాత, యత్ - ఏ, విష్ణోః - విష్ణువుయొక్క, పరమమ్ - సర్వోత్కృష్టమమగు, పదమ్ - ధామము గలదో, తత్ - దానిని, అభివదంతి - వర్ణించుచున్నారు, తత్ర హ - అక్కడనైతే, మహాభాగవతః - గొప్ప భగవద్భక్తుడు, ఔత్తానపాదిః - ఉత్తానపాదుని పుత్రుడు అగు, ధ్రువః - ధ్రువుడు, సమకాలయుగ్భిః - ఒకే కాలమునందు కలిసియుండే, అగ్నినా - అగ్నిచే, ఇంద్రేణ - ఇంద్రునిచే, ప్రజాపతినా - కశ్యప ప్రజాపతిచే, ధర్మేణ చ - ధర్మునిచే కూడ, సబహుమానమ్ - సాదరముగా, దక్షిణతః - కుడివైపు ఉండునట్లుగా, క్రియమాణః - చేయబడుచున్నవాడై, ఇదానీం అపి - ఇప్పుడు కూడ, కల్పజీవినామ్ - కల్పాంతము వరకు జీవించియుండేవారికి, ఆజీవ్యః - ఆశ్రయుడై, ఉపాస్తే - ఉన్నాడు, ఇహ - ఈ లోకములో, తస్య - ఆ ధ్రువుని, అనుభావః - ప్రభావము, ఉపవర్ణితః - వర్ణించబడినది.

శ్రీశుకమహర్షి ఇట్లు పలికెను --- సప్తర్షిమండలమునకు పదమూడు లక్షల యోజనముల పైన ధ్రువమండలము గలదు. అది విష్ణువు యొక్క సర్వోత్కృష్టమైన ధామమని మహాత్ములు చెప్పుచున్నారు. అచట ఉత్తానపాదుని పుత్రుడు, గొప్ప భగవద్భక్తుడు అగు ధ్రువుడు ఉండును. అగ్ని, ఇంద్రుడు, కశ్యప ప్రజాపతి మరియు ధర్ముడు నక్షత్రరూపులై ఏకకాలములో ఆ మండలమును సాదరముగా ప్రదక్షిణము చేయుచుందురు. కల్పాంతము వరకు నిలిచి ఉండే జీవులకు ధ్రువుడే ఆశ్రయము. ఈ లోకములో ఆ ధ్రువుని ప్రభావమును నేనిదివరలో వర్ణించియుంటిని.

స హి సర్వేషాం జ్యోతిర్గణానాం గ్రహనక్షత్రాదీనామనిమేషే
ణావ్యక్తరంహసా భగవతా కాలేన భ్రామ్యమాణానాం స్థాణురి
వావష్టంభ ఈశ్వరేణ విహితశ్శశ్వదవభాసతే ॥ 2

సః హి - ఆ ధ్రువుడు, అనిమేషేణ - రెప్పపాటు లేనట్టియు, అవ్యక్తరంహసా - ఇంద్రియగోచరము కాని వేగము కలిగినట్టియు, భగవతా - భగవత్స్వరూపమైన, కాలేన - కాలముచే, భ్రామ్యమాణానామ్ - త్రిప్పబడుచున్న, సర్వేషామ్ - అన్ని, గ్రహనక్షత్ర-ఆదీనామ్ - గ్రహములు నక్షత్రములు మొదలుగా గల, జ్యోతిర్గణానామ్ - కాంతిమండలముల సమూహములకు, ఈశ్వరేణ - ఈశ్వరునిచే, విహితః - నిర్మించబడిన, స్థాణుః ఇవ - ఆధారస్తంభము వలె, అవష్టంభః - ఆశ్రయమై, శశ్వత్ - సర్వకాలములలో, అవభాసతే - ప్రకాశించుచున్నాడు.

రెప్పపాటు నెరుగని ఈ కాలము భగవానుని శక్తి. దాని వేగము ఇంద్రియగోచరము కాదు. అట్టి కాలము గ్రహములు, నక్షత్రములు మొదలగు కాంతిమండలముల సమూహములనన్నింటినీ గిర గిర త్రిప్పుచున్నది. అట్లు తిరుగుచున్న మండలములకు ఈశ్వరుడు ధ్రువలోకమును ఆధారస్తంభమువంటి ఊతముగా నిర్మించినాడు. ఆ లోకము అన్ని కాలములలో ప్రకాశించుచుండును.

యథా మేఢీస్తంభ ఆక్రమణపశవస్సంయోజితాస్త్రిభిస్త్రిభిస్స
వనైర్యథాస్థానం మండలాని చరంత్యేవం భగణా గ్రహాదయ

**ఏతస్మిన్నంతర్బహిర్యోగేన కాలచక్ర ఆయోజితా ధ్రువమేవా వలంబ్య వాయునోదీర్యమాణా ఆకల్పాంతం పరిచంక్రమంతి నభసి యథా మేఘాశ్శ్యేనాదయో వాయువశాః కర్మసార థయః పరివర్తంతే ఏవం జ్యోతిర్గణాః ప్రకృతిపురుషసంయోగా నుగృహీతాః కర్మనిర్మితగతయో భువి న పతంతి ॥ 3**

యథా - ఏ విధముగానైతే, మేఢీస్తంభే - గుంజయందు, త్రిభిః త్రిభిః - మూడు మూడు, సవనైః - దూర విభాగములచే, సంయోజితాః - కట్టివేయబడిన, ఆక్రమణపశవః - ధాన్యము నూర్చే ఎద్దులు, యథాస్థా నమ్ - తమ తమ స్థానములను అతిక్రమించకుండగా, మండలాని - మండలములను, చరంతి - సంచరించునో, ఏవమ్ - ఇదే విధముగా, భగణాః - నక్షత్ర గణములు, గ్రహ-ఆదయః - గ్రహములు మొదలగునవి, ఏతస్మిన్ - ఈ, కాలచక్రే - కాలచక్రమునందు, అంతః-బహిః-యోగేన - పైన క్రింద అనే స్థానముల విభాగముచే, త్రిభిః త్రిభిః - మూడు మూడు, సవనైః - కాలవిభాగములచే, ఆయోజితాః - సమకూర్చబడినవై, ధ్రువం ఏవ - ధ్రువమండలమునే, అవలంబ్య - ఊతముగా గైకొని, వాయునా - వాయువుచే, ఉదీర్యమాణాః - ప్రేరితములగుచున్నవై, నభసి - ఆకాశము నందు, వాయువశాః - వాయువునకు వశమైయున్న, మేఘాః - మేఘము లు, శ్యేన-ఆదయః యథా - గ్రద్దలు మొదలగునవి వలె, కర్మసారథయః - కర్మయే సారథిగా గలవిరైు, ఆకల్ప-అంతమ్ - కల్పము అంతమగు వర కు, పరిచంక్రమంతి - చుట్టూ తిరుగుచున్నవి, ఏవమ్ - ఈ విధముగా, ప్రకృతిపురుషసంయోగ-అనుగృహీతాః - ప్రకృతి పురుషుల సంయోగము వలన ఆయా రూపములను పొందియున్న, జ్యోతిర్గణాః - నక్షత్రగణము లు, కర్మనిర్మితగతయః - కర్మలచే నిర్మాణము చేయబడిన గమనములు గలవిరైు, భువి - భూమిపై, న పతంతి - పడుట లేదు.

**కృషీవలుడు ధాన్యమును నూర్చుటకై కళ్లము మధ్యలో గుంజను పాతి, దానికి పశువులను కట్టును. వాటిలో కొన్నింటిని పొడవైన త్రాళ్లతో, కొన్నింటిని పొట్టి త్రాళ్లతో, మరి కొన్నింటిని మధ్యమ పరిమాణము గల త్రాళ్లతో కట్టుట వలన, అవి గుంజకు చాల దూరములో, చాల దగ్గరగా**

మరియు మధ్యమదూరములో ఉంటూ, గుంజ చుట్టూ తమ తమ స్థానము లలో మాత్రమే తిరుగుచుండును. అదే విధముగా, కాలచక్రమునందు నక్షత్రముల గణములు మరియు గ్రహములు మొదలైనవి క్రింద మరియు పైన అనే విధముగా స్థానభేదముచే, మరియు ఉత్తరాయణ-దక్షిణాయన-విషువత్తులనే కాలభేదముచే ఈశ్వరునిచే స్థాపించబడి యున్నవి. వాయువుచే ప్రేరితములై ఆ గ్రహాదులు ధ్రువమండలమునే ఆధారముగా చేసుకొని, ఆకాశములో వాయువుచే ప్రేరితములైన మేఘములు మరియు తమ ప్రయత్నమే ముందుకు నడుపగా తిరుగాడే గ్రద్దలు మొదలగు పక్షులు వలె, కల్పము అంతమయ్యే వరకు పరిభ్రమించుచుండును. ఈ నక్షత్రగణములన్నియు ప్రకృతిపురుషుల సంయోగముచేతనే నిర్మాణమైనవి. వాటి గమనమును పూర్వకర్మలే నిర్ధారించినవి. అవి అట్లు తిరుగుచుండుట చేతనే భూమిపై పడిపోకుండా ఉన్నవి.

కేచనైతజ్జ్యోతిరనీకం శిశుమారసంస్థానేన భగవతో వాసుదే
వస్య యోగధారణాయామనువర్ణయంతి ॥ 4

కేచన - కొందరు, ఏతత్- ఈ, జ్యోతిః-అనీకమ్ - నక్షత్రమండలమును, భగవతః వాసుదేవస్య - వాసుదేవ భగవానునియొక్క, యోగధారణాయామ్ - యోగమాయయొక్క ఆశ్రయమునందు, శిశుమారసంస్థానేన - నీటి కోతి రూపముగా, అనువర్ణయంతి - వర్ణించుచున్నారు.

ఈ నక్షత్రమండలము వాసుదేవ భగవానునియొక్క త్రిగుణాత్మిక యగు మాయాశక్తిచే నీటి కోతి రూపములో నిలబెట్టబడి యున్నదని కొందరు వర్ణించుచున్నారు.

**యస్య పుచ్ఛాగ్రేऽవాక్శిరసః కుండలీభూతదేహస్య ధ్రువ ఉపకల్పితస్తస్య లాంగూలే ప్రజాపతిరగ్నిశ్చంద్రో ధర్మ ఇతి పుచ్ఛమూలే ధాతా విధాతా చ కట్యాం సప్తర్షయః । తస్య దక్షిణావర్తకుండలీభూతశరీరస్య యాన్యుదగయనాని దక్షిణపార్శ్వే తు నక్షత్రాణ్యుపకల్పయంతి దక్షిణాయనాని తు సవ్యే । యథా శిశుమారస్య కుండలాభోగసన్నివేశస్య పార్శ్వయోరు**

భయోరప్యవయవాస్సమసంఖ్యా భవంతి । పృష్ఠే త్వజవీథీ ఆకాశగంగా చోదరతః ।। 5

అవాక్-శిరసః - క్రిందవైపు తల కలిగినట్టియు, కుండలీభూతదేహస్య - వలయముగా చేయబడిన దేహము గల, యస్య - ఏ నీటి కోతి యొక్క, పుచ్ఛ-అగ్రే - తోక చివర, ధ్రువః - ధ్రువమండలము, ఉపకల్పితః - రచించబడి యున్నదో, తస్య - దాని, లాంగూలే - తోకయందు, ప్రజాపతిః - కశ్యప ప్రజాపతి, అగ్నిః - అగ్ని, ఇంద్రః - ఇంద్రుడు, ధర్మః - ధర్ముడు, ఇతి - అనేవి, పుచ్ఛమూలే - తోక మొదట, ధాతా - ధాత, విధాతా చ - విధాత కూడ, కట్యామ్ - నడుమునందు, సప్త-ఋషయః - సప్తర్షులు, దక్షిణ-ఆవర్తకుండలీభూతశరీరస్య - కుడివైపు తిరిగి వలయాకారముగానున్న శరీరము గల, తస్య - ఆ నీటి కోతియొక్క, దక్షిణపార్శ్వే తు - కుడి ప్రక్కయందైతే, యాని - ఏ, ఉదగయనాని - ఉత్తరాయణమునకు చెందిన, నక్షత్రాణి - నక్షత్రములు గలవో వాటిని, ఉపకల్పయంతి - భావన చేయుచున్నారు, దక్షిణ-అయనాని తు - దక్షిణాయనమునకు చెందిన నక్షత్రములైతే, సవ్యే - ఎడమ ప్రక్క, యథా - ఏ విధముగానైతే, కుండల-ఆభోగసన్నివేశస్య - వలయముల రూపముగా అమరియున్న, శిశుమారస్య - నీటి కోతికి, ఉభయోః - రెండు, పార్శ్వయోః అపి - ప్రక్కలయందు కూడ, సమసంఖ్యాః - సమానమగు సంఖ్య గల, అవయవాః - అవయవములు, భవంతి - ఉండునో, పృష్ఠే తు - వీపునందైతే, అజవీథీ చ - అజవీథి, ఉదరతః - పొట్టయందు, ఆకాశగంగా - ఆకాశగంగ.

ఈ నక్షత్రమండలము, తలను క్రిందకు పెట్టి వలయాకారపు దేహము గల శిశుమారము (నీటి కోతి) ను పోలియుండును. దాని తోక చివర ధ్రువమండలము, తోక మధ్యలో కశ్యప ప్రజాపతి, ఇంద్రుడు, అగ్ని, ధర్ముడు అనే నక్షత్రములు, తోక మొదట్లో ధాత, విధాత అనే నక్షత్రములు ఉండును. ఆ రచన కుడివైపు వలయముగా చేయబడిన శరీరము గల శిశుమారమును పోలియుండును. ఒక వలయము లోపల మరియొక వలయముగా చుట్టుకొనియున్న శిశుమారమునకు రెండు వైపులా అవయవములు సమసంఖ్యలో నుండును. ఈ నక్షత్రమండలముయొక్క రచన కూడ అటు

లనే యుండును. ఉత్తరాయణ నక్షత్రములను (అభిజిత్ నుండి పునర్వసు వరకు పదునాలుగు) దానికి కుడివైపున, దక్షిణాయన నక్షత్రములను (పుష్యమునుండి ఉత్తరాషాఢ వరకు పదునాలుగు) దానికి ఎడమ వైపున సరిసమానముగా ఉన్న శిశుమారముగా మనము నక్షత్రముల అమరికను భావన చేయవచ్చును. దాని వీపుపై అజవీథి (మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢల గుంపు), పొట్టయందు ఆకాశగంగ (పొడవాటి నక్షత్రసమూహము) గలవు.

పునర్వసుపుష్యౌ దక్షిణవామయోశ్శ్రోణ్యోరార్ద్రాఽఽశ్లేషే చ దక్షిణవామయోః పశ్చిమయోః పాదయోరభిజిదుత్తరాషాఢే దక్షిణవామయోర్నాసికయోర్యథాసంఖ్యం శ్రవణపూర్వాషాఢే దక్షిణవామయోర్లోచనయోర్ధనిష్ఠామూలం చ దక్షిణవామయోః కర్ణయోర్మఘాదీన్యష్ట నక్షత్రాణి దక్షిణాయనాని వామపార్శ్వవంక్రిషు యుంజీత తథైవ మృగశీర్షాదీన్యుదగయనాని దక్షిణపార్శ్వవంక్రిషు ప్రాతిలోమ్యేన ప్రయుంజీత శతభిషాజ్యేష్ఠే స్కంధయోర్దక్షిణవామయోర్న్యసేత్ ॥ 6

దక్షిణవామయోః - కుడి ఎడమ, శ్రోణ్యోః - నడుము భాగములయందు, పునర్వసుపుష్యౌ - పునర్వసు పుష్యమి నక్షత్రములను, పశ్చిమయోః - వెనుకనున్న, దక్షిణవామయోః - కుడి ఎడమ, పాదయోః - పాదములయందు, ఆర్ద్రా-ఆశ్లేషే చ - ఆర్ద్ర ఆశ్రేషలను, దక్షిణవామయోః - కుడి ఎడమ, నాసికయోః - ముక్కు పుటములయందు, అభిజిత్-ఉత్తరాషాఢే - అభిజిత్ ఉత్తరాషాఢలను, యథాసంఖ్యమ్ - క్రమముగా, దక్షిణవామయోః - కుడి ఎడమ, లోచనయోః - కన్నులయందు, శ్రవణపూర్వాషాఢే - శ్రవణము పూర్వాషాఢలను, దక్షిణవామయోః - కుడి ఎడమ, కర్ణయోః - చెవులయందు, ధనిష్ఠామూలం చ - ధనిష్ఠ మూలలను, మఘాదీని - మఘతో మొదలిడిన, అష్ట - ఎనిమిది, దక్షిణాయనాని - దక్షిణాయనమునకు చెందిన, నక్షత్రాణి - నక్షత్రములను, వామపార్శ్వవంక్రిషు - ఎడమ ప్రక్కటెముకలయందు, యుంజీత - భావన చేయవలెను, తథా ఏవ - అదే విధముగా, మృగశీర్షాదీని - మృగశీర్షతో మొదలిడి, ఉదగయనాని -

ఉత్తరాయణమునకు చెందిన నక్షత్రములను, ప్రాతిలోమ్యేన - తల్లక్రిం దులు క్రమముగా, దక్షిణపార్శ్వవంక్రిషు - కుడి ప్రక్కటెముకలయందు, ప్రయుంజీత - భావన చేయవలెను, దక్షిణవామయోః - కుడి ఎడమ, స్కంధయోః - భుజములయందు, శతభిషాజ్యేష్ఠే - శతభిష జ్యేష్ఠలను, న్యసేత్ - ఉంచవలెను.

ఆ శిశుమారమునకు కుడి ఎడమ నడుము భాగములయందు క్రమముగా పునర్వసు పుష్యమి నక్షత్రములను, వెనుకనుండే కుడి ఎడమ పాదములయందు ఆర్ద్ర ఆశ్రేషలను, కుడి ఎడమ ముక్కు పుటముల యందు అభిజిత్ ఉత్తరాషాఢలను, కుడి ఎడమ కన్నులయందు శ్రవణము పూర్వాషాఢలను, కుడి ఎడమ చెవులయందు ధనిష్ఠ మూలలను, ఎడమ ప్రక్కటెముకలయందు మఘతో మొదలిడి ఎనిమిది దక్షిణాయన నక్షత్రము లను, అదే విధముగా కుడి ప్రక్కటెముకలయందు మృగశీర్షతో మొదలిడి తల్లక్రిందులుగా ఎనిమిది ఉత్తరాయణ నక్షత్రములను, కుడి ఎడమ భుజ ములయందు శతభిష జ్యేష్ఠలను భావన చేయవలెను.

> ఉత్తరాహనావగస్తిరధరాహనౌ యమో ముఖేషు చాంగారకశ్శ
> నైశ్చర ఉపస్థే బృహస్పతిః కకుది వక్షస్యాదిత్యో హృదయే
> నారాయణో మనసి చంద్రో నాభ్యాముశనా స్తనయోరశ్వినౌ
> బుధః ప్రాణాపానయో రాహుర్గలే కేతవస్సర్వాంగేషు రోమసు
> సర్వే తారాగణాః ॥ 7

ఉత్తరాహనౌ - పై దవడయందు, అగస్తిః - అగస్తి నక్షత్రము, అధ రాహనౌ - క్రింది దవడయందు, యమః - యమ నక్షత్రము, ముఖేషు చ - నోళ్లయందు, అంగారకః - అంగారకుడు, ఉపస్థే - గుహ్యమునందు, శనైశ్చరః - శని, కకుది - మూపురమునందు, బృహస్పతిః - బృహస్పతి, వక్షసి - వక్షఃస్థలమునందు, ఆదిత్యః - సూర్యుడు, హృదయే - హృదయ మునందు, నారాయణః - నారాయణ నక్షత్రము, మనసి - మనస్సునందు, చంద్రః - చంద్రుడు, నాభ్యామ్ - నాభియందు, ఉశనా - శుక్రుడు, స్తనయోః - స్తనములయందు, అశ్వినౌ - అశ్వినీ నక్షత్రములు, ప్రాణ-అ

పానయోః - గాలిని విడుచుట పీల్చుటలయందు, బుధః - బుధుడు, గలే - కంఠమునందు, రాహుః - రాహువు, సర్వ-అంగేషు - అన్ని అవయవ ములయందు, కేతవః - కేతువు (ధ్వజము) ఆకారములోనుండే నక్షత్రము లు, రోమసు - రోమములయందు, సర్వే - అన్ని, తారాగణాః - నక్షత్ర ముల గుంపులు.

శిశుమారరూపములో కనబడే నక్షత్రమండలములో అగస్త్యుని పై దవడగను, యముని క్రింది దవడగను, అంగారకుని నోరుగను, శనిని గుహ్యస్థానముగను, బృహస్పతిని మూపురముగను, సూర్యుని వక్షఃస్థల ముగను, నారాయణుని హృదయముగను, చంద్రుని మనస్సుగను, శుక్రుని నాభిగను, అశ్వినీ నక్షత్రములను స్తనములుగను, బుధుని ప్రాణాపానము లుగను, రాహువును కంఠముగను, ధ్వజాకారములోనుండే నక్షత్రములను వివిధములైన అవయవములుగను దర్శిస్తూ, సకల నక్షత్ర గణములను ఆ రూపముయొక్క రోమకూపములుగా ఊహించవచ్చును.

ఏతదు హైవ భగవతో విష్ణోస్సర్వదేవతామయం రూపమహర
హస్సంధ్యాయాం ప్రయతో వాగ్యతో నిరీక్షమాణ ఉపతిష్ఠేత
నమో జ్యోతిర్లోకాయ కాలాయనాయానిమిషాం పతయే మహా
పురుషాయాభిధీమహీతి ॥ 8

భగవతః విష్ణోః - విష్ణు భగవానుని, సర్వదేవతామయమ్ - సకల దేవతలతో నిండిన, రూపమ్ - రూపము, ఏతద్ ఉ హ ఏవ - నిశ్చయ ముగా నిదియే, అహః అహః - ప్రతి రోజు, సంధ్యాయామ్ - సంధ్యాకాల మునందు, ప్రయతః - పవిత్రుడై, వాగ్యతః - మౌనముగా నున్నవాడై, నిరీ క్షమాణః - చూచుచున్నవాడై, ఉపతిష్ఠేత - నిలబడి ప్రార్థించవలెను, జ్యోతిర్లోకాయ - నక్షత్రములకు ఆశ్రయమైనట్టియు, కాలాయనాయ - కాలచక్రరూపుడైనట్టియు, అనిమిషామ్ - రెప్పపాటు లేని దేవతలకు, పతయే - ప్రభుడైన, మహాపురుషాయ - పురుషోత్తముని కొరకు, అభిధీ మహి - నమస్కరిస్తూ ధ్యానించుచున్నాము, ఇతి - అని.

విష్ణు భగవానుని సర్వదేవతామయమగు రూపము నిశ్చయముగా నిదియే. సాధకుడు సంధ్యాకాలమునందు పవిత్రుడై మౌనముగానుంటూ నక్షత్రమండలమును చూస్తూ, నిలబడి ఇట్లు ప్రార్థించవలెను --- నక్షత్రములకు ఆశ్రయమైనవాడు, కాలచక్రరూపుడు, దేవతలకు ప్రభువు అగు పురుషోత్తముని నమస్కరించి ధ్యానించుచున్నాము.

గ్రహర్క్షతారామయమాధిదైవికం
పాపాపహం మంత్రకృతాం త్రికాలమ్ ।
నమస్యతస్స్మరతో వా త్రికాలం
నశ్యేత తత్కాలజమాశు పాపమ్ ।। 9

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే జ్యోతిశ్చక్రే శిశుమారవర్ణనం నామ త్రయోవింశోఽధ్యాయః ।।

గ్రహ-ఋక్షతారామయమ్ - గ్రహములు నక్షత్రములు తారామండలములతో నిండియున్నట్టియు, త్రికాలమ్ - మూడు పూటలా, మంత్రకృతామ్ - మంత్రమును జపించువారలకు, పాప-అపహమ్ - పాపములను పోగొట్టే, ఆధిదైవికమ్ - దేవుని రూపమును, త్రికాలమ్ - మూడు పూటలా, నమస్యతః - నమస్కరించువానికి, స్మరతః వా - స్మరించువానికి గాని, తత్-కాలజమ్ - ఆ కాలమునందు పుట్టిన, పాపమ్ - పాపము, ఆశు - వెంటనే, నశ్యేత - నశించును.

గ్రహములు నక్షత్రములు తారామండలములతో కూడియున్న ఈ శిశుమారము దేవుని రూపమే. దీనికి సంబంధించి పైన చెప్పిన మంత్రమును మూడు పూటలా జపించువారలకు పాపములు పోవును. ఈ రూపమునకు మూడు పూటలా నమస్కరించినా, లేక ఈ రూపమును స్మరించినా, మానవులకు ఆ కాలమునందు చేసిన పాపము వెంటనే తొలగిపోవును.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో జ్యోతిశ్చక్రము - శిశుమారము అనే ఇరవై మూడవ అధ్యాయము ముగిసినది (23).

*****

# అథ చతుర్వింశోऽధ్యాయః

## రసాతలము మొదలగు లోకముల వర్ణనము

శ్రీశుక ఉవాచ ।
అధస్తాత్సవితుర్యోజనాయుతే స్వర్భానుర్నక్షత్రవచ్చరతీత్యేకే
యోऽసావమరత్వం గ్రహత్వం చాలభత భగవదనుకంపయా
స్వయమసురాపసదస్సైంహికేయో హ్యతదర్హస్తస్య తాత
జన్మ కర్మాణి చోపరిష్టాద్వక్ష్యామః ।। 1

సవితుః - సూర్యునకు, అధస్తాత్ - క్రింద, యోజన-అయుతే - పదివేల యోజనముల వద్ద, స్వర్భానుః - రాహువు, నక్షత్రవత్ - నక్షత్రము వలె, చరతి హ - తిరుగుచున్నాడు, ఇతి - అని, ఏకే - కొందరు, యః - ఏ, అసౌ - ఈ, స్వయమ్ - తాను, అసుర-అపసదః - అసురులలో అధముడైనవాడు, అతద్-అర్హః - దేవత్వమునకు తగనివాడు అగు, సైంహికేయః - సింహిక పుత్రుడగు రాహువు, భగవద్-అనుకంపయా - భగవానుని దయచే, అమరత్వమ్ - దేవత్వమును, గ్రహత్వం చ - గ్రహమై యుండుటను కూడ, అలభత - పొందెనో, తాత - వత్సా!, తస్య - వాని, జన్మ - పుట్టుకను, కర్మాణి చ - చేష్టలను కూడ, ఉపరిష్టాత్ - తరువాత, వక్ష్యామః - చెప్పగలము.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- వత్సా! సూర్యునకు పదివేల యోజనముల క్రింద రాహువు నక్షత్రము వలె తిరుగుచుండునని కొందరు చెప్పుచున్నారు. సింహిక పుత్రుడగు ఈ రాహువు తాను అసురులలో అధముడు. ఈతడు దేవత అగుటకు తగడు. అయిననూ, భగవానుని అనుగ్రహముచే ఈతడు దేవత అయినాడు. వాని జన్మను, చేష్టలను కూడ తరువాత వర్ణించెదను.

యదదస్తరణేర్మండలం ప్రతపతస్తద్విస్తరతో యోజనాయుత మాచక్షతే ద్వాదశసహస్రం సోమస్య త్రయోదశసహస్రం రాహోర్యః పర్వణి తద్వ్యవధానకృద్వైరానుబంధస్సూర్యాచం ద్రమసావభిధావతి ॥ 2

ప్రతపతః - గట్టిగా తపించుచున్న, తరణేః - సూర్యునియొక్క, యత్ - ఏ, అదః - ఈ, మండలమ్ - మండలము గలదో, తత్ - అది, విస్తరతః - వైశాల్యమును బట్టి, యోజన-అయుతమ్ - పదివేల యోజనములుగా, సోమస్య - చంద్రునకు, ద్వాదశసహస్రమ్ - పన్నెండు వేల యోజనములు గల మండలమును, రాహోః - రాహువునకు, త్రయోదశసహస్రమ్ - పదమూడు వేల యోజనములు గల మండలమును, ఆచక్షతే - చెప్పుచున్నారు, యః - ఏ రాహువు, పర్వణి - అమావాస్యనాడు పూర్ణిమనాడు, తద్-వ్యవధానకృత్ - వారికి అడ్డమును కలిగించువాడై, వైర-అనుబంధః - వైరమును స్మరించువాడై, సూర్యాచంద్రమసౌ - సూర్యుని చంద్రుని, అభిధావతి - అభిముఖముగా వేగముగా వెళ్ళుచున్నాడు.

గట్టిగా తపించే సూర్యుని ఈ మండలముయొక్క వైశాల్యము పది వేల యోజనములు. చంద్రమండలము పన్నెండు వేలు, రాహుమండలము పదమూడు వేలు యోజనముల వైశాల్యమును కలిగియున్నవి. రాహువు అమావాస్యనాడు పూర్ణిమ నాడు సూర్యునకు, చంద్రునకు మధ్యలో అడ్డు తగులుచుండును. తనకు వారితో గల వైరమును స్మరించి, ఈతడు ఆ రోజులలో వారివైపు పయనించి, అడ్డు తగులును (గ్రహణము).

తన్నిశమ్యోభయత్రాపి భగవతా రక్షణాయ ప్రయుక్తం సుదర్శనం నామ భాగవతం దయితమస్త్రం తత్తేజసా దుర్విషహం ముహుః పరివర్తమానమభ్యవస్థితో ముహూర్తముద్విజమానశ్చకితహృదయ ఆరాదేవ నివర్తతే తదుపరాగమితి వదంతి లోకాః ॥ 3

తత్ - దానిని, నిశమ్య - తెలుసుకొని, భగవతా - శ్రీహరిచే, ఉభయత్ర అపి - సూర్యచంద్రులిద్దరివద్ద, రక్షణాయ - రక్షణ కొరకై, ప్రయు

క్తమ్ - నియోగించబడినట్టియు, సుదర్శనం నామ - సుదర్శనమని ప్రసిద్ధి గాంచినట్టియు, భాగవతమ్ - భగవానునకు చెందినట్టియు, దయితమ్ - ప్రియమైనట్టియు, తత్-తేజసా - ఆ భగవానుని తేజస్సుచే, దుర్విషహమ్ - సహించ శక్యము కానట్టియు, ముహుః - నిరంతరముగా, పరివర్తమానమ్ - తిరుగుచున్న, అస్త్రమ్ - ఆయుధమును, అభి - అభిముఖముగా, ముహూర్తమ్ - ముహూర్తకాలము, అవస్థితః - నిలచినవాడై, ఉద్విజమానః - కలవరపాటు చెందుచున్నవాడై, చకితహృదయః - వణికిపోయే హృదయము గలవాడై, ఆరాత్ ఏవ - దూరమునుండియే, నివర్తతే - వెనుకకు మరలును, తత్ - దానిని, లోకాః - జనులు, ఉపరాగమ్ - గ్రహణము, ఇతి - అని, వదంతి - చెప్పుచున్నారు.

ఆ విషయమును తెలుసుకున్న శ్రీహరి భగవానుడు సూర్యచంద్రుల రక్షణ కొరకై వారిద్దరి వద్ద తనకు ప్రియమగు ఆయుధమైన చక్రమును నియోగించెను. సుదర్శనమని ప్రసిద్ధి గాంచిన భగవానుని ఆ చక్రము ఆ భగవానుని తేజస్సు గలదగుటచే, దానిని సహించుట శక్యము కాదు. నిరంతరముగా తిరుగుచున్న ఆ చక్రమునకెదురుగా రాహువు సుమారు గంట సేపు నిలిచి, కలవరపడి, వణికిపోయే హృదయముతో దూరమునుండియే వెనుకకు మరలును. దీనికే గ్రహణము అని లోకములో ప్రసిద్ధి.

తతోఽధస్తాత్సిద్ధచారణవిద్యాధరాణాం సదనాని తావన్మాత్ర ఏవ ।।4

తతః - ఆ రాహువుకంటె, అధస్తాత్ - క్రింద, తావత్-మాత్రే ఏవ - పదివేల యోజనములయందు మాత్రమే, సిద్ధచారణవిద్యాధరాణామ్ - సిద్ధులు చారణులు విద్యాధరుల, సదనాని - స్థానములు.

ఆ రాహువుకంటె అంతే (పదివేల యోజనముల) క్రింద సిద్ధులు, చారణులు, విద్యాధరుల స్థానములు గలవు.

తతోఽధస్తాద్యక్షరక్షఃపిశాచప్రేతభూతగణానాం విహారాజిరమంతరిక్షం యావద్వాయుః ప్రవాతి యావన్మేఘా ఉపలభ్యంతే ।। 5

తతః - వాటికంటె, అధస్తాత్ - క్రింద, యక్షరక్షఃపిశాచప్రేతభూతగ ణానామ్ - యక్షులు రాక్షసులు పిశాచములు ప్రేతములు భూతముల గణ ముల, విహార-అజిరమ్ - విహరించే స్థానమగు, అంతరిక్షమ్ - అంతరిక్ష ము, యావత్ - ఎంతవరకైతే, వాయుః - వాయువు, ప్రవాతి - వీచునో, యావత్ - ఎంతవరకైతే, మేఘాః - మేఘములు, ఉపలభ్యంతే - కానవ చ్చునో.

వాటి క్రింద వాయువు వీచేటంతవరకు, మేఘములు కనబడేటంత వరకు అంతరిక్షము. అది యక్షులు, రాక్షసులు, పిశాచములు, భూతము లు, ప్రేతముల గణములకు విహారస్థానము.

తతోఽధస్తాచ్ఛతయోజనాంతర ఇయం పృథివీ యావద్ధంసభా
సశ్యేనసుపర్ణాదయః పతత్త్రిప్రవరా ఉత్పతంతీతి ॥ 6

తతః - దానికంటె, అధస్తాత్ - క్రింద, శతయోజన-అంతరే - వంద యోజనముల దూరమునందు, ఇయమ్ - ఈ, పృథివీ - భూమి, యావత్ - ఎంతవరకైతే, హంసభాసశ్యేనసుపర్ణ-ఆదయః - హంసలు రాబందులు గ్రద్దలు గరుడపక్షులు మొదలగు, పతత్త్రిప్రవరాః - పక్షులలో ప్రముఖమైనవి, ఉత్పతంతి - ఎగురుచున్నవో, ఇతి - అని.

అంతరిక్షము క్రింద వందయోజనముల దూరమునందు ఈ భూమి గలదు. హంసలు, రాబందులు, గ్రద్దలు, గరుడపక్షులు మొదలగు ప్రముఖములైన పక్షులు ఎంతవరకు ఎగురునో, అంతవరకు పృథివియ నియే గ్రహించవలెను.

ఉపవర్ణితం భూమేర్యథా సంనివేశావస్థానమవనేరప్యధస్తాత్స
ప్త భూవివరా ఏకైకశో యోజనాయుతాంతరేణాయామవిస్తారే
ణోపక్లుప్తా అతలం వితలం సుతలం తలాతలం మహాతలం
రసాతలం పాతాలమితి ॥ 7

భూమేః - భూమికి, యథా - ఏ విధముగానైతే, సంనివేశ-అవస్థా నమ్ - సంరచనతో నిలిచియుండుట గలదో అది, ఉపవర్ణితమ్ - వర్ణించబ

డినది, అవనేః - భూమికి, అధస్తాత్ అపి - క్రింద కూడ, సప్త - ఏడు, భూవివరాః - భూమియందలి ఛిద్రములు, ఏక-ఏకశః - ఒక్కొక్కటిగా, యోజన-అయుత-అంతరేణ - పదివేల యోజనముల తేడాతో, ఆయామ విస్తారేణ - పొడవు వెడల్పుతో, ఉపక్లుప్తాః - రచించబడినవి, అతలమ్ - అతలము, వితలమ్ - వితలము, సుతలమ్ - సుతలము, తలాతలమ్ - తలాతలము, మహాతలమ్ - మహాతలము, రసాతలమ్ - రసాతలము, పాతాలమ్ - పాతాలము, ఇతి - అని.

భూమి ఎట్టి సంరచనతో నిలిచియున్నదో వర్ణించబడినది. ఈ భూమికి క్రింద కూడ ఒక్కొక్కటి పదివేల యోజనముల తేడాలో, అత లము వితలము సుతలము తలాతలము మహాతలము రసాతలము మరియు పాతాలము అనే ఏడు భూవివరములు (భూమి లోపలి లోక ములు) ఈశ్వరునిచే రచించబడి యున్నవి. వీటి పొడవు మరియు వెడల్పు కూడ పదివేల యోజనముల చొప్పున ఉండును.

ఏతేషు హి బిలస్వర్గేషు స్వర్గాదప్యధికకామభోగైశ్వర్యానంద
భూతివిభూతిభిస్సుసమృద్ధభవనోద్యానాక్రీడవిహారేషు దైత్య
దానవకాద్రవేయా నిత్యప్రముదితానురక్తకలత్రాపత్యబంధుసు
హృదనుచరా గృహపతయ ఈశ్వరాదప్యప్రతిహతకామా
మాయావినోదా నివసంతి ॥ 8

ఏతేషు - ఈ, బిలస్వర్గేషు - స్వర్గమువంటి బిలములయందు, స్వర్గాత్ అపి - స్వర్గము కంటె కూడ, అధికకామభోగ-ఐశ్వర్య-ఆనందభూ తివిభూతిభిః - అధికమైన అభీష్టపదార్థములు భోగములు ఐశ్వర్యము ఆనందము ప్రభావము సంపదలచే, సుసమృద్ధభవన-ఉద్యాన-ఆక్రీడవిహా రేషు - మిక్కిలి సమృద్ధములైన భవనములు ఉద్యానవనములు క్రీడాస్థాన ములు విహారస్థానములయందు, నిత్యప్రముదిత-అనురక్తకలత్ర-అపత్యబం ధుసుహృద్-అనుచరాః - అన్ని కాలములలో చాల ఆనందముగా మరియు అనురాగముగా నుండే భార్య సంతానము బంధువులు మిత్రులు అనుచ రులు గలిగినవారు, దైత్యదానవకాద్రవేయాః - దితి దను కద్రు వంశము

లకు చెందినవారు అగు, గృహపతయః - గృహయజమానులు, ఈశ్వరాత్ అపి - ఇంద్రాది లోకపాలకుల వలనైననూ, అప్రతిహతకామాః - ఆటంకము చేయబడని కామనలు గలవారై, మాయావినోదాః - మాయామయములగు వినోదములు గలవారై, నివసంతి హి - నివసించుచున్నారు.

స్వర్గమువంటి ఈ బిలములయందు స్వర్గముకంటె కూడ అధికమగు ఇంద్రియభోగములు, ఐశ్వర్యము, ఆనందము, ప్రభావము, సంపదలు గలవు. వీటితో మిక్కిలి సమృద్ధములైయుండే భవనములలో దితి-దను-కద్రు వంశములకు చెందిన రాక్షసులు నివసిస్తూ ఉద్యానవనములలో, క్రీడాస్థానములలో మరియు విహారస్థలములయందు విహరించుచుందురు. వారు అనురాగముతో కూడిన భార్యలతో పిల్లలతో బంధుమిత్రులతో మరియు అనుచరులతో గూడి, సర్వకాలములలో ఉల్లాసముగానుండే గృహస్థజీవనమును గడుపుచుందురు. మాయామయమగు క్రీడలతో వినోదించే వారి కామనలను లోకపాలకులు కూడ అడ్డుకొనలేరు.

యేషు మహారాజ మయేన మాయావినా వినిర్మితాః పురో నానామణిప్రవరప్రవేకవిరచితవిచిత్రభవనప్రాకారగోపురసభాచైత్యచత్వరాయతనాదిభిర్నాగాసురమిథునపారావతశుకసారికాకీర్ణకృత్రిమభూమిభిర్వివరేశ్వరగృహోత్తమైస్సమలంకృతాశ్చకాసతి ॥ 9

మహారాజ - ఓ పరీక్షిన్మహారాజా!, యేషు - ఏ లోకములయందైతే, మాయావినా - మాయావియగు, మయేన - మయునిచే, వినిర్మితాః - నిర్మించబడిన, పురః - నగరములు, నానామణిప్రవరప్రవేకవిరచితవిచిత్రభవనప్రాకారగోపురసభాచైత్యచత్వర-ఆయతన-ఆదిభిః - అనేకములైన శ్రేష్ఠమగు మణులలో ముఖ్యమైనవాటిచే పొదగబడిన రంగురంగుల భవనములు ప్రాకారములు గోపురములు సభామండపములు గుడులు కూడళ్లు విశ్రాంతిగృహములతో, నాగ-అసురమిథునపారావతశుకసారికా-ఆకీర్ణకృత్రిమభూమిభిః - నాగుల మరియు అసురుల జంటలు పావురములు చిలుకలు మైనాలతో ఎడము లేక నిండియున్న రాతికట్టడపు నేలలతో, వివర-ఈశ్వరగృహ-ఉత్తమైః - ఆ లోకముల ప్రభువుల గొప్ప గృహములతో, సమలంకృతాః - చక్కగా అలంకరించబడినవై, చకాసతి - ప్రకాశించును.

ఓ పరీక్షిన్మహారాజా! ఈ లోకములలో మాయావియగు మయుని చే నిర్మించబడిన నగరములలో రంగురంగుల భవనములు, ప్రాకారములు, గోపురములు, సభామండపములు, గుడులు, కూడళ్లు, విశ్రాంతిగృహములు మొదలగునవి, మరియు రాతికట్టడపు నేలలు, ఆ లోకముల ప్రభువుల గొప్ప గృహములు ప్రకాశించుచుండును. ఆ నగరములకు అలంకారములైన ఈ కట్టడములను మయుడు అనేకములైన శ్రేష్ఠములగు మణులలో ముఖ్యమగు వాటితో పొదిగి నిర్మించెను. ఆ రాతికట్టడపు నేలల యందు నాగుల మరియు అసురుల జంటలు, పావురములు, చిలుకలు, మైనాలు ఎడము లేకుండా వ్యాపించియుండును.

ఉద్యానాని చాతితరాం మనఇంద్రియానందిభిః కుసుమఫలస్త
బకసుభగకిసలయావనతరుచిరవిటపవిటపినాం లతాంగా
ऽऽలింగితానాం శ్రీభిస్సమిథునవివిధవిహంగమజలాశయానా
మమలజలపూర్ణానాం ఝషకులోల్లంఘనక్షుభితనీరనీరజకు
ముదకువలయకహ్లారనీలోత్పలలోహితశతపత్రాదివనేషు కృత
నికేతనానామేకవిహారాకులమధురవివిధస్వనాదిభిరిం
ద్రియోత్సవైరమరలోకశ్రియమతిశయితాని ॥ 10

ఉద్యానాని చ - ఉద్యానవనములు కూడ, అతితరామ్ - మిక్కిలి, మనః-ఇంద్రియ-ఆనందిభిః - మనస్సునకు ఇంద్రియములకు ఆహ్లాదమును కలిగించే, లత-అంగ-ఆలింగితానామ్ - లతల భాగములచే కౌగిలించుకొనబడిన, కుసుమఫలస్తబకసుభగకిసలయ-అవనతరుచిరవిటపవిటపినామ్ - పువ్వుల పళ్ల గుత్తులచే అందమైన చిగుళ్లచే వంగిన అందమైన కొమ్మలు గల చెట్లయొక్క, అమలజలపూర్ణానామ్ - స్వచ్ఛమగు జలములచే నిండియున్న, సమిథునవివిధవిహంగమజల-ఆశయానామ్ - జతకట్టియున్న అనేకవిధములైన పక్షులు గల సరస్సుల, శ్రీభిః - శోభలచే, ఝషకుల-ఉల్లంఘనక్షుభితనీరనీరజకుముదకువలయకహ్లారనీల-ఉత్పలలోహిత శతపత్ర-ఆదివనేషు - చేపల గుంపుల గెంతులచే కలిచివేయబడిన నీటిలోని వట్టివేరు నాచు కలువ సౌగంధికము నల్ల కలువ ఎఱ్రతామర మొదలగు నీటి మొక్కల గుంపులయందు, కృతనికేతనానామ్ - చేయబడిన

నివాసము గల పక్షుల, ఇంద్రియ-ఉత్సవైః - ఇంద్రియములకు ఉత్సవము లైన, ఏకవిహార-ఆకులమధురవివిధస్వన-ఆదిభిః - అడ్డు ఆపు లేని విహ రించుటచే గడబిడయైన తియ్యని పలురకముల కూతలు మొదలగువాటి చే, అమరలోకశ్రియమ్ - స్వర్గలోకముయొక్క శోభను, అతిశయితాని - అతిశయించి ఉన్నవి.

ఉద్యానవనములలో చెట్లు అందమైన చిగుళ్లతో, పువ్వుల పళ్ల గుత్తులతో వంగిన అందమైన కొమ్మలతో, తమను వాటేసుకొనియున్న లతాభాగములతో, మనస్సునకు ఇంద్రియములకు మిక్కిలి ఆహ్లాదమును కలిగించుచుండును. వాటిలో స్వచ్ఛమగు నీటితో నిండియున్న సరస్సు లలో పలురకముల పక్షుల జంటలు శోభిల్లుచుండును. ఆ సరస్సులలో వట్టి వేరు, నాచు, కలువ, సౌగంధికము, నల్ల కలువ, ఎర్ర తామర మొదలగు మొక్కలు గుంపులుగా పెరిగియుండును. చేపల గుంపులు పైకి ఎగు రుతూ నీటిని కల్లోలితము చేయుచుండగా, ఆ నీటి మొక్కల గుంపులలో నివాసమేర్పరచుకుని పక్షులు అడ్డు ఆపు లేకుండా విహరిస్తూ, పలువిధ ముల మధురమైన కూతలను కూయుచుండ, ఆ సంకులమగు ధ్వని చూప రుల ఇంద్రియములకు ఉత్సవమును చేయుచుండును. ఈ విధముగా ఆ ఉద్యానవనములు స్వర్గలోక శోభను తలదన్ని యుండును.

యత్ర హ వావ న భయమహోరాత్రాదిభిః కాలవిభాగైరుపల క్ష్యతే ॥ 11

యత్ర హి - ఎక్కడనైతే, అహః-రాత్ర-ఆదిభిః - పగలు రాత్రి మొదలగు, కాలవిభాగైః - కాలఖండములచే, భయమ్ - భయము, వావ - నిశ్చయముగా, న ఉపలక్ష్యతే - కానరాదో.

అక్కడ సూర్యచంద్రులు లేకుండుటచే, రాత్రింబగళ్లు మొదలైన కాలవిభాగము గాని, దాని వలన కలిగే తలనొప్పులు గాని ఉండవు.

యత్ర హి మహాహిప్రవరశిరోమణయస్సర్వం తమః ప్రబా ధంతే ॥ 12

యత్ర హి - ఎక్కడనైతే, మహా-అహిప్రవరశిరః-మణయః - పెద్ద గొప్ప నాగుల పడగలయందలి మణులు, తమః - చీకటిని, సర్వమ్ - అంతనూ, ప్రబాధంతే - దూరము చేయుచుండునో.

అక్కడి గొప్ప పెద్ద నాగుల పడగలయందలి మణులే చీకటినం తనూ పారద్రోలుచుండును.

న వా ఏతేషు వసతాం దివ్యౌషధిరసరసాయనాన్నపానస్నానా
దిభిరాధయో వ్యాధయో వలీపలితజరాదయశ్చ దేహవైవర్ణ్య
దౌర్గంధ్యస్వేదక్లమగ్లానిరితి వయోఽవస్థాశ్చ భవంతి ॥ 13

ఏతేషు - ఈ లోకములయందు, వసతామ్ - నివసించు వారలకు, దివ్య-ఓషధిరసరసాయన-అన్నపానస్నాన-ఆధిభిః - దివ్యమగు ఓషధులు రసములు రసాయనములు ఆహారము పానీయము స్నానము మొదలగు వాటిచే, ఆధయః - మానసికమగు పీడలు, వ్యాధయః - రోగములు, వలీప లితజరా-ఆదయః చ - శరీరము ముడుతలు పడుట జుట్టు తెల్లబడుట ముసలిదనము మొదలగునవి కూడ, దేహవైవర్ణ్యదౌర్గంధ్యస్వేదక్లమగ్లానిః - దేహము పాలిపోవుట దుర్గంధమును కలిగియుండుట చెమట పట్టుట బడలికల వలన కలిగే నిరుత్సాహము, ఇతి - అనే, వయః-అవస్థాః చ - వయస్సునకు సంబంధించిన అవస్థలు కూడ, న వై భవంతి - నిశ్చయ ముగా ఉండవు.

ఈ లోకములలో నివసించువారు దివ్యములగు ఓషధులను, రస ములను, రసాయనములను, ఆహారమును, పానీయమును సేవిస్తూ, దివ్య జలములలో స్నానము మొదలగునవి చేయుటచే, వారికి మానసికమగు చింతలు గాని, వ్యాధులు గాని ఉండవు. వయస్సు మీదబడి ముసలిదనము వలన శరీరము ముడుతలు పడుట, జుట్టు తెల్లబడుట అనే స్థితి వీరికి ఉండదు. మరియు, దేహము పాలిపోవుట, దుర్గంధమును కలిగి యుండుట, చెమట పట్టుట, బడలిక, నిరుత్సాహము అనే పెద్ద వయస్సు లోని లక్షణములు కూడ వీరికి నిశ్చయముగా కలుగవు.

న హి తేషాం కల్యాణానాం ప్రభవతి కుతశ్చన మృత్యుర్వినా భగవత్తేజసశ్చక్రాపదేశాత్ ॥ 14

కల్యాణానామ్ - పుణ్యపురుషులగు, తేషామ్ - వారికి, చక్ర-అప దేశాత్ - చక్రము అనే పేరు గల, భగవత్-తేజసః వినా - భగవాసుని తేజస్సు వలన మినహాయించి, కుతశ్చన - దేనివలనైననూ, మృత్యుః - మరణము, న హి ప్రభవతి - సమర్థము కానే కాదు (కలుగనే కలుగదు).

పుణ్యపురుషులగు వారికి భగవంతుని తేజోరూపమగు సుదర్శన చక్రమును మినహాయిస్తే, ఇతరము ఏదైననూ మృత్యువును కలిగించలేదు.

యస్మిన్ ప్రవిష్టేఽసురవధూనాం ప్రాయః పుంసవనాని భయా దేవ స్రవంతి పతంతి చ ॥ 15

యస్మిన్ - ఏ చక్రము, ప్రవిష్టే - ప్రవేశించగా, అసురవధూనామ్ - అసురస్త్రీలయొక్క, పుంసవనాని - గర్భములు, ప్రాయః - అదే కాల ములో, భయాత్ ఏవ - భయము వలననే, స్రవంతి - జారిపోవును, పతంతి చ - పడిపోవును కూడ.

ఆ చక్రము ప్రవేశించగానే భయము వలన అసురస్త్రీలకు వెంటనే గర్భస్రావములు మరియు గర్భపాతములు కలుగును.

అథాతలే మయపుత్రోఽసురో బలో నివసతి యేన హ వా ఇహ సృష్టాష్షణ్ణవతిర్మాయాః కాశ్చనాద్యాపి మాయావినో ధార యంతి యస్య చ జృంభమాణస్య ముఖతస్త్రయః స్త్రీగణా ఉదపద్యంత స్వైరిణ్యః కామిన్యః పుంశ్చల్య ఇతి యా వై విలాయనం ప్రవిష్టం పురుషం రసేన హాటకాఖ్యేన సాధ యిత్వా స్వవిలాసావలోకనానురాగస్మితసంలాపోపగూహనా దిభిస్స్వైరం కిల రమయంతి యస్మిన్నుపయుక్తే పురుష ఈశ్వరోఽహం సిద్ధోఽహమిత్యయుతమహాగజబలమాత్మానమ భిమన్యమానః కత్థతే మదాంధ ఇవ ॥ 16

అథ - మరియు, అతలే - అతలలోకమునందు, మయపుత్రః - మయుని పుత్రుడగు, అసురః బలః - బలాసురుడు, నివసతి - నివసించును, యేన హ - ఎవనిచేనైతే, వై - నిశ్చయముగా, ఇహ - ఈ లోకమునందలి, షట్-నవతిః - తొంబై ఆరు, మాయాః - మాయలు, సృష్టాః - సృష్టించబడినవో, కాశ్చన - కొన్నింటిని, మాయావినః - మాయావులు, అద్య అపి - ఇప్పటికి కూడ, ధారయంతి - ధారణ చేయుచున్నారు, జృంభమాణస్య - ఆవులించుచున్న, యస్య చ - ఎవనియొక్క, ముఖతః - నోటినుండి, స్వైరిణ్యః - స్వైరిణులు, కామిన్యః - కామినులు, పుంశ్చల్యః - పుంశ్చలులు, ఇతి - అనే, త్రయః - మూడు, స్త్రీగణాః - స్త్రీల గణములు, ఉదపద్యంత - ఉదయించినవో, యాః - ఎవరైతే, వై - నిశ్చయముగా, విలాయనమ్ - బిలలోకమును, ప్రవిష్టమ్ - ప్రవేశించిన, పురుషమ్ - పురుషుని, హాటక-ఆఖ్యేన - హాటకము అనే పేరు గల, రసేన - రసముతో, సాధయిత్వా - సమర్థునిగా చేసి, స్వవిలాస-అవలోకన-అనురాగస్మితసంలాప-ఉపగూహన-ఆదిభిః - తమ విలాసలు చూపులు అనురాగముతో కూడిన చిరునవ్వు కబుర్లు కౌగిలింతలు మొదలగువాటితో, స్వైరమ్ - యథేచ్ఛగా, రమయంతి కిల - రమింప జేసెదరో, యస్మిన్ - ఏ రసము, ఉపయుక్తే - సేవించబడగా, పురుషః - వ్యక్తి, అహమ్ - నేను, ఈశ్వరః - ప్రభుడను, అహమ్ - నేను, సిద్ధః - సిద్ధుడను, ఇతి - అని, ఆత్మానమ్ - తనను, అయుతమహాగజబలమ్ - పదివేల గొప్ప ఏనుగుల బలము గలవానినిగా, అభిమన్యమానః - అభిమానము గలవాడై, మద-అంధః ఇవ - గర్వముతో కన్ను మిన్ను గానని వాడు వలె, కత్థతే - బీరములు పలుకునో.

మరియు అతలమునందు మయుని పుత్రుడగు బలాసురుడు గలడు. ఈ లోకములోని మాయలలో తొంబై ఆరింటిని నిశ్చయముగా ఆతడే సృష్టించెను. కొందరు మాయావులకు ఆ మాయలలో కొన్ని ఇప్పటికీ తెలియును. ఒకసారి ఆతడు ఆవులించినప్పుడు, స్వైరిణులు (యథేచ్ఛగా సంచరించువారు), కామినులు (కామాధిక్యము గలవారు), పుంశ్చలులు (చంచలమైన మనస్సు గలవారు) అనే మూడు స్త్రీగణములు ఉదయించెను. ఆ బిలలోకములోని పురుషులకు వారు హాటకము అనే రసమును త్రాగించి, సంభోగసమర్థులుగా తయారు చేయుదురు. అపుడు వారా పురు

షుని తమ విలాసలు, చూపులు, అనురాగముతో కూడిన చిరునవ్వులు, కబుర్లు, కౌగిలింతలతో యథేచ్ఛగా రమింప జేసెదరు. ఆ రసమును త్రాగిన వ్యక్తి, నేనే ప్రభుడను అనియు, నేనే సిద్ధుడను అనియు బీరము లను పలుకుచుండును. ఆతడు గర్వముచే కన్ను మిన్ను గానని వాడు వలె, తనకు పదివేల గొప్ప ఏనుగుల బలము గలదనే అభిమానముతో విర్రవీగుచుండును.

తతోఽధస్తాద్వితలే హరో భగవాన్ హాటకేశ్వరస్స్వపార్షదభూతగ ణావృతః ప్రజాపతిసర్గోపబృంహణాయ భవో భవాన్యా సహ మిథు నీభూత ఆస్తే యతః ప్రవృత్తా సరిత్ప్రవరా హాటకీ నామ భవయో ర్వీర్యేణ యత్ర చిత్రభానుర్మాతరిశ్వనా సమిధ్యమాన ఓజసా పిబతి తన్నిష్ఠ్యూతం హాటకాఖ్యం సువర్ణం భూషణేనాసురేంద్రావ రోధేషు పురుషాస్సహ పురుషీభిర్ధారయంతి ।। 17

తతః - దానికంటె, అధస్తాత్ - క్రింద, వితలే - వితలమునందు, హరః - పాపములను పోగొట్టువాడు, హాటకేశ్వరః - హాటకేశ్వరుడనే పేరు గలవాడు, స్వపార్షదభూతగణ-ఆవృతః - తనకు అనుచరులైన భూతగణ ములచే చుట్టువారబడి యున్నవాడు అగు, భగవాన్ భవః - శివ భగవాను డు, ప్రజాపతిసర్గ-ఉపబృంహణాయ - బ్రహ్మగారి సృష్టిని వర్ధిల్ల జేయుట కొరకై, భవాన్యా సహ - పార్వతీదేవితో గూడ, మిథునీభూయ - జత గట్టి, ఆస్తే - ఉన్నాడు, యతః - దేనినుండి, భవయోః - పార్వతీశివుల, వీర్యేణ - తేజస్సుచే, హాటకీ నామ - హాటకి అని ప్రసిద్ధి గాంచిన, సరిత్-ప్రవరా - గొప్ప నది, ప్రవృత్తా - ప్రవహించినదో, యత్ర - ఎక్కడనైతే, మాతరిశ్వనా - వాయువుచే, సమిధ్యమానః - ప్రజ్వరిల్ల జేయబడుచున్న, చిత్రభానుః - అగ్ని, ఓజసా - బలముతో, పిబతి - పానము చేయునో, తత్-నిష్ఠ్యూతమ్ - వాని ఉమ్మి, హాటక-ఆఖ్యమ్ - హాటకము అనే పేరు గల, సువర్ణమ్ - బంగారమో, అసుర-ఇంద్ర-అవరోధేషు - అసురప్రభువుల అంతఃపురము లలో, పురుషాః - పురుషులు, పురుషీభిః సహ - స్త్రీలతో గూడి, భూష ణేన - భూషణముగా, ధారయంతి - ధరించెదరు.

అతలముకంటె క్రింద వితలమునందు పాపములను పోగొట్టే హాట కేశ్వరుడని ప్రసిద్ధి గాంచిన శివ భగవానుడు, బ్రహ్మగారి సృష్టిని వర్ధిల్ల జేయుట కొరకై, పార్వతితో కలిసి నివసించును. ఆయన అనుచరులగు భూతగణములు ఆయనను చుట్టువారి యుందురు. శివపార్వతుల తేజ స్సుచే అక్కడనుండి హాటకి అనే గొప్ప నది ప్రవహించినది. వాయువుచే ప్రజ్వరిల్ల జేయబడే అగ్ని ఆ నీటిని ఉత్సాహముతో త్రాగి ఉమియగా, అదియే హాటకము అనే బంగారము అయినది. అసురప్రభువుల అంతఃపుర ములలో పురుషులు స్త్రీలతో గూడి ఆ బంగారముతో చేసిన ఆభరణము లను ధరించెదరు.

తతోఽధస్తాత్సుతలే ఉదారశ్రవాః పుణ్యశ్లోకో విరోచనాత్మజో బలిర్భగవతా మహేంద్రస్య ప్రియం చికీర్షమాణేనాదితేర్లబ్ధ కాయో భూత్వా వటువామనరూపేణ పరాక్షిప్తలోకత్రయో భగ వదనుకంపయైవ పునః ప్రవేశిత ఇంద్రాదిష్వవిద్యమానయా సుసమృద్ధయా శ్రియాఽభిజుష్టస్స్వధర్మేణారాధయంస్తమేవ భగవంతమారాధనీయమపగతసాధ్వస ఆస్తేఽధునాపి ।। 18

తతః - వితలముకంటె, అధస్తాత్ - క్రింద, సుతలే - సుతలమునం దు, ఉదారశ్రవాః - గొప్ప కీర్తి గలవాడు, పుణ్యశ్లోకః - పవిత్రమగు కీర్తి గల వాడు, విరోచన-ఆత్మజః - విరోచనుని పుత్రుడగు, బలిః - బలి, మహేం ద్రస్య - మహేంద్రునకు, ప్రియమ్ - ప్రీతిని, చికీర్షమాణేన - చేయగోరుచు న్న, భగవతా - శ్రీహరి భగవానునిచే, అదితేః - అదితినుండి, లబ్ధకాయః - లభించిన శరీరము గలవాడుగా, భూత్వా - అయి, వటువామనరూపేణ - బ్రహ్మచారియగు వామనుని రూపముతో, పరాక్షిప్తలోకత్రయః - లాగుకొ నబడిన ముల్లోకములు గలవాడై, భగవద్-అనుకంపయా ఏవ - భగవానుని అనుగ్రహము చేతనే, పునః - మరల, ప్రవేశితః - ప్రవేశ పెట్టబడినవాడై, ఇంద్ర-ఆదిషు - ఇంద్రుడు మొదలగువారియందు, అవిద్యమానయా - లేని, సుసమృద్ధయా - మిక్కిలి సమృద్ధమగు, శ్రియా - సంపదతో, అభి జుష్టః - కూడినవాడై, తమ్ - ఆ, ఆరాధనీయమ్ - ఆరాధించదగిన, భగ వంతం ఏవ - భగవానుని మాత్రమే, స్వధర్మేణ - తన ధర్మముతో, ఆరాధ

**యన్** - ఆరాధించుచున్నవాడై, **అపగతసాధ్వసః** - తొలగిన భయము గల వాడై, **అధునా అపి** - ఇప్పుడు కూడ, **ఆస్తే** - ఉన్నాడు.

వితలముకంటె క్రింద సుతలము గలదు. విరోచనుని పుత్రుడైన, గొప్ప పవిత్రమైన కీర్తి గల బలి ఇప్పటికీ ఆ సుతలమునందే ఉన్నాడు. మహేంద్రునకు ప్రియమును చేయగోరిన భగవానుడు అదితి కడుపున పుట్టి, బ్రహ్మచారియగు వామనుని రూపముతో ముల్లోకములను బలివద్ద నుండి లాగుకొనెను. కాని, ఆయనయే బలిపై అనుగ్రహమును చూపి సుతలమునందు ప్రవేశపెట్టెను. ఇంద్రుడు మొదలగువారికి కూడ లేని మిక్కిలి సమృద్ధమగు సంపద బలికి గలదు. ఆయన ఆరాధ్యుడగు ఆ భగవానుని మాత్రమే స్వధర్మమునాచరిస్తూ ఆరాధించుచున్నాడు. ఇప్పుడు ఆయనకు ఇంద్రాదుల వలన భయము లేదు.

నో ఏవైతత్సాక్షాత్కారో భూమిదానస్య యత్తద్భగవత్యశేషజీ
వనికాయానాం జీవభూతాత్మభూతే పరమాత్మని వాసుదేవే
తీర్థతమే పాత్ర ఉపపన్నే పరయా శ్రద్ధయా పరమాదరసమా
హితమనసా సంప్రతిపాదితస్య సాక్షాదపవర్గద్వారస్య యద్బి
లనిలయైశ్వర్యమ్ ॥ 19

**యత్** - ఏలయనగా, **బిలనిలయ-ఐశ్వర్యమ్** - బిలలోకమగు సుతలమునందలి ఐశ్వర్యము, **యత్** - ఏది గలదో, **తత్** - ఆ, **ఏతత్** - ఇది, **అశేషజీవనికాయానామ్** - సకలప్రాణిసమూహములకు, **జీవభూత-ఆత్మభూతే** - జీవుడుగను ఆత్మగను అయి ఉన్నట్టియు, **పరమ-ఆత్మని** - అంతరతమమగు ఆత్మస్వరూపుడైనట్టియు, **తీర్థతమే** - మిక్కిలి పవిత్రుడగు, **వాసుదేవే భగవతి** - వాసుదేవ భగవానుడు, **పాత్రే** - పాత్రుడై, **ఉపపన్నే** - రాగా, **పరయా** - గొప్ప, **శ్రద్ధయా** - శ్రద్ధతో, **పరమ-ఆదరసమాహితమనసా** - గొప్ప ఆదరముచే ఏకాగ్రమైన మనస్సుతో, **సంప్రతిపాదితస్య** - సమర్పించబడినట్టియు, **సాక్షాత్** - సాక్షాత్తుగా, **అపవర్గద్వారస్య** - మోక్షమునకు ద్వారమైన, **భూమిదానస్య** - భూమిదానమునకు, **సాక్షాత్కారః** - ఫలము, **నో ఏవ** - కానే కాదు.

సకలప్రాణిసమూహములయందు వాసుదేవ భగవానుడే జీవుడై, అంతరతమమగు ఆత్మరూపుడై ఉన్నాడు. మిక్కిలి పవిత్రుడగు ఆయనయే దానమునకు పాత్రుడై రాగా, బలి పరమశ్రద్ధతో, గొప్ప ఆదరముతో, ఏకాగ్ర మగు చిత్తముతో ఆయనకు భూమిని సమర్పించెను. అయిననూ, సుతల మునందలి ఐశ్వర్యము ఈ దానముయొక్క ఫలము కానే కాదు. ఈ దానము మోక్షమునకే ద్వారమై యున్నది.

యస్య హ వావ క్షుతపతనప్రస్ఖలనాదిషు వివశస్సకృన్నామాభి
గృణన్ పురుషః కర్మబంధనమంజసా విధునోతి యస్య హైవ
ప్రతిబాధనం ముముక్షవోऽన్యథైవోపలభంతే ॥ 20

క్షుతపతనప్రస్ఖలన-ఆదిషు - తుమ్ము పడుట జారుట మొదలగు వాటియందు, పురుషః - వ్యక్తి, వివశః సన్ - స్వాధీనత తప్పినవాడై, యస్య హ - ఏ భగవానుని, నామ - పేరును, సకృత్ - ఒక్కసారి, అభిగృణన్ - ఉచ్చరించువాడై, కర్మబంధనమ్ - కర్మబంధనమగు సంసారమును, అంజసా - తేలికగా, వావ - నిశ్చయముగా, విధునోతి - అతిక్రమించునో, యస్య - ఏ సంసారముయొక్క, ప్రతిబాధనమ్ - వినాశమును, ముముక్షవః - మోక్షమును గోరువారలు, అన్యథా ఏవ - మరియొక విధముగనే, ఉపలభంతే - పొందుచున్నారో.

తుమ్ముట, పడుట, జారుట మొదలగు సందర్భములలో వ్యక్తి స్వాధీనత తప్పియున్ననూ, ఆ భగవానుని పేరును ఒక్కసారి పలికి, కర్మ బంధనమగు సంసారమును తేలికగా అతిక్రమించును. ఇది నిశ్చయము. మోక్షమును కోరు సాధకులు ఇతరములైన యోగము మొదలగు ఉపాయ ములచే మాత్రమే సంసారమును దూరము చేసుకొనగల్గుచున్నారు.

తద్భక్తానామాత్మవతాం సర్వేషామాత్మన్యాత్మద ఆత్మత
యైవ ॥ 21

తత్ - అందువలన, భక్తానామ్ - భక్తులకు, ఆత్మవతామ్ - ఆత్మ జ్ఞానులకు, ఆత్మదే - తనను ఇచ్చునట్టియు, సర్వేషామ్ - అందరికి,

ఆత్మని - ఆత్మయైన శ్రీహరియందు, ఆత్మతయా ఏవ - ఆత్మభావము చే తనే.

కావున, భక్తులకు ఆత్మజ్ఞానులకు తనను తానే సమర్పించువాడు, సర్వప్రాణులకు ఆత్మరూపుడు అగు శ్రీహరియందు ఆత్మభావముతో చేయబడిన దానమునకు ఫలము మోక్షమే యగును.

న వై భగవాన్నూనమముష్యానుజగ్రాహ యదుత పునరాత్మాను స్మృతిమోషణం మాయామయభోగైశ్వర్యమేవాతనుతేతి ।। 22

భగవాన్ - శ్రీహరి భగవానుడు, అముష్య - ఈ ఇంద్రునకు, నూనమ్ - నిశ్చయముగా, న వై అనుజగ్రాహ - అనుగ్రహించనే లేదు, యత్ ఉత పునః - ఏలయనగా, ఆత్మానుస్మృతిమోషణమ్ - తన స్మరణ మును అపహరించే, మాయామయభోగ-ఐశ్వర్యం ఏవ - మాయాకార్య ములగు భోగముల ఐశ్వర్యమును మాత్రమే, ఆతనుత - విస్తరింప జేసెను, ఇతి - అనే కారణముగా.

శ్రీహరి భగవానుడు ఈ ఇంద్రుని అనుగ్రహించనే లేదు. ఇది నిశ్చయము. ఏలయనగా, ఆయన ఇంద్రునకు మిథ్యాభూతములగు (ప్రకృ తికార్యములగు) భోగముల ఐశ్వర్యమును మాత్రమే విస్తరింప జేసినాడు. ఆ భోగములు వ్యక్తికి శ్రీహరిని స్మరించే అవకాశమును అపహరించును.

యత్తద్భగవతాఽనధిగతాన్యోపాయేన యాచ్ఞాచ్ఛలేనాపహృత స్వశరీరావశేషితలోకత్రయో వరుణపాశైశ్చ సంప్రతిముక్తో గిరి దర్యాం చాపవిద్ధ ఇతి హోవాచ ।। 23

యత్ - ఏలయనగా, తత్ - అప్పుడు, అనధిగత-అన్య-ఉపా యేన - పొందబడని ఇతరమగు ఉపాయము గల, భగవతా - శ్రీహరి భగ వానునిచే, యాచ్ఞాచ్ఛలేన - యాచించుట అనే నెపముతో, అపహృతస్వశ రీర-అవశేషితలోకత్రయః - అపహరించబడిన తన శరీరము మాత్రమే మిగిలిన ముల్లోకములు గలవాడు, వరుణపాశైః - వరుణుని పాశములచే, సంప్రతిముక్తః - గట్టిగా బంధించబడినవాడై, చ - మరియు, గిరిదర్యామ్ -

పర్వతగుహయందు, అపవిద్ధః - పడవేయబడినవాడై, ఇతి - ఈ విధము గా, ఉవాచ హ - పలికెనట.

ఏలయనగా, అప్పుడు శ్రీహరి భగవానునకు మరియొక ఉపా యము తోచక పోవుటచే, యాచించుట అనే నెపముతో, బలినుండి ఆతని శరీరము తప్ప, ముల్లోకములను కూడ అపహరించి వేసెను. అపుడాయన బలిని వరుణుని పాశములతో బంధించి, పర్వతగుహయందు పారవైచెను. అపుడు బలి ఇట్లు పలికెను.

నూనం బతాయం భగవానర్థేషు న నిష్ణాతో యోఽసావింద్రో యస్య సచివో మంత్రాయ వృత ఏకాంతతో బృహస్పతిస్తమతి హాయ స్వయముపేంద్రేణాత్మానమయాచతాత్మనశ్చాశిషో నో ఏవ తద్దాస్యమతిగంభీరవయసః కాలస్య మన్వంతరపరి వృతం కియల్లోకత్రయమిదమ్? ।। 24

బత - అయ్యో!, అయమ్ - ఈ ఇంద్రుడు, నూనమ్ - నిశ్చయ ముగా, భగవాన్ - పూజనీయుడు, యః - ఏ, అసౌ - ఈ, ఇంద్రః - ఇంద్రు డు, అర్థేషు - ప్రయోజనముల విషయమునందు, నిష్ణాతః - నేర్పరి, న - కాదు, యస్య - ఎవ్వాని, సచివః - మంత్రియగు, బృహస్పతిః - బృహస్ప తి, ఏకాంతతః - అనన్యభావముగా, మంత్రాయ - సలహా కొరకు, వృతః - కోరబడినవాడో, తమ్ - అట్టి బృహస్పతిని, అతిహాయ - త్రోసిపుచ్చి, స్వయమ్ - తాను, ఉపేంద్రేణ - వామనుని ద్వారా, ఆత్మానమ్ - నన్ను, ఆత్మనః - తనకు, ఆశిషః చ - సంపదలను, అయాచత - కోరెనో, తద్-దా స్యమ్ - ఆ శ్రీహరియొక్క దాస్యమును, నో ఏవ - కోరనే లేదు, అతిగంభీ రవయసః - మిక్కిలి లోతైన వయస్సు గల, కాలస్య - కాలమునకు, మన్వంతరపరివృతమ్ - మన్వంతరముచే అంతమయ్యే, ఇదమ్ - ఈ, లోకత్రయమ్ - ముల్లోకములు, కియత్ - ఎంత?

అయ్యో! ఈ ఇంద్రుడు నిశ్చయముగా పూజనీయుడే; కాని, ఈతడు తన హితమును సాధించుకొనుటలో నేర్పరి కాదు. ఏలయనగా, ఈతడు బృహస్పతిని అనన్యభావముతో సలహాలనిచ్చే మంత్రిగా ఏరి కోరి

తెచ్చుకున్నాడు. కాని, ఆయన మాటను కాదని త్రోసిపుచ్చి, తాను వామనుని ద్వారా నావద్దనున్న సంపదలనే కోరుకొనెను. అంతేగాని, ఆ శ్రీహరి యొక్క దాస్యమును కోరనే లేదు. ఈ కాలము అనంతము. దీనికి మన్వంతరకాలముచే అంతమయ్యే ఈ ముల్లోకములు ఎంత?

యస్యానుదాస్యమేవాస్మత్పితామహః కిల వవ్రే న తు స్వపిత్ర్యం యదుతాకుతోభయం పదం దీయమానం భగవతః పరమితి భగవతోపరతే ఖలు స్వపితరి ॥ 25

అస్మత్-పితామహః - మా తాతయగు ప్రహ్లాదుడు, యస్య - ఏ శ్రీహరియొక్క, అనుదాస్యం ఏవ - దాసుని దాస్యమునే, వవ్రే కిల - వరించెనో గదా!, స్వపితరి - తన తండ్రి, భగవతా - శ్రీహరి భగవానునిచే, ఉపరతే - సంహరించబడగా, అకుతః-భయం ఉత - దేనివలనైననూ భయము లేనిదే అయిననూ, దీయమానమ్ - ఈయబడుచున్న, స్వపిత్ర్యమ్ - తన తండ్రికి చెందిన, పదమ్ - అధికారము, యత్ - ఏది గలదో అది, భగవతః - భగవానునికంటె, పరమ్ - ఇతరమైనది, ఇతి - అనే కారణముగా, న వవ్రే ఖలు - వరించలేదు గదా!

ప్రహ్లాదుడు మా తాత. ఆయన తండ్రియగు హిరణ్యకశిపుని శ్రీహరి సంహరించి, భయరహితమగు ఆ రాజ్యాధికారమును ప్రహ్లాదునకు ఇచ్చుచుండెను. కాని, తన తండ్రికి చెందిన ఆ అధికారము భగవానుని కంటె భిన్నమైనదగుటచే, ప్రహ్లాదుడు దానిని ఇచ్చగించనేలేదు. ఆయన భగవానుని భక్తుల దాస్యమునే వరముగా కోరుకొనెను గదా!

తస్య మహానుభావస్యానుపథమమృజితకషాయః కో వాఽస్మద్విధః పరిహీణభగవదనుగ్రహ ఉపజిగమిషతీతి ॥ 26

మహా-అనుభావస్య - గొప్ప ప్రభావము గల, తస్య - ఆ ప్రహ్లాదుని, అనుపథమ్ - అనుసరించే మార్గమును, అమృజితకషాయః - తొలగించబడని రాగద్వేషములు గలవాడు, పరిహీణభగవద్-అనుగ్రహః - తొలగిన భగవాముని అనుగ్రహము గలవాడు, అస్మద్-విధః - నావంటి వాడు, కః వా - ఎవ్వాడు, ఉపజిగమిషతి - దగ్గరగానైననూ వెళ్ల గోరును?, ఇతి - అని.

ప్రహ్లాదుడు గొప్ప ప్రభావము గలవాడు. రాగద్వేషములు తొలగించుకోకుండా, భగవానుని అనుగ్రహము నిండా లేకుండా, నావంటి వాడు ఎవడు ఆయన మార్గమును అనుసరించి వెళ్ల గోరును? అని బలి పలికెను.

**తస్యానుచరితముపరిష్టాద్విస్తరిష్యతే యస్య భగవాన్ స్వయమఖిలజగద్గురుర్నారాయణో ద్వారి గదాపాణిరవతిష్ఠతే నిజజనానుకంపితహృదయో యేనాంగుష్ఠేన పదా దశకంధరో యోజనాయుతాయుతం దిగ్విజయ ఉచ్చాటితః ॥ 27**

తస్య- ఆ బలియొక్క, అనుచరితమ్ - వృత్తాంతము, ఉపరిష్టాత్ - మున్ముందు, విస్తరిష్యతే - విస్తారముగా చెప్పబడ గలదు, యస్య - ఎవ్వాని, ద్వారి - ద్వారము వద్ద, అఖిలజగద్-గురుః - సకలజగత్తునకు తండ్రి, నిజజన-అనుకంపితహృదయః - తన భక్తులయందు దయతో గూడిన హృదయము గలవాడు అగు, భగవాన్ నారాయణః - నారాయణ భగవానుడు, స్వయమ్ - స్వయముగా, గదాపాణిః - గద చేతియందు గల వాడై, అవతిష్ఠతే - నిలిచి యుండునో, యేన - ఏ నారాయణునిచే, దిగ్-విజయే - దిగ్విజయమునందు, దశకంధరః - రావణుడు, పదా - కాలితో, అంగుష్ఠేన - బొటన వ్రేలితో, యోజన-అయుత-అయుతమ్ - పది కోట్ల యోజనములను, ఉచ్చాటితః - విసరి వేయబడెనో.

ఆ బలి వృత్తాంతమును మున్ముందు విస్తారముగా చెప్పగలను. సకలలోకములకు తండ్రియగు నారాయణ భగవానుని హృదయము తన భక్తుల యెడల దయతో నిండియుండును. ఆయన స్వయముగా బలి ద్వారము వద్ద గద చేతబట్టి నిలిచి యుండును. దిగ్విజయము కొరకై అచటకు వచ్చిన దశకంఠుని ఆయన కాలి బొటన వ్రేలితో పది కోట్ల యోజనముల దూరము విసరివైచెను.

**తతోఽధస్తాత్తలాతలే మయో నామ దానవేంద్రస్త్రిపురాధిపతిర్భగవతా పురారిణా త్రిలోకీశం చికీర్షుణా నిర్దగ్ధస్వపురత్రయస్తత్ప్రసాదాల్లబ్ధపదో మాయావినామాచార్యో మహాదేవేన పరిరక్షితో విగతసుదర్శనభయో మహీయతే ॥ 28**

తతః - సుతలముకంటె, అధస్తాత్ - క్రింద, తలాతలే - తలాతల మునందు, మయః నామ - మయుడని ప్రసిద్ధి గాంచినవాడు, త్రిపుర-అధి పతిః - మూడు నగరములకు అధిపతియైనవాడు, మాయావినామ్ - మాయావులకు, ఆచార్యః - గురువు అగు, దానవ-ఇంద్రః - రాక్షసప్రభు డు, పుర-అరిణా - పురములకు శత్రువు అయినట్టియు, త్రిలోకీశమ్ - ముల్లోకములకు సుఖమును, చికీర్షుణా - చేయగోరే, భగవతా - శివ భగ వానునిచే, నిర్దగ్ధపురత్రయః - పూర్తిగా తగులబెట్టబడిన మూడు నగర ములు గలవాడై, తత్-ప్రసాదాత్ - ఆ శివుని అనుగ్రహము వలన, లబ్ధపదః - పొందబడిన స్థానము గలవాడై, మహాదేవేన - మహాదేవునిచే, పరిరక్షితః - అన్ని విధములుగా రక్షించబడినవాడై, విగతసుదర్శనభయః - తొలగిన సుదర్శనము వలని భయము గలవాడై, మహీయతే - పూజించబడుచు న్నాడు.

సుతలము క్రింది లోకము తలాతలము. దానిలో మయుడని ప్రసిద్ధి గాంచిన రాక్షసప్రభుడు ఉన్నాడు. మాయావులకు ఆచార్యుడగు ఆ మయుడు మూడు నగరములకు అధిపతి. కాని, మహాదేవుడు ముల్లోకము లకు సుఖమును కలిగించ గోరి, ఆ మూడు నగరములకు శత్రువు అయినా డు. ఆయన ఆ మూడు నగరములను పూర్తిగా తగులబెట్టెను. కాని, ఆయన అనుగ్రహించి మయునకు ఇచట స్థానమును కల్పించి, ఆతనిని అన్ని విధములుగా రక్షించెను. మయుడు ఈ లోకములో సుదర్శనచక్రము వలని భయము లేనివాడై, పూజలనందు కొనుచున్నాడు.

తతోఽధస్తాన్మహాతలే కాద్రవేయాణాం సర్పాణాం నైకశిరసాం
క్రోధవశో నామ గణః కుహకతక్షకకాలియసుషేణాదిప్రధానా
మహాభోగవంతః పతత్త్రిరాజాధిపతేః పురుషవాహాదనవరత
ముద్విజమానాస్స్వకలత్రాపత్యసుహృత్కుటుంబసంగేన
క్వచిత్ప్రమత్తా విహరంతి ॥ 29

తతః - దానికంటె, అధస్తాత్ - క్రింద, మహాతలే - మహాతలము నందు, కాద్రవేయాణామ్ - కద్రువు సంతానమైనట్టియు, న-ఏకశిరసామ్ -

అనేకములగు తలలు గల, సర్పాణామ్ - సర్పముల, గణః - సమూహ ము, క్రోధవశః నామ - క్రోధవశము అని ప్రసిద్ధి గాంచినది, మహాభోగ వంతః - పెద్ద పడగలు గల, కుహకతక్షకకాలియసుషేణ-ఆదిప్రధానాః - కుహకుడు తక్షకుడు కాలియుడు సుషేణుడు మొదలగు ప్రధానులు, పత త్రిరాజ-అధిపతేః - పక్షులకు రాజగు గరుడపక్షులకు ప్రభువగు, పురుషవా హాత్ - పురుషోత్తముని వాహనమైన గరుత్మంతుని వలన, అనవరతమ్ - అన్ని కాలములలో, ఉద్విజమానాః - కలవరపడుచున్నవారై, స్వకలత్ర-అ పత్యసుహృత్-కుటుంబసంగేన - తమ భార్యలు పిల్లలు మిత్రుల మరియు కుటుంబముయొక్క కలయికచే, క్వచిత్ - ఒకప్పుడు, ప్రమత్తాః - ఒళ్లు మరచినవారై, విహరంతి - విహరించెదరు.

తలాతలమునకు క్రింది లోకము మహాతలము. దానియందు కద్రువు సంతానమైన సర్పముల గణము గలదు. అనేకములగు తలలు గల ఆ సర్పముల గణమునకు క్రోధవశము అనే పేరు ప్రసిద్ధి. పెద్ద పడగలు గల కుహకుడు, తక్షకుడు, కాలియుడు, సుషేణుడు మొదలగువారు ఆ గణములోని పెద్దలు. వీరు అన్ని కాలములలో పక్షిశ్రేష్ఠములకు రాజు, పురుషోత్తముని వాహనము అగు గరుత్మంతుని వలన కలవర పడుచుందు రు. కాని, ఒక్కొక్కప్పుడు తమ భార్యలు, పిల్లలు, మిత్రులతో బాటు కుటుంబమంతయు కలిసియుండుట వలన వారు ఆ భయమును ప్రక్కన బెట్టి ఒళ్లు మరచి విహరించుచుందురు.

తతోఽధస్తాద్రసాతలే దైతేయా దానవాః పణయో నామ నివాత కవచాః కాలేయా హిరణ్యపురవాసిన ఇతి విబుధప్రత్యనీకా ఉత్పత్త్యా మహౌజసో మహాసాహసినో భగవతస్సకలలోకాను భావస్య హరేరేవ తేజసా ప్రతిహతబలావలేపా బిలేశయా ఇవ వసంతి యే వై సరమయేంద్రదూత్యా వాగ్భిర్మంత్రవర్ణాభిరిం ద్రాద్బిభ్యతి॥ 30

తతః - దానికంటె, అధస్తాత్ - క్రింద, రసాతలే - రసాతలమునం దు, పణయః నామ - పణులు అని ప్రసిద్ధి గాంచిన, దైతేయాః - దితి వంశ

మువారు, దానవాః - దనువంశము వారు, నివాతకవచాః - నివాతకవచులు, కాలేయాః - కాలేయులు, హిరణ్యపురవాసినః - హిరణ్యపురవాసులు, ఇతి - అని, విబుధప్రత్యనీకాః - దేవశత్రువులు, ఉత్పత్త్యా - పుట్టుకతో, మహా-ఓజసః - గొప్ప బలము గలవారు, మహాసాహసినః - గొప్ప సాహసము గలవారు, సకలలోక-అనుభావస్య - అన్ని లోకములలో మహిమ గల, భగవతః హరేః - శ్రీహరి భగవానుని, తేజసా ఏవ - తేజస్సుచే మాత్రమే, ప్రతిహతబల-అవలేపాః - నశింపజేయబడిన బలము వలని గర్వము గలవారు, బిలేశయాః ఇవ - పుట్టలలో నివసించే పాములు వలె, వసంతి - నివసించుచున్నారు, యే వై - ఎవరైతే, ఇంద్రదూత్యా - ఇంద్రుని దూతయగు, సరమయా - సరమచే, మంత్రవర్ణాభిః - మంత్రరూపములగు, వాగ్భిః - వాక్కులచే, ఇంద్రాత్ - ఇంద్రుని వలన, బిభ్యతి - భయపడెదరో.

మహాతలముకంటె క్రింది లోకము రసాతలము. అచట పణులు, నివాతకవచులు, కాలేయులు, హిరణ్యపురవాసులు అని ప్రసిద్ధి గాంచిన దైత్యదానవగణములు పుట్టలలోని పాములు వలె నివసించును. దేవశత్రువులగు ఆ దైత్యదానవులు పుట్టుక తోడనే గొప్ప బలము మరియు గొప్ప సాహసము గలవారు. అన్ని లోకములలో మహిమాన్వితుడైన శ్రీహరి భగవానుని తేజస్సుచే మాత్రమే, తాము బలవంతులమనే వారి గర్వము అణచబడినది. ఇంద్రుని దూతయగు సరమ (దేవతల కుక్క) మంత్రరూపములగు వాక్కులు కారణముగా, వారు ఇంద్రునకు భయపడుచుందురు.

**తతోఽధస్తాత్పాతాలే నాగలోకపతయో వాసుకిప్రముఖాశ్శంఖ కులికమహాశంఖశ్వేతధనంజయధృతరాష్ట్రశంఖచూడకంబలాశ్వతరదేవదత్తాదయో మహాభోగినో మహామర్షా నివసంతి యేషాము హ వై పంచసప్తదశశతసహస్రశీర్షాణాం ఫణాసు విరచితా మహామణయో రోచిష్ణవః పాతాలవివరతిమిరనికరం స్వరోచిషా విధమంతి ॥ 31**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే
రసాతలాది వర్ణనం నామ చతుర్వింశోऽధ్యాయః ||

**తతః** - దానికంటె, **అధస్తాత్** - క్రింద, **పాతాలే** - పాతాళమునందు, **వాసుకిప్రముఖాః** - వాసుకి మొదలగువారు, **శంఖకులికమహాశంఖశ్వేతధనంజయధృతరాష్ట్రశంఖచూడకంబల-అశ్వతరదేవదత్త-ఆదయః** - శంఖుడు కులికుడు మహాశంఖుడు శ్వేతుడు ధనంజయుడు ధృతరాష్ట్రుడు శంఖచూడుడు కంబలుడు అశ్వతరుడు దేవదత్తుడు మొదలగువారు, **మహాభోగినః** - పెద్ద పడగలు గలవారు, **మహా-అమర్షాః** - గొప్ప కోపము గలవారు, **నివసంతి** - నివసించుచున్నారు, **పంచసప్తదశశతసహస్రశీర్షాణామ్** - అయిదు ఏడు పది వంద వేయి తలలు గల, **యేషాం ఉ హ** - ఎవరికైతే, **ఫణాసు** - పడగలయందు, **విరచితాః** - నిర్మించబడినవి, **రోచిష్ణవః** - ప్రకాశించునవి అగు, **మహామణయః** - గొప్ప మణులు, **పాతాలవివరతిమిరనికరం** - పాతాళము అనే బిలలోకమునందలి చీకట్ల సమూహమును, **స్వరోచిషా** - తమ కాంతిచే, **విధమంతి** - పారద్రోలు చున్నవో.

రసాతలమునకు క్రింది లోకము పాతాళము. దానిలో శంఖుడు, కులికుడు, మహాశంఖుడు, శ్వేతుడు, ధనంజయుడు, ధృతరాష్ట్రుడు, శంఖచూడుడు, కంబలుడు, అశ్వతరుడు, దేవదత్తుడు మొదలగు పెద్ద పడగలు గల సర్పములు నివసించును. గొప్ప కోపము గల ఆ సర్పములలో వాసుకి ప్రముఖుడు. వారికి అయిదు, ఏడు, పది, వంద, లేక వేయి తలలు ఉండును. ఈశ్వరుడు వారి పడగలలో గొప్పగా ప్రకాశించే గొప్ప మణులను పెట్టినాడు. వాటి కాంతులు బిలలోకమగు పాతాళమునందలి చీకట్ల సమూహములను పారద్రోలుచుండును.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో
రసాతలము మొదలగు లోకములను వర్ణించే ఇరువది
నాల్గవ అధ్యాయము ముగిసినది (24).

*****

# అథ పంచవింశోऽధ్యాయః
## శ్రీ సంకర్షణ దేవుని స్తోత్రము

శ్రీశుక ఉవాచ ।
తస్య మూలదేశే త్రింశద్యోజనసహస్రాంతర ఆస్తే యా వై కలా భగవతస్తామసీ సమాఖ్యాతాऽనంత ఇతి సాత్వతీయా ద్రష్టృదృశ్యయోస్సంకర్షణమహమిత్యభిమానలక్షణం యం సంకర్షణమిత్యాచక్షతే ।। 1

తస్య - ఆ పాతాళమునకు, మూలదేశే - మూలస్థానమునందు, త్రింశద్-యోజనసహస్ర-అంతరే - ముప్పది వేల యోజనముల దూరమునందు, యా - ఏ, భగవతః - శ్రీహరి భగవానునియొక్క, తామసీ - తమోగుణప్రధానమగు, కలా - అంశ గలదో, అనంతః - అనంతుడు, ఇతి - అని, సమాఖ్యాతా - పిలువబడునది, ద్రష్టృదృశ్యయోః - ద్రష్ట దృశ్యములకు, సంకర్షణమ్ - ఒక్కటిగా చేయుట గలది, అహమ్ - నేను, ఇతి - అనే, అభిమానలక్షణమ్ - అభిమానము లక్షణముగా గలది అగు, యమ్ - ఏ కళను, సాత్వతీయాః - సత్త్వగుణప్రధానుడగు శ్రీహరి భక్తులు, సంకర్షణమ్ - సంకర్షణము, ఇతి - అని, ఆచక్షతే - చెప్పుచున్నారో.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- పాతాళమునకు ముప్పది వేల యోజనముల దూరములో మూలస్థానమునందు శ్రీహరి భగవానుని తమోగుణప్రధానమగు కళ గలదు. దానికి అనంతుడు అని పేరు. ఇది అహంకారరూపమగుటచే ద్రష్ట (చూచువాడు) మరియు దృశ్యము (చూడబడేది) లను ఏకము (భోగ్యమగు దీనిని భోగించే భోక్తను నేను అనే అభిమానము) చేయును. సత్త్వగుణప్రధానుడగు శ్రీహరి భక్తులు ఈ కళను సంకర్షణుడు (ఏకము చేయువాడు) అని వ్యవహరించెదరు.

యస్యేదం క్షితిమండలం భగవతోఽనంతమూర్తేస్సహస్రశిరస
ఏకస్మిన్నేవ శీర్షణి ధ్రియమాణం సిద్ధార్థ ఇవ లక్ష్యతే ॥ 2

ఇదమ్ - ఈ, క్షితిమండలమ్ - భూమండలము, అనంతమూర్తేః - అనంతుని రూపములోనున్నట్టియు, సహస్రశిరసః - వేయి తలలు గల, యస్య - ఏ, భగవతః - భగవానుని, ఏకస్మిన్ ఏవ - ఒకే ఒక, శీర్షణి - తల యందు, ధ్రియమాణమ్ - భరించబడుచున్నదై, సిద్ధార్థః ఇవ - ఆవగింజ వలె, లక్ష్యతే - కనబడుచున్నదో.

వేయి తలల అనంతుని రూపములోనున్న భగవానుని ఒకే ఒక తలపై మోయబడే ఈ భూమండలము అచట ఆవగింజవలె కనబడును.

యస్య హ వా ఇదం కాలేనోపసంజిహీర్షతోఽమర్షవిరచితరుచిర
భ్రమద్భ్రువోరంతరేణ సాంకర్షణో నామ రుద్ర ఏకాదశవ్యూహ
స్త్ర్యక్షస్త్రిశిఖం శూలముత్తంభయన్నుదతిష్ఠత్ ॥ 3

కాలేన - కాలముచే, ఇదమ్ - ఈ జగత్తును, ఉపసంజిహీర్షతః - ఉపసంహరించగోరే, యస్య - ఏ సంకర్షణుని, అమర్షవిరచితరుచిరభ్రమద్-భ్రువోః - కోపముచే ముడి వేయబడిన అందమగు తిరుగుచున్న కనుబొమలయొక్క, అంతరేణ - మధ్యనుండి, ఏకాదశవ్యూహః - పదకొండు రూపములు కలవాడు, త్రి-అక్షః - మూడు కన్నులు గలవాడు, సాంకర్షణః నామ - సాంకర్షణుడు అని ప్రసిద్ధి గాంచిన, రుద్రః - రుద్రుడు, త్రిశిఖమ్ - మూడు కొనలు గల, శూలమ్ - శూలమును, ఉత్తంభయన్ - పైకి ఎత్తి పట్టుకున్నవాడై, ఉదతిష్ఠత్ - ఆవిర్భవించెనో.

ప్రళయకాలమునందు ఈ జగత్తును ఉపసంహరించగోరే ఆ సంకర్షణుడు కోపముతో అందమగు కనుబొమలను విరిచి త్రిప్పగా, వాటి మధ్య నుండి ముక్కంటి రుద్రుడు ఆవిర్భవించెను. పదకొండు రూపములు గల ఆయనకు సాంకర్షణుడు (సంకర్షణునినుండి పుట్టినవాడు) అనే పేరు ప్రసిద్ధమయ్యెను. ఆయన త్రిశూలమును ఎత్తి పట్టుకొని యుండెను.

**యస్యాంఘ్రికమలయుగలారుణవిశదనఖమణిషండమండలే**
**ష్వహిపతయస్సహ సాత్వతర్షభైరేకాంతభక్తియోగేనావనమం**
**తస్స్వవదనాని పరిస్ఫురత్కుండలప్రభామండితగండస్థలాన్య**
**తిమనోహరాణి ప్రముదితమనసః ఖలు విలోకయంతి ॥ 4**

యస్య - ఏ సంకర్షణుని, అంఘ్రికమలయుగల-అరుణవిశదనఖ మణిషండమండలేషు - పాదపద్మముల జంటయొక్క ఎర్రని స్వచ్ఛమైన గోళ్లు అనే మణుల సమూహముయొక్క మండలములయందు, అహిప తయః - నాగరాజులు, సాత్వత-ఋషభైః సహ - గొప్ప భక్తులతో గూడి, ఏకాంతభక్తియోగేన - అనన్యమగు భక్తియోగముతో, అవనమంతః - వంగి నమస్కరించువారై, పరిస్ఫురత్-కుండలప్రభామండితగండస్థలాని - అధిక ముగా ప్రకాశించే కుండలముల కాంతిచే అలంకరించబడిన చెక్కిలి స్థాన ములు గల, అతిమనోహరాణి - మిక్కిలి సుందరమగు, స్వవదనాని - తమ ముఖములను, ప్రముదితమనసః - గొప్ప ఆనందమును పొందిన మన స్సులు గలవారై, విలోకయంతి ఖలు - చూచుచున్నారో గదా!

సంకర్షణుని పాదపద్మముల జంటయొక్క గుండ్రని ఎర్రని స్వచ్ఛ మైన గోళ్ల పంక్తి మణుల వరుసను పోలియుండును. భక్తవరేణ్యులతో బాటుగా నాగరాజులు కూడ అనన్యమగు భక్తియోగముతో తలలను వంచి సంకర్షణునకు నమస్కరించెదరు. ఆ సమయములో వారికి ఆ గుండ్రని గోళ్లయందు మిక్కిలి సుందరమగు తమ ముఖములు కనబడుచుండును. వారి చెక్కిళ్లకు అధికముగా ప్రకాశించే కుండలముల కాంతియే భూషణమ గుచుండును. ఆ విధముగా తమ ముఖములను చూచుకున్న వారి మన స్సులు ఆనందముతో నిండిపోవుచుండును.

**యస్యైవ హి నాగరాజకుమార్య ఆశిష ఆశాసానాశ్చార్వంగవ**
**లయవిలసితవిశదవిపులధవలసుభగరుచిరభుజరజతస్తంభేష్వ**
**గరుచందనకుంకుమపంకానులేపేనావలింపమానాస్తదభిమర్శ**
**నోన్మథితహృదయమకరధ్వజావేశరుచిరలలితస్మితాస్తద**

నురాగమదముదితమదవిఘూర్ణితారుణకరుణావలోకనయన
వదనారవిందం సవ్రీడం కిల విలోకయంతి ॥ 5

అశిషః - భోగములను, ఆశాసానాః - అకాంక్షించే, నాగరాజకుమార్యః - నాగరాజుల కుమార్తెలు, యస్య - ఏ సంకర్షణుని, చారు-అంగవలయవిలసితవిశదవిపులధవలసుభగరుచిరభుజరజతస్తంభేషు - అందమైన అవయవమండలమునందు విలసిల్లే స్వచ్ఛమైన విశాలమైన తెల్లని మనోహరములైన ప్రకాశించే భుజములనే వెండి స్తంభములయందు, అగరుచందనకుంకుమపంక-అనులేపేన - అగరు చందనము కుంకుమల ముద్ద అనే పైపూత ద్రవ్యముచే, అవలింపమానాః - పూయుచున్నవారై, తద్-అభిమర్శన-ఉన్మథితహృదయమకరధ్వజ-ఆవేశరుచిరలలితస్మితాః - ఆయన స్పర్శచే కల్లోలితము జేయబడిన హృదయమునందలి మన్మథుని ఆవేశముచే వెలిగిపోయే అందమైన చిరునవ్వులు గలవారై, తద్-అనురాగమదముదితమదవిఘూర్ణిత-అరుణకరుణ-అవలోకనయనవదన-అరవిందమ్ - ఆయనయొక్క అనురాగముచే మదించినట్టియు ఆనందముచే మత్తెక్కిన గిరగిర తిరిగే ఎర్రని దయతో గూడిన చూపులతో గూడిన కళ్ళు గల పద్మమువంటి ముఖమును, సవ్రీడమ్ - సిగ్గుతో కూడియున్న విధముగా, విలోకయంతి కిల - చూచుచుందురో గదా!

తమ కామనలు సఫలము కావాలనే ఆకాంక్షతో నాగరాజకన్యలు సంకర్షణుని వెండి స్తంభములవలె తెల్లనైన భుజములయందు, అగరు చందనము కుంకుమలతో చేసిన పైపూత ముద్దను పూయుచుందురు. స్వచ్ఛములు, మనోహరములు అగు ఆయన విశాలభుజములు అందమగు అవయవమండలమునందు విలసిల్లుచుండును. ఆ విధముగా పైపూత పూయునప్పుడు ఆయనను స్పృశించుటచే వారి హృదయములు కల్లోలితములై మన్మథావేశమును పొంది, వారి అందమగు చిరునవ్వులు మరింత మనోహరముగా నుండును. ఆ సంకర్షణుడు పద్మమువంటి ముఖమునందలి మదవిహ్వలములై గిరగిర తిరిగే ఎర్రని కన్నులతో అనురాగముతో, ఆనందముతో, దయతో నిండిన చూపులను వారిపై బరపగా, వారు సిగ్గుతో ఆయనను చూచుచుందురు.

స ఏవ భగవాననంతోఽనంతగుణార్ణవ ఆదిదేవ ఉపసంహృతా
మర్షరోషవేగో లోకానాం స్వస్తయ ఆస్తే ॥ 6

అనంతగుణ-అర్ణవః - అనంతములగు గుణములకు సముద్రమైన వాడు, ఆదిదేవః - జగత్కారణుడు ప్రకాశస్వరూపుడు, ఉపసంహృత-అమ ర్షరోషవేగః - ఉపసంహరించబడిన అసహనముయొక్క కోపముయొక్క వేగము గలవాడు అగు, సః - ఆ, భగవాన్ అనంతః ఏవ - అనంత భగవా నుడే, లోకానామ్ - లోకముల, స్వస్తయే - కల్యాణము కొరకు, ఆస్తే - ఉన్నాడు.

అనంతములగు గుణములకు నిధి, జగత్కారణుడు, ప్రకాశస్వరూ పుడు అగు ఆ అనంత భగవానుడు తన అసహనమును, కోపవేగమును ఉపసంహరించుకొని, లోకకల్యాణము కొరకై అచట నిలిచియున్నాడు.

ధ్యాయమానస్సురాసురోరగసిద్ధగంధర్వవిద్యాధరమునిగణైర
నవరతమదముదితవికృతవిహ్వలలోచనస్సులలితముఖరికాఽ
మృతేనాప్యాయమానస్స్వపార్షదవిబుధయూథపతీనపరిమ్లాన
రాగనవతులసికామోదమధ్వాసవేన మాద్యన్మధుకరవ్రాతమ
ధురగీతశ్రియం వైజయంతీం స్వాం వనమాలాం నీలవాసా
ఏకకుండలో హలకకుది కృతసుభగసుందరభుజో భగవాన్మా
హేంద్రో వారణేంద్ర ఇవ కాంచనీం కక్షాముదారలీలో బిభర్తి
॥ 7

సుర-అసుర-ఉరగసిద్ధగంధర్వవిద్యాధరమునిగణైః - దేవతలు అసురులు నాగులు సిద్ధులు గంధర్వులు విద్యాధరులు మునుల గణముల చే, ధ్యాయమానః - ధ్యానించబడుచున్నవాడు, అనవరతమదముదితవిక్ృ తవిహ్వలలోచనః - నిరంతరముగా మత్తుచే ఆనందించువాడు చంచల మైన స్వాధీనత తప్పిన కన్నులు గలవాడు, సులలితముఖరికా-అమృతేన - మిక్కిలి మధురమగు అమృతమువంటి మాటలతో, స్వపార్షదవిబుధ యూథపతీన్ - తన అనుచరులను దేవనాయకులను, ఆప్యాయమానః -

ఆనందింప జేయుచున్నవాడు, నీలవాసాః - నల్లని వస్త్రము గలవాడు, ఏక కుండలః - ఒకే కుండలము గలవాడు, హలకకుది - నాగలి పైభాగముపై, కృతసుభగసుందరభుజః - ఉంచబడిన సుకుమారమైన అందమైన భుజ ములు గలవాడు, ఉదారలీలః - భక్తుల కోరికలను తీర్చే లీలలు గలవాడు అగు, భగవాన్ - అనంత భగవానుడు, అపరిమ్లానరాగనవతులసికామోద మధు-ఆసవేన - వాడిపోని కాంతి గల తాజా తులసియొక్క సుగంధము గల మధురమైన తేనెతో, మాద్యత్-మధుకరవ్రాతమధురగీతశ్రియమ్ - మత్తెక్కిన తుమ్మెదల గుంపుల తియ్యని ఝుంకారముల శోభ కలిగినట్టి యు, వైజయంతీమ్ - వైజయంతి అనే (రంగురంగుల పుష్పములతో గ్రుచ్చిన), స్వామ్ - తనదైన, వనమాలామ్ - అడవి పువ్వుల మాలను, మాహేంద్రః - మహేంద్రునకు చెందిన, వారణ-ఇంద్రః - గొప్ప ఏనుగు, కాంచనీమ్ - బంగరు, కక్షాం ఇవ - గొలుసును వలె, బిభర్తి - ధరించును.

నిరంతరముగా మత్తుతో ఆనందిస్తూ, చంచలమై స్వాధీనత తప్పి ఉండే కన్నులు గల అనంత భగవానుని దేవతలు, రాక్షసులు, నాగులు, సిద్ధులు, గంధర్వులు, విద్యాధరులు, మహర్షుల గణములు ధ్యానము చేయుచుందురు. నల్లని వస్త్రమును, ఒకే కుండలమును దాల్చియుండే ఆయన మిక్కిలి మధురమగు అమృతమువంటి మాటలతో తన అనుచరు లను, దేవనాయకులను ఆనందింప జేయుచుండును. నాగలి పైభాగము నందు తన సుకుమారమైన అందమగు భుజమును ఉంచియున్న అనం తుడు వైజయంతి (రంగురంగుల పువ్వులతో గ్రుచ్చినది) అనే తన అడవి పువ్వుల మాలను, మహేంద్రుని గొప్ప ఏనుగు బంగరు గొలుసును వలె, ధరించియుండును. వాడిపోని తాజా తులసియొక్క సుగంధము గల ఆ మాల చుట్టూ తేనెను త్రాగి మత్తెక్కియున్న తుమ్మెదల గుంపులు ఝుంకా రము చేస్తూ తిరిగి, దాని శోభను ఇనుమడింప జేయుచుండును. ఆయన భక్తుల కోరికలను తీర్చుట కొరకై లీలలను ప్రకటించును.

యు ఏష ఏవమనుశ్రుతో ధ్యాయమానో ముముక్షూణామనాది కాలకర్మవాసనాగ్రథితమవిద్యామయం హృదయగ్రంథిం సత్త్వరజస్తమోమయమంతర్హృదయం గత ఆశు నిర్భినత్తి

**తస్యానుభావాన్ భగవాన్ స్వాయంభువో నారదస్సహ**
**తుంబురుణా సభాయాం బ్రహ్మణస్సంశ్లోకయామాస ॥ 8**

ఏవమ్ - ఈ విధముగా, అనుశ్రుతః - శ్రవణము చేయబడినవాడు, ధ్యాయమానః - ధ్యానించబడువాడు అగు, యః - ఏ అనంతుడు గలడో, ఏషః - ఈయన, ముముక్షూణామ్ - మోక్షమును గోరు సాధకుల, అంతః-హృదయమ్ - హృదయము లోపల, గతః - ప్రవేశించినవాడై, అనాది కాలకర్మవాసనాగ్రథితమ్ - అనాది కాలమునుండి వచ్చుచున్న కర్మవాసనలచే కూర్చబడినది, అవిద్యామయమ్ - అజ్ఞానరూపమైనది, సత్త్వరజస్తమోమయమ్ - సత్త్వరజస్తమోగుణముల వికారము అగు, హృదయగ్రంథిమ్ - హృదయములోని ముడిని, ఆశు - శీఘ్రముగా, నిర్భినత్తి - తొలగించును, తస్య - ఆయనయొక్క, అనుభావాన్ - ప్రభావములను, భగవాన్ - పూజనీయుడు, స్వాయంభువః - స్వయంభువుడగు బ్రహ్మగారి పుత్రుడు అగు, నారదః - నారదుడు, తుంబురుణా సహ - తుంబురునితో గూడి, బ్రహ్మణః - బ్రహ్మగారి, సభాయామ్ - సభయందు, సంశ్లోకయామాస - చక్కగా కీర్తించెను.

మోక్షమును కోరు సాధకులు అనంత భగవానుని గురించి శ్రవణము చేసి, ఆయనను ధ్యానించినచో, ఆయన వారి హృదయము లోపల సాక్షాత్కరించి, అజ్ఞానరూపములోనుండే హృదయపు ముడిని శీఘ్రముగా నిర్మూలించును. సత్త్వరజస్తమోగుణముల వికారమగు ఈ అజ్ఞానము అనాది కాలమునుండి వచ్చుచున్న కర్మవాసనలచే కూర్చబడి యున్నది. ఒకసారి పూజనీయుడు, బ్రహ్మపుత్రుడు అగు నారదుడు తుంబురునితో కలిసి, అనంతభగవాముని ప్రభావములను బ్రహ్మగారి సభలో గొప్పగా కీర్తించెను.

**ఉత్పత్తిస్థితిలయహేతవోఽస్య కల్పాః**
**సత్త్వాద్యాః ప్రకృతిగుణా యదీక్షయాఽఽసన్ ।**
**యద్రూపం ధ్రువమకృతం యదేకమాత్మన్**
**నానాధాత్కథము హ వేద తస్య వర్త్మ ॥ 9**

అస్య - ఈ జగత్తుయొక్క, ఉత్పత్తిస్థితిలయహేతవః - సృష్టిస్థితి లయములకు కారణములైన, సత్త్వ-ఆద్యాః - సత్త్వము మొదలగు, ప్రకృతి గుణాః - ప్రకృతియొక్క గుణములు, యద్-ఈక్షయా - ఎవని సంకల్పము చే, కల్పాః - సమర్థములు, ఆసన్ - అయినవో, యద్-రూపమ్ - ఎవని స్వరూపము, ధ్రువమ్ - అనంతమో, అకృతమ్ - అనాదియో, యత్ - ఏ, ఏకమ్ - అద్వయతత్త్వము, ఆత్మన్ - తనయందు, నానా - బహునామ రూపములతో గూడిన ప్రపంచమును, అధాత్ - ధరించెనో, తస్య - అట్టి పరబ్రహ్మయొక్క, వర్త్మ - మార్గము (స్వరూపము) ను, కథం ఉ హ - ఏ విధముగా, వేద - తెలుసుకొనును?

మాయాశక్తియొక్క సత్త్వరజస్తమోగుణములు పరబ్రహ్మ సంకల్పము చేతనే ఈ జగత్తును సృష్టించి పాలించి ఉపసంహరించుటలో సమర్థములగుచున్నవి. అనాది, అనంతము, అద్వయము అగు ఆ పరబ్రహ్మ తనయందు అనేక నామరూపములతో గూడిన ప్రపంచమును ధరించియున్నాడు. అట్టి పరబ్రహ్మను పొందే మార్గమును, తత్త్వమును ఎవ్వాడు తెలియగల్గును?

మూర్తిం నః పురుకృపయా బభార సత్త్వం
సంశుద్ధం సదసదిదం విభాతి యత్ర ।
యల్లీలాం మృగపతిరాదదేఽనవద్యా-
మాదాతుం స్వజనమనాంస్యుదారవీర్యః ॥ 10

నః - మాకు, పురుకృపయా - గొప్ప దయతో, సత్త్వమ్ - సత్త్వ గుణాత్మకమైనట్టియు, సంశుద్ధమ్ - విశుద్ధమైన, మూర్తిమ్ - రూపమును, బభార - దాల్చెనో, యత్ర - ఎవనియందు, సద్-అసత్ - కార్యకారణరూపమగు, ఇదమ్ - ఈ జగత్తు, విభాతి - ప్రకాశించుచున్నదో, స్వజనమనాంసి - తన వారి మనస్సులను, ఆదాతుమ్ - వశము చేసుకొనుటకు, అనవద్యామ్ - పవిత్రమగు, యత్-లీలామ్ - ఎవని లీలను, ఉదారవీర్యః - గొప్ప పరాక్రమము గల, మృగపతిః - సింహము, ఆదదే - స్వీకరించెనో.

అనంత భగవానుడు మాయందలి గొప్ప దయతో సత్త్వగుణప్రధానమగు విశుద్ధ (రజస్తమోమిశ్రణము లేని) రూపమును దాల్చినాడు. ఈ కార్యకారణాత్మకమగు జగత్తు ఆయనయందే భాసించుచున్నది. తనవారి మనస్సులను వశము చేసుకొనుటకై ఆయన నెరపిన పవిత్రమగు లీలను, గొప్ప పరాక్రమము గల సింహము నేర్చుకొనెను.

యన్నామ శ్రుతమనుకీర్తయేదకస్మా-
దార్తో వా యది పతితః ప్రలంభనాద్వా ।
హంత్యంహస్సపది నృణామశేషమన్యం
కం శేషాద్భగవత ఆశ్రయేన్ముముక్షుః ॥ 11

యత్-నామ - ఏ అనంతుని పేరు, శ్రుతమ్ - వినబడునో, అకస్మాత్ - అకస్మాత్తుగా గాని, ఆర్తః వా - ఆపదలోనున్నవాడు గాని, ప్రలంభనాత్ వా - పరిహాసము వలన గాని, పతితః - పతితుడు, యది అనుకీర్తయేత్ - కీర్తించుచో, సపది - వెంటనే, నృణామ్ - మానవులకు, అశేషమ్ - సంపూర్ణమైన, అంహః - పాపమును, హంతి - పోగొట్టునో, ముముక్షుః - మోక్షమును గోరువాడు, భగవతః శేషాత్ - అనంత భగవానుని కంటె, అన్యమ్ - మరియొకనిని, కమ్ - ఎవనిని, ఆశ్రయేత్ - ఆశ్రయించును?

అకస్మాత్తుగా గాని, పరిహాసమునకు గాని, కష్టములో నున్నవాడు గాని, పతితుడే గాని, ఆ అనంత భగవానుని నామమును విని కీర్తించిననూ, ఆ నామము వెంటనే అట్టి మానవుని సకలపాపములను నశింప జేయును. మోక్షమును కోరే సాధకుడు అనంత భగవానుని తప్ప, మరియొకనిని ఎవనిని ఆశ్రయించును?

మూర్ధన్యర్పితమణువత్సహస్రమూర్ధ్నో
భూగోలం సగిరిసరిత్సముద్రసత్త్వమ్ ।
ఆనంత్యాదనిమితవిక్రమస్య భూమ్నః
కో వీర్యాణ్యధిగణయేత్సహస్రజిహ్వః ॥ 12

సహస్రమూర్ధ్నః - వేయి తలలు గలిగినట్టియు, అనంత్యాత్ - అనంతుడగుట వలన, అనిమితవిక్రమస్య - హద్దులు లేని పరాక్రమము గలిగినట్టియు, భూమ్నః - సర్వవ్యాపకుడైన శేషునియొక్క, మూర్ధని - తలపై, సగిరిసరిత్-సముద్రసత్త్వమ్ - పర్వతములు నదులు సముద్ర ములు ప్రాణులతో గూడియున్న, భూగోలమ్ - భూమండలము, అణువత్ - కణము వలె, అర్పితమ్ - ఉంచబడినది, సహస్రజిహ్వః - వేయి నాలు కలు గల, కః - ఎవడు, వీర్యాణి - పరాక్రమములను, అధిగణయేత్ - అధి కముగా లెక్కించును?

వేయి తలలు గల శేషుడు అనంతుడగుటచే ఆయన పరాక్రమము లకు సీమలు లేవు. పర్వతములు, నదులు, సముద్రములు, ప్రాణులతో కూడియున్న భూమండలము సర్వవ్యాపకుడగు ఆ శేషుని తలపై ఒక కణ మువలె నిలిచియున్నది. అట్టి ఆ శేషుని పరాక్రమములను వేయి నాలుకలు ఉన్ననూ, ఎవడు అధికముగా లెక్కించగల్గును?

ఏవంప్రభావో భగవాననంతో
దురంతవీర్యోరుగుణానుభావః ।
మూలే రసాయాః స్థిత ఆత్మతంత్రో
యో లీలయా క్ష్మాం స్థితయే బిభర్తి ॥ 13

ఏవంప్రభావః - ఇట్టి మహిమ గలవాడు, దురంతవీర్య-ఉరుగుణ -అనుభావః - అనంతమగు బలము అనేకములగు గుణములు మరియు శక్తి గలవాడు, ఆత్మతంత్రః - స్వతంత్రుడు అగు, యః - ఏ, భగవాన్ అనంతః - అనంత భగవానుడు, రసాయాః - భూమికి, మూలే - మూల మునందు, స్థితః - ఉన్నవాడై, లీలయా - లీలగా, క్ష్మామ్ - భూమిని, స్థితయే - రక్షణ కొరకు, బిభర్తి - మోయుచున్నాడో.

ఇట్టి మహిమ గలవాడు, అనంతబలశాలి, అనేకములగు దయాది గుణములు గలవాడు, శక్తిశాలి, స్వతంత్రుడు అగు అనంత భగవానుడు భూమికి మూలములోనున్నవాడై భూమిని అవలీలగా మోస్తూ రక్షించుచు న్నాడు.

ఏతా హ్యేవేహ నృభిరుపగంతవ్యా గతయో యథాకర్మవిని
ర్మితా యథోపదేశమనువర్ణితాః కామాన్ కామయమానైః॥14

ఇహ - ఈ లోకమునందు, కామాన్ - భోగ్యములను, కామయ మానైః - కోరుచుండే, నృభిః - మానవులచే, ఉపగంతవ్యాః - పొందదగి నవి, యథాకర్మవినిర్మితాః - కర్మలను అతిక్రమించకుండగా వేర్వేరుగా నిర్మించబడిన, గతయః - గతులు, ఏతాః హి ఏవ - ఇవి మాత్రమే, యథా -ఉపదేశమ్ - గురువు ఉపదేశము నతిక్రమించకుండగా, అనువర్ణితాః - శాస్త్రానుసారముగా వర్ణించబడినవి.

భోగ్యములను కోరుతూ ఉండే మానవులు మరణానంతరము పొందే లోకములు ఇవి మాత్రమే. ఇవి ఆయా జీవులకు తమ తమ కర్మలన తిక్రమించకుండగా లభించును. నేను వీటిని గురువు ఉపదేశమునతిక్రమిం చకుండగా శాస్త్రమునను సరించి వర్ణించితిని.

ఏతావతీర్హి రాజన్ పుంసః ప్రవృత్తిలక్షణస్య ధర్మస్య విపాకగ
తయ ఉచ్చావచా విసదృశా యథాప్రశ్నం వ్యాచఖ్యే కిమన్య
త్కథయామ ఇతి ॥ 15

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే
సంకర్షణదేవ స్తుతివర్ణనం నామ పంచవింశోఽధ్యాయః ॥

రాజన్ - ఓ రాజా!, పుంసః - మానవునకు, ఉచ్చావచాః - గొప్ప తక్కువ అయినవి, విసదృశాః - పోలిక లేనివి, ప్రవృత్తిలక్షణస్య - కర్మలనా చరించుట అనే రూపములోనుండే, ధర్మస్య - ధర్మముయొక్క, విపాకగ తయః - ఫలరూపములైన లోకములు, ఏతావతీః హి - ఇవి మాత్రమే, యథాప్రశ్నమ్ - ప్రశ్నకు తగ్గట్లుగా, వ్యాచఖ్యే - వివరించి చెప్పితిని, అన్యత్ - మరియొకదానిని, కిమ్ - దేనిని, కథయామః - చెప్పెదము?, ఇతి - అని.

ఓ పరీక్షిన్మహారాజా! మానవులు కర్మలనాచరించుట అనే రూప ములోనుండే ధర్మమునాచరించి, ఆ కర్మల ఫలరూపముగా పొందే లోక

ములు ఇవి మాత్రమే. వీటిలో కొన్ని గొప్పవి, మరికొన్ని తక్కువ స్థాయికి చెందినవి. వీటిలో ఒకదానితో మరియొకదానికి పోలిక లేదు. నేనీ వివరములను నీ ప్రశ్నకు తగ్గట్టుగా చెప్పితిని. ఇంకనూ నేనేమి చెప్పవలెను? అని శుకమహర్షి పలికెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో
సంకర్షణదేవుని స్తోత్రమును వర్ణించే ఇరువది ఐదవ
అధ్యాయము ముగిసినది (25).

*****

# అథ షడ్వింశోఽధ్యాయః

## నరకయాతనలను వర్ణించుట

రాజోవాచ ।

మహర్ష ఏతద్వైచిత్ర్యం లోకస్య కథమితి ॥ 1

మహర్షే - ఓ మహర్షీ!, లోకస్య - జీవలోకమునకు, ఏతత్ - ఈ, వైచిత్ర్యమ్ - వివిధత్వము, కథమ్ - ఎట్లు?, ఇతి - అని.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- ఓ శుక మహర్షీ! జీవలోకములో ఇంతటి వివిధత్వమునకు కారణమేమి?

ఋషిరువాచ ।

త్రిగుణత్వాత్కర్తుశ్శ్రద్ధయా కర్మగతయః పృథగ్విధాస్సర్వా
ఏవ సర్వస్య తారతమ్యేన భవంతి ॥ 2

కర్తుః - కర్త, త్రిగుణత్వాత్ - మూడు గుణములు కలవాడగుట వలన, శ్రద్ధయా - శ్రద్ధచే, పృథగ్-విధాః - వేర్వేరు ప్రకారముల, సర్వాః - అన్ని, కర్మగతయః - కర్మల ఫలములు, సర్వస్య - ప్రతివానికి, తారతమ్యేన - తరతమభావముతో, భవంతి - కలుగుచున్నవి.

శుక మహర్షి ఇట్లు పలికెను -- కర్త సాత్త్వికుడు, రాజసుడు, తామసుడు అని మూడు విధములుగా నున్నాడు. శ్రద్ధ కూడ అటులనే గుణములను బట్టి మూడు విధములుగా నున్నది. కావుననే, జీవలోకమునకంతకూ వేర్వేరు కర్మగతులు అన్నీ గొప్ప తక్కువ భేదములతో కలుగుచున్నవి.

అథేదానీం ప్రతిషిద్ధలక్షణస్యాధర్మస్య తథైవ కర్తుశ్శ్రద్ధయా
వైసాదృశ్యాత్కర్మఫలం విసదృశం భవతి యా హ్యనాద్యవి

ద్యయా కృతకామానాం తత్పరిణామలక్షణాస్సృతయస్సహ
స్రశః ప్రవృత్తాస్తాసాం ప్రాచుర్యేణానువర్ణయిష్యామః ॥ 3

అథ - తరువాత, తథా ఏవ - అదే విధముగా, ప్రతిషిద్ధలక్షణస్య - నిషేధరూపమైన, అధర్మస్య - అధర్మముయొక్క, కర్తుః - కర్తయొక్క, శ్రద్ధాయాః - శ్రద్ధయొక్క, వైసాదృశ్యాత్ - అసమానత వలన, కర్మఫలమ్ - ఆ కర్మల ఫలము, విసదృశమ్ - అసమానము, భవతి - అగుచున్నది, అనాది-అవిద్యయా - అనాదియగు అజ్ఞానముచే, కృతకామానామ్ - చేయబడిన కామనలకు, తత్-పరిణామలక్షణాః - ఆ అధర్మముయొక్క పరిపాకమే లక్షణముగా గల, సృతయః - నరకములు, సహస్రశః - వేలాదిగా, ప్రవృత్తాః - ప్రవర్తిల్లి యున్నవి, ఇదానీమ్ - ఇప్పుడు, తాసామ్ - వాటిలో, ప్రాచుర్యేణ - విస్తారముగా, అనువర్ణయిష్యామః - గురూపదేశమున నుసరించి వర్ణించగలము.

తరువాత, అదే విధముగా కర్త నిషేధరూపమైన అధర్మమును చేసే శ్రద్ధలోని అసమానతలను బట్టి, అట్టి కర్మల ఫలములు కూడ అసమానముగా నుండును. అనాదినుండి వచ్చుచున్న అజ్ఞానముచే కోరికలు పుట్టి, వ్యక్తులు వాటి కారణముగా అధర్మమును చేయుదురు. ఆ అధర్మము పండి సంప్రాప్తమయ్యే నరకములు వేలాదిగా నున్నవి. ఇప్పుడు వాటి వివరములను గురూపదేశానుసారముగా వర్ణించెదను.

రాజోవాచ ।
నరకా నామ భగవన్ కిం దేశవిశేషా అథవా బహిస్త్రిలోక్యా
ఆహోస్విదంతరాల ఇతి ॥ 4

భగవన్ - పూజనీయా!, నరకాః నామ - నరకములనగా, దేశవిశేషాః కిమ్ - ప్రత్యేకమగు స్థానములా?, అథవా - అట్లు గాక, త్రిలోక్యాః - ముల్లోకములకు, బహిః - బయటనా?, ఆహోస్విత్ - లేక, అంతరాలే - మధ్యయందా?, ఇతి - అని.

పరీక్షిన్మహారాజు ఇట్లు ప్రశ్నించెను --- పూజనీయుడవగు ఓ మహర్షీ! నరకములనగా ఈ లోకములో ఉండే ప్రత్యేక స్థానములా? లేక, అవి ముల్లోకములకు బయటనుండునా? లేక, మధ్యలో నుండునా?

ఋషిరువాచ ।
అంతరాల ఏవ త్రిజగత్యాస్తు దిశి దక్షిణస్యామధస్తాద్భూమేరుపరిష్టాచ్చ జలాద్యస్యామగ్నిష్వాత్తాదయః పితృగణా దిశి స్వానాం గోత్రాణాం పరమేణ సమాధినా సత్యా ఏవాశిష ఆశాసానా నివసంతి ॥ 5

త్రిజగత్యాః తు - ముల్లోకములకైతే, అంతరాలే ఏవ - మధ్యలోనే, దక్షిణస్యాం దిశి - దక్షిణ దిక్కునందు, భూమేః - భూమికి, అధస్తాత్ - క్రింద, జలాత్ - నీటికంటె, ఉపరిష్టాత్ చ - పైన కూడ, యస్యామ్ - ఏ, దిశి - దిక్కునందు, అగ్నిష్వాత్త-ఆదయః - అగ్నిష్వాత్తులు మొదలగు, పితృగణాః - పితృదేవతల గణములు, పరమేణ - గొప్ప, సమాధినా - ఈశ్వరధ్యానముచే, స్వానామ్ - తమ, గోత్రాణామ్ - గోత్రము వారల, ఆశిషః - కామనలను, సత్యాః ఏవ - యథార్థములుగనే, ఆశాసానాః - చేయుచున్నవారై, నివసంతి - నివసించెదరు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- నరకములు ముల్లోకముల మధ్యలోనే దక్షిణదిక్కునందు భూమికి క్రింద బ్రహ్మాండజలములకు పైన ఉండును. అగ్నిష్వాత్తులు మొదలగు పితృదేవతల గణములు కూడ ఆ దక్షిణదిక్కునందే నివసించెదరు. వారు తీవ్రముగా ఈశ్వరుని ధ్యానిస్తూ, తమ గోత్రము వారల కామనలు పరిపూర్ణములగునట్లు చేయుదురు.

యత్ర హ వావ భగవాన్ పితృరాజో వైవస్వతస్స్వవిషయం ప్రాపితేషు స్వపురుషైర్జంతుషు సంపరేతేషు యథాకర్మావద్యం దోషమేవానుల్లంఘితభగవచ్ఛాసనస్సగణో దమం ధారయతి ॥ 6

యత్ర హ - ఎక్కడనైతే, పితృరాజః - పితృదేవతలకు ప్రభువు, భగవాన్ - పూజనీయుడు, అనుల్లంఘితభగవత్-శాసనః - ఉల్లంఘించబడని భగవానుని ఆదేశము గలవాడు, వైవస్వతః - సూర్యుని పుత్రుడు అగు యముడు, సంపరేతేషు - మరణించినట్టియు, స్వపురుషైః - తన కింకరులచే, స్వవిషయమ్ - తన సామ్రాజ్యమును, ప్రాపితేషు - పొందించబడిన, జంతుషు - జీవులయందు, యథాకర్మ-అవద్యమ్ - కర్మ వలని పాపమును అతిక్రమించకుండగా, సగణః - సేవకులతో గూడి, దోషం ఏవ - దుఃఖమునే, దమమ్ - శిక్షను, ధారయతి - వేయుచున్నాడో.

అక్కడ పితృదేవతలకు ప్రభువు, పూజనీయుడు అగు యముడు తన అనుచరులతో గూడి భగవానుని శాసనమును ఖచ్చితముగా పాలించుచుండును. మరణించిన ప్రాణులను ఆయన కింకరులు ఆయన సామ్రాజ్యములోనికి ప్రవేశపెట్టెదరు. అపుడు ఆయన వారికి వారు చేసిన కర్మల వలన కలిగిన పాపమునకు అనురూపముగా, వారికి దుఃఖరూపమగు ఫలమును శిక్ష వేయుచుండును.

తత్ర హైకే నరకానేకవింశతిం గణయంతి । అథ తాంస్తే రాజన్నామరూపలక్షణతోఽనుక్రమిష్యామస్తామిస్రోఽంధతామిస్రో రౌరవో మహారౌరవః కుంభీపాకః కాలసూత్రమసిపత్రవనం సూకరముఖమంధకూపః కృమిభోజనస్సందంశస్తప్తసూర్మిర్వజ్రకంటకశాల్మలీ వైతరణీ పూయోదః ప్రాణరోధో విశసనం లాలాభక్షస్సారమేయాదనమవీచిరయఃపానమితి । కిం చ క్షారకర్దమో రక్షోగణభోజనశ్శూలప్రోతో దందశూకోఽవటనిరోధనః పర్యావర్తనస్సూచీముఖమిత్యష్టావింశతిర్నరకా వివిధయాతనాభూమయః ॥ 7

తత్ర హ - ఆ యమలోకమునందు, ఏకవిశంతిమ్ - ఇరవై ఒక్క, నరకాన్ - నరకములను, ఏకే - కొందరు, గణయంతి - లెక్కించుచున్నారు, రాజన్ - ఓ రాజా!, తే - నీ కొరకు, తాన్ - వాటిని, నామరూపలక్షణతః - పేరు రూపము లక్షణములను బట్టి, అనుక్రమిష్యామః - వరుసగా

వర్ణించెదము, తామిస్రః - తామిస్రము, అంధతామిస్రః - అంధతామిస్రము, రౌరవః - రౌరవము, మహారౌరవః - మహారౌరవము, కుంభీపాకః - కుంభీ పాకము, కాలసూత్రమ్ - కాలసూత్రము, అసిపత్రవనమ్ - అసిపత్రవన ము, సూకరముఖమ్ - సూకరముఖము, అంధకూపః - అంధకూపము, కృమిభోజనః - కృమిభోజనము, సందంశః - సందంశము, తప్తసూర్మిః - తప్తసూర్మి, వజ్రకంటకశాల్మలీ - వజ్రకంటకశాల్మలి, వైతరణీ - వైతరణి, పూయోదః - పూయోదము, ప్రాణరోధః - ప్రాణరోధము, విశసనమ్ - విశ సనము, లాలాభక్షః - లాలాభక్షము, సారమేయాదనమ్ - సారమేయాదన ము, అవీచిః - అవీచి, అయఃపానమ్ - అయఃపానము, ఇతి - అని, కిం చ - ఇంతే గాక, క్షారకర్దమః - క్షారకర్దమము, రక్షోగణభోజనః - రక్షోగణభోజ నము, శూలప్రోతః - శూలప్రోతము, దందశూకః - దందశూకము, అవటని రోధనః - అవటనిరోధనము, పర్యావర్తనః - పర్యావర్తనము, సూచీముఖమ్ - సూచీముఖము, ఇతి - అని, అష్టావింశతిః - ఇరవై ఎనిమిది, నరకాః - నరకములు, వివిధయాతనాభూమయః - అనేక విధములైన యాతనలు గల స్థానములు.

ఆ యమలోకములో ఇరవై ఒక్క నరకములను కొందరు లెక్కించు చున్నారు. ఓ పరీక్షిన్మహారాజా! వాటి పేర్లను, రూపములను, లక్షణము లను నేను వరుసగా వివరించెదను. తామిస్రము, అంధతామిస్రము, రౌరవ ము, మహారౌరవము, కుంభీపాకము, కాలసూత్రము, అసిపత్రవనము, సూకరముఖము, అంధకూపము, కృమిభోజనము, సందంశము, తప్తసూ ర్మి, వజ్రకంటకశాల్మలి, వైతరణి, పూయోదము, ప్రాణరోధము, విశసన ము, లాలాభక్షము, సారమేయాదనము, అవీచి, అయఃపానము అనునవి ఇరవై ఒకటి. ఇంతేగాక క్షారకర్దమము, రక్షోగణభోజనము, శూలప్రోతము, దందశూకము, అవటనిరోధనము, పర్యావర్తనము, సూచీముఖము అనే ఏడింటితో కలిపి, ఇరవై ఎనిమిది నరకములు. ఈ స్థానములయందు అనేక ములగు యాతనలు ఉండును.

తత్ర యస్తు పరవిత్తాపత్యకలత్రాణ్యపహరతి స హి కాలపాశ బద్ధో యమపురుషైరతిభయానకైస్తామిస్రే నరకే బలాన్నిపా

త్యతే । అనశనానుదపానదండతాడనసంతర్జనాదిభిర్యాతనాభి
ర్యాత్యమానో జంతుర్యత్ర కశ్మలమాసాదిత ఏకదైవ మూర్ఛా
ముపయాతి తామిస్రప్రాయే ॥ 8

యః తు - ఎవడైతే, పరవిత్త-అపత్యకళత్రాణి - ఇతరుల సొమ్ము సంతానము భార్యలను, అపహరతి - అపహరించునో, సః - వాడు, హి - నిశ్చయముగా, అతిభయానకైః - మిక్కిలి భయమును గొల్పే, యమపురుషైః - యముని కింకరులచే, కాలపాశబద్ధః - కాలము అనే త్రాటిచే కట్టబడినవాడై, తత్ర - ఆ, తామిస్రే - తామిస్రమనే, నరకే - నరకమునందు, బలాత్ - బలాత్కారముగా, నిపాత్యతే - పారవేయబడును, తామిస్రప్రాయే - చీకటితో నిండియుండే, యత్ర - ఎక్కడనైతే, జంతుః - జీవుడు, అనశన-అనుదపానదండతాడనసంతర్జన-ఆదిభిః - తిండి లేకుండుట త్రాగే నీరు లేకుండుట కర్రలతో కొట్టుట గట్టిగా భయపెట్టుట మొదలగువాటిచే, యాత్యమానః - పీడించబడుచున్నవాడై, కశ్మలమ్ - మహాదుఃఖమును, ఆసాదితః - పొందించబడినవాడై, ఏకదా ఏవ - వెంటనే, మూర్ఛామ్ - మూర్ఛను, ఉపయాతి - పొందునో.

ఇతరుల సొమ్మును, సంతానమును, భార్యను అపహరించిన వ్యక్తిని మిక్కిలి భయమును గొల్పే యమకింకరులు కాలపాశముతో కట్టివేసి ఆ తామిస్రము అనే నరకములో బలముగా పారవైచెదరు. చీకటితో నిండియుండే ఆ నరకమునందు జీవునకు తిండి, నీరు దొరకదు. కింకరులు వానిని కర్రలతో కొట్టి భయపెట్టి ఈ విధముగా హింసలను పెట్టెదరు. అపుడాతడు మహాదుఃఖమును, వెంటవెంటనే మూర్ఛను పొందుచుండును.

ఏవమేవాంధతామిస్రే యస్తు వంచయిత్వా పురుషం దారాదీ
నుపయుంక్తే యత్ర శరీరీ నిపాత్యమానో యాతనాస్థో వేద
నయా నష్టమతిర్నష్టదృష్టిశ్చ భవతి యథా వనస్పతిర్వృశ్చ్య
మానమూలస్తస్మాదంధతామిస్రం తముపదిశంతి ॥ 9

ఏవం ఏవ - ఇదే విధముగా, యః తు - ఎవడైతే, పురుషమ్ - వ్యక్తిని, వంచయిత్వా - మోసగించి, దార-ఆదీన్ - భార్య మొదలగువాటి

ని, ఉపయుంక్తే - సేవించునో, శరీరీ - ఆ దేహధారి, యత్ర - ఏ, అంధతా మిస్రే - అంధతామిస్రమునందు, నిపాత్యమానః - పారవేయబడినవాడై, వృశ్చ్యమానమూలః - నరుకబడుచున్న మొదలు గల, వనస్పతిః యథా - చెట్టువలె, యాతనాస్థః - పీడయందున్నవాడై, వేదనయా - పీడచే, నష్ట మతిః - నశించిన బుద్ధి గలవాడై, నష్టదృష్టిః చ - నశించిన చూపు కూడ గలవాడై, భవతి - అగును, తస్మాత్ - అందువలన, తమ్ - దానిని, అంధ తామిస్రమ్ - అంధతామిస్రమని, ఉపదిశంతి - వ్యవహరించుచున్నారు.

ఇదే విధముగా, ఇతరుని మోసగించి వాని భార్యను ఇతరసంపద లను అనుభవించిన వ్యక్తి అంధతామిస్రములో పారవేయబడును. దేహధా రియగు జీవుడు అచట మొదలు నరుకబడుచున్న చెట్టు వలె యాతనలన నుభవిస్తూ, ఆ పీడచే బుద్ధిశక్తిని మాత్రమే గాక, చూపును కూడ కోల్పోవు ను. కావుననే, ఆ నరకమునకు అంధతామిస్రము అనే పేరు వచ్చినది.

యస్త్విహ వా ఏతదహమితి మమేదమితి భూతద్రోహేణ కేవ
లం స్వకుటుంబమేవానుదినం ప్రపుష్ణాతి స తదిహ విహాయ
స్వయమేవ తదశుభేన రౌరవే నిపతతి ॥ 10

యః తు - ఎవడైతే, ఇహ - ఈ లోకమునందు, ఏతత్ వై - ఈ దేహమే, అహమ్ - నేను, ఇతి - అని, ఇదమ్ - ఇది, మమ - నాది, ఇతి - అని, భూతద్రోహేణ - ప్రాణులకు ద్రోహముచే, కేవలమ్ - కేవలము, స్వకుటుంబం ఏవ - తన కుటుంబమును మాత్రమే, అనుదినమ్ - ప్రతిదిన ము, ప్రపుష్ణాతి - బాగా పోషించుకొనునో, సః - అతడు, తత్ - ఆ దేహ మును, ఇహ - ఈ లోకమునందు, విహాయ - విడిచిపెట్టి, స్వయం ఏవ - తనంత తానే, తద్-అశుభేన - ఆ పాపముచే, రౌరవే - రౌరవమునందు, నిపతతి - పడిపోవును.

ఈ లోకములో ఈ దేహమే నేను అనే అభిమానముతో, మరియు దేహమునకు సంబంధించినవాటియందు ఇది నాది అనే అభిమానముతో, కేవలము తన కుటుంబమును మాత్రమే చక్కగా పోషించుకొనుట కొరకై ఇతరప్రాణులకు ద్రోహమును చేసే వ్యక్తి ఆ దేహమును కుటుంబమును

ఇచటనే విడిచిపెట్టి, ఆ పాపము వలన రౌరవనరకమునందు తనంత తానుగా పడిపోవును.

**యే త్విహ యథైవాముా విహింసితా జంతవః పరత్ర యమ యాతనాముపగతం త ఏవ రురవో భూత్వా తథా తమేవ విహింసంతి తస్మాద్రౌరవమిత్యాహూ రురురితి సర్పాదతిక్రూరసత్త్వస్యాపదేశః ॥ 11**

యే - ఏ, జంతవః తు - ప్రాణులైతే, అమునా - వీనిచే, యథా ఏవ - ఏ విధముగనైతే, విహింసితాః - అధికముగా హింసించబడినవో, పరత్ర - పరలోకమునందు, యమయాతనామ్ - యముని పీడను, ఉపగతమ్ - పొందియున్న, తం ఏవ - వానినే, తే ఏవ - అవియే, రురవః - రురు అనే జంతువులుగా, భూత్వా - పుట్టి, తథా - అదే విధముగా, విహింసంతి - అధికముగా హింసించును, తస్మాత్ - అందువలన, రౌరవమ్ - రౌరవము, ఇతి - అని, ఆహుః - పిలిచెదరు, రురుః - రురువు, ఇతి - అని, సర్పాత్ - పాముకంటె, అతిక్రూరసత్త్వస్య - మిక్కిలి క్రూరమైన ప్రాణియొక్క, అపదేశః - పేరు.

ఈ వ్యక్తి ఏ ప్రాణులను ఏ విధముగనైతే అధికముగా హింసించినాడో, అవే ప్రాణులు పరలోకమునందు వీడు యముని యాతనలను పొందే సందర్భములో రురు అనే జంతువులుగా పుట్టి, వీనిని అదే విధముగా అధికముగా హింసించును. కావుననే, ఆ నరకమునకు రౌరవము అని పేరు వచ్చినది. రురు అనగా పాముకంటె మిక్కిలి క్రూరమైన జంతువునకు పేరు.

**ఏవమేవ మహారౌరవో యత్ర నిపతితం పురుషం క్రవ్యాదా నామ రురవస్తం క్రవ్యేణ ఘాతయంతి యః కేవలం దేహంభరః ॥ 12**

మహారౌరవః - మహారౌరవము, ఏవం ఏవ - ఇదే విధముగ నుండును, యత్ర - దేనియందు, నిపతితమ్ - పడిన, పురుషమ్ - వ్యక్తిని, క్రవ్యాదాః - మాంసమును తినే, రురవః నామ - రురువులు అని ప్రసిద్ధి గాంచిన జంతువులు, క్రవ్యేణ - మాంసము నిమిత్తముగా, ఘాతయంతి -

చంపును, యః - ఎవడైతే, కేవలమ్ - కేవలము, దేహంభరః - తన పొట్టను తాను పోసుకొనునో.

మహారౌరవము కూడ ఇదే విధముగా నుండును. ఎవడైతే కేవలము తన పొట్టను తాను పోసుకొనునో, అట్టి వ్యక్తి దానియందు పడును. అచట పచ్చి మాంసమును తినే రురువులు అని ప్రసిద్ధి గాంచిన జంతువులు మాంసము కొరకై వానిని చంపును.

యస్త్విహ వా ఉగ్రః పశూన్ పక్షిణో వా ప్రాణత ఉపరంధయతి తమపకరుణం పురుషాదైరపి విగర్హితమముత్ర యమానుచరాః కుంభీపాకే తప్తతైలే ఉపరంధయంతి ॥ 13

యః తు - ఎవడైతే, ఇహ - ఈ లోకమునందు, వై - నిశ్చయముగా, ఉగ్రః - క్రూరుడై, పశూన్ - పశువులను గాని, పక్షిణః వా - పక్షులను గాని, ప్రాణతః - బ్రతికియుండగనే, ఉపరంధయతి - కాల్చునో, అపకరుణమ్ - తొలగిన కరుణ కలిగినట్టియు, పురుషాదైః అపి - రాక్షసులచే కూడ, విగర్హితమ్ - అధికముగా నిందించబడే, తమ్ - వానిని, అముత్ర - పరలోకమునందు, యమ-అనుచరాః - యమకింకరులు, కుంభీపాకే - కుంభీపాకమునందు, తప్తతైలే - మరిగే నూనెలో, ఉపరంధయంతి - వేయించెదరు.

ఈ లోకములో కొందరు క్రూరస్వభావులుగ నుందురు. వారిలో దయ లేశమైననూ ఉండదు. వారు పశువులను, పక్షులను బ్రతికియుండగనే కాల్చెదరు. అట్టివారిని రాక్షసులు కూడ అధికముగా నిందించెదరు. అట్టివారిని పరలోకములో యమకింకరులు కుంభీపాకములో మరిగే నూనెలో వేయించెదరు.

యస్త్విహ పితృవిప్రబ్రహ్మధ్రుక్ స కాలసూత్రసంజ్ఞకే నరకే అయుతయోజనపరిమండలే తామ్రమయే తప్తఖలే ఉపర్యధస్తాదగ్న్యర్కాభ్యామతితప్యమానేఽభినివేశితః క్షుత్పిపాసాభ్యాం చ దహ్యమానాంతర్బహిశ్శరీర ఆస్తే శేతే చేష్టతేఽవతిష్ఠతి పరిధావతి చ యావంతి పశురోమాణి తావద్వర్షసహస్రాణి ॥ 14

యః తు - ఎవడైతే, ఇహ - ఈ లోకమునందు, పితృవిప్రబ్రహ్మ ధ్రుక్ - తల్లిదండ్రులకు వేదవేత్తలకు వేదమునకు ద్రోహమును చేయువాడో, సః - ఆతడు, కాలసూత్రసంజ్ఞకే - కాలసూత్రము అనే పేరు గల, నరకే - నరకమునందు, అయుతయోజనపరిమండలే - వెయ్యి యోజనముల గుండ్రని మండలమునందు, తామ్రమయే - రాగితో తయారైనట్టియు, ఉపరి - పైన, అధస్తాత్ - క్రింద, అర్క-అగ్నిభ్యామ్ - సూర్యుడు అగ్నిచే, అతితప్యమానే - అధికముగా తపింప జేయబడుచున్న, తప్తఖలే - కాగి పోయే మైదానమునందు, అభినివేశితః - ప్రవేశపెట్టబడినవాడై, క్షుత్-పిపా సాభ్యాం చ - ఆకలి దప్పికలచే కూడ, దహ్యమాన-అంతః-బహిః-శరీరః - దహించి వేయబడుచున్న లోపలి బయట శరీరము గలవాడై, యావంతి - ఎన్ని, పశురోమాణి - పశువువంటి ఆ వ్యక్తికి రోమములు గలవో, తావద్-వ ర్షసహస్రాణి - అన్ని వేల సంవత్సరములు, ఆస్తే - ఉండును, శేతే - పరుండును, చేష్టతే - కదులుచుండును, అవతిష్ఠతి - నిలిచి యుండును, పరిధావతి చ - చుట్టూ పరుగెత్తును కూడ.

ఎవడైతే ఈ లోకములో తల్లిదండ్రులకు, వేదవేత్తలకు, వేదమునకు ద్రోహమును చేయునో, అట్టివాడు కాలసూత్రము అనే పేరు గల నరకము నందు పడును. అచట రాగితో చేసిన ఒక మైదానము గలదు. దాని చుట్టు కొలత పదివేల యోజనములు. దానిని పైనుండి సూర్యుడు, క్రిందనుండి అగ్ని అధికముగా తపింప జేయుచుండును. కాగిపోయే ఆ మైదానములో ఈతనిని ప్రవేశపెట్టెదరు. ఆ వేడికి ఆకలి దప్పికలు తోడై ఈతని శరీరము లోపల బయట కూడ దహించబడుచుండును. ఆ విధముగా నరపశువు అనదగిన ఆతని శరీరముపై ఎన్ని రోమములు గలవో, అన్ని వేల సంవత్స రములు ఆతడు ఆ మైదానములో ఉండును. ఆతడు అక్కడే పరుండి, అక్కడనే ఇటునటు తిరుగుతూ, ఒకప్పుడు నిలబడి, మరల చుట్టూ పరుగు లెత్తుతూ ఉండును.

యస్త్విహ వై నిజవేదపథాదనాపద్యపగతః పాఖండం చోపగత స్తమసిపత్రవనం ప్రవేశ్య కశయా ప్రహరంతి తత్ర హాసావిత స్తతో ధావమాన ఉభయతోధారైస్తాలవనాసిపత్రైశ్ఛిద్యమానస

ర్వాంగో హా హతో஽స్మీతి పరమయా వేదనయా మూర్ఛితః
పదే పదే నిపతతి స్వధర్మహా పాఖండానుగతం ఫలం భుంక్తే
॥ 15

యః తు - ఎవడైతే, ఇహ - ఈ లోకమునందు, వై - నిశ్చయముగా, స్వవేదపథాత్ - తన వేదోక్తమగు మార్గమునుండి, అనాపది - ఆపద లేని స్థితియందు, అపగతః - తొలగిపోయినవాడై, పాఖండమ్ - వేదవిరుద్ధమగు మతమును, ఉపగతః చ - స్వీకరించినవాడో, తమ్ - వానిని, అసిపత్రవనమ్ - అసిపత్రవనమును, ప్రవేశ్య - ప్రవేశపెట్టి, కశయా - కొరడాతో, ప్రహరంతి - కొట్టెదరు, తత్ర హ - అచట, అసౌ - ఈతడు, ఇతః తతః - ఇటునటు, ధావమానః - పరుగెత్తుచున్నవాడై, ఉభయతః-ధారైః - రెండు వైపులా పదును గల, తాలవన-అసిపత్రైః - తాడిచెట్ల అడవిలోని కత్తుల వంటి ఆకులచే, ఛిద్యమానసర్వ-అంగః - కోసివేయబడుచున్న అన్ని అవయవములు గలవాడై, హా - అయ్యో!, హతః - చంపబడినవాడను, అస్మి - అగుచున్నాను, ఇతి - అని, పరమయా - అత్యధికమగు, వేదనయా - పీడచే, మూర్ఛితః - మూర్ఛను పొందినవాడై, పదే పదే - ప్రతి అడుగునందు, నిపతతి - క్రింద పడుచుండును, స్వధర్మహా - తన ధర్మమును విడిచిపెట్టిన ఆతడు, పాఖండ-అనుగతమ్ - వేదవిరుద్ధమగు మతమును స్వీకరించుటచే సంప్రాప్తమైన, ఫలమ్ - ఫలమును, భుంక్తే - అనుభవించును.

ఎవడైతే ఈ లోకములో స్వధర్మమైన వేదమార్గమును ఆపద లేని స్థితిలో కూడ విడిచిపెట్టి, వేదవిరుద్ధమగు మతమును స్వీకరించునో, అట్టి వానిని అసిపత్రవనములో ప్రవేశపెట్టి కొరడాతో కొట్టెదరు. అచట ఈతడు ఇటునటు పరుగులెత్తునపుడు, తాడిచెట్ల అడవిలో రెండు వైపులా పదును ఉండే కత్తులవంటి తాటి ఆకులు అతని శరీరములోని అవయవములనన్నింటినీ కోసివేయుచుండును. అయ్యో! చచ్చిపోవుచున్నాను అంటూ ఆతడు అత్యధికమగు పీడచే మూర్ఛను పొందును. ఆతడు ప్రతి అడుగునందు క్రింద పడిపోతూ, తన ధర్మమును విడిచిపెట్టి వేదవిరుద్ధమగు మతమును స్వీకరించినందు వలన వచ్చిన ఫలమును అనుభవించును.

యస్త్విహ వై రాజా రాజపురుషో వా అదండ్యే దండం ప్రణ
యతి బ్రాహ్మణే వా శరీరదండం స పాపీయాన్నరకేఽముత్ర
సూకరముఖే నిపతతి తత్రాతిబలైర్వినిష్పిష్యమాణావయవో
యథైవేహేక్షుఖండ ఆర్తస్వరేణ స్వనయన్ క్వచిన్మూర్ఛితః
కశ్మలముపగతో యథైవేహాదృష్టదోషా ఉపరుద్ధాః ॥ 16

ఇహ - ఈ లోకమునందు, యః తు - ఏ, రాజా - రాజు గాని, రాజపురుషః వా - రాజుయొక్క అధికారి గాని, అదండ్యే - శిక్షింపకూడని వానియందు, దండమ్ - శిక్షను, ప్రణయతి - వేయునో, వా - లేదా, బ్రాహ్మణే - వేదవేత్తయందు, శరీరదండమ్ - శరీరమునకు పీడను కలి గించే శిక్షను వేయునో, సః - అట్టి, పాపీయాన్ - మహాపాపి, అముత్ర - పరలోకమునందు, సూకరముఖే - సూకరముఖమనే, నరకే - నరకమునం దు, వై - నిశ్చయముగా, నిపతతి - పడిపోవును, తత్ర - అచట, అతిబలైః - అధికమగు బలముగల కింకరులచే, ఇహ - ఈ లోకములో, ఇక్షుఖండః - చెరుకు ముక్క వలె, నిష్పిష్యమాణ-అవయవః - పిప్పి చేయబడుచున్న అవయవములు గలవాడై, ఆర్తస్వరేణ - పీడతో నిండిన ధ్వనితో, స్వన యన్ - ఏడ్చుచున్నవాడై, క్వచిత్ - ఒకప్పుడు, మూర్ఛితః - మూర్ఛను పొందినవాడై, కశ్మలమ్ - అధికమగు దుఃఖమును, ఉపగతః - పొందినవా డు, యథా ఏవ - ఏ విధముగానైతే, ఇహ - ఈ లోకములో, అదృష్టదోషాః - కనబడని దోషములు గలవారు, ఉపరుద్ధాః - పీడించబడినారో.

రాజు గాని, రాజుయొక్క అధికారి గాని ఎవడైతే ఈ లోకములో నిర్దోషికి శిక్షను వేయునో, లేదా వేదవేత్తకు శరీరపీడను కలిగించే శిక్షను వేయునో, అట్టి మహాపాపి మరణించి సూకరముఖము అనే నరకములో నిశ్చయముగా పడును. అచట మహాబలశాలురగు యమకింకరులు వాని అవయవములను, ఈ లోకములో చెరకు గడను చేసిన విధముగా, పిప్పి చేసెదరు. అపుడాతడు అయ్యో! అయ్యో! అని ఏడుస్తూ, ఒకప్పుడు మూర్ఛను పొందును. ఈ లోకములో నిర్దోషులను ఆతడు పీడించిన విధ ముగనే, అతనికి అచట యమకింకరులు మహాదుఃఖమును కలిగించెదరు.

యస్త్విహ వై భూతానామీశ్వరోపకల్పితవృత్తీనామవివిక్తపరవ్య
థానాం స్వయం పురుషోపకల్పితవృత్తిర్వివిక్తపరవ్యథో వ్యథామాచ
రతి స పరత్రాంధకూపే తదభిద్రోహేణ నిపతతి తత్ర హాసౌ తైర్జం
తుభిః పశుమృగపక్షిసరీసృపైర్మశకయూకామత్కుణమక్షికాదిభిర్యే
కే చాభిద్రుగ్ధాస్తైస్సర్వతోఽభిద్రుహ్యమాణస్తమసి విహతనిద్రానిర్వృ
తిరలబ్ధావస్థానః పరిక్రామతి యథా కుశరీరే జీవః ॥ 17

ఇహ - ఈ లోకమునందు, పురుష-ఉపకల్పితవృత్తిః - ఇతర వ్యక్తులచే ఏర్పాటు చేయబడిన జీవిక గలవాడు, స్వయమ్ - స్వయముగా, వివిక్తపరవ్యథః - తెలియబడిన ఇతరుల పీడ గలవాడు అగు, యః తు - ఎవడైతే, ఈశ్వర-ఉపకల్పితవృత్తీనామ్ - ఈశ్వరునిచే ఏర్పాటు చేయబడిన జీవిక గలిగినట్టియు, అవివిక్తపరవ్యథానామ్ - తెలియబడని ఇతరుల పీడ గల, భూతానామ్ - ప్రాణులకు, వ్యథామ్ - పీడను, ఆచరతి - కలిగించునో, సః - అట్టివాడు, పరత్ర - పరలోకమునందు, తద్-అభిద్రోహేణ - వాటికి చేసిన ద్రోహముచే, అంధకూపే - అంధకూపమునందు, వై - నిశ్చయముగా, నిపతతి - పడిపోవును, తత్ర హ - అచట, అసౌ - ఈతడు, పశుమృగపక్షిసరీసృపైః - గ్రామ్యపశువులు అడవియందలి మృగములు పక్షులు ప్రాకే జంతువులచే, మశకయూకామత్కుణమక్షిక-ఆదిభిః - దోమలు పేలు నల్లులు ఈగలు మొదలగు, జంతుభిః - ప్రాణులచే, యే కేచ - ఏ ప్రాణులైతే, అభిద్రుగ్ధాః - ద్రోహము చేయబడినవో, తైః - వాటిచే, సర్వతః - అంతటా, అభిద్రుహ్యమాణః - పీడించబడుచున్నవాడై, తమసి - చీకటియందు, విహతనిద్రానిర్వృతిః - పాడు చేయబడిన నిద్రా సుఖము గలవాడై, అలబ్ధ-అవస్థానః - పొందబడని నిలకడ గలవాడై, కుశరీరే - చెడిపోయిన శరీరమునందు, జీవః యథా - జీవుడు వలె, పరిక్రామతి - ఇటునటు తిరుగును.

ఈ లోకములో మానవునకు ఇతర మానవులు బ్రదుకు దెరువును చూపెదరు. మానవునకు ఇతరప్రాణుల వ్యథ తెలియుచుండును. కాని, జంతువులకు బ్రదుకు దెరువును చూపేది దేముడే. పైగా, వాటికి ఇతరప్రాణుల వ్యథ తెలియదు. ఇట్టి స్థితిలో ఎవడైతే మానవుడై ఉండి, జంతువు

లకు పీడను కలిగించునో, వాడు మరణించిన పిదప వాటికి చేసిన ద్రోహము కారణముగా నిశ్చయముగా అంధకూపములో పడిపోవును. గ్రామ్యపశువులు, అడవిలో మృగములు, పక్షులు, ప్రాకే జంతువులు, దోమలు, పేలు, నల్లులు, ఈగలు మొదలగు ఏయే జంతువులకు అతడు పీడను కలిగించినాడో, ఆయా జంతువులు అచట వానికి అన్ని విధములుగా పీడను కలిగించును. ఆ చీకట్లో వానికి నిద్రాసుఖమైననూ లేకుండా అవి వానిని పీడించును. ఆరోగ్యము చెడిపోయిన దేహమునందు జీవుడు ఏ విధముగా తీసుకొనుచుండునో, ఆ తీరున ఆతడా నరకములో నిలకడ లేక తిరుగాడుచుండును.

యస్త్విహ వా అసంవిభజ్యాశ్నాతి యత్కించనోపనతమనిర్మి
తపంచయజ్ఞో వాయససంస్తుతస్స పరత్ర కృమిభోజనే నరకా
ధమే నిపతతి తత్ర శతసహస్రయోజనే కృమికుండే కృమిభూ
తస్స్వయం కృమిభిరేవ భక్ష్యమాణః కృమిభోజనో యావత్తద
ప్రత్తాప్రహుతాదోऽనిర్వేశమాత్మానం యాతయతే ।। 18

ఇహ - ఈ లోకమునందు, అనిర్మితపంచయజ్ఞః - చేయబడని అయిదు యజ్ఞములు గలవాడు, వాయససంస్తుతః - కాకితో సమానమైన వాడని వర్ణించబడినవాడు అగు, అప్రత్త-అహుత-అదః - ఇతరులకు పెట్టకుండా దేవతలకు హోమములో సమర్పించకుండా తినే, యః తు - ఎవడైతే, వై - నిశ్చయముగా, యత్ కించన - ఏదో ఒకటి, ఉపనతమ్ - లభించినదానిని, అసంవిభజ్య - ఇతరులకు పెట్టకుండా, అశ్నాతి - తినునో, సః - అట్టివాడు, పరత్ర - పరలోకమునందు, నరక-అధమే - మిక్కిలి చెడ్డ నరకమైన, కృమిభోజనే - కృమిభోజనమునందు, నిపతతి - పడిపోవును, తత్ర - అచట, శతసహస్రయోజనే - లక్ష యోజనముల, కృమికుండే - క్రిముల గుండమునందు, కృమిభూతః - క్రిమియై, స్వయమ్ - తాను, కృమిభిః ఏవ - క్రిముల చేతనే, భక్ష్యమాణః - తినబడుచున్నవాడై, కృమిభోజనః - క్రిములే ఆహారముగా గలవాడై, అనిర్వేశమ్ - ప్రాయశ్చిత్తము లేని, ఆత్మానమ్ - తనను, యాతయతే - హింసించుకొనును, తత్ - ఆ గుండము, యావత్ - ఎన్ని యోజనములో.

ఈ లోకములో కొందరు తమకు లభించిన కొద్దో గొప్పో ఆహార మును ఇతరులకు పెట్టకుండా తినెదరు. వారు ఏ నాడైననూ దానము గాని, హోమము గాని చేయరు. అయిదు మహాయజ్ఞములు (దేవతలకు హోమములో సమర్పించుట, మనుష్యులకు అన్నమునిచ్చుట, పశుపక్ష్యా దులకు ఆహారమునిచ్చుట, బ్రహ్మయజ్ఞము అనగా వేదమునధ్యయనము చేసి ఇతరులకు బోధించుట, పితృయజ్ఞము అనగా బ్రతికియున్న తల్లిదం డ్రులకు సేవను చేయుట మరియు వారు మరణించిన తరువాత శ్రాద్ధాదు లను చేయుట) వారికి దూరమే. ఈ దోషముల పరిహారము కొరకు వారు ప్రాయశ్చిత్తమునైననూ చేయలేదు. ఇట్టి వ్యక్తులు మరణించిన తరువాత నరకములలో మిక్కిలి చెడ్డదియగు కృమిభోజనమునందు పడిపోవుదురు. అది ఒక క్రిముల గుండము. దాని చుట్టు కొలత లక్షయోజనములు. దానిలో ఈతడు క్రిమియై ఇతరక్రిములచే భక్షింపబడుతూ, తాను కూడ ఇతరక్రిములను భక్షిస్తూ, ఈ విధముగా తన దుఃఖమును తానే కొని తెచ్చు కొని, లక్ష సంవత్సరములు యాతనల ననుభవించును.

యస్త్విహ వై స్తేయేన బలాద్వా హిరణ్యరత్నాదీని బ్రాహ్మణస్య వాపహరత్యన్యస్య వాఽనాపది పురుషస్తమముత్ర రాజన్ యమపు రుషా అయమయైరగ్నిపిండైస్సందంశైస్త్వచి నిష్కుషంతి ॥ 19

రాజన్ - ఓ రాజా!, యః -ఏ, పురుషః తు - వ్యక్తియైతే, ఇహ - ఈ లోకమునందు, స్తేయేన - దొంగతనముచే గాని, బలాత్ వా - బలా త్కారముగా గాని, బ్రాహ్మణస్య - వేదవేత్తయొక్క, అన్యస్య వా - లేదా మరియొకని, హిరణ్యరత్న-ఆదీని - బంగారము రత్నములు మొదలగువా టిని, అనాపది - ఆపద లేకున్ననూ, అపహరతి - అపహరించునో, తమ్ - వానిని, అముత్ర - పరలోకమునందు, యమపురుషాః - యమకింకరులు, అయమయైః - ఇనుముతో చేసిన, అగ్నిపిండైః - కాలే గుళ్లతో, సందంశైః - పట్టుకార్లతో, త్వచి - చర్మమునందు, వై - నిశ్చయముగా, నిష్కుషంతి - పీకి వేయుదురు.

ఓ పరీక్షిన్మహారాజా! ఏ వ్యక్తియైతే ప్రాణాంతకస్థితి కాకున్ననూ, వేదవేత్తకు గాని, లేదా మరియొకనికి గాని చెందిన బంగారము రత్నములు

మొదలగువాటిని అపహరించునో, లేదా బలాత్కారముగా లాగుకొనునో, వానిని మరణించిన తరువాత యమకింకరులు కాలే ఇనుప గుళ్లతో కొట్టి, పట్టుకార్లతో చర్మమును నిశ్చయముగా పీకి వేయుదురు.

యస్త్విహ వా అగమ్యాం స్త్రియమగమ్యం వా పురుషం యోషిదభిగచ్ఛతి తావముత్ర కశయా తాడయంతస్తిగ్మయా సూర్మ్యా లోహమయ్యా పురుషమాలింగయంతి స్త్రియం చ పురుషరూపయా సూర్మ్యా ॥ 20

ఇహ - ఈ లోకమునందు, యః తు - ఎవడైతే, అగమ్యామ్ - పొందకూడని, స్త్రియమ్ - స్త్రీని, వా - లేదా, యోషిత్ - స్త్రీ, అగమ్యమ్ - పొందకూడని, పురుషమ్ - పురుషుని, అభిగచ్ఛతి - పొందునో, తౌ - వారినిద్దరిని, అముత్ర - పరలోకమునందు, కశయా - కొరడాతో, వై - నిశ్చయముగా, తాడయంతః - కొట్టుచున్నవారై, తిగ్మయా - కాలే, లోహమయ్యా - లోహముతో చేసిన, సూర్మ్యా - ప్రతిమతో, పురుషమ్ - పురుషుని, స్త్రియం చ - స్త్రీని కూడ, పురుషరూపయా - మగవాని ఆకారములోనున్న, సూర్మ్యా - ప్రతిమతో, ఆలింగయంతి - కౌగిలింప జేసెదరు.

ఈ లోకములో పురుషుడు గాని, స్త్రీ గాని వ్యభిచరించినచో, వారు మరణించిన పిదప తప్తసూర్మి అనే నరకములో పడెదరు. అచట యమకింకరులు వారిని కొరడాలతో కొడుతూ, పురుషుడు స్త్రీరూపములో నుండే కాలే లోహప్రతిమను, స్త్రీ పురుషప్రతిమను గట్టిగా కౌగిలించుకొనునట్లు చేసెదరు.

యస్త్విహ వై సర్వాభిగమస్తమముత్ర నిరయే వర్తమానం వజ్రకంటకశాల్మలీమారోప్య నిష్కర్షంతి ॥ 21

యః తు - ఎవడైతే, ఇహ - ఈ లోకమునందు, సర్వ-అభిగమః - సేవించకూడని సర్వమును సేవించునో, అముత్ర - పరలోకమైన, నిరయే - నరకమునందు, వర్తమానమ్ - ఉన్న, తమ్ - వానిని, వజ్రకంటకశాల్మలీమ్ - వజ్రపు ముళ్లు ఉండే బూరుగు చెట్టును, ఆరోప్య - ఎక్కించి, వై - నిశ్చయముగా, నిష్కర్షంతి - క్రిందకు లాగెదరు.

ఎవడైతే ఈ లోకములో సేవించకూడని సర్వమును సేవించునో, వాడు మరణించిన తరువాత నిశ్చయముగా నరకమును పొందును. అచట యమకింకరులు వానిని వజ్రపు ముళ్లు ఉండే బూరుగు చెట్టునెక్కించి, క్రిందకు లాగుచుందురు.

యే త్విహ వై రాజన్యా రాజపురుషా వా అపాఖండా ధర్మసేతూన్ భిందంతి తే సంపరేత్య వైతరణ్యాం నిపతంతి భిన్నమర్యాదా స్తస్యాం నిరయపరిఖాభూతాయాం నద్యాం యాదోగణైరితస్తతో భక్ష్యమాణా ఆత్మనా న వియుజ్యమానాశ్చాసుభిరుహ్యమానా స్స్వాఘేన కర్మపాకమనుస్మరంతో విణ్మూత్రపూయశోణితకేశనఖాస్థిమేదోమాంసవసావాహిన్యాముపతప్యంతే ॥ 22

ఇహ -ఈ లోకమునందు, యే - ఏ, అపాఖండాః - వేదవిరుద్ధ మగు మతమునకు చెందని, రాజన్యాః - రాజులు గాని, రాజపురుషాః వా - రాజాధికారులు గాని, భిన్నమర్యాదాః - ఉల్లంఘించబడిన ధర్మమర్యాదలు గలవారై, ధర్మసేతూన్ - సమాజమును కలిపి ఉంచే ధర్మములను, భిందంతి - భేదమును కలిగించెదరో, తే - వారు, సంపరేత్య - మరణించి, వైతరణ్యామ్ - వైతరణియందు, వై - నిశ్చయముగా, నిపతంతి - పడిపోవుదురు, నిరయపరిఖాభూతాయామ్ - నరకమునకు అగడ్తయై యున్నట్టియు, విట్-మూత్రపూయశోణితకేశనఖ-అస్థిమేదః-మాంసవసావాహిన్యామ్ - మలమూత్రములు చీము రక్తము జుట్టు గోళ్లు ఎముకలు క్రొవ్వు మాంసము మజ్జల ప్రవాహమైన, తస్యామ్ - ఆ, నద్యామ్ - నదియందు, ఇతః-తతః - ఇటునటు, యాదోగణైః - జలజంతువుల గుంపులచే, భక్ష్యమాణాః - భక్షింపబడు చున్నవారై, స్వ-అఘేన - తమ పాపముచే, ఆత్మనా - యాతనాశరీరముచే, న వియుజ్యమానాః - వియోగమును పొందనివారై, అసుభిః - ప్రాణములచే, ఉహ్యమానాః - జీవింప జేయబడు చున్నవారై, కర్మపాకమ్ - కర్మల పరిపాకమును, అనుస్మరంతః - అన్నికాలములలో గుర్తు చేసుకొనుచున్నవారై, ఉపతప్యంతే - తాపమును పొందుచుందురు.

వేదవిరుద్ధమగు మతములకు చెందని రాజులు గాని, రాజాధికారులు గాని, ధర్మమర్యాదనుల్లంఘించి, సమాజమును కలిపి ఉంచే ధర్మములకు ముప్పు తెచ్చినచో, వారు మరణించి నిశ్చయముగా వైతరణీ నదియందు పడెదరు. మలమూత్రములు, చీము, రక్తము, జుట్టు, గోళ్ళు, ఎముకలు, క్రొవ్వు, మాంసము, మజ్జ ప్రవహించే ఆ నది నరకలోకమునకు అగడ్తయై ఉన్నది. వారిని జలజంతువులు అన్ని వైపులనుండియు తినివేయుచున్ననూ, వారు చేసిన పాపము కారణముగా వారికి యాతనా దేహముతో వియోగము కలుగదు. వారిని ప్రాణములు సజీవముగనే యుంచును. అపుడు తాము చేసిన కర్మల పరిపాకమునే ఎల్లవేళలా గుర్తు చేసుకుంటూ వారు తాపమును పొందెదరు.

యే త్విహ వై వృషలీపతయో నష్టశౌచాచారనియమాస్త్యక్త
లజ్జాః పశుచర్యాం చరంతి తే చాపి ప్రేత్య పూయవిణ్మూత్రశ్లే
ష్మమలాపూర్ణార్ణవే నిపతంతి తదేవాతిబీభత్సితమశ్నంతి ॥
23

ఇహ - ఈ లోకమునందు, యే తు - ఎవరైతే, వృషలీపతయః - చెడిపోయిన స్త్రీలకు పాలకులై, నష్టశౌచ-ఆచారనియమాః - నశించిన శౌచము సచ్ఛీలము నియమము గలవారై, త్యక్తలజ్జాః - విడువబడిన సిగ్గు గలవారై, పశుచర్యామ్ - పశువుయొక్క ప్రవర్తనను, చరంతి - ప్రవర్తించెదరో, తే చ అపి - వారు కూడ, ప్రేత్య - మరణించి, వై - నిశ్చయముగా, పూయవిట్-మూత్రశ్లేష్మమల-ఆపూర్ణ-అర్ణవే - చీము మలమూత్రములు శ్లేష్మము అనే మాలిన్యములతో నిండియున్న సముద్రమునందు, నిపతంతి - పడిపోవుదురు, అతిబీభత్సితమ్ - మిక్కిలి వెగటును కలిగించే, తత్ ఏవ - దానినే, అశ్నంతి - తినెదరు.

ఈ లోకములో చెడు స్త్రీలకు పాలకులై బాహ్య-ఆంతరశౌచములను, సచ్ఛీలమును, నియమములను గాలికి వదిలిపెట్టి, సిగ్గును విడిచి పశువుల వలె మెలగే వ్యక్తులు మరణించిన పిదప పూయోదమనే నరకములో చీము, మలమూత్రములు, శ్లేష్మము మరియు ఇతరమా

లిన్యములతో నిండియున్న సముద్రములో నిశ్చయముగా పడి, మిక్కిలి వెగటును కలిగించే ఆ పదార్థములనే భక్షించెదరు.

**యే త్విహ వై శ్వగర్దభపతయో బ్రాహ్మణాదయో మృగయావిహారా అతీర్థే చ మృగాన్నిఘ్నంతి తానపి సంపరేతాంల్లక్ష్యభూతాన్ యమపురుషా ఇషుభిర్విధ్యంతి ॥ 24**

ఇహ - ఈ లోకమునందు, బ్రాహ్మణ-ఆదయః - బ్రాహ్మణులు మొదలగువారు, యే తు - ఎవరైతే, శ్వగర్దభపతయః - కుక్కలు గాడిదలకు యజమానులై, మృగయావిహారాః - వేటయందు విహరించువారై, అతీర్థే చ - పశువధకు అనుజ్ఞ లేని సందర్భమునందు, మృగాన్ - పశువులను, నిఘ్నంతి - చంపెదరో, సంపరేతాన్ - మరణించినట్టియు, లక్ష్యభూతాన్ - లక్ష్యములుగా చేయబడిన, తాన్ అపి - వారిని కూడ, యమపురుషాః - యమకింకరులు, ఇషుభిః - బాణములచే, వై - గట్టిగా, విధ్యంతి - కొట్టెదరు.

ఈ లోకములో బ్రాహ్మణులు మొదలగు వారు ఎవరైతే కుక్కలను గాడిదలను పెంచి, వాటితో (పై) వేటకు విహారముగా వెళ్లి, మృగములను చంపుటకు అనుజ్ఞ లేని సందర్భములలో కూడ మృగములను చంపెదరో, వారు మరణించిన తరువాత ప్రాణరోధము అనే నరకములో పడెదరు. అచట యమకింకరులు వీరిని లక్ష్యములుగా చేసి, బాణములతో గట్టిగా కొట్టెదరు.

**యే త్విహ వై దాంభికా దంభయజ్ఞేషు పశూన్ విశసంతి తానముష్మింల్లోకే వైశసే నరకే పతితాన్నిరయపతయో యాతయిత్వా విశసంతి ॥ 25**

ఇహ - ఈ లోకమునందు, దాంభికాః - డాంబికము గల, యే తు - ఎవరైతే, దంభయజ్ఞేషు - డంబము కొరకైన యజ్ఞములయందు, పశూన్ - పశువులను, విశసంతి - బలి యిచ్చెదరో, అముష్మిన్ లోకే - పరలోకమునందు, వైశసే నరకే - విశసనమనే నరకమునందు, పతితాన్ - పడిన,

తాన్ - వారిని, నిరయపతయః - నరకములోని ప్రభువులు, వై - నిశ్చయముగా, యాతయిత్వా - యాతనలను పెట్టి, విశసంతి - చంపెదరు.

ఈ లోకములో ఏ డాంబికులు డంబము కొరకై చేసే యజ్ఞములలో పశువులను సంహరించెదరో, వారు మరణించిన పిదప పరలోకములో విశసనమనే నరకములో పడెదరు. అచటి ప్రభువులు వీరిని నిశ్చయముగా యాతనలను పెట్టి సంహరించెదరు.

**యస్త్విహ వై సవర్ణాం భార్యాం ద్విజో రేతః పాయయతి కామమోహితస్తం పాపకృతమముత్ర రేతఃకుల్యాయాం పాతయిత్వా రేతస్సంపాయయంతి ॥ 26**

ఇహ - ఈ లోకమునందు, యః -ఏ, ద్విజః తు - ద్విజుడైతే, కామమోహితః - కామముచే వ్యామోహితుడై, సవర్ణామ్ - సహధర్మచారిణియగు, భార్యామ్ - భార్యను, రేతః పాయయతి - పాశవిక సంభోగమునకు గురి చేయునో, పాపకృతమ్ - పాపమును చేసిన, తమ్ - వానిని, అముత్ర - పరలోకమునందు, రేతఃకుల్యాయామ్ - లాలాభక్షమనే నరకమునందు, వై - నిశ్చయముగా, పాతయిత్వా - పడవైచి, రేతః సంపాయయంతి - బీభత్సమగు పదార్థములను భక్షింప జేసెదరు.

ఈ లోకములో ఏ ద్విజడు కామముచే కన్నుమిన్ను గానక, సహధర్మచారిణియగు భార్యను పాశవిక సంభోగమునకు గురి చేయునో, అట్టి పాపి నిశ్చయముగా లాలాభక్షమనే నరకములో పడును. అచట యమకింకరులు వానిచే బీభత్సితమగు పదార్థములను భక్షింప జేసెదరు.

**యే త్విహ వై దస్యవోఽగ్నిదా గరదా గ్రామాన్ సార్థాన్ వా విలుంపంతి రాజానో రాజభటా వా తాంశ్చాపి హి పరేత్య యమదూతా వజ్రదంష్ట్రాశ్శ్వానస్సప్తశతాని వింశతిశ్చ సరభసం ఖాదంతి ॥ 27**

ఇహ - ఈ లోకమునందు, యే - ఏ, దస్యవః - బందిపోట్లు, అగ్నిదాః - నిప్పు పెట్టువారు, గరదాః - విషము పెట్టువారు, రాజానః -

రాజులు, రాజభటాః వా - రాజభటులు గాని, గ్రామాన్ - గ్రామములను, సార్థాన్ వా - వ్యాపారులను గాని, విలుంపంతి - దోచుకొనెదరో, పరేత్య - మరణించిన తరువాత, తాన్ చ అపి - వారిని కూడ, యమదూతాః - యమదూతలు, వజ్రదంష్ట్రాః - వజ్రములవంటి కోరలు గల, సప్తశతాని వింశతిః చ - ఏడు వందల ఇరవై, శ్వానః - కుక్కలై, సరభసమ్ - వేగముగా కోపముగా, వై - నిశ్చయముగా, ఖాదంతి - తినెదరు.

ఈ లోకములో గ్రామములను గాని, వ్యాపారులను గాని దోచుకునే బందిపోట్లు గాని రాజులు గాని రాజభటులు గాని, లేక నిప్పు పెట్టువారు గాని, మరియు విషమునిచ్చువారు గాని మరణించి, నిశ్చయముగా సారమేయాదనము అనే నరకములో పడెదరు. అచట ఏడు వందల ఇరవై మంది యమదూతలు వజ్రముల వంటి కోరలు గల కుక్కలుగా మారి, వారిని వేగముగా కోపముతో కరిచి తినెదరు.

> యస్త్విహ వా అనృతం వదతి సాక్ష్యే ద్రవ్యవినిమయే దానే వా కథంచిత్స వై ప్రేత్య నరకేఽవీచిమత్యధశ్శిరా నిరవకాశే యోజనశతోచ్ఛ్రాయాద్గిరిమూర్ధ్నస్సంపాత్యతే యత్ర జలమివ స్థలమశ్మపృష్ఠమవభాసతే తదవీచిమత్తిలశో విశీర్యమాణ శరీరో న మ్రియమాణః పునరారోపితో నిపతతి ॥ 28

ఇహ - ఈ లోకమునందు, యః తు - ఎవడైతే, సాక్ష్యే - సాక్ష్యమునందుగాని, ద్రవ్యవినిమయే - ధనమును ఇచ్చి పుచ్చుకొనుటయందు గాని, దానే వా - దానమునందు గాని, కథంచిత్ - ఏదో విధముగా, అనృతమ్ - అసత్యమును, వదతి వై - పలుకునో, సః వై - ఆతడు, ప్రేత్య - మరణించి, నిరవకాశే - ఆధారము లేని, అవీచిమతి - తరంగములు (నీరు) లేని, నరకే - నరకమునందు, అధః-శిరాః - క్రిందకు వ్రేలాడే తల గలవాడై, యోజనశత-ఉచ్ఛ్రాయాత్ - వంద యోజనముల ఎత్తు గల, గిరిమూర్ధ్నః - పర్వత శిఖరమునుండి, సంపాత్యతే - పడవేయబడును, యత్ర - ఎక్కడనైతే, అశ్మపృష్ఠమ్ - రాయి పైభాగమునందు గల, స్థలమ్ - నేల, జలం ఇవ - నీరు వలె, అవభాసతే - కనబడునో, తత్ - అది, అవీచిమత్ - అవీ

చిమత్ అనబడును, తిలశః - నుగ్గు నుగ్గుగా, విశీర్యమాణశరీరః - శిథిలము గుచున్న శరీరము గలవాడు, న మ్రియమాణః - మరణించువాడు కాడు, పునః - మరల, ఆరోపితః - ఎక్కించబడినవాడై, నిపతతి - పడుచుండును.

ఈ లోకములో ఎవడైతే సాక్ష్యమునందు గాని, ధనమును ఇచ్చి పుచ్చుకొనుటలో గాని, దానము విషయములో గాని, ఏదో విధముగా అసత్యమును పలుకునో, అట్టివాడు మరణించి పట్టుకొనుటకు ఆధారము లేని అవీచి అనే నరకములో పడును. అచట ఆతడు తల క్రిందకు వ్రేలాడుచుండగా, వంద యోజనముల ఎత్తు గల పర్వత శిఖరమునుండి క్రిందకు పడవేయబడును. క్రింద రాతి నేలయే అయినా, నీరు ఉన్నట్లుగా కనబడుచుండును. కావుననే, దానికి అవీచి (తరంగములు, అనగా నీరు లేనిది) అని పేరు వచ్చినది. ఆ విధముగా పడినప్పుడు ఆతని శరీరము నుగ్గు నుగ్గుగా శిథిలమగునే గాని, ఆతడు చావడు. అపుడాతనిని యమకింకరులు మరల పర్వత శిఖరముపైకి ఎక్కించి, మరల పడద్రోయుచుందురు.

యస్త్విహ వై విప్రో రాజన్యో వైశ్యో వా సోమపీథస్తత్కలత్రం వా సురాం వ్రతస్థోఽపి వా పిబతి ప్రమాదతస్తేషాం నిరయం నీతానామురసి పదాఽఽక్రమ్యాస్యే వహ్నినా ద్రవమాణం కార్‌ష్ణాయసం నిషించంతి ॥ 29

ఇహ - ఈ లోకమునందు, విప్రః - వేదవేత్త గాని, రాజన్యః - క్షత్రియుడు గాని, వైశ్యః వా - వైశ్యుడు గాని, సోమపీథః - సోమయాగము చేసినవాడు గాని, తత్-కలత్రం వా - వారి భార్య గాని, వ్రతస్థః అపి వా - వ్రతములోనున్నవాడు గాని, ప్రమాదతః - నిషేధమును పట్టించుకొనకపోవుట వలన, సురామ్ - సారాను, పిబతి - త్రాగునో, నిరయమ్ - నరకమును గురించి, నీతానామ్ - కొనిపోబడిన, తేషామ్ - వారియొక్క, ఉరసి - వక్షఃస్థలమునందు, పదా - కాలితో, వై - నిశ్చయముగా, ఆక్రమ్య - తొక్కి, ఆస్యే - నోటియందు, వహ్నినా - నిప్పుచే, ద్రవమాణమ్ - కరిగియున్న, కార్‌ష్ణాయసమ్ - లోహమును, నిషించంతి - చల్లెదరు.

వేదవేత్త, క్షత్రియుడు, వైశ్యుడు, సోమయాగము చేసినవాడు, వ్రతమునందున్నవాడు, వారి భార్యలు మద్యమును త్రాగరాదు. ఈ నిషేధ మును పట్టించుకోకుండా ఎవరైతే ఈ లోకములో మద్యమును త్రాగెదరో, వారిని యమదూతలు నరకమునకు గొనిపోవుదురు. అచట వారు వీరి గుండెలపై కాలితో గట్టిగా తొక్కిపెట్టి, నిప్పులలో కరగబెట్టిన లోహమును నోటిలో చల్లెదరు.

**అథ చ యస్త్విహ వా ఆత్మసంభావనేన స్వయమధమో జన్మ తపోవిద్యాచారవర్ణాశ్రమవతో వరీయసో న బహు మన్యేత స మృతక ఏవ మృత్వా క్షారకర్దమే నిరయేఽవాక్శిరా నిపాతితో దురంతా యాతనా హ్యశ్నుతే ॥ 30**

అథ చ - మరియు, ఇహ - ఈ లోకమునందు, వై - నిశ్చయము గా, స్వయమ్ - తాను, అధమః - అధముడైన, యః తు - ఎవడైతే, ఆత్మ సంభావనేన - తాను గొప్పవాడననే అభిమానముతో, జన్మతపః-విద్యా-ఆ చారవర్ణ-ఆశ్రమవతః - పుట్టుక తపస్సు విద్య సచ్ఛీలము వర్ణము ఆశ్ర మము గల, వరీయసః - గొప్పవారిని, న బహు మన్యేత - ఆదరించడో, సః - అట్టివాడు, మృతకః ఏవ - మరణించినవాడే, మృత్వా - మరణించి, క్షారకర్దమే - క్షారకర్దమము అనే, నిరయే - నరకమునందు, అవాక్-శిరాః - తల్లక్రిందులుగా తల గలవాడుగా, నిపాతితః - పారవేయబడినవాడై, దురంతాః - అంతము లేని, యాతనాః - యాతనలను, అశ్నుతే హి - అనుభవించును గదా!

మరియు ఈ లోకములో వ్యక్తి తాను అధముడే అయి ఉండి కూడా, తపస్సు విద్య సచ్ఛీలము వర్ణము ఆశ్రమము మొదలగువాటిలో తనకంటె గొప్పవారిని ఆదరించనిచో, అతడు జీవన్మృతుడే. అయిననూ, అతడు మరణించిన తరువాత క్షారకర్దమము (క్షారపు అనగా ఉప్పు కారముల బురద గలది) అనే నరకములో తల్లక్రిందులుగా పారవేయబడి, అంతము లేని యాతనలననుభవించును.

**యే త్విహ వై పురుషాః పురుషమేధేన యజంతే యాశ్చ స్త్రియో నృపశూన్ ఖాదంతి తాంశ్చ తే పశవ ఇవ నిహతా యమసదనే యాతయంతో రక్షోగణాస్సౌనికా ఇవ స్వధితినా ऽవదాయాసృక్ పిబంతి నృత్యంతి చ గాయంతి చ హృష్యమాణా యథేహ పురుషాదాః ।। 31**

ఇహ - ఈ లోకమునందు, యే వై - ఏ, పురుషాః - పురుషులు, పురుషమేధేన - వ్యక్తిని హింసించుటచే, యజంతే - పూజలను చేయుదురో, యాః - ఏ, స్త్రియః చ - స్త్రీలు కూడ, నృపశూన్ - బలి ఈయబడిన మనుష్యులను, ఖాదంతి - తినెదరో, తాన్ చ - ఆ పురుషులను స్త్రీలను కూడ, యమసదనే - యమలోకము (రక్షోగణభోజనము) నందు, ఇహ - ఈ లోకములో, నిహతాః - చంపబడిన, తే - ఆ, పశవః - ప్రాణులు, రక్షః-గణాః - రాక్షసుల గణములై, సౌనికాః ఇవ - కసాయీలవలె, యాతయంతః - పీడించుచున్నవారై, స్వధితినా - గండ్రగొడ్డలితో, అవదాయ - నరికి, ఇహ - ఈ లోకమునందలి, పురుషాదాః యథా - నరమాంస భక్షకులు వలె, అసృక్ - రక్తమును, పిబంతి - త్రాగెదరు, నృత్యంతి - నాట్యము చేసెదరు, హృష్యమాణాః - ఆనందించువారై, గాయంతి చ - పాటలను కూడ పాడెదరు.

ఈ లోకములో కొందరు వ్యక్తులు ఇతరులను హింసించి పూజలను చేయుదురు. కొందరు స్త్రీలు కూడ అట్టి పూజలలో మాంసమును భక్షించెదరు. వారందరు మరణించి రక్షోగణభోజనము అనే నరకములో పడెదరు. ఈ లోకములో వీరిచే హింసించబడిన ప్రాణులే అచట రాక్షసుల గణములుగా అయి, వీరిని యాతనలు పెట్టెదరు. వారు కసాయీల వలె గండ్ర గొడ్డలితో వీరిని నరికి, వీరి రక్తమును త్రాగుతూ, నరమాంస భక్షకులీ లోకములో చేసినట్లే నాట్యమును చేస్తూ, పాటలను పాడుతూ ఆనందించెదరు.

**యే త్విహ వా అనాగసోऽరణ్యే గ్రామే వా వైశ్రంభకైరుపసృతానుపవిశ్రంభయ్య జిజీవిషూన్ శూలసూత్రాదిషూపప్రోతాన్ క్రీడనక**

తయా యాతయంతి తేఽపి చ ప్రేత్య యమయాతనాసు శూలాదిషు ప్రోతాత్మానః క్షుత్తృడ్భ్యాం చాఽభిహతాః కంకవటాదిభిశ్చేతస్తతస్తిగ్మతుండైరాహన్యమానా ఆత్మశమలం స్మరంతి ॥ 32

యే తు - ఎవరైతే, ఇహ వై - ఈ లోకమునందు, అరణ్యే - అడవియందు గాని, గ్రామే వా - గ్రామమునందు గాని, జిజీవిషూన్ - జీవించగోరునట్టియు, అనాగసః - హింసనెరుగని ప్రాణులను, వైశ్రంభకైః - నమ్మింపజేసే ఉపాయములచే, ఉపవిశ్రంభయ్య - నమ్మకమును కలిగించి, ఉపసృతాన్ - దగ్గరకు వచ్చినవాటిని, శూలసూత్ర-ఆదిషు - శూలము త్రాడు మొదలగువాటియందు, ఉపప్రోతాన్ - గ్రుచ్చబడి బంధించబడినవాటిని, క్రీడనకతయా - ఆటవస్తువుగా, యాతయంతి - యాతన పెట్టెదరో, తే అపి చ - వారు కూడ, ప్రేత్య - మరణించి, యమయాతనాసు - యమయాతనల సందర్భమునందు, శూల-ఆదిషు - శూలము మొదలగువాటియందు, ప్రోత-ఆత్మానః - గ్రుచ్చబడిన శరీరములు గలవారై, క్షుత్-తృడ్భ్యామ్ - ఆకలి దప్పికలచే, అభిహతాః - పీడించబడినవారై, తిగ్మతుండైః - వాడి ముక్కులు గల, కంకవట-ఆదిభిః చ - రాబందులు గవ్వపక్షులు మొదలగువాటిచే, ఇతః-తతః - ఇటునటు, ఆహన్యమానాః - పొడవబడుచున్నవారై, ఆత్మశమలమ్ - తమ పాపమును, స్మరంతి - స్మరించెదరు.

ఈ లోకములో కొందరు అడవిలో గాని, గ్రామములో గాని హింసనెరుగని ప్రాణులకు వివిధోపాయములతో నమ్మకమును కలిగించి, అవి నమ్మకముతో దగ్గరకు రాగానే వాటిని శూలముతో గ్రుచ్చి, లేక త్రాటితో బంధించి, అవి ఆటవస్తువులా యన్నట్లు చేసి వాటిని యాతనలు పెట్టెదరు. బ్రతుకు తీపి వాటికి కూడ ఉండును గదా! అట్టివారు మరణించి శూలప్రోతము అనే నరకములో పడెదరు. అచట వారి దేహములను శూలముపై గ్రుచ్చి యుంచెదరు. ఆకలి దప్పికలతో పీడించబడే వారిని రాబందులు, గవ్వ పక్షులు మొదలగు పక్షులు తమ వాడి ముక్కులతో అన్ని వైపుల నుండియు పొడుచుచుండును. అపుడు వారికి తాము చేసిన పాపము గుర్తుకు వచ్చుచుండును.

**యే త్విహ వై భూతాన్యుద్వేజయంతి నరా ఉల్బణస్వభావా యథా దందశూకాస్తేఽపి ప్రేత్య నరకే దందశూకాఖ్యే నిప తంతి యత్ర నృప దందశూకాః పంచముఖాస్సప్తముఖా ఉప సృత్య గ్రసంతి యథా బిలేశయాన్ ||** 33

ఉల్బణస్వభావాః - క్రూరమగు స్వభావము గల, యే - ఏ, నరాః తు - మానవులైతే, ఇహ - ఈ లోకమునందు, భూతాని - ప్రాణులను, దందశూకాః యథా - త్రాచుపాములవలె, ఉద్వేజయంతి - పీడించెదరో, తే అపి - వారు కూడ, ప్రేత్య - మరణించి, వై - నిశ్చయముగా, దందశూ క-ఆఖ్యే - దందశూకము అనే పేరు గల, నరకే - నరకమునందు, నిప తంతి - పడిపోవుదురు, నృప - ఓ మహారాజా!, యత్ర - ఎక్కడనైతే, పంచముఖాః - అయిదు తలలు గలవి, సప్తముఖాః - ఏడు తలలు గలవి అగు, దందశూకాః - త్రాచుపాములు, ఉపసృత్య - సమీపించి, బిలేశ యాన్ యథా - ఎలుకలను వలె, గ్రసంతి - మ్రింగివేయునో.

ఓ పరీక్షిన్మహారాజా! క్రూరస్వభావము గల జనులు ఈ లోక ములో ప్రాణులను త్రాచుల వలె పీడించుచుందురు. అట్టివారు మరణించి, నిశ్చయముగా దందశూకము అనే నరకములో పడిపోయెదరు. అచట అయిదు, ఏడు తలలు గల త్రాచులు వారిని సమీపించి, ఎలుకలను వలె, మ్రింగివేయును.

**యే త్విహ వా అంధావటకుసూలగుహాదిషు భూతాని నిరుం ధంతి తథాఽముత్ర తేష్వేవోపవేశ్య సగరేణ వహ్నినా ధూమేన నిరుంధంతి ||** 34

యే తు - ఎవరైతే, ఇహ వై - ఈ లోకమునందు, అంధ-అవటకు సూలగుహా-ఆదిషు - చీకటితో గాలి సోకని గుయ్యారము ధాన్యపు గరిసె గుహలు మొదలగువాటియందు, భూతాని - ప్రాణులను, నిరుంధంతి - పారిపోవుటకు వీలు లేకుండా బంధించెదరో, అముత్ర - పరలోకమునందు, తథా - అదే విధముగా, తేషు ఏవ - వాటియందే, ఉపవేశ్య - కూర్చుండ

బెట్టి, సగరేణ - విషముతో గూడిన, వహ్నినా - మంటతో, ధూమేన - పొగతో, నిరుంధంతి - అడ్డగించెదరు.

ఎవరైతే ఈ లోకములో చీకటితో నిండి గాలి సోకని బొక్కలయందు, ధాన్యపు గరిసెలు పర్వతగుహలు మొదలగువాటియందు ప్రాణులను అడ్డగించి పీడించెదరో, అట్టివారు మరణించి అవటనిరోధనమనే నరకములో పడెదరు. అచట వారిని అదే విధముగా అట్టి బొక్కలు మొదలగువాటియందే కూర్చుండబెట్టి విషముతో గూడిన మంటను, పొగను పెట్టి, కదలకుండా అడ్డగించెదరు.

యస్త్విహ వా అతిథీనభ్యాగతాన్ వా గృహపతిరసకృదుపగత
మన్యుర్దిధక్షురివ పాపేన చక్షుషా నిరీక్షతే తస్య చాపి నిరయే
పాపదృష్టేరక్షిణీ వజ్రతుండా గృధ్రాః కంకకాకవటాదయః ప్రస
హ్యోరుబలాదుత్పాటయంతి ॥ 35

ఇహ వై - ఈ లోకమునందు, యః -ఏ, గృహపతిః తు - గృహయజమానియైతే, అతిథీన్ - అతిథులను గాని, అభ్యాగతాన్ వా - అభ్యాగతులను గాని, ఉపగతమన్యుః - పొందబడిన కోపము గలవాడై, అసకృత్ - పలుమార్లు, దిధక్షుః ఇవ - దహించ గోరుచున్నవాడు వలె, పాపేన - కుటిలమగు, చక్షుషా - చూపుతో, నిరీక్షతే - చూచునో, పాపదృష్టేః - పాపపు చూపు గల, తస్య చ అపి - వానికి కూడ, నిరయే - నరకమునందు, వజ్రతుండాః - వజ్రపు ముక్కులు గల, గృధ్రాః - గ్రద్దలు, కంకకాకవట-ఆదయః - రాబందులు కాకులు గవ్వ పక్షులు మొదలగునవి, ఉరుబలాత్ - అధికమగు బలము వలన, అక్షిణీ - కన్నులను, ప్రసహ్య - బలాత్కారముగా, ఉత్పాటయంతి - పెరికివేయును.

ఈ లోకములో ఏ గృహయజమాని ఇంటికి అతిథి (పూర్వ పరిచయము లేని వ్యక్తి) గాని, అభ్యాగతుడు (పూర్వపరిచయము ఉన్నవాడు) గాని వచ్చినప్పుడు, కోపమును పొంది, తగులబెట్ట గోరుచున్నాడా యన్నట్లు పలుమార్లు కుటిలదృష్టితో వారిని చూచునో, అట్టివాడు పర్యావర్తనమనే నరకములో పడును. పాపదృష్టి గల అట్టివాని కళ్లను వజ్రపు

ముక్కులు గల గద్దలు, రాబందులు, కాకులు, గవ్వలు మొదలగు అధిక మగు బలము గల పక్షులు బలాత్కారముగా పెరికి వేయును.

యస్త్విహ వా ఆఢ్యాభిమతిరహంకృతిస్తిర్యక్ప్రేక్షణస్సర్వతోఽభివిశంకీ అర్థవ్యయనాశచింతయా పరిశుష్యమాణహృదయవదనో నిర్వృతిమనవగతో గ్రహ ఇవార్థమభిరక్షతి స చాపి ప్రేత్య తదుత్పాదనోత్కర్షణసంరక్షణశమలగ్రహస్సూచీముఖే నరకే నిపతతి యత్ర హ విత్తగ్రహం పాపపురుషం ధర్మరాజపురుషా వాయకా ఇవ సర్వతోఽంగేషు సూత్రైః పరివయంతి ॥ 36

ఇహ - ఈ లోకమునందు, ఆఢ్య-అభిమతిః - ధనముచే గర్వించినవాడు, అహంకృతిః - నేను గొప్పవాడననే అభిమానము గలవాడు, తిర్యక్-ప్రేక్షణః - వక్రదృష్టి గలవాడు, సర్వతః - అందరియందు, అభివిశంకీ - శంక గలవాడు, అర్థవ్యయనాశచింతయా - ధనముయొక్క ఖర్చు మరియు నాశముల గురించిన చింతచే, పరిశుష్యమాణహృదయవదనః - ఎండిపోవుచున్న హృదయము ముఖము గలవాడు, నిర్వృతిమ్ - సుఖమును, అనవగతః - పొందనివాడు అగు, యః తు - ఎవడైతే, గ్రహః ఇవ - బ్రహ్మరాక్షసుడు వలె, అర్థమ్ - ధనమును, అభిరక్షతి - కాపలా కాయునో, సః చ అపి - ఆతడు కూడ, ప్రేత్య - మరణించి, తద్-ఉత్పాదన-ఉత్కర్షణ సంరక్షణశమలగ్రహః - ఆ ధనమును కూడబెట్టుటయందు పెంచుట యందు సంరక్షించుటయందు పాపమును ప్రోగుచేసుకున్నవాడై, వై - నిశ్చయముగా, సూచీముఖే - సూచీముఖమనే, నరకే - నరకమునందు, నిపతతి - పడిపోవును, యత్ర హ - ఎక్కడనైతే, విత్తగ్రహమ్ - ధనమునందు లోభియైనట్టియు, పాపమ్ - పాపిష్ఠుడైన, పురుషమ్ - వ్యక్తిని, ధర్మరాజపురుషాః - యమధర్మరాజుయొక్క కింకరులు, వాయకాః ఇవ - దర్జీలు వలె, సర్వతః - అంతటా, అంగేషు - అవయవములయందు, సూత్రైః - దారములతో, పరివయంతి - చుట్టూ కుట్టెదరు.

ఈ లోకములో కొందరు ధనముచే గర్వించి, తామే గొప్పవారమనే అభిమానము గలవారై, వక్రదృష్టితో అందరినీ చూస్తూ తమ ధనము

నపహరించెదరేమో యని శంకించెదరు. వారి హృదయము మరియు ముఖము తమ ధనము ఖర్చు అగునేమో యనియు, నశించిపోవునేమో యనియు చింతచే ఎండిపోయి ఉండును. సుఖమునెరుగని వీరు ధనమునకు బ్రహ్మరాక్షసులు వలె కాపలా కాస్తూ, ఆ ధనమును ప్రోగుచేయుటకు, ప్రోగు చేసినదానిని పెంచుటకు, దానిని సంరక్షించుటకు పాపములను ప్రోగు చేసుకొనెదరు. ఇట్టివారు మరణించి, నిశ్చయముగా సూచీముఖమనే నరకములో పడెదరు. అచట యమధర్మరాజుయొక్క కింకరులు వీరిని దర్జీలు వలె అన్ని అవయవములయందు సూదులతో దారములను చుట్టూ కుట్టివేయుచుందురు.

ఏవంవిధా నరకా యమాలయే సంతి శతశస్సహస్రశస్తేషు సర్వేషు చ సర్వ ఏవాధర్మవర్తినో యే కేచిదిహోదితా అనుదితాశ్చావనిపతే పర్యాయేణ విశంతి తథైవ ధర్మానువర్తిన ఇతరత్ర ఇహ తు పునర్భవే త ఉభయశేషాభ్యాం నివిశంతి ||37

అవనిపతే - మహారాజా!, ఏవంవిధాః - ఇటువంటి, నరకాః - నరకములు, యమ-ఆలయే - యమపురియందు, శతశః - వందలుగా, సహస్రశః - వేలుగా, సంతి - కలవు, తేషు - ఆ, సర్వేషు చ - అన్నిటియందు కూడ, సర్వే - అందరు, అధర్మవర్తినః ఏవ - అధర్మమును చేసినవారు మాత్రమే, కేచిత్ - కొందరు, ఇహ - ఇచట, ఉదితాః - చెప్పబడినవారు, అనుదితాః చ - చెప్పబడనివారు కూడ, పర్యాయేణ - కర్మల క్రమముచే, విశంతి - ప్రవేశించెదరు, తథా ఏవ - అదే విధముగా, ధర్మ-అనువర్తినః - ధర్మమును ఆచరించువారు, ఇతరత్ర - స్వర్గమునందు, ఇహ తు - ఈ లోకమునందైతే, పునః-భవే - మరు జన్మయందు, తే - వారు, ఉభయశేషాభ్యామ్ - పాపపుణ్యముల శేషభాగములచే, నివిశంతి - ప్రవేశించెదరు.

ఓ పరీక్షిన్మహారాజా! ఇటువంటి నరకములు యమపురిలో వందలు వేల సంఖ్యలో గలవు. వాటన్నింటిలో అధర్మమును చేసినవారు మాత్రమే కర్మల క్రమమును బట్టి ప్రవేశించెదరు. ఈ అధర్మమును చేసిన వారిలో కొందరిని నేను చెప్పితిని. నేను చెప్పని వారు కూడ గలరు. అదే విధముగా, ధర్మమునాచరించినవారు స్వర్గమును పొందెదరు. వీరందరు

క్రమముగా తమ పుణ్యపాపములను స్వర్గనరకములలో అనుభవించి, మిగిలిన పుణ్యపాపములతో ఈ భూలోకమునందు మరల జన్మించుటకై ప్రవేశించెదరు.

నివృత్తిలక్షణమార్గ ఆదావేవ వ్యాఖ్యాతః । ఏతావానేవాండ
కోశో యశ్చతుర్దశధా పురాణేషు వికల్పిత ఉపగీయతే యత్త
ద్భగవతో నారాయణస్య సాక్షాన్మహాపురుషస్య స్థవిష్ఠం రూప
మాత్మమాయాగుణమయమనువర్ణితమాదృతః పఠతి శృణోతి
శ్రావయతి స ఉపగేయం భగవతః పరమాత్మనోఽగ్రాహ్యమపి
శ్రద్ధాభక్తివిశుద్ధబుద్ధిర్వేద ॥ 38

నివృత్తిలక్షణమార్గః - నివృత్తి అనే మార్గము, ఆదౌ ఏవ - ముందుగనే, వ్యాఖ్యాతః - వివరించి చెప్పబడినది, అండకోశః - బ్రహ్మాండగర్భము, ఏతావాన్ ఏవ - ఇంత మాత్రమే, యః - ఏదైతే, పురాణేషు - పురాణములయందు, చతుర్దశధా - పదునాల్గు విధములుగా, వికల్పితః - రచించబడినదై, ఉపగీయతే - వర్ణించబడుచున్నదో, మహాపురుషస్య - పురుషోత్తముడగు, భగవతః నారాయణస్య - నారాయణ భగవానునియొక్క, యత్ - ఏ, సాక్షాత్ - సాక్షాత్తుగా, స్థవిష్ఠమ్ - స్థూలమైనట్టియు, ఆత్మమాయాగుణమయమ్ - తన మాయాశక్తియొక్క గుణముల వికారమైన, రూపమ్ - రూపము గలదో, తత్ - అది, అనువర్ణితమ్ - వర్ణించబడినది, ఆదృతః - ఆదరము గలవాడై, పఠతి - పఠించునో, శృణోతి - వినునో, శ్రావయతి - వినిపించునో, సః - ఆతడు, పరమ-ఆత్మనః - వ్యక్తికి అంతరతమమగు ఆత్మరూపుడై యున్న, భగవతః - భగవానుని, ఉపగేయమ్ - ఉపనిషత్తులయందు వర్ణించబడిన, అగ్రాహ్యం అపి - ఇంద్రియగోచరము కాని స్వరూపమును కూడ, శ్రద్ధాభక్తివిశుద్ధబుద్ధిః - శ్రద్ధాభక్తులచే పరిశుద్ధమైన అంతఃకరణము గలవాడై, వేద - తెలియును.

నివృత్తి అనే మార్గము ముందుగనే (రెండవ స్కంధములో) వర్ణించబడినది. ఈశ్వరుడు పదునాల్గు భువనములుగా బ్రహ్మాండమును రచించెనని పురాణములు వర్ణించుచున్నవి. అట్టి ఈ కోశమువంటి బ్రహ్మాండము

ఇంత మాత్రమే. ఈ బ్రహ్మాండము సాక్షాత్తుగా పురుషోత్తముడగు నారాయణ భగవానుని స్థూలరూపము. ఇది భగవానుని మాయాశక్తియొక్క మూడు గుణముల వికారము. ఈ స్థూలరూపమును వర్ణించడమైనది. భగవానుడు సకలప్రాణులలో అంతరతమమగు ఆత్మరూపుడై ఉన్నాడు. అట్టి భగవానుని ఇంద్రియగోచరము కాని స్వరూపమును ఉపనిషత్తులు వర్ణించుచున్నవి. ఈ స్థూలరూపముయొక్క వర్ణనను ఆదరముతో పఠించి, లేదా విని, ఇతరులకు వినిపించు సాధకునకు శ్రద్ధాభక్తులు అబ్బి, అంతఃకరణము శుద్ధమై, ఆత్మరూపుడగు భగవానుడు సాక్షాత్కరించును.

శ్రుత్వా స్థూలం తథా సూక్ష్మం రూపం భగవతో యతిః ।
స్థూలే నిర్జితమాత్మానం శనైస్సూక్ష్మం ధియా నయేదితి।।39

యతిః - యతనశీలుడగు సాధకుడు, భగవతః - భగవానుని, స్థూలమ్ - స్థూలమైన, తథా - మరియు, సూక్ష్మమ్ - సూక్ష్మమైన, రూపమ్ - రూపమును గురించి, శ్రుత్వా - విని, స్థూలే - స్థూలమునందు, నిర్జితమ్ - ఏకాగ్రము చేయబడిన, ఆత్మానమ్ - మనస్సును, ధియా - బుద్ధితో, శనైః - మెల్లగా, సూక్ష్మమ్ - సూక్ష్మమును గురించి, నయేత్ - కొనిపోవలెను, ఇతి - అని.

యతనశీలుడగు సాధకుడు భగవానుని స్థూలరూపమును గురించి, సూక్ష్మమగు స్వరూపమును గురించి శ్రవణము చేసి, స్థూలరూపమునందు మనస్సును ఏకాగ్రము చేసి, మెల్లగా బుద్ధితో మనస్సును సూక్ష్మమగు స్వరూపము (ఆత్మ) లో విలీనము చేయవలెను, అని శుక మహర్షి చెప్పెను.

భూద్వీపవర్షసరిదద్రినభస్సముద్ర-
పాతాలదిఙ్నరకభాగణలోకసంస్థా ।
గీతా మయా తవ నృపాద్భుతమీశ్వరస్య
స్థూలం వపుస్సకలజీవనికాయధామ ।। 40

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే
నరకయాతనావర్ణనం నామ షడ్వింశోఽధ్యాయః ॥

॥ ఇతి పంచమః స్కంధః సమాప్తః ॥

నృప - మహారాజా!, భూద్వీపవర్షసరిద్-అద్రినభః-సముద్రపాతాలదిక్-నరకభాగణలోకసంస్థా - భూమి ద్వీపములు ఖండములు నదులు పర్వతములు ఆకాశము సముద్రములు పాతాళము దిక్కులు నరకములు నక్షత్రగణములు లోకముల స్థితి, మయా - నాచే, తవ - నీకు, గీతా - గానము చేయబడినది, సకలజీవనికాయధామ - సకలప్రాణిసమూహమునకు ఆశ్రయమగు, ఈశ్వరస్య - ఈశ్వరుని, అద్భుతమ్ - అద్భుతమగు, స్థూలమ్ - స్థూలమైన, వపుః - రూపము.

ఓ పరీక్షిన్మహారాజా! భూమి, దానిలోని ద్వీపములు, ఖండములు, నదులు, పర్వతములు, ఆకాశము, సముద్రములు, పాతాళము, దిక్కులు, నరకములు, జ్యోతిర్మండలముల సమూహముల స్థితిని నేను నీకు వివరించి చెప్పితిని. సకలప్రాణులకు ఆశ్రయమైన ఈ జగత్తు ఈశ్వరుని అద్భుతమగు స్థూలరూపమే.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి పంచమస్కంధములో
నరకయాతనలను వర్ణించే ఇరువది ఆరవ
అధ్యాయము ముగిసినది (26).

పంచమ స్కంధము ముగిసినది

హరిః ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు

*****

ఓం శ్రీగణేశాయ నమః

ఓం నమో భగవతే వాసుదేవాయ

నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమమ్ ।

దేవీం సరస్వతీం వ్యాసం తతో జయముదీరయేత్ ॥

వంశీవిభూషితకరాన్నవనీరదాభాత్

పీతాంబరాదరుణబింబఫలాధరోష్ఠాత్ ।

పూర్ణేందుసుందరముఖాదరవిందనేత్రాత్

కృష్ణాత్పరం కిమపి తత్త్వమహం న జానే ॥

సచ్చిదానందరూపాయ విశ్వోత్పత్త్యాదిహేతవే ।

తాపత్రయవినాశాయ శ్రీకృష్ణాయ వయం నుమః ॥

శ్రీగణేశాయ నమః

ఓం నమో భగవతే వాసుదేవాయ

శ్రీ మహర్షి వేదవ్యాస ప్రణీతం

# శ్రీమద్భాగవత మహాపురాణమ్

## తత్త్వ ప్రకాశికా సంయుతమ్

# షష్ఠః స్కంధః

## అథ ప్రథమోఽధ్యాయః

### అజామిలోపాఖ్యానము

రాజోవాచ ।
నివృత్తిమార్గః కథిత ఆదౌ భగవతా యథా ।
క్రమయోగోపలబ్ధేన బ్రహ్మణా యదసంసృతిః ॥ 1

భగవతా - పూజనీయుడవగు నీచే, ఆదౌ - ముందుగా, నివృత్తి మార్గః - నివృత్తి మార్గము, యథా - యథాతథముగా, కథితః - చెప్పబడినది, యత్ - దేనివలనైతే, క్రమయోగ-ఉపలబ్ధేన - క్రమముగా యోగసాధనచే పొందబడిన, బ్రహ్మణా - బ్రహ్మచే, అసంసృతిః - మోక్షమో.

పరీక్షిన్మహారాజు శుకమహర్షితో ఇట్లు పలికెను --- పూజనీయుడ వగు నీవు ముందుగా (రెండవ స్కంధములో) నివృత్తిమార్గమును ఉన్నది ఉన్నట్లుగా చెప్పితివి. దాని వలన సాధకుడు క్రమముగా శమదమాది యోగసాధనలననుష్ఠించి, పరబ్రహ్మను ఆత్మరూపముగా తెలుసుకొని సంసారమునుండి విముక్తుడగును.

ప్రవృత్తిలక్షణశ్చైవ త్రైగుణ్యవిషయో మునే ।
యోఽసావలీనప్రకృతేర్గుణసర్గః పునః పునః ।। 2

మునే - ఓ మహర్షీ!, త్రైగుణ్యవిషయః - త్రిగుణములతో కూడి యున్న సంసారమే విషయముగా గల, ప్రవృత్తిలక్షణః చ ఏవ - కర్మానుష్ఠానరూపమైన మార్గము కూడ చెప్పబడినది, యః - ఏ, అసౌ - ఈ మార్గము, అలీనప్రకృతేః - తొలగిపోని అవిద్య గలవానికి, పునః పునః - మరల మరల, గుణసర్గః - గుణముల సృష్టి గలదియో.

ఓ మహర్షీ! కర్మానుష్ఠానరూపమైన మార్గమునకు సత్త్వరజస్తమో గుణముల కార్యమైన సంసారమే విషయము. దానిని కూడ నీవు (మూడవ స్కంధములో) చెప్పితివి. ఈ కర్మమార్గము అజ్ఞానియగు సాధకునకు మరల మరల గుణముల కార్యమగు సంసారమును (దేహమును) కలిగించుచునే యుండును.

అధర్మలక్షణా నానా నరకాశ్చానువర్ణితాః ।
మన్వంతరశ్చ వ్యాఖ్యాత ఆద్యస్స్వాయంభువో యతః ।। 3

అధర్మలక్షణాః - అధర్మమును సూచించే, నానానరకాః చ - అనేకవిధములైన నరకములు కూడ, అనువర్ణితాః - వర్ణించబడినవి, మన్వంతరః చ - మన్వంతరము కూడ, వ్యాఖ్యాతః - వివరముగా చెప్పబడినది, యతః - దేనియందైతే, స్వాయంభువః - స్వాయంభువ మనువు, ఆద్యః - మొదటివాడో.

తమరు అనేకవిధములైన నరకములను కూడ (ఐదవ స్కంధములో) వర్ణించిరి. అవి నరకహేతువులగు అధర్మములను తెలుపుచున్నవి.

మరియు, తమరు మన్వంతరములను కూడ వివరించి (నాల్గవ స్కంధము లో) చెప్పితిరి. ఆ మనువులలో స్వాయంభువుడు మొదటివాడు.

ప్రియవ్రతోత్తానపదోర్వంశస్తచ్చరితాని చ ।
ద్వీపవర్షసముద్రాద్రినద్యుద్యానవనస్పతీన్ ॥ 4

ప్రియవ్రత-ఉత్తానపదోః - ప్రియవ్రతుడు ఉత్తానపాదుల, వంశః - వంశము, తత్-చరితాని చ - వారి వృత్తాంతములు కూడ, ద్వీపవర్షసముద్ర -అద్రినదీ-ఉద్యానవనస్పతీన్ - ద్వీపములు ఖండములు సముద్రములు పర్వతములు నదులు ఉద్యానవనములు వృక్షములను.

మీరు ప్రియవ్రత-ఉత్తానపాదుల వంశమును, వారి వృత్తాంతముల ను (4,5 స్కంధములలో) చెప్పితిరి. ద్వీపములు, ఖండములు, సముద్ర ములు, పర్వతములు, నదులు, ఉద్యానవనములు, వృక్షములు అనువా టిని (5 వ స్కంధములో) వివరించితిరి.

ధరామండలసంస్థానం భాగలక్షణమానతః ।
జ్యోతిషాం వివరాణాం చ యథేదమసృజద్విభుః ॥ 5

భాగలక్షణమానతః - భాగములు లక్షణములు కొలతలను బట్టి, ధరామండలసంస్థానమ్ - భూమండలముయొక్క సన్నివేశము, జ్యోతి షామ్ - జ్యోతిర్మండలములయొక్క, వివరాణాం చ - బిలలోకముల యొక్క సన్నివేశమును, విభుః - సర్వవ్యాపకుడగు భగవానుడు, ఇదమ్ - ఈ జగత్తును, యథా - ఏ విధముగా, అసృజత్ - సృష్టించెనో.

భూమండలము, జ్యోతిర్మండలములు, బిలలోకములయొక్క సన్నివేశములను, వాటియందలి విభాగములను, వాటి లక్షణములను, వాటి కొలతలను, సర్వవ్యాపకుడగు భగవానుడు ఈ జగత్తును సృష్టించిన విధ మును మీరు వివరించి చెప్పితిరి (5 వ స్కంధము).

అధునేహ మహాభాగ యథైవ నరకాన్నరః ।
నానోగ్రయాతనాన్నేయాత్తన్మే వ్యాఖ్యాతుమర్హసి ॥ 6

మహాభాగ - ఓ మహాత్మా!, అధునా - ఇప్పుడు, ఇహ - ఈ లోకమునందు, నరః - మానవుడు, యథా - ఏ విధముగానైతే, నానా-ఉగ్రయాతనాన్ - అనేకములగు క్రూరమైన యాతనలు గల, నరకాన్ - నరకములను, న ఏవ ఇయాత్ - పొందనే పొందడో, తత్ - ఆ ఉపాయమును, మే - నా కొరకు, వ్యాఖ్యాతుమ్ - వివరించి చెప్పుటకు, అర్హసి - తగుదువు.

ఓ మహాత్మా! ఈ లోకములో మానవుడు ఏ ఉపాయముచే అనేకములగు క్రూరములైన యాతనలు ఉండే నరకములను పొందనే పొందడో, దానిని నాకు మీరు వివరించి చెప్పదగును.

శ్రీశుక ఉవాచ ।
న చేదిహైవాపచితిం యథాఽంహసః
కృతస్య కుర్యాన్మనఉక్తిపాణిభిః ।
ధ్రువం స వై ప్రేత్య నరకానుపైతి
యే కీర్తితా మే భవతస్తిగ్మయాతనాః ॥ 7

ఇహ ఏవ - ఈ లోకమునందే, మనః-ఉక్తిపాణిభిః - మనోవాక్కాయములచే, కృతస్య - చేయబడిన, అంహసః - పాపమునకు, యథా - యథావిధిగా, అపచితిమ్ - ప్రాయశ్చిత్తమును, న చేత్ కుర్యాత్ - చేయకున్నచో, సః వై - అట్టివాడైతే, ప్రేత్య - మరణించి, ధ్రువమ్ - నిశ్చయముగా, నరకాన్ - నరకములను, ఉపైతి - పొందును, తిగ్మయాతనాః - దారుణములగు యాతనలు గల, యే - ఏ నరకములు, మే - నాచే, భవతః - నీకు, కీర్తితాః - వర్ణించబడినవో.

మానవుడు ఈ లోకములో మనోవాక్కాయములచే చేసిన పాపములకు ప్రాయశ్చిత్తమును యథావిధిగా చేసుకొనవలెను. అట్లు చేయని వ్యక్తి నిశ్చయముగా మరణించిన పిదప నరకములను పొందును. ఆ నరకములలోని దారుణమగు యాతనలను నేను నీకు వివరించి చెప్పితిని.

**తస్మాత్పురైవాశ్విహ పాపనిష్కృతౌ**
**యతేత మృత్యోరవిపద్యతాఽఽత్మనా ।**

దోషస్య దృష్ట్వా గురులాఘవం యథా
భిషక్ చికిత్సేత రుజాం నిదానవిత్ ॥ 8

తస్మాత్ - అందువలన, మృత్యోః - మరణమునకు, పురా ఏవ - ముందుగనే, అవిపద్యతా - రోగగ్రస్తము కాని, ఆత్మనా - దేహముతో, ఇహ - ఈ జన్మయందు, దోషస్య - దోషముయొక్క, గురులాఘవమ్ - ఎక్కువ తక్కువలను, దృష్ట్వా - పరిశీలించి, ఆశు - తొందరగా, పాపనిష్కృతౌ - పాపమునకు నిష్కృతియందు, యతేత - ప్రయత్నించవలెను, యథా - ఏ విధముగానైతే, రుజామ్ - రోగముల, నిదానవిత్ - కారణము నెరింగిన, భిషక్ - వైద్యుడు, చికిత్సేత - చికత్సను చేయునో.

అందువలన మానవుడు మరణించుటకు ముందే, దేహము రోగగ్రస్తము కాకముందే, ఈ జన్మలోనే తన దోషముయొక్క ఎక్కువ తక్కువలను పరిశీలించి, పాపమునకు నిష్కృతిని తొందరగా చేసుకొనవలెను. రోగములకు కారణమునెరింగిన వైద్యుడు చికిత్సను చేసినట్లే, మనము మన పాపముల హెచ్చుతగ్గులను గమనించి, ప్రాయశ్చిత్తమును చేయవలెను.

రాజోవాచ ।
దృష్టశ్రుతాభ్యాం యత్పాపం జానన్నప్యాత్మనోఽహితమ్ ।
కరోతి భూయో వివశః ప్రాయశ్చిత్తమథో కథమ్ ॥ 9

దృష్టశ్రుతాభ్యామ్ - కంటితో చూచినదానిచే మరియు విన్నదానిచే, యత్ - ఏది, పాపమ్ - పాపమో, ఆత్మనః - తనకు, అహితమ్ - హితము కాదో, జానన్ అపి - తెలియుచున్నవాడే అయినా, భూయః - మరల, వివశః - స్వాధీనత లేనివాడై, కరోతి - చేయుచున్నాడు, అథో - అందువలన, ప్రాయశ్చిత్తమ్ - ప్రాయశ్చిత్తము, కథమ్ - ఎట్లు?

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- వ్యక్తికి తాను చూచిన దానిని బట్టి, విన్నదానిని బట్టి ఏది పాపమో, ఏది తనకు హితము కాదో, తెలియుచునే యుండును. అయిననూ, వ్యక్తికి తన మనస్సు వశములో లేకుండుటచే, మరల పాపమునే చేయును. ఇట్టి స్థితిలో ప్రాయశ్చిత్తము ఎట్లు సంభవమగును?

క్వచిన్నివర్తతేఽభద్రాత్క్వచిచ్చరతి తత్పునః ।
ప్రాయశ్చిత్తమతోఽపార్థం మన్యే కుంజరశౌచవత్ ॥ 10

క్వచిత్ - ఒకప్పుడు, అభద్రాత్ - పాపకర్మనుండి, నివర్తతే - వెనుకకు తగ్గుచున్నాడు, క్వచిత్ చ పునః - మరియొకప్పుడైతే, తత్ - దానిని, చరతి - చేయుచున్నాడు, అతః - ఇందువలన, కుంజరశౌచవత్ - ఏనుగు స్నానము వలె, ప్రాయశ్చిత్తమ్ - ప్రాయశ్చిత్తము, అప-అర్థమ్ - అర్థము లేనిదని, మన్యే - తలచెదను.

మానవుడు ఒకప్పుడు పాపమునుండి వెనుకకు తగ్గిననూ, ఏనుగు స్నానము చేసి వెంటనే దుమ్మును మీద జల్లుకొనునట్లు, మరియొకప్పుడు దానిని చేయుచునే యున్నాడు. కావున, ప్రాయశ్చిత్తములో అర్థము లేదని నా అభిప్రాయము.

శ్రీశుక ఉవాచ ।
కర్మణా కర్మనిర్హారో న హ్యాత్యంతిక ఇష్యతే ।
అవిద్వదధికారిత్వాత్ప్రాయశ్చిత్తం విమర్శనమ్ ॥ 11

అవిద్వద్-అధికారిత్వాత్ - అజ్ఞానియే అధికారి యగుట వలన, కర్మణా - కర్మచే, ఆత్యంతికః - సమూలమైన, కర్మనిర్హారః - కర్మనాశము, న హి ఇష్యతే - అంగీకరించబడుట లేదు, విమర్శనమ్ - ఆత్మజ్ఞానమే, ప్రాయశ్చిత్తమ్ - ప్రాయశ్చిత్తము.

కర్మలకు ఆత్మస్వరూపము తెలియనివాడు మాత్రమే అధికారి. కావున, కర్మచే సమూలముగా కర్మలు నశించుట సంభవము కాదు. ఆత్మజ్ఞానము మాత్రమే అసలైన ప్రాయశ్చిత్తము.

నాశ్నతః పథ్యమేవాన్నం వ్యాధయోఽభిభవంతి హి ।
ఏవం నియమకృద్రాజన్ శనైః క్షేమాయ కల్పతే ॥ 12

రాజన్ - ఓ మహారాజా!, పథ్యమ్ - హితకరమైన, అన్నం ఏవ - ఆహారమును మాత్రమే, అశ్నతః - తినువారిని, వ్యాధయః - రోగములు, న అభిభవంతి హి - బాధించవు గదా!, ఏవమ్ - ఈ విధముగా, నియమ

కృత్ - నియమములను పాటించువాడు, శనైః - మెల్లగా, క్షేమాయ - క్షేమము (ఆత్మజ్ఞానము) కొరకు, కల్పతే - సమర్థుడగును.

ఓ మహారాజా! హితమగు ఆహారమును మాత్రమే తినువారిని రోగములు బాధించవు గదా! అదే విధముగా, నియమములను పాటించు వ్యక్తి మెల్లమెల్లగా పాపవాసనలను నివారించి క్షేమము (ఆత్మజ్ఞానము) ను పొందగల్గును.

తపసా బ్రహ్మచర్యేణ శమేన చ దమేన చ ।
త్యాగేన సత్యశౌచాభ్యాం యమేన నియమేన చ ॥ 13

దేహవాగ్బుద్ధిజం ధీరా ధర్మజ్ఞాః శ్రద్ధయాన్వితాః ।
క్షిపంత్యఘం మహదపి వేణుగుల్మమివానలః ॥ 14

తపసా - తపస్సుచే, బ్రహ్మచర్యేణ - బ్రహ్మచర్యముచే, శమేన - మనోనిగ్రహముచే, దమేన చ - బాహ్యేంద్రియ నిగ్రహముచే, త్యాగేన - త్యాగముచే, సత్యశౌచాభ్యామ్ - సత్యము శౌచములచే, యమేన - యమముచే, నియమేన చ - నియమముచే, ధీరాః - వివేకము గలవారు, ధర్మజ్ఞాః - ధర్మము తెలిసినవారు, శ్రద్ధయా - శ్రద్ధతో, అన్వితాః - కూడి యున్నవారు, దేహవాగ్-బుద్ధిజమ్ - దేహము వాక్కు బుద్ధులనుండి పుట్టిన, మహత్ - పెద్ద, అఘం అపి - పాపమునైననూ, వేణుగుల్మమ్ - వెదుళ్ల పొదను, అనలః ఇవ - అగ్ని వలె, క్షిపంతి - నశింప జేయుదురు.

వివేకము, ధర్మజ్ఞానము, శ్రద్ధ గల సాధకులు తపస్సు, బ్రహ్మచర్యము, మనోనిగ్రహము, బాహ్యేంద్రియ నిగ్రహము, త్యాగము, సత్యము, బాహ్య-ఆంతర శౌచములు, యమములు (సత్యము, అహింస, పరధనమును అపహరించే తలంపు లేకుండుట, బ్రహ్మచర్యము, భోగసాధనములను ప్రోగు చేయకుండుట), నియమముల (శౌచము, సంతుష్టి, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర శరణాగతి) చే మనోవాక్కాయముల ద్వారా కలిగిన పెద్ద పాపమునైననూ, నిప్పు వెదుళ్ల పొదను వలె, నశింప జేసెదరు.

కేచిత్కేవలయా భక్త్యా వాసుదేవపరాయణాః ।
అఘం ధున్వంతి కార్త్స్న్యేన నీహారమివ భాస్కరః ।। 15

కేచిత్ - కొందరు, వాసుదేవపరాయణాః - వాసుదేవుడే సర్వోత్కృ ష్టమగు ఆశ్రయముగా గలవారై, కేవలయా - కేవలమగు, భక్త్యా - భక్తిచే, అఘమ్ - పాపమును, కార్త్స్న్యేన - పూర్తిగా, భాస్కరః - సూర్యుడు, నీహారం ఇవ - పొగమంచును వలె, ధున్వంతి - నశింప జేసెదరు.

వాసుదేవుడే సర్వోత్కృష్టమగు ఆశ్రయమైన కొందరు కేవలభక్తిచే, సూర్యుడు పొగమంచును వలె, పాపమును పూర్తిగా నశింప జేసెదరు.

న తథా హ్యఘవాన్ రాజన్ పూయేత తపఆదిభిః ।
యథా కృష్ణార్పితప్రాణస్తత్పూరుషనిషేవయా ।। 16

రాజన్ - ఓ మహారాజా!, అఘవాన్ - పాపి, తపః-ఆదిభిః - తపస్సు మొదలగువాటిచే, తథా - ఆ విధముగా, న పూయేత - పవిత్రుడు కాడు, యథా - ఏ విధముగానైతే, కృష్ణ-అర్పితప్రాణః - శ్రీకృష్ణునియందు సమర్పించబడిన ఇంద్రియములు గలవాడు, తత్-పూరుషనిషేవయా - ఆయన భక్తులను సేవించుటచే.

ఓ మహారాజా! ఇంద్రియములను శ్రీకృష్ణునకు సమర్పించి ఆయన భక్తులను సేవించే సాధకుడు ఎంతటి పవిత్రుడగునో, పాపి తపస్సు మొదలగు సాధనములచే అంతటి పవిత్రుడు కాలేడు.

సధ్రీచీనో హ్యయం లోకే పంథాః క్షేమోఽకుతోభయః ।
సుశీలాస్సాధవో యత్ర నారాయణపరాయణాః ।। 17

లోకే - లోకమునందు, అయమ్ - ఇది, సధ్రీచీనః - సముచితమైనది, క్షేమః - క్షేమకరము, అకుతః-భయః - దేనివలననైననూ భయము లేనిది అగు, పంథాః హి - భక్తిమార్గము గదా!, యత్ర - దేనియందు, సుశీలాః - సచ్ఛీలము గల, సాధవః - సత్పురుషులు, నారాయణపరాయణాః - నారాయణుడే పరమశరణుగా గలవారో.

సచ్ఛీలము గల సత్పురుషులు నారాయణుని పూర్ణముగా శరణు పొందియుందురు. ఈ లోకములో సముచితమైన క్షేమకరమగు మార్గము ఇట్టి భక్తియే. ఈ మార్గములో దేనివలనైననూ భయమునకు తావు లేదు.

ప్రాయశ్చిత్తాని చీర్ణాని నారాయణపరాఙ్ముఖమ్ ।
న నిష్పునంతి రాజేంద్ర సురాకుంభమివాపగాః ॥ 18

రాజ-ఇంద్ర - ఓ మహారాజా!, చీర్ణాని - అనుష్ఠించబడిన, ప్రాయశ్చిత్తాని - ప్రాయశ్చిత్తములు, నారాయణపరాఙ్-ముఖమ్ - నారాయణునకు పెడముఖము పెట్టియున్నవానిని, సురాకుంభమ్ - మద్యము కుండను, ఆపగాః ఇవ - నదులు వలె, న నిష్పునంతి - పూర్తిగా పవిత్రుని చేయవు.

ఓ మహారాజా! మద్యము కుండను నదులు పవిత్రము చేయలేవు. అదే విధముగా, నారాయణునియందు భక్తి లేనివానిని వానిచే చేయబడిన ప్రాయశ్చిత్తములు పూర్తిగా పవిత్రుని చేయజాలవు.

సకృన్మనః కృష్ణపదారవిందయోః
నివేశితం తద్గుణరాగి యైరిహ ।
న తే యమం పాశభృతశ్చ తద్భటాన్
స్వప్నేఽపి పశ్యంతి హి చీర్ణనిష్కృతాః ॥ 19

ఇహ - ఈ లోకమునందు, యైః - ఎవరిచేనైతే, తద్-గుణరాగి - ఆయన గుణములయందు ప్రేమగల, మనః - మనస్సు, సకృత్ - ఒక్కసారి, కృష్ణపద-అరవిందయోః - శ్రీకృష్ణుని పాదపద్మములయందు, నివేశితమ్ - లగ్నము చేయబడినదో, తే - వారు, యమమ్ - యముని, పాశభృతః - పాశములను ధరించే, తద్-భటాన్ చ - ఆయన కింకరులను కూడ, స్వప్నే అపి - కలయందైననూ, న పశ్యంతి - చూడరు, హి - ఏలయనగా, చీర్ణనిష్కృతాః - చేయబడిన ప్రాయశ్చిత్తము గలవారో.

ఈ లోకములో ఎవరైతే శ్రీకృష్ణుని గుణములయందు ప్రేమ గల మనస్సును ఒక్కసారి ఆయన పాదపద్మములయందు లగ్నము చేయుదు

రో, వారు ప్రాయశ్చిత్తమును చేసినట్లే యగును. కావున, వారు కలయందైననూ యముని, పాశములను ధరించే ఆయన కింకరులను కూడ చూడరు.

అత్ర చోదాహరంతీమమితిహాసం పురాతనమ్ ।
దూతానాం విష్ణుయమయోస్సంవాదస్తం నిబోధ మే ॥ 20

అత్ర చ - ఈ విషయమునందు, పురాతనమ్ - ప్రాచీనమగు, ఇమమ్ - ఈ, ఇతిహాసమ్ - వృత్తాంతమును, ఉదాహరంతి - చెప్పెదరు, విష్ణుయమయోః - విష్ణువుయొక్క యమునియొక్క, దూతానామ్ - దూతలయొక్క, సంవాదః - సంభాషణము, తమ్ - దానిని, మే - నా వలన, నిబోధ - తెలియుము.

ఈ విషయములో ప్రాచీనమగు ఇతిహాసము నొకదానిని పెద్దలు చెప్పెదరు. దానిలో విష్ణుదూతలకు, యమకింకరులకు మధ్యలో జరిగిన సంభాషణము గలదు. నేను దానిని చెప్పెదను. గమనించుము.

కాన్యకుబ్జే ద్విజః కశ్చిద్దాసీపతిరజామిలః ।
నామ్నా నష్టసదాచారో దాస్యాస్సంసర్గదూషితః ॥ 21

కాన్యకుబ్జే - కాన్యకుబ్జ నగరమునందు, దాసీపతిః - దాసికి భర్త, నామ్నా - పేరుచే, అజామిలః - అజామిలుడు, నష్టసద్-ఆచారః - నశించిన సచ్ఛీలము గలవాడు, దాస్యాః - దాసియొక్క, సంసర్గదూషితః - కలయికచే అపవిత్రుడు అగు, కశ్చిత్ - ఒకానొక, ద్విజః - బ్రాహ్మణుడు.

కాన్యకుబ్జములో అజామిలుడనే బ్రాహ్మణుడు ఒకడు ఉండెను. ఆతడు దాసితో కలయికచే అపవిత్రుడై ఆ దాసినే వివాహమాడెను. ఆతని సచ్ఛీలము నశించెను.

బంద్యక్షకైతవైశ్చౌర్యైర్గర్హితాం వృత్తిమాస్థితః ।
బిభ్రత్కుటుంబమశుచిర్యాతయామాస దేహినః ॥ 22

బందీ-అక్షకైతవైః - బందీ చేసి డబ్బు వసూలు చేయుట ద్యూతము మోసములచే, చౌర్యైః - చోరీలచే, గర్హితామ్ - నిందనీయమై

న, వృత్తిమ్ - బ్రదుక దెరువును, ఆస్థితః - ఆశ్రయించినవాడై, అశుచిః - అశుచియై, కుటుంబమ్ - కుటుంబమును, బిభ్రత్ - పోషించువాడై, దేహినః - ప్రాణులను, యాతయామాస - పీడించెను.

ఆతడు ధనికులను బందీలుగా చేసి డబ్బు వసూలు చేసెడివాడు. జూదము, మోసగించుట, చోరీ చేయుట అనువాటిని ఆతడు నిందనీయ మైన బ్రదుకు దెరువుగా ఆశ్రయించెను. బాహ్యమునందు, ఆంతరము నందు కూడ శౌచము లేని ఆతడు ఈ విధముగా కుటుంబమును పోషిస్తూ, ప్రాణులను యాతన పెట్టెడివాడు.

ఏవం నివసతస్తస్య లాలయానస్య తత్సుతాన్ ।
కాలోఽత్యగాన్మహాన్ రాజన్నష్టాశీత్యాఽఽయుషస్సమాః ।।23

రాజన్ - ఓ మహారాజా!, తస్య - ఆతడు, ఏవమ్ - ఈ విధము గా, నివసతః - నివసించుచుండగా, తత్-సుతాన్ - ఆ దాసియొక్క పుత్రు లను, లాలయానస్య - లాలించుచుండగా, అష్ట-అశీత్యా - ఎనభై ఎనిమిది చే, ఆయుషః - ఆయుర్దాయముయొక్క, సమాః - సంవత్సరములు, మహాన్ - పెద్ద, కాలః - కాలము, అత్యగాత్ - గడిచి పోయెను.

ఓ మహారాజా! ఆతడీ విధముగా ఆ దాసితో గూడి తమ పుత్రు లను లాలిస్తూ నివసించుచుండగా, చాల కాలము గడిచి పోయెను. ఆతనికి ఎనభై ఎనిమిది ఏళ్ల వయస్సు వచ్చెను.

తస్య ప్రవయసః పుత్రా దశ తేషాం తు యోఽవమః ।
బాలో నారాయణో నామ్నా పిత్రోశ్చ దయితో భృశమ్ ।। 24

ప్రవయసః - పెద్ద వయస్సు వచ్చిన, తస్య - వానికి, దశ - పది మంది, పుత్రాః - కొడుకులు, తేషామ్ - వారిలో, నామ్నా - పేరుచే, నారా యణః - నారాయణుడైన, అవమః - కనిష్ఠుడైన, బాలః తు - పిల్లవాడైతే, పిత్రోః చ - తల్లిదండ్రులకు, భృశమ్ - మిక్కిలి, దయితః - ప్రీతిపాత్రుడు.

పెద్ద వయస్సు వచ్చిన ఆ అజామిలునకు పదిమంది కొడుకులు గలరు. వారిలో ఆఖరి పిల్లవాని పేరు నారాయణుడు. ఆ పిల్లవానియందు తల్లిదండ్రులకు ప్రీతి మెండు.

స బద్ధహృదయస్తస్మిన్నర్భకే కలభాషిణి ।
నిరీక్షమాణస్తల్లీలాం ముముదే జరఠో భృశమ్ ॥ 25

కలభాషిణి - మధురమగు పలుకులు గల, తస్మిన్ - ఆ, అర్భకే - పిల్లవానియందు, బద్ధహృదయః - కట్టివేయబడిన హృదయము గల, సః - ఆ, జరఠః - వృద్ధుడు, తత్-లీలామ్ - వాని ఆటను, నిరీక్షమాణః - చూచు చున్నవాడై, భృశమ్ - మిక్కిలి, ముముదే - ఆనందించెను.

తియ్యని ముద్దు పలుకుల ఆ పిల్లవానియందు వృద్ధుడగు అజామి లుని హృదయము కట్టుబడిపోయెను. ఆ పిల్లవాని ఆటపాటలను చూస్తూ, ఆతడు చాల ఆనందించెడివాడు.

భుంజానః ప్రపిబన్ ఖాదన్ బాలకస్నేహయంత్రితః ।
భోజయన్ పాయయన్మూఢో న వేదాగతమంతకమ్ ॥ 26

బాలకస్నేహయంత్రితః - పిల్లవానియందలి ప్రేమచే నియంత్రిం చబడిన, మూఢః - వ్యామోహితుడగు ఆతడు, భుంజానః - భోజనము చేయుచున్నవాడై, ఖాదన్ - నములుచున్నవాడై, భోజయన్ - భుజింపజే యుచున్నవాడు, ప్రపిబన్ - త్రాగుచున్నవాడై, పాయయన్ - త్రాగించువా డు, ఆగతమ్ - వచ్చిపడిన, అంతకమ్ - మృత్యువును గురించి, న వేద - తెలుసుకొన లేకపోయెను.

అజామిలుడు పిల్లవానియందలి ప్రేమచే కట్టుబడి యుండెను. ఆతడు తాను భోజనము చేస్తూ ఆహారమును నములుతూ పిల్లవానికి కూడ తినిపించెడివాడు. తాను నీటిని త్రాగేటప్పుడు పిల్లవానిచేత కూడ త్రాగించెడివాడు. ఇట్లు వ్యామోహితుడైయున్న ఆతడు తనకు మృత్యువు సంప్రాప్తమైనదనే విషయమునే గమనించలేదు.

స ఏవం వర్తమానోఽజ్ఞో మృత్యుకాల ఉపస్థితే ।
మతిం చకార తనయే బాలే నారాయణాహ్వయే ॥ 27

ఏవమ్ - ఈ విధముగా, వర్తమానః - ఉంటున్న, అజ్ఞః - అజ్ఞాని యగు, సః - ఆ అజామిలుడు, మృత్యుకాలే - మరణసమయము, ఉపస్థితే - సంప్రాప్తము కాగా, నారాయణ-ఆహ్వయే - నారాయణుడనే పేరు గల, బాలే - పిల్లవాడైన, తనయే - కొడుకునందు, మతిమ్ - బుద్ధిని, చకార - చేసెను.

ఈ విధముగా కాలక్షేపము చేయుచున్న ఆ అజామిలుడు మరణించే సమయము వచ్చినప్పుడు, అతని మనస్సు నారాయణుడనే తన కొడుకగు పిల్లవానియందే నిలిచి యుండెను.

స పాశహస్తాంస్త్రీన్ దృష్ట్వా పురుషాన్ భృశదారుణాన్ ।
వక్రతుండానూర్ధ్వరోమ్ణ ఆత్మానం నేతుమాగతాన్ ॥ 28

దూరే క్రీడనకాసక్తం పుత్రం నారాయణాహ్వయమ్ ।
ప్లావితేన స్వరేణోచ్చైరాజుహావాకులేంద్రియః ॥ 29

పాశహస్తాన్ - పాశములు చేతులయందు కలిగినట్టియు, భృశదారుణాన్ - మిక్కిలి భయమును గొల్పునట్టియు, వక్రతుండాన్ - వంకర నోళ్లు కలిగినట్టియు, ఊర్ధ్వరోమ్ణః - నిక్కబొడుచుకొనియున్న రోమములు కలిగినట్టియు, ఆత్మానమ్ - తనను, నేతుమ్ - కొనిపోవుటకు, ఆగతాన్ - వచ్చిన, త్రీన్ - ముగ్గురు, పురుషాన్ - పురుషులను, దృష్ట్వా - చూచి, సః - ఆతడు, ఆకుల-ఇంద్రియః - వ్యాకులమైన ఇంద్రియములు గలవాడై, దూరే - దూరమునందు, క్రీడనక-ఆసక్తమ్ - ఆటవస్తువులయందు ఆసక్తి కలిగిన, నారాయణ-ఆహ్వయమ్ - నారాయణుడు అనే పేరు గల, పుత్రమ్ - కొడుకును, ప్లావితేన - ప్లుతమైన, స్వరేణ - స్వరముతో, ఉచ్చైః - బిగ్గరగా, ఆజుహావ - పిలిచెను.

అజామిలునకు ముగ్గురు పురుషులు కనబడిరి. మిక్కిలి భయమును గొల్పే ఆ పురుషుల చేతులలో పాశములుండెను. వారు వంకర

నోళ్లను, నిక్కబొడుచుకొనియున్న రోమములను కలిగియుండిరి. వారిని చూడగనే, అతడు దూరముగానున్న తన నారాయణుడనే పేరు గల కొడుకును పొడవైన స్వరముతో బిగ్గరగా పిలిచెను. ఆ పిల్లవాడు ఆటవస్తువులయందు నిమగ్నుడై యుండెను.

నిశమ్య మ్రియమాణస్య బ్రువతో హరికీర్తనమ్ ।
భర్తుర్నామ మహారాజ పార్షదాస్సహసాఽఽపతన్ ॥ 30

మహారాజ - ఓ మహారాజా!, మ్రియమాణస్య - మరణించుచున్న అజామిలుడు, భర్తుః - ప్రభువుయొక్క, నామ - పేరును, బ్రువతః - పలుకుచుండగా, నిశమ్య - విని, హరికీర్తనమ్ - శ్రీహరి కీర్తనమని, పార్షదాః - శ్రీహరి అనుచరులు, సహసా - వెంటనే, ఆ-అపతన్ - వచ్చిపడిరి.

ఓ మహారాజా! అజామిలుడు మరణిస్తూ నారాయణ నామమును పలికెను. శ్రీహరి అనుచరులు తమ ప్రభువు పేరు విని, అతడు శ్రీహరిని కీర్తించుచున్నాడని తలచిరి. వారు వెంటనే అచటకు వచ్చిపడిరి.

వికర్షతోఽంతర్హృదయాద్దాసీపతిమజామిలమ్ ।
యమప్రేష్యాన్ విష్ణుదూతా వారయామాసురోజసా ॥ 31

దాసీపతిమ్ - దాసిని వివాహమాడిన, అజామిలమ్ - అజామిలుని, అంతః-హృదయాత్ - హృదయము లోపలనుండి, వికర్షతః - బయటకు లాగుచున్న, యమప్రేష్యాన్ - యమకింకరులను, విష్ణుదూతాః - విష్ణువు దూతలు, ఓజసా - బలముతో, వారయామాసుః - నివారించిరి.

యమకింకరులు దాసిని వివాహమాడిన అజామిలుని సూక్ష్మశరీరమును హృదయము లోపలనుండి బయటకు లాగుచుండిరి. అపుడు విష్ణువు దూతలు వారిని వద్దని బలముగా నివారించిరి.

ఊచుర్నిషేధితాస్తాంస్తే వైవస్వతపురస్సరాః ।
కే యూయం ప్రతిషేద్ధారో ధర్మరాజస్య శాసనమ్ ॥ 32

నిషేధితాః - అడ్డగించబడిన, తే - ఆ, వైవస్వతపురస్సరాః - యమకింకరులు, తాన్ - వారిని ఉద్దేశించి, ఊచుః - పలికిరి, ధర్మరాజస్య - యమధర్మరాజుయొక్క, శాసనమ్ - శాసనమును, ప్రతిషేద్ధారః - అడ్డుకొనే, యూయమ్ - మీరు, కే - ఎవరు?

ఆ విధముగా అడ్డుకొనబడిన యమకింకరులు విష్ణుదూతలతోనిట్లనిరి --- యమధర్మరాజు శాసనమును అడ్డుకొనుటకు మీరెవరు?

**కస్య వా కుత ఆయాతాః కస్మాదస్య నిషేధథ ।**
**కిం దేవా ఉపదేవా వా యూయం కిం సిద్ధసత్తమాః ॥ 33**

కస్య వా - ఎవని వారలు?, కుతః - ఎక్కడనుండి, ఆయాతాః - వచ్చినవారలు?, అస్య - వీనికి, నిషేధథ - అడ్డు తగులుచున్నారు?, కిం దేవాః - దేవతలా?, ఉపదేవాః వా - గంధర్వులు మొదలగు ఉపదేవతలా?, యూయమ్ - మీరు, కిం సిద్ధసత్తమాః - సిద్ధపురుష శ్రేష్ఠులా?

మీరు ఎవని అనుచరులు? ఎక్కడనుండి వచ్చినారు? వీనిని మేము కొనిపోవుచుండగా అడ్డు తగులుటకు కారణమేమి? మీరు దేవతలా? లేక గంధర్వాది ఉపదేవతలా? లేక, శ్రేష్ఠులైన సిద్ధపురుషులా?

**సర్వే పద్మపలాశాక్షాః పీతకౌశేయవాససః ।**
**కిరీటినః కుండలినో లసత్పుష్కరమాలినః ॥ 34**

సర్వే - అందరు, పద్మపలాశ-అక్షాః - పద్మదళములవంటి కన్నులు గలవారు, పీతకౌశేయవాససః - పట్టు పీతాంబరములు గలవారు, కిరీటినః - కిరీటము గలవారు, కుండలినః - కుండలములు గలవారు, లసత్-పుష్కరమాలినః - ప్రకాశించే పద్మముల మాలలు గలవారు.

పద్మదళములవంటి కన్నులు గల మీరందరు కిరీటములను కుండలములను పెట్టుకొని, పట్టు పీతాంబరములను ధరించియున్నారు. పద్మముల మాలలతో ప్రకాశించే మీరెవరు?

సర్వే చ నూత్నవయసస్సర్వే చారుచతుర్భుజాః ।
ధనుర్నిషంగాసిగదాశంఖచక్రాంబుజశ్రియః ॥ 35

సర్వే చ - అందరు, నూత్నవయసః - యౌవనములో నున్నవారు, సర్వే - అందరు, చారుచతుః-భుజాః - అందమైన నాలుగు చేతులు గలవారు, ధనుః-నిషంగ-అసిగదాశంఖచక్ర-అంబుజశ్రియః - ధనస్సు అంబుల పొది కత్తి గద శంఖము చక్రము పద్మములతో శోభిల్లువారు.

యౌవనములోనున్న మీరందరు అందమైన నాలుగు చేతులను కలిగియున్నారు. ధనస్సు, అంబుల పొది, కత్తి, గద, శంఖము, చక్రము మరియు పద్మములతో మీరు శోభిల్లుచున్నారు.

దిశో వితిమిరాలోకాః కుర్వంతస్స్వేన రోచిషా ।
కిమర్థం ధర్మపాలస్య కింకరాన్నో నిషేధథ ॥ 36

స్వేన - తమ, రోచిషా - కాంతిచే, దిశః - దిక్కులను, వితిమిర-ఆలోకాః - తొలగిపోయిన చీకటి (కావుననే) కాంతి గలవిగా, కుర్వంతః - చేయుచున్న మీరు, ధర్మపాలస్య - యమధర్మరాజుయొక్క, కింకరాన్ - కింకరులమగు, నః - మమ్ములను, కిమర్థమ్ - ఎందుకొరకు, నిషేధథ - అడ్డుచున్నారు?

మీ కాంతిచే చీకట్లు తొలగిపోయి దిక్కులు ప్రకాశించుచున్నవి. యమధర్మరాజు కింకరులమగు మాకు మీరు ఏల అడ్డు వచ్చెదరు?

శ్రీశుక ఉవాచ ।
ఇత్యుక్తే యమదూతైస్తైర్వాసుదేవోక్తకారిణః ।
తాన్ ప్రత్యూచుః ప్రహస్యేదం మేఘనిర్హ్రాదయా గిరా ॥37

తైః - ఆ, యమదూతైః - యమదూతలచే, ఇతి - ఈ విధముగా, ఉక్తే - పలుకబడగా, వాసుదేవ-ఉక్తకారిణః - వాసుదేవుని కింకరులు, ప్రహస్య - బిగ్గరగా నవ్వి, తాన్ - వారిని ఉద్దేశించి, మేఘనిర్హ్రాదయా - మేఘగర్జనవలె గంభీరమైన, గిరా - వాక్కుతో, ఇదమ్ - ఈ మాటను, ప్రతి-ఊచుః - బదులు చెప్పిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఆ యమదూతలిట్లు పలుకగా, వాసుదేవుని కింకరులు బిగ్గరగా నవ్వి, మేఘగర్జనవలె గంభీరమైన వాక్కుతో వారికిట్లు బదులు చెప్పిరి.

విష్ణుదూతా ఊచుః ।
యూయం వై ధర్మరాజస్య యది నిర్దేశకారిణః ।
బ్రూత ధర్మస్య నస్తత్త్వం యచ్చ ధర్మస్య లక్షణమ్ ॥ 38

యూయమ్ - మీరు, వై - నిశ్చయముగా, ధర్మరాజస్య - యమ ధర్మరాజుయొక్క, నిర్దేశకారిణః యది - ఆజ్ఞను పాలించేవారైతే, నః - మాకు, ధర్మస్య - ధర్మముయొక్క, తత్త్వమ్ - స్వరూపమును, ధర్మస్య - ధర్మముయొక్క, యత్ - ఏ, లక్షణం చ - లక్షణము (ప్రమాణము) గలదో దానిని కూడ, బ్రూత - చెప్పుడు.

విష్ణుదూతలిట్లు పలికిరి --- మీరు నిశ్చయముగా యమధర్మరాజుయొక్క ఆజ్ఞను పాలించేవారైతే, మాకు ధర్మముయొక్క స్వరూపమును, ప్రమాణమును, లక్షణములను కూడ చెప్పుడు.

కథంస్విద్ధ్రియతే దండః కిం వాఽస్య స్థానమీప్సితమ్ ।
దండ్యాః కిం కారిణస్సర్వే ఆహోస్విత్కతిచిన్నృణామ్ ॥ 39

దండః - శిక్ష, కథంస్విత్ - ఏ విధముగా, ధ్రియతే - వేయబడును?, అస్య - ఈ శిక్షకు, ఈప్సితమ్ - అర్హమగు, స్థానమ్ - పాత్ర, కిం వా - ఏది?, నృణామ్ - మానవులలో, సర్వే - అందరు, కారిణః - కర్మను చేయువారు, దండ్యాః కిమ్ - శిక్షకు అర్హులా?, ఆహోస్విత్ - లేదా, కతిచిత్ - కొందరేనా?

శిక్షను వేసే విధమెట్టిది? ఎవరు ఈ శిక్షకు అర్హుడైన పాత్రుడు? పాపకర్మను చేసే మానవులందరు శిక్షార్హులేనా? లేక, వారిలో కొందరు మాత్రమేనా?

యమదూతా ఊచుః ।
వేదప్రణిహితో ధర్మో హ్యధర్మస్తద్విపర్యయః ।
వేదో నారాయణస్సాక్షాత్స్వయంభూరితి శుశ్రుమ ।। 40

వేదప్రణిహితః - వేదముచే విధించబడినది, ధర్మః - ధర్మము, తద్-విపర్యయః - దానికి విరుద్ధమైనది, అధర్మః హి - అధర్మము గదా!, వేదః - వేదము, స్వయంభూః - స్వయంసిద్ధము, సాక్షాత్ - సాక్షాత్తుగా, నారాయణః - నారాయణుడే, ఇతి - అని, శుశ్రుమ - వినియుంటిమి.

యమదూతలిట్లు పలికిరి -- వేదవిహితమైనది ధర్మము కాగా, వేదముచే నిషేధించబడినది అధర్మము. వేదము స్వయంసిద్ధము (అపౌరుషేయము). వేదము సాక్షాత్తు నారాయణుని స్వరూపమని వినియుంటిమి.

యేన స్వధామ్న్యమీ భావా రజస్సత్త్వతమోమయాః ।
గుణనామక్రియారూపైర్విభావ్యంతే యథాతథమ్ ।। 41

యేన - ఎవనిచే, స్వధామ్ని - తన స్వరూపమునందు, అమీ - ఈ, రజః-సత్త్వతమః-మయాః - సత్త్వరజస్తమోగుణముల కార్యములగు, భావాః - ప్రాణులు, యథాతథమ్ - యోగ్యత ననుసరించి, గుణనామక్రియారూపైః - గుణములు పేర్లు రూపములతో, విభావ్యంతే - రచించబడుచున్నవో.

నారాయణుడు తన స్వరూపమునందు సత్త్వరజస్తమోగుణముల కార్యములగు ప్రాణులను వాటి యోగ్యతననుసరించి, ఆయా గుణములు పేర్లు మరియు రూపములతో రచించుచున్నాడు.

సూర్యోఽగ్నిః ఖం మరుద్గావస్సోమస్సంధ్యాహనీ దిశః ।
కం కుః కాలో ధర్మ ఇతి హ్యేతే దైహ్యస్య సాక్షిణః ।। 42

సూర్యః - సూర్యుడు, అగ్నిః - అగ్ని, ఖమ్ - ఆకాశము, మరుత్ - వాయువు, గావః - ఇంద్రియములు, సోమః - చంద్రుడు, సంధ్యా - సంధ్యాకాలము, అహనీ - రాత్రింబగళ్లు, దిశః - దిక్కులు, కమ్ - నీరు,

కుః - పృథివి, కాలః - కాలము, ధర్మః - ధర్మము, ఇతి - అనే, ఏతే - ఇవి, దైహ్యస్య - జీవునకు, సాక్షిణః - సాక్షులు.

దేహధారియగు జీవుడు చేసే కర్మలకు సూర్యుడు, అగ్ని, ఆకాశము, వాయువు, ఇంద్రియములు, చంద్రుడు, సంధ్యాకాలము, రాత్రింబగళ్లు, దిక్కులు, నీరు, పృథివి, కాలము, ధర్మము అనేవి సాక్షులు.

ఏతైరధర్మో విజ్ఞాతః స్థానం దండస్య యుజ్యతే ।
సర్వే కర్మానురోధేన దండమర్హంతి కారిణః ॥ 43

ఏతైః - వీటిచే, విజ్ఞాతః - తెలియబడే, అధర్మః - అధర్మము, దండస్య - శిక్షకు, స్థానమ్ - కారణముగా, యుజ్యతే - సంపన్నమగును, సర్వే - అందరు, కారిణః - పాపకర్మలను చేయు జనులు, కర్మ-అనురోధేన - కర్మకనురూపముగా, దండమ్ - శిక్షను, అర్హంతి - తగియున్నారు.

మానవులు చేసే అధర్మమును ఈ సాక్షులు చూచుచునే యుండును. ఆ అధర్మమే శిక్షకు కారణముగా సంప్రాప్తమగును. పాపకర్మలను చేయు జనులందరు తమ తమ కర్మలకనురూపముగా శిక్షకు అర్హులే.

సంభవంతి హి భద్రాణి విపరీతాని చానఘాః ।
కారిణాం గుణసంగోఽస్తి దేహవాన్న హ్యకర్మకృత్ ॥ 44

అనఘాః - ఓ పుణ్యాత్ములారా!, కారిణామ్ - కర్మలను చేయువారలకు, భద్రాణి - పుణ్యములు, విపరీతాని చ - పాపములు కూడ, సంభవంతి - సంభవమగుచున్నవి, గుణసంగః - గుణములతో సంగము, అస్తి - కలదు, దేహవాన్ - దేహాభిమాని, అకర్మకృత్ - కర్మలను చేయనివాడు, న హి - కానే కాదు.

ఓ పుణ్యాత్ములారా! జీవులకు గుణములతో (గుణకార్యములగు దేహేంద్రియమనస్సులతో) సంగము (అభిమానము) ఉండును. కావుననే, దేహమునందు నేను, నాది అనే అభిమానము గల వ్యక్తి కర్మలను చేయకుండా ఉండలేడు. కావున, ఆ విధముగా కర్తృత్వాభిమానముతో కర్మలను

చేయు జనులకు ఒకప్పుడు పుణ్యము, మరియొకప్పుడు పాపము సంప్రా ప్తమగుచునే యుండును.

యేన యావాన్ యథా ధర్మోఽధర్మో వేహ సమీహితః ।
స ఏవ తత్ఫలం భుంక్తే తథా తావదముత్ర వై ॥ 45

యేన - ఎవనిచే, యావాన్ - ఎంత, ధర్మః - ధర్మము గాని, అధర్మః వా - అధర్మము గాని, ఇహ - ఈ లోకమునందు, యథా - ఏ వి ధముగా, సమీహితః - చేయబడినదో, సః - ఆతడు, తత్-ఫలం ఏవ - దాని ఫలమును మాత్రమే, తథా - అదే తీరున, తావత్ - అంతే, అముత్ర - పరలోకమునందు, వై - నిశ్చయముగా, భుంక్తే - అనుభవించును.

మానవుడు ఈ లోకములో ఏ విధముగా ఎంత ధర్మమును గాని, అధర్మమును గాని చేయునో, అదే విధముగా ఆ కర్మయొక్క ఫలమును అదే ప్రమాణములో పరలోకమునందు నిశ్చయముగా అనుభవించును.

యథేహ దేవప్రవరాస్త్రైవిధ్యముపలభ్యతే ।
భూతేషు గుణవైచిత్ర్యాత్తథాఽన్యత్రానుమీయతే ॥ 46

దేవప్రవరాః - ఓ గొప్ప దేవతలారా!, ఇహ - ఈ లోకమునందు, గుణవైచిత్ర్యాత్ - గుణములయందలి భేదముచే, భూతేషు - ప్రాణుల యందు, యథా - ఏ విధముగానైతే, త్రైవిధ్యమ్ - మూడు విధములుగా నుండుట, ఉపలభ్యతే - కానవచ్చుచున్నదో, తథా - అదే విధముగా, అన్యత్ర - పరలోకమునందు, అనుమీయతే - ఊహించబడుచున్నది.

ఓ గొప్ప దేవతలారా! ఈ లోకములో సత్త్వరజస్తమోగుణముల సమ్మేళనములలో భేదము ఉండుటచే, ప్రాణులలో సుఖము-దుఃఖము-వాటి మిశ్రమము (లేదా, ధర్మము-అధర్మము-వాటి మిశ్రమము) అనే మూడు ప్రకారములు కానవచ్చుచున్నవి. అదే విధముగా, పరలోకములో కూడ ప్రాణులు అనుభవించే కర్మఫలములు ఈ మూడు విధములుగా నుండునని ఊహించవచ్చును.

వర్తమానోऽన్యయోః కాలో గుణాభిజ్ఞాపకో యథా ।
ఏవం జన్మాన్యయోరేతద్ధర్మాధర్మనిదర్శనమ్ ॥ 47

యథా - ఏ విధముగానైతే, వర్తమానః - వర్తమానము, అన్యయోః - మిగిలిన రెండింటియొక్క, గుణ-అభిజ్ఞాపకః - గుణములను ఊహింపజేయునో, ఏవమ్ - ఇదే విధముగా, ఏతత్ - ఈ, జన్మ - జన్మ, అన్యయోః - మిగిలిన రెండింటియొక్క, ధర్మ-అధర్మనిదర్శనమ్ - ధర్మాధర్మములకు నిదర్శనము.

వర్తమానమును బట్టి భూతభవిష్యత్తుల నూహించవచ్చును. అదే విధముగా, ప్రస్తుతజన్మలోని పుణ్యాపాపములను బట్టి గడచిన మరియు రాబోయే జన్మలలోని పుణ్యాపాపములను అంచనా వేయవచ్చును.

మనసైవ పురే దేవః పూర్వరూపం విపశ్యతి ।
అనుమీమాంసతేऽపూర్వం మనసా భగవానజః ॥ 48

అజః - పుట్టుక లేనివాడు, దేవః - చైతన్యస్వరూపుడు అగు, భగవాన్ - యమ భగవానుడు, పురే - పురమునందు, మనసా ఏవ - మనస్సు చేతనే, పూర్వరూపమ్ - పూర్వమునందలి రూపమును, విపశ్యతి - విశేషముగా చూచును, అను - తరువాత, మనసా - మనస్సుచే, అపూర్వమ్ - రాబోయే రూపమును, మీమాంసతే - విచారించి తెలుసుకొనును.

మా ప్రభువగు యమ భగవానుడు పుట్టుక లేనివాడు. ఆయన ప్రాణుల హృదయములలోనుండి తన మనస్సు చేతనే ఆయా ప్రాణుల గతచరిత్రలను అవలోకించును. తరువాత, ఆయన తన మనస్సు చేతనే వారికి కలుగబోయే రూపములను కూడ విచారించి తెలుసుకొనును.

యథాऽజ్ఞస్తమసా యుక్త ఉపాస్తే వ్యక్తమేవ హి ।
న వేద పూర్వమపరం నష్టజన్మస్మృతిస్తథా ॥ 49

తమసా - తమోగుణముచే, యుక్తః - కూడుకున్నవాడు, అజ్ఞః - అజ్ఞాని అగు వ్యక్తి, యథా - ఏ విధముగానైతే, వ్యక్తం ఏవ - కనబడే దేహాదులను మాత్రమే, ఉపాస్తే హి - ఆరాధించునో, నష్టజన్మస్మృతిః -

నశించిన పూర్వజన్మల గురుతులు గలవాడు, తథా - అదే విధముగా, పూర్వమ్ - గడచిన దానిని, అపరమ్ - రాబోవు దానిని, న వేద - తెలియ జాలడు.

తమోగుణప్రధానుడగు అజ్ఞాని కంటికి కనబడే దేహాదులను మాత్రమే ఆరాధించును గదా! అదే విధముగా, పూర్వజన్మపు గురుతులు నశించిన వ్యక్తి పూర్వజన్మలయందలి, మరియు రాబోవు జన్మలలోని తన ధర్మాధర్మములను తెలియజాలడు.

పంచభిః కురుతే స్వార్థాన్ పంచ వేదాథ పంచభిః ।
ఏకస్తు షోడశేన త్రీన్ స్వయం సప్తదశోఽశ్నుతే ॥ 50

షోడశేన - పదునారవ మనస్సుతో కలిపి, సప్తదశః - పదునేడు అంశములు గల, ఏకః తు - ఒక జీవుడైతే, పంచభిః - అయిదింటితో, స్వ-అర్థాన్ - తాను కోరే పనులను, కురుతే - చేయును, అథ - మరియు, పంచభిః - అయిదింటితో, పంచ - అయిదింటిని, వేద - తెలియును, స్వయమ్ - స్వయముగా, త్రీన్ - మూడింటిని, అశ్నుతే - భోగించును.

జీవునియందు అయిదు కర్మేంద్రియములు, అయిదు జ్ఞానేంద్రియములు, అయిదు ప్రాణములు, పదునారవదియగు మనస్సు, పదునేడవదియగు అహంకారము అనే అంశములు గలవు. అట్టి జీవుడు చేతులు, కాళ్లు, వాక్కు, జననేంద్రియము, విసర్గనేంద్రియము అనే అయిదు కర్మేంద్రియములతో తాను కోరే పనులను చేయుచుండును. చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు అనే అయిదు జ్ఞానేంద్రియములతో శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము అనే అయిదు విషయములను జీవుడు తెలుసుకొనుచుండును. అట్టి జీవుడు కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు, మనస్సు అనే మూడింటి విషయములను తాను స్వయముగా భోగించుచుండును.

తదేతత్ షోడశకలం లింగం శక్తిత్రయం మహత్ ।
ధత్తేఽను సంసృతిం పుంసి హర్షశోకభయార్తిదామ్ ॥ 51

షోడశకలమ్ - పదునారు అంశములు కలది, శక్తిత్రయమ్ - మూడు శక్తులు గలది, మహత్ - దృఢమైనది, తత్ - ప్రసిద్ధమైనది అగు, ఏతత్ - ఈ, లింగమ్ - సూక్ష్మశరీరము, పుంసి - జీవునియందు, అను - మరల, హర్షశోకభయ-ఆర్తిదామ్ - సుఖోద్రేకమును దుఃఖోద్రేకమును భయమును పీడను ఇచ్చే, సంసృతిమ్ - జన్మమరణపరంపరను, ధత్తే - కలిగించుచున్నది.

పదునారు అంశములతో కూడిన ఈ ప్రసిద్ధమగు సూక్ష్మశరీరము సత్త్వరజస్తమోగుణముల (శక్తుల) కార్యము. దృఢమైన (భంగము చేయుట కఠినము) ఈ సూక్ష్మశరీరము జీవుని మరల మరల జన్మమరణపరంపర యనే చక్రములో పడవేసి, వానికి సుఖోద్రేకమును, దుఃఖోద్రేకమును, భయమును, పీడను కలిగించుచుండును.

దేహ్యజ్ఞోఽజితషడ్వర్గో నేచ్ఛన్ కర్మాణి కార్యతే ।
కోశకార ఇవాత్మానం కర్మణాఽఽచ్ఛాద్య ముహ్యతి ॥ 52

అజ్ఞః - అజ్ఞాని, అజితషడ్-వర్గః - జయించబడని ఆరింటి సముదాయము గలవాడు అగు, దేహీ - మానవుడు, న ఇచ్ఛన్ - కోరనివాడే అయిననూ, కర్మాణి - కర్మలను, కార్యతే - చేయించబడుచున్నాడు, కోశకారః ఇవ - పట్టు పురుగు వలె, ఆత్మానమ్ - తనను, కర్మణా - కర్మతో, ఆచ్ఛాద్య - కప్పివేసుకొని, ముహ్యతి - వ్యామోహితుడగుచున్నాడు.

అజ్ఞానియగు వ్యక్తి కామక్రోధలోభమోహమదమాత్సర్యములనే ఆరు శత్రువులను జయించలేక, తన ఇష్టము లేకున్ననూ, వాసనలచే కర్మలు చేయించబడుచున్నాడు. ఇట్టివాడు పట్టు పురుగు వలె తనను తాను కర్మలతో కప్పివేసుకొని, వ్యామోహితుడగుచున్నాడు.

న హి కశ్చిత్ క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్ ।
కార్యతే హ్యవశః కర్మ గుణైస్స్వాభావికైర్బలాత్ ॥ 53

కశ్చిత్ - ఎవ్వడైననూ, క్షణం అపి - క్షణకాలమైననూ, జాతు - ఏ కాలమునందైననూ, అకర్మకృత్ - కర్మలను చేయనివాడై, న హి తిష్ఠతి

- ఉండుట లేదు, హి - ఏలయనగా, అవశః - అస్వతంత్రుడై, స్వాభావికైః - స్వభావసిద్ధములగు, గుణైః - గుణములచే, బలాత్ - బలాత్కారముగా, కార్యతే - చేయించబడుచున్నాడు.

ఎవ్వడైననూ ఏ కాలమునందైననూ క్షణకాలమైననూ కర్మలను చేయకుండా ఉండలేడు. సత్త్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతియొక్క కార్యమైన మనస్సునందలి వాసనలచే మానవుడు అస్వతంత్రుడై బలాత్కారముగా కర్మలను చేయించ బడుచున్నాడు.

లబ్ధ్వా నిమిత్తమవ్యక్తం వ్యక్తావ్యక్తం భవత్యుత ।
యథాయోని యథాబీజం స్వభావేన బలీయసా ।। 54

ఉత - మరియు, అవ్యక్తమ్ - కంటికి కానరాని పుణ్యాపాపరూపమగు, నిమిత్తమ్ - కారణమును, లబ్ధ్వా - పొంది, బలీయసా - మిక్కిలి బలము గల, స్వభావేన - అజ్ఞానముచే, యథాయోని - తల్లికి తగ్గట్టుగా, యథాబీజమ్ - తండ్రికి తగ్గట్టుగా, వ్యక్త-అవ్యక్తమ్ - స్థూలసూక్ష్మశరీరముల సంఘాతము (చావు పుట్టుకల శరీరము), భవతి - కలుగుచున్నది.

జీవుడు కంటికి కానరాని పుణ్యాపాపముల కారణముగా చావు పుట్టుకలు గల స్థూల సూక్ష్మశరీరముల సంఘాతమును పొందును. ప్రబలమగు అజ్ఞానము కారణముగా జీవుడు ఒకప్పుడు తల్లిని పోలినట్టియు, మరియొకప్పుడు తండ్రిని పోలిన దేహమును, స్వభావమును పొందును.

ఏష ప్రకృతిసంగేన పురుషస్య విపర్యయః ।
ఆసీత్స ఏవ నచిరాదీశసంగాద్విలీయతే ।। 55

పురుషస్య - వ్యక్తికి, ప్రకృతిసంగేన - ప్రకృతియందలి ఆసక్తిచే, ఏషః - ఈ, విపర్యయః - విపరీతము, ఆసీత్ - కలిగెను, సః - అది, ఈశసంగాత్ - ఈశ్వరునియందలి ప్రేమచే, నచిరాత్ ఏవ - శీఘ్రముగనే, విలీయతే - విలీనమగును.

జీవునకు ఈ విపరీతస్థితి (చావు పుట్టుకల సంసారము) ప్రకృతికార్యములగు దేహేంద్రియమనస్సులయందు నేను, నాది అనే అభిమానము

వలననే కలిగినది. ఈశ్వరునియందలి ప్రేమచే ఈ విపరీత స్థితి శీఘ్రముగా తొలగిపోవును.

అయం హి శ్రుతసంపన్నశ్శీలవృత్తగుణాలయః ।
ధృతవ్రతో మృదుర్దాంతస్సత్యవాన్మంత్రవిచ్ఛుచిః ।। 56

అయమ్ - ఈతడు, హి - నిశ్చయముగా, శ్రుతసంపన్నః - విజ్ఞానసంపన్నుడు, శీలవృత్తగుణ-ఆలయః - సచ్ఛీలము మంచి నడవడి సద్గుణములకు నిలయము, ధృతవ్రతః - ధరించబడిన వ్రతనిష్ఠ గలవాడు, మృదుః - మెత్తని స్వభావము గలవాడు, దాంతః - ఇంద్రియజయము గలవాడు, సత్యవాన్ - సత్యము గలవాడు, మంత్రవిత్ - మంత్రములు తెలిసినవాడు, శుచిః - ఆంతర బాహ్య శౌచములు గలవాడు.

ఈ అజామిలుడు గొప్ప విజ్ఞానము గలవాడు. ఈతడు సచ్ఛీలము, మంచి నడవడి, సద్గుణములకు నిలయము. మెత్తని స్వభావము గల ఈతడు ఇంద్రియములను జయించి సత్యమునే పలుకుతూ జీవితమును వ్రతనిష్ఠతో గడిపెడివాడు. మంత్రవేత్తయగు ఈతడు బాహ్యాభ్యంతరముల యందు శౌచము గలవాడు.

గుర్వగ్న్యతిథివృద్ధానాం శుశ్రూషుర్నిరహంకృతః ।
సర్వభూతసుహృత్సాధుర్మితవాగనసూయకః ।। 57

గురు-అగ్ని-అతిథివృద్ధానామ్ - గురువులు అగ్నులు అతిథులు వృద్ధులకు, శుశ్రూషుః - సేవను చేయువాడు, నిరహంకృతః - అహంకారము లేనివాడు, సర్వభూతసుహృత్ - సకలప్రాణులకు హితకారి, సాధుః - మంచివాడు, మితవాక్ - మితముగా మాటలాడువాడు, అనసూయకః - అసూయ లేనివాడు.

సాధుపురుషుడగు ఈ అజామిలుడు అహంకారము లేకుండా, గురువులకు అగ్నులకు అతిథులకు వృద్ధులకు సేవను చేసెడివాడు. సకల ప్రాణులకు హితకారి, మితభాషియగు ఈతనియందు ఇతరులలోని గుణములను తప్పులుగా చూపే లక్షణము లేదు.

ఏకదా౽సౌ వనం యాతః పితృసందేశకృద్ద్విజః ।
ఆదాయ తత ఆవృత్తః ఫలపుష్పసమిత్కుశాన్ ॥ 58

ఏకదా - ఒకనాడు, పితృసందేశకృత్ - తండ్రి ఆజ్ఞను నెరవేర్చే, అసౌ - ఈ, ద్విజః - బ్రాహ్మణుడు, వనమ్ - అడవిని గురించి, యాతః - వెళ్లినవాడు, తతః - అక్కడనుండి, ఫలపుష్పసమిత్-కుశాన్ - పళ్లను పువ్వులను సమిధలను దర్భలను, ఆదాయ - తీసుకొని, ఆవృత్తః - తిరిగి వచ్చినవాడు.

తండ్రి ఆదేశమును పాలించే ఈ బ్రాహ్మణుడు ఒకనాడు అడవికి వెళ్లి, అచటనుండి పళ్లు పువ్వులు సమిధలు దర్భలను తీసుకొని తిరిగి వచ్చుచుండెను.

దదర్శ కామినం కంచిచ్ఛూద్రం సహ భుజిష్యయా ।
పీత్వా చ మధు మైరేయం మదాఘూర్ణితనేత్రయా ॥ 59

మత్తయా విశ్లథన్నీవ్యా వ్యపేతం నిరపత్రపమ్ ।
క్రీడంతమనుగాయంతం హసంతమనయా౽ంతికే ॥ 60

మైరేయం మధు - బెల్లపు మద్యమును, పీత్వా - త్రాగి, మద-ఆఘూర్ణితనేత్రయా - మత్తుచే గిరగిర తిరుగుచున్న కన్నులు కలిగినట్టియు, మత్తయా - గర్వించినట్టియు, విశ్లథత్-నీవ్యా - జారిపోవుచున్న కోకముడి కలిగిన, భుజిష్యయా సహ - వేశ్యతో బాటుగా, కామినమ్ - కామిదైయైనట్టియు, వ్యపేతమ్ - భ్రష్టుడైనట్టియు, నిరపత్రపమ్ - సిగ్గు లేనట్టియు, క్రీడంతమ్ - ఆడుచున్నట్టియు, అంతికే - ప్రక్కనే, అనయా - ఈమెతో, అనుగాయంతమ్ - అనుసరించి పాడుచున్నట్టియు, హసంతమ్ - నవ్వుచున్న, కంచిత్ - ఒకానొక, శూద్రమ్ - శూద్రుని, దదర్శ - చూచెను.

జారిపోవుచున్న కోకముడి గల ఒక వేశ్యతో బాటుగా సిగ్గు లేకుండా క్రీడిస్తూ, గర్వించియున్న ఆమెతో బాటుగా పాడుతూ కేరింతాలు కొడుతూ ఉన్న భ్రష్టుడైన ఒక శూద్రవిటుని ఆయన దారిలో చూచెను. బెల్లపు మద్యము త్రాగిన మత్తులో ఆమె కన్నులు గిరగిర తిరుగుచుండెను.

దృష్ట్వా తాం కామలిప్తేన బాహునా పరిరంభితామ్ ।
జగామ హృచ్ఛయవశం సహసైవ విమోహితః ।। 61

కామలిప్తేన - కామోద్దీపకములగు గంధాదులచే పూయబడిన, బాహునా - చేతితో, పరిరంభితామ్ - కౌగిలించుకొనబడిన, తామ్ - ఆమెను, దృష్ట్వా - చూచి, సహసా ఏవ - వెనువెంటనే, విమోహితః - వ్యామోహమును పొందినవాడై, హృత్-శయవశమ్ - మనసులో దాగియుండే మన్మథుని వశమును, జగామ - పొందెను.

ఆ వ్యక్తి కామోద్దీపకములగు గంధాదులను పూసుకున్న చేతులతో ఆమెను కౌగిలించుకొనెను. అది చూచిన అజామిలుడు వెనువెంటనే వ్యామోహమును పొందెను. హృదయములో దాగియుండే మన్మథునకు ఆయన వశుడాయెను.

స్తంభయన్నాత్మనాఽఽత్మానం యావత్సత్త్వం యథాశ్రుతమ్ ।
న శశాక సమాధాతుం మనో మదనవేపితమ్ ।। 62

సత్త్వం యావత్ - ధైర్యము ఉన్నంతవరకు, యథాశ్రుతమ్ - శాస్త్రజ్ఞానము ననుసరించి, ఆత్మనా - బుద్ధితో, ఆత్మానమ్ - తనను, స్తంభయన్ - నిలద్రొక్కు కొనువాడు, మదనవేపితమ్ - మన్మథునిచే కుదిపివేయబడిన, మనః - మనస్సును, సమాధాతుమ్ - నిలబెట్టుటకు, న శశాక - సమర్థుడు కాలేదు.

అజామిలుడు తనకు గల జ్ఞానముతో ధైర్యమును చిక్కబట్టి తనను తాను నిలద్రొక్కుకొనే ప్రయత్నమును చేసెను. కాని, మన్మథవికారముచే కుదిపివేయబడిన మనస్సును ఆయన నిలబెట్టుకొన లేకపోయెను.

తన్నిమిత్తస్మరవ్యాజగ్రహగ్రస్తో విచేతనః ।
తామేవ మనసా ధ్యాయన్ స్వధర్మాద్విరరామ హ ।। 63

తత్-నిమిత్తస్మరవ్యాజగ్రహగ్రస్తః - ఆమె నిమిత్తముగా గల మన్మథుడు అనే మిషగల పిశాచముచే పట్టుకొన బడినవాడు, విచేతనః - కోల్పోయిన వివేకము గలవాడు అగు అజామిలుడు, తాం ఏవ - ఆమెను

మాత్రమే, మనసా - మనస్సుతో, ధ్యాయన్ - ధ్యానించువాడై, స్వధర్మాత్ - తన ధర్మమునుండి, విరరామ హ - విరమించుకొనెను.

ఆమెను చూచిన కారణముగా మన్మథుడు రూపములో పిశాచము పట్టుకొనగా, ఆతడు వివేకమును గోల్పోయి, ఆమెను మాత్రమే మనస్సులో ధ్యానిస్తూ, తన కర్తవ్యములను విడిచిపెట్టి వేసెను.

తామేవ తోషయామాస పిత్ర్యేణార్థేన యావతా ।
గ్రామ్యైర్మనోరమైః కామైః ప్రసీదేత యథా తథా ॥ 64

యథా - ఏ విధముగానైతే, గ్రామ్యైః - పామరములైనట్టియు, మనోరమైః - మనస్సునకు ఉల్లాసమును కలిగించే, కామైః - భోగ్యవస్తువులతో, ప్రసీదేత - ప్రసన్నురాలగునో, తథా - ఆ విధముగా, యావతా - పూర్తి, పిత్ర్యేణ - పిత్రార్జితమైన, అర్థేన - ధనముతో, తాం ఏవ - ఆమెను మాత్రమే, తోషయామాస - సంతోషపెట్టెను.

. ఈతడు పామరుల మనస్సునకు ఉల్లాసమును కలిగించే భోగ్యవస్తువులను ఆమెకు ఇచ్చి ఆమెను ప్రసన్నురాలిని చేసుకొనుటయే పనిగా పెట్టుకొనెను. ఈ పనిలో ఈతడు తండ్రి ఆస్తిని అంతనూ ఖర్చు పెట్టెను.

విప్రాం స్వభార్యామప్రౌఢాం కులే మహతి లంభితామ్ ।
విససర్జాచిరాత్పాపస్స్వైరిణ్యాఽపాంగవిద్ధధీః ॥ 65

స్వైరిణ్యా - వేశ్యచే, అపాంగవిద్ధధీః - కడగంటి చూపులచే కొట్టబడిన మనస్సు గల, పాపః - పాపియగు అజామిలుడు, అప్రౌఢామ్ - గడుసుది కానట్టియు (యౌవనవతి యైనట్టియు), మహతి - గొప్ప, కులే - వంశమునందు, లంభితామ్ - పరిణయమైనట్టియు, విప్రామ్ - విప్రురాలగు, స్వభార్యామ్ - తన భార్యను, అచిరాత్ - తొందరలోనే, విససర్జ - విడిచిపెట్టెను.

వేశ్యయొక్క కడగంటి చూపులకు లొంగిపోయిన మనస్సు గల పాపాత్ముడగు ఈ అజామిలుడు బ్రాహ్మణియగు తన భార్యను తొందరలోనే విడిచిపెట్టెను. ఈతని భార్య యౌవనవతియే అయిననూ, గడుసుదన

మెరుగదు. ఈతడు మంచి వంశమునకు చెందినవాడనియే ఆమె ఈతనిని వివాహమాడినది.

యతస్తతశ్చోపనిన్యే న్యాయతోఽన్యాయతో ధనమ్ ।
బభారాస్యాః కుటుంబిన్యా కుటుంబం మందధీరయమ్ ॥66

మందధీః - మందబుద్ధియగు, అయమ్ - ఈతడు, యతః తతః - ఎక్కడో ఒకచోటనుండి, న్యాయతః - న్యాయముగా, అన్యాయతః చ - అన్యాయముగా కూడ, ధనమ్ - ధనమును, ఉపనిన్యే - తీసుకువచ్చెను, కుటుంబిన్యాః - కుటుంబము గల, అస్యాః - ఈమెయొక్క, కుటుంబమ్ - కుటుంబమును, బభార - భరించెను.

ఆ వేశ్యకు కుటుంబము కూడ గలదు. ఈ మూర్ఖుడు ఎక్కడో ఒక చోటనుండి న్యాయముగా గాని, అన్యాయముగా గాని ధనమును పట్టుకు వచ్చి, ఆమె కుటుంబమును పోషించెను.

యదసౌ శాస్త్రముల్లంఘ్య స్వైరచార్యార్యగర్హితః ।
అవర్తత చిరం కాలమఘాయురశుచిర్మలాత్ ॥ 67

యత్ - ఎందువలనైతే, స్వైరచారీ - యథేచ్ఛగా సంచరించువాడు, ఆర్యగర్హితః - మహాత్ములచే నిందించబడినవాడు అగు, అసౌ - ఈతడు, శాస్త్రమ్ - శాస్త్రమును, ఉల్లంఘ్య - ఉల్లంఘించి, అఘ-ఆయుః - పాపపు ఆయుర్దాయము గలవాడో అందువలన, మలాత్ - రాగాది దోషము వలన, అశుచిః - అంతఃకరణశుద్ధి లేనివాడై, చిరమ్ - చాల, కాలమ్ - కాలమును, అవర్తత - జీవించెను.

యథేచ్ఛగా సంచరించి మహాత్ములచే నిందించబడిన ఈతడు శాస్త్రమునుల్లంఘించి బ్రతుకంతా పాపములను చేస్తూనే గడిపెను. ఈ తీరున, ఈతడు అంతఃకరణశుద్ధి లేని జీవితమును చిరకాలము జీవించెను.

తత ఏనం దండపాణేస్సకాశం కృతకిల్బిషమ్ ।
నేష్యామోఽకృతనిర్వేశం యత్ర దండేన శుద్ధ్యతి ॥ 68

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పంచమస్కంధే**
**అజామిలోపాఖ్యానే ప్రథమోఽధ్యాయః ।।**

**తతః** - అందువలన, **కృతకిల్బిషమ్** - చేయబడిన పాపములు గలిగినట్టియు, **అకృతనిర్వేశమ్** - చేయబడని ప్రాయశ్చిత్తము గల, **ఏనమ్** - వీనిని, **దండపాణేః** - దండము చేతియందు గల యముని, **సకాశమ్** - సన్నిధిని గురించి, **నేష్యామః** - కొనిపోయెదము, **యత్ర** - ఎక్కడనైతే, **దండేన** - శిక్షచే, **శుద్ధ్యతి** - శుద్ధిని పొందునో.

ఈతడు పాపములను చేసినాడే గాని, ప్రాయశ్చిత్తమును చేసుకొనలేదు. కావున, మేము ఈతనిని దండము చేతియందుండే యముని సన్నిధికి గొనిపోయెదము. అచట ఈతడు శిక్షననుభవించి పవిత్రుడు కాగలడు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి ఆరవ స్కంధములో
అజామిలోపాఖ్యానమునందు మొదటి
అధ్యాయము ముగిసినది (1).

*****

# అథ ద్వితీయోఽధ్యాయః

## అజామిలుడు వైకుంఠమును పొందుట

శ్రీశుక ఉవాచ ।
ఏవం తే భగవద్దూతా యమదూతాభిభాషితమ్ ।
ఉపధార్యాథ తాన్ రాజన్ ప్రత్యాహుర్నయకోవిదాః ॥ 1

రాజన్ - ఓ రాజా!, ఏవమ్ - ఈ విధముగా, నయకోవిదాః - ధర్మ నిర్ణయములో పండితులైన, తే - ఆ, భగవద్-దూతాః - విష్ణుదూతలు, యమదూత-అభిభాషితమ్ - యమదూతల ప్రసంగమును, ఉపధార్య - సావధానముగా విని, అథ - తరువాత, తాన్ ప్రతి - వారినుద్దేశించి, ఆహుః - పలికిరి.

శ్రీ శుకమహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! ఆ విష్ణు దూతలు ధర్మనిర్ణయములో పండితులు. వారా యమదూతల ప్రసంగ మును సావధానముగా విని, తరువాత వారికి ఇట్లు బదులు చెప్పిరి.

విష్ణుదూతా ఊచుః ।
అహో కష్టం ధర్మదృశామధర్మస్స్పృశతే సభామ్ ।
యత్రాదండ్యేష్వపాపేషు దండో యైర్ధ్రియతే వృథా ॥ 2

అహో - అయ్యో!, కష్టమ్ - కష్టము!, ధర్మదృశామ్ - ధర్మవేత్త ల, సభామ్ - సభను, అధర్మః - అధర్మము, స్పృశతే - స్పృశించుచున్న ది, యత్ర - ఎక్కడనైతే, అదండ్యేషు - శిక్షింప దగనివారియందు, అపా పేషు - పాపులు కానివారియందు, యైః - ఎవరిచేనైతే, వృథా - వ్యర్థము గా, దండః - శిక్ష, ధ్రియతే - వేయబడుచున్నదో.

విష్ణుదూతలు ఇట్లు పలికిరి --- అయ్యో! కష్టము వచ్చినది! ధర్మ వేత్తల సభలో అధర్మము ప్రవేశించుచున్నది. ఏలయనగా, అచట వారిచే శిక్షించదగని నిరపరాధులకు శిక్ష వేయబడుచున్నది.

ప్రజానాం పితరో యే చ శాస్తారస్సాధవస్సమాః ।
యది స్యాత్తేషు వైషమ్యం కం యాంతి శరణం ప్రజాః ।। 3

యే చ - ఎవరైతే, ప్రజానామ్ - ప్రజలకు, పితరః - తండ్రులో, శాస్తారః - శాసకులో, సాధవః - సత్పురుషులో, సమాః - సములో, తేషు - వారియందు, వైషమ్యమ్ - వైపరీత్యము, స్యాత్ యది - కలిగినచో, ప్రజాః - జనులు, కమ్ - ఎవనిని, శరణం యాంతి - శరణు పొందెదరు?

ప్రజలను తండ్రివలె సమబుద్ధితో పాలించ వలసిన సత్పురుషుల యందే వైపరీత్యము వచ్చినచో, ఆ ప్రజలు ఎవనిని శరణు పొందెదరు?

యద్యదాచరతి శ్రేయానితరస్తత్తదీహతే ।
స యత్ప్రమాణం కురుతే లోకస్తదనువర్తతే ।। 4

శ్రేయాన్ - శ్రేష్ఠ పురుషుడు, యత్ యత్ - దేనిని దేనిని, ఆచరతి - ఆచరించునో, ఇతరః - ఇతరుడు, తత్ తత్ - దానిని, ఈహతే - చేయును, సః - ఆతడు, యత్ - ఏ, ప్రమాణమ్ - కొలబద్దను, కురుతే - చేయునో, లోకః - లోకము, తత్ - దానిని, అనువర్తతే - అనుసరించును.

శ్రేష్ఠ పురుషుడు దేనిని చేస్తే, సామాన్యజనులు దానినే చేయుదురు. ఆతడు దేనిని ధర్మమని ప్రమాణీకరిస్తే, దానినే జనులు అనుసరిస్తారు.

యస్యాంకే శిర ఆధాయ లోకస్స్వపితి నిర్వృతః ।
స్వయం ధర్మమధర్మం వా న హి వేద యథా పశుః।। 5

యస్య - ఎవని, అంకే - ఒడియందు, శిరః - తలను, ఆధాయ - ఉంచి, లోకః - జనుడు, నిర్వృతః - సుఖించువాడై, స్వపితి - నిద్రించునో, స్వయమ్ - తాను, పశుః యథా - పశువు వలె, ధర్మమ్ - ధర్మమును గాని, అధర్మం వా - అధర్మమును గాని, న హి వేద - తెలియదు.

అజ్ఞానియగు సామాన్యమానవుడు తాను ధర్మాధర్మములను ఎరుంగడు. సామాన్యజనుడు ఒక గొప్పవానిని నమ్మి, ఆతని ఒడిలో తల నుంచి సుఖముగా నిద్రించును.

స కథం న్యర్పితాత్మానం కృతమైత్రమచేతనమ్ ।
విశ్రంభణీయో భూతానాం సఘృణో ద్రోగ్ధుమర్హతి ॥ 6

భూతానామ్ - ప్రాణులకు, విశ్రంభణీయః - నమ్మదగినవాడు, సఘృణః - దయ గలవాడు అగు, సః - అట్టి వ్యక్తి, న్యర్పిత-ఆత్మానమ్ - పూర్తిగా అర్పించబడిన తాను గలిగినట్టియు, కృతమైత్రమ్ - చేయబడిన మైత్రి కలిగిన, అచేతనమ్ - అజ్ఞానిని, కథమ్ - ఏ విధముగా, ద్రోగ్ధుమ్ - ద్రోహము చేయుటకు, అర్హతి - తగుచున్నాడు?

అజ్ఞానులగు జనులు ఎవనినైతే నమ్మి మైత్రిని నెరపి తమను తాము పూర్తిగా సమర్పించుకొందురో, అట్టి నమ్మదగిన మరియు దయ గల నాయకుడు, వారికి ద్రోహము చేయుటకు ఎట్లు తగును? తగడు.

అయం హి కృతనిర్వేశో జన్మకోట్యంహసామపి ।
యద్వ్యాజహార వివశో నామ స్వస్త్యయనం హరేః ॥ 7

అయమ్ - ఈతడు, హి - నిశ్చయముగా, జన్మకోటి-అంహసాం అపి - కోటి జన్మల పాపములకైననూ, కృతనిర్వేశః - చేయబడిన ప్రాయశ్చిత్తము గలవాడు, యత్ - ఏలయనగా, వివశః - స్వాధీనత తప్పినవాడై, స్వస్తి-అయనమ్ - కల్యాణములకు నిధానమగు, హరేః - శ్రీహరియొక్క, నామ - పేరును, వ్యాజహార - పలికెను.

ఈతడు కోటి జన్మల పాపములకైననూ నిశ్చయముగా ప్రాయశ్చిత్తమును చేసుకున్నాడు. ఏలయనగా, ఈతడు కల్యాణములకు నిలయమగు శ్రీహరి నామమును, ఉద్దేశ్యపూర్వకముగా కాకున్ననూ, పలికినాడు.

ఏతేనైవ హ్యఘోనోఽస్య కృతం స్యాదఘనిష్కృతమ్ ।
యదా నారాయణాయేతి జగాద చతురక్షరమ్ ॥ 8

అఘోనః - పాపియగు, అస్య - వీనికి, అఘనిష్కృతమ్ - పాపములకు నిష్కృతి, ఏతేన ఏవ - దీనిచేతనే, కృతం హి - చేయబడినది గదా!, యదా - ఎప్పుడైతే, నారాయణ - ఓ నారాయణా!, ఆయ - రమ్ము, ఇతి - అని, చతుర్-అక్షరమ్ - నాలుగు అక్షరముల నామమును, జగాద - పలికెనో.

ఈతడు ఎప్పుడైతే, నారాయణా! రమ్ము అని నాలుగు అక్షరముల నామమును ఉచ్చరించినాడో, అప్పుడు దానిచేతనే ఈ పాపియొక్క పాపములకు నిష్కృతి కలిగినది. ఇది నిశ్చయము.

స్తేనస్సురాపో మిత్రధ్రుగ్ బ్రహ్మహా గురుతల్పగః ।
స్త్రీరాజపితృగోహంతా యే చ పాతకినోఽపరే ॥ 9

సర్వేషామప్యఘవతామిదమేవ సునిష్కృతమ్ ।
నామవ్యాహరణం విష్ణోర్యతస్తద్విషయా మతిః ॥ 10

స్తేనః - బంగారమును దొంగిలించినవాడు, సురాపః - మద్యమును త్రాగువాడు, మిత్రధ్రుక్ - మిత్రునకు ద్రోహమును చేసినవాడు, బ్రహ్మహా - వేదవేత్తను చంపినవాడు, గురుతల్పగః - గురువుయొక్క భార్యను కోరినవాడు, స్త్రీరాజపితృగోహంతా - స్త్రీని రాజును తల్లిని తండ్రిని ఆవును ఎద్దును చంపినవాడు, అపరే - ఇతరులగు, పాతకినః - పాపులు, యే చ - ఇంకనూ ఎవరు గలరో, సర్వేషామ్ - అందరికి, అఘవతాం అపి - పాపులకు కూడ, ఇదం ఏవ - ఇదియే, సునిష్కృతమ్ - చక్కటి నిష్కృతి, విష్ణోః - విష్ణువుయొక్క, నామవ్యాహరణమ్ - నామము నుచ్చరించుట, యతః - దేనివలన, మతిః - బుద్ధి, తద్-విషయా - భగవదాకారమును పొందునో (ఆతడు విషయముగా గలది అగునో).

బంగారమును దొంగిలించినవాడు, మద్యము త్రాగువాడు, మిత్రునకు ద్రోహమును చేసినవాడు, వేదవేత్తను చంపినవాడు, గురువుయొక్క భార్యను కోరినవాడు, స్త్రీని రాజును తల్లిని తండ్రిని ఆవును లేదా ఎద్దును చంపినవాడు అను వారే గాక ఇంకనూ ఇతరములైన పాపములను చేసిన వారందరికి విష్ణువుయొక్క నామమును ఉచ్చరించుటయే చక్కటి ప్రాయ

శ్చిత్తము. నామమునుచ్చరించుట వలన వీని మనస్సు భగవదాకారము అగును. లేదా, భగవానునకు వీడు గుర్తుకు వచ్చి వీనిపై అనుగ్రహము కలుగును.

న నిష్కృతైరుదితైర్బ్రహ్మవాదిభిః
తథా విశుద్ధ్యత్యఘవాన్ వ్రతాదిభిః ।
యథా హరేర్నామపదైరుదాహృతైః
తదుత్తమశ్లోకగుణోపలంభకమ్ ॥ 11

బ్రహ్మవాదిభిః - వేదవేత్తలచే, ఉదితైః - చెప్పబడిన, నిష్కృతైః - ప్రాయశ్చిత్తములచే, వ్రత-ఆదిభిః - వ్రతములు మొదలగువాటిచే, అఘ వాన్ - పాపి, తథా - ఆ విధముగా, న విశుద్ధ్యతి - విశేషమగు శుద్ధిని పొందుటలేదు, యథా - ఏ విధముగానైతే, ఉదాహృతైః - ఉచ్చరించబడి న, హరేః - శ్రీహరియొక్క, నామపదైః - పేర్ల రూపములోనుండే పదము లచే, తత్ - అది, ఉత్తమశ్లోకగుణ-ఉపలంభకమ్ - గొప్ప కీర్తి గల శ్రీహరి యొక్క గుణములను ప్రకాశింప జేయునది.

వేదవేత్తలు పాపనిష్కృతికై వ్రతములు మొదలగు ప్రాయశ్చిత్తము లను చెప్పినారు. కాని కేవలము శ్రీహరి పేర్ల రూపములో నుండే పదము లను ఉచ్చరించి పాపి ఎట్టి విశేషమగు శుద్ధిని పొందుచున్నాడో, అట్టి విశుద్ధి ఆ ప్రాయశ్చిత్తములచే కలుగుట లేదు. పావనమగు కీర్తి గల శ్రీహరి పేరును ఉచ్చరించుట వలన, ఆయన గుణములు మనస్సునకు వచ్చును.

నైకాంతికం తద్ధి కృతేఽపి నిష్కృతే
మనః పునర్ధావతి చేదసత్పథే,
తత్కర్మనిర్హారమభీప్సతాం హరే-
ర్గుణానువాదః ఖలు సత్త్వభావనః ॥ 12

నిష్కృతే - ప్రాయశ్చిత్తము, కృతే అపి - చేయబడిననూ, మనః - మనస్సు, పునః - మరల, అసత్-పథే - చెడు మార్గమునందు, ధావతి చేత్ - పరుగెత్తినచో, తత్ - ఆ ప్రాయశ్చిత్తము, నైకాంతికమ్ - పూర్తిగా

పవిత్రము చేయునది కాదు, తత్ - అందువలన, కర్మనిర్హారమ్ - కర్మల యొక్క పూర్తి నాశమును, అభీప్సతామ్ - కోరువారలకు, హరేః - శ్రీహరి యొక్క, గుణ-అనువాదః - గుణములను కీర్తించుట, సత్త్వభావనః ఖలు - అంతఃకరణమును శుద్ధము చేయునది గదా!

ప్రాయశ్చిత్తమును చేసిన తరువాత మరల మనస్సు చెడు మార్గములోనికి వెళ్లినచో, ఆ ప్రాయశ్చిత్తము వాని అంతఃకరణమును పూర్తిగా శుద్ధము చేసినట్లు కానే కాదు. కావున, కర్మబంధమునుండి ఆత్యంతికమగు విముక్తిని కోరువారు శ్రీహరి గుణములను కీర్తించినచో, వారి అంతఃకరణము పూర్తిగా విశుద్ధమగును (తద్ద్వారా మోక్షము లభించును)

అథైనం మాపనయత కృతాశేషాఘనిష్కృతమ్ ।
యదసౌ భగవన్నామ మ్రియమాణస్సమగ్రహీత్ ।। 13

అథ - కావున, కృత-అశేష-అఘనిష్కృతమ్ - చేయబడిన అన్ని పాపములకు ప్రాయశ్చిత్తము గల, ఏనమ్ - వీనిని, మా అపనయత - నరకమార్గముగుండా కొనిపోవద్దు, యత్ - ఏలయనగా, అసౌ - ఈతడు, మ్రియమాణః - మరణించుచున్నవాడై, భగవత్-నామ - భగవానుని నామమును, సమగ్రహీత్ - చక్కగా స్వీకరించినాడో.

ఈతడు మరణిస్తూ భగవానుని నామమును చక్కగా ఉచ్చరించి, ఆ విధముగా తన పాపములన్నింటికీ ప్రాయశ్చిత్తమును చేసుకున్నాడు. కావున, మీరీతనిని నరకమార్గముగుండా కొనిపోవద్దు.

సాంకేత్యం పారిహాస్యం వా స్తోభం హేలనమేవ వా ।
వైకుంఠనామగ్రహణమశేషాఘహరం విదుః ।। 14

వైకుంఠనామగ్రహణమ్ - వైకుంఠవాసియగు శ్రీహరియొక్క నామమునుచ్చరించుట, సాంకేత్యమ్ - పెట్టుకున్న పేరు కాని, పారిహాస్యం వా - పరిహాసము కొరకు చేసినది గాని, స్తోభమ్ - (పాటలోని) ఊతపదము గాని, హేలనం ఏవ వా - గేలియే గాని, అశేష-అఘహరమ్ - అన్ని పాపములను పోగొట్టునదిగా, విదుః - తెలియుచున్నారు.

వైకుంఠవాసి (బుద్ధియందు చైతన్యమై ఉండువాడు) యగు శ్రీహరియొక్క నామమును ఇంకొకరి పేరును పిలిచినప్పుడు గాని, పరిహాసము కొరకు గాని, పాటలో ఊతపదముగా గాని, ఒకనిని గేలి చేయుటకు గాని ఉచ్చరించినా, పాపములన్నియు నశించునని మహాత్ములు ఎరుగుదురు.

పతితః స్ఖలితో భగ్నస్సందష్టస్తప్త ఆహతః ।
హరిరిత్యవశేనాహ పుమాన్నార్హతి యాతనామ్ ॥ 15

పతితః - పడినవాడు, స్ఖలితః - జారినవాడు, భగ్నః - అవయవము విరిగినవాడు, సందష్టః - కరువబడినవాడు, తప్తః - తాపమును పొందినవాడు, ఆహతః - కొట్టబడినవాడు, హరిః - హరి, ఇతి - అని, పుమాన్ - వ్యక్తి, అవశేన - బుద్ధిపూర్వకముగా కాకుండా, ఆహ - పలికెను, యాతనామ్ - యాతనను, న అర్హతి - తగడు.

మానవుడు పడినప్పుడు గాని, జారినప్పుడు గాని, అవయవమేదైనా విరిగినప్పుడు గాని, ఏదైనా కరిచినప్పుడు గాని, ఎండ మొదలగువాటి తాపము కలిగినప్పుడు గాని, కఱ్ఱ మొదలగువాటి దెబ్బ తగిలినప్పుడు గాని, బుద్ధిపూర్వకముగా కాకపోయినా, హరి అనే నామమునుచ్చరించినచో, ఆతడు నరకయాతనలకు అర్హుడు కాడు.

గురూణాం చ లఘూనాం చ గురూణి చ లఘూని చ ।
ప్రాయశ్చిత్తాని పాపానాం జ్ఞాత్వోక్తాని మహర్షిభిః ॥ 16

గురూణాం చ - పెద్ద, పాపానామ్ - పాపములకు, గురూణి చ - పెద్ద, ప్రాయశ్చిత్తాని - ప్రాయశ్చిత్తములు, లఘూనాం చ - చిన్నవాటికి, లఘూని చ - చిన్నవి కూడ, మహర్షిభిః - మహర్షులచే, జ్ఞాత్వా - తెలుసుకొని, ఉక్తాని - చెప్పబడినవి.

మహర్షులు విచారణ చేసియే పెద్ద పాపములకు పెద్ద ప్రాయశ్చిత్తములను, చిన్నవాటికి చిన్నవాటిని చెప్పిరి.

తైస్తాన్యఘాని పూయంతే తపోదానజపాదిభిః ।
నాధర్మజం తద్ధృదయం తదపీశాంఘ్రిసేవయా ॥ 17

తైః - ఆ, తపః-దానజప-ఆదిభిః - తపస్సు దానము జపము మొదలగువాటిచే, తాని - ఆ, అఘాని - పాపములు, పూయంతే - వినాశము చేయబడుచున్నవి, అధర్మజమ్ - అధర్మము పుట్టిన, తద్-హృదయమ్ - వాని అంతఃకరణము, న - కాదు, తత్ అపి - అది కూడ, ఈశ-అంఘ్రిసేవయా - ఈశ్వరుని పాదములను సేవించుటచే.

తపస్సు, దానము, జపము మొదలగు ప్రాయశ్చిత్తములచే పాపములు వినాశమును పొందవచ్చును. కాని, అధర్మసంకల్పమునకు జన్మనిచ్చిన అంతఃకరణము శుద్ధము కాదు. ఈశ్వరుని పాదములను సేవించినచో, అంతఃకరణము కూడ శుద్ధమగును.

అజ్ఞానాదథవా జ్ఞానాదుత్తమశ్లోకనామ యత్ ।
సంకీర్తితమఘం పుంసో దహేదేధో యథాఽనలః ॥ 18

అజ్ఞానాత్ - అజ్ఞానము వలన గాని, అథవా - లేక, జ్ఞానాత్ - జ్ఞానము వలన గాని, యత్ - ఏ, ఉత్తమశ్లోకనామ - పవిత్రకీర్తియగు శ్రీహరి నామము, సంకీర్తితమ్ - చక్కగా కీర్తించబడినదో అది, పుంసః - వ్యక్తియొక్క, అఘమ్ - పాపమును, అనలః - అగ్ని, ఏధః యథా - వంట చెరకును వలె, దహేత్ - దహించును.

మానవుడు తెలిసి గాని, తెలియక గాని పవిత్రకీర్తియగు శ్రీహరి నామము నుచ్చరించినచో, అది వాని పాపమును, నిప్పు కట్టెను వలె తగులబెట్టును.

యథాఽగదం వీర్యతమముపయుక్తం యదృచ్ఛయా ।
అజానతోఽప్యాత్మగుణం కుర్యాన్మంత్రోఽప్యుదాహృతః ॥ 19

యథా - ఏ విధముగానైతే, వీర్యతమమ్ - మిక్కిలి శక్తివంతమైనది, యదృచ్ఛయా - అనుకోకుండా, ఉపయుక్తమ్ - వాడబడిన, అగదమ్ - మందు, అజానతః అపి - తెలియనివానికి కూడ, ఆత్మగుణమ్ - తన గుణమును, కుర్యాత్ - చేయునో, ఉదాహృతః - ఉచ్చరించబడిన, మంత్రః అపి - మంత్రము కూడ.

మంచి శక్తి గల మందును ఒకడు తెలియకుండానే అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే) వాడినచో, ఆ మందు తన గుణమును చూపును. అదే విధముగా, హరినామమంత్రము నుచ్చరిస్తే, దాని ప్రభావము కనబడి తీరును.

శ్రీశుక ఉవాచ ।
త ఏవం సువినిర్ణీయ ధర్మం భాగవతం నృప ।
తం యామ్యపాశాన్నిర్ముచ్య విప్రం మృత్యోరమూముచన్।20

నృప - ఓ మహారాజా!, తే - వారు, ఏవమ్ - ఈ విధముగా, భాగవతమ్ - భగవంతునకు చెందిన, ధర్మమ్ - ధర్మమును, సువినిర్ణీయ - చక్కగా విశేషముగా నిర్ధారించి, తమ్ - ఆ, విప్రమ్ - అజామిలుని, యామ్యపాశాత్ - యమునకు చెందినవారి పాశమునుండి, నిర్ముచ్య - విడిపించి, మృత్యోః - మరణమునుండి, అమూముచన్ - విడిపించిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ మహారాజా! వారీ విధముగా భగవద్భక్తి అనే ధర్మమును చక్కగా వివరముగా నిర్ధారించి, ఆ అజామిలుని యమదూతల పాశమునుండి మాత్రమే గాక, మరణమునుండి కూడ విముక్తుని చేసిరి.

ఇతి ప్రత్యుదితా యామ్యా దూతా యాత్వా యమాంతికే ।
యమరాజ్ఞే యథా సర్వమాచచక్షురరిందమ ॥ 21

అరిందమ - శత్రువులను నియంత్రించినవాడా!, యామ్యాః - యమునకు చెందిన, దూతాః - దూతలు, ఇతి - ఈ విధముగా, ప్రతి-ఉదితాః - బదులు చెప్పబడినవారై, యమ-అంతికే - యముని సమీపమునందు, యాత్వా - వెళ్లి, యమరాజ్ఞే - యమరాజు కొరకు, సర్వమ్ - అంతనూ, యథా - యథాతథముగా, ఆచచక్షుః - చెప్పిరి.

అంతశ్శత్రువులను నియమించిన ఓ రాజా! విష్ణుదూతలీ విధముగా బదులీయగా, యమదూతలు యముని వద్దకు వెళ్లి, జరిగిన వృత్తాంతమునంతను పూస గుచ్చినట్లు చెప్పిరి.

ద్విజః పాశాద్వినిర్ముక్తో గతభీః ప్రకృతిం గతః ।
వవందే శిరసా విష్ణోః కింకరాన్ దర్శనోత్సవః ॥ 22

పాశాత్ - పాశమునుండి, వినిర్ముక్తః - విడిపించబడినవాడు, గతభీః - పోయిన భయము గలవాడు, ప్రకృతిమ్ - స్వస్థతను, గతః - పొందినవాడు, దర్శన-ఉత్సవః - వారిని చూచుటచే ఆనందము గలవాడు అగు, ద్విజః - బ్రాహ్మణుడు, శిరసా - శిరస్సుతో, విష్ణోః - విష్ణువుయొక్క, కింకరాన్ - అనుచరులను, వవందే - నమస్కరించెను.

మృత్యుపాశమునుండి విముక్తుడైన అజామిలునకు విష్ణువు యొక్క అనుచరులను చూచుటచే ఆనందము కలిగెను. భయము తొలగి ఆతనికి స్వస్థత చిక్కెను. అపుడాతడు వారికి తల వంచి నమస్కరించెను.

తం వివక్షుమభిప్రేత్య మహాపురుషకింకరాః ।
సహసా పశ్యతస్తస్య తత్రాంతర్దధిరేఽనఘ ॥ 23

అనఘ - ఓ పుణ్యాత్మా!, మహాపురుషకింకరాః - పురుషోత్తముని అనుచరులు, తమ్ - ఆ అజామిలుని, వివక్షుమ్ - మాటలాడ గోరుచున్న వానినిగా, అభిప్రేత్య - గమనించి, సహసా - వెంటనే, తస్య - ఆతడు, పశ్యతః - చూచుచుండగా, తత్ర - అచట, అంతః-దధిరే - అంతర్ధానము చెందిరి.

పుణ్యాత్ముడవగు ఓ మహారాజా! ఆ అజామిలుడు ఏదో చెప్పబోతున్నాడని గమనించిన పురుషోత్తముని అనుచరులు వెంటనే, ఆతడు చూచుచుండగనే అచట అంతర్ధానమైరి.

అజామిలోఽప్యథాకర్ణ్య దూతానాం యమకృష్ణయోః ।
ధర్మం భాగవతం శుద్ధం త్రైవిద్యం చ గుణాశ్రయమ్ ॥ 24

భక్తిమాన్ భగవత్యాశు మాహాత్మ్యశ్రవణాద్ధరేః ।
అనుతాపో మహానాసీత్స్మరతోఽశుభమాత్మనః ॥ 25

అజామిలః అపి - అజామిలుడు కూడ, యమకృష్ణయోః - యముని మరియు శ్రీహరియొక్క, దూతానామ్ - దూతలయొక్క, భాగవతమ్ - భగవానునకు చెందినట్టియు, శుద్ధమ్ - విశుద్ధమైన, ధర్మమ్ - ధర్మమును, త్రైవిద్యమ్ - మూడు వేదములకు చెందినట్టియు, గుణ-ఆశ్రయం చ - త్రిగుణాత్మకమగు సంసారము ఆశ్రయముగా గల ధర్మమును కూడ, ఆకర్ణ్య - విని, అథ - తరువాత, హరేః - శ్రీహరియొక్క, మాహాత్మ్యశ్రవణాత్ - మహిమను వినుట వలన, ఆశు - వెంటనే, భగవతి - భగవానునియందు, భక్తిమాన్ - భక్తి గలవాడు, ఆత్మనః - తన, అశుభమ్ - పాపమును, స్మరతః - గుర్తుకు తెచ్చుకున్న వానికి, మహాన్ - అధికమగు, అనుతాపః - పశ్చాత్తాపము, ఆసీత్ - కలిగెను.

వేదోక్తమైనది, సత్త్వరజస్తమోగుణాత్మకమగు సంసారమే ఆశ్రయముగా గలది అగు ప్రవృత్తిధర్మమును యమదూతలు చెప్పిరి. విశుద్ధమగు భాగవత ధర్మమును విష్ణుదూతలు చెప్పిరి. ఈ రెండింటినీ అజామిలుడు వినెను. శ్రీహరియొక్క మహిమను గురించి వినుటచే ఆతనికి అపుడు వెంటనే భగవద్భక్తి ఉదయించెను. ఆతడు తన పాపములను గుర్తుకు తెచ్చుకొని, అధికమగు పశ్చాత్తాపమును పొందెను.

**అహో మే పరమం కష్టమభూదవిజితాత్మనః ।**
**యేన విప్లావితం బ్రహ్మ వృషల్యాం జాయతాత్మనా ॥ 26**

అహో - అయ్యో!, అవిజిత-ఆత్మనః - జయించబడని మనస్సు గల, మే - నాకు, పరమమ్ - గొప్ప, కష్టమ్ - ఆపద, అభూత్ - కలిగెను, వృషల్యామ్ - దాసియందు, ఆత్మనా - పుత్రరూపముగా, జాయతా - జన్మించిన, యేన - ఏ నాచే, బ్రహ్మ - వేదము, విప్లావితః - నశింప జేయబడినదో.

అయ్యో! మనోజయము నెరుంగని నాకు పెద్ద ఆపద కలిగినది. నేను దాసియందు పుత్రుని రూపములో జన్మించి (పుత్రుని కని), వేదధర్మమును నాశము జేసితిని.

ధిఙ్మాం విగర్హితం సద్భిర్దుష్కృతం కులకజ్జలమ్ ।
హిత్వా బాలాం సతీం యోఽహం సురాపామసతీమగామ్ ।27

సద్భిః - సత్పురుషులచే, విగర్హితమ్ - నిందించబడినట్టియు, దుష్కృతమ్ - పాపములను చేసినట్టియు, కులకజ్జలమ్ - వంశమునకు కలంకమైన, మామ్ - నన్ను గురించి, ధిక్ - నింద యగుగాక!, యః - ఏ, అహమ్ - నేను, బాలామ్ - అమయాకురాలైనట్టియు, సతీమ్ - పతివ్రత యగు భార్యను, హిత్వా - విడిచిపెట్టి, సురాపామ్ - మద్యమును త్రాగే, అసతీమ్ - దుష్టురాలిని, అగామ్ - పొందితినో.

పాపినియగు నేను సత్పురుషులచే నిందించబడితిని. వంశమునకు కలంకమగు నాకు ధిక్కారమగుగాక! అమాయకురాలు, పతివ్రత అగు భార్యను విడిచి, నేను మద్యమును త్రాగే దుష్టురాలిని పొందితిని.

వృద్ధావనాథౌ పితరౌ నాన్యబంధూ తపస్వినౌ ।
అహో మయాఽధునా త్యక్తావకృతజ్ఞేన నీచవత్ ॥ 28

అహో - అయ్యో!, వృద్ధౌ - పెద్దవారు, అనాథౌ - రక్షకుడు లేనివారు, న-అన్యబంధూ - మరో బంధువులు లేనివారు, తపస్వినౌ - దుఃఖితులు అగు, పితరౌ - తల్లిదండ్రులు, అకృతజ్ఞేన - కృతఘ్నుడనగు, మయా - నాచే, అధునా - వెంటనే, నీచవత్ - నీచుడు వలె, త్యక్తౌ - విడిచిపెట్టబడిరి.

అయ్యో! మరో రక్షకుడు గాని, ఇంకో బంధువులు గాని లేనివారై పరితపిస్తూ ఉండే నా తల్లిదండ్రులను కృతఘ్నుడనగు నేను ఆ కాలములో ఆమెను కలిసిన వెంటనే విడిచిపెట్టితిని. నేను నీచుడను.

సోఽహం వ్యక్తం పతిష్యామి నరకే భృశదారుణే ।
ధర్మఘ్నాః కామినో యత్ర విందంతి యమయాతనాః ॥ 29

సః - అట్టి, అహమ్ - నేను, వ్యక్తమ్ - ఖచ్చితముగా, భృశదారుణే - మిక్కిలి దారుణమైన, నరకే - నరకమునందు, పతిష్యామి - పడగలను, యత్ర - ఎక్కడనైతే, ధర్మఘ్నాః - ధర్మమును పాడు చేసే, కామినః

- కాముకులు, యమయాతనాః - యమయాతనలను, విందంతి - పొందె దరో.

అట్టి నేను ఖచ్చితముగా మిక్కిలి దారుణమగు నరకములో పడెద ను. అచట ధర్మమును చెడగొట్టే కాముకులు యమయాతనల ననుభవించె దరు.

**కిమిదం స్వప్న ఆహోస్విత్ సాక్షాద్దృష్టమిహాద్భుతమ్ ।**
**క్వ యాతా అద్య తే యే మాం వ్యకర్షన్ పాశపాణయః ।।30**

ఇదమ్ - ఈ, అద్భుతమ్ - ఆశ్చర్యము, స్వప్నః కిమ్ - స్వప్నమా యేమి?, ఆహోస్విత్ - అట్లు గాక, ఇహ - ఇక్కడ, సాక్షాత్ - ప్రత్యక్షముగా, దృష్టమ్ - చూడబడినదా?, పాశపాణయః - పాశములు చేతులయందు గల, తే - వారు, క్వ - ఎచటకు, యాతాః - వెళ్లిరి?, యే - ఎవరైతే, మామ్ - నన్ను, వ్యకర్షన్ - లాగివేసిరో.

నేను చూసిన ఈ అద్భుతము స్వప్నమా యేమి? లేక, నేను ఇక్కడ ప్రత్యక్షముగనే చూచితినా? చేతులలోని పాశములతో నన్ను లాగి వేసిన ఆ కింకరులు ఎక్కడకు వెళ్లినారు?

**అథ తే క్వ గతాస్సిద్ధాశ్చత్వారశ్చారుదర్శనాః ।**
**వ్యమోచయన్నీయమానం బద్ధ్వా పాశైరధో భువః ।। 31**

అథ - మరియు, తే - ఆ, చారుదర్శనాః - సుందరమగు రూపము గల, చత్వారః - నల్గురు, సిద్ధాః - సిద్ధ పురుషులు, క్వ - ఎచట కు, గతాః - వెళ్లినారు?, పాశైః - త్రాళ్లతో, బద్ధ్వా - కట్టి, భువః - భూమికి, అధః - క్రిందకు, నీయమానమ్ - కొనిపోబడుచున్న నన్ను, వ్యమోచయన్ - విడిపించిరి.

మరియు ఆ నల్గురు సుందరాకారులగు సిద్ధపురుషులు ఎచటకు వెళ్లినారు? త్రాళ్లతో కట్టి పాతాళమునకు కొనిపోబడుచున్న నన్ను వారు విడిపించిరి.

అథాపి మే దుర్భగస్య విబుధోత్తమదర్శనే ।
భవితవ్యం మంగలేన యేనాత్మా మే ప్రసీదతి ॥ 32

అథాపి - అయినప్పటికీ, దుర్భగస్య - దురదృష్టవంతుడనగు, మే - నాకు, విబుధ-ఉత్తమదర్శనే - దేవతోత్తముల దర్శనమునందు, మంగలేన భవితవ్యమ్ - పుణ్యము ఉండి యుండవలెను, యేన - దేనిచే, ఆత్మా - మనస్సు, ప్రసీదతి - ప్రసన్నమగునో.

అయిననూ, దురదృష్టవంతుడనగు నాకు దేవతోత్తముల దర్శనము కలిగినది. అట్టివారిని దర్శించుటచే మనస్సు ప్రసన్నమగును. నాలో ఏదో ఒక పూర్వపుణ్యము ఉండి యుండవలెను.

అన్యథా మ్రియమాణస్య నాశుచేర్వృషలీపతేః ।
వైకుంఠనామగ్రహణం జిహ్వా వక్తుమిహార్హతి ॥ 33

అన్యథా - అట్లు గానిచో, మ్రియమాణస్య - మరణించుచున్నట్టియు, అశుచేః - శౌచము లేనట్టియు, వృషలీపతేః - దాసీభర్తనగు నాయొక్క, జిహ్వా - నాలుక, ఇహ - ఈ జన్మయందు, వైకుంఠనామగ్రహణమ్ - శ్రీహరి నామమును గ్రహించుటను, వక్తుమ్ - చేయుటకు, (గ్రహణమ్ - మనస్సును కట్టివేసే, వైకుంఠనామ - శ్రీహరి నామమును, వక్తుమ్ - పలుకుటకు), న అర్హతి - తగదు.

దాసీభర్తనగు నాయందు శౌచము లేదు. పూర్వపుణ్యము లేనిచో, మరణించుచున్న నా నాలుక మనస్సును కట్టివేసే శ్రీహరినామమును పలికి యుండెడిది గాదు.

క్వ చాహం కితవః పాపో బ్రహ్మఘ్నో నిరపత్రపః ।
క్వ చ నారాయణేత్యేతద్భగవన్నామ మంగలమ్ ॥ 34

కితవః - మోసగాడను, పాపః - పాపిని, బ్రహ్మఘ్నః - వేదమును చెడగొట్టినవాడను, నిరపత్రపః - సిగ్గు లేనివాడను అగు, అహమ్ - నేను, క్వ చ - ఎక్కడ?, నారాయణ - ఓ నారాయణా!, ఇతి - అనే, ఏతత్ - ఈ,

మంగలమ్ - మంగళకరమగు, భగవత్-నామ - భగవానుని నామము, క్వ చ - ఎక్కడ?

మోసగాడను, పాపిని, సిగ్గు లేకుండా వేదధర్మమును చెడగొట్టిన వాడను అగు నేనెక్కడ? ఓ నారాయణా! అనే ఈ మంగళకరమగు భగవన్నామమెక్కడ? (నా పూర్వపుణ్యము చేతనే నాకీ నామము దక్కినది).

సోహం తథా యతిష్యామి యతచిత్తేంద్రియానిలః ।
యథా న భూయ ఆత్మానమంధే తమసి మజ్జయే ॥ 35

సః - అట్టి, అహమ్ - నేను, యతచిత్త-ఇంద్రియ-అనిలః - నియమించబడిన మనస్సు ఇంద్రియములు ఉచ్ఛ్వాసనిశ్వాసలు గలవాడనై, తథా - ఆ విధముగా, యతిష్యామి - సాధన చేసెదను, యథా - ఏ విధముగానైతే, భూయః - మరల, ఆత్మానమ్ - నన్ను, అంధే - అజ్ఞానముతో నిండిన, తమసి - నరకమునందు, న మజ్జయే - ముంచుకొననో.

అట్టి నేను ఉచ్ఛ్వాసనిశ్వాసలను (ప్రాణాయామము), ఇంద్రియములను (ప్రత్యాహారము), మనస్సును (ధారణ) నియంత్రించి సాధన చేసి, మరల మోహపూర్ణమగు నరకములో మునిగిపోకుండా నన్ను నేను కాపాడుకొనెదను.

విముచ్య తమిమం బంధమవిద్యాకామకర్మజమ్ ।
సర్వభూతసుహృచ్ఛాంతో మైత్రః కరుణ ఆత్మవాన్ ॥ 36

మోచయే గ్రస్తమాత్మానం యోషిన్మయ్యాఽఽత్మమాయయా।
విక్రీడితో యయైవాహం క్రీడామృగ ఇవాధమః ॥ 37

తమ్ - ఆ, ఇమమ్ - ఈ, అవిద్యాకామకర్మజమ్ - అజ్ఞానము కోరికలు కర్మలనుండి పుట్టే, బంధమ్ - బంధమును, విముచ్య - విడిచిపెట్టి, సర్వభూతసుహృత్ - సకలప్రాణుల హితమును కోరువాడను, శాంతః - శాంతుడను, మైత్రః - స్నేహశీలిని, కరుణః - దయ గలవాడను, ఆత్మవాన్ - సంయమము గలవాడనై, యోషిత్-మయ్యా - స్త్రీరూపములోనున్న, ఆత్మమాయయా - శ్రీహరియొక్క మాయచే, గ్రస్తమ్ - పట్టుకొనబడి

న, ఆత్మానమ్ - నన్ను, మోచయే - విడిపించు కొనెదను, అధమః - అధముడనగు, అహమ్ - నేను, యయా ఏవ - ఏ మాయచేతనే, క్రీడామృగః ఇవ - కోతి వలె, విక్రీడితః - ఆడించబడితినో.

ఆత్మస్వరూపము తెలియకుండుట, దాని వలన కోరికలు, వాటి వలన కర్మలు, వాటి వలన బంధము కలుగును. అట్టి ఈ బంధమును విడిచిపెట్టి, నేను సకలప్రాణుల హితమును కోరుతూ, శాంతముగా స్నేహశీలముతో దయాగుణముతో ఇంద్రియజయము కలిగి యుండెదను. స్త్రీరూపములోనున్న శ్రీహరియొక్క మాయ అధముడనగు నన్ను పట్టుకొని, కోతిని చేసి యాడించినది. ఆ మాయనుండి నన్ను నేను విడిపించు కొనెదను.

మమాఽహమితి దేహాదౌ హిత్వా మిథ్యాఽర్థధీర్మతిమ్ ।
ధాస్యే మనో భగవతి శుద్ధం తత్కీర్తనాదిభిః ॥ 38

మిథ్యా-అర్థధీః - మిథ్యయగు భోగవస్తువులయందు బుద్ధి గల నేను, దేహ-ఆదౌ - దేహము మొదలగువాటియందు, అహమ్ - నేను, మమ - నాది, ఇతి - అనే, మతిమ్ - బుద్ధిని, హిత్వా - విడిచిపెట్టి, తత్-కీర్తన-ఆదిభిః - ఆ భగవానుని కీర్తించుట మొదలగువాటిచే, శుద్ధమ్ - పరిశుద్ధమైన, మనః - మనస్సును, భగవతి - భగవానునియందు, ధాస్యే - నిలిపెదను.

భోగ్యములగు విషయములు అనిత్యములు. నా బుద్ధి వాటియందు తగుల్కొని యుండెను. నేను దేహమునందు, మనస్సునందు నేను మరియు నాది అనే ధారణను విడిచిపెట్టెదను. భగవానుని కీర్తించుట మొదలగు సాధనలచే అంతఃకరణమును విశుద్ధమొనర్చుకొని, నేను నా మనస్సును భగవానునిపై నిలిపెదను.

శ్రీశుక ఉవాచ ।
ఇతి జాతసునిర్వేదః క్షణసంగేన సాధుషు ।
గంగాద్వారముపేయాయ ముక్తసర్వానుబంధనః ॥ 39

**ఇతి** - ఈ విధముగా, సాధుషు - సత్పురుషులయందు, క్షణసంగేన - కొద్ది సేపు సంగముచే, జాతసునిర్వేదః - కలిగిన చక్కని వైరాగ్యము గలవాడై, ముక్తసర్వ-అనుబంధనః - విడిచిపెట్టబడిన అన్ని ఆసక్తులు గలవాడై, గంగాద్వారమ్ - హరిద్వారమును, ఉపేయాయ - చేరెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఈ విధముగా కొద్ది సేపు సత్పురుషులతోడి సంగము వలన ఆతనికి చక్కని వైరాగ్యము కలిగెను. ఆతడు సంసారవిషయములన్నింటియందు ఆసక్తిని విడిచిపెట్టి, హరిద్వారమును చేరుకొనెను.

స తస్మిన్ దేవసదన ఆసీనో యోగమాశ్రితః ।
ప్రత్యాహృతేంద్రియగ్రామో యుయోజ మన ఆత్మని ॥ **40**

సః - ఆతడు, తస్మిన్ - ఆ, దేవసదనే - దేవతల స్థానమునందు, ఆసీనః - కూర్చున్నవాడై, యోగమ్ - యోగమార్గమును, ఆశ్రితః - ఆశ్రయించినవాడై, ప్రతి-ఆహృత-ఇంద్రియగ్రామః - వెనుకకు ఉపసంహరించబడిన ఇంద్రియముల సముదాయము గలవాడై, మనః - మనస్సును, **ఆత్మని** - **ఆత్మ**యందు, యుయోజ - కలిపెను.

**ఆతడు ఆ** దేవస్థానమునందు కూర్చుండి యోగమార్గమును స్వీకరించెను. ఆతడు ఇంద్రియ సముదాయమును విషయములనుండి ఉపసంహరించి (ప్రత్యాహారము) మనస్సును ఆత్మయందు విలీనము చేసెను.

తతో గుణేభ్య ఆత్మానం వియుజ్యాత్మసమాధినా ।
యుయుజే భగవద్ధామ్ని బ్రహ్మణ్యనుభవాత్మని ॥ **41**

తతః - తరువాత ఆత్మానమ్ - మనస్సును, గుణేభ్యః - గుణములనుండి, వియుజ్య - విడదీసి, ఆత్మసమాధినా - చిత్తైకాగ్రతచే, భగవద్-ధామ్ని - భగవానుని నివాసస్థానమైన హృదయమునందు, అనుభవ-ఆత్మని - జ్ఞానరూపమైన, బ్రహ్మణి - పరబ్రహ్మయందు, యుయుజే - విలీనము చేసెను.

ఆతడు క్రమముగా మనస్సును గుణకార్యములగు దేహేంద్రియ మనోవృత్తులనుండి వివిక్తము చేసి ఆత్మనిష్ఠుడయ్యెను. భగవానుడు హృదయమునందు నిర్విశేష జ్ఞానరూపుడై యున్నాడు. అట్టి బ్రహ్మ-అభిన్నమగు ఆత్మయందు ఆతడు మనస్సును విలీనము చేసెను.

యర్హ్యుపారతధీస్తస్మిన్నద్రాక్షీత్పురుషాన్ పురః ।
ఉపలభ్యోపలబ్ధాన్ ప్రాగ్ వవందే శిరసా ద్విజః ॥ 42

యర్హి - ఏ కాలమునందైతే, తస్మిన్ - ఆ భగవానువియందు, ఉపారతధీః - నిశ్చలమగు మనస్సు గల, ద్విజః - బ్రాహ్మణుడు, పురః - ఎదుట, ప్రాక్ - పూర్వము, ఉపలబ్ధాన్ - చూడబడిన, పురుషాన్ - పురుషులను, అద్రాక్షీత్ - చూచెనో, ఉపలభ్య - గుర్తు పట్టి; శిరసా - శిరస్సుతో, వవందే - నమస్కరించెను.

అజామిలుడు భగవానునియందు మనస్సును లగ్నము చేసియుండగా, ఆతనికి తన యెదుట శ్రీహరి అనుచరులు కనబడిరి. వారు ఆతడు ఇదివరలో చూచినవారే. అపుడాతడు వారిని గుర్తు పట్టి, తల వంచి నమస్కరించెను.

హిత్వా కలేవరం తీర్థే గంగాయాం దర్శనాదను ।
సద్యస్స్వరూపం జగృహే భగవత్పార్శ్వవర్తినామ్ ॥ 43

దర్శనాత్ - దర్శనముకంటె, అను - తరువాత, కలేవరమ్ - దేహమును, తీర్థే - పుణ్యక్షేత్రమగు హరిద్వారమునందు, గంగాయామ్ - గంగయందు, హిత్వా - విడిచిపెట్టి, సద్యః - వెంటనే, భగవత్-పార్శ్వవర్తినామ్ - భగవానుని అనుచరుల, స్వరూపమ్ - రూపమును, జగృహే - స్వీకరించెను.

వారి దర్శనము తరువాత ఆతడు హరిద్వారములోని గంగ ఒడ్డున దేహమును విడిచిపెట్టి, వెంటనే భగవంతుని అనుచరుల రూపమును స్వీకరించెను.

సాకం విహాయసా విప్రో మహాపురుషకింకరైః।
హైమం విమానమారుహ్య యయౌ యత్ర శ్రియః పతిః ।।44

విప్రః - ఆ బ్రాహ్మణుడు, మహాపురుషకింకరైః సాకమ్ - పురుషోత్తముని అనుచరులతో బాటు, హైమమ్ - బంగరు, విమానమ్ - విమానమును, ఆరుహ్య - ఎక్కి, విహాయసా - ఆకాశముచే, యయౌ - వెళ్లెను, యత్ర - ఎక్కడనైతే, శ్రియః - లక్ష్మీదేవియొక్క, పతిః - భర్త గలడో.

అజామిలుడు శ్రీహరి పార్షదులతో బాటుగా బంగరు విమానము నెక్కి ఆకాశమార్గములో లక్ష్మీపతి ఉన్న స్థానము (వైకుంఠము)నకు వెళ్లెను.

ఏవం స విప్లావితసర్వధర్మా
దాస్యాః పతిః పతితో గర్హ్యకర్మణా ।
నిపాత్యమానో నిరయే హతవ్రతః
సద్యో విముక్తో భగవన్నామ గృహ్ణన్ ।। 45

ఏవమ్ - ఈ విధముగా, విప్లావితసర్వధర్మా - నాశము చేయబడిన అన్ని ధర్మములు గలవాడు, దాస్యాః - దాసికి, పతిః - భర్త, గర్హ్యకర్మణా - నిందించదగిన పనిచే, పతితః - పతితుడు, నిరయే - నరకమునందు, నిపాత్యమానః - పడవేయబడుచున్నవాడు, హతవ్రతః - చెడిన వ్రతములు గలవాడు అగు, సః - ఆ అజామిలుడు, భగవత్-నామ - భగవానుని నామమును, గృహ్ణన్ - స్వీకరించువాడై, సద్యః - వెంటనే, విముక్తః - మోక్షమును పొందెను.

ఈ విధముగా అజామిలుడు దాసీకి భర్తయై ధర్మములనన్నింటినీ నాశము చేసుకొని, నిందించదగిన కర్మలచే పతితుడై, చెడిన వ్రతములు గలవాడయ్యెను. అతనిని నరకములో పడద్రోయుటకు యమదూతలు సిద్ధమైరి. అట్టి స్థితిలో ఆతడు భగవానుని నామమునుచ్చరించి, వెంటనే మోక్షమును పొందెను.

నాతః పరం కర్మనిబంధకృంతనం
ముముక్షతాం తీర్థపదానుకీర్తనాత్ ।

న యత్పునః కర్మసు సజ్జతే మనో
రజస్తమోభ్యాం కలిలం తతోఽన్యథా ॥ 46

అతః - ఇందువలన, ముముక్షతామ్ - మోక్షమును కోరువారలకు, తీర్థపద-అనుకీర్తనాత్ - పవిత్రమగు పాదములు గల శ్రీహరిని నిరంతరముగా కీర్తించుటకంటె, పరమ్ - గొప్ప, కర్మనిబంధకృంతనమ్ - కర్మబంధమును (కర్మలకు మూలమగు అజ్ఞానమును) తెగగొట్టునది, న - లేదు, యత్ - ఏలయనగా, మనః - మనస్సు, పునః - మరల, కర్మసు - కర్మలయందు, న సజ్జతే - ఆసక్తిని పొందదు, తతః - దానికంటె, అన్యథా - భిన్నమైనవాటిచే, రజః-తమోభ్యామ్ - రజస్తమోగుణములచే, కలిలమ్ - మలినమగును.

కావున, మోక్షమును కోరువారలకు కర్మబంధమును (కర్మలకు మూలమగు అజ్ఞానమును) తెగగొట్టుటకు పవిత్రమగు పాదములు గల శ్రీహరిని నిరంతరముగా కీర్తించుట కంటె గొప్ప ఉపాయము మరియొకటి లేదు. ఏలయనగా, దీని వలన మనస్సు మరల కర్మలయందు ఆసక్తి గలది కాదు. దీనికి భిన్నమగు ఉపాయముల ననుష్ఠించినచో, మనస్సు రజస్తమోగుణములచే మలినమగుట తప్పదు.

య ఏవం పరమం గుహ్యమితిహాసమఘాపహమ్ ।
శృణుయాచ్ఛ్రద్ధయా యుక్తో యశ్చ భక్త్యాఽనుకీర్తయేత్ ॥ 47

న వై స నరకం యాతి నేక్షితో యమకింకరైః ।
యద్యప్యమంగలో మర్త్యో విష్ణులోకే మహీయతే ॥ 48

యః - ఏ, మర్త్యః - మానవుడు, అమంగలః యది అపి - పాపియే అయిననూ, ఏవమ్ - ఈ విధముగా, పరమమ్ - గొప్ప, గుహ్యమ్ - రహస్యమైనట్టియు, అఘ-అపహమ్ - పాపములను పోగొట్టే, ఇతిహాసమ్ - వృత్తాంతమును, శ్రద్ధయా - శ్రద్ధతో, యుక్తః - కూడినవాడై, శృణుయాత్ - వినునో, యః చ - ఎవడైతే, భక్త్యా - భక్తితో, అనుకీర్తయేత్ - నిరంతరము కీర్తించునో, సః - అతడు, నరకమ్ - నరకమును, న యాతి వై - పొందనే పొందడు, యమకింకరైః - యముని కింకరులచే, న ఈక్షితః

- చూడబడడు, విష్ణులోకే - విష్ణులోకమునందు, మహీయతే - వన్నె గాంచును.

పాపియే అయిననూ ఏ మానవుడైతే పాపములను పోగొట్టే ఈ గొప్ప రహస్యమగు ఇతిహాసమును శ్రద్ధతో వినునో, మరియు భక్తితో నిరంతరముగా భగవానుని కీర్తించునో, అట్టివాడు నరకమును పొందే ప్రసక్తియే లేదు. యమకింకరులు వానివైపు కన్నెత్తి చూడరు. అట్టివాడు విష్ణులోకములో మహిమ గాంచును.

మ్రియమాణో హరేర్నామ గృణన్ పుత్రోపచారితమ్ ।
అజామిలోఽప్యగాద్ధామ కిం పునశ్శ్రద్ధయా గృణన్ ॥ 49

ఇతి శ్రీమద్భాగవతే షష్ఠస్కంధే అజామిలస్య
వైకుంఠప్రాప్తిర్నామ ద్వితీయోఽధ్యాయః ॥

అజామిలః అపి - అజామిలుడు కూడ, మ్రియమాణః - మరణించుచున్నవాడై, పుత్ర-ఉపచారితమ్ - పుత్రునకు పెట్టబడిన, హరేః - శ్రీహరియొక్క, నామ - నామమును, గృణన్ - పలుకువాడై, ధామ - వైకుంఠమును, అగాత్ - పొందెను, శ్రద్ధయా - శ్రద్ధతో, గృణన్ - ఉచ్చరించువాడు, కిం పునః - చెప్పునదేమున్నది?

మహాపాపియగు అజామిలుడు కూడ తన కొడుకుకు పెట్టుకున్న శ్రీహరి పేరును మరణసమయములో ఉచ్చరించి వైకుంఠమును పొందెను. శ్రద్ధతో శ్రీహరి నామమునుచ్చరించువాడు మోక్షమును పొందునని వేరుగా చెప్పవలయునా?

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి ఆరవ స్కంధములో
అజామిలుడు వైకుంఠమును పొందుటను వర్ణించే
రెండవ అధ్యాయము ముగిసినది (2).

*****

# అథ తృతీయోఽధ్యాయః

## యముడు భగవన్నామమహిమను వర్ణించుట

రాజోవాచ ।
విశమ్య దేవస్స్వభటోపవర్ణితం
ప్రత్యాహ కిం తాన్ప్రతి ధర్మరాజః ।
ఏవం హతాజ్ఞో విహతాన్మురారేః
నైదేశికైర్యస్య వశే జనోఽయమ్ ॥ 1

ఏవమ్ - ఈ విధముగా, హత-ఆజ్ఞః - నిరాకరించబడిన ఆదేశము గలవాడు, దేవః - ధర్మదేవత అగు, ధర్మరాజః - యమధర్మరాజు, స్వభట -ఉపవర్ణితమ్ - తన భటులచే వర్ణించబడిన దానిని, నిశమ్య - విని, ముర -అరేః - శ్రీహరియొక్క, నైదేశికైః - కింకరులచే, విహతాన్ - నిరాకరించబడిన, తాన్ ప్రతి - వారినుద్దేశించి, కిమ్ - దేనిని, ప్రతి-ఆహ - బదులుగా పలికెను?, యస్య - ఎవని, వశే - వశమునందు, అయమ్ - ఈ, జనః - జీవుడు ఉన్నాడో.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- ధర్మదేవత, సకలజీవులు తన వశమునందు గలవాడు అగు యమధర్మరాజుయొక్క ఆదేశము ఈ విధముగా త్రోసిపుచ్చబడినది. ఆ వృత్తాంతమును భటులు వర్ణించి చెప్పగా ఆయన విని, మురారి (ముర అనే రాక్షసుని సంహరించినవాడు) యొక్క భటులచే త్రోసిపుచ్చబడిన ఆ కింకరులనుద్దేశించి ఏమి బదులు పలికెను?

యమస్య దేవస్య న దండభంగః
కుతశ్చనర్షే శ్రుతపూర్వ ఆసీత్ ।

ఏతన్మునే వృశ్చతి లోకసంశయం
న హి త్వదన్య ఇతి మే వినిశ్చితమ్ ।। 2

ఋషే - ఓ మహర్షీ!, కుతశ్చన - ఎవని వలనైననూ, యమస్య దేవస్య - యమదేవునియొక్క, దండభంగః - శిక్షకు భంగము కలుగుట, శ్రుతపూర్వః - పూర్వము వినబడినది, న ఆసీత్ - కాలేదు, మునే - ఓ శుక మునీ!, ఏతత్ - ఈ విషయమునందు, లోకసంశయమ్ - జనుల సందేహ మును, త్వద్-అన్యః - నీకంటె మరియొకడు, న హి వృశ్చతి - ఛేదించుట లేదు, ఇతి - అని, మే - నా, వినిశ్చితమ్ - నిశ్చయము.

ఓ శుకమహర్షీ! ఇంతవరకు యమదేవుని శిక్షకు ఎవని వలనైననూ భంగము కలిగినదని వినియుండలేదు. ఈ విషయమై జనులలో ఉండే సందేహమును నీవు తప్ప మరియొకరు తీర్చలేరని నా నమ్మకము.

శ్రీశుక ఉవాచ ।
భగవత్పురుషై రాజన్ యామ్యాః ప్రతిహతోద్యమాః ।
పతిం విజ్ఞాపయామాసుర్యమం సంయమనీపతిమ్ ।। 3

రాజన్ - ఓ రాజా!, భగవత్-పురుషైః - శ్రీహరి అనుచరులచే, ప్రతిహత-ఉద్యమాః - విఘాతము కలిగించబడిన ప్రయత్నము గల, యామ్యాః - యమదూతలు, పతిమ్ - ప్రభుడైనట్టియు, సంయమనీపతిమ్ - సంయమనీ నగరమునకు శాసకుడైన, యమమ్ - యముని, విజ్ఞాపయా మాసుః - విన్నవించుకొనిరి.

శ్రీ శుకమహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! శ్రీహరి అనుచరులు తమ ప్రయత్నమునకు విఘాతమును కల్గించగా, యమదూ తలు తమ ప్రభుడగు యమునకు ఇట్లు విన్నవించుకొనిరి. యముడు సంయమనీ నగరమునకు ప్రభువు.

యమదూతా ఊచుః ।
కతి సంతీహ శాస్తారో జీవలోకస్య వై ప్రభో ।
త్రైవిధ్యం కుర్వతః కర్మ ఫలాభివ్యక్తిహేతవః ।। 4

ప్రభో - ఓ ప్రభూ!, ఇహ - ఈ సృష్టియందు, త్రైవిధ్యమ్ - మూడు విధముల, కర్మ - కర్మను, కుర్వతః - చేయుచున్న, జీవలోకస్య - జీవుల సముదాయమునకు, శాస్తారః - శాసకులు, ఫల-అభివ్యక్తిహేతవః - కర్మఫలము ప్రకటమగుటకు కారణమైనవారు, కతి - ఎంతమంది, సంతి - ఉన్నారు?

యమదూతలిట్లు పలికిరి --- ఓ ప్రభూ! జీవులు పుణ్యకర్మలు, పాపకర్మలు, పుణ్యపాపమిశ్రమకర్మలు అనే మూడు విధముల కర్మలను చేసి, క్రమముగా ఉత్తమలోకము, నరకము, మనుష్యలోకము అనే మూడు విధముల కర్మఫలములను పొందుచుందురు. ఈ జీవసమూహమును శాసిస్తూ, వారికి కర్మఫలములు ప్రకటమగుటకు కారణమైనవారు ఈ సృష్టిలో ఎందరు గలరు?

యది స్యుర్బహవో లోకే శాస్తారో దండధారిణః ।
కస్య స్యాతాం న వా కస్య మృత్యుశ్చామృతమేవ వా ॥ 5

లోకే - లోకమునందు, బహవః - అనేకులు, దండధారిణః - శిక్షలను వేసే, శాస్తారః - శాసకులు, యది స్యుః - ఉన్నచో, కస్య - ఎవనికి, మృత్యుః - నరకము గాని, అమృతం ఏవ వా - స్వర్గమే గాని, స్యాతామ్ - కలుగును?, కస్య వా - ఎవనికి గాని, న - కలుగవు?

లోకములో శిక్షలను వేసే శాసకులు అనేకులున్నచో, నరకము గాని, స్వర్గము గాని ఎవనికి లభించును? ఎవనికి నిరాకరించబడును?

కిం తు శాస్తృబహుత్వే స్యాద్బహూనామిహ కర్మిణామ్ ।
శాస్తృత్వముపచారో హి యథా మండలవర్తినామ్ ॥ 6

కిం తు - మరియు, ఇహ - ఈ లోకమునందు, బహూనామ్ - అనేకులగు, కర్మిణామ్ - కర్మలను చేయువారలకు, శాస్తృబహుత్వే - శాసకులు అనేకులున్నచో, మండలవర్తినాం యథా - సామంతులకు వలె, శాస్తృత్వమ్ - శాసకత్వము, ఉపచారః - నామమాత్రమే, స్యాత్ - అగును.

ఈ లోకములో కర్మలను చేయువారలు అనేకులున్నారు గనుక, శాసకులు కూడ అనేకులుండుట సమంజసమే యన్నచో, వారికి ఉండే అధికారము సామంతరాజుల అధికారము వలె నామమాత్రమే యగును.

అతస్త్వమేకో భూతానాం సేశ్వరాణామధీశ్వరః ।
శాస్తా దండధరో నృణాం శుభాశుభవివేచనః ॥ 7

అతః - ఇందువలన, స-ఈశ్వరాణామ్ - ప్రభువులతో గూడియున్న, భూతానామ్ - ప్రాణులకు, త్వమ్ - నీవు, ఏకః - ఒకే ఒక, అధీశ్వరః - అందరికంటె పైన ఉండే ప్రభుడవు, శాస్తా - శాసకుడవు, నృణామ్ - మానవులకు, దండధరః - శిక్షలను వేయువాడవు, శుభ-అశుభవివేచనః - పుణ్యపాపములను నిర్ణయించువాడవు.

కావున ప్రాణులకు, ఆయా ప్రాణుల ప్రభువులకు కూడ నీవే సర్వేశ్వరుడవు. మానవుల పుణ్యపాపములను నిర్ణయించి వారికి శిక్షలను వేసే శాసకుడవు నీవే.

తస్య తే విహతో దండో న లోకే వర్తతేఽధునా ।
చతుర్భిరద్భుతైస్సిద్ధైరాజ్ఞా తే విప్రలంభితా ॥ 8

తస్య - అట్టి, తే - నీయొక్క, దండః - శిక్ష, విహతః - త్రోసిపుచ్చబడినది, అధునా - ఇప్పుడు, లోకే - లోకమునందు, న వర్తతే - ప్రవర్తిల్లుట లేదు, అద్భుతైః - ఆశ్చర్యమును కలిగించే, చతుర్భిః - నల్గురు, సిద్ధైః - సిద్ధపురుషులచే, తే - నీ, ఆజ్ఞా - ఆజ్ఞ, విప్రలంభితా - ఉల్లంఘింపబడినది.

అట్టి నీవు వేసిన శిక్ష ఈనాడు త్రోసిపుచ్చబడినది. ఇప్పుడు లోకమునందు నీ అధికారము చెల్లుట లేదు. ఆశ్చర్యమును కలిగించే నల్గురు సిద్ధపురుషులు నీ ఆజ్ఞను ఉల్లంఘించినారు.

నీయమానం తవాదేశాదస్మాభిర్యాతనాగృహాన్ ।
వ్యమోచయన్ పాతకినం ఛిత్త్వా పాశాన్ ప్రసహ్య తే ॥ 9

తవ - నీ, ఆదేశాత్ - ఆదేశము వలన, అస్మాభిః - మాచే, యాత నాగృహాన్ - యాతనలను పెట్టే స్థానమును గురించి, నీయమానమ్ - కొని పోబడుచున్న, పాతకినమ్ - పాపిని, తే - వారు, ప్రసహ్య - బలాత్కార ముగా, తే - నీ, పాశాన్ - పాశములను, ఛిత్త్వా - తెగగొట్టి, వ్యమోచయన్ - విడిపించిరి.

నీ ఆదేశమునననుసరించి మేము యాతనలను పెట్టే స్థానమునకు ఒక పాపిని కొనిపోవుచుండగా, వారు బలాత్కారముగా నీ పాశములను తెగగొట్టి వానిని విడిపించుకొని పోయిరి.

తాంస్తు వేదితమిచ్ఛామో యది నో మన్యసే క్షమమ్ ।
నారాయణేత్యభిహితే మా భైరిత్యాయయుర్ద్రుతమ్ ॥ 10

నః - మాకు, క్షమమ్ - హితమని, మన్యసే యది - నీవు భావించే పక్షములో, తాన్ తు - వారిని గురించియైతే, వేదితుమ్ - తెలి యుటకు, ఇచ్ఛామః - కోరుచున్నాము, నారాయణ - ఓ నారాయణా!, ఇతి - అని, అభిహితే - పలుకబడగా, మా భైః - భయపడకుము, ఇతి - అని, ద్రుతమ్ - శీఘ్రముగా, ఆయయుః - వచ్చిరి.

మాకు మంచిదని నీవు తలచే పక్షములో మేము వారిని గురించి తెలుసుకొన గోరుచున్నాము. ఓ నారాయణా! అని ఆ పాపి పలుకగానే, భయపడకుము అంటూ వీరు వెంటనే వచ్చినారు.

శ్రీశుక ఉవాచ ।
ఇతి దేవస్స ఆపృష్టః ప్రజాసంయమనో యమః।
ప్రీతస్స్వదూతాన్ ప్రత్యాహ స్మరన్ పాదాంబుజం హరేః॥11

ప్రజాసంయమనః - ప్రాణులను శాసించే, సః - ఆ, యమః దేవః - యమదేవుడు, ఇతి - ఈ విధముగా, ఆపృష్టః - ప్రశ్నించబడినవాడై, ప్రీతః - సంతోషించినవాడై, హరేః - శ్రీహరియొక్క, పాద-అంబుజమ్ - పాదపద్మమును, స్మరన్ - స్మరించుచున్నవాడై, స్వదూతాన్ - తన దూత లను గురించి, ప్రతి-ఆహ - బదులు చెప్పెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ప్రాణులను శాసించే ఆ యమ దేవుని దూతలిట్లు ప్రశ్నించగా, ఆయన సంతోషించి, శ్రీహరి పాదపద్మము లను స్మరించి, వారికి ఇట్లు బదులు చెప్పెను.

యమ ఉవాచ ।
పరో మదన్యో జగతస్తస్థుషశ్చ ఓతం ప్రోతం పటవద్యత్ర విశ్వమ్ ।
యదంశతోఽస్య స్థితిజన్మనాశా నస్యోతవద్యస్య వశే చ లోకః॥12

మద్-అన్యః - నాకంటె మరియొకడు, పరః - సర్వోత్కృష్టుడు, జగతః - కదిలే ప్రాణికి, తస్థుషః చ - కదలని ప్రాణికి కూడ, యత్ర - ఎవని యందైతే, విశ్వమ్ - జగత్తు, పటవత్ - వస్త్రము వలె, ఓతం ప్రోతమ్ - పడుగు పేకగా నున్నదో, యద్-అంశతః - ఎవని అంశ వలన, అస్య - ఈ జగత్తుయొక్క, స్థితిజన్మనాశాః - పాలనము సృష్టి ప్రళయములు కలుగునో, లోకః - లోకము, నసి - ముక్కునందు, ఓతవత్ - త్రాడు వేయబడినది వలె, యస్య - ఎవని, వశే చ - వశమునందున్నదో.

యముడిట్లు పలికెను --- నాకంటె మరియొకడు సర్వోత్కృష్టుడు గలడు. స్థావరజంగమాత్మకమగు జగత్తునకు ఆయనయే ప్రభుడు. వస్త్రము దారమునందువలె, ఈ జగత్తు ఆయనయందే పడుగు పేకగా నున్నది. ఆయన అంశ వలననే ఈ జగత్తుయొక్క సృష్టిస్థితిలయములు సంపన్నమగుచున్నవి. ముక్కు త్రాడు వేయబడిన ఎద్దు వలె, ఈ లోకము ఆయన వశములో నున్నది.

యో నామభిర్వాచి జనాన్నిజాయాం
బధ్నాతి తంత్యామివ దామభిర్గాః ।
యస్మై బలిం త ఇమే నామకర్మ-
నిబంధబద్ధాశ్చకితా వహంతి ॥ 13

యః - ఎవడైతే, జనాన్ - జనులను, నిజాయామ్ - తనదైన, వాచి - వేదవాక్కునందు, నామభిః - పేర్లతో, తంత్యామ్ - పొడవాటి త్రాటి యందు, దామభిః - చిన్న త్రాళ్లతో, గాః ఇవ - ఎద్దులను వలె, బధ్నాతి -

బంధించుచున్నారో, నామకర్మనిబంధబద్ధాః - పేర్లు కర్మలు అనే త్రాళ్లతో బంధించబడినవారు, చకితాః - భయభీతులు అగు, తే - ఆ, ఇమే - వీరు, యస్మై - ఎవని కొరకు, బలిమ్ - ఉపహారమును, వహంతి - కొనిపోవుచు న్నారో.

పొడవాటి త్రాటికి ఎద్దులను చిన్న త్రాళ్లతో కట్టివేసే విధముగా, ఆయన ప్రాణులను తననుండి ప్రాదుర్భవించిన వేదవాక్కు అనే త్రాటి యందు నామరూపములనే చిన్న త్రాళ్లతో బంధించినాడు. (అనగా, ప్రాణులు ఆయా నామరూపములయందాత్మభావము గలవారై వేదము నందు నిరూపితములైన ధర్మాధర్మములను చేస్తూ, సుఖదుఃఖములననుభ వించుచున్నారు). ఈ విధముగా నామరూపములు, కర్మలు అనే త్రాళ్లతో బంధించబడి భయభీతులై యున్న అట్టి ఈ జనులు ఆయా కర్మలను చేసి ఆ సర్వేశ్వరుని ఆరాధించుచున్నారు.

అహం మహేంద్రో నిర్బతిః ప్రచేతాః
సోమోఽగ్నిరీశః పవనోఽర్కో విరించః ।
ఆదిత్యవిశ్వే వసవోఽథ సాధ్యా
మరుద్గణా రుద్రగణాస్ససిద్ధాః ॥ 14

అన్యే చ యే విశ్వసృజోఽమరేశా
భృగ్వాదయోఽస్పృష్టరజస్తమస్కాః ।
యస్యేహితం న విదుస్స్పృష్టమాయాః
సత్త్వప్రధానా అపి కిం తతోఽన్యే ॥ 15

అహమ్ - నేను, మహేంద్రః - మహేంద్రుడు, నిర్బతిః - నిర్బతి, ప్రచేతాః - వరుణుడు, సోమః - చంద్రుడు, అగ్నిః -అగ్ని, ఈశః - శివుడు, పవనః - వాయువు, అర్కః - సూర్యుడు, విరించః - బ్రహ్మగారు, ఆదిత్య విశ్వే - ద్వాదశాదిత్యులు విశ్వే దేవతలు, వసవః - వసువులు, అథ - తరు వాత, సాధ్యాః - సాధ్యులు, మరుద్-గణాః - మరుత్తుల గణములు, ససిద్ధాః - సిద్ధులతో కూడిన, రుద్రగణాః - రుద్రుల గణములు, అన్యే చ - ఇతరులగు, యే - ఏ, అస్పృష్టరజః-తమస్కాః - స్పృశించబడని రజస్త

మోగుణములు గల, భృగు-ఆదయః - భృగువు మొదలుగా గల, విశ్వ సృజః - ప్రజాపతులు గలరో వారు, అమర-ఈశాః - దేవనాయకులు, సత్త్వప్రధానాః అపి - సత్త్వగుణమే ప్రధానముగా గలవారే అయిననూ, స్పృష్టమాయాః - మాయచే స్పృశించబడినవారై, యస్య - ఎవని, ఈహితమ్ - చేష్టను, న విదుః - తెలియకుందురో, తతః - వారికంటె, అన్యే - ఇతరులు, కిమ్ - చెప్పున దేమున్నది?

నేను, మహేంద్రుడు, నిరృతి, వరుణుడు, చంద్రుడు, అగ్ని, శివుడు, వాయువు, సూర్యుడు, బ్రహ్మగారు, ద్వాదశాదిత్యులు, విశ్వేదేవతలు, వసువులు, సాధ్యులు, మరుద్గణములు, రుద్రగణములు, సిద్ధులు, రజోగుణ తమోగుణముల స్పర్శ లేని భృగువు మొదలగు ప్రజాపతులు, మరియు ఇతరులగు దేవనాయకులు అనే వీరందరు సత్త్వగుణప్రధానులే. కాని, ఆ సర్వేశ్వరుని మాయయొక్క ప్రభావమునకు లోనై వీరు కూడ ఆయన లీలలను తెలియలేకున్నారు. ఇక, సామాన్యజనులు తెలియలేరని వేరుగా చెప్పనేల?

**యం వై న గోభిర్మనసాఽసుభిర్వా**
**హృదా గిరా వాఽసుభృతో విచక్షతే ।**
**ఆత్మానమంతర్హృది సంతమాత్మనాం**
**చక్షుర్యథైవాకృతయస్తతః పరమ్ ॥ 16**

ఆత్మనామ్ - జీవులయొక్క, హృది - హృదయమునందు, అంతః - లోపల, ఆత్మానమ్ - ఆత్మరూపుడుగా, సంతమ్ - ఉండునట్టియు, తతః - ఇంద్రియాదులకంటె, పరమ్ - అతీతుడైన, యమ్ - ఎవనిని, గోభిః - జ్ఞానేంద్రియములచే గాని, మనసా - మనస్సుచే గాని, అసుభిః వా - కర్మేంద్రియములచే గాని, హృదా - బుద్ధిచే గాని, గిరా వా - వాక్కుచే గాని, అసుభృతః - ప్రాణధారులగు జీవులు, ఆకృతయః - రూపములు, చక్షుః యథా ఏవ - కన్నును వలె, వై - నిశ్చయముగా, న విచక్షతే - కనుగొనలేరో.

కంటిచే దర్శించబడే రూపములు తమకంటె అతీతముగానుండే కన్నును చూడలేవు. అదే విధముగా, జీవుల హృదయము లోపల ఆత్మ రూపుడై ఉండే ఆ శ్రీహరి ఇంద్రియాదులకు అతీతుడు. కావుననే, ఆత్మ రూపుడగు శ్రీహరి ప్రాణుల జ్ఞానేంద్రియములకు గాని, కర్మేంద్రియములకు గాని, సంకల్పవికల్పాత్మకమగు మనస్సునకు గాని, నిశ్చయాత్మకమగు బుద్ధికి గాని, వాక్కులకు గాని గోచరుడు కాడు.

తస్యాత్మతంత్రస్య హరేరధీశితుః
పరస్య మాయాధిపతేర్మహాత్మనః ।
ప్రాయేణ దూతా ఇహ వై మనోహరాః
చరంతి తద్రూపగుణస్వభావాః ॥ 17

ఆత్మతంత్రస్య - స్వతంత్రుడైనట్టియు, అధీశితుః - అధీశ్వరుడైనట్టియు, పరస్య - సర్వాతిశాయి అయినట్టియు, మాయా-అధిపతేః - మాయాశక్తికి అధిపతియైనట్టియు, మహా-ఆత్మనః - సర్వాత్ముడైన, తస్య - ఆ, హరేః - శ్రీహరియొక్క, మనోహరాః - మనస్సును దోచివేయునట్టియు, తద్-రూపగుణస్వభావాః - ఆయనయొక్క రూపము గుణములు స్వభావము గల, దూతాః - దూతలు, ఇహ - ఈ లోకమునందు, వై - నిశ్చయముగా, ప్రాయేణ - తరచుగా, చరంతి - సంచరించుచున్నారు.

స్వతంత్రుడు, అధీశ్వరుడు, సర్వాతిశాయి అగు శ్రీహరి మాయాశక్తికి అధిపతి. సర్వమునకు ఆత్మరూపుడగు ఆయన దూతలు కూడ ఆయనవంటి రూపము గుణములు స్వభావము గలవారై మనోహరముగా నుందురు. వారీ లోకములో తరచుగా సంచరించుచుందురు.

భూతాని విష్ణోస్సురపూజితాని దుర్దర్శలింగాని మహాద్భుతాని ।
రక్షంతి తద్భక్తిమతః పరేభ్యో మత్తశ్చ మర్త్యానథ సర్వతశ్చ ॥18

సురపూజితాని - దేవతలచే పూజించబడువారు, దుర్దర్శలింగాని - చూచుటకు శక్యము కాని మూర్తులు గలవారు, మహా-అద్భుతాని - గొప్ప ఆశ్చర్యమును కలిగించువారు అగు, విష్ణోః - విష్ణువుయొక్క, భూతాని - కింకరులు, తద్-భక్తిమతః - ఆ విష్ణువునందు భక్తి గల,

మర్త్యాన్ - మానవులను, పరేభ్యః - శత్రువులనుండి, మత్తః - నానుండి, సర్వతః చ - అన్ని దేశకాలములయందు (సర్వమునుండి) కూడ, రక్షంతి - రక్షించుచుందురు.

దేవతలచే పూజించబడే విష్ణుదూతల దర్శనము చాల దుర్లభము. గొప్ప ఆశ్చర్యమును కలిగించే ఆ దూతలు ఆ శ్రీహరి భక్తులగు మానవు లను శత్రువులనుండి మాత్రమే గాక నానుండి, సర్వమునుండి కూడ అన్ని దేశకాలములలో రక్షించుచుందురు.

ధర్మం తు సాక్షాద్భగవత్ప్రణీతం
న వై విదుర్ఋషయో నాపి దేవాః ।
న సిద్ధముఖ్యా అసురా మనుష్యాః
కుతశ్చ విద్యాధరచారణాదయః ॥ 19

సాక్షాత్ - సాక్షాత్తుగా, భగవత్-ప్రణీతమ్ - భగవానునిచే బోధించ బడిన, ధర్మం తు - ధర్మమునైతే, ఋషయః - మహర్షులు, న వై విదుః - తెలియకున్నారు, దేవాః అపి - దేవతలు కూడ, న - తెలియకున్నారు, సిద్ధ ముఖ్యాః - సిద్ధులలో ప్రముఖులు, న - తెలియకున్నారు, అసురాః - అసు రులు, మనుష్యాః - మానవులు, విద్యాధరచారణ-ఆదయః - విద్యాధరులు చారణులు మొదలగువారు, కుతః చ - ఎట్లు తెలియగలరు?

సాక్షాత్తుగా భగవానునిచే బోధించబడిన ధర్మమును మహర్షులు, దేవతలు, సిద్ధులలో ప్రముఖులు సైతము తెలియలేక పోవుచున్నారు. ఇట్టి స్థితిలో అసురులు, మానవులు, విద్యాధరులు, చారణులు, కిన్నరులు మొదలగువారు ఎట్లు తెలియగలరు?

స్వయంభూర్నారదశ్శంభుః కుమారః కపిలో మనుః ।
ప్రహ్లాదో జనకో భీష్మో బలిర్వైయాసకిర్వయమ్ ॥ 20

ద్వాదశైతే విజానీమో ధర్మం భాగవతం భటాః ।
గుహ్యం విశుద్ధం దుర్బోధం యం జ్ఞాత్వాఽమృతమశ్నుతే ॥ 21

భటాః - ఓ భటులారా!, స్వయంభూః - స్వయంభువుడగు బ్రహ్మగారు, నారదః - నారదుడు, శంభుః - శివుడు, కుమారః - సనత్కుమారుడు, కపిలః - కపిల భగవానుడు, మనుః - మనువు, ప్రహ్లాదః - ప్రహ్లాదుడు, జనకః - జనకుడు, భీష్మః - భీష్ముడు, బలిః - బలి, వైయాసకిః - శుకమహర్షి, వయమ్ - మేము, ఏతే - ఈ, ద్వాదశ - పన్నెండుమంది, భాగవతమ్ - భగవానునిచే చెప్పబడినట్టియు, గుహ్యమ్ - రహస్యమైనట్టియు, విశుద్ధమ్ - సత్త్వగుణప్రధానమైనట్టియు, దుర్బోధమ్ - తెలియ శక్యము కాని, ధర్మమ్ - ధర్మమును, విజానీమః - తెలియుచున్నాము, యమ్ - దేనిని, జ్ఞాత్వా - తెలుసుకొని, అమృతమ్ - మోక్షమును, అశ్నుతే - పొందుచున్నాడో.

స్వయంభువుడగు బ్రహ్మగారు, నారదుడు, శివుడు, సనత్కుమారుడు, కపిల భగవానుడు, స్వాయంభువ మనువు, ప్రహ్లాదుడు, జనకుడు, భీష్ముడు, బలి, వ్యాసపుత్రుడగు శుకుడు మరియు నేను అనే ఈ పన్నెండు మంది మాత్రమే భగవానునిచే చెప్పబడిన రహస్యమగు ధర్మమును తెలియుచున్నాము. సత్త్వగుణప్రధానమగు ఈ ధర్మమును తెలియుట చాల కష్టము. దీనిని తెలుసుకున్న మానవుడు మోక్షమును పొందును.

**ఏతావానేవ లోకేఽస్మిన్ పుంసాం ధర్మః పరస్స్మృతః ।**
**భక్తియోగో భగవతి తన్నామగ్రహణాదిభిః ॥ 22**

అస్మిన్ - ఈ, లోకే - లోకమునందు, పుంసామ్ - మానవులకు, పరః - సర్వోత్కృష్టమగు, ధర్మః - ధర్మము, ఏతావాన్ ఏవ - ఇంత మాత్రమే, స్మృతః - చెప్పబడినది, భగవతి - భగవానునియందు, తత్-నామగ్రహణ-ఆదిభిః - ఆయన నామమునుచ్చరించుట మొదలగువాటిచే, భక్తియోగః - భక్తియోగము.

భగవానుని నామమునుచ్చరించుట మొదలగువాటిచే భగవానుని యందు భక్తియోగము (భక్తిని అభ్యసించుట) మాత్రమే ఈ లోకములో మానవులకు సర్వోత్కృష్టమగు ధర్మమని మహర్షులచే చెప్పబడినది.

**నామోచ్చారణమాహాత్మ్యం హరేః పశ్యత పుత్రకాః ।**
**అజామిలోఽపి యేనైవ మృత్యుపాశాదముచ్యత ॥ 23**

పుత్రకాః - పుత్రులారా!, హరేః - శ్రీహరియొక్క, నామ-ఉచ్చారణమాహాత్మ్యమ్ - నామమునుచ్చరించుటయొక్క మహిమను, పశ్యత - గమనించుడు, అజామిలః అపి - అజామిలుడు కూడ, యేన ఏవ - దేనిచే మాత్రమే, మృత్యుపాశాత్ - మరణపాశమునుండి, అముచ్యత - విడిపించబడెనో.

పుత్రులారా! శ్రీహరి నామమునుచ్చరించుటలోని మహిమను గమనించుడు. అజామిలుడు కూడ కేవలము నామమునుచ్చరించి మరణపాశమునుండి విముక్తిని పొందినాడు.

**ఏతావతాఽలమఘనిర్హరణాయ పుంసాం**
**సంకీర్తనం భగవతో గుణకర్మనామ్నామ్ ।**
**విక్రుశ్య పుత్రమఘవాన్ యదజామిలోఽపి**
**నారాయణేతి మ్రియమాణ ఇయాయ ముక్తిమ్ ॥ 24**

పుంసామ్ - మానవులకు, అఘనిర్హరణాయ - పాపములను నశింప జేయుటకు, ఏతావతా - ఇంతమాత్రముచే, అలమ్ - చాలును, భగవతః - భగవానుని, గుణకర్మనామ్నామ్ - గుణములు లీలలు నామములయొక్క, సంకీర్తనమ్ - చక్కగా కీర్తించుట, యత్ - ఏలయనగా, అఘవాన్ - పాపియగు, అజామిలః అపి - అజామిలుడు కూడ, మ్రియమాణః - మరణించబోవువాడై, పుత్రమ్ - కొడుకును, నారాయణ - ఓ నారాయణా!, ఇతి - అని, విక్రుశ్య - బిగ్గరగా పిలిచి, ముక్తిమ్ - మోక్షమును, ఇయాయ - పొందెనో.

మానవులకు పాపములను నశింప జేయుటకు భగవానుని గుణములను, లీలలను, నామములను చక్కగా కీర్తించిన చాలును. ఏలయనగా, పాపియగు అజామిలుడు కూడ మరణించబోతూ కొడుకును, ఓ నారాయణా! అని బిగ్గరగా పిలిచి, మోక్షమును పొందినాడు.

ప్రాయేణ వేద తదిదం న మహాజనోఽయం
దేవ్యా విమోహితమతిర్బత మాయయాఽలమ్ ।
త్రయ్యాం జడీకృతమతిర్మధుపుష్పితాయాం
వైతానికే మహతి కర్మణి యుజ్యమానః ॥ 25

మాయయా దేవ్యా - మాయాశక్తిచే, అలమ్ - మిక్కిలి, విమోహితమతిః - వ్యామోహము కలిగించబడిన బుద్ధి గలవాడు, మధుపుష్పితాయామ్ - మధురముగా పుష్పించియున్న, త్రయ్యామ్ - వేదమునందు, జడీకృతమతిః - దృఢముగా లగ్నమైన బుద్ధి గలవాడు, మహతి - పెద్ద, వైతానికే - యజ్ఞమునకు సంబంధించిన, కర్మణి - కర్మయందు, యుజ్యమానః - సంలగ్నమైనవాడు అగు, అయమ్ - ఈ, మహాజనః - గొప్ప వ్యక్తి, ప్రాయేణ - తరచుగా, తత్ - అట్టి, ఇదమ్ - ఈ ధర్మమును, న వేద - తెలియకున్నాడు, బత - అయ్యో!

అయ్యో! ఈ మహావిద్వాంసుడు మాయాశక్తిచే మిక్కిలి వ్యామోహితమైన బుద్ధి గలవాడై, తియ్యని ఆకర్షణీయమైన అర్థవాదవాక్యములతో కూడిన వేదమునందు దృఢముగా లగ్నమైన బుద్ధి గలవాడై, పెద్ద పెద్ద యజ్ఞరూపములైన కర్మలను చేయుటకు నడుము బిగించునే గాని, తరచుగా అట్టి ఈ భాగవత ధర్మమును తెలుసుకొనుట లేదు.

ఏవం విమృశ్య సుధియో భగవత్యనంతే
సర్వాత్మనా విదధతే ఖలు భావయోగమ్ ।
తే మే న దండమర్హంత్యథ యద్యమీషాం
స్యాత్పాతకం తదపి హంత్యురుగాయవాదః ॥ 26

సుధియః - మంచి బుద్ధి గలవారు, ఏవమ్ - ఈ విధముగా, విమృశ్య - విచారించి, అనంతే భగవతి - అనంత భగవానునియందు. సర్వాత్మనా - అన్ని విధములుగా, భావయోగమ్ - భక్తియోగమును, విదధతే ఖలు - చేయుదురు గదా!, తే - వారు, మే - నా, దండమ్ - శిక్షను, న అర్హంతి - అర్హులు అగుట లేదు, అథ - ఒకప్పుడు, అమీషామ్ - వీరికి, పాతకమ్ - పాపము, యది స్యాత్ - ఉన్ననూ, ఉరుగాయవాదః -

గొప్పగా కీర్తించబడిన భగవానుని కీర్తనము, తత్ అపి - దానిని కూడ, హంతి - పోగొట్టును.

వివేకవంతులీ విధముగా విచారించి అనంత భగవానుని పూర్తిగా శరణు జొచ్చి భక్తియోగమునభ్యసించెదరు. వారు నేను వేసే శిక్షకు పాత్రులు కారు. ఒకచో వారియందు పాపము ఉన్ననూ, వేదాదులలో గొప్పగా కీర్తించబడే భగవానుని కీర్తించుట వలన అది కూడ నశించును.

తే దేవసిద్ధపరిగీతపవిత్రగాథా
యే సాధవస్సమదృశో భగవత్ప్రపన్నాః ।
తాన్నోపసీదత హరేర్గదయాఽభిగుప్తాన్
నైషాం వయం న చ వయః ప్రభవామ దండే ।। 27

సమదృశః - సమదృష్టి గలవారు, భగవత్-ప్రపన్నాః - భగవానుని శరణు పొందినవారు అగు, యే - ఏ, సాధవః - సత్పురుషులు గలరో, తే - వారు, దేవసిద్ధపరిగీతపవిత్రగాథాః - దేవతలచే సిద్ధులచే కీర్తించబడే పావనమగు చరితములు గలవారు, హరేః - శ్రీహరియొక్క, గదయా - గదచే, అభిగుప్తాన్ - అన్ని విధములుగా రక్షించబడే, తాన్ - వారిని, న ఉపసీదత - సమీపించకుడు, ఏషామ్ - వీరికి, దండే - శిక్షించుటయందు, వయమ్ - మనము, వయః చ - కాలము కూడ, న ప్రభవామ - సమర్థులము కాము.

సర్వమునందు ఈశ్వరుని దర్శిస్తూ ఈశ్వరుని శరణు పొంది యున్న సత్పురుషుల చరితములను దేవతలు, సిద్ధులు కూడ కీర్తించెదరు. అట్టివారిని శ్రీహరి తన గదతో అన్ని విధములుగా రక్షించుచుండును. కావున, మీరు వారి జోలికి పోకుడు. వారిని శిక్షించుటకు మనము సమర్థులము కాము; కాలము కూడ సమర్థము కాదు.

తానానయధ్వమసతో విముఖాన్ ముకుంద-
పాదారవిందమకరందరసాదజస్రమ్ ।

నిష్కించనైః పరమహంసకులై రసజ్ఞైః
జుష్టాద్గృహే నిరయవర్త్మని బద్ధతృష్ణాన్ ॥ 28

నిష్కించనైః - ఏమీ లేనట్టియు, రసజ్ఞైః - రసమునెరింగిన, పరమహంసకులైః - పరమహంసల గణములచే, జుష్టాత్ - సేవించబడే, ముకుందపాద-అరవిందమకరందరసాత్ - ముకుందుని పాదపద్మముల మకరందముయొక్క రసమునుండి, అజస్రమ్ - మిక్కిలి, విముఖాన్ - విముఖులైనట్టియు, నిరయవర్త్మని - నరకమునకు దారియగు, గృహే - ఇంటియందు, నిబద్ధతృష్ణాన్ - గట్టిగా తగుల్కొన్న దురాశ కలిగిన, తాన్ - ఆ, అసతః - దుష్టులను, ఆనయధ్వమ్ - తీసుకొని రండు.

భక్తిసారమునెరింగిన పరమహంసల గణములు తమ వద్ద సంపదలేమీ లేకున్ననూ, మోక్షప్రదాతయగు శ్రీహరియొక్క పాదపద్మముల మకరందముయొక్క రసమును సేవించుచుందురు. కాని, దుష్టులు ఆ భక్తి రసము సేవగించుకొనెదరు. అట్టి దుష్టులు గృహమునందలి భోగముల యందు గట్టిగా తగుల్కొన్న దురాశ గలవారై ఉందురు. ఆ దురాశయే నరకమునకు దారి. అట్టివారిని మీరు ఇచటకు తీసుకొని రండు.

జిహ్వా న వక్తి భగవద్గుణనామధేయం
చేతశ్చ న స్మరతి తచ్చరణారవిందమ్ ।
కృష్ణాయ నో నమతి యచ్ఛిర ఏకదాపి
తానానయధ్వమసతోఽకృతవిష్ణుకృత్యాన్ ॥ 29

యత్ - ఎవరియొక్క, జిహ్వా - నాలుక, భగవద్-గుణనామధేయమ్ - భగవానుని గుణములను నామములను, న వక్తి - కీర్తించదో, చేతః చ - మనస్సు కూడ, తత్-చరణ-అరవిందమ్ - ఆ భగవానుని పాదపద్మమును, న స్మరతి - స్మరించదో, శిరః - శిరస్సు, కృష్ణాయ - శ్రీకృష్ణుని కొరకు, ఏకదా అపి - ఒక్కనాడైననూ, నో నమతి - నమస్కరించదో, అకృతవిష్ణుకృత్యాన్ - చేయబడని విష్ణువుయొక్క పూజలు గల, తాన్ - అట్టి, అసతః - దుష్టులను, ఆనయధ్వమ్ - తీసుకొని రండు.

ఎవరి నాలుక భగవానుని గుణములను నామములను కీర్తించదో, ఎవరి మనస్సు భగవానుని పాదపద్మమును స్మరించదో, ఎవరు తల వంచి శ్రీకృష్ణునకు ఒకనాడైననూ నమస్కరించరో, ఎవరు శ్రీహరిని పూజాదికముచే ఆరాధించరో, అట్టి దుష్టులను మీరు ఇచటకు తీసుకొని రండు.

తత్ క్షమ్యతాం స భగవాన్ పురుషః పురాణో
నారాయణస్స్వపురుషైర్యదసత్కృతం నః ।
స్వానామహో న విదుషాం రచితాంజలీనాం
క్షాంతిర్గరీయసి నమః పురుషాయ భూమ్నే ॥ 30

పురాణః - కాలమునకు అతీతుడైన, పురుషః - పూర్ణచైతన్యస్వరూపుడగు, సః - ఆ, భగవాన్ నారాయణః - నారాయణ భగవానుడు, స్వపురుషైః - నా కింకరులచే, అహో - అయ్యో!, న విదుషామ్ - అజ్ఞానులైనట్టియు, రచిత-అంజలీనామ్ - కట్టబడిన దోసిళ్లు గల, స్వానామ్ - నావారియొక్క, నః - మాయొక్క, యత్ - ఏ, అసత్ - దోషము, కృతమ్ - చేయబడినదో, తత్ - దానిని, క్షమ్యతామ్ - సహించుగాక!, గరీయసి - గొప్పవానియందు, క్షాంతిః - సహనము, భూమ్నే - సర్వవ్యాపకుడైనట్టియు, పురుషాయ - సకలప్రాణులలో ఆత్మరూపముగా నున్న నారాయణుని కొరకు, నమః - నమస్కారము.

అయ్యో! అజ్ఞానులగు నా కింకరులు అపరాధమును చేసిరి. నేను, నా కింకరులు చేతులు జోడించి నమస్కరించుచున్నాము. కాలాతీతుడు, పూర్ణచైతన్యస్వరూపుడు అగు ఆ నారాయణ భగవానుడు మా దోషమును క్షమించు గాక! గొప్పవారియందు క్షమాగుణము ఉండును. సర్వవ్యాపకుడే అయిననూ, సకలప్రాణుల హృదయములో ఆత్మరూపముగా నివసించే ఆ నారాయణునకు నమస్కారము.

తస్మాత్సంకీర్తనం విష్ణోర్జగన్మంగలమంహసామ్ ।
మహతామపి కౌరవ్య విద్ధ్యైకాంతికనిష్కృతిమ్ ॥ 31

కౌరవ్య - కురువంశమునందు జన్మించిన ఓ రాజా!, తస్మాత్ - కావున, జగత్-మంగలమ్ - ప్రాణులకు కల్యాణకరమగు, విష్ణోః - విష్ణువు

యొక్క, సంకీర్తనమ్ - చక్కగా కీర్తించుట, మహతామ్ - పెద్ద, అంహసాం అపి - పాపములకు కూడ, ఐకాంతికనిష్కృతిమ్ - సర్వోత్తమము మౌలికము అగు ప్రాయశ్చిత్తముగా, విద్ధి - తెలుసుకొనుము.

కురువంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! కావున, ప్రాణులకు కల్యాణములనిచ్చే విష్ణుసంకీర్తనము పెద్ద పాపములను కూడ సమూలముగా నిర్మూలించే సర్వోత్తమమగు ప్రాయశ్చిత్తమని తెలియుము.

శృణ్వతాం గృణతాం వీర్యాణ్యుద్దామాని హరేర్ముహుః ।
యథా సుజాతయా భక్త్యా శుద్ధ్యేన్నాత్మా వ్రతాదిభిః ॥ 32

హరేః - శ్రీహరియొక్క, ఉద్దామాని - మిక్కిలి గొప్ప, వీర్యాణి - మహాకార్యములను, ముహుః - పలుమార్లు, శృణ్వతామ్ - వినువారలకు, గృణతామ్ - కీర్తించువారలకు, సుజాతయా - చక్కగా ఉదయించిన, భక్త్యా - భక్తిచే, యథా - ఏ విధముగా, ఆత్మా - అంతఃకరణము, శుద్ధ్యేత్ - శుద్ధమగునో, వ్రత-ఆదిభిః - వ్రతములు మొదలగువాటిచే, న - కాదు.

శ్రీహరియొక్క పరాక్రమ చరితములు చాల గొప్పవి. వాటిని వినువారికి, కీర్తించువారికి భక్తి తేలికగా అబ్బును. ఆ భక్తి వలన అంతఃకరణము పరిశుద్ధమయ్యేటంతగా, వ్రతాదులచే పరిశుద్ధము కాదు.

కృష్ణాంఘ్రిపద్మమధులిణ్ న పునర్విసృష్ట-
మాయాగుణేషు రమతే వృజినావహేషు ।
అన్యస్తు కామహత ఆత్మరజః ప్రమార్ష్టు-
మీహేత కర్మ యత ఏవ రజః పునస్స్యాత్ ॥ 33

కృష్ణ-అంఘ్రిపద్మమధులిట్ - శ్రీకృష్ణుని పాదపద్మముల మకరందమును ఆస్వాదించువాడు, వృజిన-ఆవహేషు - దుఃఖమును కలిగించే, విసృష్టమాయాగుణేషు - విడిచిపెట్టబడిన మాయాశక్తియొక్క గుణముల కార్యములయందు, పునః - మరల, న రమతే - రమించడు, తు - దీనికి భిన్నముగా, కామహతః - కోరికలచే పరాభూతుడైన, అన్యః - భక్తుడు కాని వాడు, ఆత్మరజః - అంతఃకరణదోషమును, ప్రమార్ష్టుమ్ - తుడిచివేయు

టకు, కర్మ - కర్మను, ఈహేత - చేయును, యతః - దేనివలనైతే, పునః - మరల, రజః ఏవ - దోషమే, స్యాత్ - కలుగునో.

శ్రీకృష్ణుని పాదపద్మముల మకరందమును సేవించు భక్తుడు మాయాగుణకార్యములగు విషయభోగములను విడిచిపెట్టును. దుఃఖమునే కలుగజేసే ఆ భోగములయందు ఆతడు మరల ప్రీతిని పొందడు. దీనికి భిన్నముగా, కోరికలచే పరాభూతుడైన అభక్తుడు అంతఃకరణములోని పాపములను నిర్మూలించుటకై కర్మలను చేయును. కాని, ఆ కర్మల వలన అంతఃకరణములో కోరికలకు కారణమగు రజోగుణదోషము మరల నిర్మాణమగును.

ఇత్థం స్వభర్తృగదితం భగవన్మహిత్వం
సంస్మృత్య విస్మితధియో యమకింకరాస్తే ।
నైవాచ్యుతాశ్రయజనం ప్రతి శంకమానా
ద్రష్టుం చ బిభ్యతి తతః ప్రభృతి స్మ రాజన్ ॥ 34

రాజన్ - ఓ రాజా!, విస్మితధియః - ఆశ్చర్యమును పొందిన మనస్సులు గల, తే - ఆ, యమకింకరాః - యమకింకరులు, ఇత్థమ్ - ఈ విధముగా, స్వభర్తృగదితమ్ - తమ ప్రభువుచే బోధించబడిన, భగవత్-మహిత్వమ్ - భగవానుని మహిమను, సంస్మృత్య - చక్కగా స్మరించి, తతః ప్రభృతి - అప్పటినుండి, శంకమానాః - సందేహించువారై, అచ్యుత-ఆశ్రయజనం ప్రతి - అచ్యుతుని శరణు జొచ్చిన మానవుని గురించి, న ఏవ - దరిదాపులకు వెళ్లరు, ద్రష్టుం చ - చూచుటకైననూ, బిభ్యతి స్మ - భయపడుచుందురు.

ఓ పరీక్షిన్మహారాజా! ఈ విధముగా యముడు బోధించిన భగవానుని మహిమను విని ఆ యమకింకరుల మనస్సులు ఆశ్చర్యముతో నిండిపోయెను. అప్పటినుండి వారు తమకు కీడు మూడునేమో యను శంకచే, అచ్యుతుని శరణు జొచ్చిన వారల జోలికి పోరు. వారా బోధను చక్కగా గుర్తులోనుంచుకొని, భక్తులకేసి కన్నెత్తి చూచుటకైననూ భయపడుదురు.

ఇతిహాసమిమం గుహ్యం భగవాన్ కుంభసంభవః ।
కథయామాస మలయ ఆసీనో హరిమర్చయన్ ॥ 35

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే యమేన
భగవన్నామమాహాత్మ్యకథనం నామ తృతీయోఽధ్యాయః ॥

మలయే - మలయపర్వతమునందు, ఆసీనః - కూర్చున్నవాడు, హరిమ్ - శ్రీహరిని, అర్చయన్ - పూజించుచున్నవాడు, భగవాన్ - పూజనీయుడు అగు, కుంభసంభవః - అగస్త్య మహర్షి, ఇమమ్ - ఈ, గుహ్యామ్ - రహస్యమైన, ఇతిహాసమ్ - వృత్తాంతమును, కథయామాస - చెప్పెను.

మలయపర్వతముపై శ్రీహరిని ఆరాధిస్తూ నివసించే పూజనీయుడగు అగస్త్య మహర్షి ఈ రహస్యమగు వృత్తాంతమును నాకు చెప్పెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి ఆరవ స్కంధములో
యముడు భగవన్నామమాహాత్మ్యమును వర్ణించే
మూడవ అధ్యాయము ముగిసినది (3).

*****

# అథ చతుర్థోऽధ్యాయః

## హంస గుహ్య స్తోత్రము

రాజోవాచ ।

దేవాసురనృణాం సర్గో నాగానాం మృగపక్షిణామ్ ।
సామాసికస్త్వయా ప్రోక్తో యస్తు స్వాయంభువేऽంతరే ।। 1

దేవ-అసురనృణామ్ - దేవతలు అసురులు మానవులయొక్క, నాగానామ్ - నాగులయొక్క, మృగపక్షిణామ్ - పశుపక్షులయొక్క, సామాసికః - సంగ్రహమగు, సర్గః - సృష్టి, త్వయా - నీచే, ప్రోక్తః - చెప్పబడినది, యః తు - ఏ సృష్టియైతే, స్వాయంభువే అంతరే - స్వాయంభువ మన్వంతరములోనిదో.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- తమరు స్వాయంభువ మన్వంతరములో దేవతలు, అసురులు, మానవులు, నాగులు, పశువులు, పక్షులయొక్క సృష్టిని సంగ్రహముగా (మూడవ స్కంధములో) చెప్పితిరి.

తస్యైవ వ్యాసమిచ్ఛామి జ్ఞాతుం తే భగవన్ యథా ।
అనుసర్గం యయా శక్త్యా ససర్జ భగవాన్ పరః ।। 2

భగవన్ - ఓ పూజనీయా!, తస్య ఏవ - అదే సృష్టియొక్క, వ్యాసమ్ - విస్తారమును, తే - నీనుండి, జ్ఞాతుమ్ - తెలియుటకు, ఇచ్ఛామి - కోరుచున్నాను, పరః - ప్రకృతికి అతీతుడగు, భగవాన్ - భగవానుడు, యయా - ఏ, శక్త్యా - శక్తిచే, అనుసర్గమ్ - తరువాతి సృష్టిని, ససర్జ - సృష్టించెనో.

పూజనీయుడవగు ఓ మహర్షీ! అదే సృష్టియొక్క విస్తారమును, ప్రకృతికి అతీతుడగు భగవానుడు ఏ శక్తిచే తరువాతి సృష్టిని కొనసాగించెనో ఆ వివరములను నేను తెలియ గోరుచున్నాను.

సూత ఉవాచ ।
ఇతి సంప్రశ్నమాకర్ణ్య రాజర్షేర్బాదరాయణిః ।
ప్రతినంద్య మహాయోగీ జగాద మునిసత్తమాః ।। 3

మునిసత్తమాః - గొప్ప మహర్షులారా!, రాజర్షేః - రాజర్షియగు పరీక్షిత్తుయొక్క, ఇతి - ఇట్టి, సంప్రశ్నమ్ - చక్కని ప్రశ్నను, ఆకర్ణ్య - విని, మహాయోగీ - గొప్ప జ్ఞాని, బాదరాయణిః - బాదరాయణుని కుమారుడు అగు శుకుడు, ప్రతినంద్య - అభినందించి, జగాద - పలికెను.

సూత మహర్షి ఇట్లు పలికెను --- ఓ గొప్ప మహర్షులారా! బాదరాయణ వేదవ్యాసుని పుత్రుడగు శుకుడు గొప్ప జ్ఞాని. ఆయన రాజర్షియగు పరీక్షిత్తు వేసిన చక్కని ప్రశ్నను అభినందించి, ఇట్లు పలికెను.

శ్రీశుక ఉవాచ ।
యదా ప్రచేతసః పుత్రా దశ ప్రాచీనబర్హిషః ।
అంతస్సముద్రాదున్మగ్నా దదృశుర్గాం ద్రుమైర్వృతామ్ ।। 4

ప్రాచీనబర్హిషః - ప్రాచీనబర్హిషుని, దశ - పదిమంది, పుత్రాః - పుత్రులగు, ప్రచేతసః - ప్రచేతసులు, యదా - ఎప్పుడైతే, అంతః-సముద్రాత్ - సముద్రము లోపలినుండి, ఉన్మగ్నాః - పైకి వచ్చినవారో అప్పుడు, ద్రుమైః - చెట్లతో, వృతామ్ - నిండియున్న, గామ్ - భూమిని, దదృశుః - చూచిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ప్రాచీనబర్హిషుని పుత్రులగు ప్రచేతసులు పదిమంది సముద్రము లోపలినుండి బయటకు వచ్చి, చెట్లతో నిండియున్న భూమిని చూచిరి.

ద్రుమేభ్యః క్రుధ్యమానాస్తే తపోదీపితమన్యవః ।
ముఖతో వాయుమగ్నిం చ ససృజుస్తద్దిధక్షయా ।। 5

తపః-దీపితమన్యవః - తపస్సుచే ప్రజ్వరిల్ల జేయబడిన కోపము గలవారు, ద్రుమేభ్యః - చెట్ల కొరకు, క్రుధ్యమానాః - కోపించుచున్నవారు అగు, తే - వారు, తద్-దిధక్షవః - వాటిని తగులబెట్టు కోరువారై, ముఖతః - నోటినుండి, వాయుమ్ - గాలిని, అగ్నిం చ - నిప్పును కూడ, ససృజుః - సృష్టించిరి.

తపస్సుచే వారి కోపము ప్రజ్వరిల్ల జేయబడెను. వారు చెట్లపై కోపించి వాటిని తగులబెట్ట గోరి, నోటినుండి గాలిని మంటలను సృష్టించిరి.

తాభ్యాం నిర్దహ్యమానాంస్తానుపలభ్య కురూద్వహ ।
రాజోవాచ మహాన్ సోమో మన్యుం ప్రశమయన్నివ ।। 6

కుర-ఉద్వహ - కురవంశోద్ధారకా!, తాభ్యామ్ - ఆ రెండింటిచే, నిర్దహ్యమానాన్ - తగులబెట్ట బడుచున్న, తాన్ - వాటిని, ఉపలభ్య - చూచి, మహాన్ - మహాత్ముడు, రాజా - ఓషధులకు రాజు అగు, సోమః - చంద్రుడు, మన్యుమ్ - కోపమును, ప్రశమయన్ ఇవ - నిశ్చయముగా చల్లార్చుచున్నవాడై, ఉవాచ - పలికెను.

కురువంశోద్ధారకుడవగు ఓ పరీక్షిన్మహారాజా! ఓషధులకు ప్రభువు, మహాత్ముడు అగు చంద్రుడు ఆ అగ్ని వాయువులు ఆ చెట్లను తగుల బెట్టుచుండగా చూచి, వారి కోపమును నిశ్చయముగా చల్లార్చువాడై ఇట్లు పలికెను.

మా ద్రుమేభ్యో మహాభాగా దీనేభ్యో ద్రోగ్ధుమర్హథ ।
వివర్ధయిషవో యూయం ప్రజానాం పతయస్స్మృతాః ।। 7

మహాభాగాః - ఓ మహానుభావులారా! ప్రజానామ్ - ప్రజలయొక్క, వివర్ధయిషవః - వర్ధిల్లజేయ గోరే, యూయమ్ - మీరు, పతయః - పాలకులుగా, స్మృతాః - చెప్పబడినవారు, దీనేభ్యః - దీనములగు, ద్రుమేభ్యః - చెట్ల కొరకు, ద్రోగ్ధుమ్ - ద్రోహము చేయుటకు, మా అర్హథ - తగరు.

మీరు ప్రజలను వర్ధిల్ల జేయగోరే ప్రజాపతులని చెప్పుచున్నారు. అట్టి మీరు దీనముగా నిలిచిన చెట్లకు ద్రోహమును తలపెట్టుట తగదు.

అహో ప్రజాపతిపతిర్భగవాన్ హరిరవ్యయః ।
వనస్పతీనోషధీశ్చ ససర్జోర్జమిషం విభుః ॥ 8

అహో - ఆహా!, ప్రజాపతిపతిః - ప్రజాపతులకు ప్రభువు, అవ్యయః - నాశము లేనివాడు, విభుః - సర్వసమర్థుడు అగు, భగవాన్ హరిః - శ్రీహరి భగవానుడు, వనస్పతీన్ - చెట్లను, ఓషధీః చ - పంటమొక్కలను, ఊర్జమ్ - బలమునిచ్చే, ఇషమ్ - ఆహారముగా, ససర్జ - సృష్టించెను.

ఆహా! ప్రజాపతులకు ప్రభుడు, నాశము లేనివాడు, సర్వసమర్థుడు (వ్యాపకుడు) అగు శ్రీహరి భగవానుడు చెట్లను, పంట మొక్కలను ప్రాణులకు బలమునిచ్చే ఆహారము కొరకై సృష్టించెను.

అన్నం చరాణామచరా హ్యపదః పాదచారిణామ్ ।
అహస్తా హస్తయుక్తానాం ద్విపదాం చ చతుష్పదః ॥ 9

చరాణామ్ - కదిలే ప్రాణులకు, అచరాః - కదలనివి, పాదచారిణామ్ - కాళ్లతో నడిచే వాటికి, అపదః - కాళ్లు లేనివి, హస్తయుక్తానామ్ - చేతులు గలవాటికి, అహస్తాః - చేతులు లేనివి, ద్విపదాం చ - రెండు కాళ్ల ప్రాణులకు, చతుష్పదః - నాలుగు కాళ్లవి, అన్నమ్ - ఆహారము.

చరములగు పక్ష్యాదులకు అచరములగు పళ్లు మొదలగునవి, కాళ్లతో నడిచే పశ్వాదులకు కాళ్లు లేని మొక్కలు మొదలగునవి ఆహారమగుచున్నవి. చేతులు గల మానవులకు చేతులు లేని చెట్లు ఆహారమును సమకూర్చుచున్నవి. రెండు కాళ్ల మానవులకు నాలుగు కాళ్ల ఎద్దులు మొదలగు జంతువులు పంటలను పండించుటలో తోడ్పడుచున్నవి.

యూయం చ పిత్రాఽన్వాదిష్టా దేవదేవేన చానఘాః ।
ప్రజాసర్గాయ హి కథం వృక్షాన్ నిర్దగ్ధుమర్హథ ॥ 10

అనఘాః - ఓ పుణ్యాత్ములారా!, యూయం చ - మీరు, పిత్రా - తండ్రిచే, దేవదేవేన చ - దేవదేవుడగు శివునిచే కూడ, ప్రజాసర్గాయ - సంతానమును సృష్టించుట కొరకు, అను-ఆదిష్టాః హి - ఆదేశించ బడిన వారు గదా!, వృక్షాన్ - చెట్లను, నిర్దగ్ధుమ్ - తగులబెట్టుటకు, కథమ్ - ఏ విధముగా, అర్హథ - తగుదురు?

ఓ పుణ్యాత్ములారా! మీ తండ్రియగు ప్రాచీనబర్హిషుడు, దేవదేవుడగు శివుడు కూడ మిమ్ములను సంతానమును సృష్టించుడని ఆదేశించినారు గదా! అట్టి మీరు చెట్లను తగులబెట్టుట ఉచితము ఎట్లగును?

ఆతిష్ఠత సతాం మార్గం కోపం యచ్ఛత దీపితమ్ ।
పిత్రా పితామహేనాపి జుష్టం వః ప్రపితామహైః ॥ 11

వః - మీ, పిత్రా - తండ్రిచే, పితామహేన అపి - తాతగారిచే కూడ, ప్రపితామహైః - ముత్తాతలచే, జుష్టమ్ - సేవించబడిన, సతామ్ - సత్పురుషుల, మార్గమ్ - మార్గమును, ఆతిష్ఠత - ఆశ్రయించుడు, దీపితమ్ - ప్రజ్వరిల్లిన, కోపమ్ - కోపమును, యచ్ఛత - ఉపసంహరించుడు.

మీ తండ్రి, తాత, ముత్తాతలు కూడ సేవించిన సన్మార్గము (శాంతి) ను మీరు కూడ ఆశ్రయించుడు. మండి పడే కోపమును తగ్గించుడు.

తోకానాం పితరౌ బంధూ దృశః పక్ష్మ స్త్రియాః పతిః ।
పతిః ప్రజానాం భిక్షూణాం గృహ్యజ్ఞానాం బుధస్సుహృత్ ॥ 12

తోకానామ్ - పిల్లలకు, పితరౌ - తల్లిదండ్రులు, బంధూ - రక్షకులు, దృశః - కన్నుకు, పక్ష్మ - రెప్ప, స్త్రియాః - స్త్రీకి, పతిః - భర్త, ప్రజానామ్ - ప్రజలకు, పతిః - రాజు, భిక్షూణామ్ - భిక్షుకులకు, గృహీ - గృహస్థుడు, అజ్ఞానామ్ - అజ్ఞానులకు, బుధః - పండితుడు, సుహృత్ - హితచింతకుడు.

పిల్లలకు తల్లిదండ్రులు, కన్నుకు రెప్ప, స్త్రీకి భర్త, భిక్షుకులకు గృహస్థుడు, అజ్ఞానులకు పండితుడు రక్షకుడు మరియు హితచింతకుడు అగుచున్నారు. అదే విధముగా, ప్రజలకు రాజు రక్షకుడు, హితచింతకుడు.

అంతర్దేహేషు భూతానామాత్మాऽऽస్తే హరిరీశ్వరః ।
సర్వం తద్ధిష్ణ్యమీక్షధ్వమేవం వస్తోషితో హ్యసౌ ॥ 13

ఈశ్వరః - సర్వేశ్వరుడగు, హరిః - శ్రీహరి, భూతానామ్ - ప్రాణులకు, అంతః-దేహేషు - దేహముల లోపల, ఆత్మా - ఆత్మయై, ఆస్తే - ఉన్నాడు, సర్వమ్ - సర్వమును, తద్-ధిష్ణ్యమ్ - ఆయన నివాస స్థానమునుగా, ఈక్షధ్వమ్ - దర్శించుడు, హి - ఏలయనగా, ఏవమ్ - ఈ విధముగా, అసౌ - ఈ శ్రీహరి, వః - మీకు, తోషితః - ప్రీతుడగును.

సర్వేశ్వరుడగు శ్రీహరి ప్రాణుల దేహములయందు ఆత్మరూపుడై ప్రకటమగుచున్నాడు. ఈ సర్వము ఆయన నివాసస్థానమనియే తెలుసుకొనుడు. మీరట్లు చేసినచో, ఆయన మీ విషయములో ప్రీతుడగును.

యస్సముత్పతితం దేహ ఆకాశాన్మన్యుముల్బణమ్ ।
ఆత్మజిజ్ఞాసయా యచ్ఛేత్స గుణానతివర్తతే ॥ 14

యః - ఎవడైతే, ఆకాశాత్ - ఆకాశమునుండి, దేహే - దేహమునందు, సముత్పతితమ్ - వచ్చి పడిన, ఉల్బణమ్ - భయంకరమగు, మన్యుమ్ - కోపమును, ఆత్మజిజ్ఞాసయా - ఆత్మవిచారముచే, యచ్ఛేత్ - ఉపసంహరించునో, సః - ఆతడు, గుణాన్ - గుణములను, అతివర్తతే - అతిక్రమించును.

ఆకాశమునుండి కోపము దేహము లోనికి హఠాత్తుగా ఊడిపడి నదా యనిపించును. లేదా, హృదయాకాశమునుండి భయంకరమగు కోపము ఉబికివచ్చును. అట్టి కోపమును ఎవడైతే ఆత్మవిచారముచే ఉపసంహరించునో, అట్టివాడు త్రిగుణాత్మకమగు సంసారము నతిక్రమించును.

అలం దగ్ధైర్ద్రుమైర్దీనైః ఖిలానాం శివమస్తు వః ।
వార్క్షీ హ్యేషా వరా కన్యా పత్నీత్వే ప్రతిగృహ్యతామ్ ॥15

దగ్ధైః - తగులబెట్టబడిన, దీనైః - దీనములగు, ద్రుమైః - చెట్లచే, అలమ్ - చాలును, ఖిలానామ్ - మిగిలినవాటికి, వః - మీకు, శివమ్ - మంగళము, అస్తు - కలుగు గాక!, ఏషా - ఈ, వార్క్షీ - వృక్షములకు

చెందిన, వరా - శ్రేష్ఠురాలగు, కన్యా - కన్య, పత్నీత్వే - భార్యాస్థానమునందు, ప్రతిగృహ్యతామ్ - స్వీకరించబడు గాక!

దీనమగు వృక్షములను తగులబెట్టుటను చాలించుడు. మిగిలిన చెట్లకు మీకు మంగళమగుగాక! ఈ శ్రేష్ఠయగు కన్యను చెట్లే పాలించినవి. ఈమెను మీరు భార్యగా స్వీకరించుడు.

ఇత్యామంత్ర్య వరారోహాం కన్యామాప్సరసీం నృప ।
సోమో రాజా యయౌ దత్త్వా తే ధర్మేణోపయేమిరే ॥ 16

నృప - ఓ రాజా!, రాజా - ఓషధులకు రాజగు, సోమః - చంద్రుడు, ఇతి - ఈ విధముగా, ఆమంత్ర్య - బుజ్జగించి, వరారోహామ్ - సుందరియైనట్టియు, ఆప్సరసీమ్ - అప్సరస కుమార్తెయగు, కన్యామ్ - కన్యను, దత్త్వా - ఇచ్చి, యయౌ - వెళ్లెను, తే - వారు, ధర్మేణ - ధర్మముగా, ఉపయేమిరే - వివాహమాడిరి.

ఓ పరీక్షిన్మహారాజా! ఓషధులకు రాజగు చంద్రుడీ విధముగా వారి కోపమును చల్లార్చెను. ప్రమ్లోచ అనే అప్సరస కుమార్తె, సుందరియగు మారిష అనే కన్యను వారికి అప్పజెప్పి, ఆయన నిష్క్రమించెను. అపుడు వారామెను ధర్మబద్ధముగా వివాహమాడిరి.

తేభ్యస్తస్యాం సమభవద్దక్షః ప్రాచేతసః కిల ।
యస్య ప్రజావిసర్గేణ లోకా ఆపూరితాస్త్రయః ॥ 17

తేభ్యః - వారి వలన, తస్యామ్ - ఆమెయందు, దక్షః - దక్షుడు, సమభవత్ - కలిగెను, ప్రాచేతసః కిల - ప్రచేతసుల పుత్రుడు కదా!, యస్య - ఎవనియొక్క, ప్రజావిసర్గేణ - ప్రజాసృష్టిచే, త్రయః - మూడు, లోకాః - లోకములు, ఆపూరితాః - అంతటా నిండినవో.

వారికి ఆమెయందు దక్షుడు పుట్టెను. దక్షుడు ప్రాచేతసుడు (ప్రచేతసుల పుత్రుడు) అని ప్రసిద్ధియే గదా! ఆ దక్షుని ప్రజాసృష్టిచే ముల్లోకములు అంతటా నిండినవి.

యథా ససర్జ భూతాని దక్షో దుహితృవత్సలః ।
రేతసా మనసా చైవ తన్మమావహితశ్శృణు ।। 18

దుహితృవత్సలః - కుమార్తెలయందు ప్రేమ గల, దక్షః - దక్షుడు, రేతసా - బీజముచే, మనసా చ ఏవ - సంకల్పముచే కూడ, యథా - ఏ విధముగా, భూతాని - ప్రాణులను, ససర్జ - సృష్టించెనో, తత్ - దానిని, మమ - నానుండి, అవహితః - జాగరూకుడవై, శృణు - వినుము.

దక్షునకు కుమార్తెలయందు ప్రేమ మెండు. ఆయన బీజముచే మరియు మనస్సంకల్పముచే కూడ ప్రాణులను సృష్టించెను. నేనా వివరములను చెప్పెదను. సావధానముగా వినుము.

మనసైవాసృజత్పూర్వం ప్రజాపతిరిమాః ప్రజాః ।
దేవాసురమనుష్యాదీన్నభఃస్థలజలౌకసః ।। 19

ప్రజాపతిః - దక్ష ప్రజాపతి, నభః-స్థలజల-ఓకసః - ఆకాశము నేల నీరు నివాసస్థానములుగా గల, దేవ-అసురమనుష్య-ఆదీన్ - దేవతలు అసురులు మానవులు మొదలుగా గల, ప్రజాః - ప్రాణులను, పూర్వమ్ - ముందుగా, మనసా ఏవ - మనస్సుతోనే, అసృజత్ - సృష్టించెను.

దక్ష ప్రజాపతి ముందుగా మనస్సంకల్పముతోనే దేవతలు, అసురులు, మానవులు మొదలగు ప్రాణులను సృష్టించెను. ఈ ప్రాణులకు ఆకాశము, నేల, నీరు నివాసస్థానములు.

తమబృంహితమాలోక్య ప్రజాసర్గం ప్రజాపతిః ।
వింధ్యపాదానుపవ్రజ్య సోఽచరద్దుష్కరం తపః।। 20

సః - ఆ, ప్రజాపతిః - దక్ష ప్రజాపతి, అబృంహితమ్ - వర్ధిల్లని, తమ్ - ఆ, ప్రజాసర్గమ్ - ప్రజాసృష్టిని, ఆలోక్య - చూచి, వింధ్యపాదాన్ - వింధ్యయొక్క పాదపర్వతములను, ఉపవ్రజ్య - చేరుకొని, దుష్కరమ్ - చేయుటకు శక్యము కాని, తపః - తపస్సును, అచరత్ - చేసెను.

ఆ ప్రజాసృష్టి వర్ధిల్లుట లేదని ఆ ప్రజాపతి గమనించెను. అపుడా యన వింధ్యయొక్క పాదపర్వతములను చేరుకొని, చేయుటకు శక్యము కాని తపస్సును చేసెను.

తత్రాఘమర్షణం నామ తీర్థం పాపహరం పరమ్ ।
ఉపస్పృశ్యానుసవనం తపసాऽతోషయద్ధరిమ్ ॥ 21

తత్ర - అచట, పాపహరమ్ - పాపములను పోగొట్టునట్టియు, పరమ్ - గొప్ప, అఘమర్షణం నామ - అఘమర్షణమని ప్రసిద్ధి గాంచిన, తీర్థమ్ - తీర్థమును, అనుసవనమ్ - మూడు పూటలా, ఉపస్పృశ్య - స్నానము చేసి, తపసా - తపస్సుతో, హరిమ్ - శ్రీహరిని, అతోషయత్ - ప్రసన్నునిగా చేసుకొనెను.

అచట అఘమర్షణమని ప్రసిద్ధి గాంచిన, పాపములను పోగొట్టే గొప్ప తీర్థము గలదు. దానియందు ఆయన మూడు పూటలా స్నానము చేస్తూ తపస్సుచే శ్రీహరిని ప్రసన్నుని చేసుకొనెను.

అస్తౌషీద్ధంసగుహ్యేన భగవంతమధోక్షజమ్ ।
తుభ్యం తదభిధాస్యామి కస్యాతుష్యద్యతో హరిః ॥ 22

అధోక్షజమ్ - ఇంద్రియములకు అతీతుడగు, భగవంతమ్ - శ్రీహరి భగవానుని, హంసగుహ్యేన - హంసగుహ్యమనే స్తోత్రముతో, అస్తౌషీత్ - స్తుతించెను, తుభ్యమ్ - నీ కొరకు, తత్ - దానిని, అభిధాస్యామి - చెప్పగలను, యతః - దేని వలన, హరిః - శ్రీహరి, కస్య - ప్రజాపతికి, అతుష్యత్ - ప్రసన్నుడాయెనో.

ఇంద్రియాతీతుడగు శ్రీహరి భగవానుని ఆ ప్రజాపతి హంసగుహ్యము (పరమహంసల రహస్యము) అనే స్తోత్రముతో స్తుతించి, ప్రసన్నుని చేసుకొనెను. నీకా స్తోత్రమును నేను చెప్పెదను.

ప్రజాపతిరువాచ ।
నమః పరాయావితథానుభూతయే
గుణత్రయాభాసనిమిత్తబంధవే ।

అదృష్టధామ్నే గుణతత్త్వబుద్ధిభిః
నివృత్తమానాయ దధే స్వయంభువే ॥ 23

అవితథ-అనుభూతయే - అమోఘమైన చైతన్యశక్తి కలిగినట్టియు, గుణత్రయ-ఆభాసనిమిత్తబంధవే - మూడు గుణములయందలి చైతన్య ప్రతిఫలనమైన జీవునకు దానికి నిమిత్తమైన త్రిగుణాత్మికయగు మాయకు నియామకుడైనట్టియు, గుణతత్త్వబుద్ధిభిః - త్రిగుణకార్యమగు జగత్తునందు వాస్తవమనే ధారణ గలవారిచే, అదృష్టధామ్నే - తెలియబడని స్వరూపము కలిగినట్టియు, నివృత్తమానాయ - తొలగిపోయిన ప్రత్యక్షాది ప్రమాణ ములు కలిగినట్టియు, స్వయంభువే - స్వయంప్రకాశ స్వరూపుడైన, పరాయ - పరమేశ్వరుని కొరకు, దధే - నమస్కరించుచున్నాను.

పరమేశ్వరుని అమోఘమగు చైతన్యశక్తినుండియే త్రిగుణాత్మిక యగు మాయ ప్రకటమైనది. త్రిగుణకార్యమగు దేహేంద్రియమనస్సంఘా తమునందు ఆ చైతన్యముయొక్క ప్రతిఫలనమే జీవుడు. ఈ విధముగా ఆ పరమేశ్వరుడే మాయాశక్తికి, జీవులకు నియామకుడగుచున్నాడు. త్రిగుణకా ర్యమగు జగత్తునందు సత్యత్వబుద్ధి గలవారు ఆయన స్వరూపమును తెలి యలేరు. ఆయన ప్రత్యక్షాది ప్రమాణములకు గోచరము కాదు. స్వయంప్ర కాశ స్వరూపుడగు అట్టి పరమేశ్వరుని కొరకు నమస్కరించుచున్నాను.

న యస్య సఖ్యం పురుషోఽవైతి సఖ్యుః
సఖా వసన్ సంవసతః పురేఽస్మిన్ ।
గుణో యథా గుణినో వ్యక్తదృష్టేః
తస్మై మహేశాయ నమస్కరోమి ॥ 24

అస్మిన్ - ఈ, పురే - నగరమువంటి దేహమునందు, వసన్ - నివ సించుచున్నట్టియు, సఖా - మిత్రుడైన, పురుషః - మానవుడు, సంవసతః - కలిసి నివసించుచున్నట్టియు, వ్యక్తదృష్టేః - జగత్తునకు దృక్ స్వరూపు డైన, యస్య - ఏ, సఖ్యుః - మిత్రునియొక్క, సఖ్యమ్ - మైత్రిని, గుణినః - ఇంద్రియములు మొదలగు విషయిని, గుణః యథా - విషయము వలె, న

అవైతి - తెలియకున్నాడో, తస్మై - అట్టి, మహా-ఈశాయ - సర్వేశ్వరుని కొరకు, నమః-కరోమి - నమస్కారమును చేయుచున్నాను.

జీవేశ్వరులు సర్వకాలమిత్రులు. నగరమనదగిన ఈ దేహము నందు జీవునితో బాటుగా మిత్రుడగు ఈశ్వరుడు కూడ సర్వజగత్సాక్షియై కలిసి నివసించుచున్నాడు. కాని, జీవుడు తన మిత్రుని గుర్తించ లేకున్నాడు. శబ్దము మొదలగు విషయములు చెవి మొదలగు ఇంద్రియములచే ప్రకాశింప జేయబడునే గాని, ఆ ఇంద్రియములను ఈ విషయములు ప్రకాశింప జేయలేవు. అదే విధముగా, జీవుడు నిత్యదృక్-స్వరూపుడగు ఈశ్వరుని తన జ్ఞానములో విషయముగా చేయలేడు. అట్టి సర్వేశ్వరునకు నేను నమస్కరించుచున్నాను.

దేహోఽసవోఽక్షా మనవో భూతమాత్రా
నాత్మానమన్యం చ విదుః పరం యత్ ।
సర్వం పుమాన్ వేద గుణాంశ్చ తజ్జ్ఞో
న వేద సర్వజ్ఞమనంతమీడే ।। 25

దేహః - శరీరము, అసవః - ప్రాణములు, అక్షాః - ఇంద్రియములు, మనవః - మనోవృత్తులు, భూతమాత్రాః చ - స్థూల సూక్ష్మ భూతములు కూడ, అన్యమ్ - విలక్షణమైన, ఆత్మానమ్ - జీవుని, న విదుః - తెలియలేవు, యత్ - ఏలయనగా, పరమ్ - అతీతమైనది, పుమాన్ - జీవుడు, సర్వమ్ - సర్వమును, గుణాన్ చ - త్రిగుణములను కూడ, వేద - తెలియుచున్నాడు, తద్-జ్ఞః - వాటిని తెలుసుకొనే జీవుడు, సర్వజ్ఞమ్ - సర్వమును తెలిసే, అనంతమ్ - అనంతుని, న వేద - తెలియకున్నాడు, ఈడే - స్తుతించుచున్నాను.

శరీరము, ప్రాణములు, ఇంద్రియములు, మనోవృత్తులు, ఆకాశము వాయువు అగ్ని జలము పృథివి అనే అయిదు స్థూలభూతములు, శబ్దము స్పర్శ రూపము రసము గంధము అనే అయిదు సూక్ష్మభూతములు ఇవన్నీ కలిసి ఒక సంఘాతము. ఈ సంఘాతమునకు ద్రష్టయగు జీవుడు ఈ సంఘాతమునకు అతీతుడై, వీటినన్నింటినీ మాత్రమే గాక, క్రమ

ముగా సత్త్వరజస్తమోగుణకార్యములగు సుఖదుఃఖమోహములను కూడ తెలియుచున్నాడు. కాని, ఆ జీవుడు తనకంటె అతీతమైన దేశకాలపరిచ్ఛేద రహితమైన సర్వజ్ఞుడగు ఈశ్వరుని తన జ్ఞానములో విషయముగా చేయలే డు. అట్టి ఈశ్వరుని నేను స్తుతించుచున్నాను.

యదోపరామో మనసో నామరూప-
రూపస్య దృష్టస్మృతిసంప్రమోషాత్ ।
య ఈయతే కేవలయా స్వసంస్థయా
హంసాయ తస్మై శుచిసద్మనే నమః ॥ 26

యదా - ఎప్పుడైతే, దృష్టస్మృతిసంప్రమోషాత్ - దర్శన స్మరణ ముల అంతరించుట వలన, నామరూపరూపస్య - నామరూపములను తెలుసుకుంటూ ఉండే, మనసః - మనస్సునకు, ఉపరామః - ఉపరతి కలు గునో అప్పుడు, యః - ఏ ఈశ్వరుడు, కేవలయా - అద్వితీయమగు, స్వసంస్థయా - ఆత్మనిష్ఠచే, ఈయతే - పొందబడుచున్నాడో, శుచిసద్మనే - శుద్ధమగు అంతఃకరణములో నివసించే, హంసాయ - అజ్ఞానవినాశకుడ గు, తస్మై - ఆ ఈశ్వరుని కొరకు, నమః - నమస్కారము.

ఇంద్రియవ్యాపారములను, మననాది వ్యాపారములను కూడ కట్టి బెట్టినప్పుడు, నామరూపములను తెలుసుకుంటూ ఉండే మనస్సు తన స్వరూపమునందు విలీనమగును. అప్పుడు జీవుడు తన స్వరూపమగు అద్వితీయ-ఆత్మయందు నిలిచియుండును. ఈ విధముగా జీవుడు ఆ ఈశ్వరుని ఆత్మరూపముగా పొందగల్గును. ఆ విధముగా శుద్ధమగు అంతః కరణములో ఆత్మరూపముగా ప్రకాశించే సర్వజ్ఞుడగు ఈశ్వరుని కొరకు నమస్కారము.

మనీషిణోఽంతర్హృది సంనివేశితం
స్వశక్తిభిర్నవభిశ్చ త్రివృద్భిః ।
వహ్నిం యథా దారుణి పాంచదశ్యం
మనీషయా నిష్కర్షంతి గూఢమ్ ॥ 27

మనీషిణః - మనోనిగ్రహము గల జ్ఞానులు, త్రివృద్భిః - త్రిగుణాత్మకములైన, నవభిః - తొమ్మిది, స్వశక్తిభిః చ - తన శక్తులచే, అంతః-హృది - హృదయము లోపల, సంనివేశితమ్ - నిశ్చలముగా చేయబడినట్టియు, గూఢమ్ - దాగియున్న ఈశ్వరుని, దారుణి - కట్టెయందు, పాంచదశ్యమ్ - పదిహేను సామిధేనీ మంత్రములచే ప్రకాశింప జేయబడే, వహ్నిం యథా - అలౌకికమగు అగ్నిని వలె, మనీషయా - వివేకముతో కూడిన బుద్ధితో, నిష్కర్షంతి - వివేచించెదరు.

అవ్యక్తము, మహత్తు (బుద్ధిశక్తి), అహంకారము, మనస్సు, అయిదు సూక్ష్మభూతములు వెరసి ఈ తొమ్మిది పరమేశ్వరుని శక్తులగు సత్త్వరజస్తమోగుణముల కార్యములు. వీటితో ఈశ్వరుడు మానవుని హృదయము లోపల గూఢముగా స్థిరముగా నున్నాడు. కట్టెయందు దాగియున్న అలౌకికమగు అగ్నిని వేదవేత్తలు పదిహేను సామిధేనీ మంత్రములను పఠిస్తూ మథించి ప్రకటము చేసెదరు. అదే విధముగా మనోనిగ్రహమునభ్యసించే మహాత్ములు వివేకపూర్ణమగు బుద్ధితో ఆ ఈశ్వరుని ఈ సంఘాతమునుండి వివేచించి, ఆత్మరూపముగా దర్శించెదరు.

స వై మమాశేషవిశేషమాయానిషేధనిర్వాణసుఖానుభూతిః ।
స సర్వనామా స చ విశ్వరూపః ప్రసీదతామనిరుక్తాత్మశక్తిః ।। 28

సః - ఆ ఈశ్వరుడు, వై - నిశ్చయముగా, మమ - నాకు, అశేషవిశేషమాయానిషేధనిర్వాణసుఖ-అనుభూతిః - సకలభేదములతో గూడిన మాయాకార్యమగు జగత్తును నిషేధించగా దుఃఖస్పర్శ లేని ఆనందానుభవమే, సః - ఆయన, సర్వనామా - సకలనామములు గలవాడు, సః - ఆయన, విశ్వరూపః చ - సకలరూపములు గలవాడు కూడ, అనిరుక్త-ఆత్మశక్తిః - నిర్వచించ శక్యము కాని స్వీయమాయాశక్తి గల ఆ ఈశ్వరుడు, ప్రసీదతామ్ - ప్రసన్నుడగు గాక!

సకలభేదములతో గూడిన మాయాకార్యమగు జగత్తును నిషేధించగా దుఃఖస్పర్శ లేకుండగా నా హృదయములో ప్రకటమయ్యే ఆనం

దానుభవమే ఆ ఈశ్వరుడు. ఈ జగత్తులోని సకలనామరూపములు ఆయ నయే. అనిర్వచనీయ మాయాశక్తి గల ఆయన నాపై ప్రసన్నుడగు గాక!

యద్యన్నిరుక్తం వచసా నిరూపితం
ధియాక్షభిర్వా మనసా వోత యస్య ।
మా భూత్స్వరూపం గుణరూపం హి తత్తత్
స వై గుణాపాయవిసర్గలక్షణః ।। 29

యత్ యత్ - ఏది ఏది, వచసా - వాక్కుచే, నిరుక్తమ్ - ఇదమిత్థముగా నిర్దేశించబడినదో, ధియా - బుద్ధిచే గాని, అక్షభిః వా - ఇంద్రియములచే గాని, ఉత - లేదా, మనసా వా - సంకల్పముచే గాని, నిరూపితమ్ - తెలియ బడినదో, తత్ తత్ - అది అది, గుణరూపం హి - త్రిగుణముల రూపమే గాని, స్వరూపమ్ - స్వరూపము, మా భూత్ - కాదు, సః - ఆ ఈశ్వరుడు, వై - నిశ్చయముగా, గుణ-అపాయవిసర్గలక్షణః - త్రిగుణ కార్యమగు జగత్తుయొక్క ప్రళయముచే సృష్టిచే లక్షితమగువాడు.

మనము వాక్కుతో దేనిని ఇదమిత్థముగా నిర్దేశిస్తామో, ఇంద్రియములతో గాని మనస్సుతో గాని బుద్ధిచే గాని తెలుసుకుంటామో, అది సత్త్వరజస్తమోగుణముల కార్యమే యగును గాని, ఈశ్వరుని స్వరూపము కాజాలదు. త్రిగుణకార్యమగు జగత్తుయొక్క సృష్టిస్థితిలయములకు అధిష్ఠానమగు ఈశ్వరుని, జగన్నిషేధమునకు అవధిగా మాత్రమే తెలియుట సంభవము. ఈ విధముగా జగత్తు ఈశ్వరునకు తటస్థ లక్షణమగుచున్నది.

యస్మిన్ యతో యేన చ యస్య యస్మై
యద్ యో యథా కురుతే కార్యతే చ ।
పరావరేషాం పరమం ప్రాక్ ప్రసిద్ధం
తద్ బ్రహ్మ తద్ధేతురనన్యదేకమ్ ।। 30

యస్మిన్ - ఎవనియందు, యతః - ఎవని వలన, యేన చ - ఎవని చేత, యస్య - ఎవనియొక్క, యస్మై - ఎవని కొరకు, యత్ - ఏది, యః - ఎవడు, యథా - ఏ విధముగా, కురుతే - చేయునో, కార్యతే చ -

చేయించబడునో కూడ, పర-అవరేషామ్ - కారణ కార్యములకు, ప్రాక్ - పూర్వమే, ప్రసిద్ధమ్ - ప్రకృష్టముగా సిద్ధమై ఉన్నట్టియు, తద్-హేతుః - వాటికి కారణమైనట్టియు, పరమమ్ - వాటికి అతీతమైనట్టియు, అనన్యత్ - మరియొకటి లేనట్టియు, ఏకమ్ - అఖండమైనది ఏది గలదో, తత్ - అదియే, బ్రహ్మ - పరబ్రహ్మ.

పరబ్రహ్మ ఈ తన జగత్తును తనయందు తననుండి తనచే తాను తన కొరకు ప్రకటించి సర్వమును తానే చేస్తూ, చేయిస్తున్నాడు. ఆ చేసే ప్రక్రియ కూడ పరబ్రహ్మయే. కార్యకారణములకు పూర్వమే స్వయంసిద్ధమైయున్న పరబ్రహ్మ ఆ కార్యకారణములన్నింటికీ హేతువు. అట్టి పరబ్రహ్మ అఖండము, అద్వితీయము.

యచ్ఛక్తయో వదతాం వాదినాం వై
వివాదసంవాదభువో భవంతి ।
కుర్వంతి చైషాం ముహురాత్మమోహం
తస్మై నమోఽనంతగుణాయ భూమ్నే ॥ 31

యత్-శక్తయః - ఎవని శక్తులు, వాదినామ్ - వాదులకు, వదతామ్ - ప్రతివాదులకు, వివాదసంవాదభువః - వివాదములకు సంవాదములకు కారణములు, భవంతి వై - అగుచున్నవో, చ - మరియు, ఏషామ్ - వీరికి, ముహుః - మరల మరల, ఆత్మమోహమ్ - బుద్ధికి వ్యామోహమును, కుర్వంతి - కలిగించుచున్నవో, అనంతగుణాయ - అనంతములగు గుణములు కలిగినట్టియు, భూమ్నే - సర్వవ్యాపకుడగు, తస్మై - ఆ పరమేశ్వరుని కొరకు, నమః - నమస్కారము.

వాదులు, ప్రతివాదుల వివాదసంవాదములకు మూలము ఆ పరమేశ్వరుని మాయాశక్తులే. ఆ మాయాశక్తులే వీరి బుద్ధులలో మరల మరల వ్యామోహమును కలిగించుచుండును. అనంతములగు గుణములు కలిగి సర్వమును వ్యాపించియున్న ఆ పరమేశ్వరునకు నమస్కారము.

అస్తీతి నాస్తీతి చ వస్తునిష్ఠయోః
ఏకస్థయోర్భిన్నవిరుద్ధధర్మయోః ।

అవేక్షితం కించన యోగసాంఖ్యయోః
సమం పరం హ్యానుకూలం బృహత్తత్ ॥ 32

అస్తి - ఉన్నది, ఇతి - అని, న అస్తి - లేదు, ఇతి చ - అని కూడ, భిన్నవిరుద్ధధర్మయోః - భిన్నములు పరస్పరవిరుద్ధములు అగు ధర్మములు కలిగినట్టియు, వస్తునిష్ఠయోః - పరమాత్మవస్తువునందు తాత్పర్యము కలిగినట్టియు, ఏకస్థయోః - ఒకే పరబ్రహ్మను ప్రతిపాదించే, యోగసాంఖ్యయోః - కర్మయోగ జ్ఞానయోగములకు, కించన - ఒకానొక, అనుకూలమ్ - అనుకూలమైన, సమమ్ - సమానమైనది, అవేక్షితమ్ - దర్శించబడినది, తత్ హి - అదియే, పరం బృహత్ - పరబ్రహ్మ.

యోగశాస్త్రము (నిష్కామ కర్మ మరియు భక్తి) ఈశ్వరునకు నామరూపములు గలవనియు, జ్ఞానయోగము ఈశ్వరునకు నామరూపములు లేవనియు, ఈ విధముగా భిన్నములు మరియు పరస్పరవిరుద్ధములు అగు ప్రతిపాదనములను చేయుచున్నట్లు కన్పట్టును. కాని, ఈ రెండు యోగములు ఒకే పరమాత్మ తత్త్వమునందు నిష్ఠ గలవియై, దానినే తాత్పర్యముగా ప్రతిపాదించుచున్నవి. వాటికి మూలములో ఒకానొక మూలతత్త్వము రెండింటికీ అనుకూలమైనది మరియు రెండింటికీ సమానమైనది గలదు. అదియే సకలభావాభావముల నిషేధములకు అవధియైన ఆత్మరూపముగా తెలియబడే పరబ్రహ్మ.

యోఽనుగ్రహార్థం భజతాం పాదమూల-
మనామరూపో భగవాననంతః ।
నామాని రూపాణి చ జన్మకర్మభిః
భేజే స మహ్యం పరమః ప్రసీదతు ॥ 33

అనామరూపః - నామరూపములు లేనివాడు, అనంతః - దేశకాల పరిచ్ఛేదములు లేనివాడు అగు, యః - ఎవ్వాడు, పాదమూలమ్ - పాదముల మూలమును, భజతామ్ - భజించు వారల, అనుగ్రహ-అర్థమ్ - అనుగ్రహము కొరకై, జన్మకర్మభిః - జన్మలచే మరియు లీలలచే, నామాని - నామములను, రూపాణి చ - రూపములను కూడ, భేజే - పొందెనో, సః

- అట్టి, పరమః - నామరూపములకు అతీతుడగు, భగ.గాన్ - భగవానుడు, మహ్యమ్ - నా కొరకు, ప్రసీదతు - ప్రసన్నుడగు గాక!

తన పాదముల మూలమును సేవించే భక్తులననుగ్రహించుటకై నామరూపములు, దేశకాలపరిచ్ఛేదములు లేని భగవానుడు అవతరించి లీలలను చేసి నామములను, రూపములను కూడ పొందెను. అయిననూ, నామరూపములకు అతీతుడుగనే యున్న ఆ భగవానుడు నాపై ప్రసన్నుడగు గాక!

యః ప్రాకృతైర్జ్ఞానపథైర్జనానాం
యథాశయం దేహగతో విభాతి ।
యథానిలః పార్థివమాశ్రితో గుణం
స ఈశ్వరో మే కురుతాన్మనోరథమ్ ।। 34

దేహగతః - దేహములయందున్న, యః - ఎవడు, ప్రాకృతైః - సాధారణములగు, జ్ఞానపథైః - ఉపాసనా మార్గములచే, జనానామ్ - జనులకు, యథా-ఆశయమ్ - భావనకు తగ్గట్లుగా, విభాతి - కానవచ్చునో, పార్థివమ్ - పృథివికి సంబంధించిన, గుణమ్ - గుణమును, ఆశ్రితః - ఆశ్రయించిన, అనిలః యథా - వాయువు వలె, సః - అట్టి, ఈశ్వరః - ఈశ్వరుడు, మే - నా, మనోరథమ్ - మనోరథమును, కురుతాత్ - చేయుగాక!

ఈశ్వరుడు సకలప్రాణుల దేహములలో ఆత్మరూపముగా నున్నాడు. అయిననూ, జనులు సాధారణములైన ఆయా ఉపాసనలను చేస్తూ, ఈశ్వరుని ఆయా దేవతల రూపములో కొల్చెదరు. ఆయన ఆ ఉపాసనలకు తగ్గట్లుగా, వాయువు పృథివీలక్షణమగు గంధమును పట్టుకొని తాను గంధము గలది వలె కనబడినట్లుగా, ఆయా రూపములు కలవాడుగనే కన్పట్టును. అట్టి పరమేశ్వరుడు నా మనోరథమునీడేర్చు గాక!

శ్రీశుక ఉవాచ ।
ఇతి స్తుతస్సంస్తువతస్స తస్మిన్నఘమర్షణే ।
ఆవిరాసీత్కురుశ్రేష్ఠ భగవాన్ భక్తవత్సలః ।। 35

కురుశ్రేష్ఠ - కురువంశములో శ్రేష్ఠుడవైన ఓ రాజా!, తస్మిన్ - ఆ, అఘమర్షణే - అఘమర్షణ తీర్థమునందు, సంస్తువతః - చక్కగా స్తుతించే దక్షునకు, ఇతి - ఈ విధముగా, స్తుతః - స్తుతించబడినవాడు, భక్తవత్సలః - భక్తులయందు ప్రేమ గలవాడు అగు, సః - ఆ, భగవాన్ - భగవానుడు, ఆవిః-ఆసీత్ - సాక్షాత్కరించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- కురువంశములో శ్రేష్ఠుడవగు ఓ పరీక్షిన్మహారాజా! చక్కగా స్తోత్రమును చేసే దక్షుడు ఆ అఘమర్షణతీర్థ మునందు ఈ విధముగా స్తుతించగా, భక్తవత్సలుడగు ఆ భగవానుడు ఆయనకు సాక్షాత్కరించెను.

కృతపాదస్సుపర్ణాంసే ప్రలంబాష్టమహాభుజః ।
చక్రశంఖాసిచర్మేషుధనుఃపాశగదాధరః ।। 36

సుపర్ణ-అంసే - గరుత్మంతుని భుజముపై, కృతపాదః - ఉంచబడిన పాదములు గలవాడు, ప్రలంబ-అష్టమహాభుజః - వ్రేలాడే ఎనిమిది పెద్ద బాహువులు గలవాడు, చక్రశంఖ-అసిచర్మ-ఇషుధనుఃపాశగదాధరః - చక్రము శంఖము కత్తి డాలు బాణము ధనస్సు త్రాడు గదలను ధరించినవాడు.

ఆయన గరుత్మంతుని భుజములపై పాదములనుంచి, వ్రేలాడే ఎనిమిది పెద్ద బాహువులయందు చక్రము, శంఖము, కత్తి, డాలు, బాణము, ధనస్సు, త్రాడు, గదలను ధరించియుండెను.

పీతవాసా ఘనశ్యామః ప్రసన్నవదనేక్షణః ।
వనమాలానివీతాంగో లసచ్ఛ్రీవత్సకౌస్తుభః ।। 37

పీతవాసాః - పీతాంబరుడు, ఘనశ్యామః - మేఘము వలె నల్లనివాడు, ప్రసన్నవదన-ఈక్షణః - ప్రసన్నములగు ముఖము కన్నులు గలవాడు, వనమాలానివీత-అంగః - వనమాలచే వ్యాపించబడిన అవయవములు గలవాడు, లసత్-శ్రీవత్సకౌస్తుభః - ప్రకాశించే శ్రీవత్సము (మచ్చ) మరియు కౌస్తుభము గలవాడు.

పీతాంబరుడగు ఆ శ్రీహరి మేఘమువలె నల్లనివాడు. ఆయన ముఖము, కన్నులు ప్రసన్నముగ నుండెను. ఆయన దేహమునంతనూ వన మాల వ్యాపించి యుండెను. ఆయన వక్షఃస్థలముపై శ్రీవత్సము మరియు కౌస్తుభము ప్రకాశించుచుండెను.

మహాకిరీటకటకస్స్ఫురన్మకరకుండలః ।
కాంచ్యంగులీయవలయనూపురాంగదభూషితః ॥ 38

మహాకిరీటకటకః - గొప్ప కిరీటము కంకణములు గలవాడు, స్ఫురత్-మకరకుండలః - ప్రకాశించే మకరకుండలములు గలవాడు, కాంచీ-అంగులీయవలయనూపుర-అంగదభూషితః - ఒడ్డాణము ఉంగరములు కంఠహారము కాలియందెలు భుజకీర్తులచే అలంకరించబడినవాడు.

గొప్ప కిరీటము, కంకణములు, మొసలి ఆకారములోనుండే కుండలములు, ఒడ్డాణము, ఉంగరములు, కంఠహారము, కాలియందెలు, భుజకీర్తులను అలంకరించుకొని ఆయన ప్రకాశించుచుండెను.

త్రైలోక్యమోహనం రూపం బిభ్రత్త్రిభువనేశ్వరః ।
వృతో నారదనందాద్యైః పార్షదైస్సురయూథపైః ॥ 39

త్రైలోక్యమోహనమ్ - ముల్లోకములకు మోహమును కలిగించే, రూపమ్ - రూపమును, బిభ్రత్ - ధరించినవాడు, త్రిభువన-ఈశ్వరః - ముల్లోకములకు ప్రభుడు, నారదనంద-ఆద్యైః - నారదుడు నందుడు మొదలుగా గల, పార్షదైః - అనుచరులతో, సురయూథపైః - లోకపాలకులతో, వృతః - చుట్టువారబడి యున్నవాడు.

ముల్లోకములకు ప్రభువగు ఆయన ముల్లోకములకు మోహమును కలిగించే రూపమును దాల్చియుండెను. నారదుడు, నందుడు మొదలగు అనుచరులు, లోకపాలకులు ఆయనను చుట్టువారి యుండిరి.

స్తూయమానోఽనుగాయద్భిస్సిద్ధగంధర్వచారణైః ।
రూపం తన్మహదాశ్చర్యం విచక్ష్యాగతసాధ్వసః ।
ననామ దండవద్భూమౌ ప్రహృష్టాత్మా ప్రజాపతిః ॥ 40

అను - వెనుక, గాయద్భిః - గానము చేయుచున్న, సిద్ధగంధర్వ చారణైః - సిద్ధులు గంధర్వులు చారణులచే, స్తూయమానః - స్తుతించబ డుచున్నవాడు, తత్ - ఆ, మహత్ - గొప్ప, ఆశ్చర్యమ్ - అద్భుతమగు, రూపమ్ - రూపమును, విచక్ష్య - చూచి, ఆగతసాధ్వసః - కలిగిన తత్తర పాటు గల, ప్రజాపతిః - దక్ష ప్రజాపతి, ప్రహృష్ట-ఆత్మా - గొప్ప హర్ష మును పొందిన హృదయము గలవాడై, భూమౌ - భూమిపై, దండవత్ - కర్రవలె, ననామ - నమస్కరించెను.

ఆయన వెనుక సిద్ధులు, గంధర్వులు, చారణులు గానము చేస్తూ స్తుతించుచుండిరి. ఆ గొప్ప అద్భుతమగు రూపమును చూచి, దక్ష ప్రజా పతి తత్తరపాటు చెందెను. ఆయన హృదయము గొప్ప హర్షముతో నిండి పోయెను. అపుడాయన నేలపై కర్రవలె సాష్టాంగనమస్కారమును చేసెను.

న కించనోదీరయితుమశకత్తీవ్రయా ముదా ।
ఆపూరితమనోద్వారైర్హ్రదిన్య ఇవ నిర్ఝరైః ॥ 41

నిర్ఝరైః - కొండ కాలువలచే, హ్రదిన్యః ఇవ - సరస్సులు వలె, తీవ్రయా - ఉత్కటమగు, ముదా - ఆనందముతో, ఆపూరితమనోద్వారైః - పూర్తిగా నిండించబడిన మనస్సునకు ద్వారములగు ఇంద్రియములచే, కించన - దేనినీ, ఉదీరయితుమ్ - పలుకుటకు, న అశకత్ - సమర్థుడు కాలేదు.

కొండ కాలువలు సరస్సును నింపివేసినట్లుగా, ఉత్కటమగు ఆనందముతో మనస్సునకు ద్వారములవంటి ఆయన ఇంద్రియములు పూర్తిగా నిండిపోయెను. కావుననే, ఆయన ఏమీ చెప్పలేక పోయెను.

తం తథావనతం భక్తం ప్రజాకామం ప్రజాపతిమ్ ।
చిత్తజ్ఞస్సర్వభూతానామిదమాహ జనార్దనః ॥ 42

తథా - ఆ విధముగా, అవనతమ్ - నమస్కరించినట్టియు, భక్తమ్ - భక్తుడైనట్టియు, ప్రజాకామమ్ - సంతానమును కోరుచున్న, ప్రజాపతిమ్ - దక్ష ప్రజాపతిని, సర్వభూతానామ్ - సకలప్రాణులయొక్క, చిత్తజ్ఞః -

చిత్తమును తెలిసే, జన-అర్దనః - జనార్దనుడు, ఇదమ్ - ఈ మాటను, ఆహ - పలికెను.

భక్తుడగు దక్ష ప్రజాపతి సంతానమును కోరువాడై ఆ విధముగా శ్రీహరికి ప్రణమిల్లెను. సకలప్రాణుల హృదయములోని భావములకు సాక్షి యగు జనార్దనుడు (దుష్టజనులను పీడించువాడు) అపుడు ఇట్లు పలికెను.

శ్రీభగవానువాచ ।
ప్రాచేతస మహాభాగ సంసిద్ధిస్తపసా భవాన్ ।
యచ్ఛ్రద్ధయా మత్పరయా మయి భావం పరం గతః ॥43

ప్రాచేతస - ప్రచేతసుల పుత్రుడా!, మహాభాగ - మహానుభావా!, భవాన్ - నీవు, తపసా - తపస్సుచే, సంసిద్ధః - చక్కటి సిద్ధిని పొందితివి, యత్ - ఏలయనగా, మత్-పరయా - నేను మాత్రమే ఏకైక విషయముగా గల, శ్రద్ధయా - శ్రద్ధచే, మయి - నాయందు, పరమ్ - అతిశయించిన, భావమ్ - భక్తిని, గతః - పొందినవాడవు.

శ్రీభగవానుడు ఇట్లు పలికెను --- ప్రచేతసుల పుత్రుడవగు ఓ మహానుభావా! నీవు తపస్సుచే చక్కటి సిద్ధిని పొందితివి. ఏలయనగా, నీవు నాయందు అనన్యమగు శ్రద్ధ గలవాడవై, నాయందు అతిశయించిన భక్తిని పొందితివి.

ప్రీతోఽహం తే ప్రజానాథ యత్తేఽస్యోద్బృంహణం తపః ।
మమైష కామో భూతానాం యద్భూయాసుర్విభూతయః ॥ 44

ప్రజానాథ - ఓ ప్రజాపతీ!, అహమ్ - నేను, తే - నీ కొరకు, ప్రీతః - ప్రసన్నుడను, యత్ - ఏలయనగా, తే - నీ, తపః - తపస్సు, అస్య - ఈ జగత్తునకు, ఉద్బృంహణమ్ - వృద్ధికరము, ఏషః - ఇది, మమ - నా, కామః - కోరిక, యత్ - ఏదనగా, భూతానామ్ - ప్రాణులకు, విభూతయః - సంపదలు, భూయాసుః - కలుగు గాక!

అప్పుడు, ఆత్మానమ్ - తనను, ఖిలం ఇవ - అసమర్థుని వలె, మేనే - తలచెను.

దేవోత్తముడగు బ్రహ్మగారు నా శక్తిచే వర్ధిల్లజేయబడినవాడే. అయిననూ, సృష్టికార్యమునందు ఉద్యుక్తుడైనప్పుడు, ఆయన తనను తాను అసమర్థుడనా యన్నట్లు తలపోసెను.

అథ మేఽభిహితో దేవస్తపోఽతప్యత దారుణమ్ ।
నవ విశ్వసృజో యుష్మాన్ యేనాదావసృజద్విభుః ।। 50

అథ - అప్పుడు, మే - నాచే, అభిహితః - ఉపదేశించ బడినవాడై, దేవః - బ్రహ్మదేవుడు, దారుణమ్ - తీవ్రమగు, తపః - తపస్సును, అతప్యత - చేసెను, యేన - దేనిచే, విభుః - సమర్థుడైన బ్రహ్మగారు, ఆదౌ - మొట్టమొదట, యుష్మాన్ - మిమ్ములను, నవ - తొమ్మిదిమంది, విశ్వసృజః - జగత్తును సృష్టించే ప్రజాపతులను, అసృజత్ - సృష్టించెనో.

అప్పుడు నేను ఉపదేశించగా బ్రహ్మదేవుడు తీవ్రమగు తపస్సును చేసెను. ఆ తపస్సుచే లభించిన సామర్థ్యము గల బ్రహ్మగారు మొట్టమొదటగా జగత్తును సృష్టించే ప్రజాపతులైన మిమ్ములను తొమ్మిదిమందిని సృష్టించెను.

ఏషా పంచజనస్యాఽంగ దుహితా వై ప్రజాపతేః ।
అసిక్నీ నామ పత్నీత్వే ప్రజేశ ప్రతిగృహ్యతామ్ ।। 51

అంగ - ఓయీ!, ప్రజా-ఈశ - ప్రజాపతీ!, ఏషా - ఈమె, పంచజనస్య ప్రజాపతేః - పంచజన ప్రజాపతియొక్క, దుహితా - కుమార్తె, అసిక్నీ నామ - అసిక్ని అని ప్రసిద్ధి గాంచినది, పత్నీత్వే - భార్య స్థానమునందు, ప్రతిగృహ్యతామ్ - స్వీకరించ బడుగాక!

ఓయీ ప్రజాపతీ! అసిక్ని అని ప్రసిద్ధి గాంచిన ఈమె పంచజన ప్రజాపతియొక్క కుమార్తె. ఈమెను నీవు భార్యగా స్వీకరించుము.

మిథునవ్యవాయధర్మస్త్వం ప్రజాసర్గమిమం పునః।
మిథునవ్యవాయధర్మిణ్యాం భూరిశో భావయిష్యసి ।। 52

మిథునవ్యవాయధర్మః - భార్యతో కలిసియుండుట అనే ధర్మము గల, త్వమ్ - నీవు, మిథునవ్యవాయధర్మిణ్యామ్ - భర్తతో కలిసియుండుట అనే ధర్మము గల ఈమెయందు, పునః - మరల, ఇమమ్ - ఈ, ప్రజాసర్గమ్ - సంతానముయొక్క సృష్టిని, భూరిశః - అధికముగా, భావయిష్యసి - చేయగలవు.

భార్యాభర్తలగు మీరిద్దరు కలిసి జీవించుడు. ఈమెతో గూడి నీవు మరల ఈ సంతానముయొక్క సృష్టిని అధికముగా చేయగలవు.

త్వత్తోఽధస్తాత్ప్రజాస్సర్వా మిథునీభూయ మాయయా ।
మదీయయా భవిష్యంతి హరిష్యంతి చ మే బలిమ్ ।। 53

త్వత్తః - నీకంటె, అధస్తాత్ - క్రింద, సర్వాః - అందరు, ప్రజాః - ప్రాణులు, మదీయయా - నాకు చెందిన, మాయయా - మాయచే, మిథునీభూయ - జంటలుగా ఏర్పడి, భవిష్యంతి - ఉండగలరు, చ - మరియు, మే - నా కొరకు, బలిమ్ - పూజను, హరిష్యంతి - తీసుకు రాగలరు.

నీ తరువాతి ప్రాణులన్నియు నా మాయచే జంటలుగా ఏర్పడి జీవించగలవు. మరియు, మానవులు మొదలగు ప్రాణులు నాకు పూజాదికమును సమర్పించెదరు.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యుక్త్వా మిషతస్తస్య భగవాన్ విశ్వభావనః ।
స్వప్నోపలబ్ధార్థ ఇవ తత్రైవాంతర్దధే హరిః ।। 54

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే
హంసగుహ్యస్తోత్రవర్ణనం నామ చతుర్థోఽధ్యాయః ।।

విశ్వభావనః - జగత్తును వర్ధిల్లజేయు, భగవాన్ హరిః - శ్రీహరి భగవానుడు, ఇతి - అని, ఉక్త్వా - పలికి, తస్య - ఆ దక్షుడు, మిషతః -

చూచుచుండగా, స్వప్న-ఉపలబ్ధ-అర్థః ఇవ - కలయందు పొందబడిన వస్తువు వలె, తత్ర ఏవ - అచటనే, అంతర్దధే - అంతర్ధానమును చెందెను.

జగత్తును వర్ధిల్లజేయు శ్రీహరి భగవానుడు ఇట్లు పలికి, ఆ దక్ష ప్రజాపతి చూచుచుండగనే, కలలో దొరికిన వస్తువు వలె, అచటనే అంతర్ధానమాయెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి ఆరవ స్కంధములో
హంసగుహ్యస్తోత్రమును వర్ణించే నాల్గవ
అధ్యాయము ముగిసినది (4).

*****

# అథ పంచమోఽధ్యాయః

## దక్షుడు నారదుని శపించుట

శ్రీశుక ఉవాచ ।
తస్యాం స పాంచజన్యాం వై విష్ణుమాయోపబృంహితః ।
హర్యశ్వసంజ్ఞానయుతం పుత్రానజనయద్విభుః ॥ 1

విష్ణుమాయా-ఉపబృంహితః - విష్ణువుయొక్క మాయాశక్తిచే వర్ధిల్లజేయబడిన, విభుః - సమర్థుడగు, సః వై - ఆ దక్షుడు, తస్యామ్ - ఆ, పాంచజన్యామ్ - పంచజనుని కుమార్తెయందు, హర్యశ్వసంజ్ఞాన్ - హర్యశ్వులు అనే పేరు గల, పుత్రాన్ - పుత్రులను, అయుతమ్ - పది వేలమందిని, అజనయత్ - కనెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- విష్ణువుయొక్క మాయాశక్తిచే వర్ధిల్లజేయబడిన సామర్థ్యము గల ఆ దక్షుడు పంచజనుని కుమార్తెయగు అసిక్నియందు హర్యశ్వులు అనే పేరు గల పదివేలమంది కొడుకులను కనెను.

అపృథగ్ధర్మశీలాస్తే సర్వే దాక్షాయణా నృప ।
పిత్రా ప్రోక్తాః ప్రజాసర్గే ప్రతీచీం ప్రయయుర్దిశమ్ ॥ 2

నృప - ఓ రాజా!, తే - ఆ, సర్వే - అందరు, దాక్షాయణాః - దక్షుని పుత్రులు, అపృథగ్-ధర్మశీలాః - వేర్వేరు కాని ధర్మము స్వభావము గలవారు, పిత్రా - తండ్రిచే, ప్రజాసర్గే - ప్రజలను సృష్టించుటయందు, ప్రోక్తాః - ఆదేశించబడినవారై, ప్రతీచీం దిశమ్ - పడమర దిక్కును గురించి, ప్రయయుః - వెళ్లిరి.

ఓ పరీక్షిన్మహారాజా! ఆ దక్షుని పుత్రులందరు ఒకే ఆచారమును మరియు స్వభావమును కలిగియుండిరి. సంతానమును కనుడని వారిని దక్షుడు ఆదేశించెను. అపుడు వారు పడమర దిక్కు వైపుగా వెళ్లిరి.

తత్ర నారాయణసరస్తీర్థం సింధుసముద్రయోః ।
సంగమో యత్ర సుమహన్మునిసిద్ధనిషేవితమ్ ॥ 3

తత్ర - అచట, సుమహత్ - చాల పెద్దది, మునిసిద్ధనిషేవితమ్ - మహర్షులచే సిద్ధులచే సేవించబడునది అగు, నారాయణసరః - నారాయణసరస్సు అనే, తీర్థమ్ - తీర్థము, యత్ర - ఎక్కడనైతే, సింధుసముద్రయోః - సింధునది సముద్రములయొక్క, సంగమః - సంగమమో.

పశ్చిమదిక్కునందు సింధునది సముద్రములో కలిసే చోట నారాయణసరస్సు అనే చాల పెద్ద తీర్థము గలదు. దానిని మహర్షులు, సిద్ధపురుషులు సేవించెదరు.

తదుపస్పర్శనాదేవ వినిర్ధూతమలాశయాః ।
ధర్మే పారమహంస్యే చ ప్రోత్పన్నమతయోఽప్యుత ॥ 4

తేపిరే తప ఏవోగ్రం పిత్రాదేశేన యంత్రితాః ।
ప్రజావివృద్ధయే యత్తాన్ దేవర్షిస్తాన్ దదర్శ హ ॥ 5

తద్-ఉపస్పర్శనాత్ ఏవ - దానియందు స్నానము చేయుట వలననే, వినిర్ధూతమల-ఆశయాః - విశేషముగా నిర్మూలించబడిన మాలిన్యము గల అంతఃకరణములు గలవారై, పారమహంస్యే - పరమహంసలకు చెందిన, ధర్మే - ధర్మమునందు, ప్ర-ఉత్పన్నమతయః అపి ఉత - గట్టిగా కలిగిన బుద్ధి గలవారే అయిననూ, పితృ-ఆదేశేన - తండ్రిగారి ఆజ్ఞచే, యంత్రితాః - నియంత్రించబడినవారై, ఉగ్రమ్ - కఠినమగు, తపః ఏవ - తపస్సును మాత్రమే, తేపిరే - చేసిరి, ప్రజావివృద్ధయే - సంతానవృద్ధి కొరకై, యత్తాన్ - ఉద్యుక్తులైన, తాన్ - వారిని, దేవర్షిః - దేవర్షియగు నారదుడు, దదర్శ హ - చూచెనట.

దానియందు స్నానము చేసినంతనే వారి హృదయములలోని మాలిన్యము విశేషముగా నిర్మూలించబడెను. వారికి పరమహంసలకు చెందిన ఆత్మధర్మమునందు గట్టిగా నిశ్చయబుద్ధి కలిగెను. అయిననూ, వారు తండ్రి ఆదేశముచే నియంత్రించబడి, కఠినమగు తపస్సును మాత్రమే చేయుచుండిరి. ఈ విధముగా సంతానవృద్ధి కొరకు ఉద్యుక్తులై యున్న ఆ హర్యశ్వులను దేవర్షియగు నారదుడు చూచెను.

ఉవాచ చాథ హర్యశ్వాః కథం స్రక్ష్యథ వై ప్రజాః ।
అదృష్ట్వాంతం భువో యూయం బాలిశా బత పాలకాః ।। 6

అథ - తరువాత, ఉవాచ చ - పలికెను, హర్యశ్వాః - ఓ హర్యశ్వులారా!, యూయమ్ - మీరు, భువః - భూమియొక్క, అంతమ్ - అంతమును, అదృష్ట్వా - చూడకుండా, ప్రజాః వై - ప్రాణులనైతే, కథమ్ - ఏ విధముగా, స్రక్ష్యథ - సృష్టించగలరు?, పాలకాః - ప్రజాపతులగు మీరు, బాలిశాః - మూర్ఖులు, బత - అయ్యో!

అపుడు నారదమహర్షి వారితోనిట్లనెను --- అయ్యో! ఓ హర్యశ్వులారా! మీరు ప్రజాపతులే అయిననూ, మూర్ఖులే. భూమి అంతమును చూడకుండా, మీరు ప్రాణులనెట్లు సృష్టించగలరు?

తథైకపురుషం రాష్ట్రం బిలం చాదృష్టనిర్గమమ్ ।
బహురూపాం స్త్రియం చాపి పుమాంసం పుంశ్చలీపతిమ్।।7

నదీముభయతోవాహాం పంచపంచాద్భుతం గృహమ్ ।
క్వచిద్ధంసం చిత్రకథం క్షౌరపవ్యం స్వయం భ్రమిమ్ ।। 8

కథం స్వపితురాదేశమవిద్వాంసో విపశ్చితః ।
అనురూపమవిజ్ఞాయ అహో సర్గం కరిష్యథ ।। 9

తథా - అదే విధముగా, ఏకపురుషమ్ - ఒకే పురుషుడు గల, రాష్ట్రమ్ - రాష్ట్రమును, అదృష్టనిర్గమమ్ - కనబడని బయటకు వచ్చే దారి గల, బిలం చ - బిలమును, బహురూపామ్ - అనేకరూపములు గల, స్త్రియం చ అపి - స్త్రీని కూడ, పుంశ్చలీపతిమ్ - వేశ్యకు భర్తయగు,

పుమాంసమ్ - పురుషుని, ఉభయతః-వాహామ్ - రెండు వైపులకు ప్రవహించే, నదీమ్ - నదిని, పంచపంచ-అద్భుతమ్ - ఇరవై అయిదింటితో ఆశ్చర్యమును గొలిపే, గృహమ్ - ఇంటిని, క్వచిత్ - ఒకచోట, చిత్రకథమ్ - చిత్రమగు కథలు గల, హంసమ్ - హంసను, క్షౌరపవ్యమ్ - చురకత్తులతో వజ్రములతో చేయబడిన, స్వయంభ్రమిమ్ - తనంత తానే తిరిగే దానిని, అవిజ్ఞాయ - తెలియకుండా, అవిద్వాంసః - మూర్ఖులగు మీరు, విపశ్చితః - విద్వాంసుడగు, స్వపితుః - మీ తండ్రియొక్క, అనురూపమ్ - ఆయనకు తగిన, ఆదేశమ్ - ఆదేశమగు, సర్గమ్ - సృష్టిని, కథమ్ - ఏ విధముగా, కరిష్యథ - చేయగలరు?, అహో - అయ్యో!

అంతే గాక, ఒకే పురుషుడు గల దేశమును, బయటకు వచ్చే దారి కనబడని సొరంగమును, అనేకరూపములు గల యువతిని, వేశ్యకు భర్త యగు పురుషుని, వేర్వేరు దిక్కులలో ప్రవహించే నదిని, ఇరవై అయిదు వస్తువులు గల అద్భుత గృహమును, ఒకచోట ఉండి చిత్రమగు కథలను చెప్పే హంసను, చురకత్తులతో వజ్రములతో చేయబడి తనంత తానే తిరిగే చక్రమును తెలుసుకోకుండా, మూర్ఖులగు మీరు విద్వాంసుడగు మీ తండ్రిగారి ఆదేశమును పాటిస్తూ, సృష్టిని ఎట్లు చేయగలరు? ఆయన తనకు తగిన ఆదేశమునిచ్చినాడు. అయ్యో!

శ్రీశుక ఉవాచ ।
తన్నిశమ్యాథ హర్యశ్వా ఔత్పత్తికమనీషయా ।
వాచః కూటం తు దేవర్షేస్స్వయం విమమృశుర్ధియా ।। **10**

హర్యశ్వాః - హర్యశ్వులు, దేవర్షేః - దేవర్షియగు నారదునియొక్క, తత్ - ఆ, వాచః - వాక్కుయొక్క, కూటం తు - దాపరికముతో కూడిన సముదాయమునైతే, నిశమ్య - విని, అథ - తరువాత, స్వయమ్ - తమంత తాముగా, ధియా - బుద్ధితో, ఔత్పత్తికమనీషయా - సహజమగు విచారశక్తితో, విమమృశుః - విమర్శించిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- దేవర్షియగు నారదుడు విషయమును దాచిపెట్టి చాల మాటలను చెప్పెను. హర్యశ్వులు వాటిని విని ఆ

మాటలలోని రహస్యమును తమంత తాముగా బుద్ధిని ఉపయోగించి తమకు సహజముగానున్న విచారశక్తితో ఆలోచించిరి.

భూః క్షేత్రం జీవసంజ్ఞం యదనాది నిజబంధనమ్ ।
అదృష్ట్వా తస్య నిర్వాణం కిమసత్కర్మభిర్భవేత్ ॥ 11

భూః - భూమి, జీవసంజ్ఞమ్ - జీవుడనే పేరు గల, క్షేత్రమ్ - దేహేంద్రియ మనస్సంఘాతము, యత్ - ఏదైతే, అనాది - ఆది లేనిది, నిజబంధనమ్ - తనను బంధించునది, తస్య - దానియొక్క, నిర్వాణమ్ - నాశమును, అదృష్ట్వా - చూడకుండా, అసత్-కర్మభిః - బంధించే కర్మల చే, కిమ్ - ఏమి, భవేత్ - ఒరుగును?

భూమియొక్క అంతము చూడకుండా, అని నారదుడనెను. దానిలో భూమియనగా దేహేంద్రియమనస్సంఘాతము. దీనియందు అభిమానముగల జీవుడు దీనిచే బంధించబడును. ఆ అభిమానమును మట్టుబెట్టకుండగా, బంధహేతువులగు కర్మలను చేయుటవలన ఒరిగేదేమున్నది?

ఏక ఏవేశ్వరస్తుర్యో భగవాన్ స్వాశ్రయః పరః ।
తమదృష్ట్వాఽభవం పుంసః కిమసత్కర్మభిర్భవేత్ ॥ 12

ఈశ్వరః - ఈశ్వరుడు, ఏకః ఏవ - ఒక్కడు మాత్రమే, తుర్యః - నాల్గవవాడు, భగవాన్ - ఆరు ఐశ్వర్యములు గలవాడు, స్వాశ్రయః - తనకు తానే ఆధారమైనవాడు, పరః - అతీతుడు, అభవమ్ - సంసారము లేని, తమ్ - ఆ ఈశ్వరుని, అదృష్ట్వా - దర్శించకుండా, పుంసః - మానవునకు, అసత్-కర్మభిః - మోక్షమునకు పనికి రాని కర్మలచే, కిమ్ - ఏమి, భవేత్ - అగును?

ఈశ్వరుడు అద్వితీయుడు. ఈశ్వరభావము, రక్షించే శక్తి, కీర్తి, శ్రీ, జ్ఞానము, వైరాగ్యములు పూర్ణముగా నున్న ఆ ఈశ్వరుడు తనకు తానే ఆధారుడై ప్రకృతికి అతీతుడుగ నున్నాడు. ఆయనయే జీవులయందు జాగ్రత్స్వప్నసుషుప్తులు అనే మూడు అవస్థలకు అతీతమైన తురీయ-ఆత్మతత్త్వమై యున్ననూ, సంసారమునకు అతీతుడుగనే యున్నాడు. అట్టి ఈశ్వ

రుని ఆత్మరూపముగా దర్శించకుండా, మోక్షమునకు పనికి రాని కర్మల వలన మానవునకు ఒరిగేదేమున్నది? (ఒకే పురుషుడున్న రాష్ట్రము)

పుమాన్నైవైతి యద్గత్వా బిలస్వర్గం గతో యథా ।
ప్రత్యగ్ధామాఽవిద ఇహ కిమసత్కర్మభిర్భవేత్ ॥ 13

యత్ - దేనిని, గత్వా - పొంది, బిలస్వర్గమ్ - పాతాళమును, గతః యథా - చేరినవాడు వలె, పుమాన్ - మానవుడు, న ఏవ ఏతి - మరల తిరిగి రాడో, ప్రత్యగ్-ధామ - వ్యక్తికి అంతరతమమగు ఆత్మప్రకాశ మును, అవిదః -తెలియనివానికి, ఇహ - ఈ లోకములో, అసత్-కర్మభిః - మిథ్యాఫలములనిచ్చే కర్మలచే, కిమ్ - ఏమి, భవేత్ - అగును?

పాతాళమును చేరినవాడు మరల తిరిగి రాడు. అదే విధముగా, మానవుడు తనకు అంతరతమమగు ఆత్మజ్యోతిరూపముగానున్న ఈశ్వ రుని తెలుసుకున్నచో, మరల జన్మ ఉండదు. అట్టి ఆత్మతత్త్వమును తెలు సుకోకుండా, మిథ్యాఫలములనిచ్చే కర్మల వలన ఒరిగేదేమున్నది? (బ యట పడే దారి లేని బిలము)

నానారూపాఽఽత్మనో బుద్ధిస్స్వైరిణీవ గుణాన్వితా ।
తన్నిష్ఠామగతస్యేహ కిమసత్కర్మభిర్భవేత్ ॥ 14

స్వైరిణీ ఇవ - స్వేచ్ఛగా తిరిగే స్త్రీ వలె, నానారూపా - అనేక రూపములు గల, ఆత్మనః - జీవుని, బుద్ధిః - బుద్ధి, గుణ-అన్వితా - గుణ ములతో కూడినది, తత్-నిష్ఠామ్ - దాని అంతమును, అగతస్య - పొందని వానికి, ఇహ - ఈ లోకమునందు, అసత్-కర్మభిః - అశాంతిని పెంచే కర్మలతో, కిమ్ - ఏమి, భవేత్ - అగును? (బహురూపా స్త్రీ-కి వివరణ).

ఈ లోకములో మానవుని బుద్ధి తిరుగుబోతు స్త్రీవలె అనేకరూప ములను దాల్చును. సత్త్వరజస్తమోగుణముల కార్యమగు ఈ బుద్ధితోడి తాదాత్మ్యమును సాధకుడు వివేకముచే అంతము చేయవలెను. అది చేయ కుండా, అశాంతిని పెంచే కర్మలను చేయుట వలన ఒరిగేదేమున్నది?

తత్సంగభ్రంశితైశ్వర్యం సంసరంతం కుభార్యవత్ ।
తద్గతీరబుధస్యేహ కిమసత్కర్మభిర్భవేత్ ॥ 15

తత్-సంగభ్రంశిత-ఐశ్వర్యమ్ - ఆ బుద్ధితోడి తాదాత్మ్యము వలన జారిపోయిన ఈశ్వరభావము గలిగినట్టియు, కుభార్యవత్ - చెడిన భార్య గలవాని వలె, తద్-గతీః - ఆ బుద్ధియొక్క పరిణామములను, సంసరంతమ్ - పొందుచున్న తనను, అబుధస్య - తెలుసుకోని వానికి, ఇహ - ఈ లోకమునందు, అసత్-కర్మభిః - అజ్ఞానమును పోగొట్టని కర్మలచే, కిమ్ - ఏమి, భవేత్ - అగును? (పుమాన్ పుంశ్చలీపతిః - యొక్క వివరణము).

ఈ బుద్ధి కులట వంటిది. దానితోడి తాదాత్మ్యము వలన తన స్వాతంత్ర్యము (అసంగత్వము) ను పోగొట్టుకొని, కులటయొక్క భర్త వలె, ఆ బుద్ధియందలి పరిణామములతో మమేకమై సంసారదుఃఖముననుభవిస్తూ, మానవుడు తన స్వరూపమును తెలియలేకున్నాడు. ఈ లోకములో అట్టివానికి ఆ అజ్ఞానమును తొలగించలేని కర్మల వలన ఒరిగేదేమున్నది?

సృష్ట్యప్యయకరీం మాయాం వేలాకూలాంతవేగితామ్ ।
మత్తస్య తామవిజ్ఞాయ కిమసత్కర్మభిర్భవేత్ ॥ 16

సృష్టి-అప్యయకరీమ్ - సృష్టి ప్రళయములను చేయునట్టియు, వేలాకూల-అంతవేగితామ్ - ఏరుగట్టుకు దగ్గరలో వేగము కలిగిన, తామ్ - ఆ, మాయామ్ - మాయాశక్తిని, అవిజ్ఞాయ - తెలుసుకోకుండా, మత్తస్య - గర్వించియున్నవానికి, అసత్-కర్మభిః - సంసారములో పడవేసే కర్మలచే, కిమ్ - ఏమి, భవేత్ - అగును?

సృష్టిప్రళయములను చేసే మాయాశక్తియే రెండు వైపులకు ప్రవహించే నది. భక్తిజ్ఞానములే ఆ నదినుండి బయటపడునట్లు చేసే ఏరు కట్టలవంటివి. జీవుడు ఆ గట్టు చేరుకోకుండా నదీవేగము వంటి కామక్రోధాదుల వేగము అడ్డుపడును. అట్టి మాయను గురించి తెలుసుకోకుండా సంసారములో గర్వించియున్న అజ్ఞానికి, సంసారములోనికి పడద్రోసే కర్మల వలన ఒరిగేదేమున్నది? (ఉభయతోవాహా నదీ - యొక్క వివరణము).

పంచవింశతితత్త్వానాం పురుషోఽద్భుతదర్పణమ్ ।
అధ్యాత్మమబుధస్యేహ కిమసత్కర్మభిర్భవేత్ ॥ 17

పురుషః - మానవుడు, పంచవింశతితత్త్వానామ్ - ఇరవై ఐదు తత్త్వములకు, అద్భుతదర్పణమ్ - ఆశ్చర్యమును కలిగించే అద్దము, అధ్యాత్మమ్ - తన లోపలి తత్త్వమును, అబుధస్య - తెలుసుకోని వానికి, ఇహ - ఈ లోకమునందు, అసత్-కర్మభిః - స్వరూపమును కప్పిపుచ్చే కర్మలచే, కిమ్ - ఏమి, భవేత్ - అగును? (పంచపంచాద్భుతం గృహమ్)

మూలప్రకృతి (ఈశ్వరుని మాయాశక్తి), మహత్తత్త్వము (సమష్టి బుద్ధిశక్తి), అహంకారము (సమష్టి), అయిదు సూక్ష్మభూతములు, మనస్సు, ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు, ఐదు స్థూలభూతములు, పరిచ్ఛిన్న జీవభావము అనే ఇరవై అయిదు తత్త్వముల సమాహారమగు ఈ దేహేంద్రియమనస్సంఘాతమునకు ఉనికిని, ప్రకాశమును ఇచ్చే అద్భుతమగు అద్దము వంటిది ఆత్మ. అట్టి సచ్చిదాత్మయే మానవుని అంతరతమమగు స్వరూపము. ఈ జన్మలో దానిని తెలుసుకోకుండా, తన స్వరూపమును కప్పిపుచ్చే కర్మల వలన ఒరిగేదేమున్నది?

ఐశ్వరం శాస్త్రముత్సృజ్య బంధమోక్షానుదర్శనమ్ ।
వివిక్తపదమజ్ఞాయ కిమసత్కర్మభిర్భవేత్ ॥ 18

ఐశ్వరమ్ - ఈశ్వరుని ప్రతిపాదించునట్టియు, బంధమోక్ష-అనుదర్శనమ్ - బంధమోక్షములను చూపించునట్టియు, వివిక్తపదమ్ - వివేచించబడిన పరతత్త్వము కల, శాస్త్రమ్ - అధ్యాత్మశాస్త్రమును, ఉత్సృజ్య - విడిచిపెట్టి, అజ్ఞాయ - తెలుసుకోకుండా, అసత్-కర్మభిః - బహిర్ముఖుని చేసే కర్మలచే, కిమ్ - ఏమి, భవేత్ - అగును?

ఈశ్వరుని ప్రతిపాదించి బంధమోక్షముల వ్యవస్థను బోధించే అధ్యాత్మశాస్త్రము హంస వంటిది. అది నీరక్షీరవివేకమువలె దృశ్యమునుండి దృక్-స్వరూపమును వివేచించును. దానిని అభ్యసించి ఆత్మస్వరూపమును తెలియవలెను. అది చేయకుండా, బహిర్ముఖుని చేసే కర్మల వలన ఒరిగేదేమున్నది? (హంసం-చిత్రకథమ్ అనుదాని వివరణ).

కాలచక్రం భ్రమిస్తీక్ష్ణం సర్వం నిష్కర్షయజ్జగత్ ।
స్వతంత్రమబుధస్యేహ కిమసత్కర్మభిర్భవేత్ ।। 19

భ్రమిః - తిరుగుటయే స్వరూపముగా గలిగినట్టియు, తీక్ష్ణమ్ - వాడియైనట్టియు, సర్వమ్ - సకలమగు, జగత్ - జగత్తును, నిష్కర్షయత్ - పిప్పి చేయునట్టియు, స్వతంత్రమ్ - స్వతంత్రమైన, కాలచక్రమ్ - కాలమనే చక్రమును, అబుధస్య - తెలుసుకోనివానికి, ఇహ - ఈ లోకమునందు, అసత్-కర్మభిః - కాలప్రవాహములోనికి నెట్టివేసే కర్మలచే, కిమ్ - ఏమి, భవేత్ - అగును? (క్షౌరపవ్యం స్వయం భ్రమిమ్ - అనుదాని వివరణము)

స్వతంత్రముగా గిర గిర తిరుగుతూ జగత్తునంతనూ తన వాడి కోరలలో పిప్పి చేసే కాలమనే చక్రమును తెలుసుకోకుండా, ఆ కాలప్రవాహములోనికి నెట్టివేసే కర్మల వలన ఈ లోకములో ఒరిగేదేమున్నది?

శాస్త్రస్య పితురాదేశం యో న వేద నివర్తకమ్ ।
కథం తదనురూపాయ గుణవిశ్రంభ్యుపక్రమేత్ ।। 20

శాస్త్రస్య - శాస్త్రమనే, పితుః - తండ్రియొక్క, నివర్తకమ్ - సంసారమును నివృత్తము చేసే, ఆదేశమ్ - ఆజ్ఞను, యః - ఎవడైతే, న వేద - తెలియడో, గుణవిశ్రంభీ - గుణకార్యమగు సంసారమునందు నమ్మకము గలవాడు, తద్-అనురూపాయ - సంసారనివృత్తికి అనురూపమైన జ్ఞానము కొరకు, కథమ్ - ఏ విధముగా, ఉపక్రమేత్ - ఉపక్రమించును?

శాస్త్రము తండ్రివంటిది. అది సంసారమును నివృత్తి చేసే ఆత్మజ్ఞానమును బోధించుచున్నది. త్రిగుణకార్యమగు సంసారమునందే నమ్మకము గల మానవుడు సంసారనివృత్తికి దారి చూపే ఆ ఆత్మజ్ఞానము కొరకు ఏల ప్రయత్నము నారంభించును? (జన్మనిచ్చిన తండ్రి ఆజ్ఞ కంటె జ్ఞానమునిచ్చే తండ్రి వంటి శాస్త్రమే ఉపాదేయము).

ఇతి వ్యవసితా రాజన్ హర్యశ్వా ఏకచేతసః।
ప్రయయుస్తం పరిక్రమ్య పంథానమనివర్తనమ్ ।। 21

రాజన్ - ఓ రాజా!, ఇతి - ఈ విధముగా, వ్యవసితాః - నిశ్చయించుకున్నవారు, ఏకచేతసః - ఒకే విధముగా ఆలోచించువారు అగు, హర్యశ్వాః - హర్యశ్వులు, తమ్ - ఆ నారదుని, పరిక్రమ్య - ప్రదక్షిణము చేసి, అనివర్తనమ్ - తిరిగి వచ్చుట లేని, పంథానమ్ - దారిని, ప్రయయుః - వెళ్లిరి.

ఓ పరీక్షిన్మహారాజా! అందరు కలిసి ఒకే విధముగా ఆ హర్యశ్వులు ఈ ఉపదేశమునందు నిశ్చయబుద్ధి గలవారై, ఆ నారదునకు ప్రదక్షిణము చేసి, ఆత్మజ్ఞానము కొరకు ప్రయత్నించిరి. ఈ జ్ఞానము వలన కలిగే మోక్షమునందు పునర్జన్మ ఉండదు.

స్వరబ్రహ్మణి నిర్భాతహృషీకేశపదాంబుజే ।
అఖండం చిత్తమావేశ్య లోకాననుచరన్మునిః ॥ 22

స్వరబ్రహ్మణి - స్వరములనే బ్రహ్మయందు, నిర్భాతహృషీకేశపద-అంబుజే - ఆవిర్భవించే హృషీకేశుని పాదపద్మమునందు, అఖండమ్ - ఏకాగ్రమగు, చిత్తమ్ - మనస్సును, ఆవేశ్య - నిమగ్నము చేసి, మునిః - నారదముని, లోకాన్ - లోకములను, అనుచరత్ - సంచరించెను.

ఇంద్రియాధిపతియగు శ్రీహరి సంగీతస్వరములనే శబ్దబ్రహ్మరూపముగా సంగీతజ్ఞులకు ఆవిర్భవించును. నారదముని అట్టి శ్రీహరి పాదపద్మమునందు ఏకాగ్రమగు చిత్తమును దృఢముగా నిలిపి, లోకములను సంచరించెను.

నాశం నిశమ్య పుత్రాణాం నారదాచ్ఛీలశాలినామ్ ।
అన్వతప్యత కశ్శోచన్ సుప్రజస్త్వం శుచాం పదమ్ ॥ 23

నారదాత్ - నారదుని వలన, శీలశాలినామ్ - సచ్ఛీలముచే శోభిల్లే, పుత్రాణామ్ - పుత్రులయొక్క, నాశమ్ - కనబడక పోవుట (గృహస్థధర్మమునుండి జారిపోవుట) ను, నిశమ్య - విని, కః - దక్ష ప్రజాపతి, శోచన్ - శోకించువాడై, అను-అతప్యత - పరితాపమును చెందెను, సుప్రజస్త్వమ్

- మంచి సంతానమును కలిగియుండుట, శుచామ్ - దుఃఖములకు, పదమ్ - ఆలవాలము.

సచ్ఛీలముతో శోభిల్లే తన పుత్రులు నారదుని కారణముగా గృహస్థధర్మమును విడిచి కనబడకుండా పోయినారని విన్న దక్ష ప్రజాపతి దుఃఖమును, పరితాపమును పొందెను. మంచి సంతానము గల తల్లిదండ్రులకు ఆ సంతానమే దుఃఖములకు ఆలవాలము అగుచుండును గదా!

స భూయః పాంచజన్యాయామజేన పరిసాంత్వితః ।
పుత్రానజనయద్దక్షశ్శబలాశ్వాన్ సహస్రశః ॥ 24

అజేన - స్వయంభువుడగు బ్రహ్మగారిచే, పరిసాంత్వితః - ఓదార్చబడిన, సః - ఆ, దక్షః - దక్షుడు, పునః - మరల, పాంచజన్యాయామ్ - పంచజనుని కుమార్తెయందు, సహస్రశః - వేయి మంది, శబలాశ్వాన్ - శబలాశ్వులనే, పుత్రాన్ - పుత్రులను, అజనయత్ - కనెను.

స్వయంభువుడగు బ్రహ్మగారు ఆ దక్షుని ఓదార్చిరి. తరువాత మరల దక్షునకు పంచజనుని కుమార్తెయగు అసిక్నియందు వేయి మంది శబలాశ్వులనే పుత్రులు కలిగిరి.

తేఽపి పిత్రా సమాదిష్టాః ప్రజాసర్గే ధృతవ్రతాః ।
నారాయణసరో జగ్ముర్యత్ర సిద్ధాస్స్వపూర్వజాః ॥ 25

తే అపి - వారు కూడ, పిత్రా - తండ్రిచే, సమాదిష్టాః - చక్కగా ఆదేశించబడినవారై, ప్రజాసర్గే - ప్రాణులను సృష్టించుటయందు, ధృతవ్రతాః - స్వీకరించబడిన వ్రతము గలవారై, నారాయణసరః - నారాయణసరస్సును గురించి, జగ్ముః - వెళ్లిరి, యత్ర - ఎక్కడనైతే, స్వపూర్వజాః - తమ అన్నలు, సిద్ధాః - సిద్ధిని పొందిరో.

తండ్రియగు దక్షుడు వారిని కూడ సంతానమును కనుడని చక్కగా ఆదేశించెను. వారు అట్లు చేయుటకే వ్రతమును దాల్చి, (తపస్సు కొరకై) నారాయణసరస్సునకు వెళ్లిరి. వారి అన్నలు సిద్ధి పొందిన స్థానమదియే.

తదుపస్పర్శనాదేవ వినిర్ధూతమలాశయాః ।
జపంతో బ్రహ్మ పరమం తేపుస్తేఽత్ర మహత్తపః ॥ 26

తద్-ఉపస్పర్శనాత్ ఏవ - దానియందు స్నానమును చేయుట వలననే, వినిర్ధూతమల-ఆశయాః - శోధన చేయబడిన మాలిన్యములు గల అంతఃకరణము గలవారై, పరమమ్ - సర్వోత్తమమైన, బ్రహ్మ - ఓంకారమును, జపంతః - జపించుచున్నవారై, తే - వారు, అత్ర - ఇచట, మహత్ - గొప్ప, తపః - తపస్సును, తేపుః - చేసిరి.

ఆ సరస్సులో స్నానము చేసినంతనే వారి అంతఃకరణములలోని మాలిన్యము తొలగిపోయెను. వారచట సర్వోత్తమమగు (పరబ్రహ్మరూపమగు) ఓంకారమును జపిస్తూ, గొప్ప తపస్సును చేసిరి.

అబ్భక్షాః కతిచిన్మాసాన్ కతిచిద్వాయుభోజనాః ।
ఆరాధయన్ మంత్రమిమమభ్యస్యంత ఇడస్పతిమ్ ॥ 27

కతిచిత్ - కొన్ని, మాసాన్ - మాసములను, అబ్-భక్షాః - నీటిని త్రాగువారై, కతిచిత్ - కొన్ని, వాయుభోజనాః - వాయువును భక్షించువారై, ఇమమ్ - ఈ, మంత్రమ్ - మంత్రమును, అభ్యస్యంతః - జపించువారై, ఇడస్పతిమ్ - వాక్కులకు ప్రభువగు శ్రీహరిని, ఆరాధయన్ - ఆరాధించిరి.

వారు కొన్ని నెలలు నీటిని మాత్రమే త్రాగి, మరి కొన్ని నెలలు వాయువును మాత్రమే భక్షించి, ఈ క్రింది మంత్రమును జపిస్తూ, వాక్కులకు ప్రభువగు శ్రీహరిని ఆరాధించిరి.

ఓం నమో నారాయణాయ పురుషాయ మహాత్మనే ।
విశుద్ధసత్త్వధిష్ణ్యాయ మహాహంసాయ ధీమహి ॥ 28

ఓమ్, పురుషాయ - పూర్ణుడైనట్టియు, మహాత్మనే - సర్వమునకు ఆత్మయైనట్టియు, విశుద్ధసత్త్వధిష్ణ్యాయ - పరిశుద్ధమగు అంతఃకరణమునందు ప్రకాశించునట్టియు, మహాహంసాయ - పరమహంస స్వరూపుడగు, నారాయణాయ - నారాయణుని కొరకు, నమః - నమస్కారము, ధీమహి - ధ్యానించుచున్నాము.

ఓమ్. నారాయణుడు పూర్ణుడు, సర్వమునకు ఆత్మ, పరిశుద్ధమగు అంతఃకరణములో ఆవిర్భవించువాడు, పరమహంసల రూపములోనుండు వాడు. ఆయనను నమస్కరించి ధ్యానించుచున్నాము.

ఇతి తానపి రాజేంద్ర ప్రతిసర్గధియో మునిః ।
ఉపేత్య నారదః ప్రాహ వాచః కూటాని పూర్వవత్ ॥ 29

రాజేంద్ర - ఓ మహారాజా!, ఇతి - ఈ విధముగా, ప్రతిసర్గధియః - ప్రతి (తరువాతి) సృష్టియందు ఆలోచన గల, తాన్ అపి - వారిని కూడ, నారదః మునిః - నారదముని, ఉపేత్య - దగ్గరకు వెళ్లి, పూర్వవత్ - పూర్వమునందు వలె, వాచః కూటాని - వాక్కుయొక్క దాపరికముతో గూడిన సముదాయములను, ప్రాహ - చెప్పెను.

ఓ మహారాజా! వారీ విధముగా ప్రతిసృష్టిని చేయవలెనని నిశ్చయించుకొని యుండిరి. నారదముని వారి దగ్గరకు కూడ వెళ్లి, ఇదివరలో చెప్పినట్లుగానే దాపరికముతో గూడిన వచనములను చెప్పెను.

దాక్షాయణాస్సంశృణుత గదతో నిగమం మమ ।
అన్విచ్ఛతానుపదవీం భ్రాతౄణాం భ్రాతృవత్సలాః ॥ 30

దాక్షాయణాః - దక్ష పుత్రులారా!, మమ - నేను, గదతః - చెప్పగా, నిగమమ్ - ఉపదేశమును, శృణుత - వినుడు, భ్రాతృవత్సలాః - అన్నలయందు ప్రేమ గల మీరు, భ్రాతౄణామ్ - అన్నల, అనుపదవీమ్ - అనుసరించిన మార్గమును, అన్విచ్ఛత - తెలుసుకొనుడు.

ఓ దక్ష పుత్రులారా! మీకు అన్నలయందు ప్రేమ మెండు. మీరు నా ఉపదేశమును విని, వారు అనుసరించిన మార్గమును తెలుసుకొనుడు.

భ్రాతౄణాం ప్రాయణం భ్రాతా యోఽనుతిష్ఠతి ధర్మవిత్ ।
స పుణ్యబంధుః పురుషో మరుద్భిస్సహ మోదతే ॥ 31

ధర్మవిత్ - ధర్మము తెలిసిన, యః - ఏ, భ్రాతా - సోదరుడైతే, భ్రాతౄణామ్ - అన్నల, ప్రాయణమ్ - శ్రేష్ఠమగు మార్గమును, అనుతిష్ఠతి

- అనుష్ఠించునో, పుణ్యబంధుః - పుణ్యమే బంధువుగా గల, సః - ఆ, పురుషః - వ్యక్తి, మరుద్భిః సహ - మరుత్తులతో గూడి, మోదతే - ఆనందించును.

అన్నగారు నడిచిన శ్రేష్ఠమగు మార్గములో నడిచే ధర్మవేత్తయగు తమ్ముడు పుణ్యమే తోడు కాగా స్వర్గములో సోదరప్రేమ గల మరుత్తులతో గూడి ఆనందించును.

ఏతావదుక్త్వా ప్రయయౌ నారదోఽమోఘదర్శనః ।
తేఽపి చాన్వగమన్మార్గం భ్రాతౄణామేవ మారిష ॥ 32

మారిష - ఓ శ్రేష్ఠుడా!, అమోఘదర్శనః - అమోఘమగు దర్శనము గల, నారదః - నారదుడు, ఏతావత్ - ఇంత మాత్రము, ఉక్త్వా - పలికి, ప్రయయౌ - వెళ్లెను, తే అపి - వారు కూడ, భ్రాతౄణామ్ - అన్నల, మార్గం ఏవ - మార్గమునే, అను-అగమన్ - అనుసరించిరి.

శ్రేష్ఠుడవగు ఓ రాజా! నారదుని దర్శించుట వ్యర్థము కాదు. ఆయన ఇంతమాత్రము చెప్పి వెళ్లిపోయెను. వారు కూడ తమ అన్నల దారినే అనుసరించిరి.

సధ్రీచీనం ప్రతీచీనం పరస్యానుపథం గతాః ।
నాద్యాపి తే నివర్తంతే పశ్చిమా యామినీరివ ॥ 33

సధ్రీచీనమ్ - సమీచీనమైనది, ప్రతీచీనమ్ - అంతర్ముఖమైనది అగు, పరస్య - పరమాత్మయొక్క, అనుపథమ్ - అనుకూలమగు మార్గమును, గతాః - వెళ్లిన, తే - వారు, పశ్చిమాః - గడచిన, యామినీః ఇవ - రాత్రులు వలె, అద్య అపి - ఈ నాటికి కూడ, న నివర్తంతే - మరలి వచ్చుట లేదు.

పరమాత్మను దర్శించే అంతర్ముఖమార్గము మానవునకు సమీచీనమైనది, సుఖకరము. ఆ మార్గములో వెళ్లిన ఆ సోదరులు, గడచిపోయిన రాత్రులు వలె, ఈ నాటికి కూడ తిరిగి రాలేదు.

ఏతస్మిన్ కాల ఉత్పాతాన్ బహూన్ పశ్యన్ ప్రజాపతిః ।
పూర్వవన్నారదకృతం పుత్రనాశముపాశృణోత్ ॥ 34

ఏతస్మిన్ - ఈ, కాలే - కాలమునందు, బహూన్ - అనేకములగు, ఉత్పాతాన్ - చెడు శకునములను, పశ్యన్ - చూచుచున్న, ప్రజాపతిః - దక్ష ప్రజాపతి, పూర్వవత్ - పూర్వమునందు వలెనే, నారదకృతమ్ - నారదునిచే చేయబడిన, పుత్రనాశమ్ - పుత్రులు చేయి జారిపోవుటను గురించి, ఉపాశృణోత్ - వినెను.

అదే కాలములో దక్ష ప్రజాపతికి అనేకములగు చెడు శకునములు కనబడెను. నారదుడు తన పుత్రులను పూర్వమునందు వలెనే గృహస్థాశ్రమమునుండి చెడగొట్టినాడని ఆయన వినెను.

చుక్రోధ నారదాయాసౌ పుత్రశోకవిమూర్ఛితః ।
దేవర్షిముపలభ్యాఽఽహ రోషాద్విస్ఫురితాధరః ॥ 35

అసౌ - ఈ దక్షుడు, పుత్రశోకవిమూర్ఛితః - పుత్రుల వలని శోకముచే మూర్ఛను పొందినవాడు, నారదాయ - నారదుని కొరకు, చుక్రోధ - కోపించెను, దేవర్షిమ్ - దేవర్షియగు నారదుని, ఉపలభ్య - చూచి, రోషాత్ - కోపము వలన, విస్ఫురిత-అధరః - విశేషముగా కంపించుచున్న క్రింది పెదవి గలవారై, ఆహ - పలికెను.

ఈ దక్షుడు పుత్రశోకముచే మూర్ఛిల్లెను. తరువాత ఆయనకు నారదునిపై కోపము కలిగెను. నారదుని చూచిన వెంటనే కోపముతో క్రింది పెదవి అధికముగా వణుకుచుండగా, ఆయన ఇట్లనెను.

దక్ష ఉవాచ ।
అహో అసాధో సాధూనాం సాధులింగేన నస్త్వయా ।
అసాధ్వకార్యర్భకాణాం భిక్షోర్మార్గః ప్రదర్శితః ॥ 36

అహో - అయ్యో!, అసాధో - దుష్టుడా!, సాధులింగేన - సాధువుల వేషము గల, త్వయా - నీచే, సాధూనామ్ - సత్పురుషులమగు, నః

- మాకు, అసాధు - అపకారము, అకారి - చేయబడినది, అర్భకాణామ్ - పిల్లలకు, భిక్షోః - భిక్షుకుని, మార్గః - దారి, ప్రదర్శితః - చూపబడినది.

దక్షుడిట్లు పలికెను --- అయ్యో! నీవు సాధువుల వేషములోనున్న దుష్టుడవు. సత్పురుషులమగు మాకు అపకారమును చేసితివి. పిల్లలకు భిక్షుకుల మార్గము (సన్న్యాసము) ను ఉపదేశించితివి.

ఋణైస్త్రిభిరముక్తానామమీమాంసితకర్మణామ్ ।
విఘాతశ్శ్రేయసః పాప లోకయోరుభయోః కృతః ॥ 37

పాప - పాపీ!, త్రిభిః - మూడు, ఋణైః - ఋణములనుండి, అముక్తానామ్ - విముక్తిని పొందనట్టియు, అమీమాంసితకర్మణామ్ - అనుష్ఠించబడని కర్మలు గల పిల్లలకు, ఉభయోః - రెండు, లోకయోః - లోకములయందు, శ్రేయసః - హితమునకు, విఘాతః - విఘాతము, కృతః - చేయబడినది.

ఓరీ పాపీ! దేవ-పితృ-ఋషి-ఋణములనుండి నా పుత్రులింకనూ విముక్తులు కాలేదు. వారు కర్మలను చేయలేదు. కర్మల అనిత్యత్వమును విచారించి తెలుసుకొనలేదు. అట్టి నా పుత్రులకు నీవు ఇహపరలోకములు రెండింటియందు సుఖమునకు విఘాతమును కలిగించితివి.

ఏవం త్వం నిరనుక్రోశో బాలానాం మతిభిద్ధరేః ।
పార్షదమధ్యే చరసి యశోహా నిరపత్రపః ॥ 38

నిరనుక్రోశః - దయ లేని, త్వమ్ - నీవు, ఏవమ్ - ఈ విధముగా, బాలానామ్ - పిల్లలకు, మతిభిత్ - బుద్ధిని చెడగొట్టినవాడవు, హరేః - శ్రీహరియొక్క, పార్షదమధ్యే - అనుచరుల మధ్యయందు, చరసి - సంచరించుచున్నావు, యశః-హా - కీర్తిని చెడగొట్టువాడవు, నిరపత్రపః - సిగ్గు లేని వాడవు.

దయ లేని నీవు ఈ విధముగా నా పుత్రుల మతిని చెడగొట్టితివి. శ్రీహరి అనుచరుల మధ్యలో తిరిగే నీవు ఆయన కీర్తిని కూడ చెడగొట్టెదవు. నీకు సిగ్గు లేదు.

నను భాగవతా నిత్యం భూతానుగ్రహకాతరాః ।
ఋతే త్వాం సౌహృదఘ్నం వై వైరంకరమవైరిణామ్ ।। 39

భాగవతాః - భగవద్భక్తులు, నిత్యమ్ - అన్ని కాలములయందు, భూత-అనుగ్రహకాతరాః - ప్రాణులయెడల అనుగ్రహమునందు వ్యాకులపడువారు, నను - నిశ్చయము, సౌహృదఘ్నమ్ - ప్రేమభావమును చంపునట్టియు, అవైరిణామ్ - వైరము లేనివారికి, వైరంకరమ్ - వైరమును కలిగించే, త్వామ్ - నిన్ను, ఋతే వై - నిశ్చయముగా మినహాయించి.

ప్రేమభావమును చంపి వైరము లేనివారితో కూడ వైరమును పూనే నిన్ను మినహాయిస్తే, భగవద్భక్తులు అన్ని కాలములలో ప్రాణులననుగ్రహించుటకు వ్యగ్రులుగా నుండెదరు. ఇది నిశ్చయము.

నేత్థం పుంసాం విరాగస్స్యాత్త్వయా కేవలినా మృషా ।
మన్యసే యద్యుపశమం స్నేహపాశనికృంతనమ్ ।। 40

ఉపశమమ్ - ఇంద్రియనిగ్రహము, స్నేహపాశనికృంతనమ్ - ప్రేమపాశములను త్రెంచివేయునది అని, మన్యసే యది - నీవు తలపోయుచున్నచో, మృషా - అసత్యపు, కేవలినా - జ్ఞానము లేని, త్వయా - నీచే, పుంసామ్ - వ్యక్తులకు, ఇత్థమ్ - ఈ విధముగా, విరాగః - వైరాగ్యము, న స్యాత్ - కలుగదు.

ఇంద్రియనిగ్రహము వలన సంసారాసక్తియొక్క పాశములు త్రెంచబడునని నీవు తలపోయవచ్చును. కాని, నీవంటి జ్ఞానము లేని అసత్యసాధువులు కారణముగా ఈ తీరున వ్యక్తులకు వైరాగ్యము ఉదయించదు.

నానుభూయ న జానాతి పుమాన్ విషయతీక్ష్ణతామ్ ।
నిర్విద్యేత స్వయం తస్మాన్న తథా భిన్నధీః పరైః ।। 41

న అనుభూయ - అనుభవించకుండా, పుమాన్ - మానవుడు. విషయతీక్ష్ణతామ్ - ఇంద్రియభోగముల దుఃఖహేతువులగుటను, న జానాతి - తెలియదు, తస్మాత్ - ఇంద్రియభోగానుభవము వలన, స్వయమ్ - తనంత తానుగా, నిర్విద్యేత - ఏ విధముగా వైరాగ్యమును

పొందునో, తథా - ఆ విధముగా, పరైః - ఇతరులచే, భిన్నధీః - చలింపజే యబడిన బుద్ధి గలవాడు, న - పొందడు.

ఇంద్రియభోగములననుభవించకుండా మానవుడు అవి దుఃఖహేతువులని తెలుసుకోలేడు. కావున, వ్యక్తి వాటిని అనుభవించి తనంత తానుగా వైరాగ్యమును తేలికగా పొందును. ఇతరులచే చలింపజేయబడిన బుద్ధి గల వ్యక్తికి అంత తేలికగా వైరాగ్యము అలవడదు.

యన్నస్త్వం కర్మసంధానాం సాధూనాం గృహమేధినామ్ ।
కృతవానసి దుర్మర్షం విప్రియం తవ మర్షితమ్ ॥ 42

కర్మసంధానామ్ - కర్మలను చేయవలెననే సంకల్పము కలిగినట్టియు, సాధూనామ్ - సత్పురుషులమైనట్టియు, గృహమేధినామ్ - గృహస్థులమగు, నః - మాకు, దుర్మర్షమ్ - సహించ శక్యము కాని, యత్ - ఏ, విప్రియమ్ - అపకారమును, త్వమ్ - నీవు, కృతవాన్ - చేసినవాడవు, అసి - అగుచున్నావో, తవ - నీకు, మర్షితమ్ - సహించబడినది.

గృహస్థులమగు మేము కర్మలను చేయాలనే సంకల్పములో నుండెదము. సత్పురుషులమగు మాకు నీవు సహించ శక్యము కాని అపకారమును చేసితివి. నీ అపకారమును నేను సహించితిని.

తంతుకృంతన యన్నస్త్వమభద్రమచరః పునః ।
తస్మాల్లోకేషు తే మూఢ న భవేద్భ్రమతః పదమ్ ॥ 43

తంతుకృంతన - సంతానతంతువును త్రెంపినవాడా!, మూఢ - మూర్ఖుడా!, త్వమ్ - నీవు, యత్ - ఎందువలన, నః - మాకు, పునః - మరల, అభద్రమ్ - అమంగళమును, అచరః - చేసితివో, తస్మాత్ - అందువలన, లోకేషు - లోకములయందు, భ్రమతః - తిరుగుచున్న, తే - నీకు, పదమ్ - స్థానము, న భవేత్ - ఉండకుండు గాక!

సంతానతంతువును త్రెంపిన ఓ మూర్ఖుడా! నీవు మాకు మరల అపకారమును చేసితివి. కావున, లోకములలో తిరుగాడే నీకు స్థిరమగు స్థానము లేకుండు గాక!

శ్రీశుక ఉవాచ ।
ప్రతిజగ్రాహ తద్బాఢం నారదస్సాధుసమ్మతః ।
ఏతావాన్ సాధువాదో హి తితిక్షేతేశ్వరస్స్వయమ్ ।। 44

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే నారదస్య
దక్షశాపో నామ పంచమోఽధ్యాయః ।।

సాధుసమ్మతః - సత్పురుషులయందు కొనియాడబడే, నారదః - నారదుడు, **తత్** - దానిని, బాఢమ్ - సరే **అని**, ప్రతిజగ్రాహ - స్వీకరించెను, సాధువాదః - సాధు **అనే** పదమునకు నిర్వచనము, ఏతావాన్ - ఇంత మాత్రమే, హి - ఏలయనగా, స్వయమ్ - తాను, ఈశ్వరః - సమర్థుడైననూ, తితిక్షేత - సహించును.

సత్పురుషులచే కొనియాడబడే నారదుడు ఆ శాపమును, సరే అని పలికి స్వీకరించెను. సాధువు అనే పదమునకు నిర్వచనము ఏమనగా, తాను తిరిగి అపకారమును చేయుటకు సమర్థుడైననూ ఇతరులు చేసిన అపకారమును సహించువాడే సాధువు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి ఆరవ స్కంధములో
దక్షుడు నారదుని శపించుటను వర్ణించే ఐదవ
అధ్యాయము ముగిసినది (5).

*****

# అథ షష్ఠోఽధ్యాయః

## దక్షుని కన్యల వంశావళి

శ్రీశుక ఉవాచ ।
తతః ప్రాచేతసోఽసిక్న్యామనునీతస్స్వయంభువా ।
షష్టిం సంజనయామాస దుహితౄః పితృవత్సలాః ॥ 1

**తతః** - తరువాత, **ప్రాచేతసః** - ప్రచేతసుల పుత్రుడగు దక్షుడు, స్వయంభువా - స్వయంభువుడగు బ్రహ్మగారిచే, **అనునీతః** - అనునయించబడినవాడై, **అసిక్న్యామ్** - అసిక్నియందు, **పితృవత్సలాః** - తండ్రియందు ప్రేమ గల, **దుహితౄః** - కుమార్తెలను, **షష్టిమ్** - అరవై మందిని, సంజనయామాస - కనెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ప్రచేతసుల పుత్రుడగు దక్షుని స్వయంభువుడగు బ్రహ్మగారు ఓదార్చెను. **తరువాత** దక్షునకు అసిక్నియందు అరవైమంది కుమార్తెలు కలిగిరి. వారికి తండ్రియందు ప్రేమ మెండు.

దశ ధర్మాయ కాయేందోర్ద్విషట్ త్రిణవ దత్తవాన్ ।
భూతాంగిరఃకృశాశ్వేభ్యో ద్వే ద్వే తార్క్ష్యాయ చాపరాః ॥2

ధర్మాయ - ధర్ముని కొరకు, దశ - పదిమందిని, కాయ - కశ్యప ప్రజాపతి కొరకు, ద్విషట్ - పదమూడు (పదమూడులో పన్నెండు అంతర్గతమగును) మందిని, ఇందోః - చంద్రునకు, త్రిణవ - ఇరవై ఏడు మందిని, భూత-అంగిరఃకృశాశ్వేభ్యః - భూతుడు అంగిరసుడు కృశాశ్వుల కొరకు, ద్వే ద్వే - ఇద్దరిద్దరిని, **తార్క్ష్యాయ** - **తార్క్ష్యుని** కొరకు, **అపరాః చ** - మిగిలినవారిని కూడ, **దత్తవాన్** - ఇచ్చినవాడు.

ఆయన ధర్మునకు పదిమందిని, తార్‌క్ష్యుడు అనే పేరు గల కశ్యప ప్రజాపతికి పదముగ్గురిని, చంద్రునకు ఇరవై ఏడుగురిని, భూతునకు ఇద్దరిని, అంగిరసునకు ఇద్దరిని, కృశాశ్వునకు ఇద్దరిని, తార్‌క్ష్యుడు అని పేరు గల కశ్యపునకే మిగిలిన నలుగురిని ఇచ్చి వివాహము చేసెను.

నామధేయాన్యమూషాం త్వం సాపత్యానాం చ మే శృణు ।
యాసాం ప్రసూతిప్రసవైర్లోకా ఆపూరితాస్త్రయః ।। 3

స-అపత్యానామ్ - సంతానములతో కూడిన, అమూషామ్ - వీరి యొక్క, నామధేయాని - పేర్లను, మే - నానుండి, త్వమ్ - నీవు, శృణు - వినుము, యాసామ్ - ఎవరియొక్క, ప్రసూతిప్రసవైః - సంతానముతో వారి సంతానముతో, త్రయః - మూడు, లోకాః - లోకములు, ఆపూరితాః - అంతటా నిండినవో.

వీరి పేర్లను, వీరి సంతానము పేర్లను నేను చెప్పెదను. వినుము. వీరి సంతానముతో, మరల వారి సంతానముతో ముల్లోకములు పూర్తిగా నిండిపోయెను.

భానుర్లంబా కకుబ్జామిర్విశ్వా సాధ్యా మరుత్వతీ ।
వసుర్ముహూర్తా సంకల్పా ధర్మపత్న్యస్సుతాన్ శృణు ।। 4

భానుః - భాను, లంబా - లంబ, కకుబ్ - కకుభ, జామిః - జామి, విశ్వా - విశ్వ, సాధ్యా - సాధ్య, మరుత్వతీ - మరుత్వతి, వసుః - వసు, ముహూర్తా - ముహూర్త, సంకల్పా - సంకల్ప, ధర్మపత్న్యః - ధర్ముని భార్యలు, సుతాన్ - పుత్రులను గురించి, శృణు - వినుము.

భాను, లంబ, కకుభ, జామి, విశ్వ, సాధ్య, మరుత్వతి, వసు, ముహూర్త, సంకల్ప అనువారలు ధర్ముని భార్యలు. వారి పుత్రులను గురించి వినుము.

భానోస్తు దేవఋషభ ఇంద్రసేనస్తతో నృప ।
విద్యోత ఆసీల్లంబాయాస్తతశ్చ స్తనయిత్నవః ।। 5

నృప - ఓ రాజా!, భానోః తు - భానువలనైతే, దేవఋషభః - దేవఋషభుడు, తతః - వానినుండి, ఇంద్రసేనః - ఇంద్రసేనుడు, లంబాయాః - లంబ వలన, విద్యోతః - విద్యోతుడు, ఆసీత్ - కలిగెను, తతః చ - వాని వలన కూడ, స్తనయిత్నవః - స్తనయిత్నువులు.

ఓ పరీక్షిన్మహారాజా! భాను పుత్రుడు దేవఋషభుడు. ఆయన పుత్రుడు ఇంద్రసేనుడు. లంబ పుత్రుడు విద్యోతుడు. అతని పుత్రులు స్తనయిత్నువులు (మేఘములు, అనగా మేఘాభిమాని దేవతలు).

కకుభస్సంకటస్తస్య కీకటస్తనయో యతః।
భువో దుర్గాణి జామేయస్స్వర్గో నందిస్తతోऽభవత్ ।। 6

కకుభః - కకుభ వలన, సంకటః - సంకటుడు, తస్య - వానికి, కీకటః - కీకటుడు, తనయః - పుత్రుడు, యతః - ఎవనినుండి, భువః - భూమియొక్క, దుర్గాణి - దుర్గములు కలిగినవో, జామేయః - జామి యొక్క పుత్రుడు, స్వర్గః - స్వర్గుడు, తతః - వానినుండి, నందిః - నంది, అభవత్ - కలిగెను.

కకుభకు సంకటుడు పుత్రుడు. సంకటునకు కీకటుడు పుత్రుడు. కీకటునకు భూదుర్గములు (అభిమాని దేవతలు) పుత్రులు. జామి పుత్రుడు స్వర్గుడు (స్వర్గము). స్వర్గుని పుత్రుడు నంది (ఆనందము).

విశ్వేదేవాస్తు విశ్వాయా అప్రజాంస్తాన్ ప్రచక్షతే ।
సాధ్యో గణస్తు సాధ్యాయా అర్థసిద్ధిస్తు తత్సుతః ।। 7

విశ్వాయాః తు - విశ్వ వలనైతే, విశ్వేదేవాః - విశ్వేదేవతలు, తాన్ - వారిని, అప్రజాన్ - సంతానము లేనివారినిగా, ప్రచక్షతే - చెప్పెదరు, సాధ్యాయాః తు - సాధ్య వలనైతే, సాధ్యః గణః - సాధ్యగణము, తత్-సుతః తు - వారి పుత్రుడైతే, అర్థసిద్ధిః - అర్థసిద్ధి.

విశ్వ పుత్రులు విశ్వేదేవతలు. వారికి సంతానము లేదని చెప్పెదరు. సాధ్య పుత్రులు సాధ్యగణము. వారి పుత్రుడు అర్థసిద్ధి.

మరుత్వాంశ్చ జయంతశ్చ మరుత్వత్యాం బభూవతుః ।
జయంతో వాసుదేవాంశ ఉపేంద్ర ఇతి యం విదుః ॥ 8

మరుత్వత్యామ్ - మరుత్వతియందు, మరుత్వాన్ చ - మరుత్వంతుడు, జయంతః చ - జయంతుడు కూడ, బభూవతుః - కలిగిరి, జయంతః - జయంతుడు, వాసుదేవ-అంశః - వాసుదేవుని అంశ, యమ్ - ఎవనిని, ఉపేంద్రః - ఉపేంద్రుడని, విదుః - తెలియుచున్నారో.

మరుత్వతికి మరుత్వంతుడు, జయంతుడు అనే ఇద్దరు పుత్రులు కలిగిరి. జయంతుడు వాసుదేవుని అంశయగు ఉపేంద్రుడని చెప్పెదరు.

మౌహూర్తికా దేవగణా ముహూర్తాయాశ్చ జజ్ఞిరే ।
యే వై ఫలం ప్రయచ్ఛంతి భూతానాం స్వస్వకాలజమ్ ॥ 9

మౌహూర్తికాః - ముహూర్తములకు అభిమానులగు, దేవగణాః - దేవతల గణములు, ముహూర్తాయాః - ముహూర్తనుండి, జజ్ఞిరే - పుట్టిరి, యే వై - ఎవరైతే, భూతానామ్ - ప్రాణులకు, స్వస్వకాలజమ్ - తమ తమ కాలములయందు పుట్టిన, ఫలమ్ - కర్మఫలమును, ప్రయచ్ఛంతి - ఇచ్చెదరో.

ముహూర్తకు ముహూర్తములకు అభిమానులగు దేవతల గణములు జన్మించెను. ఆ దేవతలు ప్రాణులకు వారి వారి కర్మఫలములను తమ తమ కాలముల (ముహూర్తముల) యందు ఇచ్చుచుందురు.

సంకల్పాయాశ్చ సంకల్పః కామస్సంకల్పజస్స్మృతః ।
వసవోఽష్టౌ వసోః పుత్రాస్తేషాం నామాని మే శృణు ॥ 10

సంకల్పాయాః చ - సంకల్ప వలన కూడ, సంకల్పః - సంకల్పుడు, సంకల్పజః - సంకల్పునినుండి పుట్టినవాడు, కామః - కాముడని, స్మృతః - చెప్పబడినాడు, వసోః - వసువునకు, వసవః - వసువులు అనే, అష్టౌ - ఎనమండుగురు, పుత్రాః - పుత్రులు, తేషామ్ - వారి, నామాని - పేర్లను, మే - నానుండి, శృణు - వినుము.

సంకల్పకు సంకల్పుడు (సంకల్పము) అనే పుత్రుడు గలడు. వానికి కాముడు అనే పుత్రుడు గలడు (సంకల్పమునుండి కోరిక పుట్టుట). వసువు అనే కన్యకు వసువులు అనే ఎనమండుగురు పుత్రులు గలరు. వారి పేర్లను వినుము.

ద్రోణః ప్రాణో ధ్రువోఽర్కోఽగ్నిర్దోషో వసుర్విభావసుః ।
ద్రోణస్యాభిమతేః పత్న్యా హర్షశోకభయాదయః ॥ 11

ద్రోణః - ద్రోణుడు, ప్రాణః - ప్రాణుడు, ధ్రువః - ధ్రువుడు, అర్కః - అర్కుడు, అగ్నిః - అగ్ని, దోషః - దోషుడు, వసుః - వసువు, విభావసుః - విభావసువు, ద్రోణస్య - ద్రోణునకు, పత్న్యాః - భార్యయగు, అభిమతేః - అభిమతి వలన, హర్షశోకభయ-ఆదయః - హర్షుడు శోకుడు భయుడు మొదలగువారు.

ద్రోణుడు, ప్రాణుడు, ధ్రువుడు, అర్కుడు, అగ్ని, దోషుడు, వసువు, విభావసువు అనునవి వారి పేర్లు. ద్రోణునకు అభిమతి అనే భార్యయందు హర్షుడు, శోకుడు, భయుడు మొదలగు పుత్రులు కలిగిరి. (తాను అల్పుడనని భావించే జీవునకు దేహమునందలి అభిమానము వలన హర్షము శోకము భయము మొదలగునవి కలుగుచుండును).

ప్రాణస్యోర్జస్వతీ భార్యా సహ ఆయుః పురోజవః ।
ధ్రువస్య భార్యా ధరణిరసూత వివిధాః పురః ॥ 12

ప్రాణస్య - ప్రాణునకు, ఊర్జస్వతీ - ఊర్జస్వతి, భార్య - భార్య, సహః - సహుడు, ఆయుః - ఆయువు, పురోజవః - పురోజవుడు, ధ్రువస్య - ధ్రువుని, భార్యా - భార్యయగు, ధరణిః - ధరణి, వివిధాః - వివిధములగు, పురః - పురములను, అసూత - కనెను.

ప్రాణునకు (ప్రాణశక్తి) ఊర్జస్వతి (బలము గలది) భార్య. వారికి సహుడు (సహనము), ఆయువు (ఆయుర్దాయము), పురోజవుడు (ముందుకు వేగముగా నడచుట) అనువారు పుత్రులు. ధ్రువునకు భార్యయగు

ధరణి (భూమి) వివిధములగు పురములను కనెను (పురములకు ఆశ్రయమ య్యెను).

**అర్కస్య వాసనా భార్యా పుత్రాస్తర్షాదయస్స్మృతాః ।**
**అగ్నేర్భార్యా వసోర్ధారా పుత్రా ద్రవిణకాదయః ॥ 13**

అర్కస్య - అర్కునకు, వాసనా - వాసన, భార్యా - భార్య, తర్ష-ఆదయః - తర్షుడు మొదలగువారు, పుత్రాః - పుత్రులని, స్మృతాః - చెప్ప బడినారు, అగ్నేః - అగ్నికి, భార్యా - భార్య, వసోర్ధారా - వసోర్ధార, పుత్రాః - పుత్రులు, ద్రవిణక-ఆదయః - ద్రవిణకుడు మొదలగువారు.

అర్కునకు వాసన అనే భార్యయందు తర్షుడు మొదలగు పుత్రులు కలిగిరి (పూర్వసంస్కారములనుండి తృష్ణ ఉదయించుట). అగ్నికి వసోర్ధార (నేతిని ధారగా అర్పించే హోమము) అనే భార్యయందు ద్రవిణకుడు (సంపద) మొదలగు పుత్రులు కలిగిరి (వసోర్ధార అనే హోమ మును చేసినచో సంపదలు మొదలగునవి కలుగును).

**స్కందశ్చ కృత్తికాపుత్రో యే విశాఖాదయస్తతః ।**
**దోషస్య శర్వరీపుత్రశ్శిశుమారో హరేః కలా ॥ 14**

స్కందః చ - స్కందుడు, కృత్తికాపుత్రః - కృత్తికలకు పుత్రుడు, తతః - వానినుండి, విశాఖ-ఆదయః - విశాఖుడు మొదలగువారు, యే - ఎవరు గలరో వారు, దోషస్య - దోషునకు, శర్వరీపుత్రః - శర్వరీ అనే భార్యయందు కలిగిన పుత్రుడు, శిశుమారః - శిశుమారుడు, హరేః - శ్రీహ రియొక్క, కలా - అంశ.

అగ్నికే కృత్తికలు అనే భార్యలయందు స్కందుడు పుట్టెను. స్కందునకు విశాఖుడు మొదలగువారు పుత్రులు. దోషునకు శర్వరి అనే భార్యయందు శ్రీహరి అంశయగు శిశుమారుడు జన్మించెను.

**వసోరాంగిరసీపుత్రో విశ్వకర్మా కృతీపతిః ।**
**తతో మనుశ్చాక్షుషోఽభూద్విశ్వే సాధ్యా మనోస్సుతాః ॥ 15**

వసోః - వసువునకు, ఆంగీరసీపుత్రః - ఆంగిరసియందలి పుత్రుడు, కృతీపతిః - శిల్పాచార్యుడగు, విశ్వకర్మా - విశ్వకర్మ, తతః - ఆయన నుండి, చాక్షుషః మనుః - చాక్షుష మనువు, అభూత్ - పుట్టెను, విశ్వే - విశ్వేదేవతలు, సాధ్యాః - సాధ్యులు, మనోః - మనువుయొక్క, సుతాః - పుత్రులు.

వసువునకు ఆంగిరసియందు శిల్పాచార్యుడగు విశ్వకర్మ పుట్టెను. విశ్వకర్మ పుత్రుడు చాక్షుష మనువు. ఆయన పుత్రులు విశ్వేదేవతలు మరియు సాధ్యులు.

విభావసోరసూతోషా వ్యుష్టం రోచిషమాతపమ్ ।
పంచయామోऽథ భూతాని యేన జాగ్రతి కర్మసు ।। 16

విభావసోః - విభావసువునకు, ఉషా - ఉష, వ్యుష్టమ్ - వ్యుష్టుని, రోచిషమ్ - రోచిషుని, ఆతపమ్ - ఆతపుని, అసూత - కనెను, అథ - ఆతపునినుండి, పంచయామః - పంచయాముడు, యేన - ఎవనిచే, భూతాని - ప్రాణులు, కర్మసు - కర్మలయందు, జాగ్రతి - తెలివిగా నుండెదరో.

విభావసువునకు భార్యయగు ఉషయందు వ్యుష్టుడు, రోచిషుడు, ఆతపుడు అనే పుత్రులు కలిగిరి (సూర్యుడు ఉషఃకాలములో ఉదయించినప్పుడు వేకువ కాంతి ఎండలు వరుసగా కలుగును). ఆతపునకు పంచయాముడనే పుత్రుడు కలిగెను. వాని వలననే ప్రాణులు తమ కర్మలను చేసుకుంటూ తెలివిగా నుండును (అయిదు జాముల పగలు సమయములో ఎండ కాయును, జనులందరు తెలివిగానుండి పనులను చేసుకొనెదరు).

సరూపాऽసూత భూతస్య భార్యా రుద్రాంశ్చ కోటిశః ।
రైవతోऽజో భవో భీమో వామ ఉగ్రో వృషాకపిః ।। 17

అజైకపాదహిర్బుధ్న్యో బహురూపో మహానితి ।
రుద్రస్య పార్షదాశ్చాన్యే ఘోరా భూతవినాయకాః ।। 18

భూతస్య - భూతుని, భార్యా - భార్యయగు, సరూపా - సరూప, రుద్రాన్ - రుద్రులను, కోటిశః - కోట్లాదిగా, అసూత - కనెను, రైవతః -

రైవతుడు, అజః - అజుడు, భవః - భవుడు, భీమః - భీముడు, వామః - వాముడు, ఉగ్రః - ఉగ్రుడు, వృషాకపిః - వృషాకపి, అజైకపాత్ - అజైకపాత్, అహిర్బుధ్న్యః - అహిర్బుధ్న్యుడు, బహురూపః - బహురూపుడు, మహాన్ - మహాన్, ఇతి - అనువారలు, రుద్రస్య - రుద్రుని, పార్షదాః - అనుచరులు, ఘోరాః - భయమును గొల్పువారు, అన్యే - ఇతరులు అగు, భూతవినాయకాః - భూతములు వినాయకులు.

భూతుని మొదటి భార్య సరూప. ఆమెకు కోట్ల సంఖ్యలో రుద్రులు పుట్టిరి. వీరిలో రైవతుడు, అజుడు, భవుడు, భీముడు, వాముడు, ఉగ్రుడు, వృషాకపి, అజైకపాత్తు, అహిర్బుధ్న్యుడు, బహురూపుడు అనువారలు రుద్రుని అనుచరులు. భూతములు, వినాయకులు భూతుని రెండవ భార్య సంతానము. వారు భయమును గొల్పుచుందురు.

ప్రజాపతేరంగిరసస్స్వధా పత్నీ పితౄనథ ।
అథర్వాంగిరసం వేదం పుత్రత్వే చాకరోత్సతీ ॥ 19

ప్రజాపతేః - ప్రజాపతియగు, అంగిరసః - అంగిరసునకు, పత్నీ - భార్యయగు, స్వధా - స్వధ, పితౄన్ - పితృదేవతలను, అథ - మరియు, సతీ - సతి, అథర్వాంగిరసం వేదమ్ - అథర్వాంగిరస వేదమును, పుత్రత్వే - పుత్రభావమునందు, అకరోత్ - చేసెను.

అంగిరస ప్రజాపతియొక్క మొదటి భార్యయగు స్వధ పితృదేవతలను కనెను. రెండవ భార్యయగు సతి అథర్వవేదు (వేదము) నే పుత్రునిగా భావించెను.

కృశాశ్వోఽర్చిషి భార్యాయాం ధూమ్రకేశమజీజనత్ ।
ధిషణాయాం వేదశిరో దేవలం వయునం మనుమ్ ॥ 20

కృశాశ్వః - కృశాశ్వుడు, భార్యాయామ్ - భార్యయగు, అర్చిషి - అర్చిస్సునందు, ధూమ్రకేశమ్ - ధూమ్రకేశుని, అజీజనత్ - కనెను, ధిషణాయామ్ - ధిషణయందు, వేదశిరః - వేదశిరసుని, దేవలమ్ - దేవలుని, వయునమ్ - వయునుని, మనుమ్ - మనువును.

కృశాశ్వునకు మొదటి భార్యయగు అర్చిష్మనందు ధూమ్రకేశుడు, రెండవ భార్యయగు ధిషణయందు వేదశిరసుడు దేవలుడు వయునుడు మనువు అను నలుగురు పుత్రులు కలిగిరి.

తార్క్ష్యస్య వినతా కద్రూః పతంగీ యామినీతి చ ।
పతంగ్యసూత పతగాన్ యామినీ శలభానథ ॥ 21

తార్క్ష్యస్య - తృక్షుని పుత్రుడగు కశ్యప ప్రజాపతికి, వినతా - వినత, కద్రూః - కద్రువు, పతంగీ - పతంగి, యామినీ ఇతి చ - యామిని అనే (భార్యలు), పతంగీ - పతంగి, పతగాన్ - పక్షులను, అథ - మరియు, యామినీ - యామిని, శలభాన్ - మిడతలను, అసూత - కనెను.

తృక్షుని పుత్రుడగు కశ్యప ప్రజాపతికి వినత, కద్రువు, పతంగి, యామిని అనే భార్యలు గలరు. పతంగి పక్షులను, యామిని మిడతలను కనెను.

సుపర్ణాऽసూత గరుడం సాక్షాద్యజ్ఞేశవాహనమ్ ।
సూర్యసూతమనూరుం చ కద్రూర్నాగానవేకశః ॥ 22

సుపర్ణా - సుపర్ణ యనబడే వినత, సాక్షాత్ - సాక్షాత్తుగా, యజ్ఞ-ఈశవాహనమ్ - యజ్ఞేశ్వరుడగు శ్రీహరికి వాహనముగు, గరుడమ్ - గరుడుని, సూర్యసూతమ్ - సూర్యునకు రథసారథియగు, అనూరుం చ - అనూరుని కూడ, కద్రూః - కద్రువు, నాగాన్ - నాగులను, అనేకశః - అనేకుల సంఖ్యలో, అసూత - కనెను.

వినతకు గరుడుడు, అనూరుడు అనే ఇద్దరు పుత్రులు కలిగిరి. గరుడుడు సాక్షాత్తుగా యజ్ఞేశ్వరుడగు శ్రీహరికి వాహనము కాగా, అనూరుడు సూర్యునకు సారథి ఆయెను. కద్రువు అనేకులగు నాగులను కనెను.

కృత్తికాదీని నక్షత్రాణీందోః పత్న్యస్తు భారత ।
దక్షశాపాత్సోऽనపత్యాస్తాసు యక్ష్మగ్రహార్దితః ॥ 23

భారత - భరతవంశీయుడవగు ఓ రాజా!, కృత్తికా-ఆదీని - కృత్తిక మొదలగు, నక్షత్రాణి తు - నక్షత్రములైతే, ఇందోః - చంద్రునకు, పత్న్యః - భార్యలు, యక్ష్మగ్రహ-అర్దితః - క్షయ (క్షీణించుట) రోగముచే పీడించబడినవాడగు, సః - ఆ చంద్రుడు, దక్షశాపాత్ - దక్షుని శాపము వలన, తాసు - వారియందు, అనపత్యః - సంతానము లేనివాడు.

భరతవంశీయుడవగు ఓ మహారాజా! కృత్తిక మొదలగు నక్షత్రములు చంద్రుని భార్యలు. చంద్రుడు దక్షుని శాపము వలన క్షయరోగముచే పీడించబడెను. ఆయనకు వారియందు సంతానము కలుగలేదు.

పునః ప్రసాద్య తం సోమః కలా లేభే క్షయే దితాః ।
శృణు నామాని లోకానాం మాతౄణాం శంకరాణి చ ॥ 24

అథ కశ్యపపత్నీనాం యత్ప్రసూతమిదం జగత్ ।
అదితిర్దితిర్దనుః కాష్ఠా అరిష్టా సురసా ఇలా ॥ 25

మునిః క్రోధవశా తామ్రా సురభిస్సరమా తిమిః ।
తిమేర్యాదోగణా ఆసన్ శ్వాపదాస్సరమాసుతాః ॥ 26

సోమః - చంద్రుడు, తమ్ - ఆ దక్షుని, ప్రసాద్య - ప్రసన్నునిగా చేసుకొని, క్షయే - కృష్ణపక్షమునందు, దితాః - ఖండించబడిన, కలాః - కళలను (అంశములను), పునః - మరల, లేభే - పొందెను, అథ - తరువాత, లోకానామ్ - ప్రాణులకు, మాతౄణామ్ - తల్లులైనట్టియు, కశ్యపపత్నీనామ్ - కశ్యపుని భార్యలయొక్క, శంకరాణి - మంగళకరములగు, నామాని చ - పేర్లను కూడ, శృణు - వినుము, యత్ - ఎవరినుండైతే, ఇదమ్ - ఈ, జగత్ - ప్రాణి సమూహము, ప్రసూతమ్ - జన్మించినదో, అదితిః - అదితి, దితిః - దితి, దనుః - దనువు, కాష్ఠా - కాష్ఠ, అరిష్టా - అరిష్ట, సురసా - సురస, ఇలా - ఇల, మునిః - ముని, క్రోధవశా - క్రోధవశ, తామ్రా - తామ్ర, సురభిః - సురభి, సరమా - సరమ, తిమిః - తిమి, తిమేః - తిమినుండి, యాదోగణాః - జలజంతువుల సమూహములు, ఆసన్ - పుట్టెను, శ్వాపదాః - హింసించే జంతువులు, సరమాసుతాః - సరమ సంతానము.

చంద్రుడు దక్షుని ప్రసన్నునిగా చేసుకొని, కృష్ణపక్షములో తన నుండి ఖండించబడిన కళలను తిరిగి పొందెను. తరువాత, ప్రాణుల తల్లుల పేర్లను వినుము. వీరు కశ్యప ప్రజాపతియొక్క భార్యలు. వీరినుండియే ఈ ప్రాణిసమూహము పుట్టినది. అదితి, దితి, దనువు, కాష్ఠ, అరిష్ట, సురస, ఇల, ముని, క్రోధవశ, తామ్ర, సురభి, సరమ, తిమి అనే వారి పేర్లు మంగళకరమైనవి. తిమికి జలజంతువుల గణములు సంతానము కాగా, హింసించే జంతువులు సరమ సంతానము.

సురభేర్మహిషా గావో యే చాన్యే ద్విశఫా నృప ।
తామ్రాయాశ్శ్యేనగృధ్రాద్యా మునేరప్సరసాం గణాః ।। 27

నృప - ఓ రాజా!, సురభేః - సురభినుండి, మహిషాః - గేదెలు, గావః - గోవులు, అన్యే - ఇతరములగు, ద్విశఫాః - రెండు గిట్టలు గలవి, యే చ - ఏవి గలవో అవి కూడ, తామ్రాయాః - తామ్రనుండి, శ్యేనగృధ్రాద్యాః - డేగ గ్రద్ద మొదలగునవి, మునేః - మునినుండి, అప్సరసామ్ - అప్సరసల, గణాః - గణములు.

ఓ మహారాజా! సురభికి గేదెలు, గోవులు మొదలగు రెండు గిట్టల జంతువులు, తామ్రకు డేగలు గ్రద్దలు మొదలగు హింసను చేసే పక్షులు, మునికి అప్సరసల గణములు జన్మించినవి.

దందశూకాదయస్సర్పా రాజన్ క్రోధవశాత్మజాః ।
ఇలాయా భూరుహాస్సర్వే యాతుధానాశ్చ సౌరసాః ।। 28

రాజన్ - ఓ మహారాజా!, దందశూక-ఆదయః - త్రాచుపాము మొదలగు, సర్పాః - విషసర్పములు, క్రోధవశా-ఆత్మజాః - క్రోధవశ సంతానము, ఇలాయాః - ఇలనుండి, సర్వే - అన్ని, భూరుహాః - చెట్టుచేమలు, యాతుధానాః చ - రాక్షసులు, సౌరసాః - సురస పుత్రులు.

ఓ మహారాజా! క్రోధవశకు త్రాచుపాము మొదలగు విషసర్పములు, ఇలకు చెట్టుచేమలు, సురసకు రాక్షసులు సంతానమై జన్మించిరి.

అరిష్టాయాశ్చ గంధర్వాః కాష్ఠాయా ద్విశఫేతరాః ।
సుతా దనోరేకషష్టిస్తేషాం ప్రాధానికాన్ శృణు ॥ 29

అరిష్టాయాః - అరిష్టనుండి, గంధర్వాః - గంధర్వులు, కాష్ఠాయాః - కాష్ఠనుండి, ద్విశఫ-ఇతరాః - రెండు గిట్టల జంతువులకంటె భిన్నమైనవి, దనోః - దనువునకు, ఏకషష్టిః - అరవై ఒక్క, సుతాః - పుత్రులు, తేషామ్ - వారిలో, ప్రాధానికాన్ - ముఖ్యమైన వారిని, శృణు - వినుము.

అరిష్టకు గంధర్వులు, కాష్ఠకు గుర్రము మొదలగు ఒంటి గిట్ట జంతువులు పుట్టినవి. దనువునకు అరవై ఒక్క పుత్రులు గలరు. వారిలో ప్రముఖులైన దానవుల పేర్లను వినుము.

ద్విమూర్ధా శంబరోఽరిష్టో హయగ్రీవో విభావసుః ।
అయోముఖశ్శంకుశిరాస్స్వర్భానుః కపిలోఽరుణః ॥ 30

ద్విమూర్ధా - ద్విమూర్ధుడు, శంబరః - శంబరుడు, అరిష్టః - అరిష్టుడు, హయగ్రీవః - హయగ్రీవుడు, విభావసుః - విభావసువు, అయోముఖః - అయోముఖుడు, శంకుశిరాః - శంకుశిరసుడు, స్వర్భానుః - స్వర్భానువు, కపిలః - కపిలుడు, అరుణః - అరుణుడు.

ద్విమూర్ధుడు, శంబరుడు, అరిష్టుడు, హయగ్రీవుడు, విభావసువు, అయోముఖుడు, శంకుశిరసుడు, స్వర్భానువు, కపిలుడు, అరుణుడు.

పులోమా వృషపర్వా చ ఏకచక్రోఽనుతాపనః ।
ధూమ్రకేశో విరూపాక్షో విప్రచిత్తిశ్చ దుర్జయః ॥ 31

పులోమా - పులోముడు, వృషపర్వా - వృషపర్వుడు, ఏకచక్రః - ఏకచక్రుడు, అనుతాపనః - అనుతాపనుడు, ధూమ్రకేశః - ధూమ్రకేశుడు, విరూపాక్షః - విరూపాక్షుడు, విప్రచిత్తిః - విప్రచిత్తి, దుర్జయః - దుర్జయుడు.

పులోముడు, వృషపర్వుడు, ఏకచక్రుడు, అనుతాపనుడు, ధూమ్రకేశుడు, విరూపాక్షుడు, విప్రచిత్తి, దుర్జయుడు అనువారలు దానవులు.

స్వర్భానోస్సుప్రభాం కన్యాముహాహ నముచిః కిల ।
వృషపర్వణస్తు శర్మిష్ఠాం యయాతిర్నాహుషో బలీ ॥ 32

స్వర్భానోః - స్వర్భానువుయొక్క, కన్యామ్ - కుమార్తెయగు, సుప్రభామ్ - సుప్రభను, నముచిః - నముచి, వృషపర్వణః - వృషపర్వుని కుమార్తెయగు, శర్మిష్ఠాం తు - శర్మిష్ఠనైతే, నాహుషః - నహుషుని పుత్రుడు, బలీ - బలశాలియగు, యయాతిః - యయాతి, ఉవాహ కిల - వివాహమాడెను గదా!

స్వర్భానువు కుమార్తెయగు సుప్రభను నముచి వివాహమాడెను. నహుషపుత్రుడు, బలశాలియగు యయాతి వృషపర్వుని కుమార్తెయగు శర్మిష్ఠను వివాహమాడెను.

వైశ్వానరసుతా యాశ్చ చతస్రశ్చారుదర్శనాః ।
ఉపదానవీ హయశిరా పులోమా కాలకా తథా ॥ 33

వైశ్వానరసుతాః - వైశ్వానరుని కుమార్తెలు, చారుదర్శనాః - అందమగు రూపము గలవారు, చతస్రః - నలుగురు, ఉపదానవీ - ఉపదానవి, హయశిరా - హయశిర, పులోమా - పులోమ, తథా - మరియు, కాలకా - కాలక, యాః చ - ఎవరు గలరో.

దనువు పుత్రుడగు వైశ్వానరునకు అందమగు రూపము గలవారు, ఉపదానవి, హయశిర, పులోమ, కాలక అనే నలుగురు కుమార్తెలు గలరు.

ఉపదానవీం హిరణ్యాక్షః క్రతుర్హయశిరాం తథా ।
పులోమాం కాలకాం చ ద్వే వైశ్వానరసుతే తు కః ॥ 34

ఉపయేమేఽథ భగవాన్ కశ్యపో బ్రహ్మచోదితః ।
పౌలోమాః కాలకేయాశ్చ దానవా యుద్ధశాలినః ॥ 35

హిరణ్యాక్షః - హిరణ్యాక్షుడు, ఉపదానవీమ్ - ఉపదానవిని, తథా - మరియు, క్రతుః - క్రతువు, హయశిరామ్ - హయశిరను, అథ - తరువాత, పులోమాం కాలకాం చ - పులోమ కాలక అనే, ద్వే - ఇద్దరు, వైశ్వానర

సుతే తు - వైశ్వానరుని కుమార్తెలనైతే, కః - ప్రజాపతి, భగవాన్ - పూజనీయుడు అగు, కశ్యపః - కశ్యపుడు, బ్రహ్మచోదితః - బ్రహ్మగారిచే ప్రేరేపించబడినవాడై, ఉపయేమే - వివాహమాడెను, దానవాః - దనువంశీయులగు, పౌలోమాః - పులోమ పుత్రులు, కాలకేయాః చ - కాలక పుత్రులు కూడ, యుద్ధశాలినః - యుద్ధమునందు శోభిల్లువారు.

హిరణ్యాక్షుడు ఉపదానవిని, క్రతువు హయశిరను వివాహమాడిరి. బ్రహ్మగారు ప్రేరేపించగా పూజనీయుడగు కశ్యప ప్రజాపతి వైశ్వానరుని మిగిలిన ఇద్దరు కుమార్తెలను, అనగా పులోమను కాలకను కూడ, వివాహమాడెను. పులోమ సంతానము పౌలోములు, కాలక సంతానము కాలకేయులు అనే దనువంశీయులగు రాక్షసులు. వీరు యుద్ధమునందు శోభిల్లే వీరులు.

తయోష్షష్టిసహస్రాణి యజ్ఞఘ్నాంస్తే పితుః పితా ।
జఘాన స్వర్గతో రాజన్నేక ఇంద్రప్రియంకరః ।। 36

రాజన్ - ఓ రాజా!, యజ్ఞఘ్నాన్ - యజ్ఞములను చెడగొట్టే, తయోః - ఆ రెండు గణములకు చెందిన, షష్టిసహస్రాణి - అరవై వేలమందిని, స్వః-గతః - స్వర్గమును గురించి వెళ్లిన, తే - నీ, పితుః - తండ్రియొక్క, పితా - తండ్రి, ఏకః - ఒక్కడే, ఇంద్రప్రియంకరః - ఇంద్రునకు ప్రీతిని కలిగించువాడై, జఘాన - సంహరించెను.

ఓ పరీక్షిన్మహారాజా! పౌలోమ కాలకేయ వంశములకు చెందిన అరవై వేలమంది దానవులు (నివాతకవచులు) యజ్ఞములను చెడగొట్టెడివారు. వారిని నీ తండ్రి అభిమన్యుని తండ్రియగు అర్జునుడొక్కడే స్వర్గమునకు వెళ్లినప్పుడు సంహరించి, ఇంద్రునకు ప్రీతిని కలిగించెను.

విప్రచిత్తిస్సింహికాయాం శతం చైకమజీజనత్ ।
రాహుజ్యేష్ఠం కేతుశతం గ్రహత్వం య ఉపాగతః ।। 37

విప్రచిత్తిః - విప్రచిత్తి, సింహికాయామ్ - సింహికయందు, రాహుజ్యేష్ఠమ్ - రాహువు పెద్దవాడుగా కలిగినట్టియు, కేతుశతమ్ - కేతువుల

పందయైన, శతం చ ఏకమ్ - నూట ఒక్కమందిని, అజీజనత్ - కనెను, యః - ఏ రాహువు, గ్రహత్వమ్ - గ్రహభావమును, ఉపాగతః - పొందినా డో.

విప్రచిత్తికి సింహికయందు నూట ఒక్కమంది పుట్టిరి. వారిలో పెద్ద వాడు రాహువు. మిగిలిన పందమందికి కేతువులు అని పేరు. రాహువు గ్రహము అయ్యేను.

అథాతశ్శ్రూయతాం వంశో యోఽదితేరనుపూర్వశః ।
యత్ర నారాయణో దేవస్స్వాంశేనావతరద్విభుః ॥ 38

అథ - మంగళము, అతః - ఈపైన, అదితేః - అదితియొక్క, యః - ఏ, వంశః - వంశము గలదో, అనుపూర్వశః - క్రమముగా, శ్రూయ తామ్ - వినబడు గాక!, యత్ర - ఏ వంశమునందైతే, విభుః - సర్వవ్యాప కుడగు, నారాయణః దేవః - నారాయణ దేవుడు, స్వ-అంశేన - తన అంశచే, అవతరత్ - అవతరించెనో.

మంగళమగు గాక! ఈపైన అదితి వంశమును క్రమముగా చెప్పె దను. వినుము. ఆ వంశములో సర్వవ్యాపకుడగు నారాయణ దేవుడు తన అంశచే (వామనుడై) అవతరించెను.

వివస్వానర్యమా పూషా త్వష్టాఽథ సవితా భగః ।
ధాతా విధాతా వరుణో మిత్రశ్శక్ర ఉరుక్రమః ॥ 39

వివస్వాన్ - వివస్వంతుడు, అర్యమా - అర్యముడు, పూషా - పూష, త్వష్టా - త్వష్ట, అథ - తరువాత, సవితా - సవిత, భగః - భగుడు, ధాతా - ధాత, విధాతా - విధాత, వరుణః - వరుణుడు, మిత్రః - మిత్రుడు, శక్రః - ఇంద్రుడు, ఉరుక్రమః - పెద్ద అడుగులు వేసిన వామనుడు.

వివస్వంతుడు, అర్యముడు, పూష, త్వష్ట, సవిత, భగుడు, ధాత, విధాత, వరుణుడు, మిత్రుడు, ఇంద్రుడు, పెద్ద అడుగులు వేసిన వామ నుడు అదితి పుత్రులు. (పన్నెండుగురు ఆదిత్యులు)

వివస్వతశ్శ్రాద్ధదేవం సంజ్ఞాఽసూయత వై మనుమ్ ।
మిథునం చ మహాభాగా యమం దేవం యమీం తథా ।
సైవ భూత్వాఽథ వడవా నాసత్యౌ సుషువే భువి ॥ 40

మహాభాగా - గొప్ప సౌభాగ్యవతియగు, సంజ్ఞా - సంజ్ఞ, వివస్వతః - వివస్వానుని వలన, శ్రాద్ధదేవం మనుం వై - శ్రాద్ధదేవ మనువును, యమం దేవమ్ - యమదేవుని, తథా - మరియు, యమీమ్ - యమునను, మిథునం చ - కవలలుగా, అసూయత - కనెను, అథ - మరియు, సా ఏవ - ఆమెయే, భువి - భూలోకమునందు, వడవా - ఆడు గుర్రము, భూత్వా - అయి, నాసత్యౌ - అశ్వినీ కుమారులను, సుషువే - కనెను.

వివస్వానునకు గొప్ప సౌభాగ్యవతియగు సంజ్ఞయందు శ్రాద్ధదేవ (వైవస్వత) మనువు, యమదేవుడు యమున అనే కవలలు కలిగిరి. ఇంతే గాక, ఆమె భూలోకములో ఆడు గుర్రమై అశ్వినీ కుమారులను కనెను.

ఛాయా శనైశ్చరం లేభే సావర్ణిం చ మనుం తతః ।
కన్యాం చ తపతీం యా వై వవ్రే సంవరణం పతిమ్ ॥ 41

ఛాయా - ఛాయ, తతః - ఆ వివస్వానుని వలన, శనైశ్చరమ్ - శనైశ్చరుని, సావర్ణిం మనుం చ - సావర్ణి మనువును, తపతీమ్ - తపతి అనే, కన్యాం చ - కన్యను కూడ, లేభే - పొందెను, యా వై - ఏ తపతియైతే, సంవరణమ్ - సంవరణుని, పతిమ్ - భర్తనుగా, వవ్రే - వరించెనో.

వివస్వానునకు రెండవ భార్యయగు ఛాయయందు శనైశ్చరుడు, సావర్ణి మనువు, తపతి అనే కన్య పుట్టిరి. తపతి సంవరణుడు అనే రాజును భర్తగా వరించెను.

అర్యమ్ణో మాతృకా పత్నీ తయోశ్చర్షణయస్సుతాః ।
యత్ర వై మానుషీ జాతిర్బ్రహ్మణా చోపకల్పితా ॥ 42

అర్యమ్ణః - అర్యమునకు, మాతృకా - మాతృక, పత్నీ - భార్య, తయోః - వారిద్దరికి, చర్షణయః - చర్షణులు అనే, సుతాః - పుత్రులు,

యత్ర - ఎవరియందైతే, బ్రహ్మణా - బ్రహ్మగారిచే, మానుషీ జాతిః - మానవజాతి, ఉపకల్పితా - రచించబడినదో.

అర్యముని భార్య మాతృక. వారికి చర్షణులు అనే పుత్రులు కలిగిరి. వారు వివేకజ్ఞానము గలవారగుటచే, వారిని ఆధారముగా చేసుకొని, బ్రహ్మగారు మానవజాతిని రచించిరి.

పూషాఽనపత్యః పిష్టాదో భగ్నదంతోఽభవత్పురా ।
యోఽసౌ దక్షాయ కుపితం జహాస వివృతద్విజః ॥ 43

పూషా - పూష, అనపత్యః - సంతానము లేనివాడు, పురా - పూర్వము, భగ్నదంతః - విరుగగొట్టబడిన పళ్లు గలవాడు, అభవత్ - ఆయెను, పిష్ట-అదః - పిండిని తినువాడు, యః - ఏ, అసౌ - ఈ పూష, దక్షాయ - దక్షుని కొరకు, కుపితమ్ - కోపించిన శివుని ఉద్దేశించి, వివృత ద్విజః - తెరువబడిన పళ్లు గలవాడై, జహాస - నవ్వెనో.

పూషకు సంతానము లేదు. పూర్వము దక్షయజ్ఞమునందు దక్షునిపై కోపించిన శివుని చూచి, ఈ పూష పళ్లను ఇకిలించి నవ్వగా, వీరభద్రుడు ఆతని పళ్లను విరుగగొట్టెను. కావుననే, ఆతడు పిండిని తినును.

త్వష్టుర్దైత్యానుజా భార్యా రచనా నామ కన్యకా ।
సంనివేశస్తయోర్జజ్ఞే విశ్వరూపశ్చ వీర్యవాన్ ॥ 44

దైత్య-అనుజా - దైత్యుల చెల్లెలు, రచనా నామ - రచన అని ప్రసిద్ధి గాంచిన, కన్యకా - కన్య, త్వష్టుః - త్వష్టకు, భార్యా - భార్య, తయోః - వారిద్దరి వలన, సంనివేశః - సంనివేశుడు, వీర్యవాన్ - పరాక్రమవంతుడగు, విశ్వరూపః చ - విశ్వరూపుడు కూడ, జజ్ఞే - పుట్టెను.

దైత్యుల చెల్లెలు, రచన అని ప్రసిద్ధి గాంచినది అగు కన్యక త్వష్టకు భార్య. వారిద్దరికి సంనివేశుడు, పరాక్రమశాలియగు విశ్వరూపుడు జన్మించిరి.

తం వవ్రిరే సురగణాస్స్వస్రీయం ద్విషతామపి ।
విమతేన పరిత్యక్తా గురుణాఽఽంగిరసేన యత్ ॥ 45

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే
దక్షకన్యావంశవర్ణనం నామ షష్ఠోఽధ్యాయః ॥

సురగణాః - దేవగణములు, ద్విషతామ్ - శత్రువులయొక్క, స్వస్రీయం అపి - చెల్లెలు కొడుకే అయిననూ, తమ్ - ఆ విశ్వరూపుని, వవ్రిరే - వరణము చేసిరి, యత్ - ఎప్పుడైతే, విమతేన - అవమానించబడిన, గురుణా - గురువైన, ఆంగిరసేన - అంగిరసుని పుత్రుడగు బృహస్పతిచే, పరిత్యక్తాః - విడిచిపెట్టబడిరో.

ఒకప్పుడు అంగిరసుని పుత్రుడు, దేవగురువు అగు బృహస్పతి ఇంద్రునిచే అవమానించబడి దేవతలను విడిచిపెట్టెను. అప్పుడు దేవగణములు, తమ శత్రువులగు దైత్యుల చెల్లెలు కొడుకే అయిననూ, విశ్వరూపుని పురోహితునిగా వరణము చేసిరి.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి ఆరవ స్కంధములో
దక్షుని కన్యల వంశావళిని వర్ణించే ఆరవ
అధ్యాయము ముగిసినది (6).

*****

# అథ సప్తమోऽధ్యాయః

## ఇంద్రునిచే అవమానించబడి బృహస్పతి దేవతలను విడిచిపెట్టుట

రాజోవాచ ।
కస్య హేతోః పరిత్యక్తా ఆచార్యేణాత్మనస్సురాః ।
ఏతదాచక్ష్వ భగవన్ శిష్యాణామక్రమం గురౌ ॥ 1

ఆత్మనః - తన, సురాః - దేవతలు, ఆచార్యేణ - దేవగురువగు బృహస్పతిచే, కస్య - ఏ, హేతోః - కారణమునకు, పరిత్యక్తాః - విడిచి పెట్ట బడినారు?, భగవన్ - పూజనీయా!, ఏతత్ - దీనిని, గురౌ - గురువు నందు, శిష్యాణామ్ - శిష్యులగు దేవతల, అక్రమమ్ - అపరాధమును, ఆచక్ష్వ - చెప్పుము.

పరీక్షిన్మహారాజు ఇట్లు ప్రశ్నించెను --- ఓ పూజనీయా! దేవగురు వగు బృహస్పతి తన శిష్యులగు దేవతలను విడిచిపెట్టుటకు కారణమేమి? శిష్యులగు దేవతలు గురువు విషయములో చేసిన అపరాధమేమి? ఈ విషయమును చెప్పుడు.

ఇంద్రస్త్రిభువనైశ్వర్యమదోల్లంఘితసత్పథః ।
మరుద్భిర్వసుభీ రుద్రైరాదిత్యైరృభుభిర్నృప ॥ 2

విశ్వేదేవైశ్చ సాధ్యైశ్చ నాసత్యాభ్యాం పరిశ్రితః ।
సిద్ధచారణగంధర్వైర్మునిభిర్బ్రహ్మవాదిభిః ॥ 3

విద్యాధరాప్సరోభిశ్చ కిన్నరైః పతగోరగైః ।
నిషేవ్యమాణో మఘవాన్ స్తూయమానశ్చ భారత ॥ 4

నృప - ఓ రాజా!, భారత - భరతవంశీయుడా!, త్రిభువన-ఐశ్వ ర్యమద-ఉల్లంఘితసత్-పథః - ముల్లోకముల ఐశ్వర్యము వలని గర్వ ముచే ఉల్లంఘింపబడిన సన్మార్గము గలవాడు, నాసత్యాభ్యామ్ - అశ్వినీ కుమారులచే, పరిశ్రితః - చుట్టువారబడి యున్నవాడు, మఘవాన్ - యజ్ఞ ములను చేసినవాడు అగు, ఇంద్రః - ఇంద్రుడు, మరుద్భిః - మరుత్తులచే, వసుభిః - వసువులచే, రుద్రైః - రుద్రులచే, ఆదిత్యైః - ఆదిత్యులచే, ఋభుభిః - ఋభువులచే, విశ్వేదేవైః చ - విశ్వేదేవతలచే కూడ, సాధ్యైః చ - సాధ్యులచే, సిద్ధచారణగంధర్వైః - సిద్ధులచే చారణులచే గంధర్వుల చే, బ్రహ్మవాదిభిః - వేదవేత్తలగు, మునిభిః - మహర్షులచే, విద్యాధర-అ ప్సరోభిః చ - విద్యాధరులచే అప్సరసలచే కూడ, కిన్నరైః - కిన్నరులచే, పతగ-ఉరగైః - పక్షులచే నాగములచే, నిషేవ్యమాణః - సేవింపబడుచు న్నవాడు, స్తూయమానః - స్తుతింపబడుచున్నవాడు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- భరతవంశీయుడవగు ఓ పరీక్షి న్మహారాజా! ఇంద్రునకు ముల్లోకముల ఐశ్వర్యముచే గర్వము కలిగి సన్మా ర్గమునుల్లంఘించెను. యజ్ఞకర్తయగు ఆ ఇంద్రునకు రెండు వైపులా అశ్వినీ కుమారులు నిలిచియుండిరి. మరుద్గణములు, వసువులు, రుద్రులు, ఆది త్యులు, ఋభుగణములు, విశ్వేదేవతలు, సాధ్యులు, సిద్ధులు, చారణులు, గంధర్వులు, వేదవేత్తలగు మహర్షులు, విద్యాధరులు, అప్సరసలు, కిన్నరు లు, పక్షులు, నాగములు కూడ ఆయనను సేవించి స్తుతించుచుండిరి.

**ఉపగీయమానో లలితమాస్థానాధ్యాసనాశ్రితః ।**
**పాండురేణాతపత్రేణ చంద్రమండలచారుణా ।। 5**

**యుక్తశ్చాన్యైః పారమేష్ఠ్యైశ్చామరవ్యజనాదిభిః ।**
**విరాజమానః పౌలోమ్యా సహార్ధాసనయా భృశమ్ ।। 6**

లలితమ్ - సుందరముగా, ఉపగీయమానః - కీర్తించబడు చున్న వాడు, ఆస్థాన-అధ్యాసన-ఆశ్రితః - సభయందు ఉన్నతమగు ఆసనమును ఆశ్రయించినవాడు, పాండురేణ - తెల్లని, చంద్రమండలచారుణా - చంద్ర మండలము వలె అందమైన, ఆతపత్రేణ - గొడుగుతో, అన్యైః - ఇతరము

లగు, చామరవ్యజన-ఆదిభిః - వింజామరలు మొదలగు, పారమేష్ఠ్యైః చ - చక్రవర్తి చిహ్నములతో కూడ, యుక్తః - కూడియున్నవాడు, అర్ధ-ఆసనయా - సగము ఆసనము గల, పౌలోమ్యా సహ - పులోముని కుమార్తె యగు శచీదేవితో గూడి, భృశమ్ - మిక్కిలి, విరాజమానః - విశేషముగా రాజిల్లువాడు.

దేవసభలో ఉన్నతమగు ఆసనమునందు కూర్చుండియున్న ఇంద్రుని గంధర్వాదులు సుందరముగా కీర్తించుచుండిరి. చంద్రమండలము వలె అందమైన తెల్లని గొడుగు, వింజామరలు మొదలగు మహారాజ చిహ్నములు గల ఇంద్రుడు అర్ధాసనమునందున్న శచీదేవితో గూడి మిక్కిలి ప్రకాశించుచుండెను.

స యదా పరమాచార్యం దేవానామాత్మనశ్చ హ ।
నాభ్యనందత సంప్రాప్తం ప్రత్యుత్థానాసనాదిభిః ॥ 7

వాచస్పతిం మునివరం సురాసురనమస్కృతమ్ ।
నోచ్చచాలాసనాదింద్రః పశ్యన్నపి సభాగతమ్ ॥ 8

తతో నిర్గత్య సహసా కవిరాంగిరసః ప్రభుః ।
ఆయయౌ స్వగృహం తూష్ణీం విద్వాన్ శ్రీమదవిక్రియామ్॥ 9

సః - ఆ, ఇంద్రః - ఇంద్రుడు, యదా - ఏ కాలమునందైతే, దేవానామ్ - దేవతలకు, ఆత్మనః చ - తనకు కూడ, పరమ-ఆచార్యమ్ - గొప్ప ఆచార్యుడైనట్టియు, మునివరమ్ - మహర్షులలో శ్రేష్ఠుడైనట్టియు, సుర-అసురనమస్కృతమ్ - దేవతలచే రాక్షసులచే నమస్కరించబడునట్టియు, సంప్రాప్తమ్ - విచ్చేసిన, వాచస్పతిమ్ - బృహస్పతిని, ప్రతి-ఉత్థాన-ఆసన-ఆదిభిః - లేచి నిలబడి ఎదురేగి ఆసనమునిచ్చుట మొదలగువాటిచే, న అభ్యనందత - సత్కరించలేదో, సభాగతమ్ - సభయందున్న బృహస్పతిని, పశ్యన్ అపి - చూచుచున్ననూ, ఆసనాత్ - ఆసనమునుండి, న ఉత్-చచాల - పైకి లేవలేదో అప్పుడు, తతః - అక్కడనుండి, కవిః - జ్ఞాని, ప్రభుః - సర్వసమర్థుడు, శ్రీమదవిక్రియామ్ - సంపద వలని గర్వముచే కలిగే వికారమును, విద్వాన్ - తెలిసినవాడు, ఆంగిరసః - అంగిర

సుని పుత్రుడు అగు బృహస్పతి, సహసా - వెంటనే, నిర్గత్య - బయటకు వచ్చి, తూష్ణీమ్ - మౌనముగా, స్వగృహమ్ - తన ఇంటిని గురించి, ఆయయౌ - వచ్చెను.

బృహస్పతి దేవతలకు తనకు కూడ గొప్ప ఆచార్యుడు. ఆ మహర్షి సభకు వచ్చినప్పుడు ఇంద్రుడు ఎదురేగి ఆసనమునిచ్చి సత్కరించలేదు. పైగా, దేవతలచే మరియు రాక్షసులచే నమస్కరించబడే ఆయనను చూచి కూడ ఇంద్రుడు తన ఆసనమునుండి కదలలేదు. అంగిరసుని పుత్రుడగు బృహస్పతి జ్ఞాని, సర్వసమర్థుడు. సంపద వలన గర్వము పుట్టి దానిచే వ్యక్తిలో వచ్చే వికారములు బృహస్పతికి తెలియును. కావుననే, అప్పుడు ఆయన వెంటనే అచటనుండి బయటకు వచ్చి, మౌనముగా తన ఇంటిని చేరుకొనెను.

తర్హ్యేవ ప్రతిబుద్ధ్యేంద్రో గురుహేలనమాత్మనః ।
గర్హయామాస సదసి స్వయమాత్మానమాత్మనా ॥ 10

తర్హి ఏవ - అదే సమయమునందు, ఇంద్రః - ఇంద్రుడు, ఆత్మనః - తన, గురుహేలనమ్ - గురువును అవమానించుటను, ప్రతిబుద్ధ్య - తెలుసుకొని, సదసి - సభయందు, స్వయమ్ - స్వయముగా, ఆత్మనా - తనచే, ఆత్మానమ్ - తనను, గర్హయామాస - నిందించుకొనెను.

అదే సమయములో ఇంద్రుడు తాను గురువును అవమానించినానని తెలుసుకొనెను. సభలో ఆతడు స్వయముగా తనను తానే నిందించుకొనెను.

అహో బత మయాఽసాధు కృతం వై దభ్రబుద్ధినా ।
యన్మయైశ్వర్యమత్తేన గురుస్సదసి కాత్కృతః ॥ 11

అహో - అయ్యో!, బత - కష్టము వచ్చినది!, దభ్రబుద్ధినా - అల్పమగు బుద్ధి గల, మయా - నాచే, వై - నిశ్చయముగా, అసాధు - తప్పు పని, కృతమ్ - చేయబడినది, యత్ - ఏలయనగా, ఐశ్వర్యమత్తేన

- ఐశ్వర్యముచే గర్వించియున్న నాచే, సదసి - సభయందు, గురుః - గురువు, కాత్-కృతః - తిరస్కరించ బడినాడు.

అయ్యో! చాల కష్టము వచ్చినది! అల్పబుద్ధి గల నేను ఐశ్వర్య ముచే గర్వించి, సభలో గురువును తిరస్కరించి, నిశ్చయముగా తప్పు పనిని చేసితిని.

కో గృధ్యేత్పండితో లక్ష్మీం త్రివిష్టపపతేరపి ।
యయాహమాసురం భావం నీతోఽద్య విబుధేశ్వరః ।। 12

పండితః - పండితుడగు, కః - ఎవడు, త్రివిష్టపపతేః - స్వర్గాధిపతి యొక్క, లక్ష్మీం అపి - సంపదనైననూ, గృధ్యేత్ - ఆశపడును?, యయా - ఏ సంపదచే, విబుధ-ఈశ్వరః - దేవప్రభువునగు, అహమ్ - నేను, ఆసురమ్ - అసురులకు చెందిన, భావమ్ - స్థితిని, అద్య - ఈనాడు, నీతః - పొందించబడితినో.

పండితుడైనవాడు ఎవడు స్వర్గాధిపతి ఐశ్వర్యమునకైననూ ఆశపడును? (పండితుడెవ్వడూ ఆశపడడు). ఏలయనగా, ఈ సంపద దేవప్రభుడనగు నాకీనాడు అసురలక్షణమగు అహంకారమును కలిగించినది.

యే పారమేష్ఠ్యం ధిషణమధితిష్ఠన్ న కంచన ।
ప్రత్యుత్తిష్ఠేదితి బ్రూయుర్ధర్మం తే న పరం విదుః ।। 13

పారమేష్ఠ్యమ్ - చక్రవర్తికి చెందిన, ధిషణమ్ - ఆసనమును, అధితిష్ఠన్ - అధిష్ఠించి యున్నవాడు, కంచన - ఎవనినైననూ, న ప్రతి-ఉత్తిష్ఠేత్ - లేచి నిలబడి ఎదురేగనక్కర లేదు, ఇతి - అని, యే - ఎవరైతే, బ్రూయుః - చెప్పెదరో, తే - వారు, పరమ్ - సర్వోత్తమమగు, ధర్మమ్ - ధర్మమును, న విదుః - తెలియరు.

చక్రవర్తి స్థానములోనున్న వ్యక్తి ఎవరు వచ్చినా లేచి నిలబడి ఎదురేగనక్కర లేదని చెప్పే వారికి సర్వోత్తమమగు ధర్మము తెలియదు.

తేషాం కుపథదేష్టౄణాం పతతాం తమసి హ్యధః ।
యే శ్రద్దధ్యుర్వచస్తే వై మజ్జంత్యశ్మప్లవా ఇవ ॥ 14

కుపథదేష్టౄణామ్ - చెడు మార్గము నుపదేశించునట్టియు, అధః - క్రింద, తమసి - చీకటియందు, పతతామ్ - పడిపోవుచున్న, తేషామ్ - వారి, వచః - మాటను, యే - ఎవరైతే, శ్రద్దధ్యుః - శ్రద్ధ చూపెదరో, తే - వారు, వై - నిశ్చయముగా, అశ్మప్లవాః ఇవ - రాళ్ల పడవలు వలె, మజ్జంతి హి - మునిగి పోవుదురు.

ఆ విధముగా చెడు మార్గము నుపదేశించే వ్యక్తులు నరకములో అధఃపతితులగుదురు. వారి మాటయందు శ్రద్ధను చూపువారు రాళ్ల పడవలు వలె మునిగి పోయెదరు.

అథాహమమరాచార్యమగాధధిషణం ద్విజమ్ ।
ప్రసాదయిష్యే నిశఠశ్శీర్ష్ణా తచ్చరణం స్పృశన్ ॥ 15

అథ - కావున, అగాధధిషణమ్ - లోతైన జ్ఞానము కలిగినట్టియు, ద్విజమ్ - వేదవేత్తయగు, అమర-ఆచార్యమ్ - దేవగురువును, నిశఠః - మోసబుద్ధి లేనివాడనై, శీర్ష్ణా - శిరస్సుతో, తత్-చరణమ్ - ఆయన పాదమును, స్పృశన్ - స్పృశించువాడనై, ప్రసాదయిష్యే - ప్రసన్నునిగా చేసుకొనెదను.

దేవగురువగు బృహస్పతి అగాధమగు జ్ఞానము గల వేదవేత్త. కావున, నేను మోసబుద్ధి లేకుండా ఆయన పాదములకు తలను అన్చి, ఆయనను ప్రసన్నునిగా చేసుకొనెదను.

ఏవం చింతయతస్తస్య మఘోనో భగవాన్ గృహాత్ ।
బృహస్పతిర్గతోఽదృష్టాం గతిమధ్యాత్మమాయయా ॥ 16

తస్య - ఆ, మఘోనః - ఇంద్రుడు, ఏవమ్ - ఈ విధముగా, చింతయతః - ఆలోచించుచుండగా, భగవాన్ - పూజనీయుడగు, బృహస్పతిః - బృహస్పతి, అధి-ఆత్మమాయయా - గొప్పదియగు తన శక్తిచే,

అదృష్టామ్ - కానరాని, గతిమ్ - గతిని, గృహాత్ - ఇంటినుండి, గతః - పొందినవాడు.

ఇంద్రుడు ఈ విధముగా ఆలోచించుచుండగనే, పూజనీయుడగు బృహస్పతి తన గొప్ప యోగశక్తిచే ఇంటినుండి అంతర్ధానమాయెను.

గురోర్నాధిగతస్సంజ్ఞాం పరీక్షన్ భగవాన్ స్వరాట్ ।
ధ్యాయన్ ధియా సురైర్యుక్తశ్శర్మ నాలభతాత్మనః ।। 17

భగవాన్ - పూజనీయుడగు, స్వరాట్ - ఇంద్రుడు, పరీక్షన్ - అంతటా వెదుకుచున్ననూ, గురోః - గురువుయొక్క, సంజ్ఞామ్ - స్థితిని గురించి, న అధిగతః - తెలియలేదు, సురైః - దేవతలతో, యుక్తః - కూడినవాడై, ధియా - బుద్ధితో, ధ్యాయన్ - ఆలోచించువాడై, ఆత్మనః - మనస్సునకు, శర్మ - సుఖమును, న అలభత - పొందలేదు.

పూజనీయుడు, స్వర్గలోకాధిపతి అగు ఇంద్రుడు అంతటా వెదికెను. అయిననూ, బృహస్పతి జాడ తెలియలేదు. దేవతలతో గూడి స్వర్గముయొక్క క్షేమమును గురించి మంత్రాలోచన చేసిననూ ప్రయోజనము లేకపోవుటచే, ఇంద్రుని మనస్సునకు శాంతి కలుగలేదు.

తచ్ఛ్రుత్వైవాసురాస్సర్వ ఆశ్రిత్యౌశనసం మతమ్ ।
దేవాన్ ప్రత్యుద్యమం చక్రుర్దుర్మదా ఆతతాయినః ।। 18

దుర్మదాః - మిక్కిలి మదించియున్నవారు, ఆతతాయినః - శస్త్రములను పట్టినవారు అగు, అసురాః - రాక్షసులు, సర్వే - అందరు, తత్ - ఆ విషయమును, శ్రుత్వా - విని, ఔశనసమ్ - శుక్రాచార్యునకు చెందిన, మతమ్ - అభిప్రాయమును, ఆశ్రిత్య - ఆశ్రయించి, దేవాన్ ప్రతి - దేవతలనుద్దేశించి, ఉద్యమమ్ - ఉద్యమమును, చక్రుః - చేసిరి.

మిక్కిలి మదించియున్న ఆ రాక్షసులందరు ఆ సంగతిని విని, శుక్రాచార్యుని అభిప్రాయమును స్వీకరించి, శస్త్రములను ధరించి, దేవతలపై యుద్ధమునకు ఉద్యుక్తులైరి.

తైర్విసృష్టేషుభిస్తీక్ష్ణైర్నిర్భిన్నాంగోరుబాహవః ।
బ్రహ్మాణం శరణం జగ్ముస్సహేంద్రా నతకంధరాః ॥ 19

తైః - వారిచే, విసృష్ట-ఇషుభిః - విడిచిపెట్టబడిన బాణములచే, నిర్భిన్న-అంగ-ఊరుబాహవః - తెగగొట్టబడిన తలలు తొడలు చేతులు గలవారు, నతకంధరాః - వంచబడిన మెడలు గలవారు, సహ-ఇంద్రాః - ఇంద్రునితో గూడియున్నవారు, బ్రహ్మాణమ్ - బ్రహ్మగారిని, శరణమ్ - శరణును, జగ్ముః - పొందిరి.

రాక్షసులు ప్రయోగించిన బాణమలచే దేవతల తలలు, తొడలు, చేతులు తెగి పడుచుండెను. దేవతలు ఇంద్రునితో గూడి సిగ్గుతో తలలను వంచుకొని, బ్రహ్మగారిని శరణు వేడిరి.

తాంస్తథాऽభ్యర్దితాన్ వీక్ష్య భగవానాత్మభూరజః ।
కృపయా పరయా దేవ ఉవాచ పరిసాంత్వయన్ ॥ 20

భగవాన్ - పూజనీయుడు, ఆత్మభూః - స్వయంభువుడు, అజః - పుట్టుక లేనివాడు అగు, దేవః - బ్రహ్మదేవుడు, తథా - ఆ విధముగా, అభి-అర్దితాన్ - అధికముగా పీడించబడియున్న, తాన్ - వారిని, వీక్ష్య - చూచి, పరయా - గొప్ప, కృపయా - దయతో, పరిసాంత్వయన్ - ఓదార్చుచున్నవాడై, ఉవాచ - పలికెను.

పూజనీయుడు, స్వయంభువుడు, పుట్టుక లేనివాడు అగు బ్రహ్మదేవునకు, ఆ విధముగా పీడించబడియున్న దేవతలను చూచి, గొప్ప దయ కలిగెను. ఆయన వారిని ఓదారుస్తూ, ఇట్లు పలికెను.

బ్రహ్మోవాచ ।
అహో బత సురశ్రేష్ఠా హ్యభద్రం వః కృతం మహత్ ।
బ్రహ్మిష్ఠం బ్రాహ్మణం దాంతమైశ్వర్యాన్నాభ్యనందత ॥ 21

అహో - అయ్యో!, బత - కష్టము వచ్చినది!, సురశ్రేష్ఠాః - దేవ నాయకులారా!, వః - మీచే, మహత్ - పెద్ద, అభద్రమ్ - అమంగళము, కృతం హి - చేయబడినది సుమా!, బ్రహ్మిష్ఠమ్ - బ్రహ్మజ్ఞానియైనట్టియు,

దాంతమ్ - జితేంద్రియుడగు, బ్రాహ్మణమ్ - బ్రాహ్మణుని, ఐశ్వర్యాత్ - ఐశ్వర్యము వలన, న అభ్యనందత - సత్కరించలేదు.

బ్రహ్మగారు ఇట్లు పలికెను --- అయ్యో! కష్టము వచ్చినది! ఓ దేవనాయకులారా! మీరు పెద్ద అమంగళకరమగు పనిని చేసితిరి. బృహస్పతి బ్రహ్మజ్ఞాని, జితేంద్రియుడగు బ్రాహ్మణుడు. మీరు ఐశ్వర్యగర్వము వలన ఆయనను సత్కరించలేదు.

తస్యాయమనయస్యాసీత్పరేభ్యో వః పరాభవః ।
ప్రక్షీణేభ్యస్స్వవైరిభ్యస్సమృద్ధానాం చ యత్సురాః ॥ 22

సురాః - దేవతలారా!, తస్య - ఆ, అనయస్య - తప్పు పనికి, అయమ్ - ఇది, ఆసీత్ - కలిగినది, యత్ - ఏదనగా, సమృద్ధానాం చ - సమృద్ధిశాలురే అయిననూ, వః - మీకు, ప్రక్షీణేభ్యః - మిక్కిలి క్షీణించియున్నట్టియు, స్వవైరిభ్యః - మీ చేతనే ఓడించబడిన, పరేభ్యః - శత్రువుల వలన, పరాభవః - పరాభవమో.

ఓ దేవతలారా! మీరు చేసిన ఆ తప్పు పనికి ఇది ఫలితము. మీరు సమృద్ధిశాలురై యుండిరి. మీ శత్రువులు మీ చేతిలో ఓడి క్షీణించి యుండిరి. అయిననూ, వారు మిమ్ములను పరాభవించినారు.

మఘవన్ ద్విషతః పశ్య ప్రక్షీణాన్ గుర్వతిక్రమాత్ ।
సంప్రత్యుపచితాన్ భూయః కావ్యమారాధ్య భక్తితః ।
ఆదదీరన్ నిలయనం మమాపి భృగుదేవతాః ॥ 23

మఘవన్ - ఓ ఇంద్రా!, గురు-అతిక్రమాత్ - గురువును తిరస్కరించుట వలన, ప్రక్షీణాన్ - బాగా క్షీణించిపోయిన వారిని, భూయః - మరల, కావ్యమ్ - శుక్రాచార్యుని, భక్తితః - భక్తితో, ఆరాధ్య - ఆరాధించి, సంప్రతి - ఇప్పుడు, ఉపచితాన్ - బలమును పొందియున్న, ద్విషతః - శత్రువులను, పశ్య - చూడుము, భృగుదేవతాః - శుక్రుడే దైవముగా గల రాక్షసులు, మమ - నా, నిలయనం అపి - స్థానమును కూడ, ఆదదీరన్ - తీసుకొనిరి.

ఓ ఇంద్రా! చూడుము. నీ శత్రువులగు రాక్షసులు ఒకప్పుడు గురు వగు శుక్రాచార్యుని తిరస్కరించి బాగా క్షీణించి పోయిరి. కాని, వారు మరల శుక్రుని భక్తితో ఆరాధించి ఇప్పుడు బలమును పొందినారు. వారికి శుక్రాచార్యుడే దైవము. వారు నా లోకమును కూడ ఆక్రమించెదరు.

త్రివిష్టపం కిం గణయంత్యభేద్యమంత్రా భృగూణామనుశిక్షితార్థాః।
న విప్రగోవిందగవీశ్వరాణాం భవంత్యభద్రాణి నరేశ్వరాణామ్ ।।24

భృగూణామ్ - భృగువంశీయులయొక్క, అనుశిక్షిత-అర్థాః - శిక్ష ణనీయబడిన అర్థశాస్త్రము గలిగినవారు, అభేద్యమంత్రాః - భేదించ శక్యము కాని యుద్ధయోజన గల రాక్షసులు, త్రివిష్టపమ్ - స్వర్గమును, కిం గణయంతి - లెక్క పెట్టెదరా?, విప్రగోవిందగవీశ్వరాణామ్ - వేదవే త్తలు గోవిందుడు గోవులు ఆరాధ్య దైవములుగా గల, నర-ఈశ్వరాణామ్ - చక్రవర్తులకు, అభద్రాణి -అమంగళములు, న భవంతి - కలుగవు.

రాక్షసులు భృగువంశీయులవద్ద అర్థశాస్త్రమును నేర్చుకొనినారు. వారి యుద్ధనీతిని పసిగట్టుట సంభవము కాదు. వారు స్వర్గమును సరకు చేసెదరా? చేయరు. వేదవేత్తలు, గోవిందుడు, గోవులను దైవముగా ఆరా ధించే చక్రవర్తులకు అమంగళములు దరి జేరవు.

తద్విశ్వరూపం భజతాశు విప్రం
తపస్వినం త్వాష్ట్రమథాత్మవంతమ్ ।
సభాజితోऽర్థాన్ స విధాస్యతే వో
యది క్షమిష్యధ్వముతాస్య కర్మ ।। 25

**తత్** - అందువలన, విప్రమ్ - వేదవేత్తయైనట్టియు, తపస్వినమ్ - తపశ్శాలి యైనట్టియు, త్వాష్ట్రమ్ - త్వష్టయొక్క పుత్రుడైనట్టియు, ఆత్మ వంతమ్ - జితేంద్రియుడైన, విశ్వరూపమ్ - విశ్వరూపుని, ఆశు - వెంటనే, భజత - సేవించుడు, అథ - తరువాత, సభాజితః - సత్కరించబడిన, సః - ఆతడు, వః - మీకు, అర్థాన్ - ప్రయోజనములను, విధాస్యతే - సాధించ గలడు, అస్య - వీని, కర్మ - పనిని, యది ఉత క్షమిష్యధ్వమ్ - సహించగ లవారు కూడ అయినచో.

కావున, మీరు త్వష్టయొక్క పుత్రుడగు విశ్వరూపుని వెంటనే సేవించుడు. ఆయన తపశ్శాలి, జితేంద్రియుడు అగు వేదవేత్త. మీరు ఆయనను సత్కరించుట మాత్రమే గాక, తరువాత ఆయనయొక్క రాక్షసపక్షపాతముతో కూడిన వ్యవహారమును కూడ సహించ గల్గినచో, ఆయన మీ మనోరథములను సంపాదించి పెట్టగలడు.

శ్రీశుక ఉవాచ ।
త ఏవముదితా రాజన్ బ్రహ్మణా విగతజ్వరాః ।
ఋషిం త్వాష్ట్రముపవ్రజ్య పరిష్వజ్యేదమబ్రువన్ ।। 26

రాజన్ - మహారాజా!, బ్రహ్మణా - బ్రహ్మగారిచే, ఏవమ్ - ఈ విధముగా, ఉదితాః - చెప్పబడిన, తే - వారు, విగతజ్వరాః - తొలగిన సంతాపము గలవారై, త్వాష్ట్రమ్ - త్వష్టయొక్క పుత్రుడైనట్టియు, ఋషిమ్ - మహర్షియగు విశ్వరూపుని, ఉపవ్రజ్య - దగ్గరకు వెళ్లి, పరిష్వజ్య - కౌగిలించుకొని, ఇదమ్ - ఈ మాటను, అబ్రువన్ - పలికిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! బ్రహ్మగారు ఈ విధముగా చెప్పగనే వారి సంతాపము తొలగిపోయెను. వారు త్వష్టయొక్క పుత్రుడగు విశ్వరూప మహర్షి వద్దకు వెళ్లి, ఆయనను కౌగిలించుకొని, ఇట్లు పలికిరి.

దేవా ఊచుః ।
వయం తేఽతిథయః ప్రాప్తా ఆశ్రమం భద్రమస్తు తే ।
కామస్సంపాద్యతాం తాత పితౄణాం సమయోచితః ।। 27

తాత - వత్సా!, వయమ్ - మేము, తే - నీ, ఆశ్రమమ్ - ఆశ్రమమును, అతిథయః - అతిథులమై, ప్రాప్తాః - వచ్చినవారము, తే - నీ కొరకు, భద్రమ్ - మంగళము, అస్తు - అగుగాక!, పితౄణామ్ - తండ్రులమగు మాయొక్క, సమయ-ఉచితః - కాలమునకు తగియున్న, కామః - కోరిక, సంపాద్యతామ్ - సంపాదించ బడుగాక!

దేవతలిట్లు పలికిరి --- వత్సా! మేము నీ ఆశ్రమమునకు అతిథులమై వచ్చితిమి. నీకు మంగళమగు గాక! మేము నీకు తండ్రుల వంటి వారము. మాకీ సమయములో ఒక కోరిక గలదు. దానిని నీవు నెరవేర్చుము.

పుత్రాణాం హి పరో ధర్మః పితృశుశ్రూషణం సతామ్ ।
అపి పుత్రవతాం బ్రహ్మన్ కిముత బ్రహ్మచారిణామ్ ।। 28

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, పుత్రవతాం సతాం అపి - పుత్రులు గల వారే అయిననూ, పుత్రాణామ్ - పుత్రులకు, పితృశుశ్రూషణమ్ - తల్లిదండ్రులను సేవించుట, పరః - గొప్ప, ధర్మః హి - ధర్మము గదా!, బ్రహ్మచారిణాం ఉత - బ్రహ్మచారులకైతే, కిమ్ - చెప్పునదేమున్నది?

మానవులు తమకు భార్య పిల్లలు ఉన్ననూ, తమ తల్లిదండ్రులను సేవించవలెను. ఇది గొప్ప ధర్మము. ఇక బ్రహ్మచారులు తల్లిదండ్రులను సేవించుట ధర్మమని వేరుగా చెప్పవలయునా?

ఆచార్యో బ్రహ్మణో మూర్తిః పితా మూర్తిః ప్రజాపతేః ।
భ్రాతా మరుత్పతేర్మూర్తిర్మాతా సాక్షాత్ క్షితేస్తనుః ।। 29

ఆచార్యః - గురువు, బ్రహ్మణః - వేదముయొక్క, మూర్తిః - మూర్తి, పితా - తండ్రి, ప్రజాపతేః - బ్రహ్మగారి, మూర్తిః - మూర్తి, భ్రాతా - అన్నగారు, మరుత్-పతేః - మరుద్గణములకు ప్రభువగు ఇంద్రుని, మూర్తిః - మూర్తి, మాతా - తల్లి, సాక్షాత్ - సాక్షాత్తుగా, క్షితేః - భూదేవి యొక్క, తనుః - మూర్తి.

మూర్తీభవించిన వేదమే గురువు. తండ్రి బ్రహ్మగారి మూర్తి. అన్నగారు ఇంద్రుని మూర్తి. తల్లి సాక్షాత్తుగా తనువు దాల్చిన భూదేవియే.

దయాయా భగినీ మూర్తిర్ధర్మస్యాత్మాऽతిథిస్స్వయమ్ ।
అగ్నేరభ్యాగతో మూర్తిస్సర్వభూతాని చాత్మనః ।। 30

భగినీ - సోదరి, దయాయాః - దయయొక్క, మూర్తిః - మూర్తి, అతిథిః - అతిథి, స్వయమ్ - స్వయముగా, ధర్మస్య - ధర్మముయొక్క,

ఆత్మా - మూర్తి, అభ్యాగతః - అభ్యాగతుడు, అగ్నేః - అగ్నియొక్క, మూర్తిః - మూర్తి, సర్వభూతాని చ - సకలప్రాణులు కూడ, ఆత్మనః - ఆత్మయొక్క.

సోదరి దయామూర్తి. అతిథి (పరిచయము లేనివాడు) స్వయముగా మూర్తి గట్టిన ధర్మదేవతయే. అభ్యాగతుడు (పరిచయము గలవాడు) అగ్నిదేవుని మూర్తి. సకలప్రాణులు ఆత్మస్వరూపులే.

తస్మాత్పిత్రూణామార్తానామార్తిం పరపరాభవమ్ ।
తపసాऽపనయంస్తాత సందేశం కర్తుమర్హసి ॥ 31

తాత - వత్సా!, తస్మాత్ - అందువలన, ఆర్తానామ్ - దుఃఖితులై యున్న, పిత్రూణామ్ - తండ్రులయొక్క, పరపరాభవమ్ - శత్రువులచే పరాభవమనే, ఆర్తిమ్ - దుఃఖమును, తపసా - తపస్సుచే, అపనయన్ - పోగొట్టువాడవై, సందేశమ్ - ఆదేశమును, కర్తుమ్ - చేయుటకు, అర్హసి - తగుదువు.

ఓ వత్సా! మేము శత్రువులచే పరాభవించబడి దుఃఖించుచున్నాము. మా దుఃఖమును నీవు నీ తపస్సుచే తొలగించుము. మా ఆదేశమును పాలించుట నీకు సముచితముగా నుండును.

వృణీమహే త్వోపాధ్యాయం బ్రహ్మిష్ఠం బ్రాహ్మణం గురుమ్।
యథాంజసా విజేష్యామస్సపత్నాంస్తవ తేజసా ॥ 32

బ్రహ్మిష్ఠమ్ - బ్రహ్మజ్ఞానివైనట్టియు, బ్రాహ్మణమ్ - వేదవేత్తవైనట్టియు, గురుమ్ - గురువైన, త్వా - నిన్ను, ఉపాధ్యాయమ్ - ఆచార్యునిగా, వృణీమహే - వరించుచున్నాము, యథా - ఏ విధముగానైతే, తవ - నీ, తేజసా - తేజస్సుచే, సపత్నాన్ - శత్రువులను, అంజసా - తేలికగా, విజేష్యామః - జయించగలమో.

నీవు బ్రహ్మజ్ఞానివి, వేదవేత్తవు, గురుడవు. నీ తేజస్సుచే మేము శత్రువులను తేలికగా జయించగలము. కావున, మేము నిన్ను ఆచార్యునిగా వరించుచున్నాము.

న గర్హయంతి హ్యర్థేషు యవిష్ఠాంఘ్ర్యభివాదనమ్ ।
ఛందోభ్యోऽన్యత్ర న బ్రహ్మన్ వయో జ్యైష్ఠ్యస్య కారణమ్।33

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, అర్థేషు - ప్రయోజనముల విషయమునందు, యవిష్ఠ-అంఘ్రి-అభివాదనమ్ - పిన్నవాని పాదములకు నమస్కరించుటను, న గర్హయంతి - నిందించుట లేదు, ఛందోభ్యః అన్యత్ర - వేదములను మినహాయించి, వయః - వయస్సు, జ్యైష్ఠ్యస్య - పెద్దరికమునకు, కారణమ్ - హేతువు, న - కాదు.

ఓ మహర్షీ! యోగ్యమగు ప్రయోజనము ఉన్నప్పుడు, చిన్నవాని పాదములకు నమస్కరించుటను పెద్దలు తప్పు పట్టరు. వేదజ్ఞానమును బట్టి పెద్దరికమును నిర్ణయించవలెనే గాని, కేవలము వయస్సును బట్టి నిర్ణయించుట సరిగాదు.

ఋషిరువాచ ।
అభ్యర్థితస్సురగణైః పౌరోహిత్యే మహాతపాః।
స విశ్వరూపస్తానాహ ప్రసన్నః శ్లక్ష్ణయా గిరా ॥ 34

మహాతపాః - గొప్ప తపస్సు గల, సః - ఆ, విశ్వరూపః - విశ్వరూపుడు, సురగణైః - దేవగణములచే, పౌరోహిత్యే - పురోహిత కార్యమునందు, అభ్యర్థితః - కోరబడినవాడై, ప్రసన్నః - ప్రసన్నుడై, శ్లక్ష్ణయా - మృదువైన, గిరా - వాక్కుతో, తాన్ - వారినుద్దేశించి, ఆహ - పలికెను.

శ్రీ శుకమహర్షి ఇట్లు పలికెను --- దేవగణములు ఇట్లు తమకు పురోహితుడవు కమ్మని కోరగా, గొప్ప తపశ్శాలియగు ఆ విశ్వరూపుడు ప్రసన్నుడై, మృదుమధురమగు వాక్కుతో వారితో నిట్లనెను.

విశ్వరూప ఉవాచ ।
విగర్హితం ధర్మశీలైర్బ్రహ్మవర్చఉపవ్యయమ్ ।
కథం ను మద్విధో నాథా లోకేశైరభియాచితమ్ ।
ప్రత్యాఖ్యాస్యతి తచ్ఛిష్యస్స ఏవ స్వార్థ ఉచ్యతే ॥ 35

నాథాః - ఓ తండ్రులారా!, ధర్మశీలైః - ధర్మస్వభావము గలవారి చే, విగర్హితమ్ - అధికముగా నిందించబడినట్టియు, బ్రహ్మవర్చః-ఉపవ్య యమ్ - బ్రహ్మవర్చస్సును క్షీణింప జేయునట్టియు, లోక-ఈశైః - లోకపా లకులచే, అభియాచితమ్ - కోరబడిన దానిని, తత్-శిష్యః - వారి శిష్యుడ గు, మద్-విధః - నావంటి వాడు, కథమ్ - ఏ విధముగా, ప్రత్యాఖ్యాస్యతి - తిరస్కరించ గలడు?, సః ఏవ - అదియే, స్వ-అర్థః - తన ప్రయోజనమ ని, ఉచ్యతే - చెప్పబడుచున్నది.

విశ్వరూపుడిట్లు పలికెను --- ఓ తండ్రులారా! పౌరోహిత్యమును ధర్మాత్ములు విశేషముగా నిందించినారు. అది బ్రహ్మవర్చస్సును క్షీణింప జేయును. అయిననూ, లోకపాలకులగు మీరు నన్ను కోరుచున్నారు. మీ శిష్యుడగు నావంటి వాడు మీ కోరికను ఎట్లు తిరస్కరించ గలడు? మీ కోరికను నెరవేర్చుటయే నాకు పురుషార్థమగునని నేను చెప్పుచున్నాను.

అకించనానాం హి ధనం శిలోంఛనం
తేనేహ నిర్వర్తితసాధుసత్క్రియః ।
కథం విగర్హ్యం ను కరోమ్యధీశ్వరాః
పౌరోధసం హృష్యతి యేన దుర్మతిః ॥ 36

అధి-ఈశ్వరాః - ఓ గొప్ప ప్రభువులారా!, అకించనానామ్ - దరి ద్రులకు, శిల-ఉంఛనం హి - కోత కోసిన మళ్లలోని వెన్నులనేరుకొనుట బియ్యపు మర దగ్గర గాని పొలములలో గాని పడిన గింజలనేరుకొను టయే, ధనమ్ - సంపద, తేన - దానిచే, ఇహ - ఈ లోకమునందు, నిర్వ ర్తితసాధుసత్-క్రియః - నిర్వహించబడిన సత్పురుషుల సత్కార్యములు గల నేను, విగర్హ్యమ్ - విశేషముగా నిందించదగిన, పౌరోధసమ్ - పౌరో హిత్యమును, కథం ను - ఏ విధముగా, కరోమి - చేయుదును?, యేన - దేనిచే, దుర్మతిః - దుర్బుద్ధి, హృష్యతి - హర్షించునో.

ఓ గొప్ప ప్రభువులారా! దరిద్రులు కోత కోసిన మళ్లలోని వెన్ను లను త్రెంపుకొని గాని, బియ్యపు మరల వద్ద మరియు పొలములలో పడిన గింజలను ఏరుకొని గాని జీవనయాత్రను సాగించవచ్చును. నేను ఆ విధ

ముగా ఈ లోకములో సత్పురుషులు చేసే సత్కార్యములను (దేవయజ్ఞా దులను) చేసుకొనుచునే యున్నాను. పౌరోహిత్యము మాత్రము చాల నిందించ దగిన బ్రదుకు దెరువు. కేవలము దుర్బుద్ధియగు జనుడు మాత్రమే దానిలో హర్షించును. అట్టి వృత్తిని నేనెట్లు చేయగలను?

తథాపి న ప్రతిబ్రూయాం గురుభిః ప్రార్థితం కియత్ ।
భవతాం ప్రార్థితం సర్వం ప్రాణైరర్థైశ్చ సాధయే ॥ 37

తథాపి - అయినప్పటికీ, న ప్రతిబ్రూయామ్ - తిరస్కరించను, గురుభిః - తండ్రులగు మీచే, ప్రార్థితమ్ - కోరబడినది, కియత్ - అల్ప ము. భవతామ్ - మీ, ప్రార్థితమ్ - కోరబడినదానిని, సర్వమ్ - అంతనూ, ప్రాణైః - ప్రాణములచే, అర్థైః చ - తపస్సు మొదలగు సంపదలచే కూడ, సాధయే - సంపాదించెదను.

అయిననూ, మీ కోరికను నేను తిరస్కరించుట లేదు. మీరు కోరి నది అల్పమే. మీరు కోరినదానిని నేను పూర్తిగా నా ప్రాణములనొడ్డి, నా తపస్సు ఖర్చు చేసి అయినా, సాధించి పెట్టెదను.

శ్రీశుక ఉవాచ ।
తేభ్య ఏవం ప్రతిశ్రుత్య విశ్వరూపో మహాతపాః ।
పౌరోహిత్యం వృతశ్చక్రే పరమేణ సమాధినా ॥ 38

మహాతపాః - గొప్ప తపశ్శాలియగు, విశ్వరూపః - విశ్వరూపు డు, తేభ్యః - వారి కొరకు, ఏవమ్ - ఈ విధముగా, ప్రతిశ్రుత్య - ప్రతిజ్ఞ చేసి, వృతః - వరించబడినవాడై, పౌరోహిత్యమ్ - పౌరోహిత్యమును, పర మేణ - గొప్ప, సమాధినా - ఏకాగ్రతతో, చక్రే - చేసెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- గొప్ప తపశ్శాలియగు విశ్వ రూపుని వారీ విధముగా పురోహితునిగా వరించిరి. అపుడాయన ఈ విధ ముగా ప్రతిజ్ఞ చేసి, గొప్ప ఏకాగ్రతతో పౌరోహిత్యమును నిర్వర్తించెను.

సురద్విషాం శ్రియం గుప్తామౌశనస్యాపి విద్యయా ।
ఆచ్ఛిద్యాదాన్మహేంద్రాయ వైష్ణవ్యా విద్యయా విభుః ॥ 39

విభుః - సమర్థుడగు విశ్వరూపుడు, ఔశనస్యా - శుక్రాచార్యునకు చెందిన, విద్యయా - నీతిచే, గుప్తామ్ - దాచబడిన, సురద్విషామ్ - దేవవిద్వేషులగు రాక్షసులయొక్క, శ్రియం అపి - సంపదను కూడ, వైష్ణవ్యా - విష్ణువునకు చెందిన, విద్యయా - ఉపాసనచే, అచ్ఛిద్య - తీసుకువచ్చి, మహేంద్రాయ - మహేంద్రుని కొరకు, అదాత్ - ఇచ్చెను.

శుక్రాచార్యుడు తన నీతిబలముతో సురవిద్వేషులగు రాక్షసుల సంపదను దాచిపెట్టెను. సర్వసమర్థుడగు విశ్వరూపుడు నారాయణ కవచమనే వైష్ణవోపాసనయొక్క బలముచే దానిని తీసుకువచ్చి, మహేంద్రునకు ఇచ్చెను.

యయా గుప్తస్సహస్రాక్షో జిగ్యేऽసురచమూర్విభుః ।
తాం ప్రాహ స మహేంద్రాయ విశ్వరూప ఉదారధీః ॥ 40

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే బృహస్పతినా
దేవత్యాగో నామ సప్తమోऽధ్యాయః ॥

ఉదారధీః - ఉదారమగు బుద్ధిగల, సః - ఆ, విశ్వరూపః - విశ్వరూపుడు, తామ్ - ఆ విద్యను, మహేంద్రాయ - మహేంద్రుని కొరకు, ప్రాహ - చెప్పెను, యయా - దేనిచే, గుప్తః - రక్షించబడిన, విభుః - సమర్థుడగు, సహస్ర-అక్షః - వేయి కన్నుల ఇంద్రుడు, అసురచమూః - రాక్షస సైన్యములను, జిగ్యే - జయించెనో.

ఉదారమగు శీలము గల ఆ విశ్వరూపుడు ఆ విద్యను మహేంద్రునకు బోధించెను. ఆ విద్యచే రక్షించబడి సామర్థ్యమును పొందిన వేయి కన్నుల వేల్పు రాక్షససైన్యములను జయించెను.

**శ్రీమద్భాగవత మహాపురాణమునందలి ఆరవ స్కంధములో ఇంద్రునిచే
అవమానించబడి బృహస్పతి దేవతలను విడిచిపెట్టుటను
వర్ణించే ఏడవ అధ్యాయము ముగిసినది (7).**

*****

# అథ అష్టమోఽధ్యాయః

## నారాయణ కవచము

రాజోవాచ ।
యయా గుప్తస్సహస్రాక్షస్సవాహాన్ రిపుసైనికాన్ ।
క్రీడన్నివ వినిర్జిత్య త్రిలోక్యా బుభుజే శ్రియమ్ ॥ 1

భగవంస్తన్మమాఖ్యాహి వర్మ నారాయణాత్మకమ్ ।
యథాఽఽతతాయినశ్శత్రూన్ యేన గుప్తోఽజయన్మృధే ॥ 2

భగవన్ - ఓ పూజనీయా!, యయా - ఏ విద్యచే, గుప్తః - రక్షించబడిన, సహస్ర-అక్షః - వేయి కన్నుల ఇంద్రుడు, సవాహాన్ - వాహనములతో కూడియున్న, రిపుసైనికాన్ - శత్రుసైనికులను, క్రీడన్ ఇవ - ఆట ఆడుచున్నవాడు వలె, వినిర్జిత్య - జయించి, త్రిలోక్యాః - ముల్లోకముల, శ్రియమ్ - సంపదను, బుభుజే - భోగించెనో, తత్ - ఆ, నారాయణ-ఆత్మకమ్ - నారాయణరూపమైన, వర్మ - కవచమును, మమ - నాకు, ఆఖ్యాహి - చెప్పుము, యేన - దేనిచే, గుప్తః - రక్షించబడిన ఇంద్రుడు, మృధే - యుద్ధమునందు, ఆతతాయినః - శస్త్రధారులగు, శత్రూన్ - శత్రువులను, యథా - ఏ విధముగా, అజయత్ - జయించెనో.

పరీక్షిన్మహారాజు ఇట్లు ప్రశ్నించెను --- ఓ పూజనీయా! నారాయణుని రూపమే అయి ఉన్న కవచవిద్యచే రక్షించబడిన వేయి కన్నుల ఇంద్రుడు శత్రుసైనికులను వారి వాహనములతో బాటుగా జయించి ముల్లోకముల సంపదననుభవించెను. ఆ కవచమును నాకు చెప్పుడు. ఆ కవచము రక్షించుచుండగా, ఇంద్రుడు యుద్ధమునందు శస్త్రధారులగు శత్రువులను నిర్జించిన విధమును కూడ చెప్పుడు.

శ్రీశుక ఉవాచ ।
వృతః పురోహితస్త్వాష్ట్రో మహేంద్రాయానుపృచ్ఛతే ।
నారాయణాఖ్యం వర్మాహ తదిహైకమనాశ్శృణు ॥ 3

పురోహితః - పురోహితుడుగా, వృతః - వరించబడిన, త్వాష్ట్రః - త్వష్ట పుత్రుడగు విశ్వరూపుడు, అనుపృచ్ఛతే - తరువాత అడిగిన, మహేంద్రాయ - మహేంద్రుని కొరకు, నారాయణ-ఆఖ్యమ్ - నారాయణ అనే పేరు గల, వర్మ - కవచమును, ఆహ - చెప్పెను, తత్ - దానిని, ఇహ - ఇప్పుడు, ఏకమనాః - ఏకాగ్రమగు మనస్సు గలవాడవై, శృణు - వినుము.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- దేవతలు త్వష్టయొక్క పుత్రుడగు విశ్వరూపుని పురోహితునిగా వరించిన తరువాత, ఇంద్రుడు అడుగగా ఆయన నారాయణ కవచమును చెప్పెను. దానిని నీవు ఇప్పుడు ఏకాగ్రమగు మనస్సుతో వినుము.

విశ్వరూప ఉవాచ ।
ధౌతాంఘ్రిపాణిరాచమ్య సపవిత్ర ఉదఙ్ముఖః ।
కృతస్వాంగకరన్యాసో మంత్రాభ్యాం వాగ్యతశ్శుచిః ॥ 4

నారాయణమయం వర్మ సన్నహ్యేద్భయ ఆగతే ।
పాదయోర్జానునోరూర్వోరుదరే హృద్యథోరసి ॥ 5

ముఖే శిరస్యానుపూర్వ్యాదోంకారాదీని విన్యసేత్ ।
ఓం నమో నారాయణాయేతి విపర్యయమథాపి వా ॥ 6

ధౌత-అంఘ్రిపాణిః - కడుగుకొనబడిన కాళ్లు చేతులు గలవాడు, సపవిత్రః - దర్భలతో చేసిన పవిత్రము గలవాడు, ఉదక్-ముఖః - ఉత్తర ముఖముగా కూర్చున్నవాడు, ఆచమ్య - ఆచమనమును చేసి, మంత్రాభ్యామ్ - రెండు మంత్రములతో, కృతస్వ-అంగకరన్యాసః - చేయబడిన తన అవయవములయందు చేతులయందు న్యాసము (ఈశ్వరుని స్థాపించుట) గలవాడు, వాగ్యతః - మౌనముగా నున్నవాడు, శుచిః - పవిత్రమగు

హృదయము గలవాడు, భయే - భయము, ఆగతే - రాగా, నారాయణ మయమ్ - నారాయణరూపమైన, వర్మ - కవచమును, సన్నహ్యేత్ - బంధించవలెను, పాదయోః - పాదములయందు, జానునోః - మోకాళ్ల యందు, ఊర్వోః - తొడలయందు, ఉదరే - ఉదరమునందు, హృది - హృదయమునందు, అథ - తరువాత, ఉరసి - వక్షఃస్థలమునందు, ముఖే - నోటియందు, శిరసి - తలయందు, అనుపూర్వ్యాత్ - క్రమముగా, ఓం నమో నారాయణాయ (నారాయణుని కొరకు నమస్కారము), ఇతి - అని, ఓంకార-ఆదీని - ఓంకారము మొదట గల అక్షరములను, విపర్యయం అథాపి వా - తల్లక్రిందులుగా నైననూ, విన్యసేత్ - న్యాసము చేయవలెను.

సాధకుడు భయము వచ్చినప్పుడు నారాయణ కవచమును ఈ విధముగా కట్టుకొనవలెను. కాళ్లు చేతులు కడుగుకొని, దర్భపవిత్రమును ధరించి, ఉత్తరముఖముగా కూర్చుండి, ఆచమనము చేసి, మౌనముగా పవిత్రమగు హృదయముతో తన అవయవములయందు చేతులయందు, ఓం నమో నారాయణాయ మరియు ఓం నమో భగవతే వాసుదేవాయ (వాసుదేవ భగవానుని కొరకు నమస్కారము) అనే రెండు మంత్రములతో న్యాసమును చేయవలెను. ముందుగా ఓం నమో నారాయణాయ అనే మంత్రముయొక్క ఎనిమిది అక్షరములను ఓంకారమునకు జేర్చి, క్రమముగా పాదములు, మోకాళ్లు, తొడలు, ఉదరము, హృదయము, వక్షఃస్థలము, నోరు, తలలయందు న్యాసము చేయవలెను. లేదా, దీనికి విపరీత క్రమములో మంత్రములోని అక్షరములను వెనుకనుండి ఆరంభించి, తలతో ఆరంభించి న్యాసము చేయవలెను.

కరన్యాసం తతః కుర్యాద్ద్వాదశాక్షరవిద్యయా ।
ప్రణవాదియకారాంతమంగుల్యంగుష్ఠపర్వసు ॥ 7

**తతః** - తరువాత, ద్వాదశ-అక్షరవిద్యయా - పన్నెండు అక్షరముల మంత్రముతో, ప్రణవ-ఆదియకార-అంతమ్ - ఓం తో మొదలిడి యకారముతో అంతమగునట్లుగా, అంగులీ-అంగుష్ఠపర్వసు - వ్రేళ్ల యందు బొటనవ్రేళ్ల కణుపులయందు, కరన్యాసమ్ - కరన్యాసమును, కుర్యాత్ - చేయవలెను.

తరువాత, ఓం నమో భగవతే వాసుదేవాయ అనే పన్నెండు అక్షరముల మంత్రముతో ఓం తో మొదలిడి యకారము వరకు ఒక్కొక్క అక్షరమును ఓంకారమునకు జోడించి, రెండు చేతుల ఎనిమిది వ్రేళ్లయందు (బొటనవ్రేళ్లను మినహాయించి), రెండు బొటనవ్రేళ్లయొక్క నాలుగు కణుపులయందు, వెరసి పన్నెండు స్థానములలో కరన్యాసమును చేయవలెను.

న్యసేద్ధృదయ ఓంకారం వికారమను మూర్ధని ।
షకారం తు భ్రువోర్మధ్యే ణకారం శిఖయా దిశేత్ ॥ 8

హృదయే - హృదయమునందు, ఓంకారమ్ - ఓంకారమును, న్యసేత్ - ఉంచవలెను, అను - తరువాత, వికారమ్ - వి అనే అక్షరమును, మూర్ధని - తలపై, షకారం తు - షకారమునైతే, భ్రువోః - కనుబొమల, మధ్యే - మధ్యయందు, ణకారమ్ - ణకారమును, శిఖయా - పిలకతో, దిశేత్ - నిర్దేశించవలెను.

ఓం విష్ణవే నమః (విష్ణువు కొరకు నమస్కారము) అనే మంత్రముయొక్క ఓంకారమును హృదయమునందు, వి-కారమును తలపై, షకారమును కనుబొమల మధ్య, ణకారమును పిలకపై న్యాసము చేయవలెను.

వేకారం నేత్రయోర్యుంజ్యాన్నకారం సర్వసంధిషు ।
మకారమస్త్రముద్దిశ్య మంత్రమూర్తిర్భవేద్బుధః ॥ 9

సవిసర్గం ఫడంతం తత్సర్వదిక్షు వినిర్దిశేత్ ।
ఓం విష్ణవే నమ ఇతి ॥ 10

వేకారమ్ - వేకారమును, నేత్రయోః - రెండు కళ్లయందు, నకారమ్ - నకారమును, సర్వసంధిషు - అన్ని కీళ్లయందు, యుంజ్యాత్ - కలుపవలెను, సవిసర్గమ్ - విసర్గతో కూడినట్టియు, ఫట్-అంతమ్ - ఫట్ అంతమునందు గల, మకారమ్ - మకారరూపమైన, అస్త్రమ్ - అస్త్రమును, ఉద్దిశ్య - భావన చేసి, బుధః - వివేకి, ఓం విష్ణవే నమః, ఇతి - అని, మంత్రమూర్తిః - మంత్రరూపుడు, భవేత్ - కావలెను, సర్వదిక్షు - దిక్కులన్నింటియందు, వినిర్దిశేత్ - విశేషముగా నిర్దేశించవలెను.

వేకారమును రెండు కళ్లయందు, నకారమును అన్ని కీళ్లయందు న్యాసము చేయవలెను. ఓం మః అస్త్రాయ ఫట్ అని చెప్పి దిగ్బంధమును చేయవలెను. ఈ విధముగా వివేకియగు సాధకుడు ఓం విష్ణవే నమః అనే మంత్రము రూపముగా గలవాడు అగును.

ఆత్మానం పరమం ధ్యాయేద్ధ్యేయం షట్శక్తిభిర్యుతమ్ ।
విద్యాతేజస్తపోమూర్తిమిమం మంత్రముదాహరేత్ ।। 11

పరమమ్ - ప్రకృతికి అతీతుడైనట్టియు, షట్-శక్తిభిః - ఆరు శక్తుల తో, యుతమ్ - కూడియున్నట్టియు, ధ్యేయమ్ - ధ్యానము చేయదగిన ఈశ్వరుని, ఆత్మానమ్ - ఆత్మరూపముగా, ధ్యాయేత్ - ధ్యానించవలెను, విద్యాతేజః-తపః-మూర్తిమ్ - జ్ఞానము తేజస్సు తపస్సులే స్వరూపముగా గలిగిన, ఇమమ్ - ఈ, మంత్రమ్ - మంత్రమును, ఉదాహరేత్ - జపించవలెను.

ప్రకృతికి అతీతుడగు నారాయణుడు ధ్యానము చేయుదగినవాడు. ఐశ్వర్యము, వీర్యము, యశస్సు, శ్రీ, జ్ఞానము, వైరాగ్యము అనే ఆరు శక్తులను నిండా కలిగియున్న నారాయణుని ఆత్మరూపముగా ధ్యానించవలెను. జ్ఞానము, తేజస్సు, తపస్సులు మూర్తీభవించిన ఈ క్రింది (నారాయణ కవచ) మంత్రమును జపించవలెను.

ఓం హరిర్విదధ్యాన్మమ సర్వరక్షాం
న్యస్తాంఘ్రిపద్మః పతగేంద్రపృష్ఠే ।
దరారిచర్మాసిగదేషుచాప-
పాశాన్ దధానోఽష్టగుణోఽష్టబాహుః ।। 12

ఓమ్, పతగ-ఇంద్రపృష్ఠే - పక్షిరాజు వీపుపై, న్యస్త-అంఘ్రిపద్మః - ఉంచబడిన పద్మములవంటి పాదములు గలవాడు, దర-అరిచర్మ-అసిగదా-ఇషుచాపపాశాన్ - శంఖము చక్రము డాలు కత్తి గద బాణము ధనుస్సు పాశములను, దధానః - ధరించి యున్నవాడు, అష్టగుణః - అష్టైశ్వర్యములు గలవాడు, అష్టబాహుః - ఎనిమిది చేతులు గలవాడు అగు

శ్రీహరి, మమ - నాకు, సర్వరక్షామ్ - సర్వదేశకాలములయందు రక్షణను, విదధ్యాత్ - చేయుగాక!

శంఖము, చక్రము, డాలు, కత్తి, గద, బాణము, ధనుస్సు, పాశము లను ఎనిమిది బాహువులలో ధరించి, పక్షిరాజగు గరుడుని వీపుపై పద్మ ములవంటి పాదములనుంచిన శ్రీహరిని ఎనిమిది ఐశ్వర్యములు (అణిమ - సూక్ష్మరూపమును పొందుట, లఘిమ - తేలికగా నగుట, ప్రాప్తి - దేని నైనా పొందగల్గుట, ప్రాకామ్యము - ఎదురులేని ఇచ్ఛాశక్తి, మహిమ - పెద్దగా అగుట, ఈశిత్వము - సర్వమును శాసించుట, వశిత్వము - సర్వ మును తన వశములో నుంచుకొనుట, కామావసాయిత - కోరికలకు అతీ తుడుగా నుండుట) సేవించుచున్నవి. ఓంకారస్వరూపుడగు ఆయన నాకు సర్వదేశకాలములయందు రక్షణను కలిగించు గాక!

జలేషు మాం రక్షతు మత్స్యమూర్తిః
యాదోగణేభ్యో వరుణస్య పాశాత్ ।
స్థలేషు మాయావటువామనోఽవ్యాత్
త్రివిక్రమః ఖేఽవతు విశ్వరూపః ॥ 13

మత్స్యమూర్తిః - మత్స్యమై అవతరించిన శ్రీహరి, మామ్ - నన్ను, జలేషు - నీళ్లయందు, వరుణస్య - వరుణుని, పాశాత్ - పాశమైన, యాదోగణేభ్యః - జలజంతువుల గణములనుండి, రక్షతు - రక్షించుగాక!, మాయావటువామనః - మాయచే బ్రహ్మచారియై వామనుడైనవాడు, త్రివి క్రమః - మూడు పెద్ద అడుగులు వేసినవాడు, స్థలేషు - స్థానములయం దు, అవ్యాత్ - రక్షించు గాక!, విశ్వరూపః - జగత్తు రూపముగా ప్రకటమైన శ్రీహరి, ఖే - ఆకాశమునందు, అవతు - రక్షించుగాక!

మత్స్యమై అవతరించిన శ్రీహరి నన్ను నీళ్లలో వరుణుని పాశ మగు జలజంతువుల గణములనుండి రక్షించు గాక! మాయచే పొట్టి బ్రహ్మచారి రూపమును దాల్చి మూడు అడుగులతో జగత్తును కొలిచిన వామనమూర్తి నన్ను నేలపై రక్షించు గాక! ఈ జగద్రూపముగా ప్రకటమై యున్న శ్రీహరి నన్ను ఆకాశములో రక్షించు గాక!

దుర్గేష్వటవ్యాజిముఖాదిషు ప్రభుః
పాయాన్నృసింహోఽసురయూథపారిః ।
విముంచతో యస్య మహాఽట్టహాసం
దిశో వినేదుర్న్యపతంశ్చ గర్భాః ।। 14

అటవీ-ఆజిముఖ-ఆదిషు - అడవి రణరంగము మొదలగు, దుర్గేషు - సంకటస్థానములయందు, అసురయూథప-అరిః - రాక్షససేనా నాయకులకు శత్రువగు, నృసింహః ప్రభుః - నృసింహ ప్రభుడు, పాయాత్ - రక్షించు గాక!, యస్య - ఎవడైతే, మహా-అట్టహాసమ్ - పెద్ద అట్టహాసమును, విముంచతః - విడిచి పెట్టుచుండగా, దిశః - దిక్కులు, వినేదుః - ప్రతిధ్వనించినవో, గర్భాః చ - గర్భములు కూడ, న్యపతన్ - జారినవో.

అడవి, రణరంగము మొదలగు సంకటస్థానములలో రాక్షససేనా నాయకులకు శత్రువగు నృసింహ ప్రభుడు రక్షించుగాక! ఆయన పెద్ద అట్టహాసనమును చేయగా, దిక్కులు ప్రతిధ్వనించి గర్భములు జారిపోయినవి.

రక్షత్వసౌ మాఽధ్వని యజ్ఞకల్పః
స్వదంష్ట్రయోన్నీతధరో వరాహః ।
రామోఽద్రికూటేష్వథ విప్రవాసే
సలక్ష్మణోఽవ్యాద్భరతాగ్రజోఽస్మాన్ ।। 15

యజ్ఞకల్పః - యజ్ఞములచే నిర్దేశించబడువాడు, స్వదంష్ట్రయా - తన కోరచే, ఉన్నీతధరః - పైకి తీసుకురాబడిన భూమి గలవాడు అగు, వరాహః - వరాహమూర్తి, మా - నన్ను, అధ్వని - మార్గమునందు, రక్షతు - కాపాడు గాక!, రామః - పరశురాముడు, అద్రికూటేషు - పర్వత శిఖరములయందు, అథ - మరియు, సలక్ష్మణః - లక్ష్మణునితో కూడియున్నవాడు, భరత-అగ్రజః - భరతుని అన్నగారు అగు శ్రీరాముడు, అస్మాన్ - మమ్మలను, విప్రవాసే - పరదేశయాత్రయందు, అవ్యాత్ - కాపాడు గాక!

యజ్ఞములే అవయవములుగా గలిగి, తన కోరచే భూమిని పైకి తీసుకువచ్చిన వరాహమూర్తి నన్ను మార్గమునందు కాపాడు గాక! పరశు

రాముడు నన్ను పర్వత శిఖరములపై కాపాడు గాక! మరియు లక్ష్మణునితో కూడియుండువాడు, భరతుని అన్నగారు అగు శ్రీరాముడు మమ్ములను పరదేశయాత్రయందు రక్షించు గాక!

మాముగ్రధర్మాదఖిలాత్ప్రమాదాత్
నారాయణః పాతు నరశ్చ హాసాత్ ।
దత్తస్త్వయోగాదథ యోగనాథః
పాయాద్గుణేశః కపిలః కర్మబంధాత్ ॥ 16

నారాయణః - నారాయణుడు, మామ్ - నన్ను, ఉగ్రధర్మాత్ - భయమును కలిగించే తామస ధర్మమునుండి, అఖిలాత్ - సకలమైన, ప్రమాదాత్ - పొరపాటునుండి, నరః చ - నరుడు కూడ, హాసాత్ - గర్వమునుండి, పాతు - రక్షించు గాక!, అథ - తరువాత, యోగనాథః - యోగేశ్వరుడగు, దత్తః తు - దత్తాత్రేయుడైతే, అయోగాత్ - యోగము (ఈశ్వరారాధన) లేని స్థితినుండి, గుణ-ఈశః - గుణాతీతుడగు, కపిలః - కపిలుడు, కర్మబంధాత్ - కర్మల బంధమునుండి, పాయాత్ - రక్షించుగాక!

భయమును కలిగించే తామస ధర్మమునుండి, అన్ని పొరపాట్ల నుండి నారాయణుడు నన్ను రక్షించు గాక! నరుడు నాకు గర్వము కలుగ కుండా రక్షించు గాక! యోగేశ్వరుడగు దత్తాత్రేయుడు నాకు భక్తిజ్ఞానములు లేని స్థితినుండి రక్షించు గాక! గుణాతీతుడగు కపిల భగవానుడు నన్ను కర్మల బంధము (సంసారము) నుండి రక్షించు గాక!

సనత్కుమారోఽవతు కామదేవాత్
హయశీర్షా మాం పథి దేవహేలనాత్ ।
దేవర్షివర్యః పురుషార్చనాంతరాత్
కూర్మో హరిర్మాం నిరయాదశేషాత్ ॥ 17

సనత్కుమారః - సనత్కుమారుడు, కామదేవాత్ - మన్మథుని నుండి, హయశీర్షా - హయగ్రీవుడు, మామ్ - నన్ను, పథి - మార్గమునందు, దేవహేలనాత్ - దేవతలను అవమానించుటనుండి, దేవర్షివర్యః - దేవ

ర్షులలో శ్రేష్ఠుడగు నారదుడు, పురుష-అర్చన-అంతరాత్ - పురుషోత్త ముని ఆరాధనయందలి ఆటంకమునుండి, కూర్మః - కూర్మరూపుడగు, హరిః - శ్రీహరి, మామ్ - నన్ను, అశేషాత్ - సమస్తమైన, నిరయాత్ - నరకము (దుఃఖము) నుండి, అవతు - రక్షించు గాక!

సనత్కుమారుడు కామవేగమునుండియు, హయగ్రీవుడు ప్రయాణములో మార్గములో పొరపాటున దేవతల యెడల జరిగే అపరాధముల నుండియు, దేవర్షులలో శ్రేష్ఠుడగు నారదుడు పురుషోత్తముని ఆరాధనకు వచ్చే ఆటంకములనుండియు, కూర్మరూపుడగు శ్రీహరి సకలనరకముల (దుఃఖముల) నుండియు నన్ను రక్షించు గాక!

ధన్వంతరిర్భగవాన్ పాత్వపథ్యాద్
ద్వంద్వాద్భయాదృషభో నిర్జితాత్మా ।
యజ్ఞశ్చ లోకాదవతాజ్జనాంతాద్
బలో గణాత్ క్రోధవశాదహీంద్రః ।। 18

ధన్వంతరిః భగవాన్ - ధన్వంతరి భగవానుడు, అపథ్యాత్ - హితము కాని పదార్థములను తినుటనుండి, నిర్జిత-ఆత్మా - జయించబడిన మనస్సు గల, ఋషభః - ఋషభదేవుడు, ద్వంద్వాత్ - ద్వంద్వము వలని, భయాత్ - భయమునుండి, పాతు - రక్షించు గాక!, యజ్ఞః చ - యజ్ఞస్వరూపుడగు శ్రీహరి, లోకాత్ - లోకమునుండి, బలః - బలరాముడు, జన-అంతాత్ - జనుల వలని కష్టమునుండి, అహి-ఇంద్రః - సర్పరాజగు శేషుడు, క్రోధవశాత్ - క్రోధవశము అనే, గణాత్ - పాముల గణమునుండి, పాతు - రక్షించు గాక!

ధన్వంతరి భగవానుడు నన్ను హితము కాని పదార్థములను తినుటనుండియు, మనోజయము గల ఋషభదేవుడు సుఖదుఃఖాది ద్వంద్వముల వలన కలిగే భయమునుండి, యజ్ఞస్వరూపుడగు శ్రీహరి లోకాపవాదమునుండి, బలరాముడు జనులు పెట్టే కష్టములనుండి, సర్పరాజగు శేషుడు కోపమునకు వశమగుటనుండి (విషసర్పమునుండి) రక్షించు గాక!

ద్వైపాయనో భగవానప్రబోధాద్బుద్ధస్తు పాఖండగణాత్ప్రమాదాత్।
కల్కిః కలేః కాలమలాత్ప్రపాతు ధర్మావనాయోరుకృతావతారః ॥

భగవాన్ - పూజనీయుడగు, ద్వైపాయనః - వ్యాస మహర్షి, అప్రబోధాత్ - అజ్ఞానమునుండి, బుద్ధః తు - బుద్ధుడైతే, పాఖండగణాత్ - వేద విరుద్ధములగు మతములననుసరించే వారి గణమునుండి, ప్రమాదాత్ - ధర్మము విషయములో మరుపునుండి, ధర్మ-అవనాయ - ధర్మమును రక్షించుట కొరకు, ఉరుకృత-అవతారః - అధికముగా స్వీకరించబడిన అవతారములు గల, కల్కిః - కల్కి, కాలమలాత్ - కాలముయొక్క దోషమైన, కలేః - కలి (కలహము) నుండి, ప్రపాతు - ప్రకృష్టముగా రక్షించు గాక!

పూజనీయుడగు వ్యాస మహర్షి అజ్ఞానమునుండియు, బుద్ధుడు వేదవిరుద్ధమతానుయాయుల గణమునుండి మరియు ధర్మాచరణములో జరిగే మరుపునుండియు, ధర్మరక్షణ కొరకై అనేకములగు అవతారములను దాల్చిన కల్కి కాలమునందు వచ్చే కలి (కలహ) దోషమునుండియు నన్ను రక్షించు గాక!

మాం కేశవో గదయా ప్రాతరవ్యాద్గోవింద ఆసంగవమాత్తవేణుః ।
నారాయణః ప్రాహ్ణ ఉదాత్తశక్తిర్మధ్యందినే విష్ణురరీంద్రపాణిః ॥20

కేశవః - కేశవుడు, మామ్ - నన్ను, ప్రాతః - ఉదయము, గదయా - గదతో, ఆత్తవేణుః - పట్టుకొనబడిన మురళి గల, గోవిందః - గోవిందుడు, ఆసంగవమ్ - పగలు రెండవ జామును, ఉదాత్తశక్తిః - గొప్ప శక్తి గల, నారాయణః - నారాయణుడు, ప్రాహ్ణే - మూడవ జామునందు, మధ్యందినే - మధ్యాహ్నమునందు, అరి-ఇంద్రపాణిః - గొప్ప చక్రము చేతియందు గల, విష్ణుః - విష్ణువు, అవ్యాత్ - రక్షించు గాక!

గదాధారియగు కేశవుడు (అందమైన జుట్టు గలవాడు) ఉదయమునందు, మురళి పట్టుకున్న గోవిందుడు (గోవులను పాలించువాడు) పగటి రెండవ జాములో, గొప్ప శక్తి అనే ఆయుధము గల నారాయణుడు (సకల ప్రాణులే నివాసముగా గలవాడు) పగటి మూడవ జామునందు, గొప్ప

చక్రము చేతియందు గల విష్ణువు (సర్వవ్యాపకుడు) మధ్యాహ్నమునందు నన్ను రక్షించు గాక!

దేవోఽపరాహ్ణే మధుహోగ్రధన్వా
సాయం త్రిధామాఽవతు మాధవో మామ్ ।
దోషే హృషీకేశ ఉతార్ధరాత్రే
నిశీథ ఏకోఽవతు పద్మనాభః ।। 21

అపర-అహ్ణే - పగటి చివరి భాగమునందు, మధుహా - మధువును సంహరించిన, దేవః - దేవుడు, ఉగ్రధన్వా - భయంకరమగు ధనుస్సు గలవాడై, సాయమ్ - సాయంకాలము, త్రిధామా - మూడు మూర్తులు గల, మాధవః - మాధవుడు, మామ్ - నన్ను, అవతు - రక్షించు గాక!, దోషే - రాత్రియందు, హృషీకేశః - హృషీకేశుడు, ఉత - మరియు, అర్ధరాత్రే - అర్ధరాత్రమునందు (ఆ-అర్ధరాత్రే - అర్ధరాత్రి వరకు), నిశీథే - అర్ధరాత్రి తరువాత, ఏకః - ఒకడే, పద్మనాభః - పద్మనాభుడు, అవతు - రక్షించు గాక!

భయంకరమగు ధనస్సు గల మధుసూదనుడు పగటి చివరి భాగమునందు, త్రిమూర్తియగు మాధవుడు (లక్ష్మీపతి) సాయంకాలమునందు, రాత్రి ఆరంభములో హృషీకేశుడు (ఇంద్రియాధిపతి), అర్ధరాత్రి వరకు మరియు అర్ధరాత్రి తరువాత ఒకే (అద్వితీయుడగు) పద్మనాభుడు (పృథివీ పద్మము ఆకాశరూపమగు నాభియందు గలవాడు) నన్ను రక్షించు గాక!

శ్రీవత్సధామాపరరాత్ర ఈశః
ప్రత్యూష ఈశోఽసిధరో జనార్దనః ।
దామోదరోఽవ్యాదనుసంధ్యం ప్రభాతే
విశ్వేశ్వరో భగవాన్ కాలమూర్తిః ।। 22

అపరరాత్రే - రాత్రి చివర, శ్రీవత్సధామా - శ్రీవత్సము (మచ్చ) వక్షఃస్థలమునందు గల, ఈశః - ఈశ్వరుడు, ప్రత్యూషే - వేగుజామునందు, ఈశః - ప్రభుడగు, జనార్దనః - జనార్దనుడు, అసిధరః - కత్తిని ధరిం

చువాడై, అనుసంధ్యమ్ - ప్రతి సంధ్యయందు, దామోదరః - దామోదరుడు, ప్రభాతే - తెల్లవారిన సమయమునందు, విశ్వ-ఈశ్వరః - జగన్నాథుడు, కాలమూర్తిః - కాలరూపుడు అగు, భగవాన్ - భగవానుడు, అవ్యాత్ - రక్షించు గాక!

శ్రీవత్సము వక్షఃస్థలమునందు గల ఈశ్వరుడు రాత్రి చివరయందు, కత్తిని ధరించిన జనార్దన (దుష్టజనులను పీడించే) ప్రభుడు వేగుజామునందు, దామోదరుడు (నడుముకు త్రాడు కట్టబడినవాడు) రెండు సంధ్యలయందు, జగన్నాథుడు కాలమూర్తియగు శ్రీహరి భగవానుడు తెల్లవారిన సమయమునందు నన్ను రక్షించు గాక!

చక్రం యుగాంతానలతిగ్మనేమి
భ్రమత్సమంతాద్భగవత్ప్రయుక్తమ్ ।
దందగ్ధి దందగ్ధ్యరిసైన్యమాశు
కక్షం యథా వాతసఖో హుతాశః ॥ 23

యుగ-అంత-అనలతిగ్మనేమి - ప్రళయకాలాగ్నివలె వేడియైన ధారలు గలది, భగవత్-ప్రయుక్తమ్ - భగవానునిచే ప్రయోగించబడినది, సమంతాత్ - అంతటా, భ్రమత్ - తిరుగుచున్నది అగు, చక్రమ్ - చక్రము, వాతసఖః - వాయువు తోడైన, హుతాశః - అగ్ని, కక్షం యథా - ఎండు గడ్డిని వలె, అరిసైన్యమ్ - శత్రుసైన్యమును, ఆశు - వెంటనే, దందగ్ధి దందగ్ధి - అతిశయముగా తగుల బెట్టుము (బెట్టును).

ఓ సుదర్శనమా! ప్రళయకాలాగ్నివలె కాలిపోయే ధారలు గల నీవు భగవానుడు ప్రయోగించగా అంతటా తిరుగుచున్నావు. గాలి తోడైన అగ్ని ఎండు గడ్డిని వలె, నీవు శత్రుసైన్యమును వెంటనే పూర్తిగా తగుల బెట్టుము (సుదర్శనము తగుల బెట్టును).

గదేऽశనిస్పర్శనవిస్ఫులింగే
నిష్పింఢి నిష్పింఢ్యజితప్రియాసి ।

కూష్మాండవైనాయకయక్షరక్షో-
భూతగ్రహాంశ్చూర్ణయ చూర్ణయారీన్ ।। 24

అశనిస్పర్శనవిస్ఫులింగే - పిడుగువంటి స్పర్శ గల నిప్పు కణములు గల, గదే - ఓ గదా!, అజితప్రియా - పరాజయమునెరుంగని శ్రీహరికి ప్రియమైన దానవు, అసి - అగుచున్నావు, అరీన్ - శత్రువులగు, కూష్మాండవైనాయకయక్షరక్షః-భూతగ్రహాన్ - కూష్మాండులు వినాయకులు యక్షులు రాక్షసులు భూతములు గ్రహములను, నిష్పింఢి నిష్పింఢి చూర్ణయ చూర్ణయ - అతిశయించి పిండి చేయుము.

ఓ కౌమోదకీ గదా! నీనుండి రాలే నిప్పు కణములు పిడుగుల వలె తగులును. నీవు పరాజయమునెరుంగని శ్రీహరికి ప్రియమైన దానవు. నీవు మాకు శత్రువులగు కూష్మాండములు, వినాయకులు, భూతములు, గ్రహములు (ప్రేతములలో భేదములు), యక్షులు, రాక్షసులను పిండి పిండి చేయుము.

త్వం యాతుధానప్రమథప్రేతమాతృ-
పిశాచవిప్రగ్రహఘోరదృష్టీన్ ।
దరేంద్ర విద్రావయ కృష్ణపూరితో
భీమస్వనోఽరేర్హృదయాని కంపయన్ ।। 25

దర-ఇంద్ర - ఓ గొప్ప శంఖమా!, కృష్ణపూరితః - శ్రీకృష్ణునిచే పూరించబడునట్టియు, భీమస్వనః - భయమును గొల్పే ధ్వని గలిగినట్టియు, అరేః - శత్రువుయొక్క, హృదయాని - హృదయములను, కంపయన్ - వణికించే, త్వమ్ - నీవు, యాతుధానప్రమథప్రేతమాతృపిశాచవిప్రగ్రహఘోరదృష్టీన్ - రాక్షసులు ప్రమథగణములు ప్రేతములు మాతృకలు పిశాచములు బ్రహ్మరాక్షసులు క్రూరమగు చూపులు గలవారిని, విద్రావయ - తరిమి వేయుము.

ఓ గొప్ప శంఖమా! శ్రీకృష్ణునిచే పూరించబడే నీ ధ్వని శత్రువుల హృదయములను భయముతో వణుకునట్లు చేయును. రాక్షసులు, ప్రమథగ

ణములు, ప్రేతములు, మాతృకలు, పిశాచములు, బ్రహ్మరాక్షసులు మొద లగు క్రూరమగు చూపులు గల ప్రాణులను తరిమి వేయుము.

త్వం తిగ్మధారాఽసివరారిసైన్య-
మీశప్రయుక్తో మమ ఛింధి ఛింధి ।
చక్షూంషి చర్మన్ శతచంద్ర ఛాదయ
ద్విషామఘోనాం హర పాపచక్షుషామ్ ॥ 26

తిగ్మధార - వాడి పదును గలదానా!, అసివర - ఓ గొప్ప కత్తీ!, ఈశప్రయుక్తః - ఈశ్వరునిచే ప్రయోగించబడిన, త్వమ్ - నీవు, మమ - నా, అరిసైన్యమ్ - శత్రుసైన్యమును, ఛింధి ఛింధి - అతిశయించి ఛేదించుము, శతచంద్ర - వంద చంద్రుని పోలిన బుడిపెలు గలదానా!, చర్మన్ - ఓ డాలూ!, అఘోనామ్ - పాపులగు, ద్విషామ్ - శత్రువుల, చక్షూంషి - కళ్లను, ఛాదయ - కప్పివేయుము, పాపచక్షుషామ్ - పాపపు చూపులు గలవారికి, హర - తొలగించుము.

వాడి పదును గల ఓ గొప్ప కత్తీ! ఈశ్వరునిచే ప్రయోగించబడిన నీవు నా శత్రువుల సైన్యమును అతిశయించి ఛేదించుము. వంద చంద్రాకారపు బుడిపెలు గల ఓ డాలూ! పాపపు చూపులు గలవారు, పాపులు అగు శత్రువుల కన్నులను నీవు కప్పివేసి, వారికి చూపు లేకుండా చేయుము.

యన్నో భయం గ్రహేభ్యోఽభూత్ కేతుభ్యో నృభ్య ఏవ చ ।
సరీసృపేభ్యో దంష్ట్రిభ్యో భూతేభ్యోఽంహోభ్య ఏవ వా ॥27

సర్వాణ్యేతాని భగవన్నామరూపాస్త్రకీర్తనాత్ ।
ప్రయాంతు సంక్షయం సద్యో యే నశ్శ్రేయఃప్రతీపకాః ॥28

నః - మాకు, గ్రహేభ్యః - గ్రహముల వలన, కేతుభ్యః - తోకచుక్కల వలన, నృభ్యః ఏవ చ - మానవుల వలన కూడ, సరీసృపేభ్యః - ప్రాకే జంతువుల వలన, దంష్ట్రిభ్యః - కోరలు గల క్రూరమృగముల వలన, భూతేభ్యః - ప్రేతముల (పంచభూతముల) వలన, అంహోభ్యః ఏవ వా - పాపుల వలన గాని, యత్ - ఏ, భయమ్ - భయము, అభూత్ - కలిగెనో,

ఏతాని - ఈ, సర్వాణి- అన్నీ, భగవత్-నామరూప-అస్త్రకీర్తనాత్ - భగవానుని పేరును రూపమును ఆయుధములను కీర్తించుట వలన, సద్యః - వెంటనే, సంక్షయమ్ - పూర్తి నాశమును, ప్రయాంతు - పొందు గాక!, యే - ఏవి, నః - మాకు, శ్రేయఃప్రతీపకాః - మంచి మార్గమునకు ఆటంకము కలిగించువారో.

కుజుడు మొదలగు గ్రహములు, తోకచుక్కలు, మానవులు, ప్రాకే జంతువులు, కోరలు గల క్రూరమృగములు, ప్రేతములు, పంచభూతములు, పాపులగు ప్రాణులు అనువాటి వలన మాకు కలిగే భయము భగవానుని నామరూపములను, ఆయుధములను కీర్తించుట వలన వెంటనే పూర్తిగా తొలగిపోవు గాక! మాకు మంచి మార్గములో ఆటంకమును కలిగించువారు పూర్తిగా నాశమును పొందెదరు గాక!

గరుడో భగవాన్ స్తోత్రస్తోభశ్ఛందోమయః ప్రభుః ।
రక్షత్వశేషకృచ్ఛ్రేభ్యో విష్వక్సేనస్స్వనామభిః ॥ 29

భగవాన్ - పూజనీయుడు, స్తోత్రస్తోభః - సామలచే స్తుతించబడువాడు, ఛందోమయః - వేదమూర్తి, ప్రభుః - సర్వసమర్థుడు అగు, గరుడః - గరుడుడు, అశేషకృచ్ఛ్రేభ్యః - అన్ని కష్టములనుండి, విష్వక్సేనః - విష్వక్సేనుడు, స్వనామభిః - తన పేర్లతో, రక్షతు - రక్షించు గాక!,

పూజనీయుడు, వేదమూర్తి అగు గరుడుడు బృహద్రథంతరము మొదలగు సామములచే చక్కగా స్తుతించబడుచుండును. ఆ ప్రభుడు కష్టములన్నింటినుండి గట్టెక్కించు గాక! విష్వక్సేనుడు (అంతటా తన కిరణములు గల సూర్యుని రూపములోనున్న శ్రీహరి, లేక పార్షదుడు) ప్రభువు నామముల ప్రభావముచే రక్షించు గాక!

సర్వాపద్భ్యో హరేర్నామరూపయానాయుధాని నః ।
బుద్ధీంద్రియమనఃప్రాణాన్ పాంతు పార్షదభూషణాః ॥ 30

హరేః - శ్రీహరియొక్క, నామరూపయాన-ఆయుధాని - పేర్లు రూపములు వాహనములు ఆయుధములు, పార్షదభూషణాః - భగవానుని

అనుచరులకు అలంకారమైనవారు, నః - మా, బుద్ధి-ఇంద్రియమనఃప్రాణాన్ - బుద్ధి ఇంద్రియములు మనస్సు ప్రాణములను, సర్వ-ఆపద్భ్యః - అన్ని ఆపదలనుండి, పాంతు - రక్షించు గాక!

శ్రీహరి పేర్లు, రూపములు, వాహనములు, ఆయుధములు, ఆయన అనుచరులలో ప్రముఖులు మా బుద్ధి, ఇంద్రియములు, మనస్సు, ప్రాణములను ఆపదలన్నింటినుండి రక్షించు గాక!

యథా హి భగవానేవ వస్తుతస్సదసచ్చ యత్ ।
సత్యేనానేన నస్సర్వే యాంతు నాశముపద్రవాః ॥ 31

వస్తుతః - పరమార్థముగా, సత్ - రూపము గలది, అసత్ చ - రూపము లేనిది, యత్ - ఏది గలదో అది, భగవాన్ ఏవ - భగవానుడే, యథా హి - యథార్థము గదా!, అనేన - ఈ, సత్యేన - సత్యముచే, నః - మా, సర్వే - అన్ని, ఉపద్రవాః - ఆపదలు, నాశమ్ - నాశమును, యాంతు - పొందు గాక!

రూపము గల పృథివి జలము అగ్ని, రూపము లేని వాయువు ఆకాశము అనే సర్వము పరమార్థములో భగవానుడే అనేది యథార్థము గదా! ఈ సత్యముచే మా ఉపద్రవములన్నీ నశించు గాక!

యథైకాత్మ్యానుభావానాం వికల్పరహితస్స్వయమ్ ।
భూషణాయుధలింగాఖ్యా ధత్తే శక్తీస్స్వమాయయా ॥ 32

తేనైవ సత్యమానేన సర్వజ్ఞో భగవాన్ హరిః ।
పాతు సర్వైస్స్వరూపైర్నస్సదా సర్వత్ర సర్వగః ॥ 33

ఐకాత్మ్య-అనుభావానామ్ - అద్వయ-ఆత్మయొక్క అనుభవము గలవారికి, వికల్పరహితః - భేదము లేనివాడు, సర్వజ్ఞః - సర్వము తెలిసినవాడు, సర్వగః - సర్వవ్యాపి అగు, భగవాన్ హరిః - శ్రీహరి భగవానుడు, యథా - ఏ విధముగానైతే, భూషణ-ఆయుధలింగ-ఆఖ్యాః - భూషణములు ఆయుధములు ఆకారములు నామములను, శక్తీః - శక్తులను, స్వమాయయా - తన మాయచే, స్వయమ్ - తాను, ధత్తే - ధరించుచు

న్నాడు, యథా - యథార్థము, తేన - ఆ, సత్యమానేన ఏవ - యథార్థ మగు ప్రమాణముచే, సర్వైః - అన్ని, స్వరూపైః - తన రూపములచే, నః - మమ్ములను, సదా - అన్ని కాలములలో, సర్వత్ర - అన్ని దేశములలో, పాతు - రక్షించు గాక!

అద్వయ-ఆత్మ అనుభవము గలవారికి సర్వజ్ఞుడు, సర్వవ్యాపి అగు ఆ శ్రీహరి భగవానునియందు భేదము వాస్తవముగా లేదు. అయిన నూ, ఆయన తన మాయచే భూషణములను, ఆయుధములను, ఆకార ములను, నామములను, జ్ఞానము ఐశ్వర్యము మొదలగు శక్తులను ధరిం చుచున్నాడు. ఇది యథార్థము. ఈ యథార్థమగు ప్రమాణముచే ఆయన తన రూపములన్నింటిచే మమ్ము అన్ని దేశకాలములలో రక్షించు గాక!

విదిక్షు దిక్షూర్ధ్వమధస్సమంతాదంతర్బహిర్భగవాన్నారసింహః ।
ప్రహాపయంల్లోకభయం స్వనేన స్వతేజసా గ్రస్తసమస్తతేజాః ।।34

స్వతేజసా - తన తేజస్సుచే, గ్రస్తసమస్తతేజాః - తిరస్కరించబ డిన అన్ని తేజస్సులు గల, భగవాన్ నారసింహః - నృసింహ భగవానుడు, స్వనేన - ధ్వనిచే, విదిక్షు - మూలలయందు, దిక్షు - దిక్కులయందు, ఊర్ధ్వమ్ - పైన, అధః - క్రింద, సమంతాత్ - అన్ని వైపులా, అంతః - లోపల, బహిః - బయట, లోకభయమ్ - జనుల భయమును, ప్రహాపయన్ - పోగొట్టుచున్నవాడు.

నృసింహ భగవానుని తేజస్సు ముందు సూర్యాది తేజస్సులు వెలవెల బోవుచుండెను. ఆయన తన అట్టహాస ధ్వనిచే నాలుగు దిక్కుల యందు, నాలుగు మూలలయందు, క్రింద, పైన, లోపల, బయట, అన్ని వైపులా జనుల భయమును పోగొట్టును.

మఘవన్నిదమాఖ్యాతం వర్మ నారాయణాత్మకమ్ ।
విజేష్యస్యంజసా యేన దంశితోఽసురయూథపాన్ ।। 35

మఘవన్ - ఇంద్రా!, ఇదమ్ - ఈ, నారాయణ-ఆత్మకమ్ - నారా యణరూపమగు, వర్మ - కవచము, ఆఖ్యాతమ్ - చెప్పబడినది, యేన -

దేనిచే, దంశితః - కవచము గలవాడవై, అసురయూథపాన్ - రాక్షస సేనా నాయకులను, అంజసా - తేలికగా, విజేష్యసి - జయించగలవు.

ఓ ఇంద్రా! నారాయణ రూపమగు ఈ కవచమును నేను నీకు చెప్పితిని. దీనిని రక్షణకవచముగా చేసుకొని నీవు రాక్షస సేనానాయకులను తేలికగా జయించ గలవు.

ఏతద్ధారయమాణస్తు యం యం పశ్యతి చక్షుషా ।
పదా వా సంస్పృశేత్సద్యస్సాధ్వసాత్స విముచ్యతే ॥ 36

ఏతత్ - ఈ కవచమును, ధారయమాణః - ధారణ (కంఠస్థము) చేయువాడు, యం యం తు - ఎవనిని ఎవనినైతే, చక్షుషా - కంటితో, పశ్యతి - చూచునో, వా - లేదా, పదా - కాలితో, సంస్పృశేత్ - చక్కగా స్పృశించునో, సః - అతడు, సద్యః - వెంటనే, సాధ్వసాత్ - భయమునుండి, విముచ్యతే - విముక్తుడగును.

ఈ కవచమును ధారణ చేయు వ్యక్తి ఎవనినైతే కంటితో చూచునో, లేదా కాలితో చక్కగా స్పృశించునో, వాని భయము వెంటనే దూరమగును.

న కుతశ్చిద్భయం తస్య విద్యాం ధారయతో భవేత్ ।
రాజదస్యుగ్రహాదిభ్యో వ్యాఘ్రాదిభ్యశ్చ కర్హిచిత్ ॥ 37

విద్యామ్ - కవచమంత్రమును, ధారయతః - ధారణ చేయు, తస్య - వానికి, రాజదస్యుగ్రహ-ఆదిభ్యః - రాజు బందిపోట్లు గ్రహములు మొదలగువాటి వలన, వ్యాఘ్ర-ఆదిభ్యః చ - పెద్దపులి మొదలగువాటి వలన కూడ, కుతశ్చిత్ - దేనివలనైననూ, కర్హిచిత్ - ఎక్కడనైననూ ఏ కాలమునందైననూ, భయమ్ - భయము, న భవేత్ - కలుగదు.

ఈ కవచమంత్రమును ధారణ చేయు వ్యక్తికి, రాజు బందిపోట్లు గ్రహములు మొదలగువాటి వలన గాని, పెద్దపులి మొదలగు క్రూరజంతువుల వలన గాని, ఏ కాలములోనైననూ ఏ దేశమునందైననూ దేనివలనైననూ భయము కలుగదు.

ఇమాం విద్యాం పురా కశ్చిత్ కౌశికో ధారయన్ ద్విజః ।
యోగధారణయా స్వాంగం జహౌ స మరుధన్వని ।। 38

పురా - పూర్వము, కౌశికః - కౌశికుడనే, కశ్చిత్ - ఒకానొక, ద్విజః - బ్రాహ్మణుడు, సః - ఆతడు, ఇమామ్ - ఈ, విద్యామ్ - కవచమంత్రమును, ధారయన్ - ధారణ చేయువాడై, స్వ-అంగమ్ - తన దేహమును, మరుధన్వని - ఎడారియందు, యోగధారణయా - యోగాభ్యాసముచే, జహౌ - విడిచిపెట్టెను.

పూర్వము కౌశికుడనే బ్రాహ్మణుడొకడు ఉండెను. ఆతడు ఈ కవచమంత్రమును ధారణ చేసి, ఎడారిలో యోగమునభ్యసిస్తూ ప్రాణములను విడిచిపెట్టెను.

తస్యోపరి విమానేన గంధర్వపతిరేకదా ।
యయౌ చిత్రరథః స్త్రీభిర్వృతో యత్ర ద్విజక్షయః ।। 39

ఏకదా - ఒకనాడు, గంధర్వపతిః - గంధర్వరాజగు, చిత్రరథః - చిత్రరథుడు, స్త్రీభిః - యువతులతో, వృతః - చుట్టువారబడినవాడై, తస్య - దానికి, ఉపరి - పైన, విమానేన - విమానముచే, యయౌ - వెళ్లెను, యత్ర - ఎక్కడనైతే, ద్విజక్షయః - ఆ బ్రాహ్మణుడు మరణించెనో.

ఒకనాడు గంధర్వపతియగు చిత్రరథుడు స్త్రీలతో చుట్టువారబడి విమానములో, ఆ బ్రాహ్మణుడు మరణించిన స్థానమునకు పైనగా వెళ్లెను.

గగనాన్న్యపతత్సద్యః సవిమానో హ్యవాక్శిరాః ।
స వాలఖిల్యవచనాదస్థీన్యాదాయ విస్మితః ।
ప్రాస్య ప్రాచీసరస్వత్యాం స్నాత్వా ధామ స్వమన్వగాత్ ।।40

సవిమానః - విమానముతో కూడియున్న, సః - ఆతడు, అవాక్-శిరాః - తల క్రిందుగా ఉన్నవాడై, సద్యః - వెంటనే, గగనాత్ - ఆకాశము నుండి, న్యపతత్ - పడిపోయెను, విస్మితః - ఆశ్చర్యమును పొందినవాడై, వాలఖిల్యవచనాత్ - వాలఖిల్య మహర్షుల వచనముచే, అస్థీని - అస్థులను, ఆదాయ - తీసుకొని, ప్రాచీసరస్వత్యామ్ - తూర్పు వైపు ప్రవహించే

సరస్వతీ నదియందు, ప్రాస్య - కలిపి, స్నాత్వా - స్నానము చేసి, స్వమ్ - తనదైన, ధామ - లోకమును గురించి, అను-అగాత్ - వెళ్లెను.

వెంటనే ఆతడు తలక్రిందులుగా విమానముతో సహా నేల గూలె ను. ఆయనకు చాల ఆశ్చర్యమయ్యెను. అపుడు వాలఖిల్య మహర్షుల సలహా ప్రకారముగా, ఆతడు ఆ బ్రాహ్మణుని అస్థులను తీసుకొని, తూర్పుగా ప్రవహించే సరస్వతీ నదిలో కలిపి, స్నానము చేసి, తన లోకమునకు వెళ్లెను.

శ్రీశుక ఉవాచ ।

యఇదం శృణుయాత్కాలే యో ధారయతి చాదృతః ।
తం నమస్యంతి భూతాని ముచ్యతే సర్వతో భయాత్ ।। 41

యః - ఎవడైతే, కాలే - ఏదో ఒక కాలమునందు, ఇదమ్ - దీనిని, శృణుయాత్ - వినునో, యః చ - ఎవడు, ఆదృతః - ఆదరము గలవాడై, ధారయతి - ధారణ చేయునో, తమ్ - వానిని, భూతాని - ప్రాణులు, నమస్యంతి - నమస్కరించును, సర్వతః - అన్ని విధముల, భయాత్ - భయమునుండి, ముచ్యతే - విముక్తుడగును.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఎవడైతే దీనిని ఏదో ఒకప్పుడు వినునో, సాదరముగా ధారణ చేయునో, అట్టివానికి ప్రాణులు నమస్కరించు ను. వానికి అన్ని విధముల భయమునుండి విముక్తి కలుగును.

ఏతాం విద్యామధిగతో విశ్వరూపాచ్ఛతక్రతుః ।
త్రైలోక్యలక్ష్మీం బుభుజే వినిర్జిత్య మృధేఽసురాన్ ।। 42

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే నారాయణ
కవచవర్ణనం నామ అష్టమోఽధ్యాయః ।।

ఏతామ్ - ఈ, విద్యామ్ - కవచమంత్రమును, విశ్వరూపాత్ - విశ్వరూపునినుండి, శతక్రతుః - ఇంద్రుడు, అధిగతః - పొందినవాడై, మృధే - యుద్ధమునందు, అసురాన్ - రాక్షసులను, వినిర్జిత్య - విశేష

ముగా జయించి, త్రైలోక్యలక్ష్మీమ్ - ముల్లోకముల సంపదను, బుభుజే - భోగించెను.

ఈ కవచమంత్రమును వంద యజ్ఞములు చేసిన ఇంద్రుడు విశ్వరూపునినుండి పొంది, దాని బలముచే యుద్ధములో రాక్షసులను విశేషముగా జయించి, ముల్లోకముల సంపదను అనుభవించెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి ఆరవ స్కంధములో నారాయణ కవచమును వర్ణించే ఎనిమిదవ అధ్యాయము ముగిసినది (8).

*****

# అథ నవమోఽధ్యాయః

## వృత్రాసురుని పుట్టుక - దేవతలు శ్రీహరిని స్తుతించుట

శ్రీశుక ఉవాచ ।
తస్యాసన్ విశ్వరూపస్య శిరాంసి త్రీణి భారత ।
సోమపీథం సురాపీథమన్నాదమితి శుశ్రుమ ।। 1

భారత - భరతవంశీయుడవగు ఓ రాజా!, తస్య - ఆ, విశ్వరూపస్య - విశ్వరూపునకు, సోమపీథమ్ - సోమరసమును త్రాగునది, సురాపీథమ్ - మద్యమును త్రాగునది, అన్న-అదమ్ - ఆహారమును తినునది, త్రీణి - మూడు, శిరాంసి - తలలు, ఆసన్ - ఉండెను, ఇతి - అని, శుశ్రుమ - వింటిమి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- భరతవంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! ఆ విశ్వరూపునకు మూడు తలలు ఉండెననియు, ఒక తలతో సోమరసమును, రెండవ తలతో మద్యమును త్రాగెడివాడనియు, మూడవ దానితో ఆహారమును తినెడివాడనియు విని యుంటిమి.

స వై బర్హిషి దేవేభ్యో భాగం ప్రత్యక్షముచ్చకైః ।
అవదద్యస్య పితరో దేవాస్సప్రశ్రయం నృప ।। 2

నృప - ఓ రాజా!, సః వై - ఆ విశ్వరూపుడు, బర్హిషి - యజ్ఞమునందు, ప్రత్యక్షమ్ - ప్రకటముగా, సప్రశ్రయమ్ - సవినయముగా, దేవేభ్యః - దేవతల కొరకు, భాగమ్ - హవిర్భాగమును, ఉచ్చకైః - బిగ్గరగా, అవదత్ - ఉచ్చరించెను, యస్య - ఎవనికైతే, దేవాః - దేవతలు, పితరః - తండ్రులో.

ఆ విశ్వరూపునకు తండ్రులు దేవతలే. కావున, ఆతడు యజ్ఞములో సవినయముగా బిగ్గరగా దేవతలకు హవిర్భాగములను ప్రకటిస్తూ, సమర్పించెడివాడు.

స ఏవ హి దదౌ భాగం పరోక్షమసురాన్ ప్రతి ।
యజమానోఽవహద్భాగం మాతృస్నేహవశానుగః ॥ 3

యజమానః - యజ్ఞమును చేయుచున్న, సః ఏవ - ఆ విశ్వరూపుడే, పరోక్షమ్ - కనబడకుండా, అసురాన్ ప్రతి - రాక్షసుల నుద్దేశించి, భాగమ్ - హవిర్భాగమును, దదౌ - ఇచ్చెను, మాతృస్నేహవశ-అనుగః - తల్లి ప్రేమకు వశుడై, భాగమ్ - భాగమును, అవహత్ - అందజేసెను.

ఆ విశ్వరూపుడు యజ్ఞమును చేస్తూ, రాక్షసులకు కూడ హవిర్భాగములను రహస్యముగా సమర్పించెను. ఆతని తల్లి రాక్షసవంశమునందు పుట్టుటచే, ఆమెకు వారియందు ఉండే ప్రేమకు ఈతడు కూడ వశీభూతుడై, రాక్షసులకు భాగమును అందజేసెడివాడు.

తద్దేవహేలనం తస్య ధర్మాలీకం సురేశ్వరః ।
ఆలక్ష్య తరసా భీతస్తచ్ఛీర్షాణ్యచ్ఛినద్రుషా ॥ 4

తస్య - ఆతని, తత్ - ఆ, దేవహేలనమ్ - దేవతల యెడల అపరాధమును, ధర్మ-అలీకమ్ - ధర్మమునందు కపటమును, ఆలక్ష్య - గమనించి, సుర-ఈశ్వరః - దేవప్రభుడగు ఇంద్రుడు, భీతః - భయపడినవాడై, తరసా - వేగముగా, రుషా - కోపముతో, తత్-శీర్షాణి - వాని తలలను, అచ్ఛినత్ - నరికెను.

ఆ విధముగా ఆతడు ధర్మములో కపటమును చేస్తూ దేవతల యెడల అపరాధమును చేయగా, దేవప్రభుడగు ఇంద్రుడు గమనించెను. ఇంద్రుడు భయపడి, కోపముతో వేగముగా ఆతని తలలను నరికివేసెను.

సోమపీథం తు యత్తస్య శిర ఆసీత్కపింజలః ।
కలవింకస్సురాపీథమన్నాదం యత్స తిత్తిరిః ॥ 5

తస్య - వాని, సోమపీథమ్ - సోమరసమును త్రాగే, యత్ - ఏ, శిరః - తల, ఆసీత్ - ఉండెనో అది, కపింజలః - కముజు పిట్ట, సురాపీథమ్ - మద్యమును త్రాగేది, కలవింకః - పిచ్చుక, యత్ - ఏ, అన్న-అదమ్ - ఆహారమును తినే తల గలదో, సః - అది, తిత్తిరిః - తీతువు పిట్ట.

సోమపానమును చేసే వాని తల కముజు పిట్టగను, మద్యమును త్రాగే తల పిచ్చుకగను, ఆహారమును తినే తల తీతువు పిట్టగను ఆయెను.

బ్రహ్మహత్యామంజలినా జగ్రాహ యదపీశ్వరః ।
సంవత్సరాంతే తదఘం భూతానాం స విశుద్ధయే ।
భూమ్యంబుద్రుమయోషిద్భ్యశ్చతుర్ధా వ్యభజద్ధరిః ॥ 6

హరిః - ఇంద్రుడు, యత్ అపి ఈశ్వరః - స్వర్గలోకాధిపతియే అయిననూ, బ్రహ్మహత్యామ్ - బ్రహ్మహత్యను, అంజలినా - దోసిలితో, జగ్రాహ - పట్టుకొనెను, సః - ఆయన, సంవత్సర-అంతే - సంవత్సరము పూర్తి కాగా, భూతానామ్ - పంచభూతముల, విశుద్ధయే - పరిశుద్ధి కొరకు, తత్ - ఆ, అఘమ్ - పాపమును, భూమి-అంబుద్రుమయోషిద్భ్యః - నేల నీరు చెట్లు స్త్రీల కొరకు, చతుర్ధా - నాలుగు భాగములుగా, వ్యభజత్ - విభజించెను.

ఇంద్రుడు స్వర్గాధిపతియే అయిననూ, ఆయనకు బ్రహ్మహత్య తప్పలేదు. ఆయన ఆ పాపమును తన దోసిలితో స్వీకరించెను. సంవత్స రము తరువాత ఆయన తన దేహమునందలి నాలుగు భూతముల పరి శుద్ధి కొరకై (ఆకాశమునకు అపవిత్రత లేదు), ఆ పాపమును నేల, నీరు, చెట్లు మరియు స్త్రీలకు నాలుగు భాగములుగా పంచి యిచ్చెను.

భూమిస్తురీయం జగ్రాహ ఖాతపూరవరేణ వై ।
ఈరిణం బ్రహ్మహత్యాయా రూపం భూమౌ ప్రదృశ్యతే ॥ 7

భూమిః - నేల, ఖాతపూరవరేణ వై - గొయ్యి పూడ్చబడుట అనే వరముచే, తురీయమ్ - నాల్గవ వంతును, జగ్రాహ - తీసుకొనెను, భూమౌ

- భూమిపై, బ్రహ్మహత్యాయాః - బ్రహ్మహత్యయొక్క రూపమగు, ఈరిణమ్ - చవిటి నేల, దృశ్యతే - కనబడును.

భూమిపై ఎక్కడైననూ గొయ్యి తనంత తానుగా పూడ్చబడవలెను అనే వరమును తీసుకొని, భూమి ఆ పాపముయొక్క నాల్గవ భాగమును స్వీకరించెను. భూమిపై కనబడే చవిటి నేల బ్రహ్మహత్యయొక్క రూపమే.

తుర్యం ఛేదవిరోహేణ వరేణ జగృహుర్ద్రుమాః।
తేషాం నిర్యాసరూపేణ బ్రహ్మహత్యా ప్రదృశ్యతే ॥ 8

ఛేదవిరోహేణ - తెగిన కొమ్మ చిగురించుట అనే, వరేణ - వరముచే, ద్రుమాః - చెట్లు, తుర్యమ్ - నాల్గవ వంతును, జగృహుః - స్వీకరించినవి, తేషామ్ - వాటి, నిర్యాసరూపేణ - మ్రాని బంక రూపముగా, బ్రహ్మహత్యా - బ్రహ్మహత్య, ప్రదృశ్యతే - కనబడుచున్నది.

తెగిన కొమ్మ చిగురించవలెను అనే వరమును పొంది, చెట్లు ఆ పాపములో నాల్గవ వంతును స్వీకరించినవి. ఆ బ్రహ్మహత్యాదోషము కొమ్మను నరికినప్పుడు వచ్చే బంక రూపములో కనబడును.

శశ్వత్కామవరేణాంహస్తురీయం జగృహుః స్త్రియః ।
రజోరూపేణ యాస్వంహో మాసి మాసి ప్రదృశ్యతే ॥ 9

స్త్రియః - స్త్రీలు, శశ్వత్-కామవరేణ - అధిక కామము అనే వరముచే, తురీయమ్ - నాల్గవ వంతు, అంహః - పాపమును, జగృహుః - స్వీకరించిరి, యాసు - ఎవరియందు, అంహః - పాపము, మాసి మాసి - నెల నెలా, రజః-రూపేణ - రజస్సు రూపముగా, ప్రదృశ్యతే - కనబడునో.

అధికమగు కామమును వరముగా పొంది, స్త్రీలు ఆ పాపములో నాల్గవ వంతును స్వీకరించిరి. స్త్రీలలో ప్రతి నెల రజస్వల యగుట అనే రూపములో ఆ దోషము కనబడును.

ద్రవ్యభూయోవరేణాపస్తురీయం జగృహుర్మలమ్ ।
తాసు బుద్బుదఫేనాభ్యాం దృష్టం తద్ధరతి క్షిపన్ ॥ 10

. ద్రవ్యభూయః-వరేణ - నీరు అధికముగా ఊరుట అనే వరముచే, ఆపః - జలములు, తురీయమ్ - నాల్గవ వంతు, మలమ్ - పాపమును, జగృహుః - స్వీకరించినవి, తాసు - వాటియందు, బుద్బుదఫేనాభ్యామ్ - బుడగలు నురగగా, దృష్టమ్ - కనబడునది, తత్ - దానిని, క్షిపన్ - ప్రక్కకు త్రోయుచున్నవాడై, హరతి - తీసుకొనుచున్నాడు.

నూతులు మొదలగువాటియందు నీరు అధికముగా ఊరుచుండవలెను అనే వరమును పొంది, జలములు నాల్గవ వంతు పాపమును స్వీకరించినవి. ఆ పాపమే నీటియందు బుడగలు, నురగల రూపములో కనబడును. వ్యక్తి నీటిని తీసుకొనే సమయములో వాటిని ప్రక్కకు త్రోసివేయును.

హతపుత్రస్తతస్త్వష్టా జుహావేంద్రాయ శత్రవే ।
ఇంద్రశత్రో వివర్ధస్వ మా చిరం జహి విద్విషమ్ ।। 11

తతః - తరువాత, హతపుత్రః - చంపబడిన కొడుకు గల, త్వష్టా - త్వష్ట, ఇంద్రాయ - ఇంద్రుని కొరకు, శత్రవే - సంహరించువాని కొరకు, జుహావ - హోమమును చేసెను, ఇంద్రశత్రో - ఇంద్రునకు సంహారకుడా!, వివర్ధస్వ - విశేషముగా వర్ధిల్లుము, మా చిరమ్ - విలంబము లేకుండా, విద్విషమ్ - శత్రువును, జహి - సంహరించుము.

తరువాత కొడుకును కోల్పోయిన త్వష్ట ఇంద్రుని సంహరించువాని కొరకై, ఓ ఇంద్ర సంహారకా! వర్ధిల్లుము, విలంబము లేకుండా శత్రువును హతమార్చుము అనే అర్థము గల మంత్రముతో హోమము చేసెను.

అథాన్వాహార్యపచనాదుత్థితో ఘోరదర్శనః ।
కృతాంత ఇవ లోకానాం యుగాంతసమయే యథా ।। 12

అథ - తరువాత, అన్వాహార్యపచనాత్ - దక్షిణాగ్నినుండి, ఘోరదర్శనః - భయంకరమగు ఆకారము గల పురుషుడు, యుగ-అంతసమయే - ప్రళయ సమయమునందు, లోకానామ్ - లోకములకు, కృత-అంతః ఇవ - చేయబడిన అంతము గల రుద్రుడు వలె, ఉత్థితః - బయల్వెడలినాడు.

అపుడు దక్షిణాగ్నినుండి భయంకరాకారుడగు పురుషుడొకడు బయటకు వచ్చెను. అతడు ప్రళయకాలమునందు లోకములను సంహరించే రుద్రుడు వలె కానవచ్చెను.

విష్వగ్వివర్ధమానం తమిషుమాత్రం దినే దినే ।
దగ్ధశైలప్రతీకాశం సంధ్యాऽభ్రానీకవర్చసమ్ ।। 13
తప్తతామ్రశిఖాశ్మశ్రుం మధ్యాహ్నార్కోగ్రలోచనమ్ ।। 14
దేదీప్యమానే త్రిశిఖే శూల ఆరోప్య రోదసీ ।
నృత్యంతమున్నదంతం చ చాలయంతం పదా మహీమ్।।15

దరీగంభీరవక్త్రేణ పిబతా చ నభస్తలమ్ ।
లిహతా జిహ్వయర్క్షాణి గ్రసతా భువనత్రయమ్ ।। 16

మహతా రౌద్రదంష్ట్రేణ జృంభమాణం ముహుర్ముహుః।
విత్రస్తా దుద్రువుర్లోకా వీక్ష్య సర్వే దిశో దశ ।। 17

దినే దినే - ప్రతి దినమునందు, విష్వక్ - అన్ని వైపులా, ఇషుమాత్రమ్ - బాణముతో సమానముగా, వివర్ధమానమ్ - పెరుగుచున్నట్టియు, దగ్ధశైలప్రతీకాశమ్ - తగులబడ్డ పర్వతమును పోలియున్నట్టియు, సంధ్యా-అభ్ర-అనీకవర్చసమ్ - సంధ్యాకాలమునందలి మేఘముల గుంపు యొక్క ప్రకాశము కలిగినట్టియు, తప్తతామ్రశిఖాశ్మశ్రుమ్ - పుటము పెట్టిన రాగివంటి జుట్టు గెడ్డము మీసములు కలిగినట్టియు, మధ్యాహ్న-అర్క-ఉగ్రలోచనమ్ - మధ్యాహ్న సూర్యునివలె తాపమును కలిగించే కన్నులు కలిగినట్టియు, దేదీప్యమానే - గొప్పగా వెలిగిపోవుచున్న, త్రిశిఖే - మూడు కొనలు గల, శూలే - శూలమునందు, రోదసీ - స్వర్గలోక భూలోకములను, ఆరోప్య - గ్రుచ్చి, నృత్యంతమ్ - నాట్యము చేయుచున్నట్టియు, ఉన్నదంతమ్ - బిగ్గరగా నాదము చేయుచున్నట్టియు, పదా - కాలితో, మహీమ్ - భూమిని, చాలయంతం చ - కంపింప జేయుచున్నట్టియు, మహతా - పెద్ద, రౌద్రదంష్ట్రేణ - భయంకరమగు కోరలు గల, దరీగంభీర వక్త్రేణ - గుహవలె లోతైన నోటితో, ముహుః ముహుః - మాటిమాటికీ, జృంభమాణమ్ - ఆవులించుచున్నట్టియు, నభః-తలమ్ - ఆకాశతలము

ను, పిబతా చ - త్రాగుచున్నట్టియు, జిహ్వయా - నాలుకతో, ఋక్షాణి - నక్షత్రములను, లిహతా - నాకివేయుచున్నట్టియు, భువనత్రయమ్ - ముల్లోకములను, గ్రసతా - మ్రింగుచున్న, తమ్ - వానిని, వీక్ష్య - చూచి, విత్రస్తాః - అధికముగా భయపడిన, లోకాః - జనులు, దశ - పది, దిశః - దిక్కులను గురించి, దుద్రువుః - పారిపోయిరి.

ఆ పురుషుడు ప్రతిదినము అన్ని వైపులా ఒక బాణము పరిమాణములో పెరుగుచుండెను. తగులబడ్డ పర్వతము వలె నల్లనైన అతడు సంధ్యాకాలమునందలి మేఘముల గుంపుయొక్క కాంతిని కలిగియుండెను. పుటము పెట్టిన రాగిని బోలిన జుట్టు, గెడ్డము, మీసములు గల అతని కన్నులు మధ్యాహ్నసూర్యుని వలె చూపరులకు తాపమును కలిగించుచుండెను. అతడు గొప్పగా వెలిగిపోవుచున్న మూడు కొనల శూలమును పట్టుకొని బిగ్గరగా నాదము చేస్తూ నాట్యమాడినప్పుడు, నేల కంపించెను. ఆ శూలముపై అంతరిక్షమును గ్రుచ్చినాడా యన్నట్లుండెను. గుహవలె లోతైన అతని నోటిలో పెద్ద భయంకరములగు కోరలు ఉండెను. అతడు మాటిమాటికీ ఆవులిస్తూ, ఆకాశమును త్రాగివేయుచున్నాడా యన్నట్లు, నాలుకతో నక్షత్రములను నాకి వేయుచున్నాడా యన్నట్లు, ముల్లోకములను మ్రింగి వేయుచున్నాడా యన్నట్లు ఉండెను. వానిని చూచి జనులు చాల భయపడి పది దిక్కులకు పారిపోయిరి.

యేనావృతా ఇమే లోకాస్తమసా త్వాష్ట్రమూర్తినా ।
స వై వృత్ర ఇతి ప్రోక్తః పాపః పరమదారుణః ॥ 18

యేన - ఏ, త్వాష్ట్రమూర్తినా - త్వష్ట పుత్రుని రూపములోనున్న, తమసా - చీకటిచే, ఇమే - ఈ, లోకాః - లోకములు, ఆవృతాః - ఆవరించబడినవో, పాపః - పాపి, పరమదారుణః - మిక్కిలి క్రూరుడు అగు, సః వై - అతడు, వృత్రః - వృత్రుడు, ఇతి - అని, ప్రోక్తః - పిలువబడెను.

త్వష్టయొక్క పుత్రుని రూపములో చీకటి ఈ లోకములను ఆవరించెను. కావుననే, పాపి మిక్కిలి క్రూరుడు అగు అతడు వృత్రుడు (ఆవరించినవాడు) అని పిలువబడెను.

**తం నిజఘ్నురభిద్రుత్య సగణా విబుధర్షభాః ।**
**స్వైస్వైర్దివ్యాస్త్రశస్త్రౌఘైస్సోఽగ్రసత్తాని కృత్స్నశః ॥ 19**

సగణాః - గణములతో కూడిన, విబుధ-ఋషభాః - దేవవీరులు, తమ్ - వానిని, అభిద్రుత్య - అభిముఖముగా దండెత్తి, స్వైః స్వైః - తమ తమ, దివ్య-అస్త్రశస్త్ర-ఓఘైః - దివ్యములగు అస్త్రశస్త్రముల సమూహ ములచే, నిజఘ్నుః - గట్టిగా కొట్టిరి, సః - ఆతడు, తాని - వాటిని, కృత్స్నశః - పూర్తిగా, అగ్రసత్ - మ్రింగి వేసెను.

దేవవీరులు తమ గణములతో కూడి వానిపై దండెత్తి వానిని తమ తమ దివ్యములగు అస్త్ర (మంత్రపూర్వకముగా ప్రయోగించబడే ఆయుధ ములు) శస్త్రముల (బాణములు మొదలగు ఆయుధములు) తో గట్టిగా కొట్టిరి. ఆతడు వాటినన్నింటినీ మ్రింగి వేసెను.

**తతస్తే విస్మితాస్సర్వే విషణ్ణా గ్రస్తతేజసః ।**
**ప్రత్యంచమాదిపురుషముపతస్థుస్సమాహితాః ॥ 20**

తతః - తరువాత, విస్మితాః - ఆశ్చర్యమును పొందినవారు, విషణ్ణాః - దుఃఖితులు, గ్రస్తతేజసః - తిరస్కరించబడిన తేజస్సు గలవారు అగు, తే - వారు, సర్వే - అందరు, సమాహితాః - ఏకాగ్రచిత్తము గలవా రై, ప్రత్యంచమ్ - ఆత్మస్వరూపుడైనట్టియు, ఆదిపురుషమ్ - సర్వజగత్కా రణుడైన పూర్ణ పరబ్రహ్మను, ఉపతస్థుః - నిలబడి స్తుతించిరి.

తరువాత తమ తేజస్సు తిరస్కరించ బడుటచే ఆశ్చర్యవిషాదము లను పొందియున్న ఆ దేవతలందరు, ఆత్మస్వరూపుడు సర్వజగత్కార ణుడు అగు పూర్ణ పరబ్రహ్మను ఏకాగ్రమగు చిత్తముతో నిలబడి స్తుతించిరి.

**దేవా ఊచుః ।**
**వాయ్వంబరాగ్న్యప్క్షితయస్త్రిలోకా**
**బ్రహ్మాదయో యే వయముద్విజంతః ।**
**హరామ యస్మై బలిమంతకోఽసౌ**
**బిభేతి యస్మాదరణం తతో నః ॥ 21**

యే - ఏ, వాయు-అంబర-అగ్ని-అప్క్షితయః - వాయువు ఆకాశము అగ్ని జలములు పృథివి, త్రిలోకాః - ముల్లోకములు, బ్రహ్మ-ఆదయః - బ్రహ్మగారు మొదలుగా గల, వయమ్ - మేము, ఉద్విజంతః - భయపడుచున్నవారమై, యస్మై - ఎవని కొరకు, బలిమ్ - పూజాదికమును, హరామ - సమర్పించెదమో, అసౌ - ఈ, అంతకః - కాలము, యస్మాత్ - ఎవని వలన, బిభేతి - భయపడునో, తతః - ఆ శ్రీహరి వలన, నః - మాకు, అరణమ్ - రక్షణము.

దేవతలిట్లు పలికిరి --- పృథివ్యప్తేజోవాయ్వాకాశములనే పంచ భూతములు, ముల్లోకములు, బ్రహ్మగారు మొదలుగా గల దేవతలమగు మేము కాలమునకు భయపడి, శ్రీహరికి పూజాదికమును సమర్పించుచుందుము. కాని, ఆ కాలము కూడ శ్రీహరి వలన భయపడును. అట్టి శ్రీహరి మాకు శరణు.

అవిస్మితం తం పరిపూర్ణకామం
స్వేనైవ లాభేన సమం ప్రశాంతమ్ ।
వినోపసర్పత్యపరం హి బాలిశః
శ్వలాంగులేనాతితితర్తి సింధుమ్ ॥ 22

అవిస్మితమ్ - అహంకారము లేనట్టియు, స్వేన - తన స్వరూపమైన, లాభేన ఏవ - లబ్ధి చేతనే, పరిపూర్ణకామమ్ - పరిపూర్ణమైన మనోరథము కలిగినట్టియు, సమమ్ - సర్వసముడైనట్టియు, ప్రశాంతమ్ - రాగద్వేషములు లేని, తం వినా - ఆ శ్రీహరి కాకుండా, అపరమ్ - మరియొకనిని, బాలిశః - మూర్ఖుడు, ఉపసర్పతి - శరణు పొందును, హి - ఏలయనగా, శ్వలాంగులేన - కుక్క తోకతో, సింధుమ్ - సముద్రమును, అతితితర్తి - తరించ గోరుచున్నాడు.

సర్వజగత్కర్తయగు శ్రీహరియందు కర్తృత్వాహంకారము గాని, రాగద్వేషములు కాని లేవు. ఆనందఘనమగు తన స్వరూపము చేతనే పరిపూర్ణమైన మనోరథములు గల శ్రీహరి సర్వమునందు సమముగా ప్రకట

మగుచున్నాడు. ఆ శ్రీహరిని కాకుండా, మరియొక సామాన్యుని శరణు పొందే వ్యక్తి, కుక్క తోక పట్టుకొని సముద్రమును తరించ గోరుచున్నాడు.

యస్యోరుశృంగే జగతీం స్వనావం
మనుర్యథాఽఽబధ్య తతార దుర్గమ్ ।
స ఏవ నస్త్వాష్ట్రభయాద్దురంతాత్
త్రాతాఽఽశ్రితాన్ వారిచరోఽపి నూనమ్ ॥ 23

యస్య - ఎవ్వాని, ఉరుశృంగే - పెద్ద కొమ్మునందు, స్వనావమ్ - తన పడవయగు, జగతీమ్ - పృథివిని, ఆబధ్య - కట్టి, మనుః - మనువు, యథా - ఉన్నవాడున్నట్లుగా, దుర్గమ్ - మహాభయమును, తతార - దాటి వేసెనో, సః - ఆ, వారిచరః ఏవ - మత్స్యమూర్తియే, ఆశ్రితాన్ - శరణు వేడిన, నః అపి - మమ్ములను కూడ, నూనమ్ - నిశ్చయముగా, దురం తాత్ - అంతము లేని, త్వాష్ట్రభయాత్ - త్వష్టయొక్క పుత్రుడగు వృత్రుని వలని భయమునుండి, త్రాతా - రక్షించగలడు.

ఆ మత్స్యమూర్తియొక్క పెద్ద కొమ్మునకు మనువు పడవ రూప ములోనున్న పృథివిని కట్టి సునాయాసముగా మహాభయమునుండి బయట పడెను. త్వష్టయొక్క పుత్రుడగు వృత్రుని వలని భయమునకు అంతము కానరాదు. ఆ శ్రీహరియే శరణు వేడిన మమ్ములను కూడ నిశ్చ యముగా ఈ భయమునుండి రక్షించగలడు.

పురా స్వయంభూరపి సంయమాంభ-
స్యుదీర్ణవాతోర్మిరవైః కరాలే ।
ఏకోఽరవిందాత్పతితస్తతార
తస్మాద్భయాద్యేన స నోఽస్తు పారః ॥ 24

పురా - పూర్వము, ఉదీర్ణవాత-ఊర్మిరవైః - వీచుచున్న గాలులచే తరంగముల శబ్దములచే, కరాలే - భయమును గొల్పు, సంయమ-అంభసి - ప్రళయజలములయందు, అరవిందాత్ - పద్మమునుండి, పతితః - పడి పోయిన, ఏకః - ఒంటరియగు, స్వయంభూః అపి - స్వయంభువుడగు

బ్రహ్మగారు కూడ, తస్మాత్ - ఆ, భయాత్ - భయమునుండి, యేన - ఎవని ద్వారా, తతార - తరించెనో, సః - అట్టి శ్రీహరి, నః - మాకు, పారః - తరింప జేయువాడు, అస్తు - అగు గాక!

పూర్వము ప్రళయజలములయందు పెద్ద గాలులు వీచి తరంగములు పుట్టి మహాశబ్దముతో భయమును గొల్పుచుండగా, ఒంటరియగు స్వయంభువుడు నాభికమలమునుండి పడిపోయెను. ఆయన ఆ భయము నుండి శ్రీహరి అనుగ్రహముచే బయట పడెను. మమ్ములను కూడ ఆ శ్రీహరి రక్షించు గాక!

యో ఏక ఈశో నిజమాయయా నః
ససర్జ యేనానుసృజామ విశ్వమ్ ।
వయం న యస్యాపి పురస్సమీహతః
పశ్యామ లింగం పృథగీశమానినః ॥ 25

యః - ఏ, ఏకః - అద్వితీయుడగు, ఈశః - ఈశ్వరుడు, నిజమాయయా - తన మాయచే, నః - మమ్ములను, ససర్జ - సృష్టించెనో, యేన - ఎవని ద్వారా, అను - తరువాత, విశ్వమ్ - జగత్తును, సృజామ - సృష్టించుచున్నామో, పృథక్-ఈశమానినః - భిన్నులమని ప్రభువులమని అభిమానము గల, వయమ్ - మేము, పురః - ఎదుట, సమీహతః అపి - చక్కగా చేష్టలను చేయుచున్ననూ, యస్య - ఎవనియొక్క, లింగమ్ - స్వరూపమును, న పశ్యామ - చూడమో.

అద్వితీయుడు, ఈశ్వరుడు అగు శ్రీహరి తన మాయచే మమ్ములను సృష్టించగా, అపైన మేము ఆయన అనుగ్రహము చేతనే జగత్తును సృష్టించుచున్నాము. మేము ఆయన కంటె భిన్నులము, మేము ప్రభువులము అనే అభిమానము మాకు గలదు. కావుననే, ఆయన మా యెదుటనే తన లీలలను చేయుచున్ననూ, మేము ఆయన స్వరూపమును తెలియలేకున్నాము.

యో నస్సపత్నైర్భృశమర్ద్యమానాన్
దేవర్షితిర్యఙ్నృషు నిత్య ఏవ ।

కృతావతారస్తనుభిస్స్వమాయయా
కృత్వాఽఽత్మసాత్పాతి యుగే యుగే చ ॥ 26

యః - ఏ శ్రీహరి, నిత్యః ఏవ - కాలమునకు అతీతుడే అయిననూ, యుగే యుగే చ - యుగయుగమునందు కూడ, స్వమాయయా - తన మాయాశక్తిచే, తనుభిః - శరీరములచే, దేవ-ఋషితిర్యఙ్-నృషు - దేవతలు మహర్షులు పశువులు మానవులయందు, కృత-అవతారః - చేయబడిన అవతారములు గలవాడై, సపత్నైః - శత్రువులచే, భృశమ్ - మిక్కిలి, అర్ద్యమానాన్ - పీడింపబడుచున్న, నః - మమ్ములను, ఆత్మసాత్ - తనవారినిగా, కృత్వా - చేసి, పాతి - రక్షించుచున్నాడు.

ఆ శ్రీహరి కాలమునకు అతీతుడు. అయిననూ, ఆయన తన మాయాశక్తిచే యుగయుగమునందు దేవతలు, మహర్షులు, పశువులు, మనుష్యుల రూపముగా అవతరించి, శత్రువులచే మిక్కిలి పీడింపబడుచున్న మమ్ములను తన వారినిగా భావించి రక్షించుచున్నాడు.

తమేవ దేవం వయమాత్మదైవతం
పరం ప్రధానం పురుషం విశ్వమన్యమ్ ।
వ్రజామ సర్వే శరణం శరణ్యం
స్వానాం స నో ధాస్యతి శం మహాత్మా ॥ 27

ఆత్మదైవతమ్ - మాకు ఉపాస్యుడైనట్టియు, పరమ్ - ప్రకృతికి అతీతుడైనట్టియు, ప్రధానమ్ - సృష్టికి ఉపాదానమైనట్టియు, పురుషమ్ - సృష్టికి నిమిత్తకారణమైనట్టియు, విశ్వమ్ - జగద్రూపముగా నున్నట్టియు, అన్యమ్ - జగత్తుకంటె విలక్షణుడైనట్టియు, శరణ్యమ్ - శరణు జొచ్చినవారిని కాపాడే, తమ్ - ఆ, దేవం ఏవ - శ్రీహరి భగవానుని మాత్రమే, వయమ్ - మేము, సర్వే - అందరము, శరణం వ్రజామ - శరణు పొందెదము, మహాత్మా - సర్వాత్మస్వరూపుడగు, సః - ఆయన, నః - మాకు, శమ్ - సుఖమును, ధాస్యతి - కలిగించగలడు.

ఈ సృష్టికి ఉపాదానము, నిమిత్తము కూడ ఆ శ్రీహరియే. ఆయనయే జగద్రూపముగా ప్రకటమైననూ, జగత్తుకంటె విలక్షణముగా నున్నా

డు. శరణు జొచ్చినవారిని కాపాడే ఆయనయే మా ఉపాస్యదైవము. మేమందరము ఆ భగవానుని శరణు వేడుచున్నాము. సర్వాత్మస్వరూపు డగు ఆయన మాకు సుఖమును కలిగించ గలడు.

శ్రీశుక ఉవాచ ।
ఇతి తేషాం మహారాజ సురాణాముపతిష్ఠతామ్ ।
ప్రతీచ్యాం దిశ్యభూదావిశ్శంఖచక్రగదాధరః ॥ 28

మహారాజ - ఓ మహారాజా!, ఇతి - ఈ విధముగా, తేషామ్ - ఆ, సురాణామ్ - దేవతలు, ఉపతిష్ఠతామ్ - స్తుతించుచుండగా, ప్రతీచ్యాం దిశి - పడమర దిక్కునందు, శంఖచక్రగదాధరః - శంఖము చక్రము గదలను ధరించిన శ్రీహరి, ఆవిః అభూత్ - ఆవిర్భవించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! ఈ విధ ముగా ఆ దేవతలు స్తుతించుచుండగా, పడమర దిక్కునందు శంఖము, చక్రము, గదలను ధరించిన శ్రీహరి ప్రకటమయ్యెను.

ఆత్మతుల్యైష్షోడశభిర్వినా శ్రీవత్సకౌస్తుభౌ ।
పర్యుపాసితమున్నిద్రశరదంబురుహేక్షణమ్ ॥ 29

దృష్ట్వా తమవనౌ సర్వ ఈక్షణాహ్లాదవిక్లబాః ।
దండవత్పతితా రాజన్ శనైరుత్థాయ తుష్టువుః ॥ 30

రాజన్ - ఓ మహారాజా!, శ్రీవత్సకౌస్తుభౌ - శ్రీవత్సమును కౌస్తుభమాణిక్యమును, వినా - మినహాయించి, ఆత్మతుల్యైః - తనతో సమానమైన, షోడశభిః - పదునార్గురిచే, పరి-ఉపాసితమ్ - చుట్టూ సేవించబడినట్టియు, ఉన్నిద్రశరద్-అంబురుహ-ఈక్షణమ్ - వికసించిన శరత్కాలమునందలి పద్మమువంటి కన్నులు గలిగిన, తమ్ - ఆ శ్రీహరిని, దృష్ట్వా - చూచి, ఈక్షణ-ఆహ్లాదవిక్లబాః - చూచుట వలని ఆనందము వలన వివశులైన, సర్వే - అందరు, అవనౌ - నేలపై, దండవత్ - కర్రవలె, పతితాః - పడినవారై, శనైః - మెల్లగా, ఉత్థాయ - లేచి నిలబడి, తుష్టువుః - స్తుతించిరి.

ఓ మహారాజా! ఆ శ్రీహరిని చుట్టువారి పదునార్గురు అనుచరులు సేవించుచుండిరి. శ్రీవత్సమనే మచ్చను, కౌస్తుభమాణిక్యమును మినహాయించి, వారు శ్రీహరినే పోలియుండిరి. వికసించిన శరత్కాలపద్మముల వంటి కన్నులు గల ఆ శ్రీహరిని చూచి దేవతలందరు ఆ ఆనందముచే వివశులైరి. వారు సాష్టాంగ దండప్రణామము నాచరించి, మెల్లగా లేచి నిలబడి స్తుతించిరి.

దేవా ఊచుః ।
నమస్తే యజ్ఞవీర్యాయ వయసే ఉత తే నమః ।
నమస్తే హ్యస్తచక్రాయ నమస్సుపురుహూతయే ॥ 31

యజ్ఞవీర్యాయ - యజ్ఞములకు ఫలమునిచ్చే, తే - నీ కొరకు, వయసే - కాలస్వరూపుడవైనట్టియు, అస్తచక్రాయ - ప్రయోగించబడిన చక్రము కలిగినట్టియు, ఉత - మరియు, సుపురుహూతయే - చక్కని చాల నామములు గల, తే - నీ కొరకు, నమః ---- - అనేక నమస్కారములు.

దేవతలిట్లు పలికిరి --- కాలస్వరూపుడవగు నీవే యజ్ఞఫలదాతవు. శత్రువులపై చక్రమును ప్రయోగించే నీకు చక్కని నామములు చాల గలవు. నీకు అనేక నమస్కారములు.

యత్తే గతీనాం తిసృణామీశితుః పరమం పదమ్ ।
నార్వాచీనో విసర్గస్య ధాతర్వేదితుమర్హతి ॥ 32

ధాతః - ఓ పాలకుడా!, తిసృణామ్ - మూడు, గతీనామ్ - జీవగతులకు, ఈశితుః - శాసకుడవైన, తే - నీ, యత్ - ఏ, పరమమ్ - సర్వోత్కృష్టమైన, పదమ్ - పదము గలదో దానిని, విసర్గస్య - సృష్టియొక్క, అర్వాచీనః - తరువాత వచ్చినవాడు, వేదితుమ్ - తెలియుటకు, న అర్హతి - అర్హుడు కాడు.

ఓ పాలకుడా! జీవులు పొందే ఉత్తమ (స్వర్గాది)- మధ్యమ (మనుష్య)- అధమ (నరకాది) గతులను శాసించేది నీవే. నీ సర్వాతిశాయి స్వరూపమును తెలియుటకు సృష్టి తరువాత వచ్చిన మావంటివారు తగరు.

ఓం. నమస్తేస్తు భగవన్ నారాయణ వాసుదేవాదిపురుష మహాపు
రుష మహానుభావ పరమమంగల పరమకల్యాణ పరమకారుణిక
కేవల జగదాధార లోకైకనాథ సర్వేశ్వర లక్ష్మీనాథ పరమహంసప
రివ్రాజకైః పరమేణాత్మయోగసమాధినా పరభావితపరిస్ఫుటపార
మహంస్యధర్మేణోద్ఘాటితతమఃకపాటద్వార చిత్తే ఽపావృత ఆత్మ
లోకే స్వయముపలబ్ధనిజసుఖానుభావో భవాన్ ॥ 33

ఓమ్, భగవన్ - భగవానుడా!, నారాయణ - నారాయణా!, తే - నీ కొరకు, నమః - నమస్కారము, అస్తు - అగుగాక!, వాసుదేవ - వాసుదేవా!, ఆదిపురుష - ఆదిపురుషా!, మహాపురుష - మహాపురుషా!, మహానుభావ - మహానుభావా!, పరమమంగల - పరమమంగళుడా!, పరమకల్యాణ - పరమకల్యాణస్వరూపా!, పరమకారుణిక - గొప్ప దయ గలవాడా!, కేవల - అద్వయుడా!, జగద్-ఆధార - జగత్తునకు అధిష్ఠానమైనవాడా!, లోక-ఏకనాథ - లోకములకు ఏకైక రక్షకుడా!, సర్వ-ఈశ్వర - సర్వమును శాసించువాడా!, లక్ష్మీనాథ - లక్ష్మీపతీ!, భవాన్ - నీవు, పరమహంసపరివ్రాజకైః - గొప్ప ఆత్మజ్ఞానము కలిగి అంతటా సంచారము చేసే మహాత్ములచే, పరమేణ - సర్వశ్రేష్ఠమైన, ఆత్మయోగసమాధినా - ఆత్మనిష్ఠయందలి ఏకాగ్రతచే, పరిభావితపరిస్ఫుటపారమహంస్యధర్మేణ - పరిశుద్ధము చేయబడిన అంతఃకరణమునందు చక్కగా స్ఫురించే సర్వసంగపరిత్యాగులకు చెందిన ధర్మముచే, ఉద్ఘాటితతమఃకవాటద్వారే - తెరువబడిన అజ్ఞానమనే తలుపులు గల ద్వారమైన, చిత్తే - చిత్తమునందు, అపావృతే - ప్రకటమైన, ఆత్మలోకే - ఆత్మ అనే లోకమునందు, స్వయమ్ - తనంత తానుగ, ఉపలబ్ధనిజసుఖ-అనుభావః - పొందబడిన ఆత్మానందానుభవస్వరూపుడవు.

ఓ నారాయణ భగవానుడా! నీకు నమస్కారమగు గాక! వాసుదేవా! పురుషోత్తమా! జగత్కారణమగు చైతన్యము నీవే. నీ మహిమ గొప్పది. పరమమంగళమగు నీ రూపము భక్తులకు గొప్ప కల్యాణముల నిచ్చును. ఓ అద్వయా! కరుణామయుడవగు నీవే జగత్తునకు అధిష్ఠానమగుచున్నావు. లోకములను శాసించి రక్షించే ఏకైకప్రభుడవు నీవే. ఓ లక్ష్మీపతీ!

పరమహంస పరివ్రాజకులు సర్వోత్కృష్టమగు ఆత్మనిష్ఠయందు ఏకాగ్రత గలవారై యుందురు. ఆ విధముగా పరిశుద్ధము చేయబడిన వారి అంతఃకరణమునందు సర్వసంగపరిత్యాగుల శమదమాది ధర్మము చక్కగా స్ఫురించుచుండును. దానిచే, చిత్తము అనే మోక్షద్వారమునకు ఉండే అజ్ఞానపు తలుపులు తెరుచుకొనును. అట్టి చిత్తమునందు ఆత్మరూపుడవైన నీవు చక్కగా ఆవిర్భవించెదవు. అట్టి ఆత్మసాక్షాత్కారమునందు తనంత తానుగా ప్రకటమయ్యే బ్రహ్మానందానుభవము నీ స్వరూపమే.

దురవబోధ ఇవ తవాయం విహారయోగో యదశరణోఽశరీర
ఇదమనవేక్షితాస్మత్సమవాయ ఆత్మనైవావిక్రియమాణేన సగు
ణమగుణస్సృజసి పాసి హరసి ।। 34

తవ - నీ, అయమ్ - ఈ, విహారయోగః - క్రీడించే పద్ధతి, దురవబోధః ఇవ - తెలియ శక్యము కానిదియే, యత్ - ఏలయనగా, అశరణః - ఆశ్రయము లేనివాడవు, అశరీరః - శరీరము లేనివాడవు, అనవేక్షిత-అస్మత్-సమవాయః - అపేక్షించబడని మా సాహాయ్యము గలవాడవు, అగుణః - నిర్గుణుడవు అగు నీవు, ఆత్మనా - స్వరూపము, అవిక్రియమాణేన ఏవ - వికారములు పొందనిదిగనే, సగుణమ్ - గుణములతో కూడియున్న, ఇదమ్ - ఈ జగత్తును, సృజసి - సృష్టించుచున్నావు, పాసి - రక్షించుచున్నావు, హరసి - ఉపసంహరించుచున్నావు.

నీ ఈ లీలాపద్ధతి బుద్ధికి అంతు పట్టుటనే లేదు. ఏలయన, నీకు ఆశ్రయము గాని, శరీరము గాని, గుణములు గాని లేవు. మా సాహాయ్యమును నీవు అపేక్షించవు. నీ స్వరూపములో వికారములేవియు రావు. అయిననూ, నీవీ త్రిగుణముల కార్యమగు జగత్తును సృష్టించి, పాలించి, ఉపసంహరించుచున్నావు.

అథ తత్ర భవాన్ కిం దేవదత్తవదిహ గుణవిసర్గపతితః పారతంత్ర్యేణ స్వకృతకుశలాకుశలం ఫలముపాదదాత్యాహోస్విదాత్మారామ ఉపశమశీలస్సమంజసదర్శన ఉదాస్త ఇతి హ వావ
న విదామః ।। 35

అథ - మరియు, తత్ర భవాన్ - పూజనీయుడవగు నీవు, దేవదత్త వత్ - దేవదత్తుని వలె, ఇహ - ఈ లోకమునందు, గుణవిసర్గపతితః - త్రిగుణముల కార్యమగు శరీరమునందు పడినవాడవై, పారతంత్ర్యేణ - పరాధీనతచే, స్వకృతకుశల-అకుశలమ్ - తనచే చేయబడిన పుణ్యాపాపరూపమైన, ఫలమ్ - ఫలమును, కిం ఉపాదదాతి - అనుభవించుచున్నావా?, ఆహోస్విత్ - అట్లుగాక, ఆత్మారామః - తన స్వరూపమునందు రమించువాడవు, ఉపశమశీలః - శాంతస్వభావుడవు, సమంజసదర్శనః - సమ్యగ్దర్శనము గలవాడవు, ఉదాస్తః - సాక్షిమాత్రుడవా?, ఇతి - అని, వావ న విదామః హ - తెలియలేక పోవుచున్నాము.

నీవు ప్రాకృతజీవుని వలె ఈ లోకములో త్రిగుణకార్యమగు దేహాదులయందు ఆత్మభావము గలవాడవై పరాధీనుడవై మంచి-చెడు కర్మలను చేసి వాటి ఫలములగు సుఖదుఃఖముల ననుభవించుచున్నావా? లేక, ఆత్మారాముడవు, శాంతస్వభావుడవు, కర్తృత్వ భోక్తృత్వములకు అతీతమగు బ్రహ్మాత్మ దర్శనము గలవాడవు అగు కేవల సాక్షివై యున్నావా? ఇది మాకు అంతు పట్టరాకున్నది.

న హి విరోధ ఉభయం భగవత్యపరిగణితగుణగణే ఈశ్వరేఽనవగాహ్యమాహాత్మ్యేఽర్వాచీనవికల్పవితర్కవిచారప్రమాణాభాసకుతర్కశాస్త్రకలిలాంతఃకరణాశ్రయదురవగ్రహవాదినాం వివాదానవసర ఉపరతసమస్తమాయామయే కేవల ఏవాత్మమాయామంతర్ధాయ కో న్వర్థో దుర్ఘట ఇవ భవతి స్వరూపద్వయాభావాత్ ॥ 36

అపరిగణితగుణగణే - లెక్కించని గుణముల సమూహము కలిగినట్టియు, ఈశ్వరే - సర్వమును శాసించునట్టియు, అనవగాహ్యమాహాత్మ్యే - తెలియ శక్యము కాని మహిమ కలిగినట్టియు, అర్వాచీనవికల్పవితర్కవిచారప్రమాణ-ఆభాసకుతర్కశాస్త్రకలిల-అంతఃకరణ-ఆశ్రయదురవగ్రహవాదినామ్ - కొంగ్రొత్త వికల్పములు వితర్కములు విచారములు ప్రమాణములుగా కనిపించే అప్రమాణములు చెడు తర్కములు గల శాస్త్రములచే

కలుషితమైన అంతఃకరణమే ఆశ్రయముగా గల దురాగ్రహముతో వాదించువారియొక్క, వివాద-అనవసరే - వివాదములకు విషయము కాన ట్టియు, ఉపరతసమస్తమాయామయే - త్రోసిపుచ్చబడిన సమస్తమగు సంసారము కలిగినట్టియు, కేవలే - అద్వితీయమగు, భగవతి - భగవానుని యందు, ఉభయమ్ - రెండు, న హి విరోధః - విరుద్ధము కాదు గదా!, ఆత్మమాయామ్ - నీ మాయాశక్తిని, అంతర్ధాయ - మధ్యలోనుంచుకొని, కః - ఏ, అర్థః - ప్రయోజనము, దుర్ఘటః ఇవ - పొసగనిది (ఘటిల్లనిది) వలె, భవతి ను - అగును చెప్పుమా!, స్వరూపద్వయ-అభావాత్ - స్వరూపమునందు ద్వైతము లేకుండుట వలన.

సర్వమును శాసించే భగవానుని గుణగణములను లెక్కించుట శక్యము కాదు. తెలియ శక్యము కాని మహిమ గల ఆ భగవానుని విషయ ములో, దురాగ్రహమునకు నిలయమై దూషితమైన బుద్ధి గల వాదులు కొంగ్రొత్తగా కల్పించే చెడు తర్కముల శాస్త్రములలోని వికల్పములకు (ఇదా? అదా? అనే సంశయములు), విరుద్ధతర్కములకు, విచారములకు (వాదనలు), ప్రమాణములు (జ్ఞానసాధనములు) వలె కన్పట్టే అప్రమాణ ములకు తావు లేదు. మాయాకల్పితమగు సంసారము అద్వితీయుడగు ఆ భగవానునియందు నిరస్తమైనది. భగవానునియందు సగుణము-నిర్గుణ ము, కర్త-అకర్త మొదలగు పరస్పర విరుద్ధములగు అంశములు మాయాశ క్తిని మధ్యలో నుంచుకున్నచో అసంగతములు కానే కావు. మాయాశక్తిచే పొసగనిది ఒకటి ఉన్నదా! వాస్తవములో సర్వమునకు అతీతమగు అద్వయ బ్రహ్మయందు కర్తృత్వము గాని, అకర్తృత్వము గాని, సగుణత్వము గాని, నిర్గుణత్వము గాని ఉండవు. పరబ్రహ్మ సకలద్వంద్వ విలక్షణము.

సమవిషమమతీనాం మతమనుసరసి యథా రజ్జుఖండసర్పా
దిధియామ్ ॥ 37

రజ్జుఖండః - త్రాడు ముక్క, సర్ప-ఆదిధియాం యథా - పాము మొదలగు భావనలు గలవారి వలె, సమవిషమమతీనామ్ - సమత్వబుద్ధి మరియు భేదదృష్టి గలవారల, మతమ్ - అభిప్రాయమును, అనుసరసి - అనుసరించుచున్నావు.

ఒకే త్రాడు ముక్క యథార్థమగు దర్శనము గలవానికి త్రాడుగను, విరుద్ధదర్శనము గలవారలకు పాము మాల మొదలగు రూపములలోను కానవచ్చును. అదే విధముగా, సమదర్శనము (అద్వయబ్రహ్మాత్మజ్ఞానము) గలవారలకు సర్వరూపుడువుగను, భేదదృష్టి గలవారలకు భేదములు గలవాడివగను కానవచ్చేది నీవే.

స ఏవ హి పునస్సర్వవస్తుని వస్తుస్వరూపస్సర్వేశ్వరస్సకలజగత్కారణకారణభూతస్సర్వప్రత్యగాత్మత్వాత్సర్వగుణాభాసోపలక్షిత ఏక ఏవ పర్యవశేషితః ॥ 38

పునః - మరియు, సర్వ-ఈశ్వరః - సర్వజగన్నాథుడు, సకలజగత్-కారణకారణభూతః - సకలజగత్తునకు కారణమగు పంచభూతములకు కారణమైనవాడు అగు, సః ఏవ హి - ఆ భగవానుడే, సర్వవస్తుని - సకల ప్రపంచమునందు, వస్తుస్వరూపః - పరమార్థ (కేవలసత్తా) రూపుడై, సర్వ ప్రత్యగ్-ఆత్మత్వాత్ - సర్వప్రాణులకు అంతరతమమగు ఆత్మస్వరూపుడగుట వలన, సర్వగుణ-ఆభాస-ఉపలక్షితః - గుణకార్యములగు సర్వేంద్రియముల ప్రకాశములచే గుర్తించబడువాడై, ఏకః ఏవ - ఒక్కడు మాత్రమే, పరి-అవశేషితః - మిగిలి యున్నవాడు.

మరల విచారించినచో, సర్వజగన్నాథుడగు ఆ భగవానుడు సకల జగత్తునకు కారణములగు పంచభూతములకు కూడ కారణము. కావున, సకలప్రపంచముయొక్క పరమార్థ (కేవల-అఖండసత్తా) స్వరూపము ఆయనయే. ఆయనయే సకలప్రాణులలో అంతరతమమగు ఆత్మస్వరూపముగా ఉండి, గుణకార్యములగు ఇంద్రియములనన్నింటినీ ప్రకాశింపజేయుచున్నాడు. ఆయా ఇంద్రియప్రకాశములు ఆ సర్వేశ్వరునే సంకేతముగా చూపుచున్నవి. ఈ కార్యప్రపంచమును సర్వమును నిషేధించగా (కారణముకంటె భిన్నముగా లేదని తెలుసుకొని కారణములో విలీనము చేయగా), మిగిలి ఉండేది ఆ అద్వయ పరమేశ్వరుడు మాత్రమే.

అథ హ వావ తవ మహిమామృతరససముద్రవిప్రుషా సకృదవలీఢయా స్వమనసి నిష్యందమానానవరతసుఖేన విస్మారితదృష్టశ్రు

**తవిషయసుఖలేశాభాసాః పరమభాగవతా ఏకాంతినో భగవతి సర్వ భూతప్రియసుహృది సర్వాత్మని నితరాం నిరంతరం నిర్వృతమ నసః కథము హ వా ఏతే మధుమథన పునస్స్వార్థకుశలా హ్యాత్మ ప్రియసుహృదస్సాధవస్త్వచ్చరణాంబుజానుసేవాం విసృజంతి న యత్ర పునరయం సంసారపర్యావర్తః ॥ 39**

మధుమథన - మధువును సంహరించినవాడా!, అథ హ వావ - ఇందువలననే, తవ - నీ, మహిమామృతరససముద్రవిప్రుషా - మహిమ అనే అమృతరస సముద్రముయొక్క బిందువు, సకృత్ - ఒక్కసారి, అవలీ ఢయా - ఆస్వాదించబడగా, స్వమనసి - తమ మనస్సునందు, నిష్యంద మాన-అనవరతసుఖేన - జాలువారే అఖండానందముచే, విస్మారితదృష్ట శ్రుతవిషయసుఖలేశ-ఆభాసాః - మరుపునకు తీసుకు రాబడిన చూచిన విన్న ఇంద్రియభోగములయందలి సుఖముయొక్క లేశముయొక్క ప్రతీతి గలవారు, ఏకాంతినః - అనన్యభక్తులు, సర్వభూతప్రియసుహృది - సకల ప్రాణులకు ఆత్మరూపుడైన హితకారియైనట్టియు, సర్వ-ఆత్మని - సర్వము నకు ఆత్మయగు, భగవతి - భగవానునియందు, నితరామ్ - సుతరాము, నిరంతరమ్ - ప్రతి క్షణము, నిర్వృతమనసః - సుఖముగా నిలిచియున్న మనస్సు గలవారు, స్వ-అర్థకుశలాః - తమ పురుషార్థమునందు నిపుణు లు, ఆత్మప్రియసుహృదః - ఆత్మయే ప్రియమైనది మరియు హితకరమైన దిగా గలవారు, సాధవః - పరోపకారులు అగు, ఏతే - ఈ, పరమభాగవతాః - గొప్ప భగవద్భక్తులు, త్వత్-చరణ-అంబుజ-అనుసేవామ్ - నీ పాదప ద్మముల నిరంతరసేవను, పునః - మరల, కథం ఉ హ వై - ఏ విధముగా, విసృజంతి - విడిచిపెట్టెదరు, యత్ర - దేనియందైతే, అయమ్ - ఈ, సంసారపర్యావర్తః - సంసారమునందు పరిభ్రమణము, పునః - మరల, న హి - లేదో.

ఓ మధుసూదనా! కావుననే, భగవద్భక్తశిఖామణులకు నీ మహిమ అనే అమృతరససముద్రముయొక్క బిందువును ఒక్కసారి ఆస్వా దించినంతనే వారి మనస్సునందు అఖండానందము జాలువారును. దానిచే వారు అంతవరకు చూచిన మరియు విన్న ఇంద్రియభోగము

లయందలి అల్పమగు సుఖముయొక్క ప్రతీతి మరుగున పడిపోవును. సకలప్రాణులకు ఆత్మరూపుడవు, హితకారివి, సర్వముయొక్క పరమార్థరూపుడవు, భగవానుడవు అగు నీయందు అనన్యభక్తి గల ఆ సాధుపురుషుల మనస్సు సుఖముగా నిలిచియుండును. తమ పురుషార్థము విషయములో నిపుణులగు ఈ భక్తులు ఆత్మయందే ఆనందఘనుడు హితకరుడు అగు పరబ్రహ్మను దర్శించెదరు. అట్టి మహాత్ములు మరల నీ పాదపద్మముల నిరంతర సేవను ఏ విధముగా విడిచిపెట్టెదరు? (విడిచిపెట్టరు). దాని వలన మానవునకు మరల ఈ సంసారములో పరిభ్రమణము తొలగి పోవును.

త్రిభువనాత్మభవన త్రివిక్రమ త్రినయన త్రిలోకమనోహరాను
భావ తవైవ విభూతయో దితిజదనుజాదయశ్చాపి తేషామను
పక్రమసమయోఽయమితి స్వాత్మమాయయా సురనరమృగ
మిశ్రితజలచరాకృతిభిర్యథాపరాధం దండం దండధర దధర్థ
ఏవమేనమపి భగవన్ జహి త్వాష్ట్రముత యది మన్యసే।40

త్రిభువన-ఆత్మభవన - ముల్లోకములే నీ స్థానముగా గలవాడా! (ముల్లోకములకు ఆత్మ మరియు నివాసము అయినవాడా!), త్రివిక్రమ - మూడు అడుగులను వేసినవాడా!, త్రినయన - ముక్కంటీ!, త్రిలోకమనోహర-అనుభావ - ముల్లోకముల మనస్సును హరించే మహిమ గలవాడా!, దండధర - శిక్షను విధించువాడా!, భగవన్ - భగవానుడా!, దితిజదనుజ-ఆదయః చ అపి - దితి పుత్రులు దనువు పుత్రులు అగు రాక్షసులు కూడ, తవ - నీ, విభూతయః ఏవ - విభూతులే, అపి - అయిననూ, అయమ్ - ఇది, తేషామ్ - వారికి, అనుపక్రమసమయః - ఉద్యమించే కాలము కాదు, ఇతి - అని, స్వ-ఆత్మమాయయా - నీ స్వరూపములో అంతర్గతమైన మాయాశక్తిచే, సురనరమృగమిశ్రితజలచర-ఆకృతిభిః - దేవత మానవుడు మృగము నరమృగముల కలయిక చేపల రూపములతో, యథా-అపరాధమ్ - అపరాధము నతిక్రమించకుండగా, దండమ్ - శిక్షను, దధర్థ - విధించితివి, ఏవమ్ - ఇదే విధముగా, ఉత యది మన్యసే - నీకు ఇచ్ఛ ఉన్నచో, ఏనమ్ - ఈ, త్వాష్ట్రం అపి - త్వష్టయొక్క పుత్రుడగు వృత్రుని కూడ, జహి - సంహరించుము.

ఓ భగవానుడా! ఈ ముల్లోకములే నీ నివాసము. ఈ ముల్లోకములకు నీవే ఆత్మ మరియు ఆశ్రయము. నీవీ ముల్లోకములను మూడు అడుగులతో కొలిచినావు. ముక్కంటివి నీవే. నీ మహిమలు (లీలలు) ముల్లోకములలో మనోహరములైనవి. దితి దనువుల సంతానమగు రాక్షసులు కూడ నీ విభూతులే. అయిననూ, వారు ఉద్యమించే కాలము ఇది కాదని భావించిన సందర్భములలో, నీవు నీ స్వరూపములో అంతర్గతమైన మాయాశక్తిచే దేవత (వామనుడు), మానవుడు (శ్రీరాముడు), మృగము (వరాహము), నరసింహముల కలయిక, జలచరము (మత్స్యము) ల రూపములో అవతరించి, వారి అపరాధములకు తగ్గట్లుగా వారికి శిక్షను అమలు చేసితివి. అదే విధముగా, నీకు అంగీకారమైనచో, త్వష్టయొక్క పుత్రుడగు ఈ వృత్రుని కూడ సంహరించుము.

అస్మాకం తావకానాం తవ నతానాం తత తతామహ తవ చర
ణనలినయుగలధ్యానానుబద్ధహృదయనిగడానాం స్వలింగవి
వరణేనాత్మసాత్కృతానామనుకంపాఽనురంజితవిశదరుచిరశిశి
రస్మితావలోకేన విగలితమధురముఖరసామృతకలయా
చాంతస్తాపమనఘార్హసి శమయితుమ్ ॥ 41

తత - తండ్రీ!, తతామహ - తాతా!, అనఘ - దోషము లేనివాడా!, తావకానామ్ - నీ వారమైనట్టియు, తవ - నీకు, నతానామ్ - నమస్కరించినట్టియు, తవ - నీ, చరణనలినయుగలధ్యాన-అనుబద్ధహృదయనిగడానామ్ - పాదపద్మముల జంటయొక్క ధ్యానించుటచే బంధించి వేయబడిన హృదయమునందలి సంకెల కలిగినట్టియు, స్వలింగవివరణేన - నీ మూర్తిని ప్రకటించుటచే, ఆత్మసాత్-కృతానామ్ - నీవారినిగా స్వీకరించిన మాయొక్క, అంతః-తాపమ్ - అంతరంగమునందలి తాపమును, అనుకంపా-అనురంజితవిశదరుచిరశిశిరస్మిత-అవలోకేన - దయతో అనురాగముతో కూడిన నిర్మలమగు సుందరమైన చల్లని చిరునవ్వుతో కూడిన చూపుతో, విగలితమధురముఖరస-అమృతకలయా చ - బయల్వెడలే మధురమైన ప్రియవాక్కు అనే అమృతబిందువుచే, శమయితుమ్ - చల్లార్చుటకు, అర్హసి - తగుదువు.

కర్తృత్వాది దోషములు లేని ఓ శ్రీహరీ! మాకు తండ్రివి, తాతవు నీవే. మేము నీ వారము. నీకు నమస్కరించుచున్నాము. మా హృదయములు నీ పాదపద్మముల జంటకు ధ్యానము అనే సంకెలచే కట్టి వేయబడినవి. నీవు నీ మూర్తిని మా ముందు ప్రకటించి మమ్ములను నీవారినిగా స్వీకరించినావు. నీ అందమగు నిర్మలమైన చిరునవ్వు దయతో అనురాగముతో కూడి చల్లగా నుండును. అట్టి చిరునవ్వుతో కూడిన చూపుతో, మరియు నీ నోటినుండి వెలువడే మధురమగు వాక్కు అనే అమృతబిందువుతో మా మనస్తాపమును చల్లార్చుట నీకు తగును.

అథ భగవంస్తవాస్మాభిరఖిలజగదుత్పత్తిస్థితిలయనిమిత్తాయమానదివ్యమాయావినోదస్య సకలజీవనికాయానామంతర్హృదయేషు బహిరపి చ బ్రహ్మప్రత్యగాత్మస్వరూపేణ ప్రధానరూపేణ చ యథాదేశకాలదేహావస్థానవిశేషం తదుపాదానోపలంభకతయాఽనుభవతస్సర్వప్రత్యయసాక్షిణ ఆకాశశరీరస్య సాక్షాత్పరబ్రహ్మణః పరమాత్మనః కియానిహ వా అర్థవిశేషో విజ్ఞాపనీయస్యాద్విస్ఫులింగాదిభిరివ హిరణ్యరేతసః ।।42

భగవన్ - ఓ భగవానుడా!, అథ - కావున, అఖిలజగద్-ఉత్పత్తిస్థితిలయనిమిత్తాయమానదివ్యమాయావినోదస్య - సకలజగత్తుయొక్క సృష్టి స్థితిలయములకు నిమిత్తమగుచున్న అంతశ్శక్తిరూపమైన మాయచే వినోదము గలిగినట్టియు, సకలజీవనికాయానామ్ - సకలప్రాణిసమూహముల యొక్క, అంతః-హృదయేషు - హృదయముల లోపల, బ్రహ్మప్రత్యగ్-ఆత్మస్వరూపేణ - పూర్ణము అంతరతమము అగు ఆత్మస్వరూపముగా, బహిః అపి చ - బయట కూడ, ప్రధానరూపేణ చ - ప్రకృతి రూపముగా ఉన్నట్టియు, యథాదేశకాలదేహ-అవస్థానవిశేషమ్ - దేశము కాలము శరీరము అవస్థ అనువాటిలోని తేడాలను అతిక్రమించకుండగా, తద్-ఉపాదాన-ఉపలంభకతయా - వాటికి ఉపాదానముగా ప్రకాశింప జేయునదిగా, అనుభవతః - అనుభవించుచున్నట్టియు, సర్వప్రత్యయసాక్షిణః - అన్ని బుద్ధిప్రత్యయములకు సాక్షి యైనట్టియు, ఆకాశశరీరస్య - ఆకాశము వలె నిర్వికారమైన స్వరూపము కలిగినట్టియు, సాక్షాత్ - సాక్షాత్తుగా, పరబ్రహ్మణః -

పరబ్రహ్మ మైనట్టియు, పరమ-ఆత్మనః - అంతరతమమగు ఆత్మ స్వరూపమైన, తవ - నీకు, అస్మాభిః - మాచే, హిరణ్యరేతసః - అగ్నికి, విస్ఫులింగ-ఆదిభిః ఇవ - మిణుగురులు మొదలగువాటిచే వలె, ఇహ - ఇప్పుడు (ఇక్కడ), కియాన్ వై - ఎంతటి, అర్థవిశేషః - విశిష్టమగు ప్రయో జనము, విజ్ఞాపనీయః - విన్నవించుకొన దగినది, స్యాత్ - అగును?

ఓ భగవానుడా! సకలజగత్తుయొక్క సృష్టిస్థితిలయములకు నిమి త్తమగుచున్న మాయ నీ అంతరంగశక్తి. ఆ మాయ నీకు వినోదము. నీవు సకలప్రాణిసమూహముల హృదయముల లోపల పూర్ణమగు అంతరాత్మ రూపముగను, బాహ్యజగత్తునందు ప్రకృతిరూపముగను ప్రకటమగుచున్నా వు. నీవే ఆయా దేశములయందు ఆయా కాలములలో ఆయా దేహముల యందు ఆయా అవస్థలయందు వాటికి ఉపాదానమగు భోక్తృచైతన్యము రూపముగా ప్రకటమై, ఆయా ఇంద్రియాది శక్తులను ప్రకాశింప జేయుచు న్నావు. సకలబుద్ధి ప్రత్యయములకు సాక్షి, వ్యక్తికి అంతరతమ స్వరూపము అగు ఆత్మ సాక్షాత్తుగా నీవే. సర్వజగత్కారణమగు పరబ్రహ్మ నీవే. అట్టి నీకు మేము అగ్నికి మిణుగురులు మొదలగువాటి వంటి వారము. మేము ఇక్కడ ఇప్పుడు నీకు మా విశేషమగు ప్రయోజనమును గురించి విన్నవిం చుకొనే ఆవశ్యకత ఉన్నదా? లేదు.

అత ఏవ స్వయం తదుపకల్పయాస్మాకం భగవతః పరమగురోస్తవ
చరణశతపలాశచ్ఛాయాం వివిధవృజినసంసారపరిశ్రమోపశమనీ
ముపసృతానాం వయం యత్కామేనోపసాదితాః ॥ 43

అతః ఏవ - ఇందువలననే, పరమగురోః - గురువులకు గురువైన ట్టియు, భగవతః - భగవానుడవగు, తవ - నీయొక్క, ఉపసృతానామ్ - శరణాగతులయొక్క, వివిధవృజినసంసారపరిశ్రమ-ఉపశమనీమ్ - వివిధ ములగు దుఃఖములతోడి సంసారమునందలి అధికమగు శ్రమను ఉపశ మింప జేసే, చరణశతపలాశచ్ఛాయామ్ - పాదపద్మముల నీడను, వయమ్ - మేము, యత్-కామేన - దేనియందలి కోరికచే, ఉపసాదితాః - పొందితిమో, తత్ - దానిని, అస్మాకమ్ - మాకు, స్వయమ్ - స్వయము గా, ఉపకల్పయ - సంపాదించి పెట్టుము.

ఓ భగవానుడా! నీవు గురువులకు గురుడవు. నిన్ను శరణు పొంది నవారికి వివిధదుఃఖములతో కూడియున్న సంసారమునందలి అధికమగు శ్రమను నీ పాదపద్మముల నీడ ఉపశమింప జేయుచుండును. మేము ఒక కోరికతో అట్టి నీ పాదములను పట్టుకున్నాము. కావున, నీవు స్వయముగా మాకా కోరికను సంపాదించి పెట్టుము.

అథో ఈశ జహి త్వాష్ట్రం గ్రసంతం భువనత్రయమ్ ।
గ్రస్తాని యేన నః కృష్ణ తేజాంస్యస్త్రాయుధాని చ ।। 44

ఈశ - ఓ ఈశ్వరా!, కృష్ణ - ఓ నల్లనివాడా!, అథో - కావున, భువనత్రయమ్ - ముల్లోకములను, గ్రసంతమ్ - మ్రింగి వేయుచున్న, త్వాష్ట్రమ్ - త్వష్టయొక్క పుత్రుడగు వృత్రుని, జహి - సంహరించుము, యేన - ఎవనిచేనైతే, నః - మాయొక్క, తేజాంసి - శక్తులు, అస్త్ర-ఆయుధాని చ - అస్త్రములు ఆయుధములు కూడ, గ్రస్తాని - మ్రింగి వేయబడినవో.

ఓ ఈశ్వరా! కృష్ణా! కావున, ఇప్పటికే మా శక్తులను అస్త్రములను ఆయుధములను మ్రింగివేసి, ముల్లోకములను కూడ మ్రింగి వేయుచున్న త్వష్టయొక్క పుత్రుడగు ఆ వృత్రుని నీవు సంహరించుము.

హంసాయ దహ్రనిలయాయ నిరీక్షకాయ
కృష్ణాయ మృష్టయశసే నిరుపక్రమాయ ।
సత్సంగ్రహాయ భవపాంథనిజాశ్రమాప్తా-
వంతే పరీష్టగతయే హరయే నమస్తే ।। 45

హంసాయ - సూర్యరూపుడైనట్టియు, దహ్రనిలయాయ - హృదయాకాశమునందు నివసించునట్టియు, నిరీక్షకాయ - సాక్షియైనట్టియు, కృష్ణాయ - ఆనందస్వరూపుడైనట్టియు, మృష్టయశసే - ఉజ్జ్వలమగు కీర్తి కలిగినట్టియు, నిరుపక్రమాయ - అనాది యైనట్టియు, సత్-సంగ్రహాయ - సత్పురుషులచే చక్కగా పట్టుకొనబడునట్టియు, భవపాంథనిజ-ఆశ్రమ-ఆప్తౌ - సంసారమార్గమునందలి బాటసారికి తన శరణు పొందగా, అంతే - అంతమునందు, పరీష్టగతయే - సర్వోత్తమమగు మోక్షరూపుడై

నట్టియు, హరయే - పాపములను పోగొట్టే, తే - నీ కొరకు, నమః - నమస్కారము.

ఓ శ్రీహరీ! సూర్యరూపముగా నున్న నీకు నమస్కారము. ఆనంద స్వరూపుడవగు నీవు ప్రాణుల హృదయాకాశములో సాక్షిచైతన్యమై నివసించుచున్నావు. ఉజ్జ్వలమగు కీర్తి గల నీకు ఆది లేదు. సత్పురుషులు నిన్నే ధ్యానమునందు గట్టిగా పట్టుకొనెదరు. సంసారమార్గములో బాటసారి యగు జీవుడు నిన్ను శరణు పొందినప్పుడు, సంసారము అంతమై సర్వోత్తమమగు గతిగా నిన్నే పొందును.

శ్రీశుక ఉవాచ ।
అథైవమీడితో రాజన్ సాదరం త్రిదశైర్హరిః ।
స్వముపస్థానమాకర్ణ్య ప్రాహ తానభినందితః ॥ 46

రాజన్ - ఓ మహారాజా!, అథ - తరువాత, ఏవమ్ - ఈ విధముగా, త్రిదశైః - దేవతలచే, సాదరమ్ - సాదరముగా, ఈడితః - స్తుతించబడిన, హరిః - శ్రీహరి, స్వమ్ - తనదైన, ఉపస్థానమ్ - స్తుతిని, ఆకర్ణ్య - విని, అభినందితః - ప్రసన్నుడుగా చేయబడినవాడై, తాన్ - వారినుద్దేశించి, ప్రాహ - పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ మహారాజా! ఆ దేవతలీ విధముగా సాదరముగా స్తుతించగా, అపుడా శ్రీహరి తన స్తుతిని విని ప్రసన్నుడై వారితో నిట్లనెను.

శ్రీభగవానువాచ ।
ప్రీతోఽహం వస్సురశ్రేష్ఠా మదుపస్థానవిద్యయా ।
ఆత్మైశ్వర్యస్మృతిః పుంసాం భక్తిశ్చైవ యయా మయి ॥47

సురశ్రేష్ఠాః - దేవతోత్తములారా!, వః - మీ, మద్-ఉపస్థానవిద్యయా - నా స్తుతితో కూడిన జ్ఞానముచే, అహమ్ - నేను, ప్రీతః - సంతోషించినవాడను, యయా - దేనిచే, పుంసామ్ - మానవులకు, ఆత్మైశ్వర్య

స్మృతిః - నా (ఆత్మయొక్క) ఐశ్వర్యముయొక్క స్మరణము, మయి - నాయందు, భక్తిః చ ఏవ - భక్తి కూడ కలుగునో.

శ్రీభగవానుడిట్లు పలికెను --- ఓ దేవతోత్తములారా! మీరు నన్ను ఉద్దేశించి చేసిన స్తుతి తత్త్వజ్ఞానముతో కూడియున్నది. నేను ప్రసన్నుడనై తిని. ఈ స్తుతి వలన మానవులకు నాయందు భక్తి కూడ ఉదయించి, ఆత్మ రూపుడనగు నా ఈశ్వరభావము స్మృతిలో నుండును.

కిం దురాపం మయి ప్రీతే తథాపి విబుధర్షభాః ।
మయ్యేకాంతమతిర్నాన్యన్మత్తో వాంఛతి తత్త్వవిత్ ॥ 48

విబుధ-ఋషభాః - దేవతోత్తములారా!, మయి - నేను, ప్రీతే - ప్రసన్నుడను కాగా, దురాపమ్ - పొంద శక్యము కానిది, కిమ్ - ఏమి ఉండును?, తథాపి - అయినప్పటికీ, మయి - నాయందు, ఏకాంతమతిః - అఖండమగు భక్తిగల, తత్త్వవిత్ - తత్త్వము తెలిసినవాడు, మత్తః - నానుండి, అన్యత్ - ఇతరమునూ, న వాంఛతి - కోరడు.

ఓ దేవతోత్తములారా! నేను ప్రసన్నుడనైనచో లభించనిది ఏమి ఉండును? అయిననూ, నాయందు అనన్యమగు భక్తిగల తత్త్వవేత్తలు నానుండి (భక్తిని తక్క) ఇతరమును దేనినీ కోరరు.

న వేద కృపణశ్శ్రేయ ఆత్మనో గుణవస్తుదృక్ ।
తస్య తానిచ్ఛతో యచ్ఛేద్యది సోఽపి తథావిధః ॥ 49

గుణవస్తుదృక్ - గుణముల కార్యమగు ప్రపంచమునందు యథార్థ మనే బుద్ధి గలవాడు, కృపణః - భోగాసక్తి గలవాడు, ఆత్మనః - తనయొక్క, శ్రేయః - హితమును, న వేద - తెలియకున్నాడు, తాన్ - ఆ భోగములను, ఇచ్ఛతః - కోరుచున్న, తస్య - వానికి, యది యచ్ఛేత్ - ఇచ్చినచో, సః అపి - ఆ ఇచ్చువాడు కూడ, తథావిధః - అట్టివాడే.

త్రిగుణకార్యమగు జగత్తునందు సత్యత్వబుద్ధి గల వ్యక్తి సంసారాసక్తుడై యుండును. వానికి తన హితము ఏదో తెలియదు. వాడు కోరే భోగములను వానికి ఇచ్చినచో, ఇచ్చువాడు కూడ అట్టి అజ్ఞానియే యగును.

స్వయం నిశ్శ్రేయసం విద్వాన్ న వక్త్యజ్ఞాయ కర్మ హి ।
న రాతి రోగిణోఽపథ్యం వాంఛతో హి భిషక్తమః ॥ 50

స్వయమ్ - తాను, నిశ్శ్రేయసమ్ - మోక్షసాధనమగు ఆత్మజ్ఞానమును, విద్వాన్ - తెలుసుకున్నవాడు, అజ్ఞాయ - అజ్ఞాని కొరకు, కర్మ - కర్మను, న వక్తి - బోధించడు, హి - ఏలయనగా, భిషక్తమః - గొప్ప వైద్యుడు, రోగిణః - రోగి, అపథ్యమ్ - హితము కాని ఆహారమును, వాంఛతః - కోరుచుండగా, న రాతి - ఈయడు.

మోక్షసాధనమగు ఆత్మజ్ఞానమును పొందిన మహాత్ముడు అజ్ఞానికి కామనలను తీర్చే కర్మల నుపదేశించడు. హితము కాని ఆహారమును రోగి కోరిననూ, మంచి వైద్యుడు ఆతనికి దానిని ఈయడు గదా!

మఘవన్ యాత భద్రం వో దధ్యంచమృషిసత్తమమ్ ।
విద్యావ్రతతపస్సారం గాత్రం యాచత మా చిరమ్ ॥ 51

మఘవన్ - ఓ ఇంద్రా!, యాత - వెళ్లుడు, వః - మీకు, భద్రమ్ - మంగళమగు గాక!, ఋషిసత్తమమ్ - మహర్షియగు, దధ్యంచమ్ - దధీచుని, మా చిరమ్ - శీఘ్రముగా, విద్యావ్రతతపః-సారమ్ - ఉపాసన వ్రతములు తపస్సులచే దృఢమైన, గాత్రమ్ - శరీరమును, యాచత - కోరుడు.

ఓ ఇంద్రా! దధీచి మహర్షివద్దకు శీఘ్రముగా వెళ్లుడు. మీకు మంగళమగు గాక! ఉపాసన, వ్రతములు, తపస్సులచే దృఢమైన ఆయన శరీరమును కోరుడు.

స వా అధిగతో దధ్యఙ్ఙశ్విభ్యాం బ్రహ్మ నిష్కలమ్ ।
యద్వా అశ్వశిరో నామ తయోరమరతాం వ్యధాత్ ॥ 52

నిష్కలమ్ - నిరవయవమగు, బ్రహ్మ - పరబ్రహ్మను, వై - నిశ్చయముగా, అధిగతః - తెలుసుకున్న, సః - ఆ, దధ్యఙ్ - దధీచి, అశ్విభ్యామ్ - అశ్వినీ దేవతల కొరకు, అశ్వశిరః నామ - అశ్వశిరము అని

ప్రసిద్ధి గల, యత్ వై - ఏదైతే, తయోః - వారిద్దరికి, అమరతామ్ - జీవన్ముక్తిని, వ్యధాత్ - ఇచ్చెనో.

నిరవయవమగు పరబ్రహ్మయొక్క జ్ఞానము ఆ దధీచునకు గలదు. అశ్వశిరము అని ప్రసిద్ధి గాంచిన ఆ జ్ఞానమును ఆయన అశ్వినీ కుమారులకు ఉపదేశించగా, వారు జీవన్ముక్తులైరి.

దధ్యఙ్ఙాథర్వణస్త్వష్ట్రే వర్మాభేద్యం మదాత్మకమ్ ।
విశ్వరూపాయ యత్ప్రాదాత్త్వష్టా యత్త్వమధాస్తతః ।। 53

ఆథర్వణః - అథర్వవేదీయుడగు, దధ్యఙ్ - దధీచి, మద్-ఆత్మకమ్ - నా స్వరూపమగు, అభేద్యమ్ - భేదింప శక్యము కాని, వర్మ - కవచమును, త్వష్ట్రే - త్వష్ట కొరకు, త్వష్టా - త్వష్ట, యత్ - దేనిని, విశ్వరూపాయ - విశ్వరూపుని కొరకు, ప్రాదాత్ - ఇచ్చెనో, తతః - వానినుండి, యత్ - దేనిని, త్వమ్ - నీవు, అధాః - ధారణ చేసితివో.

అథర్వవేదీయుడగు దధీచి నా స్వరూపమగు కవచమును త్వష్టకు ఇచ్చెను. ఆ కవచము దుర్భేద్యమైనది. దానిని త్వష్ట తన పుత్రుడగు విశ్వరూపునకీయగా, ఆయన వద్దనుండి నీవు పొంది ధారణ చేసితివి.

యుష్మభ్యం యాచితోఽశ్విభ్యాం ధర్మజ్ఞోఽంగాని దాస్యతి ।
తతస్తైరాయుధశ్రేష్ఠో విశ్వకర్మవినిర్మితః ।
యేన వృత్రశిరో హర్తా మత్తేజఉపబృంహితః ।। 54

ధర్మజ్ఞః - ధర్మము తెలిసిన దధీచి, అశ్విభ్యామ్ - అశ్వినీ దేవతలచే, యాచితః - కోరబడినవాడై, యుష్మభ్యమ్ - మీ కొరకు, అంగాని - అవయవములను, దాస్యతి - ఈయగలడు, తతః - తరువాత, తైః - వాటితో, ఆయుధశ్రేష్ఠః - గొప్ప ఆయుధము, విశ్వకర్మవినిర్మితః - విశ్వకర్మచే నిర్మించబడేది, యేన - దేనితో, మత్-తేజః-ఉపబృంహితః - నా తేజస్సుచే వర్ధిల్ల జేయబడిన నీవు, వృత్రశిరః - వృత్రుని తలను, హర్తా - తొలగించ గలవు.

అశ్వినీ దేవతలు కోరినచో, ధర్మము తెలిసిన దధీచి తన అవయవములను మీకు ఈయగలడు. వాటితో విశ్వకర్మ గొప్ప ఆయుధమును నిర్మించును. నా తేజస్సుచే వర్ధిల్లజేయబడిన నీవు దానితో వృత్రుని తలను నరుకగలవు.

తస్మిన్ వినిహతే యూయం తేజోఽస్త్రాయుధసంపదః ।
భూయః ప్రాప్స్యథ భద్రం వో న హింసంతి చ మత్పరాన్।55

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే
వృత్రాసురోత్పత్తివర్ణనం నామ నవమోఽధ్యాయః ।।

తస్మిన్ - ఆ వృత్రుడు, వినిహతే - సంహరించబడగా, యూయమ్ - మీరు, తేజః-అస్త్ర-ఆయుధసంపదః - తేజస్సును అస్త్రములను శస్త్రములను సంపదలను, భూయః - మరల, ప్రాప్స్యథ - పొందగలరు, వః - మీకు, భద్రమ్ - మంగళమగు గాక!, మత్-పరాన్ - నా భక్తులను, న హింసంతి - హింసించరు.

ఆ వృత్రుడు సంహరించబడగానే మీకు తేజస్సు, అస్త్రశస్త్రములు, సంపదలు మరల లభించగలవు. మీకు మంగళమగు గాక! నా భక్తులను ఎవరైననూ హింసించలేరు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి ఆరవ స్కంధములో వృత్రాసురుని జననమును వర్ణించే తొమ్మిదవ అధ్యాయము ముగిసినది (9).

*****

# అథ దశమోऽధ్యాయః

## దేవాసుర యుద్ధము

శ్రీశుక ఉవాచ ।
ఇంద్రమేవం సమాదిశ్య భగవాన్ విశ్వభావనః ।
పశ్యతామనిమేషాణాం తత్రైవాంతర్దధే హరిః ॥ 1

విశ్వభావనః - జగత్తునకు సుఖమును కలిగించే, భగవాన్ హరిః - శ్రీహరి భగవానుడు, ఇంద్రమ్ - ఇంద్రుని, ఏవమ్ - ఈ విధముగా, సమాదిశ్య - ఆదేశించి, అనిమేషాణామ్ - దేవతలు, పశ్యతామ్ - చూచుచుండగా, తత్ర ఏవ - అచటనే, అంతః-దధే - అంతర్ధానమాయెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- జగత్తునకు సుఖమును కలిగించే శ్రీహరి భగవానుడు ఇంద్రుని ఈ విధముగా ఆదేశించి, దేవతలు చూచుచుండగా అచటనే అంతర్ధానమాయెను.

తథాऽభియాచితో దేవైరృషిరాథర్వణో మహాన్ ।
మోదమాన ఉవాచేదం ప్రహసన్నివ భారత ॥ 2

భారత - భరతవంశీయుడవగు ఓ రాజా!, దేవైః - దేవతలచే, తథా - ఆ విధముగా, అభియాచితః - కోరబడినవాడై, ఆథర్వణః - అథర్వవేదమునకు చెందిన, మహాన్ - గొప్ప, ఋషిః - ఋషి, మోదమానః - సంతోషించుచున్నవాడై, ప్రహసన్ ఇవ - చిరునవ్వు నవ్వుచున్నాడా యన్నట్లు, ఇదమ్ - ఈ మాటను, ఉవాచ - పలికెను.

భరతవంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! దేవతలు అథర్వణవేదీయుడగు దధీచి మహర్షిని అదే విధముగా కోరిరి. అపుడాయన సంతోషిస్తూ, చిరునవ్వుతో వారితోనిట్లనెను.

**అపి బృందారకా యూయం న జానీథ శరీరిణామ్ ।**
**సంస్థాయాం యస్త్వభిద్రోహో దుస్సహశ్చేతనాపహః ।। 3**

బృందారకాః - దేవతలారా!, శరీరిణామ్ - ప్రాణులకు, సంస్థా యామ్ - మృత్యువునందు, యః తు - ఏ, చేతన-అపహః - తెలివిని పోగొట్టే, దుస్సహః - సహించ శక్యము కాని, అభిద్రోహః - ఉపద్రవము కలుగునో దానిని, యూయమ్ - మీరు, అపి న జానీథ - తెలియకున్నారా యేమి?

దేవతలారా! దేహధారులకు మరణసమయములో సహించ శక్యము కాని ఉపద్రవము (పీడ) కలిగి మూర్ఛ కూడ వచ్చును. ఆ విష యము మీకు తెలియదా యేమి?

**జిజీవిషూణాం జీవానామాత్మా ప్రేష్ఠ ఇహేప్సితః ।**
**క ఉత్సహేత తం దాతుం భిక్షమాణాయ విష్ణవే ।। 4**

జిజీవిషూణామ్ - జీవించ గోరే, జీవానామ్ - ప్రాణులకు, ఆత్మా - దేహము, ప్రేష్ఠః - మిక్కిలి ప్రియమైనది, ఇహ - ఈ లోకమునందు, ఈప్సితః - అభీష్టము, తమ్ - దానిని, భిక్షమాణాయ - కోరుచున్న, విష్ణవే - విష్ణువు కొరకు, దాతుమ్ - ఇచ్చుటకు, కః - ఎవడు, ఉత్సహేత - సాహ సించును?

ఈ లోకములో జీవించ గోరే ప్రాణులకు దేహము మిక్కిలి ప్రియ తమమైనది, అభీష్టమైనది. స్వయముగా విష్ణువే కోరిననూ, దానిని ఇచ్చు టకు ఎవడు సాహసించును?

**దేవా ఊచుః ।**
**కిం ను తద్దుస్త్యజం బ్రహ్మన్ పుంసాం భూతానుకంపినామ్ ।**
**భవద్విధానాం మహతాం పుణ్యశ్లోకేడ్యకర్మణామ్ ।। 5**

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, భూత-అనుకంపినామ్ - ప్రాణులయందు దయ కలిగినట్టియు, పుణ్యశ్లోక-ఈడ్యకర్మణామ్ - పవిత్రమగు కీర్తి గలవా రిచే కొనియాడదగిన కర్మలు గలిగినట్టియు, మహతామ్ - మహాత్ములగు,

భవద్-విధానామ్ - నీవంటి, పుంసామ్ - మానవులకు, దుస్త్యజమ్ - విడిచిపెట్ట శక్యము కాని, తత్ - అది, కిం ను - ఏమి ఉండును?

దేవతలిట్లు పలికిరి --- ఓ మహర్షీ! భూతదయ, పవిత్రమగు కీర్తి, పవిత్రమగు కీర్తి గలవారిచే కూడ కొనియాడదగిన కర్మలు గల నీవంటి మహాత్ములగు పురుషులకు విడిచిపెట్ట శక్యము కానిది ఏమి ఉండును?

నను స్వార్థపరో లోకో న వేద పరసంకటమ్ ।
యది వేద న యాచేత నేతి నాహ యదీశ్వరః ॥ 6

లోకః - జనుడు, స్వ-అర్థపరః - తన పనియే ప్రధానముగా గలవాడు, పరసంకటమ్ - ఇతరుల కష్టమును, న వేద - గుర్తించడు, యది వేద - గుర్తించినచో, న యాచేత - కోరడు, యది ఈశ్వరః - సమర్థుడైనచో, న ఇతి - లేదని, న ఆహ - చెప్పడు.

జనులకు తమ పనియే ప్రధానముగా నుండును. వారు ఇతరుల కష్టమును తెలుసుకొనరు. తెలుసుకొనేవారైనచో, ఇతరులను ఈ విధముగా యాచించరు. దాత సమర్థుడైనచో, ఇతరులు యాచించినప్పుడు కాదనడు.

ఋషిరువాచ ।
ధర్మం వశ్శ్రోతుకామేన యూయం మే ప్రత్యుదాహృతాః ।
ఏష వః ప్రియమాత్మానం త్యజంతం సంత్యజామ్యహమ్ ॥7

వః - మీనుండి, ధర్మమ్ - ధర్మమును, శ్రోతుకామేన - వినగోరే, మే - నాచే, యూయమ్ - మీరు, ప్రతి-ఉదాహృతాః - నిరాకరించ బడినారు, ఏషః - ఈ, అహమ్ - నేను, త్యజంతమ్ - విడిచి పెట్టుచున్న, ప్రియమ్ - ప్రియమైన, ఆత్మానమ్ - దేహమును, వః - మీ కొరకై, సంత్యజామి - విడిచి పెట్టుచున్నాను.

దధీచి మహర్షి ఇట్లు పలికెను --- నేను మీనుండి ధర్మమును వినగోరి మిమ్ములను నిరాకరించినట్లు మాటలాడినాను. ఇదిగో! నేను ప్రియమైన దేహమును మీ కొరకు విడిచి పెట్టుచున్నాను. ఈ దేహము నన్ను ఒకనాడు విడిచి పెట్టేదే.

యోఽధ్రువేణాత్మనా నాథా న ధర్మం న యశః పుమాన్ ।
ఈహేత భూతదయయా స శోచ్యః స్థావరైరపి ।। 8

నాథాః - ప్రభువులారా!, యః - ఏ, పుమాన్ - మానవుడైతే, భూతదయయా - ప్రాణులయందలి దయచే, అధ్రువేణ - అనిత్యమగు, ఆత్మనా - దేహముతో, ధర్మమ్ - ధర్మమును, న ఈహేత - చేయడో, యశః - కీర్తిని, న - చేయడో, సః - ఆతడు, స్థావరైః అపి - చెట్టుచేమలచే కూడ, శోచ్యః - శోకించ దగినవాడు.

ఓ ప్రభువులారా! ఏ మానవుడైతే భూతదయ గలవాడై, అనిత్యమగు దేహముతో ధర్మమును చేసి కీర్తిని సంపాదించడో, అట్టివానిని గురించి చెట్టు చేమలు కూడ శోకింప దగినదే.

ఏతావానవ్యయో ధర్మః పుణ్యశ్లోకైరుపాసితః ।
యో భూతశోకహర్షాభ్యామాత్మా శోచతి హృష్యతి ।। 9

పుణ్యశ్లోకైః - పవిత్రమగు కీర్తి గలవారిచే, ఉపాసితః - ఉపాసించబడిన, అవ్యయః - వినాశము లేని, ధర్మః - ధర్మము, ఏతావాన్ ఏవ - ఇంత మాత్రమే, యః - ఏదనగా, ఆత్మా - తాను, భూతశోకహర్షాభ్యామ్ - ప్రాణుల దుఃఖము మరియు సుఖములచే, శోచతి - దుఃఖించును, హృష్యతి - హర్షించును.

మానవుడు ప్రాణుల దుఃఖముచే తాను దుఃఖమును, వాటి సుఖముచే తాను హర్షమును పొందవలెను. పవిత్రమగు కీర్తి గలవారలు ఉపాసించే వినాశము లేని ధర్మము ఇంత మాత్రమే.

అహో దైన్యమహో కష్టం పారక్యైః క్షణభంగురైః ।
యన్నోపకుర్యాదస్వార్థైర్మర్త్యస్స్వజ్ఞాతివిగ్రహైః ।। 10

అహో - అయ్యో!, దైన్యమ్ - దీనత!, అహో - అయ్యో!, కష్టమ్ - కష్టము!, యత్ - ఏదనగా, పారక్యైః - ఇతరప్రాణులకు మాత్రమే పనికి వచ్చునట్టియు, క్షణభంగురైః - క్షణకాలములో ముక్కలగునట్టియు, అస్వార్థైః - తన పురుషార్థమునకు పనికిరాని, స్వజ్ఞాతివిగ్రహైః - ధనము

బంధువులు దేహములచే, మర్త్యః - మానవుడు, న ఉపకుర్యాత్ - ఉపకార మును చేయడో.

ధనము, బంధువులు, దేహము క్షణకాలములో ముక్కలయ్యేవే గాని, పురుషార్థమునకు పనికి వచ్చేవి కావు. ఇవి అంతతో గత్వా ఇతరు లకు మాత్రమే పనిని ఇచ్చును. మానవుడు వీటితో పరోపకారమును చేయ కపోవుట, అయ్యో! ఎట్టి దీనత! అయ్యో! ఎట్టి కష్టము!

శ్రీశుక ఉవాచ ।
ఏవం కృతవ్యవసితో దధ్యఙ్ఙాథర్వణస్తనుమ్ ।
పరే భగవతి బ్రహ్మణ్యాత్మానం సన్నయన్ జహౌ ॥ 11

ఏవమ్ - ఈ విధముగా, కృతవ్యవసితః - చేయబడిన నిశ్చ యము గలవాడు, ఆథర్వణః - అథర్వవేదీయుడు అగు, దధ్యఙ్ - దధీచి, పరే బ్రహ్మణి - పరబ్రహ్మయగు, భగవతి - శ్రీహరి భగవానునియందు, ఆత్మానమ్ - మనస్సును, సన్నయన్ - విలీనము చేయువాడై, తనుమ్ - దేహమును, జహౌ - విడిచి పెట్టెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- అథర్వవేదీయుడగు దధీచి ఈ విధముగా నిశ్చయించుకొని, పరబ్రహ్మస్వరూపుడగు శ్రీహరి భగవానుని యందు మనస్సును విలీనము చేసి, దేహమును విడిచి పెట్టెను.

యతాక్షాసుమనోబుద్ధిస్తత్త్వదృగ్ ధ్వస్తబంధనః ।
ఆస్థితః పరమం యోగం న దేహం బుబుధే గతమ్ ॥ 12

యత-అక్ష-అసుమనః-బుద్ధిః - నియంత్రించబడిన ఇంద్రియ ములు ప్రాణములు మనస్సు బుద్ధి గలవాడు, తత్త్వదృగ్ - పరమాత్మ తత్త్వము తెలిసినవాడు, ధ్వస్తబంధనః - నశింప జేయబడిన కర్మబంధము గలవాడు అగు దధీచి, పరమమ్ - సర్వోత్తమమగు, యోగమ్ - చిత్తైకాగ్ర తను, ఆస్థితః - స్థిరముగా పొందినవాడై, గతమ్ - జారిపోయిన, దేహమ్ - దేహమును, న బుబుధే - తెలియలేదు.

పరమాత్మతత్త్వము నెరింగిన దధీచికి కర్మబంధము నశించెను. ఆయన ఇంద్రియములను, ప్రాణములను, మనస్సును, బుద్ధిని వశము చేసుకొని, సర్వోత్తమమగు చిత్తైకాగ్రతను పొందియుండెను. ఆయనకు తెలియకుండానే దేహత్యాగము సంపన్నమయ్యెను.

అథేంద్రో వజ్రముద్యమ్య నిర్మితం విశ్వకర్మణా ।
మునేశ్శక్తిభిరుత్సిక్తో భగవత్తేజసాఽన్వితః ॥ 13
వృతో దేవగణైస్సర్వైర్గజేంద్రోపర్యశోభత ।
స్తూయమానో మునిగణైస్త్రైలోక్యం హర్షయన్నివ ॥ 14

అథ - తరువాత, మునేః - దధీచి మహర్షియొక్క, శక్తిభిః - ఎముకలతో, విశ్వకర్మణా - విశ్వకర్మచే, నిర్మితమ్ - నిర్మించబడిన, వజ్రమ్ - వజ్రమును, ఇంద్రః - ఇంద్రుడు, ఉద్యమ్య - పైకెత్తి, ఉత్సిక్తః - బలమును పొందినవాడై, భగవత్-తేజసా - భగవానుని తేజస్సుతో, అన్వితః - కూడుకున్నవాడై, సర్వైః - అన్ని, దేవగణైః - దేవతల గణములచే, వృతః - చుట్టువారబడిన వాడై, మునిగణైః - మహర్షుల గణములచే, స్తూయమానః - స్తుతించబడు చున్నవాడై, త్రైలోక్యమ్ - ముల్లోకములను, హర్షయన్ ఇవ - హర్షింప జేయుచున్నవాడు వలె, గజ-ఇంద్ర-ఉపరి - గొప్ప ఏనుగు పైన, అశోభత - శోభిల్లెను.

తరువాత విశ్వకర్మ దధీచి మహర్షియొక్క ఎముకలతో వజ్రమును నిర్మించెను. బలమును పొంది, భగవానుని తేజస్సుతో కూడియున్న ఇంద్రుడు గొప్ప ఏనుగుపై కూర్చుండి దానిని పైకెత్తి పట్టుకొని శోభిల్లెను. దేవగణములన్నియు ఆయనను చుట్టువారి యుండెను. మహర్షుల గణములాయనను స్తుతించుచుండెను. ఆయన ముల్లోకములను ఆనందింప జేయుచున్నాడా యన్నట్లు ఉండెను.

వృత్రమభ్యద్రవచ్ఛేత్తుమసురానీకయూథపైః ।
పర్యస్తమోజసా రాజన్ క్రుద్ధో రుద్ర ఇవాంతకమ్ ॥ 15

రాజన్ - ఓ రాజా!, క్రుద్ధః - కోపించిన ఇంద్రుడు, అసుర-అనీక యూథపైః - రాక్షస సేనానాయకులతో, పర్యస్తమ్ - కూడియున్న

వృత్రమ్ - వృత్రుని, ఛేత్తుమ్ - నరుకుటకు, రుద్రః - రుద్రుడు, అంతకం ఇవ - యముని వలె, ఓజసా - బలముతో, అభ్యద్రవత్ - వేగముగా దండెత్తెను.

ఓ మహారాజా! వృత్రుడు రాక్షస సేనానాయకులతో కూడియుండెను. ఇంద్రుడు కోపించి వృత్రుని నరుకుటకై, రుద్రుడు యమునిపైకి వలె, వేగముగా బలముతో ఆతని పైకి దండెత్తెను.

తతస్సురాణామసురై రణః పరమదారుణః ।
త్రేతాముఖే నర్మదాయామభవత్ప్రథమే యుగే ।। 16

తతః - అప్పుడు, ప్రథమే - మొదటి, యుగే - మహాయుగమునందు, త్రేతాముఖే - త్రేతాయుగ ప్రారంభమునందు, నర్మదాయామ్ - నర్మదాతీరమునందు, సురాణామ్ - దేవతలకు, అసురైః - రాక్షసులతో, పరమదారుణః - మిక్కిలి భయంకరమగు, రణః - యుద్ధము, అభవత్ - ఆయెను.

అప్పుడు మొదటి మహాయుగములో త్రేతాయుగము ఆరంభములో నర్మదానదీతీరమునందు దేవతలకు, రాక్షసులతో మిక్కిలి భయంకరమగు యుద్ధము జరిగెను.

రుద్రైర్వసుభిరాదిత్యైరశ్విభ్యాం పితృవహ్నిభిః ।
మరుద్భిరృభుభిస్సాధ్యైర్విశ్వేదేవైర్మరుత్పతిమ్ ।। 17

దృష్ట్వా వజ్రధరం శక్రం రోచమానం స్వయా శ్రియా ।
నామృష్యన్నసురా రాజన్ మృధే వృత్రపురస్సరాః ।। 18

రాజన్ - ఓ రాజా!, రుద్రైః - రుద్రులతో, వసుభిః - వసువులతో, ఆదిత్యైః - ఆదిత్యులతో, అశ్విభ్యామ్ - అశ్వినీ దేవతలతో, పితృవహ్నిభిః - పితృదేవతలతో అగ్నితో, మరుద్భిః - మరుత్తులతో, ఋభుభిః - ఋభువులతో, సాధ్యైః - సాధ్యులతో, విశ్వేదేవైః - విశ్వేదేవతలతో, మరుత్-పతిమ్ - దేవరాజైనట్టియు, వజ్రధరమ్ - వజ్రమును ధరించి యున్నట్టియు, స్వయా - తనదైన, శ్రియా - శోభతో, మృధే - యుద్ధమునందు, రోచమా

నమ్ - ప్రకాశించుచున్న, శక్రమ్ - ఇంద్రుని, దృష్ట్వా - చూచి, వృత్రపుర స్సరాః - వృత్రుడు అగ్రేసరుడుగా గల, అసురాః - రాక్షసులు, న అమృష్యన్ - సహించరైరి.

ఓ మహారాజా! రుద్రులు, వసువులు, ఆదిత్యులు, అశ్వినీ దేవతలు, పితృదేవతలు, అగ్ని, మరుత్తులు, ఋభువులు, సాధ్యులు, విశ్వేదేవతలతో కూడియున్న దేవరాజగు ఇంద్రుడు వజ్రమును ధరించి యుద్ధములో తనదైన శోభతో ప్రకాశించెను. వృత్రుడు అగ్రేసరుడుగా గల రాక్షసులు ఆయనను చూచి సహించ లేకపోయిరి.

నముచిశ్శంబరోఽనర్వా ద్విమూర్ధా ఋషభోఽంబరః ।
హయగ్రీవశ్శంకుశిరా విప్రచిత్తిరయోముఖః ॥ 19

పులోమా వృషపర్వా చ ప్రహేతిర్హేతిరుత్కలః ।
దైతేయా దానవా యక్షా రక్షాంసి చ సహస్రశః ॥ 20

సుమాలిమాలిప్రముఖాః కార్తస్వరపరిచ్ఛదాః ।
ప్రతిషిధ్యేంద్రసేనాగ్రం మృత్యోరపి దురాసదమ్ ॥ 21

అభ్యర్దయన్నసంభ్రాంతాస్సింహనాదేన దుర్మదాః ।
గదాభిః పరిఘైర్బాణైః ప్రాసముద్గరతోమరైః ॥ 22

శూలైః పరశ్వధైః ఖడ్గైశ్శతఘ్నీభిర్భుశుండిభిః ।
సర్వతోఽవాకిరన్ శస్త్రైరస్త్రైశ్చ విబుధర్షభాన్ ॥ 23

నముచిః - నముచి, శంబరః - శంబరుడు, అనర్వా - అనర్వుడు, ద్విమూర్ధా - ద్విమూర్ధుడు, ఋషభః - ఋషభుడు, అంబరః - అంబరుడు, హయగ్రీవః - హయగ్రీవుడు, శంకుశిరాః - శంకుశిరసుడు, విప్రచిత్తిః - విప్రచిత్తి, అయోముఖః - అయోముఖుడు, పులోమా - పులోముడు, వృషపర్వా చ - వృషపర్వుడు, ప్రహేతిః - ప్రహేతి, హేతిః - హేతి, ఉత్కలః - ఉత్కలుడు, దైతేయాః - దితి పుత్రులు, దానవాః - దనుపుత్రులు, యక్షాః - యక్షులు, రక్షాంసి చ - రాక్షసులు, సహస్రశః - వేలాదిగా,

సుమాలిమాలిప్రముఖాః - సుమాలి మాలి మొదలుగా గలవారు, కార్తస్వర పరిచ్ఛదాః - బంగరు ఆభరణములు గలవారు, అసంభ్రాంతాః - భయము లేనివారు, సింహనాదేన - సింహనాదముతో, దుర్మదాః - గర్వించి యున్నవారు, మృత్యోః అపి - యమునకైననూ, దురాసదమ్ - సమీపించ శక్యము కాని, ఇంద్రసేన-అగ్రమ్ - ఇంద్రుని సేనానాయకుని, ప్రతిషిధ్య - త్రోసుకొని, గదాభిః - గదలతో, పరిఘైః - గుదియలతో, బాణైః - బాణము లతో, ప్రాసముద్గరతోమరైః - ఈటెలు సమ్మెటలు చిల్లకోలలతో, శూలైః - శూలములతో, పరశ్వధైః - గండ్ర గొడ్డళ్లతో, ఖడ్గైః - కత్తులతో, శతఘ్నీభిః - ఫిరంగులతో, భుశుండిభిః - ఇనుప ముండ్ల కఱ్ఱలతో, అభ్యర్దయన్ - పీడించిరి, సర్వతః - అన్ని వైపులనుండియు, శస్త్రైః - శస్త్రములతో, అస్త్రైః - అస్త్రములతో, విభుద-ఋషభాన్ - దేవనాయకులను, అవాకి రన్ - వర్షము కురిపించిరి.

నముచి, శంబరుడు, అనర్వ, ద్విమూర్ధుడు, ఋషభుడు, అంబ రుడు, హయగ్రీవుడు, శంకుశిరసుడు, విప్రచిత్తి, అయోముఖుడు, పులోమ, వృషపర్వుడు, ప్రహేతి, హేతి, ఉత్కలుడు, సుమాలి, మాలి మొదలగు దితిపుత్రులు, దనుపుత్రులు, యక్షులు, రాక్షసులు వేలసంఖ్యలో, యమున కైననూ సమీపించ శక్యము కాని ఇంద్రుని సేనానాయకుని త్రోసుకొని నిర్భ యముగా ముందుకు దూసుకు పోయిరి. బంగరు ఆభరణములను ధరించి, గర్వించియున్న ఆ రాక్షసులు సింహనాదమును చేయుచుండిరి. గదలు, గుదియలు, బాణములు, ఈటెలు, సమ్మెటలు, చిల్లకోలలు, శూలములు, గండ్ర గొడ్డళ్లు, కత్తులు, ఫిరంగులు, ఇనుప ముండ్ల కఱ్ఱలతో వారు దేవత లను పీడించిరి. వారు దేవనాయకులపై అన్ని వైపులనుండియు శస్త్రముల ను, అస్త్రములను వర్షముగా కురిపించిరి.

న తేఽదృశ్యంత సంఛన్నాశ్శరజాలైస్సమంతతః ।
పుంఖానుపుంఖపతితైర్జ్యోతీంషీవ నభోఘనైః ॥ 24

సమంతతః - అన్ని వైపులనుండియు, పుంఖ-అనుపుంఖపతితైః - ఒక బాణపు తోకవెంట మరియొక బాణము ఉండునట్లుగా పడుచున్న, శర జాలైః - బాణముల పరంపరలచే, సంఛన్నాః - కప్పివేయబడిన, తే -

వారు, నభః-ఘనైః - ఆకాశమునందలి మేఘములచే, జ్యోతీంషి ఇవ - నక్షత్రములు వలె, న అదృశ్యంత - కానరాలైరి.

వారిపై బాణములు పుంఖానుపుంఖములుగా అన్ని వైపులనుండియు పడుచుండెను. ఆకాశములో మేఘములచే కప్పివేయబడిన నక్షత్రములు వలె, ఆ దేవనాయకులు బాణములచే కప్పబడి కానరాకుండిరి.

న తే శస్త్రాస్త్రవర్షౌఘా హ్యాసేదుస్సురసైనికాన్ ।
ఛిన్నాస్సిద్ధపథే దేవైర్లఘుహస్తైస్సహస్రధా ॥ 25

లఘుహస్తైః - హస్తలాఘవము గల, దేవైః - దేవతలచే, సిద్ధపథే - ఆకాశమునందు, సహస్రధా - వేయి ముక్కలుగా, ఛిన్నాః - ఛేదించబడిన, తే - ఆ, శస్త్ర-అస్త్రవర్ష-ఓఘాః - శస్త్రములు అస్త్రముల వర్షముల పరంపరలు, సురసైనికాన్ - దేవసైనికులను, న హి ఆసేదుః - దగ్గరకు రానే లేదు.

హస్తలాఘవము గల దేవతలు ఆ శస్త్రముల మరియు అస్త్రముల పరంపరల వర్షములను ఆకాశములోనే ఛిన్నాభిన్నము చేయగా, అవి దేవసైనికుల దరిదాపులకు రాలేక పోయినవి.

అథ క్షీణాస్త్రశస్త్రౌఘా గిరిశృంగద్రుమోపలైః ।
అభ్యవర్షన్ సురబలం చిచ్ఛిదుస్తాంశ్చ పూర్వవత్ ॥ 26

అథ - అప్పుడు, క్షీణ-అస్త్రశస్త్ర-ఓఘాః - తగ్గిపోయిన అస్త్రముల శస్త్రముల సముదాయములు గల ఆ రాక్షసులు, గిరిశృంగద్రుమ-ఉపలైః - పర్వత శిఖరములు చెట్లు రాళ్లతో, సురబలమ్ - దేవసైన్యమును, అభ్యవర్షన్ - వర్షించిరి, తాన్ చ - వాటిని కూడ, పూర్వవత్ - ఇదివరలో వలెనే, చిచ్ఛిదుః - ఛేదించిరి.

అప్పుడు రాక్షసుల వద్ద శస్త్రాస్త్రములు ఖర్చు అయిపోగా, వారు దేవసైన్యముపై పర్వత శిఖరములను, చెట్లను, రాళ్లను వర్షించిరి. దేవతలు వాటిని కూడ ముక్కలు ముక్కలుగా చేసిరి.

తానక్షతాన్ స్వస్తిమతో నిశామ్య శస్త్రాస్త్రపూగైరథ వృత్రనాథాః ।
ద్రుమైర్దృషద్భిర్వివిధాద్రిశృంగైరవిక్షతాంస్తత్రసురింద్రసైనికాన్ ।27

అథ - అప్పుడు, శస్త్ర-అస్త్రపూగైః - శస్త్రాస్త్రముల వర్షములచే, అక్షతాన్ - హాని చెందనట్టియు, స్వస్తిమతః - క్షేమముగానున్నట్టియు, ద్రుమైః - చెట్లచే, దృషద్భిః - రాళ్లచే, వివిధ-అద్రిశృంగైః - పలు రకముల పర్వత శిఖరములచే, అవిక్షతాన్ - గాయపడని, తాన్ - ఆ, ఇంద్రసైనికాన్ - ఇంద్రుని సైనికులను, నిశామ్య - చూచి, వృత్రనాథాః - వృత్రుడు నాయకుడుగా గల రాక్షసులు, తత్రసుః - భయపడిరి.

వృత్రుని నాయకత్వములో రాక్షసులు దేవసైన్యముపై శస్త్రములను, అస్త్రములను వర్షించిననూ, వారు చెక్కు చెదరకుండ క్షేమముగా నుండిరి. తరువాత వారు చెట్లను, రాళ్లను, పలు రకముల పర్వత శిఖరములను ఇంద్రుని సైనికులపై వర్షించిననూ, వారికి గాయమే కాలేదు. ఈ స్థితిని చూచి, రాక్షసులు భయపడిరి.

సర్వే ప్రయాసా అభవన్విమోఘాః
కృతాః కృతా దేవగణేషు దైత్యైః ।
కృష్ణానుకూలేషు యథా మహత్సు
క్షుద్రైః ప్రయుక్తా రుశతీ రూక్షవాచః ।। 28

దైత్యైః - రాక్షసులచే, కృష్ణ-అనుకూలేషు - శ్రీకృష్ణుడు అనుకూలుడుగా గల, దేవగణేషు - దేవతల గణములపై, కృతాః కృతాః - మరల మరల చేయబడిన, సర్వే - అన్ని, ప్రయాసాః - ప్రయత్నములు, మహత్సు - మహాత్ములపై, క్షుద్రైః - అల్పులచే, ప్రయుక్తాః - ప్రయోగించబడిన, రుశతీః - తిట్ల రూపములోనున్న, రూక్షవాచః యథా - పరుష వచనములు వలె, విమోఘాః - వ్యర్థములు, అభవన్ - ఆయెను.

అల్పులు మహాత్ములపై ప్రయోగించే తిట్లతో కూడిన పరుషవచనములు వారిపై ఎట్టి ప్రభావమును చూపలేవు. అదే విధముగా, శ్రీకృష్ణుని అనుగ్రహము గల దేవగణములపై రాక్షసులు మరల మరల చేసిన దాడులన్నియు వ్యర్థములే ఆయెను.

తే స్వప్రయాసం వితథం నిరీక్ష్య హరావభక్తా హతయుద్ధదర్పాః ।
పలాయనాయాజిముఖే విసృజ్య పతిం మనస్తే దధురాత్తసారాః ॥

హరౌ - శ్రీహరియందు, అభక్తాః - భక్తి లేనివారు, హతయుద్ధ దర్పాః - నశింప జేయబడిన యుద్ధమునందలి దర్పము గలవారు, ఆత్త సారాః - అపహరించబడిన బలము గల, తే - వారు, వితథమ్ - వ్యర్థమైన, స్వప్రయాసమ్ - తమ శ్రమను, నిరీక్ష్య - చూచి, తే - ప్రసిద్ధులైన, తే - వారు, ఆజిముఖే - యుద్ధారంభమునందు, పతిమ్ - ప్రభువును, విసృజ్య - విడిచిపెట్టి, పలాయనాయ - పారిపోవుటకై, మనః దధుః - నిశ్చయము చేసుకొనిరి.

శ్రీహరియందు భక్తి లేని ఆ రాక్షసులకు యుద్ధమునందలి గర్వము తొలగిపోయెను. వారి మనోబలమంతయు శత్రువులచే తీసుకొనబడెను. ఈ విధముగా యుద్ధమునకు ఆరంభములోనే తమ శ్రమ వ్యర్థమగుటను గాంచి, వారు తమ ప్రభువగు వృత్రుని విడిచిపెట్టి పారిపోవుటకు నిశ్చయించుకొనిరి.

వృత్రోఽసురాంస్తాననుగాన్మనస్వీ ప్రధావతః ప్రేక్ష్య బభాష ఏతత్,
పలాయితం ప్రేక్ష్య బలం చ భగ్నం భయేన తీవ్రేణ విహస్య వీరః।

ప్రధావతః - పారిపోవుచున్నట్టియు, అనుగాన్ - అనుచరులైన, తాన్ - ఆ, అసురాన్ - రాక్షసులను, ప్రేక్ష్య - చూచి, తీవ్రేణ - తీవ్రమగు, భయేన - భయముతో, భగ్నమ్ - చెల్లాచెదరైనట్టియు, పలాయితమ్ - పారిపోవుచున్న, బలం చ - సైన్యమును కూడ, ప్రేక్ష్య - చూచి, మనస్వీ - స్వాభిమానము గలవాడు, వీరః - వీరుడు అగు, వృత్రః - వృత్రుడు, విహస్య - నవ్వి, ఏతత్ - ఈ మాటను, బభాషే - పలికెను.

స్వాభిమానము గల వృత్రాసురుడు తన అనుచరులగు ఆ రాక్షసులు పారిపోవుచుండుటను గాంచెను. తీవ్రమగు భయముతో తన సైన్యము చెల్లాచెదరై పారిపోవుచుండుటను చూచిన ఆ వీరుడు నవ్వి ఇట్లు పలికెను.

కాలోపపన్నాం రుచిరాం మనస్వినా-
ముచావ వాచం పురుషప్రవీరః ।
హే విప్రచిత్తే నముచే పులోమన్
మయానర్వఞ్ఛంబర మే శృణుధ్వమ్ ।। 31

పురుషప్రవీరః - పురుషులలో గొప్ప వీరుడగు వృత్రుడు, కాల-ఉపపన్నామ్ - సమయోచితమైనట్టియు, మనస్వినామ్ - స్వాభిమానము గలవారలకు, రుచిరామ్ - మనోహరమైన, వాచమ్ - మాటను, ఉవాచ - పలికెను, హే విప్రచిత్తే - ఓ విప్రచిత్తీ!, నముచే - నముచీ!, పులోమన్ - పులోమా!, మయ - మయా!, అనర్వన్ - అనర్వా!, శంబర - శంబరా!, మే - నాకు, శృణుధ్వమ్ - వినుడు.

పురుషులలో గొప్ప వీరుడగు వృత్రుడు సమయోచితముగా, స్వాభిమానము గలవారల మనస్సును హరించే ఈ మాటను పలికెను --- ఓ విప్రచిత్తీ! నముచీ! పులోమా! మయా! అనర్వా! శంబరా! నా మాటను వినుడు.

జాతస్య మృత్యుర్ధ్రువ ఏష సర్వతః
ప్రతిక్రియా యస్య న చేహ క్లుప్తా ।
లోకో యశశ్చాథ తతో యది హ్యముం
కో నామ మృత్యుం న వృణీత యుక్తమ్ ।। 32

జాతస్య - పుట్టినవానికి, ఏషః - ఈ, మృత్యుః - మరణము, సర్వతః - అంతటా, ధ్రువః - నిశ్చితము, యస్య - దేనికైతే, ఇహ - ఈ లోకమునందు, ప్రతిక్రియా - నివారణోపాయము, న చ క్లుప్తా - నిర్మించబడలేదో, తతః - దానివలన, లోకః - పుణ్యలోకము, యశః చ - కీర్తి కూడ, యది - కలుగుచున్నచో, అథ - అప్పుడు, అముమ్ - ఈ, యుక్తమ్ - యోగ్యమైన (ప్రాప్తమైన), మృత్యుమ్ - మరణమును, కః నామ - ఎట్టివాడు, న వృణీత - వరించకుండును?

ఈ లోకములో సర్వత్రా పుట్టినవానికి మరణము నిశ్చితము. భగవంతుడు దానికి నివారణోపాయమును కూడ పెట్టలేదు. అట్టి మరణము వలన పుణ్యలోకము కీర్తి కూడ లభించే పక్షములో, అట్టి యోగ్యమగు మరణము సంప్రాప్తమైనప్పుడు, దానిని ఎట్టివాడు వరించకుండును?

ద్వౌ సంమతావిహ మృత్యూ దురాపౌ
యద్బ్రహ్మసంధారణయా జితాసుః ।
కలేవరం యోగరతో విజహ్యాద్
యదగ్రణీర్వీరశయేఽనివృత్తః ।। 33

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే దేవాసురయుద్ధ వర్ణనం నామ దశమోఽధ్యాయః ।।

ఇహ - ఈ లోకమునందు, ద్వౌ - రెండు, మృత్యూ - మరణములు, సంమతౌ - గొప్పవి, దురాపౌ - పొంద శక్యము కానివి, యత్ - ఏదనగా, యోగరతః - యోగమునందు ప్రీతి గలవాడు, జిత-అసుః - జయించబడిన ప్రాణములు గలవాడై, బ్రహ్మసంధారణయా - భగవంతుని ధ్యానముచే, యత్ - ఏదనగా, అగ్రణీః - అగ్రేసరుడు, అనివృత్తః - వెనుకకు తిరగనివాడు, వీరశయే - వీరశయనమునందు, కలేవరమ్ - దేహమును, విజహ్యాత్ - విడిచిపెట్టునో.

ఈ లోకములో రెండు గొప్ప మరణములు గలవు. వాటిని పొందుట చాల కష్టము. భక్తిజ్ఞానములయందు ప్రీతి గల సాధకుడు ప్రాణాయామమును చేసి భగవంతుని ధ్యానిస్తూ దేహమును విడిచిపెట్టుట మొదటిది. వీరుడు యుద్ధరంగమునుండి వెనుదిరుగకుండా ముందుకు దూసుకుపోయి శత్రువుల ప్రహారమునకు గురియై యుద్ధభూమియందు మరణించుట రెండవది.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి ఆరవ స్కంధములో దేవాసుర యుద్ధమును వర్ణించే పదవ అధ్యాయము ముగిసినది (**10**).

*****

# అథ ఏకాదశోऽధ్యాయః

## వృత్రాసురుని వీరవాణి

శ్రీశుక ఉవాచ ।
త ఏవం శంసతో ధర్మం వచః పత్యురచేతసః ।
నైవాగృహ్ణన్ భయత్రస్తాః పలాయనపరా నృప ॥ 1

నృప - ఓ మహారాజా!, ఏవమ్ - ఈ విధముగా, శంసతః - చెప్పుచున్న, పత్యుః - ప్రభువగు వృత్రుని, ధర్మమ్ - ధర్మమైన, వచః - మాటను, అచేతసః - వివేకము లేనివారు, భయత్రస్తాః - భయభీతులు, పలాయనపరాః - పారిపోవుటయందే నిమగ్నమై యున్నవారు అగు, తే - వారు, న ఏవ అగృహ్ణన్ - స్వీకరించనే లేదు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! వారి నాయకుడగు వృత్రుడు ఈ విధముగా ధర్మబద్ధమైన మాటను చెప్పెను. కాని, వివేకము లేని ఆ రాక్షసులు భయభీతులై పారిపోవుటయే లక్ష్యముగా పెట్టుకొని, ఆయన మాటను స్వీకరించనే లేదు.

విశీర్యమాణాం పృతనామాసురీమసురర్షభః ।
కాలానుకూలైస్త్రిదశైః కాల్యమానామనాథవత్ ॥ 2

దృష్ట్వాऽతప్యత సంక్రుద్ధ ఇంద్రశత్రురమర్షితః ।
తాన్ నివార్యౌజసా రాజన్ నిర్భర్త్స్యేదమువాచ హ ॥ 3

రాజన్ - ఓ రాజా!, ఆసురీమ్ - రాక్షసులకు చెందినట్టియు, విశీర్యమాణామ్ - చెల్లాచెదరు అగుచున్నట్టియు, కాల-అనుకూలైః - కాలము కలిసివచ్చిన, త్రిదశైః - దేవతలచే, అనాథవత్ - నాయకుడు లేనిది వలె,

కాల్యమానామ్ - తరిమివేయబడుచున్న, పృతనామ్ - సైన్యమును, దృష్ట్వా - చూచి, అసుర-ఋషభః - రాక్షసశ్రేష్ఠుడు, ఇంద్రశత్రుః - ఇంద్రుడు శత్రువుగా గలవాడు అగు వృత్రుడు, సంక్రుద్ధః - చాల కోపించిన వాడై, అమర్షితః - సహించనివాడై, అతప్యత - తాపమును పొందెను, తాన్ - వారిని, ఓజసా - వేగముగా, నిర్భర్త్స్య - బలాత్కారము చేసి, నివార్య - ఆపి, ఇదమ్ - ఈ మాటను, ఉవాచ హ - పలికెనట.

ఓ మహారాజా! కాలము కలిసి వచ్చిన దేవతలు రాక్షససైన్యమును నాయకుడు లేని సైన్యమును వలె, చెల్లాచెదరు చేసి తరిమి వేయుచుండిరి. రాక్షసశ్రేష్ఠుడు, ఇంద్రశత్రువు అగు వృత్రుడీ దృశ్యమును చూచి, చాల కోపముతో దానిని సహించలేక పరితాపమును పొందెను. అపుడాతడు వేగముగా తన బలమునొడ్డి, ముందుకు వచ్చుచున్న దేవసైన్యమును నిలువరించి ఇట్లు పలికెను.

కిం వా ఉచ్చరితైర్మాతుర్ధావద్భిః పృష్ఠతో హతైః ।
న హి భీతవధః శ్లాఘ్యో న స్వర్గ్యశ్శూరమానినామ్ ॥ 4

మాతుః - తల్లియొక్క, ఉచ్చరితైః - ఒడినుండి వచ్చినట్టియు, ధావద్భిః - పరుగులెత్తుచున్నట్టియు, పృష్ఠతః - వెనుక భాగమునందు, హతైః - కొట్టబడినవారిచే, కిం వై - ఏమి ప్రయోజనము?, శూరమానినామ్ - శూరులమనుకొనే వారలకు, భీతవధః - భయపడినవారిని వధించుట, న హి శ్లాఘ్యః - కొనియాడబడేది కాదు గదా!, స్వర్గ్యః - స్వర్గమునకు హితమైనది, న - కాదు.

వీరు ఇప్పుడే తల్లి ఒడినుంచి వచ్చినవారు. కావుననే, పారిపోవుచున్నారు. వారిని వెనుకనుండి కొట్టుట వలన ప్రయోజనమేమున్నది? శూరులమనుకొనే వారు భయపడినవారిని వధించుట ప్రశంసార్హము కాదు. దాని వలన స్వర్గాది పుణ్యలోకములు కూడ లభించవు.

యది వః ప్రధనే శ్రద్ధా సారం వా క్షుల్లకా హృది ।
అగ్రే తిష్ఠత మాత్రం మే న చేద్గ్రామ్యసుఖే స్పృహా ॥ 5

క్షుల్లకాః - ఓ అల్పులారా!, వః - మీకు, ప్రధనే - యుద్ధమునందు, శ్రద్ధా యది - ఉత్సాహమున్నచో, హృది - హృదయమునందు, సారం వా - ధైర్యము గాని ఉన్నచో, గ్రామ్యసుఖే - ఇంద్రియభోగమునందు, స్పృహా - తృష్ణ, న చేత్ - లేనిచో, మాత్రమ్ - క్షణమాత్రము, మే - నా, అగ్రే - ఎదుట, తిష్ఠత - నిలుడు.

ఓ అల్పులారా! మీకు యుద్ధమునందు ఉత్సాహము, హృదయమునందు ధైర్యము ఉన్నచో, ఇంద్రియభోగములయందు తృష్ణ లేనిచో, క్షణకాలము నా ముందు నిలువుడు.

ఏవం సురగణాన్ క్రుద్ధో భీషయన్ వపుషా రిపూన్ ।
వ్యనదత్సుమహాప్రాణో యేన లోకా విచేతసః ।। 6

క్రుద్ధః - కోపించినవాడు, సుమహాప్రాణః - మహాబలశాలి అగు వృత్రుడు, ఏవమ్ - ఈ విధముగా, వపుషా - శరీరముతో, రిపూన్ - శత్రువులగు, సురగణాన్ - దేవగణములను, భీషయన్ - భయపెట్టుచున్నవాడై, వ్యనదత్ - నాదము చేసెను, యేన - దేనిచే, లోకాః - ప్రాణులు, విచేతసః - మూర్ఛిల్లినవారో.

మహాబలశాలియగు వృత్రుడు కోపించి ఈ విధముగా పలికి, తన శరీరముతో శత్రువులగు దేవగణములకు భయమును గొల్పుచూ, సింహనాదము చేయగా, ఆ ధ్వనికి ప్రాణులు మూర్ఛిల్లెను.

తేన దేవగణాస్సర్వే వృత్రవిస్ఫోటనేన వై ।
నిపేతుర్మూర్ఛితా భూమౌ యథైవాశనినా హతాః ।। 7

తేన - ఆ, వృత్రవిస్ఫోటనేన - వృత్రుని గర్జనచే, సర్వే - అన్ని, దేవగణాః - దేవగణములు, అశనినా - పిడుగుచే, హతాః యథా - కొట్టబడినవారు వలె, వై - నిశ్చయముగా, మూర్ఛితాః - మూర్ఛితులై, భూమౌ - నేలపై, నిపేతుః - పడిపోయిరి.

వృత్రుని ఆ గర్జనచే దేవగణములన్నియు, నెత్తిపై పిడుగు పడినవారు వలె, మూర్ఛిల్లి నేలపై బడిపోయిరి.

మమర్ద పద్భ్యాం సురసైన్యమాతురం
నిమీలితాక్షం రణరంగదుర్మదః ।
గాం కంపయన్నుద్యతశూల ఓజసా
నాలం వనం యూథపతిర్యథోన్మదః ॥ 8

రణరంగదుర్మదః - యుద్ధరంగమునందు గొప్పగా గర్వించి యున్నవాడు, ఉద్యతశూలః - పైకి ఎత్తబడిన శూలము గలవాడు అగు వృత్రుడు, గామ్ - భూమిని, ఓజసా - బలముతో, కంపయన్ - కంపింప జేయుచున్నవాడై, ఆతురమ్ - భయపడినట్టియు, నిమీలిత-అక్షమ్ - మూయబడిన కన్నులు గల, సురసైన్యమ్ - దేవసైన్యమును, ఉన్మదః - బాగా మదించియున్న, యూథపతిః - ఏనుగుల గుంపునకు నాయకుడగు గజేంద్రము, నాలం వనం యథా - తామరతూళ్ల గుబురును వలె, పద్భ్యామ్ - కాళ్లతో, మమర్ద - మర్దించెను.

యుద్ధరంగమునందు గొప్పగా గర్వించి శూలమును పైకెత్తి పట్టు కొనియున్న వృత్రుడు తన బలముతో భూమిని కంపింప జేయుచుండెను. దేవతలు ఆయనను చూచి భయపడి కళ్లను మూసుకొనిరి. తామరతూళ్ల గుంపులోనికి ఏనుగుల గుంపునకు నాయకుడై మదించియున్న గజేంద్రము వలె, ఆతడు దేవసైన్యములో ప్రవేశించి, వారిని తన కాళ్లతో తొక్కివేసెను.

విలోక్య తం వజ్రధరోఽత్యమర్షితః
స్వశత్రవేఽభిద్రవతే మహాగదామ్ ।
చిక్షేప తామాపతతీం సుదుస్సహాం
జగ్రాహ వామేన కరేణ లీలయా ॥ 9

అతి-అమర్షితః - సుతరాము సహించని, వజ్రధరః - వజ్రమును దాల్చియున్న ఇంద్రుడు, తమ్ - వానిని, విలోక్య - చూచి, అభిద్రవతే - ముందుకు దూసుకువచ్చుచున్న, స్వశత్రవే - తాను శత్రువుగా గల వృత్రుని కొరకు, మహాగదామ్ - పెద్ద గదను, చిక్షేప - విసిరెను, సుదుస్స హామ్ - మిక్కిలి సహించ శక్యము కానట్టియు, ఆపతతీమ్ - వచ్చి పడుచు

న్న, తామ్ - దానిని, వామేన - ఎడమ, కరేణ - చేతితో, లీలయా - అవలీలగా, జగ్రాహ - పట్టుకొనెను.

ఆ పరిస్థితిని చూచి సహించలేని వజ్రధారియగు ఇంద్రుడు, తన మీదకు తన శత్రువగు వృత్రుడు దూసుకువచ్చుచుండగా, పెద్ద గదను ఆతనిపై విసిరెను. ఆ గదను ఓర్చుకొనుట చాల కష్టము. కాని, తన మీదకు వచ్చుచున్న ఆ గదను వృత్రుడు అవలీలగా ఎడమ చేతితో పట్టుకొనెను.

స ఇంద్రశత్రుః కుపితో భృశం తయా
మహేంద్రవాహం గదయోగ్రవిక్రమః ।
జఘాన కుంభస్థల ఉన్నదన్ మృధే
తత్కర్మ సర్వే సమపూజయన్నృప ॥ 10

నృప - ఓ మహారాజా!, ఇంద్రశత్రుః - ఇంద్రుడు శత్రువుగా గలవాడు, ఉగ్రవిక్రమః - భయంకరమగు పరాక్రమము గలవాడు అగు, సః - ఆ వృత్రుడు, భృశమ్ - మిక్కిలి, కుపితః - కోపించినవాడై, మృధే - యుద్ధమునందు, ఉత్-నదన్ - బిగ్గరగా సింహనాదమును చేయుచున్నవాడై, తయా - ఆ, గదయా - గదతో, మహేంద్రవాహమ్ - మహేంద్రుని వాహనమగు ఏనుగును, కుంభస్థలే - కుంభస్థలమునందు, జఘాన - కొట్టెను, సర్వే - అందరు, తత్ - ఆ, కర్మ - పనిని, సమపూజయన్ - చక్కగా పూజించిరి.

ఓ మహారాజా! ఇంద్రశత్రువు, భయంకరమగు పరాక్రమము గలవాడు అగు ఆ వృత్రునకు చాల కోపము వచ్చెను. ఆతడు యుద్ధరంగములో బిగ్గరగా సింహనాదమును చేసి, ఆ గదతో మహేంద్రుని వాహనమగు ఐరావతమును కొట్టెను. ఆతని ఆ పనిని అందరు ప్రశంసించిరి.

ఐరావతో వృత్రగదాభిమృష్టో
విఘూర్ణితోఽద్రిః కులిశాహతో యథా ।
అపాసరద్భిన్నముఖస్సహేంద్రో
ముంచన్నసృక్సప్తధనుర్భృశార్తః ॥ 11

వృత్రగదా-అభిమృష్టః - వృత్రునిచే గదతో కొట్టబడినది, భిన్న ముఖః - పగిలిన ముఖము గలది, సహ-ఇంద్రః - ఇంద్రునితో కూడియున్నది, భృశ-ఆర్తః - అధికమగు పీడను పొందినది అగు, ఐరావతః - ఐరావతము, కులిశ-ఆహతః - వజ్రముచే కొట్టబడిన, అద్రిః యథా - పర్వతము వలె, విఘూర్ణితః - గిరగిర తిరుగుచున్నదై, అసృక్ - రక్తమును, ముంచన్ - విడిచి పెట్టుచున్నదై, సప్తధనుః - ఏడు ధనుస్సుల దూరమును, అపాసరత్ - వెనుకకు వెళ్లెను.

వృత్రుడు గదతో కొట్టగా పగిలిన ముఖము గల ఆ ఐరావతము, వజ్రముచే కొట్టబడిన పర్వతము వలె, అధికమగు పీడను పొంది, గిరగిర తిరుగుతూ రక్తమును గ్రక్కుచూ, ఇంద్రునితో సహా ఏడు ధనుస్సుల దూరము వెనుకకు తగ్గెను.

న సన్నవాహాయ విషణ్ణచేతసే
ప్రాయుంక్త భూయస్స గదాం మహాత్మా ।
ఇంద్రోఽమృతస్యందికరాభిమర్శ-
వీతవ్యథక్షతవాహోఽవతస్థే ॥ 12

సన్నవాహాయ - మూర్ఛిల్లిన వాహనము కలిగినట్టియు, విషణ్ణచేతసే - ఖేదమును పొందిన మనస్సు గల ఇంద్రుని కొరకు, మహాత్మా - మహాత్ముడగు, సః - ఆ వృత్రుడు, భూయః - మరల, గదామ్ - గదను, న ప్రాయుంక్త - ప్రయోగించలేదు, ఇంద్రః - ఇంద్రుడు, అమృతస్యందికర-అభిమర్శవీతవ్యథక్షతవాహః - అమృతమును చిందే చేతితో తడుముటచే తొలగిన నొప్పిగల గాయపడిన వాహనము గలవాడై, అవతస్థే - నిలిచెను.

తన వాహనము మూర్ఛిల్లుటచే ఇంద్రుడు మనస్సులో ఖేదమును పొందెను. కాని, ఆ సమయములో ఉదారస్వభావుడగు వృత్రుడు మరల గదను ఆయనపై ప్రయోగించలేదు. ఇంతలో ఇంద్రుడు గాయపడిన తన ఏనుగును అమృతము చిలికే తన చేతితో తడిమి, నొప్పిని తొలగించి, మరల యుద్ధములో నిలిచి యుండెను.

స తం నృపేంద్రాహవకామ్యయా రిపుం
వజ్రాయుధం భ్రాతృహణం విలోక్య ।
స్మరంశ్చ తత్కర్మ నృశంసమంహః
శోకేన మోహేన హసఞ్జగాద ॥ 13

నృప-ఇంద్ర - ఓ మహారాజా!, రిపుమ్ - శత్రువైనట్టియు, వజ్ర-ఆయుధమ్ - వజ్రమే ఆయుధముగా కలిగినట్టియు, భ్రాతృహణమ్ - సోదరుని చంపిన, తమ్ - ఆ ఇంద్రుని, ఆహవకామ్యయా - యుద్ధమునందలి కోరికతో, విలోక్య - చూచి, నృశంసమ్ - క్రూరమైనట్టియు, తత్-కర్మ - వానిచే చేయబడిన, అంహః - పాపమును, స్మరన్ చ - స్మరించుచున్నవాడై, శోకేన - శోకముతో, మోహేన - సోదరునియందలి మోహముతో, హసన్ - నవ్వుచున్నవాడై, జగాద - పలికెను.

ఓ పరీక్షిన్మహారాజా! తన శత్రువు, తన సోదరుని చంపినవాడు అగు ఆ ఇంద్రుడు యుద్ధము చేయు కోరికతో వజ్రమును ధరించియుండగా వృత్రుడు చూచెను. ఇంద్రుడు చేసిన క్రూరమగు పాపకృత్యము ఆతని తలపునకు వచ్చి మనస్సు శోకముతో, మరియు సోదరునియందలి ఆసక్తితో నిండెను. ఆతడు నవ్వుతూ ఇంద్రునితో నిట్లనెను.

వృత్ర ఉవాచ ।
దిష్ట్యా భవాన్ మే సముపస్థితో రిపుః
యో బ్రహ్మహా గురుహా భ్రాతృహా చ ।
దిష్ట్యాఽనృణోఽద్యాహమసత్తమ త్వయా
మచ్ఛూలనిర్భిన్నదృషద్ధృదాఽచిరాత్ ॥ 14

అసత్-తమ - ఓరీ పరమదుష్టుడా!, మే - నా, రిపుః - శత్రువగు, భవాన్ - నీవు, దిష్ట్యా - దైవవశముచే, సముపస్థితః - ఎదురుగానున్నవాడవు, యః - ఏ నీవు, బ్రహ్మహా - బ్రహ్మహత్యను చేసినవాడవో, గురుహా - గురువును చంపినవాడవో, భ్రాతృహా చ - నా సోదరుని చంపినవాడవో, అహమ్ - నేను, అద్య - ఈనాడు, అచిరాత్ - శీఘ్రముగా, మత్-శూలనిర్భిన్నదృషద్-హృదా - నా శూలముచే ముక్కలు చేయబడిన

రాయి అయిన హృదయము గల, త్వయా - నీచే, అనృణః - ఋణము లేనివాడను, దిష్ట్యా - ఆనందము.

ఓరీ పరమదుష్టుడా! నీవు నా సోదరుడు, నీకు గురువు, బ్రాహ్మణుడు అగు విశ్వరూపుని చంపిన హంతకుడవు. దైవవశముచే నీవీనాడు నా యెదుట నిలిచి యున్నావు. నాకు ఆనందము! నేనీనాడు తొందరగా నా శూలముతో రాయివంటి నీ హృదయమును ముక్కలు చేసి తండ్రి ఋణమును తీర్చుకొనెదను.

యో నోఽగ్రజస్యాత్మవిదో ద్విజాతేర్గురోరపాపస్య చ దీక్షితస్య ।
విశ్రమ్య ఖడ్గేన శిరాంస్యవృశ్చత్పశోరివాకరుణస్స్వర్గకామః ।।15

స్వర్గకామః - స్వర్గమును కోరువాడవు, అకరుణః - దయ లేనివాడవు అగు, యః - ఏ నీవు, ఆత్మవిదః - ఆత్మజ్ఞానియైనట్టియు, ద్విజాతేః - బ్రాహ్మణుడైనట్టియు, గురోః - గురువైనట్టియు, అపాపస్య - పాపము లేనట్టియు, దీక్షితస్య చ - దీక్షలో కూడ ఉన్న, నః - మా, అగ్రజస్య - అన్నగారైన విశ్వరూపుని, విశ్రమ్య - నమ్మించి, శిరాంసి - తలలను, ఖడ్గేన - కత్తితో, పశోః ఇవ - పశువుయొక్క వలె, అవృశ్చత్ - నరికెనో.

నీవు స్వర్గమునందలి కామననే గాని, దయను ఎరుగవు. మా అన్నగారు విశ్వరూపుడు ఆత్మజ్ఞానియైన బ్రాహ్మణుడు. పాపమునెరుగని ఆయన దీక్షలోనుండగా నీవు ఆయనను నమ్మించి, కత్తితో ఆయన తలలను పశువు తలను నరికినట్లుగా నరికితివి.

హ్రీశ్రీదయాకీర్తిభిరుజ్ఝితం త్వాం
స్వకర్మణా పురుషాద్యైశ్చ గర్హ్యమ్ ।
కృచ్ఛ్రేణ మచ్ఛూలవిభిన్నదేహ-
మస్పృష్టవహ్నిం సమదంతి గృధ్రాః ।। 16

హ్రీశ్రీదయాకీర్తిభిః - సిగ్గు సంపద దయ కీర్తులచే, ఉజ్ఝితమ్ - విడిచి పెట్టబడినట్టియు, స్వకర్మణా - నీ పనిచే, పురుష-అద్యైః చ - రాక్షసులచే కూడ, గర్హ్యమ్ - నిందించదగినట్టియు, కృచ్ఛ్రేణ - కష్టముగా, మత్

-శూలవిభిన్నదేహమ్ - నా శూలముచే ముక్కలు చేయబడిన దేహము కలిగినట్టియు, అస్పృష్టవహ్నిమ్ - స్పృశించబడని అగ్ని గల, త్వామ్ - నిన్ను, గృధ్రాః - గ్రద్దలు, సమదంతి - చక్కగా తినుచుండును.

నిన్ను సిగ్గు, సంపద, దయ, కీర్తి అనునవి విడిచి పెట్టినవి. నీవు చేసిన పాపపు పనికి నిన్ను నరమాంసభక్షకులు కూడ నిందించెదరు. నీ దేహమును నేను శూలముతో ముక్కలు చేయగా, నీవు కష్టపడుతూ మరణించెదవు. అట్టి నీకు దహనసంస్కారము కూడ ఉండబోదు. నీ దేహమును గ్రద్దలు చక్కగా భక్షించ గలవు.

అన్యేఽను యే త్వేహ నృశంసమజ్ఞా
యే హ్యుద్యతాస్త్రాః ప్రహరంతి మహ్యమ్ ।
తైర్భూతనాథాన్ సగణాన్ నిశాత-
త్రిశూలనిర్భిన్నగలైర్యజామి ॥ 17

ఇహ - ఇక్కడ, నృశంసమ్ - క్రూరుడవగు, త్వా - నిన్ను, అను - అనుసరించే, యే - ఏ, అజ్ఞాః - అజ్ఞానులగు, అన్యే తు - ఇతరులు గలరో, యే హి - ఎవరైతే, ఉద్యత-అస్త్రాః - ఎక్కుపెట్టబడిన అస్త్రములు గలవారై, మహ్యమ్ - నా కొరకు, ప్రహరంతి - కొట్టుచున్నారో, నిశాతత్రిశూలనిర్భిన్నగలైః - వాడియగు త్రిశూలముచే ముక్కలు చేయబడిన మెడలు గల, తైః - వారిచే, సగణాన్ - గణములతో కూడిన, భూతనాథాన్ - భూతముల నాయకులను, యజామి - ఆరాధించెదను.

కొందరు మూర్ఖులు ఈ యుద్ధరంగములో క్రూరుడవగు నిన్ను అనుసరిస్తూ, నాపై ప్రయోగించుటకై అస్త్రముల నెక్కుపెట్టి యున్నారు. నేను వారి మెడలను వాడియగు నా త్రిశూలముతో ముక్కలుగా చేసి, (ఆ రక్తమాంసములతో) భూతనాయకులను వారి గణములను తృప్తిపరచెదను.

అథో హరే మే కులిశేన వీర
హర్తా ప్రమథ్యైవ శిరో యదీహ ।

తత్రానృణో భూతబలిం విధాయ
మనస్వినాం పాదరజః ప్రపత్స్యే ।। 18

హరే - ఓ ఇంద్రా!, వీర - ఓ వీరుడా!, అథో - అట్లు గాక, ఇహ - ఇచట, కులిశేన - వజ్రముతో, ప్రమథ్య - చంపి, మే - నా, శిరః ఏవ - తల నే, హర్తా యది - హరించబోవుచున్నచో, తత్ర - అప్పుడు, భూతబలిమ్ - ప్రాణులకు ఆహారమును, విధాయ - కల్పించి, అనృణః - ఋణము లేని వాడనై, మనస్వినామ్ - స్వాభిమానము గలవారి, పాదరజః - పాదధూళి ని, ప్రపత్స్యే - పొందగలను.

వీరుడవగు ఓ ఇంద్రా! అట్లు గాక, నీవే ఇచట నీ వజ్రముతో నన్ను కొట్టి నా తలను నరికే పక్షములో, నేను నా శరీరముతో ప్రాణులకు ఆహార మును కల్పించి, ఋణవిముక్తుడనై స్వాభిమానము గల వారు పొందే లోక ములను పొంది, అచట వారి పాదములకు మ్రొక్కెదను.

సురేశ కస్మాన్న హినోషి వజ్రం
పురః స్థితే వైరిణి మయ్యమోఘమ్ ।
మా సంశయిష్ఠా న గదేవ వజ్రం
స్యాన్నిష్ఫలం కృపణార్థేవ యాచ్ఞా ।। 19

సుర-ఈశ - ఓ దేవేంద్రా!, పురః - ఎదుట, స్థితే - నిలబడిన, వైరిణి - శత్రువునగు, మయి - నాయందు, అమోఘమ్ - అమోఘమగు, వజ్రమ్ - వజ్రమును, కస్మాత్ - ఎందు వలన, న హినోషి - ప్రయోగిం చవు?, మా సంశయిష్ఠాః - సందేహించకుము, వజ్రమ్ - వజ్రము, గదా ఇవ - గద వలె, కృపణ-అర్థా - లోభి వలని ప్రయోజనము గల, యాచ్ఞా ఇవ - యాచన వలె, నిష్ఫలమ్ - వ్యర్థము, న స్యాత్ - కాదు.

ఓ దేవేంద్రా! నీ శత్రువునగు నేను నీ యెదుటనే నిలిచి యున్నా ను. నీవు నాపై అమోఘమగు వజ్రమునేల ప్రయోగించవు? నీవు ఇంతకు ముందు ప్రయోగించిన గదవలె వ్యర్థమగునేమో యని సందేహించకుము. వజ్రము లోభినుండి ప్రయోజనమునపేక్షించి చేసే యాచనవంటిది కాదు. అది వ్యర్థము కాబోదు.

నన్వేష వజ్రస్తవ శక్ర తేజసా
హరేర్దధీచేస్తపసా చ తేజితః ।
తేనైవ శత్రుం జహి విష్ణుయంత్రితో
యతో హరిర్విజయశ్శ్రీర్గుణాస్తతః ॥ 20

శక్ర - ఓ ఇంద్రా!, తవ - నీ, ఏషః - ఈ, వజ్రః - వజ్రము, హరేః - శ్రీహరియొక్క, తేజసా - తేజస్సుచే, దధీచేః - దధీచియొక్క, తపసా చ - తపస్సుచే కూడ, తేజితః - తేజస్వంతము చేయబడినది, నను - నిశ్చయము, విష్ణుయంత్రితః - విష్ణువుచే ప్రేరితుడవై, తేన ఏవ - దానిచేతనే, శత్రుమ్ - శత్రువును, జహి - సంహరించుము, హరిః - శ్రీహరి, యతః - ఎటువైపో, తతః - అటువైపు, విజయః - విజయము, శ్రీః - సంపద, గుణాః - గుణములు.

ఓ ఇంద్రా! నీ వజ్రమును శ్రీహరి తేజస్సు, దధీచి తపస్సు నిశ్చయముగా తేజస్వంతము చేసినవి. శ్రీహరి ప్రేరణ కూడ నీకు గలదు. నీవు దానితోనే నీ శత్రువునగు నన్ను సంహరించుము. శ్రీహరి ఎటువైపు ఉంటే, విజయము సంపద సద్గుణములు అటువైపు ఉండును.

అహం సమాధాయ మనో యథాఽఽహ
సంకర్షణస్తచ్చరణారవిందే ।
త్వద్వజ్రరంహోలులితగ్రామ్యపాశో
గతిం మునేర్యామ్యపవిద్ధలోకః ॥ 21

సంకర్షణః - సంకర్షణ దేవుడు, యథా - ఏ విధముగా, ఆహ - చెప్పెనో, అహమ్ - నేను, మనః - మనస్సును, తత్-చరణ-అరవిందే - ఆయన పాదపద్మమునందు, సమాధాయ - ఏకాగ్రము చేసి, త్వద్-వజ్ర రంహః-లులితగ్రామ్యపాశః - నీ వజ్రముయొక్క వేగముచే తెగగొట్టబడిన విషయభోగములనే పాశము గలవాడనై, అపవిద్ధలోకః - విడిచిపెట్టబడిన భోగవాసనలు (దేహము) గలవాడనై, మునేః - ఆత్మజ్ఞానియొక్క, గతిమ్ - గతిని, యామి - పొందెదను.

నేను సంకర్షణదేవుని ఆజ్ఞానుసారముగా నా మనస్సును ఆయన పాదపద్మముపై ఏకాగ్రము చేసెదను. నీ వజ్రము నా దేహముతో బాటుగా విషయభోగములయందలి పాశమును కూడ తెగగొట్టును. నేను భోగవాసనలను పరిత్యజించి, ఆత్మజ్ఞానులు పొందే మోక్షమును పొందగలను.

పుంసాం కిలైకాంతధియాం స్వకానాం
యాస్సంపదో దివి భూమౌ రసాయామ్ ।
న రాతి యద్ద్వేష ఉద్వేగ ఆధిః
మదః కలిర్వ్యసనం సంప్రయాసః ॥ 22

ఏకాంతధియామ్ - అనన్యమగు భక్తి కలిగినట్టియు, స్వకానామ్ - తన భక్తులైన, పుంసామ్ - మానవులకు, దివి - స్వర్గమునందు, భూమౌ - భూలోకమునందు, రసాయామ్ - రసాతలమునందు, యాః - ఏ, సంపదః - సంపదలు గలవో వాటిని, న రాతి - ఇచ్చుట లేదు, యత్ - వేటి వలన, ద్వేషః - ద్వేషము, ఉద్వేగః - భయము, ఆధిః - మనస్సంతాపము, మదః - గర్వము, కలిః - కలహము, వ్యసనమ్ - దుఃఖము, సంప్రయాసః కిల - అధికమగు శ్రమ కలుగునో.

దేవలోక భూలోక రసాతలలోకములయందలి సంపదలను అనన్యమగు భక్తి గల తన భక్తులకు భగవానుడు ఈయడు. ఏలయనగా, వాటి వలన మానవునకు ద్వేషము, భయము, మనస్సంతాపము, గర్వము, కలహము, దుఃఖము కలుగును. వాటిని రక్షించుటకై అధికమగు శ్రమ మాత్రమే మిగులును గదా!

త్రైవర్గికాయాసవిఘాతమస్మత్-
పతిర్విధత్తే పురుషస్య శక్ర ।
తతోఽనుమేయో భగవత్ప్రసాదో
యో దుర్లభోఽకించనగోచరోఽన్యైః ॥ 23

శక్ర - ఓ ఇంద్రా!, అస్మత్-పతిః - మన ప్రభుడు, పురుషస్య - వ్యక్తికి, త్రైవర్గిక-ఆయాసవిఘాతమ్ - ధర్మార్థకామములకు చెందిన

శ్రమకు వినాశమును, విధత్తే - చేయును, తతః - దానివలన, భగవత్-ప్ర సాదః - భగవానుని అనుగ్రహము, అనుమేయః - ఊహించ దగినది, యః - ఎయ్యది, అన్యైః - ఇతరులచే, దుర్లభః - పొంద శక్యము కానిదియో, అకించనగోచరః - ఏకాంతభక్తులకు లభించునదియో.

ఓ ఇంద్రా! మన ప్రభుడు వ్యక్తికి ధర్మార్థకామములకు చెందిన ఆయాసమును అంతమొందించును. దాని చేతనే భగవానుని అనుగ్రహ మును మనము ఊహించవలెను. భోగపరాయణులకు పొంద శక్యము కాని ఆ అనుగ్రహము ఏకాంతభక్తులకు తేలికగా లభించును.

అహం హరే తవ పాదైకమూల-
దాసానుదాసో భవితాస్మి భూయః ।
మనస్స్మరేతాసుపతేర్గుణాంస్తే
గృణీత వాక్కర్మ కరోతు కాయః ॥ 24

హరే - ఓ శ్రీహరీ!, అహమ్ - నేను, భూయః - మరల, తవ - నీ, పాద-ఏకమూలదాస-అనుదాసః - పాదములే ఏకైకమగు ఆశ్రయముగా గలవారి దాసుని అనుసరించే దాసుడను, భవితాస్మి - కాగలను, మనః - మనస్సు, అసుపతేః - ప్రాణనాథుడవగు, తే - నీయొక్క, గుణాన్ - గుణ ములను, స్మరేత - స్మరించు గాక!, వాక్ - వాగింద్రియము, గృణీత - పలుకు గాక!, కాయః - దేహము, కర్మ - కర్మను, కరోతు - చేయుగాక!

ఓ శ్రీహరీ! నేను మరల నీ పాదములే ఏకైకమగు ఆశ్రయముగా గల భక్తుల దాసుని అనుసరించే దాసుడనై జన్మించెదను గాక! ఆ జన్మలో నా మనస్సు ప్రాణనాథుడవగు నీ గుణములనే స్మరించు గాక! నా వాగింద్రి యము నీ గుణములనే కీర్తించు గాక! నా దేహము నీ పూజనే చేయుగాక!

న నాకపృష్ఠం న చ పారమేష్ఠ్యం
న సార్వభౌమం న రసాధిపత్యమ్ ।
న యోగసిద్ధీరపునర్భవం వా
సమంజస త్వా విరహయ్య కాంక్షే ॥ 25

సమంజస - అన్ని సౌభాగ్యములకు నిధియైన వాడా!, త్వా - నిన్ను, విరహయ్య - విడిచిపెట్టి, నాకపృష్ఠమ్ - స్వర్గపదము (ధ్రువలోకము) ను, న కాంక్షే - కోరను, పారమేష్ఠ్యం చ - బ్రహ్మపదవిని కూడ, న - కోరను, సార్వభౌమమ్ - చక్రవర్తి పదవిని, న - కోరను, రసా-ఆధిపత్యమ్ - రసాతలమునకు ఆధిపత్యమును, న - కోరను, యోగసిద్ధీః - యోగసిద్ధులను గాని, అపునర్భవం వా - పునర్జన్మ లేకపోవుటను గాని, న - కోరను.

అన్ని సౌభాగ్యములకు నిధియగు ఓ శ్రీహరీ! నేను నిన్ను విడిచి నీనుండి వేరై, స్వర్గపదమును గాని, ధ్రువస్థానమును గాని, బ్రహ్మపదవిని గాని, చక్రవర్తి పదవిని గాని, రసాతలమునకు ఆధిపత్యమును గాని, యోగ సిద్ధులను గాని, పునర్జన్మ లేని మోక్షమునే గాని కోరను.

అజాతపక్షా ఇవ మాతరం ఖగాః
స్తన్యం యథా వత్సతరాః క్షుధార్తాః ।
ప్రియం ప్రియేవ వ్యుషితం విషణ్ణా
మనోఽరవిందాక్ష దిదృక్షతే త్వామ్ ॥ 26

అరవింద-అక్ష - పద్మమువంటి కన్నులు గలవాడా!, అజాతపక్షాః - మొలకెత్తని రెక్కలు గల, ఖగాః - పక్షులు, మాతరం ఇవ - తల్లిని వలె, క్షుధా-ఆర్తాః - ఆకలిచే పీడించబడిన, వత్సతరాః - లేగ దూడలు, స్తన్యం యథా - తల్లి పాలను వలె, వ్యుషితమ్ - పొరుగు దేశము వెళ్లిన, ప్రియమ్ - ప్రియుని, విషణ్ణా - ఖిన్నురాలగు, ప్రియా ఇవ - ప్రియురాలు వలె, మనః - మనస్సు, త్వామ్ - నిన్ను, దిదృక్షతే - చూడ గోరుచున్నది.

పద్మమువంటి కన్నులు గల ఓ శ్రీహరీ! రెక్కలు రాని పక్షులు తల్లి కొరకు, ఆకలిచే పీడించబడే లేగదూడలు తల్లి పాల కొరకు, ఖిన్నురాలగు ప్రియురాలు పొరుగు దేశము వెళ్లిన ప్రియుని కొరకు వలె, నా మనస్సు నిన్ను చూచుటకు తహతహ లాడుచున్నది.

మమోత్తమశ్లోకజనేషు సఖ్యం
సంసారచక్రే భ్రమతస్స్వకర్మభిః ।

త్వన్మాయయాఽఽత్మాత్మజదారగేహే-
ష్వాసక్తచిత్తస్య న నాథ భూయాత్ ॥ 27

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే వృత్రాసురస్య
వీరవాణీ నామ ఏకాదశోఽధ్యాయః ॥

నాథ - ఓ ప్రభూ!, స్వకర్మభిః - నా కర్మలచే, సంసారచక్రే - సంసారమనే చక్రమునందు, భ్రమతః - తిరుగుచున్న, మమ - నాకు, ఉత్తమశ్లోకజనేషు - పవిత్రకీర్తియగు శ్రీహరి భక్తులయందు, సఖ్యమ్ - మైత్రి, త్వత్-మాయయా - నీ మాయచే, ఆత్మాత్మజదారగేహేషు - దేహము సంతానము భార్య ఇల్లు అనువాటియందు, ఆసక్తచిత్తస్య - తగుల్కొన్న చిత్తము గల నాకు (వాని), సఖ్యమ్ - (వాటియందు) స్నేహము, న భూయాత్ - కలుగకుండు గాక!

ఓ ప్రభూ! నా కర్మలచే నేను సంసారచక్రములో పడి తిరుగుచున్నాను. నాకు పవిత్రకీర్తివగు నీ భక్తులతోడి మైత్రి కలుగు గాక! దేహము, సంతానము, భార్య, ఇల్లు అనువాటియందు నా చిత్తము తగుల్కొనియున్నది. నాకు వాటియందు మైత్రి కలుగకుండు గాక! అట్టి ఆసక్తి గలవాని మైత్రి కూడ నాకు కలుగకుండు గాక!

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి ఆరవ స్కంధములో వృత్రాసురుని వీరవాణిని వర్ణించే పదునొకండవ అధ్యాయము ముగిసినది (**11**).

*****

# అథ ద్వాదశోఽధ్యాయః

## ఇంద్రుడు వృత్రాసురుని సంహరించుట

ఋషిరువాచ ।
ఏవం జిహాసుర్నృప దేహమాజౌ
మృత్యుం వరం విజయాన్మన్యమానః ।
శూలం ప్రగృహ్యాభ్యపతత్సురేంద్రం
యథా మహాపురుషం కైటభోఽప్సు ॥ 1

నృప - ఓ మహారాజా!, ఏవమ్ - ఈ విధముగా, ఆజౌ - యుద్ధమునందు, దేహమ్ - దేహమును, జిహాసుః - విడువ గోరువాడు, విజయాత్ - విజయముకంటె, మృత్యుమ్ - మరణమును, వరమ్ - గొప్పదిగా, మన్యమానః - తలపోయువాడు అగు వృత్రుడు, శూలమ్ - శూలమును, ప్రగృహ్య - పట్టుకొని, సుర-ఇంద్రమ్ - దేవేంద్రుని, అప్సు - నీటియందు, మహాపురుషమ్ - పురుషోత్తముని, కైటభః యథా - కైటభుడు వలె, **అభ్యపతత్** - మీద పడెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! ఈ విధముగా వృత్రుడు యుద్ధములో దేహమును విడువ గోరెను. ఆయనకు విజయముకంటె మరణమే మేలని తోచెను. అపుడాయన శూలమును పట్టుకొని, ప్రళయకాలజలములలో కైటభుడు పురుషోత్తముని పైకి వలె, దేవేంద్రుని పైకి ఉరికెను.

తతో యుగాంతాగ్నికఠోరజిహ్వమావిధ్య శూలం తరసాఽసురేంద్రః,
క్షిప్త్వా మహేంద్రాయ వినద్య వీరో హతోఽసి పాపేతి రుషా జగాద.

తతః - తరువాత, అసుర-ఇంద్రః - రాక్షసశ్రేష్ఠుడు, వీరః - వీరుడు అగు వృత్రుడు, యుగ-అంత-అగ్నికఠోరజిహ్వమ్ - ప్రళయకాలాగ్నివలె వెలిగిపోయే నాలుకలు గల, శూలమ్ - శూలమును, తరసా - వేగముగా, ఆవిధ్య - త్రిప్పి, మహేంద్రాయ - మహేంద్రుని కొరకు, క్షిప్త్వా - విసిరి, వినద్య - సింహనాదము చేసి, పాప - ఓరీ పాపీ!, హతః అసి - చంపబడితివి, ఇతి - అని, రుషా - కోపముతో, జగాద - పలికెను.

తరువాత రాక్షసశ్రేష్ఠుడు, వీరుడు అగు వృత్రుడు ప్రళయకాలాగ్నివలె వెలిగిపోయే నాలుకలు గల శూలమును వేగముగా త్రిప్పి, మహేంద్రునిపై విసిరి, సింహనాదము చేసి, ఓరీ పాపీ! దీనితో నీ పని ఆఖరు, అంటూ కోపముతో పలికెను.

ఖ ఆపతత్తద్విచలద్గ్రహోల్కవన్నిరీక్ష్య దుష్ప్రేక్ష్యమజాతవిక్లవః ।
వజ్రేణ వజ్రీ శతపర్వణాఽచ్ఛినద్భుజం చ తస్యోరగరాజభోగమ్॥3

ఖే - ఆకాశమునందు, ఆపతత్ - వచ్చుచున్నట్టియు, విచలత్ - తిరుగుచున్నట్టియు, గ్రహ-ఉల్కవత్ - గ్రహమును ఉల్కను పోలినట్టియు, దుష్ప్రేక్ష్యమ్ - చూడ శక్యము కాని, తత్ - ఆ శూలమును, నిరీక్ష్య - చూచి, అజాతవిక్లవః - కలుగని భయము గలవాడు, వజ్రీ - వజ్రము గలవాడు అగు ఇంద్రుడు, శతపర్వణా - వంద కణుపులు గల, వజ్రేణ - వజ్రముతో, తస్య - వానియొక్క, ఉరగరాజభోగమ్ - నాగరాజగు వాసుకి యొక్క పడగను పోలియున్న, భుజం చ - భుజమును కూడ, అచ్ఛినత్ - తెగగొట్టెను.

ఆకాశములో తిరుగుతూ మీదకు వచ్చుచున్న ఆ శూలము గ్రహమును ఉల్కను బోలి, చూచుటకు వీలు కాకుండెను. అయిననూ, వజ్రధరుడగు ఇంద్రుడు భయపడలేదు. వంద కణుపుల వజ్రముతో ఆయన ఆ త్రిశూలమును మాత్రమే గాక, నాగరాజగు వాసుకి పడగవంటి వాని భుజమును కూడ తెగగొట్టెను.

ఛిన్నైకబాహుః పరిఘేణ వృత్రస్సంరబ్ధ ఆసాద్య గృహీతవజ్రమ్,
హనౌ తతాడేంద్రమథామరేభం వజ్రం చ హస్తాన్న్యపతన్మఘోనః.

ఛిన్న-ఏకబాహుః - తెగగొట్టబడిన ఒక చేయి గల, వృత్రః - వృత్రుడు, సంరబ్ధః - కోపించినవాడై, పరిఘేణ - గుదియతో, గృహీతవ జ్రమ్ - పట్టుకొనబడిన వజ్రము గల, ఇంద్రమ్ - ఇంద్రుని, ఆసాద్య - సమీపించి, అథ - అప్పుడు, హనౌ - చెక్కిలిపై, అమర-ఇభం చ - దేవగజ మగు ఐరావతమును కూడ, తతాడ - కొట్టెను, వజ్రమ్ - వజ్రము, మఘోనః - ఇంద్రుని, హస్తాత్ - చేతినుండి, ని-పతత్ - క్రింద పడెను.

వృత్రుని ఒక చేయి తెగిపోయెను. అయిననూ, ఆతడు కోపించి ఇనుప గుదియతో ఇంద్రుని మీదకు వెళ్ళి చెక్కిలిపై కొట్టెను. తరువాత దేవ గజమగు ఐరావతమును కూడ ఆతడు కొట్టెను. ఆ దెబ్బకు ఇంద్రుని చేతి నుండి వజ్రము క్రింద పడిపోయెను.

వృత్రస్య కర్మాతిమహాద్భుతం తత్
సురాసురాశ్చారణసిద్ధసంఘాః ।
అపూజయంస్తత్ పురుహూతసంకటం
నిరీక్ష్య హా హేతి విచుక్రుశుర్భృశమ్ ॥ 5

వృత్రస్య - వృత్రుని, అతిమహా-అద్భుతమ్ - మిక్కిలి అధికమగు ఆశ్చర్యమును గొల్పే, తత్ - ఆ, కర్మ - పనిని, సుర-అసురాః - దేవతలు రాక్షసులు, చారణసిద్ధసంఘాః - చారణులు సిద్ధుల గుంపులు, అపూజ యన్ - ప్రశంసించిరి, తత్ - ఆ, పురుహూతసంకటమ్ - ఇంద్రుని సంకట మును, నిరీక్ష్య - చూచి, హా హా - అయ్యో! అయ్యో!, ఇతి - అని, భృశమ్ - మిక్కిలి, విచుక్రుశుః - ఆక్రోశించిరి.

వృత్రుడు చేసిన ఆ మిక్కిలి అధికముగా ఆశ్చర్యమును కలిగించే పనిని దేవతలు, రాక్షసులు, చారణులు, సిద్ధులు గుంపులుగా చేరి ప్రశం సించిరి. ఇంద్రుడు ఉన్న సంకటస్థితి (చేతినుండి వజ్రము జారిపోవుట) ని గాంచి, వారు అయ్యో! అయ్యో! అంటూ ఆక్రోశించిరి.

ఇంద్రో న వజ్రం జగృహే విలజ్జితః
చ్యుతం స్వహస్తాదరిసన్నిధౌ పునః ।

తమాహ వృత్రో హర ఆత్తవజ్రో
జహి స్వశత్రుం న విషాదకాలః ॥ 6

విలజ్జితః - చాల సిగ్గు పడిన, ఇంద్రః - ఇంద్రుడు, స్వహస్తాత్ - తన చేతినుండి, అరిసన్నిధౌ - శత్రువు యెదుట, చ్యుతమ్ - జారిపడిన, వజ్రమ్ - వజ్రమును, పునః - మరల, న జగృహే - తీసుకొన లేదు, వృత్రః - వృత్రుడు, తమ్ - వానిని ఉద్దేశించి, ఆహ - పలికెను, హరే - ఓ ఇంద్రా!, ఆత్తవజ్రః - తీసుకొనబడిన వజ్రము గలవాడవై, శత్రుమ్ - శత్రువును, జహి - చంపుము, విషాదకాలః - దుఃఖించుటకు సమయము, న - కాదు.

తన చేతినుండి శత్రువు యెదుట వజ్రము జారి పడినందులకు ఇంద్రుడు చాల సిగ్గు పడెను. అపుడు వృత్రుడాతనితో నిట్లనెను --- ఓయీ ఇంద్రా! వజ్రమును తీసుకొని శత్రువును సంహరించుము. ఇది దుఃఖించుటకు సమయము కాదు.

యుయుత్సతాం కుత్రచిదాతతాయినాం
జయస్సదైకత్ర న వై పరాత్మనామ్ ।
వినైకముత్పత్తిలయస్థితీశ్వరం
సర్వజ్ఞమాద్యం పురుషం సనాతనమ్ ॥ 7

యుయుత్సతామ్ - యుద్ధము చేయగోరునట్టియు, ఆతతాయినామ్ - ధరించబడిన శస్త్రములు కలిగినట్టియు, పర-ఆత్మనామ్ - అనాత్మయగు దేహమే ఆత్మగా కలవారలకు, సదా - అన్ని కాలములలో, ఏకత్ర వై - ఒకవైపు మాత్రమే, జయః - విజయము, న - ఉండదు, కుత్రచిత్ - ఏ వైపునయైననూ ఉండును, ఉత్పత్తిలయస్థితి-ఈశ్వరమ్ - ఉత్పత్తిస్థితిలయములను శాసించునట్టియు, సర్వజ్ఞమ్ - సర్వము తెలిసినట్టియు, ఆద్యమ్ - సర్వకారణమైనట్టియు, సనాతనమ్ - కాలాతీతమగు, పురుషమ్ - పూర్ణబ్రహ్మను, వినా - మినహాయించి.

జగత్కారణుడు, జగత్తుయొక్క ఉత్పత్తిస్థితిలయములకు అధీశ్వరుడు, సర్వజ్ఞుడు, కాలమునకు అతీతుడు అగు పూర్ణ పరబ్రహ్మకు సర్వత్ర

విజయమే. కాని, దేహాత్మభావముతో శస్త్రములను ధరించి యుద్ధమును చేయగోరు వారలకు అన్ని కాలములలో విజయము తమ పక్షమున మాత్రమే ఉండుననే నియమము లేదు. విజయము ఎటువైపునైననూ ఉండవచ్చును.

లోకాస్సపాలా యస్యేమే శ్వసంతి వివశా వశే ।
ద్విజా ఇవ శిచా బద్ధాస్స కాల ఇహ కారణమ్ ॥ 8

సపాలాః - పాలకులతో కూడియున్నట్టియు, వివశాః - పరతంత్రులైన, ఇమే - ఈ, లోకాః - జనులు, శిచా - వలచే, బద్ధాః - బంధించబడిన, ద్విజాః ఇవ - పక్షులు వలె, యస్య - ఎవని, వశే - వశమునందు, శ్వసంతి - చేష్టలను చేయుచున్నారో, సః - అట్టి, కాలః - కాలము, ఇహ - దీనియందు, కారణమ్ - కారణము.

పాలకులతో సహా సకలజనులు పరాధీనులై, వలలో బంధించబడిన పక్షులు వలె, కాలమునకు వశులై వివిధచేష్టలను చేయుచున్నారు. అట్టి కాలమే ఈ జయపరాజయములకు కారణము.

ఓజస్సహో బలం ప్రాణమమృతం మృత్యుమేవ చ ।
తమజ్ఞాయ జనో హేతుమాత్మానం మన్యతే జడమ్ ॥ 9

ఓజః - మనోబలమైనట్టియు, సహః - ఇంద్రియబలమైనట్టియు, బలమ్ - శరీరబలమైనట్టియు, ప్రాణమ్ - ప్రాణశక్తి అయినట్టియు, అమృతమ్ - జీవనమైనట్టియు, మృత్యుం ఏవ చ - మరణము కూడ అయిన, తమ్ - ఆ కాలమును, అజ్ఞాయ - తెలియక, జనః - జనుడు, జడమ్ - జడమగు, ఆత్మానమ్ - దేహమును, హేతుమ్ - హేతువునుగా, మన్యతే - తలపోయుచున్నాడు.

కాలమే జనునియందు మనోబలము, ఇంద్రియబలము, దేహబలము, ప్రాణశక్తి, జీవనము మరియు మరణముల రూపముగా నున్నది. ఈ సంగతి తెలియక జనుడు తన దేహమే జయపరాజయములు మొదలగువాటికి కారణమని తలపోయుచుండును.

యథా దారుమయీ నారీ యథా యంత్రమయో మృగః ।
ఏవం భూతాని మఘవన్నీశతంత్రాణి విద్ధి భోః ।। 10

భోః - ఓయీ!, మఘవన్ - ఇంద్రా!, దారుమయీ - చెక్కతో చేసిన, నారీ - స్త్రీ, యథా - ఎట్లో, యంత్రమయః - యంత్రముతో నడిచే, మృగః - మృగము బొమ్మ, యథా - ఎట్టిదో, ఏవమ్ - ఇదే విధముగా, భూతాని - ప్రాణులు, ఈశతంత్రాణి - ఈశ్వరుని అధీనములో నున్నవని, విద్ధి - తెలుసుకొనుము.

ఓ ఇంద్రా! చెక్కతో చేసిన స్త్రీ బొమ్మ, యంత్రముతో నడిచే మృగము బొమ్మ వాటిని నడిపించే వాని చేతిలో ఉండును. అదే విధముగా, ప్రాణులు ఈశ్వరుని వశములోనున్నవని తెలుసుకొనుము.

పురుషః ప్రకృతిర్వ్యక్తమాత్మా భూతేంద్రియాశయాః ।
శక్నువంత్యస్య సర్గాదౌ న వినా యదనుగ్రహాత్ ।। 11

పురుషః - పురుషుడు, ప్రకృతిః - ప్రకృతి, వ్యక్తమ్ - మహత్తత్త్వము, ఆత్మా - అహంకారము, భూత-ఇంద్రియ-ఆశయాః - పంచభూతములు ఇంద్రియములు అంతఃకరణము, యద్-అనుగ్రహాత్ వినా - ఎవ్వాని అనుగ్రహము లేకుండా, అస్య - ఈ జగత్తుయొక్క, సర్గ-ఆదౌ - సృష్టిస్థితిలయములయందు, న శక్నువంతి - సమర్థములు కావో.

మాయాశక్తియందు ప్రతిఫలించిన పరబ్రహ్మయే జగత్కారణమగు ఈశ్వరుడు. ఆ మాయాశక్తియే మహత్తత్త్వము (సమష్టి బుద్ధిశక్తి), అహంకారము (సమష్టి), పంచభూతములు, ప్రాణులలోని ఇంద్రియములు, ప్రాణుల అంతఃకరణముల రూపములో ప్రకటమై, ఈ జగత్తుయొక్క సృష్టి, స్థితి ఘటిల్లుచున్నవి. ఈ సర్వము విలోమక్రమములో పరబ్రహ్మలో విలీనమగుటయే ప్రళయము. ఈ విధముగా, జగత్తుయొక్క సృష్టిస్థితిలయములను ఈ మాయాకార్యములు సత్తాస్ఫూర్తిప్రదాతయగు ఆ పరబ్రహ్మయొక్క అనుగ్రహము వలననే ఘటిల్ల జేయుచున్నవి. ఆ అనుగ్రహము లేనిచో, ఈ జడతత్త్వములు నిరాత్మకములై దేనికైననూ సమర్థములు కావు.

**అవిద్వానేవమాత్మానం మన్యతేऽనీశమీశ్వరమ్ ।**
**భూతైస్సృజతి భూతాని గ్రసతే తాని తైస్స్వయమ్ ॥ 12**

ఏవమ్ - ఈ విధముగా, అవిద్వాన్ - తెలియని వాడు, అనీశమ్ - అస్వతంత్రుడగు, ఆత్మానమ్ - తనను, ఈశమ్ - స్వతంత్రునిగా, మన్యతే - తలపోయుచున్నాడు, స్వయమ్ - ఈశ్వరుడే, భూతాని - ప్రాణులను, భూతైః - ప్రాణులతో, సృజతి - సృష్టించుచున్నాడు, తాని - వాటిని, తైః - వాటిచే, గ్రసతి - మ్రింగుచున్నాడు.

ఈ సత్యమునెరుగని వ్యక్తి అస్వతంత్రుడై యున్న తానే స్వతంత్రుడనగు కర్త-భోక్తనని తలపోయును. ఈశ్వరుడే స్వయముగా ప్రాణులను ప్రాణుల ద్వారా సృష్టించి, వాటిని వాటి ద్వారానే సంహరించుచున్నాడు.

**ఆయుశ్శ్రీః కీర్తిరైశ్వర్యమాశిషః పురుషస్య యాః ।**
**భవంత్యేవ హి తత్కాలే యథానిచ్ఛోర్విపర్యయాః ॥ 13**

పురుషస్య - వ్యక్తియొక్క, యాః - ఏ, ఆయుః - ఆయుర్దాయము, శ్రీః - సంపద, కీర్తిః - కీర్తి, ఐశ్వర్యమ్ - ఈశ్వరభావము అనే, ఆశిషః - మనోరథములు గలవో అవి, అనిచ్ఛోః - కోరని వానికి, విపర్యయాః యథా - వీటి విరుద్ధములు వలె, తత్-కాలే - ఆ కాలమునందు, భవంతి ఏవ హి - కలిగి తీరును గదా!

వ్యక్తి ఆయుర్వృద్ధి, సంపద, కీర్తి, ఈశ్వరభావము మొదలగు మనోరథములను కలిగియుండును. వ్యక్తి కోరకున్ననూ వీటికి విరుద్ధములగు అపకీర్తి మొదలగునవి కలుగుచునే యున్నవి. అదే విధముగా, ఇవి కూడ తగిన కాలము వచ్చినప్పుడు తప్పక లభించును.

**తస్మాదకీర్తియశసోర్జయాపజయయోరపి ।**
**సమస్స్యాత్సుఖదుఃఖాభ్యాం మృత్యుజీవితయోస్తథా ॥ 14**

తస్మాత్ - అందువలన, అకీర్తియశసోః - అపకీర్తి కీర్తులయందు, జయ-అపజయయోః అపి - జయపరాజయములయందు కూడ, తథా - అదే విధముగా, మృత్యుజీవితయోః - మరణ జీవనములయందు, సుఖ

దుఃఖాభ్యామ్ - సుఖదుఃఖములచే, సమః - సముడై, స్యాత్ - ఉండవలె ను.

కావున, కీర్తి-అపకీర్తులు, జయ-పరాజయములు, జీవన్మరణములు, సుఖదుఃఖములు అనే ద్వంద్వముల యెడల వ్యక్తి సమచిత్తుడై యుండవలెను.

సత్త్వం రజస్తమ ఇతి ప్రకృతేర్నాత్మనో గుణాః ।
తత్ర సాక్షిణమాత్మానం యో వేద న స బధ్యతే ॥ 15

సత్త్వమ్ - సత్త్వము, రజః - రజస్సు, తమః - తమస్సు, ఇతి - అనునవి, ప్రకృతేః - ప్రకృతియొక్క, గుణాః - గుణములు, ఆత్మనః - ఆత్మవి, న - కావు, యః - ఎవడైతే, తత్ర - వాటి విషయమునందు, ఆత్మానమ్ - తనను, సాక్షిణమ్ - సాక్షినిగా, వేద - తెలియునో, సః - అట్టి వాడు, న బధ్యతే - బంధించబడడు.

సత్త్వరజస్తమోగుణములు మాయాశక్తివే గాని, ఆత్మచైతన్యమునకు చెందినవి కావు. కావున, వాటి కార్యములగు సుఖదుఃఖమోహముల యెడల ఎవడైతే తన స్వరూపము సాక్షియని తెలియునో, వానికి వాటి వలన బంధము కలుగదు.

పశ్య మాం నిర్జితం శక్ర వృక్ణాయుధభుజం మృధే ।
ఘటమానం యథాశక్తి తవ ప్రాణజిహీర్షయా ॥ 16

శక్ర - ఓ ఇంద్రా!, మృధే - యుద్ధమునందు, వృక్ణ-ఆయుధభుజమ్ - తెగగొట్టబడిన ఆయుధము భుజము కలిగినట్టియు, నిర్జితమ్ - జయించబడినట్టియు, తవ - నీ, ప్రాణజిహీర్షయా - ప్రాణముల నపహరించవలెననే కోరికతో, యథాశక్తి - శక్తికి తగ్గట్లుగా, ఘటమానమ్ - ప్రయత్నించుచున్న, మామ్ - నన్ను, పశ్య - చూడుము.

ఓ ఇంద్రా! చూడుము. యుద్ధములో నీవు నా ఆయుధమును మాత్రమే గాక, నా భుజమును కూడ తెగగొట్టి, నన్ను ఓడించితివి. అయిననూ, నేను యథాశక్తిగా నీ ప్రాణములను తీయుటకే యత్నించుచున్నాను.

ప్రాణగ్లహోఽయం సమర ఇష్వక్షో వాహనాసనః ।
అత్ర న జ్ఞాయతేఽముష్య జయోఽముష్య పరాజయః ॥ 17

అయమ్ - ఈ, సమరః - యుద్ధము, ప్రాణగ్లహః - ప్రాణములే జూదమునందలి పందెముగా గలది, ఇషు-అక్షః - బాణములే పాచికలుగా గలది, వాహన-ఆసనః - వాహనములే పలకలుగా గలది, అత్ర - దీనియందు, అముష్య - వీనికి, జయః - విజయము, అముష్య - వీనికి, పరాజయః - పరాజయము అని, న జ్ఞాయతే - తెలియబడుట లేదు.

ఈ యుద్ధము అనే జూదములో ప్రాణములే పందెముగా ఒడ్డబడును. వాహనములే జూదపు పలకలు కాగా, బాణములే పాచికలు. ఈ జూదములో ఫలానా వానికి విజయమనియు, ఫలానా వానికి పరాజయమనియు ముందుగా తెలియదు.

శ్రీశుక ఉవాచ ।
ఇంద్రో వృత్రవచశ్శ్రుత్వా గతాలీకమపూజయత్ ।
గృహీతవజ్రః ప్రహసంస్తమాహ గతవిస్మయః ॥ 18

గత-అలీకమ్ - తొలగిన కపటము గల, వృత్రవచః - వృత్రుని వచనమును, శ్రుత్వా - విని, గృహీతవజ్రః - తీసుకొనబడిన వజ్రము గలవాడు, గతవిస్మయః - తొలగిన అధికమగు గర్వము గలవాడు అగు, ఇంద్రః - ఇంద్రుడు, అపూజయత్ - పూజించెను, ప్రహసన్ - నవ్వుచున్నవాడై, తమ్ - వానిని ఉద్దేశించి, ఆహ - పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను -- వృత్రుని కపటము లేని మాటను విన్న ఇంద్రునకు అధికమగు గర్వము తొలగి పోయెను. ఆయన వజ్రమును చేతిలోకి తీసుకొని నవ్వుతూ, వృత్రుని ప్రశంసిస్తూ, ఆతనితో నిట్లనెను.

ఇంద్ర ఉవాచ ।
అహో దానవ సిద్ధోఽసి యస్య తే మతిరీదృశీ ।
భక్తస్సర్వాత్మనాఽఽత్మానం సుహృదం జగదీశ్వరమ్ ॥ 19

అహో - ఆహా!, దానవ - ఓ రాక్షసా!, సిద్ధః - సిద్ధపురుషుడవు, అసి - అగుచున్నావు, యస్య - ఏ, తే - నీకు, ఈదృశీ - ఇట్టి, మతిః - బుద్ధియో, ఆత్మానమ్ - ఆత్మరూపుడై యున్నట్టియు, సుహృదమ్ - హిత కరుడైన, జగద్-ఈశ్వరమ్ - జగన్నాథుని, సర్వాత్మనా - దేహేంద్రియమ నస్సులతో, భక్తః - సేవించినవాడవు.

ఇంద్రుడిట్లు పలికెను --- ఓ రాక్షసా! ఇట్టి వివేకము గల నీవు సిద్ధ పురుషుడవు. ఆత్మరూపుడు, హితకరుడు, జగన్నాథుడు అగు ఆ శ్రీహరిని నీవు సర్వస్వార్పణము చేసి సేవించితివి.

భవానతార్షీన్మాయాం వై వైష్ణవీం జనమోహినీమ్ ।
యద్విహాయాసురం భావం మహాపురుషతాం గతః ।। 20

జనమోహినీమ్ - జనులను మోహపెట్టే, వైష్ణవీమ్ - విష్ణువునకు సంబంధించిన, మాయామ్ - మాయను, భవాన్ - నీవు, వై - నిశ్చయము గా, అతార్షీత్ - తరించితివి, యత్ - ఏలయనగా, ఆసురమ్ - అసురులకు చెందిన, భావమ్ - లక్షణమును, విహాయ - విడిచిపెట్టి, మహాపురుషతామ్ - మహాపురుషుల స్థితిని, గతః - పొందినావో.

నీవు జనులను మోహపెట్టే వైష్ణవ మాయను నిశ్చయముగా తరిం చితివి. ఏలయనగా, నీవు అసురులలో ఉండే లక్షణములను విడిచిపెట్టి, మహాపురుషుల లక్షణములను సంతరించుకున్నావు.

ఖల్విదం మహదాశ్చర్యం యద్రజఃప్రకృతేస్తవ ।
వాసుదేవే భగవతి సత్త్వాత్మని దృఢా మతిః ।। 21

ఇదమ్ - ఇది, మహత్ - గొప్ప, ఆశ్చర్యం ఖలు - ఆశ్చర్యము గదా!, యత్ - ఏదనగా, రజఃప్రకృతేః - రజోగుణ స్వభావము గల, తవ - నీకు, సత్త్వ-ఆత్మని - సత్త్వగుణ ప్రధానుడగు, వాసుదేవే భగవతి - వాసు దేవ భగవానునియందు, దృఢా - దృఢమగు, మతిః - బుద్ధియో.

రజోగుణ ప్రధానమగు నీ బుద్ధి సత్త్వగుణ ప్రధానుడగు వాసుదేవ భగవానునియందు దృఢముగా నిలిచినది. ఇది గొప్ప ఆశ్చర్యము సుమా!

యస్య భక్తిర్భగవతి హరౌ నిశ్శ్రేయసేశ్వరే ।
విక్రీడతోఽమృతాంభోధౌ కిం క్షుద్రైః ఖాతకోదకైః ॥ 22

యస్య - ఎవనికైతే, నిశ్శ్రేయస-ఈశ్వరే - మోక్షమునకు ప్రభుడగు, హరౌ భగవతి - శ్రీహరి భగవానునియందు, భక్తిః - భక్తియో, అమృత-అంభోధౌ - అమృత సముద్రమునందు, విక్రీడతః - విహరించుచున్న అట్టివానికి, క్షుద్రైః - అల్పములగు, ఖాతక-ఉదకైః - గుంటల నీళ్లతో, కిమ్ - పని యేమి?

శ్రీహరి భగవానుడు మోక్షమునకు అధీశ్వరుడు. ఆయనయందు భక్తి కలిగి, అమృత సముద్రమునందు ఓలలాడే నీకు గుంట నీళ్లవంటి స్వర్గాదులతో పని యేమున్నది?

శ్రీశుక ఉవాచ ।
ఇతి బ్రువాణావన్యోన్యం ధర్మజిజ్ఞాసయా నృప ।
యుయుధాతే మహావీర్యావింద్రవృత్రౌ యుధాం పతీ ॥ 23

నృప - ఓ మహారాజా!, మహావీర్యౌ - గొప్ప పరాక్రమము గలవారు, యుధామ్ - యుద్ధవీరులకు, పతీ - ప్రభువులు అగు, ఇంద్రవృత్రౌ - ఇంద్రుడు వృత్రుడు, ధర్మజిజ్ఞాసయా - ధర్మమును తెలియవలెననే కోరికతో, ఇతి - ఈ విధముగా, అన్యోన్యమ్ - పరస్పరము, బ్రువాణౌ - మాటలాడుచున్నవారై, యుయుధాతే - యుద్ధమును చేసిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ మహారాజా! గొప్ప పరాక్రమము గలవారు, యుద్ధవీరులకు నాయకులు అగు ఇంద్రవృత్రులిద్దరు ధర్మమును తెలుసుకోవాలనే కోరికతో ఈ విధముగా పరస్పరము మాటలాడుకుంటూ, యుద్ధమును చేసిరి.

ఆవిధ్య పరిఘం వృత్రః కార్ష్ణాయసమరిందమః ।
ఇంద్రాయ ప్రాహిణోద్ఘోరం వామహస్తేన మారిష ॥ 24

మారిష - మాననీయా!, అరిందమః - శత్రువులను శాసించే, వృత్రః - వృత్రుడు, కార్ష్ణాయసమ్ - లోహముతో చేయబడినట్టియు,

ఘోరమ్ - భయంకరమగు, పరిఘమ్ - గుదియను, వామహస్తేన - ఎడమ చేతితో, ఆవిధ్య - త్రిప్పి, ఇంద్రాయ - ఇంద్రుని కొరకు, ప్రాహిణోత్ - విసిరి వేసెను.

శత్రుశాసకుడగు వృత్రుడు భయంకరమగు లోహపు గుదియను ఎడమ చేతితో గిరగిర త్రిప్పి, ఇంద్రుని పైకి విసిరెను.

స తు వృత్రస్య పరిఘం కరం చ కరభోపమమ్ ।
చిచ్ఛేద యుగపద్దేవో వజ్రేణ శతపర్వణా ॥ 25

సః - ఆ, దేవః తు - ఇంద్రదేవుడైతే, వృత్రస్య - వృత్రుని, పరిఘమ్ - గుదియను, కరభ-ఉపమమ్ - ఏనుగు తొండమును పోలిన, కరం చ - చేతిని కూడ, యుగపత్ - ఒక్కసారి, శతపర్వణా - వంద కణుపులు గల, వజ్రేణ - వజ్రముతో, చిచ్ఛేద - ఛేదించెను.

ఆ ఇంద్రదేవుడు వృత్రుని గుదియను, ఏనుగు తొండమువంటి చేతిని కూడ వంద కణుపుల వజ్రముతో ఒకే సారి తెగగొట్టెను.

దోర్భ్యాముత్కృత్తమూలాభ్యాం బభౌ రక్తస్రవోఽసురః ।
ఛిన్నపక్షో యథా గోత్రః ఖాద్భ్రష్టో వజ్రిణా హతః ॥ 26

ఉత్కృత్తమూలాభ్యామ్ - తెగగొట్టబడిన మొదళ్లు గల, దోర్భ్యామ్ - రెండు చేతులతో, రక్తస్రవః - రక్తమును స్రవించుచున్న, అసురః - వృత్రాసురుడు, వజ్రిణా - వజ్రధరుడగు ఇంద్రునిచే, హతః - కొట్టబడినది, ఛిన్నపక్షః - తెగగొట్టబడిన రెక్కలు గలది, ఖాత్ - ఆకాశము నుండి, భ్రష్టః - క్రింద పడినది అగు, గోత్రః యథా - పర్వతము వలె, బభౌ - ప్రకాశించెను.

వజ్రధరుడగు ఇంద్రుడు వృత్రుని రెండు చేతులను మొదళ్ల వరకు నరికెను. రక్తము కారుచుండగా ఆ రాక్షసుడు, ఇంద్రునిచే వజ్రముతో తెగ గొట్టబడిన రెక్కలు గలదియై ఆకాశమునుండి నేలగూలిన పర్వతము వలె, శోభిల్లెను.

కృత్వాऽధరాం హనుం భూమౌ దైత్యో దివ్యుత్తరాం హనుమ్ ।
నభోగంభీరవక్త్రేణ లేలిహోల్బణజిహ్వయా ॥ 27

దంష్ట్రాభిః కాలకల్పాభిర్గ్రసన్నివ జగత్త్రయమ్ ।
అతిమాత్రమహాకాయ ఆక్షిపంస్తరసా గిరీన్ ॥ 28

గిరిరాట్ పాదచారీవ పద్భ్యాం నిర్జరయన్ మహీమ్ ।
జగ్రాస స సమాసాద్య వజ్రిణం సహవాహనమ్ ।
మహాప్రాణో మహావీర్యో మహాసర్ప ఇవ ద్విపమ్ ॥ 29

అతిమాత్రమహాకాయః - మిక్కిలి ఎత్తైన పెద్ద దేహము గలవాడు, మహాప్రాణః - గొప్ప బలము గలవాడు, మహావీర్యః - గొప్ప పరాక్రమము గలవాడు అగు, సః - ఆ, దైత్యః - రాక్షసుడు, అధరామ్ - క్రింది, హనుమ్ - దవడను, భూమౌ - భూమియందు, ఉత్తరామ్ - పై, హనుమ్ - దవడను, దివి - స్వర్గమునందు, కృత్వా - ఆన్చి, నభః-గంభీరవక్త్రేణ - ఆకాశము వలె లోతైన నోటితో, లేలిహ-ఉల్బణజిహ్వయా - పాము వలె భయంకరమగు నాలుకతో, కాలకల్పాభిః - మృత్యుదేవతను బోలిన, దంష్ట్రాభిః - కోరలతో, జగత్-త్రయమ్ - ముల్లోకములను, గ్రసన్ ఇవ - మ్రింగుచున్నవాడు వలె, గిరీన్ - పర్వతములను, తరసా - వేగముగా, ఆక్షిపన్ - కదిలించుచున్నవాడై, పాదచారీ - కాళ్లపై నడుస్తున్న, గిరిరాట్ - పర్వతరాజు వలె, పద్భ్యామ్ - పాదములతో, మహీమ్ - భూమిని, నిర్జరయన్ - చూర్ణము చేయుచున్నవాడై, సమాసాద్య - దగ్గరకు వచ్చి, సహవాహనమ్ - వాహనమగు ఐరావతముతో గూడిన, వజ్రిణమ్ - వజ్రధారి యగు ఇంద్రుని, మహాసర్పః - పెద్ద పాము, ద్విపం ఇవ - ఏనుగును వలె, జగ్రాస - మ్రింగి వేసెను.

మిక్కిలి ఎత్తైన పెద్ద దేహము, గొప్ప బలపరాక్రమములు గల ఆ రాక్షసుడు క్రింది పెదవిని భూమికి, పై పెదవిని స్వర్గమునకు ఆన్చెను. అతని నోరు ఆకాశము వలె లోతుగా నుండెను. అతని నాలుక పాము వలె భయమును గొల్పుచుండెను. అతని కోరలు మృత్యుదేవత కోరలను బోలి యుండెను. అతడు ముల్లోకములను మ్రింగి వేయునా యన్నట్లుండెను.

ఆతడు పర్వతములను వేగముగా కదిలిస్తూ, నడయాడే పర్వతరాజు వలె భూమిని పాదములతో చూర్ణము చేస్తూ, వజ్రధారియగు ఇంద్రుని మీదకు వచ్చెను. అపుడాతడు, కొండ చిలువ ఏనుగును వలె, ఇంద్రుని ఆతని వాహనమగు ఐరావతమును కూడ మ్రింగి వేసెను.

వృత్రగ్రస్తం తమాలక్ష్య సప్రజాపతయస్సురాః ।
హా కష్టమితి నిర్విణ్ణాశ్చుక్రుశుస్సమహర్షయః ॥ 30

వృత్రగ్రస్తమ్ - వృత్రునిచే, గ్రస్తమ్ - మ్రింగివేయబడిన, తమ్ - ఆ ఇంద్రుని, ఆలక్ష్య - చూచి, సప్రజాపతయః - ప్రజాపతులతో గూడినవారు, సమహర్షయః - మహర్షులతో గూడినవారు అగు, సురాః - దేవతలు, హా - అయ్యో!, కష్టమ్ - కష్టము!, ఇతి - అని, నిర్విణ్ణాః - నిరాశను పొందినవారై, చుక్రుశుః - ఆక్రోశించిరి.

వృత్రుడు ఇంద్రుని మ్రింగివేయుచుండగా, ప్రజాపతులతో మరియు మహర్షులతో కూడియున్న దేవతలు చూచి, అయ్యో! కష్టము వచ్చినది! అంటూ నిరాశతో ఆక్రోశించిరి.

నిగీర్ణోఽప్యసురేంద్రేణ న మమారోదరం గతః ।
మహాపురుషసన్నద్ధో యోగమాయాబలేన చ ॥ 31

అసుర-ఇంద్రేణ - రాక్షసశ్రేష్ఠుడగు వృత్రునిచే, నిగీర్ణః - మ్రింగి వేయబడినవాడు, ఉదరమ్ - ఉదరమును, గతః అపి - పొందినవాడు అయిననూ, మహాపురుషసన్నద్ధః - పురుషోత్తమునిచే కవచితుడైన ఇంద్రుడు, యోగమాయాబలేన చ - త్రిగుణాత్మకయగు మాయాశక్తియొక్క బలముచే కూడ, న మమార - మరణించ లేదు.

రాక్షసశ్రేష్ఠుడగు వృత్రునిచే మ్రింగివేయబడిన ఇంద్రుడు వాని ఉదరమును చేరి కూడ మరణించలేదు. ఏలయనగా, ఆతనిని పురుషోత్తముడు కవచము రూపములో కాపాడెను. పైగా, ఆతని వద్ద త్రిగుణాత్మకయగు మాయాశక్తియొక్క బలము కూడ గలదు.

భిత్త్వా వజ్రేణ తత్కుక్షిం నిష్క్రమ్య బలభిద్విభుః।
ఉచ్చకర్త శిరశ్శత్రోర్గిరిశృంగమివౌజసా ॥ 32

బలభిత్ - బలాసురుని సంహరించినవాడు, విభుః - దేవరాజు అగు ఇంద్రుడు, వజ్రేణ - వజ్రముతో, తత్-కుక్షిమ్ - వాని పొట్టను, భిత్త్వా - ఛేదించి, నిష్క్రమ్య - బయటకు వచ్చి, శత్రోః - శత్రువగు వృత్రుని, గిరి శృంగం ఇవ - పర్వత శిఖరమువంటి, శిరః - తలను, ఓజసా - బలముతో, ఉచ్చకర్త - తెగగొట్టెను.

బలాసురుని సంహరించిన దేవరాజగు ఇంద్రుడు వజ్రముతో వాని పొట్టను చీల్చి బయటకు వచ్చి, తన శత్రువగు వృత్రుని పర్వత శిఖరము వంటి తలను బలముగా నరికెను.

వజ్రస్తు తత్కంధరమాశువేగః కృంతన్ సమంతాత్పరివర్తమానః ।
న్యపాతయత్తావదహర్గణేన యో జ్యోతిషామయనే వార్త్రహత్యే ॥

ఆశువేగః - అధికమగు వేగము గల, వజ్రః తు - వజ్రమైతే, తత్-కంధరమ్ - వాని మెడను, కృంతన్ - తెగగొట్టుచున్నదై, వార్త్రహత్యే - వృత్రుని సంహరించుటయందు, సమంతాత్ - అన్ని వైపులా, పరివర్త మానః - తిరుగుచున్నదై, తావత్ - అంత, అహః-గణేన - రోజుల సముదాయముచే, న్యపాతయత్ - పడవేసెను, యః - ఏ సముదాయమైతే, జ్యోతిషామ్ - సూర్యాది జ్యోతిర్మండలముల, అయనే - గతియందు.

ఆ వజ్రము అధికమగు వేగముతో వృత్రుని మెడను కోసుకుంటూ, వానిని సంహరించే పనిలో చుట్టూ తిరుగుతూ కొంత కాలమునకు దానిని క్రింద పడవేసి, వానిని సంహరించెను. అదే కాలము (సంవత్సరము) లో సూర్యుడు మొదలగు జ్యోతిర్మండలములు దక్షిణ-ఉత్తర అయనముల గతిని పూర్తి చేసెను.

తదా చ ఖే దుందుభయో వినేదుర్గంధర్వసిద్ధాస్సమహర్షిసంఘాః,
వార్త్రఘ్నలింగైస్తమభిష్టువానా మంత్రైర్ముదా కుసుమైరభ్యవర్షన్।

**తదా చ** - అప్పుడు, **ఖే** - ఆకాశమునందు, **దుందుభయః** - భేరీలు, **వినేదుః** - మ్రోగినవి, **సమహర్షిసంఘాః** - మహర్షుల గుంపులతో గూడియున్న, **గంధర్వసిద్ధాః** - గంధర్వులు సిద్ధులు, **వార్త్రఘ్నలింగైః** - వృత్రుని సంహరించిన ఇంద్రుని పరాక్రమమును వెల్లడి జేసే, **మంత్రైః** - మంత్రములతో, **ముదా** - ఆనందముతో, **తమ్** - ఆ ఇంద్రుని, **అభిష్టువానాః** - అభిముఖముగా స్తుతించుచున్నవారై, **కుసుమైః** - పుష్పములతో, **అభ్యవర్షన్** - వర్షించిరి.

అప్పుడు ఆకాశమునందు దేవదుందుభులు మ్రోగినవి. మహర్షుల గణములు, గంధర్వులు, సిద్ధులు వృత్రుని సంహరించిన ఇంద్రుని పరాక్రమమును వెల్లడి జేసే మంత్రములతో ఆయనను అభిముఖముగా స్తుతిస్తూ, ఆనందముతో ఆయనపై పూలవానను కురిపించిరి.

వృత్రస్య దేహాన్నిష్క్రాంతమాత్మజ్యోతిరరిందమ ।
పశ్యతాం సర్వలోకానామలోకం సమపద్యత ।। 35

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే ఇంద్రేణ
వృత్రాసురసంహారో నామ ద్వాదశోఽధ్యాయః ।।

**అరిందమ** - శత్రువులను శాసించువాడా!, **వృత్రస్య** -వృత్రుని, **దేహాత్** - దేహమునుండి, **నిష్క్రాంతమ్** - బయటకు వచ్చిన, **ఆత్మజ్యోతిః** - సూక్ష్మ శరీర ప్రకాశము, **సర్వలోకానామ్** - అందరు జనులు, **పశ్యతామ్** - చూచుచుండగా, **అలోకమ్** - లోకములకు అతీతుడగు భగవానుని, **సమపద్యత** - చేరుకొనెను.

అంతశ్శత్రువులను శాసించే ఓ మహారాజా! వృత్రుని దేహమునుండి సూక్ష్మ శరీర ప్రకాశము బయటకు వచ్చి, దేవతలు మొదలగు వారందరు చూచుచుండగా, లోకాతీతుడగు భగవానునిలో ఐక్యమయ్యెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి ఆరవ స్కంధములో వృత్రాసురుని సంహారమును వర్ణించే పన్నెండవ అధ్యాయము ముగిసినది (12).

*****

# అథ త్రయోదశోఽధ్యాయః

## ఇంద్రుడు బ్రహ్మహత్యాపాపమునుండి విముక్తుడగుట

శ్రీశుక ఉవాచ ।
వృత్రే హతే త్రయో లోకా వినా శక్రేణ భూరిద ।
సపాలా హ్యభవన్ సద్యో విజ్వరా నిర్వృతేంద్రియాః ॥ 1

భూరిద - అధికముగా ఇచ్చువాడా!, వృత్రే - వృత్రుడు, హతే - సంహరించ బడగా, శక్రేణ వినా - ఇంద్రుడు తప్ప, సపాలాః - పాలకులతో కూడిన, త్రయః - మూడు, లోకాః - లోకములు, సద్యః - వెంటనే, విజ్వరాః - తొలగిన తాపము గలవి, నిర్వృత-ఇంద్రియాః - సుఖించిన మనస్సులు గలవి, అభవన్ హి - ఆయెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- గొప్ప దాతవగు ఓ పరీక్షిన్మహారాజా! వృత్రుడు సంహరించబడగా, ఇంద్రుడు తప్ప ముల్లోకముల వారికి వెంటనే సంతాపము తొలగి, మనస్సులు సుఖమును పొందెను.

దేవర్షిపితృభూతాని దైత్యా దేవానుగాస్స్వయమ్ ।
ప్రతిజగ్ముస్స్వధిష్ణ్యాని బ్రహ్మేశేంద్రాదయస్తతః ॥ 2

తతః - తరువాత, దేవ-ఋషిపితృభూతాని - దేవతలు మహర్షులు పితృదేవతలు భూతగణములు, దైత్యాః - దైత్యులు, దేవ-అనుగాః - దేవతల అనుచరులు, స్వయమ్ - స్వయముగా, బ్రహ్మ-ఈశ-ఇంద్ర-ఆదయః - బ్రహ్మగారు రుద్రుడు ఇంద్రుడు మొదలగువారు, స్వధిష్ణ్యాని - తమ స్థానములను గురించి, ప్రతిజగ్ముః - తిరిగి వెళ్లిరి.

తరువాత దేవతలు, మహర్షులు, పితృదేవతలు, భూతగణములు, దైత్యులు, దేవతల అనుచరులగు విద్యాధరాదులు తమ తమ నెలవులకు

వెళ్లిరి. అప్పుడు బ్రహ్మగారు, రుద్రుడు, ఇంద్రుడు మొదలగువారు తాము కూడ తమ స్థానములకు వెళ్లిరి.

రాజోవాచ ।
ఇంద్రస్యాఽనిర్వృతేర్హేతుం శ్రోతుమిచ్ఛామి భో మునే ।
యేనాసన్ సుఖినో దేవా హరేర్దుఃఖం కుతోఽభవత్ ।। 3

భోః మునే - ఓ మహర్షీ!, ఇంద్రస్య - ఇంద్రుని, అనిర్వృతేః - సుఖమును పొందకుండుటకు, హేతుమ్ - కారణమును, శ్రోతుమ్ - వినుటకు, ఇచ్ఛామి - కోరుచున్నాను, యేన - దేనిచే, దేవాః - దేవతలు, సుఖినః - సుఖము గలవారు, ఆసన్ - అయిరో, హరేః - ఇంద్రునకు, దుఃఖమ్ - దుఃఖము, కుతః - ఎందువలన, అభవత్ - కలిగెను?

పరీక్షిన్మహారాజు ఇట్లు ప్రశ్నించెను --- ఓ మహర్షీ! ఇంద్రుడు సుఖమును పొందకుండుటకు గల కారణమును నేను విన గోరుచున్నాను. వృత్రుని సంహారము వలన దేవతలు సుఖించిరి. ఇంద్రునకు దుఃఖము కలుగుటకు కారణమేమి?

శ్రీశుక ఉవాచ ।
వృత్రవిక్రమసంవిగ్నాస్సర్వే దేవాస్సహర్షిభిః ।
తద్వధాయార్థయన్నింద్రం నైచ్ఛద్భీతో బృహద్వధాత్ ।। 4

వృత్రవిక్రమసంవిగ్నాః - వృత్రుని పరాక్రమముచే భయపడిన, సర్వే - అందరు, దేవాః - దేవతలు, ఋషిభిః సహ - మహర్షులతో గూడి, తద్-వధాయ - ఆ వృత్రుని వధ కొరకు, ఇంద్రమ్ - ఇంద్రుని, ఆర్థయన్ - ప్రార్థించిరి, బృహద్-వధాత్ - బ్రాహ్మణుని వధ వలన, భీతః - భయపడిన ఇంద్రుడు, న ఐచ్ఛత్ - ఇష్టపడ లేదు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- దేవతలందరు వృత్రుని పరాక్రమమునకు భయపడి, మహర్షులతో గూడి, వృత్రుని సంహరించుమని ఇంద్రుని ప్రార్థించిరి. కాని, బ్రహ్మహత్యాపాపము వలన భయపడిన ఇంద్రుడు దానికి ఇష్టపడ లేదు.

ఇంద్ర ఉవాచ ।
స్త్రీభూజలద్రుమైరేనో విశ్వరూపవధోద్భవమ్ ।
విభక్తమనుగృహ్ణద్భిర్వృత్రహత్యాం క్వ మార్జ్మ్యహమ్ ॥ 5

విశ్వరూపవధ-ఉద్భవమ్ - విశ్వరూపుని వధించుట వలన పుట్టిన, ఏనః - పాపము, అనుగృహ్ణద్భిః - అనుగ్రహమును చూపుచున్న, స్త్రీభూ జలద్రుమైః - స్త్రీలు భూమి జలము చెట్లచే, విభక్తమ్ - పంచుకొన బడిన ది, వృత్రహత్యామ్ - వృత్రుని హత్యను, అహమ్ - నేను, క్వ - ఎక్కడ, మార్జ్మి - క్షాళన చేసుకొనవలెను?

ఇంద్రుడిట్లు పలికెను --- విశ్వరూపుని వధ వలన కలిగిన బ్రహ్మ హత్యాపాపమును స్త్రీలు, భూమి, నీరు, చెట్లు పంచుకొని నన్ను అనుగ్రహించినవి. వృత్రుని హత్య చేసినచో, నేను ఆ పాపమును ఎక్కడ క్షాళన చేసుకొన వలెను?

శ్రీశుక ఉవాచ ।
ఋషయస్తదుపాకర్ణ్య మహేంద్రమిదమబ్రువన్ ।
యాజయిష్యామ భద్రం తే హయమేధేన మా స్మ భైః ॥ 6

ఋషయః - మహర్షులు, తత్ - ఆ మాటను, ఉపాకర్ణ్య - విని, మహేంద్రమ్ - మహేంద్రుని ఉద్దేశించి, ఇదమ్ - ఈ మాటను, అబ్రువన్ - పలికిరి, తే - నీ కొరకు, భద్రమ్ - మంగళమగు గాక!, హయమేధేన - అశ్వమేధముచే, యాజయిష్యామ - యజ్ఞము చేయించెదము, మా స్మ భైః - భయపడకుము.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- మహర్షులు ఆ మాటను విని మహేంద్రునితో నిట్లనిరి --- నీకు మంగళమగు గాక! నీచే అశ్వమేధ యాగమును చేయించెదము. భయపడకుము.

హయమేధేన పురుషం పరమాత్మానమీశ్వరమ్ ।
ఇష్ట్వా నారాయణం దేవం మోక్ష్యసేఽపి జగద్వధాత్ ॥ 7

పురుషమ్ - పూర్ణుడైనట్టియు, పరమాత్మానమ్ - అంతరతమ మగు ఆత్మస్వరూపుడైనట్టియు, ఈశ్వరమ్ - జగన్నాథుడగు, నారాయణం దేవమ్ - నారాయణ దేవుని, హయమేధేన - అశ్వమేధయాగముచే, ఇష్ట్వా - ఆరాధించి, జగద్-వధాత్ అపి - జగత్తుయొక్క వధనుండి కూడ, మోక్ష్యసే - విముక్తిని పొందగలవు.

పూర్ణుడు, అంతరతమమగు ఆత్మస్వరూపుడు, జగన్నాథుడు అగు నారాయణ దేవుని అశ్వమేధయాగముతో ఆరాధించినచో, జగత్తునం తనూ సంహరించిన పాపమునుండి కూడ విముక్తి కలుగును.

బ్రహ్మహా పితృహా గోఘ్నో మాతృహాऽऽచార్యహాऽఘవాన్ ।
శ్వాదః పుల్కసకో వాపి శుద్ధ్యేరన్ యస్య కీర్తనాత్ ॥ 8

బ్రహ్మహా - బ్రహ్మహత్య చేసినవాడు, పితృహా - తండ్రిని చంపి నవాడు, గోఘ్నః - గోవును చంపినవాడు, మాతృహా - తల్లిని చంపినవా డు, ఆచార్యహా - ఆచార్యుని చంపిన, అఘవాన్ - పాపి, శ్వాదః - కుక్క మాంసమును తినే, పుల్కసకః వా అపి - కసాయి కూడ, యస్య - ఏ నారా యణుని, కీర్తనాత్ - కీర్తించుట వలన, శుద్ధ్యేరన్ - శుద్ధిని పొందెదరో.

బ్రాహ్మణుని, తండ్రిని, గోవును, తల్లిని లేదా ఆచార్యుని చంపిన పాపి, కుక్క మాంసమును తినే కసాయి కూడ నారాయణుని కీర్తించినచో, పాపవిముక్తులగుదురు.

తమశ్వమేధేన మహామఖేన
శ్రద్ధాऽన్వితోऽస్మాభిరనుష్ఠితేన ।
హత్వాపి సబ్రహ్మ చరాచరం త్వం
న లిప్యసే కిం ఖలనిగ్రహేణ ॥ 9

అస్మాభిః - మాచే, అనుష్ఠితేన - అనుష్ఠించబడే, అశ్వమేధేన - అశ్వమేధము అనే, మహామఖేన - గొప్ప యాగముచే, శ్రద్ధా-అన్వితః - శ్రద్ధతో కూడియున్న, త్వమ్ - నీవు, తమ్ - ఆ నారాయణుని (ఆరాధించి), సబ్రహ్మ - బ్రహ్మగారితో కూడియున్న, చర-అచరమ్ - కదిలే కదలని

ప్రాణిసమూహమును, హత్వా అపి - సంహరించి కూడ, న లిప్యసే - లేప మును పొందవు, ఖలనిగ్రహేణ - దుష్టుని సంహరించుటచే, కిమ్ - చెప్పు నదేమున్నది?

మేము అశ్వమేధము అనే గొప్ప యాగము ననుష్ఠించెదము. దానితో నీవు శ్రద్ధతో ఆ నారాయణుని ఆరాధించుము. అప్పుడు బ్రహ్మాగా రితో సహా సకల చరాచరజగత్తును సంహరించిన పాపము కూడ నిన్ను స్పృశించ లేదు. దుష్టుని సంహరించుట వలన కలిగే పాపము గురించి ఇక చెప్పునదేమున్నది?

శ్రీశుక ఉవాచ ।
ఏవం సంచోదితో విప్రైర్మరుత్వానహనద్రిపుమ్ ।
బ్రహ్మహత్యా హతే తస్మిన్నాససాద వృషాకపిమ్ ॥ 10

ఏవమ్ - ఈ విధముగా, విప్రైః - మహర్షులచే, సంచోదితః - ప్రేరేపించబడిన, మరుత్వాన్ - ఇంద్రుడు, రిపుమ్ - శత్రువును, అహనత్ - సంహరించెను, తస్మిన్ - ఆ వృత్రుడు, హతే - సంహరించబడగా, బ్రహ్మహత్యా - బ్రహ్మహత్యా పాపము, వృషాకపిమ్ - ఇంద్రుని, ఆససాద - పట్టుకొనెను.

ఈ విధముగా మహర్షులు ప్రేరేపించగా, ఇంద్రుడు తన శత్రువగు వృత్రుని సంహరించెను. వృత్రుడు సంహరించ బడగానే, బ్రహ్మహత్యా పాపము ఇంద్రుని పట్టుకొనెను.

తయేంద్రస్స్మాసహత్తాపం నిర్వృతిర్నామమువిశత్,
హ్రీమంతం వాచ్యతాం ప్రాప్తం సుఖయంత్యపి నో గుణాః॥11

ఇంద్రః - ఇంద్రుడు, తయా - దానిచే, తాపమ్ - పీడను, అస హత్ స్మ - సహించెను, అముమ్ - వీనిని, నిర్వృతిః - సుఖము, న ఆవి శత్ - కలుగలేదు, వాచ్యతామ్ - నిందించదగిన స్థితిని, ప్రాప్తమ్ - పొంది న, హ్రీమంతమ్ - వినయశీలుని, గుణాః అపి - సద్గుణములు కూడ, నో సుఖయంతి - సుఖమును కలిగించవు.

ఆ బ్రహ్మహత్యా పాపముచే ఇంద్రుడు పీడను సహించుచుండెను. ఆయనకు సుఖము లేకుండెను. వినయశీలియగు వ్యక్తి నిందించదగిన స్థితిని చేరుకున్నచో, ఆతని సద్గుణములు కూడ ఆతనికి సుఖమునీయలేవు.

తాం దదర్శానుధావంతీం చాండాలీమివ రూపిణీమ్ ।
జరయా వేపమానాంగీం యక్ష్మగ్రస్తామసృక్పటామ్ ॥ 12

వికీర్య పలితాన్ కేశాంస్తిష్ఠ తిష్ఠేతి భాషిణీమ్ ।
మీనగంధ్యసుగంధేన కుర్వతీం మార్గదూషణమ్ ॥ 13

అనుధావంతీమ్ - వెనుక పరుగెత్తుచున్నట్టియు, చాండాలీం ఇవ - కసాయిదాని వలె, రూపిణీమ్ - రూపము కలిగినట్టియు, జరయా - ముసలిదనముచే, వేపమాన-అంగీమ్ - వణుకుచున్న అవయవములు కలిగినట్టియు, యక్ష్మగ్రస్తామ్ - క్షయరోగముచే పట్టుకొనబడినట్టియు, అసృక్-పటామ్ - రక్తము గల వస్త్రము కలిగినట్టియు, పలితాన్ - తెల్లబడిన, కేశాన్ - కేశములను, వికీర్య - విరబోసుకొని, తిష్ఠ తిష్ఠ - నిలు నిలు, ఇతి - అని, భాషిణీమ్ - పలుకుచున్నట్టియు, మీనగంధి-అసుగంధేన - చేపల వాసన గల నిశ్శ్వాసవాయువుయొక్క వాసనచే, మార్గదూషణమ్ - మార్గముయొక్క చెడగొట్టుటను, కుర్వతీమ్ - చేయుచున్న, తామ్ - ఆ బ్రహ్మహత్యను, దదర్శ - చూచెను.

కసాయిదానివంటి రూపము గల ఆ బ్రహ్మహత్య తన వెంట పరుగెత్తుచుండగా ఇంద్రుడు చూచెను. క్షయరోగము పట్టుకున్న ఆమె శరీరము ముసలిదనముచే వణుకుచుండెను. ఆమె వస్త్రము రక్తపు మరకలను కలిగియుండెను. తెల్లని జుట్టు విరబోసుకొని, ఆమె నిలు నిలు అని పలుకుచుండెను. ఆమె పీల్చి విడిచే గాలి చేపల కంపు గలదియై, దారి అంతా దుర్వాసన వ్యాపించుచుండెను.

నభో గతో దిశస్సర్వాస్సహస్రాక్షో విశాం పతే ।
ప్రాగుదీచీం దిశం తూర్ణం ప్రవిష్టో నృప మానసమ్ ॥ 14

విశాం పతే - నరపతీ!, సహస్ర-అక్షః - ఇంద్రుడు, నభః - ఆకాశ మును, సర్వాః - అన్ని, దిశః - దిక్కులను, గతః - పొందినవాడు, నృప - రాజా!, తూర్ణమ్ - వెంటనే, ప్రాక్-ఉదీచీం దిశమ్ - ఈశాన్యదిక్కును, మానసమ్ - మానస సరోవరమును, ప్రవిష్టః - ప్రవేశించిన వాడు.

ఓ పరీక్షిన్మహారాజా! వేయి కన్నుల వేల్పు ఆకాశములో దిక్కుల న్నీ తిరిగి, వెంటనే ఈశాన్యదిక్కులోని మానస సరోవరమును ప్రవేశించెను.

స ఆవసత్పుష్కరనాలతంతూ-
నలబ్ధభోగో యదిహాగ్నిదూతః।
వర్షాణి సాహస్రమలక్షితోఽంతః
స చింతయన్ బ్రహ్మవధాద్విమోక్షమ్ ॥ **15**

సః - ఆ ఇంద్రుడు, పుష్కరనాలతంతూన్ - పద్మపు తూడు యొక్క త్రాళ్లను, ఆవసత్ - నివసించెను, అలబ్ధభోగః - పొందబడని భోగము గలవాడు, యత్ - ఏలయనగా, ఇహ - ఈ లోకమునందు, అగ్ని దూతః - అగ్నియే దూతగా గలవాడు, సః - ఆ ఇంద్రుడు, సాహస్రం వర్షాణి - వేయి సంవత్సరములు, అంతః - లోపల, అలక్షితః - కనబడని వాడై, బ్రహ్మవధాత్ - బ్రహ్మహత్యనుండి, విమోక్షమ్ - విముక్తిని, చింత యన్ - ఆలోచించుచున్నవాడు.

ఆ ఇంద్రుడు పద్మపు తూడు లోపలి త్రాళ్లయందు వేయి సంవత్స రములు దాగియుండెను. ఇంద్రునకు హవ్యమును అందించే అగ్ని నీటిలో ప్రవేశించలేదు గనుక, ఆయనకు ఆ కాలములో ఆహారాది భోగములు లేకుండెను. ఆ లోపల ఆతడు బ్రహ్మహత్యనుండి విముక్తిని పొందే ఉపా యమును గురించియే చింతిల్లుచుండెను.

తావత్త్రిణాకం నహుషశ్శశాస విద్యాతపోయోగబలానుభావః,
స సంపదైశ్వర్యమదాంధబుద్ధిర్నీతస్తిరశ్చాం గతిమింద్రపత్న్యా।**16**

తావత్ - ఆ కాలమునందు, త్రిణాకమ్ - స్వర్గమును, విద్యాతపః- యోగబల-అనుభావః - ఉపాసన తపస్సు యోగశక్తుల ప్రభావము గల,

నహుషః - నహుషుడు, శశాస - శాసించెను, సంపద్-ఐశ్వర్యమద-అంధ బుద్ధిః - సంపద శాసకత్వముల వలని గర్వముచే గ్రుడ్డిదైన బుద్ధి గల, సః - ఆతడు, ఇంద్రపత్న్యా - ఇంద్రుని భార్యయగు శచీదేవిచే, తిరశ్చామ్ - పశువుల, గతిమ్ - జన్మను, నీతః - పొందించ బడినవాడు.

ఆ కాలమునందు స్వర్గమును నహుషుడు శాసించెను. ఆయన విద్య, తపస్సు, యోగశక్తుల ప్రభావము గలవాడే. కాని, సంపద అధికారముల వలన కలిగిన గర్వముచే ఆతని వివేకశక్తి లోపించెను. ఇంద్రుని భార్యయగు శచీదేవి కల్పించిన శాపముచే ఆతడు సర్పమై జన్మించెను.

తతో గతో బ్రహ్మగిరోపహూత
ఋతంభరధ్యాననివారితాఘః ।
పాపస్తు దిగ్దేవతయా హతౌజాస్తం
నాభ్యభూదవితం విష్ణుపత్న్యా ॥ 17

తతః - తరువాత, ఋతంభరధ్యాననివారిత-అఘః - సత్యసంకల్పుడగు శ్రీహరియొక్క (సత్యమును ప్రకాశింపజేసే) ధ్యానముచే తొలగించబడిన పాపము గల ఇంద్రుడు, బ్రహ్మగిరా - బ్రహ్మగారి వాక్కుచే, ఉపహూతః - ఆహ్వానించబడినవాడై, గతః - వెళ్లినవాడు, పాపః తు - బ్రహ్మహత్యా పాతకమైతే, దిగ్-దేవతయా - ఈశాన్యదిక్కునకు దేవతయగు ఈశానునిచే, హత-ఓజాః - నశింప జేయబడిన బలము గలదియై, విష్ణుపత్న్యా - విష్ణువుయొక్క భార్యయగు లక్ష్మీదేవిచే, అవితమ్ - రక్షించబడిన, ఇంద్రమ్ - ఇంద్రుని, న అభ్యభూత్ - పీడించ లేదు.

తరువాత సత్యసంకల్పుడగు శ్రీహరియొక్క (సత్యమును ప్రకాశింపజేసే) ధ్యానమును చేయుటచే ఇంద్రుని పాపము తొలగిపోయెను. బ్రహ్మగారు కబురు చేసి ఆహ్వానించగా, ఆయన తిరిగి స్వర్గమునకు వెళ్లెను. బ్రహ్మహత్యాపాపముయొక్క బలమును ఈశాన్యదిక్కునకు అధిదేవతయగు ఈశానుడు నశింప జేసెను. పైగా, విష్ణుపత్నియగు లక్ష్మి ఇంద్రుని రక్షించెను. ఆ విధముగా, ఆ పాపము ఆతనిని పీడించుట మానివేసెను.

తం చ బ్రహ్మర్షయోఽభ్యేత్య హయమేధేన భారత ।
యథావద్దీక్షయాంచక్రుః పురుషారాధనేన హ ॥ 18

భారత - ఓ భరతవంశీయుడా!, బ్రహ్మర్షయః - బ్రహ్మర్షులు, అభ్యేత్య - విచ్చేసి, తమ్ - ఆ ఇంద్రుని, పురుష-ఆరాధనేన - శ్రీహరి యొక్క ఆరాధన గల, హయమేధేన - అశ్వమేధయాగముచే, యథావత్ - యథాశాస్త్రముగా, దీక్షయాంచక్రుః - దీక్షితుని చేసిరి.

భరతవంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! అపుడు బ్రహ్మర్షులు విచ్చేసి, శ్రీహరియొక్క ఆరాధన గల అశ్వమేధ యాగమునకు ఇంద్రుని దీక్షితుని చేసిరి.

అథేజ్యమానే పురుషే సర్వదేవమయాత్మని ।
అశ్వమేధే మహేంద్రేణ వితతే బ్రహ్మవాదిభిః ॥ 19

స వై త్వాష్ట్రవధో భూయానపి పాపచయో నృప ।
నీతస్తేనైవ శూన్యాయ నీహార ఇవ భానునా ॥ 20

నృప - ఓ రాజా!, అథ - తరువాత, సర్వదేవమయ-ఆత్మని - సకలదేవతలతో నిండిన రూపము కలిగిన, పురుషే - పురుషోత్తముడు, మహేంద్రేణ - మహేంద్రునిచే, బ్రహ్మవాదిభిః - వేదవేత్తలచే, వితతే - అనుష్ఠించబడిన, అశ్వమేధే - అశ్వమేధ యాగమునందు, ఇజ్యమానే - ఆరాధించ బడుచుండగా, సః - ఆ, త్వాష్ట్రవధః - త్వష్టయొక్క పుత్రుడగు వృత్రుని సంహరించుట వలన కలిగిన, భూయాన్ - పెద్ద, పాపచయః అపి - పాపపు ముద్ద కూడ, వై - నిశ్చయముగా, తేన ఏవ - ఆ యాగము చేత నే, భానునా - సూర్యునిచే, నీహారః ఇవ - పొగమంచు వలె, శూన్యాయ - శూన్యము కొరకు, నీతః - కొనిపోబడెను.

ఓ పరీక్షిన్మహారాజా! బ్రహ్మవేత్తలతో గూడి మహేంద్రుడు అశ్వమే ధయాగముననుష్ఠించి, సర్వదేవతాస్వరూపుడగు పురుషోత్తముని ఆరాధిం చెను. దానిచే, త్వష్టయొక్క పుత్రుడగు వృత్రుని సంహరించుట వలన కలి

గిన పెద్ద పాపపు ముద్ద కూడ, సూర్యునిచే పొగమంచు వలె, నిశ్చయముగా నిశ్శేషముగా నశింప జేయబడెను.

స వాజిమేధేన యథోదితేన వితాయమానేన మరీచిమిశ్రైః,
ఇష్ట్వాఽధియజ్ఞం పురుషం పురాణమింద్రో మహానాస విధూతపాపః.

సః - ఆ, ఇంద్రః - మహేంద్రుడు, మరీచిమిశ్రైః - మరీచి ప్రముఖుడుగా గలవారిచే, యథా-ఉదితేన - యథావిధిగా, వితాయమానేన - అనుష్ఠింప జేయబడిన, వాజిమేధేన - అశ్వమేధ యాగముచే, అధియజ్ఞమ్ - యజ్ఞేశ్వరుడైనట్టియు, పురాణమ్ - కాలాతీతుడగు, పురుషమ్ - పురుషోత్తముని, ఇష్ట్వా - ఆరాధించి, విధూతపాపః - నశింప జేయబడిన పాపము గలవాడు, మహాన్ - పూజనీయుడు, ఆస - ఆయెను.

ఆ మహేంద్రుడు మరీచి మొదలగువారిచే యథావిధిగా అనుష్ఠించబడిన అశ్వమేధయాగముచే యజ్ఞేశ్వరుడు, పురాణపురుషుడు అగు శ్రీహరిని ఆరాధించి, పాపమును నశింప జేసుకొని, పూజనీయుడాయెను.

ఇదం మహాఖ్యానమశేషపాప్మనాం
ప్రక్షాలనం తీర్థపదానుకీర్తనమ్ ।
భక్త్యుచ్ఛ్రయం భక్తజనానువర్ణనం
మహేంద్రమోక్షం విజయం మరుత్వతః ॥ 22

ఇదమ్ - ఈ, మహా-ఆఖ్యానమ్ - గొప్ప గాథ, అశేషపాప్మనామ్ - సకలపాపములకు, ప్రక్షాలనమ్ - ప్రక్షాళనము చేయునది, తీర్థపద-అనుకీర్తనమ్ - గంగ పుట్టిన పాదములు గల శ్రీహరియొక్క నిరంతరమగు కీర్తనము గలది, భక్తి-ఉచ్ఛ్రయమ్ - భక్తియొక్క ఉత్కర్ష గలది, భక్తజన-అనువర్ణనమ్ - భక్తజనుల వర్ణనము గలది, మహేంద్రమోక్షమ్ - మహేంద్రుని పాపవిముక్తి గలది, మరుత్వతః - మహేంద్రునియొక్క, విజయమ్ - అధికమగు జయము గలది.

గంగకు జన్మనిచ్చిన పాదములు గల శ్రీహరిని కీర్తించి, భక్తజనుల చరితమును వర్ణించి, భక్తికి ఉత్కర్షను కలిగించే ఈ గొప్ప గాథ సకలపాప

ములను ప్రక్షాళన చేయును. దీనియందు మహేంద్రుని పాపవిముక్తి, అధిక మగు జయము వర్ణించ బడినవి.

పఠేయురాఖ్యానమిదం సదా బుధాః
శృణ్వంత్యథో పర్వణి పర్వణీంద్రియమ్ ।
ధన్యం యశస్యం నిఖిలాఘమోచనం
రిపుంజయం స్వస్త్యయనం తథాఽఽయుషమ్ ॥ 23

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే ఇంద్రస్య
బ్రహ్మహత్యాపాపవిముక్తిర్నామ త్రయోదశోఽధ్యాయః ॥

అథో - కావున, ఇంద్రియమ్ - ఇంద్రియములకు పాటవమునిచ్చునది, ధన్యమ్ - ధనమునిచ్చునది, యశస్యమ్ - కీర్తినిచ్చునది, నిఖిల-అఘమోచనమ్ - సకలపాపములనుండి విముక్తిని కలిగించునది, రిపుంజయమ్ - శత్రువులపై విజయమును కలిగించునది, స్వస్తి-అయనమ్ - మంగళములకు నిధానము, తథా - అదే విధముగా, ఆయుషమ్ - ఆయుర్వర్ధకము అగు, ఇదమ్ - ఈ, ఆఖ్యానమ్ - గాథను, బుధాః - విద్వాంసులు, సదా - అన్ని కాలములలో, పర్వణి పర్వణి - ప్రతి పర్వదినమునందు, పఠేయుః - పఠించెదరు, శృణ్వంతి - వినెదరు.

కల్యాణములకు నిధానమగు ఈ ఉపాఖ్యానము ఇంద్రియపాటవమును, ధనమును, కీర్తిని, సకలపాపములనుండి విముక్తిని, శత్రువులపై విజయమును మరియు ఆయుర్వృద్ధిని ఇచ్చును. కావున, విద్వాంసులు దీనిని అన్ని కాలములలో, లేదా పర్వదినములయందు పఠించెదరు, లేదా శ్రవణము చేసెదరు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి ఆరవ స్కంధములో ఇంద్రుడు
బ్రహ్మహత్యాపాపమునుండి విముక్తిని పొందుటను వర్ణించే పదమూడవ
అధ్యాయము ముగిసినది (13).

*****

# అథ చతుర్దశోऽధ్యాయః

## వృత్రాసురుని పూర్వచరితము - చిత్రకేతువునకు పుత్ర వియోగము

పరీక్షిదువాచ ।
రజస్తమస్స్వభావస్య బ్రహ్మన్ వృత్రస్య పాప్మనః ।
నారాయణే భగవతి కథమాసీద్దృఢా మతిః ॥ 1

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, రజః-తమః-స్వభావస్య - రజోగుణ తమోగుణ ప్రధానమగు స్వభావము గలిగినట్టియు, పాప్మనః - పాపియగు, వృత్రస్య - వృత్రునకు, నారాయణే భగవతి - నారాయణ భగవానునియందు, దృఢా - దృఢమగు, మతిః - భక్తి, కథమ్ - ఎట్లు, ఆసీత్ - కలిగెను?

పరీక్షిన్మహారాజు ఇట్లు ప్రశ్నించెను --- ఓ మహర్షీ! పాపియగు వృత్రుని స్వభావము రజోగుణము, తమోగుణము ప్రధానముగా గలది. అట్టివానికి నారాయణ భగవానునియందు దృఢమగు భక్తి ఎట్లు కలిగెను?

దేవానాం శుద్ధసత్త్వానామృషీణాం చామలాత్మనామ్ ।
భక్తిర్ముకుందచరణే న ప్రాయేణోపజాయతే ॥ 2

ప్రాయేణ - తరచుగా, శుద్ధసత్త్వానామ్ - పరిశుద్ధమగు సత్త్వగుణము గలిగినట్టియు, అమల-ఆత్మనామ్ - పరిశుద్ధమగు అంతఃకరణము గల, దేవానామ్ - దేవతలకు, ఋషీణాం చ - మహర్షులకు కూడ, ముకుందచరణే - శ్రీహరి పాదమునందు, భక్తిః - భక్తి, న ఉపజాయతే - ఉదయించదు.

దేవతలు, మహర్షుల అంతఃకరణములు శుద్ధమగు సత్త్వగుణము ప్రధానముగా కలిగి నిర్మలముగా నుండును. మోక్షప్రదాతయగు శ్రీహరి యందు వారికి కూడ భక్తి తరచుగా ఉదయించుట లేదు.

రజోభిస్సమసంఖ్యాతాః పార్థివైరిహ జంతవః ।
తేషాం యే కేచనేహంతే శ్రేయో వై మనుజాదయః ॥ 3

ఇహ - ఈ లోకమునందు, జంతవః - ప్రాణులు, పార్థివైః - భూమికి చెందిన, రజోభిః - ధూళికణములతో, సమసంఖ్యాతాః - సమాన మని లెక్కించబడునవి, తేషామ్ - వాటిలో, మనుజ-ఆదయః - మానవులు మొదలగు, యే కేచన వై - ఏవో కొన్ని ప్రాణులు మాత్రమే, శ్రేయః - ధర్మమును, ఈహంతే - చేయుచున్నవి.

భూమిపై ధూళికణములు ఎన్ని గలవో, ఈ జగత్తునందు ప్రాణులు అన్ని గలవని లెక్క వేసెదరు. ఈ ప్రాణులలో మానవులు మొద లగు ఏవో కొన్ని ప్రాణులు మాత్రమే ధర్మమును చేయుచున్నవి.

ప్రాయో ముముక్షవస్తేషాం కేచనైవ ద్విజోత్తమ ।
ముముక్షూణాం సహస్రేషు కశ్చిన్ముచ్యేత సిధ్యతి ॥ 4

ద్విజ-ఉత్తమ - ఓ మహర్షీ!, తేషామ్ - ఆ ధర్మమును చేయువారి లో, ప్రాయః - తరచుగా, ముముక్షవః - మోక్షమును కోరువారు, కేచన ఏవ - కొద్దిమంది మాత్రమే, ముముక్షూణామ్ - మోక్షమును కోరువారి యొక్క, సహస్రేషు - వేలయందు, కశ్చిత్ - ఒకానొకడు, ముచ్యేత - మోక్షమును పొందును, సిధ్యతి - సిద్ధిని పొందును.

ఓ మహర్షీ! ధర్మమును చేయువారిలోనైననూ తరచుగా కొద్ది మంది మాత్రమే మోక్షమును కోరెదరు. మోక్షమును కోరే వేలాదిమందిలో ఒకానొకడు మాత్రమే సంసారబంధమునుండి విముక్తుడై సిద్ధిని బడయును.

ముక్తానామపి సిద్ధానాం నారాయణపరాయణః ।
సుదుర్లభః ప్రశాంతాత్మా కోటిష్వపి మహామునే ॥ 5

మహామునే - ఓ మహర్షీ!, ముక్తానామ్ - మోక్షమును పొందిన, సిద్ధానాం అపి - సిద్ధులయొక్క, కోటిషు అపి - కోటిమందిలోనైననూ, నారాయణపరాయణః - నారాయణుడే పరమలక్ష్యముగా గలవాడు, ప్రశాంత-ఆత్మా - మిక్కిలి శాంతమగు మనస్సు గలవాడు, సుదుర్లభః - మిక్కిలి దుర్లభుడు.

ఓ మహర్షీ! సంసారబంధమునుండి విముక్తిని పొందిన సిద్ధపురుషులలోనైననూ, నారాయణుడే పరమలక్ష్యముగా కలిగి మిక్కిలి శాంతమగు మనస్సు గలవాడు కోటిలో ఒక్కడు కూడ కనబడుట దుర్ఘటమే.

వృత్రస్తు స కథం పాపస్సర్వలోకోపతాపనః।
ఇత్థం దృఢమతిః కృష్ణ ఆసీత్సంగ్రామ ఉల్బణే ॥ 6

పాపః - పాపి, సర్వలోక-ఉపతాపనః - సకలప్రాణులను తపింపజేయువాడు అగు, సః - ఆ, వృత్రః తు - వృత్రుడైతే, ఉల్బణే - భయంకరమగు, సంగ్రామే - యుద్ధమునందు, ఇత్థమ్ - ఈ విధముగా, కృష్ణే - శ్రీకృష్ణునియందు, దృఢమతిః - దృఢమగు భక్తి గలవాడు, కథమ్ - ఏ విధముగా, ఆసీత్ - ఆయెను?

వృత్రుడైతే సకలప్రాణులకు పీడను కలిగించిన పాపి. భయంకరమగు యుద్ధములో వానికి శ్రీకృష్ణునియందు ఇంతటి దృఢమగు భక్తి ఎట్లు కలిగెను?

అత్ర నస్సంశయో భూయాన్ శ్రోతుం కౌతూహలం ప్రభో।
యః పౌరుషేణ సమరే సహస్రాక్షమతోషయత్ ॥ 7

అత్ర - ఈ విషయమునందు, నః - మాకు, భూయాన్ - పెద్ద, సంశయః - సందేహము, ప్రభో - ఓ ప్రభూ!, శ్రోతుమ్ - వినుటకు, కౌతూహలమ్ - కుతూహలము, యః - ఏ వృత్రుడైతే, సమరే - యుద్ధమునందు, సహస్ర-అక్షమ్ - వేయి కన్నుల వేల్పును, పౌరుషేణ - పురుషకారముతో, అతోషయత్ - సంతోషపెట్టెనో.

ఓ ప్రభూ! ఈ విషయములో మాకు పెద్ద సందేహము గలదు. నాకు ఈ విషయమును వినాలనే కుతూహలము గలదు. ఆహా! వృత్రుడు యుద్ధములో వేయి కన్నుల వేలుపును తన పౌరుషముతో సంతోషపెట్టెను గదా!

సూత ఉవాచ ।
పరీక్షితోఽథ సంప్రశ్నం భగవాన్ బాదరాయణిః ।
నిశమ్య శ్రద్దధానస్య ప్రతినంద్య వచోఽబ్రవీత్ ॥ 8

భగవాన్ - పూజనీయుడగు, బాదరాయణిః - బాదరాయణుని పుత్రుడగు శుకుడు, శ్రద్దధానస్య - శ్రద్ధను కలిగియున్న, పరీక్షితః - పరీక్షిత్తుయొక్క, సంప్రశ్నమ్ - చక్కని ప్రశ్నను, నిశమ్య - విని, అథ - తరువాత, ప్రతినంద్య - అభినందించి, వచః - మాటను, అబ్రవీత్ - పలికెను.

సూత మహర్షి ఇట్లు పలికెను --- పూజనీయుడు, వేదవ్యాస బాదరాయణుని పుత్రుడు అగు శుకమహర్షి శ్రద్ధాళువు అగు పరీక్షిత్తు వేసిన చక్కని ప్రశ్నను విని, ఆయనను అభినందించి, ఇట్లు పలికెను.

శ్రీశుక ఉవాచ ।
శృణుష్వావహితో రాజన్నితిహాసమిమం యథా ।
శ్రుతం ద్వైపాయనముఖాన్నారదాద్దేవలాదపి ॥ 9

రాజన్ - ఓ రాజా!, ఇమమ్ - ఈ, ఇతిహాసమ్ - వృత్తాంతమును, అవహితః - ఏకాగ్రచిత్తము గలవాడవై, శృణుష్వ - వినుము, యథా - ఏ విధముగానైతే, ద్వైపాయనముఖాత్ - వ్యాసుని నోటినుండి, నారదాత్ - నారదునినుండి, దేవలాత్ అపి - దేవలునినుండి కూడ, శ్రుతమ్ - వినబడినదో.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! నేనీ వృత్తాంతమును వ్యాసుని వద్ద, నారదుని వద్ద, దేవలుని వద్ద కూడ వినియుంటిని. దానిని యథాతథముగా చెప్పెదను. నీవు సావధానముగా వినుము.

ఆసీద్రాజా సార్వభౌమశ్శూరసేనేషు వై నృప ।
చిత్రకేతురితి ఖ్యాతో యస్యాసీత్కామధుఙ్మహీ ॥ 10

నృప - ఓ రాజా!, శూరసేనేషు - శూరసేన దేశమునందు, చిత్ర కేతుః - చిత్రకేతువు, ఇతి - అని, ఖ్యాతః - ప్రసిద్ధిని గాంచిన, సార్వభౌమః - చక్రవర్తియగు, రాజా - రాజు, ఆసీత్ - ఉండెను, యస్య వై - ఎవనికైతే, మహీ - భూమి, కామధుక్ - కోరికలను పితికేది, ఆసీత్ - అయెనో.

ఓ మహారాజా! చిత్రకేతువు అని ప్రసిద్ధి గాంచిన మహారాజు శూర సేన దేశమునకు చక్రవర్తియై ఉండగా, భూమి ఆయనకు కోరికలనన్నింటినీ అనుగ్రహించినది.

తస్య భార్యాసహస్రాణాం సహస్రాణి దశాభవన్ ।
సాంతానికశ్చాపి నృపో న లేభే తాసు సంతతిమ్ ॥ 11

తస్య - వానికి, భార్యాసహస్రాణామ్ - భార్యల వేలయొక్క, సహ స్రాణి - వేలు, దశ - పది, అభవన్ - ఉండెను, నృపః - రాజు, సాంతానికః చ అపి - సంతానమునకు అర్హుడే కూడ, తాసు - వారియందు, సంతతిమ్ - సంతానమును, న లేభే - పొందలేదు.

ఆయనకు కోటిమంది భార్యలుండిరి. ఆయన సంతానమునకు అర్హుడే. అయిననూ, ఆయనకు వారియందు సంతానము కలుగలేదు.

రూపౌదార్యవయోజన్మవిద్యైశ్వర్యశ్రియాదిభిః ।
సంపన్నస్య గుణైస్సర్వైశ్చింతా వంధ్యాపతేరభూత్ ॥ 12

రూప-ఔదార్యవయః-జన్మవిద్యా-ఐశ్వర్యశ్రియాదిభిః - అందము దానగుణము యౌవనము గొప్ప వంశములో పుట్టుక విద్య ఐశ్వర్యము సంపద మొదలగు, సర్వైః - అన్ని, గుణైః - గుణములతో, సంపన్నస్య - సంపన్నుడైనట్టియు, వంధ్యాపతేః - సంతానము లేని భార్యలకు భర్తయైన ఆ రాజునకు, చింతా - దుఃఖము, అభూత్ - కలిగెను.

అందము, దానగుణము, యౌవనము, గొప్ప వంశములో జన్మ, విద్య, రాజాధికారము, సంపద మొదలగు గుణములన్నియు ఆయన యందు నిండుగా నుండెను. అయినమూ, సంతానము లేని భార్యలకు భర్త యగుటచే ఆయనకు బెంగ కలిగెను.

న తస్య సంపదస్సర్వా మహిష్యో వామలోచనాః ।
సార్వభౌమస్య భూశ్చేయమభవన్ ప్రీతిహేతవః ॥ 13

తస్య - ఆ, సార్వభౌమస్య - చక్రవర్తికి, సర్వాః - అన్ని, సంపదః - సంపదలు, వామలోచనాః - అందమైన కన్నులు గల, మహిష్యః - భార్యలు, ఇయమ్ - ఈ, భూః చ - భూమి కూడ, ప్రీతిహేతవః - సుఖమునకు కారణములు, న అభవన్ - కాలేదు.

ఆ చక్రవర్తికి సకలసంపదలు, అందమైన కన్నులు గల భార్యలు, ఈ భూమండలముపై అధికారము ఉన్ననూ, వాటి వలన ఆయనకు ప్రీతి కలుగలేదు.

తస్యైకదా తు భవనమంగిరా భగవానృషిః ।
లోకాననుచరన్నేతానుపగచ్ఛద్యదృచ్ఛయా ॥ 14

ఏకదా తు - ఒకనాడైతే, భగవాన్ - పూజనీయుడగు, అంగిరాః ఋషిః - అంగిరస మహర్షి, ఏతాన్ - ఈ, లోకాన్ - లోకములను, అనుచరన్ - సంచరించుచున్నవాడై, యదృచ్ఛయా - అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే), తస్య - వాని, భవనమ్ - ప్రాసాదమును గురించి, ఉపగచ్ఛత్ - విచ్చేసెను.

పూజనీయుడగు అంగిరస మహర్షి ఈ లోకములను సంచరిస్తూ అనుకోకుండా (ఈశ్వరేచ్ఛచే) ఒకనాడా చక్రవర్తి భవనమునకు విచ్చేసెను.

తం పూజయిత్వా విధివత్ప్రత్యుత్థానార్హణాదిభిః ।
కృతాతిథ్యముపాసీదత్సుఖాసీనం సమాహితః ॥ 15

ప్రతి-ఉత్థాన-అర్హణ-ఆదిభిః - లేచి యెదురేగుట అర్ఘ్యమిచ్చుట మొదలగువాటిచే, విధివత్ - యథావిధిగా, పూజయిత్వా - పూజించి, కృత-ఆతిథ్యమ్ - చేయబడిన అతిథి సత్కారము కలిగినట్టియు, సుఖ-ఆసీనమ్ - సుఖముగా కూర్చున్న, తమ్ - ఆయనను, సమాహితః - సావధానుడై, ఉపాసీదత్ - దగ్గరగా కూర్చుండెను.

రాజు ఆయనకు ఎదురేగి అర్ఘ్యము మొదలగు వాటితో యథావిధిగా పూజించెను. ఆయన అతిథి సత్కారమును స్వీకరించి సుఖముగా కూర్చుండగా, మహారాజు సావధానుడై ఆయన దగ్గర కూర్చుండెను.

మహర్షిస్తముపాసీనం ప్రశ్రయావనతం క్షితౌ ।
ప్రతిపూజ్య మహారాజ సమాభాష్యేదమబ్రవీత్ ॥ 16

మహారాజ - ఓ మహారాజా!, మహర్షిః - అంగిరస మహర్షి, క్షితౌ - నేలపై, ఉపాసీనమ్ - దగ్గరగా కూర్చున్నట్టియు, ప్రశ్రయ-అవనతమ్ - వినయముతో నమ్రుడైన, తమ్ - ఆ రాజును, ప్రతిపూజ్య - సత్కరించి, సమాభాష్య - సంబోధించి, ఇదమ్ - ఈ మాటను, అబ్రవీత్ - పలికెను.

ఓ పరీక్షిన్మహారాజా! చిత్రకేతు మహారాజు వినయముతో వినమ్రుడై తనకు దగ్గరగా నేలపై కూర్చుండి యుండగా, అంగిరస మహర్షి ఆయనను సత్కారపూర్వకముగా సంబోధించి, ఇట్లు పలికెను.

అంగిరా ఉవాచ ।
అపి తేఽనామయం స్వస్తి ప్రకృతీనాం తథాఽత్మనః ।
యథా ప్రకృతిభిర్గుప్తః పుమాన్ రాజాపి సప్తభిః ॥ 17

తే - నీకు, ఆత్మనః - దేహమునకు, అపి అనామయమ్ - ఆరోగ్యమేనా?, తథా - మరియు, ప్రకృతీనామ్ - రాజప్రకృతులకు, స్వస్తి - మంగళమేనా?, యథా - ఏ విధముగానైతే, పుమాన్ - జీవుడు, సప్తభిః - ఏడు, ప్రకృతిభిః - తత్త్వములచే, గుప్తః - రక్షించ బడినాడో, రాజా అపి - రాజు కూడ అటులనే.

అంగిరస మహర్షి ఇట్లు పలికెను --- నీకు దేహమునందు ఆరోగ్యముగ నున్నదా? రాజప్రకృతులకు కల్యాణమేనా? మహత్తత్త్వము (సమష్టి బుద్ధి శక్తి), సమష్టి అహంకారము, అయిదు భూతములు అనే ఏడు తత్త్వములు జీవుని జీవునిగా నిలబెట్టును. అదే విధముగా, గురువు, మంత్రి, రాష్ట్రము, దుర్గములు, ఖజానా, న్యాయవ్యవస్థ, మిత్రరాజ్యములు అనే ఏడు ప్రకృతులు రాజును రక్షించుచుండును.

ఆత్మానం ప్రకృతిష్వద్ధా నిధాయ శ్రేయ ఆప్నుయాత్ ।
రాజ్ఞా తథా ప్రకృతయో నరదేవాఽఽహితాధయః ॥ 18

నరదేవ - ఓ మహారాజా!, ఆత్మానమ్ - నిన్ను, ప్రకృతిషు - ప్రకృతులయందు, అద్ధా - సాక్షాత్తుగా, నిధాయ - ఉంచుకొని, శ్రేయః - కల్యాణమును, ఆప్నుయాత్ - పొందవలెను, తథా - అదే విధముగా, ప్రకృతయః - ప్రకృతులు, రాజ్ఞా - రాజుచే, ఆహితాధయః - ఉంచబడిన సంపదలు గలవారు.

ఓ మహారాజా! రాజు తనను సాక్షాత్తుగా రాజప్రకృతులకు వశము చేసుకొని కల్యాణమును బడయును. అదే విధముగా, రాజప్రకృతులు కూడ రాజునకు వశులై, రాజుచే సమర్పించబడిన సంపదలు గలవారై కల్యాణములను బడయుదురు.

అపి దారాః ప్రజామాత్యా భృత్యాశ్శ్రేణ్యోఽథ మంత్రిణః ।
• పౌరా జానపదా భూపా ఆత్మజా వశవర్తినః ॥ 19

దారాః - భార్యలు, ప్రజా-అమాత్యాః - ప్రజలు అమాత్యులు, భృత్యాః - సేవకులు, శ్రేణ్యః - వ్యాపారులు, అథ - మరియు, మంత్రిణః - సలహాదారులు, పౌరాః - నగరవాసులు, జానపదాః - పల్లె వాసులు, భూపాః - సామంత రాజులు, ఆత్మజాః - పుత్రులు, అపి వశవర్తినః - స్వాధీనులై ఉన్నవారా?

భార్యలు, ప్రజలు, అమాత్యులు, సేవకులు, వ్యాపారులు, సలహా దారులు, నగరవాసులు, పల్లెవాసులు, సామంతులు, పుత్రులు వశవర్తులై ఉన్నారా?

యస్యాత్మానువశశ్చేత్స్యాత్సర్వే తద్వశగా ఇమే ।
లోకాస్సపాలా యచ్ఛంతి సర్వే బలిమతంద్రితాః ॥ 20

యస్య - ఎవనికైతే, ఆత్మా - మనస్సు, అనువశః - వశవర్తియై, స్యాత్ చేత్ - ఉన్నచో, ఇమే - ఈ, సర్వే - అందరు, తద్-వశగాః - వానికి వశవర్తులు, సపాలాః - పాలకులతో గూడియున్న, లోకాః - లోకములు, సర్వే - అన్నీ, అతంద్రితాః - సోమరితనము లేనివారై, బలిమ్ - పూజను, యచ్ఛంతి - సమర్పించెదరు.

ఎవనికైతే తన మనస్సు వశములో నుండునో వానికి వీరందరు వశవర్తులగుటయే గాక, లోకపాలకులతో సహ సకలలోకములు ఉపేక్ష చేయకుండగా, వానికి ఉపహారములను సమర్పించును.

ఆత్మనః ప్రీయతే నాత్మా పరతస్స్వత ఏవ వా ।
లక్షయేఽలబ్ధకామం త్వాం చింతయా శబలం ముఖమ్ ॥21

ఆత్మనః - నీ, ఆత్మా - మనస్సు, న ప్రీయతే - సంతోషమును పొందుట లేదు, త్వామ్ - నిన్ను, పరతః - ఇతరుల వలన గాని, స్వతః ఏవ వా - తన వలననే గాని, అలబ్ధకామమ్ - పొందబడని కోరిక గలవాని నిగా, చింతయా - బెంగచే, శబలమ్ - వ్యాపించబడిన వానినిగా, లక్షయే - చూచుచున్నాను.

నీ మనస్సునకు సంతోషము లేదు. నీనుండి గాని, ఇతరులనుండి గాని నీవు కోరినది నీకు లభించలేదని నాకు తెలియుచునే యున్నది. నీ ముఖము బెంగచే వ్యాప్తమై యున్నది.

ఏవం వికల్పితో రాజన్ విదుషా మునినాఽపి సః ।
ప్రశ్రయావనతోఽభ్యాహ ప్రజాకామస్తతో మునిమ్ ॥ 22

రాజన్ - ఓ రాజా!, విదుషా అపి - తెలిసినవాడే అయిననూ, మునినా - మహర్షిచే, ఏవమ్ - ఈ విధముగా, వికల్పితః - వివిధములగు ప్రశ్నలు వేయబడినవాడు, ప్రశ్రయ-అవనతః - వినయముచే నమ్రుడు, ప్రజాకామః - సంతానమును కోరువాడు అగు, సః - ఆ రాజు, తతః - అప్పుడు, మునిం అభి - మహర్షి యెదుట, ఆహ - పలికెను.

ఓ పరీక్షిన్మహారాజా! ఆ మహర్షి అన్నీ తెలిసినవాడే అయినా వినయముచే నమ్రుడై యున్న ఆ రాజును ఈ తీరున వివిధ ప్రశ్నలు వేసెను. సంతానమును కోరుచున్న ఆ రాజు ఆ మహర్షి యెదుట ఇట్లు పలికెను.

చిత్రకేతురువాచ ।
భగవన్ కిం న విదితం తపోజ్ఞానసమాధిభిః ।
యోగినాం ధ్వస్తపాపానాం బహిరంతశ్శరీరిషు ॥ 23

భగవన్ - ఓ పూజనీయా!, తపః-జ్ఞానసమాధిభిః - తపస్సు ఉపాసన చిత్తైకాగ్రతలచే, ధ్వస్తపాపానామ్ - నశింప జేయబడిన పాపములు గల, యోగినామ్ - యోగులకు, శరీరిషు - దేహధారులయందు, బహిః - బయట, అంతః - లోపల, కిమ్ - ఏది, న విదితమ్ - తెలియబడనిది?

చిత్రకేతువు ఇట్లు పలికెను --- ఓ పూజనీయా! తపస్సు, ఉపాసన మరియు చిత్తైకాగ్రతలచే నశింప జేయబడిన దోషములు గల యోగులకు దేహధారుల లోపల మరియు బయట ఉన్నది ఏది తెలియకుండును?

తథాపి పృచ్ఛతో బ్రూయాం బ్రహ్మన్నాత్మని చింతితమ్ ।
భవతో విదుషశ్చాపి చోదితస్త్వదనుజ్ఞయా ॥ 24

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, తథాపి - అయినప్పటికీ, విదుషః అపి - తెలిసినవాడవే అయిననూ, భవతః - తమరు, పృచ్ఛతః - ప్రశ్నించుచుండగా, త్వద్-అనుజ్ఞయా - తమరి అనుజ్ఞచే, చోదితః - ప్రేరేపించబడినవాడనై, ఆత్మని - మనస్సునందలి, చింతితమ్ - బెంగను గురించి, బ్రూయామ్ - చెప్పెదను.

ఓ మహర్షీ! అయిననూ, అన్నీ తెలిసిన తమరు ప్రశ్నించుచున్నా రు. తమరి ఆజ్ఞచే ప్రేరితుడనై నేను నా మనస్సులోని బెంగను చెప్పెదను.

లోకపాలైరపి ప్రార్థ్యాస్సామ్రాజ్యైశ్వర్యసంపదః ।
న నందయంత్యప్రజం మాం క్షుత్తృట్కామమివాపరే ॥ 25

లోకపాలైః అపి - లోకపాలురచే గూడ, ప్రార్థ్యాః - కోరదగిన, సామ్రాజ్య-ఐశ్వర్యసంపదః - సామ్రాజ్యముయొక్క అధికారము సంపద లు, అప్రజమ్ - సంతానము లేని, మామ్ - నన్ను, క్షుత్-తృట్-కామమ్ - ఆకలి దప్పికల కోరిక గలవానిని, అపరే ఇవ - ఇతరములు వలె, న నంద యంతి - ఆనందింప జేయుట లేదు.

నా వద్ద లోకపాలకులు కూడ కోరదగిన సామ్రాజ్యాధికారము, సంపదలు గలవు. ఆకలి దప్పికలతో పీడించబడుచున్నవానిని ఇతర పదార్థ ములు సంతోష పెట్టలేవు. అదే విధముగా, సంతానము లేని నాకు వీటి వలన ఆనందము కలుగకున్నది.

తతః పాహి మహాభాగ పూర్వైస్సహ గతం తమః ।
యథా తరేమ దుస్తారం ప్రజయా తద్విధేహి నః ॥ 26

మహాభాగ - ఓ మహాత్మా!, పూర్వైః సహ - పూర్వీకులతో సహా, తమః - నరకము, గతమ్ - పొందబడినది, తతః - దానినుండి, పాహి - రక్షించుము, యథా - ఏ విధముగానైతే, ప్రజయా - సంతానముచే, దుస్తా రమ్ - తరించ శక్యము కాని నరకమును, తరేమ - తరించెదమో, తత్ - దానిని, నః - మాకు, విధేహి - ఉపదేశించుము.

ఓ మహాత్మా! సంతానము లేకుండుటచే నేను నా పూర్వజులతో సహా నరకమును పొందెదను. నన్ను ఆ నరకమునుండి రక్షించుము. సంతానము కలిగినచో, మేము తరించ శక్యము కాని ఆ నరకమును తరిం చెదము. కావున, సంతానము కలిగే ఉపాయమును నాకు ఉపదేశించుము.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యర్థితస్స భగవాన్ కృపాలుర్బ్రహ్మణస్సుతః ।
శ్రపయిత్వా చరుం త్వాష్ట్రం త్వష్టారమయజద్విభుః ॥ 27

భగవాన్ - పూజనీయుడు, కృపాలుః - కరుణామయుడు, బ్రహ్మణః - బ్రహ్మగారి, సుతః - పుత్రుడు, విభుః - సర్వసమర్థుడు అగు, సః - ఆ అంగిరసుడు, ఇతి - ఈ విధముగా, అర్థితః - ప్రార్థించబడినవాడై, త్వాష్ట్రమ్ - త్వష్ట దేవతగా గల, చరుమ్ - అన్నమును, శ్రపయిత్వా - వండించి, త్వష్టారమ్ - త్వష్టను, అయజత్ - ఆరాధించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- బ్రహ్మగారి పుత్రుడగు ఆ అంగిరసుడు పూజనీయుడు, కరుణామయుడు మరియు సర్వసమర్థుడు. ఆయన త్వష్ట దేవతగా గల అన్నమును హోమాగ్నియందు వండించి, త్వష్టకు హోమము చేసెను.

జ్యేష్ఠా శ్రేష్ఠా చ యా రాజ్ఞో మహిషీణాం చ భారత ।
నామ్నా కృతద్యుతిస్తస్యై యజ్ఞోచ్ఛిష్టమదాద్ద్విజః ॥ 28

భారత - ఓ భరత వంశీయుడా!, రాజ్ఞః - రాజుయొక్క, మహిషీణామ్ - భార్యలలో, యా - ఎవతె, జ్యేష్ఠా - పెద్దది, శ్రేష్ఠా చ - యోగ్యురాలు కూడ, నామ్నా - పేరుచే, కృతద్యుతిః - కృతద్యుతి గలదో, తస్యై - ఆమె కొరకు, ద్విజః - అంగిరసుడు, .యజ్ఞ-ఉచ్ఛిష్టమ్ - యజ్ఞప్రసాదమును, అదాత్ - ఇచ్చెను.

భరత వంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! ఆ రాజుయొక్క భార్యలలో పెద్దామె పేరు కృతద్యుతి. ఆమె గొప్ప యోగ్యురాలు. అంగిరసుడు యజ్ఞప్రసాదమును ఆమెకు ఇచ్చెను.

అథాహ నృపతిం రాజన్ భవితైకస్తవాత్మజః ।
హర్షశోకప్రదస్తుభ్యమితి బ్రహ్మసుతో యయౌ ॥ 29

అథ - తరువాత, బ్రహ్మసుతః - బ్రహ్మగారి పుత్రుడగు అంగిరసుడు, నృపతిమ్ - రాజునుద్దేశించి, ఆహ - పలికెను, రాజన్ - ఓ రాజా!,

తవ - నీకు, ఏకః - ఒక, ఆత్మజః - కొడుకు, భవితా - కలుగును, తుభ్యమ్ - నీ కొరకు, హర్షశోకప్రదః - ఆనందమును దుఃఖమును ఇచ్చువాడు, ఇతి - అని, యయౌ - వెళ్లెను.

తరువాత బ్రహ్మపుత్రుడగు అంగిరసుడు ఆ మహారాజుతో, ఓ రాజా! నీకు ఆనందమును దుఃఖమును కూడ కలిగించే ఒక కొడుకు కలుగును, అని చెప్పి తన దారిన వెళ్లెను.

సాపి తత్ప్రాశనాదేవ చిత్రకేతోరధారయత్ ।
గర్భం కృతద్యుతిర్దేవీ కృత్తికాఽగ్నేరివాత్మజమ్ ॥ 30

సా - ఆ, కృతద్యుతిః దేవీ అపి - కృతద్యుతి దేవి కూడ, తత్-ప్రాశనాత్ ఏవ - దానిని తినుట వలననే, చిత్రకేతోః - చిత్రకేతువుయొక్క, గర్భమ్ - గర్భమును, కృత్తికా - కృత్తికే, అగ్నేః - అగ్నియొక్క, ఆత్మజం ఇవ - పుత్రుని వలె, అధారయత్ - ధరించెను.

ఆ కృతద్యుతి దేవి కూడ ఆ ప్రసాదమును తినుట వలననే, చిత్రకేతువుయొక్క గర్భమును, కృత్తిక అగ్నియొక్క పుత్రుని వలె, ధరించెను.

తస్యా అనుదినం గర్భశ్శుక్లపక్ష ఇవోడుపః ।
వవృధే శూరసేనేశతేజసా శనకైర్నృప ॥ 31

నృప - ఓ రాజా!, తస్యాః - ఆమెయొక్క, గర్భః - గర్భము, అనుదినమ్ - ప్రతి దినము, శుక్లపక్షే - శుక్లపక్షమునందు, ఉడుపః ఇవ - చంద్రుడు వలె, శనకైః - మెల్లగా, శూరసేన-ఈశతేజసా - శూరసేన దేశ ప్రభువగు చిత్రకేతువుయొక్క తేజస్సుచే, వవృధే - వర్ధిల్లెను.

ఓ మహారాజా! ఆమె గర్భము శూరసేన దేశప్రభుడగు చిత్రకేతువు తేజస్సుచే, మెల్లగా శుక్లపక్షచంద్రుని వలె దినదినము వర్ధిల్లెను.

అథ కాల ఉపావృత్తే కుమారస్సమజాయత ।
జనయన్ శూరసేనానాం శృణ్వతాం పరమాం ముదమ్ ॥32

అథ - తరువాత, కాలే - సమయము, ఉపావృత్తే - రాగా, శృణ్వతామ్ - వినిన, శూరసేనానామ్ - శూరసేన దేశ ప్రజలకు, పరమామ్ - గొప్ప, ముదమ్ - ఆనందమును, జనయన్ - కలిగించుచున్నవాడై, కుమారః - పుత్రుడు, సమజాయత - పుట్టెను.

తరువాత సమయము రాగానే కొడుకు పుట్టెను. ఆ వార్తను విన్న శూరసేన దేశ ప్రజలకు చాల ఆనందము కలిగెను.

హృష్టో రాజా కుమారస్య స్నాతశ్శుచిరలంకృతః ।
వాచయిత్వాऽऽశిషో విప్రైః కారయామాస జాతకమ్ ॥ 33

హృష్టః - హర్షమును పొందిన, రాజా - రాజు, స్నాతః - స్నానమును చేసినవాడై, శుచిః - పరిశుద్ధుడై, అలంకృతః - అలంకరించుకున్నవాడై, కుమారస్య - పుత్రునకు, విప్రైః - వేదవేత్తలచే, ఆశిషః - ఆశీస్సులను, వాచయిత్వా - పలికించి, జాతకమ్ - జాతకర్మను, కారయామాస - చేయించెను.

మహారాజు చాల ఆనందించెను. ఆయన స్నానము చేసి పరిశుద్ధుడై అలంకరించుకొని, తన పుత్రునకు వేదవేత్తలచే ఆశీర్వచనములను చేయించి, జాతకర్మను కూడ చేయించెను.

తేభ్యో హిరణ్యం రజతం వాసాంస్యాభరణాని చ ।
గ్రామాన్ హయాన్గజాన్ప్రాదాద్ధేనూనామర్బుదాని షట్ ॥34

తేభ్యః - వారి కొరకు, హిరణ్యమ్ - బంగారమును, రజతమ్ - వెండిని, వాసాంసి - వస్త్రములను, ఆభరణాని చ - ఆభరణములను, గ్రామాన్ - గ్రామములను, హయాన్ - గుర్రములను, గజాన్ - ఏనుగులను, ధేనూనామ్ - పాలిచ్చే ఆవులయొక్క, షట్ - ఆరు, అర్బుదాని చ - కోట్లను కూడ, ప్రాదాత్ - ఇచ్చెను.

ఆయన వారికి బంగారమును, వెండిని, వస్త్రములను, ఆభరణములను, గ్రామములను, గుర్రములను, ఏనుగులను, ఆరు కోట్ల పాలిచ్చే ఆవులను కూడ దానము చేసెను.

వవర్ష కామమన్యేషాం పర్జన్య ఇవ దేహినామ్ ।
ధన్యం యశస్యమాయుష్యం కుమారస్య మహామనాః ॥ 35

మహామనాః - ఉదారస్వభావము గల రాజు, కుమారస్య - పుత్రునకు, ధన్యమ్ - ధనము కలుగునట్లుగా, యశస్యమ్ - కీర్తి కలుగునట్లుగా, ఆయుష్యమ్ - ఆయుర్వృద్ధి కలుగునట్లుగా, అన్యేషామ్ - ఇతరులకు, కామమ్ - కోరికను, పర్జన్యః - మేఘుడు, దేహినాం ఇవ - ప్రాణులకు వలె, వవర్ష - వర్షించెను.

ఉదారస్వభావము గల ఆ రాజు తన పుత్రునకు ధనము, కీర్తి, ఆయుర్వృద్ధి కలుగుట కొరకై, మేఘుడు ప్రాణులకు నీటిని వర్షించిన విధముగా, ఇతరులకు కూడ కోరికలను వర్షించెను.

కృచ్ఛ్రలబ్ధేఽథ రాజర్షేస్తనయేఽనుదినం పితుః ।
యథా నిస్స్వస్య కృచ్ఛ్రాప్తే ధనే స్నేహోఽన్వవర్ధత ॥ 36

అథ - తరువాత, పితుః - తండ్రియైనట్టియు, రాజర్షేః - రాజర్షి యగు చిత్రకేతువునకు, అనుదినమ్ - ప్రతిదినము, కృచ్ఛ్రలబ్ధే - కష్టముచే పొందబడిన, తనయే - పుత్రునియందు, నిః-స్వస్య - ధనము లేని వానికి, కృచ్ఛ్ర-ఆప్తే - కష్టముచే పొందబడిన, ధనే యథా - ధనము నందు వలె, స్నేహః - ప్రేమ, అన్వవర్ధత - పెరిగెను.

నిర్ధనునకు కష్టము మీద లభించిన ధనమునందు ప్రీతి అధికము గానుండును. అదే విధముగా రాజర్షి, తండ్రి అగు చిత్రకేతువునకు లేక లేక కలిగిన కొడుకుపై ప్రేమ అపుడు దినదినము వర్ధిల్లెను.

మాతుస్త్వతితరాం పుత్రే స్నేహో మోహసముద్భవః ।
కృతద్యుతేస్సపత్నీనాం ప్రజాకామజ్వరోఽభవత్ ॥ 37

మాతుః - తల్లియగు, కృతద్యుతేః తు - కృతద్యుతికైతే, పుత్రే - పుత్రునియందు, మోహసముద్భవః - వ్యామోహమును కలిగించే, స్నేహః - ఆసక్తి, అతితరామ్ - చాల అధికము, సపత్నీనామ్ - సవతులకు, ప్రజాకామజ్వరః - సంతానమునందలి కోరికచే జ్వరము, అభవత్ - కలిగెను.

తల్లియగు కృతద్యుతికైతే పుత్రునియందు వ్యామోహమును కలిగించే అత్యధికమగు ఆసక్తి ఉదయించెను. ఆమె సవతులకు తమకు కూడ సంతానము కలుగువలెననే కోరికచే తీవ్రమగు సంతాపము కలిగెను.

చిత్రకేతోరతిప్రీతిర్యథా దారే ప్రజావతి ।
న తథాన్యేషు సంజజ్ఞే బాలం లాలయతోఽన్వహమ్ ॥ 38

అను-అహమ్ - ప్రతి రోజు, బాలమ్ - పిల్లవానిని, లాలయతః - లాలించుచున్న, చిత్రకేతోః - చిత్రకేతువునకు, ప్రజావతి - సంతానము గల, దారే - భార్యయందు, యథా - ఎట్టి, అతిప్రీతిః - అధికమగు ప్రేమ యో, తథా - ఆ విధముగా, అన్యేషు - ఇతర భార్యలయందు, న సంజజ్ఞే - కలుగలేదు.

చిత్రకేతువు ప్రతిరోజు పిల్లవానిని లాలించెడివాడు. ఆయనకు పుత్రుని కన్న భార్యయందు ఉన్న అధికమగు ప్రేమ ఇతర భార్యలయందు లేకుండెను.

తాః పర్యతప్యన్నాత్మానం గర్హయంత్యోఽభ్యసూయయా ।
ఆనపత్యేన దుఃఖేన రాజ్ఞోఽనాదరేణ చ ॥ 39

తాః - వారు, ఆత్మానమ్ - తనను, అభ్యసూయయా - దోషములనారోపించుటచే, గర్హయంత్యః - నిందించుకొనువారై, ఆనపత్యేన - సంతానము లేకపోవుటచే కలిగిన, దుఃఖేన - దుఃఖముచే, రాజ్ఞః - రాజు యొక్క, అనాదరేణ చ - అనాదరముచే, పరి-అతప్యన్ - అధికమగు తాపమును పొందిరి.

వారు తమకు సంతానము లేకపోవుటచే దుఃఖిస్తూ, తమపై తామే దోషముల నారోపించుకుంటూ, తమను తాము నిందించుకొనిరి. పైగా, రాజు వారిని ఆదరించుట లేదు. ఈ విధముగా వారు చాల తాపమును పొందిరి.

ధిగప్రజాం స్త్రియం పాపాం పత్యుశ్చాగృహసమ్మతామ్ ।
సుప్రజాభిస్సపత్నీభిర్దాసీమివ తిరస్కృతామ్ ॥ 40

అప్రజామ్ - సంతానము లేనట్టియు, పాపామ్ - పాపియైనట్టియు, పత్యుః చ - భర్తకు కూడ, అగృహసమ్మతామ్ - ఇంటియందు నచ్చుబాటు కానట్టియు, సుప్రజాభిః - చక్కని సంతానము గల, సపత్నీభిః - సవతులచే, దాసీం ఇవ - దాసిని వలె, తిరస్కృతామ్ - తిరస్కరించబడే, స్త్రియమ్ - స్త్రీని గురించి, ధిక్ - నింద యగుగాక!

సంతానము లేక, ఇంటిలో భర్తకు నచ్చుబాటు కాక, చక్కని సంతానము గల సవతులచే దాసివలె తిరస్కరించబడే పాపియగు స్త్రీయొక్క జీవితము నిందార్హము.

దాసీనాం కో ను సంతాపస్స్వామినః పరిచర్యయా ।
అభీక్ష్ణం లబ్ధమానానాం దాస్యా దాసీవ దుర్భగాః ॥ 41

స్వామినః - ప్రభువుయొక్క, పరిచర్యయా - పరిచర్యచే, అభీక్ష్ణమ్ - పూర్ణముగా, లబ్ధమానానామ్ - పొందబడిన సమ్మానము గల, దాసీనామ్ - దాసీలకు, సంతాపః - సంతాపము, కః ను - ఏమి గలదు?, దాస్యాః - దాసియొక్క, దాసీవ - దాసీలవంటి మనము, దుర్భగాః - అభాగ్యులము.

ప్రభువునకు పరిచర్య చేస్తూ సమ్మానమును పొందే దాసీలకు దుఃఖము ఏమి ఉండును? మనము దాసీకి దాసీలవంటి అభాగ్యులము.

ఏవం సందహ్యమానానాం సపత్న్యాః పుత్రసంపదా ।
రాజ్ఞోऽసమ్మతవృత్తీనాం విద్వేషో బలవానభూత్ ॥ 42

ఏవమ్ - ఈ విధముగా, సపత్న్యాః - సవతియొక్క, పుత్రసంపదా - పుత్రుడు అనే భాగ్యముచే, సందహ్యమానానామ్ - దహించబడుచున్నట్టియు, రాజ్ఞః - రాజునకు, అసమ్మతవృత్తీనామ్ - నచ్చుబాటు కాని వర్తనము కలిగిన ఆ భార్యలకు, బలవాన్ - బలమగు, విద్వేషః - ద్వేషము, అభూత్ - కలిగెను.

ఈ విధముగా వారు తమ సవతికి పుత్రుడు రూపములో పట్టిన భాగ్యముచే మండిపోవుచుండిరి. పైగా, రాజునకు వారి ప్రవృత్తి నచ్చుబాటు కాకుండెను. దానితో, వారికి బలమగు విద్వేషము కలిగెను.

విద్వేషనష్టమతయః స్త్రియో దారుణచేతసః ।
గరం దదుః కుమారాయ దుర్మర్షా నృపతిం ప్రతి ॥ 43

విద్వేషనష్టమతయః - విద్వేషముచే నశించిన వివేకబుద్ధి గలవారు, దారుణచేతసః - మిక్కిలి క్రూరమగు బుద్ధి గలవారు, నృపతిం ప్రతి - రాజునుద్దేశించి, దుర్మర్షాః - అసహనము గలవారు అగు, స్త్రియః - భార్యలు, కుమారాయ - బాలకుని కొరకు, గరమ్ - విషమును, దదుః - ఇచ్చిరి.

విద్వేషముచే ఆ భార్యల వివేకజ్ఞానము నశించెను. వారు రాజు ప్రవృత్తిని సహించలేక, మిక్కిలి క్రూరమగు బుద్ధి గలవారై, ఆ బాలకునకు విషమును పెట్టిరి.

కృతద్యుతిరజానంతీ సపత్నీనామఘం మహత్ ।
సుప్త ఏవేతి సంచింత్య నిరీక్ష్య వ్యచరద్గృహే ॥ 44

సపత్నీనామ్ - సవతులయొక్క, మహత్ - పెద్ద, అఘమ్ - పాపమును, అజానంతీ - తెలియని, కృతద్యుతిః - కృతద్యుతి, సుప్తః - నిద్రించినవాడు, ఇతి ఏవ - అనియే, సంచింత్య - తలచి, నిరీక్ష్య - ఎదురు చూచి, గృహే - ఇంటియందు, వ్యచరత్ - సంచరించెను.

సవతులు చేసిన పెద్ద పాపము కృతద్యుతికి తెలియదు. బాలకుడు నిద్రించుచున్నాడనియే ఆమె తలచెను. ఆమె పిల్లవాడు నిద్ర లేచునని ఎదురు చూస్తూ, ఇంటిలో తచ్చాడుచుండెను.

శయానం సుచిరం బాలముపధార్య మనీషిణీ ।
పుత్రమానయ మే భద్రే ఇతి ధాత్రీమచోదయత్ ॥ 45

మనీషిణీ - బుద్ధిమతియగు కృతద్యుతి, బాలమ్ - పిల్లవానిని, సుచిరమ్ - చాల సేపు, శయానమ్ - నిద్రించుచున్నవానినిగా, ఉపధార్య

- నిశ్చయించి, భద్రే - ఓ కల్యాణీ!, మే - నా, పుత్రమ్ - పుత్రుని, ఆనయ - తీసుకు రమ్ము, ఇతి - అని, ధాత్రీమ్ - పెంపుడగత్తెను, అచోదయత్ - ఆదేశించెను.

బుద్ధిమతియగు కృతద్యుతికి పిల్లవాడు చాలసేపు నిద్రించుచున్నాడని నిశ్చయము కలిగెను. కల్యాణీ! నా పుత్రుని తీసుకు రమ్ము, అని ఆమె దాదిని ఆదేశించెను.

సా శయానముపవ్రజ్య దృష్ట్వా చోత్తారలోచనమ్ ।
ప్రాణేంద్రియాత్మభిస్త్యక్తం హతాఽస్మీత్యపతద్భువి ॥ 46

సా - ఆమె, శయానమ్ - పరుండియున్న పిల్లవానిని, ఉపవ్రజ్య - సమీపమునకు వెళ్లి, ఉత్తారలోచనమ్ - ఉబికి వచ్చిన కనుగ్రుడ్లు కలిగినట్టి యు, ప్రాణ-ఇంద్రియ-ఆత్మభిః - ప్రాణములు ఇంద్రియములు అంతఃకరణములచే, త్యక్తమ్ - విడిచిపెట్టబడిన పిల్లవానిని, దృష్ట్వా - చూచి, హా - అయ్యో!, హతా - సంహరించ బడినదానను, అస్మి - అగుచున్నాను, ఇతి - అని, భువి - నేలపై, అపతత్ - పడెను.

ఆమె పరుండియున్న పిల్లవాని దగ్గరకు వెళ్లెను. వాని కనుగ్రుడ్లు పైకి ఉబికి యుండెను. వానిలో ప్రాణము గాని, ఇంద్రియవ్యాపారములు గాని లేవు. జీవుడు ఆ దేహమును విడిచిపెట్టెను. ఆ విషయమును తెలుసుకున్న ఆ దాసి, అయ్యో! చచ్చితిని! అంటూ నేలపై పడెను.

తస్యాస్తదాఽఽకర్ణ్య భృశాతురం స్వరం
ఘ్నంత్యాః కరాభ్యామురఉచ్చకైరపి ।
ప్రవిశ్య రాజ్ఞీ త్వరయాఽఽత్మజాంతికం
దదర్శ బాలం సహసా మృతం సుతమ్ ॥ 47

తదా - అప్పుడు, కరాభ్యామ్ - చేతులతో, ఉరః - వక్షఃస్థలమును, ఘ్నంత్యాః - కొట్టుకొనుచున్న, తస్యాః - ఆమెయొక్క, భృశ-ఆతురమ్ - మిక్కిలి ఆదుర్దాతో కూడియున్న, ఉచ్చకైః - బిగ్గరమైన, స్వరమ్ - ఏడుపు ధ్వనిని, ఆకర్ణ్య - విని, రాజ్ఞీ అపి - రాణి కూడ, త్వరయా - వేగ

ముగా, ఆత్మజ-అంతికమ్ - పుత్రుని సమీపమును, ప్రవిశ్య - ప్రవేశించి, సహసా - వెంటనే, మృతమ్ - మరణించిన, బాలమ్ - పిల్లవాడైన, సుతమ్ - పుత్రుని, దదర్శ - చూచెను.

అప్పుడు ఆ దాది రెండు చేతులతో గుండెలను కొట్టుకుంటూ పెద్ద ఆర్తనాదమును చేసెను. ఆ ఏడుపు శబ్దమును విని వెంటనే రాణి కూడ వేగముగా తన కొడుకు వద్దకు వచ్చెను. ఆమెకు అచట చచ్చి పడి యున్న పసికూన తన పుత్రుడు దర్శనమిచ్చెను.

పపాత భూమౌ పరివృద్ధయా శుచా
ముమోహ విభ్రష్టశిరోరుహాంబరా ॥ 48

పరివృద్ధయా - అధికముగా పెరిగిన, శుచా - దుఃఖముతో, విభ్రష్ట శిరః-రుహ-అంబరా - జారిపోయిన జుట్టుముడి వస్త్రము గలదియై, భూమౌ - నేలపై, పపాత - పడెను, ముమోహ - మూర్ఛిల్లెను.

అపుడామె మహాదుఃఖముతో వస్త్రము జారి నేలపై పడి మూర్ఛిల్లెను. ఆమె జుట్టు చెల్లా చెదరయ్యెను.

తతో నృపాంతఃపురవర్తినో జనా
నరాశ్చ నార్యశ్చ నిశమ్య రోదనమ్ ।
ఆగత్య తుల్యవ్యసనాస్సుదుఃఖితాః
తాశ్చ వ్యలీకం రురుదుః కృతాగసః ॥ 49

తతః - తరువాత, నృప-అంతఃపురవర్తినః - రాజుగారి అంతఃపురమునందుండే, జనాః - జనులు, నరాః చ - మగవాళ్లు, నార్యః చ - స్త్రీలు కూడ, రోదనమ్ - ఏడుపును, నిశమ్య - విని, ఆగత్య - వచ్చి, తుల్యవ్యసనాః - సమానమగు ఆపద గలవారై, సుదుఃఖితాః - మిక్కిలి దుఃఖించినవారు, కృత-ఆగసః - పాపమును చేసిన, తాః చ - వారు కూడ, వ్యలీకమ్ - కపటముగా, రురుదుః - ఏడ్చిరి.

తరువాత, రాజుగారి అంతఃపురములోనుండే స్త్రీపురుషులందరు ఏడుపు విని అచటకు వచ్చిరి. ఆ ఆపద వారందరికి తమకు వచ్చిన ఆపద

గనే కనబడెను. వారు అధికముగా దుఃఖించిరి. పాపము చేసిన సవతులు కూడ వచ్చి కపటముగా దుఃఖించిరి.

శ్రుత్వా మృతం పుత్రమలక్షితాంతకం
వినష్టదృష్టిః ప్రపతన్ స్థలన్ పథి ।
స్నేహానుబంధైధితయా శుచా భృశం
విమూర్ఛితోఽనుప్రకృతిద్విజైర్వృతః ।। 50

అలక్షిత-అంతకమ్ - ఊహించబడని మరణము కలిగిన, పుత్రమ్ - పుత్రుని, మృతమ్ - మృతునిగా, శ్రుత్వా - విని, వినష్టదృష్టిః - నశించిన చూపు కలిగినవాడు, స్నేహ-అనుబంధ-ఏధితయా - ప్రేమయొక్క నిరంతరమగు అనువృత్తిచే వర్ధిల్ల జేయబడిన, శుచా - దుఃఖముచే, భృశమ్ - అధికముగా, పథి - దారియందు, స్థలన్ - జారుచున్నవాడు, ప్రపతన్ - పడిపోవుచున్నవాడు, విమూర్ఛితః - మూర్ఛిల్లినవాడు, అనుప్రకృతిద్విజైః - అనుచరులు మంత్రులు మొదలగువారిచే మరియు వేదవేత్తలచే, వృతః - చుట్టువారబడి యున్నవాడు.

ఆ రాజు తన కొడుకు మరణమును కలలోనైననూ ఊహించలేదు. కొడుకు మరణవార్తను వినగానే ఆయనకు కన్నుల యెదుట చీకటి నిండెను. పుత్రునియందలి ప్రేమను నిరంతరముగా అనువృత్తి చేయుటచే ఆయన దుఃఖము మరింత పెరిగిపోయెను. దాని వలన ఆయన దారిలో మరల మరల జారి పడిపోవుచుండెను. అనుచరులు, మంత్రులు మొదలగువారు, వేదవేత్తలు చుట్టువారియుండగా ఆయన మూర్ఛిల్లెను.

పపాత బాలస్య స పాదమూలే
మృతస్య విస్రస్తశిరోరుహాంబరః ।
దీర్ఘం శ్వసన్బాష్పకలోపరోధతో
నిరుద్ధకంఠో న శశాక భాషితుమ్ ।। 51

విస్రస్తశిరః-రుహ-అంబరః - జారిపోయిన జుట్టు వస్త్రములు గల, సః - ఆ రాజు, మృతస్య - మరణించిన, బాలస్య - పిల్లవాని, పాదమూలే

- పాదముల మొదట, పపాత - పడెను, దీర్ఘమ్ - దీర్ఘముగా, శ్వసన్ - నిట్టూర్చువాడై, బాష్పకలా-ఉపరోధతః - కన్నీటి బిందువులచే అడ్డుకొనబ డుట వలన, నిరుద్ధకంఠః - అడ్డుకొనబడిన కంఠము గలవాడై, భాషితుమ్ - మాటలాడుటకు, న శశాక - సమర్థుడు కాలేదు.

ఆ రాజు మరణించిన పిల్లవాని పాదముల వద్ద కూలబడెను. అతని జుట్టు చెల్లాచెదరు కాగా, వస్త్రము జారిపోయెను. ఆయన దీర్ఘ ముగా నిట్టూర్చుచుండెను. కన్నీటితో ఆయన చూపు అడ్డుకొనబడగా, కంఠ మునందు డగ్గుత్తిక వలన ఆయన మాటలాడ లేకపోయెను.

పతిం నిరీక్ష్యోరుశుచాఽర్పితం తదా
మృతం చ బాలం సుతమేకసంతతిమ్ ।
జనస్య రాజ్ఞీ ప్రకృతేశ్చ హృద్రుజం
సతీ దధానా విలలాప చిత్రధా ॥ 52

తదా - అప్పుడు, ఉరుశుచా - పెద్ద దుఃఖముచే, అర్పితమ్ - వ్యాపించబడియున్న, పతిమ్ - భర్తను, మృతమ్ - మరణించిన, బాలమ్ - పిల్లవాడైన, ఏకసంతతిమ్ - ఒకే సంతానమైన, సుతం చ - కొడుకును కూడ, నిరీక్ష్య - చూచి, సతీ -పతివ్రతయగు, రాజ్ఞీ - రాణి, జనస్య - జన మునకు, ప్రకృతేః చ - మంత్రులు మొదలగువారికి, హృద్-రుజమ్ - హృదయమునందలి పీడను, దధానా - కలిగించుచున్నదై, చిత్రధా - పలు విధములుగా, విలలాప - రోదించెను.

అప్పుడు పతివ్రతయగు మహారాణి పెద్ద దుఃఖముతో నిండి యున్న తన భర్తను, మరణించిన తన ఏకైకసంతానమగు పిల్లవానిని చూచి, పలువిధములుగా ఏడ్చెను. ఆమెను చూచి జనులు, మంత్రులు మొదలగువారు కూడ హృదయములో దుఃఖమును పొందిరి.

స్తనద్వయం కుంకుమగంధమండితం
నిషించతీ సాంజనబాష్పబిందుభిః ।

వికీర్య కేశాన్ విగలత్స్రజస్సుతం
శుశోచ చిత్రం కురరీవ సుస్వరమ్ ।। 53

కుంకుమగంధమండితమ్ - కుంకుమతో గంధముతో అలంకరించ బడిన, స్తనద్వయమ్ - స్తనద్వయమును, స-అంజనబాష్పబిందుభిః - కాటుకతో కూడిన కన్నీటి బిందువులతో, నిషించతీ - తడుపుచున్నదై, విగలత్-స్రజః - జారిపోవుచున్న పూలమాలలు గల, కేశాన్ - కేశములను, వికీర్య - విరబోసుకొని, సుతమ్ - కొడుకును గురించి, కురరీ ఇవ - పక్షి వలె, సుస్వరమ్ - స్పష్టమగు స్వరము కలుగునట్లుగా, చిత్రమ్ - పలువిధములుగా, శుశోచ - శోకించెను.

ఆమె పక్షివలె స్పష్టమగు స్వరముతో పలువిధములుగా పుత్రుని గురించి శోకించుచుండగా, కుంకుమ గంధములతో అలంకరించబడిన స్తన ద్వయము కాటుక కళ్లనుండి స్రవించిన నీటి బిందువులతో తడిసిపోయెను. కేశములనుండి మాలలు జారిపోగా, ఆమె జుట్టు విరబోసుకొని యుండెను.

అహో విధాతస్త్వమతీవ బాలిశో
యస్త్వాత్మసృష్ట్యప్రతిరూపమీహసే ।
పరేऽనుజీవత్యపరస్య యా మృతిః
విపర్యయశ్చేత్త్వమసి ధ్రువః పరః ।। 54

అహో - అయ్యో!, విధాతః - ఓ బ్రహ్మ!, త్వమ్ - నీవు, అతీవ - మిక్కిలి, బాలిశః - మూర్ఖుడవు, యః తు - ఏ నీవైతే, ఆత్మసృష్టి-అప్రతిరూపమ్ - నీ సృష్టికి తగని విధముగా, ఈహసే - చేయుచున్నావో, పరే - పెద్దవాడు, అనుజీవతి - జీవించి యుండగా, అపరస్య - పిన్నవాని, యా - ఏ, మృతిః - మరణము గలదో, విపర్యయః చేత్ - విపరీత స్వభావము ఉన్నచో, త్వమ్ - నీవు, ధ్రువః - అమరుడైన, పరః - శత్రువు, అసి - అగుదువు.

అయ్యో! ఓ బ్రహ్మ! నీవు మిక్కిలి మూర్ఖుడవు. ఏలయనగా, నీవు చేసిన సృష్టికి విరుద్ధముగా నీవే ఆచరించుచున్నావు. పెద్దలు బ్రతికియుం

దగా, పిన్నలు మరణించుట విరుద్ధమే గదా! నీలో ఈ విరోధము వాస్తవముగా ఉన్నచో, నీవు అందరికీ అమరుడైన శత్రువు అగుదువు.

న హి క్రమశ్చేదిహ మృత్యుజన్మనోః
శరీరిణామస్తు తదాఽఽత్మకర్మభిః ।
యస్స్నేహపాశో నిజసర్గవృద్ధయే
స్వయం కృతస్తే తమిమం వివృశ్చసి ॥ 55

ఇహ - ఈ లోకమునందు, శరీరిణామ్ - దేహధారులకు, మృత్యుజన్మనోః - మరణజన్మలకు, క్రమః - వరుస, న హి చేత్ - లేకున్నచో, తదా - అప్పుడు, ఆత్మకర్మభిః - తమ తమ కర్మలచే, అస్తు - అగుగాక!, నిజసర్గవృద్ధయే - నీ సృష్టి వర్ధిల్లుట కొరకై, యః - ఏ, స్నేహపాశః - ప్రేమపాశము, తే - నీచే, కృతః - చేయబడినదో, తమ్ - ఆ, ఇమమ్ - దీనిని, స్వయమ్ - స్వయముగా, వివృశ్చసి - తెగగొట్టుచున్నావు.

ఈ లోకములో దేహధారుల జన్మమరణములకు క్రమమేదియు లేదన్నచో, నీవు ఉండి ప్రయోజనమేమి? జీవులు తమ తమ కర్మలచే పుట్టి మరణించుచుందురు. నీవు నీ సృష్టి వర్ధిల్లుటకై ప్రేమపాశమును నిర్మించితివి. దానిని నీవే ఇప్పుడు స్వయముగా తెగగొట్టుచున్నావు.

త్వం తాత నార్హసి చ మాం కృపణామనాథాం
త్యక్తుం విచక్ష్వ పితరం తవ శోకతప్తమ్ ।
అంజస్తరేమ భవతాఽప్రజదుస్తరం యద్
ధ్వాంతం న యాహ్యకరుణేన యమేన దూరమ్ ॥ 56

తాత - బాబూ!, త్వమ్ - నీవు, కృపణామ్ - దీనురాలనైనట్టియు, అనాథామ్ - అనాథనగు, మాం చ - నన్ను, త్యక్తుమ్ - విడిచిపెట్టుటకు, న అర్హసి - తగవు, శోకతప్తమ్ - శోకముచే క్రుగ్గిపోవుచున్న, తవ - నీ, పితరమ్ - తండ్రిని, విచక్ష్వ - చూడుము, భవతా - నీచే, అప్రజదుస్తరమ్ - సంతానము లేనివారు తరించ శక్యము కాని, యత్ - ఏ, ధ్వాంతమ్ - చీక

టిని, అంజః - తేలికగా, తరేమ - తరించెదమో, అకరుణేన - దయ లేని, యమేన - యమునితో, దూరమ్ - దూరముగా, న యాహి - వెళ్లకుము.

బాబూ! నేను దీనురాలను, అనాథను. నన్ను విడిచి పెట్టి వెళ్లుట నీకు తగదు. శోకముతో క్రుంగిపోవుచున్న నీ తండ్రిని చూడుము. సంతానము లేనివారు తరించ శక్యము కాని నరకమును మేము నీ వలన తేలికగా తరించెదము. కాని, నీవు దయ లేని యమునితో కలిసి దూరముగా వెళ్లి పోవద్దు.

ఉత్తిష్ఠ తాత త ఇమే శిశవో వయస్యాః
త్వామాహ్వయంతి నృపనందన సంవిహర్తుమ్ ।
సుప్తశ్చిరం హ్యశనయా చ భవాన్ పరీతో
భుంక్ష్వ స్తనం పిబ శుచో హర నస్స్వకానామ్ ॥ 57

తాత - బాబూ!, ఉత్తిష్ఠ - లెమ్ము, నృపనందన - రాజకుమారా!, తే - నీ, వయస్యాః - జతగాండ్రగు, ఇమే - ఈ, శిశవః - పిల్లలు, త్వామ్ - నిన్ను, సంవిహర్తుమ్ - చక్కగా విహరించుటకు, ఆహ్వయంతి - పిలుచుచున్నారు, చిరమ్ - చాల సేపు, సుప్తః - నిద్రించినవాడవు, భవాన్ - నీవు, అశనయా - ఆకలితో, పరీతః - నిండియున్నావు, భుంక్ష్వ - తినుము, స్తనమ్ - పాలను, పిబ - త్రాగుము, స్వకానామ్ - నీవారమగు, నః - మాయొక్క, శుచః - శోకములను, హర - పోగొట్టుము.

బాబూ! లెమ్ము. రాజకుమారా! నీ జతగాండ్రగు ఈ పిల్లలు చక్కగా ఆడుకొనుటకై నిన్ను పిలుచుచున్నారు. చాల సేపు నిద్రించినావు. నీకు బాగా ఆకలి వేయుచుండును. అన్నమును తినుము. పాలను త్రాగుము. నీవారమగు మా శోకములను పోగొట్టుము.

నాహం తనూజ దదృశే హతమంగలా తే
ముగ్ధస్మితం ముదితవీక్షణమాననాబ్జమ్ ।
కిం వా గతోఽస్యపునరన్వయమన్యలోకం
నీతోఽఘృణేన న శృణోమి కలా గిరస్తే ॥ 58

తనూజ - ఓ పుత్రా!, హతమంగలా - నశింప జేయబడిన కల్యాణ ములు గల, అహమ్ - నేను, తే - నీ, ముగ్ధస్మితమ్ - అమాయకపు చిరు నవ్వు గలిగినట్టియు, ముదితవీక్షణమ్ - ఆనందముతో నిండిన చూపులు గల, ఆనన-అబ్జమ్ - పద్మమువంటి ముఖమును, న దదృశే - చూడలేదు, అఘృణేన - దయలేని యమునిచే, నీతః - కొనిపోబడినవాడవై, అపునర న్వయమ్ - తిరిగి రాని విధముగా, అన్యలోకమ్ - మరియొక లోకమును గురించి, కిం వా గతః అసి - వెళ్లినవాడవా?, తే - నీ, కలాః - మధురము లగు, గిరః - మాటలను, న శృణోమి - వినను.

ఓ పుత్రా! నేను పుణ్యము నశించిన దానను. దయ లేని యముడు నిన్ను తిరిగి రాని మరియొక లోకమునకు కొనిపోయినాడా? ముద్దు వచ్చే చిరునవ్వు, ఆనందముతో నిండిన చూపులు గల పద్మమువంటి నీ ముఖము ఇకపై నాకు కనబడదు. నీ మధురమగు మాటలు నాకు వినరావు.

శ్రీశుక ఉవాచ ।
విలపంత్యా మృతం పుత్రమితి చిత్రవిలాపనైః ।
చిత్రకేతుర్భృశం తప్తో ముక్తకంఠో రురోద హ ॥ 59

మృతమ్ - మరణించిన, పుత్రమ్ - పుత్రుని గురించి, ఇతి - ఈ విధముగా, చిత్రవిలాపనైః - పలు విధముల విలాపములచే, విలపంత్యా - విలపించుచున్న ఆమెతో గూడి, భృశమ్ - మిక్కిలి, తప్తః - తాపమును పొందిన, చిత్రకేతుః - చిత్రకేతువు, ముక్తకంఠః - విడిచిపెట్టబడిన కంఠము గలవాడై, రురోద హ - రోదించెను.

మరణించిన పుత్రుని గురించి ఆమె ఈ విధముగా పలు విధము లుగా విలపించుచుండెను. చిత్రకేతువు అత్యధికమగు పీడను పొందినవా డై, ఎలుగెత్తి రోదించెను.

తయోర్విలపతోస్సర్వే దంపత్యోస్తదనువ్రతాః ।
రురుదుస్స్మ నరా నార్యస్సర్వమాసీదచేతనమ్ ॥ 60

**తయోః - ఆ, దంపత్యోః - దంపతులు, విలపతోః - విలపించు**
*చుండగా, తద్-అనువ్రతాః* **- వారి అనుచరులు, సర్వే - అందరు, నరాః -**
మగవాళ్లు, నార్యః - స్త్రీలు, రురుదుః - రోదించిరి, సర్వమ్ - అంతా,
అచేతనమ్ - జడము, ఆసీత్ - ఆయెను.

ఆ దంపతులు రోదించుచుండగా, వారి అనుయాయులు స్త్రీలు పురుషులు అందరు రోదించుచుండిరి. ఈ విధముగా నగరమంతయు జడముగా తయారయ్యెను.

ఏవం కశ్మలమాపన్నం నష్టసంజ్ఞమనాయకమ్ ।
జ్ఞాత్వాంగిరా నామ మునిరాజగామ సనారదః ॥ **61**

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే వృత్రాసుర
పూర్వచరితే చిత్రకేతు విలాపో నామ చతుర్దశోఽధ్యాయః ॥

ఏవమ్ - ఈ విధముగా, కశ్మలమ్ - మోహమును, ఆపన్నమ్ - పొందినట్టియు, నష్టసంజ్ఞమ్ - నశించిన తెలివి కలిగినట్టియు, అనాయకమ్ - నాయకుడు లేని జనమును గురించి, జ్ఞాత్వా - తెలుసుకొని, అంగిరాః నామ - అంగిరసుడు అని ప్రసిద్ధి గాంచిన, మునిః - మహర్షి, సనారదః - నారదునితో గూడినవాడై, ఆజగామ - వచ్చెను.

ఈ విధముగా అచటి జనులందరు మోహమును పొంది, తెలివిని కోల్పోయి ఉండిరి. వారికి రాజు ఉండి కూడ లేనట్లాయెను. ఈ విషయము తెలిసి అంగిరస మహర్షి నారదునితో గూడి అచటకు వచ్చెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి ఆరవ స్కంధములో వృత్రాసురుని
పూర్వచరితమునందు చిత్రకేతువు పుత్రవియోగమును పొందుటను
వర్ణించే పదునాల్గవ అధ్యాయము ముగిసినది (14).

*****

# అథ పంచదశోఽధ్యాయః

## అంగిరసుడు చిత్రకేతువునకు వైరాగ్యమునుపదేశించుట

శ్రీశుక ఉవాచ ।
ఊచతుర్మృతకోపాంతే పతితం మృతకోపమమ్ ।
శోకాభిభూతం రాజానం బోధయంతౌ సదుక్తిభిః ॥ 1

మృతక-ఉపాంతే - మరణించిన బాలుని సమీపమునందు, మృత క-ఉపమమ్ - మరణించినవానిని పోలినట్టియు, పతితమ్ - పడియున్నట్టియు, శోక-అభిభూతమ్ - శోకముచే పరాభూతుడైన, రాజానమ్ - చిత్రకేతు మహారాజును, సద్-ఉక్తిభిః - మంచి మాటలతో, బోధయంతౌ - బోధించుచున్నవారై, ఊచతుః - పలికిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- చిత్రకేతు మహారాజు మరణించిన కొడుకు ప్రక్కన మరణించినవానిని బోలి పడియుండెను. ఆ విధముగా శోకముచే పరాభూతుడై యున్న రాజునకు మంచి మాటలను బోధిస్తూ, అంగిరసుడు మరియు నారదుడు ఇట్లు పలికిరి.

కోఽయం స్యాత్తవ రాజేంద్ర భవాన్ యమనుశోచతి ।
త్వం చాస్య కతమస్సృష్టౌ పురేదానీమతః పరమ్ ॥ 2

రాజేంద్ర - ఓ మహారాజా!, అయమ్ - ఈ బాలుడు, తవ - నీకు, కః - ఎవడు, స్యాత్ - అగును?, భవాన్ - నీవు, యమ్ - ఎవనిని గురించి, అనుశోచతి - దుఃఖించుచున్నావో, సృష్టౌ - సృష్టియందు, పురా - పూర్వమునందు, ఇదానీమ్ - ఇప్పుడు, అతః పరమ్ - ఈ పైన, త్వం చ - నీవు కూడ, అస్య - వీనికి, కతమః - ఎన్నవ వాడవు?

ఓ మహారాజా! నీవీ బాలకుని గురించి శోకించుచుంటివి. ఈ సృష్టి యందు పూర్వజన్మలో, ఈ జన్మలో మరియు రాబోయే జన్మలో నీకు ఈ బాలకుడేమగును? నీవు వీనికి ఎన్నవ తండ్రివి?

యథా ప్రయాంతి సంయాంతి స్రోతోవేగేన వాలుకాః ।
సంయుజ్యంతే వియుజ్యంతే తథా కాలేన దేహినః ॥ 3

యథా - ఏ విధముగానైతే, వాలుకాః - ఇసుక కణములు, స్రోతః-వేగేన - ప్రవాహముయొక్క వేగముచే, ప్రయాంతి - విడిపోవునో, సంయాంతి - కలియునో, తథా - అదే విధముగా, దేహినః - ప్రాణులు, కాలేన - కాలముచే, సంయుజ్యంతే - కలియుదురు, వియుజ్యంతే - విడిపోవుదురు.

ప్రవాహవేగముచే ఇసుక కణములు ఒకదానితో మరియొకటి కలిసి విడిపోవుచుండును. అదే విధముగా కాలవేగమునందు ప్రాణులు ఒకరితో మరియొకరు కలిసి విడిపోవుచుందురు.

యథా ధానాసు వై ధానా భవంతి న భవంతి చ ।
ఏవం భూతేషు భూతాని చోదితానీశమాయయా ॥ 4

ధానాసు - గింజలయందు, ధానాః యథా - గింజలు వలె, ఏవమ్ - ఇదే విధముగా, ఈశమాయయా - ఈశ్వరుని మాయాశక్తిచే, చోదితాని - ప్రేరితములైన, భూతాని - జీవులు, భూతేషు - జీవులయందు, భవంతి - పుట్టెదరు, న భవంతి చ - గిట్టెదరు కూడ.

ధాన్యపు గింజలనుండి మరికొన్ని ధాన్యపు గింజలు పుట్టి మరల నశించుచుండును. ఇదే విధముగా, కొన్ని జీవులు ఈశ్వరుని మాయాశక్తిచే ప్రేరితులై మరికొన్ని జీవులకు సంతానమై పుట్టెదరు. పుట్టినవారు అటులనే నిలిచియుందురను నియమము లేదు. పుట్టినవారు గిట్టుచుందురు.

వయం చ త్వం చ యే చేమే తుల్యకాలాశ్చరాచరాః ।
జన్మమృత్యోర్యథా పశ్చాత్ ప్రాఙ్నైవమధునాపి భోః ॥ 5

భోః - ఓ రాజా!, తుల్యకాలాః - సమకాలీనులమగు, వయమ్ - మేము, త్వం చ - నీవు, యే - ఏ, ఇమే - వీరు గలరో, చర-అచరాః - కదిలే మరియు కదలని ప్రాణులు, యథా - ఏ విధముగానైతే, జన్మ మృత్యోః - పుట్టుక మరణములకు, ప్రాక్ పశ్చాత్ - ముందు వెనుకల, న - లేరో, అధునా అపి - ఇప్పుడు కూడ.

ఓ రాజా! మేము, నీవు, వీరలు, కదిలే మరియు కదలని ప్రాణులు అనే మనమందరము సమకాలీనులము. పుట్టుటకు ముందు గాని, మరణించిన తరువాత గాని మనము లేము. కావున, ఇప్పుడు కూడ లేము. (త్రికాలములలో బాధితము కానిదే సత్యము. కేవలము వర్తమాన కాలములో ఉన్నట్లు కనబడేది కనబడుటయే గాని వాస్తవముగా ఉండుట కాదు).

భూతైర్భూతాని భూతేశస్సృజత్యవతి హంత్యజః ।
ఆత్మసృష్టైరస్వతంత్రైరనపేక్షోఽపి బాలవత్ ॥ 6

భూత-ఈశః - సకలజీవులకు శాసకుడు, అజః - పుట్టుక లేనివాడు అగు ఈశ్వరుడు, అనపేక్షః అపి - ప్రయోజనము లేనివాడే అయిననూ, బాలవత్ - బాలకుని వలె, ఆత్మసృష్టైః - తనచే సృష్టించబడినట్టియు, అస్వతంత్రైః - స్వతంత్రములు కాని, భూతైః - ప్రాణులచే, భూతాని - ప్రాణులను, సృజతి - సృష్టించును, అవతి - రక్షించును, హంతి - సంహరించును.

సకలజీవులకు శాసకుడు, పుట్టుక లేనివాడు అగు శ్రీహరికి ఈ జగద్వ్యాపారమునందు సాధించదగిన ప్రయోజనమేమియు లేదు. చిన్నపిల్లలు ఆట కొరకు ఇసుకలో ఇళ్లను కట్టి కూల్చుచుందురు. అదే విధముగా, ఆయన అస్వతంత్రములగు ఈ ప్రాణులను సృష్టించి, వాటి ద్వారా ఇతర ప్రాణులను సృష్టిస్తూ, రక్షిస్తూ, వాటి ద్వారానే సంహరించుచుండును.

దేహేన దేహినో రాజన్ దేహాద్దేహోఽభిజాయతే ।
బీజాదేవ యథా బీజం దేహ్యర్థ ఇవ శాశ్వతః ॥ 7

రాజన్ - ఓ రాజా!, దేహేన - దేహముతోడి, దేహాత్ - దేహము నుండి, దేహినః - దేహియొక్క, దేహః - దేహము, బీజాత్ ఏవ - బీజము నుండియే, బీజం యథా - బిజము వలె, అభిజాయతే - పుట్టును, దేహీ - దేహి, అర్థః ఇవ - వస్తువు వలె, శాశ్వతః - నిత్యుడు.

ఓ రాజా! ఒక గింజనుండి మరియొక గింజ పుట్టునట్లుగా, దేహ మునకు దేహముతోడి కలయిక వలన మరియొక దేహము పుట్టును. ఆ దేహమునకు అభిమానియగు దేహి కూడ దేహముతో బాటే పుట్టినట్లు కాన వచ్చును. కాని, ఘటాది కార్యములయందు వస్తువైన మట్టి వలె, దేహి మాత్రమే నిత్యుడుగా నుండును. (దేహములు నశించును).

దేహదేహివిభాగోఽయమవివేకకృతః పురా ।
జాతివ్యక్తివిభాగోఽయం యథా వస్తుని కల్పితః ॥ 8

అయమ్ - ఈ, దేహదేహివిభాగః - దేహము దేహి అనే విభాగ ము, పురా - అనాది, అవివేకకృతః - అజ్ఞానముచే కల్పితము, యథా - ఏ విధముగానైతే, వస్తుని - వస్తువునందు, అయమ్ - ఈ, జాతివ్యక్తివిభాగః - జాతి వ్యక్తి అనే విభాగము, కల్పితః - కల్పించబడినదో.

మట్టి ఒక్కటియే. కాని, దానియందు ఘటవ్యక్తి (ఒకానొక ఘట ము), ఘటజాతి (ఘటసామాన్యము) అనునవి కల్పితములు. అదే విధము గా, ఒకే పరమాత్మయందు అనాదినుండియు అజ్ఞానముచే ఈ దేహము-దేహి అనే విభాగము కల్పించబడినది.

శ్రీశుక ఉవాచ ।
ఏవమాశ్వాసితో రాజా చిత్రకేతుర్ద్విజోక్తిభిః ।
ప్రమృజ్య పాణినా వక్త్రమాధిమ్లానమభాషత ॥ 9

చిత్రకేతుః రాజా - చిత్రకేతు మహారాజు, ద్విజ-ఉక్తిభిః - మహ ర్షుల మాటలచే, ఏవమ్ - ఈ విధముగా, ఆశ్వాసితః - ఓదార్చబడినవాడై, ఆధిమ్లానమ్ - మానసికమగు పీడచే వాడిపోయిన, వక్త్రమ్ -

ముఖమును, పాణినా - చేతితో, ప్రమృజ్య - తుడుచుకొని, అభాషత - పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఆ మహర్షులిద్దరు ఈ విధముగా ఆ చిత్రకేతు మహారాజును ఓదార్చిరి. అపుడాయన మనస్సునందలి దుఃఖముచే వాడిపోయిన ముఖమును చేతితో తుడుచుకొని ఇట్లు పలికెను.

రాజోవాచ ।
కౌ యువాం జ్ఞానసంపన్నౌ మహిష్ఠౌ చ మహీయసామ్ ।
అవధూతేన వేషేణ గూఢావిహ సమాగతౌ ।। 10

జ్ఞానసంపన్నౌ - జ్ఞానమనే సంపద గలవారు, మహీయసాం చ - గొప్పవారిలో కూడ, మహిష్ఠౌ - చాల గొప్పవారు అగు, యువామ్ - మీరిద్దరు, కౌ - ఎవరు?, అవధూతేన - తిరస్కరించబడే, వేషేణ - వేషముతో, గూఢౌ - తెలియబడని వారై, ఇహ - ఇచటకు, సమాగతౌ - వచ్చినవారు.

మీరిద్దరు మలినమగు వేషముతో, మీ గురించి ఎవ్వరికైననూ తెలియని విధముగా, ఇచటకు విచ్చేసితిరి. మీరు జ్ఞానసంపద గలవారు. మహాత్ములలో మహాత్ములు. మీరెవరు?

చరంతి హ్యవనౌ కామం బ్రాహ్మణా భగవత్ప్రియాః ।
మాదృశాం గ్రామ్యబుద్ధీనాం బోధాయోన్మత్తలింగినః ।। 11

హి - ఏలయనగా, భగవత్-ప్రియాః - భగవానునకు ఆత్మరూపులైన, బ్రాహ్మణాః - బ్రహ్మజ్ఞానులు, అవనౌ - భూమియందు, కామమ్ - యథేచ్ఛగా, గ్రామ్యబుద్ధీనామ్ - ఇంద్రియసుఖములయందు బుద్ధి గల, మాదృశామ్ - నావంటివారలకు, బోధాయ - బోధించుట కొరకు, ఉన్మత్త లింగినః - పిచ్చివారి చిహ్నములు గలవారై, చరంతి - సంచరించెదరు.

బ్రహ్మజ్ఞానులు భగవానునకు ఆత్మరూపులు. వారు నావంటి భోగాసక్తమగు బుద్ధి గలవారలకు బోధించుట కొరకై పిచ్చివారి లక్షణములతో భూమిపై యథేచ్ఛగా సంచరించుచుందురు.

కుమారో నారద ఋభురంగిరా దేవలోఽసితః ।
అపాంతరతమో వ్యాసో మార్కండేయోఽథ గౌతమః ।। 12

వసిష్ఠో భగవాన్ రామః కపిలో బాదరాయణిః ।
దుర్వాసా యాజ్ఞవల్క్యశ్చ జాతూకర్ణ్యస్తథాఽఽరుణిః ।। 13

రోమశశ్చ్యవనో దత్త ఆసురిస్సపతంజలిః ।
ఋషిర్వేదశిరా బోధ్యో మునిః పంచశిరాస్తథా ।। 14

హిరణ్యనాభః కౌసల్యశ్శ్రుతదేవ ఋతధ్వజః ।
ఏతే పరే చ సిద్ధేశాశ్చరంతి జ్ఞానహేతవః ।। 15

కుమారః - సనత్కుమారుడు, నారదః - నారదుడు, ఋభుః - ఋభువు, అంగిరాః - అంగిరసుడు, దేవలః - దేవలుడు, అసితః - అసితుడు, అపాంతరతమః - అపాంతరతముడు, వ్యాసః - వ్యాసుడు, మార్కండేయః - మార్కండేయుడు, అథ - మరియు, గౌతమః - గౌతముడు, వసిష్ఠః - వసిష్ఠుడు, భగవాన్ - భగవానుడగు, రామః - పరశు రాముడు, కపిలః - కపిలుడు, బాదరాయణిః - బాదరాయణ వ్యాసుని పుత్రుడగు శుకుడు, దుర్వాసాః - దుర్వాసుడు, యాజ్ఞవల్క్యః చ - యాజ్ఞవల్క్యుడు కూడ, జాతూకర్ణ్యః - జాతూకర్ణ్యుడు, తథా - మరియు, ఆరుణిః - ఆరుణి, రోమశః - రోమశుడు, చ్యవనః - చ్యవనుడు, దత్తః - దత్తాత్రేయుడు, ఆసురిః - ఆసురి, సపతంజలిః - పతంజలితో గూడియున్నవాడు, వేదశిరాః ఋషిః - వేదశిర మహర్షి, బోధ్యః మునిః - బోధ్యముని, తథా - మరియు, పంచశిరాః - పంచశిరసుడు, హిరణ్యనాభః - హిరణ్యనాభుడు, కౌసల్యః - కౌసల్యుడు, శ్రుతదేవః - శ్రుతదేవుడు, ఋతధ్వజః - ఋతధ్వజుడు, ఏతే - వీరు, పరే చ - ఇతరులు కూడ, సిద్ధ-ఈశాః - సర్వస్వతంత్రులగు సిద్ధ పురుషులు, జ్ఞానహేతవః - జ్ఞానమునకు కారణులై, చరంతి - సంచరించెదరు.

సనత్కుమారుడు, నారదుడు, ఋభువు, అంగిరసుడు, దేవలుడు, అసితుడు, అపాంతరతముడు, వ్యాసుడు, మార్కండేయుడు, గౌతముడు,

వసిష్ఠుడు, భగవాన్ పరశురాముడు, కపిలుడు, బాదరాయణ వ్యాసుని పుత్రుడగు శుకుడు, దుర్వాసుడు, యాజ్ఞవల్క్యుడు, జాతూకర్ణ్యుడు, ఆరుణి, రోమశుడు, చ్యవనుడు, దత్తాత్రేయుడు, ఆసురి, పతంజలి, వేదశిర మహర్షి, బోధ్యముని, పంచశిరసుడు, హిరణ్యనాభుడు, కౌసల్యుడు, శ్రుతదేవుడు, ఋతధ్వజుడు మొదలగు సిద్ధపురుషులు అనేకులు లోకమునకు ఆత్మజ్ఞానమునను గ్రహిస్తూ సర్వస్వతంత్రులై సంచరించెదరు.

తస్మాద్యువాం గ్రామ్యపశోర్మమ మూఢధియః ప్రభూ ।
అంధే తమసి మగ్నస్య జ్ఞానదీప ఉదీర్యతామ్ ॥ 16

తస్మాత్ - అందువలన, ప్రభూ - ప్రభువులగు, యువామ్ - మీరిద్దరు, గ్రామ్యపశోః - భోగాసక్తుడను పశుప్రాయుడను అయినట్టియు, మూఢధియః - వ్యామోహమును పొందిన బుద్ధి కలిగినట్టియు, అంధే - అజ్ఞానమునందు, తమసి - తమోగుణమునందు, మగ్నస్య - మునిగియున్న, మమ - నాకు, జ్ఞానదీపః - జ్ఞానమనే దీపము, ఉదీర్యతామ్ - ప్రవర్తింప జేయబడుగాక!

నేను భోగాసక్తుడనై పశుప్రాయముగా బ్రదుకుచున్నాను. నా బుద్ధి వ్యామోహితమై యున్నది. నేను అజ్ఞానమునందు, తమోగుణమునందు మునిగి యున్నాను. కావున, సమర్థులగు మీరిద్దరు నాలో జ్ఞానమనే దీపమును వెలిగించుడు.

అంగిరా ఉవాచ ।
అహం తే పుత్రకామస్య పుత్రదోఽస్మ్యంగిరా నృప ।
ఏష బ్రహ్మసుతస్సాక్షాన్నారదో భగవానృషిః ॥ 17

నృప - ఓ రాజా!, అహమ్ - నేను, పుత్రకామస్య - పుత్రుని కోరే, తే - నీకు, పుత్రదః - పుత్రుని ఇచ్చిన, అంగిరాః - అంగిరసుడను, అస్మి - అగుచున్నాను, ఏషః - ఈయన, సాక్షాత్ - సాక్షాత్తుగా, బ్రహ్మసుతః - బ్రహ్మగారి పుత్రుడు, భగవాన్ - పూజనీయుడు, నారదః ఋషిః - నారద మహర్షి.

ఓ మహారాజా! నేను అంగిరసుడను. పుత్రుని కోరే నీకు పుత్రుని అనుగ్రహించినది నేనే. ఈయన సాక్షాత్తు బ్రహ్మపుత్రుడు, పూజనీయుడు అగు నారద మహర్షి.

ఇత్థం త్వాం పుత్రశోకేన మగ్నం తమసి దుస్తరే ।
అతదర్హమనుస్మృత్య మహాపురుషగోచరమ్ ॥ 18

అనుగ్రహాయ భవతః ప్రాప్తావావామిహ ప్రభో ।
బ్రహ్మణ్యో భగవద్భక్తో నావసీదితుమర్హతి ॥ 19

ప్రభో - ఓ మహారాజా!, ఇత్థమ్ - ఈ విధముగా, మహాపురుషగోచరమ్ - పురుషోత్తముని భక్తుడవగు, త్వామ్ - నిన్ను, పుత్రశోకేన - పుత్రశోకముచే, దుస్తరే - తరించ శక్యము కాని, తమసి - చీకటియందు, మగ్నమ్ - మునిగియున్నవానినిగా, అతద్-అర్హమ్ - దానికి తగనివానినిగా, అనుస్మృత్య - తెలుసుకొని, భవతః - నీయొక్క, అనుగ్రహాయ - అనుగ్రహించుట కొరకు, ఆవామ్ - మేమిద్దరము, ఇహ - ఇచటకు, ప్రాప్తౌ - వచ్చినవారము, బ్రహ్మణ్యః - వేదవేత్తల యెడల భక్తి గలవాడు, భగవద్భక్తః - భగవానుని భక్తుడు, అవసీదితుమ్ - దుఃఖించుటకు, న అర్హతి - తగడు.

ఓ మహారాజా! పురుషోత్తముని భక్తుడవగు నీవు ఈ విధముగా పుత్రశోకముచే తరించ శక్యము కాని అజ్ఞానాంధకారములో మునిగి యున్నావనియు, నీవు అట్లు అగుటకు తగదనియు తెలుసుకొని, మేమిద్దరము నిన్ను అనుగ్రహించుటకై ఇచటకు విచ్చేసినాము. వేదవేత్తల యెడల భక్తి గలవాడు, భగవద్భక్తుడు దుఃఖముతో క్రుంగిపోవుట తగదు.

తదేవ తే పరం జ్ఞానం దదామి గృహమాగతః ।
జ్ఞాత్వాన్యాఽభినివేశం తే పుత్రమేవ దదావహమ్ ॥ 20

గృహమ్ - ఇంటిని గురించి, ఆగతః - వచ్చిన నేను, తే - నీ కొరకు, తత్ - ఆ, పరమ్ - సర్వోత్కృష్టమగు, జ్ఞానం ఏవ - జ్ఞానమునే, దదామి - ఇచ్చెడివాడను, తే - నీయొక్క, అన్య-అభినివేశమ్ - ఇతరము

నందలి ఆగ్రహమును, జ్ఞాత్వా - గమనించి, అహమ్ - నేను, పుత్రం ఏవ - పుత్రునే, దదౌ - ఇచ్చితిని.

ఇదివరలో నేను నీ గృహమునకు వచ్చినప్పుడే నీకు సర్వోత్కృష్ట మగు ఆత్మజ్ఞానమును ఇచ్చియుండెడి వాడను. కాని, నీవు దానికంటె భిన్నముగా పుత్రునియందు పట్టుదలను కలిగియుంటివి. ఆ విషయమును గమనించి, నేను అప్పుడు నీకు పుత్రుని మాత్రమే అనుగ్రహించితిని.

అధునా పుత్రిణాం తాపో భవతైవానుభూయతే ।
ఏవం దారా గృహా రాయో వివిధైశ్వర్యసంపదః ।। 21

శబ్దాదయశ్చ విషయాశ్చలా రాజ్యవిభూతయః ।
మహీ రాజ్యం బలం కోశో భృత్యామాత్యాసుహృజ్జనాః।।22

అధునా - ఇప్పుడు, పుత్రిణామ్ - పుత్రుడు గలవారల, తాపః - దుఃఖము, భవతా ఏవ - నీ చేతనే, అనుభూయతే - అనుభవించ బడుచు న్నది, ఏవమ్ - ఇదే విధముగా, దారాః - భార్య, గృహాః -ఇల్లు, రాయః - ధనములు, వివిధ-ఐశ్వర్యసంపదః - పలు రకముల ఐశ్వర్యములు సంపద లు, శబ్ద-ఆదయః - శబ్దము మొదలగు, విషయాః - ఇంద్రియ భోగములు, రాజ్యవిభూతయః - సామ్రాజ్య వైభవములు, మహీ - భూమి, రాజ్యమ్ - రాజ్యము, బలమ్ - సేన, కోశః - ఖజానా, భృత్య-అమాత్యాః - సేవకులు అమాత్యులు, సుహృత్-జనాః - మిత్రజనులు, చలాః - అనిత్యములు.

పుత్రుడు గలవారు పొందే దుఃఖమును ఇప్పుడు నీవు అనుభవిం చుచునే యున్నావు. ఇదే విధముగా భార్య, ఇల్లు, ధనములు, పలు రక ముల ఐశ్వర్యములు, సంపదలు, శబ్దస్పర్శరూపరసగంధములనే ఇంద్రి యభోగములు, సామ్రాజ్య వైభవములు, భూమి, రాజ్యము, సేన, ఖజానా, సేవకులు, అమాత్యులు, మిత్రజనులు అనే సర్వము కూడా అనిత్యమే.

సర్వేఽపి శూరసేనేమే శోకమోహభయార్తిదాః ।
గంధర్వనగరప్రఖ్యాస్స్వప్నమాయామనోరథాః ।। 23

శూరసేన - ఓ శూరసేనా!, ఇమే - ఈ, సర్వే అపి - అన్నీ కూడ, శోకమోహభయ-ఆర్తిదాః - శోకమును వ్యామోహమును భయమును దుఃఖమును ఇచ్చునవి, గంధర్వనగరప్రఖ్యాః - గంధర్వనగరముతో సమానమైనవి, స్వప్నమాయామనోరథాః - కల ఇంద్రజాలము మనోరథములు.

ఓ శూరసేన మహారాజా! ఇవన్నీ గంధర్వనగరము (ఆకాశములో కనబడిన కల్పితమగు నగరము), కల, ఇంద్రజాలము, కల్పనావిలాసముల లోని వస్తువులు వలె మిథ్య. ఇవి మానవునకు శోకమును, వ్యామోహమును, భయమును మరియు దుఃఖమును మిగుల్చును.

దృశ్యమానా వినార్థేన న దృశ్యంతే మనోభవాః ।
కర్మభిర్ధ్యాయతో నానాకర్మాణి మనసోఽభవన్ ॥ 24

అర్థేన వినా - వస్తుత్వము లేకుండా, దృశ్యమానాః - కనబడుచున్నవి, న దృశ్యంతే - మరల కనబడుట లేదు, మనః-భవాః - మనస్సుచే కల్పించబడినవి, కర్మభిః - కర్మవాసనలచే, ధ్యాయతః - భోగములను ధ్యానము చేయువానికి, మనసః - మనస్సు కారణముగా, నానాకర్మాణి - అనేక కర్మలు, అభవన్ - కలిగినవి.

ఈ భోగములు వాస్తవములు కాకున్ననూ యథార్థములు వలె భాసించి, మరు క్షణము అదృశ్యమగుచుండును. కావున, ఇవి మనస్సు యొక్క కల్పనలు మాత్రమే. కర్మవాసనలచే ప్రభావితుడైన వ్యక్తి భోగములను గురించి ధ్యానించుచుండును. వాని మనస్సే అనేక కర్మలను చేయుచుండుటకు నిమిత్తమగును.

**అయం హి దేహినో దేహో ద్రవ్యజ్ఞానక్రియాత్మకః ।**
**దేహినో వివిధక్లేశసంతాపకృదుదాహృతః ॥ 25**

**ద్రవ్యజ్ఞానక్రియా-ఆత్మకః - ద్రవ్యము జ్ఞానము క్రియ మూలము నందు గల, దేహినః - దేహధారియొక్క, అయమ్ - ఈ, దేహః హి - దేహమే, దేహినః - దేహికి, వివిధక్లేశసంతాపకృత్ - పలురకముల క్లేశములను సంతాపములను కలిగించునది అని, ఉదాహృతః - చెప్పబడినది.**

దేహధారియొక్క ఈ దేహమునకు మూలములో ద్రవ్యము, క్రియాశక్తి, జ్ఞానశక్తి గలవు. ఈ దేహమే దేహధారికి పలువిధముల క్లేశముల ను, సంతాపములను కలిగించునని చెప్పబడినది.

తస్మాత్స్వస్థేన మనసా విమృశ్య గతిమాత్మనః ।
ద్వైతే ధ్రువార్థవిశ్రంభం త్యజోపశమమావిశ ॥ 26

తస్మాత్ - అందువలన, స్వస్థేన - స్వస్థమైన, మనసా - మనస్సు తో, ఆత్మనః - ఆత్మయొక్క, గతిమ్ - స్వరూపమును, విమృశ్య - విచా రించి, ద్వైతే - భేదజాతమునందు, ధ్రువ-అర్థవిశ్రంభమ్ - నిత్యమగు వస్తువు అనే నమ్మకమును, త్యజ - విడిచిపెట్టుము, ఉపశమమ్ - శాంతి ని, ఆవిశ - ఆశ్రయించుము.

కావున, ప్రసన్నమగు మనస్సుతో ఆత్మస్వరూపమును విచారించు ము. నానాత్వవిశిష్టమగు ఈ ప్రపంచము యథార్థము అనే సంసారాసక్తిని విడిచిపెట్టుము. మనస్సును ఆత్మస్వరూపమునందు విలీనము చేసి, ఆత్మ నిష్ఠుడవై యుండుము.

నారద ఉవాచ ।
ఏతాం మంత్రోపనిషదం ప్రతీచ్ఛ ప్రయతో మమ ।
యాం ధారయన్ సప్తరాత్రాద్ద్రష్టా సంకర్షణం ప్రభుమ్ ॥ 27

ప్రయతః - సావధానుడవై, ఏతామ్ - ఈ, మంత్ర-ఉపనిషదమ్ - మంత్రము రూపములోనున్న మోక్షసాధనమును, మమ - నానుండి, ప్రతీచ్ఛ - స్వీకరించుము, యామ్ - దేనిని, ధారయన్ - ధారణ చేయువా డు, సప్తరాత్రాత్ - ఏడు రాత్రుల కంటె తరువాత, సంకర్షణం ప్రభుమ్ - సంకర్షణ ప్రభుని, ద్రష్టా - చూడగలడో.

నారద మహర్షి ఇట్లు పలికెను --- నీవు నానుండి మోక్షసాధన మగు ఈ మంత్రమును స్వీకరించుము. దీనిని ఏడు రాత్రులు దాటి ధారణ చేయు సాధకునకు సంకర్షణ ప్రభుని దర్శనము కలుగును.

యత్పాదమూలముపసృత్య నరేంద్ర పూర్వే
శర్వాదయో భ్రమమిమం ద్వితయం విసృజ్య ।
సద్యస్తదీయమతులానధికం మహిత్వం
ప్రాపుర్భవానపి పరం నచిరాదుపైతి ।। 28

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే అంగిరసా
చిత్రకేతోః వైరాగ్యోపదేశవర్ణనం నామ పంచదశోఽధ్యాయః ।।

నర-ఇంద్ర - ఓ మహారాజా!, పూర్వే - పూర్వీకులగు, శర్వ-ఆదయః - శివుడు మొదలగువారు, యత్-పాదమూలమ్ - ఎవని పాదమూలమును, ఉపసృత్య - చేరుకొని, ఇమమ్ - ఈ, ద్వితయమ్ - ద్వైతరూపమగు, భ్రమమ్ - భ్రాంతిని, విసృజ్య - విడిచిపెట్టి, సద్యః - వెంటనే, తదీయమ్ - ఆ భగవానునకు చెందిన, అతుల-అనధికమ్ - సాటి గాని అధికము గాని లేని, మహిత్వమ్ - మహిమను, ప్రాపుః - పొందిరో, భవాన్ అపి - నీవు కూడ, నచిరాత్ - తొందరలోనే, పరమ్ - మోక్షమును, ఉపైతి - పొందుచున్నావు.

ఓ మహారాజా! శివుడు మొదలగు పూర్వీకులు ఆ సంకర్షణ దేవుని పాదమూలమునాశ్రయించి, నానాత్వవిశిష్టమగు ప్రపంచము యథార్థమనే ఈ భ్రాంతిని విడనాడి, వెంటనే ఆయన మహిమను (మోక్షమును) పొందిరి. దానితో సాటి గాని, దానికంటె గొప్పది గాని మరియొక గతి లేదు. నీవు కూడ తొందరలోనే ఆ మోక్షపదమును పొందగలవు.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి ఆరవ స్కంధములో అంగిరసుడు
చిత్రకేతువునకు వైరాగ్యమునుపదేశించుటను వర్ణించే
పదునైదవ అధ్యాయము ముగిసినది (15).

*****

# అథ షోడశోऽధ్యాయః

## చిత్రకేతువునకు పరమాత్మ సాక్షాత్కరించుట

శ్రీశుక ఉవాచ ।
అథ దేవఋషీ రాజన్ సంపరేతం నృపాత్మజమ్ ।
దర్శయిత్వేతి హోవాచ జ్ఞాతీనామనుశోచతామ్ ॥ 1

రాజన్ - ఓ మహారాజా!, అథ - తరువాత, దేవఋషిః - దేవర్షి యగు నారదుడు, సంపరేతమ్ - మరణించిన, నృప-ఆత్మజమ్ - రాజకుమారుని, అనుశోచతామ్ - దుఃఖించుచున్న, జ్ఞాతీనామ్ - బంధువులకు, దర్శయిత్వా - చూపించి, ఇతి - ఈ విధముగా, ఉవాచ హ - పలికెనట.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! తరువాత దేవర్షియగు నారదుడు మరణించిన రాజకుమారుని జీవుని (సూక్ష్మశరీరమును) దుఃఖించుచున్న బంధువులకు చూపించి, ఇట్లు పలికెను.

నారద ఉవాచ ।
జీవాత్మన్ పశ్య భద్రం తే మాతరం పితరం చ తే ।
సుహృదో బాంధవాస్తప్తాశ్శుచా త్వత్కృతయా భృశమ్ ॥ 2

జీవాత్మన్ - ఓ జీవుడా!, తే - నీ కొరకు, భద్రమ్ - మంగళమగుగాక!, తే - నీ, మాతరమ్ - తల్లిని, తే - నీ, పితరం చ - తండ్రిని కూడ, పశ్య - చూడుము, సుహృదః - మిత్రులు, బాంధవాః - బంధువులు, త్వత్-కృతయా - నీ కారణముగా కలిగిన, శుచా - దుఃఖముచే, భృశమ్ - మిక్కిలి, తప్తాః - తాపమును పొందినవారు.

నారద మహర్షి ఇట్లు పలికెను --- ఓ జీవుడా! నీకు మంగళమగు గాక! నీ తల్లిదండ్రులను చూడుము. మిత్రులు, బంధువులు నీ కారణముగా కలిగిన దుఃఖముచే అధికమగు తాపమును పొంది యున్నారు.

కలేవరం స్వమావిశ్య శేషమాయుస్సుహృద్వృతః ।
భుంక్ష్వ భోగాన్ పితృప్రత్తానధితిష్ఠ నృపాసనమ్ ॥ 3

స్వమ్ - నీదైన, కలేవరమ్ - దేహమును, ఆవిశ్య - ప్రవేశించి, శేషమ్ - మిగిలియున్న, ఆయుః - ఆయుర్దాయమును, సుహృద్-వృతః - మిత్రులతో కూడినవాడవై, పితృప్రత్తాన్ - తండ్రిచే ఈయబడిన, భోగాన్ - భోగములను, భుంక్ష్వ - అనుభవించుము, నృప-ఆసనమ్ - రాజసింహాస నమును, అధితిష్ఠ - అధిష్ఠించుము.

నీ దేహములో నీవు ప్రవేశించుము. మిగిలియున్న ఆయుర్దాయ మును నీ మిత్రులతో గూడి నీ తండ్రి ఇచ్చిన భోగములననుభవించుము. రాజ సింహాసనము నధిష్ఠించుము.

జీవ ఉవాచ ।
కస్మిన్ జన్మన్యమీ మహ్యం పితరో మాతరోఽభవన్ ।
కర్మభిర్భ్రామ్యమాణస్య దేవతిర్యఙ్నృయోనిషు ॥ 4

కర్మభిః - కర్మలచే, దేవతిర్యఙ్-నృయోనిషు - దేవతలు పశుప క్ష్యాదులు మానవుల జన్మలయందు, భ్రామ్యమాణస్య - త్రిప్పబడుచున్న, మహ్యమ్ - నా కొరకు, అమీ - వీరు, కస్మిన్ - ఏ, జన్మని - జన్మయందు, పితరః - తండ్రులు, మాతరః - తల్లులు, అభవన్ - అయిరి?

కర్మలు నన్ను దేవతలు, పశుపక్ష్యాదులు మరియు మానవుల జన్మలలో త్రిప్పుచున్నవి. ఆ జన్మలలో వీరు నాకు తండ్రులు, తల్లులు అయిన జన్మ ఏది?

బంధుజ్ఞాత్యరిమధ్యస్థమిత్రోదాసీనవిద్విషః ।
సర్వ ఏవ హి సర్వేషాం భవంతి క్రమశో మిథః ॥ 5

మిథః - పరస్పరము, బంధుజ్ఞాతి-అరిమధ్యస్థమిత్ర-ఉదాసీనవిద్విషః - బంధువులు జ్ఞాతులు శత్రువులు మధ్యస్థులు మిత్రులు ఉదాసీనులు విద్వేషము గలవారు, సర్వే ఏవ - అందరు కూడ, సర్వేషామ్ - అందరికి, క్రమశః - క్రమముగా, భవంతి - అగుచుందురు.

వివిధజన్మలలో అందరు అందరికి పరస్పరము క్రమముగా బంధువులు, జ్ఞాతులు (ఒకే కుటుంబమువారు), శత్రువులు, మధ్యస్థులు, ఉదాసీనులు (కలుగజేసుకొనని వారు), ద్వేషించువారు అగుచునే యుందురు.

యథా వస్తూని పణ్యాని హేమాదీని తతస్తతః ।
పర్యటంతి నరేష్వేవం జీవో యోనిషు కర్తృషు ।। 6

పణ్యాని - క్రయవిక్రయములు చేయదగిన, హేమ-ఆదీని - బంగారము మొదలగు, వస్తూని - వస్తువులు, యథా - ఏ విధముగానైతే, తతః - వానినుండి, తతః - వానినుండి, నరేషు - జనులయందు, పరి-అటంతి - చుట్టూ తిరుగుచుండునో, ఏవమ్ - ఇదే విధముగా, జీవః - జీవుడు, కర్తృషు - తండ్రులయందు, యోనిషు - తల్లులయందు.

క్రయవిక్రయములు చేయదగిన బంగారము మొదలగు వస్తువులు జనులలో ఒకనినుండి మరియొకనికి, మరల వానినుండి ఇంకొకనికి, ఈ విధముగా చుట్టూ తిరుగుచుండును. ఇదే విధముగా, జీవుడు తల్లిదండ్రులలో తిరుగుచుండును.

నిత్యస్యార్థస్య సంబంధో హ్యనిత్యో దృశ్యతే నృషు ।
యావద్యస్య హి సంబంధో మమత్వం తావదేవ హి ।। 7

నృషు - మానవులయందు, నిత్యస్య - స్థిరముగానుండే, అర్థస్య - వస్తువుయొక్క, సంబంధః - సంబంధము, అనిత్యః - అనిత్యముగా, దృశ్యతే హి - కనబడుచున్నది, యావత్ - ఎంతవరకైతే, యస్య హి - దేనియొక్క, సంబంధః - సంబంధమో, మమత్వమ్ - మమకారము, తావత్ ఏవ హి - అంతవరకే గదా!

స్థిరముగానుండే బంగారము మొదలగు వస్తువులకు కూడ మనుష్యులతోడి సంబంధము అనిత్యముగనే యున్నదని మనకు అనుభవములో తెలియుచునే యున్నది. ఒక వ్యక్తికి ఒక వస్తువుతో ఎంతవరకు సంబంధముండునో, అంతవరకు మాత్రమే మమకారము ఉండును గదా!

ఏవం యోనిగతో జీవస్స నిత్యో నిరహంకృతః।
యావద్యత్రోపలభ్యేత తావత్స్వత్వం హి తస్య తత్ ।। 8

ఏవమ్ - ఈ విధముగా, యోనిగతః - జన్మను పొందిన, సః - ఆ, జీవః - జీవుడు, నిత్యః - నిత్యుడు, నిరహంకృతః - దేహమునందు నేను అనే ధారణకు తగనివాడు, యావత్ - ఎంతవరకైతే, యత్ర - ఏ దేహమునందైతే, ఉపలభ్యేత - ప్రకటమగునో, తావత్ - అంతవరకు, తస్య - వానికి, తత్ - దానియందు, స్వత్వం హి - నాది అనే ధారణ ఉండును గదా!

నిత్యుడగు జీవుడు తల్లి కడుపున జన్మించి ఆ దేహమునందు దేహియై ఉండును. జీవునకా దేహమునందు, నేను అనే ధారణ వాస్తవము కాదు. జీవుడు ఎంతవరకైతే ఒక దేహమునందు ప్రకటమగునో, అంతవరకు ఆ దేహమునందు, నేను నాది అనే ధారణను కలిగియుండును.

ఏష నిత్యోఽవ్యయస్సూక్ష్మ ఏష సర్వాశ్రయస్స్వదృక్ ।
ఆత్మమాయాగుణైర్విశ్వమాత్మానం సృజతి ప్రభుః ।। 9

ఏషః - ఈ జీవుడు, నిత్యః - వినాశము లేనివాడు, అవ్యయః - అపక్షయము లేనివాడు, సూక్ష్మః - ఇంద్రియగోచరము కానివాడు, ఏషః - ఈ జీవుడు, సర్వ-ఆశ్రయః - సర్వమునకు ఆశ్రయమైనవాడు, స్వదృక్ - స్వయంప్రకాశుడు, ప్రభుః - ఈశ్వరుడు, ఆత్మమాయాగుణైః - తన మాయాశక్తియొక్క గుణములచే, ఆత్మానమ్ - తననే, విశ్వమ్ - జగత్తుగా, సృజతి - ప్రకటించుచున్నాడు.

కాలమునకు అతీతుడు, అపక్షయము లేనివాడు, ఇంద్రియగోచరము కానివాడు, సర్వమునకు ఆశ్రయుడు, స్వయంప్రకాశస్వరూపుడు అగు ఈ జీవుడు, తన మాయాశక్తియొక్క సత్త్వరజస్తమోగుణములచే తానే

జగద్రూపముగా ప్రకటమగుచున్న సర్వశక్తిమంతమగు పరబ్రహ్మ వాస్తవముగా ఒక్కటియే.

స హ్యస్యాతిప్రియః కశ్చిన్నాప్రియస్స్వః పరోఽపి వా ।
ఏకస్సర్వధియాం ద్రష్టా కర్తౄణాం గుణదోషయోః ॥ 10

అస్య - వీనికి, అతిప్రియః - మిక్కిలి ప్రియమైనవాడు, కశ్చిత్ - ఒకానొకడు, న - లేడు, అప్రియః - ప్రియము కానివాడు గాని, స్వః - తనవాడు గాని, పరః అపి వా - పరాయి వాడే గాని, న హి - లేడు, ఏకః - అద్వితీయుడై, గుణదోషయోః - ధర్మాధర్మములయొక్క, కర్తౄణామ్ - కర్తలగు, సర్వధియామ్ - సకలబుద్ధివృత్తులకు, ద్రష్టా - ద్రష్ట.

జీవుని యధార్థస్వరూపము అసంగ-ఆత్మ. అద్వితీయమగు ఆత్మకు ప్రియుడు గాని, శత్రువు గాని, తనవారు గాని, పరాయి వారు గాని లేరు. ధర్మాధర్మముల కర్తృత్వము బుద్ధినిష్ఠము. అట్టి బుద్ధిలోని వృత్తులను ఆత్మ ప్రకాశింపజేస్తూ, దృక్-స్వరూపముగా నిలిచియుండును.

నాదత్త ఆత్మా హి గుణం న దోషం న క్రియాఫలమ్ ।
ఉదాసీనవదాసీనః పరావరదృగీశ్వరః ॥ 11

ఆత్మా - ఆత్మ, గుణమ్ - పుణ్యమును, న ఆదత్తే - స్వీకరించుట లేదు, దోషమ్ - పాపమును, న - స్వీకరించుట లేదు, క్రియాఫలమ్ - కర్మల ఫలమును, న - స్వీకరించుట లేదు, ఉదాసీనవత్ - ఉదాసీనునివలె, ఆసీనః - ఉన్నది, పర-అవరదృక్ - కారణకార్యములకు ద్రష్ట, ఈశ్వరః - స్వతంత్రము.

ఆత్మకు పుణ్యపాపములతో గాని, కర్మఫలములగు సుఖదుఃఖములతో గాని సంగము లేదు. సర్వస్వతంత్రమగు ఆత్మ ఉదాసీనముగా స్వరూపమునందు నిలిచి, కారణకార్యములను ప్రకాశింపజేస్తూ, వాటికి సాక్షిగా నుండును.

శ్రీశుక ఉవాచ ।
ఇత్యుదీర్య గతో జీవో జ్ఞాతయస్తస్య తే తదా ।
విస్మితా ముముచుశ్శోకం ఛిత్త్వాఽఽత్మస్నేహశృంఖలామ్ ।। 12

జీవః - జీవుడు, ఇతి - ఈ విధముగా, ఉదీర్య - పలికి, గతః - వెళ్లినాడు, తస్య - వాని, తే - ఆ, జ్ఞాతయః - జ్ఞాతులు, తదా - అప్పుడు, విస్మితాః - ఆశ్చర్యమును పొందినవారై, ఆత్మస్నేహశృంఖలామ్ - తమ ఆసక్తి అనే సంకెలను, ఛిత్త్వా - ఛేదించి, శోకమ్ - దుఃఖమును, ముముచుః - విడిచిపెట్టిరి.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- జీవుడు ఈ విధముగా పలికి నిష్క్రమించెను. అప్పుడు వాని ఆ జ్ఞాతులు తమలోని ఆసక్తి అనే సంకెలను ఛేదించి, శోకమును విడిచిపెట్టిరి.

నిర్హృత్య జ్ఞాతయో జ్ఞాతేర్దేహం కృత్వోచితాః క్రియాః ।
తత్యజుర్దుస్త్యజం స్నేహం శోకమోహభయార్తిదమ్ ।। 13

జ్ఞాతయః - జ్ఞాతులు, జ్ఞాతేః - జ్ఞాతియొక్క, దేహమ్ - దేహమును, నిర్హృత్య - దహించి, ఉచితాః - తగిన, క్రియాః - కర్మలను, కృత్వా - చేసి, దుస్త్యజమ్ - విడిచిపెట్ట శక్యము కానట్టియు, శోకమోహభయ-ఆర్తిదమ్ - దుఃఖమును వ్యామోహమును భయమును పీడను కలిగించే, స్నేహమ్ - ఆసక్తిని, తత్యజుః - విడిచిపెట్టిరి.

జ్ఞాతులు తమ జ్ఞాతియగు ఆ బాలకుని దేహమును దహించి, ఉత్తరక్రియలను యథోచితముగా చేసిరి. వారు ఆ బాలకునిపై గల ఆసక్తిని విడనాడిరి. విడిచిపెట్ట శక్యము కాని ఈ ఆసక్తియే మానవులకు దుఃఖమును, వ్యామోహమును, భయమును, మానసిక పీడను కలిగించుచుండును.

బాలఘ్న్యో వ్రీడితాస్తత్ర బాలహత్యాహతప్రభాః ।
బాలహత్యావ్రతం చేరుర్బ్రాహ్మణైర్యన్నిరూపితమ్ ।
యమునాయాం మహారాజ స్మరంత్యో ద్విజభాషితమ్ ।।14

మహారాజ - ఓ పరీక్షిన్మహారాజా!, తత్ర - ఆ సమయమునందు, బాలఘ్న్యః - బాలకుని చంపినవారు, బాలహత్యాహతప్రభాః - బాలకుని చంపుటచే నశించిన కాంతి గలవారు అగు రాణులు, వ్రీడితాః - సిగ్గు పడిన వారై, ద్విజభాషితమ్ - అంగిరసుని మాటను, స్మరంత్యః - స్మరించుచు న్నవారై, బ్రాహ్మణైః - వేదవేత్తలచే, నిరూపితమ్ - ప్రతిపాదించబడిన, బాలహత్యావ్రతమ్ - బాలకుని చంపినందులకు ప్రాయశ్చిత్తము, యత్ - ఏది గలదో దానిని, యమునాయామ్ - యమునా నదియందు, చేరుః - నిర్వర్తించిరి.

ఓ పరీక్షిన్మహారాజా! అప్పుడు బాలకుని చంపిన రాణుల ముఖ కాంతి బాలుని హత్యచే నశించెను. వారు తాము చేసిన పనికి సిగ్గు తెచ్చు కొని, అంగిరసుని ఉపదేశమును స్మరించిరి. వేదవేత్తలు బాలకుని హత్యకు ప్రాయశ్చిత్తమును ప్రతిపాదించిరి. అపుడు వారా ప్రాయశ్చిత్తమును యమునానదియందు నిర్వర్తించిరి.

స ఇత్థం ప్రతిబుద్ధాత్మా చిత్రకేతుర్ద్విజోక్తిభిః ।
గృహాంధకూపాన్నిష్క్రాంతస్సరఃపంకాదివ ద్విపః ।। 15

సః - ఆ, చిత్రకేతుః - చిత్రకేతువు, ఇత్థమ్ - ఈ విధముగా, ద్విజ -ఉక్తిభిః - నారదుడు అంగిరసుల వాక్యములచే, ప్రతిబుద్ధ-ఆత్మా - మేల్కొలుపబడిన అంతఃకరణము గలవాడై, సరఃపంకాత్ - సరస్సులోని బురదనుండి, ద్విపః ఇవ - ఏనుగు వలె, గృహ-అంధకూపాత్ - ఇల్లు అనే అజ్ఞానాంధకారపు గుయ్యారమునుండి, నిష్క్రాంతః - బయట పడెను.

నారదుడు, అంగిరసుడు చేసిన ఉపదేశము వలన చిత్రకేతువు యొక్క అంతఃకరణము జాగృతమయ్యేను. సరస్సులోని బురదనుండి ఏనుగు వలె, ఆయన ఇల్లు అనే అజ్ఞానాంధకారపు గుయ్యారమునుండి నిష్క్రమించెను.

కాలింద్యాం విధివత్ స్నాత్వా కృతపుణ్యజలక్రియః ।
మౌనేన సంయతప్రాణో బ్రహ్మపుత్రావవందత ।। 16

కాలింద్యామ్ - యమునానదియందు, విధివత్ - యథావిధిగా, స్నాత్వా - స్నానమును చేసి, కృతపుణ్యజలక్రియః - చేయబడిన పవిత్ర మగు జలములయందలి కర్మలు గలవాడై, మౌనేన - మౌనముతో, సంయతప్రాణః - నియంత్రించిన ఉచ్ఛ్వాసనిశ్వాసలు గలవాడై, బ్రహ్మపుత్రౌ - బ్రహ్మపుత్రులగు అంగిరస నారదులను, అవందత - నమస్కరించెను.

ఆయన యమునానదిలో యథావిధిగా స్నానము చేసి, పవిత్ర మగు తర్పణాది కర్మలను నిర్వర్తించెను. తరువాత మౌనముగానుండి ప్రాణాయామమును చేసెను. పిదప ఆయన బ్రహ్మపుత్రులగు అంగిరస నారదులకు నమస్కరించెను.

అథ తస్మై ప్రపన్నాయ భక్తాయ ప్రయతాత్మనే ।
భగవాన్నారదః ప్రీతో విద్యామేతామువాచ హ ॥ 17

అథ - తరువాత, ప్రపన్నాయ - శరణు వేడినట్టియు, భక్తాయ - భక్తుడైనట్టియు, ప్రయత-ఆత్మనే - నిగ్రహించబడిన మనస్సు కలిగిన, తస్మై - ఆ చిత్రకేతువు కొరకు, భగవాన్ - పూజనీయుడగు, నారదః - నారదుడు, ప్రీతః - సంతోషించినవాడై, ఏతామ్ - ఈ, విద్యామ్ - ఉపాసనను, ఉవాచ హ - చెప్పెనట.

తరువాత, భక్తుడగు చిత్రకేతువు మనోనిగ్రహము గలవాడై పూజనీయుడగు నారదుని శరణు వేడెను. ఆయన సంతోషించి ఈ ఉపాసనను బోధించెను

ఓం నమస్తుభ్యం భగవతే వాసుదేవాయ ధీమహి ।
ప్రద్యుమ్నాయానిరుద్ధాయ నమస్సంకర్షణాయ చ ॥ 18

ఓమ్, భగవతే = భగవంతుడవగు, తుభ్యమ్ - నీ కొరకు, వాసుదేవాయ = వాసుదేవుని కొరకు, ప్రద్యుమ్నాయ = ప్రద్యుమ్నుని కొరకు, అనిరుద్ధాయ = అనిరుద్ధుని కొరకు, చ = మరియు, సంకర్షణాయ = సంకర్షణుని కొరకు, నమః = నమస్కారమును, ధీమహి = భావన చేయుచున్నాము, నమః = నమస్కారము.

భగవంతుడగు వాసుదేవుని కొరకు, ప్రద్యుమ్న (శ్రీకృష్ణుని పుత్రుడు), అనిరుద్ధ (మనుమడు), సంకర్షణుల (సోదరుడు) కొరకు మనస్సులో నమస్కారమును భావన చేయుచున్నాము. లేదా, ఆ నామములు గల నాలుగు వ్యూహములకు నమస్కారము. లేదా, సర్వజగన్నివాసుడు, ప్రకాశస్వరూపుడు, తేజస్స్వరూపుడు, స్వతంత్రుడు, ప్రేమస్వరూపుడై భక్తులను తన వద్దకు ఆకర్షించువాడు అగు భగవానునకు, అనగా ఓ దేవా! నీకు, మనస్సులో నమస్కారమును భావన చేయుచున్నాము.

నమో విజ్ఞానమాత్రాయ పరమానందమూర్తయే ।
ఆత్మారామాయ శాంతాయ నివృత్తద్వైతదృష్టయే ।। 19

విజ్ఞానమాత్రాయ - శుద్ధ జ్ఞానస్వరూపుడైనట్టియు, పరమ-ఆనందమూర్తయే - అఖండమగు ఆనందమే స్వరూపముగా కలిగినట్టియు, ఆత్మారామాయ - తనయందే ఆరామము కలిగినట్టియు, శాంతాయ - శాంతియే స్వరూపముగా కలిగినట్టియు, నివృత్తద్వైతదృష్టయే - తొలగిన భేదదర్శనము కలిగిన భగవానుని కొరకు, నమః - నమస్కారము.

శుద్ధజ్ఞానస్వరూపుడు, పరమానందఘనుడు, ఆత్మారాముడు (తన ఆనందము కొరకు ఇతరముపై ఆధారపడనివాడు), శాంతుడు (స్వరూపమునందు చలనము లేనివాడు), భేదదృష్టి లేనివాడు అగు భగవానునకు నమస్కారము.

ఆత్మానందానుభూత్యైవ న్యస్తశక్త్యూర్మయే నమః।
హృషీకేశాయ మహతే నమస్తే విశ్వమూర్తయే ।। 20

ఆత్మానంద-అనుభూత్యా ఏవ - తన స్వరూపమైన ఆనందము యొక్క అనుభూతి చేతనే, న్యస్తశక్తి-ఊర్మయే - త్రోసిపుచ్చబడిన మాయా శక్తియొక్క తరంగములైన రాగద్వేషములు గలిగినట్టియు, హృషీక-ఈశాయ - ఇంద్రియాధిపతియైనట్టియు, మహతే - దేశపరిచ్ఛేదమునకు అతీతుడైనట్టియు, విశ్వమూర్తయే - జగద్రూపముగా ప్రకటమైన, తే - నీ కొరకు, నమః - నమస్కారము.

నీవు నీ స్వరూపమగు ఆనందముయొక్క అనుభూతి చేతనే మాయనుండి పుట్టే రాగద్వేషములను త్రోసిపుచ్చితివి. నీవు దేశపరిచ్ఛేద రహితుడవే అయిననూ, ఇంద్రియాధిపతివై ఉన్నావు. జగద్రూపముగా ప్రకటమై యున్న నీకు నమస్కారము.

వచస్యుపరతేఽప్రాప్య య ఏకో మనసా సహ ।
అనామరూపశ్చిన్మాత్రస్సోఽవ్యాన్నస్సదసత్పరః ।। 21

అప్రాప్య - పొందలేక, వచసి - వాక్కు, మనసా సహ - మనస్సుతో సహా, ఉపరతే - విరమించగా, ఏకః - అద్వితీయుడు, అనామరూపః - నామరూపములు లేనివాడు, చిత్-మాత్రః - శుద్ధచైతన్యస్వరూపుడు, సద్-అసత్-పరః - కార్యకారణములకు అతీతుడు అగు, యః - ఏ శ్రీహరి గలడో, సః - ఆయన, నః - మమ్ములను, అవ్యాత్ - రక్షించుగాక!

వాక్కు, మనస్సు కలిసి నామరూపములు లేని భగవానుని చేరుటకు ప్రయత్నించి విఫలమై వెనుదిరిగినవి (భగవానుడు వాక్కులకు, మనస్సునకు గోచరుడు కాడు). అద్వితీయుడు, శుద్ధచైతన్యమే స్వరూపముగా గలవాడు, కార్య (జగత్తు) కారణము (మాయాశక్తి) లకు అతీతుడు అగు ఆ పరమేశ్వరుడు మమ్ములను రక్షించు గాక!

యస్మిన్నిదం యతశ్చేదం తిష్ఠత్యప్యేతి జాయతే ।
మృణ్మయేష్వివ మృజ్జాతిస్తస్మై తే బ్రహ్మణే నమః ।। 22

ఇదమ్ - ఈ జగత్తు, యతః - ఎవనినుండి, జాయతే - పుట్టుచున్నదో, యస్మిన్ - ఎవనియందు, తిష్ఠతి - నిలిచియున్నదో, అప్యేతి చ - విలీనమగునో, మృత్-మయేషు - మట్టితో చేసినవాటియందు, మృత్-జాతిః ఇవ - కేవలము మట్టి వలె, తస్మై - అట్టి, బ్రహ్మణే - పరబ్రహ్మవగు, తే - నీ కొరకు, నమః - నమస్కారము.

ఈ జగత్తు పరబ్రహ్మనుండి పుట్టి, పరబ్రహ్మయందే మనుగడను సాగించి, పరబ్రహ్మయందే విలీనమగును. మట్టితో చేసిన ఘటాదుల యందు మట్టి అనుస్యూతముగ నుండును. అదే విధముగా, ఈ జగత్తు

నందు పరబ్రహ్మ అనుస్యూతమై యున్నది. అట్టి పరబ్రహ్మవు నీవే. నీకు నమస్కారము.

యన్న స్పృశంతి న విదుర్మనోబుద్ధీంద్రియాసవః ।
అంతర్బహిశ్చ వితతం వ్యోమవత్తన్నతోఽస్మ్యహమ్ ॥ 23

అంతః - లోపల, బహిః చ - బయట కూడ, వ్యోమవత్ - ఆకాశము వలె, వితతమ్ - వ్యాపించియున్న, యత్ - దేనిని, మనః-బుద్ధి-ఇంద్రియ-అసవః - మనస్సు బుద్ధి జ్ఞానేంద్రియములు కర్మేంద్రియములు, న స్పృశంతి - స్పృశించవో, న విదుః - తెలియవో, తత్ - అట్టి పరబ్రహ్మను, అహమ్ - నేను, నతః - నమస్కరించినవాడను, అస్మి - అగుదును.

పరబ్రహ్మ ఆకాశము వలె లోపల బయట కూడ వ్యాపించి యున్నది. దానిని మనస్సు (సంకల్ప వికల్పాత్మకము), బుద్ధి (నిశ్చయాత్మకము), జ్ఞానేంద్రియములు తెలియలేవు. దానిని కర్మేంద్రియములు స్పృశించలేవు. అట్టి పరబ్రహ్మకు నేను నమస్కరించుచున్నాను.

దేహేంద్రియప్రాణమనోధియోఽమీ
యదంశవిద్ధాః ప్రచరంతి కర్మసు ।
నైవాన్యదా లోహమివాప్రతప్తం
స్థానేషు తద్ద్రష్ట్రపదేశమేతి ॥ 24

అమీ - ఈ, దేహ-ఇంద్రియప్రాణమనః-ధియః - దేహము ఇంద్రియములు ప్రాణములు మనస్సు బుద్ధులు, యద్-అంశవిద్ధాః - దేని యొక్క చైతన్యాంశముచే ఆవేశించబడినవై, కర్మసు - వ్యాపారములయందు, ప్రచరంతి - ప్రవర్తిల్లుచున్నవో, అన్యదా - ఇతరసందర్భములయందు, అప్రతప్తమ్ - కాల్చబడని, లోహం ఇవ - ఇనుప గుండు వలె, న ఏవ - ప్రవర్తిల్లుటనే లేదో, స్థానేషు - అవస్థలయందు, ద్రష్టృ-అపదేశమ్ - ద్రష్ట అనే పేరును, తత్ - అదియే, ఏతి - పొందుచున్నదో.

ఈ దేహము, ఇంద్రియములు, ప్రాణములు, మనస్సు, బుద్ధి అనునవి పరబ్రహ్మయొక్క చైతన్యాంశముచే ఆవేశించబడి, నిప్పులలో కాలిన

గుండు ఇతరమును ధరించునట్లు, తమ తమ వ్యాపారములయందు ప్రవర్తిల్లుచున్నవి. అట్లు గానిచో, నిప్పులలో కాల్చని గుండు దేనినీ కాల్చలేని విధముగనే, అవి కూడ తమ వ్యాపారములను చేయలేవు. ఈ దేహేంద్రియాదుల సంఘాతమునందు ఆ పరబ్రహ్మ చైతన్యము అభివ్యక్తమవుతూ, జాగ్రత్తు మొదలగు అవస్థలయందు ఆ అవస్థలకు సాక్షి అని వ్యవహరించబడుచున్నది.

ఓం నమో భగవతే మహాపురుషాయ మహానుభావాయ మహా
విభూతిపతయే సకలసాత్వతపరివృఢనికరకరకమలకుడ్మలోప
లాలితచరణారవిందయుగల పరమ పరమేష్ఠిన్నమస్తే ॥ 25

ఓమ్, మహా-అనుభావాయ - గొప్ప మహిమ కలిగినట్టియు, మహావిభూతిపతయే - గొప్ప విభూతులకు (లక్ష్మీదేవికి) ప్రభువు అయిన, మహాపురుషాయ భగవతే - పురుషోత్తమ భగవానుని కొరకు, నమః - నమస్కారము, సకలసాత్వతపరివృఢనికరకరకమలకుడ్మల-ఉపలాలితచరణ-అరవిందయుగల - అందరు భక్తశ్రేష్ఠుల సమూహముయొక్క పద్మముల వంటి చేతుల మొగ్గలచే సేవించబడే పద్మముల వంటి పాదముల జంట గలవాడా!, పరమ - సర్వాతీతా!, పరమేష్ఠిన్ - సర్వేశ్వర!, తే - నీ కొరకు, నమః - నమస్కారము.

ఓమ్. గొప్ప మహిమ గలవాడు, గొప్ప విభూతులకు (లక్ష్మీదేవికి) ప్రభువు అగు పురుషోత్తమ భగవానునకు నమస్కారము. ఓ సర్వేశ్వరా! భక్తశిఖామణులందరు గుంపులుగా చేరి పద్మములవంటి తమ చేతులను జోడించి, మొగ్గలవంటి ఆ దోసిళ్లతో సర్వాతీతుడవగు నీ పద్మములవంటి పాదముల జంటను సేవించుచున్నారు. నీకు నమస్కారము.

శ్రీశుక ఉవాచ ।
భక్తాయైతాం ప్రపన్నాయ విద్యామాదిశ్య నారదః।
యయావంగిరసా సాకం ధామ స్వాయంభువం ప్రభో ॥ 26

ప్రభో - ఓ పరీక్షిన్మహారాజా!, నారదః - నారదుడు, ఏతామ్ - ఈ, విద్యామ్ - ఉపాసనను, భక్తాయ - భక్తుడైనట్టియు, ప్రపన్నాయ -

శరణు వేడిన చిత్రకేతువు కొరకు, ఆదిశ్య - ఉపదేశించి, అంగిరసా సాకమ్ - అంగిరసునితో గూడి, స్వాయంభువమ్ - స్వయంభువుడగు బ్రహ్మగారికి చెందిన, ధామ - లోకమును గురించి, యయౌ - వెళ్లెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! భక్తుడగు చిత్రకేతువు శరణు వేడగా, నారదుడు ఆయనకీ ఉపాసనను ఉపదేశించి, తరువాత అంగిరసునితో గూడి స్వయంభువుడగు బ్రహ్మగారి ధామమునకు వెళ్లెను.

చిత్రకేతుస్తు విద్యాం తాం యథా నారదభాషితామ్ ।
ధారయామాస సప్తాహమబ్భక్షస్సుసమాహితః ॥ 27

చిత్రకేతుః తు - చిత్రకేతువైతే, నారదభాషితామ్ - నారదునిచే ఉపదేశించబడిన, తామ్ - ఆ, విద్యామ్ - ఉపాసనను, యథా - ఉన్నది ఉన్నట్లుగా, సప్త-అహమ్ - ఏడు రోజులు అగునట్లుగా, అబ్-భక్షః - నీరు మాత్రమే ఆహారముగా గలవాడై, సుసమాహితః - మిక్కిలి ఏకాగ్రమగు చిత్తము గలవాడై, ధారయామాస - జపించెను.

నారదుడు ఉపదేశించిన ఈ మంత్రమును చిత్రకేతువు యథాతథముగా ఏడు రోజులు మిక్కిలి ఏకాగ్రమగు చిత్తముతో జపించెను. ఆ సమయములో ఆయన కేవలము నీటిని మాత్రమే ఆహారముగా తీసుకొనెను.

తతశ్చ సప్తరాత్రాంతే విద్యయా ధార్యమాణయా ।
విద్యాధరాధిపత్యం స లేభేऽప్రతిహతం నృపః ॥ 28

తతః చ - తరువాత, సప్తరాత్ర-అంతే - ఏడు రోజులు అయిన తరువాత, ధార్యమాణయా - జపము చేయబడిన, విద్యయా - మంత్రముచే, సః - ఆ, నృపః - రాజు, అప్రతిహతమ్ - ఆటంకములు లేని, విద్యాధర-ఆధిపత్యమ్ - విద్యాధరుల అధీశ్వరత్వమును, లేభే - పొందెను.

ఆ రాజు ఈ మంత్రమును ఏడు రోజులు జపించెను. అపుడాతనికి దాని ప్రభావముచే విద్యాధరులపై ఎదురు లేని అధీశ్వరత్వము లభించెను.

తతః కతిపయాహోభిర్విద్యయేద్ధమనోగతిః।
జగామ దేవదేవస్య శేషస్య చరణాంతికమ్ ।। 29

తతః - తరువాత, కతిపయ-అహోభిః - కొన్ని రోజులచే, విద్యయా - మంత్రముచే, ఇద్ధమనః-గతిః - దీప్తమైన మనస్సుయొక్క ప్రవృత్తి గల చిత్రకేతువు, దేవదేవస్య - దేవదేవుడగు, శేషస్య - ఆదిశేషుని, చరణ-అంతికమ్ - పాదముల సమీపమును, జగామ - చేరెను.

మంత్రప్రభావముచే ఆయన మానసిక ప్రవృత్తి చాల పరిశుద్ధమయ్యెను. కొన్ని రోజుల తరువాత ఆయన దేవదేవుడగు ఆదిశేషుని పాదముల వద్దకు వెళ్లెను.

మృణాలగౌరం శితివాససం స్ఫురత్-
కిరీటకేయూరకటిత్రకంకణమ్ ।
ప్రసన్నవక్త్రారుణలోచనం వృతం
దదర్శ సిద్ధేశ్వరమండలైః ప్రభుమ్ ।। 30

మృణాలగౌరమ్ - తామరతూడు వలె తెల్లనైనట్టియు, శితివాససమ్ - నల్లని వస్త్రము కలిగినట్టియు, స్ఫురత్-కిరీటకేయూరకటిత్రకంకణమ్ - ప్రకాశించే కిరీటము భుజపురులు మొలనూలు కంకణములు కలిగినట్టియు, ప్రసన్నవక్త్ర-అరుణలోచనమ్ - ప్రసన్నమగు ముఖములు ఎఱ్ఱని కళ్లు కలిగినట్టియు, సిద్ధ-ఈశ్వరమండలైః - సిద్ధపుంగవుల గుంపులచే, వృతమ్ - చుట్టువారబడియున్న, ప్రభుమ్ - ఆదిశేష ప్రభుని, దదర్శ - చూచెను.

చిత్రకేతువు సిద్ధేశ్వరుల గుంపుల మండలములోనున్న ఆదిశేష ప్రభుని చూచెను. తామరతూడు వలె తెల్లని ఆదిశేషుడు నల్లని వస్త్రమును దాల్చెను. ఆయన కిరీటము, భుజపురులు, మొలనూలు, కంకణములతో ప్రకాశించుచుండెను. ఆయన ముఖములు ప్రసన్నములుగను, కన్నులు ఎఱ్ఱగను ఉండెను.

తద్దర్శనధ్వస్తసమస్తకిల్బిషః
స్వచ్ఛామలాంతఃకరణోఽభ్యయాన్మునిః ।
ప్రవృద్ధభక్త్యా ప్రణయాశ్రులోచనః
ప్రహృష్టరోమాఽనమదాదిపూరుషమ్ ॥ 31

తద్-దర్శనధ్వస్తసమస్తకిల్బిషః - ఆయన దర్శనముచే నశింప జేయబడిన సకలపాపములు గలవాడు, స్వచ్ఛ-అమల-అంతఃకరణః - స్వచ్ఛము నిర్మలము అగు అంతఃకరణము గలవాడు, మునిః - మౌన ముగా నున్నవాడు, ప్రణయ-అశ్రులోచనః - ప్రేమచే నీటితో నిండిన కన్నులు గలవాడు, ప్రహృష్టరోమా - గగుర్పాటుతో కూడిన రోమములు గలవాడు అగు చిత్రకేతువు, ప్రవృద్ధభక్త్యా - బాగా పెరిగిన భక్తితో, ఆదిపూ రుషమ్ - జగత్కారణుడు పూర్ణుడు అగు సంకర్షణ దేవుని, అభి-అయాత్ - ఎదురుగా వచ్చెను, అనమత్ - నమస్కరించెను.

చిత్రకేతువు పాపములన్నియు ఆయన దర్శనముచే నశించి, అంతఃకరణము స్వచ్ఛము, నిర్మలము ఆయెను. మౌనముగానున్న ఆయన కళ్లు ప్రేమచే నీటితో నిండెను. శరీరమంతటా రోమములు గగుర్పా టును పొందెను. అధికముగా వర్ధిల్లిన భక్తితో ఆతడు, జగత్కారణుడు పూర్ణుడు అగు సంకర్షణ దేవుని యెదుటకు వచ్చి నమస్కరించెను.

స ఉత్తమశ్లోకపదాబ్జవిష్టరం ప్రేమాశ్రులేశైరుపమేహయన్ముహుః,
ప్రేమోపరుద్ధాఖిలవర్ణనిర్గమో నైవాశకత్తం ప్రసమీడితుం చిరమ్।32

సః - ఆ చిత్రకేతువు, ఉత్తమశ్లోకపద-అబ్జవిష్టరమ్ - పవిత్రకీర్తి యగు సంకర్షణ దేవుని పాదపద్మముల పీఠమును, ప్రేమ-అశ్రులేశైః - ప్రేమ వలని కన్నీటి బిందువులచే, ముహుః - పలుమార్లు, ఉపమేహయన్ - అభిషేకించుచున్నవాడై, ప్రేమ-ఉపరుద్ధ-అఖిలవర్ణనిర్గమః - ప్రేమచే అడ్డుకొనబడిన అన్ని అక్షరముల ఉచ్చారణ గలవాడై, చిరమ్ - చాలసేపు, తమ్ - ఆయనను, ప్రసమీడితుమ్ - చక్కగా స్తుతించుటకు, న ఏవ అశకత్ - సమర్థుడు కానే లేదు.

ఆ చిత్రకేతువు పవిత్రకీర్తియగు సంకర్షణ దేవుని పాదపద్మముల పీఠమును ప్రేమచే తన కన్నులనుండి స్రవించే నీటి బిందువులతో అభిషేకించెను. అన్ని అక్షరముల ఉచ్చారణను భక్తిచే కలిగిన డగ్గుత్తిక అడ్డుకొనెను. చాలసేపటి వరకు ఆతడు ఆయనను చక్కగా స్తుతించనే లేకపోయెను.

తతస్సమాధాయ మనో మనీషయా
బభాష ఏతత్ప్రతిలబ్ధవాగసౌ ।
నియమ్య సర్వేంద్రియబాహ్యవర్తనం
జగద్గురుం సాత్వతశాస్త్రవిగ్రహమ్ ।। 33

తతః - తరువాత, మనః - మనస్సును, మనీషయా - బుద్ధితో, సమాధాయ - ఏకాగ్రము చేసి, ప్రతిలబ్ధవాక్ - తిరిగి పొందబడిన మాట గల, అసౌ - ఈతడు, సర్వ-ఇంద్రియబాహ్యవర్తనమ్ - అన్ని ఇంద్రియముల బాహ్యప్రవృత్తిని, నియమ్య - నియమించి, జగద్-గురుమ్ - జగత్తునకు తండ్రి అయినట్టియు, సాత్వతశాస్త్రవిగ్రహమ్ - భక్తిశాస్త్రమునందు వర్ణించబడిన (భాగవతమే) రూపము గల సంకర్షణుని ఉద్దేశించి, ఏతత్ - ఈ మాటను, బభాష - పలికెను.

తరువాత ఆ చిత్రకేతువు సంకల్పశక్తిచే మనస్సును ఏకాగ్రము చేసి, తిరిగి ఉచ్చారణ శక్తిని పొందెను. ఆతడు ఇంద్రియములు బయటకు పోకుండా నియమించి సంకర్షణ దేవునితో నిట్లనెను. జగత్తునకు తండ్రి యగు ఆ దేవుడు భక్తిశాస్త్రము వర్ణించే రూపమును కలిగియుండెను (సాత్వతశాస్త్రమగు భాగవతమే ఆయన రూపము).

చిత్రకేతురువాచ ।

**అజిత జితస్సమమతిభిస్సాధుభిర్భవాన్ జితాత్మభిర్భవతా,**
**విజితాస్తేऽపి చ భజతామకామాత్మనాం య ఆత్మదోऽతికరుణః।34**

**అజిత** - పరాజయము లేనివాడా!, **భవాన్** - నీవు, **సమమతిభిః** - సమచిత్తులైనట్టియు, **జిత-ఆత్మభిః** - జయించబడిన మనస్సు గల,

సాధుభిః - సత్పురుషులచే, జితః - జయించబడినవాడవు, తే అపి చ - వారు కూడ, భవతా - నీచే, విజితాః - జయించబడినవారు, అకామ-ఆత్మ నామ్ - కామనలు లేని మనస్సు గల, భజతామ్ - భక్తులకు, అతికరుణః - అతిశయించిన కరుణ గల, యః - ఏ నీవు, ఆత్మదః - నిన్ను నీవే ఇచ్చి వేయువాడవో.

పరాజయము లేని ఓ దేవా! సర్వమునందు సముడగు ఈశ్వరుని దర్శిస్తూ మనస్సును జయించిన సత్పురుషులు నిన్ను తమ వశము చేసు కొనెదరు. నీవు కూడ వారిని నీ వశము చేసుకొనెదవు. మనస్సులో కామ నలు లేకుండా భక్తిని చేయువారలకు పరమదయామూర్తివగు నీవు నిన్నే సమర్పించెదవు.

తవ విభవః ఖలు భగవన్ జగదుదయస్థితిలయాదీని ।
విశ్వసృజస్తేఽంశాంశాస్తత్ర మృషా స్పర్ధంతే పృథగభిమత్యా ॥35

భగవన్ - ఓ భగవానుడా!, జగద్-ఉదయస్థితిలయ-ఆదీని - జగ త్తుయొక్క సృష్టిస్థితిలయములు మొదలైనవి, తవ - నీ, విభవః ఖలు - లీలయే గదా!, తే - నీ, అంశ-అంశాః - అంశయగు హిరణ్యగర్భుని అంశలు అగు, విశ్వసృజః - జగత్తును సృష్టించే ప్రజాపతులు, తత్ర - ఆ జగత్తునందు, పృథగ్-అభిమత్యా - మేము వేరుగా నున్నాము అనే అభి మానముచే, మృషా - వ్యర్థముగా, స్పర్ధంతే - పోటీ పడుచున్నారు.

ఓ భగవానుడా! జగత్తుయొక్క సృష్టి, స్థితి, లయము, మరల సృష్టిని అనుగ్రహించుట మొదలగు జగద్వ్యాపారములు నీ లీలావిలాస ములు మాత్రమే. జగత్తును సృష్టించే ప్రజాపతులు నీ అంశయగు హిరణ్య గర్భుని అంశలు. వారు ఆ జగత్తులో, మేము వేరుగా నున్నాము అనే అభి మానముతో వ్యర్థముగా పోటీ పడుచున్నారు.

పరమాణుపరమమహతోస్త్వమాద్యంతాంతరవర్తీ త్రయవిధురః।
ఆదావంతేఽపి చ సత్త్వానాం యద్ధ్రువం తదేవాంతరాలేఽపి ॥36

పరమ-అణుపరమమహతోః - మిక్కిలి చిన్నదానికి మిక్కిలి పెద్ద దానికి, త్వమ్ - నీవే, ఆది-అంత-అంతరవర్తీ - ఆది అంతము మధ్యల యందు ఉండువాడవు, త్రయవిధురః - ఈ మూడు లేనివాడవు, సత్త్వానామ్ - పదార్థములకు, ఆదౌ - ఆదియందు, అంతే అపి చ - అంతమునందు కూడ, యత్ - ఏది, ధ్రువమ్ - స్థిరమగు వస్తువు గలదో, తత్ ఏవ - అదియే, అంతరాలే అపి - మధ్యయందు కూడ.

మిక్కిలి చిన్నదియగు పరమాణువునుండి మొదలిడి మిక్కిలి పెద్దదియగు మహత్తత్త్వము వరకు సకలపదార్థములయొక్క ఆది, మధ్య, అంతము నీవే. కాని, నీకు ఆది, అంతము, మధ్య లేవు. పదార్థముల యందు (కంఠాభరణము మొదలగునవి) ఏదైతే ఆది-అంతములలో స్థిరముగానుండునో (బంగారము), మధ్యయందు కూడ అదియే ఉండును (అనగా కర్ణాభరణము మిథ్య, బంగారము సత్యము. అదే విధముగా, జగత్తు మిథ్య, ఈశ్వరుడు సత్యము).

క్షిత్యాదిభిరేష కిలావృతస్సప్తభిర్దశగుణోత్తరైరాండకోశః ।
యత్ర పతత్యణుకల్పస్సహాండకోటికోటిభిస్తదనంతః ॥ 37

క్షితి-ఆదిభిః - భూమి మొదలగు, దశగుణ-ఉత్తరైః - ముందుది వెనుకదానికంటె పదిరెట్లు ఉండే, సప్తభిః - ఏడింటిచే, ఆవృతః కిల - చుట్టువారబడి యున్న, ఏషః - ఈ, ఆండకోశః - బ్రహ్మాండకోశము, అండకోటికోటిభిః సహ - బ్రహ్మాండలముల కోట్ల కోట్లతో సహా, యత్ర - ఏ నీయందు, అణుకల్పః - రేణువును పోలినదై, పతతి - తిరుగుచున్నదో, తత్ - అందువలన, అనంతః కిల - అనంతుడవు గదా!

పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, అహంకారము, మహత్తు అనే ఏడు తత్త్వములు ఒకదాని చుట్టువారి మరియొకటి పదిరెట్లు చొప్పున ఈ బ్రహ్మాండము మొగ్గవలె నున్నది. ఇది, ఇటువంటి కోట్ల కోట్ల బ్రహ్మాండములు నీయందు ఒక కణమును పోలి తిరుగుచున్నవి. కావుననే, నీవు అనంతుడవని చెప్పబడుచున్నావు.

**విషయతృషో నరపశవో య ఉపాసతే విభూతీర్న పరం త్వామ్ ।**
**తేషామాశిష ఈశ తదను వినశ్యంతి యథా రాజకులమ్ ।। 38**

ఈశ - ఓ ఈశ్వరా!, విషయతృషః - ఇంద్రియభోగములయందు తృష్ణ గల, యే - ఏ, నరపశవః - మానవరూపములోనున్న పశువులు, తే - నీ, విభూతీః - విభూతులగు ఇంద్రాదులను, ఉపాసతే - ఉపాసించెదరో, పరమ్ - సర్వోత్తముడవగు, త్వామ్ - నిన్ను, న - కాదో, తేషామ్ - వారి, ఆశిషః - భోగములు, తద్-అను - ఆ దేవతల వెంబడి, రాజకులం యథా - రాజవంశము వలె, వినశ్యంతి - నశించును.

ఓ ఈశ్వరా! ఇంద్రియభోగములయందు తృష్ణ గల మానవులు పశుప్రాయులు. వారు సర్వోత్తముడవగు నిన్ను కాకుండా, నీ విభూతులైన ఇంద్రాది దేవతలను కొలిచెదరు. వారికి ఆ దేవతలచే అనుగ్రహించబడిన భోగములు, రాజకులము నశించుట తోడనే ఆ రాజు అనుగ్రహించిన సంపదలు వలె, ఆ దేవతలతో బాటే నశించును.

**కామధియస్త్వయి రచితా న పరమ రోహంతి యథా కరంభబీజాని,**
**జ్ఞానాత్మన్యగుణమయే గుణగణతోఽస్య ద్వంద్వజాలాని ।। 39**

పరమ - ఓ సర్వాతిశాయీ!, జ్ఞాన-ఆత్మని - జ్ఞానస్వరూపుడవైనట్టియు, అగుణమయే - నిర్గుణుడవగు, త్వయి - నీయందు, రచితాః - చేయబడిన, కామధియః - కోరికల సంకల్పములు, కరంభబీజాని యథా - వేయించిన విత్తనములు వలె, న రోహంతి - మొలకెత్తవు, అస్య - ఈ జీవునకు, గుణగణతః - గుణముల సముదాయము వలన, ద్వంద్వజాలాని - సుఖదుఃఖాది ద్వంద్వముల సముదాయములు.

ఓ సర్వేశ్వరా! నీవు నిర్గుణచైతన్యస్వరూపుడవు గనుక, నీయందు చేయబడే సంకల్పములు కామనతో కూడినవే అయిననూ, వేయించిన విత్తనములు వలె కొత్త జన్మను కలిగించవు. ఈ జీవునకు సుఖదుఃఖాది ద్వంద్వముల పరంపర సత్త్వరజస్తమోగుణముల సముదాయము (గుణకార్యమగు ప్రపంచము) వలననే కలుగుచున్నది.

జితమజిత తదా భవతా యదాఽఽహ భాగవతం ధర్మమనవద్యమ్,
నిష్కించనా యే మునయ ఆత్మారామా యముపాసతేఽపవర్గాయ.

అజిత - పరాజయమునెరుగని వాడా!, యదా - ఎప్పుడైతే, అనవద్యమ్ - నిర్దోషమగు, భాగవతమ్ - భగవద్భక్తులకు చెందిన, ధర్మమ్ - ధర్మమును, ఆహ - చెప్పితివో, తదా - అప్పుడు, భవతా - నీచే, జితమ్ - సర్వోత్కర్షగా ఉండబడినది, నిష్కించనాః - ఏమీ లేని, యే - ఏ, మునయః - మహర్షులు గలరో వారు, ఆత్మారామాః - ఆత్మయందే రమణము గలవారై, యమ్ - ఏ ధర్మమును, అపవర్గాయ - మోక్షము కొరకు, ఉపాసతే - ఉపాసించుచున్నారో.

పరాజయమునెరుగని ఓ ఈశ్వరా! నీవేనాడైతే నిర్దోషమగు భాగవత ధర్మమును ఉపదేశించితివో, ఆనాడు నీవు సర్వోత్కర్షగా నున్నావు. ఏలయనగా, అకించనులే (ద్రోగు చేయుట నెరుగనివారు) అయిననూ ఆత్మస్వరూపమునందే రమించే మహర్షులు మోక్షము కొరకై ఆ ధర్మమునే ఉపాసించుచున్నారు.

విషమమతిర్న యత్ర నృణాం
త్వమహమితి మమ తవేతి చ యదన్యత్ర ।
విషమధియా రచితో యః
స హ్యవిశుద్ధః క్షయిష్ణురధర్మబహులః ॥ 41

యత్ర - ఏ ధర్మమునందైతే, నృణామ్ - మానవులకు, త్వమ్ - నీవు, అహమ్ - నేను, ఇతి - అని, మమ - నాది, తవ - నీది, ఇతి చ - అని కూడ, విషమమతిః - భేదబుద్ధి, న - లేదో, యత్ - ఏ విధముగా, అన్యత్ర - ఇతరధర్మమునందు గలదో, యః - ఏ ధర్మము, విషమధియా - భేదబుద్ధితో, రచితః - విధించబడినదో, సః - అది, హి - నిశ్చయముగా, అవిశుద్ధః - అంత పవిత్రమైనది కాదు, క్షయిష్ణుః - నశించే స్వభావము గలది, అధర్మబహులః - అధర్మము అధికముగా గలది.

భాగవత ధర్మము (నిష్కామభక్తి) లో నీవు, నేను, నీది, నాది అనే భేదబుద్ధికి తావు లేదు. సకామముగా చేసే ధర్మములో ఇట్టి భేదబుద్ధి గల

దు. వాస్తవములో సకామధర్మము భేదబుద్ధిని పురస్కరించుకొనియే విధించబడుచున్నది. కావున, అది అంత పవిత్రమైనది కాదు. దాని వలన కలిగే ఫలములు కూడ శీఘ్రముగా నశించును. పైగా, దానిని ఆచరించుటలో హింస మొదలగు అధర్మము అధికముగనే యుండును.

కః క్షేమో నిజపరయోః కియానర్థస్స్వపరద్రుహా ధర్మేణ ।
స్వద్రోహాత్తవ కోపః పరసంపీడయా చ తథాఽధర్మః ॥ 42

స్వపరద్రుహా - తనకు ఇతరులకు ద్రోహమును చేసే, ధర్మేణ - ధర్మముతో, నిజపరయోః - తనకు ఇతరునకు, కః - ఏమి, క్షేమః - కుశలము?, అర్థః - ప్రయోజనము, కియాన్ - ఎంతటిది?, స్వద్రోహాత్ - ఆత్మద్రోహము వలన, తవ - నీకు, కోపః - కోపము, తథా - మరియు, పరసంపీడయా - ఇతరులకు కలిగించబడిన పీడచే, అధర్మః చ - అధర్మము కూడ.

కామన కొరకు చేసే ధర్మము తనకు, ఇతరులకు కూడ ద్రోహమును చేయును. దాని వలన తనకు గాని, ఇతరులకు గాని ఏమి క్షేమము కలుగును? దాని వలన ఒరిగే ప్రయోజనమెంతటిది? దాని వలన వ్యక్తి ఆత్మద్రోహమునకు పాల్పడినప్పుడు, నీ అనుగ్రహమునకు దూరుడగును. పైగా, ఇతరులకు దాని వలన పీడ కలుగుటచే వానికి అధర్మము (పాపము) కూడ చుట్టుకొనును.

న వ్యభిచరతి తవేక్షా యయా హ్యభిహితో భాగవతో ధర్మః ।
స్థిరచరసత్త్వకదంబేష్వపృథగ్ధియో యముపాసతే త్వార్యాః ॥43

తవ - నీ, ఈక్షా - దృష్టి, న వ్యభిచరతి - సత్యదూరము కాదు, యయా - ఏ దృష్టిచే, భాగవతః ధర్మః - భగవద్భక్తి అనే ధర్మము, అభిహితః హి - ఉపదేశించ బడినదో, యం హి - ఏ ధర్మమునైతే, స్థిరచరసత్త్వకదంబేషు - కదలని కదిలే ప్రాణుల సముదాయములయందు, అపృథగ్-ధియః - భేదబుద్ధి లేని, ఆర్యాః - మహాత్ములు, ఉపాసతే - ఉపాసించుచున్నారో.

ఓ భగవానుడా! నీవు ఏ దృష్టితో నిష్కామ భక్తి అనే భాగవత ధర్మము నుపదేశించితివో, (జీవుడు కృతార్థుడు కావాలనే) ఆ దృష్టి ఎన్న టికీ సత్యదూరము కాదు. చరాచరజగత్తును ఆత్మకంటె అభిన్నముగా దర్శించే మహాత్ములు ఆ ధర్మమునే ఉపాసించుచున్నారు.

న హి భగవన్నఘటితమిదం త్వద్దర్శనాన్నృణామఖిలపాపక్షయః,
యన్నామసకృచ్ఛ్రవణాత్పుల్కసకోఽపి విముచ్యతే సంసారాత్.44

భగవన్ - ఓ భగవానుడా!, ఇదమ్ - ఇది, అఘటితం న హి - అసంగతము కాదు సుమా!, త్వద్-దర్శనాత్ - నీ దర్శనము వలన, నృణామ్ - మానవులకు, అఖిలపాపక్షయః - సకలపాపముల నాశము, యత్ - ఏలయనగా, నామసకృత్-శ్రవణాత్ - నామమును ఒక్కసారి వినుట వలన, పుల్కసకః అపి - కసాయి కూడ, సంసారాత్ - సంసారము నుండి, విముచ్యతే - విముక్తిని పొందును.

ఓ భగవానుడా! నీ దర్శనముచే మానవులకు సకలపాపములు నశించును అను వచనము అసంగతము కానే కాదు సుమా! ఏలయనగా, నీ నామమును ఒక్కసారి వినుటచే కసాయి కూడ సంసారబంధమునుండి విముక్తుడగుచున్నాడు.

అథ భగవన్ వయమధునా త్వదవలోకపరిమృష్టాశయమలాః ।
సురఋషిణా యదుదితం తావకేన కథమన్యథా భవతి ।। 45

భగవన్ - ఓ భగవానుడా!, అథ - కావున, వయమ్ - మేము, అధునా - ఈనాడు, త్వద్-అవలోకపరిమృష్ట-ఆశయమలాః - నీ దర్శన ముచే కడిగి వేయబడిన అంతఃకరణమునందలి మాలిన్యములు గలవారము, తావకేన - నీ భక్తుడగు, సురఋషిణా - దేవర్షియగు నారదు నిచే, యత్ - ఏది, ఉదితమ్ - ఉపదేశించబడినదో అది, అన్యథా - మరి యొక విధముగా, కథమ్ - ఎట్లు, భవతి - అగును?

ఓ భగవానుడా! కావున, నీ దర్శనముచే ఈనాడు మా అంతఃకర ణములోని మాలిన్యములు కడిగి వేయబడినవి. నీ భక్తుడు, దేవర్షి అగు

నారదుడు చేసిన ఉపదేశము మరియొక విధముగా (వ్యర్థము) అగుట ఎట్లు సంభవము?

విదితమనంత సమస్తం తవ జగదాత్మనో జనైరిహాచరితమ్ ।
విజ్ఞాప్యం పరమగురోః కియదివ సవితురివ ఖద్యోతైః ।। 46

అనంత - ఓ అనంతుడా!, జగద్-ఆత్మనః - జగత్తుయొక్క పరమార్థము అయిన (జగద్రూపముగా ప్రకటమైన), తవ - నీకు, ఇహ - ఈ లోకమునందు, జనైః - జనులచే, ఆచరితమ్ - చేయబడినది, సమస్తమ్ - సర్వము, విదితమ్ - తెలియబడినది, సవితుః - సూర్యునకు, ఖద్యోతైః ఇవ - మిణుగురు పురుగులచే వలె, పరమగురోః - గురువులకు గురువు (తండ్రులకు తండ్రి) అగు నీకు, విజ్ఞాప్యమ్ - విన్నవించ (తెలుప) దగినది, కియదివ - ఎంతటిది?

ఓ అనంతా! జగత్తుయొక్క పరమార్థ తత్త్వము నీవే. జగద్రూపముగా నీవే ప్రకటమైనావు. అట్టి నీకు ఈ లోకములో జనులు చేసే సర్వము తెలియుచునే యుండును. నీవు తండ్రులకు తండ్రివి, గురువులకు గురుడవు. మిణుగురు పురుగులు సూర్యుని యెదుట ప్రకాశింప జేసేది ఏమి ఉండును? అదే విధముగా, నీ యెదుట విన్నవించేది (తెలుపుడు జేసేది) ఏమి ఉండును?

నమస్తుభ్యం భగవతే సకలజగత్స్థితిలయోదయేశాయ ।
దురవసితాత్మగతయే కుయోగినాం భిదా పరమహంసాయ ।।47

భగవతే - భగవానుడవైనట్టియు, సకలజగత్స్థితిలయ-ఉదయ-ఈశాయ - సకలజగత్తుయొక్క రక్షణ ప్రళయము సృష్టులకు ప్రభుడవైనట్టియు, భిదా - భేదముచే, కుయోగినామ్ - అయోగ్యులగు సాధకులకు, దురవసిత-ఆత్మగతయే - తెలియ శక్యము కాని తన తత్త్వము కలిగినట్టియు, పరమహంసాయ - పరమహంసవగు, తుభ్యమ్ - నీ కొరకు, నమః - నమస్కారము.

ఓ భగవానుడా! సకలజగత్తుయొక్క సృష్టిస్థితిలయములకు అధీశ్వరుడవు నీవే. కేవలము భేదమును మాత్రమే దర్శించే అయోగ్యులగు సాధకులు నీ యథార్థతత్త్వమును తెలియజాలరు. పరమహంస (ఆత్మజ్ఞాని) కు నీకు తేడా లేదు. సూర్యాదులను కూడ ప్రకాశింప జేసేది నీవే. నీకు నమస్కారము.

యం వై శ్వసంతమను విశ్వసృజశ్శ్వసంతి
యే చేకితానమను చిత్తయ ఉచ్చకంతి ।
భూమండలం సర్షపాయతి యస్య మూర్ధ్ని
తస్మై నమో భగవతేఽస్తు సహస్రమూర్ధ్నే ॥ 48

శ్వసంతమ్ - చేష్టను చేయుచున్న, యం వై - ఎవనినైతే, అను - అనుసరించి, విశ్వసృజః - జగత్తును సృష్టించే ప్రజాపతులు, శ్వసంతి - చేష్టను చేయుచున్నారో, చేకితానమ్ - ప్రకాశింప జేయుచున్న, యమ్ - ఎవనిని, అను - అనుసరించి, యే - ఏ, చిత్తయః - జ్ఞానేంద్రియములు, ఉచ్చకంతి - ప్రకాశింప జేయుచున్నవో, యస్య - ఎవని, మూర్ధ్ని - తల పై, భూమండలమ్ - భూమండలము, సర్షపాయతి - ఆవగింజ వలె నున్నదో, తస్మై - అట్టి, సహస్రమూర్ధ్నే - వేయి పడగల, భగవతే - భగవానుని కొరకు, నమః - నమస్కారము, అస్తు - కలుగు గాక!

ఆ అనంతుని చేష్టను అనుసరించియే జగత్తును సృష్టించే ప్రజాపతులు చేష్టను చేయుచున్నారు (వారి శక్తి అనంతుని అధీనమై యున్నది). ఆయన ప్రాణులలో ఆత్మచైతన్యమై ప్రకాశించుచుండగా; ఆ ప్రకాశమున నుసరించి జ్ఞానేంద్రియములు శబ్దాది విషయములను ప్రకాశింప జేయుచున్నవి. ఆయన పడగపై భూమండలము ఆవగింజ వలె నున్నది. అట్టి వేయి పడగల భగవానుని కొరకు నమస్కారము అగుగాక!

శ్రీశుక ఉవాచ ।
సంస్తుతో భగవానేవమనంతస్తమభాషత ।
విద్యాధరపతిం ప్రీతశ్చిత్రకేతుం కురూద్వహ ॥ 49

కురు-ఉద్వహ - కురువంశ శ్రేష్ఠా!, ఏవమ్ - ఈ విధముగా, సంస్తుతః - చక్కగా స్తుతించ బడిన, అనంతః భగవాన్ - అనంత భగవానుడు, ప్రీతః - ప్రసన్నుడై, విద్యాధరపతిమ్ - విద్యాధరులకు ప్రభువగు, తమ్ - ఆ, చిత్రకేతుమ్ - చిత్రకేతువును ఉద్దేశించి, అభాషత - పలికెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- కురువంశ శ్రేష్ఠుడవగు ఓ పరీక్షిన్మహారాజా! ఈ విధముగా విద్యాధరులకు ప్రభువగు చిత్రకేతువు అనంత భగవానుని చక్కగా స్తుతించెను. అపుడాయన ప్రసన్నుడై ఆతనితో నిట్లనెను.

శ్రీభగవానువాచ ।
యన్నారదాంగిరోభ్యాం తే వ్యాహృతం మేऽనుశాసనమ్ ।
సంసిద్ధోऽసి తయా రాజన్ విద్యయా దర్శనాచ్చ మే ।। 50

రాజన్ - ఓ రాజా!, నారద-అంగిరోభ్యామ్ - నారదుడు అంగిరసులచే, యత్ - ఏ, మే - నాయొక్క, అనుశాసనమ్ - ఉపాసనయొక్క ఉపదేశము, తే - నీ కొరకు, వ్యాహృతమ్ - చెప్పబడినదో, తయా - ఆ, విద్యయా - ఉపాసనచే, మే - నా, దర్శనాత్ చ - దర్శనము వలన కూడ, సంసిద్ధః - పూర్తిగా సిద్ధిని బడసిన వాడవు, అసి - అగుచున్నావు.

ఓ రాజా! నారదుడు, అంగిరసుడు నా ఉపాసనను నీకు ఉపదేశించినారు. దానిచే మరియు నన్ను దర్శించుటచే నీవు పూర్ణమగు సిద్ధిని (కృతార్థతను) బడసితివి.

అహం వై సర్వభూతాని భూతాత్మా భూతభావనః ।
శబ్దబ్రహ్మ పరం బ్రహ్మ మమోభే శాశ్వతీ తనూ ।। 51

సర్వభూతాని - సకలప్రాణులు, అహం వై - నేనే, భూత-ఆత్మా - ప్రాణుల యథార్థస్వరూపము, భూతభావనః - ప్రాణులకు కారణము, అహం వై - నేనే, శబ్దబ్రహ్మ - వేదరూపమగు బ్రహ్మ, పరం బ్రహ్మ - పరబ్రహ్మ, ఉభే - రెండు, మమ - నా, శాశ్వతీ - శాశ్వతములైన, తనూ - రూపములు.

సకలప్రాణులు, సకలప్రాణుల ఆత్మ, సకలప్రాణులకు కారణము అన్నీ నేనే. వేదరూపముగా నేనే ఉన్నాను. వేదము, వేదములచే ప్రతిపాదించబడే పరబ్రహ్మ (సచ్చిదానందము) అనే రెండు నా రూపములే (ఒకటి రూపము, మరియొకటి స్వరూపము).

**లోకే వితతమాత్మానం లోకం చాత్మని సంతతమ్,**
**ఉభయం చ మయా వ్యాప్తం మయి చైవోభయం కృతమ్।52**

లోకే - జగత్తునందు, వితతమ్ - అనుగతమైన, ఆత్మానమ్ - ఆత్మను, ఆత్మని చ - ఆత్మయందు కూడ, సంతతమ్ - వ్యాపించబడియున్న, లోకమ్ - లోకమును, మయా - నాచే, వ్యాప్తమ్ - వ్యాపించబడియున్న, ఉభయం చ - రెండింటినీ కూడ, మయి చ - నాయందే, కృతమ్ - చేయబడిన, ఉభయమ్ - రెండింటినీ (దర్శించవలెను).

జగత్తు (నామరూపములు) నందు ఆత్మ (చిత్) యే వ్యాపించియున్నది. జగత్తు ఆత్మయందే నిలిచియున్నది. ఈ రెండింటినీ నేనే (అఖండసత్, బ్రహ్మ) వ్యాపించియున్నాను. ఈ రెండు నాయందే ప్రకాశించుచున్నవి.

అఖండసత్ యందు చిత్ (ఆత్మ) ఆవిర్భవించినది. ఆత్మయందు నామరూపాత్మకమగు జగత్తు ప్రకాశించుచున్నది. ఆత్మ తాను ప్రకాశింప జేసే జగత్తును వ్యాపించుచున్నది. తనను ప్రకాశింప జేసే ఆత్మయందు మాత్రమే జగత్తు నిలిచియున్నది. ఈ విధముగా, ఈ రెండింటికీ అధిష్ఠానమగు అఖండసత్త (పరబ్రహ్మ) నేనే.

**యథా సుషుప్తః పురుషో విశ్వం పశ్యతి చాత్మని ।**
**ఆత్మానమేకదేశస్థం మన్యతే స్వప్న ఉత్థితః ।। 53**

**యథా - ఏ విధముగానైతే, సుషుప్తః - నిద్రించిన, పురుషః - వ్యక్తి, స్వప్నే - కలయందు, ఆత్మని - తనయందు, విశ్వమ్ - జగత్తును, పశ్యతి - చూచునో, ఉత్థితః - నిద్ర లేచినవాడై, ఆత్మానమ్ - తనను, ఏకదేశస్థమ్ - ఒక చోట ఉన్నవానినిగా, మన్యతే - తలపోయునో.**

నిద్రించిన మానవుడు కలలో జగత్తును తనయందే దర్శించును. కాని, ఆతడే నిద్ర లేచిన పిదప తాను ఒక చోట ఉన్నానని తలపోయును.

ఏవం జాగరణాదీని జీవస్థానాని చాత్మనః।
మాయామాత్రాణి విజ్ఞాయ తద్ద్రష్టారం పరం స్మరేత్ ॥ 54

ఏవమ్ - ఇదే విధముగా, జాగరణ-ఆదీని - జాగ్రత్తు మొదలగు, జీవస్థానాని చ - జీవుని అవస్థలు, ఆత్మనః - ఆత్మకు, మాయామాత్రాణి - మాయచే కల్పించబడినవి మాత్రమేనని, విజ్ఞాయ - తెలుసుకొని, తద్-ద్రష్టారమ్ - ఆ అవస్థలకు సాక్షియగు, పరమ్ - పరబ్రహ్మను, స్మరేత్ - స్మరించవలెను.

అదే విధముగా, జాగ్రత్తు మొదలగు జీవుని (బుద్ధి ఉపాధిగా గల వాడు) అవస్థలు కేవలము అజ్ఞానముచే మాత్రమే ఆత్మయందు కల్పించ బడుచున్నవి. వాస్తవములో ఈ అవస్థలకు సాక్షియగు ఆత్మ పరబ్రహ్మయే. ఈ పరబ్రహ్మను సాధకుడు స్మరించవలెను (ఆత్మనిష్ఠుడై యుండవలెను).

యేన ప్రసుప్తః పురుషస్స్వాపం వేదాత్మనస్తదా ।
సుఖం చ నిర్గుణం బ్రహ్మ తమాత్మానమవేహి మామ్ ॥ 55

ప్రసుప్తః - గాఢమగు నిద్రను పొందిన, పురుషః - వ్యక్తి, తదా - అప్పుడు, యేన - దేనిచే, ఆత్మనః - తన, స్వాపమ్ - నిద్రను, వేద - తెలి యునో, తమ్ - ఆ, ఆత్మానమ్ - ఆత్మను, సుఖమ్ - ఆనందస్వరూపమ గు, నిర్గుణమ్ - నిర్గుణమగు, బ్రహ్మ చ - పరబ్రహ్మనుగా, మామ్ - నన్ను గా, అవేహి - తెలుసుకొనుము.

గాఢనిద్రను పొందిన వ్యక్తికి ఆ నిద్రావస్థ (ప్రపంచము లేకుం డుట) యొక్క అనుభవము ఏ సాక్షిచైతన్యము వలన కలుగుచున్నదో, అట్టి ఆత్మచైతన్యమే ఆనందఘనము, నిర్గుణము అగు పరబ్రహ్మ అనియు, ఆ పరబ్రహ్మయే సగుణబ్రహ్మనగు నా స్వరూపమనియు, తెలుసుకొనుము.

ఉభయం స్మరతః పుంసః ప్రస్వాపప్రతిబోధయోః ।
అన్వేతి వ్యతిరిచ్యేత తజ్జ్ఞానం బ్రహ్మ తత్పరమ్ ॥ 56

ఉభయమ్ - రెండింటినీ, స్మరతః - స్మరించే, పుంసః - వ్యక్తికి, ప్రస్వాపప్రతిబోధయోః - నిద్ర జాగ్రదవస్థలయందు, జ్ఞానమ్ - జ్ఞానము, అను-ఏతి - అనుగతమై యుండును, వ్యతిరిచ్యేత - విలక్షణమై యుండును, తత్ - ఆ, జ్ఞానమ్ - జ్ఞానము, తత్ - ఆ, పరం బ్రహ్మ - పరబ్రహ్మ.

వ్యక్తి జాగ్రదవస్థలో ప్రపంచానుభవమును, నిద్రావస్థలో దాని అభావమును తెలుసుకొనుచుండును. ఈ రెండు అవస్థలలో వ్యాపించి యుండేది నిర్విశేషమగు జ్ఞానము (చైతన్యము). ఆ జ్ఞానము ఆ అవస్థల గుణస్వభావములకు విలక్షణముగనే యుండును. అట్టి ఆ నిర్విశేష జ్ఞానమే ఉపనిషత్ప్రతిపాద్యమగు పరబ్రహ్మ.

యదేతద్విస్మృతం పుంసో మద్భావం భిన్నమాత్మనః ।
తతస్సంసార ఏతస్య దేహాద్దేహో మృతేర్మృతిః ।। 57

పుంసః - వ్యక్తికి, యత్ - ఏ, మద్భావమ్ - నాతోడి అభేదము గలదో, ఏతత్ - ఇది, విస్మృతం యత్ - విస్మరింప బడినచో, ఆత్మనః - తనకంటె, భిన్నమ్ - వేరుపడుట, తతః - దాని వలన, ఏతస్య - వీనికి, సంసారః - సంసారము, దేహాత్ - దేహమునుండి, దేహః - దేహము, మృతేః - మరణమునుండి, మృతిః - మరణము.

వ్యక్తియొక్క యథార్థస్వరూపము (ఆత్మ) నాకంటె అభిన్నము. కాని, వ్యక్తి ఆ విషయమును విస్మరించినచో, తన స్వరూపమునుండి తానే వేరగును. అపుడు వానికి సంసారము, ఒక దేహము తరువాత మరియొకటి, ఒక మరణము తరువాత మరియొకటి వరుసగా కలుగుచుండును.

లబ్ధ్వేహ మానుషీం యోనిం జ్ఞానవిజ్ఞానసంభవామ్ ।
ఆత్మానం యో న బుద్ధ్యేత న క్వచిచ్ఛమమాప్నుయాత్।।58

ఇహ - ఈ జగత్తునందు, జ్ఞానవిజ్ఞానసంభవామ్ - జ్ఞానవిజ్ఞానముల సంభావన గల, మానుషీం యోనిమ్ - మానవజన్మను, లబ్ధ్వా - పొంది, యః - ఎవడైతే, ఆత్మానమ్ - తనను, న బుద్ధ్యేత - తెలుసుకొనడో

వాడు, క్వచిత్ - ఎక్కడనైననూ, శమమ్ - శాంతిని, న ఆప్నుయాత్ - పొందడు.

ఈ సృష్టిలో మానవజన్మయందు మాత్రమే ఆత్మయొక్క యథార్థ స్వరూపమును తెలుసుకొని అనుభవమునకు తెచ్చుకొనే అవకాశము గలదు. కాని, ఎవడైతే ఆత్మను తెలుసుకొనడో, వానికి ఎక్కడనైననూ (ఏ జన్మలోనైననూ) శాంతి కరువగును.

స్మృత్వేహాయాం పరిక్లేశం తతః ఫలవిపర్యయమ్ ।
అభయం చాప్యనీహాయాం సంకల్పాద్విరమేత్కవిః ॥ 59

ఈహాయామ్ - ప్రవృత్తియందు, పరిక్లేశమ్ - అధికమగు క్లేశమును, తతః - దానివలన, ఫలవిపర్యయమ్ - ఫలము తల్లక్రిందులగుటను, అనీహాయామ్ - నివృత్తియందు, అభయం చ అపి - అభయమును కూడ, స్మృత్వా - తెలుసుకొని, కవిః - వివేకి, సంకల్పాత్ - సంకల్పమునుండి, విరమేత్ - విరమించవలెను.

కామనల కొరకై చేసే కర్మలలో అధికమగు క్లేశము మాత్రమే గాక, కోరినదానికి విరుద్ధముగా దుఃఖఫలము కూడ కలుగుచుండును. కామనానివృత్తియందు అభయమగు ఆత్మస్వరూపము లభించును. ఈ సత్యమును తెలుసుకున్న వివేకి కామనలను, వాటి కొరకై కర్మలను సంకల్పించరాదు.

సుఖాయ దుఃఖమోక్షాయ కుర్వాతే దంపతీ క్రియాః ।
తతోఽనివృత్తిరప్రాప్తిర్దుఃఖస్య చ సుఖస్య చ ॥ 60

దంపతీ - స్త్రీపురుషులు, సుఖాయ - సుఖము కొరకు, దుఃఖమోక్షాయ - దుఃఖమునుండి విముక్తి కొరకు, క్రియాః - కర్మలను, కుర్వాతే - చేయుదురు, తతః - వాటి వలన, దుఃఖస్య - దుఃఖముయొక్క, అనివృత్తిః చ - నివృత్తి కాకుండుట, సుఖస్య చ - సుఖముయొక్క, అప్రాప్తిః చ - లాభము లేకుండుట.

లోకములో స్త్రీలు గాని, పురుషులు గాని, దుఃఖమునుండి విముక్తి ని, సుఖమును కోరి కామ్యకర్మలను చేయుచుందురు. కాని, వాటి వలన దుఃఖము తొలగుట లేదు, సుఖము లభించుట లేదు.

ఏవం విపర్యయం బుద్ధ్వా నృణాం విజ్ఞాభిమానినామ్ ।
ఆత్మనశ్చ గతిం సూక్ష్మాం స్థానత్రయవిలక్షణామ్ ॥ 61

దృష్టశ్రుతాభిర్మాత్రాభిర్నిర్ముక్తస్స్వేన తేజసా ।
జ్ఞానవిజ్ఞానసంతుష్టో మద్భక్తః పురుషో భవేత్ ॥ 62

పురుషః - మానవుడు, ఏవమ్ - ఈ విధముగా, విజ్ఞ-అభిమాని నామ్ - తెలివి గలవారమనే అభిమానము గల, నృణామ్ - మానవులకు, విపర్యయమ్ - విపరీత ఫలమును, సూక్ష్మామ్ - ఇంద్రియగోచరము కాన ట్టియు, స్థానత్రయవిలక్షణామ్ - మూడు అవస్థలకంటె విలక్షణమైన, ఆత్మనః - ఆత్మయొక్క, గతిం చ - స్వరూపమును కూడ, బుద్ధ్వా - తెలు సుకొని, స్వేన - తన, తేజసా - తేజస్సుచే, దృష్టశ్రుతాభిః - కనబడిన విన బడిన, మాత్రాభిః - శబ్దాది విషయములనుండి, నిర్ముక్తః - విముక్తుడై, జ్ఞానవిజ్ఞానసంతుష్టః - ఆత్మజ్ఞానమునందు ఆత్మానుభవమునందు సంతో షము గలవాడై, మద్-భక్తః - నా భక్తుడు, భవేత్ - కావలెను.

ఈ విధముగా తాము తెలివి గలవారమనే అభిమానము గల జనులు కామ్యకర్మలను చేసి విరుద్ధఫలమును పొందుచున్నారు. మాన వుడు ఈ సంగతిని గమనించి, ఇంద్రియగోచరము కాని ఆత్మయొక్క యథార్థస్వరూపమును తెలుసుకొనవలెను. మానవజీవితములోని మూడు అవస్థలను ప్రకాశింప జేసేది ఆత్మయే అయినా, వాటికంటె ఆత్మ విలక్షణ ముగా నున్నది. మానవుడు తన వివేకశక్తిచే, కనబడే (ఇహలోక) మరియు వినబడే (పరలోక) భోగములనుండి బయటపడి, ఆత్మజ్ఞానమును సాధన చేసి, అనుభవము లోనికి తెచ్చుకొని, నా భక్తుడై ఉండవలెను.

ఏతావానేవ మనుజైర్యోగనైపుణబుద్ధిభిః ।
స్వార్థస్సర్వాత్మనా జ్ఞేయో యత్పరాత్మైకదర్శనమ్ ॥ 63

యోగనైపుణబుద్ధిభిః - యోగముచే నిపుణమైన బుద్ధి గల, మనుజైః - మానవులచే, స్వ-అర్థః - పురుషార్థము, ఏతావాన్ ఏవ - ఇది మాత్రమేనని, సర్వాత్మనా - అన్ని విధములుగా, జ్ఞేయః - తెలియబడ వలెను, యత్ - ఏదనగా, పర-ఆత్మైకదర్శనమ్ - పరబ్రహ్మయే ఆత్మ అని తెలియుట.

మానవులు కర్మయోగమునభ్యసిస్తూ బుద్ధికి పదును పెట్టి పరబ్ర హ్మయే ఆత్మరూపముగా నున్నదని తెలుసుకొనుటకు సర్వవిధములుగా ప్రయత్నించవలెను. పురుషార్థము (జీవితలక్ష్యము) ఇది మాత్రమే.

త్వమేతచ్ఛ్రద్ధయా రాజన్నప్రమత్తో వచో మమ ।
జ్ఞానవిజ్ఞానసంపన్నో ధారయన్నాశు సిధ్యసి ।। 64

రాజన్ - ఓ రాజా!, త్వమ్ - నీవు, అప్రమత్తః - మరుపు లేనివాడ వై, ఏతత్ - ఈ, మమ - నా, వచః - మాటను, ధారయన్ - ధారణ చేయు వాడవై, జ్ఞానవిజ్ఞానసంపన్నః - ఆత్మజ్ఞానము ఆత్మానుభవములతో సంప న్నుడవై, ఆశు - శీఘ్రముగా, సిధ్యసి - సిద్ధిని పొందగలవు.

ఓ రాజా! నీవు నా మాటను మరచిపోవద్దు. నా ఉపదేశమును బుద్ధిలో నిలుపుము. దాని వలన నీవు శీఘ్రముగా ఆత్మజ్ఞానమును, ఆత్మా నుభవమును పొంది, జీవన్ముక్తుడవు కాగలవు.

శ్రీశుక ఉవాచ ।
ఆశ్వాస్య భగవానిత్థం చిత్రకేతుం జగద్గురుః ।
పశ్యతస్తస్య విశ్వాత్మా తతశ్చాంతర్దధే హరిః ।। 65

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే చిత్రకేతోః
పరమాత్మదర్శనం నామ షోడశోఽధ్యాయః ।।

జగద్-గురుః - జగత్తునకు గురువు (తండ్రి), విశ్వ-ఆత్మా - జగ త్తునకు ఆత్మ అగు, భగవాన్ హరిః - శ్రీహరి భగవానుడు, చిత్రకేతుమ్ - చిత్రకేతువును, ఇత్థమ్ - ఈ విధముగా, ఆశ్వాస్య - ఓదార్చి, తస్య - అత

డు, పశ్యతః - చూచుచుండగా, తతః - అక్కడనుండి, అంతర్దధే - అంత ర్ధానము జెందెను.

జగత్తునకు తండ్రి, గురువు అగు శ్రీహరి భగవానుడే జగత్తు యొక్క యథార్థస్వరూపము కూడ. ఆయన చిత్రకేతువును ఈ విధముగా ఓదార్చి, అతడు చూచుచుండగనే అక్కడనుండి అంతర్ధానమయ్యెను.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి ఆరవ స్కంధములో
చిత్రకేతువునకు పరమాత్మ సాక్షాత్కారమును వర్ణించే
పదునారవ అధ్యాయము ముగిసినది (16).

*****

# అథ సప్తదశోఽధ్యాయః

## చిత్రకేతువు శాపముచే వృత్రుడై జన్మించుట

శ్రీశుక ఉవాచ ।
యతశ్చాంతర్హితోఽనంతస్తస్యై కృత్వా దిశే నమః।
విద్యాధరశ్చిత్రకేతుశ్చచార గగనేచరః ॥ 1

యతః చ - ఎచ్చటనుండైతే, అనంతః - అనంతుడు, అంతర్హితః - అంతర్ధానమును చెందినాడో, తస్యై - ఆ, దిశే - దిక్కు కొరకు, నమః - నమస్కారమును, కృత్వా - చేసి, విద్యాధరః - విద్యాధరుడు, గగనేచరః - ఆకాశమునందు సంచరించువాడు అగు, చిత్రకేతుః - చిత్రకేతువు, చచార - సంచరించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- విద్యాధరుడగు చిత్రకేతువు అనంతుడు అంతర్ధానమైన దిక్కునకు నమస్కరించి, యథేచ్ఛగా ఆకాశ మార్గమునందు సంచరించెను.

స లక్షం వర్షలక్షాణామవ్యాహతబలేంద్రియః ।
స్తూయమానో మహాయోగీ మునిభిస్సిద్ధచారణైః ॥ 2

కులాచలేంద్రద్రోణీషు నానాసంకల్పసిద్ధిషు ।
రేమే విద్యాధరస్త్రీభిర్గాపయన్ హరిమీశ్వరమ్ ॥ 3

అవ్యాహతబల-ఇంద్రియః - క్షీణించని బలము గల ఇంద్రియ ములు గలవాడు, మునిభిః - మహర్షులచే, సిద్ధచారణైః - సిద్ధులు చారణు లచే, స్తూయమానః - స్తుతించబడుచున్నవాడు, మహాయోగీ - గొప్ప యోగి అగు, సః - ఆ చిత్రకేతువు, నానాసంకల్పసిద్ధిషు - అనేకములగు

కామనల సిద్ధి గల, కుల-అచల-ఇంద్రద్రోణీషు - కులపర్వతములలో శ్రేష్ఠ మగు మేరు పర్వతముయొక్క లోయలయందు, విద్యాధరస్త్రీభిః - విద్యాధరస్త్రీలచే, హరిం ఈశ్వరమ్ - శ్రీహరి భగవానుని, గాపయన్ - గానము చేయించువాడై, వర్షలక్షాణామ్ - లక్ష సంవత్సరముల, లక్షమ్ - లక్షను, రేమే - రమించెను.

అనేకములగు సంకల్పములను సిద్ధింపజేసే కులపర్వతరాజగు మేరుపర్వతముయొక్క లోయలలో ఆ చిత్రకేతువు పది వేల కోట్ల సంవత్సరములు విహరించెను. గొప్ప యోగియగు ఆతని ఇంద్రియముల పాటవము తగ్గనే లేదు. ఆతనిని మహర్షులు, సిద్ధులు, చారణులు స్తుతించెడివారు. ఆతని ప్రేరణచే విద్యాధరస్త్రీలు శ్రీహరి భగవానుని కీర్తించెడివారు.

ఏకదా స విమానేన విష్ణుదత్తేన భాస్వతా ।
గిరిశం దదృశే గచ్ఛన్ పరీతం సిద్ధచారణైః ॥ 4

ఆలింగ్యాంకీకృతాం దేవీం బాహునా మునిసంసది ।
ఉవాచ దేవ్యాశ్శృణ్వంత్యా జహాసోచ్చైస్తదంతికే ॥ 5

ఏకదా - ఒకనాడు, సః - ఆతడు, విష్ణుదత్తేన - విష్ణువుచే ఈయబడినట్టియు, భాస్వతా - ప్రకాశించే, విమానేన - విమానముచే, గచ్ఛన్ - వెళ్లుచున్నవాడై, మునిసంసది - మహర్షుల సభలో, అంకీకృతామ్ - అంకమునందు కూర్చుండపెట్టుకున్న, దేవీమ్ - పార్వతీదేవిని, బాహునా - బాహువుతో, ఆలింగ్య - ఆలింగనము చేసుకొని, సిద్ధచారణైః - సిద్ధులచే చారణులచే, పరీతమ్ - చుట్టువారబడియున్న, గిరిశమ్ - కైలాసవాసి యగు శివుని, దదృశే - చూచెను, దేవ్యాః - పార్వతీదేవి, శృణ్వంత్యాః - వినుచుండగా, ఉచ్చైః - బిగ్గరగా, జహాస - నవ్వెను, తద్-అంతికే - ఆమె సమీపమునందు, ఉవాచ - పలికెను.

ఒకానాడాతడు విష్ణువు ఇచ్చిన మెరిసి పోయే విమానములో వెళ్లుచుండెను. సిద్ధులు, చారణులచే చుట్టువారబడియున్న కైలాసవాసి యగు శివుడాతనికి కనబడెను. ఆయన మహర్షుల సభలో తన అంకముపై పార్వతీ దేవిని కూర్చుండ బెట్టుకొని, ఆమెను బాహువుతో ఆలింగనము

చేసుకొనియుండెను. ఆమె వినుచుండగా, చిత్రకేతువు బిగ్గరగా నవ్వి, ఆమె సమీపమునందు ఇట్లు పలికెను.

చిత్రకేతురువాచ ।
ఏష లోకగురుస్సాక్షాద్ధర్మం వక్తా శరీరిణామ్ ।
ఆస్తే ముఖ్యస్సభాయాం వై మిథునీభూయ భార్యయా ।। 6

ఏషః - ఈయన, సాక్షాత్ - సాక్షాత్తుగా, లోకగురుః - లోకములకు తండ్రి (గురువు), శరీరిణామ్ - మానవులకు, ధర్మమ్ - ధర్మమును, వక్తా - చెప్పువాడు, సభాయామ్ - సభయందు, ముఖ్యః - ప్రధానుడు, భార్యయా - భార్యతో, మిథునీభూయ - కలిసిపోయి, ఆస్తే వై - ఉన్నాడు.

చిత్రకేతువు ఇట్లు పలికెను --- ఈయన సాక్షాత్తుగా లోకములకు తండ్రి, గురువు. ఈయన మానవులకు ధర్మమును బోధించును. ఈ సభలో ఈయనే ప్రముఖుడు. అయిననూ, భార్యను కౌగిలించుకొని ఉన్నాడు.

జటాధరస్తీవ్రతపా బ్రహ్మవాదిసభాపతిః ।
అంగీకృత్య స్త్రియం చాస్తే గతహ్రీః ప్రాకృతో యథా ।। 7

జటాధరః - జటలను ధరించువాడు, తీవ్రతపాః - కఠినమగు తపస్సు గలవాడు, బ్రహ్మవాదిసభాపతిః - బ్రహ్మవేత్తల సభకు అధ్యక్షుడు, ప్రాకృతః యథా - సామాన్య జనుడు వలె, గతహ్రీః - తొలగిన సిగ్గు గలవాడై, స్త్రియమ్ - స్త్రీని, అంగీకృత్య చ - కౌగిలించుకొని, ఆస్తే - ఉన్నాడు.

ఈయన జటలను ధరించి కఠినమగు తపస్సును చేసినవాడు. వేద వేత్తల సభకు అధ్యక్షుడు ఈయనే. అయిననూ, ఈయన సభలో సిగ్గు లేకుండా స్త్రీని కౌగిలించుకొని యున్నాడు.

ప్రాయశః ప్రాకృతాశ్చాపి స్త్రియం రహసి బిభ్రతి ।
అయం మహావ్రతధరో బిభర్తి సదసి స్త్రియమ్ ।। 8

ప్రాకృతాః అపి - సామాన్య జనులు కూడ, ప్రాయశః - బహుశా, స్త్రియమ్ - స్త్రీని, రహసి - ఏకాంతమునందు, బిభ్రతి - అంకమునందు

కూర్చుండ బెట్టెదరు, మహావ్రతధరః - గొప్ప వ్రతనిష్ఠ గల, అయమ్ - ఈతడు, సదసి - సభయందు, స్త్రియమ్ - స్త్రీని, బభర్తి - అంకముపై కలిగియున్నాడు.

సామాన్య జనులైననూ బహుశః ఏకాంతమునందు మాత్రమే స్త్రీని అంకముపై కూర్చుండ బెట్టుకొనెదరు. కాని, గొప్ప వ్రతనిష్ఠ గల ఈయన మాత్రము సభయందు స్త్రీని అంకముపై కూర్చుండ బెట్టుకొనెను.

శ్రీశుక ఉవాచ ।
భగవానపి తచ్ఛ్రుత్వా ప్రహస్యాగాధధీర్నృప ।
తూష్ణీం బభూవ సదసి సభ్యాశ్చ తదనువ్రతాః ॥ 9

నృప - ఓ పరీక్షిన్మహారాజా!, అగాధధీః - గంభీరమైన సంకల్పము గల, భగవాన్ అపి - శివ భగవానుడు కూడ, తత్ - ఆ మాటను, శ్రుత్వా - విని, ప్రహస్య - నవ్వి, తూష్ణీం బభూవ - మిన్నకుండెను, సదసి - సభయందలి, సభ్యాః - సభ్యులు, తద్-అనువ్రతాః - ఆయనను అనుసరించువారు.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! శివ భగవానుని సంకల్పము ఊహకు అందేది కాదు. ఆయన ఆ మాటను విని నవ్వి మిన్నకుండెను. సభలోని సభ్యులు కూడ ఆయన పద్ధతినే పాటించిరి.

ఇత్యతద్వీర్యవిదుషి బ్రువాణే బహ్వశోభనమ్ ।
రుషాఽఽహ దేవీ ధృష్టాయ నిర్జితాత్మాభిమానినే ॥ 10

అతద్-వీర్యవిదుషి - ఆ శివుని శక్తిని ఎరుగని చిత్రకేతువు, ఇతి - ఈ విధముగా, బహు - చాల, అశోభనమ్ - తప్పు మాటను, బ్రువాణే - పలుకుచుండగా, దేవీ - పార్వతీ దేవి, ధృష్టాయ - పొగరుమోతు అయినట్టియు, నిర్జిత-ఆత్మాభిమానినే - జయించబడిన మనస్సు గలవాడననే గర్వము గలవాడు అగు చిత్రకేతువు కొరకు, రుషా - కోపముతో, ఆహ - పలికెను.

చిత్రకేతువు పొగరుమోతు. తాను మనస్సును జయించినాననే గర్వముతో, శివుని శక్తిని ఎరుగని ఆ చిత్రకేతువు ఈ విధముగా చాల తప్పు మాటలను పలుకుచుండగా, పార్వతీ దేవి కోపముగా వానితో నిట్లనెను.

పార్వత్యువాచ ।
అయం కిమధునా లోకే శాస్తా దండధరః ప్రభుః ।
అస్మద్విధానాం దుష్టానాం నిర్లజ్జానాం చ విప్రకృత్ ॥ 11

లోకే - లోకమునందు, అధునా - ఇప్పుడు, శాస్తా - శాసించువాడు, దండధరః - శిక్షను వేయువాడు, ప్రభుః - ప్రభుడు, దుష్టానామ్ - దుష్టులైనట్టియు, నిర్లజ్జానామ్ - సిగ్గు లేని, అస్మద్-విధానామ్ - మన వంటి వారలకు, విప్రకృత్ చ - అపకారమును చేయువాడు, అయం కిమ్ - వీడేనా యేమి?

పార్వతీ దేవి ఇట్లు పలికెను --- ఈనాడు లోకములో, సిగ్గులేని దుష్టులమగు మనవంటి వారలకు శిక్షను వేసి కష్టమును కలిగించి శాసించే ప్రభుడు ఈతడేనా యేమి?

న వేద ధర్మం కిల పద్మయోనిః
న బ్రహ్మపుత్రా భృగునారదాద్యాః ।
న వై కుమారః కపిలో మనుశ్చ
యే నో నిషేధంత్యతివర్తినం హరమ్ ॥ 12

పద్మయోనిః - పద్మమునుండి పుట్టిన బ్రహ్మగారు, ధర్మమ్ - ధర్మమును, న వేద కిల - ఎరుగడు గదా!, బ్రహ్మపుత్రాః - బ్రహ్మగారి పుత్రులగు, భృగునారద-ఆద్యాః - భృగువు నారదుడు మొదలగువారు, న - ఎరుగరు, కుమారః - సనత్కుమారుడు, కపిలః - కపిలుడు, మనుః చ - మనువు కూడ, వై - నిశ్చయముగా, న - ఎరుగరు, యే - ఎవరైతే, అతివర్తినమ్ - మితి మీరి ప్రవర్తించే, హరమ్ - శివుని, నో నిషేధంతి - నిషేధించుట లేదో.

పద్మసంభవుడగు బ్రహ్మగారు, ఆయన పుత్రులగు భృగువు నారదుడు మొదలగు వారు, సనత్కుమారుడు, కపిలుడు, మనువు కూడ ధర్మమునెరుగరు గదా! ఏలయనగా, మితిమీరి ప్రవర్తించుచున్న శివుని వారు అడ్డుకొన లేదు.

ఏషామనుధ్యేయపదాబ్జయుగ్మం
జగద్గురుం మంగలమంగలం స్వయమ్ ।
యః క్షత్రబంధుః పరిభూయ సూరీన్
ప్రశాస్తి ధృష్టస్తదయం హి దండ్యః ॥ 13

ఏషామ్ - వీరికి, అనుధ్యేయపద-అబ్జయుగ్మమ్ - నిరంతరముగా ధ్యానించదగిన పాదపద్మముల జంట గలిగినట్టియు, జగద్-గురుమ్ - జగత్తునకు తండ్రి (గురువు) అయినట్టియు, స్వయమ్ - స్వయముగా, మంగలమంగలమ్ - మంగళములకు మంగళమైన శివుని, క్షత్రబంధుః - క్షత్రియాధముడు, ధృష్టః - పొగరుమోతు అగు, యః - ఎవడైతే, సూరీన్ - మహర్షులను, పరిభూయ - తిరస్కరించి, ప్రశాస్తి - శాసించుచున్నాడో, తత్ - అందువలన, అయమ్ - ఈతడు, దండ్యః హి - శిక్షార్హుడు గదా!

వీరందరు జగత్తునకు తండ్రి, గురువు అగు శివుని పద్మముల వంటి పాదముల జంటను నిరంతరముగా ధ్యానించుచుందురు. ఆయన స్వయముగా మంగళములన్నింటికీ మంగళుడు. ఈ క్షత్రియాధముడు, ఈ పొగరుమోతు మహర్షులను త్రోసిపుచ్చి, ఆయనను శాసించుచున్నాడు. కావున, వీనికి శిక్షను వేయవలసినదే.

నాయమర్హతి వైకుంఠపాదమూలోపసర్పణమ్ ।
సంభావితమతిః స్తబ్ధస్సాధుభిః పర్యుపాసితమ్ ॥ 14

సంభావితమతిః - తాను ఉత్తముడననే ధారణ గలవాడు, స్తబ్ధః - గర్విష్ఠి అగు, అయమ్ - ఈతడు, సాధుభిః - సత్పురుషులచే, పర్యుపాసితమ్ - సేవించబడే, వైకుంఠపాదమూల-ఉపసర్పణమ్ - శ్రీహరి పాదముల మూలమును పొందుటను, న అర్హతి - తగదు.

తాను ఉత్తముడనని గర్వించియున్న ఈతడు సత్పురుషులచే సేవించబడే శ్రీహరి పాదముల మూలమును చేరుటకు తగడు.

**అతః పాపీయసీం యోనిమాసురీం యాహి దుర్మతే ।**
**యథేహ భూయో మహతాం న కర్తా పుత్ర కిల్బిషమ్ ।। 15**

దుర్మతే - ఓరీ దుర్బుద్ధీ!, అతః - ఇందువలన, పాపీయసీమ్ - పాపము అధికముగా నుండునట్టియు, ఆసురీమ్ - అసురులకు చెందిన, యోనిమ్ - జన్మను, యాహి - పొందుము, పుత్ర - ఓ కుమారా!, యథా - ఏ విధముగానైతే, ఇహ - ఈ జగత్తునందు, భూయః - మరల, మహతామ్ - మహాత్ములకు, కిల్బిషమ్ - అపరాధమును, న కర్తా - చేయకుందువో.

ఓరీ దుర్బుద్ధీ! కావున, నీవు పాపభూయిష్ఠమగు రాక్షసజన్మను పొందుము. ఓ కుమారా! ఈ శిక్ష వలన నీవీ లోకములో మరల మహాత్ముల యెడల అపరాధమును చేయకుండెదవు.

**శ్రీశుక ఉవాచ ।**
**ఏవం శప్తశ్చిత్రకేతుర్విమానాదవరుహ్య సః ।**
**ప్రసాదయామాస సతీం మూర్ధ్నా నమ్రేణ భారత ।। 16**

భారత - ఓ భరతవంశీయుడా!. ఏవమ్ - ఈ విధముగా, శప్తః - శపించబడిన, సః - ఆ, చిత్రకేతుః - చిత్రకేతువు, విమానాత్ - విమానము నుండి, అవరుహ్య - క్రిందకు దిగి, నమ్రేణ - వినమ్రమైన, మూర్ధ్నా - శిరస్సుతో, సతీమ్ - పార్వతీదేవిని, ప్రసాదయామాస - ప్రసన్నురాలిని చేసుకొనెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- భరతవంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! ఈ విధముగా శాపమును పొందిన ఆ చిత్రకేతువు విమానము నుండి క్రిందకు దిగి, వినమ్రమైన శిరస్సుతో పార్వతీదేవిని ప్రసన్నురాలిని చేసుకొనెను.

చిత్రకేతురువాచ ।
ప్రతిగృహ్ణామి తే శాపమాత్మనోఽంజలినాఽంబికే ।
దేవైర్మర్త్యాయ యత్ప్రోక్తం పూర్వదిష్టం హి తస్య తత్॥17

అంబికే - ఓ జగన్మాతా!, తే - నీ, ఆత్మనః - నాకు, శాపమ్ - శాపమును, అంజలినా - దోసిలితో, ప్రతిగృహ్ణామి - స్వీకరించుచున్నాను, మర్త్యాయ - మానవుని కొరకు, దేవైః - దేవతలచే, యత్ - ఏది, ప్రోక్తమ్ - చెప్పబడినదో, తత్ - అది, తస్య - వానికి, పూర్వదిష్టం హి - ప్రారబ్ధకర్మచే లభించేదియే.

చిత్రకేతువు ఇట్లు పలికెను --- ఓ జగన్మాతా! నీవు నాకిచ్చిన శాపమును నేను దోసిలియొగ్గి (వినయపూర్వకముగా) స్వీకరించుచున్నాను. మానవునకు ప్రారబ్ధకర్మచే లభించే దానికి దేవతలు కేవలము సూచనను చేయువారు మాత్రమే.

సంసారచక్ర ఏతస్మిన్ జంతురజ్ఞానమోహితః ।
భ్రామ్యన్ సుఖం చ దుఃఖం చ భుంక్తే సర్వత్ర సర్వదా ॥18

ఏతస్మిన్ - ఈ, సంసారచక్రే - సంసారమనే చక్రమునందు, అజ్ఞానమోహితః - అజ్ఞానముచే వ్యామోహితుడైన, జంతుః - మానవుడు, భ్రామ్యన్ - తిరుగుచున్నవాడై, సర్వత్ర - అన్ని దేశములయందు, సర్వదా - అన్ని కాలములయందు, సుఖం చ - సుఖమును, దుఃఖం చ - దుఃఖమును కూడ, భుంక్తే - అనుభవించు చున్నాడు.

అజ్ఞానముచే వ్యామోహమును పొందియున్న జీవుడు ఈ సంసార చక్రములో తిరుగుతూ, దేశకాలములన్నింటియందు సుఖదుఃఖముల ననుభవించుచునే యుండును.

నైవాత్మా న పరశ్చాపి కర్తా స్యాత్సుఖదుఃఖయోః ।
కర్తారం మన్యతేఽప్రాజ్ఞ ఆత్మానం పరమేవ చ ॥ 19

సుఖదుఃఖయోః - సుఖదుఃఖములకు, కర్తా - కర్త, ఆత్మా - తాను, న ఏవ - కానే కాదు, పరః చ అపి - మరియొకడైననూ, న - కాదు,

అప్రాజ్ఞః - అజ్ఞాని, ఆత్మానమ్ - తనను, పరం ఏవ చ - ఇతరుని కూడ, కర్తారమ్ - కర్తనుగా, మన్యతే - తలపోయును.

సుఖదుఃఖములనిచ్చేది తన ఆత్మ కాదు; ఇంకొకరు కూడ కాదు. కాని, అజ్ఞాని ఆత్మ గాని, మరియొకరు గాని కర్తయని తలపోయును.

గుణప్రవాహ ఏతస్మిన్ కశ్శాపః కో న్వనుగ్రహః ।
కస్స్వర్గో నరకః కో వా కిం సుఖం దుఃఖమేవ వా ॥ 20

ఏతస్మిన్ - ఈ, గుణప్రవాహే - సత్త్వరజస్తమోగుణముల ప్రవాహమునందు, శాపః - శాపము, కః - ఎట్టిది?, అనుగ్రహః - అనుగ్రహము, కః ను - ఎట్టిది?, స్వర్గః - స్వర్గము, కః -ఎయ్యది?, నరకః - నరకము, కః వా - ఏది?, సుఖమ్ - సుఖము, కిమ్ - ఏది?, దుఃఖం ఏవ - దుఃఖము గాని, వా - ఏది?

ఈ సంసారము సత్త్వరజస్తమోగుణముల ప్రవాహము (మిథ్య) మాత్రమే. దీనిలో శాపమెట్టిది? అనుగ్రహమెట్టిది? స్వర్గమేది? నరకమేది? సుఖమేది? దుఃఖమేది?

ఏకస్సృజతి భూతాని భగవానాత్మమాయయా ।
ఏషాం బంధం చ మోక్షం చ సుఖం దుఃఖం చ నిష్కలః॥21

ఏకః - అద్వితీయుడు, నిష్కలః - శుద్ధుడు అగు, భగవాన్ - భగవానుడు, ఆత్మమాయయా - తన మాయాశక్తిచే, భూతాని - ప్రాణులను, ఏషామ్ - వీటియొక్క, బంధం చ - బంధమును, మోక్షం చ - మోక్షమును కూడ, సుఖమ్ - సుఖమును, దుఃఖం చ - దుఃఖమును కూడ, సృజతి - సృష్టించుచున్నాడు.

అద్వితీయుడు, కర్తృత్వభోక్తృత్వములు లేనివాడు అగు భగవానుడే తన మాయాశక్తిచే ప్రాణులను, వారి వారి బంధమోక్షములను, సుఖదుఃఖములను కూడ సృష్టించుచున్నాడు.

న తస్య కశ్చిద్దయితః ప్రతీపో న జ్ఞాతిబంధుర్న పరో న చ స్వః ।
సమస్య సర్వత్ర నిరంజనస్య సుఖే న రాగః కుత ఏవ రోషః ॥22

సర్వత్ర - అంతటా, సమస్య - సముడైనట్టియు, నిరంజనస్య - రాగద్వేషముల దోషము లేని, తస్య - ఆ భగవానునకు, కశ్చిత్ - ఒకానొకడు, దయితః - ప్రియుడు, న - కాడు, ప్రతీపః - శత్రువు, న - లేడు, జ్ఞాతిబంధుః - జ్ఞాతి బంధువు, న - లేడు, పరః - పరాయి, న - లేడు, స్వః - తన వాడు, న - లేడు, సుఖే - సుఖమునందు, రాగః - ఆసక్తి, న - లేదు, రోషః - కోపము, కుతః ఏవ - ఎక్కడిది?

భగవానుడు సర్వసముడు, రాగద్వేషములు లేనివాడు. ఆయనకు ఒకడు ప్రియుడనియు, మరియొకడు శత్రువనియు, తనవాడు పరాయి వాడు అనియు భేదము ఉండదు. ఆయనకు జ్ఞాతి అని, బంధువు అని ఉండరు. ఆయనకు సుఖమునందు ఆసక్తి లేదు. అట్టి స్థితిలో కోపము ఎక్కడనుండి వచ్చును?

తథాపి తచ్ఛక్తివిసర్గ ఏషాం
సుఖాయ దుఃఖాయ హితాహితాయ ।
బంధాయ మోక్షాయ చ మృత్యుజన్మనోః
శరీరిణాం సంసృతయేఽవకల్పతే ॥ 23

తథాపి - అయినప్పటికి, తత్-శక్తివిసర్గః - ఆయన మాయాశక్తి యొక్క సృష్టి, ఏషామ్ - ఈ, శరీరిణామ్ - దేహధారులకు, సుఖాయ - సుఖము కొరకు, దుఃఖాయ - దుఃఖము కొరకు, హిత-అహితాయ - హితము అహితముల కొరకు, బంధాయ - బంధము కొరకు, మోక్షాయ చ - మోక్షము కొరకు, మృత్యుజన్మనోః - జననమరణముల, సంసృతయే - సంసారము కొరకు, అవకల్పతే - సమర్థమగుచున్నది.

అయినప్పటికీ ఈ జగత్తు రూపముగా ప్రకటమైన ఆయన మాయాశక్తి ఈ దేహధారులకు సుఖదుఃఖములను, మంచి చెడులను, బంధమోక్షములను, జననమరణప్రవాహరూపమగు సంసారమును కల్పించుటకు సమర్థమగుచున్నది.

**అథ ప్రసాదయే న త్వాం శాపమోక్షాయ భామిని ।**
**యన్మన్యసే అసాధూక్తం మమ తత్ క్షమ్యతాం సతి ।। 24**

భామిని - కోపము గలదానా!, సతి - పతివ్రతా!, అథ - కావున, **త్వామ్** - నిన్ను, ప్రసాదయే - ప్రసన్నురాలిని చేయుచున్నాను, శాపమో క్షాయ - శాపమునుండి విముక్తి కొరకు, న - కాదు, మమ - నా, ఉక్తమ్ - మాటను, యత్ - దేనిని, అసాధు - చెడు అని, మన్యసే - తలచెదవో, **తత్** - అది, క్షమ్యతామ్ - క్షమించబడు గాక!

ఓ పతివ్రతా! నీకు కోపము ఎక్కువయే. నేను నిన్ను ప్రసన్నురాలి నిగా చేసుకొనుచున్నాను. కాని, శాపవిముక్తి కొరకు కాదు. నా మాట చెడు అని నీవు తలచితివి. దానిని నీవు క్షమించుము.

శ్రీశుక ఉవాచ ।
ఇతి ప్రసాద్య గిరిశౌ చిత్రకేతురరిందమ ।
జగామ స్వవిమానేన పశ్యతోస్స్మయతోస్తయోః ।। 25

అరిందమ - శత్రువుల నడచిన వాడా!, చిత్రకేతుః - చిత్రకేతువు, ఇతి - ఈ విధముగా, గిరిశౌ - పార్వతీ పరమేశ్వరులను, ప్రసాద్య - ప్రస న్నులుగా చేసుకొని, స్మయతోః - విస్మితులైన, తయోః - వారిద్దరు, పశ్యతోః - చూచుచుండగా, స్వవిమానేన - తన విమానముచే, జగామ - వెళ్లెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- అంతశ్శత్రువులను అణచిన ఓ పరీక్షిన్మహారాజా! కైలాసవాసులగు పార్వతీ పరమేశ్వరులను ఈ విధ ముగా ప్రసన్నము చేసుకొని, వారు విస్మితులై చూచుచుండగా, చిత్రకే తువు తన విమానముపై వెళ్లెను.

**తతస్తు భగవాన్ రుద్రో రుద్రాణీమిదమబ్రవీత్ ।**
**దేవర్షిదైత్యసిద్ధానాం పార్షదానాం చ శృణ్వతామ్ ।। 26**

**తతః** - తరువాత, భగవాన్ రుద్రః తు - రుద్ర భగవానుడైతే, రుద్రాణీమ్ - పార్వతిని ఉద్దేశించి, దేవ-ఋషిదైత్యసిద్ధానామ్ - దేవతలు

మహర్షులు దైత్యులు సిద్ధులు, పార్షదానాం చ - రుద్రుని అనుచరులు కూడ, శృణ్వతామ్ - వినుచుండగా, ఇదమ్ - ఈ మాటను, అబ్రవీత్ - పలికెను.

అపుడు దేవతలు, మహర్షులు, దైత్యులు, సిద్ధులు, రుద్రానుచరులు కూడ వినుచుండగా, రుద్రభగవానుడు పార్వతితో నిట్లనెను.

శ్రీరుద్ర ఉవాచ ।
దృష్టవత్యసి సుశ్రోణి హరేరద్భుతకర్మణః ।
మాహాత్మ్యం భృత్యభృత్యానాం
నిస్స్పృహాణాం మహాత్మనామ్ ॥ 27

సుశ్రోణి - ఓ సుందరీ!, అద్భుతకర్మణః - ఆశ్చర్యమును గొలిపే లీలలు గల, హరేః - శ్రీహరియొక్క, నిస్స్పృహాణామ్ - కామనలు లేనట్టియు, మహాత్మనామ్ - మహాత్ములైన, భృత్యభృత్యానామ్ - సేవకుల సేవకులయొక్క, మాహాత్మ్యమ్ - మహిమను, దృష్టవతీ - చూచినదానవు, అసి - అగుచున్నావు.

శ్రీరుద్ర భగవానుడిట్లు పలికెను --- ఓ సుందరీ! శ్రీహరి లీలలు ఆశ్చర్యకరములు. ఆయన సేవకుల సేవకులు కూడ కామనలు లేని మహాత్ములే. నీవు అట్టి మహాత్ముని మహిమను చూచినావు.

నారాయణపరాస్సర్వే న కుతశ్చన బిభ్యతి ।
స్వర్గాపవర్గనరకేష్వపి తుల్యార్థదర్శినః ॥ 28

నారాయణపరాః - నారాయణుని భక్తులు, సర్వే - అందరు, కుతశ్చన - దేని వలనైననూ, న బిభ్యతి - భయపడరు, స్వర్గ-అపవర్గనరకేషు అపి - స్వర్గము మోక్షము నరకములయందు కూడ, తుల్య-అర్థదర్శినః - సమమగు వస్తువును చూచువారు.

నారాయణుని శరణు పొందిన భక్తులెవరైననూ దేనివలనైననూ భయపడరు. వారికి స్వర్గము, నరకము, మోక్షములయందు కూడ అంతటా సమానముగా పరమార్థతత్త్వమగు భగవానుడే కానవచ్చును.

దేహినాం దేహసంయోగాద్ద్వంద్వానీశ్వరలీలయా ।
సుఖం దుఃఖం మృతిర్జన్మ శాపోఽనుగ్రహ ఏవ చ ॥ 29

దేహినామ్ - ప్రాణులకు, ఈశ్వరలీలయా - ఈశ్వరుని లీలచే, దేహసంయోగాత్ - దేహముతోడి తాదాత్మ్యము వలన, సుఖమ్ - సుఖము, దుఃఖమ్ - దుఃఖము, మృతిః - మరణము, జన్మ - పుట్టుక, శాపః - శాపము, అనుగ్రహః ఏవ చ - అనుగ్రహము కూడ, ద్వంద్వాని - ద్వంద్వములు.

ప్రాణులకు దేహము తోడి తాదాత్మ్యము వలననే, సుఖదుఃఖములు, జన్మమరణములు, శాపానుగ్రహములు మొదలగు ద్వంద్వములు కలుగుచుండును. ఇది అంతా ఈశ్వరుని లీల.

అవివేకకృతః పుంసో హ్యర్థభేద ఇవాత్మని ।
గుణదోషవికల్పశ్చ భిదేవ స్రజి వత్కృతః ॥ 30

పుంసః - వ్యక్తికి, గుణదోషవికల్పః చ - మంచి చెడుల తేడా, ఆత్మని - ఆత్మ చైతన్యమునందు, అర్థభేదః ఇవ - పదార్థముల తేడా వలె, స్రజి వత్ - మాలయందు వలె, అవివేకకృతః - అవివేకముచే చేయబడినది, భిదా ఇవ - భేదము వలె, కృతః - చేయబడినది.

మానవునకు అవివేకముచే మంచి-చెడులు, సుఖదుఃఖముల తేడా కనబడుచుండును. ఇది స్వప్నములో భేదము లేని ఆత్మ చైతన్యమునందు అనేకములగు భేదములు భాసించుట వంటిది. మాలయందు మానవుడు సర్పమును దర్శించినట్లుగానే, అనాత్మయందు ఆత్మను దర్శించును.

వాసుదేవే భగవతి భక్తిముద్వహతాం నృణామ్ ।
జ్ఞానవైరాగ్యవీర్యాణాం నేహ కశ్చిద్వ్యపాశ్రయః ॥ 31

వాసుదేవే భగవతి - వాసుదేవ భగవానునియందు, భక్తిమ్ - భక్తిని, ఉద్వహతామ్ - చేయుచున్నట్టియు, జ్ఞానవైరాగ్యవీర్యాణామ్ - జ్ఞానము వైరాగ్యమే బలముగా కలిగిన, నృణామ్ - మానవులకు, ఇహ -

ఈ లోకమునందు, కశ్చిత్ - ఏదైననూ, వ్యపాశ్రయః - ఆశ్రయించ దగిన ది, న - లేదు.

వాసుదేవ భగవానునియందు భక్తిని చేస్తూ, జ్ఞానవైరాగ్యములే బలముగా గల మానవులకు ఈ లోకములో పని కట్టుకుని ఆశ్రయించ దగి నది ఏదీ లేదు.

నాహం విరించో న కుమారనారదౌ
న బ్రహ్మపుత్రా మునయస్సురేశాః ।
విదామ యస్యేహితమంశకాంశకా
న తత్స్వరూపం పృథగీశమానినః ।। 32

అహమ్ - నేను, విరించః - బ్రహ్మగారు, యస్య - ఏ శ్రీహరియొ క్క, ఈహితమ్ - అభిప్రాయమును (లీలను), తత్-స్వరూపమ్ - ఆయన స్వరూపమును, న విదామ - తెలియకున్నామో, కుమారనారదౌ - సన త్కుమారుడు నారదుడు, న - తెలియకున్నారో, బ్రహ్మపుత్రాః - బ్రహ్మ గారి పుత్రులగు, మునయః - మహర్షులు, అంశక-అంశకాః - అంశయొక్క అంశలైనవారు, పృథగ్-ఈశమానినః - భేదదృష్టిచే తమను ప్రభువులమని తలపోసే, సుర-ఈశాః - లోకపాలకులు, న - తెలియకున్నారు.

ఆ శ్రీహరియొక్క అభిప్రాయమును, లీలను, స్వరూపమును నేను, బ్రహ్మగారు, సనత్కుమారుడు, నారదుడు, బ్రహ్మమానసపుత్రులగు మహర్షులు తెలియకున్నారు. శ్రీహరి అంశయగు బ్రహ్మగారి అంశలైన లోకపాలకులు భేదదృష్టిచే తాము ప్రభువులమని తలపోయుచుందురు. కాని, వారు కూడ ఆయన స్వరూపమును తెలియకున్నారు.

న హ్యస్యాస్తి ప్రియః కశ్చిన్నాప్రియస్స్వః పరోఽపి వా ।
ఆత్మత్వాత్సర్వభూతానాం సర్వభూతప్రియో హరిః ।। 33

అస్య - ఈ ఈశ్వరునకు, ప్రియః - ప్రియమైనవాడు, కశ్చిత్ - ఒకానొకడు, న అస్తి - లేదు, అప్రియః - ప్రియము కానివాడు, స్వః - తన వాడు గాని, పరః అపి వా - పరాయి వాడు గాని, న - లేదు, సర్వభూతా

నామ్ - సర్వప్రాణులకు, ఆత్మత్వాత్ - ఆత్మయై ఉండుట వలన, హరిః - శ్రీహరి, సర్వభూతప్రియః - సకలప్రాణులకు ప్రియమైనవాడు (సకలప్రాణులు ప్రియులైనవాడు).

ఈశ్వరునకు ఒకడు ప్రియుడనియు, మరియొకడు కాదనియు, ఒకడు తనవాడనియు, ఇంకొకడు పరాయి వాడనియు లేదు. సకలప్రాణులకు ఆత్మ శ్రీహరియే గనుక, అందరు శ్రీహరికి ప్రియులే. శ్రీహరి అందరికి ప్రియుడే.

తస్య చాయం మహాభాగశ్చిత్రకేతుః ప్రియోఽనుగః ।
సర్వత్ర సమదృక్ శాంతో హ్యహం చైవాచ్యుతప్రియః ।। 34

మహాభాగః - గొప్ప భాగ్యవంతుడగు, అయమ్ - ఈ, చిత్రకేతుః - చిత్రకేతువు, తస్య - ఆ శ్రీహరియొక్క, ప్రియః - ప్రియమైన, అనుగః - అనుచరుడు, సర్వత్ర - అంతటా, సమదృక్ - సమదర్శనము గలవాడు, శాంతః - శాంత స్వభావము గలవాడు, అహం చ - నేను కూడ, అచ్యుత ప్రియః హి - శ్రీహరికి ప్రియుడనే (శ్రీహరి ప్రియుడుగా గలవాడను).

గొప్ప భాగ్యవంతుడగు ఈ చిత్రకేతువు శ్రీహరికి ప్రియమైన అనుచరుడు. శాంత స్వభావము గల ఈతడు అంతటా సమానముగా పరబ్రహ్మను దర్శించును. నేను కూడ శ్రీహరికి ప్రియుడనే. నాకు కూడ శ్రీహరి ప్రియుడు.

తస్మాన్న విస్మయః కార్యః పురుషేషు మహాత్మసు ।
మహాపురుషభక్తేషు శాంతేషు సమదర్శిషు ।। 35

తస్మాత్ - అందువలన, మహాత్మసు - మహాత్ములైనట్టియు, మహాపురుషభక్తేషు - పురుషోత్తముని భక్తులైనట్టియు, సమదర్శిషు - సమదర్శనము గల, పురుషేషు - వ్యక్తుల యెడల, విస్మయః - గర్వము, న కార్యః - చేయబడరాదు.

కావున మహాత్ములు, పురుషోత్తముని భక్తులు, అంతటా సమానముగా పరబ్రహ్మను దర్శించువారు అగు వ్యక్తుల యెడల గర్వమును ప్రదర్శించరాదు.

శ్రీశుక ఉవాచ ।
ఇతి శ్రుత్వా భగవతశ్శివస్యోమాభిభాషితమ్ ।
బభూవ శాంతధీ రాజన్ దేవీ విగతవిస్మయా ॥ 36

రాజన్ - ఓ మహారాజా!, ఇతి - ఈ విధముగా, భగవతః శివస్య - శివభగవానుని, అభిభాషితమ్ - సంభాషణమును, శ్రుత్వా - విని, ఉమా దేవీ - ఉమాదేవి, విగతవిస్మయా - తొలగిన గర్వము గలదియై, శాంతధీః - ప్రసన్నమగు మనస్సు గలది, బభూవ - ఆయెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! శివభగవానుడు తనతో పలికిన ఈ మాటను వినిన ఉమాదేవికి గర్వము తొలగిపోయి, మనస్సు ప్రసన్నమయ్యెను.

ఇతి భాగవతో దేవ్యాః ప్రతిశప్తుమలంతమః ।
మూర్ధ్నా సంజగృహే శాపమేతావత్సాధులక్షణమ్ ॥ 37

ఇతి - ఈ విధముగా, భాగవతః - భగవద్భక్తుడగు చిత్రకేతువు, దేవ్యాః - ఉమాదేవికి, ప్రతిశప్తుమ్ - తిరిగి శపించుటకు, అలంతమః - మిక్కిలి సమర్థుడే, శాపమ్ - శాపమును, మూర్ధ్నా - శిరస్సుతో, సంజగృహే - స్వీకరించెను, సాధులక్షణమ్ - సత్పురుషుల లక్షణము, ఏతావత్ - ఇంత మాత్రమే.

ఈ విధముగా భగవద్భక్తుడగు చిత్రకేతువు ఉమాదేవికి తిరిగి శాపము నీయగల గొప్ప సామర్థ్యము గలవాడే అయిననూ, ఆమె ఇచ్చిన శాపమును తల వంచి స్వీకరించెను. సత్పురుషుల లక్షణము ఇతరులకు అపకారమును చేయకుండుటయే.

జజ్ఞే త్వష్టుర్దక్షిణాగ్నౌ దానవీం యోనిమాశ్రితః ।
వృత్ర ఇత్యభివిఖ్యాతో జ్ఞానవిజ్ఞానసంయుతః ॥ 38

దానవీం యోనిమ్ - రాక్షసజన్మను, ఆశ్రితః - ఆశ్రయించినవాడై, త్వష్టుః - త్వష్టకు, దక్షిణాగ్నౌ - దక్షిణాగ్నియందు, జజ్ఞే - జన్మించెను, వృత్రః - వృత్రుడు, ఇతి - అని, అభివిఖ్యాతః - అంతటా అధికప్రసిద్ధి గలవాడు, జ్ఞానవిజ్ఞానసంయుతః - జ్ఞానవిజ్ఞానములతో కూడినవాడు.

ఆ చిత్రకేతువే త్వష్టకు దక్షిణాగ్నియందు రాక్షసుడై జన్మించి, వృత్రుడు అని అంతటా గొప్ప ప్రఖ్యాతిని పొందెను. ఆతడు పరోక్షమగు ఆత్మజ్ఞానము మాత్రమే గాక, ఆత్మానుభవము కూడ గలవాడు.

ఏతత్తే సర్వమాఖ్యాతం యన్మాం త్వం పరిపృచ్ఛసి ।
వృత్రస్యాసురజాతేశ్చ కారణం భగవన్మతేః ।। 39

తే - నీ కొరకు, ఏతత్ - ఈ, సర్వమ్ - అంతా, ఆఖ్యాతమ్ - చెప్పబడినది, యత్ - దేనిని, త్వమ్ - నీవు, మామ్ - నన్ను, పరిపృచ్ఛసి - ప్రశ్నించుచున్నావో, అసురజాతేః - రాక్షసుడై పుట్టిన, వృత్రస్య - వృత్రునియొక్క, భగవత్-మతేః - భగవద్భక్తికి, కారణమ్ - కారణము.

రాక్షసుడై పుట్టిన వృత్రునకు భగవంతునియందు భక్తి ఉండుటకు గల కారణమేమని నీవు నన్ను ప్రశ్నించితివి. ఆ విషయమునంతనూ నేను నీకీ విధముగా చెప్పితిని.

ఇతిహాసమిమం పుణ్యం చిత్రకేతోర్మహాత్మనః ।
మాహాత్మ్యం విష్ణుభక్తానాం శ్రుత్వా బంధాద్విముచ్యతే ।।40

మహాత్మనః - మహాత్ముడగు, చిత్రకేతోః - చిత్రకేతువుయొక్క, ఇమమ్ - ఈ, పుణ్యమ్ - పావనమగు, ఇతిహాసమ్ - వృత్తాంతమును, విష్ణుభక్తానామ్ - విష్ణుభక్తులయొక్క, మాహాత్మ్యమ్ - మహిమను, శ్రుత్వా - విని, బంధాత్ - బంధమునుండి, విముచ్యతే - విముక్తుడగును.

మహాత్ముడగు ఈ చిత్రకేతువుయొక్క వృత్తాంతము పావనమైనది. విష్ణుభక్తుల మహిమను విన్నవారికి సంసారబంధమునుండి విముక్తి లభించును.

**యఏతత్ప్రాతరుత్థాయ శ్రద్ధయా వాగ్యతః పఠేత్ ।**
**ఇతిహాసం హరిం స్మృత్వా స యాతి పరమాం గతిమ్ ॥41॥**

**ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే చిత్రకేతోః శాపవర్ణనం నామ సప్తదశోఽధ్యాయః ॥**

యః - ఎవడైతే, ప్రాతః - ఉదయము, ఉత్థాయ - లేచి, వాగ్-యతః - మౌనమును పాటించువాడై, శ్రద్ధయా - శ్రద్ధతో, హరిమ్ - శ్రీహరిని, స్మృత్వా - స్మరించి, ఏతత్ - ఈ, ఇతిహాసమ్ - వృత్తాంతమును, పఠేత్ - పఠించునో, సః - ఆతడు, పరమామ్ - సర్వోత్కృష్టమగు, గతిమ్ - గతిని, యాతి - పొందును.

ఎవడైతే ఉదయమే లేచి మౌనముగా శ్రీహరిని స్మరించి ఈ వృత్తాంతమును శ్రద్ధతో పఠించునో, ఆతడు మోక్షమును పొందును. పురుషార్థములలోకెల్లా మోక్షము శ్రేష్ఠము.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి ఆరవ స్కంధములో
చిత్రకేతువు శాపముచే వృత్రుడై జన్మించుటను వర్ణించే
పదునేడవ అధ్యాయము ముగిసినది (17).

*****

# అథ అష్టాదశోऽధ్యాయః

## మరుద్గణముల జన్మ వృత్తాంతము

శ్రీశుక ఉవాచ ।
పృశ్నిస్తు పత్నీ సవితుస్సావిత్రీం వ్యాహృతిం త్రయీామ్ ।
అగ్నిహోత్రం పశుం సోమం చాతుర్మాస్యం మహామఖాన్ ॥1

సిద్ధిర్భగస్య భార్యాంగ మహిమానం విభుం ప్రభుమ్ ।
ఆశిషం చ వరారోహాం కన్యాం ప్రాసూత సువ్రతామ్ ॥ 2

అంగ - ఓయీ!, సవితుః - సవితయొక్క, పత్నీ - భార్యయగు, పృశ్నిః తు - పృశ్నియైతే, సావిత్రీమ్ - సావిత్రిని, వ్యాహృతిమ్ - వ్యాహృతిని, త్రయీామ్ - త్రయిని, అగ్నిహోత్రమ్ - అగ్నిహోత్రుని, పశుమ్ - పశువును, సోమమ్ - సోముని, చాతుర్మాస్యమ్ - చాతుర్మాస్యుని, మహామఖాన్ - పంచ మహాయజ్ఞములను, భగస్య - భగుని, భార్యా - భార్యయగు, సిద్ధిః - సిద్ధి, మహిమానమ్ - మహిముని, విభుమ్ - విభుని, ప్రభుమ్ - ప్రభుని, వరారోహామ్ - సుందరియైనట్టియు, సువ్రతామ్ - గొప్ప వ్రతనిష్ఠ గల, ఆశిషమ్ - ఆశీస్సు అనే, కన్యాం చ - కన్యను కూడ, ప్రాసూత - కనెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఓ పరీక్షిన్మహారాజా! సవితకు పృశ్ని భార్య. వారికి సావిత్రి (మంత్రమునకు అభిమాని దేవత), వ్యాహృతి (భూః భువః సువః అనే ఉచ్చారణలకు అభిమాని దేవత), త్రయి (వేదమునకు అభిమాని దేవత), అగ్నిహోత్రుడు, పశుయాగము, చాతుర్మాస్యుడు, పంచమహాయజ్ఞములు (వైదికకర్మలకు అభిమాని దేవతలు), సోముడు (ద్రవ్యములకు అభిమాని దేవతలు) సంతానముగా కలిగిరి. భగుని భార్య సిద్ధి.

వారికి మహిముడు, విభుడు, ప్రభుడు అనే పుత్రులు, ఆశీస్సు అనే కన్య కలిగిరి. ఆ కన్య చాల సుందరి మరియు గొప్ప వ్రతనిష్ఠ గలది. (బ్రహ్మయజ్ఞమనే వేదాధ్యయనము, దేవయజ్ఞము, అతిథిపూజ అనే నృయజ్ఞము, పితృయజ్ఞము, పశుపక్ష్యాదులకు ఆహారమునిచ్చుట అనే భూతయజ్ఞము అనునవి పంచ మహాయజ్ఞములు).

ధాతుః కుహూస్సినీవాలీ రాకా చానుమతిస్తథా ।
సాయం దర్శమథ ప్రాతః పూర్ణమాసమనుక్రమాత్ ।। 3

ధాతుః - ధాతకు, కుహూః - కుహు, సినీవాలీ - సినీవాలి, రాకా - రాక, తథా - మరియు, అనుమతిః చ - అనుమతి కూడ, సాయమ్ - సాయమును, దర్శమ్ - దర్శను, అథ - తరువాత, ప్రాతః - ప్రాతఃకాలమును, పూర్ణమాసమ్ - పూర్ణమాసుని, అనుక్రమాత్ - వరుసగా.

ధాతకు కుహు (అమావాస్యకు అభిమానినియగు దేవత), సినీవాలి (కృష్ణ చతుర్దశికి అభిమాని దేవత), రాక (పూర్ణిమ అభిమానిని), అనుమతి (శుక్ల చతుర్దశి) అను భార్యలు గలరు. వారికి వరుసగా సాయంకాలము, దర్శ (అమావాస్య), ప్రాతఃకాలము, పూర్ణమాసుడు అనే పుత్రులు కలిగిరి.

అగ్నీన్ పురీష్యానాధత్త క్రియాయాం సమనంతరః ।
చర్షణీ వరుణస్యాసీద్యస్యాం జాతో భృగుః పునః ।। 4

సమనంతరః - తరువాతివాడగు విధాత, క్రియాయామ్ - క్రియయందు, పురీష్యాన్ - పురీష్యులనే పేరు గల, అగ్నీన్ - అగ్నులను, ఆధత్త - కనెను, వరుణస్య - వరుణునకు, చర్షణీ - చర్షణి, ఆసీత్ - ఉండెను, యస్యామ్ - ఎవతెయందు, భృగుః - భృగువు, పునః - మరల, జాతః - పుట్టెనో.

ధాత తమ్ముడు విధాత. ఆయన భార్య క్రియ. వారికి పురీష్యులు అనే పేరు గల అయిదుగురు అగ్నులు పుత్రులుగా కలిగిరి. వరుణుని భార్య చర్షణి. బ్రహ్మపుత్రుడగు భృగువే మరల వారికి కొడుకై పుట్టెను.

వాల్మీకిశ్చ మహాయోగీ వల్మీకాదభవత్కిల ।
అగస్త్యశ్చ వసిష్ఠశ్చ మిత్రావరుణయోర్ఋషీ ।। 5

మహాయోగీ - గొప్ప యోగియగు, వాల్మీకిః చ - వాల్మీకి కూడ, వల్మీకాత్ - పుట్టనుండి, అభవత్ కిల - పుట్టెను గదా!, ఋషీ - మహర్షుల గు, అగస్త్యః - అగస్త్యుడు, వసిష్ఠః చ - వసిష్ఠుడు కూడ, మిత్రావరుణయోః - మిత్రుడు వరుణుల పుత్రులు.

యోగిపుంగవుడగు వాల్మీకి కూడ వరుణుని పుత్రుడే. ఆయన పుట్ట (వల్మీకము) నుండి పుట్టి వాల్మీకి యైనాడు. అగస్త్యుడు, వసిష్ఠుడు మిత్రుడు వరుణుల పుత్రులు.

రేతస్సిషిచతుః కుంభే ఉర్వశ్యాస్సన్నిధౌ ద్రుతమ్ ।
రేవత్యాం మిత్ర ఉత్సర్గమరిష్టం పిప్పలం వ్యధాత్ ।। 6

ఉర్వశ్యాః - ఊర్వశియొక్క, సన్నిధౌ - సన్నిధియందు, ద్రుతమ్ - జారిన, రేతః - వీర్యమును, కుంభే - కడవయందు, సిషిచతుః - విడిచిరి, రేవత్యామ్ - రేవతియందు, మిత్రః - మిత్రుడు, ఉత్సర్గమ్ - ఉత్సర్గుని, అరిష్టమ్ - అరిష్టుని, పిప్పలమ్ - పిప్పలుని, వ్యధాత్ - కనెను.

మిత్రునకు వరుణునకు ఊర్వశి సన్నిధిలో స్ఖలనమైన రేతస్సును కడవయందు విడిచిరి (ఆ విధముగా అగస్త్యుడు, వసిష్ఠుడు జన్మించిరి). మిత్రునకే రేవతియందు ఉత్సర్గుడు, అరిష్టుడు, పిప్పలుడు అనే పుత్రులు కలిగిరి.

పౌలోమ్యామింద్ర ఆధత్త త్రీన్ పుత్రానితి నశ్శ్రుతమ్ ।
జయంతమృషభం తాత తృతీయం మీఢుషం ప్రభుః ।। 7

తాత - వత్సా!, ప్రభుః - స్వర్గాధిపతియగు, ఇంద్రః - ఇంద్రుడు, పౌలోమ్యామ్ - పులోముని పుత్రికయగు శచీదేవియందు, జయంతమ్ - జయంతుని, ఋషభమ్ - ఋషభుని, తృతీయమ్ - మూడవ వాడగు, మీఢుషమ్ - మీఢ్వానుని, త్రీన్ - ముగ్గురు, పుత్రాన్ - పుత్రులను, ఆధత్త - కనెను, ఇతి - అని, నః - మాకు, శ్రుతమ్ - వినబడినది.

వత్సా! స్వర్గాధిపతియగు ఇంద్రునకు పులోముని కుమార్తెయగు శచీదేవియందు జయంతుడు, ఋషభుడు, మీఢ్వానుడు అనే ముగ్గురు పుత్రులు కలిగిరని నేను వినియుంటిని.

ఉరుక్రమస్య దేవస్య మాయావామనరూపిణః ।
కీర్త్యాం పత్న్యాం బృహచ్ఛ్లోకస్తస్యాసన్ సౌభగాదయః ॥ 8

మాయావామనరూపిణః - కపట వామనరూపమును దాల్చినట్టియు, ఉరుక్రమస్య - పెద్ద అడుగులు వేసిన, దేవస్య - శ్రీహరికి, పత్న్యామ్ - భార్యయగు, కీర్త్యాం - కీర్తియందు, బృహచ్ఛ్లోకః - బృహచ్ఛ్లోకుడు, తస్య - వానికి, సౌభగ-ఆదయః - సౌభగుడు మొదలగు వారలు, ఆసన్ - కలిగిరి.

శ్రీహరి మాయాశక్తిచే వామనుని రూపమును దాల్చి పెద్ద అడుగులతో ముల్లోకములను కొలిచెను. ఆ వామనునకు కీర్తి అనే భార్యయందు బృహచ్ఛ్లోకుడనే పుత్రుడు కలిగెను. ఆ బృహచ్ఛ్లోకునకు సౌభగుడు మొదలగు పుత్రులు కలిగిరి.

తత్కర్మగుణవీర్యాణి కాశ్యపస్య మహాత్మనః ।
పశ్చాద్వక్ష్యామహేఽదిత్యాం యథా వావతతార హ ॥ 9

మహాత్మనః - మహాత్ముడైనట్టియు, కాశ్యపస్య - కశ్యప పుత్రుడగు వామనునియొక్క, తత్-కర్మగుణవీర్యాణి - ఆ ప్రసిద్ధమగు కర్మను గుణములను పరాక్రమమును, పశ్చాత్ - తరువాత, వక్ష్యామహే - చెప్పగలము, అదిత్యామ్ - అదితియందు, యథా వా - ఏ విధముగానైతే, అవతతార హ - అవతరించెనో.

శ్రీహరి కశ్యపునకు అదితియందు పుత్రుడై జన్మించెను. ఆ మహాత్ముడు ఆ అవతారములో చేసిన ప్రసిద్ధమైన కర్మలను, ఆయన గుణములను, పరాక్రమమును నేను తరువాత (8వ స్కంధములో) వర్ణించ గలను.

అథ కశ్యపదాయాదాన్ దైతేయాన్ కీర్తయామి తే ।
యత్ర భాగవతశ్శ్రీమాన్ ప్రహ్లాదో బలిరేవ చ ॥ 10

అథ - తరువాత, కశ్యపదాయాదాన్ - కశ్యపుని పుత్రులను, దైతేయాన్ - దితియందు పుట్టినవారిని, తే - నీ కొరకు, కీర్తయామి - వర్ణించెదను, యత్ర - ఎవరియందైతే, భాగవతః - భగవద్భక్తుడు, శ్రీమాన్ - శోభాయుక్తుడు అగు, ప్రహ్లాదః - ప్రహ్లాదుడు, బలిః ఏవ చ - బలి కూడ గలరో.

తరువాత కశ్యపునకు దితియందు పుట్టినవారి వివరములను నీకు చెప్పెదను. భగవద్భక్తులు, శోభాయుక్తులు అగు ప్రహ్లాదుడు, బలి వారిలోని వారే.

దితేర్ద్వావేవ దాయాదౌ దైత్యదానవవందితౌ ।
హిరణ్యకశిపుర్నామ హిరణ్యాక్షశ్చ కీర్తితౌ ॥ 11

దితేః - దితికి, ద్వౌ ఏవ - ఇద్దరు మాత్రమే, దాయాదౌ - పుత్రులు, దైత్యదానవవందితౌ - దైత్యులచే దానవులచే నమస్కరించ బడువారు, హిరణ్యకశిపుః నామ - హిరణ్యకశిపుడని ప్రసిద్ధి గాంచినవాడు, హిరణ్యాక్షః చ - హిరణ్యాక్షుడు కూడ, కీర్తితౌ - వర్ణించబడినవారు.

దితికి హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు అని ప్రసిద్ధి గాంచిన ఇద్దరు పుత్రులు మాత్రమే కలిగిరి. వారికి దైత్యులు, దానవులు కూడ నమస్కరించెదరు. వారి వృత్తాంతము ఇదివరలో (3వ స్కంధములో) వర్ణించబడినది.

హిరణ్యకశిపోర్భార్యా కయాధుర్నామ దానవీ ।
జంభస్య తనయా దత్తా సుషువే చతురస్సుతాన్ ॥ 12

సంహ్రాదం ప్రాగనుహ్రాదం హ్రాదం ప్రహ్రాదమేవ చ ।
తత్స్వసా సింహికా నామ రాహుం విప్రచితోఽగ్రహీత్ ॥ 13

జంభస్య - జంభుని, తనయా - కుమార్తె, హిరణ్యకశిపోః - హిరణ్యకశిపునకు, దత్తా - ఈయబడినది, భార్యా - భార్య, కయాధుః నామ - కయాధువు అని ప్రసిద్ధి గాంచినది, దానవీ - దనువంశమునకు చెందినది, ప్రాక్ - ముందుగా, సంహ్రాదమ్ - సంహ్రాదుని, అనుహ్రాదమ్ - అనుహ్రాదుని, హ్రాదమ్ - హ్రాదుని, ప్రహ్రాదం ఏవ చ - ప్రహ్రాదుని కూడ, చతురః - నల్గురు, సుతాన్ - కుమారులను, సుషువే - కనెను, తత్-స్వసా - ఆమె

చెల్లెలు, సింహికా నామ - సింహిక యని పేరు బడసినది, విప్రచితః - విప్రచిత్తునుండి, రాహుమ్ - రాహువును, అగ్రహీత్ - కనెను.

జంభుని కుమార్తె కయాధువు దానవవంశమునకు చెందినది. ఆమెను ఆతడు హిరణ్యకశిపునకు ఇచ్చి వివాహము చేసెను. వారికి వరుసగా సంహ్రాదుడు, అనుహ్రాదుడు, హ్రాదుడు, ప్రహ్రాదుడు అనే నలుగురు పుత్రులు కలిగిరి. కయాధువు చెల్లెలు సింహిక యని ప్రసిద్ధి. ఆమె భర్త విప్రచిత్తు. వారికి పుత్రుడు రాహువు.

శిరోఽహరద్యస్య హరిశ్చక్రేణ పిబతోఽమృతమ్ ।
సంహ్రాదస్య కృతిర్భార్యాఽసూత పంచజనం తతః ॥ 14

అమృతమ్ - అమృతమును, పిబతః - త్రాగుచున్న, యస్య - ఎవనియొక్క, శిరః - తలను, హరిః - శ్రీహరి, చక్రేణ - చక్రముతో, అహరత్ - నరికెనో, సంహ్రాదస్య - సంహ్రాదుని, భార్యా - భార్య, కృతిః - కృతి, తతః - వాని వలన, పంచజనమ్ - పంచజనుని, అసూత - కనెను.

ఆ రాహువు అమృతమును త్రావుచుండగా, శ్రీహరి చక్రముతో వాని తలను నరికెను. సంహ్రాదుని భార్య కృతి. వారికి పంచజనుడు అనే పుత్రుడు కలిగెను.

హ్రాదస్య ధమనిర్భార్యాఽసూత వాతాపిమిల్వలమ్ ।
యోఽగస్త్యాయ త్వతిథయే పేచే వాతాపిమిల్వలః ॥ 15

హ్రాదస్య - హ్రాదుని, భార్యా - భార్యయగు, ధమనిః - ధమని, వాతాపిమ్ - వాతాపిని, ఇల్వలమ్ - ఇల్వలుని, అసూత - కనెను, యః - ఏ, ఇల్వలః తు - ఇల్వలుడైతే, అతిథయే - అతిథియగు, అగస్త్యాయ - అగస్త్యుని కొరకు, వాతాపిమ్ - వాతాపిని, పేచే - వండెనో.

హ్రాదునకు భార్యయగు ధమనియందు వాతాపి, ఇల్వలుడు అనే ఇద్దరు కుమారులు కలిగిరి. ఆ ఇల్వలుడే అగస్త్యుడు అతిథిగా వచ్చినప్పుడు వాతాపిని వండి వడ్డించెను.

అనుహ్రాదస్య సూర్మ్యాయాం బాష్కలో మహిషస్తథా ।
విరోచనస్తు ప్రాహ్రాదిర్దేవ్యాస్తస్యాభవద్బలిః ।। 16

అనుహ్రాదస్య - అనుహ్రాదునకు, సూర్మ్యాయామ్ - సూర్మ్యయందు, బాష్కలః - బాష్కలుడు, తథా - మరియు, మహిషః - మహిషుడు, విరోచనః తు - విరోచనుడైతే, ప్రాహ్రాదిః - ప్రహ్రాదుని పుత్రుడు, తస్య - వానికి, దేవ్యాః - దేవి వలన, బలిః - బలి, అభవత్ - కలిగెను.

అనుహ్రాదునకు సూర్మ్యయందు బాష్కలుడు, మహిషుడు కలిగిరి. ప్రహ్రాదుని పుత్రుడు విరోచనుడు. విరోచనునకు దేవి అనే భార్యయందు బలి జన్మించెను.

బాణజ్యేష్ఠం పుత్రశతమశనాయాం తతోఽభవత్ ।
తస్యానుభావస్సుశ్లోక్యః పశ్చాదేవాభిధాస్యతే ।। 17

తతః - ఆ బలి వలన, అశనాయామ్ - అశనయందు, బాణజ్యేష్ఠమ్ - బాణుడు జ్యేష్ఠుడుగా గల, పుత్రశతమ్ - పుత్రుల వంద, అభవత్ - కలిగెను, తస్య - ఆ బలియొక్క, సుశ్లోక్యః - మిక్కిలి కీర్తించదగిన, అనుభావః - ప్రభావము, పశ్చాత్ - తరువాత, అభిధాస్యతే - చెప్పబడ గలదు.

ఆ బలికి అశనయందు వందమంది పుత్రులు పుట్టిరి. వారిలో బాణుడు పెద్దవాడు. మిక్కిలి కీర్తించదగిన బలియొక్క ప్రభావమును గురించి తరువాత (8వ స్కంధము) చెప్పెదను.

బాణ ఆరాధ్య గిరిశం లేభే తద్గణముఖ్యతామ్ ।
యత్పార్శ్వే భగవానాస్తే హ్యద్యాపి పురపాలకః।। 18

బాణః - బాణుడు, గిరిశమ్ - కైలాసవాసియగు శివుని, ఆరాధ్య - పూజించి, తద్-గణముఖ్యతామ్ - ఆయన గణములలో ప్రధానస్థానమును, లేభే - పొందెను, యత్-పార్శ్వే - ఎవని ప్రక్కన, భగవాన్ - శివ భగవానుడు, అద్య అపి - ఈ నాటికి కూడ, పురపాలకః - పురమును పాలించువాడై, ఆస్తే హి - ఉండునో.

బాణుడు కైలాసవాసియగు శివుని ఆరాధించి శివగణములలో ప్రముఖమగు స్థానమును పొందెను. ఈ నాటికి కూడ శివ భగవానుడు ఆతని వద్దనే ఆతని నగరమును రక్షిస్తూ నిలిచి యున్నాడు.

మరుతశ్చ దితేః పుత్రాశ్చత్వారింశన్నవాధికాః ।
త ఆసన్నప్రజాస్సర్వే నీతా ఇంద్రేణ సాత్మతామ్ ।। 19

దితేః - దితియొక్క, చత్వారింశత్ నవ-అధికాః - నలభై తొమ్మిది మంది, పుత్రాః - పుత్రులు, మరుతః - మరుత్తులు, తే - వారు, సర్వే - అందరు, అప్రజాః - సంతానము లేనివారుగా, ఆసన్ - ఉండిరి, ఇంద్రేణ - ఇంద్రునిచే, స-ఆత్మతామ్ - సమానతను, నీతాః - పొందించ బడినారు.

దితికి నలభై తొమ్మిదిమంది మరుత్తులు అనే పుత్రులు కలిగిరి. వారిలో ఎవ్వరికీ సంతానము లేదు. వారికి ఇంద్రుడు తనతో సమానమగు స్థానమునిచ్చెను.

రాజోవాచ ।
కథం త ఆసురం భావమపోహ్యౌత్పత్తికం గురో ।
ఇంద్రేణ ప్రాపితాస్సాత్మ్యం కిం తత్సాధు కృతం హి తైః।।20

గురో - ఓ ఆచార్యా!, తే - వారు, ఔత్పత్తికమ్ - సహజమైన, ఆసురం భావమ్ - అసుర స్వభావమును, అపోహ్య - తొలగింపజేసి, ఇంద్రేణ - ఇంద్రునిచే, సాత్మ్యమ్ - సమానత్వమును, కథమ్ - ఏ విధముగా, ప్రాపితాః - పొందించ బడినారు?, తైః - వారిచే, కృతం - చేయబడిన, సాధు - పుణ్యమైన, తత్ - అది, కిం హి - ఏది?

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- ఓ ఆచార్యా! వారు సహజమైన అసుర స్వభావమును తొలగింప జేసి, ఇంద్రునిచే తనతో సమానత్వమును ఎట్లు పొందించ బడినారు? వారు చేసిన పుణ్యమెట్టిది?

ఇమే శ్రద్దధతే బ్రహ్మన్నృషయో హి మయా సహ ।
పరిజ్ఞానాయ భగవంస్తన్నో వ్యాఖ్యాతుమర్హసి ।। 21

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, ఇమే - ఈ, ఋషయః - మహర్షులు, మయా సహ - నాతో బాటుగా, పరిజ్ఞానాయ - తెలియుట కొరకు, శ్రద్ధధతే హి - శ్రద్ధను కలిగియున్నారు, భగవన్ - ఓ పూజనీయా!, తత్ - దానిని, నః - మా కొరకు, వ్యాఖ్యాతుమ్ - వివరించుటకు, అర్హసి - తగుదువు.

పూజనీయుడవగు ఓ మహర్షీ! నాతో బాటుగా ఈ మహర్షులు కూడ ఆ విషయమును తెలుసుకొనుటకు శ్రద్ధను కలిగియున్నారు. కావున, నీవు మాకా విషయమును వివరించి చెప్పుము.

సూత ఉవాచ ।
తద్విష్ణురాతస్య స బాదరాయణిః
వచో నిశమ్యాదృతమల్పమర్థవత్ ।
సభాజయన్సంనిభృతేన చేతసా
జగాద సత్రాయణ సర్వదర్శనః ।। 22

సత్రాయణ - సత్రయాగము ఆశ్రయముగా గల ఓ శౌనక మహర్షీ!, సర్వదర్శనః - సర్వము తెలిసినవాడు, బాదరాయణిః - బాదరాయణ వ్యాసుని పుత్రుడు అగు, సః - ఆ శుకుడు, విష్ణురాతస్య - పరీక్షిత్తుయొక్క, తత్ - ఆ, ఆదృతమ్ - ఆదరముతో కూడిన, అల్పమ్ - అల్పమైన, అర్థవత్ - అర్థము గల, వచః - మాటను, నిశమ్య - విని, సభాజయన్ - సత్కరించువాడై, సంనిభృతేన - ఆనందముతో నిండిన, చేతసా - మనస్సుతో, జగాద - పలికెను.

సూత మహర్షి ఇట్లు పలికెను --- ఓ శౌనక మహర్షీ! నీకు సత్రయాగము ఆశ్రయముగా నున్నది. బాదరాయణ వ్యాసుని పుత్రుడు, సర్వము తెలిసినవాడు అగు ఆ శుకుడు, పరీక్షిత్తు సాదరముగా పలికిన అర్థవంతమైన ఆ అల్పభాషణమును వినెను. ఆయన మనస్సు ఆనందముతో నిండిపోయెను. ఆయన ఆ ప్రశ్నను ప్రశంసిస్తూ, ఇట్లు పలికెను.

శ్రీశుక ఉవాచ ।
హతపుత్రా దితిశ్శక్రపార్ష్ణిగ్రాహేణ విష్ణునా ।
మన్యునా శోకదీప్తేన జ్వలంతీ పర్యచింతయత్ ।। 23

శక్రపార్ష్ణిగ్రాహేణ - ఇంద్రుని వెనుక సహాయకుడుగా నుండే, విష్ణునా - విష్ణువుచే, హతపుత్రా - సంహరించబడిన పుత్రులు గల, దితిః - దితి, శోకదీప్తేన - శోకముచే ప్రజ్వరిల్ల జేయబడిన, మన్యునా - కోపముతో, జ్వలంతీ - మండుచున్నదై, పర్యచింతయత్ - ఆలోచించెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- విష్ణువు ఇంద్రునకు వెనుక సహాయకుడుగా నుండును. ఆయన ఆ విధముగా దితిపుత్రులగు హిరణ్యకశిపు హిరణ్యాక్షులను సంహరించెను. దానిచే దితి మనస్సులో శోకము కలిగి కోపముతో మండిపడుచుండెను. ఆమె ఇట్లు తలపోయ సాగెను.

కదా ను భ్రాతృహంతారమింద్రియారామముల్బణమ్ ।
అక్లిన్నహృదయం పాపం ఘాతయిత్వా శయే సుఖమ్ ।।24

భ్రాతృహంతారమ్ - సోదరులను చంపినట్టియు, ఇంద్రియ-ఆరామమ్ - ఇంద్రియభోగములయందు రమించునట్టియు, ఉల్బణమ్ - క్రూరుడైనట్టియు, అక్లిన్నహృదయమ్ - కఠినహృదయుడైనట్టియు, పాపమ్ - పాపియగు ఇంద్రుని, ఘాతయిత్వా - చంపించి, కదా - ఎప్పుడు, సుఖమ్ - సుఖముగా, శయే ను - నిద్రించెదనో గదా?

ఇంద్రుడు సోదరులను చంపిన క్రూరుడు. ఇంద్రియభోగములయందు రమించే ఇంద్రుడు కఠినహృదయుడు. నేను ఆ పాపిని చంపించి సుఖముగా నిద్రించే రోజు ఎప్పుడు వచ్చునో గదా?

కృమివిడ్భస్మసంజ్ఞాऽऽసీద్యస్యేశాభిహితస్య చ ।
భూతధ్రుక్తత్కృతే స్వార్థం కిం వేద నిరయో యతః ।। 25

ఈశ-అభిహితస్య - ప్రభువని నిర్దేశించబడిన, యస్య చ - ఏ దేహమునకు, కృమివిడ్-భస్మసంజ్ఞా - క్రిములు మలము బూడిద అనే పేరు, ఆసీత్ - అగునో, తత్-కృతే - అట్టి దేహము కొరకు, భూతధ్రుక్ -

ప్రాణులకు ద్రోహము చేయువాడు, స్వ-అర్థమ్ - తన పురుషార్థమును, వేద కిమ్ - తెలియునా?, యతః - దేని వలన, నిరయః - నరకమో.

ప్రభువు అని ఇతరులచే నిర్దేశించబడిన దేహమే ఒకనాడు క్రిముల ని, మలమని, బూడిదయని పేరును పొందును. అట్టి దేహము కొరకై ప్రాణులకు ద్రోహమును చేయువాడు తన పురుషార్థము తెలిసినవాడేనా? కాదు. అట్లు చేయుట వలన లభించేది నరకము మాత్రమే.

ఆశాపానస్య తస్యేదం ధ్రువమున్నద్ధచేతసః ।
మదశోషక ఇంద్రస్య భూయాద్యేన సుతో హి మే ॥ 26

ఇదమ్ - ఈ దేహమును, ధ్రువమ్ - నిత్యముగా, ఆశాపానస్య - తలపోయునట్టియు, ఉన్నద్ధచేతసః - ఉచ్ఛృంఖలమగు మనస్సు గల, ఇంద్రస్య - ఇంద్రునియొక్క, మదశోషకః - గర్వమునడంచే, సుతః - పుత్రుడు, మే - నాకు, యేన - దేనిచే, భూయాత్ హి - కలుగునో గదా?

ఇంద్రుడు ఈ దేహమే శాశ్వతమని తలపోస్తూ ఉచ్ఛృంఖలమగు ప్రవృత్తి కలిగియున్నాడు. వాని గర్వమునడంచే పుత్రుడు నాకు కలిగే ఉపాయము ఏమై యుండును?

ఇతి భావేన సా భర్తురాచచారాసకృత్ప్రియమ్ ।
శుశ్రూషయానురాగేణ ప్రశ్రయేణ దమేన చ ॥ 27

ఇతి - ఈ విధమైన, భావేన - తలంపుతో, సా - ఆమె, శుశ్రూషయా - సేవచే, అనురాగేణ - ప్రేమచే, ప్రశ్రయేణ - వినయముచే, దమేన చ - ఇంద్రియనిగ్రహముచే, భర్తుః - భర్తకు, అసకృత్ - నిరంతరముగా, ప్రియమ్ - ప్రియమును, ఆచచార - ఆచరించెను.

ఈ విధముగా తలపోసి ఆమె భర్తను ప్రేమతో మరియు వినయముతో సేవించెను. ఆమె ఇంద్రియనిగ్రహము గలదియై భర్తకు నిరంతరముగా ప్రియమునాచరించెను.

భక్త్యా పరమయా రాజన్ మనోజ్ఞైర్వల్గుభాషితైః ।
మనో జగ్రాహ భావజ్ఞా సుస్మితాపాంగవీక్షణైః ।। 28

రాజన్ - ఓ రాజా!, భావజ్ఞా - ఇంగితమునెరింగిన దితి, పరమయా - సర్వోత్తమమగు, భక్త్యా - భక్తితో, మనోజ్ఞైః - మనోహరములగు, వల్గుభాషితైః - మధురసంభాషణలచే, సుస్మిత-అపాంగవీక్షణైః - చక్కని చిరునవ్వుతో కూడిన కడగంటి చూపులతో, మనః - మనస్సును, జగ్రాహ - హరించెను.

ఓ పరీక్షిన్మహారాజా! దితి భర్త ఇంగితమునెరింగి గొప్ప భక్తితో, మధురమగు సంభాషణలతో, చక్కని చిరునవ్వుతో కూడిన కడగంటి చూపులతో కశ్యపుని మనస్సును చూరగొనెను.

ఏవం స్త్రియా జడీభూతో విద్వానపి విదగ్ధయా ।
బాఢమిత్యాహ వివశో న తచ్చిత్రం హి యోషితి ।। 29

ఏవమ్ - ఈ విధముగా, విద్వాన్ అపి - వివేకియే అయిననూ, విదగ్ధయా - తెలివి తేటలు గల, స్త్రియా - స్త్రీచే, జడీభూతః - జడుడుగా చేయబడినవాడై, వివశః - స్వాధీనత తప్పినవాడై, బాఢమ్ - సరే, ఇతి - అని, ఆహ - పలికెను, తత్ - అది, యోషితి - స్త్రీ విషయమునందు, న చిత్రం హి - విచిత్రము కాదు గదా!

కశ్యపుడు వివేకియే. కాని, తెలివి తేటలు గల దితి ఆయనను తన వశము చేసుకొనెను. ఆ విధముగా ఆయన జడుడుగా తయారై ఆమె కోరికకు అంగీకరించెను. అంత పని చేయుట స్త్రీకి విడ్డూరము కాదు.

విలోక్యైకాంతభూతాని భూతాన్యాదౌ ప్రజాపతిః ।
స్త్రియం చక్రే స్వదేహార్ధం యయా పుంసాం మతిర్హృతా।।30

ఆదౌ - సృష్టి ప్రారంభమునందు, ప్రజాపతిః - బ్రహ్మగారు, ఏకాంతభూతాని - ఏకాంతమునందుండే, భూతాని - ప్రాణులను, విలోక్య - చూచి, స్వదేహ-అర్ధమ్ - తన దేహములో సగమును, స్త్రియమ్ - స్త్రీని

గా, చక్రే - చేసెను, యయా - ఏ స్త్రీచే, పుంసామ్ - పురుషుల, మతిః - మనస్సు, హృతా - అపహరించబడినదో.

సృష్టి ప్రారంభములో ప్రాణులు ఏకాంతముగా నుండుటను బ్రహ్మ గారు గమనించి, తన శరీరములో సగమును స్త్రీగా చేసెను. అప్పటినుం డియు స్త్రీ పురుషుని మనస్సును అపహరించుచునే యున్నది.

ఏవం శుశ్రూషితస్తాత భగవాన్ కశ్యపః స్త్రియా ।
ప్రహస్య పరమప్రీతో దితిమాహాఽభినంద్య చ ॥ 31

తాత - వత్సా!, ఏవమ్ - ఈ విధముగా, స్త్రియా - దితిచే, శుశ్రూషితః - సేవ చేయబడిన, భగవాన్ - పూజనీయుడగు, కశ్యపః - కశ్యపుడు, ప్రహస్య - నవ్వి, పరమప్రీతః - మిక్కిలి ప్రీతి గలవాడై, దితిమ్ - దితిని, అభినంద్య చ - అభినందించి, ఆహ - పలికెను.

వత్సా! ఈ విధముగా దితి పూజనీయుడగు కశ్యపునకు సేవ చేయగా, ఆయన చాల సంతోషించెను. ఆయన నవ్వి, ఆమెను అభినందిం చి, ఇట్లు పలికెను.

కశ్యప ఉవాచ ।
వరం వరయ వామోరు ప్రీతస్తేఽహమనిందితే ।
స్త్రియా భర్తరి సుప్రీతే కః కామ ఇహ చాగమః ॥ 32

వామోరు - ఓ సుందరీ!, వరమ్ - వరమును, వరయ - కోరుకొనుము, అనిందితే - దోషము లేనిదానా!, అహమ్ - నేను, తే - నీ కొరకు, ప్రీతః - ప్రీతుడను, భర్తరి - భర్త, సుప్రీతే - చాల ప్రీతుడు కాగా, స్త్రియాః - స్త్రీకి, ఇహ చ - ఈ లోకమునందు కూడ, అగమః - పొందరాని, కామః - భోగ్యవస్తువు, కః - ఏది?

కశ్యపుడిట్లు పలికెను --- ఓ సుందరీ! నీలో దోషము లేదు. నేను నీ విషయములో చాల ప్రీతుడనైనాను. నీవు వరమును కోరుకొనుము. భర్త సంతోషించినప్పుడు స్త్రీకి ఈ లోకములో పొందరానిది ఏది గలదు?

పతిరేవ హి నారీణాం దైవతం పరమం స్మృతమ్ ।
మానసస్సర్వభూతానాం వాసుదేవశ్శ్రియః పతిః ।। 33

నారీణామ్ - స్త్రీలకు, పతిః ఏవ - భర్తయే, పరమమ్ - గొప్ప, దైవతమ్ - దైవమని, స్మృతః హి - చెప్పబడినాడు గదా!, శ్రియః పతిః - లక్ష్మీపతియగు, వాసుదేవః - వాసుదేవుడు, సర్వభూతానామ్ - సకలప్రాణులకు, మానసః - మనస్సునందుండువాడు.

స్త్రీలకు భర్తయే గొప్ప దైవమని స్మృతికారులు చెప్పినారు. లక్ష్మీపతియగు వాసుదేవుడు సకలప్రాణుల హృదయములలో ఆత్మరూపుడై యున్నాడు.

స ఏవ దేవతాలింగైర్నామరూపవికల్పితైః ।
ఇజ్యతే భగవాన్ పుంభిః స్త్రీభిశ్చ పతిరూపధృక్ ।। 34

సః - ఆ, భగవాన్ ఏవ - శ్రీహరి భగవానుడే, పుంభిః - పురుషులచే, నామరూపవికల్పితైః - నామరూపములచే వేర్వేరుగా కల్పించబడిన, దేవతాలింగైః - దేవతామూర్తులుగా, స్త్రీభిః చ - స్త్రీలచే కూడ, పతిరూపధృక్ - భర్త రూపమును దాల్చినవాడుగా, ఇజ్యతే - ఆరాధించబడుచున్నాడు.

మానవులు ఆ శ్రీహరి భగవానునే, నామరూపములచే వేర్వేరుగా కల్పించబడిన దేవతామూర్తుల రూపములో ఆరాధించుచున్నారు. స్త్రీలు భర్త రూపములోనున్న శ్రీహరిని ఆరాధించుచున్నారు.

తస్మాత్పతివ్రతా నార్యశ్శ్రేయస్కామాస్సుమధ్యమే ।
యజంతేऽనన్యభావేన పతిమాత్మానమీశ్వరమ్ ।। 35

సుమధ్యమే - సన్నని నడుము గలదానా!, తస్మాత్ - అందువలన, శ్రేయః-కామాః - హితము (మోక్షము) ను కోరే, పతివ్రతాః - పతివ్రతలైన, నార్యః - స్త్రీలు, అనన్యభావేన - ఏకాంతమగు ప్రేమతో, ఆత్మానమ్ - ఆత్మస్వరూపుడగు, ఈశ్వరమ్ - ఈశ్వరుని, పతిమ్ - భర్తనుగా, యజంతే - కొలిచెదరు.

ఓ సుందరీ! కావుననే, హితము (మోక్షము) ను కోరే స్త్రీలు భర్తృ శుశ్రూషయే వ్రతముగా గలవారై, ఏకాంతమగు ప్రేమతో భర్తను కొలిచెద రు. వారు సర్వప్రాణులలో ఆత్మరూపుడైయున్న శ్రీహరిని భర్తలో దర్శించె దరు.

సోఽహం త్వయార్చితో భద్రే ఈదృగ్భావేన భక్తితః ।
తత్తే సంపాదయే కామమసతీనాం సుదుర్లభమ్ ॥ 36

భద్రే - ఓ కల్యాణీ!, త్వయా - నీచే, ఈదృగ్-భావేన - ఇట్టి ప్రేమతో, భక్తితః - భక్తితో, అర్చితః - పూజించబడిన, సః - అట్టి, అహమ్ - నేను, తత్ - అందువలన, అసతీనామ్ - పతివ్రతలు కానివారికి, దుర్ల భమ్ - పొంద శక్యము కాని, కామమ్ - కోరికను, సంపాదయే - సాధించి పెట్టెదను.

ఓ కల్యాణీ! నీవీ విధముగా నన్ను ఇంతటి ప్రేమతో భక్తిపూర్వక ముగా పూజించితివి. కావున నేను నీ కోరికను తీర్చెదను. పతివ్రతలు కాని స్త్రీలు ఇట్టి స్థితిని పొంద శక్యము కాదు.

దితిరువాచ ।
వరదో యది మే బ్రహ్మన్ పుత్రమింద్రహణం వృణే ।
అమృత్యుం మృతపుత్రాఽహం యేన మే ఘాతితౌ సుతౌ॥37

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, మే - నా కొరకు, వరదః యది - వరమునిచ్చువాడవైతే, మృతపుత్రా - మరణించిన పుత్రులు గల, అహమ్ - నేను, ఇంద్రహణమ్ - ఇంద్రుని చంపునట్టియు, అమృత్యుమ్ - మర ణము లేని, పుత్రమ్ - పుత్రుని, వృణే - కోరుచున్నాను, యేన - ఏ ఇంద్రు నిచే, మే - నా, సుతౌ - ఇద్దరు కొడుకులు, ఘాతితౌ - చంపబడిరో.

దితి ఇట్లు పలికెను --- ఓ మహర్షీ! ఇంద్రుడు నా ఇద్దరు కొడుకు లను చంపించినాడు. అట్టి నేను ఇంద్రుని చంపే కొడుకును వరముగా కోరుచున్నాను. నా కొడుకునకు చావు ఉండరాదు. నీవు వరమునిచ్చేవాడ వైతే, ఆ వరమునిమ్ము.

నిశమ్య తద్వచో విప్రో విమనాః పర్యతప్యత ।
అహో అధర్మస్సుమహానద్య మే సముపస్థితః ॥ 38

విప్రః - వేదవేత్త, తత్ - ఆ, వచః - మాటను, నిశమ్య - విని, విమనాః - చెడిన మనస్సు గలవాడై, పర్యతప్యత - సంతాపమును పొందెను, అహో - అయ్యో!, అద్య - ఈనాడు, మే - నాకు, సుమహాన్ - చాల పెద్ద, అధర్మః - అధర్మము, సముపస్థితః - వచ్చి పడినది.

వేదవేత్తయగు ఆ మహర్షి ఆ మాటను వినగానే మనస్సు చెడి, అయ్యో! ఈనాడు నాకు చాల పెద్ద అధర్మము వచ్చిపడినది అంటూ, చాల సంతాపమును పొందెను.

అహో అద్యేంద్రియారామో యోషిన్మయ్యేహ మాయయా ।
గృహీతచేతాః కృపణః పతిష్యే నరకే ధ్రువమ్ ॥ 39

అహో - అయ్యో!, ఇంద్రియ-ఆరామః - ఇంద్రియములయందు భోగించునట్టియు, ఇహ - ఇప్పుడు, యోషిత్-మయ్యా - స్త్రీరూపములో నున్న, మాయయా - మాయచే, గృహీతచేతాః - వశీకృతమైన మనస్సు గలవాడను, కృపణః - దీనుడను అగు నేను, అద్య - శీఘ్రముగా, నరకే - నరకమునందు, ధ్రువమ్ - నిశ్చయముగా, పతిష్యే - పడగలను.

అయ్యో! ఈనాడు స్త్రీరూపములోనున్న మాయ నా మనస్సును వశము చేసుకున్నది. ఇంద్రియభోగములయందు రమిస్తూ దీనుడనై యున్న నేను శీఘ్రముగా నరకములో పడెదను.

కోఽతిక్రమోఽనువర్తంత్యాస్స్వభావమిహ యోషితః ।
ధిఙ్మాం బతాబుధం స్వార్థే యదహం త్వజితేంద్రియః ॥40

ఇహ - ఈ సందర్భమునందు, స్వభావమ్ - స్వభావమును, అను వర్తంత్యాః - అనుసరించుచున్న, యోషితః - స్త్రీయొక్క, అతిక్రమః - అపరాధము, కః - ఏది?, స్వ-అర్థే - నా పురుషార్థము విషయమునందు, అబుధమ్ - వివేకము లేని, మామ్ - నన్ను గురించి, ధిక్ - నింద యగు

గాక!, యత్ - ఏలయనగా, అహం తు - నేనైతే, అజిత-ఇంద్రియః - జయించబడని ఇంద్రియములు గలవాడను, బత - కష్టము!

ఈ విషయములో ఈమె స్త్రీస్వభావమునే అనుసరించినది. దానిలో ఆమె తప్పు ఏమి గలదు? అవివేకినగు నేనే పురుషార్థమును విస్మరించితిని. అయ్యో! ఇంద్రియజయము లేని నేను నిందార్హుడను.

శరత్పద్మోత్సవం వక్త్రం వచశ్చ శ్రవణామృతమ్ ।
హృదయం క్షురధారాభం స్త్రీణాం కో వేద చేష్టితమ్ ॥ 41

వక్త్రమ్ - ముఖము, శరత్-పద్మ-ఉత్సవమ్ - శరత్కాలమునందలి పద్మముయొక్క వికాసము గలది, వచః చ - మాట కూడ, శ్రవణ-అమృతమ్ - చెవులకు అమృతము, హృదయమ్ - హృదయము, క్షురధార-ఆభమ్ - కత్తి పదనును పోలినది, స్త్రీణామ్ - స్త్రీలయొక్క, చేష్టితమ్ - చేష్టను, కః - ఎవడు, వేద - తెలియును?

స్త్రీల ముఖము శరత్కాలపద్మమువలె వికసించి యుండును. వారి మాట చెవులకు అమృతమే. కాని, వారి హృదయము వాడియైన కత్తియొక్క పదను గలది. వారు చేయబోయే పనిని ఎవడు తెలియగలడు?

న హి కశ్చిత్ప్రియః స్త్రీణామంజసా స్వాశిషాత్మనామ్ ।
పతిం పుత్రం భ్రాతరం వా ఘ్నంత్యర్థే ఘాతయంతి చ ॥42

స్వ-ఆశిష-ఆత్మనామ్ - తమ కోరికలే తమకు ప్రియముగా గల, స్త్రీణామ్ - స్త్రీలకు, కశ్చిత్ - ఎవడైననూ, అంజసా - సాక్షాత్తుగా, ప్రియః - ప్రియుడు, న హి - లేడు సుమా!, పతిమ్ - భర్తను, పుత్రమ్ - కొడుకును, భ్రాతరం వా - సోదరుని గాని, అర్థే - ప్రయోజనము సందర్భమునందు, ఘ్నంతి - చంపెదరు, ఘాతయంతి చ - చంపించెదరు కూడ.

తమ కోరికలే తమకు ప్రియమైన స్త్రీలకు సాక్షాత్తుగా ప్రియమైనవాడు ఎవ్వడూ లేడు. వారు తమ కోరిక తీరుటకై భర్తను గాని, కొడుకును గాని, సోదరుని గాని చంపెదరు; లేదా, చంపించెదరు.

ప్రతిశ్రుతం దదామీతి వచస్తన్న మృషా భవేత్ ।
వధం నార్హతి చేంద్రోఽపి తత్రేదముపకల్పతే ॥ 43

దదామి - ఇచ్చెదను, ఇతి - అని, ప్రతిశ్రుతమ్ - ప్రతిజ్ఞ చేయబడిన, తత్ - ఆ, వచః - మాట, మృషా - వ్యర్థము, న భవేత్ - కారాదు, ఇంద్రః అపి చ - ఇంద్రుడైననూ కూడ, వధమ్ - వధను, న అర్హతి - తగదు, తత్ర - దాని విషయమునందు, ఇదమ్ - ఇది, ఉపకల్పతే - యోగ్యముగా నుండును.

ఇచ్చెదనని ప్రతిజ్ఞ చేసి, దానిని వమ్ము చేయుట తగదు. ఇంద్రుడైననూ వధించబడుటకు తగినవాడు కాదు. ఈ విషయములో ఇది యోగ్యముగా నుండును.

ఇతి సంచింత్య భగవాన్ మారీచః కురునందన ।
ఉవాచ కించిత్ కుపిత ఆత్మానం చ విగర్హయన్ ॥ 44

కురునందన - కురువంశీయుడా!, భగవాన్ - పూజనీయుడు, కించిత్ - కొంచెము, కుపితః - కోపించినవాడు, మారీచః - మరీచుని పుత్రుడు అగు కశ్యపుడు, ఆత్మానం చ - తనను కూడ, విగర్హయన్ - నిందించుకొనుచున్నవాడై, ఇతి - ఈ విధముగా, సంచింత్య - చక్కని ఆలోచన చేసి, ఉవాచ - పలికెను.

కురువంశీయుడవగు ఓ పరీక్షిన్మహారాజా! పూజనీయుడు, మరీచి పుత్రుడు అగు కశ్యపునకు కొంత కోపము కలిగెను. ఆయన తనను తాను నిందించుకుంటూనే చక్కని ఆలోచన చేసి, ఇట్లు పలికెను.

కశ్యప ఉవాచ ।
పుత్రస్తే భవితా భద్రే ఇంద్రహా దేవబాంధవః ।
సంవత్సరం వ్రతమిదం యద్యంజో ధారయిష్యసి ॥ 45

భద్రే - ఓ కల్యాణీ!, సంవత్సరమ్ - సంవత్సర కాలము, ఇదమ్ - ఈ, వ్రతమ్ - వ్రతమును, అంజః - యథాతథముగా, ధారయిష్యసి యది - ధారణ చేయబోయే పక్షములో, తే - నీకు, ఇంద్రహా - ఇంద్రుని

చంపువాడు, దేవబాంధవః - దేవతలకు మిత్రుడు అగు, పుత్రః - పుత్రుడు, భవితా - కలుగగలడు.

కశ్యపుడిట్లు పలికెను --- ఓ కల్యాణీ! నేను చెప్పే ఈ వ్రతమును నీవు యథాతథముగా ఒక సంవత్సర కాలము ధారణ చేసే పక్షములో, దేవ తలకు మిత్రుడై ఇంద్రుని చంపే కొడుకు నీకు పుట్టగలడు.

దితిరువాచ ।
ధారయిష్యే వ్రతం బ్రహ్మన్ బ్రూహి కార్యాణి యాని మే ।
యాని చేహ నిషిద్ధాని న వ్రతం ఘ్నంతి యాని తు ।। 46

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, వ్రతమ్ - వ్రతమును, ధారయిష్యే - ధారణ చేసెదను, మే - నాకు, యాని - ఏవి, కార్యాణి - చేయదగినవో, ఇహ - ఈ వ్రతమునందు, యాని చ - ఏవి, నిషిద్ధాని - చేయకూడనివో, యాని - ఏవి, వ్రతమ్ - వ్రతమును, న ఘ్నంతి - చెడగొట్టవో వాటిని, బ్రూహి - చెప్పుము.

దితి ఇట్లు పలికెను --- ఓ మహర్షీ! నేను వ్రతమును ధారణ చేసె దను. ఈ వ్రతములో నేను పాటించవలసిన నియమములేవి? నేను చేయ కూడని పనులు ఏవి? నేను ఏ పనులను చేసిననూ వ్రతము చెడకుండును? ఈ వివరములను చెప్పుము.

కశ్యప ఉవాచ ।
న హింస్యాద్భూతజాతాని న శపేన్నానృతం వదేత్ ।
న ఛింద్యాన్నఖరోమాణి న స్పృశేద్యదమంగలమ్ ।। 47

భూతజాతాని - ప్రాణి సమూహములను, న హింస్యాత్ - హింసించరాదు, న శపేత్ - తిట్టరాదు, అనృతమ్ - అసత్యమును, న వదేత్ - పలుకరాదు, నఖరోమాణి - గోళ్లను జుట్టును, న ఛింద్యాత్ - కత్తిరించ రాదు, యత్ - ఏది, అమంగలమ్ - అపవిత్రమో దానిని, న స్పృశేత్ - స్పృశించరాదు.

కశ్యపుడిట్లు పలికెను --- ప్రాణులను వేటినీ హింసించరాదు. తిట్లను ఉచ్చరించరాదు. అసత్యమును పలుకరాదు. గోళ్లను, జుట్టును కత్తిరించుకొనరాదు. అపవిత్రమగు వస్తువును ముట్టరాదు.

నాప్సు స్నాయాన్న కుప్యేత న సంభాషేత దుర్జనైః ।
న వసీతాధౌతవాసస్స్రజం చ విధృతాం క్వచిత్ ॥ 48

అప్సు - నీళ్ల లోపల, న స్నాయాత్ - స్నానమాడరాదు, న కుప్యేత - కోపించరాదు, దుర్జనైః - దుష్టులతో, న సంభాషేత - మాటలాడరాదు, క్వచిత్ - ఏ కాలమునందైననూ, అధౌతవాసః - ఉతకని వస్త్రమును, విధృతామ్ - పెట్టుకున్న, స్రజం చ - మాలను కూడ, న వసీత - ధరించరాదు.

నీళ్లను మీద పోసుకోవాలి; నీళ్లలో దిగి స్నానము చేయరాదు. కోపించరాదు; దుష్టులతో మాటలాడరాదు. ఉతకని వస్త్రమును ధరించరాదు. ఏ కాలమునందైనా ఒకసారి పెట్టుకున్న మాలను మరల పెట్టుకోరాదు.

నోచ్ఛిష్టం చండికాన్నం చ సామిషం వృషలాహృతమ్ ।
భుంజీతోదక్యయా దృష్టం పిబేదంజలినా త్వపః ॥ 49

ఉచ్ఛిష్టమ్ - తినగా మిగిలినదానిని, చండికా-అన్నం చ - చీమలు పట్టిన అన్నమును, స-ఆమిషమ్ - మాంసము గల అన్నమును, వృషల-ఆహృతమ్ - ధర్మదూరునిచే తీసుకురాబడిన (సంపాదించబడిన) అన్నమును, ఉదక్యయా - రజస్వలచే, దృష్టమ్ - చూడబడినదానిని, న భుంజీత - తినరాదు, అపః తు - నీటినైతే, అంజలినా - దోసిలితో, న పిబేత్ - త్రాగరాదు.

ఇతరులు తినగా మిగిలినది, చీమలు పట్టినది, మాంసము గలది, అధర్మాచరణము గలవాడు సంపాదించినది (తీసుకు వచ్చినది), లేశమైననూ రజస్వలయొక్క సంపర్కము గలది అగు అన్నమును తినరాదు. నీటినైతే దోసిలితో త్రాగరాదు.

నోచ్ఛిష్టాఽస్ప్రుష్టసలిలా సంధ్యాయాం ముక్తమూర్ధజా ।
అనర్చితాసంయతవాజ్ నాసంవీతా బహిశ్చరేత్ ॥ 50

ఉచ్ఛిష్టా - స్నానము లేనిది, అస్ప్రుష్టసలిలా - కడుగుకోని చేతులు కాళ్లు గలది, సంధ్యాయామ్ - సంధ్యాకాలమునందు, ముక్తమూర్ధజా - జుట్టు విరబోసుకున్నది, అనర్చితా - అలంకారములు లేనిది, అసంయతవాక్ - నియంత్రణ లేని మాటలు గలది, అసంవీతా - కప్పుకోనిది, బహిః - బయట, న చరేత్ - తిరుగరాదు.

స్నానము చేయకుండా గాని, ముఖము చేతులు కాళ్లు కడుగుకోకుండా గాని, సంధ్యాకాలమునందు గాని, జుట్టు విరబోసుకొని గాని, బొట్టు మొదలగు అలంకారములు లేకుండా గాని, వంటినిండా వస్త్రమును కప్పుకోకుండా గాని బయట తిరుగ రాదు; హద్దు లేకుండా మాటలాడ రాదు.

నాధౌతపాదాఽప్రయతా నార్ద్రపాన్నో ఉదక్శిరాః ।
శయీత నాపరాజ్ నాన్యైర్న నగ్నా న చ సంధ్యయోః ॥ 51

అధౌతపాదా - కడుగుకొనబడని కాళ్లు గలదియై, అప్రయతా - శుచి లేనిదై, న శయీత - పరుండరాదు, ఆర్ద్రపాత్ - తడి కాళ్లు గలదియై, న - పరుండరాదు, ఉదక్-శిరాః - ఉత్తరము వైపు తల గలదియై, నో - పరుండరాదు, అపరాక్ - పడమర వైపు తల గలదియై, న - పరుండరాదు, అన్యైః - ఇతరులతో గూడి, న - పరుండరాదు, నగ్నా - నగ్నయై, న - పరుండరాదు, సంధ్యయోః చ - రెండు సంధ్యలయందు కూడ, న - పరుండరాదు.

కాళ్లను కడుగుకోకుండా, అశుచిగా, తడి కాళ్లతో పరుండరాదు. ఉత్తరము వైపు గాని, పడమర వైపు గాని తల పెట్టి పరుండరాదు. ఇతరులతో కలిసి గాని, నగ్నముగా గాని పరుండరాదు. రెండు సంధ్యలలో కూడ పరుండరాదు.

ధౌతవాసాశ్శుచిర్నిత్యం సర్వమంగలసంయుతా ।
పూజయేత్ప్రాతరాశాత్ప్రాగ్గోవిప్రాన్ శ్రియమచ్యుతమ్ ॥52

నిత్యమ్ - అన్ని వేళలా, ధౌతవాసాః - ఉతికిన వస్త్రము గలది, శుచిః - శుచిగా నున్నది, సర్వమంగలసంయుతా - అన్ని సౌభాగ్యచిహ్నములు గలది, ప్రాతః-అశాత్ - ఉదయము ఆహారమును తినుటకు, ప్రాక్ - ముందుగా, గోవిప్రాన్ - గోవులను వేదవేత్తలను, శ్రియమ్ - లక్ష్మీదేవిని, అచ్యుతమ్ - శ్రీహరిని, పూజయేత్ - పూజించవలెను.

అన్ని వేళలా ఉతికిన వస్త్రమును ధరించి, బొట్టు మొదలగు మంగళచిహ్నములనన్నిటిని పెట్టుకొని శుచిగా ఉండవలెను. ఉదయమే ఫలహారమును చేయుటకు ముందే గోవులను, వేదవేత్తలను, లక్ష్మీదేవిని, శ్రీహరిని పూజించవలెను.

స్త్రియో వీరవతీశ్చార్చేత్స్రగ్గంధబలిమండనైః ।
పతిం చార్చ్యోపతిష్ఠేత ధ్యాయేత్కోష్ఠగతం చ తమ్ ॥ 53

వీరవతీః - సువాసినులగు, స్త్రియః చ - స్త్రీలను కూడ, స్రగ్-గంధబలిమండనైః - పుష్పమాలలు గంధము ఆహారము అలంకారములతో, అర్చేత్ - పూజించవలెను, పతిం చ - భర్తను కూడ, అర్చ్య - అన్ని విధములుగా పూజించి, ఉపతిష్ఠేత - స్తుతించవలెను, తం చ - ఆ భర్తను, కోష్ఠగతమ్ - ఉదరమునందున్న వానినిగా, ధ్యాయేత్ - ధ్యానించవలెను.

సువాసినీ స్త్రీలకు పుష్పమాలలను, గంధమును, ఆహారమును, అలంకారములను సమర్పించి పూజించవలెను. భర్తకు కూడ అన్ని విధములుగా సేవ చేసి స్తుతించవలెను. భర్తయొక్క తేజస్సు తన కడుపులో నున్నట్లుగా భావన చేయవలెను.

సాంవత్సరం పుంసవనం వ్రతమేతదవిప్లుతమ్ ।
ధారయిష్యసి చేత్తుభ్యం శక్రహా భవితా సుతః ॥ 54

సాంవత్సరమ్ - సంవత్సరము చేయదగినట్టియు, పుంసవనమ్ - పుత్రసంతానమునిచ్చే (పుంసవనము అనే), ఏతత్ - ఈ, వ్రతమ్ - వ్రతమును, అవిప్లుతమ్ - నిర్విఘ్నముగా, ధారయిష్యసి చేత్ - ధరించగలిగిన

చో, తుభ్యమ్ - నీ కొరకు, శక్రహా - ఇంద్రుని చంపే, సుతః - కొడుకు, భవితా - కలుగగలడు.

పుత్రసంతానమునిచ్చే (పుంసవనము అనే) ఈ వ్రతమును సంవత్సర కాలము నీవు నిర్విఘ్నముగా ధరించినచో, నీకు ఇంద్రుని చంపే కొడుకు పుట్టగలడు.

బాఢమిత్యభిప్రేత్యాథ దితీ రాజన్ మహామనాః ।
కాశ్యపం గర్భమాధత్త వ్రతం చాంజో దధార సా ॥ 55

రాజన్ - ఓ మహారాజా!, బాఢమ్ - సరే, ఇతి - అని, అభిప్రేత్య - అంగీకరించి, మహామనాః - గొప్ప సంకల్పశక్తి గల, సా - ఆ, దితిః - దితి, కాశ్యపమ్ - కశ్యపునకు చెందిన, గర్భమ్ - గర్భమును, ఆధత్త - ధరించెను, వ్రతం చ - వ్రతమును కూడ, అంజః - చెప్పినది చెప్పినట్లుగా (వెంటనే), దధార - ధారణ చేసెను.

ఓ పరీక్షిన్మహారాజా! దితి గొప్ప సంకల్పశక్తి గలది. ఆమె భర్త చెప్పిన మాటను సరే అని అంగీకరించెను. ఆమె తన గర్భములో కశ్యపుని తేజస్సును ధరిస్తూ, వ్రతమును యథాతథముగా వెంటనే ఆచరించెను.

మాతృష్వసురభిప్రాయమింద్ర ఆజ్ఞాయ మానద ।
శుశ్రూషణేనాశ్రమస్థాం దితిం పర్యచరత్కవిః ॥ 56

మానద - మర్యాద నిచ్చువాడా!, కవిః - తెలివైనవాడగు, ఇంద్రః - ఇంద్రుడు, మాతృష్వసుః - పినతల్లియొక్క, అభిప్రాయమ్ - అభిప్రాయమును, ఆజ్ఞాయ - తెలుసుకొని, ఆశ్రమస్థామ్ - ఆశ్రమమునందున్న, దితిమ్ - దితిని, శుశ్రూషణేన - సేవచే, పరి-అచరత్ - చుట్టూ తిరిగెను (పరిచర్య చేసెను).

మర్యాదనిచ్చే ఓ పరీక్షిన్మహారాజా! ఇంద్రుడు తెలివైనవాడు. తన పినతల్లి అభిప్రాయమును ఆయన తెలుసుకొనెను. ఆమె వ్రతము కొరకై ఆశ్రమములోనుండగా, ఆతడు ఆమెకు నిరంతరముగా సేవ చేస్తూ, ఆమె వద్దనే కనిపెట్టుకొని ఉండెను.

నిత్యం వనాత్సుమనసః ఫలమూలసమిత్కుశాన్ ।
పత్రాంకురమృదోఽపశ్చ కాలే కాల ఉపాహరత్ ॥ 57

నిత్యమ్ - ప్రతిదినము, కాలే కాలే - ఆయా సమయములయందు, వనాత్ - అడవినుండి, సుమనసః - పువ్వులను, ఫలమూలసమిత్-కుశాన్ - పళ్లు దుంపలు సమిధలు దర్భలను, పత్ర-అంకురమృదః - ఆకులు చిగుళ్లు మట్టి అనువాటిని, అపః చ - నీటిని కూడ, ఉపాహరత్ - తీసుకు వచ్చెను.

ఆతడు ప్రతిదినము ఆయా సమయములయందు అడవినుండి పువ్వులు, పళ్లు, దుంపలు, సమిధలు, దర్భలు, ఆకులు, చిగుళ్లు, మట్టి, నీరు అనువాటిని తీసుకు వచ్చి సమర్పించెడి వాడు.

ఏవం తస్యా వ్రతస్థాయా వ్రతచ్ఛిద్రం హరిర్నృప ।
ప్రేప్సుః పర్యచరజ్జిహ్మో మృగహేవ మృగాకృతిః ॥ 58

నృప - మహారాజా!, ఏవమ్ - ఈ విధముగా, జిహ్మః - కుటిలుడగు, హరిః - ఇంద్రుడు, మృగ-ఆకృతిః - లేడి ఆకారములోనున్న, మృగహా ఇవ - మృగమును చంపే కిరాతుడు వలె, వ్రతస్థాయాః - వ్రతమునందున్న, తస్యాః - ఆమెయొక్క, వ్రతచ్ఛిద్రమ్ - వ్రతములోని లోపమును, ప్రేప్సుః - పొంద గోరువాడై, పర్యచరత్ - పరిచర్య చేసెను.

ఓ పరీక్షిన్మహారాజా! లేడిని చంపగోరి కిరాతుడు లేడి వేషములో తిరుగాడిన తీరున, కుటిలుడగు ఇంద్రుడు వ్రతనిష్ఠయందున్న దితియొక్క వ్రతములో లోపమును వెదికి పట్టుగొన కోరికతో, ఆమెకు పరిచర్య చేస్తూ, ఆమె వద్దనే కనిపెట్టుకొని యుండెను.

నాభ్యగచ్ఛద్వ్రతచ్ఛిద్రం తత్పరోఽథ మహీపతే ।
చింతాం తీవ్రాం గతశ్శక్రః కేన మే స్యాచ్ఛివం త్విహ ॥ 59

మహీపతే - ఓ మహారాజా!, అథ - తరువాత, తత్-పరః - వ్రతమునందలి లోపమే పరమలక్ష్యముగా గల, శక్రః - ఇంద్రుడు, వ్రతచ్ఛిద్రమ్ - వ్రతమునందలి లోపమును, న అభ్యగచ్ఛత్ - పొందలేక పోయెను,

తీవ్రామ్ - తీవ్రమైన, చింతామ్ - దుఃఖమును, గతః - పొందినవాడు, మే - నాకు, ఇహ తు - ఇక్కడనైతే, శివమ్ - కల్యాణము, కేన - దేనిచే, స్యాత్ - కలుగును?

ఓ పరీక్షిన్మహారాజా! దితియొక్క వ్రతములో లోపమును పట్టుకొనుటయే ఇంద్రుని పరమలక్ష్యము. కాని, ఆతనికి అట్టి లోపమేదీ దొరకలేదు. నాకిక్కడ కల్యాణము కలిగే ఉపాయమేది? అంటూ ఆయన తీవ్రమగు చింతను పొందెను.

ఏకదా సా తు సంధ్యాయాముచ్ఛిష్టా వ్రతకర్శితా ।
అస్పృష్టవార్యధౌతాంఘ్రిస్సుష్వాప విధిమోహితా ॥ 60

ఏకదా తు - ఒకనాడైతే, వ్రతకర్శితా - వ్రతముచే కృశించియున్న, సా - ఆ దితి, విధిమోహితా - విధిచే వ్యామోహమును పొందించబడినదై, ఉచ్ఛిష్టా - ఎంగిలి నోరు గలది, అస్పృష్టవారి-అధౌత-అంఘ్రిః - స్పృశించబడని నీరు గలది కడుగుకొనబడని పాదములు గలదియై, సంధ్యాయామ్ - సంధ్యాకాలమునందు, సుష్వాప - నిద్రించెను.

ఒకనాడు వ్రతముచే చిక్కియున్న ఆ దితి అన్నము తిని నోరు, చేతులు, కాళ్లు కడుగుకోకుండా, సంధ్యాకాలములో నిద్రించెను. ప్రారబ్ధమే ఆమెకు అట్టి మోహమును కలిగించినది.

లబ్ధ్వా తదంతరం శక్రో నిద్రాఽపహృతచేతసః ।
దితేః ప్రవిష్ట ఉదరం యోగేశో యోగమాయయా ॥ 61

తత్ - ఆ, అంతరమ్ - సందును, లబ్ధ్వా - పొంది, యోగ-ఈశః - యోగశక్తులచే సమర్థుడైన, శక్రః - ఇంద్రుడు, నిద్రా-అపహృతచేతసః - నిద్రచే అపహరించబడిన తెలివి గల, దితేః - దితియొక్క, ఉదరమ్ - ఉదరమును, యోగమాయయా - యోగశక్తిచే, ప్రవిష్టః - ప్రవేశించినవాడు.

దితి నిద్రించి తెలివిని కోల్పోయి ఉండెను. యోగశక్తులలో సమర్థుడైన ఇంద్రుడు ఆ సందు చూచుకొని, యోగశక్తిచే ఆమె ఉదరములో ప్రవేశించెను.

చకర్త సప్తధా గర్భం వజ్రేణ కనకప్రభమ్ ।
రుదంతం సప్తధైకైకం మా రోదీరితి తాన్ పునః ॥ 62

కనకప్రభమ్ - బంగరు కాంతి గల, గర్భమ్ - గర్భమును, వజ్రేణ - వజ్రముతో, సప్తధా - ఏడు ముక్కలుగా, చకర్త - కోసివేసెను, రుదంతమ్ - ఏడ్చుచున్న, ఏక-ఏకమ్ - ఒక్కొక్కదానిని, పునః - మరల, మా రోదీః - ఏడ్వవద్దు, ఇతి - అని, తాన్ - వాటిని, సప్తధా - ఏడుగా.

ఆయన బంగరు కాంతి గల ఆ గర్భమును వజ్రముతో ఏడు ముక్కలుగా కోసెను. ఏడుస్తూ ఉన్న ఆ ఖండములను మరల, ఏడ్వవద్దు అంటూనే, ఒక్కొక్కదానిని ఏడు ముక్కలుగా నరికెను.

తే తమూచుః పాట్యమానాస్సర్వే ప్రాంజలయో నృప ।
నో జిఘాంససి కిమింద్ర భ్రాతరో మరుతస్తవ ॥ 63

నృప - ఓ మహారాజా!, పాట్యమానాః - కోసివేయ బడుచున్న, తే - ఆ, సర్వే - అన్ని గర్భశకలములు, ప్రాంజలయః - చేతులు జోడించిన వై, ఊచుః - పలికినవి, ఇంద్ర - ఓ ఇంద్రా!, నః - మమ్ములను, కిమ్ - ఏల, జిఘాంససి - చంప గోరుచున్నావు?, తవ - నీ, భ్రాతరః - తమ్ములమగు, మరుతః - మరుత్తులము.

ఓ పరీక్షిన్మహారాజా! కోసివేయ బడుచున్న ఆ గర్భపు ముక్కలు అన్నీ చేతులు జోడించి ఇట్లు పలికెను --- ఓ ఇంద్రా! మమ్ములను చంప గోరుటకు కారణమేమి? మేము నీ తమ్ములమగు మరుత్తులము.

మా భైష్ట భ్రాతరో మహ్యం యూయమిత్యాహ కౌశికః ।
అనన్యభావాన్ పార్షదానాత్మనో మరుతాం గణాన్ ॥ 64

మహ్యమ్ - నా కొరకు, భ్రాతరః - తమ్ములగు, యూయమ్ - మీరు, మా భైష్ట - భయపడకుడు, ఇతి - అని, అనన్యభావాన్ - ఏకాంతమగు ప్రేమ కలిగినట్టియు, ఆత్మనః - తనకు, పార్షదాన్ - అనుచరులైన, మరుతామ్ - మరుత్తుల, గణాన్ - గణములను ఉద్దేశించి, కౌశికః - ఇంద్రుడు, ఆహ - పలికెను.

ఇంద్రుడు ఆ మరుద్గణములతో, మీరు నా తమ్ములు గాన భయపడకుడు అని పలికెను. వారే ఆయన అనుచరులై ఏకాంతమగు ప్రేమను చూపిరి.

న మమార దితేర్గర్భశ్శ్రీనివాసానుకంపయా ।
బహుధా కులిశక్షుణ్ణో ద్రౌణ్యస్త్రేణ యథా భవాన్ ॥ 65

శ్రీనివాస-అనుకంపయా - శ్రీనివాసుని దయచే, ద్రౌణి-అస్త్రేణ - ద్రోణపుత్రుడగు అశ్వత్థామయొక్క అస్త్రముచే, భవాన్ యథా - నీవు వలె, బహుధా - అనేకములగు ముక్కలుగా, కులిశక్షుణ్ణః - వజ్రముచే నలగకొట్టబడిన, దితేః - దితియొక్క, గర్భః - గర్భము, న మమార - మరణించలేదు.

శ్రీనివాసుని దయచే ద్రోణపుత్రుడగు అశ్వత్థామ వేసిన అస్త్రము నిన్ను సంహరించ లేదు. అదే విధముగా, ఆ దితియొక్క గర్భము వజ్రముచే చాల ముక్కలుగా నలగకొట్టబడిననూ మరణించ లేదు.

సకృదిష్ట్వాఽఽదిపురుషం పురుషో యాతి సామ్యతామ్ ।
సంవత్సరం కించిదూనం దిత్యా యద్ధరిరర్చితః ॥ 66

సజూరింద్రేణ పంచాశద్దేవాస్తే మరుతోఽభవన్ ।
వ్యపోహ్య మాతృదోషం తే హరిణా సోమపాః కృతాః ॥ 67

ఆదిపురుషమ్ - జగత్కారణుడగు పురుషోత్తముని, సకృత్ - ఒక్కసారి, ఇష్ట్వా - ఆరాధించి, పురుషః - మానవుడు, సామ్యతామ్ - సమానత్వమును, యాతి - పొందును, కించిత్ ఊనమ్ - కొంచెము తక్కువ, సంవత్సరమ్ - సంవత్సర కాలమును, దిత్యా - దితిచే, యత్ - ఏలనైతే, హరిః - శ్రీహరి, అర్చితః - పూజించబడినాడో అందువలన, తే - ఆ, మరుతః - మరుత్తులు, ఇంద్రేణ సజూః - ఇంద్రునితో గూడి, పంచాశత్ - ఏభై, దేవాః - దేవతలు, అభవన్ - అయిరి, మాతృదోషమ్ - తల్లి దోషమును, వ్యపోహ్య - తొలగించి, తే - వారు, హరిణా - ఇంద్రునిచే, సోమపాః - సోమరసమును పానము చేయువారుగా, కృతాః - చేయబడిరి.

జగత్కారణుడగు పురుషోత్తముని ఒక్కసారి ఆరాధించి మానవుడు ఆయనతో ఐక్యమగును. అట్టిచో, దితి ఆ శ్రీహరిని కొంచెము తక్కువగా సంవత్సరకాలము పూజించెను. కావుననే, ఆ మరుత్తులు ఇంద్రునితో కలిసి ఏభైమంది దేవతలు అయిరి. సవతి తల్లి సంతానమనే (తల్లి అసురి అనే) దోషబుద్ధిని ప్రక్కన బెట్టి ఇంద్రుడు (శ్రీహరి) కూడ వారికి యజ్ఞములలో సమర్పించబడే సోమరసమునందు భాగమునిచ్చెను.

దితిరుత్థాయ దదృశే కుమారాననలప్రభాన్ ।
ఇంద్రేణ సహితాన్ దేవీ పర్యతుష్యదనిందితా ॥ 68

దితిః - దితి, ఉత్థాయ - నిద్ర లేచి, అనలప్రభాన్ - నిప్పు వలె వెలిగిపోవుచున్నట్టియు, ఇంద్రేణ - ఇంద్రునితో, సహితాన్ - కూడియున్న, కుమారాన్ - పుత్రులను, దదృశే - చూచెను, అనిందితా - దోషములు లేని, దేవీ - ఆ దేవి, పర్యతుష్యత్ - చాల సంతోషించెను.

దోషములు లేని ఆ దితి దేవి నిద్ర లేచి, అగ్నుల వలె వెలిగిపోతూ ఇంద్రునితో కూడియున్న పుత్రులను చూచి, చాల సంతోషించెను.

అథేంద్రమాహ తాతాహమాదిత్యానాం భయావహమ్ ।
అపత్యమిచ్ఛంత్యచరం వ్రతమేతత్సుదుష్కరమ్ ॥ 69

అథ - తరువాత, ఇంద్రమ్ - ఇంద్రుని గురించి, ఆహ - పలికెను, తాత - వత్సా!, అహమ్ - నేను, ఆదిత్యానామ్ - అదితి పుత్రులకు, భయ -ఆవహమ్ - భయమును కలిగించే, అపత్యమ్ - సంతానమును, ఇచ్ఛంతీ - కోరుదాననై, సుదుష్కరమ్ - మిక్కిలి చేయ శక్యము కాని, ఏతత్ - ఈ, వ్రతమ్ - వ్రతమును, అచరమ్ - చేసితిని.

తరువాత ఆమె ఇంద్రునితో నిట్లనెను --- వత్సా! ఈ వ్రతమును చేయుట చాల కష్టము. నేను అదితి పుత్రులకు భయమును కలిగించే సంతానమును కోరి, ఈ వ్రతము ననుష్ఠించితిని.

ఏకస్సంకల్పితః పుత్రస్సప్త సప్తాభవన్ కథమ్ ।
యది తే విదితం పుత్ర సత్యం కథయ మా మృషా ॥ 70

ఏకః - ఒక్క, పుత్రః - పుత్రుడు, సంకల్పితః - కోరబడినవాడు, సప్త సప్త - నలభై తొమ్మిది మంది, కథమ్ - ఎట్లు, అభవన్ - కలిగిరి?, పుత్ర - కుమారా!, తే - నీకు, విదితం యది - తెలియబడినది అయినచో, సత్యమ్ - యథార్థమును, కథయ - చెప్పుము, మా మృషా - అసత్యమును చెప్పవద్దు.

కుమారా! నేను కోరినది ఒక్క కొడుకైతే, నలభై తొమ్మిది మంది ఎట్లు కలిగినారు ? నీకు తెలిస్తే సత్యమును చెప్పుము. అసత్యమును చెప్పవద్దు.

ఇంద్ర ఉవాచ ।
అంబ తేఽహం వ్యవసితముపధార్యాగతోఽంతికమ్ ।
లబ్ధాంతరోఽచ్ఛిదం గర్భమర్థబుద్ధిర్న ధర్మవిత్ ॥ 71

అంబ - అమ్మా!, అహమ్ - నేను, తే - నీ, వ్యవసితమ్ - నిశ్చయమును, ఉపధార్య - తెలుసుకొని, అంతికమ్ - సమీపమును, ఆగతః - చేరినవాడను, లబ్ధ-అంతరః - పొందబడిన సందు గలవాడనై, గర్భమ్ - గర్భమును, అచ్ఛిదమ్ - ఛేదించితిని, అర్థబుద్ధిః - స్వార్థమునందు బుద్ధి గలవాడు (డను), ధర్మవిత్ - ధర్మము తెలిసినవాడు (డను), న - కాదు.

ఇంద్రుడు ఇట్లు పలికెను --- అమ్మా! నేను స్వార్థమునందు అభినివేశము గలవాడనే గాని, ధర్మమునందు కాదు. నాకు నీ నిశ్చయము తెలిసినది. వెంటనే నేను నీ వద్దకు చేరి, కనిపెట్టుకొని యుంటిని. సందు దొరకగానే, నీ గర్భమును ఛేదించితిని. స్వార్థబుద్ధి గలవాడు ధర్మమును సరకు చేయడు.

కృతో మే సప్తధా గర్భ ఆసన్ సప్త కుమారకాః ।
తేఽపి చైకైకశో వృక్ణాస్సప్తధా నాపి మమ్రిరే ॥ 72

మే - నాచే, గర్భః - గర్భము, సప్తధా - ఏడు ముక్కలుగా, కృతః - చేయబడినది, సప్త - ఏడు, కుమారకాః - బాలకులు, ఆసన్ - అయిరి, తే అపి చ - అవి కూడ, ఏక-ఏకశః - ఒక్కొక్కటిగా, సప్తధా - ఏడు ముక్క

లుగా, వృక్ణాః - కోయబడినవి, అపి - అయిననూ, న మమ్రిరే - మర ణించ లేదు.

నేను గర్భమును ఏడు ముక్కలుగా చేసితిని. అవియే ఏడు బాల కులైరి. వాటిని నేను మరల ఒక్కొక్కదానిని ఏడు ముక్కలుగా నరికితిని. అయిననూ, ఆ ముక్కలు మరణించ లేదు.

తతస్తత్పరమాశ్చర్యం వీక్ష్యాధ్యవసితం మయా ।
మహాపురుషపూజాయాస్సిద్ధిః కాప్యనుషంగిణీ ॥ 73

తతః - తరువాత, తత్ - ఆ, పరమ-ఆశ్చర్యమ్ - అత్యద్భుతము ను, వీక్ష్య - చూచి, మయా - నాచే, అధ్యవసితమ్ - నిశ్చయించ బడినది, మహాపురుషపూజాయాః - పురుషోత్తముని పూజకు, అనుషంగిణీ - అవాం తరఫలమగు, కా అపి - ఒకానొక, సిద్ధిః - సిద్ధి.

ఆ అత్యద్భుతమును చూచిన నాకు, ఇది పురుషోత్తముని పూజ వలన లభించిన ఒక గొప్ప అవాంతర ఫలము, అని నిశ్చయము కలిగెను.

ఆరాధనం భగవత ఈహమానా నిరాశిషః ।
యే తు నేచ్ఛంత్యపి పరం తే స్వార్థకుశలాస్స్మృతాః ॥ 74

యే తు - ఎవరైతే, భగవతః - భగవానుని, ఆరాధనమ్ - పూజ ను, నిరాశిషః - నిష్కాములై, ఈహమానాః - చేయువారు, పరం అపి - మోక్షమును కూడ, న ఇచ్ఛంతి - కోరరో, తే - వారు, స్వ-అర్థకుశలాః - తమ పురుషార్థము విషయములో నిపుణులని, స్మృతాః - చెప్పబడినారు.

ఎవరైతే నిష్కామముగా భగవంతుని ఆరాధిస్తూ మోక్షమును కూడ కోరరో, వారే తమ పురుషార్థము విషయములో నిపుణులని శాస్త్ర ములు చెప్పుచున్నవి.

ఆరాధ్యాత్మప్రదం దేవం స్వాత్మానం జగదీశ్వరమ్ ।
కో వృణీతే గుణస్పర్శం బుధస్స్యాన్నరకేఽపి యత్ ॥ 75

**ఆత్మప్రదమ్** - తనను ఇచ్చివేయునట్టియు, **స్వ-ఆత్మానమ్** - తనకు ఆత్మరూపుడైనట్టియు, **జగద్-ఈశ్వరమ్** - జగన్నాథుడైన, **దేవమ్** - దేవుని, **ఆరాధ్య** - ఆరాధించి, **బుధః** - వివేకి, **కః** - ఎవడు, **గుణస్పర్శమ్** - ఇంద్రియభోగము (ఇంద్రియములకు బాహ్యవస్తువుతో సంపర్కము వలన కలిగేది) ను, **వృణీతే** - కోరును?, **యత్** - ఏదైతే, **నరకే అపి** - నరకమునందు కూడ, **స్యాత్** - ఉండునో.

భక్తునిలో ఆత్మరూపుడుగా ఉండే జగన్నాథుడగు దేవుని ఆరాధించినచో, ఆయన తనను తానే ఇచ్చివేయును. అట్టి దేవుని ఆరాధించి, వివేకియైనవాడెవ్వడు ఇంద్రియభోగమును కోరుకొనును? ఇంద్రియభోగములు కొద్దో గొప్పో నరకములో కూడ ఉండును. (అనగా, వాటి కొరకై దేవుని ఆరాధించుట వ్యర్థము).

తదిదం మమ దౌర్జన్యం బాలిశస్య మహీయసి ।
క్షంతుమర్హసి మాతస్త్వం దిష్ట్యా గర్భో మృతోత్థితః ॥ 76

మహీయసి - ఓ మహాత్మురాలా!, బాలిశస్య - అజ్ఞానినగు, మమ - నాయొక్క, తత్ - అట్టి, ఇదమ్ - ఈ, దౌర్జన్యమ్ - దౌర్జన్యమును, త్వమ్ - నీవు, క్షంతుమ్ - క్షమించుటకు, అర్హసి - తగుదువు, మాతః - అమ్మా!, దిష్ట్యా - దైవవశముచే, గర్భః - గర్భము, మృత-ఉత్థితః - చచ్చి మరల బ్రదికినది.

అమ్మా! నీవు మహాత్మురాలవు. అజ్ఞానినగు నేను చేసిన అట్టి ఈ దౌర్జన్యమును నీవు క్షమించ దగును. దైవానుగ్రహముచే చచ్చిపోయిన గర్భము మరల బ్రదికినది.

శ్రీశుక ఉవాచ ।
ఇంద్రస్తయాఽభ్యనుజ్ఞాతశ్శుద్ధభావేన తుష్టయా ।
మరుద్భిస్సహ తాం నత్వా జగామ త్రిదివం ప్రభుః ॥ 77

ప్రభుః ఇంద్రః - ఇంద్ర ప్రభుడు, శుద్ధభావేన - పరిశుద్ధమగు భావముచే, తుష్టయా - సంతోషించిన, తయా - ఆమెచే, **అభ్యనుజ్ఞాతః** -

అనుజ్ఞ ఈయబడినవాడై, మరుద్భిః సహ - మరుత్తులతో గూడి, తామ్ - ఆమెను, నత్వా - నమస్కరించి, త్రిదివమ్ - స్వర్గమును గురించి, జగామ - వెళ్లెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- ఇంద్రప్రభుని పరిశుద్ధమగు భావమునకు దితి సంతోషించెను. ఆయన మరుత్తులతో గూడి ఆమెకు నమస్కరించి, ఆమె అనుమతిని బడసి, స్వర్గమును చేరుకొనెను.

ఏవం తే సర్వమాఖ్యాతం యన్మాం త్వం పరిపృచ్ఛసి ।
మంగలం మరుతాం జన్మ కిం భూయః కథయామి తే ॥78

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే మరుతాం
జన్మవర్ణనం నామ అష్టాదశోఽధ్యాయః ॥

ఏవమ్ - ఈ విధముగా, తే - నీ కొరకు, మరుతామ్ - మరుత్తుల యొక్క, మంగలమ్ - కల్యాణకరమగు, జన్మ - పుట్టుక, సర్వమ్ - అంతా, ఆఖ్యాతమ్ - చెప్పబడినది, యత్ - దేనిని గురించి, మామ్ - నన్ను, పరి పృచ్ఛసి - ప్రశ్నించుచున్నావో, భూయః - మరల, తే - నీ కొరకు, కిమ్ - దేనిని, కథయామి - చెప్పెదను?

ఈ విధముగా మరుత్తుల కల్యాణకరమగు జన్మవృత్తాంతమునంతనూ నీవు వేసిన ప్రశ్నకు తగినట్లుగా నేను నీకు చెప్పితిని. నేను నీకింకనూ ఏమి చెప్పవలెను?

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి ఆరవ స్కంధములో
మరుత్తుల జన్మను వర్ణించే పదునెనిమిదవ
అధ్యాయము ముగిసినది (18).

*****

# అథ ఏకోనవింశోఽధ్యాయః

## పుంసవన వ్రత విధానము

రాజోవాచ ।
వ్రతం పుంసవనం బ్రహ్మన్ భవతా యదుదీరితమ్ ।
తస్య వేదితుమిచ్ఛామి యేన విష్ణుః ప్రసీదతి ॥ 1

బ్రహ్మన్ - ఓ మహర్షీ!, భవతా - నీచే, పుంసవనం నామ - పుంస వనము అని ప్రసిద్ధి గాంచిన, యత్ - ఏ, వ్రతమ్ - వ్రతము, ఉదీరితమ్ - చెప్పబడినదో, తస్య - దానిని, వేదితుమ్ - తెలియుటకు, ఇచ్ఛామి - కోరుచున్నాను, యేన - దేనిచే, విష్ణుః - విష్ణువు, ప్రసీదతి - ప్రసన్నుడగునో.

పరీక్షిన్మహారాజు ఇట్లు పలికెను --- ఓ మహర్షీ! తమరు పుంసవ నము అని ప్రసిద్ధి గాంచిన వ్రతమును గురించి చెప్పితిరి. ఆ వివరములను నేను తెలియ గోరుచున్నాను. ఆ వ్రతముచే విష్ణువు ప్రసన్నుడగును గదా!

శ్రీశుక ఉవాచ ।
శుక్లే మార్గశిరే పక్షే యోషిద్భర్తురనుజ్ఞయా ।
ఆరభేత వ్రతమిదం సార్వకామికమాదితః ॥ 2

మార్గశిరే - మార్గశిర మాసమునందు, శుక్లే పక్షే - శుక్లపక్షమునం దు, ఆదితః - పాడ్యమినాడు, యోషిత్ - స్త్రీ, భర్తుః - భర్తయొక్క, అను జ్ఞయా - అనుమతితో, ఇదమ్ - ఈ, సార్వకామికమ్ - కోరికలనన్నింటినీ ఈడేర్చే, వ్రతమ్ - వ్రతమును, ఆరభేత - ప్రారంభించ వలెను.

శ్రీశుక మహర్షి ఇట్లు పలికెను --- స్త్రీ భర్త అనుమతితో కోరికలన న్నింటినీ ఈడేర్చే ఈ వ్రతమును మార్గశిర శుక్ల పాద్యమి నాడు ప్రారం భించ వలెను.

నిశమ్య మరుతాం జన్మ బ్రాహ్మణాననుమంత్ర్య చ ।
స్నాత్వా శుక్లదతీ శుక్లే వసీతాఽలంకృతాఽంబరే ।
పూజయేత్ప్రాతరాశాత్ప్రాగ్భగవంతం శ్రియా సహ ॥ 3

మరుతామ్ - మరుత్తుల, జన్మ - పుట్టుకను, నిశమ్య - విని, బ్రాహ్మణాన్ - వేదవేత్తలను, అనుమంత్ర్య చ - అనుమతి తీసుకొని, శుక్ల దతీ - తెల్లని పళ్లు గల స్త్రీ, స్నాత్వా - స్నానమును చేసి, శుక్లే - తెల్లని, అంబరే - వస్త్రముల జంటను, వసీత - ధరించవలెను, అలంకృతా - అలంకరించుకున్నదై, ప్రాతరాశాత్ - ఉదయపు ఫలహారము కంటె, ప్రాక్ - ముందుగా, శ్రియా సహ - లక్ష్మీదేవితో గూడియున్న, భగవంతమ్ - శ్రీహరి భగవానుని, పూజయేత్ - పూజించవలెను.

స్త్రీ మరుత్తుల జన్మవృత్తాంతమును విని, వేదవేత్తల అనుమతిని పొందవలెను. ప్రతి దినము ఆమె దంతములను శుభ్రము చేసుకొని, స్నానము చేసి, రెండు తెల్లని వస్త్రములను ధరించి, అలంకరించుకొని, ఉదయపు ఫలహారమునకు ముందే లక్ష్మీదేవితో గూడియున్న శ్రీహరి భగ వానుని పూజించవలెను.

అలం తే నిరపేక్షాయ పూర్ణకామ నమోఽస్తు తే ।
మహావిభూతిపతయే నమస్సకలసిద్ధయే ॥ 4

పూర్ణకామ - పూర్ణమైన కామనలు గలవాడా!, నిరపేక్షాయ - అపేక్షలు లేని, తే - నీ కొరకు, అలమ్ - చాలును, మహావిభూతిపతయే - గొప్ప మహిమలకు (లక్ష్మికి) ప్రభుడవైనట్టియు, సకలసిద్ధయే - సకలసి ద్ధులు గల, తే - నీ కొరకు, నమః - నమస్కారము, అస్తు - అగు గాక!

హే భగవన్! నీవు ఆప్తకాముడవు. నీకు అపేక్షలు లేవు. నీకు సర్వము సుసంపన్నము. నీవు గొప్ప మహిమలకు (లక్ష్మికి) ప్రభుడవు. సకలసిద్ధులు నీయందే ఉన్నవి. నీకు అనేక నమస్కారములు అగు గాక!

యథా త్వం కృపయా భూత్యా తేజసా మహినౌజసా ।
జుష్ట ఈశ గుణైస్సర్వైస్తతోऽసి భగవాన్ ప్రభుః ।। 5

ఈశ - ఓ ఈశ్వరా!, యథా - యథార్థముగా, త్వమ్ - నీవు, కృపయా - దయచే, భూత్యా - సంపదచే, తేజసా - తేజస్సుచే, మహినా - మహిమచే, ఓజసా - శక్తిచే, సర్వైః - సకలములైన, గుణైః - గుణములచే, జుష్టః - సేవించబడుచున్నావు, తతః - అందువలన, భగవాన్ - భగవానుడవు, ప్రభుః - ప్రభుడవు, అసి - అగుచున్నావు.

ఓ ఈశ్వరా! దయ, సంపద, తేజస్సు, మహిమ, శక్తి మొదలగు సకలగుణములు పూర్ణములై నిన్ను సేవించుచున్నవి. కావుననే, నీవు భగవానుడవు, జగన్నాథుడవు అగుచున్నావు.

విష్ణుపత్ని మహామాయే మహాపురుషలక్షణే ।
ప్రీయేథా మే మహాభాగే లోకమాతర్నమోऽస్తు తే ।। 6

విష్ణుపత్ని - విష్ణుపత్నివగు ఓ లక్ష్మి!, మహామాయే - ఓ మహామాయా!, మహాపురుషలక్షణే - పురుషోత్తముని లక్షణములు గలదానా!, మహాభాగే - గొప్ప భాగ్యము గలదానా!, మే - నా కొరకు, ప్రీయేథాః - ప్రీతురాలవు కమ్ము, లోకమాతః - లోకజననీ!, తే - నీ కొరకు, నమః - నమస్కారము, అస్తు - అగుగాక!

విష్ణుపత్నివగు ఓ లక్ష్మి! గొప్ప మాయాశక్తివి నీవే. పురుషోత్తముని లక్షణములే నీయందు కూడ గలవు. గొప్ప భాగ్యవతియగు ఓ లోకజననీ! నాపై ప్రీతిని కలిగియుండుము. నీకు నమస్కారమగు గాక!

ఓం నమో భగవతే మహాపురుషాయ మహానుభావాయ మహావిభూతిపతయే సహ మహావిభూతిభిర్బలిముపహరాణీతి ।
అనేనాహరహర్మంత్రేణ విష్ణోరావాహనార్ఘ్యపాద్యోపస్పర్శన

స్నానవాసఉపవీతవిభూషణగంధపుష్పధూపదీపోపహారాద్యు
సచారాంశ్చ సమాహితా ఉపాహరేత్ ।। 7

ఓమ్, మహా-అనుభావాయ - గొప్ప ప్రభావము కలిగినట్టియు, మహావిభూతిపతయే - గొప్ప మహిమలకు (లక్ష్మీదేవికి) ప్రభువైనట్టియు, మహావిభూతిభిః సహ - గొప్ప విభూతులతో సహా, మహాపురుషాయ భగవతే - పురుషోత్తమ భగవానుని కొరకు, నమః - నమస్కారము, బలిమ్ - పూజాద్రవ్యమును, ఉపాహరాణి - సమర్పించెదను గాక!, ఇతి - అనే, అనేన - ఈ, మంత్రేణ - మంత్రముతో, అహః-అహః - ప్రతి దినము, విష్ణోః - విష్ణువునకు, ఆవాహన-అర్ఘ్యపాద్య-ఉపస్పర్శనస్నానవాసః-ఉపవీతవిభూషణగంధపుష్పధూపదీప-ఉపహార-ఆది-ఉపచారాన్ చ - ఆవాహనము అర్ఘ్యము పాద్యము ఆచమనము స్నానము వస్త్రములు యజ్ఞోపవీతము ఆభరణములు గంధము పుష్పములు ధూపము దీపము నైవేద్యము మొదలైన ఉపచారములను కూడ, సమాహితా - ఏకాగ్రచిత్తము గలదియై, ఉపాహరేత్ - సమర్పించవలెను.

ఓమ్, మహాప్రభావశాలి, మహామహిమాన్వితుడు, మహావిభూతులతో (లక్ష్మితో) కూడియున్నవాడు అగు పురుషోత్తమ భగవానుని కొరకు నమస్కారము. పూజాద్రవ్యములను సమర్పించెదను గాక! అనే భావము గల పై మంత్రముతో ప్రతిదినము ఆ స్త్రీ ఏకాగ్రమగు చిత్తముతో విష్ణువునకు ఆవాహనము, అర్ఘ్యము, పాద్యము, ఆచమనము, స్నానము, వస్త్రములు, యజ్ఞోపవీతము, ఆభరణములు, గంధము, పుష్పములు, ధూపము, దీపము, నైవేద్యము మొదలైన ఉపచారములను కూడ సమర్పించవలెను.

హవిశ్శేషం తు జుహుయాదనలే ద్వాదశాహుతీః। ఓం నమో
భగవతే మహాపురుషాయ మహావిభూతిపతయే స్వాహేతి।।8

హవిః-శేషం తు - నైవేద్యము పెట్టగా మిగిలిన ఆహారమునైతే, అనలే - అగ్నియందు, ద్వాదశ - పన్నెండు, ఆహుతీః - ఆహుతులను, జుహుయాత్ - హోమము చేయవలెను, ఓమ్, మహావిభూతిపతయే -

గొప్ప విభూతియగు లక్ష్మీదేవికి భర్తయగు, భగవతే మహాపురుషాయ - పురుషోత్తమ భగవానుని కొరకు, స్వాహా, ఇతి - అని.

గొప్ప విభూతియగు లక్ష్మీదేవికి భర్తయగు పురుషోత్తమ భగవానుని కొరకు ఇది సమర్పించ బడుచున్నది అనే అర్థము గల మంత్రముతో, నైవేద్యము పెట్టగా మిగిలిన హవిస్సును పన్నెండు సార్లు అగ్నిలో హోమము చేయవలెను.

శ్రియం విష్ణుం చ వరదావాశిషాం ప్రభవావుభౌ ।
భక్త్యా సంపూజయేన్నిత్యం యదీచ్ఛేత్సర్వసంపదః ॥ 9

వరదౌ - వరములనిచ్చువారు, ఆశిషామ్ - మనోరథములకు, ప్రభవౌ - ఉత్పత్తి స్థానములు అగు, శ్రియమ్ - లక్ష్మీదేవిని, విష్ణుం చ - విష్ణువును కూడ, ఉభౌ - ఇద్దరిని, నిత్యమ్ - ప్రతిదినము, భక్త్యా - భక్తితో, సంపూజయేత్ - చక్కగా పూజించవలెను, సర్వసంపదః - సకలసంపదలను, ఇచ్ఛేత్ యది - కోరుచున్నచో.

లక్ష్మీదేవి, విష్ణువు వీరిద్దరి వలననే మనోరథములన్నియు ఈడేరును. కావున, సకలసంపదలను కోరే వ్యక్తి భక్తితో, వరములనిచ్చే వారిద్దరిని నిత్యము చక్కగా పూజించవలెను.

ప్రణమేద్దండవద్భూమౌ భక్తిప్రహ్వేణ చేతసా ।
దశవారం జపేన్మంత్రం తతః స్తోత్రముదీరయేత్ ॥ 10

భక్తిప్రహ్వేణ - భక్తితో నమ్రమైన, చేతసా - మనస్సుతో, భూమౌ - నేలపై, దండవత్ - కర్రవలె, ప్రణమేత్ - నమస్కరించవలెను, మంత్రమ్ - మంత్రమును, దశవారమ్ - పది సార్లు, జపేత్ - జపించవలెను, తతః - తరువాత, స్తోత్రమ్ - స్తోత్రమును, ఉదీరయేత్ - పఠించవలెను.

భక్తితో వినమ్రమైన మనస్సుతో సాష్టాంగ నమస్కారము చేసి, మంత్రమును పదిసార్లు జపించి, తరువాత స్తోత్రమును పఠించవలెను.

యువాం తు విశ్వస్య విభూ జగతః కారణం పరమ్ ।
ఇయం హి ప్రకృతిస్సూక్ష్మా మాయాశక్తిర్దురత్యయా ।। 11

యువాం తు - మీరిద్దరైతే, విశ్వస్య - జగత్తునకు, విభూ - ప్రభువులు, జగతః - జగత్తునకు, పరమ్ - సర్వాతిశాయియగు, కారణమ్ - కారణము, ఇయం హి - ఈ లక్ష్మీదేవియే, సూక్ష్మా - సూక్ష్మమగు, ప్రకృతిః - ప్రకృతి, దురత్యయా - ఉల్లంఘించ శక్యము కాని, మాయాశక్తిః - మాయాశక్తి.

మీరిద్దరు జగత్ప్రభువులు. మీరు జగత్తునకు కారణమై జగత్తునకు అతీతులై యున్నారు. జగత్తునకు ఉపాదానమగు సూక్ష్మశక్తి ఈ లక్ష్మీదేవియే. ఉల్లంఘించ శక్యము కాని మాయాశక్తి ఈమెయే.

తస్యా అధీశ్వరస్సాక్షాత్త్వమేవ పురుషః పరః ।
త్వం సర్వయజ్ఞ ఇజ్యేయం క్రియేయం ఫలభుగ్భవాన్ ।।12

పురుషః పరః - పురుషోత్తముడవగు, త్వం ఏవ - నీవే, సాక్షాత్ - సాక్షాత్తుగా, తస్యాః - ఆ మాయాశక్తికి, అధీశ్వరః - అధీశ్వరుడవు, త్వమ్ - నీవు, సర్వయజ్ఞః - సకలయజ్ఞముల రూపములో నున్నవాడవు, ఇయమ్ - ఈమె, ఇజ్యా - యజ్ఞక్రియ, ఇయమ్ - ఈమె, క్రియా - క్రియ, భవాన్ - నీవు, ఫలభుక్ - ఫలభోక్తవు.

పురుషోత్తముడవగు నీవే సాక్షాత్తుగా ఆ మాయాశక్తికి అధీశ్వరుడవు. నీవు సర్వయజ్ఞమూర్తివి కాగా, యజ్ఞక్రియ ఈమెయే. నీవు సర్వకర్మల ఫలమునను భవించే జీవుని రూపములో నుండగా, ఈమె లౌకిక క్రియ (క్రియాశక్తి) రూపములో నున్నది.

గుణవ్యక్తిరియం దేవీ వ్యంజకో గుణభుగ్భవాన్ ।
త్వం హి సర్వశరీర్యాత్మా శ్రీశ్శరీరేంద్రియాశయా ।
నామరూపే భగవతీ ప్రత్యయస్త్వమపాశ్రయః ।। 13

ఇయమ్ - ఈ, దేవీ - దేవి, గుణవ్యక్తిః - గుణముల అభివ్యక్తి (ప్రకటరూపము), భవాన్ - నీవు, వ్యంజకః - గుణములను ప్రకటించువాడవు,

గుణభుక్ - గుణముల ననుభవించువాడవు, సర్వశరీరీ - సర్వప్రాణుల రూపములోనున్న, ఆత్మా - ఆత్మవు, త్వం హి - నీవే, శ్రీః - లక్ష్మీదేవి, శరీర-ఇంద్రియ-ఆశయా - శరీరము ఇంద్రియములు అంతఃకరణము, భగవతీ - లక్ష్మీదేవి, నామరూపే - నామరూపములు, అపాశ్రయః - ఆశ్రయము, ప్రత్యయః - ప్రకాశము, త్వమ్ - నీవే.

సత్త్వరజస్తమోగుణముల అభివ్యక్తియే లక్ష్మీదేవి కాగా, ఆ గుణములను ప్రకటించి అనుభవించే చేతన పురుషుడవు నీవు. సర్వప్రాణుల రూపముగా ఉన్న అఖండచైతన్యము (ఆత్మ) నీవు కాగా, ఆ శరీరములు, ఇంద్రియములు, అంతఃకరణముల రూపములో లక్ష్మి ప్రకటమైనది. లక్ష్మీ భగవతి నామరూపములు కాగా, ఆ నామరూపములకు ఆశ్రయము ప్రకాశకము అగు సచ్చిదాత్మ నీవే.

యథా యువాం త్రిలోకస్య వరదౌ పరమేష్ఠినౌ ।
తథా మ ఉత్తమశ్లోక సంతు సత్యా మహాశిషః ॥ 14

ఉత్తమశ్లోక - ఓ పవిత్రమగు కీర్తి గలవాడా!, యథా - ఏ విధముగానైతే, యువామ్ - మీరిద్దరు, త్రిలోకస్య - ముల్లోకములకు, వరదౌ - వరములనిచ్చే, పరమేష్ఠినౌ - పరమేశ్వరులో, తథా - అదే విధముగా, మే - నాయొక్క, మహా-ఆశిషః - గొప్ప మనోరథములు, సత్యాః - యథార్థములు, సంతు - అగుగాక!

ఓ శ్రీహరీ! నీ కీర్తి పవిత్రమైనది. నీవు, లక్ష్మి ముల్లోకములకు వరములనిచ్చే పరమేశ్వరులు. కావున, నా గొప్ప మనోరథములు కూడ మీ అనుగ్రహముచే యథార్థములగు గాక!

ఇత్యభిష్టూయ వరదం శ్రీనివాసం శ్రియా సహ ।
తన్నిస్సార్యోపహరణం దత్త్వాఽఽచమనమర్చయేత్ ॥ 15

వరదమ్ - వరములనిచ్చే, శ్రీనివాసమ్ - శ్రీనివాసుని, శ్రియా సహ - శ్రీదేవితో సహా, ఇతి - ఈ విధముగా, అభిష్టూయ - స్తుతించి, తత్

- ఆ, ఉపహరణమ్ - నైవేద్యమును, నిస్సార్య - తొలగించి, ఆచమనమ్ - ఆచమనమును, దత్త్వా - ఇచ్చి, అర్చయేత్ - పూజించవలెను.

లక్ష్మీసమేతుడగు శ్రీనివాసుని ఈ విధముగా స్తుతించి, నైవేద్యము నచటనుండి తీసివేసి, ఆచమనమును సమర్పించి పూజించవలెను.

తతః స్తువీత స్తోత్రేణ భక్తిప్రహ్వేణ చేతసా ।
యజ్ఞోచ్ఛిష్టమవఘ్రాయ పునరభ్యర్చయేద్ధరిమ్ ।
పతిం చ పరయా భక్త్యా మహాపురుషచేతసా ॥ 16

తతః - తరువాత, భక్తిప్రహ్వేణ - భక్తితో వినమ్రమైన, చేతసా - మనస్సుతో, స్తోత్రేణ - స్తోత్రముతో, స్తువీత - స్తుతించవలెను, యజ్ఞ-ఉచ్ఛిష్టమ్ - యజ్ఞములో మిగిలిన హవిస్సును, అవఘ్రాయ - ఆఘ్రాణించి, పునః - మరల, హరిమ్ - శ్రీహరిని, పతిం చ - భర్తను కూడ, మహాపురుషచేతసా - పురుషోత్తముడనే భావనతో, పరయా - సర్వోత్తమమగు, భక్త్యా - భక్తితో, అభ్యర్చయేత్ - పూజించవలెను.

తరువాత భక్తితో వినమ్రమైన మనస్సుతో స్తోత్రమును పఠించవలెను. అటు పిదప యజ్ఞములో మిగిలిన హవిస్సును ఆఘ్రాణించి, సర్వోత్తమమగు భక్తితో శ్రీహరికి పునఃపూజ చేయవలెను. భర్తను కూడ పురుషోత్తముడే యను బుద్ధితో పూజించవలెను.

ప్రియైస్తైస్తైరుపనమేత్ ప్రేమశీలస్స్వయం పతిః ।
బిభృయాత్ సర్వకర్మాణి పత్న్యా ఉచ్చావచాని చ ॥ 17

ప్రేమశీలః - ప్రేమస్వభావము గల, పతిః - భర్త, స్వయమ్ - తాను, తైః తైః - ఆయా, ప్రియైః - ప్రియవస్తువులతో, ఉపనమేత్ - సేవించవలెను, పత్న్యాః - భార్యయొక్క, ఉచ్చావచాని - చిన్న పెద్ద, సర్వకర్మాణి చ - సకలకర్మలను, బిభృయాత్ - సమర్థించవలెను.

భర్త కూడ ప్రేమ స్వభావము గలవాడై, ఆయా ప్రియమగు వస్తువులను భార్యకు అర్పించవలెను. మరియు, భార్యయొక్క చిన్న పెద్ద పనులలో ఆమెకు చేదోడు వాదోడుగా నుండవలెను.

**కృతమేకతరేణాపి దంపత్యోరుభయోరపి ।**
**పత్న్యాం కుర్యాదనర్హాయాం పతిరేతత్సమాహితః ॥ 18**

ఏకతరేణ - ఇద్దరిలో ఒకరిచే, కృతం అపి - చేయబడిననూ, ఉభయోః - ఇద్దరు, దంపత్యోః అపి - దంపతులకు కూడ, పత్న్యామ్ - భార్య, అనర్హాయామ్ - సమర్థురాలు కానిచో, పతిః - భర్త, ఏతత్ - ఈ వ్రతమును, సమాహితః - ఏకాగ్రమగు చిత్తము గలవాడై, కుర్యాత్ - చేయ వలెను.

దంపతులిద్దరిలో ఏ ఒకరు చేసినా ఫలము ఇద్దరికి వచ్చును. భార్య సమర్థురాలు కానిచో, భర్త ఈ వ్రతమును ఏకాగ్రమగు చిత్తముతో చేయవలెను.

**విష్ణోర్వ్రతమిదం బిభ్రన్న విహన్యాత్ కథంచన ।**
**విప్రాన్ స్త్రియో వీరవతీస్స్రగ్గంధబలిమండనైః ।**
**అర్చేదహరహర్భక్త్యా దేవం నియమమాస్థితః ॥ 19**

ఇదమ్ - ఈ, విష్ణోః - విష్ణువుయొక్క, వ్రతమ్ - వ్రతమును, బిభ్రత్ - ధరించువాడు, కథంచన - ఏ విధముగనైననూ, న విహన్యాత్ - ఆటంకమును చేయరాదు, నియమమ్ - నియమమును, ఆస్థితః - చేపట్టిన వ్యక్తి, విప్రాన్ - వేదవేత్తలను, వీరవతీః - సువాసినులగు, స్త్రియః - స్త్రీల ను, దేవమ్ - శ్రీహరిని, స్రక్-గంధబలిమండనైః - పుష్పమాలలు గంధము ఆహారము అలంకారములతో, అహః-అహః - ప్రతిదినము, భక్త్యా - భక్తితో, అర్చేత్ - పూజించవలెను.

ఈ విష్ణువ్రతమును చేయు వ్యక్తి దీనికి ఏ విధముగనూ ఆటం కమును కలుగనీయరాదు. ఈ వ్రతనియమమును చేపట్టిన వ్యక్తి వేదవేత్తల ను, సువాసినులగు స్త్రీలను, శ్రీహరిని కూడ పుష్పమాలలు, గంధము, ఆహారము, అలంకారములతో ప్రతిదినము భక్తితో పూజించవలెను.

**ఉద్వాస్య దేవం స్వే ధామ్ని తన్నివేదితమగ్రతః ।**
**అద్యాదాత్మవిశుద్ధ్యర్థం సర్వకామర్ద్ధయే తథా ॥ 20**

దేవమ్ - శ్రీహరిని, స్వే - తన, ధామ్ని - ధామమునందు, ఉద్వాస్య - సాగనంపి, ఆత్మవిశుద్ధి-అర్థమ్ - అంతఃకరణశుద్ధి కొరకు, తథా - అదే విధముగా, సర్వకామ-ఋద్ధయే - సకలమనోరథసమృద్ధి కొర కు, తత్-నివేదితమ్ - ఆయనకు నైవేద్యము పెట్టిన ఆహారమును, అగ్రతః - మున్ముందుగా, అద్యాత్ - భక్షించవలెను.

శ్రీహరిని తన ధామమునకు సాగనంపి, అంతఃకరణశుద్ధి కొరకు సకలమనోరథసమృద్ధి కొరకు నైవేద్యము పెట్టిన ప్రసాదమును మున్ముం దుగా తినవలెను.

ఏతేన పూజావిధినా మాసాన్ ద్వాదశ హాయనమ్ ।
నీత్వాఽథోపచరేత్సాధ్వీ కార్తికే చరమేఽహని ॥ 21

సాధ్వీ - పతివ్రత, ఏతేన - ఈ, పూజావిధినా - పూజావిధానము తో, హాయనమ్ - సంవత్సరమును, ద్వాదశ - పన్నెండు, మాసాన్ - మాసములను, నీత్వా - గడిపి, అథ - తరువాత, కార్తికే - కార్తిక మాసము నందు, చరమే - ఆఖరి, అహని - రోజునాడు, ఉపచరేత్ - ఉపవసించ వలెను.

పతివ్రతయగు స్త్రీ ఈ పూజావిధానమును అధికమాసము లేని సంవత్సరము పన్నెండు నెలలు అనుష్ఠించి, తరువాత కార్తీక అమావాస్య నాడు ఉపవాసము చేయవలెను.

శ్వోభూతేఽప ఉపస్పృశ్య కృష్ణమభ్యర్చ్య పూర్వవత్ ।
పయఃశృతేన జుహుయాచ్చరుణా సహ సర్పిషా ।
పాకయజ్ఞవిధానేన ద్వాదశైవాహుతీః పతిః ॥ 22

పతిః ఏవ - భర్త మాత్రమే, శ్వః-భూతే - మరునాడు ఉదయమే, అపః ఉపస్పృశ్య - స్నానమును చేసి, పూర్వవత్ - పూర్వమునందు వలె నే, కృష్ణమ్ - శ్రీహరిని, అభ్యర్చ్య - పూజించి, సర్పిషా సహ - నేయితో కూడి, పయఃశృతేన - పాలతో వండబడిన, చరుణా - అన్నముతో, పాకయ

జ్ఞవిధానేన - స్థాలీపాక విధానముచే, ద్వాదశ - పన్నెండు, ఆహుతీః - ఆహుతులను మాత్రమే, జుహుయాత్ - హోమము చేయవలెను.

మరునాడు ఉదయమే భర్త స్నానము చేసి, పూర్వమునందు వలెనే శ్రీహరిని పూజించి, నేతితో కూడిన పాయసమును పన్నెండు ఆహుతులను స్థాలీపాక విధానముతో హోమము చేయవలెను.

ఆశిషశ్శిరసాఽఽదాయ ద్విజైః ప్రీతైస్సమీరితాః ।
ప్రణమ్య శిరసా భక్త్యా భుంజీత తదనుజ్ఞయా ॥ 23

ప్రీతైః - ప్రీతిని పొందిన, ద్విజైః - వేదవేత్తలచే, సమీరితాః - చక్కగా పలుకబడిన, ఆశిషః - ఆశీస్సులను, శిరసా - శిరస్సుతో, ఆదాయ - స్వీకరించి, శిరసా - శిరస్సుతో, భక్త్యా - భక్తితో, ప్రణమ్య - నమస్కరించి, తద్-అనుజ్ఞయా - వారి అనుమతితో, భుంజీత - భుజించవలెను.

సంతుష్టులైన వేదవేత్తలు చక్కగా చేసిన ఆశీర్వచనములను తల వంచి స్వీకరించవలెను. భక్తితో వారికి తల వంచి నమస్కరించి వారి అనుమతితో భుజించవలెను.

ఆచార్యమగ్రతః కృత్వా వాగ్యతస్సహ బంధుభిః ।
దద్యాత్పత్న్యై చరోశ్శేషం సుప్రజస్త్వం సుసౌభగమ్ ॥ 24

వాగ్-యతః - మౌనము గలవాడై, బంధుభిః సహ - బంధువులతో సహా, ఆచార్యమ్ - ఆచార్యుని, అగ్రతః - ఎదుట, కృత్వా - ఇడుకొని, సుప్రజస్త్వమ్ - చక్కని సంతానమును కలిగించునట్టియు, సుసౌభగమ్ - చక్కని సౌభాగ్యమునిచ్చే, చరోః - పాయసముయొక్క, శేషమ్ - మిగిలిన భాగమును, పత్న్యై - భార్య కొరకు, దద్యాత్ - ఈయవలెను.

భర్త మౌనముగా నుండి బంధువులతో గూడి ఆచార్యుని ఎదుటనిడుకొని, హోమము చేయగా మిగిలిన పాయసమును భార్యకు ఈయవలెను. ఈ ప్రసాదము వలన చక్కని సంతానము, సౌభాగ్యము కలుగును.

ఏతచ్చరిత్వా విధివద్వ్రతం విభోః
అభీప్సితార్థం లభతే పుమానిహ ।
స్త్రీ త్వేతదాస్థాయ లభేత సౌభగం
శ్రియం ప్రజాం జీవపతిం యశో గృహమ్ ॥ 25

విభోః - విష్ణువుయొక్క, ఏతత్ - ఈ, వ్రతమ్ - వ్రతమును, విధివత్ - యథావిధిగా, చరిత్వా - చేసి, పుమాన్ - పురుషుడు, ఇహ - ఈ లోకమునందు, అభీప్సిత-అర్థమ్ - కోరబడిన ప్రయోజనమును, లభతే - పొందును, స్త్రీ తు - స్త్రీయైతే, ఏతత్ - ఈ వ్రతమును, ఆస్థాయ - అనుష్ఠించి, సౌభగమ్ - సౌభాగ్యమును, శ్రియమ్ - సంపదను, ప్రజామ్ - సంతానమును, జీవపతిమ్ - ఆయుష్మంతుడగు భర్తను, యశః - కీర్తిని, గృహమ్ - ఇంటిని, లభేత - పొందును.

ఈ విష్ణువ్రతమును యథావిధిగా ఆచరించే పురుషునకు ఈ లోకములో కోరిన ప్రయోజనము సిద్ధించును. దీనిని ఆచరించే స్త్రీకి సౌభాగ్యము, సంపద, సంతానము, భర్తకు దీర్ఘాయుర్దాయము, కీర్తి మరియు స్వంత ఇల్లు లభించును.

కన్యా చ విందేత సమగ్రలక్షణం
వరం త్వవీరా హతకిల్బిషా గతిమ్ ।
మృతప్రజా జీవసుతా ధనేశ్వరీ
సుదుర్భగా సుభగా రూపమగ్ర్యమ్ ॥ 26

విందేద్విరూపా విరుజా విముచ్యతే
య ఆమయావీంద్రియకల్పదేహమ్ ।
ఏతత్పఠన్నభ్యుదయే చ కర్మ-
ణ్యనంతతృప్తిః పితృదేవతానామ్ ॥ 27

కన్యా చ - కన్య కూడ, సమగ్రలక్షణమ్ - సకల సల్లక్షణములు గల, వరమ్ - భర్తను, అవీరా తు - సంతానము (భర్త) లేని స్త్రీయైతే, హతకిల్బిషా - నశింప జేయబడిన దోషములు గలదియై, గతిమ్ - పుణ్యలోక

మును, విందేత - పొందును, మృతప్రజా - మరణించిన సంతానము గల స్త్రీ, జీవసుతా - జీవించియున్న సంతానము గలది, ధన-ఈశ్వరీ - ధనమునకు ప్రభ్వి, సుదుర్భగా - చాల దురదృష్టవంతురాలు, సుభగా - సౌభాగ్యము గలది, విరూపా - అందము లేనిది, అగ్ర్యమ్ - శ్రేష్ఠమగు, రూపమ్ - రూపమును, విందేత్ - పొందును, ఆమయావీ - రోగము గల, యః - ఎవడైతే (వ్రతమును చేయునో), విరుజా - విశేషముగా రోగముచే, విముచ్యతే - విడిచిపెట్ట బడును, ఇంద్రియకల్పదేహమ్ - ఇంద్రియములతో సమర్థమైన దేహమును, విందేత్ - పొందును, చ - మరియు, అభ్యుదయే - అభ్యుదయమును కలిగించే, కర్మణి - కర్మయందు, ఏతత్ - దీనిని, పఠన్ - పఠించువాడు (కావలెను), పితృదేవతానామ్ - పితృదేవతలకు, అనంతతృప్తిః - అనంతమగు సంతోషము (కలుగును).

ఈ వ్రతమును కన్య ఆచరించినచో, సకలసల్లక్షణములు గల భర్త లభించును. సంతానము (భర్త) లేని స్త్రీ చేసినచో, ఆమె దోషములన్నియు తొలగిపోయి పుణ్యలోకము లభించును. సంతానము పోయిన స్త్రీ చేసినచో, ఆమెకు దీర్ఘాయుర్దాయము గల సంతానము కలుగుటయే గాక, ఆమె సంపన్నురాలగును. దురదృష్టము గల స్త్రీ చేసినచో, అదృష్టము కలిసి వచ్చును. అందము లేని యువతి చేసినచో, గొప్ప అంధము కలుగును. రోగము గలవాడు దీనిని చేసినచో, రోగమునుండి విముక్తుడగుటయే గాక, ఇంద్రియపాటవము గల బలమైన దేహమును కూడ పొందును. దీనిని యజ్ఞము, దానము మొదలగు అభ్యుదయ కర్మలను చేయు సమయములో సాధకుడు పఠించ దగును. దీనిని పఠించుట వలన పితృదేవతలకు అనంతమగు తృప్తి కలుగును.

తుష్టాః ప్రయచ్ఛంతి సమస్తకామాన్
హోమావసానే హుతభుక్ శ్రీర్హరిశ్చ ।
రాజన్ మహన్మరుతాం జన్మ పుణ్యం
దితేర్వ్రతం చాభిహితం మహత్తే ॥ 28

ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే షష్ఠస్కంధే పుంసవన
వ్రత వర్ణనం నామ ఏకోనవింశోऽధ్యాయః ॥

॥ ఇతి షష్ఠః స్కంధః సమాప్తః ॥

హోమ-అవసానే - హోమము పూర్తి అయినప్పుడు, తుష్టాః - సంతోషించిన పితృదేవతలు, హుతభుక్ - హోమద్రవ్యములకు భోక్తయగు, హరిః - శ్రీహరి, శ్రీః చ - లక్ష్మీదేవి కూడ, సమస్తకామాన్ - సకల మనోరథములను, ప్రయచ్ఛంతి - ఇచ్చెదరు, రాజన్ - ఓ పరీక్షిన్మహారాజా!, మరుతామ్ - మరుత్తుల, పుణ్యమ్ - పవిత్రమైన, మహత్ - గొప్ప, జన్మ - పుట్టుక, దితేః - దితియొక్క, మహత్ - గొప్ప, వ్రతం చ - వ్రతము కూడ, తే - నీ కొరకు, అభిహితమ్ - చెప్పబడినది.

హోమము పూర్తి అయిన తరువాత పితృదేవతలు, హోమద్రవ్యభోక్తయగు శ్రీహరి మరియు లక్ష్మీదేవి కూడ సంతోషించి సకల మనోరథములను ఇచ్చెదరు. ఓ పరీక్షిన్మహారాజా! నేను నీకు గొప్పది మరియు పావనము అగు మరుత్తుల జన్మ వృత్తాంతమును, దితియొక్క గొప్ప వ్రతమును గురించి చెప్పితిని.

శ్రీమద్భాగవత మహాపురాణమునందలి ఆరవ స్కంధములో
పుంసవన వ్రతమును వర్ణించే పంతొమ్మిదవ
అధ్యాయము ముగిసినది (19).

షష్ఠ స్కంధము ముగిసినది

హరిః ఓం తత్సత్ శ్రీకృష్ణార్పణమస్తు

*****

T.T.D. Religious Publications Series No. 685

Price : Rs.



భారతీయ వాఙ్మయం అంతా ఒక యెత్తు; శ్రీమద్భాగవతం ఒక్కటి ఒక యెత్తు. ఈ ప్రఖ్యాతికి ముఖ్యకారణం – భగవంతుణ్ణి గూర్చి తెలిపే గ్రంథాల్లో భాగవత పురాణం అగ్రగణ్యమై అలరారుతూ వుండటం.

''వేద''మనే కల్పతరువున ఫలించి, శుక యోగీంద్రుని వాక్కులనెడి అమృత రసంతో సమ్మిళితమయి, పుడమికి అవతరించిన పరిపక్వ మధుర ఫలం భాగవతం!

ఇంతటి విశిష్టతగల భాగవత మహాపురాణాన్ని 'తత్త్వప్రకాశిక' – అనే తెలుగు టీకతో ప్రచురించటం తెలుగువారందరికీ మిగుల సంతోషదాయకమైన విషయం. తి.తి.దేవస్థానంవారి ఈ ప్రచురణ సంస్కృతమూలంలోని పరమార్థాన్ని తెలిసికోవటానికి, అలాగే, పోతన మహాకవి రచనను ఇతోఽధికంగా అవగాహన చేసి కోవ టానికి –ఉభయ తారకంగా ఆంధ్రావళికి ఉపయోగపడుతుంది.

సార్థక నామధేయులైన ఈ టీకను రచించినవారు పూజ్యశ్రీ తత్త్వవిదానంద సరస్వతీ స్వామివారు. బ్రహ్మ విద్యాకుటీర (సికిందరాబాదు) నిలయులు. సంస్కృతాంధ్రాంగ్లాది బహుభాషావేత్తలు. వేద, వేదాంతాది ప్రాచీన విద్యల్లోను, రసాయన శాస్త్రాది ఆధునికవైజ్ఞానిక శాస్త్రాల్లోను నిష్ణాతులు.

పరిశోధన, బోధన, బహుగ్రంథ రచన, సామాజికాది సమస్యల సదవగాహన – ఇత్యాది రంగాల్లో విశేషానుభవం గడించిన పరిణత ప్రజ్ఞావంతులు శ్రీస్వామివారు. ఆర్ష విద్యాపారంగతులైన వీరు ఉత్తమవక్తగా అనేక జాతీయ, అంతర్జాతీయ వేదికలపై ప్రశస్తిగాంచారు.

విశేషించి, ఉపనిషత్తుల్లో నిక్షిప్తమై ఉన్న ఆధ్యాత్మిక విజ్ఞానాన్ని ప్రబోధించే ఉదారాశయంతో సన్న్యాసాశ్రమాన్ని స్వీకరించిన యతివరేణ్యులు వీరు! బ్రహ్మవిద్యానిధులయిన వీరు భాగవతానికి సరళ సుందరశైలిలో ఈ టీక రచించటం బంగారుకు తావి అబ్బినట్లయింది!

Published by Sri A.P.V.N.SARMA, I.A.S., Executive Officer, Tirumala Tirupati Devasthanams and Printed at T.T.D. Press, Tirupati.